మహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

## (దశమస్కంధ పూర్వార్ధము)
## ఏడవ సంపుటము

స్వామి తత్త్వవిదానంద సరస్వతి






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

శ్రీమహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

(దశమస్కంధ పూర్వార్ధము)

ఏడవ సంపుటము

స్వామి తత్త్వవిదానంద సరస్వతి
(బ్రహ్మవిద్యాకుటీర్, పాత అల్వాల్, సికింద్రాబాదు)
గారిచే రచింపబడిన "తత్త్వప్రకాశిక" అనే
తెలుగు టీకతో కూడినది




ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
2009

# SRIMADBHAGAVATAMU

with Telugu Commentary
**Skandha X (Purvardham) - Volume - VII**

by
**SWAMI TATTVAVIDANANDA SARASWATI**

T.T.D. Religious Publications Series No: 800



First Edition : 2009

Copies : 2000

*Published by*
**Sri. K.V. Ramanachary, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 501.

***Printed at :***
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507.

యోగివరేణ్యులు, శ్రీరామలాల ప్రభుజీవారి
ప్రముఖ శిష్యులు, యోగ సంస్కృతముల
అధ్యయనమునకు స్ఫూర్తినిచ్చిన పుణ్యమూర్తులు,
కీర్తిశేషులు బ్రహ్మశ్రీ
ఓరుగంటి నరసింహయోగివర్యుల
పవిత్ర స్మృతికి భక్తి పూర్వకముగ
అంకితము.

# ముందు మాట

భారతీయ వాఙ్మయంలో పురాణాలు అత్యంత విశిష్టమైనవి. అవి లోకానికి మిత్రులవలె హితాన్ని ఉపదేశిస్తాయి. కాబట్టి, "మిత్ర సమ్మితములు"గా ప్రఖ్యాతి వహించాయి. పురాణాలు ప్రాచీనమైనవైనా ఎప్పటికప్పుడు నిత్య నూతనంగా ప్రకాశిస్తూ వుంటాయి. అవి మన పురాతన విజ్ఞాన సర్వస్వాలు. (Encyclopaedias) అటువంటి పదునెనిమిది పురాణాల్లో అగ్రగణ్యమైనది శ్రీమద్భాగవతము.

'భాగవత'మంటే భగవంతుని గూర్చి వివరించే గ్రంథమని భావం. ఇలాగే 'భగవత్' శబ్దంతో సంబంధించిన నామధేయం కల మరొక ప్రసిద్ధ గ్రంథం 'భగవద్గీత'. భగవంతుడు చెప్పింది భగవద్గీత; ఆ భగవంతుని గూర్చి చెప్పేది భాగవతము. ఇది ఈ రెంటికి గల అవినాభావ సంబంధం.

వేర్వేరు పురాణాలను, ఇతిహాసాలను రచియించిన వేదవ్యాసుడు బదరికావనంలో సరస్వతీనదీ తీరాన గల తన ఆశ్రమంలో ఒకప్పుడు చింతిస్తూ కూర్చొని ఉండినాడు. ఆ సమయంలో అక్కడకు విచ్చేసిన నారదమహర్షి, విషయం తెలిసికొని, వ్యాసునితో ఇలా అన్నాడు. 'మునీంద్రా! నీవు ఇంతవరకు ఎన్నో గ్రంథాలను రచించినప్పటికీ, భగవానుడైన శ్రీమహావిష్ణువు యొక్క గుణగుణాలను, మహిమలను, అవతారలీలలను వెల్లడించే కథలతో గూడిన సమగ్ర గ్రంథాన్ని ప్రత్యేకంగా రచింపలేదు. కావున, అలాంటి ఉత్కృష్ట గ్రంథాన్ని రచిస్తే నీకు పరిపూర్ణమైన మనశ్శాంతి ఏర్పడుతుంది' – అని. ఆ విధంగా నారదుని ఆదేశాన్ని పాటించి, వేదవ్యాస మహాముని రచించిన ఉదాత్తగ్రంథమే శ్రీమద్భాగవత మహాపురాణం!

మంత్రాలన్నింటిలోనూ ఉత్తమమైన మంత్రం **'గాయత్రి'** అటువంటి గాయత్రీమంత్రాన్ని ఆధారంచేసికొని ఈ గ్రంథం విస్తరిల్లినట్లు ఇందలి అవతారికలో పేర్కొనబడి ఉంది. ఈ గ్రంథానికి **'భక్తిశాస్త్ర'** మని, **'సాత్వత సంహిత'** అని, **'మోక్షగ్రంథ'**మని, **'హయగ్రీవ బ్రహ్మవిద్య'** అని – అనేక నామాలు పూర్వం నుండీ వాడుకలో వున్నాయి. ఇవన్నీ ఈ భాగవత గ్రంథానికి గల ప్రశస్తిని చక్కగా చాటుతూ వున్నాయి.

వేదవ్యాసుడు తొలుదొల్త భాగవత పురాణాన్ని కుమారుడైన శుకునికీ, శిష్యుడైన రోమ హర్షణునికీ ఉపదేశించాడు. రోమహర్షణుని కుమారుడైన ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో వెయ్యేండ్ల సత్రయాగాన్ని నిర్వహిస్తూవున్న శౌనకాది

మహామునుల వద్దకు వెళ్లి, భాగవత పురాణాన్ని ప్రవచనం చేశాడు. ఆ విధంగా ఉగ్రశ్రవసుడనే సూతుడు అలనాడు నైమిశారణ్యంలో ఆరంభించిన భాగవత కథా ప్రవచనం నేటికీ దేశంలో ఎక్కడో ఒకచోట అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే వస్తున్నది.

ఈ సుప్రసిద్ధ గ్రంథానికి "**తత్త్వప్రకాశిక**" - అనే తెలుగు టీక సమకూర్చబడి ఉండటం ప్రస్తుత ప్రచురణలోని ముఖ్య విశేషం! ప్రతిపదార్థ, తాత్పర్యాలతో కూడిన ఈ తెలుగు టీక సరళమైన భాషలో, సులభశైలిలో, సామాన్య పాఠకులను సైతం ఆకట్టుకొనే రీతిలో సముచితంగా కొనసాగింది. సార్థక నామమయిన ఈ టీకను రచించిన సహృదయులు, సుగృహీత నామధేయులు, బ్రహ్మవిద్యానిధులు, బహుగ్రంథకర్తలు **పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామి వారు.** వారికి కృతజ్ఞతాపూర్వక అభివందనాలు.

చివరగా నొక్కమాట: పద్మపురాణంలో శ్రీమద్భాగవతం సాక్షాత్తు భగవంతుని స్వరూపంగా నిరూపింపబడింది. తదనుగుణంగా భాగవతంలోని మొదటి, రెండు స్కంధాలు భగవంతుని పాదాలు; మూడు నాలుగు స్కంధాలు ఊరువులు; ఐదవ స్కంధం నాభి ప్రదేశం; ఆరవ స్కంధం హృదయం; ఏడు, ఎనిమిది స్కంధాలు బాహువులు; తొమ్మిదవ స్కంధం కంఠం; పదవ స్కంధం ముఖం; పదకొండవది లలాటం; పంద్రెండవ స్కంధం శిఖ.

పద్మపురాణంలో పై వరుస క్రమాన్ని బట్టి ప్రస్తుతం ప్రచురితమవుతున్న దశమ స్కంధ పూర్వార్ధం వ్యాసభగవానుని ముఖభాగంగా భావించాలి. ఇది 7వ సంపుటం - ఇట్లే దశమస్కంధ ఉత్తరార్ధం, ఏకాదశ ద్వాదశస్కంధాలు త్వరలో ప్రచురించే ప్రయత్నాలు సాగుతున్నాయి. తి.తి.దేవస్థానం ప్రచురిస్తున్న ఈ ధార్మిక గ్రంథాలు పాఠకుల ఆదరాభిమానాలు చూరగొనగలవని ఆకాంక్షిస్తున్నాను.

**"భాగవత పురాణ ఫల రసాస్వాదన**
**పదవింగనుడు! రసిక భావవిదులు!"**

**కార్యనిర్వహణాధికారి,**
తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| 1. | శ్రీకృష్ణావతారము – ఉపక్రమము | 1 |
| 2. | శ్రీకృష్ణావతారము – దేవతలు దేవకీగర్భమునందలి శ్రీహరిని స్తుతించుట | 31 |
| 3. | శ్రీకృష్ణ జననము | 53 |
| 4. | యోగమాయ కంసునినుండి తప్పించుకొనుట | 80 |
| 5. | శ్రీకృష్ణ జననోత్సవము | 99 |
| 6. | పూతన ఉత్తమ గతిని పొందుట | 113 |
| 7. | శకటాసుర సంహారము – తృణావర్తుని ఉద్ధారము | 133 |
| 8. | శ్రీకృష్ణ బలరాముల బాల్య లీలలు | 150 |
| 9. | శ్రీకృష్ణుని రోలుకు కట్టివేసే లీల | 174 |
| 10. | శ్రీకృష్ణుడు అర్జున వృక్షముల జంటను పడగొట్టి గంధర్వులకు శాపవిముక్తిని కలిగించుట | 185 |
| 11. | శ్రీకృష్ణుడు వత్సాసుర బకాసురులను ఉద్ధరించుట | 204 |
| 12. | శ్రీకృష్ణుడు అఘాసురుని ఉద్ధరించుట | 228 |
| 13. | బ్రహ్మదేవుడు వ్యామోహితుడగుట | 250 |
| 14. | బ్రహ్మ స్తుతి | 281 |
| 15. | ధేనుకాసురుని ఉద్ధరించుట | 314 |
| 16. | కాళియ మర్దన లీల | 337 |
| 17. | శ్రీకృష్ణుడు గోకులవాసులను దావాగ్నినుండి కాపాడుట | 370 |
| 18. | శ్రీకృష్ణుడు ప్రలంబాసురుని ఉద్ధరించుట | 381 |
| 19. | శ్రీకృష్ణుడు గోవులను గోపాలకులను దావాగ్నినుండి రక్షించుట | 395 |
| 20. | వర్ష శరదృతువుల వర్ణనము | 402 |
| 21. | వేణు గీతము | 422 |
| 22. | గోపికా వస్త్రాపహరణము | 435 |
| 23. | యజ్ఞపత్నులు ఉద్ధారము | 451 |
| 24. | శ్రీకృష్ణుడు ఇంద్రయాగమునాపుట | 474 |
| 25. | గోవర్ధనోద్ధారము | 490 |
| 26. | నందునితో గోపాలకులు శ్రీకృష్ణుని గురించి చర్చించుట | 504 |
| 27. | కామధేనువు శ్రీకృష్ణుని గోవిందునిగా అభిషేకించుట | 515 |

| | | |
|---|---|---|
| 28. | శ్రీకృష్ణుడు నందుని వరుణలోకమునుండి విడిపించుట | 528 |
| 29. | రాస పంచాధ్యాయి - ఉపక్రమము | 536 |
| 30. | గోపికలు అంతర్హితుడైన శ్రీకృష్ణుని వెదుకుట | 560 |
| 31. | గోపికా గీతము | 580 |
| 32. | శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై గోపికలనోదార్చుట | 590 |
| 33. | మహా రాస లీల | 601 |
| 34. | శ్రీకృష్ణుడు సుదర్శనుని శంఖచూడుని ఉద్ధరించుట | 620 |
| 35. | గోపికా యుగళ గీతము | 633 |
| 36. | వృషభాసురుని ఉద్ధారము - కంసుడు అక్రూరుని గోకులమునకు పంపుట | 646 |
| 37. | శ్రీకృష్ణుడు కేశిని, వ్యోమాసురుని ఉద్ధరించుట - నారద స్తుతి | 662 |
| 38. | అక్రూరుడు గోకులమునకు వెళ్లుట | 678 |
| 39. | అక్రూరుడు బలరామ కృష్ణులను గోకులమునుండి తీసుకువెళ్లుట | 699 |
| 40. | అక్రూరుడు శ్రీకృష్ణుని స్తుతించుట | 724 |
| 41. | శ్రీకృష్ణుడు మధురలో ప్రవేశించి మాలాకారుని అనుగ్రహించుట | 738 |
| 42. | శ్రీకృష్ణుడు కుబ్జను అనుగ్రహించి ధనుర్భంగమును చేయుట | 760 |
| 43. | శ్రీకృష్ణుడు కువలయాపీడమునుద్ధరించి మల్లరంగములో ప్రవేశించుట | 776 |
| 44. | శ్రీకృష్ణుడు చాణూరాదులను కంసుని సంహరించుట | 793 |
| 45. | శ్రీకృష్ణ బలరాముల ఉపనయనము, గురుకుల ప్రవేశము, విద్యాధ్యయనము, గురుదక్షిణ | 814 |
| 46. | ఉద్ధవుడు గోకులమునకు వెళ్లుట | 835 |
| 47. | ఉద్ధవుడు గోపికలతో మాటలాడుట - భ్రమర గీతము | 855 |
| 48. | శ్రీకృష్ణుడు అక్రూరుని ఇంటికి వెళ్లుట | 888 |
| 49. | అక్రూరుడు హస్తినాపురమునకు వెళ్లుట | 905 |


* * * * *

శ్రీమహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

(దశమ స్కంధ పూర్వార్ధము)

ఏడవ సంపుటము

శ్రీగణేశాయ నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

# శ్రీమద్భాగవత మహాపురాణమ్

## దశమః స్కంధః (పూర్వ భాగః)

## అథ ప్రథమోఽధ్యాయః

## శ్రీకృష్ణావతారము - ఉపక్రమము

రాజోవాచ ।
కథితో వంశవిస్తారో భవతా సోమసూర్యయోః ।
రాజ్ఞాం చోభయవంశ్యానాం చరితం పరమాద్భుతమ్ ॥ 1

యదోశ్చ ధర్మశీలస్య నితరాం మునిసత్తమ ।
తత్రాంశేనావతీర్ణస్య విష్ణోర్వీర్యాణి శంస నః ॥ 2

మునిసత్తమ - ఓ మహర్షీ!, భవతా - మీచే, సోమసూర్యయోః - చంద్రుని మరియు సూర్యునియొక్క, వంశవిస్తారః - వంశముల విస్తారము, కథితః - చెప్పబడినది, చ - మరియు, ఉభయవంశ్యానామ్ - రెండు వంశములకు చెందిన, రాజ్ఞామ్ - మహారాజులయొక్క, పరమ-అద్భుతమ్ - మిక్కిలి అచ్చెరువును గొలిపే, చరితమ్ - చరితము, నితరామ్ - మిక్కిలి, ధర్మశీలస్య - ధర్మస్వభావము గల, యదోః చ - యదు మహారాజుయొక్క చరితము కూడ, తత్ర - ఆ యదువంశమునందు, అంశేన - అంశయగు బలరామునితో గూడి, అవతీర్ణస్య - అవతరించిన, విష్ణోః - శ్రీహరియొక్క, వీర్యాణి - గొప్ప ప్రభావముతో గూడిన కర్మలను, నః - మా కొరకు, శంస - చెప్పుము.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను -- మహర్షీ! మీరు సూర్యచంద్రవంశముల విస్తారమును చెప్పితిరి. ఆ రెండు వంశములకు చెందిన మహారాజుల చరితమును కూడ వర్ణించితిరి. ఆ చరితము మిక్కిలి ఆశ్చర్యమును

గొల్పునది. అతిశయించిన ధర్మస్వభావము గల యదు మహారాజు వంశముయొక్క విస్తారమును కూడ తమరు చెప్పితిరి. ఆ వంశమునందు శ్రీహరి తన అంశయగు బలరామునితో గూడి అవతరించి, గొప్ప ప్రభావముతో గూడిన కర్మలను చేసెను. ఆ వివరములను మాకు చెప్పుము.

అవతీర్య యదోర్వంశే భగవాన్ భూతభావనః ।
కృతవాన్ యాని విశ్వాత్మా తాని నో వద విస్తరాత్ ॥ 3

భూతభావనః - సకలప్రాణులను పాలించువాడు, విశ్వ-ఆత్మా - సర్వమునకు ఆత్మ (సారతత్త్వము) అయినవాడు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, యదోః - యదువుయొక్క, వంశే - వంశమునందు, అవతీర్య - అవతరించి, యాని - ఏ లీలలను, కృతవాన్ - చేసినవాడో, తాని - వాటిని, నః - మాకు, విస్తరాత్ - విస్తారముగా, వద - చెప్పుడు.

సర్వమునకు ఆత్మయై సకలప్రాణులను పాలించే శ్రీహరి భగవానుడు యదువుయొక్క వంశమునందవతరించి ఏ లీలలను చేసెనో, వాటిని గురించి మాకు విస్తారముగా చెప్పుడు.

నివృత్తతర్షైరుపగీయమానాద్భవౌషధాచ్ఛ్రోత్రమనోఽభిరామాత్ ।
క ఉత్తమశ్లోకగుణానువాదాత్పుమాన్ విరజ్యేత వినా పశుఘ్నాత్॥4

నివృత్తతర్షైః - తొలగిపోయిన వాసనలు (భోగతృష్ణ) గలవారిచే, ఉపగీయమానాత్ - అధికముగా కీర్తించబడునట్టియు, భవ-ఔషధాత్ - సంసారమనే వ్యాధికి మందు అయినట్టియు, శ్రోత్రమనః-అభిరామాత్ - చెవులకు మనస్సునకు సుఖమునిచ్చే (మిక్కిలి ప్రియమైన), ఉత్తమశ్లోకగుణ-అనువాదాత్ - పవిత్రకీర్తియగు శ్రీహరియొక్క గుణముల వర్ణనమునుండి, పశుఘ్నాత్ వినా - పశువులను చంపే కిరాతుని మినహాయించి, కః - ఎవ్వాడు, విరజ్యేత - విరక్తుడగును?

తొలగిపోయిన వాసనలు మరియు భోగతృష్ణ గల జీవన్ముక్తులు కూడ పవిత్రకీర్తియగు శ్రీహరియొక్క గుణములను వర్ణించెదరు. ఇట్టి గుణవర్ణనము సంసారమనే రోగమునకు మందు అగుటయే గాక, చెవులకు మరియు మనస్సునకు సుఖమును, ప్రీతిని కలిగించును. పశువులను

చంపే కిరాతుడువంటివానికి అట్టి గుణవర్ణనమునందు ప్రీతి లేకుండవచ్చును. అట్టివానిని మినహాయిస్తే, శ్రీహరి గుణవర్ణనమునందు ఎవడు ప్రీతి జేయకుండును? (అందరు ప్రీతిని జేయుదురు).

పితామహా మే సమరేఽమరంజయైః
దేవవ్రతాద్యాతిరథైస్తిమింగిలైః ।
దురత్యయం కౌరవసైన్యసాగరం
కృత్వాఽతరన్ వత్సపదం స్మ యత్ప్లవాః ॥ 5

మే - నాయొక్క, పితామహాః - తాతలు, సమరే - యుద్ధమునందు, అమరంజయైః - దేవతలను జయించినట్టియు, దేవవ్రత-ఆద్య-అతిరథైః - భీష్ముడు ప్రముఖుడుగా గల అతిరథులనే, తిమింగిలైః - తిమింగిలముల చే, దురత్యయమ్ - దాట శక్యము కాని, కౌరవసైన్యసాగరమ్ - కౌరవుల సైన్యమనే సముద్రమును, యత్-ప్లవాః - ఏ కృష్ణుడనే నౌక గలవారై, వత్సపదమ్ - దూడ గిట్ట గురుతును, కృత్వా - చేసి, అతరన్ స్మ- దాటిరో.

కౌరవుల సైన్యమే ఒక సముద్రము కాగా, దేవతలను సైతము జయించిన భీష్ముడు మొదలగు అతిరథులు ఆ సముద్రమునందలి తిమింగిలములు. సముద్రమువంటి ఆ సైన్యమును యుద్ధములో అతిక్రమించుట (జయించుట) సంభవమే కాదు. అయిననూ, నా తాతలగు పాండవులు ఆ శ్రీకృష్ణుడే నావ కాగా, నేలపై పడిన దూడ గిట్ట గురుతును నడుస్తూ దాటినంత తేలికగా, దాటివేసిరి (విజయమును పొందిరి).

ద్రౌణ్యస్త్రవిప్లుష్టమిదం మదంగం సంతానబీజం కురుపాండవానామ్ ।
జుగోప కుక్షిం గత ఆత్తచక్రో మాతుశ్చ మే యశ్శరణం గతాయాః॥6

ద్రౌణి-అస్త్రవిప్లుష్టమ్ - ద్రోణుని పుత్రుడగు అశ్వత్థామయొక్క బ్రహ్మాస్త్రముచే దహించివేయబడినట్టియు, కురుపాండవానామ్ - కౌరవుల మరియు పాండవులయొక్క, సంతానబీజమ్ - వంశమునకు బీజమైన, ఇదమ్ - ఈ, మద్-అంగం చ - దేహమును కూడ, యః - ఏ శ్రీకృష్ణుడైతే, శరణమ్ - శరణమును, గతాయాః - పొందిన, మే - నాయొక్క, మాతుః - తల్లియొక్క, కుక్షిమ్ - ఉదరమును, గతః - పొందినవాడై, ఆత్తచక్రః - స్వీకరించబడిన చక్రాయుధము గలవాడై, జుగోప - రక్షించెనో.

ఈ నా శరీరము కౌరవ పాండవ వంశములు రెండింటికీ బీజము. దానిని ద్రోణపుత్రుడగు అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రము దహించి వేయగా, నా తల్లియగు ఉత్తర ఈ శ్రీకృష్ణుని శరణు వేడెను. అపుడాయన చక్రాయుధము (గిరగిర త్రిప్పబడిన గద) ను చేతబట్టి ఆమె ఉదరమును ప్రవేశించి ఈ నా దేహమును రక్షించెను.

వీర్యాణి తస్యాఖిలదేహభాజా-
మంతర్బహిః పూరుషకాలరూపైః,
ప్రయచ్ఛతో మృత్యుముతామృతం చ
మాయామనుష్యస్య వదస్వ విద్వాన్ ॥ 7

విద్వాన్ - ఓ జ్ఞానీ!, అఖిలదేహభాజామ్ - సకల దేహధారులయొక్క, అంతః - లోపల, బహిః - బయట, పూరుషకాలరూపైః - పూర్ణచైతన్యము మరియు కాలముల రూపములచే, మృత్యుమ్ - మృత్యువును, అమృతం చ - మోక్షమును కూడ, ప్రయచ్ఛతః - ఇచ్చే, మాయామనుష్యస్య - మాయాశక్తిచే మానవుడైన, తస్య - ఆ శ్రీహరియొక్క, వీర్యాణి - మహిమోపేతములైన చరితములను గురించి, వదస్వ - చెప్పుము.

ఓ మహర్షీ! నీవు జ్ఞానివి. సకల దేహధారుల లోపల శ్రీహరి ఆత్మరూపుడై దేహేంద్రియాదులకు స్ఫూర్తిని, సత్తను అనుగ్రహిస్తూ ఆ విధముగా దర్శించువారికి మోక్షమునిచ్చుచున్నాడు. ఆ శ్రీహరియే సకలప్రాణులకు బయట కాలావయవముల రూపముగా నున్నవాడై బహిర్ముఖులకు మృత్యువునే ఇచ్చుచున్నాడు. తన మాయాశక్తిచే మానవుడై అవతరించి ఆ శ్రీహరి వెలయించిన మహిమోపేతములైన చరితములను చెప్పుడు.

రోహిణ్యాస్తనయః ప్రోక్తో రామస్సంకర్షణస్త్వయా ।
దేవక్యా గర్భసంబంధః కుతో దేహాంతరం వినా ॥ 8

సంకర్షణః - సంకర్షణ దేవుడు, రోహిణ్యాః - రోహిణీదేవియొక్క, తనయః - పుత్రుడగు, రామః - బలరాముడని, త్వయా - నీచే, ప్రోక్తః - చెప్పబడినవాడు, దేహ-అంతరం వినా - మరియొక దేహము లేకుండా, దేవక్యాః - దేవకీదేవియొక్క, గర్భసంబంధః - గర్భముతోడి సంబంధము, కుతః - ఎట్లు?

దేవకీదేవి పుత్రులలో సంకర్షణదేవుడు పరిగణించబడినాడు. మరియు సంకర్షణదేవుడు రోహిణీదేవి పుత్రుడగు బలరాముడైనాడని తమరు చెప్పితిరి. సంకర్షణునకు మరియొక దేహమును స్వీకరించకుండా దేవకీగర్భముతో సంబంధము (ఒకే దేహముతో ఇద్దరు తల్లుల పుత్రుడగుట) ఎట్లు పొసగును?

కస్మాన్ముకుందో భగవాన్ పితుర్గేహాద్వ్రజం గతః ।
క్వ వాసం జ్ఞాతిభిస్సార్ధం కృతవాన్ సాత్వతాం పతిః ॥ 9

ముకుందః - మోక్షమునిచ్చే, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, పితుః - తండ్రియగు వసుదేవునియొక్క, గృహాత్ - ఇంటినుండి, వ్రజమ్ - గోకులమును గురించి, కస్మాత్ - ఎందువలన, గతః - వెళ్లినవాడు?, సాత్వతామ్ - భక్తులకు, పతిః - ప్రభువగు శ్రీకృష్ణుడు, జ్ఞాతిభిః సార్ధమ్ - బంధువులైన నందాదులతో గూడి, క్వ - ఎచ్చోట, వాసమ్ - నివాసమును, కృతవాన్ - చేసినవాడు?

మోక్షప్రదాతయగు శ్రీకృష్ణ భగవానుడు తన తండ్రియగు వసుదేవుని (మథురానగరమునందలి) ఇంటిని విడిచి గోకులమునకు వెళ్లుటకు కారణమేమి? భక్తపాలకుడగు ఆయన నందుడు మొదలగు బంధుజనముతో గూడి ఎక్కడ నివసించెను?

వ్రజే వసన్ కిమకరోన్మధుపుర్యాం చ కేశవః ।
భ్రాతరం చావధీత్కంసం మాతురద్ధాఽతదర్హణమ్ ॥ 10

కేశవః - శ్రీకృష్ణుడు, వ్రజే - గోకులమునందు, మధుపుర్యాం చ - మథురయందు కూడ, వసన్ - నివసించుచున్నవాడై, కిమ్ - దేనిని, అకరోత్ - చేసెను?, అద్ధా - సాక్షాత్తుగా, మాతుః - తల్లియొక్క, భ్రాతరమ్ - సోదరుడైనట్టియు, అతద్-అర్హణమ్ - అట్లు చేయుటకు తగని, కంసమ్ - కంసుని, అవధీత్ చ - ఏల సంహరించెను?

శ్రీకృష్ణుడు గోకులమునందు, మథురా నగరమునందు కూడ నివసించి నప్పుడు ఏమి చేసెను? ఆయన స్వయానా తన తల్లి సోదరుడగు కంసుని

సంహరించుటకు కారణమేమి? తల్లి సోదరుడు వధకు తగినవాడు కాడు గదా!

దేహం మానుషమాశ్రిత్య కతి వర్షాణి వృష్ణిభిః ।
యదుపుర్యాం సహావాత్సీత్పత్న్యః కత్యభవన్ ప్రభోః ॥ 11

మానుషమ్ - మానవులకు చెందిన, దేహమ్ - దేహమును, ఆశ్రిత్య - దాల్చి, వృష్ణిభిః సహ - యదువంశీయులతో గూడి, కతి - ఎన్ని, వర్షాణి - సంవత్సరములను, యదుపుర్యామ్ - యాదవుల నగరమగు ద్వారకయందు, అవాత్సీత్ - నివసించెను?, ప్రభోః - శ్రీకృష్ణ ప్రభునకు, పత్న్యః - భార్యలు, కతి - ఎందరు, అభవన్ - ఉండిరి?

శ్రీహరి మానవదేహమును దాల్చి యదువంశీయులతో గూడి యాదవుల నగరమగు ద్వారకయందు ఎన్ని సంవత్సరములు నివసించెను? ఆ ప్రభువునకు ఎందరు భార్యలు ఉండిరి?

ఏతదన్యచ్చ సర్వం మే మునే కృష్ణవిచేష్టితమ్ ।
వక్తుమర్హసి సర్వజ్ఞ శ్రద్దధానాయ విస్తృతమ్ ॥ 12

మునే - ఓ మహర్షీ!, సర్వజ్ఞ - సర్వము దెలిసినవాడా!, ఏతత్ - ఈ, కృష్ణవిచేష్టితమ్ - శ్రీకృష్ణుని లీలను, అన్యత్ చ - ఇతరమును కూడ, సర్వమ్ - సర్వమును, శ్రద్దధానాయ - శ్రద్ధను కలిగియున్న, మే - నా కొరకు, విస్తృతమ్ - విస్తారముగా, వక్తుమ్ - చెప్పుటకు, అర్హసి - తగవు.

ఓ మహర్షీ! నీవు సర్వము దెలిసినవాడవు. శ్రీకృష్ణుని లీలలను నేను అడిగినవాటిని, అడగనివాటిని కూడ సర్వమును నాకు తమరు విస్తారముగా చెప్పదగుదురు. ఎందుకంటే, నేను శ్రద్ధ గలవాడను.

నైషాతిదుస్సహా క్షున్మాం త్యక్తోదమపి బాధతే ।
పిబంతం త్వన్ముఖాంభోజచ్యుతం హరికథామృతమ్ ॥ 13

త్వత్-ముఖ-అంభోజచ్యుతమ్ - నీ ముఖపద్మమునుండి జాలువారిన, హరికథా-అమృతమ్ - శ్రీహరి గాథలు అనే అమృతమును, పిబంతమ్ - పానము చేయుచున్న, మామ్ - నన్ను, త్యక్త-ఉదం అపి - విడిచిపెట్టబ

డిన నీరు గలవాడనే అయిననూ, అతిదుస్సహా - మిక్కిలి సహించ శక్యము కాని, ఏషా - ఈ, క్షుత్ - ఆకలి, న బాధతే - పీడించుట లేదు.

నేను నీటిని కూడ విడిచి పెట్టిననూ, నీ ముఖపద్మమునుండి జాలువారే శ్రీహరిగాథలు అనే అమృతమునాస్వాదించుచున్నాను. కావునే, ఈ ఆకలి మిక్కిలి సహించ శక్యము కానిదే అయిననూ, నన్ను పీడించుట లేదు.

సూత ఉవాచ ।
ఏవం నిశమ్య భృగునందన సాధువాదం
వైయాసకిస్స భగవానథ విష్ణురాతమ్ ।
ప్రత్యర్చ్య కృష్ణచరితం కలికల్మషఘ్నం
వ్యాహర్తుమారభత భాగవతప్రధానః ॥ 14

భృగునందన - భృగువంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ శౌనకా!, భగవాన్ - పూజనీయుడు, భాగవతప్రధానః - భగవద్భక్తులలో ప్రముఖుడైన, సః - ఆ, వైయాసకిః - వ్యాసపుత్రుడగు శుకమహర్షి, ఏవమ్ - ఈ విధముగా, సాధువాదమ్ - చక్కటి ప్రశ్నను, నిశమ్య - విని, అథ - తరువాత, విష్ణురాతమ్ - పరీక్షిత్తును, ప్రత్యర్చ్య - కొనియాడి, కలికల్మషఘ్నమ్ - కలిదోషములను నశింపజేసే, కృష్ణచరితమ్ - శ్రీకృష్ణుని వృత్తాంతమును, వ్యాహర్తుమ్ - చెప్పుటకు, ఆరభత - ఆరంభించెను.

ఓ శౌనకా! నీవు భృగువంశీయులలో శ్రేష్ఠుడవు. వ్యాసపుత్రుడగు శుక మహర్షి పూజనీయుడు, భగవద్భక్తులలో ప్రముఖుడు. పరీక్షిత్తు వేసిన ఈ చక్కని ప్రశ్నను విని ఆయన పరీక్షిత్తును ముందుగా కొనియాడి, తరువాతనే శ్రీకృష్ణుని చరితమును చెప్పుటకు ఉపక్రమించెను. శ్రీకృష్ణుని గాథ కలిదోషములను నశింప జేయును.

శ్రీశుక ఉవాచ।
సమ్యగ్వ్యవసితా బుద్ధిస్తవ రాజర్షిసత్తమ ।
వాసుదేవకథాయాం తే యజ్జాతా నైష్ఠికీ రతిః ॥ 15

రాజర్షిసత్తమ - రాజర్షులలో శ్రేష్ఠుడవైన ఓ రాజా!, తవ - నీయొక్క, బుద్ధిః - బుద్ధి, సమ్యగ్-వ్యవసితా - యోగ్యమైన నిశ్చయము గలది, యత్

- ఏలయనగా, తే - నీకు, వాసుదేవకథాయామ్ - శ్రీకృష్ణుని గాథయందు, నైష్ఠికీ - నిశ్చలమైన, రతిః - ప్రీతి, జాతా - కలిగినది.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- రాజర్షులలో శ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! నీ బుద్ధి యోగ్యమైన నిశ్చయమును కలిగియున్నది. ఏలయనగా, నీకు శ్రీకృష్ణుని గాథలయందు అచంచలమైన ప్రీతి కలిగినది.

వాసుదేవకథాప్రశ్నః పురుషాంస్త్రీన్ పునాతి హి ।
వక్తారం పృచ్ఛకం శ్రోతౄంస్తత్పాదసలిలం యథా ॥ 16

వాసుదేవకథాప్రశ్నః - శ్రీకృష్ణుని గాథలకు సంబంధించిన ప్రశ్న, వక్తారమ్ - చెప్పువానిని, పృచ్ఛకమ్ - ప్రశ్నించువానిని, శ్రోతౄన్ - వినువారలను, త్రీన్ - ముగ్గురు, పురుషాన్ - వ్యక్తులను, తత్-పాదసలిలం యథా - ఆయన పాదములనుండి పుట్టిన గంగ (పాదముల తీర్థము) వలె, హి - నిశ్చయముగా, పునాతి - పావనము చేయును.

శ్రీకృష్ణ భగవానుని గాథలకు సంబంధించిన ప్రశ్న -- చెప్పువాడు, వినే ప్రతి వ్యక్తి, ప్రశ్నించువాడు -- అనే ముగ్గురిని, ఆయన పాదములనుండి పుట్టిన గంగ వలె, ఆయన పాదములనభిషేకించిన తీర్థము వలె, నిశ్చయముగా పావనము చేయును.

భూమిర్దృప్తనృపవ్యాజదైత్యానీకశతాయుతైః ।
ఆక్రాంతా భూరిభారేణ బ్రహ్మాణం శరణం యయౌ ॥ 17

దృప్తనృపవ్యాజదైత్య-అనీకశత-అయుతైః - గర్వించిన రాజుల రూపములోనున్న రాక్షసుల సైన్యముల పదుల లక్షలచే, భూరిభారేణ - పెద్ద బరువుచే, ఆక్రాంతా - ఆక్రమించబడిన, భూమిః - భూదేవి, బ్రహ్మాణమ్ - బ్రహ్మదేవుని, శరణమ్ - శరణమును, యయౌ - పొందెను.

పదుల లక్షల సైన్యములు గల రాక్షసులు గర్వించిన రాజుల రూపములో రాజ్యమును చేయుచుండిరి. ఆ విధముగా భూమి మోయలేని బరువును మోయుచుండెను. అపుడా భూదేవి బ్రహ్మదేవుని శరణు వేడెను.

**గౌర్భూత్వాఽశ్రుముఖీ ఖిన్నా క్రందంతీ కరుణం విభోః ।**
**ఉపస్థితాఽంతికే తస్మై వ్యసనం స్వమవోచత ॥ 18**

గౌః - గోవుగా, భూత్వా - అయి, అశ్రుముఖీ - కన్నీరు ముఖమునందు గలది, ఖిన్నా - ఖేదమును పొందినది, కరుణమ్ - జాలి కలిగే విధముగా, క్రందంతీ - రోదించుచున్నది, అంతికే - సమీపమునందు, ఉపస్థితా - నిల బడినది, తస్మై - ఆ బ్రహ్మగారి కొరకు, స్వమ్ - తనదైన, వ్యసనమ్ - ఆప దను, అవోచత - చెప్పెను.

ఆ భూదేవి గోరూపమును దాల్చి బ్రహ్మదేవుని వద్దకు వచ్చెను. ఆమె కన్నీరు నిండిన ముఖముతో జాలి కలిగే విధముగా రోదిస్తూ ఖేదమును పొందియుండెను. ఆమె బ్రహ్మదేవునకు తన ఆపదను వివరించెను.

బ్రహ్మా తదుపధార్యాథ సహ దేవైస్తయా సహ ।
జగామ సత్రినయనస్తీరం క్షీరపయోనిధేః ।। 19

బ్రహ్మా - బ్రహ్మదేవుడు, తత్ - ఆ ఆపదను గురించి, ఉపధార్య - తెలు సుకొని, అథ - తరువాత, దేవైః సహ - దేవతలతో గూడి, తయా సహ - ఆమెతో గూడి, సత్రినయనః - ముక్కంటి దేవునితో గూడినవాడై, క్షీరప యోనిధేః - పాల సముద్రముయొక్క, తీరమ్ - తీరమును గురించి, జగామ - వెళ్లెను.

బ్రహ్మదేవుడు భూదేవియొక్క ఆపదను గురించి తెలుసుకొని, అప్పుడు ఆ భూదేవిని, దేవతలను వెంట బెట్టుకొని పాల సముద్రపు తీర మునకు వెళ్లెను. ముక్కంటి దేవుడు కూడ ఆయన వెంట వెళ్లెను.

తత్ర గత్వా జగన్నాథం దేవదేవం వృషాకపిమ్ ।
పురుషం పురుషసూక్తేన ఉపతస్థే సమాహితః ।। 20

తత్ర - అచటకు, గత్వా - వెళ్లి, సమాహితః - ఏకాగ్రమగు మనస్సు గల వాడై, జగత్-నాథమ్ - జగత్తునకు రక్షకుడైనట్టియు, దేవదేవమ్ - దేవత లకు ఆరాధ్యుడైనట్టియు, వృషాకపిమ్ - కోరికలను వర్షించి కష్టములను పారద్రోలే, పురుషమ్ - పురుషోత్తముని, పురుషసూక్తేన - పురుషసూక్తము తో, ఉపతస్థే - నిలబడి స్తుతించెను.

అచటకు వెళ్లి బ్రహ్మదేవుడు ఏకాగ్రమగు చిత్తముతో నిలబడి పురుష సూక్తమును పఠించి పురుషోత్తముని స్తుతించెను. జగత్తులను పాలించే ఆ

శ్రీహరి భక్తులకు కోరికలను వర్షించి కష్టములను పారద్రోలును. ఆయనను దేవతలు కూడ ఆరాధించెదరు.

గిరం సమాధౌ గగనే సమీరితాం
నిశమ్య వేధాస్త్రిదశానువాచ హ ।
గాం పౌరుషీం మే శృణుతామరాః పునః
విధీయతామాశు తథైవ మా చిరమ్ ॥ 21

సమాధౌ - సమాధియందు, గగనే - హృదయాకాశమునందు, సమీరితామ్ - పలుకబడిన, గిరమ్ - వాక్కును, నిశమ్య - విని, వేధాః - బ్రహ్మదేవుడు, త్రిదశాన్ - దేవతలనుద్దేశించి, ఉవాచ హ - పలికెను, అమరాః - ఓ దేవతలారా!, పౌరుషీమ్ - పురుషోత్తమునకు చెందిన, గామ్ - వచనమును, మే - నానుండి, శృణుత - వినుడు, పునః - మరియు, ఆశు - వెంటనే, తథా ఏవ - అదే విధముగా, మా చిరమ్ - విలంబము లేకుండా, విధీయతామ్ - చేయబడుగాక!

సమాధిలో తన హృదయాకాశమునందు పలుకబడిన వాక్కును బ్రహ్మదేవుడు వినెను. ఆయన అప్పుడు దేవతలనుద్దేశించి ఇట్లు పలికెను -- ఓ దేవతలారా! పురుషోత్తముడు నాకు చెప్పిన వచనమును నేను మీకు చెప్పెదను, వినుడు. వినిన తరువాత వెంటనే సరిగ్గా అదే విధముగా విలంబము లేకుండా అనుష్ఠించుడు.

పురైవ పుంసావధృతో ధరాజ్వరో
భవద్భిరంశైర్యదుషూపజన్యతామ్ ।
స యావదుర్వ్యా భరమీశ్వరేశ్వరః
స్వకాలశక్త్యా క్షపయంశ్చరేద్భువి ॥ 22

పుంసా - పురుషోత్తమునిచే, ధరాజ్వరః - భూదేవియొక్క తాపము, పురా ఏవ - ముందే, అవధృతః - నిశ్చయముగా తెలియబడినది, భవద్భిః - మీచే, యదుషు - యదువంశీయులయందు, అంశైః - అంశలచే, ఉపజన్యతామ్ - జన్మ స్వీకరించబడుగాక!, యావత్ - ఎంతలోనైతే, ఈశ్వర-ఈశ్వరః - ఈశ్వరులకు ఈశ్వరుడగు, సః - ఆ శ్రీహరి, స్వకాలశక్త్యా - తన కాలమనే శక్తి ద్వారా, ఉర్వ్యాః - భూదేవియొక్క, భరమ్ - భారమును,

క్షపయన్ - నశింపజేయువాడై, భువి - భూలోకమునందు, చరేత్ - సంచరించునో.

భూదేవికి వచ్చిన ఆపద మనము విన్నవించుటకు ముందే శ్రీహరికి నిశ్చితముగా తెలియును. ఆయన భూలోకమునందు సంచరించి తన కాలము అనే శక్తి ద్వారా భూమియొక్క భారమును నశింప జేయగలడు. ఈశ్వరులకు కూడ ఈశ్వరుడగు ఆ శ్రీహరి ఆ పని చేసే లోపులో మీరు మీ మీ అంశలతో యదువంశీయులయందు జన్మించుడు.

వసుదేవగృహే సాక్షాద్భగవాన్ పురుషః పరః ।
జనిష్యతే తత్ప్రియార్థం సంభవంతు సురస్త్రియః ॥ 23

సాక్షాత్ - సాక్షాత్తుగా, భగవాన్ పురుషః పరః - పురుషోత్తమ భగవానుడు, వసుదేవగృహే - వసుదేవుని గృహమునందు, జనిష్యతే - జన్మించగలడు, తత్-ప్రియ-అర్థమ్ - ఆయనకు ప్రీతిని కలిగించుట కొరకై, సురస్త్రియః - దేవతాస్త్రీలు, సంభవంతు - జన్మించెదరు గాక!

స్వయముగా పురుషోత్తమ భగవానుడే వసుదేవుని గృహములో (భార్యయందు) అవతరించ గలడు. ఆయనకు సేవను చేసి ప్రీతిని కలిగించుట కొరకై దేవతాస్త్రీలు జన్మించవలెను.

వాసుదేవకలాఽనంతస్సహస్రవదనస్స్వరాట్ ।
అగ్రతో భవితా దేవో హరేః ప్రియచికీర్షయా ॥ 24

వాసుదేవకలా - శ్రీహరి భగవానుని అంశ, సహస్రవదనః - వేయి పడగలు గలవాడు, స్వరాట్ - స్వయంప్రకాశ స్వరూపుడు అగు, అనంతః దేవః - అనంత దేవుడు, హరేః - శ్రీహరికి, ప్రియచికీర్షయా - ప్రియమును చేసే కోరికతో, అగ్రతః - ముందుగా, భవితా - జన్మించగలడు.

శ్రీహరి సర్వజగన్నివాసుడు, స్వయంప్రకాశ స్వరూపుడు. ఆయన అంశయగు అనంత భగవానుడు కూడ అట్టివాడే. ఆ వేయి పడగల దేముడు శ్రీహరికి ప్రియమును చేయగోరి ఆయనకంటె ముందుగనే అవతరించగలడు.

విష్ణోర్మాయా భగవతీ యయా సమ్మోహితం జగత్ ।
ఆదిష్టా ప్రభుణాంశేన కార్యార్థే సంభవిష్యతి ॥ 25

భగవతీ - పూజనీయురాలైన, విష్ణోః - విష్ణువుయొక్క, మాయా - మాయాశక్తి, ప్రభుణా - శ్రీహరి ప్రభునిచే, ఆదిష్టా - ఆదేశించబడినదై, అంశేన - అంశచే, కార్య-అర్థే - దేవకార్యము అనే ప్రయోజనమునందు, సంభవిష్యతి - జన్మించగలదు, యయా - ఏ మాయాశక్తిచే, జగత్ - జగత్తు, సమ్మోహితమ్ - వ్యామోహితము చేయబడుచున్నదో.

పూజనీయురాలైన విష్ణువుయొక్క మాయాశక్తిచే జగత్తు వ్యామోహితమగుచున్నది. ఆ దేవి శ్రీహరిచే ఆదేశించబడి దేవ (అవతార) కార్యమును సాధించుట కొరకై అంశచే జన్మించగలదు.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యాదిశ్యామరగణాన్ ప్రజాపతిపతిర్విభుః ।
ఆశ్వాస్య చ మహీం గీర్భిస్స్వధామ పరమం యయౌ ॥ 26

ప్రజాపతిపతిః - ప్రజాపతులకు ప్రభువగు, విభుః - బ్రహ్మదేవుడు, అమరగణాన్ - దేవతల గణములను, ఇతి - ఈ విధముగా, ఆదిశ్య - ఆదేశించి, మహీం చ - భూదేవిని కూడ, గీర్భిః - మంచి మాటలతో, ఆశ్వాస్య - ఓదార్చి, పరమమ్ - సర్వోత్కృష్టమైన, స్వధామ - తన ధామమును గురించి, యయౌ - వెళ్లెను.

మరీచ్యాది ప్రజాపతులకు ప్రభువగు బ్రహ్మదేవుడు దేవతల గణములనీ విధముగా ఆదేశించి, భూదేవిని కూడ మంచి మాటలతో ఓదార్చి, తన ధామమును గురించి వెళ్లెను. ఆయన ధామము భూరాది లోకములకంటె ఉత్కృష్టమైనది.

శూరసేనో యదుపతిర్మథురామావసన్ పురీమ్ ।
మాథురాఞ్ఛూరసేనాంశ్చ విషయాన్ బుభుజే పురా ॥ 27

పురా - పూర్వము, యదుపతిః - యాదవులకు ప్రభువగు, శూరసేనః - శూరసేన మహారాజు, మథురాం పురీం ఆవసన్ - మథురానగరమునందు నివసించువాడై, మాథురాన్ శూరసేనాన్ చ విషయాన్ -

మథురామండలమును శూరసేనమండలమును కూడ, బుభుజే - పాలించెను.

పూర్వము యాదవప్రభువగు శూరసేనమహారాజు మథురా నగరమునందు నివసిస్తూ మథురామండలమును, శూరసేన మండలమును కూడ పాలించెను.

రాజధానీ తతస్సాఽభూత్సర్వయాదవభూభుజామ్ ।
మథురా భగవాన్ యత్ర నిత్యం సన్నిహితో హరిః ॥ 28

తతః - ఆనాటినుండియు, సా - ఆ, మథురా - మథుర, సర్వయాదవభూభుజామ్ - అందరు యాదవరాజులకు, రాజధానీ - రాజధాని, అభూత్ - ఆయెను, యత్ర - ఎక్కడనైతే, హరిః భగవాన్ - శ్రీహరి భగవానుడు, నిత్యమ్ - అన్ని వేళలా, సన్నిహితః - సన్నిధి చేయునో.

ఆ శూరసేనుని కాలమునుండీ ఆ మథురయే యాదవరాజులందరికీ రాజధాని ఆయెను. అక్కడ శ్రీహరి భగవానుని నిత్యసన్నిధి ఉండును.

తస్యాం తు కర్హిచిచ్ఛౌరిర్వసుదేవః కృతోద్వహః ।
దేవక్యా సూర్యయా సార్ధం ప్రయాణే రథమారుహత్ ॥ 29

తస్యాం తు - ఆ మథురయందైతే, కర్హిచిత్ - ఒకానొకప్పుడు, శౌరిః - శూరుని పుత్రుడగు, వసుదేవః - వసుదేవుడు, కృత-ఉద్వహః - చేయబడిన వివాహము గలవాడై, సూర్యయా - కొత్త పెళ్లికూతురగు, దేవక్యా సార్ధమ్ - దేవకితో కూడి, ప్రయాణే - పయనించుట కొరకై, రథమ్ - రథమును, ఆరుహత్ - ఎక్కెను.

ఆ మథురయందైతే ఒకానొకప్పుడు శూరుని పుత్రుడగు వసుదేవుడు దేవకిని పెళ్లాడి, కొత్త పెళ్లికూతురుతో కూడి ప్రయాణము కొరకై రథమునెక్కెను.

ఉగ్రసేనసుతః కంసస్స్వసుః ప్రియచికీర్షయా ।
రశ్మీన్ హయానాం జగ్రాహ రౌక్మై రథశతైర్వృతః ॥ 30

ఉగ్రసేనసుతః - ఉగ్రసేనుని పుత్రుడగు, కంసః - కంసుడు, స్వసుః - చెల్లెలు అగు దేవకికి, ప్రియచికీర్షయా - ప్రీతిని కలిగించే ఇచ్ఛతో, రౌక్మైః - బంగారముతో చేసిన, రథశతైః - వందల రథములతో, వృతః - కూడినవాడై, హయానామ్ - గుర్రములయొక్క, రశ్మీన్ - కళ్లెములను, జగ్రాహ - పట్టెను.

కంసుడు ఉగ్రసేనుని కొడుకు. ఆతడు తన చెల్లెలు (పినతండ్రి కుమార్తె) అగు దేవకికి ప్రీతిని కలిగించగోరి స్వయముగా గుర్రముల కళ్లెమును పట్టి రథమును నడిపెను. ఆతని వెంట బంగరు రథములు వందల సంఖ్యలో నడిచెను.

చతుశ్శతం పారిబర్హం గజానాం హేమమాలినామ్ ।
అశ్వానామయుతం సార్ధం రథానాం చ త్రిషట్ఛతమ్ ॥ 31
దాసీనాం సుకుమారాణాం ద్వే శతే సమలంకృతే ।
దుహిత్రే దేవకః ప్రాదాద్యానే దుహితృవత్సలః ॥ 32

దుహితృవత్సలః - కుమార్తెయందు ప్రేమ గల, దేవకః - దేవకుడు, యానే - ప్రయాణసమయమునందు, దుహిత్రే - కుమార్తె కొరకు, హేమమాలినామ్ - బంగరు మాలలు గల, గజానామ్ - ఏనుగుల, చతుశ్శతమ్ - నాల్గు వందలను, అశ్వానామ్ - గుర్రముల, సార్ధం అయుతమ్ - పదిహేను వేలను, రథానామ్ - రథముల, త్రిషట్-శతమ్ - పద్ధెనిమిది వందలను, సుకుమారాణామ్ - సుకుమారులైన, దాసీనామ్ - దాసీల, సమలంకృతే - చక్కగా అలంకరించబడిన, ద్వే - రెండు, శతే చ - వందలను కూడ, పారిబర్హమ్ - పెళ్లికానుకగా, ప్రాదాత్ - ఇచ్చెను.

దేవకునకు (ఉగ్రసేనుని సోదరుడు) కుమార్తెయందు ప్రీతి మెండు. ఆమె అత్తవారింటికి వెళ్లే సమయములో ఆయన బంగరు మాలలు గల నాల్గు వందల ఏనుగులను, పదిహేను వేల గుర్రములను, పద్ధెనిమిది వందల రథములను, చక్కగా అలంకరించుకున్న సుకుమారలైన రెండు వందలమంది దాసీలను కూడ పెళ్లికానుకగా ఇచ్చెను.

శంఖతూర్యమృదంగాశ్చ నేదుర్దుందుభయస్సమమ్ ।
ప్రయాణప్రక్రమే తావద్వరవధ్వోస్సుమంగలమ్ ॥ 33

వరవధ్వోః - పెళ్లి కొడుకు పెళ్లి కూతుళ్ల, ప్రయాణప్రక్రమే - ప్రయాణముయొక్క ఆరంభమునందు, తావత్ - మొట్టమొదటనే, శంఖతూర్యమృదంగాః - శంఖములు తూర్యములు మద్దెళ్లు, దుందుభయః చ - భేరీలు కూడ, సమమ్ - ఒక్కసారిగా, సుమంగలమ్ - చక్కని శుభము కలుగునట్లుగా, నేదుః - మ్రోగినవి.

కొత్త పెళ్లి కొడుకు పెళ్లి కూతురు ప్రయాణమునారంభించగా మొట్టమొదటనే శంఖములు, తూర్యములు, మద్దెళ్లు, భేరీలు కూడ మంగళమును సూచిస్తూ ఒక్కసారిగా మ్రోగినవి.

పథి ప్రగ్రహిణం కంసమాభాష్యాహాశరీరవాక్ ।
అస్యాస్త్వామష్టమో గర్భో హంతా యాం వహసేఽబుధ ॥ 34

ప్రగ్రహిణమ్ - కళ్లెములను పట్టుకొనియున్న, కంసమ్ - కంసుని ఉద్దేశించి, పథి - మార్గమునందు, అశరీరవాక్ - ఆకాశవాణి, ఆహ - పలికెను, అబుధ - ఓ అవివేకీ!, యామ్ - ఏ దేవకిని, వహసే - తీసుకొని వెళ్లుచున్నావో, అస్యాః - ఈమెయొక్క, అష్టమః - ఎనిమిదవ, గర్భః - సంతానము, త్వామ్ - నిన్ను, హంతా - సంహరించును.

కళ్లెములను పట్టి రథమును నడుపుతూ ఉన్న కంసుని ఉద్దేశించి మార్గమధ్యములో ఆకాశవాణి ఇట్లు పలికెను - ఓరీ అవివేకీ! నీవు రథముపై ఏ దేవకిని తీసుకొని వెళ్లుచున్నావో, ఈమె ఎనిమిదవ సంతానము నిన్ను సంహరించును.

ఇత్యుక్తస్స ఖలః పాపో భోజానాం కులపాంసనః ।
భగినీం హంతుమారబ్ధః ఖడ్గపాణిః కచేఽగ్రహీత్ ॥ 35

ఖలః - దుష్టుడు, పాపః - పాపి, భోజానామ్ - భోజులయొక్క, కులపాంసనః - వంశమును చెడగొట్టువాడు అగు, సః - ఆ కంసుడు, ఇతి - ఈ విధముగా, ఉక్తః - పలుకబడినవాడై, ఖడ్గపాణిః - కత్తి చేతియందు

గలవాడై, భగినీమ్ - చెల్లెలిని, హంతుమ్ - సంహరించుటకు, ఆరబ్ధః - ఉపక్రమించినవాడై, కచే - కొప్పునందు, అగ్రహీత్ - పట్టుకొనెను.

దుష్టుడు, పాపి అయిన కంసుడు భోజవంశమునందు చెడబుట్టినాడు. ఈ విధముగా ఆకాశవాణి పలుకగా వాడు చేత కత్తిబట్టి చెల్లెలి కొప్పును పట్టుకొని ఆమెను సంహరించుటకు ఉద్యుక్తుడాయెను.

తం జుగుప్సితకర్మాణం నృశంసం నిరపత్రపమ్ ।
వసుదేవో మహాభాగ ఉవాచ పరిసాంత్వయన్ ।। 36

జుగుప్సితకర్మాణమ్ - ఏవగించుకొనబడిన పనిని చేయునట్టియు, నృశంసమ్ - క్రూరుడైనట్టియు, నిరపత్రపమ్ - సిగ్గు లేని, తమ్ - ఆ కంసుని ఉద్దేశించి, మహాభాగః - గొప్ప భాగ్యశాలియగు, వసుదేవః - వసుదేవుడు, పరిసాంత్వయన్ - మంచి మాటలతో బోధించువాడై, ఉవాచ - పలికెను.

క్రూరుడైన కంసుడు సిగ్గు లేకుండా జనులు ఏవగించుకొనే పనిని చేయబోవుచుండగా, గొప్ప భాగ్యశాలియగు వసుదేవుడు మంచి మాటలతో బోధిస్తూ ఆతనితో నిట్లనెను.

వసుదేవ ఉవాచ ।
శ్లాఘనీయగుణశ్శూరైర్భవాన్ భోజయశస్కరః ।
స కథం భగినీం హన్యాత్ స్త్రియముద్వాహపర్వణి ।। 37

భవాన్ - తమరు, శూరైః - శూరులచే, శ్లాఘనీయగుణః - కొనియాడదగిన గుణములు గలవాడవు, భోజయశస్కరః - భోజవంశమునకు కీర్తిని కలిగించువాడవు, సః - అట్టివాడు, ఉద్వాహపర్వణి - వివాహముయొక్క శుభకాలమునందు, భగినీమ్ - చెల్లెలిని, కథమ్ - ఏ విధముగా, హన్యాత్ - చంపును?

**వసుదేవుడిట్లు పలికెను --- భోజవంశమునకు కీర్తిని కలిగించిన తమరి గుణములను శూరులు పొగిడెదరు. అట్టివాడు వివాహశుభవేళ చెల్లెలినెట్లు చంపును? (చంపడు).**

మృత్యుర్జన్మవతాం వీర దేహేన సహ జాయతే ।
అద్య వాబ్దశతాంతే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః ।। 38

వీర - ఓ వీరుడా!, జన్మవతామ్ - పుట్టుక గలవారలకు, మృత్యుః - మరణము, దేహేన సహ - దేహముతో బాటే, జాయతే - పుట్టును, ప్రాణినామ్ - ప్రాణులకు, అద్య వా - ఈనాడు గాని, అబ్దశత-అంతే వా - వంద యేళ్ల తరువాత గాని, మృత్యుః - మరణము, ధ్రువః వై - నిశ్చితము గదా!

వీరుడవగు ఓ కంసా! (వీరుడు మృత్యువుకు భయపడడు, స్త్రీని సంహరించడు) పుట్టుక గల జనులకు దేహముతో బాటే మరణము కూడ పుట్టును. ఈ నాడు గాని, వంద యేళ్ల తరువాత గాని, ప్రాణులకు మరణము నిశ్చితము గదా!

దేహే పంచత్వమాపన్నే దేహీ కర్మానుగోఽవశః ।
దేహాంతరమనుప్రాప్య ప్రాక్తనం త్యజతే వపుః ।। 39

అవశః - అస్వతంత్రుడు, కర్మ-అనుగః - కర్మను అనుసరించి పయనించువాడు అగు, దేహీ - దేహమును పొందియున్న జీవుడు, దేహే - దేహము, పంచత్వమ్ - పంచభూతములలో కలియుటను, ఆపన్నే - పొందుచుండగా, దేహ-అంతరమ్ - మరియొక దేహమును, ప్రాప్య - పొంది, అను - తరువాత, ప్రాక్తనమ్ - ముందటి, వపుః - దేహమును, త్యజతే - విడిచిపెట్టును.

అస్వతంత్రుడగు జీవుడు కర్మానుసారముగా ఒక దేహమునుండి మరియొక దేహమునకు పయనించుచుండును. ఈ దేహము పంచభూతములలో కలిసిపోవుటకు కాలము రాగా జీవుడు మరియొక దేహమును పొంది ముందటి (ఈ) దేహమును విడిచిపెట్టును.

వ్రజంస్తిష్ఠన్ పదైకేన యథైవైకేన గచ్ఛతి ।
యథా తృణజలూకైవం దేహీ కర్మగతిం గతః ।। 40

వ్రజన్ - నడచుచున్న వ్యక్తి, యథా - ఏ విధముగానైతే, ఏకేన - ఒక, పదా - కాలితో, తిష్ఠన్ - నిలిచియున్నవాడై, ఏకేన ఏవ - ఒకే కాలితో,

గచ్ఛతి - ముందుకు సాగునో, ఏవమ్ - ఈ విధముగా, యథా తృణజలూకా - గడ్డి పురుగు వలె, దేహీ - దేహమునందున్న జీవుడు, కర్మగతిమ్ - కర్మమార్గమును, గతః - పొందినవాడు.

నడిచే వ్యక్తి ఒక కాలితో నేలపై నిలిచి మరియొక కాలితో ముందుకు సాగును. గడ్డి పురుగు ఒక గడ్డిపోచను పట్టుకొని వెనుకటి పోచను వదిలిపెట్టును. కర్మమార్గమునందు పయనించే జీవుడు కూడ అదే విధముగా చేయును.

స్వప్నే యథా పశ్యతి దేహమీదృశం
మనోరథేనాభినివిష్టచేతనః ।
దృష్టశ్రుతాభ్యాం మనసాఽనుచింతయన్
ప్రపద్యతే తత్కిమపి హ్యపస్మృతిః ॥ 41

యథా - ఏ విధముగానైతే, స్వప్నే - కలయందు, మనోరథేన- కామనచే, అభినివిష్టచేతనః - పట్టుదల కలిగిన బుద్ధి గలవాడై, దృష్టశ్రుతాభ్యామ్ - చూడబడిన మరియు వినబడిన వాటితో, మనసా - మనస్సుతో, అనుచింతయన్ - స్మరించువాడై, ఈదృశమ్ - ఇటువంటి, కిం అపి - ఏదో ఒక, దేహమ్ - దేహమును, పశ్యతి - చూచునో, అపస్మృతిః - తొలగిన స్మృతి గలవాడై, తత్ హి - దానినే, ప్రపద్యతే - భావించును.

మానవుని మనస్సులో కామనలు గట్టిగా నాటుకొనియుండును. తాను చూచిన మరియు విన్న భోగసంస్కారములు అతని మనస్సులో ఉండును. అతడు నిద్రించి ఆ మనస్సుతో కల గనును. ఆ కలలో జాగ్రద్దేహమును పోలిన ఒకానొక (ఈ విధంగా ఉండునని చెప్ప వీలుగాని) దేహమును చూచును. అతనికి అప్పుడు జాగ్రదవస్థయొక్క స్మరణము ఉండదు గనుక, ఆ దేహమే తానని భావించును. అదే విధముగా జీవుడు మరణించి ఈ దేహమును విడిచి సర్వమును విస్మరించి మరియొక దేహమునందు ఆత్మాభిమానమును పొందును.

యతో యతో ధావతి దైవచోదితం మనో వికారాత్మకమాప పంచసు,
గుణేషు మాయారచితేషు దేహ్యసౌ ప్రపద్యమానస్సహ తేన జాయతే.

దైవచోదితమ్ - దైవముచే ప్రేరితమైనది, వికార-ఆత్మకమ్ - వాసనలతో నిండియుండే, మనః - మనస్సు, మాయారచితేషు - మాయాశక్తిచే నిర్మితములైన, పంచసు - అయిదు, గుణేషు - భూతములయందు, యతః యతః - ఏయే దేహమును గురించి, ధావతి - పరుగు తీయునో, ఆప - పొందునో దానినే, ప్రపద్యమానః - ఆత్మరూపముగా భావించువాడై, అసౌ - ఈ, దేహీ - జీవుడు, తేన సహ - ఆ మనస్సుతో బాటే, జాయతే - పుట్టును. 42

వాసనాత్మకమైన మనస్సు దైవము (జన్మనిచ్చే కర్మ) చే ప్రేరితమై ఏయే దేహమువైపు పయనించునో, ఈ జీవుడు కూడ ఆ మనస్సుతో బాటే ఆ దేహమునే పొంది జన్మించి దానియందు ఆత్మాభిమానమును కలిగియుండును. పంచభూతములతో తయారయ్యే ఈ దేహములన్నియు మాయాశక్తిచే నిర్మించబడినవే.

జ్యోతిర్యథైవోదకపార్థివేష్వదస్సమీరవేగానుగతం విభావ్యతే,
ఏవం స్వమాయారచితేష్వసౌ పుమాన్గుణేషు రాగానుగతో విముహ్యతి।

యథా ఏవ - ఏ విధముగానైతే, ఉదకపార్థివేషు - నీటి పడియలయందు, అదః - ఈ, జ్యోతిః - ప్రకాశించే మండలము, సమీరవేగ-అనుగతమ్ - గాలి వీచుటననుసరించి కదిలేదిగా, విభావ్యతే - కానవచ్చునో, ఏవమ్ - ఇదే విధముగా, అసౌ - ఈ, పుమాన్ - పూర్ణ-ఆత్మ, స్వమాయారచితేషు - తన మాయాశక్తిచే నిర్మితములైన, గుణేషు - దేహములయందు, రాగ-అనుగతః - ఆసక్తిచే అభిమానము గలవాడై, ముహ్యతి - మోహము (తాదాత్మ్యము) ను పొందుచున్నాడు.

ఒకే సూర్య (చంద్ర) బింబము వేర్వేరు నీటి పడియలలో ప్రతిఫలిస్తూ, గాలి వీచి ఆ నీరు కదిలినప్పుడు తాను కూడ కదులుచున్నట్లు కానవచ్చును. ఇదే విధముగా ఒకే పూర్ణ-ఆత్మ తన మాయాశక్తిచే నిర్మితములైన వేర్వేరు దేహములయందు ప్రవేశించి ఆయా దేహమునందు ఆసక్తిని కలిగి దేహతాదాత్మ్యముచే జీవభ్రాంతిని పొందియుండును. 43

తస్మాన్న కస్యచిద్ద్రోహమాచరేత్స తథావిధః ।
ఆత్మనః క్షేమమన్విచ్ఛన్ద్రోగ్ధుర్వై పరతో భయమ్ ॥ 44

తస్మాత్ - అందువలన, తథావిధః - ఆ విధముగా మోహితుడైయున్న, సః - ఆ జీవుడు, ఆత్మనః - తనకు, క్షేమమ్ - క్షేమమును, అన్విచ్ఛన్ - కోరువాడై, కస్యచిత్ - ఎవనికైననూ, ద్రోహమ్ - హానిని, న ఆచరేత్ - చేయరాదు, ద్రోగ్ధుః - ద్రోహము చేయువానికి, పరతః - ఇతరుని వలన, భయమ్ - భయము, వై - నిశ్చితము.

అందువలన ఈ విధముగా (దేహాభిమానముతో) మోహితుడైయున్న జీవుడు తనకు (ఇహపరములలో) క్షేమమును కోరువాడైనచో, ఎవనికైననూ కీడు చేయరాదు. ఇతరులకు కీడు చేయు వానికి ఇహములో ఇతరుని వలన, పరములో యముని వలన భయము తప్పదు.

ఏషా తవానుజా బాలా కృపణా పుత్రికోపమా ।
హంతుం నార్హసి కల్యాణీమిమాం త్వం దీనవత్సలః ॥ 45

ఏషా - ఈ, బాలా - అమాయకురాలు, తవ - నీ, అనుజా - చెల్లెలు, కృపణా - దీనురాలు, పుత్రికా-ఉపమా - కుమార్తెను పోలినది, కల్యాణీమ్ - మంగళప్రదురాలైన, ఇమామ్ - ఈమెను, దీనవత్సలః - దీనులయందు ప్రేమ గల, త్వమ్ - నీవు, హంతుమ్ - సంహరించుటకు, న అర్హసి - తగవు.

ఈ నీ చెల్లెలు అమాయకురాలు, నీకు కుమార్తెతో సమానము. మంగళప్రదురాలైన ఈమెను సంహరించుట దీనులయందు ప్రేమను చూపే నీకు తగదు.

శ్రీశుక ఉవాచ ।
ఏవం స సామభిర్భేదైర్బోధ్యమానోఽపి దారుణః ।
న న్యవర్తత కౌరవ్య పురుషాదాననువ్రతః ॥ 46

కౌరవ్య - కురువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా!, దారుణః - క్రూరుడు, పురుష-అదాన్ - నరమాంసభక్షకులైన రాక్షసులను, అనువ్రతః - పట్టుదలతో అనుసరించువాడు అగు, సః - ఆ కంసుడు, ఏవమ్ - ఈ

విధముగా, సామభిః - సాంత్వవచనములతో, భేదైః - పాపభీతిని కలిగించే మాటలతో, బోధ్యమానః అపి - ఉపదేశించబడినవాడే అయిననూ, న న్యవర్తత - వెనుదిరగ లేదు.

కురువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! కంసుడు నరమాంసభక్షకులైన రాక్షసులను పట్టుదలతో అనుసరించే క్రూరుడు. వసుదేవుడు ఆతనికి సాంత్వవచనములతో మరియు పాపభీతిని కలిగించే మాటలతో ఉపదేశించిననూ, ఆతడు (పాపకర్మనుండి) వెనుదిరగలేదు.

నిర్బంధం తస్య తం జ్ఞాత్వా విచింత్యానకదుందుభిః ।
ప్రాప్తం కాలం ప్రతివ్యోఢుమిదం తత్రాన్వపద్యత ॥ 47

ఆనకదుందుభిః - వసుదేవుడు, తస్య - వానియొక్క, తమ్ - ఆ, నిర్బంధమ్ - హఠమును, జ్ఞాత్వా - గుర్తించి, విచింత్య - ఆలోచించి, ప్రాప్తమ్ - వచ్చిపడిన, కాలమ్ - మృత్యువును, ప్రతివ్యోఢుమ్ - వంచించుటకై, తత్ర - అప్పుడు, ఇదమ్ - ఈ ఉపాయమును, అన్వపద్యత - నిశ్చయించెను.

వసుదేవుడు వాని ఆ హఠమును గుర్తించి ఆలోచించి వచ్చిపడిన మృత్యువును తప్పించుటకై ఆ సమయములో ఈ (క్రింది) ఉపాయమును నిశ్చయించెను.

మృత్యుర్బుద్ధిమతాఽపోహ్యో యావద్బుద్ధిబలోదయమ్ ।
యద్యసౌ న నివర్తేత నాపరాధోఽస్తి దేహినః ॥ 48

బుద్ధిమతా - బుద్ధిమంతునిచే, యావద్-బుద్ధిబల-ఉదయమ్ - ఎంతవరకైతే బుద్ధి మరియు బలము ముందుకు వచ్చునో అంతవరకు, మృత్యుః - మరణము, అపోహ్యః - తప్పించుకొనదగినది, అసౌ - ఈ మరణము, న నివర్తేత యది - తప్పిపోనిచో, దేహినః - వ్యక్తియొక్క, అపరాధః - తప్పు, న అస్తి - కాదు.

బుద్ధిమంతుడగు వ్యక్తి తన బుద్ధిని మరియు శక్తిని ఎంతవరకు అవకాశము ఉంటే అంతవరకు వినియోగించి మరణమునుండి

తప్పించుకొనవలెను. ప్రయత్నించినా మరణము తప్పనిసరి యైనచో, అది వాని తప్పు కాదు.

ప్రదాయ మృత్యవే పుత్రాన్మోచయే కృపణామిమామ్ ।
సుతా మే యది జాయేరన్మృత్యుర్వా న మ్రియేత చేత్ ॥ 49

పుత్రాన్ - పుత్రులను, మృత్యవే - మృత్యువు కొరకు, ప్రదాయ - అప్పజెప్పి, ఇమామ్ - ఈ, కృపణామ్ - దీనురాలిని, మోచయే - విడిపించెదను, మే - నాకు, సుతాః - పుత్రులు, యది జాయేరన్ - పుట్టినప్పుడు గదా!, వా - లేదా, మృత్యుః - మృత్యురూపుడగు కంసుడు, న మ్రియేత చేత్ - మరణించకున్నచో!

చంపుటకు పుత్రులను వీనికి అప్పజెప్పి (మాట యిచ్చి) ఈ దీనురాలిని విడిపించెదను. నాకు పుత్రులు కలిగినప్పుడు గదా! ఈ లోపులో మృత్యురూపుడగు ఈ కంసుడే మృత్యువు వాత పడునేమో!

విపర్యయో వా కిం న స్యాద్గతిర్ధాతుర్దురత్యయా ।
ఉపస్థితో నివర్తేత నివృత్తః పునరాపతేత్ ॥ 50

విపర్యయః వా - తల్లక్రిందులైననూ, కిం న స్యాత్ - ఏల అవరాదు?, ధాతుః - విధాతయొక్క, గతిః - సంకల్పము, దురత్యయా - అతిక్రమించ శక్యము కానిది, ఉపస్థితః - ఎదురుగా ఉన్నది, నివర్తేత - వెనుకకు పోవచ్చును, నివృత్తః - వెనుకకు పోయినది, పునః - మరల, ఆపతేత్ - రావచ్చును.

నాకు పుట్టబోయే బుడతడు ఈ కంసుని చంపుట అనే తల్లక్రిందులు కూడ కారాదా? (కావచ్చును). విధాతయొక్క సంకల్పము అతిక్రమించ శక్యము కానిది. మా ముందున్న మృత్యువు దూరమై, కంసునికే మృత్యువు రావచ్చును.

అగ్నేర్యథా దారువియోగయోగయోరదృష్టతోఽన్యత్ర నిమిత్తమస్తి ।
ఏవం హి జంతోరపి దుర్విభావ్యశ్శరీరసంయోగవియోగహేతుః ॥

యథా - ఏ విధముగానైతే, అగ్నేః - అగ్నికి, దారువియోగయోగయోః - ఒక కట్టెతో విడిపోవుటకు మరియొక కట్టెతో కలయికకు, అదృష్టతః -

ఆయా జీవుల భాగ్యములకంటె, అన్యత్ - మరియొక, నిమిత్తమ్ - కారణము, న అస్తి - లేదో, ఏవం హి - ఇదే విధముగా, జంతోః అపి - జీవునకు కూడ, శరీరసంయోగవియోగహేతుః - ఒక శరీరముతో కలయిక మరియొక శరీరముతో వియోగమునకు కారణము, దుర్విభావ్యః - ఊహించ శక్యము కానిది. 51

అడవిలో కార్చిచ్చు పుట్టినప్పుడు ఒక చెట్టు తగులబడగా, మరియొకటి క్షేమముగా నుండును. ఈ ఘటనలకు కారణము ఆయా జీవుల పుణ్యపాపములే తప్ప మరియొకటి కాదు. ఇదే విధముగా, జీవునకు ఒక శరీరముతోడి సంయోగము గాని, మరియొక దేహముతోడి వియోగము గాని, ఊహించ శక్యము కాని అదృష్టము పైననే ఆధారపడి యుండును.

ఏవం విమృశ్య తం పాపం యావదాత్మనిదర్శనమ్ ।
పూజయామాస వై శౌరిర్బహుమానపురస్సరమ్ ॥ 52

శౌరిః - శూరుని పుత్రుడగు వసుదేవుడు, ఏవమ్ - ఈ విధముగా, యావద్-ఆత్మనిదర్శనమ్ - తన బుద్ధికి ఏ మేరకు తోచెనో ఆ మేరకు, విమృశ్య - పూర్వాపరములను ఆలోచించి, పాపమ్ - పాపియగు, తమ్ - ఆ కంసుని, బహుమానపురస్సరమ్ - పెద్ద ఆదరము కలుగునట్లుగా, పూజయామాస వై - ప్రశంసించెను.

శూరపుత్రుడగు వసుదేవుడు తన బుద్ధికి తోచిన మేరకు ఈ విధముగా పూర్వాపరములనాలోచించుకొని, పాపియగు ఆ కంసుని పెద్ద ఆదరముతో ప్రశంసించెను.

ప్రసన్నవదనాంభోజో నృశంసం నిరపత్రపమ్ ।
మనసా దూయమానేన విహసన్నిదమబ్రవీత్ ॥ 53

ప్రసన్నవదన-అంభః-జః - ప్రసన్నమైన పద్మమువంటి ముఖము గల వసుదేవుడు, విహసన్ - నవ్వుచున్నవాడై, దూయమానేన - సంతాపముతో నిండిన, మనసా - మనస్సుతో, నృశంసమ్ -

క్రూరుడైనట్టియు, నిరపత్రపమ్ - సిగ్గు లేని కంసుని ఉద్దేశించి, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

వసుదేవుని మనస్సు సంతాపముతో నిండియున్ననూ ఆయన ముఖము ప్రసన్నముగా పద్మమును పోలియుండెను. ఆయన నవ్వుతూ, సిగ్గు లేకుండా క్రూరమగు పనికి పాల్పడ్డ కంసునితో ఇట్లు పలికెను.

వసుదేవ ఉవాచ ।
న హ్యస్యాస్తే భయం సౌమ్య యద్వాగాహాశరీరిణీ ।
పుత్రాన్సమర్పయిష్యేఽస్యా యతస్తే భయముత్థితమ్ ॥ 54

సౌమ్య - ఓ ప్రియదర్శనుడా!, తే - నీ కొరకు, అస్యాః - ఈమెనుండి, భయమ్ - భయము, న హి - లేనే లేదు, యత్ - ఏ భయమును, అశరీరిణీ వాక్ - ఆకాశవాణి, ఆహ - చెప్పెనో, అస్యాః - ఈమెయొక్క, పుత్రాన్ - పుత్రులను, సమర్పయిష్యే - సమర్పించగలను, యతః - ఎవరివలనైతే, తే - నీ కొరకు, భయమ్ - భయము, ఉత్థితమ్ - ఉదయించినదో.

వసుదేవుడిట్లు పలికెను --- ప్రియదర్శనుడవగు ఓ కంసా! ఆకాశవాణి చెప్పిన ప్రాణభయము నీకు ఈమె వలన కలుగనే కలుగదు. ఈమె పుత్రుల వలన నీకు భయము గదా! ఆ పుత్రులను నేను నీకు సమర్పించెదను.

శ్రీశుక ఉవాచ ।
స్వసుర్వధాన్నివవృతే కంసస్తద్వాక్యసారవిత్ ।
వసుదేవోఽపి తం ప్రీతః ప్రశస్య ప్రావిశద్గృహమ్ ॥ 55

తద్-వాక్యసారవిత్ - ఆ వసుదేవుని మాటల యుక్తిని గుర్తెరిగిన, కంసః - కంసుడు, స్వసుః - చెల్లెలి, వధాత్ - సంహారమునుండి, నివవృతే - వెనుదిరిగెను, వసుదేవః అపి - వసుదేవుడు కూడ, ప్రీతః - ప్రీతి జెందినవాడై, తమ్ - ఆ కంసుని, ప్రశస్య - ప్రశంసించి, గృహమ్ - ఇంటిని, ప్రావిశత్ - ప్రవేశించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- వసుదేవుని మాటలలోని ఔచిత్యమును గుర్తించిన కంసుడు చెల్లెలిని చంపుట అనే క్రౌర్యమునుండి విరమించుకొనెను. వసుదేవుడు కూడ ప్రీతిని జెంది కంసుని ప్రశంసించి తన ఇంటికి చేరుకొనెను.

అథ కాల ఉపావృత్తే దేవకీ సర్వదేవతా ।
పుత్రాన్ప్రసుషువే చాష్టౌ కన్యాం చైవానువత్సరమ్ ॥ 56

అథ - తరువాత, కాలే - కాలము, ఉపావృత్తే - గడువగా, సర్వదేవతా - అందరికీ పూజనీయురాలైన (అందరియందలి పరబ్రహ్మను ఆరాధించే), దేవకీ - దేవకి, అనువత్సరమ్ - ప్రతి సంవత్సరము, అష్టౌ - ఎనమండుగురు, పుత్రాన్ - పుత్రులను, కన్యాం చ ఏవ - కన్యను కూడ, ప్రసుషువే - కనెను.

తరువాత కాలము గడుచుచుండెను. అందరియందు పరబ్రహ్మను దర్శించే దేవకి సర్వులకు పూజనీయురాలు. ఆమె ప్రతి సంవత్సరము ఒక్కరిని చొప్పున ఎనమండుగురు పుత్రులను, ఒక కన్యను కూడ కనెను.

కీర్తిమంతం ప్రథమజం కంసాయానకదుందుభిః ।
అర్పయామాస కృచ్ఛ్రేణ సోఽనృతాదతివిహ్వలః ॥ 57

అనృతాత్ - అసత్యము వలన, అతివిహ్వలః - మిక్కిలి కంగారు పడే, సః - ఆ, ఆనకదుందుభిః - వసుదేవుడు, ప్రథమజమ్ - మొదటి సంతానమైన, కీర్తిమంతమ్ - కీర్తిమంతుని, కృచ్ఛ్రేణ - కష్టముతో, కంసాయ - కంసుని కొరకు, అర్పయామాస - సమర్పించెను.

వసుదేవుడు పుట్టినప్పుడు దేవతలు నగారాలను మ్రోగించిరి. ఆయనకు అసత్యమంటే భయము మెండు. ఆయన మొదటి సంతానమైన కీర్తిమంతుని, బాధ పడుతూనే కంసునికి సమర్పించెను.

కిం దుస్సహం ను సాధూనాం విదుషాం కిమపేక్షితమ్ ।
కిమకార్యం కదర్యాణాం దుస్త్యజం కిం ధృతాత్మనామ్ ॥ 58

సాధూనామ్ - సత్పురుషులకు, దుస్సహమ్ - సహింప శక్యము కానిది, కిం ను - ఏమున్నది?, విదుషామ్ - జ్ఞానులకు, అపేక్షితమ్ -

కోరబడేది, కిమ్ - ఏమి గలదు?, కదర్యాణామ్ - నీచులకు, అకార్యమ్ - చేయకూడనిది, కిమ్ - ఏమి గలదు?, ధృత-ఆత్మనామ్ - దేహేంద్రియనిగ్రహము గలవారలకు, దుస్త్యజమ్ - విడువ శక్యము కానిది, కిమ్ - ఏమి గలదు?

సత్పురుషులు సహించ లేనిది ఏమి గలదు? (వారెంతటి కష్టమునైననూ సహించెదరు). జ్ఞానులు దేనిని కోరెదరు? (దేనినైననూ కోరరు). నీచులు చేయలేని పని యేది గలదు? (వారెంతటి క్రూరమైన పనినైననూ చేసెదరు). దేహమును, ఇంద్రియములను, మనస్సును నిగ్రహించిన మహాత్ములు విడువలేనిది ఏది గలదు? (వారు సర్వమును త్యజించెదరు).

దృష్ట్వా సమత్వం తచ్ఛౌరేస్సత్యే చైవ వ్యవస్థితిమ్ ।
కంసస్తుష్టమనా రాజన్ ప్రహసన్నిదమబ్రవీత్ ।। 59

రాజన్ - ఓ పరీక్షిన్మహారాజా!, శౌరేః - వసుదేవునియొక్క, తత్ - ఆ, సమత్వమ్ - సుఖదుఃఖముల యెడల సమచిత్తత్వమును, చ - మరియు, సత్యే ఏవ - సత్యమునందు మాత్రమే, వ్యవస్థితిమ్ - గట్టిగా నిలబడుటను, దృష్ట్వా - చూచి, తుష్టమనాః - సంతుష్టి చెందిన మనస్సు గల, కంసః - కంసుడు, ప్రహసన్ - నవ్వుచున్నవాడై, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

ఓ పరీక్షిన్మహారాజా! వసుదేవుడు సుఖదుఃఖముల యెడల సమమైన స్పందన కలవాడు. పైగా, ఆయన సత్యమునకు గట్టిగా కట్టుబడినవాడు. ఆయనయొక్క ఈ లక్షణములను గని కంసునకు మనస్సులో సంతోషము కలిగెను. ఆతడు నవ్వుతూ ఇట్లు పలికెను.

ప్రతియాతు కుమారోఽయం న హ్యస్మాదస్తి మే భయమ్ ।
అష్టమాద్యువయోర్గర్భాన్మృత్యుర్మే విహితః కిల ।। 60

అయమ్ - ఈ, కుమారః - పిల్లవాడు, ప్రతియాతు - (తన యింటికి) తిరిగి వెళ్ళుగాక!, హి - ఏలయనగా, అస్మాత్ - వీని వలన, మే - నా కొరకు, భయమ్ - భయము, న - లేదు, యువయోః - మీ ఇద్దరి,

అష్టమాత్ - ఎనిమిదవ, గర్భాత్ - సంతానము వలన, మే - నాకు, మృత్యుః - మరణము, విహితః కిల - చెప్పబడినది గదా!

ఈ పిల్లవానిని ఇంటికి తీసుకు పొమ్ము. ఎందుకంటే, నాకు ఈ పిల్లవాని వలన భయము లేదు. ఆకాశవాణి చెప్పినది నాకు మీ ఇద్దరి ఎనిమిదవ సంతానము వలన మరణము కలుగునని గదా!

తథేతి సుతమాదాయ యయావానకదుందుభిః ।
నాభ్యనందత తద్వాక్యమసతోఽవిజితాత్మనః ।। 61

తథా - సరే, ఇతి - అని, ఆనకదుందుభిః - వసుదేవుడు, సుతమ్ - పుత్రుని, ఆదాయ - తీసుకొని, యయౌ - వెళ్లెను, అవిజిత-ఆత్మనః - నిలకడ లేని మనస్సు గల, అసతః - దుష్టుడైన కంసునియొక్క, తత్ - ఆ, వాక్యమ్ - మాటను, న అభ్యనందత - అభినందించ లేదు.

సరే అని పలికి వసుదేవుడు పుత్రుని తీసుకొని వెళ్లెను. కంసుడు దుష్టుడు, మనోనిగ్రహము స్థిరచిత్తము లేనివాడు. వాని ఆ మాటను ఆయన నమ్మలేదు.

నందాద్యా యే వ్రజే గోపా యాశ్చామీషాం చ యోషితః ।
వృష్ణయో వసుదేవాద్యా దేవక్యాద్యా యదుస్త్రియః ।। 62
సర్వే వై దేవతాప్రాయా ఉభయోరపి భారత ।
జ్ఞాతయో బంధుసుహృదో యే చ కంసమనువ్రతాః ।। 63

భారత - ఓ పరీక్షిన్మహారాజా!, వ్రజే - గోకులమునందు, యే - ఏ, నంద-ఆద్యాః - నందుడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు గలరో, అమీషామ్ - వీరియొక్క, యాః - ఏ, యోషితః చ - స్త్రీలు కూడ గలరో, వసుదేవ-ఆద్యాః - వసుదేవుడు మొదలుగా గల, వృష్ణయః - వృష్ణివంశీయులు, దేవకీ-ఆద్యాః - దేవకి మొదలుగా గల, యదుస్త్రియః - యాదవస్త్రీలు, ఉభయోః - నందవసుదేవులిద్దరియొక్క, సర్వే - అందరు, జ్ఞాతయః - జ్ఞాతులు, బంధుసుహృదః చ - బంధువులు స్నేహితులు కూడ, యే - ఎవరైతే, కంసమ్ - కంసుని, అనువ్రతాః -

అనుచరులు, దేవతాప్రాయాః - ఇంచుమించుగా దేవతలే, వై - నిశ్చయము.

గోకులమునందు నందుడు మొదలుగా గల ఏ గోపాలకులు గలరో వారు, వీరి స్త్రీలు (యశోద మొదలగువారు), వసుదేవుడు మొదలుగా గల వృష్ణివంశీయులు, దేవకి మొదలైన యాదవస్త్రీలు, నందవసుదేవులిద్దరి జ్ఞాతులు, బంధువులు, మిత్రులు, మరియు కంసుని అనుచరులెవరు గలరో వారు కూడ నిశ్చయముగా ఇంచుమించు అందరు దేవతలే.

ఏతత్కంసాయ భగవాన్ శశంసాభ్యేత్య నారదః ।
భూమేర్భారాయమాణానాం దైత్యానాం చ వధోద్యమమ్ ॥ 64

భగవాన్ - పూజనీయుడగు, నారదః - నారదుడు, అభ్యేత్య - వచ్చి, కంసాయ - కంసుని కొరకు, ఏతత్ - ఈ విషయమును, భూమేః - భూమికి, భారాయమాణానామ్ - బరువుగా తయారైన, దైత్యానామ్ - రాక్షసులయొక్క, వధ-ఉద్యమం చ - సంహారమునకై జరుగుచున్న ఉద్యమమును గురించి కూడ, శశంస - వివరించి చెప్పెను.

పూజనీయుడగు నారద మహర్షి కంసుని వద్దకు వచ్చి ఈ విషయమును వివరించి చెప్పెను. ఇంతేగాక, రాక్షసుల సంహారమునకై జరుగుచున్న ఉద్యమమును గురించి కూడ చెప్పెను.

ఋషేర్వినిర్గమే కంసో యదూన్మత్వా సురానితి ।
దేవక్యా గర్భసంభూతం విష్ణుం చ స్వవధం ప్రతి ॥ 65
దేవకీం వసుదేవం చ నిగృహ్య నిగడైర్గృహే ।
జాతం జాతమహన్ పుత్రం తయోరజనశంకయా ॥ 66

ఋషేః - నారద మహర్షియొక్క, వినిర్గమే - నిష్క్రమణము కాగా, కంసః - కంసుడు, యదూన్ - యాదవులను, సురాన్ - దేవతలనుగా, స్వవధం ప్రతి - తనను వధించుటను గురించి, విష్ణుమ్ - శ్రీహరిని, దేవక్యాః - దేవకియొక్క, గర్భసంభూతం చ - గర్భమునందు జన్మించినవానిగా కూడ, మత్వా - తెలుసుకొని, దేవకీమ్ - దేవకిని, వసుదేవం చ - వసుదేవుని కూడ, గృహే - కారాగారమునందు, నిగడైః -

సంకెళ్లతో, నిగృహ్య - బంధించి, తయోః - వారిద్దరికి, జాతం జాతమ్ - పుట్టిన ప్రతి, పుత్రమ్ - పుత్రుని, అజనశంకయా - పుట్టుక లేని శ్రీహరి అనే శంకతో, అహన్ - చంపెను.

నారదుడు నిష్క్రమించెను. యాదవులు దేవతలనియు, శ్రీహరి తనను చంపుటకై దేవకి గర్భమునందు ఆవిర్భవించినట్లేనని కంసునకు తెలిసెను. ఆతడు దేవకీ వసుదేవులను కారాగృహమునందు సంకెళ్లతో బంధించెను. వారికి పుట్టిన ప్రతి పుత్రుడు పుట్టుకయే లేని శ్రీహరియేననే శంకతో ఆతడు ఆ పిల్లలను చంపెను.

మాతరం పితరం భ్రాతౄన్ సర్వాంశ్చ సుహృదస్తథా ।
ఘ్నంతి హ్యసుతృపో లుబ్ధా రాజానః ప్రాయశో భువి ॥ 67

భువి - భూలోకమునందు, అసుతృపః - భోగపరాయణులు (ఇతరుల ప్రాణములతో తమ ఇంద్రియములను సంతృప్తి పరచువారు), లుబ్ధాః - లోభులు ఐన, రాజానః - రాజులు, ప్రాయశః - తరుచుగా, మాతరమ్ - తల్లిని, పితరమ్ - తండ్రిని, భ్రాతౄన్ - సోదరులను, తథా - అదే విధముగా, సర్వాన్ - అందరు, సుహృదః చ - మిత్రులను కూడ, ఘ్నంతి హి - సంహరించెదరు గదా!

ఈ లోకములో భోగపరాయణులై లోభులైన (ఇతరులను చంపి తమ పొట్ట పోసుకొనే) పాలకులు తరుచుగా తల్లిని, తండ్రిని, సోదరులను, మిత్రులనందరినీ కూడ చంపెదరు గదా!

ఆత్మానమిహ సంజాతం జానన్ ప్రాగ్విష్ణునా హతమ్ ।
మహాసురం కాలనేమిం యదుభిస్స వ్యరుధ్యత ॥ 68

ఆత్మానమ్ - తనను, ప్రాక్ - పూర్వజన్మయందు, విష్ణునా - శ్రీహరిచే, హతమ్ - సంహరించబడిన, ఇహ - ఈ లోకములో, సంజాతమ్ - పుట్టిన, మహా-అసురమ్ - పెద్ద రాక్షసుడైన, కాలనేమిమ్ - కాలనేమినిగా, జానన్ - తెలియువాడై, సః - ఆ కంసుడు, యదుభిః - యాదవులతో, వ్యరుధ్యత - విరోధించెను.

తాను పూర్వజన్మలో కాలనేమి అనే పెద్ద రాక్షసుడననియు, ఆ జన్మలో శ్రీహరి సంహరించగా ఈ జన్మలో కంసునిగా జన్మించినాననియు తెలుసుకున్న కంసుడు యాదవులతో విరోధము పెట్టుకొనెను.

ఉగ్రసేనం చ పితరం యదుభోజాంధకాధిపమ్ ।
స్వయం నిగృహ్య బుభుజే శూరసేనాన్మహాబలః ।। 69

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ప్రథమోఽధ్యాయః ।।

పితరమ్ - తండ్రి ఐనట్టియు, యదుభోజ-అంధక-అధిపమ్ - యాదవులకు భోజవంశీయులకు అంధకవంశీయులకు ప్రభువైన, ఉగ్రసేనం చ - ఉగ్రసేన మహారాజును కూడ, స్వయమ్ - తానే, నిగృహ్య - బంధించి, మహాబలః - మహాబలశాలియగు కంసుడు, శూరసేనాన్ - శూరసేన దేశమును, బుభుజే - పాలించెను.

ఉగ్రసేన మహారాజు మహాబలశాలియగు కంసుని తండ్రి. పైగా ఆయన యాదవ-భోజ-అంధకవంశీయులకు ప్రభువు. ఆయనను కూడ కంసుడు స్వయముగా బంధించి శూరసేన దేశమును పాలించెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము పూర్వార్ధములో
శ్రీకృష్ణావతారము-ఉపక్రమమును వర్ణించే
మొదటి అధ్యాయము ముగిసినది (1).

* * * * *

# అథ ద్వితీయోఽధ్యాయః

## శ్రీకృష్ణావతారము - దేవతలు దేవకి గర్భమునందలి శ్రీహరిని స్తుతించుట

శ్రీశుక ఉవాచ ।
ప్రలంబబకచాణూరతృణావర్తమహాశనైః ।
ముష్టికారిష్టద్వివిదపూతనాకేశిధేనుకైః ॥ 1

అన్యైశ్చాసురభూపాలైర్బాణభౌమాదిభిర్యుతః ।
యదూనాం కదనం చక్రే బలీ మాగధసంశ్రయః ॥ 2

బలీ - బలశాలియగు కంసుడు, మాగధసంశ్రయః - మగధదేశాధిపతియగు జరాసంధుడు ఆశ్రయముగా గలవాడై, ప్రలంబబక చాణూరతృణావర్తమహాశనైః - ప్రలంబుడు బకుడు చాణూరుడు తృణా వర్తుడు అఘాసురులతో, ముష్టిక-అరిష్టద్వివిదపూతనాకేశిధేనుకైః - ముష్టికుడు అరిష్టుడు ద్వివిదుడు పూతన కేశి మరియు ధేనుకాసురులతో, బాణభౌమ-ఆదిభిః - బాణాసురుడు నరకాసురుడు మొదలైన, అన్యైః - ఇతరులగు, అసురభూపాలైః చ - రాక్షసరాజులతో కూడ, యుతః - కూడినవాడై, యదూనామ్ - యాదవులకు, కదనమ్ - వినాశమును, చక్రే - చేసెను.

బలశాలియగు కంసునకు మగధరాజగు జరాసంధుడు ఆసరా. ఆతడు ప్రలంబ-బక-చాణూర-తృణావర్త-అఘ-ముష్టిక-అరిష్ట-ద్వివిద-పూతనా-కేశి -ధేనుకులనే అనుచరులు తోడు కాగా, బాణాసురుడు నరకాసురుడు మొదలైన ఇతరరాక్షసరాజుల సాహాయ్యముతో యాదవుల వినాశమునకు పూనుకొనెను.

తే పీడితా నివివిశుః కురుపంచాలకేకయాన్ ।
శాల్వాన్ విదర్భాన్నిషధాన్ విదేహాన్ కోసలానపి ॥ 3

ఏకే తమనురుంధానా జ్ఞాతయః పర్యుపాసతే ।

పీడితాః - పీడించబడిన, తే - ఆ యాదవులు, కురుపంచాలకేకయాన్ - కురుపంచాలకేకయప్రాంతములను, శాల్వాన్ - శాల్వప్రాంతమును, విదర్భాన్ - విదర్భప్రాంతమును, నిషధాన్ - నిషధప్రాంతమును, విదేహాన్ - విదేహప్రాంతమును, కోసలాన్ అపి - కోసలప్రాంతమును కూడ, నివివిశుః - వలస పోయిరి, ఏకే - కొందరు, జ్ఞాతయః - జ్ఞాతులు, తమ్ - ఆ కంసుని, అనురుంధానాః - అనుసరించువారై, ఉపాసతే - సేవించుచున్నారు.

పీడించబడిన ఆ యాదవులు కురుపంచాలకేకయశాల్వవిదర్భనిషధ విదేహకోసలప్రాంతములకు వలస పోయిరి. కొందరు జ్ఞాతులు ఆ కంసుని అనుసరిస్తూ సేవించుచుండిరి.

హతేషు షట్సు బాలేషు దేవక్యా ఔగ్రసేనినా ॥ 4

సప్తమో వైష్ణవం ధామ యమనంతం ప్రచక్షతే ।
గర్భో బభూవ దేవక్యా హర్షశోకవివర్ధనః ॥ 5

ఔగ్రసేనినా - ఉగ్రసేనుని పుత్రుడగు కంసునిచే, దేవక్యాః - దేవకియొక్క, షట్సు - ఆర్గురు, బాలేషు - పుత్రులు, హతేషు - చంపబడగా, దేవక్యాః - దేవకికి, వైష్ణవమ్ - విష్ణువునకు చెందిన, ధామ - కళ, హర్షశోకవివర్ధనః - హర్షమును శోకమును కూడ వర్ధిల్లజేసే, సప్తమమ్ - ఏడవ, గర్భః - గర్భముగా, బభూవ - ఆయెను, యమ్ - ఏ స్వరూపమును, అనంతం ఇతి - అనంతుడని, ప్రచక్షతే - చెప్పెదరో.

ఉగ్రసేనుని పుత్రుడగు కంసుడు దేవకియొక్క ఆర్గురు పుత్రులను సంహరించెను. దేవకి ఏడవ సారి గర్భవతి ఆయెను. (సంతానము కలుగుననే) హర్షమును, (కంసుడు చంపుననే) శోకమును కూడ వర్ధిల్లజేసే ఆ గర్భమునందు విష్ణువుయొక్క కళయైన శేషుడు ఉండెను. ఆ శేషుడు అనంతుడని మహాత్ములు చెప్పెదరు.

భగవానపి విశ్వాత్మా విదిత్వా కంసజం భయమ్ ।
యదూనాం నిజనాథానాం యోగమాయాం సమాదిశత్ ॥ 6

విశ్వ-ఆత్మా - సర్వమునకు ఆత్మయగు, భగవాన్ అపి - శ్రీహరి భగవానుడు కూడ, నిజనాథానామ్ - తానే రక్షకుడుగా గల, యదూనామ్ - యాదవులకు, కంసజమ్ - కంసుని వలన కలిగిన, భయమ్ - భయమును, విదిత్వా - గుర్తించి, యోగమాయామ్ - యోగమాయను, సమ్-ఆదిశత్ - ఆదేశించెను.

సర్వమునకు ఆత్మ శ్రీహరియే. ఆ భగవానుడు తానే రక్షకుడై ఉన్న యాదవులకు కంసుని వలన కలిగిన భయమును గుర్తించి యోగమాయను ఆదేశించెను.

గచ్ఛ దేవి వ్రజం భద్రే గోపగోభిరలంకృతమ్ ।
రోహిణీ వసుదేవస్య భార్యాఽఽస్తే నందగోకులే ।
అన్యాశ్చ కంససంవిగ్నా వివరేషు వసంతి హి ॥ 7

దేవి - ఓ దేవీ!, భద్రే - ఓ కల్యాణీ!, గోపగోభిః - గోపాలకులతో గోవులతో, అలంకృతమ్ - అందముగానుండే, వ్రజమ్ - నందగోకులమును గురించి, గచ్ఛ - వెళ్లుము, నందగోకులే - నందగోకులమునందు, వసుదేవస్య - వసుదేవుని, భార్యా - భార్యయగు, రోహిణీ - రోహిణి, ఆస్తే - ఉన్నది, కంససంవిగ్నాః - కంసుని వలన భయపడిన, అన్యాః చ - ఇతరభార్యలు కూడ, వివరేషు - రహస్యస్థానములయందు, వసంతి హి - నివసించుచున్నారు గదా!

ఓ దేవీ! కల్యాణీ! గోపాలకులతో గోవులతో అందముగానుండే గోకులమునకు వెళ్లుము. నందగోకులమునందు వసుదేవుని భార్యయగు రోహిణి ఉన్నది. ఆయనయొక్క ఇతరభార్యలు కంసుని వలన భయపడి రహస్యస్థానములలో నివసించుచున్నారు గదా!

దేవక్యా జఠరే గర్భం శేషాఖ్యం ధామ మామకమ్ ।
తత్సన్నికృష్య రోహిణ్యా ఉదరే సన్నివేశయ ॥ 8

దేవక్యాః - దేవకియొక్క, జఠరే - ఉదరమునందలి, గర్భమ్ - గర్భము, శేష-ఆఖ్యమ్ - శేషుడని పేరు గల, మామకమ్ - నాకు చెందిన, ధామ - కళ, తత్ - దానిని, సన్నికృష్య - ఆకర్షించి, రోహిణ్యాః -

రోహిణియొక్క, ఉదరే - ఉదరమునందు, సన్నివేశయ - చక్కగా స్థాపించుము.

దేవకియొక్క ఉదరమునందలి గర్భము శేషుడనే పేరు గల నా అంశయే. ఆ గర్భమునాకర్షించి రోహిణియొక్క ఉదరమునందు చక్కగా స్థాపించుము.

అథాహమంశభాగేన దేవక్యాః పుత్రతాం శుభే ।
ప్రాప్స్యామి త్వం యశోదాయాం నందపత్న్యాం భవిష్యసి ॥ 9

శుభే - ఓ కల్యాణీ!, అథ - తరువాత, అహమ్ - నేను, అంశభాగేన - జ్ఞానము బలము మొదలైన అంశలతో భక్తులయందు ప్రకటమయ్యే రూపముతో, దేవక్యాః - దేవకికి, పుత్రతామ్ - పుత్రుని రూపమును, ప్రాప్స్యామి - పొందగలను, త్వమ్ - నీవు, నందపత్న్యామ్ - నందుని భార్యయగు, యశోదాయామ్ - యశోదయందు, భవిష్యసి - జన్మించగలవు.

ఓ కల్యాణీ! తరువాత నేను జ్ఞానబలాదులతో భక్తులయందు ప్రకటమయ్యే రూపముతో దేవకికి పుత్రుడనై జన్మించెదను. నీవు నందుని భార్యయగు యశోదయందు పుత్రికవై జన్మించగలవు.

అర్చిష్యంతి మనుష్యాస్త్వాం సర్వకామవరేశ్వరీమ్ ।
ధూపోపహారబలిభిస్సర్వకామవరప్రదామ్ ॥ 10

సర్వకామవర-ఈశ్వరీమ్ - సకలములైన కామనలు గలవారలకు శ్రేష్ఠమైన ఈశ్వరి ఐనట్టియు, సర్వకామవరప్రదామ్ - సకలములైన కామనలను వరములుగా ఇచ్చే, త్వామ్ - నిన్ను, మనుష్యాః - మానవులు, ధూప-ఉపహారబలిభిః - ధూపములు పుష్పాదులు నైవేద్యములతో, అర్చిష్యంతి - పూజించగలరు.

సకలములైన కామనలు గలవారలకు శ్రేష్ఠమైన ఈశ్వరివి నీవే. సకలములైన కామనలను వరములుగా ఇచ్చే నిన్ను మానవులు ధూప-పుష్ప-నైవేద్యాదులతో పూజించెదరు.

నామధేయాని కుర్వంతి స్థానాని చ నరా భువి ।
దుర్గేతి భద్రకాలీతి విజయా వైష్ణవీతి చ ।। 11

కుముదా చండికా కృష్ణా మాధవీ కన్యకేతి చ ।
మాయా నారాయణీశానీ శారదేత్యంబికేతి చ ।। 12

భువి - భూలోకమునందు, నరాః - మానవులు, దుర్గా - దుర్గ, ఇతి - అని, భద్రకాలీ - భద్రకాళి, ఇతి - అని, విజయా - విజయ, వైష్ణవీ - వైష్ణవి, ఇతి చ - అని కూడ, కుముదా - కుముద, చండికా - చండిక, కృష్ణా - కృష్ణ, మాధవీ - మాధవి, కన్యకా - కన్యక, ఇతి చ - అని కూడ, మాయా - మాయ, నారాయణీ - నారాయణి, ఈశానీ - ఈశాని, శారదా - శారద, అంబికా - అంబిక, ఇతి చ - అని కూడ, నామాని - నామములను, స్థానాని చ - స్థానములను కూడ, కుర్వంతి - చేయుదురు.

భూలోకములో మానవులు నిన్ను దుర్గ (కష్టములను గట్టెక్కించునది), భద్రకాళి (మంగళములను కలిగించునది), విజయ (జయమునిచ్చునది), వైష్ణవి (విష్ణువునకు చెందినది), కుముద (భూలోకమునందు ఆనందమును కలిగించునది), చండిక (దుష్టులపై కోపించునది), కృష్ణ (భక్తులనాకర్షించునది) , మాధవి (మధువంశమునందు అవతరించినది), కన్యక (ఆనందమును పొందించునది), మాయ (అసంభవమును సంభవము చేయు శక్తి), నారాయణి (ప్రాణులయందు ప్రాణరూపముగా నున్నది), ఈశాని (సర్వమును శాసించునది), శారద (సంసారమును నశింపజేయునది, శత్రువులను హింసించునది, శరత్కాలమునందు పూజించబడునది), అంబిక (ఆర్తభక్తులచే శరణు పొందబడునది) అనే పేర్లతో పిలుస్తూ పుణ్య క్షేత్రములను నిర్మించెదరు.

గర్భసంకర్షణాత్తం వై ప్రాహుస్సంకర్షణం భువి ।
రామేతి లోకరమణాద్బలం బలవదుచ్ఛ్రయాత్ ।। 13

గర్భసంకర్షణాత్ - గర్భమును ఆకర్షించుట వలన, తం వై - ఆ బాలకునైతే, భువి - భూలోకమునందు, సంకర్షణమ్ - సంకర్షణునిగా, లోకరమణాత్ - జనులను రమింప జేయుట వలన, రామ - ఓ రామా!, ఇతి

- అని, బలవద్-ఉచ్ఛ్రయాత్ - బలవంతులలో శ్రేష్ఠుడగుట వలన, బలమ్ - బలునిగా, ప్రాహుః - పిలిచెదరు,

యోగమాయ గర్భమును దేవకినుండి రోహిణిలోనికి ఆకర్షించుట వలన పుట్టినవాడగుటచే ఆ బాలకుని ఈ లోకములో జనులు సంకర్షణుడు అని పిలిచెదరు. ఆయన జనులను రమింప జేయుట వలన రాముడని, బలవంతులలో శ్రేష్ఠుడగుట వలన బలుడనియు ప్రఖ్యాతి జెందును.

సందిష్టైవం భగవతా తథేత్యోమితి తద్వచః ।
ప్రతిగృహ్య పరిక్రమ్య గాం గతా తత్తథాఽకరోత్ ॥ 14

భగవతా - శ్రీహరి భగవానునిచే, ఏవమ్ - ఈ విధముగా, సందిష్టా - ఆదేశించబడిన యోగమాయ, తథా - అటులనే, ఇతి - అని, ఓమ్ - సరే, ఇతి - అని, తద్-వచః - ఆ భగవానుని మాటను, ప్రతిగృహ్య - స్వీకరించి, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, గామ్ - భూలోకమును గురించి, గతా - వెళ్లినది, తత్ - ఆ పనిని, తథా - ఆ విధముగా, అకరోత్ - చేసెను.

శ్రీహరి భగవానుడు ఈ విధముగా ఆదేశించగా యోగమాయ అటులనే, సరే అని స్వీకరించి, ఆయనకు ప్రదక్షిణము చేసి భూలోకమునకు వెళ్లి, ఆమె ఆ మాటను అదే విధముగా అమలు చేసెను.

గర్భే ప్రణీతే దేవక్యా రోహిణీం యోగనిద్రయా ।
అహో విస్రంసితో గర్భ ఇతి పౌరా విచుక్రుశుః ॥ 15

యోగనిద్రయా - యోగమాయచే, దేవక్యాః - దేవకియొక్క, గర్భే - గర్భము, రోహిణీమ్ - రోహిణిని గురించి, ప్రణీతే - తీసుకొని పోబడగా, అహో - అయ్యో!, గర్భః - గర్భము, విస్రంసితః - జారిపోయినది, ఇతి - అని, పౌరాః - పురజనులు, విచుక్రుశుః - ఆక్రోశించిరి.

యోగమాయ దేవకియొక్క గర్భమునాకర్షించి రోహిణియందు ప్రవేశపెట్టెను. అప్పుడు పురజనులు, అయ్యో! దేవకి గర్భము నష్టమైనది, అని ఆక్రోశించిరి.

భగవానపి విశ్వాత్మా భక్తానామభయంకరః ।
ఆవివేశాంశభాగేన మన ఆనకదుందుభేః ॥ 16

విశ్వ-ఆత్మా - సర్వమునకు ఆత్మ, భక్తానామ్ - భక్తులకు, అభయంకరః - అభయమునిచ్చువాడు అగు, భగవాన్ అపి - శ్రీహరి భగవానుడు కూడ, అంశభాగేన - జ్ఞానము బలము మొదలైన అంశలతో భక్తులయందు ప్రకటమయ్యే రూపముతో, ఆనకదుందుభేః - వసుదేవుని, మనః - మనస్సును, ఆవివేశ - ఆవేశించెను.

సర్వమునకు ఆత్మయగు శ్రీహరి భక్తులకభయమునిచ్చువాడు. ఆయన జ్ఞానము బలము మొదలైన అంశలతో భక్తులయందు ప్రకటమయ్యే రూపముతో వసుదేవుని మనస్సును ఆవేశించెను.

స బిభ్రత్పౌరుషం ధామ భ్రాజమానో యథా రవిః ।
దురాసదోఽతిదుర్ధర్షో భూతానాం సంబభూవ హ ॥ 17

పౌరుషమ్ - పురుషునకు (శ్రీహరికి) చెందిన, ధామ - తేజస్సును, బిభ్రత్ - ధరించుచున్న, సః - ఆ వసుదేవుడు, రవిః యథా - సూర్యుడు వలె, భ్రాజమానః - ప్రకాశించుచున్నవాడు, భూతానామ్ - ప్రాణులకు, దురాసదః - సమీపించ శక్యము కానివాడు, అతిదుర్ధర్షః - సుతరాము తిరస్కరించ శక్యము కానివాడు, సంబభూవ హ - ఆయెనట.

పురుషోత్తముడగు శ్రీహరియొక్క తేజస్సును ధరించియున్న ఆ వసుదేవుడు సూర్యుడు వలె ప్రకాశించుచుండెను. ప్రాణులు ఆయనను సమీపించ లేకపోయినవి. కంసాదులకైననూ ఆయనను తిరస్కరించుట శక్యము కాకుండెను.

తతో జగన్మంగలమచ్యుతాంశం సమాహితం శూరసుతేన దేవీ,
దధార సర్వాత్మకమాత్మభూతం కాష్ఠా యథాఽఽనందకరం మనస్తః ॥18

తతః - తరువాత, దేవీ - ప్రకాశించే దేవకి, శూరసుతేన - శూరుని పుత్రుడగు వసుదేవునిచే, సమాహితమ్ - నిక్షేపించబడినట్టియు, జగత్-మంగలమ్ - జగత్తునకు కల్యాణమైనట్టియు, సర్వ-ఆత్మకమ్ - సర్వమునకు ఆత్మ యైనట్టియు, ఆత్మభూతమ్ - (ప్రాణులలో)

ఆత్మరూపుడై ఉన్న, అచ్యుత-అంశమ్ - శ్రీహరియొక్క అంశ (రూపము) ను, కాష్ఠా - తూర్పుదిక్కు, ఆనందకరం యథా - అమృతకిరణుడగు చంద్రుని వలె, మనస్తః - మనస్సుతో, దధార - ధరించెను.

తరువాత ప్రకాశించే దేవకి శూరుని పుత్రుడగు వసుదేవునిచే నిక్షేపించబడిన అచ్యుతుని రూపమును ధరించెను. సర్వమునకు సత్తాస్ఫూర్తులననుగ్రహిస్తూ సర్వప్రాణులలో ఆత్మరూపుడై యున్న శ్రీహరి జగత్కల్యాణము కొరకు అవతరించబోతున్నాడు. ఆ శ్రీహరిని దేవకి, తూర్పు దిక్కు అమృతకిరణుడగు చంద్రుని వలె, మనస్సుతో ధారణ చేసెను.

సా దేవకీ సర్వజగన్నివాసనివాసభూతా నితరాం న రేజే ।
భోజేంద్రగేహేఽగ్నిశిఖేవ రుద్ధా సరస్వతీ జ్ఞానఖలే యథా సతీ॥ 19

సర్వజగత్-నివాసనివాసభూతా - సకలజగత్తునకు అధిష్ఠానమైన శ్రీహరిని తన గర్భమునందు కలిగియున్న, సా - ఆ, దేవకీ - దేవకి, భోజ-ఇంద్రగేహే - భోజదేశప్రభువగు కంసుని కారాగారమునందు, అగ్నిశిఖా ఇవ - అగ్ని జ్వాల వలె, రుద్ధా - బంధించబడినదై, జ్ఞానఖలే - జ్ఞానవంచకునియందు, సతీ - పవిత్రమైన, సరస్వతీ యథా - జ్ఞానము వలె, నితరామ్ - అధికముగా, న రేజే - ప్రకాశించలేదు.

ఆ దేవకి సకలజగత్తునకు అధిష్ఠానమైన శ్రీహరిని తన గర్భమునందు దాల్చియుండెను. కుండయందు దాగియున్న అగ్నిజ్వాల వలన చుట్టూ ప్రకాశము ఉండదు. జ్ఞానవంచకుని (జ్ఞానమును ఇతరులకు ఈయనివాడు, జ్ఞానమును జీవితములో ఆచరించనివాడు) యందలి జ్ఞానము వలన సమాజమునకు వెలుగు ఉండదు. అదే విధముగా, భోజప్రభువగు కంసుని కారాగారమునందు బంధించబడిన దేవకి అధికముగా ప్రకాశించలేదు.

తాం వీక్ష్య కంసః ప్రభయాఽజితాంతరాం
విరోచయంతీం భవనం శుచిస్మితామ్ ।
ఆహైష మే ప్రాణహరో హరిర్గుహాం
ధ్రువం శ్రితో యన్న పురేయమీదృశీ ॥ 20

ప్రభయా - కాంతిచే, భవనమ్ - భవనమును, విరోచయంతీమ్ - అధికముగా ప్రకాశింప జేయుచున్నట్టియు, అజిత-అంతరామ్ - అజేయుడైన శ్రీహరి తనయందు కలిగినట్టియు, శుచిస్మితామ్ - స్వచ్ఛమగు చిరునవ్వు గల, తామ్ - ఆ దేవకిని, వీక్ష్య - పరికించి చూచి, కంసః - కంసుడు, ఆహ - పలికెను, మే - నా, ప్రాణహరః - ప్రాణములను హరించే, హరిః - శ్రీహరి (సింహము), గుహామ్ - గర్భము (గుహ) ను, శ్రితః - ఆశ్రయించినాడు, ధ్రువమ్ - నిశ్చయము, యత్ - ఏలయనగా, ఇయమ్ - ఈమె, పురా - ఇదివరలో, న ఈదృశీ - ఇట్టిది కాదు.

అజేయుడగు శ్రీహరిని తనయందు కలిగియున్న దేవకియొక్క కాంతిచే కారాగృహము విశేషముగా ప్రకాశింప జొచ్చెను. స్వచ్ఛమగు చిరునగవు గల ఆ దేవకిని చూచి కంసుడు తనలో -- ఈమె ఇదివరలో ఉన్నట్లుగా లేదు; (సింహము గుహలో ప్రవేశించినట్లుగా) నా ప్రాణములను తీసే శ్రీహరి ఈమెయందు ప్రవేశించినాడు; ఇది నిశ్చయము -- అని తలపోసెను.

కిమద్య తస్మిన్కరణీయమాశు మే
యదర్థతంత్రో న విహంతి విక్రమమ్ ।
స్త్రియాస్స్వసుర్గురుమత్యా వధోఽయం
యశశ్శ్రియం హంత్యనుకాలమాయుః ॥ 21

తస్మిన్ - ఆ శ్రీహరి విషయమునందు, అద్య - ఇప్పుడు, మే - నాకు, ఆశు - వెంటనే, కరణీయమ్ - చేయదగినది, కిమ్ - ఏది?, యత్ - ఏలయన, అర్థతంత్రః - కార్యమే ప్రధానముగా గల వ్యక్తి, విక్రమమ్ - తన పరాక్రమమును, న విహంతి - నాశము చేసుకోడు, స్వసుః - చెల్లెలైన, గురుమత్యాః - గర్భవతియగు, స్త్రియాః - స్త్రీయొక్క, అయమ్ - ఈ, వధః - సంహరించుట, అనుకాలమ్ - వెనువెంటనే, యశః - కీర్తిని, శ్రియమ్ - సంపదను, ఆయుః - ఆయుర్దాయమును, హంతి - నష్టము చేయును.

ఆ శ్రీహరి విషయములో ఇప్పుడు వెంటనే నేనేమి చేయవలెను? పని పూర్తి అగుటయే ప్రధానముగా గల వ్యక్తి కంగారు పడి తన

పరాక్రమమునకు హాని కలిగే పనిని చేయరాదు. ఈమెనిప్పుడు చంపినచో, స్త్రీని అందులో చెల్లెలిని, అందులో గర్భవతిని చంపినచో, ఆ పని వెనువెంటనే కీర్తిని, సంపదను, ఆయుర్దాయమును నశింప జేయును.

స ఏష జీవన్ ఖలు సంపరేతో
వర్తేత యోఽత్యంతనృశంసితేన ।
దేహే మృతే తం మనుజాశ్శపంతి
గంతా తమోఽంధం తనుమానినో ధ్రువమ్ ॥ 22

సః - అట్టి, ఏషః - ఈ వ్యక్తి, జీవన్ - జీవించువాడై, సంపరేతః ఖలు - మరణించినవాడే గదా!, యః - ఎవడైతే, అత్యంతనృశంసితేన - మిక్కిలి క్రూరమైన పనిచే, వర్తేత - ప్రవర్తిల్లునో, తనుమానినః - దేహమును లాలించేవాని, దేహే - దేహము, మృతే - మరణించగా, ధ్రువమ్ - నిశ్చయముగా, అంధః తమః - చీకటి గుయ్యారమనదగిన నరకమును, గంతా - పొంది తీరునని, తమ్ - వానిని, మనుజాః - మానవులు, శపంతి - తిట్టెదరు.

ఎవడైతే మిక్కిలి క్రూరమైన పనితో తన ప్రాణమును నిలబెట్టుకొనునో, అట్టి ఈతడు బ్రతికియున్ననూ చచ్చినట్లే గదా! ఇతరప్రాణులను హింసించి తన దేహమును లాలించే వ్యక్తియొక్క దేహము మరణించినప్పుడు జనులు వానిని ఉద్దేశించి -- వీడు నిశ్చయముగా చీకటి గుయ్యారమనదగిన నరకమును పొందును -- అని తిట్టి పోసెదరు.

ఇతి ఘోరతమాద్భావాత్సన్నివృత్తస్స్వయం ప్రభుః ।
ఆస్తే ప్రతీక్షంస్తజ్జన్మ హరేర్వైరానుబంధకృత్ ॥ 23

హరేః - శ్రీహరియొక్క, వైర-అనుబంధకృత్ - వైరమును మరల మరల చేస్తూ ఉండే, ప్రభుః - కంసప్రభుడు, ఇతి - ఈ విధముగా, ఘోరతమాత్ - మిక్కిలి క్రూరమైన, భావాత్ - ఆలోచననుండి, స్వయమ్ - తనంత తానే, నివృత్తః - విరమించుకున్నవాడై, తత్-జన్మ - ఆ శ్రీహరియొక్క పుట్టుకను, ప్రతి-ఈక్షన్ - వేచియున్నవాడై, ఆస్తే - ఉండెను.

కంసప్రభుడు శ్రీహరియందు వైరమును నిరంతరముగా చేసెను. ఆతడీ విధముగా ఆలోచించి మిక్కిలి క్రూరమైన (స్త్రీని వధించుట) పనినుండి తనంత తానే విరమించుకొని, ఆ శ్రీహరియొక్క పుట్టుకకై వేచియుండెను.

ఆసీనస్సంవిశంస్తిష్ఠన్ భుంజానః పర్యటన్మహీమ్ ।
చింతయానో హృషీకేశమపశ్యత్తన్మయం జగత్ ।। 24

ఆసీనః - కూర్చున్నవాడై, సంవిశన్ - పరున్నవాడై, తిష్ఠన్ - నిలుచున్నవాడై, భుంజానః - తినుచున్నవాడై, మహీమ్ - భూమిని, పరి-అటన్ - సంచరించువాడై, హృషీక-ఈశమ్ - ఇంద్రియాధిపతియగు శ్రీహరిని, చింతయానః - తలపోయువాడై, జగత్ - జగత్తును, తత్-మయమ్ - ఆ శ్రీహరితో నిండినదానినిగా, అపశ్యత్ - చూచెను.

కంసునకు కూర్చున్నా, పరున్నా, నిలుచున్నా, తింటున్నా, రాజ్యములో పర్యటిస్తున్నా, ఇంద్రియాధిపతియగు శ్రీహరిని గురించిన తలపులే ఉండెను. ఆతనికి జగత్తు అంతా శ్రీహరితో నిండియున్నట్లుగా కనబడెను.

బ్రహ్మా భవశ్చ తత్రైత్య మునిభిర్నారదాదిభిః ।
దేవైస్సానుచరైస్సాకం గీర్భిర్వృషణమైడయన్ ।। 25

బ్రహ్మా - బ్రహ్మదేవుడు, భవః చ - రుద్రుడు కూడ, నారద-ఆదిభిః - నారదుడు మొదలుగా గల, మునిభిః - మహర్షులతో, స-అనుచరైః - అనుయాయులతో కూడిన, దేవైః సాకమ్ - దేవతలతో బాటుగా, తత్ర - అచటకు, ఏత్య - వచ్చి, గీర్భిః - వాక్కులతో, వృషణమ్ - వరములను వర్షించే శ్రీహరిని, ఐడయన్ - స్తుతించిరి.

బ్రహ్మదేవుడు, రుద్రుడు కూడ నారదుడు భృగువు మొదలైన మహర్షులతో కూడి అచటకు వచ్చిరి. అనుయాయులతో బాటుగా దేవతలు వారి వెంట వచ్చిరి. వారందరు వరములను వర్షించే శ్రీహరిని స్తుతించిరి.

సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం సత్యస్య యోనిం నిహితం చ సత్యే
సత్యస్య సత్యమృతసత్యనేత్రం సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః।

సత్యవ్రతమ్ - సత్యసంకల్పుడైనట్టియు, సత్యపరమ్ - సత్యమే గొప్ప ప్రాప్తిసాధనముగా కలిగినట్టియు, త్రిసత్యమ్ - మూడు కాలములయందు నిలిచియుండునట్టియు, సత్త్యస్య - సత్ (పృథివి, జలములు, అగ్ని) నకు త్యత్ (వాయు-ఆకాశములు) నకు, యోనిమ్ - కారణమైనట్టియు, చ - మరియు, సత్త్యే - పంచభూతములయందు, నిహితమ్ - అంతర్యామివై ఉన్నట్టియు, సత్త్యస్య - పంచభూతములయొక్క, సత్యమ్ - పారమార్థిక స్వరూపమైనట్టియు, ఋతసత్యనేత్రమ్ - సత్యవచనమును సమదర్శనమును ప్రవర్తిల్ల జేయునట్టియు, సత్య-ఆత్మకమ్ - సత్యస్వరూపుడైన, త్వామ్ - నిన్ను, శరణమ్ - రక్షకునిగా, ప్రపన్నాః - కాళ్లను పట్టుకొనువారము.

నీవు సత్యసంకల్పుడవు. నిన్ను పొందే సాధనములలో సత్యము గొప్పది. నీవు సృష్టిస్థితిలయకాలములు మూడింటియందు నిలిచి యుందువు. పృథివి, జలములు, అగ్ని (సత్), వాయువు, ఆకాశము (త్యత్) అనే పంచభూతముల పారమార్థిక స్వరూపము నీవే. నీవే వాటికి కారణమై వాటియందు అంతర్యామివై ఉన్నావు. సత్యవచనమును, సమదర్శనమును ప్రవర్తిల్ల జేసే సత్యస్వరూపుడవైన నిన్ను మేము శరణు వేడుచున్నాము.

ఏకాయనోఽసౌ ద్విఫలస్త్రిమూలశ్చతూరసః పంచవిధష్షడాత్మా ।
సప్తత్వగష్టవిటపో నవాక్షో దశచ్ఛదీ ద్విఖగో హ్యాదివృక్షః ॥ 27

హి - ఏలయన, అసౌ - ఈ సంసారము, ఆదివృక్షః - సనాతనమగు చెట్టు, ఏక-అయనః - ఒకటియే ఆశ్రయముగా గలది, ద్విఫలః - రెండు పళ్లు గలది, త్రిమూలః - మూడు వ్రేళ్లు గలది, చతుః-రసః - నాలుగు రసములు గలది, పంచవిధః - ఐదు విధములు (ప్రకారములు) గలది, షడ్-ఆత్మా - ఆరు స్వభావములు గలది, సప్తత్వక్ - ఏడు బెరడులు గలది, అష్టవిటపః - ఎనిమిది కొమ్మలు గలది, నవ-అక్షః - తొమ్మిది తొర్రలు గలది, దశ-ఛదీ - పది ఆకులు గలది, ద్విఖగః - రెండు పక్షులు గలది.

ఏలయన, ఈ వ్యష్టిసమష్టిదేహరూపమైన సనాతనమగు సంసారము చెట్టు వంటిది. పరమేశ్వరుని మాయాశక్తి మాత్రమే దీనికి ఆశ్రయము. దీనికి సుఖదుఃఖములనే రెండు ఫలములు, సత్త్వరజస్తమోగుణములనే మూడు వ్రేళ్లు, ధర్మార్థకామమోక్షములనే నాలుగు రసములు గలవు. దీనిని శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనే ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా తెలియ దగును. పుట్టుట-ఉండుట-పెరుగుట-పరిణామమును చెందుట-క్షీణించుట-నశించుట అనే ఆరు పదార్థవికారములే దీని స్వభావములు. రసము, రక్తము, మాంసము, క్రొవ్వు, ఎముకలు, మూలుగు, చర్మములనే ఏడు ధాతువులే దీని బెరడులు. పృథివ్యప్తేజోవాయ్వాకాశములు మనో బుద్ధ్యహంకారములు అనే ఎనిమిది దీని కొమ్మలు. దేహమునందలి తొమ్మిది రంధ్రములే దీని తొర్రలు. ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమానములు, నాగకూర్మకృకలదేవదత్తధనంజయములనే పది వాయువులే దీని ఆకులు. జీవేశ్వరులనే రెండు పక్షులు దీనిపై గలవు.

త్వమేక ఏవాస్య సతః ప్రసూతిస్త్వం సన్నిధానం త్వమనుగ్రహశ్చ,
త్వన్మాయయా సంవృతచేతసస్త్వాం పశ్యంతి నానా న విపశ్చితో యే.

అస్య - ఈ, సతః - కార్యజగత్తునకు, ప్రసూతిః - ఉత్పత్తిస్థానము, ఏకః - అద్వితీయుడవగు, త్వం ఏవ - నీవే, త్వమ్ - నీవు, సత్-నిధానమ్ - కార్యజగత్తు లయమయ్యే స్థానము, త్వమ్ - నీవు, అనుగ్రహః చ - పాలించేవాడవు కూడ, త్వత్-మాయయా - నీ మాయచే, సంవృతచేతసః - కప్పివేయబడిన వివేకజ్ఞానము గలవారలు, త్వామ్ - నిన్ను, నానా - అనేకముగా, పశ్యంతి - చూచెదరు, యే - ఎవరైతే, విపశ్చితః - సత్యము తెలిసినవారు, న - కాదో. (త్వన్మాయయా - నీ మాయచే, అసంవృతచేతసః - కప్పివేయబడని వివేకజ్ఞానము గల, యే - ఏ, విపశ్చితః - జ్ఞానులు గలరో వారు, త్వామ్ - నిన్ను, నానా - అనేకముగా, న పశ్యంతి - చూడరు). 28

ఈ కార్యజగత్తు (సంసారవృక్షము) నీనుండి పుట్టి నీయందే విలీనమగును. దీనిని పాలించేది కూడ నీవే. నీ మాయచే కప్పివేయబడిన వివేకజ్ఞానము గలవారలు నీయందు భేదమును దర్శించెదరు. వారు

సత్యము తెలిసినవారు కారు. (నీ మాయచే కప్పివేయబడని వివేకజ్ఞానము గల విద్వాంసులు నిన్ను భిన్నముగా దర్శించరు).

బిభర్షి రూపాణ్యవబోధ ఆత్మా క్షేమాయ లోకస్య చరాచరస్య ।
సత్త్వోపపన్నాని సుఖావహాని సతామభద్రాణి ముహుః ఖలానామ్॥

అవబోధః - జ్ఞానస్వరూపమగు, ఆత్మా - ఆత్మయగు నీవు, చర-అచరస్య - స్థావరజంగమాత్మకమగు, లోకస్య - ప్రాణివర్గముయొక్క, క్షేమాయ - క్షేమము కొరకై, సత్త్వ-ఉపపన్నాని - సత్త్వగుణముతో నిండియుండునట్టియు, సతామ్ - సజ్జనులకు, సుఖ-ఆవహాని - సుఖమును కలిగించునట్టియు, ఖలానామ్ - దుష్టులకు, అభద్రాణి - అమంగళకరములైన, రూపాణి - అవతారములను, ముహుః - పలుమార్లు, బిభర్షి - దాల్చెదవు. 29

చైతన్యస్వరూపమగు ఆత్మవు నీవే. నీవు స్థావరజంగమాత్మకమగు ప్రాణివర్గముయొక్క క్షేమము కొరకై పలుమార్లు అవతారములను దాల్చెదవు. సత్త్వగుణప్రధానమగు నీ అవతారములు సజ్జనులకు సుఖమును, దుష్టులకు అమంగళమును కలిగించును.

త్వయ్యంబుజాక్షాఖిలసత్త్వధామ్ని సమాధినాఽఽవేశితచేతసైకే,
త్వత్పాదపోతేన మహత్కృతేన కుర్వంతి గోవత్సపదం భవాబ్ధిమ్।

అంబుజ-అక్ష - పద్మములవంటి కన్నులు గలవాడా!, ఏకే - కొద్దిమంది, అఖిలసత్త్వధామ్ని - శుద్ధసత్త్వరూపుడవగు నీయందు, సమాధినా - ఏకాగ్రతతో, ఆవేశితచేతసా - ప్రవేశపెట్టబడిన మనస్సుతో, మహత్-కృతేన - మహాత్ములచే (శరణాగతి) చేయబడిన, త్వత్-పాదపోతేన - నీ పాదములనే పడవతో, భవ-అబ్ధిమ్ - సంసారసముద్రమును, గోవత్సపదమ్ - ఆవుదూడ కాలి అడుగునుగా, కుర్వంతి - చేయుదురు. 30

పద్మములవంటి కన్నులు గల ఓ శ్రీహరీ! కొద్దిమంది శుద్ధసత్త్వస్వరూపుడవగు నీయందు ఏకాగ్రతతో మనస్సును లగ్నము చేసి, నీ పాదములనే పడవగా చేసుకొని సంసారసముద్రమును, ఆవు

దూడ గిట్ట గాడిని దాటినంత తేలికగా, దాటి వేసెదరు. మహాత్ములు నీ పాదములనే శరణు జొచ్చి కృతార్థులైరి.

స్వయం సముత్తీర్య సుదుస్తరం ద్యుమన్
భవార్ణవం భీమమదభ్రసౌహృదాః ।
భవత్పదాంభోరుహనావమత్ర తే
నిధాయ యాతాస్సదనుగ్రహో భవాన్ ॥ 31

ద్యుమన్ - స్వయంప్రకాశుడవగు ఓ శ్రీహరీ!, అదభ్రసౌహృదాః - తక్కువ కాని దయ గల, తే - ఆ మహాత్ములు, సుదుస్తరమ్ - సుతరాము దాట శక్యము కానట్టియు, భీమమ్ - భయంకరమైన, భవ-అర్ణవమ్ - సంసారమనే సముద్రమును, స్వయమ్ - స్వయముగా, సమ్-ఉత్తీర్య - చక్కగా దాటివేసి, భవత్-పద-అంభః-రుహనావమ్ - పద్మములవంటి నీ పాదములనే నావను, అత్ర - ఈ లోకమునందు, నిధాయ - ఉంచి, యాతాః - వెళ్లినవారు, భవాన్ - నీవు, సద్-అనుగ్రహః - సత్పురుషులయందు అనుగ్రహము గలవాడవు.

స్వయంప్రకాశస్వరూపుడవగు ఓ శ్రీహరీ! సంసారమనే సముద్రము భయంకరమైనది. దానిని దాటుట చాల కష్టము. ఆ మహాత్ములు దానిని చక్కగా తాము దాటివేసి, ప్రాణులపై గొప్ప దయ గలవారై, నీ పాదపద్మ ములనే నావను ఈ లోకమునందే విడిచిపెట్టి వెళ్లిరి (నీ పాదములయందలి భక్తిని లోకములో ప్రవర్తిల్ల జేసిరి). నీకు సజ్జనులపై అనుగ్రహము మెండు.

యేఽన్యేఽరవిందాక్ష విముక్తమానినః
త్వయ్యస్తభావాదవిశుద్ధబుద్ధయః ।
ఆరుహ్య కృచ్ఛ్రేణ పరం పదం తతః
పతంత్యధోఽనాదృతయుష్మదంఘ్రయః ॥ 32

అరవింద-అక్ష - పద్మములవంటి కన్నులు గల ఓ శ్రీహరీ!, విముక్తమానినః - ముక్తులమనే అభిమానము గలవారు, అన్యే - ఇతరులు, త్వయి - నీయందు, అస్తభావాత్ - కొరవడిన భక్తి కలిగియుండుట వలన,

అవిశుద్ధబుద్ధయః - పరిశుద్ధము కాని అంతఃకరణము గలవారు, న-ఆదృతయుష్మద్-అంఘ్రయః - ఆదరించబడని నీ పాదములు గలవారు, యే - ఎవరైతే గలరో వారు, కృచ్ఛ్రేణ - కష్టముతో, పరమ్ - సర్వోత్కృష్టమైన, పదమ్ - స్థానమును, ఆరుహ్య - అధిరోహించి, తతః - అక్కడనుండి, అధః - క్రింద, పతంతి - పడెదరు.

మరి కొందరు తాము విముక్తులమనే అహంకారము కలిగి నీ పాదములనాదరించరు. వారిలో భక్తి కొరవడుట వలన వారి అంతఃకరణమునందలి మాలిన్యము తొలగిపోదు. వారు తపస్సు మొదలగు కఠినసాధనలతో సర్వాతిశాయి స్థానమును పొందిననూ, అక్కడనుండి క్రిందకు పడిపోయెదరు.

తథా న తే మాధవ తావకాః క్వచిత్
భ్రశ్యంతి మార్గాత్త్వయి బద్ధసౌహృదాః ।
త్వయాఽభిగుప్తా విచరంతి నిర్భయా
వినాయకానీకపమూర్ధసు ప్రభో ॥ 33

మాధవ - ఓ లక్ష్మీపతీ!, త్వయి - నీయందు, బద్ధసౌహృదాః - కట్టివేయబడిన ప్రేమ గల, తే - ఆ, తావకాః - నీ భక్తులు, క్వచిత్ - ఏనాడైననూ, తథా - ఆ విధముగా, మార్గాత్ - భక్తియోగమునుండి, న భ్రశ్యంతి - జారిపోరు, ప్రభో - ఓ ప్రభూ!, త్వయా - నీచే, అభిగుప్తాః - అన్ని వైపులనుండియు కాపాడబడే ఆ భక్తులు, వినాయక-అనీకపమూర్ధసు - విఘ్నములను కలిగించే వారి సైన్యముయొక్క అధిపతుల శిరస్సులయందు, నిర్భయాః - భయము లేనివారై, విచరంతి - సంచరించెదరు.

ఓ లక్ష్మీపతీ! నీయందు దృఢమగు ప్రేమ గల ఆ నీ భక్తులు ఆ విధముగా (భక్తి లేనివారు వలె) ఏనాడైననూ యోగభ్రష్టులు కారు. ఓ ప్రభూ! నీచే అన్ని వైపులనుండియు రక్షించబడే ఆ భక్తులు నిర్భయులై విఘ్నకర్తల సైన్యముయొక్క అధ్యక్షుల తలలపై సంచరించెదరు (విఘ్నములనన్నింటినీ జయించెదరు).

సత్త్వం విశుద్ధం శ్రయతే భవాన్ స్థితౌ
శరీరిణాం శ్రేయఉపాయనం వపుః ।
వేదక్రియాయోగతపస్సమాధిభిః
తవార్హణం యేన జనస్సమీహతే ॥ 34

భవాన్ - నీవు, స్థితౌ - స్థితికాలమునందు, విశుద్ధమ్ - రజస్తమోగుణముల కల్తీ లేనట్టియు, సత్త్వమ్ - సత్త్వగుణమయమైనట్టి, శరీరిణామ్ - ప్రాణులకు, శ్రేయః-ఉపాయనమ్ - మోక్షమును కలిగించే, వపుః - రూపమును, శ్రయతే - ఉపాధిగా స్వీకరించెదవు, యేన - దేని ద్వారా, జనః - మానవుడు, వేదక్రియాయోగతపః-సమాధిభిః - వేదములు కర్మలు యోగానుష్ఠానము తపస్సు మరియు సమాధి అనువాటిచే, తవ - నీ యొక్క, అర్హణమ్ - ఆరాధనను, సమ్-ఈహతే - గొప్పగా చేయునో.

నీవు స్థితికాలమునందు రజస్తమోగుణముల కల్తీ లేని శుద్ధసత్త్వగుణప్రధానుడవై ప్రాణులకు మోక్షమునను గ్రహించే రూపమును ఉపాధిగా స్వీకరించెదవు. ఆ రూపము ద్వారా మానవుడు వేదములనధ్యయనము చేసి, కర్మలననుష్ఠించి, యోగానుష్ఠానమును మరియు తపస్సును చేసి, సమాధి (ఏకాగ్రచిత్తము) తో నిన్ను చక్కగా ఆరాధించగల్గును.

సత్త్వం న చేద్ధాతరిదం నిజం భవేద్విజ్ఞానమజ్ఞానభిదాపమార్జనమ్ ।
గుణప్రకాశైరనుమీయతే భవాన్ప్రకాశతే యస్య చ యేన వా గుణః॥

ధాతః - ఓ విధాతా!, ఇదమ్ - ఈ, నిజమ్ - నీదైన, సత్త్వమ్ - సత్త్వగుణప్రధానమైన రూపము, న భవేత్ చేత్ - లేనిచో, అజ్ఞానభిదా-అపమార్జనమ్ - అజ్ఞానము వలన కలిగే భేదబుద్ధిని తుడిచిపెట్టే, విజ్ఞానమ్ - విజ్ఞానము, న భవేత్ - ఉండెడిది కాదు, (అజ్ఞానభిత్ - అజ్ఞానమును పోనాడే, విజ్ఞానమ్ - ఆత్మజ్ఞానము, మార్జనమ్ - నాశమును, అప - పొంది యుండెడిది), గుణప్రకాశైః - గుణముల కార్యములైన ఇంద్రియముల ప్రకాశముల ద్వారా, భవాన్ - నీవు, అనుమీయతే - ఊహ చేయబడుదువు, యస్య చ - ఎవ్వానియొక్క, వా -

లేదా, యేన - ఎవ్వానిచే, గుణః - గుణము, ప్రకాశతే - ప్రకాశించుచున్నదో. 35

ఓ విధాతా! శుద్ధసత్త్వప్రధానమైన నీ ఈ రూపము లేకున్నచో, అజ్ఞానము వలన కలిగే భేదబుద్ధిని పోనాడే ఆత్మజ్ఞానమే ఉండెడిది కాదు. ఈ బుద్ధి, మనస్సు మొదలైన గుణవికారములు ఆత్మకు చెందినవియే (అనగా సాక్షియగు ఆత్మ చైతన్యముచే ప్రకాశింప జేయబడేవే). ఆత్మచే అధిష్ఠించబడిన బుద్ధి మొదలైనవి బాహ్యామునందలి శబ్దాది గుణవికారములను ప్రకాశింప జేయుచున్నవి. ఈ విధముగా ఆత్మ చైతన్యముచే ప్రకాశింప జేయబడే బుద్ధి మొదలైన ఇంద్రియముల ద్వారా, మరియు వాటిచే ప్రకాశింప జేయబడే శబ్దము మొదలైన గుణవికారముల ద్వారా, నిన్ను జ్ఞానయోగులు ఆత్మరూపముగా సాక్షాత్కరించుకొనెదరు. (ఆత్మయందు నిష్ఠను పొంది ఉండుట మాత్రమే సంభవము. ఆత్మను ఇంద్రియములతో కనుట గాని, మనస్సుతో భావన చేయుట గాని సంభవము కాదు. కాని, భగవానుని రూపమును ఇంద్రియములతో కని మనస్సుతో భక్తిని చేయవచ్చును).

న నామరూపే గుణజన్మకర్మభిః
నిరూపితవ్యే తవ తస్య సాక్షిణః ।
మనోవచోభ్యామనుమేయవర్త్మనో
దేవ క్రియాయాం ప్రతియంత్యథాఽపి హి ।। 36

తస్య - ఆ ఇంద్రియసంఘాతమునకు, సాక్షిణః - ప్రకాశింప జేసే సాక్షి ఐనట్టియు, అనుమేయవర్త్మనః - సూక్ష్మమగు బుద్ధిచే నిరూపించదగిన ప్రాప్తిమార్గము గల, తవ - నీయొక్క, గుణజన్మకర్మభిః - గుణములతో పుట్టుకలతో మరియు లీలలతో కూడి, నామరూపే - పేర్లు మరియు రూపములు, మనః-వచోభ్యామ్ - మనస్సుచే మరియు వాక్కుచే, నిరూపితవ్యే - నిరూపించ దగినవి, న - కావు, దేవ - ఓ దేవా!, అథ అపి - అయినప్పటికీ, క్రియాయామ్ - ఆరాధనయందు, ప్రతియంతి హి - నిశ్చయముగా నిరూపించెదరు.

ఇంద్రియసంఘాతమును ప్రకాశింపజేసే సాక్షి చైతన్యము నీవే. నిన్ను పొందే జ్ఞానమార్గమును సూక్ష్మమగు బుద్ధి మాత్రమే తెలియగలదు. వాత్సల్యము మొదలగు గుణములతో, మత్స్యము మొదలైన జన్మలతో, గోవర్ధనోద్ధారము మొదలైన లీలలతో, కూడియుండే నీ నామరూపములను (అవి అనంతములగుట వలన) మనస్సుతో భావించుట గాని, వాక్కుతో కీర్తించుట గాని సంభవము కాదు. ఓ దేవా! అయినప్పటికీ నీ ఆరాధనయందు నిష్ఠ గల భక్తులు నీ నామములను కీర్తిస్తూ, నీ రూపములను మనస్సుతో ధ్యానిస్తూనే ఉన్నారు. (అనగా, మనస్సునకు వాక్కునకు అందని భగవానుడు భక్తుని భక్తికి అందునని యర్థము).

శృణ్వన్ గృణన్ సంస్మరయంశ్చ చింతయన్
నామాని రూపాణి చ మంగలాని తే ।
క్రియాసు యస్త్వచ్చరణారవిందయోః
ఆవిష్టచేతా న భవాయ కల్పతే ॥ 37

యః తు - ఎవడైతే, త్వత్-చరణ-అరవిందయోః - నీ పద్మములవంటి రెండు పాదములయందు, ఆవిష్టచేతాః - లగ్నమైన మనస్సు గలవాడై, తే - నీయొక్క, మంగలాని - కల్యాణకరములైన, నామాని - పేర్లను, రూపాణి చ - రూపములను కూడ, శృణ్వన్ - వినువాడై, గృణన్ - కీర్తించువాడై, సంస్మరయన్ - స్మరించువాడై, చింతయన్ చ - ధ్యానము కూడ చేయువాడై, క్రియాసు - కర్మలయందు (ఉన్ననూ), భవాయ - సంసారము కొరకు, న కల్పతే - త్రోయబడడు.

ఎవడైతే పద్మములవంటి నీ రెండు పాదములయందు మనస్సును లగ్నము చేసి కల్యాణకరములైన నీ పేర్లను వింటూ కీర్తిస్తూ స్మరిస్తూ మరియు ధ్యానము చేస్తూ, తన పనులను చేసుకొనునో, అట్టివాడు మరల సంసారములో పడే ప్రసక్తి ఉండదు.

దిష్ట్యా హరేఽస్యా భవతః పదో భువో
భారోఽపనీతస్తవ జన్మనేశితుః ।
దిష్ట్యాఽంకితాం త్వత్పదకైస్సుశోభనైః
ద్రక్ష్యామ గాం ద్యాం చ తవానుకంపితామ్ ॥ 38

హరే - ఓ శ్రీహరీ!, ఈశితుః - జగన్నియామకుడవైన, తవ - నీయొక్క, జన్మనా - అవతరించుటచే, భవతః - నీయొక్క, పదః - పాదమైన, అస్యాః - ఈ, భువః - భూమియొక్క, భారః - భారము, దిష్ట్యా - దైవానుగ్రహముచే, అపనీతః - తొలగించబడినట్లే, సుశోభనైః - మిక్కిలి సుందరమైన, త్వత్-పదకైః - నీ కోమలములగు అడుగులతో, అంకితామ్ - గుర్తులు పడిన, గామ్ - భూమిని, తవ - నీయొక్క, అనుకంపితామ్ - దయను పొందిన, ద్యాం చ - స్వర్గలోకమును కూడ, దిష్ట్యా - దైవానుగ్రహముచే, ద్రక్ష్యామ - చూడగలము.

ఓ శ్రీహరీ! జగన్నియామకుడవగు నీ పుట్టుకచే నీ పాదమే అయిన ఈ భూమియొక్క భారము తొలగిపోయినట్లే. ఇది దైవానుగ్రహమే. మిక్కిలి సుందరమైన నీ కోమలములైన పాదముల గుర్తులు నేలపై పడగలవు. స్వర్గలోకము కూడ నీ దయకు పాత్రము కాగలదు. ఈ దైవానుగ్రహమును మేము కాంచెదము.

న తేఽభవస్యేశ భవస్య కారణం వినా వినోదం బత తర్కయామహే,
భవో నిరోధః స్థితిరప్యవిద్యయా కృతా యతస్త్వయ్యభయాశ్రయాత్మని.

బత ఈశ - ఓ ఈశ్వరా!, అభయాశ్రయ - అభయమునకు ఆశ్రయమైనవాడా!, అభవస్య - పుట్టుక లేని, తే - నీయొక్క, భవస్య - పుట్టుకకు, కారణమ్ - కారణమును, వినోదం వినా - వినోదము కాకుండా, న తర్కయామహే - ఊహించ లేము, యతః - ఏలయన, ఆత్మని - ఆత్మస్వరూపుడవగు, త్వయి - నీయందు, భవః - పుట్టుక, నిరోధః - మరణము, స్థితిః అపి - జీవించి యుండుట కూడ, అవిద్యయా - అజ్ఞానముచే, కృతా - కల్పించబడినది. 39

ఓ ఈశ్వరా! అభయమునకు ఆశ్రయము నీవే. పుట్టుకయే లేని నీకు పుట్టుటకు కారణము వినోదమే. అది కాక మరియొక కారణమును మేము ఊహ చేయలేము. ఎందుకంటే, ఆత్మస్వరూపుడవగు నీయందు పుట్టుక, జీవించి యుండుట, మరణము అనేవి అజ్ఞానముచే కల్పించబడినవి.

మత్స్యాశ్వకచ్ఛపనృసింహవరాహహంస-
రాజన్యవిప్రవిబుధేషు కృతావతారః ।
త్వం పాసి నస్త్రిభువనం చ యథాఽధునేశ
భారం భువో హర యదూత్తమ వందనం తే ॥ 40

ఈశ - ఓ ఈశ్వరా!, యదు-ఉత్తమ - ఓ యాదవశ్రేష్ఠా!, యథా - ఏ విధముగానైతే, మత్స్య-అశ్వకచ్ఛపనృసింహవరాహహంసరాజన్యవిప్ర విబుధేషు - చేప గుఱ్ఱము తాబేలు నరసింహము వరాహము హంస రాజు బ్రాహ్మణుడు దేవత అనే రూపములయందు, కృత-అవతారః - చేయబడిన అవతారము గల, త్వమ్ - నీవు, నః - మమ్ములను, త్రిభువనం చ - ముల్లోకములను కూడ, పాసి - రక్షించెదవో (అదే విధముగా), అధునా - ఇప్పుడు, భువః - భూమియొక్క, భారమ్ - బరువును, హర - తొలగించుము, తే - నీ కొరకు, వందనమ్ - నమస్కారము.

ఓ ఈశ్వరా! యాదవులలో శ్రేష్ఠుడవు నీవే. నీవు ఇదివరలో మత్స్య-హయగ్రీవ-కూర్మ-నృసింహ-వరాహ-హంస-శ్రీరామ-పరశురామ-వామనరూపములుగా అవతరించి మమ్ములను, ముల్లోకములను కూడ పాలించితివి. అదే విధముగా, ఇప్పుడు కూడ భూభారమును తొలగించుము. నీకు నమస్కారము.

దిష్ట్యాఽంబ తే కుక్షిగతః పరః పుమాన్
అంశేన సాక్షాద్భగవాన్భవాయ నః ।
మా భూద్భయం భోజపతేర్ముమూర్షోః
గోప్తా యదూనాం భవితా తవాత్మజః ॥ 41

అంబ - అమ్మా!, దిష్ట్యా - దైవానుగ్రహముచే, సాక్షాత్ - సాక్షాత్తుగా, పరః పుమాన్ - పురుషోత్తముడగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, నః - మాయొక్క, భవాయ - క్షేమము కొరకై, అంశేన - అంశయగు శేషునితో గూడి, తే - నీయొక్క, కుక్షిగతః - గర్భమును పొందినవాడు, ముమూర్షోః - చావగోరే, భోజపతేః - భోజదేశాధిపతియగు కంసుని వలన, భయమ్ -

భయము, మా భూత్ - వద్దు, తవ - నీయొక్క, ఆత్మజః - పుత్రుడు, యదూనామ్ - యాదవులకు, గోప్తా - రక్షకుడు, భవితా - తప్పక కాగలడు.

అమ్మా దేవకీ! ఇదివరలో శ్రీహరి అంశయగు శేషుడు నీ గర్భమునందు ప్రకటమైనాడు. ఇప్పుడు సాక్షాత్తుగా పురుషోత్తముడగు శ్రీహరి భగవానుడే మా క్షేమము కొరకై నీ గర్భమును పొందియున్నాడు. ఇది దైవానుగ్రహము. భోజదేశాధిపతియగు కంసుడు మృత్యువును ఏరి కోరి తెచ్చుకొనుచున్నాడు. నీవు వానికి భయపడవద్దు. నీ పుత్రుడు యాదవులను తప్పక రక్షించగలడు.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యభిష్టూయ పురుషం యద్రూపమనిదం యథా ।
బ్రహ్మేశానౌ పురోధాయ దేవాః ప్రతియయుర్దివమ్ ॥ 42

ఇతి శ్రీమద్భాగవతే దశమస్కంధే పూర్వార్ధే ద్వితీయోఽధ్యాయః ॥

దేవాః - దేవతలు, బ్రహ్మ-ఈశానౌ - బ్రహ్మను శివుని, పురోధాయ - ముందిడుకొని, ఇతి - ఈ విధముగా, పురుషమ్ - పూర్ణుడగు శ్రీహరిని, యద్-రూపమ్ - ఎవ్వాని స్వరూపము, యథా - ఉన్నది ఉన్నట్లుగా, అనిదమ్ - దృశ్యము కాదో, అభిష్టూయ - స్తుతించి, దివం ప్రతి - స్వర్గమును గురించి, యయుః - వెళ్లిరి.

శ్రీ శుక మహర్షి ఇట్లు పలికెను --- దేవతలు బ్రహ్మను శివుని ముందిడుకొని పూర్ణుడగు శ్రీహరిని ఈ విధముగా స్తుతించిరి. శ్రీహరి యథార్థస్వరూపము కంటికి కనబడేది (ఇంద్రియగోచరము) కాదు. అప్పుడు వారు స్వర్గమునకు వెళ్లిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము పూర్వార్ధములో
దేవతలు దేవకీగర్భమునందలి శ్రీహరిని స్తుతించుటను వర్ణించే
రెండవ అధ్యాయము ముగిసినది (2).

* * * * *

# అథ తృతీయోఽధ్యాయః

## శ్రీకృష్ణ జననము

శ్రీశుక ఉవాచ ।
అథ సర్వగుణోపేతః కాలః పరమశోభనః ।
యర్హ్యేవాజనజన్మర్క్షం శాంతర్క్షగ్రహతారకమ్ ॥ 1

యర్హి - ఎప్పుడైతే, కాలః - సమయము, సర్వగుణ-ఉపేతః - అన్ని మంచి లక్షణములతో కూడినదై, పరమశోభనః - అతిశయించి కల్యాణకరమో, అథ ఏవ - అప్పుడు మాత్రమే, శాంత-ఋక్షగ్రహతారకమ్ - శాంతములైన అశ్వినీ మొదలగు నక్షత్రగణములు గ్రహములు తారకలు గల, అజనజన్మ-ఋక్షమ్ - పుట్టుక లేని శ్రీహరియొక్క జన్మ నక్షత్రము (పుట్టుక లేని శ్రీహరినుండి ఆవిర్భవించిన బ్రహ్మ అధిష్ఠాన దేవతగా గల రోహిణీ నక్షత్రము).

ఆ సమయము అన్ని మంచి లక్షణములతో కూడి అతిశయించి కల్యాణకరమాయెను. అశ్విని మొదలైన నక్షత్రగణములు, గ్రహములు, తారకలు శాంతముగా నుండెను. అదియే జన్మలేని శ్రీహరి జన్మించిన నక్షత్రము (రోహిణి). ఆ నక్షత్రమునకు విష్ణువునుండి ఆవిర్భవించిన బ్రహ్మదేవుడు అధిష్ఠానము.

దిశః ప్రసేదుర్గగనం నిర్మలోడుగణోదయమ్ ।
మహీ మంగలభూయిష్ఠపురగ్రామవ్రజాకరా ॥ 2

దిశః - దిక్కులు, ప్రసేదుః - ప్రసన్నములాయెను, గగనమ్ - ఆకాశము, నిర్మల-ఉడుగణ-ఉదయమ్ - నిర్మలము మరియు నక్షత్రగణముల ఉదయము గలది, మహీ - భూమి, మంగలభూయిష్ఠపురగ్రామవ్రజ-ఆకరా - మంగళములు అధికముగా గల నగరములు గ్రామములు గొల్లపల్లెలు గనులు గలది.

దిక్కులు ప్రసన్నములు (ధూళి లేనివి) అయెను. నిర్మలమైన ఆకసమునందు నక్షత్రముల గుంపులు ఉదయించెను. పట్టణములు, గ్రామములు, గొల్ల పల్లెలు, గనులయందు నిండా మంగళములు ఉండెను.

నద్యః ప్రసన్నసలిలా హ్రదా జలరుహశ్రియః ।
ద్విజాలికులసన్నాదస్తబకా వనరాజయః ॥ 3

నద్యః - నదులు, ప్రసన్నసలిలాః - తేటపడిన నీరు గలవి, హ్రదాః - సరస్సులు, జలరుహశ్రియః - కలువల శోభ గలవి, వనరాజయః - అడవుల వరుసలు, ద్విజ-అలికులసన్నాదస్తబకాః - పక్షుల మరియు తుమ్మెదల గుంపుల చక్కని ధ్వనులు గల పూలగుత్తులు గలవి.

నదులలోని నీరు తేటపడెను. సరస్సులలో కలువలు శోభిల్లెను. అడవుల వరుసలలోని పూల గుత్తులు పక్షుల మరియు తుమ్మెదల గుంపుల ధ్వనులతో చక్కగా నుండెను.

వవౌ వాయుస్సుఖస్పర్శః పుణ్యగంధవహశ్శుచిః ।
అగ్నయశ్చ ద్విజాతీనాం శాంతాస్తత్ర సమింధత ॥ 4

తత్ర - ఆ సమయమునందు, సుఖస్పర్శః - సుఖకరమగు స్పర్శ గలది, పుణ్యగంధవహః - పవిత్రమగు పరిమళమును మోసుకు వచ్చునది, శుచిః - స్వచ్ఛమైనది అగు, వాయుః - గాలి, వవౌ - వీచెను, ద్విజాతీనామ్ - బ్రాహ్మణుల, అగ్నయః చ - అగ్నులు కూడ, శాంతాః - పొగ లేనివియై, సమింధత - బాగా ప్రజ్వరిల్లినవి.

ఆ సమయమునందు పవిత్రమగు పరిమళమును మోసుకు వచ్చుచున్న స్వచ్ఛమగు గాలి సుఖకరమగు స్పర్శను కలిగిస్తూ వీచెను. బ్రాహ్మణుల అగ్నులు కూడ పొగ లేకుండా బాగా మండినవి.

మనాంస్యాసన్ప్రసన్నాని సాధూనామసురద్రుహామ్ ।
జాయమానేఽజనే తస్మిన్నేదుర్దుందుభయో దివి ॥ 5

తస్మిన్ - ఆ, అజనే - పుట్టుక లేని శ్రీహరి, జాయమానే - జన్మించుచుండగా, అసురద్రుహామ్ - దేవతలకు హానిని తలపెట్టే

రాక్షసులకంటె ఇతరులైన, సాధూనామ్ - సత్పురుషులయొక్క, మనాంసి - మనస్సులు, ప్రసన్నాని - ప్రసన్నములై, ఆసన్ - ఐనవి, దివి - ద్యులోకమునందు, దుందుభయః - దుందుభులు, నేదుః - మ్రోగినవి.

వాస్తవముగా పుట్టుక లేని శ్రీహరి అవతరించుచుండగా సత్పురుషుల మనస్సులు ప్రసన్నములైనవి. కాని, దేవతలకు హానిని తలపెట్టే కంసాది రాక్షసుల మనస్సులు ప్రసన్నము కాలేదు. అప్పుడు స్వర్గలోకమునందు దుందుభులు మ్రోగినవి.

జగుః కిన్నరగంధర్వాస్తుష్టువుస్సిద్ధచారణాః ।
విద్యాధర్యశ్చ ననృతురప్సరోభిస్సమం తదా ॥ 6

తదా - అప్పుడు, కిన్నరగంధర్వాః - కిన్నరులు గంధర్వులు, జగుః - గానము చేసిరి, సిద్ధచారణాః - సిద్ధులు చారణులు, తుష్టువుః - స్తుతించిరి, విద్యాధర్యః చ - విద్యాధరస్త్రీలు కూడ, అప్సరోభిః సమమ్ - అప్సరలతో బాటుగా, ననృతుః - నాట్యము చేసిరి.

అప్పుడు కిన్నరులు, గంధర్వులు గానము చేయగా, విద్యాధరస్త్రీలు అప్సరసలతో కలిసి నాట్యము చేసిరి. సిద్ధులు, చారణులు స్తుతించిరి.

ముముచుర్మునయో దేవాస్సుమనాంసి ముదాన్వితాః ।
మందం మందం జలధరా జగర్జురనుసాగరమ్ ॥ 7

మునయః - మునులు, దేవాః - దేవతలు, ముదా - ఆనందముతో, అన్వితాః - కూడినవారై, సుమనాంసి - పువ్వులను, ముముచుః - విడిచిరి, జలధరాః - మేఘములు, అనుసాగరమ్ - సముద్రము వలె, మందం మందమ్ - చాల మెల్లగా, జగర్జుః - గర్జించినవి.

మునులు, దేవతలు ఆనందముతో పూలవానను కురిపించిరి. మేఘములు సముద్రము వలె చాల మెల్లగా గర్జించినవి.

నిశీథే తమ ఉద్భూతే జాయమానే జనార్దనే ।
దేవక్యాం దేవరూపిణ్యాం విష్ణుస్సర్వగుహాశయః ।
ఆవిరాసీద్యథా ప్రాచ్యాం దిశీందురివ పుష్కలః ॥ 8

తమః-ఉద్భూతే - చీకటిచే అధికముగా వ్యాపించబడినట్టియు, జన-అర్దనే - ప్రాణులకు ఇబ్బందిని కలిగించే, నిశీథే - అర్ధరాత్రి, జాయమానే - అగుచుండగా, సర్వగుహాశయః - సకలప్రాణుల హృదయమనే గుహయందుండే, విష్ణుః - శ్రీహరి, దేవరూపిణ్యామ్ - దేవతాస్వరూపిణియగు, దేవక్యామ్ - దేవకియందు, ప్రాచ్యామ్ - తూర్పు దిక్కునందు, పుష్కలః ఇందుః ఇవ - పూర్ణచంద్రుడు వలె, యథా - పూర్ణరూపముతో, ఆవిః-ఆసీత్ - ఆవిర్భవించెను.

చీకటి దట్టముగా వ్యాపించి ప్రాణులకు ఇబ్బందిని కలిగించే అర్ధరాత్రము ఆయెను. అప్పుడు సకలప్రాణుల హృదయమనే గుహయందుండే శ్రీహరి దేవతాస్వరూపిణియగు దేవకియందు, తూర్పు దిక్కునందు పూర్ణచంద్రుడు వలె, పూర్ణరూపముతో జన్మించెను.

తమద్భుతం బాలకమంబుజేక్షణం
చతుర్భుజం శంఖగదార్యుదాయుధమ్ ।
శ్రీవత్సలక్ష్మం గలశోభికౌస్తుభం
పీతాంబరం సాంద్రపయోదసౌభగమ్ ॥ 9

అద్భుతమ్ - అచ్చెరువును గొల్పునట్టియు, అంబుజ-ఈక్షణమ్ - పద్మములవంటి కన్నులు కలిగినట్టియు, చతుర్భుజమ్ - నాలుగు చేతులు కలిగినట్టియు, శంఖగదా-అరి-ఉద్-ఆయుధమ్ - శంఖము గద చక్రము అనే గొప్ప ఆయుధములు కలిగినట్టియు, శ్రీవత్సలక్ష్మమ్ - శ్రీవత్సమనే మచ్చ కలిగినట్టియు, గలశోభికౌస్తుభమ్ - మెడయందు (మెడచే) ప్రకాశించే కౌస్తుభ మాణిక్యము కలిగినట్టియు, పీత-అంబరమ్ - పచ్చని వస్త్రము కలిగినట్టియు, సాంద్రపయః-దసౌభగమ్ - దట్టని మేఘముయొక్క శోభ కలిగిన, తమ్ - ఆ, బాలకమ్ - పిల్లవానిని (వసుదేవుడు చూచెను).

పద్మములవంటి కన్నులు గల ఆ పిల్లవాడు నాలుగు చేతులతో, శంఖము గద చక్రము అనే గొప్ప ఆయుధములతో, రొమ్ముపై శ్రీవత్సమనే బంగరు రేఖతో, మెడలో ప్రకాశించే కౌస్తుభ మాణిక్యముతో (మెడచే ప్రకాశింపజేయబడే కౌస్తుభముతో) అచ్చెరువును

గొల్పుచుండెను. దట్టని మేఘము వలె ప్రకాశించే ఆ పిల్లవాడు పచ్చని వస్త్రమును దాల్చెను.

మహార్హ వైదూర్యకిరీటకుండలత్విషా పరిష్వక్తసహస్రకుంతలమ్ ।
ఉద్దామకాంచ్యంగదకంకణాదిభిర్విరోచమానం వసుదేవ ఐక్షత॥10

మహా-అర్హ వైదూర్యకిరీటకుండలత్విషా - మిక్కిలి విలువైన వైడూర్యమాణిక్యముల కిరీటముయొక్క కుండలములయొక్క కాంతితో, పరిష్వక్తసహస్రకుంతలమ్ - కౌగిలించుకొనబడిన లెక్క లేనన్ని ముంగురులు కలిగినట్టియు, ఉద్దామకాంచీ-అంగదకంకణ-ఆదిభిః - మిక్కిలి విలువైన నడుము పట్టీ భుజకీర్తులు చేతి కంకణములు మొదలగువాటితో, విరోచమానమ్ - విశేషముగా ప్రకాశించుచున్న పిల్లవానిని, వసుదేవః - వసుదేవుడు, ఐక్షత - చూచెను.

మిక్కిలి విలువైన వైడూర్యములు పొదిగిన కిరీటమునుండి మరియు కుండలములనుండి వెల్వడే కాంతులు తమ మధ్యలోనుండే దట్టని ముంగురులను ఆవరించి వేసినవి. ఆ బాలుడు మిక్కిలి విలువైన నడుము పట్టీని, భుజకీర్తులను, కంకణములను, ఇతరములగు ఆయుధములను ధరించి విశేషముగా ప్రకాశించుచుండగా, వసుదేవుడు చూచెను.

స విస్మయోత్ఫుల్లవిలోచనో హరిం
సుతం విలోక్యానకదుందుభిస్తదా ।
కృష్ణావతారోత్సవసంభ్రమోఽస్పృశత్
ముదా ద్విజేభ్యోఽయుతమాప్లుతో గవామ్ ॥ 11

సుతమ్ - పుత్రుడైన, హరిమ్ - శ్రీహరిని, విలోక్య - చూచి, విస్మయ-ఉత్-ఫుల్లవిలోచనః - ఆశ్చర్యముతో విప్పారిన కన్నులు గల, సః - ఆ, ఆనకదుందుభిః - వసుదేవుడు, తదా - అప్పుడు, కృష్ణ-అవతార-ఉత్సవసంభ్రమః - నల్లనయ్య అవతరించిన ఉత్సవముయొక్క హడావుడి గలవాడై, ముదా - ఆనందముతో, ఆప్లుతః - మునిచెత్తబడినవాడై, ద్విజేభ్యః - వేదపండితుల కొరకు, గవామ్ -

గోవులయొక్క, అయుతమ్ - పది వేలను, అస్పృశత్ - దానముగా సంకల్పించెను.

శ్రీహరి తనకు పుత్రుడై పుట్టుటను గాంచిన ఆ వసుదేవుని కన్నులు ఆశ్చర్యముతో విప్పారెను. నల్లనయ్య అవతరించిన ఉత్సవముయొక్క హడావుడితో కూడియున్న ఆయనను ఆనందము ముంచెత్తెను. అప్పుడాయన వేదపండితుల కొరకు పది వేల గోవులను దానము చేయుటకు సంకల్పము చేసెను.

అథైనమస్తౌదవధార్య పూరుషం పరం నతాంగః కృతధీః కృతాంజలిః,
స్వరోచిషా భారత సూతికాగృహం విరోచయంతం గతభీః ప్రభావవిత్।

భారత - ఓ పరీక్షిన్మహారాజా!, అథ - తరువాత, స్వరోచిషా - తన కాంతితో, సూతికాగృహమ్ - ప్రసవగృహమును, విరోచయంతమ్ - విశేషముగా ప్రకాశింప జేయుచున్న, ఏనమ్ - ఈ పిల్లవానిని, పరం పూరుషమ్ - పురుషోత్తమునిగా, అవధార్య - నిశ్చయించుకొని, నత-అంగః - వంచబడిన అవయవములు గలవాడు, కృతధీః - స్థిరమగు చిత్తము (పవిత్రమగు అంతఃకరణము) గలవాడు, ప్రభావవిత్ - మహిమ తెలిసినవాడు, గతభీః - తొలగిన భయము గలవాడు అగు వసుదేవుడు, కృత-అంజలిః - ఘటించబడిన దోసిలి గలవాడై, అస్తౌత్ - స్తుతించెను. 12

ఓ మహారాజా! తన కాంతితో ఆ ప్రసవగృహమును వెలిగిపోవునట్లు చేయుచున్న ఈ బుడతడు పురుషోత్తముడేనని వసుదేవుడు నిశ్చయించుకొనెను. శ్రీహరి మహిమ నెరిగిన ఆయనకు కంసుని వలని భయము తొలగిపోయెను. ఏకాగ్రమగు చిత్తము (పవిత్రమగు అంతఃకరణము) గల ఆయన అప్పుడు ప్రణామము చేసి దోసిలి ఘటించి స్తుతించెను.

వసుదేవ ఉవాచ ।
విదితోఽసి భవాన్ సాక్షాత్పురుషః ప్రకృతేః పరః ।
కేవలానుభవానందస్వరూపస్సర్వబుద్ధిదృక్ ॥ 13

విదితః - తెలియబడినవాడవు, అసి - అగుదువు, భవాన్ - నీవు, సాక్షాత్ - సాక్షాత్తుగా, ప్రకృతేః - ప్రకృతికంటె, పరః - అతీతుడవగు, పురుషః - పురుషోత్తముడవు, కేవల-అనుభవ-ఆనందస్వరూపః - అద్వయమగు అనుభవరూపమైన ఆనందమే స్వరూపముగా గలవాడవు, సర్వబుద్ధిదృక్ - సకలప్రాణుల సకలబుద్ధివృత్తులకు సాక్షియగు ఆత్మ చైతన్యమవు.

వసుదేవుడిట్లు పలికెను -- నీవెవరివో నాకు తెలిసినది. నీవు సాక్షాత్తు ప్రకృతికి అతీతుడవగు పురుషోత్తముడవు. ప్రాణులయందలి అద్వయమగు ఆనందానుభవమే నీ స్వరూపము. నీవు సకలప్రాణులలో ఆత్మరూపుడవై సకలబుద్ధివృత్తులకు సాక్షివై ఉన్నావు.

స ఏవ స్వప్రకృత్యేదం సృష్ట్వాఽగ్రే త్రిగుణాత్మకమ్ ।
తదను త్వం హ్యప్రవిష్టః ప్రవిష్ట ఇవ భావ్యసే ॥ 14

సః - అట్టి, త్వం ఏవ - నీవే, అగ్రే - సృష్ట్యాదియందు, స్వప్రకృత్యా - నీ మాయాశక్తితో, త్రిగుణ-ఆత్మకమ్ - సత్త్వరజస్తమోగుణములే ఉపాదానముగా గల, ఇదమ్ - ఈ జగత్తును, సృష్ట్వా - సృష్టించి, తదను - ఆ తరువాత, అప్రవిష్టః అపి - ప్రవేశించనివాడవే ఐనను, ప్రవిష్టః ఇవ - ప్రవేశించినవాడవు వలె, భావ్యసే హి - నిరూపించబడుచున్నావు గదా!

అట్టి (ప్రకృతికి అతీతుడవగు) నీవే సృష్ట్యాదియందు నీ మాయాశక్తితో సత్త్వరజస్తమోగుణములు ఉపాదానముగా గల ఈ జగత్తును సృష్టించినావు. ఆ పైన నీవు ఆ జగత్తులో యథార్థముగా ప్రవేశించకున్ననూ, (జగత్తునందు అనుభవమునకు వచ్చే సత్తాస్ఫూర్తులను బట్టి) ప్రవేశించినావా యన్నట్లున్నావని శ్రుతులు వర్ణించుచున్నవి. (నీవు యథార్థముగా దేవకీగర్భమునందు ప్రవేశించకున్ననూ, ప్రవేశించినావన్నట్లు తెలియబడెదవు).

యథేమేఽవికృతా భావాస్తథా తే వికృతైస్సహ ।
నానావీర్యాః పృథగ్భూతా విరాజం జనయంతి హి ॥ 15

ఇమే - ఈ, అవిక్రృతాః - వికారము చెందని, భావాః - తత్త్వములు (మహత్తు మొదలైనవి), యథా - ఎట్లో, తథా - అట్లు, నానావీర్యాః - పొంతన లేని శక్తులు గలవి, పృథగ్-భూతాః - వేర్వేరుగా నున్నవి అగు, తే - ఆ మహత్తత్త్వము మొదలైనవి, వికృతైః సహ - పృథివి మొదలైన వికారములతో గూడి, విరాజమ్ - బ్రహ్మాండమును, జనయంతి హి - ఉత్పన్నము చేయును గదా!

మహత్తత్త్వము, అహంకారము, శబ్దస్పర్శరూపరసగంధములనే ఐదు తన్మాత్రలు వెరసి ఏడు వికారము చెందని తత్త్వములు. పృథివి మొదలైన పంచభూతములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు, మనస్సు వెరసి పదహారు వికారము చెందే తత్త్వములు. అవికారి తత్త్వములు వికారి తత్త్వములలో వాస్తవముగా ప్రవేశించకున్ననూ, ప్రవేశించినవా యన్నట్లు కానవచ్చును. నీవు కూడ అటులనే. (సర్వమునందు పరమాత్మ సద్రూపముగా ముందునుండియే ఉండును గనుక, కొత్తగా ప్రవేశించడమనేది లేదు; ఐననూ ప్రవేశించినట్లు భావించబడును). ఈ అవికారి తత్త్వములు ఏడు వేర్వేరుగా ఉన్నంత వరకు వాటి శక్తుల మధ్య పొంతన ఉండదు. అవి (సద్ఘనమగు పరబ్రహ్మయొక్క ప్రేరణచే) వికారి తత్త్వములతో కలిసి బ్రహ్మాండమును ఉత్పన్నము చేయుచున్నవి.

సన్నిపత్య సముత్పాద్య దృశ్యంతేఽనుగతా ఇవ ।
ప్రాగేవ విద్యమానత్వాన్న తేషామిహ సంభవః ॥ 16

సన్నిపత్య - ఒకదానితో మరియొకటి కలిసి, సముత్పాద్య - బ్రహ్మాండమును ఉత్పన్నము చేసి, అనుగతాః ఇవ - ప్రవేశించినవా యన్నట్లు, దృశ్యంతే - కానవచ్చుచున్నవి, ప్రాక్ ఏవ - ముందే, విద్యమానత్వాత్ - ఉండుట వలన, తేషామ్ - వాటికి, ఇహ - ఈ కార్యజగత్తునందు, సంభవః - ప్రవేశము, న - లేదు.

ఆ అవికారి తత్త్వములు పరస్పరము కలిసి బ్రహ్మాండమును ఉత్పన్నము చేయగా, కొత్తగా ప్రవేశించినవా యన్నట్లు కనబడుచున్నవి.

అవి ఈ బ్రహ్మాండమునందు ముందే (కారణరూపముగా) ఉండుట వలన, కొత్తగా ప్రవేశించుట అనేది లేదు.

ఏవం భవాన్బుద్ధ్యనుమేయలక్షణైర్గ్రాహ్యైర్గుణైస్సన్నపి తద్గుణాగ్రహః,
అనావృతత్వాద్బహిరంతరం న తే సర్వస్య సర్వాత్మన ఆత్మవస్తునః।

ఏవమ్ - ఈ విధముగా, భవాన్ - నీవు, బుద్ధి-అనుమేయలక్షణైః - రూపాదుల జ్ఞానముచే ఊహించదగిన స్వరూపము గల ఇంద్రియములతో, గ్రాహ్యైః - వాటిచే తెలియబడే, గుణైః - శబ్దాది గుణములతో, సన్ అపి - కూడి యున్నవాడవైననూ, తద్-గుణ-అగ్రహః - ఆ ప్రకృతియొక్క గుణములను పట్టుకొనువాడవు కావు, సర్వస్య - సర్వము ఐనట్టియు, సర్వ-ఆత్మనః - సర్వమునకు అంతర్యామి ఐనట్టియు, ఆత్మవస్తునః - సద్ఘనమగు ఆత్మయైన, తే - నీకు, అనావృతత్వాత్ - దేశకాలపరిచ్ఛేదము లేనందువలన, బహిః - బయట, అంతరమ్ - లోపల, న - లేదు. 17

సర్వము నీవే అయి ఉన్నావు. సర్వముయొక్క అంతర్యామివి నీవే. రూపాదిజ్ఞానమును బట్టి కన్ను మొదలగు ఇంద్రియముల ఉనికి ఊహించబడును. ఈ విధముగా నీవు ఆ ఇంద్రియములతో మరియు వాటిచే గ్రహించబడే రూపాది గుణకార్యములతో కలిసిపోయి ఉన్ననూ, నీకు ఆ ప్రకృతియొక్క గుణములతో సంగము లేదు. సద్ఘనమగు ఆత్మవు నీవే. నీయందు దేశకాలపరిచ్ఛేదములు లేవు గనుక, బయట-లోపల అనే తేడాలు నీకు లేవు.

య ఆత్మనో దృశ్యగుణేషు సన్నితి
వ్యవస్యతే స్వవ్యతిరేకతోఽబుధః ।
వినాఽనువాదం న చ తన్మనీషితం
సమ్యగ్యతస్త్యక్తముపాదదత్పుమాన్ ॥ 18

ఆత్మనః - తనకు, దృశ్యగుణేషు - దృశ్యములయ్యే గుణకార్యములైన దేహాదులయందు, స్వవ్యతిరేకతః - ఆత్మకంటె వేరుగా, సన్ - ఉన్నది, ఇతి - అని, యః - ఏ, అబుధః - అజ్ఞానియగు, పుమాన్ - వ్యక్తి, వ్యవస్యతే - నిశ్చయించుకొనునో, మనీషితమ్ - విచారించబడిన, తత్ -

అది, అనువాదం వినా - వాక్కుయొక్క ఆలంబనమును మినహాయించి, (అనువాదమ్ - నామమే ఆలంబనముగా గల, తత్ - అది, వినా - ఆత్మరూపమైన ఉనికి లేకుండా), సమ్యక్ - స్వతంత్రమైన ఉనికి గలది, న చ - కానే కాదు, యతః - ఏలయనగా, త్యక్తమ్ - బాధితమైనదానిని, ఉపాదదత్ - స్వీకరించుచున్నాడో.

త్రిగుణముల కార్యములు మరియు దృశ్యములు అగు దేహాదులు ఆత్మస్వరూపమగు ఉనికిని విడిచి స్వతంత్రమగు ఉనికి గలవి కానే కావు. అవి కేవలము వాగింద్రియము మాత్రమే ఆలంబనముగా గల నామములతో కూడియుండే రూపములు మాత్రమే. ఎందుకంటే, శాస్త్రవిచారము చేసిన మహాత్ములు వాటిని స్వతంత్రమగు ఉనికి లేని అధ్యారోపములు మాత్రమేనని త్రోసిపుచ్చినారు. కాని, అజ్ఞానియగు వ్యక్తి అవి ఆత్మకంటె భిన్నముగా స్వతంత్రమగు సత్త గలవియని నిశ్చయించుకొనును.

త్వత్తోఽస్య జన్మస్థితిసంయమాన్ విభో
వదంత్యనీహాదగుణాదవిక్రియాత్ ।
త్వయీశ్వరే బ్రహ్మణి నో విరుధ్యతే
త్వదాశ్రయత్వాదుపచర్యతే గుణైః ॥ 19

విభో - ఓ ప్రభూ!, అనీహాత్ - క్రియ (సంకల్పము) లేనట్టియు, అగుణాత్ - గుణములు లేనట్టియు, అవిక్రియాత్ - వికారములు లేని, త్వత్తః - నీనుండి, అస్య - ఈ జగత్తుయొక్క, జన్మస్థితిసంయమాన్ - సృష్టిస్థితిలయములను, వదంతి - చెప్పెదరు, బ్రహ్మణి - నిర్గుణబ్రహ్మ వైనట్టియు, ఈశ్వరే - సగుణబ్రహ్మ వైన, త్వయి - నీయందు, నో విరుధ్యతే - విరోధము లేదు, గుణైః - గుణములచే, తద్-ఆశ్రయత్వాత్ - వాటికి అధిష్ఠానమగుట వలన, ఉపచర్యతే - ఆరోపించబడుచున్నది.

ఓ ప్రభూ! నీయందు సంకల్పములు గాని, క్రియలు గాని, వికారములు గాని లేవు. సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతి నీయందు యథార్థముగా స్వతంత్రమగు సత్త గలదిగా లేనే లేదు. ఐననూ, ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములు నీవలననే ఘటిల్లుచున్నవని

మహాత్ములు చెప్పెదరు. ఇట్లు చెప్పుటలో విరోధమేమీ లేదు. ఎందుకంటే, నిర్గుణబ్రహ్మవు నీవే, సగుణబ్రహ్మవు (ఈశ్వరుడవు) నీవే. నీయందు ఆరోపించబడే గుణములకు అధిష్ఠానము నీవే గనుక, గుణములయందలి కర్తృత్వము కూడ నీయందు ఆరోపించబడుచున్నది.

స త్వం త్రిలోకస్థితయే స్వమాయయా
బిభర్షి శుక్లం ఖలు వర్ణమాత్మనః ।
సర్గాయ రక్తం రజసోపబృంహితం
కృష్ణం చ వర్ణం తమసా జనాత్యయే ॥ 20

సః - అట్టి, త్వమ్ - నీవు, త్రిలోకస్థితయే - ముల్లోకములను పాలించుట కొరకు, స్వమాయయా - నీ మాయాశక్తిచే, ఆత్మనః - నీకు, శుక్లమ్ - సత్త్వగుణమయమగు, వర్ణమ్ - రూపమును, సర్గాయ - సృష్టి కొరకు, రజసా - రజోగుణముచే, ఉపబృంహితమ్ - వర్ధిల్ల జేయబడే, రక్తమ్ - రాగముతో కూడిన రూపమును, జన-అత్యయే - ప్రాణుల సంహారమునందు, తమసా - తమోగుణముచే, కృష్ణమ్ - నల్లని, వర్ణం చ - రూపమును కూడ, బిభర్షి - ధరించెదవు.

అట్టి సద్ఘనుడవగు నీవు నీ మాయాశక్తి ద్వారా ముల్లోకములను పాలించుట కొరకై సత్త్వగుణమయమగు విష్ణు (శాంత) రూపమును, సృష్టించుటకై రాగముతో కూడిన రజోగుణప్రధానమగు ప్రజాపతి రూపమును, ప్రాణులను ఉపసంహరించే ప్రళయకాలమునందు తమో గుణప్రధానమైన రుద్రరూపమును దాల్చెదవు. తెలుపు సత్త్వగుణమునకు, ఎరుపు రజోగుణమునకు, నలుపు తమస్సునకు చిహ్నములు.

త్వమస్య లోకస్య విభో రిరక్షిషుః
గృహేఽవతీర్ణోఽసి మమాఖిలేశ్వర ।
రాజన్యసంజ్ఞాఽసురకోటియూథపైః
నిర్వ్యూహ్యమానా నిహనిష్యసే చమూః ॥ 21

విభో - ఓ ప్రభూ!, అఖిల-ఈశ్వర - సర్వమును నియమించువాడా!, త్వమ్ - నీవు, అస్య - ఈ, లోకస్య - లోకమును, రిరక్షిషుః -

రక్షించగోరువాడవై, మమ - నాయొక్క, గృహే - ఇంటియందు, అవతీర్ణః - అవతరించినవాడవు, అసి - అగుచున్నావు, రాజన్యసంజ్ఞా-అసురకోటి యూథపైః - రాజులనే పేరు గల రాక్షసుల కోట్లాది సేనానాయకులచే, నిర్వ్యూహమానాః - ఇటునటు పంపబడే, చమూః - సైన్యములను, నిహనిష్యసే - సంహరించగలవు.

సకలజగత్తును శాసించే ఓ ప్రభూ! నీవు ఈ లోకమును రక్షించగోరి నా ఇంటిలో అవతరించితివి. రాక్షసులు రాజుల పేరుతో చెలామణీ అగుచున్నారు. వారి సేనానాయకులచే ఇటునటు త్రిప్పబడుతూ ఉండే కోట్లాది సేనలను నీవు మట్టుబెట్టగలవు.

అయం త్వసభ్యస్తవ జన్మ నౌ గృహే
శ్రుత్వాఽగ్రజాంస్తే న్యవధీత్సురేశ్వర ।
స తేఽవతారం పురుషైస్సమర్పితం
శ్రుత్వాఽధునైవాభిసరత్యుదాయుధః ॥ 22

సుర-ఈశ్వర - ఓ దేవదేవా!, అసభ్యః - దుష్టుడగు, అయం తు - ఈ కంసుడైతే, నౌ - మా యిద్దరి, గృహే - ఇంటియందు, తవ - నీ, జన్మ - అవతారమును గురించి, శ్రుత్వా - విని, తే - నీ, అగ్రజాన్ - అన్నలను, న్యవధీత్ - క్రూరముగా సంహరించెను, సః - ఆతడు, పురుషైః - భటులచే, సమర్పితమ్ - చేరవేయబడిన, తే - నీ, అవతారమ్ - అవతారమును గురించి, శ్రుత్వా - విని, అధునా ఏవ - ఇప్పటికిప్పుడు, ఉద్-ఆయుధః - పైకెత్తబడిన ఆయుధము గలవాడై, అభిసరతి - మీదకు వచ్చుచుండును.

ఓ దేవదేవా! నీవు మా ఇద్దరి ఇంట్లో అవతరిస్తావని విని దుష్టుడగు ఈ కంసుడైతే నీ అన్నలను (నీవేమోనని) క్రూరముగా చంపినాడు. నీవు అవతరించిన విషయమును రాజభటులు ఆతనికి ఇప్పటికే చెప్పి యుందురు. ఆతడు ఆయుధమును చేతబట్టి నీ మీదకు వచ్చుచుండును.

శ్రీశుక ఉవాచ ।
అథైనమాత్మజం వీక్ష్య మహాపురుషలక్షణమ్ ।
దేవకీ తముపాధావత్కంసాద్భీతా శుచిస్మితా ॥ 23

అథ - అప్పుడు, మహాపురుషలక్షణమ్ - పురుషోత్తముని లక్షణములు గల, ఏనమ్ - ఈ, ఆత్మజమ్ - పుత్రుని, వీక్ష్య - తేరిపార జూచి, శుచిస్మితా - స్వచ్ఛమైన చిరునవ్వు గల, దేవకీ - దేవకి, కంసాత్ - కంసుని వలన, భీతా - భయపడినదై, తమ్ - ఆ బాలకుని గురించి, ఉప-అధావత్ - స్తుతించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అప్పుడు పురుషోత్తముని లక్షణములతో కూడియున్న పుత్రుని చూచి దేవకి ఆయనను స్తుతించెను. ఆమె కంసునకు భయపడిననూ, పుత్రుని చూచి ఆమె ముఖములో స్వచ్ఛమగు చిరునవ్వు మొలకెత్తెను.

దేవక్యువాచ ।
రూపం యత్తత్ప్రాహురవ్యక్తమాద్యం
బ్రహ్మ జ్యోతిర్నిర్గుణం నిర్వికారమ్ ।
సత్తామాత్రం నిర్విశేషం నిరీహం
స త్వం సాక్షాద్విష్ణురధ్యాత్మదీపః ॥ 24

అవ్యక్తమ్ - ఇంద్రియగోచరము కానట్టియు, ఆద్యమ్ - సర్వకారణమైనట్టియు, బ్రహ్మ - సర్వవ్యాపకమైనట్టియు, జ్యోతిః - స్వయంప్రకాశమైనట్టియు, నిర్గుణమ్ - గుణములు లేనట్టియు, నిర్వికారమ్ - వికారము (మార్పు) లు లేనట్టియు, సత్తామాత్రమ్ - సద్ఘనమైనట్టియు, నిర్విశేషమ్ - భేదములు లేనట్టియు, నిరీహమ్ - సంకల్పములు (చేష్టలు) లేని, యత్ - ఏ, రూపమ్ - స్వరూపము గలదో, తత్ - దానిని, ప్రాహుః - చెప్పెదరు, సః - అట్టి, సాక్షాత్ - సాక్షాత్తుగా, విష్ణుః - విష్ణువగు, త్వమ్ - నీవు, అధ్యాత్మదీపః - దేహేంద్రియసంఘాతమునకు ప్రాణము పోసి జ్ఞానమునొసగువాడవు.

సర్వజగత్కారణమగు పరబ్రహ్మ ఇంద్రియగోచరము కాదు. స్వయంప్రకాశమగు ఆ బ్రహ్మయొక్క స్వరూపమునందు గుణములు గాని, వికారములు గాని, భేదములు గాని, చేష్టలు గాని, సంకల్పములు గాని లేవని మహాత్ములు చెప్పుచున్నారు. సర్వవ్యాపకమగు ఆ పరబ్రహ్మ సాక్షాత్తుగా నీవే. దేహేంద్రియమనస్సంఘాతమునకు సత్తాస్ఫూర్తుల ననుగ్రహించే ఆత్మవు నీవే.

నష్టే లోకే ద్విపరార్ధావసానే మహాభూతేష్వాదిభూతం గతేషు ।
వ్యక్తేఽవ్యక్తం కాలవేగేన యాతే భవానేకశ్శిష్యతే శేషసంజ్ఞః ॥25

కాలవేగేన - కాలముయొక్క వేగముచే, ద్విపరార్ధ-అవసానే - బ్రహ్మగారి రెండు ఏబదుల ఆయుష్షు పూర్తి అయినప్పుడు, లోకే - బ్రహ్మాండము, నష్టే - విలీనము కాగా, మహాభూతేషు - ఐదు మహాభూతములు, ఆదిభూతమ్ - మహత్తత్త్వమును ఉద్దేశించి, గతేషు - విలీనము కాగా, వ్యక్తః - మహత్తత్త్వము, అవ్యక్తమ్ - మాయాశక్తిని ఉద్దేశించి, యాతే - విలీనము కాగా, భవాన్ - నీవు, ఏకః - ఒక్కడివి, శిష్యతే - మిగిలి యుందువు, శేషసంజ్ఞః - శేషుడని పేరు గలవాడవు.

కాలముయొక్క వేగముచే బ్రహ్మగారి రెండు ఏబదుల ఆయుష్షు పూర్తియై బ్రహ్మాండము ఐదు మహాభూతములయందు, అవి తమకు కారణమగు మహత్తత్త్వమునందు, అది మాయాశక్తియందు విలీనమగును. అప్పుడు నీవొక్కడివే మిగిలియుందువు. కావుననే నీకు శేషుడని పేరు.

యోఽయం కాలస్తస్య తేఽవ్యక్తబంధో
చేష్టామాహుశ్చేష్టతే యేన విశ్వమ్ ।
నిమేషాదిర్వత్సరాంతో మహీయాన్
తం త్వేశానం క్షేమధామ ప్రపద్యే ॥ 26

అవ్యక్తబంధో - మాయాశక్తిని ప్రవర్తిల్ల జేయువాడా!, అయమ్ - ఈ, నిమేష-ఆదిః - రెప్పపాటు మొదలుగా గలది, వత్సర-అంతః - సంవత్సరము అంతముగా గలది అగు, యః - ఏ, మహీయాన్ - గొప్ప, కాలః - కాలము గలదో దానిని, తస్య - అట్టి, తే - నీ, చేష్టామ్ - శక్తినిగా,

ఆహుః - చెప్పెదరు, యేన - దేనిచే, విశ్వమ్ - జగత్తు, చేష్టతే - తిరుగుచున్నదో, ఈశానమ్ - నియామకుడవైనట్టియు, క్షేమధామ - అభయస్థానమైన, తమ్ - అట్టి, త్వా - నిన్ను, ప్రపద్యే - శరణు వేడుచున్నాను.

ప్రకృతిని ప్రవర్తిల్ల జేసే ఓ ఈశ్వరా! రెప్పపాటుతో మొదలై సంవత్సరము వరకు ఉండే ఏ కాలము గలదో, ఇది చాల గొప్పది. దాని వలననే జగత్తు (సృష్టిస్థితిప్రళయములయందు) తిరుగుచున్నది. ఆ కాలము నీ లీలయేనని మహాత్ములు చెప్పెదరు. అట్టి కాలప్రవర్తకుడవైన నీవు అభయమునకు స్థానమవు. నిన్ను శరణు వేడుచున్నాను.

మర్త్యో మృత్యువ్యాలభీతః పలాయన్
లోకాన్ సర్వాన్నిర్భయం నాధ్యగచ్ఛత్ ।
త్వత్పాదాబ్జం ప్రాప్య యదృచ్ఛయాఽఽద్య
స్వస్థశ్శేతే మృత్యురస్మాదపైతి ॥ 27

ఆద్య - సర్వమునకు కారణమైనవాడా!, మర్త్యః - మరణధర్ముడగు మానవుడు, మృత్యువ్యాలభీతః - మరణమనే పెద్ద పాము వలన భయపడినవాడై, సర్వాన్ - సకలములైన, లోకాన్ - లోకములను గురించి, పలాయన్ - పారిపోవువాడై, నిర్భయమ్ - అభయమును, న అధి-అగచ్ఛత్ - పొందలేదు, యదృచ్ఛయా - అనుకోకుండా, త్వత్-పాద-అబ్జమ్ - నీ పద్మములవంటి పాదమును, ప్రాప్య - చేరి, స్వస్థః - తన స్వరూపమునందున్నవాడై, శేతే - విశ్రమించును, అస్మాత్ - వీనినుండి, మృత్యుః - మరణము, అప-ఏతి - తొలగిపోవును.

సర్వకారణమైన ఓ ఈశ్వరా! మరణశీలుడగు మానవుడు మరణమనే పెద్ద పామునకు భయపడుతూ లోకములనన్నింటినీ తిరిగి అభయమును పొందలేకపోయెను. ఆ మానవుడు అనుకోకుండా (నీ కృపచే) పద్మములవంటి నీ పాదములను చేరి (శరణాగతి చేసి) విశ్రాంతిని పొందును. మృత్యువు అట్టివానికి దూరముగా పోవును.

స త్వం ఘోరాదుగ్రసేనాత్మజాన్నః
త్రాహి త్రస్తాన్భృత్యవిత్రాసహాఽసి ।

రూపం చేదం పౌరుషం ధ్యానధిష్ణ్యం
మా ప్రత్యక్షం మాంసదృశాం కృషీష్ఠాః ॥ 28

సః - అట్టి, త్వమ్ - నీవు, ఘోరాత్ - భయంకరుడగు, ఉగ్రసేన-ఆత్మజాత్ - ఉగ్రసేనుని పుత్రుడగు కంసుని వలన, త్రస్తాన్ - భయపడిన, నః - మమ్ములను, త్రాహి - కాపాడుము, భృత్యవిత్రాసహా - భక్తుల భయమును పోగొట్టువాడవు, అసి - అగుచున్నావు, పౌరుషమ్ - పురుషోత్తమునకు చెందినట్టియు, ధ్యానధిష్ణ్యమ్ - ధ్యానించుటకు తగిన, ఇదమ్ - ఈ, రూపం చ - రూపమును కూడ, మాంసదృశామ్ - మాంసమయమగు కన్నులు గలవారలకు, ప్రత్యక్షమ్ - కనబడేదానినిగా, మా కృషీష్ఠాః - చేయవద్దు.

అట్టి (అభయస్థానమగు) నీవు మమ్ములను కాపాడుము. ఉగ్రసేనుని పుత్రుడగు కంసుడు భయంకరుడు. మేము వానికి భయపడుచున్నాము. నీవు భక్తుల భయమును పోగొట్టువాడవు. ధ్యానించ దగిన ఈ పురుషోత్తమ రూపమును మాంసచక్షువులగు అజ్ఞానులకు కనబడనీయకుము.

జన్మ తే మయ్యసౌ పాపో మా విద్యాన్మధుసూదన ।
సముద్విజే భవద్ధేతోః కంసాదహమధీరధీః ॥ 29

మధుసూదన - మధువును సంహరించిన ఓ శ్రీహరీ!, మయి - నాయందు, తే - నీ, జన్మ - అవతారమును, పాపః - పాపియగు, అసౌ - ఈ కంసుడు, మా విద్యాత్ - తెలియకుండు గాక!, అధీరధీః - ధైర్యము లేని మనస్సు గల, అహమ్ - నేను, భవద్-హేతోః - నీ కారణముగా, కంసాత్ - కంసుని వలన, సమ్-ఉద్విజే - చాల ఆదుర్దా పడుచున్నాను.

మధువును సంహరించిన ఓ శ్రీహరీ! నీవు నా పుత్రుడవై అవతరించిన సంగతి పాపియగు ఈ కంసునకు తెలియరాదు. నా మనస్సులో ధైర్యము లేదు. నేను నీ గురించి కంసుని నిమిత్తముగా చాల ఆదుర్దా పడుచున్నాను.

ఉపసంహర విశ్వాత్మన్నదో రూపమలౌకికమ్ ।
శంఖచక్రగదాపద్మశ్రియా జుష్టం చతుర్భుజమ్ ॥ 30

విశ్వ-ఆత్మన్ - జగత్తునకు ఆత్మయగు ఓ శ్రీహరీ!, అలౌకికమ్ - దివ్యమైనట్టియు, శంఖచక్రగదాపద్మశ్రియా - శంఖము చక్రము గద పద్మముల శోభతో, జుష్టమ్ - సేవించబడునట్టియు, చతుర్-భుజమ్ - నాలుగు చేతులు గల, అదః - ఈ, రూపమ్ - రూపమును, ఉపసంహర - ఉపసంహారము చేయుము.

ఓ శ్రీహరీ! జగత్తుయొక్క సారము నీవే. శంఖచక్రగదాపద్మములతో సేవించబడే నాలుగు చేతుల ఈ దివ్యరూపమును దాచి పెట్టుము.

విశ్వం యదేతత్స్వతనౌ నిశాంతే
యథాఽవకాశం పురుషః పరో భవాన్ ।
బిభర్తి సోఽయం మమ గర్భగోఽభూత్
అహో నృలోకస్య విడంబనం హి తత్ ॥ 31

పరః పురుషః - పురుషోత్తముడవగు, భవాన్ - నీవు, నిశా-అంతే - ప్రళయముయొక్క అంతమునందు, ఏతత్ - ఈ, విశ్వమ్ - జగత్తును, స్వతనౌ - నీ దేహమునందు, యథా-అవకాశమ్ - తొడతొక్కిడి లేని విధముగా, బిభర్తి - ధరించుచున్నావు, సః - అట్టి, అయమ్ - ఈ నీవు, మమ - నా, గర్భగః - గర్భమును పొందినవాడవు, అభూత్ - ఐతివి, యత్ - అనేది యేది గలదో, తత్ - అది, నృలోకస్య - మానవలోకమునకు, విడంబనం హి - హాస్యాస్పదము గదా!

పురుషోత్తముడవగు నీవు ప్రళయమునకు అంతము (సృష్టిస్థితులు) నందు ఈ జగత్తును నీ దేహమునందు తొడతొక్కిడి లేకుండా ధరించి యుందువు. అట్టి ఈ నీవు నా గర్భమునందు జన్మించితివనేది యేది గలదో అది మానవలోకమునకు (ఊహాకు అందనిదగుటచే) హాస్యాస్పదముగా నుండును గదా!

శ్రీభగవానువాచ ।
త్వమేవ పూర్వసర్గేఽభూః పృశ్నిస్స్వాయంభువే సతి ।
తదాఽయం సుతపా నామ ప్రజాపతిరకల్మషః ॥ 32

స్వాయంభువే - స్వాయంభువ మన్వంతరము, సతి - ఉండగా, పూర్వసర్గే - గడచిన జన్మయందు, త్వం ఏవ - నీవే, పృశ్నిః - పృశ్నివి, అభూః - ఐతివి, తదా - అప్పుడు, అయమ్ - ఈ వసుదేవుడు, సుతపాః నామ - సుతపసుడని ప్రసిద్ధి గాంచిన, అకల్మషః - కల్మషము లేని, ప్రజాపతిః - ప్రజాపతి.

శ్రీభగవానుడిట్లు పలికెను --- స్వాయంభువ మన్వంతరము నడచుచుండగా నీవు గడచిన జన్మలో పృశ్నిగను, ఈ వసుదేవుడు నిష్కల్మషుడగు సుతపసుడనే ప్రజాపతిగను ఉండిరి.

యువాం వై బ్రహ్మణాఽఽదిష్టౌ ప్రజాసర్గే యదా తతః ।
సన్నియమ్యేంద్రియగ్రామం తేపాథే పరమం తపః ॥ 33

యదా - ఎప్పుడైతే, యువామ్ - మీరిద్దరు, బ్రహ్మణా - బ్రహ్మగారిచే, ప్రజాసర్గే - సంతానమును కనుటయందు, వై - నిశ్చయముగా, ఆదిష్టౌ - ఆదేశించబడిరో, తతః - అప్పుడు, ఇంద్రియగ్రామమ్ - ఇంద్రియముల సమూహమును, సమ్-నియమ్య - బాగుగా నియంత్రించి, పరమమ్ - కఠోరమగు, తపః - తపస్సును, తేపాథే - చేసిరి.

మీరిద్దరిని బ్రహ్మగారు సంతానమును కనుడని ఖచ్చితముగా ఆదేశించెను. అప్పుడు మీరు ఇంద్రియములనన్నింటినీ బాగుగా నియమించి కఠోరమగు తపస్సును చేసిరి.

వర్షవాతాతపహిమఘర్మకాలగుణానను ।
సహమానౌ శ్వాసరోధవినిర్ధూతమనోమలౌ ॥ 34

వర్షవాత-ఆతపహిమఘర్మకాలగుణాన్ - వర్షము గాలి ఎండ మంచు వేసవి తాపము అనే కాలముయొక్క లక్షణములను, అను - క్రమముగా, సహమానౌ - సహించుచున్నవారు, శ్వాసరోధవినిర్ధూతమనః-మలౌ - ప్రాణాయామముచే పటాపంచలు చేయబడిన మనస్సులోని మాలిన్యములు గలవారు.

మీరిద్దరు ఆయా కాలముల లక్షణములైన వర్షమును, గాలిని, ఎండను, మంచును, వేసవి తాపమును సహిస్తూ ప్రాణాయామమును చేసి మనస్సులోని కాలుష్యములను పటాపంచలు చేసిరి.

శీర్ణపర్ణానిలాహారావుపశాంతేన చేతసా ।
మత్తః కామానభీప్సంతౌ మదారాధనమీహతుః ॥ 35

శీర్ణపర్ణ-అనిల-ఆహారౌ - రాలిన ఎండుటాకులు గాలి ఆహారముగా గలవారు, మత్తః - నానుండి, కామాన్ - కోరికలను, అభీప్సంతౌ - కోరువారు, ఉపశాంతేన - ప్రశాంతమైన, చేతసా - మనస్సుతో, మద్-ఆరాధనమ్ - నా ఆరాధనను, ఈహతుః - చేసిరి.

మీరిద్దరు నానుండి కోరికలను కోరువారై రాలిన ఎండుటాకులను గాలిని మాత్రమే ఆహారముగా తీసుకుంటూ ప్రశాంతమగు మనస్సుతో నన్ను ఆరాధించిరి.

ఏవం వాం తప్యతోస్తీవ్రం తపః పరమదుష్కరమ్ ।
దివ్యవర్షసహస్రాణి ద్వాదశేయుర్మదాత్మనోః ॥ 36

మద్-ఆత్మనోః - నాయందు మనస్సు గల, వామ్ - మీరిద్దరు, ఏవమ్ - ఈ విధముగా, తీవ్రమ్ - కఠోరమైనట్టియు, పరమదుష్కరమ్ - మిక్కిలి చేయ శక్యము కాని, తపః - తపస్సును, తప్యతోః - చేయుచుండగా, ద్వాదశ - పన్నెండు, దివ్యవర్షసహస్రాణి - దేవతలకు చెందిన సంవత్సరముల వేలు, ఈయుః - గడచినవి.

ఈ విధముగా మీరిద్దరు మనస్సును నాయందు నిలిపి ఇతరులకు చేయ శక్యము కాని కఠోరమైన తపస్సును చేయుచుండగా, పన్నెండు వేల దేవసంవత్సరములు గడచినవి.

తదా వాం పరితుష్టోఽహమమునా వపుషాఽనఘే ।
తపసా శ్రద్ధయా నిత్యం భక్త్యా చ హృది భావితః ॥ 37

ప్రాదురాసం వరదరాడ్యువయోః కామదిత్సయా ।
వ్రియతాం వర ఇత్యుక్తే మాదృశో వాం వృతస్సుతః ॥ 38

అనఘే - ఓ పుణ్యాత్మురాలా!, తదా - అప్పుడు, వామ్ - మీ ఇద్దరి, తపసా - తపస్సుచే, శ్రద్ధయా - శ్రద్ధచే, నిత్యమ్ - నిరంతరముగా, భక్త్యా చ - భక్తితో కూడ, హృది - హృదయమునందు, భావితః - ధ్యానించబడిన, వరదరాట్ - వరములనిచ్చువారిలో అగ్రేసరుడనగు, అహమ్ - నేను, పరితుష్టః - మిక్కిలి ప్రీతుడనై, వామ్ - మీకిద్దరి కొరకు, కామదిత్సయా - కోరికలనిచ్చే కోరికతో, అమునా - ఈ, వపుషా - రూపముతో, ప్రాదుః-ఆసమ్ - సాక్షాత్కరించితిని, వరః - వరము, వ్రియతామ్ - కోరబడుగాక!, ఇతి - అని, ఉక్తే - పలుకబడగా, వామ్ - మీ ఇద్దరిచే, మాదృశః - నావంటి, సుతః - పుత్రుడు, వృతః - కోరబడినవాడు.

ఓ పుణ్యాత్మురాలా! వరములనిచ్చువారిలో నేను అగ్రేసరుడను. మీరిద్దరు తపస్సు చేస్తూ నన్ను నిత్యము శ్రద్ధాభక్తులతో హృదయములో ధ్యానించితిరి. అప్పుడు నేను మిక్కిలి ప్రీతి జెంది మీ ఇద్దరి కోరికలను తీర్చగోరి ఇదే రూపముతో సాక్షాత్కరించితిని. వరమును కోరుకొనుడని నేను చెప్పగా, నావంటి పుత్రుని మీరు వరముగా కోరితిరి.

అజుష్టగ్రామ్యవిషయావనపత్యౌ చ దంపతీ ।
న వవ్రాథేఽపవర్గం మే మోహితౌ మమ మాయయా ।। 39

అజుష్టగ్రామ్యవిషయౌ - సేవించబడని ఇంద్రియభోగములు గల, అనపత్యౌ చ - సంతానము లేని, దంపతీ - దంపతులు, మమ - నా, మాయయా - మాయాశక్తిచే, మోహితౌ - మోహమును పొందించబడినవారై, మే - నానుండి, అపవర్గమ్ - మోక్షమును, న వవ్రాథే - కోరకుండిరి.

సంతానము లేని దంపతులైన మీరిద్దరు ఇంద్రియభోగములను సేవించినవారు కారు. కాని, నా మాయాశక్తిచే మోహితులైన మీరు నానుండి మోక్షమును కోరకుండిరి.

గతే మయి యువాం లబ్ధ్వా వరం మత్సదృశం సుతమ్ ।
గ్రామ్యాన్భోగానభుంజాథాం యువాం ప్రాప్తమనోరథౌ ।। 40

మయి - నేను, గతే - వెళ్లగా, యువామ్ - మీరిద్దరు, మత్-సదృశమ్ - నన్ను పోలిన, సుతమ్ - పుత్రుని, వరమ్ - వరమునుగా, లబ్ధ్వా - పొంది, ప్రాప్తమనోరథౌ - పొందబడిన అభీష్టము గల, యువామ్ - మీరిద్దరు, గ్రామ్యాన్ భోగాన్ - ఇంద్రియభోగములను, అభుంజాథామ్ - భోగించిరి.

వరమునిచ్చి నేను నిష్క్రమించితిని. నన్ను పోలిన పుత్రుని వరముగా పొంది మీ ఇద్దరి అభీష్టము ఈడేరినది. పిదప మీరిద్దరు ఇంద్రియభోగముల ననుభవించిరి.

అదృష్ట్వాऽన్యతమం లోకే శీలౌదార్యగుణైస్సమమ్ ।
అహం సుతో వామభవం పృశ్నిగర్భ ఇతి శ్రుతః ॥ 41

లోకే - లోకమునందు, శీల-ఔదార్యగుణైః - సచ్ఛీలముతో నిండుదనముతో దయ మొదలగు గుణములతో, సమమ్ - సమానమైన, అన్యతమమ్ - మరియొకనిని, అదృష్ట్వా - కానరాక, అహమ్ - నేను, వామ్ - మీకిద్దరికి, పృశ్నిగర్భః - పృశ్నిగర్భుడు, ఇతి - అని, శ్రుతః - ప్రఖ్యాతి వడసిన, సుతః - పుత్రుడను, అభవమ్ - ఐతిని.

సచ్ఛీలము, నిండుదనము, దయ ఇత్యాది గుణములచే నాతో సమమైనవాడు లోకములో మరియొకడు కానరాడు. కావుననే, నేను మీకిద్దరికి పుత్రుడనై జన్మించి పృశ్నిగర్భుడని పేరు వడసితిని.

తయోర్వాం పునరేవాహమదిత్యామాస కశ్యపాత్ ।
ఉపేంద్ర ఇతి విఖ్యాతో వామనత్వాచ్చ వామనః ॥ 42

తయోః - ఆ, వామ్ - మీకిద్దరికి, పునః - మరల, అహం ఏవ - నేనే, కశ్యపాత్ - కశ్యపుని వలన, అదిత్యామ్ - అదితియందు, ఆస - జన్మించితిని, ఉపేంద్రః - ఉపేంద్రుడు, చ - మరియు, వామనత్వాత్ - పొట్టివాడు (అందగాడు) అగుట వలన, వామనః - వామనుడు, ఇతి - అని, విఖ్యాతః - ప్రసిద్ధిని పొందితిని.

మీరిద్దరు అదితి-కశ్యపులు కాగా మరల నేనే మీకు పుత్రుడనై జన్మించి ఉపేంద్రుడని పేరు వడసితిని. నేను పొట్టిగా నుండుట వలన (సుందరుడనగుట వలన) వామనుడని కూడ నాకు పేరు కలిగినది.

తృతీయేఽస్మిన్భవేఽహం వై తేనైవ వపుషాఽథ వామ్ ।
జాతో భూయస్తయోరేవ సత్యం మే వ్యాహృతం సతి ॥ 43

అస్మిన్ - ఈ, తృతీయే - మూడవ, భవే - జన్మయందు, అహం వై - నేనైతే, తేన - ఆ, వపుషా ఏవ - రూపముతోనే, తయోః - ఆ, వాం ఏవ - మీకిద్దరికే, భూయః - మరల, జాతః - జన్మించితిని, సతి - ఓ పతివ్రతా!, మే - నాచే, సత్యమ్ - యథార్థము, వ్యాహృతమ్ - చెప్పబడినది.

మరల ఆ మీ ఇద్దరే ఇప్పుడు దేవకీవసుదేవులైరి. ఆ నేనే అదే రూపముతో మరల ఇప్పుడు మూడో సారి మీకు పుత్రుడనైతిని. ఓ పతివ్రతా! నా మాట యథార్థము.

ఏతద్వాం దర్శితం రూపం ప్రాగ్జన్మస్మరణాయ మే ।
నాన్యథా మద్భవం జ్ఞానం మర్త్యలింగేన జాయతే ॥ 44

మే - నా, ప్రాగ్-జన్మస్మరణాయ - పూర్వమునందలి అవతారముల స్మరణము కొరకై, వామ్ - మీ కొరకు, ఏతత్ - ఈ, రూపమ్ - రూపము, దర్శితమ్ - చూపబడినది, అన్యథా - చూపించకపోతే, మర్త్యలింగేన - మానవదేహముతో, మద్భవమ్ - నాకు చెందిన, జ్ఞానమ్ - జ్ఞానము, న జాయతే - కలుగదు.

నేను గడచిన జన్మలలో మీకు పుత్రుడనై జన్మించిన విషయము మీకు గుర్తుకు వచ్చుటకై మీకీ రూపమును చూపించితిని. అట్లు చూపించనిచో, మానవదేహముతో నా అవతారముల గురించి జ్ఞానము కలుగదు.

యువాం మాం పుత్రభావేన బ్రహ్మభావేన చాసకృత్ ।
చింతయంతౌ కృతస్నేహౌ యాస్యేథే మద్గతిం పరామ్ ॥ 45

యువామ్ - మీరిద్దరు, మామ్ - నన్ను, పుత్రభావేన - పుత్రుడనే భావముతో, అసకృత్ - పలుమార్లు, బ్రహ్మభావేన చ - పరబ్రహ్మయనే భావముతో కూడ, చింతయంతౌ - తలపోయువారై, కృతస్నేహౌ - చేయబడిన ప్రేమ గలవారై, పరామ్ - సర్వాతిశాయియగు, మద్-గతిమ్ - నా స్వరూపమును, యాస్యేథే - పొందగలరు.

మీరిద్దరు నన్ను పుత్రుడనే భావముతో, పలుమార్లు పరబ్రహ్మ అనే భావముతో కూడ భావించువారై నాయందు ప్రేమను కలిగియుండుడు. మీరు సర్వాతిశాయియగు నా స్వరూపము (మోక్షము) ను పొందెదరు.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్త్వాఽఽసీద్ధరిస్తూష్ణీం భగవానాత్మమాయయా ।
పిత్రోస్సంపశ్యతోస్సద్యో బభూవ ప్రాకృతశ్శిశుః ॥ 46

హరిః భగవాన్ - శ్రీహరి భగవానుడు, ఇతి - ఇట్లు, ఉక్త్వా - పలికి, తూష్ణీం ఆసీత్ - మిన్నకుండెను, పిత్రోః - తల్లిదండ్రులు, సంపశ్యతోః - శ్రద్ధగా చూచుచుండగా, సద్యః - వెంటనే, ఆత్మమాయయా - తన మాయాశక్తిచే, ప్రాకృతః - మామూలు, శిశుః - పిల్లవాడు, బభూవ - ఆయెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీహరి భగవానుడిట్లు పలికి మిన్నకుండెను. తల్లిదండ్రులు ప్రేమతో చూచుచుండగనే, ఆయన తన మాయాశక్తిచే వెంటనే మామూలు పిల్లవాడు ఆయెను.

తతశ్చ శౌరిర్భగవత్ప్రచోదితః
సుతం సమాదాయ స సూతికాగృహాత్ ।
యదా బహిర్గంతుమియేష తర్హ్యజా
యా యోగమాయాఽజని నందజాయయా ॥ 47

తతః - తరువాత, భగవత్-ప్రచోదితః - శ్రీహరి భగవానునిచే ప్రేరేపించబడిన, సః - ఆ, శౌరిః చ - శూరుని పుత్రుడగు వసుదేవుడైతే, సూతికాగృహాత్ - పురిటి గదినుండి, సుతమ్ - పుత్రుని, సమాదాయ - ప్రేమగా తీసుకొని, యదా - ఎప్పుడైతే, బహిః - బయటకు, గంతుమ్ - వెళ్లుటకు, ఇయేష - కోరెనో, తర్హి - అప్పుడు, అజా - పుట్టుక లేని, యా - ఏ, యోగమాయా - యోగమాయ గలదో ఆమె, నందజాయయా - నందుని భార్యయగు యశోద ద్వారా, అజని - పుట్టెను.

తరువాత శ్రీహరి భగవానుని ప్రేరణచే శూరపుత్రుడగు ఆ వసుదేవుడు పురిటి గదినుండి పుత్రుని ప్రేమగా తీసుకొని బయటకు వెళ్లుటకు

సంసిద్ధుడాయెను. అదే సమయములో యథార్థమగు పుట్టుక లేని ఏ యోగమాయ గలదో ఆమె నందుని భార్యయగు యశోదకు జన్మించెను.

తయా హృతప్రత్యయసర్వవృత్తిషు
 ద్వాఃస్థేషు పౌరేష్వపి శాయితేష్వథ ।
ద్వారస్తు సర్వాః పిహితా దురత్యయా
 బృహత్కపాటాయసకీలశృంఖలైః ॥ 48

అథ - అప్పుడు, తయా - ఆ యోగమాయచే, హృతప్రత్యయసర్వవృత్తిషు - తొలగించివేయబడిన జ్ఞానమును కలిగించే అన్ని ఇంద్రియవ్యాపారములు గల, ద్వాఃస్థేషు - ద్వారపాలకులు, పౌరేషు అపి - పురజనులు కూడ, శాయితేషు - నిద్రించునట్లు చేయబడగా, బృహత్-కపాట-ఆయసకీలశృంఖలైః - పెద్ద తలుపులతో ఇనుప కీలలతో గొలుసులతో, పిహితాః - మూయబడిన, సర్వాః - అన్ని, ద్వారః తు - ద్వారములైతే, దురత్యయాః - దాటి వెళ్ల శక్యము కానివి.

అప్పుడు ఆ యోగమాయ ద్వారపాలకులకు, పురజనులకు కూడ పదార్థజ్ఞానమును కలిగించే ఇంద్రియవ్యాపారములన్నింటినీ తొలగించి నిద్ర పోవునట్లు చేసెను. కారాగారముయొక్క ద్వారములన్నింటికీ పెద్ద తలుపులు ఉండెను. అవి ఇనుప కీలలతో, గొలుసులతో మూసివేయబడెను. వాటిని తెరుచుకొని బయట పడుట దుర్ఘటము.

తాః కృష్ణవాహే వసుదేవ ఆగతే
 స్వయం వ్యవర్యంత యథా తమో రవేః ।
వవర్ష పర్జన్య ఉపాంశుగర్జితః
 శేషోఽన్వగాద్వారి నివారయన్ఫణైః ॥ 49

కృష్ణవాహే - కృష్ణుని మోయుచున్న, వసుదేవే - వసుదేవుడు, ఆగతే - రాగా, రవేః - సూర్యుని (ఉదయమునందు), తమః యథా - చీకటి వలె, తాః - ఆ తలుపులు, స్వయమ్ - తమంత తాము, వ్యవర్యంత - తెరచుకొనెను, ఉపాంశుగర్జితః - మెల్లగా గర్జించే, పర్జన్యః - మేఘుడు,

వవర్ష - వర్షించెను; శేషః - ఆదిశేషుడు, ఫణైః - పడగలతో, వారి - నీటిని, నివారయన్ - తప్పించువాడై, అను-అగాత్ - అనుసరించి వెళ్లెను.

సూర్యుడు ఉదయించగానే చీకటి తొలగిపోవునట్లుగా, కృష్ణుని నెత్తిపై పెట్టుకొని వసుదేవుడు రాగానే ఆ తలుపులు తమంత తాము తెరుచుకొనెను. మేఘము మెల్లగా గర్జిస్తూ వర్షించెను. ఆదిశేషుడు పడగలతో నీరు కృష్ణునిపై పడకుండా కాపాడుతూ ఆయన వెంట వెళ్లెను.

మఘోని వర్షత్యసకృద్యమానుజా గంభీరతోయౌఘజవోర్మి ఫేనిలా,
భయానకావర్తశతాకులా నదీ మార్గం దదౌ సింధురివ శ్రియః పతేః।50

అసకృత్ - పలుమార్లు, మఘోని - ఇంద్రుడు, వర్షతి - వర్షించుచుండ, గంభీరతోయ-ఓఘజవ-ఊర్మి ఫేనిలా - లోతైన నీటియందలి ప్రవాహముయొక్క వేగముచే తరంగముల నురగ గలది, భయానక-ఆవర్తశత-ఆకులా - భయంకరమైన సుడిగుండముల వందలచే కల్లోలితమైనది, యమ-అనుజా - యముని సోదరి అగు, నదీ - యమునా నది, శ్రియః - లక్ష్మీదేవియొక్క, పతేః - పెనిమిటియగు శ్రీరామునకు, సింధుః ఇవ - సముద్రము వలె, మార్గమ్ - దారిని, దదౌ - ఇచ్చెను.

పలుమార్లు పర్జన్యాధిపతియగు ఇంద్రుడు వర్షించిన కారణముగా యముని సహోదరియగు యమునా నది లోతైన నీటియందు ప్రవాహవేగముతో కూడిన తరంగములను, నురగను కలిగియుండెను. వందలాది సుడిగుండములతో కల్లోలముగానున్న ఆ నది, సీతాపతియగు శ్రీరామునకు సముద్రము వలె, దారిని ఇచ్చెను.

నందవ్రజం శౌరిరుపేత్య తత్ర తాన్గోపాన్ప్రసుప్తానుపలభ్య నిద్రయా,
సుతం యశోదాశయనే నిధాయ తత్సుతాముపాదాయ పునర్గృహానగాత్

శౌరిః - శూరుని పుత్రుడగు వసుదేవుడు, నందవ్రజమ్ - నందుని గొల్లపల్లెను, ఉపేత్య - చేరి, తత్ర - అచట, నిద్రయా - నిద్రచే (యోగమాయచే), ప్రసుప్తాన్ - గాఢముగా నిద్రించియున్న, తాన్ - ఆ, గోపాన్ - గోపాలకులను, ఉపలభ్య - చూచి, సుతమ్ - పుత్రుని, యశోదాశయనే - యశోదయొక్క ప్రక్కయందు, నిధాయ - ఉంచి,

తత్-సుతామ్ - ఆమెయొక్క కుమార్తెను, ఉపాదాయ - తీసుకొని, పునః - మరల, గృహాన్ - కారావాసమును గురించి, అగాత్ - వెళ్లెను. 51

శూరపుత్రుడగు వసుదేవుడు నందుని గొల్లపల్లెను చేరుసరికి అచట యోగమాయ ప్రభావముచే ఒళ్లు మరిచి నిద్రించుచున్న గోపాలకులు ఆయన కంట బడిరి. ఆయన పుత్రుని యశోద ప్రక్కలో పరుండబెట్టి, ఆమె కుమార్తెను తీసుకొని మరల కారాగారమును చేరుకొనెను.

దేవక్యాశ్శయనే న్యస్య వసుదేవోఽథ దారికామ్ ।
ప్రతిముచ్య పదోర్లోహమాస్తే పూర్వవదావృతః ॥ 52

అథ - తరువాత, వసుదేవః - వసుదేవుడు, దారికామ్ - అమ్మాయిని, దేవక్యాః - దేవకియొక్క, శయనే - ప్రక్కయందు, న్యస్య - ఉంచి, పదోః - పాదములకు, లోహమ్ - సంకెలను, ప్రతిముచ్య - కట్టుకొని, పూర్వవత్ - ఇదివరలో వలెనే, ఆవృతః - బందీయై, ఆస్తే - ఉన్నాడు.

తరువాత వసుదేవుడు ఆ అమ్మాయిని దేవకి ప్రక్కలో పరుండబెట్టెను. ఆయన కాళ్లకు సంకెళ్లను కట్టుకొని ఇదివరలో వలెనే బందీయై ఉండెను.

యశోదా నందపత్నీ చ జాతం పరమబుధ్యత ।
న తల్లింగం పరిశ్రాంతా నిద్రయాఽపగతస్మృతిః ॥ 53

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే తృతీయోఽధ్యాయః ॥

నందపత్నీ - నందుని భార్యయగు, యశోదా చ - యశోదయైతే, పరమ్ - కేవలము, జాతమ్ - పుట్టిన శిశువును, అబుధ్యత - గుర్తించెను, పరిశ్రాంతా - సొమ్మసిల్లినది, నిద్రయా - నిద్ర (యోగమాయ) చే, అపగతస్మృతిః - తొలగిపోయిన స్మృతి గలది, తత్-లింగమ్ - ఆ శిశువుయొక్క లింగమును, న - తెలియలేదు.

నందుని భార్యయగు యశోద సొమ్మసిల్లెను. ఆమెకు నిద్రచే (యోగమాయా ప్రభావముచే) స్మృతి లేకుండెను. తనకు ప్రసవమైనదని

మాత్రమే ఆమెకు తెలిసెను. ఆ శిశువు మగా, లేక ఆడా అను విషయము ఆమెకు తెలియలేదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్ధములో శ్రీకృష్ణజననమును వర్ణించే
మూడవ అధ్యాయము ముగిసినది (3).

* * * * *

# అథ చతుర్థోఽధ్యాయః

## యోగమాయ కంసునినుండి తప్పించుకొనుట

శ్రీశుక ఉవాచ ।
బహిరంతఃపురద్వారాస్సర్వాః పూర్వవదావృతాః ।
తతో బాలధ్వనిం శ్రుత్వా గృహపాలాస్సముత్థితాః ॥ 1

బహిః-అంతఃపురద్వారాః - బయట లోపల నగరముయొక్క ద్వారములు, సర్వాః - అన్నీ, పూర్వవత్ - ముందులో వలెనే, ఆవృతాః - మూయబడి యున్నవి, తతః - తరువాత, బాలధ్వనిమ్ - శిశువుయొక్క ధ్వనిని, శ్రుత్వా - విని, గృహపాలాః - కారాగార రక్షకులు (కుక్కలు), సమ్-ఉత్థితాః - నిద్ర లేచిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- నగరమునకు లోపల, బయట కూడ ద్వారములన్నీ ముందులో వలెనే మూయబడి యుండెను. ఇంతలో (కుక్కల వంటి) కారాగార రక్షకులు శిశువు ఏడ్చిన ధ్వని విని నిద్ర లేచిరి.

తే తు తూర్ణముపవ్రజ్య దేవక్యా గర్భజన్మ తత్ ।
ఆచఖ్యుర్భోజరాజాయ యదుద్విగ్నః ప్రతీక్షతే ॥ 2

తే తు - వారైతే, తూర్ణమ్ - వెంటనే, ఉపవ్రజ్య - దగ్గరకు వెళ్లి, భోజరాజాయ - భోజదేశప్రభువగు కంసుని కొరకు, దేవక్యాః - దేవకియొక్క, తత్ - ఆ, గర్భజన్మ - గర్భము ప్రసవించుటను గురించి, ఆచఖ్యుః - విన్నవించిరి, యత్ - దేనిని, ఉద్విగ్నః - ఆదుర్దా గలవాడై, ప్రతీక్షతే - వేచియున్నాడో.

ఆ రక్షకభటులైతే వెంటనే భోజప్రభువగు కంసుని వద్దకు వెళ్లి ఆ (ఎనిమిదవ పర్యాయము) గర్భవతియగు దేవకి ప్రసవించిన విషయమును విన్నవించిరి. ఆతడు ఆ క్షణము కొరకే ఆదుర్దాతో వేచి చూచుచుండెను.

స తల్పాత్తూర్ణముత్థాయ కాలోఽయమితి విహ్వలః ।
సూతీగృహమగాత్తూర్ణం ప్రస్ఖలన్ముక్తమూర్ధజః ॥ 3

అయమ్ - ఈ శిశువు, కాలః - మృత్యువు (అయమ్ - ఇది, కాలః - శిశువును చంపే సమయము), ఇతి - అని, విహ్వాలః - కంగారు పడిన, సః - ఆ కంసుడు, తల్పాత్ - ప్రక్క మీదనుండి, ఉత్థాయ - పైకి లేచి, తూర్ణమ్ - వెంటనే, ప్రస్ఖలన్ - తూలుచున్నవాడై, ముక్తమూర్ధజః - రేగిపోయిన జుట్టు గలవాడై, సూతీగృహమ్ - పురిటి గదిని గురించి, అగాత్ - వెళ్లెను.

ఈ శిశువు నాకు మృత్యువు (ఈ శిశువును మట్టుపెట్టే సమయమిదియే) అని కంగారు పడుతూ ఆ కంసుడు ప్రక్కమీదనుండి పైకి లేచి తూలుతూ (అపశకునము) వెంటనే పురిటి గదికి వెళ్లెను. ఆతని జుట్టు రేగిపోయి ఉండెను.

తమాహ భ్రాతరం దేవీ కృపణా కరుణం సతీ ।
స్నుషేయం తవ కల్యాణ స్త్రియం మా హంతుమర్హసి ॥ 4

తమ్ - ఆ, భ్రాతరమ్ - అన్నయగు కంసుని ఉద్దేశించి, సతీ - పతివ్రత, కృపణా - దీనురాలు అగు, దేవీ - దేవకీదేవి, కరుణమ్ - జాలి కలిగే విధముగా, ఆహ - పలికెను, కల్యాణ - మంగళకరుడా!, ఇయమ్ - ఈ అమ్మాయి, తవ - నీకు, స్నుషా - (మేన)కోడలు, స్త్రియమ్ - స్త్రీని, హంతుమ్ - చంపుటకు, మా అర్హసి - తగవు.

పతివ్రతయగు దేవకీదేవి దీనురాలై యుండెను. ఆమె అన్నగారగు కంసునితో జాలి కలిగే విధముగా ఇట్లు పలికెను -- ఓయీ మంగళకరుడా! ఈ అమ్మాయి నీ (మేన)కోడలు. ఆడపిల్లను చంపుట నీకు తగదు.

బహవో హింసితా భ్రాతశ్శిశవః పావకోపమాః ।
త్వయా దైవనిసృష్టేన పుత్రికైకా ప్రదీయతామ్ ॥ 5

భ్రాతః - అన్నా!, పావక-ఉపమాః - నిప్పులాంటి, శిశవః - పిల్లలు, బహవః - చాలమంది, దైవనిసృష్టేన - ప్రారబ్ధముచే ప్రేరితుడవైన, త్వయా - నీచే, హింసితాః - చంపబడితిరి, ఏకా - ఒక్క, పుత్రికా - అమ్మాయి, ప్రదీయతామ్ - ఈయబడుగాక!

అన్నా! (మా) ప్రారబ్ధము ప్రేరేపించగా నీవు నిప్పులాంటి పిల్లలను చాలమందిని చంపితివి. ఒక్క అమ్మాయిని నీవు అనుగ్రహించుము.

నన్వహం తే హ్యవరజా దీనా హతసుతా ప్రభో ।
దాతుమర్హసి మందాయా అంగేమాం చరమాం ప్రజామ్ ॥ 6

ప్రభో - ఓ రాజా!, హి - ఎందుకంటే, దీనా - దీనురాలను, హతసుతా - చంపబడిన పుత్రులు గలదానను అగు, అహమ్ - నేను, తే - నీకు, అవరజా నను - చెల్లెలిని గదా!, అంగ - అన్నా!, మందాయాః - అభాగ్యురాలనగు నాకు, ఇమామ్ - ఈ, చరమామ్ - ఆఖరి, ప్రజామ్ - సంతానమును, దాతుమ్ - ఇచ్చుటకు, అర్హసి - తగుదువు.

ఓ రాజా! నా పుత్రులు చంపబడిరి. దీనురాలనగు నేను నీకు చెల్లెలిని గదా! అన్నా! అభాగ్యురాలగు నాకు ఈ ఆఖరి సంతానమైన అమ్మాయిని విడిచిపెట్టుట నీకు యోగ్యముగా నుండును.

శ్రీశుక ఉవాచ ।
ఉపగుహ్యాత్మజామేవం రుదత్యా దీనదీనవత్ ।
యాచితస్తాం వినిర్భర్త్స్య హస్తాదాచిచ్ఛిదే ఖలః ॥ 7

ఏవమ్ - ఈ విధముగా, ఆత్మజామ్ - కుమార్తెను, ఉపగుహ్య - దగ్గరగా పమిటలో కప్పి ఉంచి, రుదత్యా - ఏడ్చుచున్న దేవకిచే, దీనదీనవత్ - దీనాతిదీనముగా, యాచితః - కోరబడినవాడు, ఖలః - దుష్టుడగు కంసుడు, వినిర్భర్త్స్య - బలముగా త్రోసి, హస్తాత్ - చేతినుండి, తామ్ - ఆ శిశువును, ఆచిచ్ఛిదే - లాగివేసెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆమె ఈ విధముగా ఏడుస్తూ పిల్లను దగ్గరగా పమిటలో దాచుకొని దీనాతిదీనముగా కోరెను. ఆ దుష్టుడు బలముగా త్రోసి చేతినుండి ఆ శిశువును లాగివేసెను.

తాం గృహీత్వా చరణయోర్జాతమాత్రాం స్వసుస్సుతామ్ ।
అపోథయచ్ఛిలాపృష్ఠే స్వార్థోన్మూలితసౌహృదః ॥ 8

స్వ-అర్థ-ఉత్-మూలితసౌహృదః - స్వార్థముచే నిర్మూలించబడిన ప్రేమ గల కంసుడు, స్వసుః - చెల్లెలికి, జాతమాత్రామ్ - అప్పుడే పుట్టిన, తామ్ - ఆ, సుతామ్ - కుమార్తెను, చరణయోః - రెండు కాళ్ళయందు,

గృహీత్వా - పట్టుకొని, శిలాపృష్ఠే - రాతి పైభాగముపై, అపోథయత్ - బలముగా కొట్టెను.

స్వార్థముచే కంసుని హృదయములోని ప్రేమ నిర్మూలితమయ్యేను. ఆతడు చెల్లెలికి అప్పుడే పుట్టిన ఆ అమ్మాయిని రెండు కాళ్లను పట్టుకొని రాతి పైభాగముపై వేసి కొట్టెను.

సా తద్ధస్తాత్సముత్పత్య సద్యో దేవ్యంబరం గతా ।
అదృశ్యతాఽనుజా విష్ణోస్సాయుధాఽష్టమహాభుజా ॥ 9

విష్ణోః - శ్రీహరికి, అనుజా - తరువాత జన్మించిన, సా - ఆ అమ్మాయి, సద్యః - వెంటనే, దేవీ - దేవియై, తద్-హస్తాత్ - వాని చేతినుండి, సమ్-ఉత్పత్య - బాగా పైకి యెగిరి, అంబరమ్ - ఆకసమును గురించి, గతా - వెళ్లినదై, స-ఆయుధా - ఆయుధములతో కూడినదియై, అష్టమహాభుజా - ఎనిమిది గొప్ప భుజములు గలదియై, అదృశ్యత - కనబడెను.

శ్రీహరి తరువాత జన్మించిన ఆ అమ్మాయి వెంటనే దేవియై వాని చేతినుండి బాగా పైకి యెగిరి ఆకసమును చేరెను. ఆమె ఎనిమిది గొప్ప భుజములు, ఆయుధములు గలదియై కానవచ్చెను.

దివ్యస్రగంబరాలేపరత్నాభరణభూషితా ।
ధనుశ్శూలేషుచర్మాసిశంఖచక్రగదాధరా ॥ 10

దివ్యస్రగ్-అంబర-ఆలేపరత్న-ఆభరణభూషితా - దివ్యమైన మాలలు వస్త్రములు చందనము మొదలైన పైపూతలు రత్నములు పొదిగిన ఆభరణములతో అలంకరించబడినది, ధనుః-శూల-ఇషుచర్మ-అసిశంఖచక్రగదాధరా - ధనుస్సు శూలము బాణములు కవచము కత్తి శంఖము చక్రము గద అనువాటిని ధరించినది.

ఆ దేవి దివ్యమైన వస్త్రములను దాల్చి, మాలలను, రత్నములు పొదిగిన ఆభరణములను అలంకరించుకొనెను. ఆమె చందనము మొదలైన ఆలేపములను వినియోగించెను. ధనుస్సు, బాణములు,

శూలము, కవచము, కత్తి, శంఖము, చక్రము, గదలను ఆమె (ఎనిమిది చేతులలో) ధరించెను.

సిద్ధచారణగంధర్వైరప్సరఃకిన్నరోరగైః ।
ఉపాహృతోరుబలిభిః స్తూయమానేదమబ్రవీత్ ॥ 11

సిద్ధచారణగంధర్వైః - సిద్ధులచే చారణులచే గంధర్వులచే, అప్సరఃకిన్నర-ఉరగైః - అప్సరసలచే కిన్నరులచే నాగులచే, ఉప-ఆహృత-ఉరుబలిభిః - తీసుకురాబడిన గొప్ప ఉపహారములు గల ఆ దేవి, స్తూయమానా - కొనియాడబడుచున్నదై, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

సిద్ధులు, చారణులు, గంధర్వులు, అప్సరసలు, కిన్నరులు, నాగులు గొప్ప ఉపహారములను తీసుకువచ్చి ఆమెను స్తుతించుచుండిరి. ఆమె (కంసునితో) ఇట్లు పలికెను.

కిం మయా హతయా మంద జాతః ఖలు తవాంతకృత్ ।
యత్ర క్వ వా పూర్వశత్రుర్మా హింసీః కృపణాన్ వృథా ॥ 12

మంద - ఓ మూర్ఖా!, హతయా - చంపబడిన, మయా - నాచే, కిమ్ - ఏమి ప్రయోజనము?, తవ - నీకు, అంతకృత్ - మరణమును కలిగించే, పూర్వశత్రుః - పూర్వమునందలి శత్రువు, యత్ర క్వ వా - ఎక్కడనో ఒకచోట, జాతః ఖలు - పుట్టియే ఉన్నాడు, కృపణాన్ - దీనులను, వృథా - వ్యర్థముగా, మా హింసీః - హింసించకుము.

ఓరీ మూర్ఖా! నన్ను చంపి యేమి లాభము? నిన్ను మట్టుబెట్టే నీ పూర్వశత్రువు ఎక్కడో ఒకచోట జన్మించియే యున్నాడు. నీవు వ్యర్థముగా దీనులను హింసించకుము.

ఇతి ప్రభాష్య తం దేవీ మాయా భగవతీ భువి ।
బహునామనికేతేషు బహునామా బభూవ హ ॥ 13

భగవతీ - భగవానునకు చెందిన, మాయా - యోగమాయయగు, దేవీ - ఆ దేవి, తమ్ - ఆ కంసుని ఉద్దేశించి, ఇతి - ఈ విధముగా, ప్రభాష్య -

గొప్పగా పలికి, భువి - భూలోకమునందు, బహునామనికేతేషు - పలు పేర్లు గల స్థానములయందు, బహునామా - పలు పేర్లు గలదియై, బభూవ హ - ఆయెను.

భగవానుని యోగమాయయగు ఆ దేవి కంసునితో ఈ విధముగా గంభీరముగా పలికెను. ఆమె భూలోకములో (కాశి మొదలైన) వేర్వేరు స్థానములయందు (విశాలాక్షి మొదలైన) వేర్వేరు పేర్లతో ప్రసిద్ధి గాంచెను.

తయాఽభిహితమాకర్ణ్య కంసః పరమవిస్మితః ।
దేవకీం వసుదేవం చ విముచ్య ప్రశ్రితోఽబ్రవీత్ ॥ 14

తయా - ఆమెచే, అభిహితమ్ - పలుకబడిన మాటను, ఆకర్ణ్య - విని, పరమవిస్మితః - మిక్కిలి అచ్చెరువు పొందిన, కంసః - కంసుడు, దేవకీమ్ - దేవకిని, వసుదేవం చ - వసుదేవుని కూడ, విముచ్య - విడిచిపెట్టి, ప్రశ్రితః - వినయము గలవాడై, అబ్రవీత్ - పలికెను.

ఆ దేవి చెప్పిన మాటను విన్న కంసుడు మిక్కుటమగు అచ్చెరువును పొందెను. ఆతడు దేవకీవసుదేవులను విడిచిపెట్టి వినయముతో నిట్లనెను.

అహో భగిన్యహో భామ మయా వాం బత పాప్మనా ।
పురుషాద ఇవాపత్యం బహవో హింసితాస్సుతాః ॥ 15

భగిని - ఓ చెల్లీ!, అహో - అయ్యో!, భామ - బావా!, అహో - అయ్యో!, బత - ఎంత దుఃఖమో!, పాప్మనా - పాపినగు, మయా - నాచే, వామ్ - మీ ఇద్దరి, అపత్యమ్ - సంతానమైన, బహవః - చాలమంది, సుతాః - పుత్రులు, పురుష-అదః ఇవ - నరమాంసభక్షకుడు వలె, హింసితాః - చంపబడిరి.

అయ్యో! అయ్యో! కష్టము! ఓ చెల్లీ! బావా! పాపినగు నేను మీ ఇద్దరి సంతానమైన చాలమంది కొడుకులను నరమాసంభక్షకుని వలె చంపితిని.

స త్వహం త్యక్తకారుణ్యస్త్యక్తజ్ఞాతిసుహృత్ఖలః ।
కాంల్లోకాన్ వై గమిష్యామి బ్రహ్మహేవ మృతశ్శ్వసన్ ॥ 16

త్యక్తకారుణ్యః - విడిచిపెట్టబడిన దయ గలవాడను, త్యక్తజ్ఞాతిసుహృత్ - విడిచిపెట్టబడిన బంధువులు మిత్రులు గలవాడను, ఖలః - దుష్టుడను అగు, సః - అట్టి, అహం తు - నేనైతే, కాన్ - ఏ, లోకాన్ - లోకములను, గమిష్యామి వై - పొందెదనో?, బ్రహ్మాహా ఇవ - బ్రహ్మహత్య చేసినవాడు వలె, శ్వసన్ - గాలి పీల్చుచున్ననూ, మృతః - మరణించినవాడను.

దయను త్రోసిపుచ్చి బంధువులను మిత్రులను విడిచిపెట్టిన దుష్టుడను నేను. అట్టి నేను ఏ నరకలోకములను పొందెదనో! బ్రహ్మహత్య చేసినవాడు వలె నేను గాలిని పీల్చుచున్ననూ చచ్చినవానితో సమానమే.

దైవమప్యనృతం వక్తి న మర్త్యా ఏవ కేవలమ్ ।
యద్విశ్రంభాదహం పాపస్స్వసుర్నిహతవాఞ్ఛిశూన్ ॥ 17

కేవలమ్ - కేవలము, మర్త్యాః ఏవ - మానవులు మాత్రమే, న - కాదు, దైవం అపి - దైవము కూడ, అనృతమ్ - అసత్యమును, వక్తి - చెప్పును, యద్-విశ్రంభాత్ - ఏ దైవమునందలి నమ్మకము వలన, పాపః - పాపినగు, అహమ్ - నేను, శిశూన్ - పిల్లలను, నిహతవాన్ - చంపితినో.

కేవలము మనుష్యులే కాదు, దైవము కూడ అసత్యమును చెప్పును. ఆ దైవముయొక్క మాటను నమ్మి, పాపినగు నేను పిల్లలను చంపితిని.

మా శోచతం మహాభాగావాత్మజాన్ స్వకృతంభుజః ।
జంతవో న సదైకత్ర దైవాధీనాస్తదాఽసతే ॥ 18

మహాభాగౌ - ఓ మహాత్ములారా! స్వకృతంభుజః - తమ ప్రారబ్ధమును అనుభవించే, ఆత్మజాన్ - పుత్రులను గురించి, మా శోచతమ్ - శోకించకుడు, దైవ-అధీనాః - దైవమునకు వశవర్తులై యుండే, జంతవః - ప్రాణులు, సదా - అన్ని వేళలా, తదా - అప్పుడు, ఏకత్ర - ఒక్కచోట, న ఆసతే - ఉండరు.

ఓ మహాత్ములారా! పుత్రులు తమ ప్రారబ్దమునునుభవించెదరు. వారిని గురించి శోకించకుడు. దైవవశవర్తులై ఉండే ప్రాణులు అన్ని వేళలా ఒక్కచోట యుండరు; ఉన్నచోటనైననూ కలిసి ఉండరు (విడిపోయెదరు).

భువి భౌమాని భూతాని యథా యాంత్యపయాంతి చ ।
నాయమాత్మా తథైతేషు విపర్యేతి యథైవ భూః ॥ 19

భువి - భూలోకమునందు, భౌమాని - మట్టితో చేసిన, భూతాని - కుండ మొదలైన పదార్థములు, యథా - ఏ విధముగానైతే, యాంతి - తయారగునో, అపయాంతి చ - చెదిరిపోవును కూడానో, తథా - అదే విధముగా, ఏతేషు - ఈ దేహములయందు, అయమ్ - ఈ, ఆత్మా - ఆత్మ, యథా భూః ఏవ - భూమి వలెనే, న విపర్యేతి - మార్పు చెందదు.

ఈ లోకములో మట్టితో కుండ మొదలైనవి తయారై, మరల అవి శిథిలమగును. కాని మట్టి స్థిరముగా నుండును. అదే విధముగా, దేహములు పుట్టి గిట్టుచున్ననూ, ఈ ఆత్మ వికారములను పొందదు.

యథాఽనేవంవిదో భేదో యత ఆత్మవిపర్యయః ।
దేహయోగవియోగౌ చ సంసృతిర్న నివర్తతే ॥ 20

యథా - యథార్థమును, అనేవంవిదః - ఈ విధముగా తెలియనివానికి, ఆత్మవిపర్యయః - అనాత్మయందు ఆత్మబుద్ధి, యతః - దేనివలనైతే, భేదః - భేదబుద్ధి కలుగునో, దేహయోగవియోగౌ చ - దేహముతో సంయోగవియోగములు కూడ కలుగునో, సంసృతిః - సంసారము, న నివర్తతే - మరలి పోదు.

ఆత్మ అవికారి అనే ఈ సత్యమునీ విధముగా ఎవడైతే తెలుసుకోడో, వానికి అనాత్మలగు దేహాదులయందు ఆత్మబుద్ధి కలుగును. దాని వలన తాను సర్వమునుండి విడివడి ఉన్నాననే భేదబుద్ధి కలుగును. దాని వలన ఆతడు దేహముతో సంయోగవియోగములను (పుట్టుక-చావులను) పొందుచుండును. అట్టి అజ్ఞానికి ఈ సంసారము తొలగిపోదు.

తస్మాద్భద్రే స్వతనయాన్మయా వ్యాపాదితానపి ।
మాఽనుశోచ యతస్సర్వస్స్వకృతం విందతేఽవశః ॥ 21

భద్రే - ఓ కల్యాణీ!, తస్మాత్ - అందువలన, మయా - నాచే, వ్యాపాదితాన్ అపి - చంపబడినవారే ఐననూ, స్వతనయాన్ - నీ పుత్రులను గురించి, మా అనుశోచ - శోకించకుము, యతః - ఏలయన,

సర్వః - ప్రతి ప్రాణి, అవశః - అస్వతంత్రుడై, స్వకృతమ్ - తన కర్మ (ఫలము) ను, విందతే - పొందును.

ఓ కల్యాణీ! నేను నీ పుత్రులను చంపిన మాట యథార్థమే. ఐననూ, నీవు వారిని గురించి శోకించకుము. ఎందుకంటే, ఏ ప్రాణికైననూ సుఖదుఃఖముల విషయములో స్వాతంత్ర్యము లేదు. ప్రతి ప్రాణి తన కర్మఫలమును మాత్రమే పొందుచుండును.

యావద్ధతోఽస్మి హంతాఽస్మీత్యాత్మానం మన్యతేఽస్వదృక్ ।
తావత్తదభిమాన్యజ్ఞో బాధ్యబాధకతామియాత్ ॥ 22

అస్వదృక్ - ఆత్మజ్ఞానము లేనివాడు, యావత్ - ఎంతవరకైతే, హతః - కొట్టబడినవాడను, అస్మి - అగుచున్నాను, హంతా - కొట్టువాడను, అస్మి - అగుచున్నాను, ఇతి - అని, ఆత్మానమ్ - తనను గురించి, మన్యతే - తలపోయునో, తావత్ - అంతవరకు, తద్-అభిమానీ - ఆ దేహమును ఆత్మగా తలపోసే, అజ్ఞః - అజ్ఞాని, బాధ్యబాధకతామ్ - పీడించబడుటను పీడించుటను, ఇయాత్ - పొందును.

ఆత్మస్వరూపమునెరుంగని వ్యక్తి ఇతరులు తనను పీడించినారనియు, తాను ఇతరులను పీడించినాననియు తలపోయును. ఎంతవరకైతే, అజ్ఞాని ఆ విధముగా దేహమే తాననే అభిమానమును కలిగియుండునో, అంతవరకు ఇతరులచే పీడించబడును, తాను ఇతరులను పీడించును.

క్షమధ్వం మమ దౌరాత్మ్యం సాధవో దీనవత్సలాః ।
ఇత్యుక్త్వాఽశ్రుముఖః పాదౌ శ్యాలస్స్వస్రోరథాఽగ్రహీత్ ॥ 23

మమ - నాయొక్క, దౌరాత్మ్యమ్ - దుర్బుద్ధిదనమును, క్షమధ్వమ్ - క్షమించుడు, సాధవః - సత్పురుషులు, దీనవత్సలాః - దీనులయందు ప్రేమ గలవారు, ఇతి - అని, శ్యాలః - బావమరదియగు కంసుడు, ఉక్త్వా - పలికి, అథ - తరువాత, అశ్రుముఖః - కన్నీళ్లు ముఖమునందు గలవాడై, స్వస్రోః - చెల్లి బావల, పాదౌ - రెండు పాదములను, అగ్రహీత్ - పట్టుకొనెను.

నేను దుర్బుద్ధిని, నన్ను క్షమించుడు, సత్పురుషులు దీనులపై ప్రేమను చూపించెదరు, అంటూ వసుదేవుని బావమరది యగు కంసుడు కళ్ల వెంబడి నీళ్లు పెట్టుకొనెను. తరువాత ఆతడు చెల్లి-బావల రెండు కాళ్లను పట్టుకొనెను.

మోచయామాస నిగడాద్విశ్రబ్ధః కన్యకాగిరా ।
దేవకీం వసుదేవం చ దర్శయన్నాత్మసౌహృదమ్ ॥ 24

కన్యకాగిరా - యోగమాయయొక్క మాటచే, విశ్రబ్ధః - నమ్మకము కలిగిన కంసుడు, ఆత్మసౌహృదమ్ - తన ప్రేమను, దర్శయన్ - చూపువాడై, దేవకీమ్ - దేవకిని, వసుదేవం చ - వసుదేవుని కూడ, నిగడాత్ - సంకెలనుండి, మోచయామాస - విడిపింప జేసెను.

యోగమాయ చెప్పిన మాటను బట్టి దేవకీవసుదేవులయందు తప్పు లేదని కంసుడు నమ్మెను. ఆతడు తన ప్రేమను చూపుతూ వారిద్దరిని సంకెళ్లనుండి విడిపింప జేసెను.

భ్రాతుస్సమనుతప్తస్య క్షాంత్వా రోషం చ దేవకీ ।
వ్యసృజద్వసుదేవశ్చ ప్రహస్య తమువాచ హ ॥ 25

సమ్-అనుతప్తస్య - బాగా పశ్చాత్తాపమును చెందిన, భ్రాతుః - అన్నయగు కంసునకు, క్షాంత్వా - క్షమించి, దేవకీ - దేవకి, రోషం చ - కోపమును కూడ, వ్యసృజత్ - విడిచి పెట్టెను, వసుదేవః చ - వసుదేవుడు కూడ, ప్రహస్య - నవ్వి, తమ్ - ఆ కంసుని గురించి, ఉవాచ హ - చెప్పెను.

అన్నయగు కంసుని అధికమగు పశ్చాత్తాపమును చూచి దేవకి వానిని క్షమించి, కోపమును విడిచి పెట్టెను. వసుదేవుడు కూడ నవ్వి కంసునితో నిట్లనెను.

ఏవమేతన్మహాభాగ యథా వదసి దేహినామ్ ।
అజ్ఞానప్రభవాऽహంధీస్స్వపరేతి భిదా యతః ॥ 26

మహాభాగ - ఓ మహాత్మా!, యథా - ఏ విధముగానైతే, వదసి - పలుకుచున్నావో, ఏతత్ - ఇది, ఏవమ్ - ఇటులనే, దేహినామ్ - ప్రాణులకు, అహంధీః - నేను అనే బుద్ధి, అజ్ఞానప్రభవా - అజ్ఞానము వలన పుట్టునది, యతః - దేనివలనైతే, స్వపర-ఇతి - తనవాడు పరాయి వాడు అనే, భిదా - తేడాయో.

ఓ మహాత్మా! నీవు చెప్పినది యథార్థమే. ప్రాణులయందు అజ్ఞానము వలన నేను అనే భేదబుద్ధి ఉండును. దాని వలననే, వ్యక్తి తనవాడు, పరాయి వాడు అనే భేదమును చూపును.

శోకహర్షభయద్వేషలోభమోహమదాన్వితాః ।
మిథో ఘ్నంతం న పశ్యంతి భావైర్భావం పృథగ్దృశః ॥ 27

పృథగ్-దృశః - భేదదృష్టి గలవారలు, శోకహర్షభయద్వేషలోభమోహమద-అన్వితాః - దుఃఖము హర్షము భయము ద్వేషము లోభము వ్యామోహము గర్వములతో కూడినవారై, భావైః - ప్రాణుల ద్వారా, మిథః - ఒకరిని మరియొకరుగా, భావమ్ - ప్రాణిని, ఘ్నంతమ్ - మట్టుబెట్టే కాలరూపుడైన ఈశ్వరుని, న పశ్యంతి - చూడరు.

భేదదృష్టి గల జనులు శోకము, హర్షము, ద్వేషము, లోభము, వ్యామోహము, గర్వములతో కూడియుందురు. కాలరూపుడగు ఈశ్వరుడు ఒక ప్రాణిని నిమిత్తముగా చేసి మరియొక ప్రాణిని మట్టుబెట్టును. ఈ సత్యమును ఆ జనులు తెలియలేరు.

శ్రీశుక ఉవాచ ।
కంస ఏవం ప్రసన్నాభ్యాం విశుద్ధం ప్రతిభాషితః ।
దేవకీవసుదేవాభ్యామనుజ్ఞాతోऽవిశద్గృహమ్ ॥ 28

ప్రసన్నాభ్యామ్ - ప్రసన్నులైన, దేవకీవసుదేవాభ్యామ్ - దేవకీవసుదేవులచే, ఏవమ్ - ఈ విధముగా, విశుద్ధమ్ - నిష్కపటముగా, ప్రతిభాషితః - బదులు చెప్పబడిన, కంసః - కంసుడు, అనుజ్ఞాతః - అనుమతి ఈయబడినవాడై, గృహమ్ - ఇంటిని, అవిశత్ - ప్రవేశించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- దేవకీవసుదేవులీ విధముగా ప్రసన్నమనస్కులై కంసునకు నిష్కపటమగు ఉత్తరమునిచ్చిరి. అపుడాతడు వారి వద్ద సెలవు తీసుకొని తన ప్రాసాదమునకు వెళ్లెను.

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం కంస ఆహూయ మంత్రిణః ।
తేభ్య ఆచష్ట తత్సర్వం యదుక్తం యోగనిద్రయా ॥ 29

తస్యామ్ - ఆ, రాత్ర్యామ్ - రాత్రి, వ్యతీతాయామ్ - గడువగా, కంసః - కంసుడు, మంత్రిణః - మంత్రులను, ఆహూయ - పిలిచి, తేభ్యః - వారి కొరకు, తత్ - ఆ, సర్వమ్ - సర్వమును, ఆచష్ట - చెప్పెను, యత్ - ఏదైతే, యోగనిద్రయా - యోగమాయచే, ఉక్తమ్ - చెప్పబడినదో.

ఆ రాత్రి గడచెను. ఆ మరునాడు కంసుడు మంత్రులను పిలిచి, తనతో యోగమాయ ఏ మాటలను పలికెనో, వాటినన్నింటినీ వారికి వివరించెను.

ఆకర్ణ్య భర్తుర్గదితం తమూచుర్దేవశత్రవః ।
దేవాన్ప్రతి కృతామర్షా దైతేయా నాతికోవిదాః ॥ 30

భర్తుః - కంసప్రభువుయొక్క, గదితమ్ - మాటను, ఆకర్ణ్య - విని, దేవశత్రవః - దేవతలకు శత్రువులైనవారు, దేవాన్ ప్రతి - దేవతలనుద్దేశించి, కృత-అమర్షాః - చేయబడిన క్రోధము గలవారు, న-అతికోవిదాః - పెద్ద తెలివితేటలు లేనివారు అగు, దైతేయాః - దితిపుత్రులగు రాక్షసులు, తమ్ - ఆ కంసుని ఉద్దేశించి, ఊచుః - పలికిరి.

దేవతలపై శత్రుత్వమును నెరపే ఆ దితిపుత్రులకు తెలివితేటలు (ధర్మాధర్మవిచారము) తక్కువ. కంసప్రభువు మాటను విని వారికి దేవతలపై కోపము వచ్చెను. వారు ఆతనితో నిట్లనిరి.

ఏవం చేత్తర్హి భోజేంద్ర పురగ్రామవ్రజాదిషు ।
అనిర్దశాన్నిర్దశాంశ్చ హనిష్యామోఽద్య వై శిశూన్ ॥ 31

భోజ-ఇంద్ర - ఓ భోజదేశాధిపతీ!, ఏవం చేత్ - ఇట్లైనచో, తర్హి - అప్పుడు, పురగ్రామవ్రజ-ఆదిషు - నగరములు గ్రామములు గొల్లపల్లెలు మొదలగువాటియందు, అనిర్దశాన్ - పదిరోజులు దాటని, చ - మరియు,

నిర్దశాన్ - పది రోజులు దాటిన, శిశూన్ - పిల్లలను, వై - నిశ్చయముగా, హనిష్యామః - చంపెదము.

ఓ భోజరాజా! పరిస్థితి ఇట్లున్న పక్షములో మనము నగరములలో, గ్రామములలో, గొల్లపల్లెలలో, ఇంకనూ ఇతరస్థానములలో పిల్లలను, వారికి పది రోజుల వయస్సు దాటినా దాటకున్నా, చంపి వేసెదము.

కిముద్యమైః కరిష్యంతి దేవాస్సమరభీరవః ।
నిత్యముద్విగ్నమనసో జ్యాఘోషైర్ధనుషస్తవ ॥ 32

సమరభీరవః - యుద్ధమునందు భయస్వభావము గలవారు, తవ - నీయొక్క, జ్యాఘోషైః - నారి త్రాటి శబ్దములచే, నిత్యమ్ - ఎల్లవేళలా, ఉద్విగ్నమనసః - ఆందోళనతో నిండిన మనస్సు గలవారు అగు, దేవాః - దేవతలు, ఉద్యమైః - యుద్ధపు తయారీలతో, కిం కరిష్యంతి - ఏమి చేయగలరు?

దేవతలకు యుద్ధమంటే భయము. నీ నారి త్రాటి శబ్దములకు వారి మనస్సు ఎల్లవేళలా ఆందోళనతో నిండిపోవును. వారు యుద్ధోద్యమముల ద్వారా ఏమి సాధించెదరు?

అస్యతస్తే శరవ్రాతైర్హన్యమానాస్సమంతతః ।
జిజీవిషవ ఉత్సృజ్య పలాయనపరా యయుః ॥ 33

అస్యతః - కొట్టే, తే - నీ, శరవ్రాతైః - బాణముల గుంపులచే, సమంతతః - అన్ని వైపులనుండియు, హన్యమానాః - కొట్టబడుచున్నవారై, జిజీవిషవః - బ్రదుక గోరువారై, ఉత్సృజ్య - విడిచిపెట్టి, పలాయనపరాః - పారిపోవుటయే ప్రధానముగా గలవారై, యయుః - పోయిరి.

(ఒకప్పుడు) నీవు బాణములను గుంపులుగా ప్రయోగించి అన్ని వైపులనుండియు కొట్టుచుండగా, దేవతలు బ్రదుకు దీపితో యుద్ధమును విడిచిపెట్టిరి. వారు పలాయనమే బ్రదికే ఉపాయమని తలచి పరుగెత్తిరి.

కేచిత్ప్రాంజలయో దీనా న్యస్తశస్త్రా దివౌకసః ।
ముక్తకచ్ఛశిఖాః కేచిద్భీతాస్స్మ ఇతి వాదినః ॥ 34

కేచిత్ - కొందరు, ప్ర-అంజలయః - జోడించిన చేతులు గలవారు, దీనాః - దీనులు, న్యస్తశస్త్రాః - విడిచిపెట్టబడిన ఆయుధములు గలవారు, దివౌకసః - స్వర్గవాసులు, ముక్తకచ్ఛశిఖాః - విడిపోయిన పంచకట్టులు జుట్టుముడులు గలవారు, కేచిత్ - కొందరు, భీతాః స్మః - భయపడుచున్నాము, ఇతి - అని, వాదినః - పలుకువారు.

(ఆ యుద్ధములో) స్వర్గవాసులగు కొందరు దేవతలు ఆయుధములను విడిచిపెట్టి దీనముగా చేతులు జోడించిరి. మరికొందరి పంచకట్టులు, జుట్టుముడులు విడిపోతూంటే, మాకు భయం వేస్తోంది, అని పలికిరి.

న త్వం విస్మృతశస్త్రాస్త్రాన్ విరథాన్ భయసంవృతాన్ ।
హంస్యన్యాసక్తవిముఖాన్ భగ్నచాపానయుధ్యతః ॥ 35

విస్మృతశస్త్ర-అస్త్రాన్ - విస్మరించబడిన శస్త్రములు అస్త్రములు గలవారిని, విరథాన్ - రథము లేనివారిని, భయసంవృతాన్ - భయముతో నిండినవారిని, అన్యాసక్తవిముఖాన్ - మరియొకనితో యుద్ధము చేయుచున్నవారిని యుద్ధమునుండి వెనుదిరుగువారిని, భగ్నచాపాన్ - విరిగిన ధనుస్సు గలవారిని, అయుధ్యతః - యుద్ధము చేయనివారిని, త్వమ్ - నీవు, న హంసి - చంపవు.

ఆయుధప్రయోగమును అస్త్రమంత్రమును మరిచిపోయినవారిని, రథము లేనివారిని, భయముతో నిండియున్నవారిని, మరియొకనితో యుద్ధము చేయుచున్నవారిని, యుద్ధమునుండి వెనుదిరుగుచున్నవారిని, ధనుస్సు విరిగిపోయినవారిని, యుద్ధము మానివేసినవారిని నీవు చంపవు.

కిం క్షేమశూరైర్విబుధైరసంయుగవికత్థనైః ।
రహోజుషా కిం హరిణా శంభునా వా వనౌకసా ।
కిమింద్రేణాల్పవీర్యేణ బ్రహ్మణా వా తపస్యతా ॥ 36

క్షేమశూరైః - భయము లేనిచోట శూరులైనట్టియు, అసంయుగవికత్థనైః - యుద్ధము లేని సమయమునందు (చోట) బీరాలు పలికే, విబుధైః -

దేవతలతో, కిమ్ - ఏమున్నది?, రహః-జుషా - రహస్యస్థానమును సేవించే, హరిణా - విష్ణువుతో, కిమ్ - ఏమున్నది?, వన-ఓకసా - అడవియందు నివసించే, శంభునా వా - శివునితో గాని, అల్పవీర్యేణ - తక్కువ పరాక్రమము గల, ఇంద్రేణ - ఇంద్రునితో, కిమ్ - ఏమున్నది?, తపస్యతా - తపస్సు చేసుకొనే, బ్రహ్మణా వా - బ్రహ్మదేవునితో గాని.

భయము లేని చోట దేవతలు శూరులు. యుద్ధము లేనప్పుడు యుద్ధము లేని చోట వారు బీరాలు పలికెదరు. విష్ణువు పాల సముద్రమువంటి రహస్యస్థానములో నివసించును. శివుడు అడవిలో నివసించును. ఇంద్రుని పరాక్రమము అల్పము. బ్రహ్మదేవుడు తపస్సు చేసుకొనుచుండును. వీరి వలన మనకు కలిగే ముప్పు ఏమి ఉండును?

తథాఽపి దేవాస్సాపత్న్యాన్నోపేక్ష్యా ఇతి మన్మహే ।
తతస్తన్మూలఖననే నియుంక్ష్వాస్మాననువ్రతాన్ ॥ 37

తథాపి - ఐనప్పటికీ, సాపత్న్యాత్ - శత్రువులగుట వలన, దేవాః - దేవతలు, న ఉపేక్ష్యాః - ఉపేక్షించ దగనివారు, ఇతి - అని, మన్మహే - తలంచెదము, తతః - అందువలన, తత్-మూలఖననే - వారిని తల్లివేరుతో సహా పెకిలించి వేయుటయందు, అనువ్రతాన్ - సేవకులమైన, అస్మాన్ - మమ్ములను, నియుంక్ష్వ - నియోగించుము.

ఐనప్పటికీ దేవతలు శత్రువులు గనుక వారిని ఉపేక్ష చేయరాదని మా అభిప్రాయము. కావున, వారి తల్లివేరు (శ్రీహరి) ని పెకిలించి వేయుటకై నీ సేవకులమగు మమ్ము ఆజ్ఞాపించుము.

యథాఽఽమయోఽంగే సముపేక్షితో నృభిః
న శక్యతే రూఢపదశ్చికిత్సితుమ్ ।
యథేంద్రియగ్రామ ఉపేక్షితస్తథా
రిపుర్మహాన్బద్ధబలో న చాల్యతే ॥ 38

యథా - ఏ విధముగానైతే, అంగే - అవయవమునందు, ఆమయః - వ్యాధి, సముపేక్షితః - ఉపేక్షించబడినదై, రూఢపదః - నాటుకొనబడిన పాదము గలదియై, నృభిః - మానవులచే, చికిత్సితుమ్ - చికిత్స

చేయుటకు, న శక్యతే - శక్యము కాదో, ఉపేక్షితః - ఉపేక్ష చేయబడిన, ఇంద్రియగ్రామః యథా - ఇంద్రియముల సముదాయము వలె, బద్ధబలః - నాటుకున్న బలము గల, మహాన్ - పెద్ద, రిపుః - శత్రువు, న చాల్యతే - చలింపజేయ బడడు.

దేహములోని అవయవమునందలి వ్యాధిని ఉపేక్షిస్తే అది ఆ అవయవమునందు గట్టిగా నాటుకొనును. అప్పుడు మానవులు దానికి చికిత్సను చేయజాలరు. ఇంద్రియముల సమూహమును ముందుగా ఉపేక్షించినచో, తరువాత వాటిని నియమించుట సంభవము కాదు. అదే విధముగా శత్రువును ఉపేక్షించినచో, ఆతడు నాటుకున్న బలము గలవాడై పెద్దవాడగును. అప్పుడా శత్రువును చలింప జేయుట శక్యము కాదు.

మూలం హి విష్ణుర్దేవానాం యత్ర ధర్మస్సనాతనః ।
తస్య చ బ్రహ్మ గోవిప్రాస్తపో యజ్ఞాస్సదక్షిణాః ।। 39

దేవానామ్ - దేవతలకు, మూలమ్ - వేరు, విష్ణుః హి - విష్ణువు గదా!, యత్ర - ఎక్కడనైతే, సనాతనః - కాలాతీతమగు, ధర్మః - ధర్మము ఉండునో, తస్య - దానికి, బ్రహ్మ - వేదము, గోవిప్రాః - గోవులు వేదవేత్తలు, తపః - తపస్సు, సదక్షిణాః - దక్షిణలతో గూడిన, యజ్ఞాః చ - యజ్ఞములు కూడ.

దేవతలకు మూలము విష్ణువే గదా! ఎక్కడనైతే కాలాతీతమగు ధర్మము ఉండునో, విష్ణువు అక్కడ ఉండును. వేదము, గోవులు, వేదవేత్తలు, తపస్సు, దక్షిణలతో కూడిన యజ్ఞములు కూడ ఆ ధర్మమునకు మూలములు.

తస్మాత్సర్వాత్మనా రాజన్ బ్రాహ్మణాన్ బ్రహ్మవాదినః ।
తపస్వినో యజ్ఞశీలాన్ గాశ్చ హన్మో హవిర్దుఘాః ।। 40

రాజన్ - ఓ రాజా!, తస్మాత్ - అందువలన, బ్రహ్మవాదినః - వేదములనుపదేశించే, బ్రాహ్మణాన్ - వేదవేత్తలను, యజ్ఞశీలాన్ - యజ్ఞములననుష్ఠించే స్వభావము గల, తపస్వినః చ - తపశ్శాలురను, హవిః-దుఘః - హోమసాధనములైన పాలను పితికే, గాః చ - ఆవులను

కూడ, సర్వ-ఆత్మనా - పూర్ణప్రయత్నముచే (అన్ని ప్రకారములుగా), హన్మః - చంపెదము.

ఓ రాజా! కాబట్టి, వేదములనుపదేశించే వేదవేత్తలను, యజ్ఞములననుష్ఠించే స్వభావము గల తపశ్శాలురను, హోమసాధనములైన పాలను ఇచ్చే ఆవులను కూడ పూర్తి ప్రయత్నము చేసి అన్ని ప్రకారములుగా మట్టు బెట్టెదము.

విప్రా గావశ్చ వేదాశ్చ తపస్సత్యం దమశ్శమః ।
శ్రద్ధా దయా తితిక్షా చ క్రతవశ్చ హరేస్తనూః ॥ 41

విప్రాః - వేదవేత్తలు, గావః చ - గోవులు, వేదాః చ - వేదములు, తపః - తపస్సు, సత్యమ్ - సత్యము, దమః - బాహ్యేంద్రియ నిగ్రహము, శమః - మనోనిగ్రహము, శ్రద్ధా - శ్రద్ధ, దయా - దయ, తితిక్షా చ - సహనము, చ - మరియు, క్రతవః - యజ్ఞములు, హరేః - శ్రీహరికి, తనవః - దేహములు.

వేదవేత్తలు, గోవులు, వేదములు, తపస్సు, సత్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము, శ్రద్ధ, దయ, సహనము, మరియు యజ్ఞములు శ్రీహరికి శరీరమువంటివి.

స హి సర్వసురాధ్యక్షో హ్యసురద్విడ్గుహాశయః ।
తన్మూలా దేవతాస్సర్వాస్సేశ్వరాస్సచతుర్ముఖాః ।
అయం వై తద్వధోపాయో యదృషీణాం విహింసనమ్ ॥ 42

సః - ఆ విష్ణువు, సర్వసుర-అధ్యక్షః హి - అందరు దేవతలకు ప్రభువు గదా!, అసురద్విట్ - రాక్షసులను ద్వేషించువాడు, గుహా-ఆశయః హి - బుద్ధి అనే గుహయందుండువాడు గదా!, స-ఈశ్వరాః - శివునితో గూడిన, సచతుర్-ముఖాః - నాల్గు మోముల వేల్పుతో గూడిన, దేవతాః - దేవతలు, సర్వాః - అందరు, తత్-మూలాః - ఆ విష్ణువు మూలముగా గలవారు, అయం వై - ఇదియే, తద్-వధ-ఉపాయః - ఆ విష్ణువును సంహరించే ఉపాయము, యత్ - ఏదనగా, ఋషీణామ్ - మహర్షులయొక్క, విహింసనమ్ - విశేషముగా హింసించుటయే.

ఎందుకంటే, ఆ విష్ణువు సకలదేవతలకు ప్రభువు. బుద్ధిగుహ యందుండే రాక్షసద్వేషి ఆతడే గదా! శివునితో సహా, బ్రహ్మదేవునితో సహా సకలదేవతలకు ఆశ్రయమాతడే. ఆ విష్ణువును నిశ్చయముగా వధించే ఉపాయమేదనగా, మహర్షులను అధికముగా హింసించుటయే.

శ్రీశుక ఉవాచ । ఏవం దుర్మంత్రిభిః కంసస్సహ సంమంత్ర్య
దుర్మతిః । బ్రహ్మహింసాం హితం మేనే కాలపాశావృతోఽసురః॥

దుర్మతిః - దుర్బుద్ధి, కాలపాశ-ఆవృతః - మృత్యువుయొక్క పాశముచే కప్పివేయబడినవాడు, అసురః - రాక్షసుడు అగు, కంసః - కంసుడు, ఏవమ్ - ఈ విధముగా, దుర్-మంత్రిభిః సహ - చెడు మంత్రులతో కూడి, సంమంత్ర్య - సలహా చేసి, బ్రహ్మహింసామ్ - వేదవేత్తలను హింసించుటను, హితమ్ - హితకరమునుగా, మేనే - తలచెను. 43

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- దుర్బుద్ధియగు కంసాసురుడు మృత్యువుయొక్క పాశముచే కప్పివేయబడి యుండెను. ఆతడీ విధముగా దుష్టులగు మంత్రులతో సలహా చేసి, వేదవేత్తలను హింసించుట తనకు హితకారి యని తలచెను.

సందిశ్య సాధులోకస్య కదనే కదనప్రియాన్ ।
కామరూపధరాన్ దిక్షు దానవాన్ గృహమావిశత్ ॥ 44

కదనప్రియాన్ - ఇతరులకు దుఃఖమును కలిగించుటయే ప్రియమైనట్టియు, కామరూపధరాన్ - కోరిన రూపమును ధరించే, దానవాన్ - రాక్షసులను, దిక్షు - దిక్కులయందు, సాధులోకస్య - సత్పురుషుల సముదాయమునకు, కదనే - దుఃఖమును కలిగించుటయందు, సందిశ్య - నియోగించి, గృహమ్ - ఇంటిని, ఆవిశత్ - ప్రవేశించెను.

దిక్కులన్నింటియందలి సత్పురుషుల సమాజములకు దుఃఖమును కలిగించే పనియందు ఆతడు రాక్షసులను నియోగించి, తన ప్రాసాదమునందు ప్రవేశించెను. కోరిన రూపములను దాల్చగలిగే ఆ రాక్షసులకు పరపీడనమన్నచో ప్రీతి మెండు.

తే వై రజఃప్రకృతయస్తమసా మూఢచేతసః ।
సతాం విద్వేషమాచేరురారాదాగతమృత్యవః ॥ 45

రజఃప్రకృతయః - రజోగుణస్వభావము కలిగినవారు, తమసా - అజ్ఞానముచే, మూఢచేతసః - వ్యామోహితమైన బుద్ధి గలవారు, వై - నిశ్చయముగా, ఆరాత్ - దగ్గరలో, ఆగతమృత్యవః - వచ్చిన మరణము గలవారు అగు, తే - వారు, సతామ్ - సత్పురుషులకు, విద్వేషమ్ - హానిని, ఆచేరుః - చేసిరి.

రజోగుణ (కామక్రోధాది) స్వభావము గల ఆ రాక్షసుల బుద్ధి అజ్ఞానముచే వ్యామోహితమై యుండెను. నిశ్చయముగా చావు దగ్గర పడిన ఆ రాక్షసులు సత్పురుషులకు హానిని కలిగించ జొచ్చిరి.

ఆయుశ్శ్రియం యశో ధర్మం లోకానాశిష ఏవ చ ।
హంతి శ్రేయాంసి సర్వాణి పుంసో మహదతిక్రమః ॥ 46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే చతుర్థోఽధ్యాయః ॥

పుంసః - మానవునకు, మహద్-అతిక్రమః - మహాత్ములను అనాదరము చేయుట, ఆయుః - ఆయుష్షును, శ్రియమ్ - సంపదను, యశః - కీర్తిని, లోకాన్ - పుణ్యలోకములను, ఆశిషః ఏవ చ - కోరబడే పుత్రాదులను, సర్వాణి - సకలములైన, శ్రేయాంసి - శ్రేయస్సులను, హంతి - నష్టము జేయును.

మానవుడు మహాత్ములను అనాదరము చేయుట వలన ఆయుష్షును, సంపదను, కీర్తిని, పుణ్యలోకములను, పుత్రాది కామ్యములను, సకలశ్రేయస్సులను కూడ కోల్పోవును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్థములో యోగమాయ కంసునినుండి తప్పించుకొనుటను
వర్ణించే నాల్గవ అధ్యాయము ముగిసినది (4).



# అథ పంచమోఽధ్యాయః

## శ్రీకృష్ణ జననోత్సవము

శ్రీశుక ఉవాచ ।
నందస్త్వాత్మజ ఉత్పన్నే జాతాహ్లాదో మహామనాః ।
ఆహూయ విప్రాన్ వేదజ్ఞాన్ స్నాతశ్శుచిరలంకృతః ॥ 1

శ్రీశుకః - శ్రీశుక మహర్షి, ఉవాచ - పలికెను, మహామనాః - పెద్ద మనసు గల, నందః తు - నందుడైతే, ఆత్మజే - పుత్రుడు, ఉత్పన్నే - పుట్టగా, జాత-ఆహ్లాదః - కలిగిన ఆహ్లాదము గలవాడై, వేదజ్ఞాన్ - వేదమునెరింగిన, విప్రాన్ - బ్రాహ్మణులను, ఆహూయ - పిలిచి, స్నాతః - స్నానము చేసినవాడై, శుచిః - శుచియై, అలంకృతః - అలంకరించుకున్నవాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను -- నందునిది పెద్ద మనసు. పుత్రుడు పుట్టగానే ఆయనకు ఆహ్లాదము కలిగెను. ఆయన వేదవేత్తలైన బ్రాహ్మణులనాహ్వానించెను. తాను స్నానమాడి శుచియై అలంకరించుకొనెను.

వాచయిత్వా స్వస్త్యయనం జాతకర్మాత్మజస్య వై ।
కారయామాస విధివత్పితృదేవార్చనం తథా ॥ 2

స్వస్త్యయనం కారయిత్వా - స్వస్తివాచనమును చేయించి, ఆత్మజస్య - పుత్రునకైతే, జాతకర్మ - జాతకర్మను, తథా - అదే విధముగా, పితృదేవ-అర్చనమ్ - పితృదేవతల మరియు దేవతల పూజను, విధివత్ - యథావిధిగా, కారయామాస - చేయించెను.

ఆయన వేదవేత్తలచే స్వస్తివాచనమును చేయించి, పుత్రునకు జాత కర్మను, పితృదేవతలకు దేవతలకు యథావిధిగా అర్చనను చేయించెను.

ధేనూనాం నియుతే ప్రాదాద్విప్రేభ్యస్సమలంకృతే ।
తిలాద్రీన్ సప్త రత్నౌఘశాతకౌంభాంబరావృతాన్ ।। 3

విప్రేభ్యః - వేదవేత్తల కొరకు, ధేనూనామ్ - పాలిచ్చే ఆవుల, సమ్-అలంకృతమ్ - చక్కగా అలంకరించబడిన, నియుతే - రెండు లక్షలను, రత్న-ఓఘశాతకౌంభ-అంబర-ఆవృతాన్ - రత్నముల గుట్టలచే బంగరు రసము పూసిన వస్త్రములచే కప్పబడిన, సప్త - ఏడు, తిల-అద్రీన్ - నువ్వుల పర్వతములను, ప్రాదాత్ - ఇచ్చెను.

ఆయన వేదవేత్తల కొరకు రెండు లక్షల ఆవులను చక్కగా అలంకరించి దానము చేసెను. మరియు, ఏడు తిలల పర్వతము (పది కుంచములు) లను పైన రత్నముల గుట్టలను పోసి బంగరు రసము పూసిన వస్త్రములను కప్పి దానము చేసెను.

కాలేన స్నానశౌచాభ్యాం సంస్కారైస్తపసేజ్యయా ।
శుధ్యంతి దానైస్సంతుష్ట్యా ద్రవ్యాణ్యాత్మాఽఽత్మవిద్యయా ।। 4

కాలేన - కాలముచే, స్నానశౌచాభ్యామ్ - స్నానముచే శౌచముచే, సంస్కారైః - సంస్కారములచే, తపసా - తపస్సుచే, ఇజ్యయా - యాగముచే, దానైః - దానములచే, సంతుష్ట్యా - సంతోషముచే, ద్రవ్యాణి - ద్రవ్యములు, శుధ్యంతి - శుద్ధిని పొందును, ఆత్మా - జీవుడు, ఆత్మవిద్యయా - ఆత్మవిద్యచే.

కాలముచే మట్టి ఉన్న నీరు, స్నానముచే దేహము, ఉతుకుటచే వస్త్రము, గర్భాధానాది సంస్కారములచే గర్భము మొదలైనవి, తపస్సుచే ఇంద్రియములు, యాగముచే బ్రాహ్మణుడు, దానములచే ధనము, సంతోషముచే మనస్సు అనే ద్రవ్యములు శుద్ధములగును. జీవుడు ఆత్మవిద్యచే పరిశుద్ధుడగును.

సౌమంగల్యగిరో విప్రాస్సూతమాగధవందినః ।
గాయకాశ్చ జగుర్నేదుర్భేర్యో దుందుభయో ముహుః ।। 5

విప్రాః - వేదవేత్తలు, సూతమాగధవందినః - పౌరాణికులు మాగధులు వందులు, సౌమంగల్యగిరః - సుమంగళమును ఆశాసించే వాక్కులు

గలవారు, గాయకాః చ - పాటగాళ్ళు కూడ, జగుః - గానము చేసిరి, భేర్యః - భేరీలు, దుందుభయః - దుందుభులు, ముహుః - మాటిమాటికీ, నేదుః - మ్రోగినవి.

వేదవేత్తలు, పౌరాణికులు, మాగధులు (వంశమును కీర్తించువారు), వందులు (సందర్భమునకు తగ్గట్లుగా స్తుతించువారు) చక్కని మంగళవచనములను పలికిరి. పాటగాళ్ళు కూడ పాడిరి. భేరీలు, దుందుభులు మ్రోగినవి.

వ్రజస్సంమృష్టసంసిక్తద్వారాజిరగృహాంతరః ।
చిత్రధ్వజపతాకాస్రక్చైలపల్లవతోరణైః ॥ 6

వ్రజః - గొల్లపల్లె, సంమృష్టసంసిక్తద్వార-అజిరగృహ-అంతరః - అలికి బాగా చల్లిన ద్వారములు వాకిళ్ళు ఇంటి మధ్యభాగములు గలది, చిత్రధ్వజపతాకాస్రక్-చైలపల్లవతోరణైః - రంగురంగుల టెక్కెములు జెండాలు మాలల వస్త్రముల చిగుళ్ల తోరణములతో (అలంకరించబడెను).

నందవ్రజములోని జనులు ఇళ్ల ద్వారములను, వాకిళ్లను, మధ్యభాగములను అలికి పన్నీరు చల్లిరి. ఇళ్లను రంగురంగుల టెక్కెములతో, జెండాలతో అలంకరించి, పుష్పమాలలను వస్త్రములను చిగుళ్ల మాలలను తోరణములుగా కట్టిరి.

గావో వృషా వత్సతరా హరిద్రాతైలరూషితాః ।
విచిత్రధాతుబర్హస్రగ్వస్త్రకాంచనమాలినః ॥ 7

గావః - ఆవులు, వృషాః - ఎద్దులు, వత్సతరాః - ఎదిగిన దూడలు, హరిద్రాతైలరూషితాః - పసుపు నూనె పూయబడినవి, విచిత్రధాతుబర్హస్రగ్-వస్త్రకాంచనమాలినః - రంగురంగుల రాతిరంగులు నెమలి పింఛముల మాలలు వస్త్రములు బంగరు గొలుసులు గలవి.

ఆవులకు, ఎద్దులకు, ఎదిగిన దూడలకు పసుపు కలిపిన నువ్వుల నూనె పూసిరి. రంగురంగుల రాతి రంగులు, నెమలి పింఛముల మాలలు, వస్త్రములు, బంగరు గొలుసులతో వాటిని అలంకరించిరి.

మహార్హవస్త్రాభరణకంచుకోష్ణీషభూషితాః ।
గోపాస్సమాయయుః రాజన్నానోపాయనపాణయః ॥ 8

రాజన్ - ఓ పరీక్షిన్మహారాజా!, మహా-అర్హవస్త్ర-ఆభరణకంచుక-ఉష్ణీష భూషితాః - మిక్కిలి విలువైన వస్త్రములచే ఆభరణములచే చొక్కాలచే తలపాగలచే అలంకరించబడిన, గోపాః - గోపాలకులు, ఉపాయనపాణయః - బహుమతులు చేతులయందున్నవారై, సమ్-ఆయయుః - విచ్చేసిరి.

ఓ రాజా! గోపాలకులు మిక్కిలి విలువైన వస్త్రములను, చొక్కాలను, తలపాగలను దాల్చి, ఆభరణములతో అలంకరించుకొనిరి. వారు చేతులలో బహుమతులను పట్టుకొని విచ్చేసిరి.

గోపాశ్చాకర్ణ్య ముదితా యశోదాయాస్సుతోద్భవమ్ ।
ఆత్మానం భూషయాంచక్రుర్వస్త్రాకల్పాంజనాదిభిః ॥ 9

గోపాః చ - గోపికలు కూడ, యశోదాయాః - యశోదకు, సుత-ఉద్భవమ్ - కొడుకు పుట్టుటను గురించి, ఆకర్ణ్య - విని, ముదితాః - ఆనందించినవారై, ఆత్మానమ్ - తనను, వస్త్ర-ఆకల్ప-అంజన-ఆదిభిః - వస్త్రములు నగలు కాటుక మొదలగువాటితో, భూషయాంచక్రుః - అలంకరించుకొనిరి.

గోపికలు కూడ యశోదకు కొడుకు పుట్టినాడని విని ఆనందించిరి. వారు కొత్త వస్త్రములను దాల్చి కాటుక దిద్దుకొని నగలు పెట్టుకొని చందనాదులతో తమను తాము అలంకరించుకొనిరి.

నవకుంకుమకింజల్కముఖపంకజభూతయః ।
బలిభిస్త్వరితం జగ్ముః పృథుశ్రోణ్యశ్చలత్కుచాః ॥ 10

నవకుంకుమకింజల్కముఖపంకజభూతయః - కొత్త కుంకుమ అనే పుప్పొడితో ముఖములనే పద్మములయందు శోభ గలవారు, పృథుశ్రోణ్యః - విశాలమైన నితంబములు గలవారు, చలత్-కుచాః - కదలాడే వక్షోజములు గల గోపికలు, బలిభిః - బహుమతులతో, త్వరితమ్ - వేగముగా, జగ్ముః - వెళ్లిరి.

అతిశయించిన సౌందర్యము గల గోపికలు తమ పద్మములవంటి ముఖములపై అలంకరించుకున్న కొత్త కుంకుమ పుప్పొడి శోభను కలిగి యుండెను. వారు బహుమతులతో తొందరగా యశోద యింటికి వెళ్లిరి.

గోప్యస్సుమృష్టమణికుండలనిష్కకంఠ్యః
చిత్రాంబరాః పథి శిఖాచ్యుతమాల్యవర్షాః ।
నందాలయం సవలయా వ్రజతీర్విరేజుః
వ్యాలోలకుండలపయోధరహారశోభాః ॥ 11

సుమృష్టమణికుండలనిష్కకంఠ్యః - మిక్కిలి స్వచ్ఛమైన మణుల కుండలములు గలవారు పదకములు మెడలయందు గలవారు, చిత్ర-అంబరాః - రంగు రంగుల కోకలు గలవారు, పథి - మార్గమునందు, శిఖాచ్యుతమాల్యవర్షాః - జుట్టుముడులనుండి జారిన పుష్పమాలల వర్షము గలవారు, వ్యాలోలకుండలపయోధరహారశోభాః - మిక్కిలి కదలాడుచున్న కుండలముల మరియు వక్షోజములయందలి హారముల శోభలు గలవారు, సవలయాః - కంకణములతో కూడిన గోపికలు, నంద-ఆలయమ్ - నందుని గృహమును గురించి, వ్రజతీః - వెళ్లుచున్నవారై, విరేజుః - అధికముగా ప్రకాశించిరి.

గోపికలు స్వచ్ఛమైన మణుల కుండలములను, మెడలయందు మణుల పదకములను ధరించిరి. వారు రంగు రంగుల కోకలను దాల్చి నందుని ఇంటికి వెళ్తూ ఉంటే వారి జుట్టుముడులనుండి జారిన మాలల వర్షములు మార్గముపై పడుచుండెను. అధికముగా కదలాడే కుండలములతో, వక్షోజములయందలి హారములతో, కంకణములతో వారు విశేషముగా ప్రకాశించిరి.

తా ఆశిషః ప్రయుంజానాశ్చిరం పాహీతి బాలకే ।
హరిద్రాచూర్ణతైలాద్భిస్సించంత్యో జనముజ్జగుః ॥ 12

తాః - ఆ గోపికలు, చిరమ్ - చాలకాలము, పాహి - రక్షించుము. ఇతి - అని, బాలకే - పిల్లవానియందు, ఆశిషః - ఆశీస్సులను, ప్రయుంజానాః - ప్రయోగించువారై, హరిద్రాచూర్ణతైల-అద్భిః - పసుపు పొడి నూనె గల

నీళ్లతో, జనమ్ - జనమును, సించంత్యః - చల్లుచున్నవారై, ఉజ్జగుః - బిగ్గరగా గానము చేసిరి.

ఆ గోపికలు, ఓ ఈశ్వరా! చాలకాలము ఈ పిల్లవానిని రక్షించుము, అని ఆశీస్సులను పలుకుచుండిరి. వారు పసుపు పొడి, నూనె కలిపిన నీటిని జనముపై చల్లుతూ బిగ్గరగా పాటలను పాడిరి.

అవాద్యంత విచిత్రాణి వాదిత్రాణి మహోత్సవే ।
కృష్ణే విశ్వేశ్వరేఽనంతే నందస్య వ్రజమాగతే ।। 13

విశ్వ-ఈశ్వరే - జగత్తును నియమించునట్టియు, అనంతే - కాలాతీతుడైన, కృష్ణే - నల్లనయ్య, నందస్య - నందుని, వ్రజమ్ - గొల్లపల్లెను గురించి, ఆగతే - రాగా, మహా-ఉత్సవే - పెద్ద ఉత్సవమునందు, విచిత్రాణి - రంగు రంగుల, వాదిత్రాణి - వాద్యములు, అవాద్యంత - మ్రోయించబడెను.

జగన్నియామకుడు, కాలాతీతుడు అగు శ్రీహరి నల్లనివాడై నందగోకులమునందవతరించగా పెద్ద ఉత్సవము జరిగెను. వారు రంగు రంగుల వాద్యములను మ్రోయించిరి.

గోపాః పరస్పరం హృష్టా దధిక్షీరఘృతాంబుభిః ।
ఆసించంతో విలింపంతో నవనీతైశ్చ చిక్షిపుః ।। 14

హృష్టాః - హర్షితులైన, గోపాః - గోపాలకులు, పరస్పరమ్ - ఒకరినొకరు, క్షీరఘృత-అంబుభిః - పెరుగు పాలు నెయ్యి నీళ్లతో, ఆసించంతః - చల్లుచున్నవారు, నవనీతైః చ - వెన్నలతో కూడ, విలింపంతః - పూయుచున్నవారు, దధి - పెరుగును, చిక్షిపుః - విసరిరి.

హర్షితులైన గోపాలకులు ఒకరిపైనొకరు పాలను, నేతిని, నీళ్లను చల్లి, వెన్నలను పూసి, పెరుగును విసరుకొనిరి.

నందో మహామనాస్తేభ్యో వాసోఽలంకారగోధనమ్ ।
సూతమాగధవందిభ్యో యేఽన్యే విద్యోపజీవినః ।। 15

మహామనాః - పెద్ద మనసు గల, నందః - నందుడు, తేభ్యః - వారి కొరకు, సూతమాగధవందిభ్యః - పౌరాణికులు వంశమును కీర్తించువారు స్తుతించువారల కొరకు, వాసః-అలంకారగోధనమ్ - వస్త్రములను ఆభరణములను గోవులను ధనమును, అన్యే - ఇతరులైన, యే - ఎవరైతే, విద్యా-ఉపజీవినః - విద్యలే బ్రదుకు దెరువుగా గలవారో.

పెద్ద మనసు గల నందుడు ఆ గోపీగోపాలకులకు, పౌరాణికులకు, వంశమును కీర్తించువారలకు, స్తుతిపాఠకులకు, ఇంకా ఇతరులెవరైతే సంగీతాది విద్యలే బ్రదుకు దెరువుగా గలవారో వారికి, వస్త్రములను, ఆభరణములను, గోవులను, ధనమును ఇచ్చెను.

తైస్తైః కామైరదీనాత్మా యథోచితమపూజయత్ ।
విష్ణోరారాధనార్థాయ స్వపుత్రస్యోదయాయ చ ॥ 16

అదీన-ఆత్మా - దైన్యము లేని మనస్సు గల నందుడు, విష్ణోః - శ్రీహరియొక్క, ఆరాధన-అర్థాయ - ఆరాధించుట అనే ప్రయోజనము కొరకు, స్వపుత్రస్య - తన పుత్రుని, ఉదయాయ చ - అభివృద్ధి కొరకు కూడ, తైః తైః - ఆయా, కామైః - భోగ్యములచే, యథా-ఉచితమ్ - యోగ్యతకు తగ్గట్లుగా, అపూజయత్ - పూజించెను.

దైన్యమునెరుగని మనస్సు గల నందుడు శ్రీహరిని ఆరాధించుట అనే ప్రయోజనము మరియు తన పుత్రుని అభివృద్ధి సిద్ధించుటకై, జనులకు వారి యోగ్యతకు తగ్గట్లుగా వివిధములగు భోగ్యములనిచ్చి పూజించెను.

రోహిణీ చ మహాభాగా నందగోపాభినందితా ।
వ్యచరద్దివ్యవాసస్స్రక్కంఠాభరణభూషితా ॥ 17

మహాభాగా - గొప్ప భాగ్యము గలది, నందగోప-అభినందితా - నందునిచే గోపాలకులచే అభినందించబడినది అగు, రోహిణీ చ - రోహిణి కూడ, దివ్యవాసః-స్రక్-కంఠ-ఆభరణభూషితా - దివ్యమైన వస్త్రము మాల కంఠాభరణములచే అలంకరించబడినదై, వ్యచరత్ - ఇటునటు తిరిగెను.

రోహిణి భాగ్యము గొప్పది. ఆమెను (ఆమె పుత్రుని) నందుడు, గోపాలకులు అభినందించిరి. ఆమె దివ్యమైన వస్త్రమును దాల్చి, మాలలను ముడిచి, కంఠాభరణమునలంకరించుకొని ఇటునటు తిరిగెను.

తత ఆరభ్య నందస్య వ్రజస్సర్వసమృద్ధిమాన్ ।
హరేర్నివాసాత్మగుణై రమాఽఽక్రీడమభూన్నృప ॥ 18

నృప - ఓ పరీక్షిన్మహారాజా!, తతః - అప్పటినుండి, ఆరభ్య - మొదలుపెట్టి, నందస్య - నందరాజుయొక్క, వ్రజః - గొల్లపల్లె, సర్వసమృద్ధిమాన్ - సకలసంపదలు గలది, హరేః - శ్రీహరియొక్క, నివాస-ఆత్మగుణైః - నివాసముచే తన గుణములతో, రమా-ఆక్రీడమ్ - లక్ష్మీదేవికి విహారస్థానము, అభూత్ - ఆయెను.

ఓ రాజా! ఆ నాటినుండి నందుని గోకులము సకలసంపదలకు నెలవై తనదైన సౌందర్యాది గుణములతో విలసిల్లెను. శ్రీహరి నివసించుటచే ఆ పల్లె లక్ష్మీదేవికి విహారస్థానమాయెను.

గోపాన్ గోకులరక్షాయాం నిరూప్య మథురాం గతః ।
నందః కంసస్య వార్షిక్యం కరం దాతుం కురూద్వహ ॥ 19

కురు-ఉద్వహ - కురవంశశ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా!, నందః - నందుడు, గోపాన్ - గోపాలకులను, గోకులరక్షాయామ్ - గోకులముయొక్క రక్షణయందు, నిరూప్య - ఆదేశించి, కంసస్య - కంసునకు, వార్షిక్యమ్ - ప్రతి సంవత్సరము కట్టవలసిన, కరమ్ - కప్పమును, దాతుమ్ - జమ కట్టుటకు, మథురామ్ - మథురా నగరమును గురించి, గతః - వెళ్లినవాడు.

కురవంశశ్రేష్ఠుడవగు ఓ రాజా! నందుడు గోకులమును రక్షిస్తూ ఉండుడని గోపాలకులకు ఆదేశములనిచ్చి, కంసునకు ప్రతి సంవత్సరము కట్టవలసిన పన్నును కట్టుటకై మథురానగరమునకు వెళ్లెను.

వసుదేవ ఉపశ్రుత్య భ్రాతరం నందమాగతమ్ ।
జ్ఞాత్వా దత్తకరం రాజ్ఞే యయౌ తదవమోచనమ్ ॥ 20

భ్రాతరమ్ - సోదరుడైన, నందమ్ - నందుని, ఆగతమ్ - వచ్చినవానినిగా, ఉపశ్రుత్య - విని, రాజ్ఞే - రాజు కొరకు, దత్తకరమ్ - కట్టబడిన పన్ను గలవానినిగా, జ్ఞాత్వా - తెలిసి, తద్-అవమోచనమ్ - ఆయన బళ్లను విప్పుకుని ఆగిన డేరాను గురించి, యయౌ - వెళ్లెను.

వసుదేవుడు సోదరుడగు నందుడు వచ్చినాడని వినెను. ఆయన కంసరాజునకు పన్ను కట్టినాడని కూడ తెలిసెను. అపుడాయన నందుడు బళ్లను విప్పుకుని నివసించిన డేరాకు వెళ్లెను.

తం దృష్ట్వా సహసోత్థాయ దేహః ప్రాణమివాగతమ్ ।
ప్రీతః ప్రియతమం దోర్భ్యాం సస్వజే ప్రేమవిహ్వలః ॥ 21

ప్రియతమమ్ - మిక్కిలి ప్రియుడైన, తమ్ - ఆ వసుదేవుని, దృష్ట్వా - చూచి, ప్రీతః - ఆనందించిన నందుడు, ఆగతమ్ - వచ్చిన, ప్రాణమ్ - ప్రాణమును, దేహః ఇవ - దేహము వలె, సహసా - వెంటనే, ఉత్థాయ - పైకి లేచి, ప్రేమవిహ్వలః - ప్రేమతో వ్యాకులుడై, దోర్భ్యామ్ - రెండు చేతులతో, సస్వజే - కౌగిలించెను.

నందునకు వసుదేవుడు మిక్కిలి ప్రియమైనవాడు. ప్రాణము తిరిగి రాగా దేహము నిలబడునట్లుగా, ఆయన వసుదేవుని చూచి ప్రేమతో వ్యాకులుడై వెంటనే లేచి నిలబడెను. నందుడాయనను రెండు చేతులతో కౌగిలించెను.

పూజితస్సుఖమాసీనః పృష్ట్వాఽనామయమాదృతః ।
ప్రసక్తధీస్స్వాత్మజయోరిదమాహ విశాం పతే ॥ 22

విశాం పతే - ఓ పరీక్షిన్నృపతీ!, పూజితః - పూజించబడినవాడు, సుఖమ్ - సుఖముగా, ఆసీనః - కూర్చున్నవాడు, ఆదృతః - ఆదరించబడినవాడు, స్వ-ఆత్మజయోః - తన పుత్రులిద్దరియందు, ప్రసక్తధీః - గట్టిగా తగుల్కొన్న బుద్ధి గల వసుదేవుడు, అనామయమ్ - క్షేమమును గురించి, పృష్ట్వా - అడిగి, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

ఓ నృపతీ! నందుడు వసుదేవుని సాదరముగా సత్కరించెను. ఆయన సుఖముగా కూర్చుండి క్షేమసమాచారమునడిగెను. ఆయన మనస్సు తన ఇద్దరు పుత్రులపైననే లగ్నమై యుండెను. ఆయన నందునితో నిట్లనెను.

దిష్ట్యా భ్రాతః ప్రవయస ఇదానీమప్రజస్య తే ।
ప్రజాఽఽశాయా నివృత్తస్య ప్రజా యత్సమపద్యత ॥ 23

భ్రాతః - సోదరా!, ప్రవయసః - పెద్ద వయసు ఉన్నట్టియు, అప్రజస్య - సంతానము లేనట్టియు, ప్రజా-ఆశాయాః - సంతానముయొక్క ఆశనుండి, నివృత్తస్య - వెనుదిరిగిన, తే - నీకు, ఇదానీమ్ - ఇప్పుడు, ప్రజా - సంతానము, సమపద్యత - కలిగెను అనేది, యత్ - ఏది గలదో అది, దిష్ట్యా - మంగళము.

ఓ సోదరా! నీది పెద్ద వయస్సు. నీకు సంతానము లేకుండెను. సంతానము కలుగననే ఆశయైననూ నీనుండి తొలగిపోయెను. అట్టి నీకు ఇప్పుడు సంతానము కలిగెననేది యేది గలదో, అది మంగళము.

దిష్ట్యా సంసారచక్రేఽస్మిన్వర్తమానః పునర్భవః ।
ఉపలబ్ధో భవానద్య దుర్లభం ప్రియదర్శనమ్ ॥ 24

అస్మిన్ - ఈ, సంసారచక్రే - సంసారమనే చక్రమునందు, వర్తమానః - ఉంటున్న, భవాన్ - నీవు, అద్య - ఈనాడు, పునః-భవః - మరల పుట్టినవాడవై, ఉపలబ్ధః - చూడబడితివి, దిష్ట్యా - మంగళము, ప్రియదర్శనమ్ - ప్రియమిత్రుని చూచుట, దుర్లభమ్ - దుర్లభము.

ఈ సంసారమండలము (సమాజజీవితము) నందుండే నీవు మరల పుట్టినావా యన్నట్లు ఈనాడు (కారాగారములో మ్రగ్గిన) నా కంట బడితివి. ఇది మంగళము. ప్రియమిత్రుని చూచుట దుర్లభము.

నైకత్ర ప్రియ సంవాసస్సుహృదాం చిత్రకర్మణామ్ ।
ఓఘేన వ్యూహమానానాం ప్లవానాం స్రోతసో యథా ॥ 25

ప్రియ - ఓ మిత్రమా!, చిత్రకర్మణామ్ - నానావిధములైన కర్మలు గల, సుహృదామ్ - మిత్రులకు, స్రోతసః - నదియొక్క, ఓఘేన - ప్రవాహము

చే, వ్యూహమానానామ్ - తీసుకుపోబడుచున్న, ప్లవానాం యథా - కట్టెలకు వలె, ఏకత్ర - ఒకచోట, సంవాసః - కలిసి ఉండుట, న - లేదు.

ఓ మిత్రమా! నదీప్రవాహముచే కొట్టుకుపోబడే కట్టెలకు కలిసి ఉండుట సంభవము కాదు. అదే విధముగా, నానావిధములైన కర్మలు గల మిత్రులకు కూడ ఒకే చోట ప్రేమతో కలిసి ఉండుట ఘటిల్లదు.

కచ్చిత్పశవ్యం నిరుజం భూర్యంబుతృణవీరుధమ్ ।
బృహద్వనం తదధునా యత్రాస్సే త్వం సుహృద్వృతః ॥ 26

తత్ - ఆ, బృహత్ - పెద్ద, వనమ్ - అడవి, అధునా - ఇప్పుడు, పశవ్యమ్ - పశువులకు హితకరమైనది, నిరుజమ్ - రోగములు లేనిది, భూరి-అంబుతృణవీరుధమ్ - అధికమగు నీరు గడ్డి తీగలు గలది, కచ్చిత్ - అగునా?, యత్ర - ఎక్కడనైతే, త్వమ్ - నీవు, సుహృద్-వృతః - మిత్రులతో కూడినవాడవై, ఆస్సే - నివసించుచున్నావో.

ఎక్కడనైతే నీవు మిత్రులతో గూడి నివసించుచున్నావో, ఆ పెద్ద అడవి ఇప్పుడు పశువులకు హితకరముగా ఉన్నదా? పశువులకు, జనులకు రోగములు లేవు గదా? నీరు, గడ్డి, తీగలు సమృద్ధిగా ఉన్నాయా?

భ్రాతర్మమ సుతః కచ్చిన్మాత్రా సహ భవద్వ్రజే ।
తాతం భవంతం మన్వానో భవద్భ్యాముపలాలితః ॥ 27

భ్రాతః - ఓ సోదరా!, మమ - నా, సుతః - పుత్రుడు, భవద్-వ్రజే - నీ గొల్లపల్లెలో, మాత్రా సహ - తల్లితో గూడి, భవంతమ్ - నిన్ను, తాతమ్ - తండ్రినిగా, మన్వానః - తలపోయువాడై, భవద్భ్యామ్ - మీ యిద్దరిచే, కచ్చిత్ ఉపలాలితః - లాలన చేయబడుచున్నాడా?

ఓ సోదరా! నా కొడుకు తల్లితో గూడి నీ గోకులమునందున్నాడు. ఆతడు నిన్ను తండ్రినిగా భావించుచున్నాడా? నీవు, యశోద ఆ బాలకుని లాలించుచున్నారా?

పుంసస్త్రివర్గో విహితస్సుహృదో హ్యనుభావితః ।
న తేషు క్లిశ్యమానేషు త్రివర్గోఽర్థాయ కల్పతే ॥ 28

హి - ఏలయనగా, పుంసః - వ్యక్తికి, సుహృదః - బంధువులనుద్దేశించి, అనుభావితః - సంపాదించబడిన, త్రివర్గః - ధర్మార్థకామముల సముదాయము, విహితః - విధించబడినది (యోగ్యము) గదా!, తేషు - ఆ బంధువులు, క్లిశ్యమానేషు - కష్టపడుచుండగా, త్రివర్గః - ధర్మార్థ కామముల సముదాయము, అర్థాయ - సుఖము కొరకు, న కల్పతే - సమర్థము కాదు.

బంధువులనుద్దేశించి సంపాదించబడిన ధర్మార్థకామములనే త్రివర్గము మాత్రమే మనిషికి యుక్తము, శాస్త్రవిహితము. భార్యాపుత్రాదిబంధువులు కష్టపడుచుండగా, వ్యక్తి సంపాదించిన ధర్మాదులు సుఖమునీయలేవు.

నంద ఉవాచ ।
అహో తే దేవకీపుత్రాః కంసేన బహవో హతాః ।
ఏకాఽవశిష్టాఽవరజా కన్యా సాఽపి దివం గతా ॥ 29

అహో - అయ్యో!, తే - నీ, దేవకీపుత్రాః - దేవకియొక్క పుత్రులు, బహవః - అనేకులు, కంసేన - కంసునిచే, హతాః - చంపబడిరి, ఏకా - ఒక్క, కన్యా - అమ్మాయి, అవరజా - అందరికంటె చిన్నది, సా అపి - ఆమె కూడ, దివమ్ - స్వర్గమును, గతా - పొందినది.

నందుడు ఇట్లు పలికెను -- అయ్యో! నీకు దేవకికి పుట్టిన అనేకపుత్రులను కంసుడు తన పొట్టన పెట్టుకొనెను. అందరికంటె చిన్నదైన ఒక్క అమ్మాయి కూడ స్వర్గమును చేరినది.

నూనం హ్యదృష్టనిష్ఠోఽయమదృష్టపరమో జనః ।
అదృష్టమాత్మనస్తత్త్వం యో వేద న స ముహ్యతి ॥ 30

అయమ్ - ఈ, జనః - మానవుడు, అదృష్టనిష్ఠః హి - ప్రారబ్ధకర్మయందు స్థితి గలవాడు గదా!, నూనమ్ - నిశ్చయము, అదృష్టపరమః - ప్రారబ్ధమే నియామకముగా గలవాడు, ఆత్మనః - తనయొక్క, తత్త్వమ్ - సుఖదుఃఖాదికారణమును, అదృష్టమ్ - ప్రారబ్ధకర్మనుగా, యః - ఎవడైతే, వేద - తెలియునో, సః - ఆతడు, న ముహ్యతి - వ్యామోహమును పొందడు.

ఈ మానవుని స్థితి నిశ్చయముగా ప్రారబ్ధకర్మయందు మాత్రమే గలదు గదా! మానవుని నియమించేది ప్రారబ్ధమే. తనకు సుఖదుఃఖాదిహేతువు ప్రారబ్ధకర్మయేనని తెలియువాడు సుఖదుఃఖాదులయందు వ్యామోహమును పొందడు.

వసుదేవ ఉవాచ ।
కరో వై వార్షికో దత్తో రాజ్ఞే దృష్టా వయం చ వః ।
నేహ స్థేయం బహుతిథం సంత్యుత్పాతాశ్చ గోకులే ॥ 31

రాజ్ఞే - రాజుకొరకు, వార్షికః - ప్రతిసంవత్సరము కట్టే, కరః వై - పన్నైతే, దత్తః - కట్టబడినది, వః - మీకు, వయం చ - మేము కూడ, దృష్టాః - కనబడితిమి, ఇహ - ఇచట, బహుతిథమ్ - చాల దినములు, న స్థేయమ్ - ఉండరాదు, గోకులే చ - గోకులమునందైతే, ఉత్పాతాః - అపశకునములు, సంతి - కలుగుచున్నవి.

వసుదేవుడిట్లు పలికెను --- రాజునకు ప్రతి ఏడాది కట్టే పన్నును కట్టితివి. నన్ను కూడ చూచితివి. ఇచట చాల రోజులు ఉండవద్దు. గోకులమునందు అపశకునములు కలుగుచున్నవి.

శ్రీశుక ఉవాచ ।
ఇతి నందాదయో గోపాః ప్రోక్తాస్తే శౌరిణా యయుః ।
అనోభిరనడుద్యుక్తైస్తమనుజ్ఞాప్య గోకులమ్ ॥ 32

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే పంచమోఽధ్యాయః ॥

ఇతి - ఈ విధముగా, శౌరిణా - శూరపుత్రుడగు వసుదేవునిచే, ప్ర-ఉక్తాః - చెప్పబడిన, తే - ఆ, నంద-ఆదయః - నందుడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు, తమ్ - ఆయనను, అనుజ్ఞాప్య - సెలవు తీసుకొని, అనడుద్-యుక్తైః - ఎద్దులతో పూన్చబడిన, అనోభిః - బళ్లతో, గోకులమ్ - గోకులమును గురించి, యయుః - వెళ్లిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శూరపుత్రుడగు వసుదేవుడు ఈ విధముగా చెప్పగా, నందుడు మొదలుగా గల ఆ గోపాలకులు ఆయన వద్ద సెలవు తీసుకొని, ఎద్దులు పూన్చిన బళ్లపై గోకులమునకు వెళ్లిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్ధములో శ్రీకృష్ణజననోత్సవమును వర్ణించే
ఐదవ అధ్యాయము ముగిసినది (5).

* * * * *

న యత్ర శ్రవణాదీని రక్షోఘ్నాని స్వకర్మసు ।
కుర్వంతి సాత్వతాం భర్తుర్యాతుధాన్యశ్చ యత్ర హి ॥ 3

యత్ర - ఎక్కడనైతే, స్వకర్మసు - తమ పనులయందు, రక్షః-ఘ్నాని - రాక్షసులను సంహరించే, సాత్వతామ్ - సత్త్వగుణప్రధానులగు భక్తులకు, భర్తుః - ప్రభువగు శ్రీహరియొక్క, శ్రవణ-ఆదీని - శ్రవణము మొదలైనవాటిని, న కుర్వంతి - చేయరో, యత్ర హి - ఎక్కడనైతే నిశ్చయముగా, యాతుధాన్యః - రాక్షసులు (ఉండెదరో).

సత్త్వగుణప్రధానులగు భక్తులకు ప్రభువు శ్రీహరి. ఆయన కీర్తిని వినుట, కీర్తించుట మొదలైనవి రాక్షసులను నశింపజేయును. ఎక్కడనైతే జనులు తమ పనులను చేసుకుంటూ ఆ శ్రీహరియొక్క కీర్తిని వినుట మొదలైనవి చేయరో, అక్కడనే నిశ్చయముగా రాక్షసులు ఉండెదరు.

సా ఖేచర్యేకదోపేత్య పూతనా నందగోకులమ్ ।
యోషిత్వా మాయయాऽऽత్మానం ప్రావిశత్కామచారిణీ ॥ 4

ఖేచరీ - ఆకాశమునందు సంచరించేది, కామచారిణీ - యథేచ్ఛగా సంచరించేది అగు, సా - ఆ, పూతనా - పూతన, ఏకదా - ఒకనాడు, నందగోకులమ్ - నందుని గోకులమును గురించి, ఉపేత్య - చేరుకొని, మాయయా - ఇంద్రజాలముచే, ఆత్మానమ్ - తనను, యోషిత్వా - సుందరియగు యువతిగా మార్చుకొని, ప్రావిశత్ - ప్రవేశించెను.

ఆ పూతన తనకు నచ్చిన రూపమును దాల్చి యథేచ్ఛగా ఆకాశమునందు సంచరించును. ఒకనాడామె నందుని గోకులమును చేరి, మాయచే తనను సుందరియగు యువతిగా మలచుకొని ప్రవేశించెను.

తాం కేశబంధవ్యతిషక్తమల్లికాం బృహన్నితంబస్తనకృచ్ఛ్రమధ్యమామ్
సువాససం కంపితకర్ణభూషణత్విషోల్లసత్కుంతలమండితాననామ్ ॥ 5

కేశబంధవ్యతిషిక్తమల్లికామ్ - జుట్టుముడియందు ముడవబడిన మల్లెల మాల కలిగినట్టియు, బృహత్-నితంబస్తనకృచ్ఛ్రమధ్యమామ్ - విశాలమైన కటిభాగము స్తనములు సన్నని నడుము కలిగినట్టియు, సువాససమ్ - మంచి చీర కలిగినట్టియు, కంపితకర్ణభూషణత్విషా - కదల్చబడిన చెవుల

ఆభరణముల కాంతిచే, ఉల్లసత్-కుంతలమండిత-ఆననామ్ - బాగా ప్రకాశించే ముంగురులచే అందముగా చేయబడిన ముఖము గల, తామ్ - ఆ పూతనను --.

విశాలమైన కటిభాగము, స్తనములు మరియు సన్నని నడుము గల ఆ పూతన చక్కని కోకను ధరించి, జుట్టుముడియందు మల్లెల మాలను తురిమెను. కర్ణాభరణములు కదలాడుచుండగా ఆ కాంతులచే ముంగురులు అధికముగా ప్రకాశించుటచే ఆమె ముఖము శోభిల్లెను.

వల్గుస్మితాపాంగవిసర్గవీక్షితైః
మనో హరంతీం వనితాం వ్రజౌకసామ్ ।
అమంసతాంభోజకరేణ రూపిణీం
గోప్యశ్శ్రియం ద్రష్టుమివాగతాం పతిమ్ ॥ 6

వల్గుస్మిత-అపాంగవిసర్గవీక్షితైః - రమ్యమైన చిరునవ్వు గల ప్రక్కచూపుల విసరుటలు గల చూపులతో, వ్రజ-ఓకసామ్ - గొల్లపల్లెయందుండే జనులయొక్క, మనః - మనస్సును, హరంతీమ్ - దోచుచున్నట్టియు, వనితామ్ - అనురాగమును కలిగించే ఆ యువతిని, అంభః-జకరేణ - పద్మముతో కూడిన చేతిచే, రూపిణీమ్ - రూపము కలిగినట్టియు, పతిమ్ - భర్తయగు శ్రీహరిని, ద్రష్టుమ్ - చూచుటకు, ఆగతామ్ - వచ్చినట్టి, శ్రియం ఇవ - లక్ష్మీదేవిని వలె, గోప్యః - గోపికలు, అమంసత - తలపోసిరి.

అనురాగమును కలిగించే ఆ యువతి అందమైన చిరునవ్వుతో ప్రక్కచూపులను విసురుతూ ఆ గొల్లపల్లెయందలి జనుల మనస్సును దోచివేయుచుండెను. చేతిలో పద్మము ఉండుటను బట్టి ఆమె తన భర్తయగు శ్రీహరిని చూచుటకై రూపు దాల్చి వచ్చిన లక్ష్మీదేవియా అన్నట్లు గోపికలు తలపోసిరి.

బాలగ్రహస్తత్ర విచిన్వతీ శిశూన్యదృచ్ఛయా నందగృహేఽసదంతకమ్।
బాలం ప్రతిచ్ఛన్ననిజోరుతేజసం దదర్శ తల్పేఽగ్నిమివాహితం భసి॥

తత్ర - ఆ గొల్లపల్లెయందు, శిశూన్ - పిల్లలను, విచిన్వతీ - వెదుకుచున్న, బాలగ్రహః - పిల్లలకు పిశాచమైన పూతన, యదృచ్ఛయా - అనుకోకుండా, నందగృహే - నందుని ఇంటియందు, తల్పే - శయ్యపై, అసద్-అంతకమ్ - దుష్టలను మట్టుబెట్టునట్టియు, ప్రతిచ్ఛన్ననిజ-ఉరుతేజసమ్ - కప్పివేయబడిన తనదైన గొప్ప తేజస్సు కలిగినట్టియు, భసి - బూడిదయందు, ఆహితమ్ - ఉంచబడిన, అగ్నిం ఇవ - అగ్నివలెనున్న, బాలమ్ - పిల్లవానిని, దదర్శ - చూచెను. 7

పూతన పిల్లలను హతమార్చే పిశాచము. ఆమె ఆ గోకులములో పిల్లలను వెదుకుచుండెను. ఆమెకు అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) నందుని ఇంట్లో శయ్యపై దుష్టులను మట్టుబెట్టే బుడతడు కనబడెను. ఆ బాలకృష్ణుడు తనదైన గొప్ప తేజస్సును దాచిపెట్టి, బూడిదయందు పెట్టిన నిప్పువలె నుండెను.

విబుధ్య తాం బాలకమారికాగ్రహం చరాచరాత్మాऽऽస నిమీలితేక్షణః ।
అనంతమారోపయదంకమంతకం యథోరగం సుప్తమబుద్ధిరజ్జుధీః ।। 8

తామ్ - ఆమెను, బాలకమారికాగ్రహమ్ - పిల్లలను మట్టుబెట్టే పిశాచమునుగా, విబుధ్య - గుర్తెరిగి, చర-అచర-ఆత్మా - స్థావరజంగమాత్మకమగు జగత్తునకు ఆత్మ (సారము) యైన శ్రీకృష్ణుడు, నిమీలిత-ఈక్షణః - మూయబడిన కన్నులు గలవాడై, ఆస - ఉండెను, అబుద్ధిరజ్జుధీః - తెలియనివాడై త్రాడని భావించువాడు, సుప్తమ్ - నిద్రించిన, ఉరగం యథా - పామును వలె, అనంతమ్ - కాలాతీతుడైనట్టియు, అంతకమ్ - సంహారకుడైన శ్రీకృష్ణుని, అంకమ్ - ఒడిని, ఆరోపయత్ - కూర్చుండబెట్టుకొనెను.

స్థావరజంగమాత్మకమగు జగత్తునకు శ్రీకృష్ణుడే ఆత్మ. పిల్లలను మట్టుబెట్టే ఆ పిశాచమును ఆ అనంతుడు గుర్తించి కళ్లు మూసుకొని యుండెను. పామని తెలియనివాడు త్రాడని భ్రమపడి నిద్రిస్తున్న పామును పట్టుకున్నట్లు, ఆమె అంతకుడగు కృష్ణుని ఒడిలో కూర్చుండబెట్టుకొనెను.

తాం తీక్ష్ణచిత్తామతివామచేష్టితాం వీక్ష్యాంతరా కోశపరిచ్ఛదాసివత్,
వరస్త్రియం తత్ప్రభయా చ ధర్షితే నిరీక్షమాణే జననీ హ్యతిష్ఠతామ్।

కోశపరిచ్ఛద-అసివత్ - ఒరచే కప్పివేయబడియున్న కత్తివలె, తీక్ష్ణచిత్తామ్ - క్రూరమైన చిత్తము కలిగినట్టియు, అతివామచేష్టితామ్ - మిక్కిలి అందమైన చేష్టలు కలిగిన, తామ్ - ఆ, వరస్త్రియమ్ - పుణ్యస్త్రీని, అంతరా - ఇంటి మధ్యయందు, వీక్ష్య - చూచి, జననీ - తల్లులిద్దరు, తత్-ప్రభయా - ఆమెయొక్క కాంతిచే, ధర్షితే చ - పరాభూతులు కూడ అయి, నిరీక్షమాణే హి - కేవలము చూచుచున్నవారై, అతిష్ఠతామ్ - నిలబడిరి. 9

ఒరలో దాచిపెట్టిన చురకత్తివలె ఆ పూతన క్రూరమైన చిత్తము గలదే ఐననూ మిక్కిలి అందమైన చేష్టలను చేస్తూ పుణ్యస్త్రీ వలె కనబడెను. ఇంటి మధ్యలో ఆమెను చూచి రోహిణీయశోదలిద్దరు తల్లులు ఆమె కాంతిచే అవాక్కయిపోయి కేవలము చూస్తూ నిలబడిరి.

తస్మిన్ స్తనం దుర్జరవీర్యముల్బణం
ఘోరాऽంకమాదాయ శిశోర్దదావథ ।
గాఢం కరాభ్యాం భగవాన్ప్రపీడ్య తత్-
ప్రాణైస్సమం రోషసమన్వితోऽపిబత్ ।। 10

తస్మిన్ - ఆ స్థానమునందు, ఘోరా - క్రూరురాలగు పూతన, అంకమ్ - ఒడిని గురించి, ఆదాయ - తీసుకొని, శిశోః - పిల్లవానికి, దుర్జరవీర్యమ్ - అరిగించుకొన శక్యము కాని విషశక్తి కలిగినట్టియు, ఉల్బణమ్ - భయంకరమైన, స్తనమ్ - స్తనమును, దదౌ - ఇచ్చెను, అథ - అప్పుడు, రోషసమన్వితః - కోపముతో కూడియున్న, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, కరాభ్యామ్ - రెండు చేతులతో, తత్ - ఆ స్తనమును, గాఢమ్ - గట్టిగా, ప్రపీడ్య - నొక్కి పట్టుకొని, ప్రాణైః సమమ్ - ప్రాణములతో సహా, అపిబత్ - త్రాగెను.

ఆ ఇంటి మధ్యలో క్రూరురాలగు పూతన పిల్లవానిని ఒడిలోనికి తీసుకొని పాలను త్రాగించెను. ఆమె స్తనము అరిగించుకొన శక్యము కాని

శక్తి గల విషముతో భయమును గొల్పెను. అప్పుడు శ్రీకృష్ణ భగవానుడు కోపించి ఆ స్తనమును రెండు చేతులతో గట్టిగా నొక్కి పట్టుకొని ప్రాణములతో సహా త్రాగివేసెను.

సా ముంచ ముంచాలమితి ప్రభాషిణీ
నిష్పీడ్యమానాఽఖిలజీవమర్మణి ।
వివృత్య నేత్రే చరణౌ భుజౌ ముహుః
ప్రస్విన్నగాత్రా క్షిపతీ రురోద హ ॥ 11

అఖిలజీవమర్మణి - సకలములైన జీవుని మర్మస్థానములయందు, నిష్పీడ్యమానా - అధికముగా పీడించబడిన, సా - ఆమె, ముంచ - విడువుము, ముంచ - విడువుము, అలమ్ - చాలును, ఇతి - అని, ప్రభాషిణీ - బిగ్గరగా పలుకుచున్నదై, నేత్రే - రెండు కళ్లను, వివృత్య - విప్పార్చి, చరణౌ - రెండు కాళ్లను, భుజౌ - రెండు చేతులను, ముహుః - మరల మరల, క్షిపతీ - విసురుచున్నదై, ప్రస్విన్నగాత్రా - చెమటతో తడిసి ముద్దైన దేహము గలదై, రురోద హ - ఏడ్చెను.

జీవశక్తియొక్క మర్మస్థానములన్నింటియందు అధికముగా పీడను పొందిన ఆ పూతన, విడువుము, విడువుము, చాలు అంటూ, బిగ్గరగా పలికెను. ఆమె రెండు కళ్లను తేలవేసి, చేతులను కాళ్లను కొట్టుకుంటూ ఆర్తనాదము చేసెను. ఆమె దేహమంతా చెమటతో తడిసి ముద్దయ్యెను.

తస్యాస్స్వనేనాతిగభీరరంహసా సాద్రిర్మహీ ద్యౌశ్చ చచాల సగ్రహా ।
రసా దిశశ్చ ప్రతినేదిరే జనాః పేతుః క్షితౌ వజ్రనిపాతశంకయా ॥ 12

అతిగభీరరంహసా - చాల ఎక్కువ వేగము గల (మిక్కిలి భయంకరమైన), తస్యాః - ఆమెయొక్క, స్వనేన - ధ్వనిచే, స-అద్రిః - పర్వతములతో కూడిన, మహీ - భూలోకము, సగ్రహా - గ్రహములతో కూడిన, ద్యౌః చ - ద్యులోకము కూడ, రసాః చ - క్రింది లోకములు కూడ, చచాల - కదిలిపోయెను, దిశః - దిక్కులు, ప్రతినేదిరే - మారు మ్రోగినవి, జనాః - జనులు, వజ్రనిపాతశంకయా - పిడుగు పడినదనే భయముతో, క్షితౌ - నేలపై, పేతుః - పడిరి.

ఆమెయొక్క మహావేగము గల భయంకరధ్వనిచే పర్వతములతో సహా భూలోకము, గ్రహములతో సహా ద్యులోకము, క్రింది లోకములు కూడ కదలాడి పోయినవి. దిక్కులు మారు మ్రోగినవి. పిడుగు పడినదనే భయముతో జనులు నేలపై బడిరి.

నిశాచరీత్థం వ్యథితస్తనా వ్యసుర్వ్యాదాయ కేశాంశ్చరణౌ భుజావపి,
ప్రసార్య గోష్ఠే నిజరూపమాస్థితా వజ్రాహతో వృత్ర ఇవాపతన్నృప। 13

నృప - ఓ రాజా!, ఇత్థమ్ - ఈ విధముగా, వ్యథితస్తనా - పీడించబడిన స్తనము గల, నిశాచరీ - రాక్షసి, వి-అసుః - పోయిన ప్రాణములు గలదియై, వ్యాదాయ - నోరు వెళ్లబెట్టి, కేశాన్ - కేశములను, చరణౌ - రెండు కాళ్లను, భుజౌ అపి - చేతులను కూడ, ప్రసార్య - చాపి, నిజరూపమ్ - తనదైన రూపమును, ఆస్థితా - పొందినదై, గోష్ఠే - గొల్లపల్లెయందు, వజ్ర-ఆహతః - వజ్రముచే కొట్టబడిన, వృత్రః ఇవ - వృత్రాసురుడు వలె, అపతత్ - పడెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా స్తనమునందు పీడించబడిన రాక్షసికి ప్రాణములు పోయెను. ఆమె నోరు వెళ్లబెట్టి, జుట్టు విరబోసుకొని, చేతులను కాళ్లను కూడ చాపి, వజ్రముతో కొట్టబడిన వృత్రాసురుడు వలె, తన వాస్తవరూపముతో గొల్లపల్లెకు బయట పడిపోయెను.

పతమానోఽపి తద్దేహస్త్రిగవ్యూత్యంతరద్రుమాన్ ।
చూర్ణయామాస రాజేంద్ర మహదాసీత్తదద్భుతమ్ ॥ 14

రాజేంద్ర - ఓ రాజరాజా!, పతమానః - పడుచున్న, తద్-దేహః - ఆమెయొక్క శరీరము, త్రిగవ్యూతి-అంతరద్రుమాన్ - మూడు గవ్యూతుల లోపలి చెట్లను, చూర్ణయామాస - నుగ్గు చేసెను, తత్ - అది, మహత్ - పెద్ద, అద్భుతమ్ - అద్భుతము, ఆసీత్ - ఆయెను.

ఓ రాజరాజా! ఆమె దేహము క్రింద పడుతూ ఆరు క్రోసుల దూరము వరకు ఉన్న చెట్లను నుగ్గు చేసెను. అది గొప్ప ఆశ్చర్యమును కలిగించెను.

ఈషామాత్రోగ్రదంష్ట్రాస్యం గిరికందరనాసికమ్ ।
గండశైలస్తనం రౌద్రం ప్రకీర్ణారుణమూర్ధజమ్ ॥ 15

ఈషామాత్ర-ఉగ్రదంష్ట్రా-ఆస్యమ్ - నాగలి చాలు పరిమాణము గల భయంకరమైన కోరలు గల ముఖము కలిగినట్టియు, గిరికందరనాసికమ్ - కొండ గుహవంటి ముక్కులు కలిగినట్టియు, గండశైలస్తనమ్ - కొండనుండి జారిపడిన బండరాళ్లవంటి స్తనములు కలిగినట్టియు, రౌద్రమ్ - భయమును గొల్పునట్టియు, ప్రకీర్ణ-అరుణమూర్ధజమ్ - విరబోసిన ఎర్రని కేశములు గల (దేహమును చూచిరి).

ఆమె దేహము భయమును గొల్పుచుండెను. ఆమె నోరు నాగలి చాలు పరిమాణము గల కోరలతో భీతిల్లజేయుచుండెను. ఆమె ముక్కు పుటములు కొండగుహలను, స్తనములు కొండనుండి జారిపడిన బండరాళ్లను పోలియుండెను. ఆమె ఎర్రని జుట్టు విరబోసి యుండెను.

అంధకూపగభీరాక్షం పులినారోహభీషణమ్ ।
బద్ధసేతుభుజోర్వంఘ్రి శూన్యతోయహ్రదోదరమ్ ॥ 16

అంధకూపగభీర-అక్షమ్ - చీకటి నూతులవలె లోతైన కన్నులు కలిగినట్టియు, పులిన-ఆరోహభీషణమ్ - ఇసుకతిన్నెలవంటి పిరుదులతో భయమును గొల్పునట్టియు, బద్ధసేతుభుజ-ఊరు-అంఘ్రిమ్ - కట్టబడిన సేతువులవంటి చేతులు తొడలు కాళ్లు కలిగినట్టియు, శూన్యతోయహ్రద-ఉదరమ్ - నీరు లేని సరస్సువంటి పొట్ట గల (దేహమును చూచిరి).

ఆ దేహమునందు కన్నులు చీకటి నూతులవలె లోతుగా నుండెను. ఇసుకతిన్నెలవంటి పిరుదులు భీతిని గొల్పుచుండెను. చేతులు, తొడలు, కాళ్లు జనులచే కట్టబడిన సేతువులను పోలియుండెను. ఆమె పొట్ట నీరు లేని సరస్సువలె నుండెను.

సంతత్రసుస్స్మ తద్వీక్ష్య గోపా గోప్యః కలేవరమ్ ।
పూర్వం తు తన్నిస్స్వనితభిన్నహృత్కర్ణమస్తకాః ॥ 17

పూర్వం తు - ముందైతే, తత్-నిస్స్వనితభిన్నహృత్-కర్ణమస్తకాః - ఆమెయొక్క గర్జనశబ్దముచే పగిలిన హృదయములు చెవులు తలలు గల,

గోపాః - గోపాలకులు, గోప్యః - గోపికలు, తత్ - ఆ, కలేవరమ్ - శవమును, వీక్ష్య - చూచి, సంత్రసుః స్మ - అధికముగా భయపడిరి.

ఆమె గర్జనశబ్దముచే గోపాలకులకు, గోపికలకు ముందే హృదయములు, చెవులు, తలలు పేలిపోయెను. ఆపై ఇప్పుడు వారా దేహమును చూచి అధికముగా భయపడిరి.

బాలం చ తస్యా ఉరసి క్రీడంతమకుతోభయమ్ ।
గోప్యస్తూర్ణం సమభ్యేత్య జగృహుర్జాతసంభ్రమాః ।। 18

జాతసంభ్రమాః - కలిగిన కంగారు గల, గోప్యః - గోపికలు, తూర్ణమ్ - వెంటనే, సమభ్యేత్య - దగ్గరకు వచ్చి, తస్యాః - ఆమెయొక్క, ఉరసి - వక్షఃస్థలముపై, క్రీడంతమ్ - ఆడుచున్నట్టియు, అకుతః-భయమ్ - దేనివలనైననూ భయపడని, బాలం చ - పిల్లవానిని కూడ, జగృహుః - తీసుకొనిరి.

ఆమె వక్షఃస్థలముపై బాలకృష్ణుడు దేనికీ భయపడకుండా ఆడుచుండెను. కంగారు పడిపోయిన గోపికలు వెంటనే దగ్గరకు వచ్చి ఆ పిల్లవానిని తీసుకొనిరి.

యశోదారోహిణీభ్యాం తాస్సమం బాలస్య సర్వతః ।
రక్షాం విదధిరే సమ్యగ్గోపుచ్ఛభ్రమణాదిభిః ।। 19

తాః - ఆ గోపికలు, యశోదారోహిణీభ్యాం సమమ్ - యశోదారోహిణులతో బాటుగా, బాలస్య - పిల్లవానికి, గోపుచ్ఛభ్రమణ-ఆదిభిః - ఆవు తోకను త్రిప్పుట మొదలగువాటిచే, సర్వతః - అన్ని వైపుల నుండియు, రక్షామ్ - రక్షను, సమ్యక్ - బాగుగా, విదధిరే - అనుష్ఠించిరి.

ఆ గోపికలు యశోదారోహిణులతో బాటు పిల్లవానికి ఆవు తోకను త్రిప్పుట, ఆవు చెవులను స్పృశింప జేయుట మొదలగు విధులతో సర్వవిధములుగా చక్కని రక్షను చేసిరి.

గోమూత్రేణ స్నాపయిత్వా పునర్గోరజసాఽర్భకమ్ ।
రక్షాం చక్రుశ్చ శకృతా ద్వాదశాంగేషు నామభిః ।। 20

అర్భకమ్ - పిల్లవానిని, గోమూత్రేణ - గోమూత్రముతో, పునః - ఇంకా, గోరజసా - గోధూళితో, స్నాపయిత్వా - చల్లి, శకృతా చ - గోమయముతో కూడ, ద్వాదశ-అంగేషు - పన్నెండు తిలకస్థానములయందు, నామభిః - పేర్లతో, రక్షామ్ - రక్షను, చక్రుః - చేసిరి,

వారు బాలకృష్ణునకు గోమూత్రమును, గోధూళిని చల్లి, గోమయముతో కూడ పన్నెండు తిలకస్థానములయందు ఈశ్వరుని పేర్లతో రక్షను చేసిరి.

గోప్యస్సంస్పృష్టసలిలా అంగేషు కరయోః పృథక్ ।
న్యస్యాత్మన్యథ బాలస్య బీజన్యాసమకుర్వత ॥ 21

సంస్పృష్టసలిలాః - ఆచమనము చేయబడిన జలములు గల, గోప్యః - గోపికలు, ఆత్మని - తమయందు, న్యస్య - న్యాసము చేసి, అథ - తరువాత, బాలస్య - బాలునకు, అంగేషు - అవయవములయందు, కరయోః - రెండు చేతులయందు, పృథక్ - వేరుగా, బీజన్యాసమ్ - బీజాక్షరముల న్యాసమును, అకుర్వత - చేసిరి.

గోపికలు ఆచమనము చేసి తమకు న్యాసము చేసుకొని, తరువాత పిల్లవానికి అవయవములయందు, రెండు చేతులయందు వేరుగా బీజాక్షరముల న్యాసమును చేసిరి.

అవ్యాదజోఽంఘ్రి మణిమాంస్తవ జాన్వథోరూ
యజ్ఞోఽచ్యుతః కటితటం జఠరం హయాస్యః ।
హృత్కేశవస్త్వదుర ఈశ ఇనస్తు కంఠం
విష్ణుర్భుజం ముఖమురుక్రమ ఈశ్వరః కమ్ ॥ 22

అజః - పుట్టుక లేని శ్రీహరి, తవ - నీ, అంఘ్రి - పాదమును, మణిమాన్ - మణిమంతుడు, తవ - నీ, జాను - మోకాలిని, అథ - మరియు, యజ్ఞః - యజ్ఞుడు, ఊరూ - తొడలను, అచ్యుతః - అచ్యుతుడు, కటితటమ్ - నడుము భాగమును, హయ-ఆస్యః - హయగ్రీవుడు, జఠరమ్ - ఉదరమును, కేశవః - కేశవుడు, హృత్ - గుండెను, త్వద్-ఉరః - నీ వక్షఃస్థలమును, ఈశః - ఈశుడు, ఇనః తు - సూర్యుడైతే, కంఠమ్ - కంఠమును, విష్ణుః - విష్ణువు, భుజమ్ - చేతిని, ఉరుక్రమః - పెద్ద

అడుగులవాడు, ముఖమ్ - నోటిని, ఈశ్వరః - ఈశ్వరుడు, కమ్ - తలను, అవ్యాత్ - రక్షించు గాక!

పుట్టుక లేని శ్రీహరి నీ పాదములను, కౌస్తుభమణిధారియగు శ్రీహరి నీ మోకాళ్లను, యజ్ఞరూపుడగు శ్రీహరి తొడలను, స్వరూపచ్యుతి లేని శ్రీహరి నడుము భాగమును, హయగ్రీవరూపియగు శ్రీహరి ఉదరమును, వివిధశక్తులకు ఉద్గమస్థానమగు శ్రీహరి గుండెను, సర్వాంతర్యామియగు శ్రీహరి వక్షఃస్థలమును, సూర్యరూపియగు శ్రీహరి కంఠమును, సర్వవ్యాపియగు శ్రీహరి చేతులను, మూడు అడుగులలో బ్రహ్మాండమును కొలిచిన శ్రీహరి నోటిని, సర్వనియామకుడగు శ్రీహరి తలను రక్షించుగాక!

చక్ర్యగ్రతస్సహగదో హరిరస్తు పశ్చాత్
త్వత్పార్శ్వయోర్ధనురసీ మధుహాఽజనశ్చ ।
కోణేషు శంఖ ఉరుగాయ ఉపర్యుపేంద్రః
తార్క్ష్యః క్షితౌ హలధరః పురుషస్సమంతాత్ ।। 23

చక్రీ - చక్రధారియగు శ్రీహరి, అగ్రతః - ముందు, సహగదః - గదతో కూడియున్న, హరిః తు - శ్రీహరియైతే, పశ్చాత్ - వెనుక, అస్తు - ఉండుగాక!, త్వత్-పార్శ్వయోః - నీ ప్రక్కలయందు, ధనుః-అసీ - ధనుస్సును కత్తిని (ధరించే), మధుహా - మధువనే రాక్షసుని చంపిన శ్రీహరి, అజనః చ - పుట్టుక లేని శ్రీహరి కూడ, కోణేషు - దిక్కుల మూలలయందు, శంఖః - శంఖము గల, ఉరుగాయః - గొప్ప కీర్తి గల శ్రీహరి, ఉపేంద్రః - వామనుడైన శ్రీహరి, ఉపరి - పైన, తార్క్ష్యః - గరుడుడు, క్షితౌ - భూమియందు, హలధరః - నాగలిని ధరించే సంకర్షణుడు, పురుషః - పూర్ణుడగు శ్రీహరి, సమంతాత్ - అన్ని వైపులా.

చక్రధారియగు శ్రీహరి ముందు, గదాధారి వెనుక, ధనుర్ధారియగు మధుసూదనుడు ఒక ప్రక్కన, కత్తిని చేత బట్టిన పుట్టుక లేని శ్రీహరి మరియొక ప్రక్కన, శంఖధారియై గొప్పగా కీర్తించబడే శ్రీహరి దిక్కుల మూలలయందు, వామనుడైన శ్రీహరి పైన, గరుడారూఢుడగు శ్రీహరి మరియు నాగలిని ధరించే సంకర్షణుడు నేలపై, పూర్ణుడగు శ్రీహరి అంతటా ఉండుగాక ! (ఉండి రక్షించుగాక!)

ఇంద్రియాణి హృషీకేశః ప్రాణాన్నారాయణోఽవతు ।
శ్వేతద్వీపపతిశ్చిత్తం మనో యోగేశ్వరోఽవతు ॥ 24

హృషీక-ఈశః - ఇంద్రియాధిపతియగు శ్రీహరి, ఇంద్రియాణి - ఇంద్రియములను, నారాయణః - నారాయణుడు, ప్రాణాన్ - ప్రాణములను, అవతు - రక్షించుగాక!, శ్వేతద్వీపపతిః - శ్వేతద్వీపమునకు ప్రభువగు శ్రీహరి, చిత్తమ్ - చిత్తమును, యోగ-ఈశ్వరః - యోగులకు ప్రభువగు శ్రీహరి, మనః - మనస్సును, అవతు - రక్షించుగాక!

ఇంద్రియాధిపతియగు శ్రీహరి ఇంద్రియములను, నారాయణుడు ప్రాణాపానాదులను, శ్వేతద్వీపాధిపతియగు శ్రీహరి చిత్తమును (స్మృతిని), యోగులకు ప్రభువగు శ్రీహరి మనస్సును రక్షించుగాక!

పృశ్నిగర్భస్తు తే బుద్ధిమాత్మానం భగవాన్పరః ।
క్రీడంతం పాతు గోవిందశ్శయానం పాతు మాధవః ॥ 25

పృశ్నిగర్భః తు - పృశ్నికి పుత్రుడై అవతరించిన శ్రీహరియైతే, తే - నీ, బుద్ధిమ్ - బుద్ధిని, పరః - పరమాత్మయగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, ఆత్మానమ్ - వ్యక్తిత్వమును, గోవిందః - వేదములను పాలించే శ్రీహరి, క్రీడంతమ్ - ఆడుచున్నవానిని, పాతు - రక్షించుగాక!, శయానమ్ - పరున్నవానిని, మాధవః - లక్ష్మీపతియగు శ్రీహరి, పాతు - రక్షించుగాక!

పృశ్నికి పుత్రుడై అవతరించిన శ్రీహరి నీ బుద్ధిని (కర్తృత్వమును), పరమాత్మయగు శ్రీహరి భగవానుడు నీ వ్యక్తిత్వము (భోక్తృత్వము) ను, వేదములను పాలించే శ్రీహరి నీవు ఆడుచున్నప్పుడు, లక్ష్మీపతియగు శ్రీహరి నీవు పరున్నప్పుడు రక్షించుగాక!

వ్రజంతమవ్యాద్వైకుంఠ ఆసీనం త్వాం శ్రియః పతిః ।
భుంజానం యజ్ఞభుక్పాతు సర్వగ్రహభయంకరః ॥ 26

వైకుంఠః - వైకుంఠవాసియగు శ్రీహరి, వ్రజంతమ్ - వెళ్లుచున్న, త్వామ్ - నిన్ను, శ్రియః - లక్ష్మీదేవియొక్క, పతిః - ప్రభువగు శ్రీహరి, ఆసీనమ్ - కూర్చున్న నిన్ను, అవ్యాత్ - రక్షించుగాక!, యజ్ఞభుక్ -

యజ్ఞభాగములను భుజించువాడు, సర్వగ్రహభయంకరః - సకలపిశాచములకు భయమును గొల్పువాడు అగు శ్రీహరి, భుంజానమ్ - భుజించుచున్న నిన్ను, పాతు - రక్షించుగాక!

వైకుంఠవాసియగు (వినాశము లేని జ్ఞానమే స్వరూపముగా గలవాడు) శ్రీహరి నీవు వెళ్లుచున్నప్పుడు, లక్ష్మీపతియగు శ్రీహరి నీవు కూర్చున్నప్పుడు, యజ్ఞభాగములను భుజించువాడు మరియు సకలపిశాచములకు భయమును గొల్పువాడు (నృసింహరూపి) అగు శ్రీహరి నీవు భుజించుచున్నప్పుడు రక్షించుగాక!

డాకిన్యో యాతుధాన్యశ్చ కూష్మాండా యేఽర్భకగ్రహాః ।
భూతప్రేతపిశాచాశ్చ యక్షరక్షోవినాయకాః ॥ 27

కోటరా రేవతీ జ్యేష్ఠా పూతనా మాతృకాదయః ।
ఉన్మాదా యే హ్యపస్మారా దేహప్రాణేంద్రియద్రుహః ॥ 28

స్వప్నదృష్టా మహోత్పాతా వృద్ధబాలగ్రహాశ్చ యే ।
సర్వే నశ్యంతు తే విష్ణోర్నామగ్రహణభీరవః ॥ 29

డాకిన్యః - దుష్టలగు స్త్రీలు, యాతుధాన్యః చ - రాక్షసస్త్రీలు, కూష్మాండాః - కూష్మాండములు అనే ఉపద్రవకారులగు క్షుద్రదేవతలు, యే - ఏ, అర్భకగ్రహాః - పిల్లలను పీడించే పిశాచములు గలవో అవి, భూతప్రేతపిశాచాః చ - భూతములు ప్రేతములు పిశాచములు, యక్షరక్షః-వినాయకాః - యక్షులు రాక్షసులు విఘ్నకర్తలగు క్షుద్రదేవతలు, కోటరా - కోటర, రేవతీ - రేవతి, జ్యేష్ఠా - జ్యేష్ఠాదేవి, పూతనా - పూతన, మాతృకా-ఆదయః - మాతృక మొదలైన బాలగ్రహములు, ఉన్మాదాః - పిచ్చిని కలిగించే గ్రహములు, యే - ఏ, అపస్మారాః హి - చిత్తభ్రాంతి కలిగించే గ్రహములు, దేహప్రాణ-ఇంద్రియద్రుహః - దేహమును ప్రాణమును ఇంద్రియములను నశింపజేయునవి, స్వప్నదృష్టాః - స్వప్నమునందు చూడబడిన, మహా-ఉత్పాతాః - పెద్ద అపశకునములు, యే - ఏ, వృద్ధబాలగ్రహాః చ - పెద్దవారిని పిల్లలను పట్టి పీడించేవి గలవో,

తే - ఆ, సర్వే - అన్నీ, విష్ణోః - శ్రీహరియొక్క, నామగ్రహణభీరవః - పేరును ఉచ్చరించుట వలన భయపడునవి, నశ్యంతు - నశించుగాక!

దుష్టస్త్రీలు, రాక్షసస్త్రీలు, ఉపద్రవములను కలిగించే కూష్మాండములనే క్షుద్రదేవతలు, పిల్లలను పీడించే భూతప్రేతపిశాచములు, యక్షులు, రాక్షసులు, విఘ్నములను కలిగించే క్షుద్రదేవతలు, కోటర, రేవతి, జ్యేష్ఠాదేవి, పూతన, మాతృక మొదలగు బాలగ్రహములు, పిచ్చిని కలిగించే గ్రహములు, చిత్తభ్రాంతిని కలిగించే గ్రహములు, దేహమును ప్రాణమును ఇంద్రియములను నశింపజేసే గ్రహములు, స్వప్నమునందు కనబడిన పెద్ద అపశకునములు, పెద్దలను పిల్లలను పట్టి పీడించే గ్రహములు ఏవైతే గలవో అవన్నీ శ్రీహరి నామమును ఉచ్చరించినంత మాత్రాన భయభీతములగును. అవన్నీ నశించు గాక!

శ్రీశుక ఉవాచ ।
ఇతి ప్రణయబద్ధాభిర్గోపీభిః కృతరక్షణమ్ ।
పాయయిత్వా స్తనం మాతా సన్న్యవేశయదాత్మజమ్ ॥ 30

ఇతి - ఈ విధముగా, ప్రణయబద్ధాభిః - ప్రేమచే కట్టివేయబడిన, గోపీభిః - గోపికలచే, కృతరక్షణమ్ - చేయబడిన రక్షణ కలిగిన, ఆత్మజమ్ - పుత్రుని, మాతా - తల్లియగు యశోద, స్తనమ్ - పాలను, పాయయిత్వా - త్రాగింపజేసి, సన్న్యవేశయత్ - మెల్లగా నిదురబుచ్చెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా ప్రేమచే కట్టివేయబడిన గోపికలు బాలకృష్ణునకు రక్షను విధించిరి. తల్లియగు యశోద పాలను త్రావించి నిదుర బుచ్చెను.

తావన్నందాదయో గోపా మథురాయా వ్రజం గతాః ।
విలోక్య పూతనాదేహం బభూవురతివిస్మితాః ॥ 31

తావత్ - అంతలో, మథురాయాః - మథురనుండి, వ్రజమ్ - గొల్లపల్లెను, గతాః - చేరిన, నంద-ఆదయః - నందుడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు, పూతనాదేహమ్ - పూతనయొక్క శరీరమును,

విలోక్య - చూచి, అతివిస్మితాః - అధికమగు ఆశ్చర్యము గలవారై, బభూవుః - అయిరి.

అంతలో నందుడు మొదలుగా గల గోపాలకులు మథురనుండి గొల్లపల్లెను చేరిరి. వారు పూతన దేహమును చూచి అత్యాశ్చర్యమును పొందిరి.

నూనం బతర్షిస్సంజాతో యోగేశో వా సమాస సః ।
స ఏవ దృష్టో హ్యుత్పాతో యదాహానకదుందుభిః ॥ 32

బత - ఆశ్చర్యము!, ఆనకదుందుభిః - వసుదేవుడుగా, సంజాతః - జన్మించినవాడు, ఋషిః - మహర్షిగా గాని, యోగ-ఈశః వా - గొప్ప యోగియై గాని, సమాస - గొప్పగా ప్రకాశించెను, నూనమ్ - నిశ్చయము, హి - ఏలయన, సః ఏవ - అదియే, ఉత్పాతః - అపశకునము, దృష్టః - కనబడినది, యత్ - దేనిని, సః - ఆయన, ఆహ - చెప్పినాడో.

ఆశ్చర్యము! వసుదేవుడు పూర్వజన్మలో మహర్షిగా గాని, గొప్ప యోగియై గాని ప్రకాశించెను. ఇది నిశ్చయము. ఏలయన, ఆయన ఏ అపశకునమును గురించి చెప్పినాడో, అదియే కానబడినది.

కలేవరం పరశుభిశ్ఛిత్వా తత్తే వ్రజౌకసః ।
దూరే క్షిప్త్వాఽవయవశో న్యదహన్కాష్ఠధిష్ఠితమ్ ॥ 33

వ్రజ-ఓకసః - గోకులమునందు నివసించే, తే - వారు, తత్ - ఆ, కలేవరమ్ - శరీరమును, పరశుభిః - గొడ్డళ్లతో, అవయవశః - అవయవములుగా, ఛిత్వా - తెగగొట్టి, దూరే - దూరమునందు, క్షిప్త్వా - పడవేసి, కాష్ఠధిష్ఠితమ్ - కట్టెలచే చుట్టువారబడిన దానిని, న్యదహన్ - పూర్తిగా తగులబెట్టిరి.

గోకులమునందు నివసించే ఆ జనులు ఆ శరీరమును గొడ్డళ్లతో అవయవములుగా తెగగొట్టి దూరముగా పడవేసి చుట్టూ కట్టెలను పేర్చి పూర్తిగా తగుల బెట్టిరి.

దహ్యమానస్య దేహస్య ధూమశ్చాగురుసౌరభః ।
ఉత్థితః కృష్ణనిర్భుక్తసపద్యాహతపాప్మనః ॥ 34

కృష్ణనిర్భుక్తసపది-ఆహతపాప్మనః - శ్రీకృష్ణునిచే పాలు ప్రాణములు త్రాగబడుట వలన వెనువెంటనే పూర్తిగా నశింపజేయబడిన పాపములు గల, దేహస్య - దేహము, దహ్యమానస్య - దహించబడుచుండగా, అగురుసౌరభః - అగురు పరిమళము గల, ధూమః - పొగ, ఉత్థితః - పైకి లేచినది.

శ్రీకృష్ణుడు పాలను ప్రాణములను త్రాగుట వలన పూతన పాపములు వెనువెంటనే సమూలముగా నశించెను. ఆ దేహము తగులబడుచుండగా పైకి యెగసిన పొగ అగురు సుగంధమును కలిగియుండెను.

పూతనా లోకబాలఘ్నీ రాక్షసీ రుధిరాశనా ।
జిఘాంసయాఽపి హరయే స్తనం దత్త్వాఽఽప సద్గతిమ్ ॥ 35

లోకబాలఘ్నీ - జనుల పిల్లలను చంపునది, రాక్షసీ - రాక్షసి, రుధిర-అశనా - రక్తమే ఆహారముగా గలది అగు, పూతనా - పూతన, జిఘాంసయా అపి - చంపాలనే కోరికతోనే ఐననూ, హరయే - శ్రీహరి కొరకు, స్తనమ్ - పాలను, దత్త్వా - ఇచ్చి, సద్-గతిమ్ - ఉత్తమగతిని, ఆప - పొందెను.

జనుల పిల్లలను చంపుతూ రక్తాన్ని త్రాగే పూతన కూడ చంపాలనే కోరికతోనే ఐనా శ్రీహరికి పాలనిచ్చి ఉత్తమగతిని పొందెను.

కిం పునశ్శ్రద్ధయా భక్త్యా కృష్ణాయ పరమాత్మనే ।
యచ్ఛన్ప్రియతమం వస్తు కిం ను రక్తాస్తన్మాతరో యథా ॥ 36

శ్రద్ధయా - శ్రద్ధతో, భక్త్యా - భక్తితో, కృష్ణాయ పరమాత్మనే - శ్రీకృష్ణ పరమాత్మ కొరకు, ప్రియతమమ్ - మిక్కిలి ప్రియమైన, వస్తు - వస్తువును, యచ్ఛన్ - ఇచ్చువాడు, కిం పునః - చెప్పునదేమున్నది?, తత్-మాతరః యథా - ఆయనయొక్క తల్లులు వలె, రక్తాః - అనురాగము గలవారు, కిం ను - చెప్పునదేమున్నది?

శ్రద్ధాభక్తులతో శ్రీకృష్ణపరమాత్మకు మిక్కిలి ప్రియమైన వస్తువునిచ్చువాడు ఉత్తమగతిని పొందునని వేరుగా చెప్పవలెనా? ఆ శ్రీకృష్ణుని తల్లులు వలె అనురాగము గలవారై ఇచ్చువారు మరింత ఉత్తమగతిని పొందెదరని చెప్పవలెనా?

పద్భ్యాం భక్తహృదిస్థాభ్యాం వంద్యాభ్యాం లోకవందితైః ।
అంగం యస్యాస్సమాక్రమ్య భగవానపిబత్ స్తనమ్ ।। 37

యాతుధాన్యపి సా స్వర్గమవాప జననీగతిమ్ ।
కృష్ణభుక్తస్తనక్షీరాః కిము గావో ను మాతరః ।। 38

భక్తహృదిస్థాభ్యామ్ - భక్తుల హృదయమునందుండునట్టియు, లోకవందితైః - జనులచే నమస్కరించబడే ఇంద్రాదులచే, వంద్యాభ్యామ్ - నమస్కరించబడే, పద్భ్యామ్ - రెండు పాదములతో, యస్యాః - ఏ పూతనయొక్క, అంగమ్ - దేహమును, సమాక్రమ్య - పూర్తిగా ఆక్రమించి, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, స్తనమ్ - పాలను, అపిబత్ - త్రాగెనో, సా - ఆమె, యాతుధానీ అపి - రాక్షసియే ఐననూ, జననీగతిమ్ - తల్లుల గతియగు, స్వర్గమ్ - స్వర్గమును, అవాప - పొందెను, కృష్ణభుక్తస్తనక్షీరాః - శ్రీకృష్ణునిచే త్రాగబడిన స్తనములయందలి పాలు గల, గావః - ఆవులు, మాతరః - తల్లులు, కిము ను - ఏమి చెప్పవలెను?

భక్తులచే హృదయమునందు స్థిరముగా ధ్యానించబడే భగవానుని పాదములను జనులచే ఆరాధించబడే ఇంద్రాదులు కూడ నమస్కరించెదరు. శ్రీకృష్ణ భగవానుడు అట్టి రెండు పాదములతో పూతనయొక్క దేహమును అడ్డముగా ఆక్రమించి పాలను త్రాగెను. ఆమె రాక్షసియే ఐననూ, తల్లి పొందదగిన స్వర్గమునే పొందెను. అట్టిచో, శ్రీకృష్ణుడు ఏ ఆవుల మరియు తల్లుల పాలను త్రావెనో, వారు ఉత్తమోత్తమగతిని పొందెదరని వేరుగా చెప్పవలయునా?

పయాంసి యాసామపిబత్పుత్రస్నేహస్నుతాన్యలమ్ ।
భగవాన్దేవకీపుత్రః కైవల్యాద్యఖిలప్రదః ।। 39

తాసామవిరతం కృష్ణే కుర్వతీనాం సుతేక్షణమ్ ।
న పునః కల్పతే రాజన్ సంసారోఽజ్ఞానసంభవః ।। 40

రాజన్ - ఓ రాజా!, దేవకీపుత్రః - దేవకియొక్క పుత్రుడు, కైవల్య-ఆది-అఖిలప్రదః - మోక్షము మొదలుకొని సర్వమును అనుగ్రహించువాడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, యాసామ్ - ఏ తల్లుల (ఆవుల) యొక్క, పుత్రస్నేహస్నుతాని - పుత్రునియందలి ప్రేమ వలన స్రవించిన, పయాంసి - పాలను, అలమ్ - తృప్తిగా, అపిబత్ - త్రావెనో, కృష్ణే - శ్రీకృష్ణునియందు, అవిరతమ్ - నిరంతరముగా, సుత-ఈక్షణమ్ - పుత్రునిగా చూచుటను, కుర్వతీనామ్ - చేయుచున్న, తాసామ్ - ఆ తల్లుల (ఆవుల) కు, పునః - మరల, అజ్ఞానసంభవః - అజ్ఞానము వలన కలిగే, సంసారః - జననమరణప్రవాహము, న కల్పతే - కలుగదు.

ఓ పరీక్షిన్మహారాజా! మోక్షము మొదలుకొని సకలమునను గ్రహించే భగవానుడు దేవకికి పుత్రుడై యశోద మొదలగు తల్లుల మరియు గోవుల పాలను తృప్తిగా త్రావెను. శ్రీకృష్ణునియందు నిరంతరముగా పుత్రదృష్టిని కలిగియున్న వారలకు పుత్రునియందలి ప్రేమ వలన పాలు స్రవించెడివి. వారికి అజ్ఞానము వలన కలిగే జననమరణప్రవాహము మరల కలుగదు.

కటధూమస్య సౌరభ్యమవఘ్రాయ వ్రజౌకసః ।
కిమిదం కుత ఏవేతి వదంతో వ్రజమాయయుః ।। 41

వ్రజ-ఓకసః - గోకులము నివాసముగా గల జనులు, కటధూమస్య - చితియొక్క పొగయొక్క, సౌరభ్యమ్ - పరిమళమును, అవఘ్రాయ - ఆఘ్రాణించి, ఇదమ్ - ఇది, కిమ్ - ఏమి?, కుతః ఏవ - ఎక్కడనుండి చెప్పుమా?, ఇతి - అని, వదంతః - పలుకుచున్నవారై, వ్రజమ్ - గోకులమును గురించి, ఆయయుః - వచ్చిరి.

గోకులములో నివసించే గోపాలకులు శవముయొక్క పొగయందలి పరిమళమునాఘ్రాణించి, ఇది యేమి? ఎక్కడనుండి వచ్చుచున్నది? అంటూ పలుకుతూ, గోకులమును చేరిరి.

తే తత్ర వర్ణితం గోపైః పూతనాఽఽగమనాదికమ్ ।
శ్రుత్వా తన్నిధనం స్వస్తి శిశోశ్చాసన్ సువిస్మితాః ॥ 42

తత్ర - ఆ గోకులమునందలి, గోపైః - గోపాలకులచే, వర్ణితమ్ - వర్ణించబడిన, పూతనా-ఆగమన-ఆదికమ్ - పూతన వచ్చుట మొదలైన దానిని, తత్-నిధనమ్ - ఆ పూతనయొక్క మరణమును, శిశోః - పిల్లవానియొక్క, స్వస్తి - క్షేమమును, శ్రుత్వా - విని, సువిస్మితాః - మిక్కిలి ఆశ్చర్యము గలవారై, ఆసన్ - అయిరి.

గోకులమునందలి గోపాలకులు పూతన వచ్చుట, శ్రీకృష్ణునకు పాలను త్రావించుట ఇత్యాది వృత్తాంతమును, ఆమె మరణమును, పిల్లవాడు క్షేమముగా ఉన్న వైనమును వర్ణించి చెప్పిరి. నందాదులు దానిని విని చాల ఆశ్చర్యమును పొందిరి.

నందస్స్వపుత్రమాదాయ ప్రేత్యాగతముదారధీః ।
మూర్ధ్న్యుపాఘ్రాయ పరమాం ముదం లేభే కురూద్వహ ॥ 43

కురు-ఉద్వహ - ఓ కురువంశశ్రేష్ఠా!, ఉదారధీః - పెద్ద మనస్సు గల, నందః - నందుడు, ప్రేత్య - మరణించి, ఆగతమ్ - వచ్చిన, స్వపుత్రమ్ - తన పుత్రుడగు శ్రీకృష్ణుని, ఆదాయ - తీసుకొని, మూర్ధ్ని - తలపై, ఉపాఘ్రాయ - ముద్దాడి, పరమామ్ - అతిశయించిన, ముదమ్ - ఆనందమును, లేభే - పొందెను.

కురువంశశ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! నందుడు పెద్ద మనస్సు గలవాడు. మృత్యుముఖమునుండి బయట పడిన తన పుత్రుడగు శ్రీకృష్ణుని ఆయన దగ్గరకు తీసుకొని లలాటముపై ముద్దాడి అతిశయించిన ఆనందమును పొందెను.

య ఏతత్పూతనామోక్షం కృష్ణస్యాఽర్భకమద్భుతమ్ ।
శృణుయాచ్ఛ్రద్ధయా మర్త్యో గోవిందే లభతే రతిమ్ ॥ 44

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే షష్ఠోఽధ్యాయః ॥

కృష్ణస్య - శ్రీకృష్ణునియొక్క, అద్భుతమ్ - విస్మయమును కలిగించే, ఏతత్ - ఈ, ఆర్భకమ్ - బాలలీలను, పూతనామోక్షమ్ - పూతన ఉత్తమగతిని పొందుటను, యః - ఏ, మర్త్యః - మానవుడైతే, శ్రద్ధయా - శ్రద్ధతో, శృణుయాత్ - వినునో, గోవిందే - గోవిందునియందు, రతిమ్ - ప్రేమను, లభతే - పొందును.

ఏ మానవుడైతే శ్రీకృష్ణుని విస్మయమును కలిగించే ఈ బాలలీలను, పూతన స్వర్గమును పొందుటను శ్రద్ధతో వినునో, అట్టివానికి గోవిందునియందు ప్రేమ (భక్తి) కలుగును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్ధములో పూతన ఉత్తమగతిని పొందుటను వర్ణించే
ఆరవ అధ్యాయము ముగిసినది (౬).

* * * * *

# అథ సప్తమోఽధ్యాయః

## శకటాసుర సంహారము - తృణావర్తుని ఉద్ధారము

రాజోవాచ ।
యేన యేనావతారేణ భగవాన్ హరిరీశ్వరః ।
కరోతి కర్ణరమ్యాణి మనోజ్ఞాని చ నః ప్రభో ॥ 1

ప్రభో - ఓ ప్రభూ!, ఈశ్వరః - జగన్నియామకుడగు, హరిః భగవాన్ - శ్రీహరి భగవానుడు, యేన యేన - ఏయే, అవతారేణ - అవతారముతో, కర్ణరమ్యాణి - చెవులకు ఇంపైన లీలలను, కరోతి - చేయునో అవి, నః - మాకు, మనోజ్ఞాని చ - మనోహరములే.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ ప్రభూ! జగన్నియామకుడగు శ్రీహరి భగవానుడు ఏయే అవతారములతో చెవులకు ఇంపైన లీలలను చేయునో, అవి మాకు మనోహరములే.

యచ్ఛృణ్వతోఽపైత్యరతిర్వితృష్ణా సత్త్వం చ శుద్ధ్యత్యచిరేణ పుంసః।
భక్తిర్హరౌ తత్పురుషే చ సఖ్యం తదేవ హారం వద మన్యసే చేత్ ॥2

యత్ - దేనిని, శృణ్వతః - వినుచున్న, పుంసః - వ్యక్తికి, అరతిః - మనస్సునందలి గ్లాని, వితృష్ణా - పలురకముల తృష్ణ, అపైతి - తొలగిపోవునో, అచిరేణ - శీఘ్రముగా, సత్త్వం చ - మనస్సు కూడ, శుద్ధ్యతి - పవిత్రమగునో, హరౌ - శ్రీహరియందు, భక్తిః - భక్తి, తత్-పురుషే - ఆ శ్రీహరి భక్తునియందు, సఖ్యం చ - మైత్రి కూడ, మన్యసే చేత్ - తమరు తలపోయునట్లైతే, హారమ్ - మనోహరమైన, తత్ ఏవ - ఆ హరిగాథనే, వద - చెప్పుము.

శ్రీహరి లీలలను శ్రవణము చేసే వ్యక్తికి మనస్సునందలి గ్లాని మరియు (దానికి కారణమగు) పలురకముల తృష్ణ తొలగిపోయి

(అందువలననే) మనస్సు శీఘ్రముగా శుద్ధమగును. ఇంతేగాక, శ్రీహరియందు భక్తి, శ్రీహరి భక్తులతో మైత్రి కలుగును. నేను యోగ్యుడనని తమరు భావించే పక్షములో, మనోహరమైన అట్టి శ్రీహరి గాథనే చెప్పుడు.

అథాన్యదపి కృష్ణస్య తోకాచరితమద్భుతమ్ ।
మానుషం లోకమాసాద్య తజ్జాతిమనురుంధతః ॥ 3

అథ - కావున, మానుషమ్ - మానవులకు చెందిన, లోకమ్ - లోకమును, ఆసాద్య - ప్రకటమై, తత్-జాతిమ్ - ఆ మానవజాతిని, అనురుంధతః - అనుకరించే, కృష్ణస్య - శ్రీకృష్ణునియొక్క, అద్భుతమ్ - ఆశ్చర్యమును గొల్పే, అన్యత్ - మరియొక, తోక-ఆచరితం అపి - బాలచేష్టను కూడ.

శ్రీకృష్ణుడు మానవునిగా జన్మించి మానవుల జీవనశైలినే అనుకరిస్తూ చేసిన మరియొక ఆశ్చర్యకరమగు బాలచేష్టను కూడ చెప్పుడు.

శ్రీశుక ఉవాచ ।
కదాచిదౌత్థానికకౌతుకాప్లవే జన్మర్క్షయోగే సమవేతయోషితామ్ ।
వాదిత్రగీతద్విజమంత్రవాచకైశ్చకార సూనోరభిషేచనం సతీ ॥ 4

కదాచిత్ - ఒకనాడు, ఔత్థానికకౌతుక-ఆప్లవే - పిల్లవాడు తిరగబడినప్పుడు చేయదగిన ఉత్సవమునందలి అభిషేకమునందు, జన్మ-ఋక్షయోగే - జన్మనక్షత్రము కూడ కలియగా, సమవేతయోషితామ్ - సమావేశమైన యువతులలో, సతీ - యశోద, వాదిత్రగీతద్విజమంత్రవాచకైః - వాద్యములతో గానములతో వేదవేత్తలయందు మంత్రమును పఠించువారలతో, సూనోః - పుత్రుని, అభిషేచనమ్ - అభిషేకమును, చకార - చేసెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- బాలకృష్ణుడు పరుండి తిరగబడే సామర్థ్యమును పొందిన రోజు జన్మనక్షత్రము (రోహిణి) కూడ కలిసి వచ్చెను. ఆనాడు అభిషేకించే ఉత్సవమును తలపెట్టగా, యువతులు సమావేశమైరి. వారి మధ్యలో యశోద పుత్రునకు అభిషేకమును చేయగా,

వేదవేత్తలు మంత్రములను పఠించిరి. వాటికి వాద్యఘోష, పాటలు తోడయ్యెను.

నందస్య పత్నీ కృతమజ్జనాదికం విప్రైః కృతస్వస్త్యయనం సుపూజితైః
అన్నాద్యవాసస్స్రగభీష్టధేనుభిస్సంజాతనిద్రాక్షమశీశయచ్ఛనైః || 5

నందస్య - నందుని, పత్నీ - భార్యయగు యశోద, కృతమజ్జన-ఆదికమ్ - చేయబడిన స్నానము మొదలైనవి కలిగినట్టియు, అన్న-ఆద్యవాసః-స్రగ్-అభీష్టధేనుభిః - భుజించదగిన ఆహారము వస్త్రములు మాలలు నచ్చిన ఆవులతో, సుపూజితైః - చక్కగా సత్కరించబడిన, విప్రైః - వేదవేత్తలచే, కృతస్వస్తి-అయనమ్ - చేయబడిన రక్షాబంధనము మొదలైనవి కలిగినట్టియు, సంజాతనిద్రా-అక్షమ్ - కలిగిన నిద్ర గల కళ్లు గల బాలకృష్ణుని, శనైః - మెల్లగా, అశీశయత్ - పరుండబెట్టెను.

బాలకృష్ణుని స్నానము, అలంకారము మొదలైనవి పూర్తి అయ్యెను. వేదవేత్తలకు భుజించదగిన ఆహారమును, వస్త్రములను, మాలలను, నచ్చిన ఆవులను ఇచ్చి సత్కరించగా, వారు రక్షాబంధనము మొదలైనవి పూర్తి చేసిరి. బాలకృష్ణుని కళ్లలో నిద్ర వ్యక్తము కాజొచ్చెను. అప్పుడు నందుని భార్యయగు యశోద మెల్లగా పిల్లవానిని పరుండబెట్టెను.

ఔత్థానికౌత్సుక్యమనా మనస్వినీ సమాగతాన్ పూజయతీ వ్రజౌకసః,
నైవాశృణోద్వై రుదితం సుతస్య సా రుదన్ స్తనార్థీ చరణావుదక్షిపత్|6

ఔత్థానిక-ఔత్సుక్యమనాః - పిల్లవాడు తిరగబడ్డప్పుడు చేసే ఉత్సవమునందలి ఉత్సాహముతో నిండిన మనస్సు గలది, మనస్వినీ - పెద్ద మనసు గలది అగు, సా - ఆ యశోద, సమాగతాన్ - విచ్చేసిన, వ్రజ-ఓకసః - గోకులవాసులను, పూజయతీ - సత్కరించుచున్నదై, సుతస్య - పుత్రుని, రుదితమ్ - ఏడ్పును, వై - సుతరాము, న ఏవ అశృణోత్ - వినననే లేదు, స్తన-అర్థీ - పాలను కోరువాడై, రుదన్ - ఏడ్చుచున్నవాడై, చరణౌ - రెండు కాళ్లను, ఉదక్షిపత్ - పైకి తన్నెను.

పిల్లవాడు తిరగబడ్డప్పుడు చేసే ఉత్సవమునందలి ఉత్సాహముతో మనస్సు నిండిపోగా, పెద్ద మనస్సు గల ఆ యశోద విచ్చేసిన గోకులవాసులకు సత్కారములను చేయుచుండెను. ఆమెకు తన పుత్రుని ఏడ్పు సుతరాము వినబడనే లేదు. పాలను కోరి ఏడ్చుచున్న బాలకృష్ణుడు రెండు కాళ్లతో పైకి తన్నెను.

అధశ్శయానస్య శిశోరనోఽల్పకప్రవాలమృద్వంఘ్రిహతం వ్యవర్తత ।
విధ్వస్తనానారసకుప్యభాజనం వ్యత్యస్తచక్రాక్షవిభిన్నకూబరమ్ ॥ 7

అధః - క్రింద, శయానస్య - పరున్న, శిశోః - పిల్లవాని, అల్పకప్రవాలమృదు-అంఘ్రిహతమ్ - చిన్నవైన చిగుళ్లవలె మెత్తని కాళ్లతో తన్నబడిన, అనః - బండి, విధ్వస్తనానారసకుప్యభాజనమ్ - నేల పాలైన అనేకరసములు గల కంచు-ఇత్తడి గిన్నెలు గలదిగా, వ్యత్యస్తచక్ర-అక్షవిభిన్నకూబరమ్ - తల్లక్రిందులైన చక్రములు ఇరుసు గలదిగా విరిగిన కూబరము (నొగ) గలదిగా, వ్యవర్తత - తిరగబడెను.

బండి క్రింద కట్టిన ఊయలలో పరున్న బాలకృష్ణుడు చిగుళ్లవలె మెత్తనైన బుల్లి కాళ్లతో తన్నగా బండి తిరగబడెను. దానియందు కంచు-ఇత్తడి పాత్రలలోని అనేకములైన ద్రవాహారములు నేలపాలయ్యెను. చక్రములు, ఇరుసు తల్లక్రిందులై కూబరము (నొగ) విరిగెను.

దృష్ట్వా యశోదాప్రముఖా వ్రజస్త్రియ
ఔత్థానికే కర్మణి యాస్సమాగతాః ।
నందాదయశ్చాద్భుతదర్శనాకులాః
కథం స్వయం వై శకటం విపర్యగాత్ ॥ 8

యశోదాప్రముఖాః - యశోద మొదలుగా గల, వ్రజస్త్రియః - గోకులస్త్రీలు, యాః - ఎవరైతే, ఔత్థానికే - పిల్లవాడు తిరగబడ్డప్పుడు చేసే, కర్మణి - ఉత్సవమునందు, సమాగతాః - విచ్చేసిరో, నంద-ఆదయః చ - నందుడు మొదలగువారు కూడ, అద్భుతదర్శన-ఆకులాః - అద్భుతమును చూచుటచే కంగారు పడినవారు, శకటమ్ - బండి,

స్వయమ్ - తనంత తాను, కథమ్ - ఏ విధముగా, విపర్యగాత్ వై - తల్లక్రిందులాయెను చెప్పుమా?

పిల్లవాడు తిరగబడ్డప్పుడు చేసే ఉత్సవమునకు విచ్చేసిన గోకుల స్త్రీలతో కూడిన యశోద, నందుడు మొదలగువారు కూడ ఆ అద్భుతమును చూచి కంగారు పడిరి. బండి తనంత తాను ఎల్లా తిరగబడింది? (అని వారు ఆశ్చర్యపడిరి).

ఊచురవ్యవసితమతీన్ గోపాన్ గోపీశ్చ బాలకాః ।
రుదతానేన పాదేన క్షిప్తమేతన్న సంశయః ॥ 9

అవ్యవసితమతీన్ - నిర్ధారణకు రాని బుద్ధి గల, గోపాన్ - గోపాలకులను, గోపీః చ - గోపికలను కూడ ఉద్దేశించి, బాలకాః - పిల్లలు, ఊచుః - చెప్పిరి, రుదతా - ఏడ్చుచున్న, అనేన - వీనిచే, పాదేన - కాలితో, ఏతత్ - ఇది, క్షిప్తమ్ - తల్లక్రిందులు చేయబడినది, న సంశయః - సంశయము లేదు.

గోపాలకులకు, గోపికలకు బండి తిరగబడిన కారణమింకనూ నిర్ధారణ కాలేదు. వారితో పిల్లలు ఇట్లు చెప్పిరి -- ఈ బాలకృష్ణుడు ఏడుస్తూ కాలితో తన్ని దీనిని తల్లక్రిందులు చేసినాడు. దీనిలో సందేహము లేదు.

న తే శ్రద్దధిరే గోపా బాలభాషితమిత్యుత ।
అప్రమేయం బలం తస్య బాలకస్య న తే విదుః ॥ 10

తే - ఆ, గోపాః - గోపాలకులు, బాలభాషితమ్ - పిల్లల మాట, ఉత - సంభవమా?, ఇతి - అని, న శ్రద్దధిరే - నమ్మలేదు, (ఉత - అది యుక్తమే), తస్య - ఆ, బాలకస్య - బాలకృష్ణుని, అప్రమేయమ్ - ఊహాకందని, బలమ్ - శక్తిని గురించి, తే - వారు, న విదుః - ఎరుగరు.

పిల్లలు అల్లాగే చెప్తారు, అది సంభవమా? అంటూ గోపాలకులు వారి మాటలను నమ్మలేదు. అది యుక్తమే. ఆ బాలకృష్ణుని ఊహాకందని శక్తి గురించి వారికి తెలియదు.

రుదంతం సుతమాదాయ యశోదా గ్రహశంకితా ।
కృతస్వస్త్యయనం విప్రైస్సూక్తైః స్తనమపాయయత్ ॥ 11

గ్రహశంకితా - దెయ్యమని శంకించిన, యశోదా - యశోద, రుదంతమ్ - ఏడ్చుచున్న, సుతమ్ - పుత్రుని, ఆదాయ - తీసుకొని, విప్రైః - వేదవేత్తలచే, సూక్తైః - సూక్తములతో, కృతస్వస్త్యయనమ్ - చేయబడిన మంగళకృత్యములు గల పిల్లవానిని, స్తనమ్ - పాలను, అపాయయత్ - త్రావించెను.

పిల్లవానికి గాలి సోకినదని శంకించిన యశోద ఏడుస్తున్న బాలకృష్ణుని తీసుకొని పాలను త్రావించెను. వేదవేత్తలు (గ్రహములను దూరము చేసే) సూక్తములను పఠించి పిల్లవానికి మంగళవాచనమును చేసిరి.

పూర్వవత్ స్థాపితం గోపైర్బలిభిస్సపరిచ్ఛదమ్ ।
విప్రా హుత్వాఽర్చయాంచక్రుర్దధ్యక్షతకుశాంబుభిః ॥ 12

విప్రాః - వేదవేత్తలు, హుత్వా - హోమము చేసి, గోపైః - గోపాలకులచే, పూర్వవత్ - ఇదివరలో వలెనే, బలిభిః - పెరుగు మొదలైన ఉపహారములతో, స్థాపితమ్ - ఏర్పాటు చేయబడిన, సపరిచ్ఛదమ్ - భాగములతో కూడిన బండిని, దధి-అక్షతకుశ-అంబుభిః - పెరుగు అక్షతలు దర్భలు జలములతో, అర్చయాంచక్రుః - పూజించిరి.

గోపాలకులు బండికి భాగములనమర్చి ఇదివరలో వలెనే పెరుగు మొదలైన ఉపహారములనుంచి సిద్ధము చేసిరి. వేదవేత్తలు హోమము చేసి పెరుగు, అక్షతలు, దర్భలు, జలములతో బండిని (ఈశ్వరుని) పూజించిరి.

యేఽసూయాఽనృతదంభేర్ష్యాహింసామానవివర్జితాః ।
న తేషాం సత్యశీలానామాశిషో విఫలాః కృతాః ॥ 13

యే - ఎవరైతే, అసూయా-అనృతదంభ-ఈర్ష్యాహింసామానవివర్జితాః - అసూయ అసత్యము దంభము ఈర్ష్య హింసా గర్వములచే విడిచిపెట్టబడినవారో, సత్యశీలానామ్ - సత్యస్వభావము గల, తేషామ్ - అట్టివారల, కృతాః - చేయబడిన, ఆశిషః - ఆశీస్సులు, విఫలాః - నిష్ఫలములు, న - కావు.

అసూయ (ఇతరుల గుణములను దోషములుగా చూచుట), అసత్యము, డాంబీకము, ఈర్ష్య (ఇతరుల ఉన్నతిని ఓర్వలేకుండుట), హింస, గర్వము లేని సత్యస్వభావులగు వేదవేత్తలు చేసే ఆశీర్వచనములు నిష్ఫలములు కావు.

ఇతి బాలకమాదాయ సామర్గ్యజురుపాకృతైః ।
జలైః పవిత్రౌషధిభిరభిషిచ్య ద్విజోత్తమైః ॥ 14

వాచయిత్వా స్వస్త్యయనం నంధగోపస్సమాహితః ।
హుత్వా చాగ్నిం ద్విజాతిభ్యః ప్రాదాదన్నం మహాగుణమ్ ॥ 15

ఇతి - అని, సమాహితః - నిశ్చయించుకున్న, నందగోపః - నంద గోపుడు, బాలకమ్ - బాలకృష్ణుని, ఆదాయ - తీసుకుని, సామ-ఋగ్-యజుః-ఉపాకృతైః - సామవేద-ఋగ్వేద-యజుర్వేదమంత్రములచే మంత్రించబడినట్టియు, పవిత్ర-ఓషధిభిః - పవిత్రములగు ఓషధులు గల, జలైః - నీళ్లతో, ద్విజ-ఉత్తమైః - బ్రాహ్మణశ్రేష్ఠులచే, అభిషిచ్య - అభిషేకము చేయించి, స్వస్తి-అయనం వాచయిత్వా - పుణ్యాహవాచనమును చేయించి, అగ్నిమ్ - అగ్నిని, హుత్వా చ - హోమము కూడ చేసి, ద్విజాతిభ్యః - బ్రాహ్మణుల కొరకు, మహాగుణమ్ - గొప్ప రుచి గల, అన్నమ్ - ఆహారమును, ప్రాదాత్ - సమర్పించెను.

ఈ విధముగా నిశ్చయించుకొని నందగోపుడు బాలకృష్ణుని తీసుకొని బ్రాహ్మణోత్తములచే అభిషేకము చేయించెను. పవిత్రమగు ఓషధులు కలిపిన ఆ అభిషేకజలములు సామవేద-ఋగ్వేద-యజుర్వేదమంత్రములచే అభిమంత్రించబడినవి. తరువాత పుణ్యాహవాచనమును చేయించి, హోమమును కూడ చేసి, బ్రాహ్మణులకు గొప్ప రుచి గల ఆహారమును సమర్పించెను.

గావస్సర్వగుణోపేతా వాసస్స్రగ్రుక్మమాలినీః ।
ఆత్మజాభ్యుదయార్థాయ ప్రాదాత్తే చాన్వయుంజత ॥ 16

సర్వగుణ-ఉపేతాః - అన్ని మంచి లక్షణములతో కూడినట్టియు, వాసః-స్రగ్-రుక్మమాలినీః - వస్త్రములు పుష్పమాలలు బంగరు మాల గల, గావః

- ఆవులను, ఆత్మజ-అభి-ఉదయ-అర్థాయ - పుత్రుని అభ్యుదయమనే ప్రయోజనము కొరకై, ప్రాదాత్ - ఇచ్చెను, తే చ - వారు కూడ, అను - తరువాత, అయుంజత - ఆశీర్వదించిరి.

ఆయన పుత్రుని క్షేమము కొరకై అన్ని మంచి లక్షణములతో గూడిన ఆవులను వస్త్రములు, పుష్పమాలలు, బంగరు మాలతో సహా ఇచ్చెను. ఆ వేదవేత్తలు ఆశీర్వచనములను పలికిరి.

విప్రా మంత్రవిదో యుక్తాస్తైర్యాః ప్రోక్తాస్తథాఽఽశిషః ।
తా నిష్ఫలా భవిష్యంతి న కదాచిదపి స్ఫుటమ్ ॥ 17

మంత్రవిదః - మంత్రవేత్తలైన, విప్రాః - వేదవిద్వాంసులు, యుక్తాః - ఇంద్రియనిగ్రహము గలవారు, తైః - వారిచే, యాః - ఏ, ఆశిషః - ఆశీస్సులు, ప్రోక్తాః - పలుకబడినవో, తాః - అవి, తథా - అటులనే యగును, కదాచిత్ అపి - ఏనాడైననూ, నిష్ఫలాః - విఫలములు, న భవిష్యంతి - కాబోవు, స్ఫుటమ్ - స్పష్టము.

మంత్రవిదులైన వేదవేత్తలు ఇంద్రియనిగ్రహమును కలిగియుందురు. వారు చేసిన ఆశీస్సులు అటులనే ఫలించును. అవి ఎన్నటికీ నిష్ఫలములు కావనేది తెలిసిన విషయమే.

ఏకదాఽఽరోహమారూఢం లాలయంతీ సుతం సతీ ।
గరిమాణం శిశోర్వోఢుం న సేహే గిరికూటవత్ ॥ 18

ఏకదా - ఒకనాడు, ఆరోహమ్ - ఒడిని, ఆరూఢమ్ - ఎక్కి కూర్చున్న, సుతమ్ - పుత్రుని, లాలయంతీ - ముద్దాడుచున్న, సతీ - యశోదాదేవి, శిశోః - పిల్లవానియొక్క, గిరికూటవత్ - పర్వతశిఖరమువంటి, గరిమాణమ్ - బరువును, వోఢుమ్ - మోయుటకు, న సేహే - సహించలేకుండెను.

ఒకనాడు బాలకృష్ణుడు తల్లి యశోదాదేవి ఒడిలోనికి చేరెను. ఆమె ఆ పుత్రుని లాలిస్తూండగా, హఠాత్తుగా ఆమెకు పిల్లవాడు పర్వతశిఖరము వలె బరువుగా దోచెను. ఆమె ఆ బరువును మోయలేకపోయెను.

భూమౌ నిధాయ తం గోపీ విస్మితా భారపీడితా ।
మహాపురుషమాదధ్యౌ జగతామాస కర్మసు ॥ 19

విస్మితా - ఆశ్చర్యపడినది, భారపీడితా - బరువుచే పీడను పొందినది, గోపీ - గోపిక అగు యశోద, తమ్ - ఆ బాలకృష్ణుని, భూమౌ - నేలపై, నిధాయ - ఉంచి, మహాపురుషమ్ - పురుషోత్తముని, ఆదధ్యౌ - ధ్యానించెను, జగతామ్ - సంసారులకు చెందిన, కర్మసు - పనులయందు, ఆస - ఉండెను.

గోపికయగు యశోద ఆశ్చర్యపడి బరువుచే పీడను పొంది ఆ బాలకృష్ణుని నేలపై ఉంచెను. ఆమె పురుషోత్తముని ధ్యానించి సంసారమునకు చెందిన కర్మలలో నిమగ్నురాలయ్యెను.

దైత్యో నామ్నా తృణావర్తః కంసభృత్యః ప్రణోదితః ।
చక్రవాతస్వరూపేణ జహారాసీనమర్భకమ్ ॥ 20

నామ్నా - పేరుచే, తృణావర్తః - తృణావర్తుడనే, దైత్యః - రాక్షసుడు, కంసభృత్యః - కంసుని సేవకుడు, ప్రణోదితః - పంపబడినవాడు, చక్రవాతస్వరూపేణ - ప్రచండమగు సుడిగాలి రూపముతో, ఆసీనమ్ - కూర్చున్న, అర్భకమ్ - పిల్లవానిని, జహార - ఎత్తుకుపోయెను.

కంసుడు తన సేవకుడైన తృణావర్తుడనే రాక్షసుని పంపెను. ఆతడు పెద్ద సుడిగాలి రూపముతో కూర్చుని ఉన్న బాలకృష్ణుని ఎత్తుకు పోయెను.

గోకులం సర్వమావృణ్వన్ముష్ణంశ్చక్షూంషి రేణుభిః ।
ఈరయన్ సుమహాఘోరశబ్దేన ప్రదిశో దిశః ॥ 21

గోకులమ్ - గోకులమును, సర్వమ్ - అంతనూ, ఆవృణ్వన్ - కప్పివేయుచున్నవాడు, చక్షూంషి - కన్నులను, రేణుభిః - దుమ్ము కణములతో, ముష్ణన్ - హరించువాడు, సుమహాఘోరశబ్దేన - మిక్కిలి భయమును గొల్పె చప్పుడుతో, దిశః - దిక్కులను, ప్రదిశః - మూలలను, ఈరయన్ - నినదింపజేయువాడు.

ఆ సుడిగాలి గోకులమునంతనూ కప్పివేసెను. దుమ్ముకణములతో జనుల కన్నులు మూసుకుపోయెను. మిక్కిలి భయమును గొల్పె శబ్దముతో దిక్కులు, విదిక్కులు ప్రతిధ్వనించెను.

ముహూర్తమభవద్గోష్ఠం రజసా తమసాఽఽవృతమ్ ।
సుతం యశోదా నాపశ్యత్తస్మిన్న్యస్తవతీ యతః ॥ 22

గోష్ఠమ్ - గోకులము, ముహూర్తమ్ - ఇంచుమించు గంట సేపు, రజసా - దుమ్ముతో, తమసా - చీకటితో, ఆవృతమ్ - కప్పివేయబడినది, అభవత్ - ఆయెను, యశోదా - యశోద, యతః - ఎక్కడనైతే, సుతమ్ - పుత్రుని, న్యస్తవతీ - ఉంచినదో, తస్మిన్ - ఆ స్థానమునందు, న అపశ్యత్ - కనలేదు.

గోకులము ఇంచుమించు గంట సేపు దుమ్ముతో చీకటితో కప్పివేయబడెను. యశోద ఎక్కడనైతే కూర్చుండబెట్టెనో అక్కడ పుత్రుడు కనబడలేదు.

నాపశ్యత్కశ్చనాత్మానం పరం చాపి విమోహితః ।
తృణావర్తనిసృష్టాభిశ్శర్కరాభిరుపద్రుతః ॥ 23

తృణావర్తనిసృష్టాభిః - తృణావర్తునిచే విసురబడిన, శర్కరాభిః - ఇసుక రేణువులచే, ఉపద్రుతః - ఉద్విగ్నుడైనవాడు, విమోహితః - వ్యామోహమును పొందినవాడు, కశ్చన - ఎవ్వడైననూ, ఆత్మానమ్ - తనను, పరం చ అపి - ఇతరుని కూడ, న అపశ్యత్ - కనలేదు.

తృణావర్తుడు విసిరిన ఇసుకరేణువులచే ఉద్విగ్నుడై వ్యామోహితుడైన ఏ ఒక్కడైననూ తనను గాని, ఇతరుని గాని చూడలేకపోయెను.

ఇతి ఖరపవనచక్రపాంసువర్షే సుతపదవీమబలాఽవిలక్ష్య మాతా,
అతికరుణమనుస్మరంత్యశోచద్భువి పతితా మృతవత్సకా యథా గౌః।

ఇతి - ఈ విధముగా, ఖరపవనచక్రపాంసువర్షే - తీక్ష్ణమైన గాలియొక్క సుడి వలన కలిగిన దుమ్ము వర్షమునందు, సుతపదవీమ్ - పుత్రుని జాడను, అవిలక్ష్య - కానరాక, అబలా - నిస్సహాయురాలైన,

మాతా - తల్లి యశోద, అనుస్మరంతీ - నిరంతరముగా స్మరించుచున్నదై, అతికరుణమ్ - మిక్కిలి దీనముగా, భువి - నేలపై, పతితా - పడినదై, మృతవత్సకా - మరణించిన లేగ గల, గౌః యథా - ఆవు వలె, అశోచత్ - దుఃఖించెను. 24

ఈ విధముగా తీక్ష్ణమైన సుడిగాలి వర్షించిన దుమ్ములో పుత్రుని జాడ తల్లి యశోదకు కానరాలేదు. నిస్సహాయురాలగు ఆమె నిరంతరముగా కృష్ణునే స్మరిస్తూ నేలపై పడి, లేగదూడ మరణించిన ఆవు వలె, అతిదీనముగా శోకించెను.

రుదితమనునిశమ్య తత్ర గోప్యో భృశమనుతప్తధియోऽశ్రుపూర్ణముఖ్యః।
రురుదురనుపలభ్య నందసూనుం పవన ఉపారతపాంసువర్షవేగే ।।25

అను - తరువాత, పవనే - గాలి, ఉపారతపాంసువర్షవేగే - తగ్గిన దుమ్ము వర్షముయొక్క వేగము గలది కాగా, రుదితమ్ - ఏడ్పును, నిశమ్య - విని, తత్ర - అక్కడ, అశ్రుపూర్ణముఖ్యః - కన్నీళ్లతో నిండిన ముఖములు గల, గోప్యః - గోపికలు, భృశమ్ - మిక్కిలి, అనుతప్తధియః - తాపమును పొందిన మనస్సులు గలవారై, నందసూనుమ్ - నందపుత్రుడగు బాలకృష్ణుని, అనుపలభ్య - కానక, రురుదుః - ఏడ్చిరి.

తరువాత గాలి తగ్గి దుమ్ము వర్షముయొక్క వేగము శాంతించెను. గోపికలు ఆ నందుని ఇంటియందు ఏడ్పును వినిరి. నందపుత్రుడగు బాలకృష్ణుని కానరాక వారి మనస్సులు మిక్కుటమగు తాపమును పొందెను. వారు కన్నీళ్లు నిండిన ముఖములు గలవారై ఏడ్చిరి.

తృణావర్తశ్శాంతరయో వాత్యారూపధరో హరన్ ।
కృష్ణం నభోగతో గంతుం నాశక్నోద్భూరిభారభృత్ ।। 26

వాత్యారూపధరః - సుడిగాలి రూపమును దాల్చినవాడై, కృష్ణమ్ - బాలకృష్ణుని, హరన్ - ఎత్తుకొనిపోవుచున్న, తృణావర్తః - తృణావర్తుడు, నభః-గతః - ఆకాశమును చేరినవాడై, భూరిభారభృత్ - పెద్ద బరువును మోయుచున్నవాడై, శాంతరయః - తగ్గిన వేగము గలవాడై, గంతుమ్ - వెళ్లుటకు, న అశక్నోత్ - సమర్థుడు కాలేదు.

సుడిగాలి రూపమును దాల్చి బాలకృష్ణుని ఎత్తుకొని పోయిన తృణావర్తుడు ఆకాశమును చేరెను. కాని, మోయుచున్న బరువు పెద్దదగుట వలన ఆతని వేగము తగ్గి ముందుకు వెళ్లే శక్తిని కోల్పోయెను.

తమశ్మానం మన్యమాన ఆత్మనో గురుమత్తయా ।
గలే గృహీత ఉత్స్రష్టుం నాశక్నోదద్భుతార్భకమ్ ॥ 27

ఆత్మనః - తనకంటె, గురుమత్తయా - ఎక్కువ బరువు ఉండుటచే, తమ్ - ఆ, అద్భుత-అర్భకమ్ - విడ్డూరపు పిల్లవానిని, అశ్మానమ్ - బండరాతినిగా, మన్యమానః - తలపోయువాడై, గలే - మెడయందు, గృహీతః - పట్టుకొనబడినవాడై, ఉత్స్రష్టుమ్ - విడిపించుకొనుటకు, న అశక్నోత్ - సమర్థుడు కాలేదు.

ఆ విడ్డూరపు పిల్లవాడు తృణావర్తుని కంటె ఎక్కువ బరువు ఉండెను. ఆ పిల్లవాడు వానికి బండరాయి వలె అనిపించెను. బాలకృష్ణుడు వానిని మెడ పట్టుకొనగా, వాడు విడిపించుకొనలేకపోయెను.

గలగ్రహణనిశ్చేష్టో దైత్యో నిర్గతలోచనః ।
అవ్యక్తరావో న్యపతత్సహబాలో వ్యసుర్వ్రజే ॥ 28

గలగ్రహణనిశ్చేష్టః - మెడయందు పట్టుకొనుటచే ఉడిగిన చేష్టలు గలవాడు, నిర్గతలోచనః - బయటకు వచ్చిన కన్నులు గలవాడు, అవ్యక్తరావః - వినరాని ధ్వని గలవాడు అగు, దైత్యః - రాక్షసుడు, వి-అసుః - పోయిన ప్రాణములు గలవాడై, సహబాలః - పిల్లవానితో గూడినవాడై, వ్రజే - గోకులమునందు, న్యపతత్ - క్రింద బడెను.

మెడయందు పట్టుకొనుటచే ఆ రాక్షసుని చేష్టలు ఉడిగి కళ్లు పైకి ఉబికెను. వాని నోటినుండి ధ్వని వచ్చుట లేదు. వాడు ప్రాణములు పోయి పిల్లవానితో సహా గోకులములో క్రింద బడెను.

తమంతరిక్షాత్పతితం శిలాయాం విశీర్ణసర్వావయవం కరాలమ్ ।
పురం యథా రుద్రశరేణ విద్ధం స్త్రియో రుదత్యో దదృశుస్సమేతాః॥

రుద్రశరేణ - రుద్రుని బాణముచే, విద్ధమ్ - కొట్టబడిన, పురం యథా - త్రిపురము వలె, అంతరిక్షాత్ - ఆకసమునుండి, శిలాయామ్ - రాతిపై, పతితమ్ - పడినట్టియు, విశీర్ణసర్వ-అవయవమ్ - నుగ్గైన అన్ని అవయవములు కలిగినట్టియు, కరాలమ్ - భయమును గొల్పే, తమ్ - ఆ రాక్షసుని, రుదత్యః - ఏడ్చుచున్న, స్త్రియః - గోపికలు, సమేతాః - గుమిగూడినవారై, దదృశుః - చూచిరి. 29

రుద్రుని బాణముచే కొట్టబడిన త్రిపురము వలె ఆ రాక్షసుడు ఆకసమునుండి రాతిపై పడెను. వాని అవయవములన్నియు నుగ్గు నుగ్గై భయమును గొల్పెను. ఏడ్చుచున్న గోపికలు గుమిగూడి వానిని చూచిరి.

ప్రాదాయ మాత్రే ప్రతిహృత్య విస్మితాః
కృష్ణం చ తస్యోరసి లంబమానమ్ ।
తం స్వస్తిమంతం పురుషాదనీతం
విహాయసా మృత్యుముఖాత్ప్రముక్తమ్ ।
గోప్యశ్చ గోపాః కిల నందముఖ్యా
లబ్ధ్వా పునః ప్రాపురతీవ మోదమ్ ।। 30

తస్య - ఆ రాక్షసునియొక్క, ఉరసి - వక్షఃస్థలమునందు, లంబమానమ్ - వ్రేలాడుచున్న, కృష్ణం చ - బాలకృష్ణుని, ప్రాదాయ - తీసుకొని, మాత్రే - తల్లి కొరకు, ప్రతిహృత్య - అప్పజెప్పి, విస్మితాః - చకితులైనవారు, విహాయసా - ఆకాశమార్గముచే, పురుషాదనీతమ్ - నరమాంసభక్షకుడగు రాక్షసునిచే ఎత్తుకుపోబడినట్టియు, స్వస్తిమంతమ్ - క్షేమముగానున్నట్టియు, మృత్యుముఖాత్ - మృత్యువు నోటినుండి, ప్రముక్తమ్ - విడిచిపెట్టబడిన, తమ్ - ఆ బాలకృష్ణుని, పునః - తిరిగి, లబ్ధ్వా - పొంది, గోప్యః - గోపికలు, నందముఖ్యాః - నందుడు మొదలుగా గల, గోపాః చ - గోపాలకులు కూడ, అతీవ - అతిశయించిన, మోదమ్ - ఆనందమును, ప్రాపుః - పొందిరి.

ఆ రాక్షసుని వక్షఃస్థలముపై వ్రేలాడుచున్న బాలకృష్ణుని చకితులైన గోపికలు తీసుకొని తల్లి యశోదకు అప్పజెప్పిరి. నరమాంసభక్షకుడగు రాక్షసుడు ఆకాశమార్గము గుండా ఎత్తుకొనిపోగా బాలకృష్ణుడు

క్షేమముగనే ఉండెను. మృత్యువు నోటినుండి విముక్తుడైన ఆ బాలకృష్ణుని తిరిగి పొంది గోపికలు, నందుడు మొదలుగా గల గోపాలకులు కూడ అతిశయించిన ఆనందమును పొందిరి.

అహో బతాత్యద్భుతమేష రక్షసా
బాలో నివృత్తిం గమితోఽభ్యగాత్పునః ।
హింస్రస్స్వపాపేన విహింసితః ఖలః
సాధుస్సమత్వేన భయాద్విముచ్యతే ॥ 31

అహో - ఆశ్చర్యము!, బత - ఆహా!, అతి-అద్భుతమ్ - గొప్ప అద్భుతము!, ఏషః - ఈ, బాలః - బుడతడు, రక్షసా - రాక్షసునిచే, నివృత్తిమ్ - మృత్యువును, గమితః - పొందించబడినవాడై, పునః - మరల, అభ్యగాత్ - ఎదురుగా వచ్చెను, హింస్రః - హింసించే, ఖలః - దుష్టుడు, స్వపాపేన - తన పాపముచే, విహింసితః - హింసించబడినవాడు, సాధుః - మంచివాడు, సమత్వేన - సమదృష్టిచే, భయాత్ - భయమునుండి, విముచ్యతే - విడిపించబడును.

ఆశ్చర్యము! ఆహా! గొప్ప అద్భుతము! రాక్షసుని చేతిలో మృత్యువు వాత పడిన ఈ బుడతడు మరల ఎదురుగా వచ్చినాడు. హింసించే ఆ దుష్టుడు తన పాపముచేతనే మృత్యువు వాత పడినాడు. సత్పురుషునకు వాని సమదృష్టియే భయమునుండి విముక్తిని కలిగించును.

కిం నస్తపశ్చీర్ణమధోక్షజార్చనం
పూర్తేష్టదత్తముత భూతసౌహృదమ్ ।
యత్సంపరేతః పునరేవ బాలకో
దిష్ట్యా స్వబంధూన్ప్రణయన్నుపస్థితః ॥ 32

నః - మనచే, తపః - తపస్సు, అధోక్షజ-అర్చనమ్ - ఇంద్రియగోచరుడు కాని శ్రీహరియొక్క ఆరాధనము, పూర్తేష్టదత్తమ్ - పూర్తకర్మలు యజ్ఞములు దానములు, ఉత - లేదా, భూతసౌహృదమ్ - భూతదయ, కిమ్ - ఏది, చీర్ణమ్ - ఆచరించబడినది?, యత్ - ఏలయన, సంపరేతః - మరణించిన, బాలకః - పిల్లవాడు, పునః - మరల,

స్వబంధూన్ - తన బంధువులను, ప్రణయన్ - హర్షింపజేయుచున్నవాడై, ఉపస్థితః - ముందున్నవాడు, దిష్ట్యా ఏవ - మంగళమే ఘటిల్లినది.

మనము ఏమి తపస్సును చేసితిమి? లేక, ఇంద్రియగోచరము కాని శ్రీహరిని ఆరాధించితిమా? నూతులు త్రవ్వించుట మొదలగు సమాజహితకార్యములను చేసితిమా? యజ్ఞయాగాదులను చేసితిమా? దానములను చేసితిమా? లేక ప్రాణులపై దయను చూపితిమా? ఎందుకంటే, మరణించిన పిల్లవాడు మరల తన బంధువులను హర్షింపజేస్తూ మన ముందున్నాడు. ఇది పరమమంగళము.

దృష్ట్వాఽద్భుతాని బహుశో నందగోపో బృహద్వనే ।
వసుదేవవచో భూయో మానయామాస విస్మితః ॥ 33

నందగోపః - నందగోపుడు, బృహద్వనే - మహావనమునందు, బహుశః - పలు ప్రకారములుగా, అద్భుతాని - అద్భుతములను, దృష్ట్వా - చూచి, విస్మితః - చకితుడై, భూయః - మరల, వసుదేవవచః - వసుదేవుని మాటను, మానయామాస - మెచ్చుకొనెను.

నందగోపుడు మహావనములో పలు విధములైన అద్భుతములను చూచి చకితుడై, మరల వసుదేవుని మాటను మెచ్చుకొనెను.

ఏకదాఽర్భకమాదాయ స్వాంకమారోప్య భామినీ ।
ప్రస్నుతం పాయయామాస స్తనం స్నేహపరిప్లుతా ॥ 34

ఏకదా - ఒకనాడు, భామినీ - తేజస్వినియగు యశోదాదేవి, అర్భకమ్ - బాలకృష్ణుని, ఆదాయ - తీసుకొని, స్వ-అంకమ్ - తన ఒడిని, ఆరోప్య - కూర్చుండబెట్టుకొని, స్నేహపరిప్లుతా - ప్రేమచే ముంచెత్తబడినదై, ప్రస్నుతమ్ - పాలను స్రవించుచున్న, స్తనమ్ - స్తనమును, పాయయామాస - త్రావించెను.

ఒకనాడు తేజస్వినియగు యశోదాదేవి బాలకృష్ణుని తీసుకొని ఒడిలో కూర్చుండబెట్టుకొనెను. ఆమె హృదయము ప్రేమచే ముంచెత్తబడెను. ఆమె పాలను స్రవించుచున్న స్తనమును వానిచే త్రావించెను.

పీతప్రాయస్య జననీ సా తస్య రుచిరస్మితమ్ ।
ముఖం లాలయతీ రాజఞ్జృంభతో దదృశే ఇదమ్ ॥ 35

రాజన్ - ఓ రాజా!, జననీ - తల్లి యశోద, పీతప్రాయస్య - ఇంచుమించు త్రాగటము పూర్తి అయిన, తస్య - ఆ పిల్లవాని, రుచిరస్మితమ్ - ప్రకాశించే చిరునవ్వు గల, ముఖమ్ - ముఖమును, లాలయతీ - ముద్దాడుచున్నదై, జృంభతః - ఆవులించుచున్న పిల్లవాని (నోటియందు), ఇదమ్ - ఈ జగత్తును, దదృశే - చూచెను.

ఓ పరీక్షిన్మహారాజా! బాలకృష్ణుడు పాలు త్రాగుట ఇంచుమించు పూర్తి అయ్యెను. తల్లి యశోద ప్రకాశించే చిరునవ్వు గల వాని ముఖమును ముద్దాడెను. ఆవులించిన కృష్ణుని నోటిలో ఆమె ఈ జగత్తును చూచెను.

ఖం రోదసీ జ్యోతిరనీకమాశాస్సూర్యేందువహ్నిశ్వసనాంబుధీంశ్చ ।
ద్వీపాన్నగాంస్తద్దుహితౄర్వనాని భూతాని యాని స్థిరజంగమాని ॥ 36

ఖమ్ - ఆకాశమును, రోదసీ - ద్యులోకభూలోకములను, జ్యోతిః-అనీకమ్ - నక్షత్రముల సముదాయమును, ఆశాన్ - దిక్కులను, సూర్య-ఇందువహ్నిశ్వసన-అంబుధీన్ చ - సూర్యుడు చంద్రుడు అగ్ని వాయువు సముద్రములను కూడ, ద్వీపాన్ - ద్వీపములను, నగాన్ - పర్వతములను, తద్-దుహితౄః - వాటినుండి పుట్టే నదులను, వనాని - అడవులను, యాని - ఏ, స్థిరజంగమాని - కదిలే మరియు కదలని, భూతాని - ప్రాణులు గలవో వాటిని.

ఆకాశమును, ద్యులోకమును, భూలోకమును, నక్షత్రముల గుంపును, దిక్కులను, సూర్యుని, చంద్రుని, అగ్నిని, వాయువును, సముద్రములను, ద్వీపములను, పర్వతములను, వాటినుండి పుట్టే నదులను, అడవులను, కదిలే మరియు కదలని ప్రాణులను కూడ ఆమె చూచెను.

సా వీక్ష్య విశ్వం సహసా రాజన్ సంజాతవేపథుః ।
సమ్మీల్య మృగశాబాక్షీ నేత్రే ఆసీత్సువిస్మితా ॥ 37

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే సప్తమోఽధ్యాయః ॥

రాజన్ - ఓ రాజా!, మృగశాబ-అక్షీ - లేడి కూన కన్నులవంటి కన్నులు గల, సా - ఆమె, సహసా - అకస్మాత్తుగా, విశ్వమ్ - జగత్తును, వీక్ష్య - చూచి, సంజాతవేపథుః - పుట్టిన వణుకు గలదై, నేత్రే - రెండు కళ్లను, సమ్మీల్య - గట్టిగా మూసుకొని, సువిస్మితా - మిక్కిలి ఆశ్చర్యమును పొందినదై, ఆసీత్ - ఉండెను.

ఓ పరీక్షిన్మహారాజా! లేడి కూన కన్నులవంటి కన్నులు గల ఆ యశోదకు అకస్మాత్తుగా జగత్తును చూడగానే వణుకు పుట్టెను. ఆమె మిక్కిలి ఆశ్చర్యమును పొంది రెండు కళ్లను గట్టిగా మూసుకొని యుండెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్థములో శకటాసుర సంహారమును, తృణావర్తుని
ఉద్ధారమును వర్ణించే ఏడవ అధ్యాయము ముగిసినది (7).



# అథ అష్టమోఽధ్యాయః

## శ్రీకృష్ణ బలరాముల బాల్య లీలలు

గర్గః పురోహితో రాజన్ యదూనాం సుమహాతపాః ।
వ్రజం జగామ నందస్య వసుదేవప్రచోదితః ॥ 1

రాజన్ - ఓ రాజా!, యదూనామ్ - యాదవుల, పురోహితః - పురోహితుడు, సుమహాతపాః - చాల గొప్ప తపస్సు గలవాడు అగు, గర్గః - గర్గుడు, వసుదేవప్రచోదితః - వసుదేవునిచే ప్రేరేపించబడినవాడై, నందస్య - నందుని, వ్రజమ్ - గోకులమును గురించి, జగామ - వెళ్లెను.

ఓ పరీక్షిన్మహారాజా! యాదవుల పురోహితుడగు గర్గుడు చాల గొప్ప తపస్వి. వసుదేవుని ప్రేరణచే ఆయన నందుని గోకులమునకు వెళ్లెను.

తం దృష్ట్వా పరమప్రీతః ప్రత్యుత్థాయ కృతాంజలిః ।
ఆనర్చాధోక్షజధియా ప్రణిపాతపురస్సరమ్ ॥ 2

తమ్ - ఆయనను, దృష్ట్వా - చూచి, పరమప్రీతః - మిక్కిలి సంతోషించిన నందుడు, కృత-అంజలిః - చేయబడిన దోసిలి గలవాడై, ప్రతి-ఉత్థాయ - లేచి ఎదురేగి, ప్రణిపాతపురస్సరమ్ - పాదనమస్కారముతో మొదలుపెట్టి, అధోక్షజధియా - ఇంద్రియగోచరుడు కాని శ్రీహరియేననే భావనతో, ఆనర్చ - పూజించెను.

ఆయనను చూచి నందుడు చాల ప్రీతిని పొందెను. ఆతడు అంజలి ఘటించి లేచి యెదురేగెను. ఇంద్రియగోచరుడు కాని శ్రీహరియేనా అన్నట్లు పాదనమస్కారముతో ఆరంభించి నందుడాయనను పూజించెను.

సూపవిష్టం కృతాతిథ్యం గిరా సూనృతయా మునిమ్ ।
నందయిత్వాఽబ్రవీద్బ్రహ్మన్ పూర్ణస్య కరవామ కిమ్ ॥ 3

కృత-ఆతిథ్యమ్ - చేయబడిన అతిథిసత్కారము కలిగినట్టియు, సు-ఉపవిష్టమ్ - చక్కగా కూర్చుండియున్న, మునిమ్ - గర్గమునిని, నందయిత్వా - అభినందనము చేసి, సూనృతయా - యథార్థమధురమైన, గిరా - వాక్కుతో, అబ్రవీత్ - పలికెను, బ్రహ్మన్ - ఓ మహర్షీ!, పూర్ణస్య - పూర్ణుడవగు నీకు, కిమ్ - దేనిని, కరవామ - చేసెదము?

గర్గముని అతిథిసత్కారమును స్వీకరించి విశ్రాంతిగా కూర్చుని యుండెను. నందుడు ఆయనను అభినందించి యథార్థమధురమగు వాక్కుతో నిట్లనెను -- ఓ మహర్షీ! పూర్ణుడవగు నీకు మేము చేయదగినది ఏమి గలదు?

మహద్విచలనం నృణాం గృహిణాం దీనచేతసామ్ ।
నిశ్శ్రేయసాయ భగవన్ కల్పతే నాన్యథా క్వచిత్ ॥ 4

భగవన్ - ఓ పూజనీయా!, గృహిణామ్ - గృహస్థులైనట్టియు, దీనచేతసామ్ - దీనమైన మనస్సు గల, నృణామ్ - మానవులకు, మహద్-విచలనమ్ - మహాత్ములు తమ స్థానమును విడుచుట, నిశ్శ్రేయసాయ - మోక్షము కొరకు, కల్పతే - సమర్థమగును, క్వచిత్ - ఎప్పుడైననూ, అన్యథా - మరియొక విధముగా, న - కాదు.

ఓ పూజనీయా! గృహస్థులగు మానవులు దీనమైన చిత్తము కలిగి యుందురు. మహాత్ములు తమ స్థానమును వీడి వారి యింటికి వచ్చుట వారి పరమకల్యాణము కొరకే. అంతేగాని, మహాత్ముల రాకకు స్వప్రయోజనము ఏనాడైననూ ఉండదు.

జ్యోతిషామయనం సాక్షాద్యత్తజ్జ్ఞానమతీంద్రియమ్ ।
ప్రణీతం భవతా యేన పుమాన్వేద పరావరమ్ ॥ 5

యత్ - ఏ, జ్ఞానమ్ - జ్ఞానము, అతి-ఇంద్రియమ్ - ఇంద్రియగోచరము కాదో, తత్ - అట్టి, జ్యోతిషామ్ - గ్రహాదుల, అయనమ్ - ఫలమును బోధించే శాస్త్రము, సాక్షాత్ - సాక్షాత్తుగా, భవతా - తమరిచే, ప్రణీతమ్ - రచించబడినది, యేన - దేనిచేనైతే, పుమాన్ - మానవుడు, పర-అవరమ్ -

పూర్వజన్మయందలి కర్మను ఈ జన్మయందలి సుఖాదికమును, వేద - తెలియునో.

అతీంద్రియమగు జ్ఞానమును బోధించే జ్యోతిశ్శాస్త్రమును రచించినది సాక్షాత్తు తమరే. దాని ద్వారా మానవుడు పూర్వజన్మల కర్మలను గురించి, ఇహజన్మయందలి సుఖదుఃఖముల గురించి తెలియగల్గును.

త్వం హి బ్రహ్మవిదాం శ్రేష్ఠస్సంస్కారాన్ కర్తుమర్హసి ।
బాలయోరనయోర్నౄణాం జన్మనా బ్రాహ్మణో గురుః ।। 6

త్వమ్ - నీవు, బ్రహ్మవిదామ్ - వేదవేత్తలలో, శ్రేష్ఠః - శ్రేష్ఠుడవు, హి - నిశ్చయము, అనయోః - ఈ, బాలయోః - ఇద్దరు బాలకులకు, సంస్కారాన్ - సంస్కారములను, కర్తుమ్ - చేయుటకు, అర్హసి - తగుదువు, నృణామ్ - మానవులకు, జన్మనా - పుట్టుకచే, బ్రాహ్మణః - బ్రాహ్మణుడు, గురుః - గురువు.

నీవు వేదవేత్తలలో శ్రేష్ఠుడవనేది నిశ్చయము. తమరీ ఇద్దరు బాలకులకు నామకరణాది సంస్కారములను చేయదగును. పుట్టుకచే బ్రాహ్మణుడు మానవులకు గురువు.

గర్గ ఉవాచ ।
యదూనామహమాచార్యః ఖ్యాతశ్చ భువి సర్వతః ।
సుతం మయా సంస్కృతం తే మన్యతే దేవకీసుతమ్ ।। 7

అహమ్ - నేను, యదూనామ్ - యాదవులకు, ఆచార్యః - గురువును, భువి = భూలోకమునందు, సర్వతః - అంతటా, ఖ్యాతః చ - ప్రసిద్ధి జెందినవాడను, మయా - నాచే, సంస్కృతమ్ - సంస్కారము చేయబడిన, తే - నీ, సుతమ్ - పుత్రుని, దేవకీసుతమ్ - దేవకియొక్క పుత్రుడని, మన్యతే - తలపోయును.

గర్గాచార్యుడిట్లు పలికెను --- నేను యాదవుల గురువునని లోకములో అంతటా ప్రసిద్ధి జెందినవాడను. నేను నీ పుత్రునకు సంస్కారమును చేసినచో, జనులు నీ పుత్రుని దేవకి పుత్రుడనియే భావించెదరు.

కంసః పాపమతిస్సఖ్యం తవ చానకదుందుభేః ।
దేవక్యా అష్టమో గర్భో న స్త్రీ భవితుమర్హతి ॥ 8

ఇతి సంచింతయఞ్ఛ్రుత్వా దేవకీదారికావచః ।
అపి హంతాఽఽగతాశంకస్తర్హి తన్నోఽనయో భవేత్ ॥ 9

పాపమతిః - దుర్బుద్ధియగు, కంసః - కంసుడు, దేవకీదారికావచః - దేవకియొక్క కుమార్తెయొక్క మాటను, శ్రుత్వా - విని, దేవక్యాః - దేవకియొక్క, అష్టమః - ఎనిమిదవ, గర్భః - సంతానము, స్త్రీ - స్త్రీ, భవితుమ్ - అగుటకు, న అర్హతి - తగదు, ఇతి - అని, తవ - నీకు, ఆనకదుందుభేః - వసుదేవునకు, సఖ్యం చ - స్నేహమును కూడ, సంచింతయన్ - విచారము చేయువాడై, ఆగత-ఆశంకః - కలిగిన శంక గలవాడై, హంతా అపి - సంహరించే పక్షములో, తర్హి - అప్పుడు, తత్ - అది, నః - మనకు, అనయః - అనర్థము, భవేత్ - అగును.

కంసుడు దుర్బుద్ధి. నిన్ను చంపువాడు ఇప్పటికే పుట్టినాడు, అని దేవకియొక్క కుమార్తె చెప్పినదానిని ఆతడు వినియున్నాడు. దానిని బట్టి దేవకియొక్క ఎనిమిదవ శిశువు అమ్మాయి కాదని ఆతడు గ్రహించి యుండును. పైగా, నీకు వసుదేవునకు స్నేహమని కూడ ఆతనికి తెలియును. ఆతడు ఈ విషయములను విచారము చేసి శంక కలిగినవాడై, కృష్ణాదులను చంపినచో, అది మనకు అనర్థము అగును.

నంద ఉవాచ ।
అలక్షితోఽస్మిన్ రహసి మామకైరపి గోవ్రజే ।
కురు ద్విజాతిసంస్కారం స్వస్తివాచనపూర్వకమ్ ॥ 10

అస్మిన్ - ఈ, గోవ్రజే - గోకులమునందు (గోశాలయందు), రహసి - ఏకాంతమునందు, మామకైః అపి - నావారిచే కూడ, అలక్షితః - కనబడనివాడవై, స్వస్తివాచనపూర్వకమ్ - పుణ్యాహవాచనపూర్వకముగా, ద్విజాతిసంస్కారమ్ - రెండవ జన్మకు అర్హమైన సంస్కారమును, కురు - చేయుము.

నందుడిట్లు పలికెను --- ఈ గోకులములోని గోశాలయందు ఏకాంతములో నావారికి కూడ కనబడకుండా స్వస్తివాచనమును చేసి, నామకరణాది ద్విజసంస్కారమును చేయుడు.

శ్రీశుక ఉవాచ ।
ఏవం సంప్రార్థితో విప్రస్స్వచికీర్షితమేవ తత్ ।
చకార నామకరణం గూఢో రహసి బాలయోః ।। 11

ఏవమ్ - ఈ విధముగా, సంప్రార్థితః - గట్టిగా కోరబడిన, విప్రః - వేదవేత్తయగు గర్గుడు, గూఢః - తెలియబడనివాడై, రహసి - ఏకాంతమునందు, బాలయోః - పిల్లలిద్దరికి, నామకరణమ్ - నామకరణమును, చకార - చేసెను, తత్ - అది, స్వచికీర్షితం ఏవ - తాను చేయ గోరినది మాత్రమే.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గర్గుడు నామకరణమును చేయాలనే కోరెను. ఈ విధముగా నందుడు గట్టిగా కోరగా ఆయన ఏకాంతములో రహస్యముగా పిల్లలిద్దరికి నామకరణ సంస్కారమును చేసెను.

గర్గ ఉవాచ ।
అయం హి రోహిణీపుత్రో రమయన్ సుహృదో గుణైః ।
ఆఖ్యాస్యతే రామ ఇతి బలాధిక్యాద్బలం విదుః ।
యదూనామపృథగ్భావాత్సంకర్షణముశంత్యుత ।। 12

అయమ్ - ఈ, రోహిణీపుత్రః హి - రోహిణియొక్క పుత్రుడైతే, సుహృదః - మిత్రులను, గుణైః - గుణములతో, రమయన్ - రమింపజేయువాడు, రామః - రాముడు, ఇతి - అని, ఆఖ్యాస్యతే - పిలువబడగలడు, బల-ఆధిక్యాత్ - బలముయొక్క అధికముగా నుండుట వలన, బలమ్ - బలునిగా, విదుః - తెలియుదురు, యదూనామ్ - యాదవులకు, అపృథగ్-భావాత్ - ఐకమత్యమును కలిగించుట వలన, సంకర్షణం అపి - సంకర్షణునిగా కూడ, ఉశంతి - కోరెదరు.

గర్గాచార్యుడిట్లు పలికెను --- ఈ రోహిణియొక్క పుత్రుడైతే మిత్రులను తన మంచి గుణములచే రమింపజేయును. కావున, ఇతడు రాముడు అని

పిలువబడగలడు. ఈతనికి బలము అధికముగా నుండుట వలన జనులు బలుడు అని పిలిచెదరు. ఈతడు యాదవులలో ఐకమత్యమును స్థాపించును గనుక, ఇతనిని సంకర్షణుడు (దగ్గరకు లాగువాడు) అని కూడ జనులు పిలువ గోరెదరు.

ఆసన్ వర్ణాస్త్రయో హ్యస్య గృహ్ణతోఽనుయుగం తనూః ।
శుక్లో రక్తస్తథా పీత ఇదానీం కృష్ణతాం గతః ॥ 13

అనుయుగమ్ - ప్రతి యుగమునందు, హి - నిశ్చయముగా, తనూః - దేహములను, గృహ్ణతః - స్వీకరించే, అస్య - ఈ బాలకునకు, శుక్లః - తెల్లనిది, రక్తః - ఎర్రనిది, పీతః - పచ్చనిది అనే, వర్ణాః - రంగులు, ఆసన్ - ఉండెను, ఇదానీమ్ - ఇప్పుడు, కృష్ణతామ్ - నల్ల రంగును, గతః - పొందినవాడు.

ప్రతియుగమునందు దేహములను స్వీకరించే ఈ నీ పుత్రునకు తెలుపు, ఎరుపు, పచ్చన అనే మూడు రంగులు ఇదివరలో ఉండెను. ఇప్పుడు నలుపు రంగును పొందినాడు. (కావున, కృష్ణుడనబడును).

ప్రాగయం వసుదేవస్య క్వచిజ్జాతస్తవాత్మజః ।
వాసుదేవ ఇతి శ్రీమానభిజ్ఞాస్సంప్రచక్షతే ॥ 14

శ్రీమాన్ - శోభాయుక్తుడగు, అయమ్ - ఈ, తవ - నీ, ఆత్మజః - పుత్రుడు, ప్రాక్ - పూర్వము, క్వచిత్ - ఒకప్పుడు, వసుదేవస్య - వసుదేవునకు, జాతః - పుట్టినవాడు, వాసుదేవః - వాసుదేవుడు, ఇతి - అని, అభిజ్ఞాః - రహస్యము దెలిసినవారు, సంప్రచక్షతే - చెప్పెదరు.

శోభిల్లే ఈ నీ పుత్రుడు పూర్వము ఒకప్పుడు వసుదేవునకు పుత్రుడైనాడు. కావున, రహస్యము దెలిసినవారు ఈతనిని వాసుదేవుడు (వసుదేవ పుత్రుడు) అని పిలిచెదరు.

బహూని సంతి నామాని రూపాణి చ సుతస్య తే ।
గుణకర్మానురూపాణి తాన్యహం వేద నో జనాః ॥ 15

తే - నీ, సుతస్య - పుత్రునకు, బహూని - చాల, గుణకర్మ-అనురూపాణి - గుణములకు లీలలకు తగిన, నామాని - పేర్లు, రూపాణి చ - రూపములు కూడ, సంతి - కలవు, తాని - వాటిని, అహమ్ - నేను, వేద - ఎరుగుదును, జనాః - జనులు, నో - తెలియరు.

నీ పుత్రునకు గుణములకు లీలలకు తగిన చాల పేర్లు, రూపములు కూడ గలవు. అవి నాకు తెలియునే గాని, జనులకు తెలియవు.

ఏష వశ్శ్రేయ ఆధాస్యద్గోపగోకులనందనః ।
అనేన సర్వదుర్గాణి యూయమంజస్తరిష్యథ ॥ 16

గోపగోకులనందనః - గోపాలకులను గోకులమును ఆనందింపజేసే, ఏషః - ఈ బాలకుడు, వః - మీకు, శ్రేయః - శ్రేయస్సును, ఆధాస్యత్ - కలిగించగలడు, యూయమ్ - మీరు, అనేన - ఈతనితో, సర్వదుర్గాణి - అన్ని కష్టములను, అంజః - తేలికగా, తరిష్యథ - దాటివేయగలరు.

గోపాలకులను, గోకులమును ఆనందింపజేసే ఈ బాలకుడు మీకు శ్రేయస్సును కలిగించగలడు. ఇతని ద్వారా మీరు కష్టములనన్నింటినీ అతిక్రమించెదరు.

పురాऽనేన వ్రజపతే సాధవో దస్యుపీడితాః ।
అరాజకే రక్ష్యమాణా జిగ్యుర్దస్యూన్ సమేధితాః ॥ 17

వ్రజపతే - ఓ గోకులప్రభూ!, పురా - పూర్వము, అరాజకే - రాజు లేనప్పుడు, దస్యుపీడితాః - చోరులచే పీడించబడిన, సాధవః - సజ్జనులు, అనేన - ఈతనిచే, రక్ష్యమాణాః - రక్షింపబడుచున్నవారై, సమేధితాః - వర్ధిల్ల జేయబడినవారై, దస్యూన్ - చోరులను, జిగ్యుః - జయించిరి.

పూర్వము ఒకప్పుడు (వేనుని కాలమునందు) అరాచకమేర్పడెను. అప్పుడు చోరులు సజ్జనులను పీడించజొచ్చిరి. అపుడీతడు వారిని రక్షించి వర్ధిల్ల జేయగా, వారు చోరులను జయించిరి.

య ఏతస్మిన్మహాభాగాః ప్రీతిం కుర్వంతి మానవాః ।
నారయోऽభిభవంత్యేతాన్ విష్ణుపక్షానివాసురాః ॥ 18

యే - ఏ, మహాభాగాః - గొప్ప భాగ్యము గల, మానవాః - మానవులు, ఏతస్మిన్ - వీనియందు, ప్రీతిమ్ - ప్రేమను, కుర్వంతి - చేయుదురో, ఏతాన్ - వీరిని, విష్ణుపక్షాన్ - విష్ణువు పక్షమునందు గల దేవతలను, అసురాః ఇవ - అసురులు వలె, అరయః - శత్రువులు, న అభిభవంతి - పరాభవించరు.

విష్ణువును ఆశ్రయించిన దేవతలను అసురులు పరాభవించలేరు. అదే విధముగా, గొప్ప భాగ్యము గల ఏ మానవులు వీనియందు ప్రీతిని చేయుదురో, వారిని (బాహ్య-అంతర) శత్రువులు పరాభవించలేరు.

తస్మాన్నందాత్మజోఽయం తే నారాయణసమో గుణైః ।
శ్రియా కీర్త్యాఽనుభావేన గోపాయస్వ సమాహితః ।। 19

నంద - ఓ నందా!, తస్మాత్ - అందువలన, అయమ్ - ఈ, తే - నీ, ఆత్మజః - పుత్రుడు, గుణైః - గుణములతో, శ్రియా - శోభ (సంపద) తో, కీర్త్యా - కీర్తితో, అనుభావేన - ప్రభావముతో, నారాయణసమః - నారాయణునితో సముడు, సమాహితః - సావధానుడవై, గోపాయస్వ - కాపాడుము.

ఓ నందా! కావున, గుణములు, శోభ, సంపద, కీర్తి, ప్రభావములలో ఈ నీ పుత్రుడు నారాయణునితో సముడు. నీవు సావధానుడవై కాపాడుము.

ఇత్యాత్మానం సమాదిశ్య గర్గే చ స్వగృహం గతే ।
నందః ప్రముదితో మేనే ఆత్మానం పూర్ణమాశిషామ్ ।। 20

ఇతి - అని, ఆత్మానమ్ - నందుని, సమాదిశ్య - ఉపదేశించి, గర్గే - గర్గుడు, స్వగృహమ్ - తన యింటిని గురించి, గతే - వెళ్లగా, ప్రముదితః - మిక్కిలి ఆనందించిన, నందః - నందుడు, ఆత్మానమ్ - తనను, ఆశిషామ్ - అభీష్టములతో, పూర్ణమ్ - పూర్ణునిగా, మేనే - తలపోసెను.

గర్గుడీ విధముగా నందునకు ఉపదేశించి యింటికి వెళ్లెను. చాల ఆనందించిన నందుడు తన సకలాభీష్టములు పూర్ణమైనవని తలపోసెను.

కాలేన వ్రజతాఽల్పేన గోకులే రామకేశవౌ ।
జానుభ్యాం సహ పాణిభ్యాం రింగమాణౌ విజహ్రతుః ॥ 21

వ్రజతా - ముందుకు సాగే, అల్పేన - కొద్ది, కాలేన - కాలముచే, గోకులే - గోకులమునందు, రామకేశవౌ - బలరామకృష్ణులు, జానుభ్యామ్ - మోకాళ్లతో, పాణిభ్యాం సహ - చేతులతో కలిపి, రింగమాణౌ - ప్రాకుచున్నవారై, విజహ్రతుః - విహరించిరి.

నామకరణము తరువాత కొద్ది కాలమునకే గోకులములో బలరామకృష్ణులు మోకాళ్లతో చేతులతో ప్రాకుతూ విహరించిరి.

తావంఘ్రియుగ్మమనుకృష్య సరీసృపంతౌ
ఘోషప్రఘోషరుచిరం వ్రజకర్దమేషు ।
తన్నాదహృష్టమనసావనుసృత్య లోకం
ముగ్ధప్రభీతవదుపేయతురంతి మాత్రోః ॥ 22

తౌ - వారిద్దరు, ఘోషప్రఘోషరుచిరమ్ - చిరుగంటల నాదముతో (గోకులమునందలి జనుల ప్రోత్సాహకధ్వనులతో) మధురముగా నుండునట్లుగా, వ్రజకర్దమేషు - గోకులమునందలి బురదతో కూడిన వాకిళ్లయందు, అంఘ్రియుగ్మమ్ - కాళ్లజంటను, అనుకృష్య - ముందుకు లాగి, సరీసృపంతౌ - వంకర టింకరగా ప్రాకుచున్నవారై, తత్-నాదహృష్టమనసౌ - ఆ గంటల (గోకులజనుల) నాదముచే హర్షమును పొందిన మనస్సు గలవారై, లోకమ్ - జనుని, అనుసృత్య - అనుసరించి, ముగ్ధప్రభీతవత్ - అమాయకులా యన్నట్లు భయపడినారా యన్నట్లు, మాత్రోః - తల్లులిద్దరి, అంతి - సమీపమును గురించి, ఉపేయతుః - వచ్చి చేరిరి.

వారిద్దరు గోకులమునందలి వాకిళ్ల బురదలో కాళ్లజంటను ముందుకు లాగుతూ వంకర టింకరగా ప్రాకుచుండగా వారి ఆభరణముల చిరుగంటలు మధురమగు ధ్వనిని చేయుచుండెను. గోకులమునందలి జనులు వారిని ప్రోత్సహిస్తూ మధురమగు శబ్దములను చేసెడివారు. ఆ ధ్వనులకు, ఆ శబ్దములకు వారిద్దరికి మనస్సులో హర్షము కలిగెడిది. మార్గముగుండా

వెళ్లే అపరిచితవ్యక్తి వెనుక అమాయికముగా కొద్ది దూరము వెళ్లి, భయపడినారా యన్నట్లు వెనుదిరిగి తల్లులవద్దకు చేరెడివారు.

తన్మాతరౌ నిజసుతౌ ఘృణయా స్నువంత్యౌ
పంకాంగరాగరుచిరావుపగుహ్య దోర్భ్యామ్ ।
దత్త్వా స్తనం ప్రపిబతోస్స్మ ముఖం నిరీక్ష్య
ముగ్ధస్మితాల్పదశనం యయతుః ప్రమోదమ్ ॥ 23

ఘృణయా - ప్రేమచే, స్నువంత్యౌ - పాలను స్రవించుచున్న, తత్-మాతరౌ - వారిద్దరి తల్లులిద్దరు, పంక-అంగరాగరుచిరౌ - బురదతో (బురద అనే) చందనముతో సుందరులైన, నిజసుతౌ - తమ పుత్రులనిద్దరిని, దోర్భ్యామ్ - రెండు చేతులతో, ఉపగుహ్య - కౌగిలించుకొని, స్తనమ్ - పాలను, దత్త్వా - ఇచ్చి, ప్రపిబతోః - త్రాగుచున్న వారిద్దరి, ముగ్ధస్మిత-అల్పదశనమ్ - అమాయికమైన చిరునవ్వు చిన్న పళ్లు గల, ముఖమ్ - ముఖమును, నిరీక్ష్య - పట్టి చూచి, ప్రమోదమ్ - గొప్ప ఆనందమును, యయతుః - పొందిరి.

వారిద్దరి దేహములు వాకిలిలోని మట్టియే చందనము కాగా (మట్టి మరియు చందనముతో) సుందరముగా నుండెడివి. ప్రేమచే పాలను స్రవించుచున్న తల్లులిద్దరు తమ పుత్రులనిద్దరిని రెండు చేతులతో కౌగిలించి పాలనిచ్చెడివారు. వారిద్దరు పాలు త్రాగుచుండగా, చిన్న పళ్లు గల వారి ముఖములపై అమాయికమైన చిరునవ్వు తొంగి చూచెడిది. అట్టి వారి ముఖములను చూచి తల్లులు మహానందమును పొందెడివారు.

యర్హ్యంగనాదర్శనీయకుమారలీలా
అంతర్వ్రజే తదబలాః ప్రగృహీతపుచ్ఛైః ।
వత్సైరితస్తత ఉభావనుకృష్యమాణౌ
ప్రేక్షంత్య ఉజ్ఝితగృహా జహృషుర్హసంత్యః ॥ 24

యర్హి - ఎప్పుడైతే, అంగనాదర్శనీయకుమారలీలౌ - యువతులచే చూడదగిన బాలచేష్టలు గలవారో అప్పుడు, అంతః-వ్రజే - గోకులము మధ్యలో, ప్రగృహీతపుచ్ఛైః - గట్టిగా పట్టుకొనబడిన తోకలు గల, వత్సైః -

దూడలచే, ఇతః - ఇటు, తతః - అటు, అనుకృష్యమాణౌ - లాగబడుచున్న, ఉభౌ - వారిద్దరిని, ప్రేక్షంత్యః - చూచుచున్న, తద్-అబలాః - ఆ గోకులమునందలి యువతులు, ఉజ్ఝితగృహాః - విడిచిపెట్టబడిన ఇంటి పనులు గలవారై, హసంత్యః - నవ్వుచున్నవారై, జహృషుః - హర్షమును పొందిరి.

వారిద్దరు కొంచెము పెరిగి పెద్దవారు కాగా వారి లీలలను గోకులములోని యువతులు చూడ దొడంగిరి. గోకులము మధ్యలో వారిద్దరు దూడల తోకలను గట్టిగా పట్టుకోగా, వారిని దూడలు ఇటునటు లాగుచుండెడివి. అప్పుడు గోకులమునందలి యువతులు ఇంటి పనులను ప్రక్కన బెట్టి వారిని చూస్తూ నవ్వుతూ హర్షించెడివారు.

శృంగ్యగ్నిదంష్ట్ర్యసిజలద్విజకంటకేభ్యః
 క్రీడాపరావతిచలౌ స్వసుతౌ నిషేద్ధుమ్ ।
గృహ్యాణి కర్తుమపి యత్ర న తజ్జనన్యౌ
 శేకాత ఆపతురలం మనసోఽనవస్థామ్ ॥ 25

క్రీడాపరౌ - ఆటలే ముఖ్యమైనట్టియు, అతిచలౌ - అధికమగు అల్లరి చేసే, స్వసుతౌ - తమ పుత్రులనిద్దరిని, శృంగీ-అగ్నిదంష్ట్రి-అసిజలద్విజ కంటకేభ్యః - కొమ్ములు గల ఆవులు ఎద్దులు దూడలు నిప్పు కోరలు గల కుక్కలు కత్తి పక్షులు ముళ్లనుండి, నిషేద్ధుమ్ - నివారించుటకు, గృహ్యాణి అపి - ఇంటి పనులను కూడ, కర్తుమ్ - చేయుటకు, యత్ర - ఎప్పుడైతే, తత్-జనన్యౌ - వారి తల్లులిద్దరు, న శేకాతే - సమర్థులు కాలేదో అప్పుడు, మనసః - మనస్సునకు, అలమ్ - అధికమగు, అనవస్థామ్ - ఆందోళనను, ఆపతుః - పొందిరి.

ఎక్కువగా అల్లరి చేసే బలరామకృష్ణులిద్దరికి ఆటలే ముఖ్యమాయెను. కొమ్ములతో పొడిచే ఆవులు, ఎద్దులు, దూడలు, నిప్పు, కోరలు గల జంతువులైన కుక్కలు మొదలగునవి, పక్షులు, ముళ్లు అనువాటినుండి వారిద్దరిని తల్లులు కాపాడవలెను. అదే సమయములో ఇంటిలోని పనులను చేసుకొనుట ఆ తల్లులకు వీలు కాకుండెను. ఈ విధముగా వారిద్దరి తల్లులు మనస్సులో ఆందోళనను పొందెడివారు.

కాలేనాల్పేన రాజర్షే రామః కృష్ణశ్చ గోకులే ।
అఘృష్టజానుభిః పద్భిర్విచక్రమతురంజసా ॥ 26

రాజ-ఋషే - ఓ రాజర్షీ!, అల్పేన - తక్కువ, కాలేన - కాలముచే, రామః - బలరాముడు, కృష్ణః చ - శ్రీకృష్ణుడు కూడ, గోకులే - గోకులమునందు, అఘృష్టజానుభిః - భూమితో రాపిడిని పొందని మోకాళ్లు గల, పద్భిః - పాదములతో, అంజసా - తేలిక (వేగము) గా, విచక్రమతుః - అధికముగా అంతటా తిరిగిరి.

మహర్షివంటి ఓ పరీక్షిన్మహారాజా! కొద్ది కాలములోనే బలరామకృష్ణులు మోకాళ్లు భూమికి తగలకుండానే లేచి నిలబడి గోకులములో అంతటా తేలికగా వేగముగా సంచరించ జొచ్చిరి.

తతస్తు భగవాన్ కృష్ణో వయస్యైర్వ్రజబాలకైః ।
సహరామో వ్రజస్త్రీణాం చిక్రీడే జనయన్ముదమ్ ॥ 27

తతః - తరువాత, సహరామః - రామునితో గూడిన, భగవాన్ కృష్ణః తు - శ్రీకృష్ణ భగవానుడైతే, వ్రజస్త్రీణామ్ - గోకులమునందలి స్త్రీలకు, ముదమ్ - ఆనందమును, జనయన్ - కలిగించువాడై, వయస్యైః - మిత్రులైన, వ్రజబాలకైః - గోకులమునందలి బాలకులతో, చిక్రీడే - క్రీడించెను.

తరువాత శ్రీకృష్ణభగవానుడు గోకులమునందలి స్త్రీలకు ఆనందమును కలిగిస్తూ, రామునితో మరియు గోకులమునందలి బాలకులతో కలిసి క్రీడించెను.

కృష్ణస్య గోప్యో రుచిరం వీక్ష్య కౌమారచాపలమ్ ।
శృణ్వత్యాః కిల తన్మాతురితి హోచుస్సమాగతాః ॥ 28

గోప్యః - గోపికలు, కృష్ణస్య - శ్రీకృష్ణుని, రుచిరమ్ - అందమైన, కౌమారచాపలమ్ - బాల్యమునందలి అల్లరిని, వీక్ష్య - చూచి, సమాగతాః - గుమిగూడినవారై, తత్-మాతుః - ఆతని తల్లియగు యశోద, శృణ్వత్యాః కిల - వినుచుండగా, ఇతి - ఈ విధముగా, హ - స్పష్టముగా, ఊచుః - చెప్పిరి.

శ్రీకృష్ణుడు బాల్యములో చేస్తున్న అందమైన అల్లరిని చూచిన గోపికలు గుమిగూడి, ఆతని తల్లియగు యశోద వినుచుండగా స్పష్టముగా ఈ విధముగా చెప్పిరి.

వత్సాన్ముంచన్ క్వచిదసమయే క్రోశసంజాతహాసః
స్తేయం స్వాద్వత్త్యథ దధి పయః కల్పితైః స్తేయయోగైః ।
మర్కాన్ భోక్ష్యన్ విభజతి స చేన్నాత్తి భాండం భినత్తి
ద్రవ్యాలాభే స గృహకుపితో యాత్యుపక్రోశ్య తోకాన్ ॥ 29

క్వచిత్ - ఒకప్పుడు, అసమయే - వేళ కాని వేళ, వత్సాన్ - దూడలను, ముంచన్ - విడిచిపెట్టువాడు, క్రోశసంజాతహాసః - కూకలేసినప్పుడు పుట్టిన నవ్వు గలవాడు, అథ - మరియు, కల్పితైః - చేయబడిన, స్తేయయోగైః - అపహరించుటయొక్క ఉపాయములచే, స్తేయమ్ - అపహరించబడిన, స్వాదు - రుచియైన, దధి - పెరుగును, పయః - పాలను, అత్తి - భక్షించును, మర్కాన్ - కోతుల (పిల్లుల) ను, భోక్ష్యన్ - భుజింపజేయబోవువాడై, విభజతి - వాటాలను చేయును, సః - ఆ కోతి, న అత్తి చేత్ - తిననిచో, భాండమ్ - కుండను, భినత్తి - పగులగొట్టును, ద్రవ్య-అలాభే - పెరుగు మొదలగు పదార్థము దొరకని సందర్భమునందు, గృహకుపితః - ఇంటి కొరకు కోపించిన, సః - ఆతడు, తోకాన్ - పిల్లలను, ఉపక్రోశ్య - ఏడిపించి, యాతి - వెళ్లును.

ఆ కృష్ణుడు ఒకప్పుడు వేళ కాని వేళ దూడలను విడిచిపెట్టును. (అవి పాలను త్రాగివేయగా ఇంటిలోనివారు) కూకలేసినప్పుడు నవ్వును. మరియు ఆతడు అపహరించే ఉపాయములనాచరించి తియ్యని పెరుగును, పాలను అపహరించి త్రాగివేయును. (తాను త్రాగిన పిదప) కోతులకు పిల్లులకు త్రాగిపించుటకై వాటాలను వేయును. ఒకానొక కోతి తినకపోయినచో, (చికాకు పుట్టి) కుండను పగులగొట్టును. పెరుగు-పాలు మొదలైనవి దొరకకపోయినచో, ఆ ఇంటి(వారి)పై కోపించి ఆతడు పిల్లలను (గిల్లి) ఏడిపించి వెళ్లిపోవును.

హస్తాగ్రాహ్యే రచయతి విధిం పీఠకోలూఖలాద్యైః
ఛిద్రం హ్యంతర్నిహితవయునశ్శిక్యభాండేషు తద్విత్ ।

ధ్వాంతాగారే ధృతమణిగణం స్వాంగమర్థప్రదీపం
కాలే గోప్యో యర్హి గృహకృత్యేషు సువ్యగ్రచిత్తాః ॥ 30

హస్త-అగ్రాహ్యే - చేతికి దొరకని సందర్భమునందు, పీఠక-ఉలూఖల-ఆద్యైః - పీట రోలు మొదలగువాటితో, విధిమ్ - దొరికించుకునే ఉపాయమును, రచయతి - ఆచరించును, శిక్యభాండేషు - ఉట్టియందలి కుండలయందు, అంతః-నిహితవయునః - లోపల ఉంచిన పదార్థముయొక్క జ్ఞానము గలవాడు, తద్-విత్ - దాని ఉపాయము తెలిసినవాడు అగు ఆతడు, ఛిద్రమ్ - చిల్లును (చేయును), ధ్వాంత-ఆగారే - చీకటి గదియందు, ధృతమణిగణమ్ - ధరించబడిన మణుల సముదాయము గల, స్వ-అంగమ్ - తన దేహమును, అర్థప్రదీపమ్ - పదార్థములను ప్రకాశింపజేయు దానినిగా (చేయును), యర్హి - ఏ, కాలే - కాలమునందు, గోప్యః - గోపికలు, గృహకృత్యేషు - ఇంటి పనులయందు, సువ్యగ్రచిత్తాః - మిక్కిలి కంగారుతో కూడిన మనస్సు కలిగియుందురో.

పెరుగు కుండ చేతికి అందనిచో పీట, రోలు, మిత్రుని భుజము మొదలగువాటి ఆసరాతో అది చేతికి అందే ఉపాయమును ఆచరించును. ఉట్టియందలి కుండలో ఏమున్నదో, దానిని ఏ విధముగా అందుకోవాలో అతనికి తెలియును. ఒకచో ఆతడు దానికి చిల్లు పెట్టి లోపలి వస్తువును చేజిక్కించుకొనును. చీకటి గదిలో తాను ధరించిన మణుల సమూహామే దీపమై పదార్థములను ప్రకాశింప జేయును. ఆతడీ పనులను గోపికలు ఇంటి పనులలో చాల హడావుడిగా ఉన్నప్పుడు చేయును.

ఏవం ధార్ష్ట్యాన్యుశతి కురుతే మేహనాదీని వాస్తౌ
స్తేయోపాయైర్విరచితకృతిస్సుప్రతీకో యథాఽస్తే ।
ఇత్థం స్త్రీభిస్సభయనయనశ్రీముఖాలోకినీభిః
వ్యాఖ్యాతార్థా ప్రహసితముఖీ న హ్యుపాలబ్ధుమైచ్ఛత్ ॥ 31

ఉశతి - ఓ సుందరీ!, ఏవమ్ - ఈ విధముగా, ధార్ష్ట్యాని - దిట్టదనపు పనులను, కురుతే - చేయును, వాస్తౌ - ఇంటియందు, మేహన-ఆదీని - మాలిన్యమును వేయుట మొదలగు పనులను, స్తేయ-ఉపాయైః - ఎత్తుకుపోయే ఉపాయములతో, విరచితకృతిః - చేయబడిన పనులు గల

కృష్ణుడు, సుప్రతీకః యథా - బుద్ధిమంతుడు వలె, ఆస్తే - ఉండును, ఇత్థమ్ - ఈ విధముగా, సభయనయనశ్రీముఖ-ఆలోకినీభిః - భయముతో కూడిన కన్నులు గల శోభతో కూడిన ముఖమును చూచే గోపికలచే, వ్యాఖ్యాత-అర్థా - వివరించి చెప్పబడిన విషయము గల యశోద, ప్రహసితముఖీ - నవ్వుతో నిండిన ముఖము గలదై, ఉపాలబ్ధుమ్ - కోపపడుటకు, న హి ఐచ్ఛత్ - ఇష్టపడనే లేదు.

ఓ సుందరీ! యశోదా! బాలకృష్ణుడీ విధముగా దిట్టదనపు పనులను చేయును. ఇంటిలో మాలిన్యమును వేయుట మొదలగు పనులను చేయును. వెన్నను ఎత్తుకుపోయే ఉపాయములతో వివిధచేష్టలను చేసే కృష్ణుడు బుద్ధిమంతుడు వలె కనబడును -- అని ఈ విధముగా, భయముతో కూడిన కన్నులతో శోభిల్లే బాలకృష్ణుని ముఖమును చూస్తూ గోపికలు వివరించి చెప్పిరి. కాని, నవ్వుతో నిండిన ముఖము గల యశోదకు కృష్ణునిపై కోపపడుట ఇష్టము కానే లేదు.

ఏకదా క్రీడమానాస్తే రామాద్యా గోపదారకాః ।
కృష్ణో మృదం భక్షితవానితి మాత్రే న్యవేదయన్ ।। 32

ఏకదా - ఒకనాడు, క్రీడమానాః - ఆటలాడుచున్న, తే - ఆ, రామ-ఆద్యాః - బలరాముడు మొదలైన, గోపదారకాః - గోపాలకుల పిల్లలు, కృష్ణః - శ్రీకృష్ణుడు, మృదమ్ - మట్టిని, భక్షితవాన్ - తినినాడు, ఇతి - అని, మాత్రే - తల్లి యశోద కొరకు, న్యవేదయన్ - విన్నవించిరి.

ఒకనాడు గోపబాలకులు ఆటలాడుచుండిరి. బాలకృష్ణుడు మట్టిని తిన్నాడని బలరాముడు మొదలైన ఆ పిల్లలు తల్లి యశోదకు విన్నవించిరి.

సా గృహీత్వా కరే కృష్ణముపాలభ్య హితైషిణీ ।
యశోదా భయసంభ్రాంతప్రేక్షణాక్షమభాషత ।। 33

హితైషిణీ - హితమును కోరే, సా - ఆ, యశోదా - యశోద, భయసంభ్రాంతప్రేక్షణ-అక్షమ్ - భయముతో కంగారుపడుతూ చూస్తున్న కళ్లు గల, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, కరే - చేతియందు, గృహీత్వా - పట్టుకొని, ఉపాలభ్య - కూకలేసి, అభాషత - పలికెను.

శ్రీకృష్ణుని హితము (అనారోగ్యము కలుగకూడదని) కోరే ఆ యశోద ఆతని చేతిని పట్టుకొనెను. ఆతడు భయముతో కంగారుపడుచున్న కన్నులతో చూచుచుండెను. ఆమె ఆతనిని కూకలేసి ఇట్లనెను.

కస్మాన్మృదమదాంతాత్మన్ భవాన్ భక్షితవాన్ రహః ।
వదంతి తావకా హ్యేతే కుమారాస్తేఽగ్రజోఽప్యయమ్ ॥ 34

అదాంత-ఆత్మన్ - వశము చేసుకొనబడని దేహేంద్రియాదులు గలవాడా!, భవాన్ - నీవు, రహః - ఏకాంతమునందు, మృదమ్ - మట్టిని, కస్మాత్ - ఎందువలన, భక్షితవాన్ - తిన్నవాడవు?, హి - ఏలయన, తావకాః - నీ మంచిని కోరే, ఏతే - ఈ, కుమారాః - బాలకులు, వదంతి - చెప్పుచున్నారు, తే - నీ, అయమ్ - ఈ, అగ్రజః అపి - అన్న కూడ.

ఓ కృష్ణా! నీ నోరు నీకు వశములో లేదు సుమా! నీవు రహస్యముగా మట్టిని యేల తింటివి? నీ మంచిని కోరే ఈ పిల్లలు, ఈ నీ అన్న కూడ (నీవు మట్టిని తిన్నావని) చెప్పుచున్నారు.

శ్రీకృష్ణ ఉవాచ ।
నాహం భక్షితవానంబ సర్వే మిథ్యాభిశంసినః ।
యది సత్యగిరస్తర్హి సమక్షం పశ్య మే ముఖమ్ ॥ 35

అంబ - అమ్మా!, అహమ్ - నేను, న భక్షితవాన్ - తిన్నవాడను కాదు, సర్వే - అందరు, మిథ్యా-అభిశంసినః - అసత్యముగా నేరమును చెప్పువారు, యది సత్యగిరః - సత్యమగు మాట గలవారన్నచో, తర్హి - అప్పుడు, మే - నా, ముఖమ్ - నోటిని, సమక్షమ్ - ప్రత్యక్షముగా, పశ్య - చూడుము.

అమ్మా! నేను మట్టిని తినలేదు. అందరు చెప్పే నేరములు అబద్ధము. వారు సత్యమునే చెప్పుచున్నారని నీవు తలచే పక్షములో, నా నోటిని నీవే ప్రత్యక్షముగా చూడుము.

యద్యేవం తర్హి వ్యాదేహీత్యుక్తస్స భగవాన్ హరిః ।
వ్యాదత్తావ్యాహతైశ్వర్యః క్రీడామనుజబాలకః ॥ 36

యది ఏవమ్ - ఇట్లు ఐనచో, తర్హి - అప్పుడు, వ్యాదేహి - నోటిని తెరువుము, ఇతి - అని, ఉక్తః - పలుకబడినవాడు, అవ్యాహత-ఐశ్వర్యః - మొక్కవోని ఈశ్వరభావము గలవాడు, క్రీడామనుజబాలకః - లీల కొరకై మానవబాలుడైనవాడు అగు, సః - ఆ, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, వ్యాదత్త - నోటిని తెరిచెను.

వారు చెప్పే మాట అసత్యమైనచో నోటిని తెరువుము, అని ఆమె పలికెను. మొక్కవోని ఈశ్వరీయశక్తి గల శ్రీహరి లీల కొరకే మానవబాలుడై అవతరించెను. అట్టి శ్రీకృష్ణుడు నోటిని తెరిచెను.

సా తత్ర దదృశే విశ్వం జగత్ స్థాస్ను చ ఖం దిశః ।
సాద్రిద్వీపాబ్ధిభూగోలం సవాయ్వగ్నీందుతారకమ్ ॥ 37

సా - ఆమె, తత్ర - ఆ నోటియందు, జగత్ - కదిలే, చ - మరియు, స్థాస్ను - కదలని, సవాయు-అగ్ని-ఇందుతారకమ్ - వాయువు అగ్ని చంద్రుడు నక్షత్రములతో కూడిన, విశ్వమ్ - జగత్తును, ఖమ్ - ఆకాశమును, దిశః - దిక్కులను, స-అద్రిద్వీప-అబ్ధిభూగోలమ్ - పర్వతములతో ద్వీపములతో సముద్రములతో కూడిన భూగోళమును, దదృశే - చూచెను.

ఆమెకు ఆ నోటియందు చరాచరమగు జగత్తు, భూగోళము చుట్టూ ఉండే వాయువు, విద్యుత్తు, చంద్రుడు, నక్షత్రములు, ద్యులోకము, దిక్కులు, పర్వతములతో ద్వీపములతో సముద్రములతో కూడిన భూగోళము కనబడెను.

జ్యోతిశ్చక్రం జలం తేజో నభస్వాన్ వియదేవ చ ।
వైకారికాణీంద్రియాణి మనో మాత్రా గుణాస్త్రయః ॥ 38

జ్యోతిశ్చక్రమ్ - నక్షత్రముల మండలము, జలమ్ - నీరు, తేజః - తేజస్సు, నభస్వాన్ - వాయువు, వియత్ ఏవ చ - ఆకాశము కూడ, వైకారికాణి - సాత్త్వికమగు సమష్టి-అహంకారమునుండి పుట్టిన, ఇంద్రియాణి - ఇంద్రియాభిమాని దేవతలు, మనః -

సమష్టిచిత్తాభిమానియగు హిరణ్యగర్భుడు, మాత్రాః - తన్మాత్రలు, త్రయః - మూడు, గుణాః - గుణములు.

నక్షత్రమండలము, నీరు, తేజస్సు, (నక్షత్రమండలమధ్యమునందలి) వాయువు, ఆకాశము, (హిరణ్యగర్భుని) సాత్త్వికాహంకారమునుండి పుట్టి ఇంద్రియములకు అభిమానులై ఉండే ఇంద్రాది దేవతలు, సమష్టిచిత్తాభిమానియగు హిరణ్యగర్భుడు, శబ్దస్పర్శరూపరసగంధములనే సూక్ష్మ భూతములు, సత్త్వరజస్తమస్సులనే మూడు గుణములు కనబడెను.

ఏతద్విచిత్రం సహ జీవకాలస్వభావకర్మాశయలింగభేదమ్ ।
సూనోస్తనౌ వీక్ష్య విదారితాస్యే వ్రజం సహాత్మానమవాప శంకామ్॥39

సూనోః - పుత్రునియొక్క, విదారిత-ఆస్యే - తెరువబడిన నోరు గల, తనౌ - శరీరమునందు, సహ - ఒకేసారి, జీవకాలస్వభావకర్మ-ఆశయలింగభేదమ్ - జీవుడు కాలము అజ్ఞానము కర్మ కర్మవాసన అనే లింగశరీరధర్మములచే భేదములు గల, విచిత్రమ్ - పలు రకముల, ఏతత్ - ఈ జగత్తును, సహ-ఆత్మానం - తనతో కూడియున్న, వ్రజం చ - గోకులమును కూడ, వీక్ష్య - చూచి, శంకామ్ - సందేహమును, అవాప - పొందెను.

నోరు తెరిచిన పుత్రుని శరీరమునందు యశోద ఒకే సారి వివిధప్రాణులతో గూడిన ఈ జగత్తును, తనతో సహా గోకులమును కూడ చూచెను. ఈ జగత్తులోని ప్రాణులలోని విభిన్నరూపములకు మూలమునందు జీవుడు, వాని అజ్ఞానము, కాలము, కర్మలు, కర్మవాసనలు గలవు. అపుడామెకు సందేహము కలిగెను.

కిం స్వప్న ఏతదుత దేవమాయా కిం వా మదీయో బత బుద్ధిమోహః,
అథో అముష్యైవ మమార్భకస్య యః కశ్చనౌత్పత్తిక ఆత్మయోగః॥40

ఏతత్ - ఇది, కిం స్వప్నః - కలయా?, ఉత - లేక, దేవమాయా - శ్రీహరి మాయయా?, వా - లేక, మదీయః - నాదైన, బుద్ధిమోహః కిమ్ - బుద్ధియొక్క వ్యామోహమా?, బత - ఆశ్చర్యము!, అథో - లేక, అముష్య - ఈ, మమ - నా, అర్భకస్య - పిల్లవానిదే ఐన, యః కశ్చన - ఏదో

ఒకానొక, ఔత్పత్తికః - సహజసిద్ధమైన, ఆత్మయోగః - తనదైన యోగసిద్ధియా?

ఇది కలా? లేక వైష్ణవమాయయా? లేక నా బుద్ధి వ్యామోహపడుచున్నదా? ఆశ్చర్యము! లేక, ఈ నా పిల్లవానికే ఏదో ఒక పుట్టుకతో వచ్చిన తనదైన యోగసిద్ధి గలదా? (అని యశోద తలపోసెను).

అథో యథావన్న వితర్కగోచరం
చేతోమనఃకర్మవచోభిరంజసా ।
యదాశ్రయం యేన యతః ప్రతీయతే
సుదుర్విభావ్యం ప్రణతాఽస్మి తత్పదమ్ ॥ 41

అథో - అందువలన, చేతః-మనఃకర్మవచోభిః - బుద్ధి మనస్సు కర్మ వాక్కులచే, అంజసా - తేలికగా, యథావత్ - ఉన్నది ఉన్నట్లుగా, న వితర్కగోచరమ్ - ఊహ చేయుటకు విషయము కానిది, యద్-ఆశ్రయమ్ - ఏ పరమాత్మయే అధిష్ఠానముగా గలదియో, యేన - ఎవనిచే, యతః - ఎవని వలన, ప్రతీయతే - అనుభవమునకు వచ్చుచున్నదో, సుదుర్విభావ్యమ్ - సుతరాము బుద్ధిగోచరము కాని, తత్-పదమ్ - ఆ పరమాత్మస్వరూపమును, ప్రణతా - ప్రణమిల్లుదాననై, అస్మి - అగుచున్నాను.

ఆ పరమాత్మయొక్క స్వరూపము యథాతథముగా బుద్ధిచే నిశ్చయించుటకు, మనస్సుతో భావన చేయుటకు, కర్మతో చేరుకొనుటకు, వాక్కుతో వర్ణించుటకు గోచరము కాదు. ఊహాపోహలకు అతీతమైన ఆ పరమాత్మయే జగత్తునకు అధిష్ఠానము. ఆ పరమాత్మనుండి ఆవిర్భవించిన ఈ జగత్తు చైతన్యరూపుడగు ఆ పరమాత్మ ద్వారానే ప్రతీతమగుచున్నది. అందువలన, సుతరాము బుద్ధిగోచరము కాని ఆ పరమాత్మస్వరూపమును నేను ప్రణమిల్లుచున్నాను.

అహం మమాసౌ పతిరేష మే సుతో
ప్రజేశ్వరస్యాఖిలవిత్తపా సతీ ।

గోప్యశ్చ గోపాస్సహగోధనాశ్చ మే
యన్మాయయేత్థం కుమతిస్స మే గతిః ॥ 42

అహమ్ - నేను, వ్రజ-ఈశ్వరస్య - గోకులమునకు ప్రభువగు నందుని, అఖిలవిత్తపా - సకలసంపదను పాలించే, సతీ - భార్యను, అసౌ - ఈయన, మమ - నా, పతిః - భర్త, ఏషః - ఈతడు, మే - నా, సుతః - పుత్రుడు, సహగోధనాః - గోవులు అనే సంపదతో కూడిన, గోప్యః - గోపికలు, గోపాః చ - గోపాలకులు కూడ, మే - నావారు, ఇత్థమ్ - ఈ విధముగా, యత్-మాయయా - ఏ శ్రీహరియొక్క మాయచే, కుమతిః - తప్పు భావనలు గలదాననో, సః - ఆ శ్రీహరి, మే - నాకు, గతిః - శరణము.

నేను గోకులనాథుడగు నందుని భార్యను, ఆతని సకలసంపదకు రాణిని, ఈ నందుడు నా భర్త. ఈ కృష్ణుడు నా కొడుకు. గోవులే సంపదగా గల గోపాలకులు గోపికలు కూడ నావారు, అంటూ నేను ఎవని మాయచే మిథ్యాసంకల్పములను కలిగియున్నానో, ఆ శ్రీహరి నాకు శరణు.

ఇత్థం విదితతత్త్వాయాం గోపికాయాం స ఈశ్వరః ।
వైష్ణవీం వ్యతనోన్మాయాం పుత్రస్నేహమయీం విభుః ॥ 43

ఇత్థమ్ - ఈ విధముగా, విదితతత్త్వాయామ్ - తెలియబడిన తత్త్వము గల, గోపికాయామ్ - గోపికయగు యశోదయందు, విభుః - సర్వవ్యాపకుడగు, సః - ఆ, ఈశ్వరః - జగన్నాథుడు, వైష్ణవీమ్ - తన శక్తియైనట్టియు, పుత్రస్నేహమయీమ్ - పుత్రునియందలి ఆసక్తి ప్రధానముగా గల, మాయామ్ - మాయను, వ్యతనోత్ - విస్తరింపజేసెను.

ఈ విధముగా గోపికయగు యశోదకు ఆత్మతత్త్వము తెలిసిపోయెను. అప్పుడు సర్వాంతర్యామి, జగన్నాథుడు అగు ఆ విష్ణువు పుత్రునియందలి ఆసక్తి అనే రూపములోనుండే తనదైన మాయను ఆమెయందు విస్తరింప జేసెను.

సద్యో నష్టస్మృతిర్గోపీ సాఽఽరోప్యారోహమాత్మజమ్ ।
ప్రవృద్ధస్నేహకలిలహృదయాఽఽసీద్యథా పురా ॥ 44

సద్యః - వెంటనే, నష్టస్మృతిః - నశించిన తత్త్వజ్ఞానము గల, సా - ఆ, గోపీ - గోపికయగు యశోద, ఆత్మజమ్ - పుత్రుని, ఆరోహమ్ - ఒడిని, ఆరోప్య - కూర్చుండబెట్టుకొని, పురా యథా - ఇదివరలో వలెనే, ప్రవృద్ధస్నేహకలిలహృదయా - పెరిగిన ఆసక్తిచే వ్యాపించబడిన హృదయము గలదియై, ఆసీత్ - ఆయెను.

వెంటనే గోపికయగు ఆ యశోదకు తత్త్వజ్ఞానము కనుమరుగై పుత్రుని ఒడిలో కూర్చుండబెట్టుకొనెను. ఆమె హృదయములో పూర్వమునందు వలెనే పుత్రునియందలి ఆసక్తి వ్యాపించెను.

త్రయ్యా చోపనిషద్భిశ్చ సాంఖ్యయోగైశ్చ సాత్వతైః ।
ఉపగీయమానమాహాత్మ్యం హరిం సామన్యతాత్మజమ్ ॥ 45

త్రయ్యా చ - వేదముచే, ఉపనిషద్భిః చ - ఉపనిషత్తులచే, సాంఖ్యయోగైః చ - సాంఖ్యులచే యోగులచే కూడ, సాత్వతైః - భక్తులచే, ఉపగీయమానమాహాత్మ్యమ్ - గానము చేయబడే మహిమ గల, హరిమ్ - శ్రీహరిని, సా - ఆమె, ఆత్మజమ్ - పుత్రునిగా, అమన్యత - తలపోసెను.

శ్రీహరి మహిమను వేదములు, ఉపనిషత్తులు, ఆత్మనిష్ఠులు, కర్మయోగపరులు, భక్తులు కూడ కీర్తించెదరు. అట్టి శ్రీహరిని ఆమె తన పుత్రుడని తలపోయుచుండెను.

రాజోవాచ ।
నందః కిమకరోద్బ్రహ్మన్ శ్రేయ ఏవం మహోదయమ్ ।
యశోదా చ మహాభాగా పపౌ యస్యాః స్తనం హరిః ॥ 46

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, నందః - నందుడు, మహాభాగా - గొప్ప పుణ్యాత్మురాలగు, యశోదా చ - యశోద కూడ, ఏవమ్ - ఈ విధముగా, మహా-ఉదయమ్ - గొప్ప ఫలము గల, శ్రేయః - పుణ్యమును, కిమ్ - దేనిని, అకరోత్ - చేసెను?, యస్యాః - ఏ యశోదయొక్క, స్తనమ్ - పాలను, హరిః - శ్రీహరి, పపౌ - త్రాగెనో.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ శుకమహర్షీ! శ్రీహరి యశోద పాలను త్రావెను. మహాపుణ్యాత్మురాలగు యశోద మరియు నందుడు (ఇంతటి) గొప్ప ఫలమునిచ్చే ఏ పుణ్యమునునుష్ఠించిరి?

పితరౌ నాన్వవిందేతాం కృష్ణోదారార్భకేహితమ్ ।
గాయంత్యద్యాపి కవయో యల్లోకశమలాపహమ్ ॥ 47

పితరౌ - తల్లిదండ్రులు, కృష్ణ-ఉదార-అర్భక-ఈహితమ్ - శ్రీకృష్ణుని గొప్ప బాలక్రీడను, న అన్వవిందేతామ్ - అనుభవించలేదు, లోకశమల-అపహమ్ - జనుల మాలిన్యమును పోగొట్టే, యత్ - దేనినైతే, అద్య అపి - ఈ నాటికి కూడ, కవయః - మహాత్ములు, గాయంతి - కీర్తించుచున్నారో.

శ్రీకృష్ణుని అద్భుతమైన బాల్యలీలలు జనుల మనోమాలిన్యములను పోగొట్టును. వాటిని ఈ నాటికీ కవులు కీర్తిస్తూనే ఉన్నారు. కాని, తల్లిదండ్రులైన దేవకీవసుదేవులు ఆ లీలలను అనుభవించనే లేదు.

శ్రీశుక ఉవాచ ।
ద్రోణో వసూనాం ప్రవరో ధరయా సహ భార్యయా ।
కరిష్యమాణ ఆదేశాన్ బ్రహ్మణస్తమువాచ హ ॥ 48

వసూనామ్ - వసువులలో, ప్రవరః - ముఖ్యుడగు, ద్రోణః - ద్రోణుడు, భార్యయా - భార్యయగు, ధరయా సహ - ధరతో గూడి, బ్రహ్మణః - బ్రహ్మదేవుని, ఆదేశాన్ - ఆదేశములను, కరిష్యమాణః - చేయబోవువాడై, తమ్ - ఆ బ్రహ్మదేవుని ఉద్దేశించి, ఉవాచ హ - చెప్పెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- వసువులలో ముఖ్యుడగు ద్రోణుడు భార్యయగు ధరతో గూడి బ్రహ్మదేవుని ఆదేశములను చేయబోవువాడై ఆయనతో నిట్లనెను.

జాతయోర్నౌ మహాదేవే భువి విశ్వేశ్వరే హరౌ ।
భక్తిస్స్యాత్పరమా లోకే యయాంజో దుర్గతిం తరేత్ ॥ 49

భువి - భూలోకమునందు, నౌ - మేమిద్దరము, జాతయోః - పుట్టగా, మహాదేవే - దేవదేవుడైనట్టియు, విశ్వ-ఈశ్వరే - జగన్నాథుడగు, హరౌ - శ్రీహరియందు, పరమా - సర్వాతిశాయియగు, భక్తిః - భక్తి, స్యాత్ - కలుగవలెను, యయా - దేనిచే, లోకే - లోకమునందు, అంజః - తేలికగా, దుర్గతిమ్ - దుర్గతిని, తరేత్ - అతిక్రమించునో.

మేము భూలోకమునందు పుట్టినప్పుడు, దేవదేవుడు జగన్నాథుడు అగు శ్రీహరియందు సర్వాతిశాయియగు భక్తి కలుగుగాక! అట్టి భక్తిచేతనే లోకములో మానవుడు దుర్గతిని తేలికగా అతిక్రమించును.

అస్త్విత్యుక్తస్స భగవాన్ వ్రజే ద్రోణో మహాయశాః ।
జజ్ఞే నంద ఇతి ఖ్యాతో యశోదా సా ధరాఽభవత్ ॥ 50

అస్తు - అగుగాక!, ఇతి - అని, ఉక్తః - చెప్పబడిన, భగవాన్ - పూజనీయుడు, మహాయశాః - గొప్ప కీర్తి గలవాడు అగు, సః - ఆ, ద్రోణః - ద్రోణుడు, జజ్ఞే - పుట్టెను, నందః - నందుడు, ఇతి - అని, ఖ్యాతః - ప్రఖ్యాతి గలవాడు, సా - ఆ, ధరా - ధర, యశోదా - యశోద, అభవత్ - ఆయెను.

అటులనే యగుగాక! అని బ్రహ్మదేవుడు చెప్పెను. పూజనీయుడు, గొప్ప కీర్తి గలవాడు అగు ఆ ద్రోణుడు భూలోకమునందు పుట్టి నందుడని ప్రసిద్ధి వడసెను. ఆ ధరయే యశోద ఆయెను.

తతో భక్తిర్భగవతి పుత్రీభూతే జనార్దనే ।
దంపత్యోర్నితరామాసీద్గోపగోపీషు భారత ॥ 51

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, తతః - అందువలన, జన-అర్దనే - దుష్టజనశిక్షకుడగు, భగవతి - శ్రీహరి భగవానుడు, గోపగోపీషు - గోపాలకులు గోపికలయందు, దంపత్యోః - ఆ దంపతులకు, పుత్రీభూతే - పుత్రుడుగా కాగా, నితరామ్ - కామన లేని, భక్తిః - భక్తి, ఆసీత్ - కలిగెను.

భరతవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఆ వరము కారణముగా, దుష్టజనశిక్షకుడగు శ్రీహరి భగవానుడు గోపాలకులు గోపికల మధ్యలో ఆ దంపతులకు పుత్రుడై జన్మించెను. వారికి నిష్కామభక్తి కలిగెను.

కృష్ణో బ్రహ్మణ ఆదేశం సత్యం కర్తుం వ్రజే విభుః ।
సహరామో వసంశ్చక్రే తేషాం ప్రీతిం స్వలీలయా ॥ 52

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే అష్టమోఽధ్యాయః ॥

విభుః - సర్వసమర్థుడగు, కృష్ణః - శ్రీకృష్ణుడు, బ్రహ్మణః బ్రహ్మదేవుని, ఆదేశమ్ - వరమును, సత్యమ్ - సత్యమునుగా, కర్తుమ్ చేయుటకు, సహరామః - బలరామునితో గూడినవాడై, వ్రజే గోకులమునందు, వసన్ - నివసించువాడై, స్వలీలయా - తన లీలచే, తేషామ్ - వారికి, ప్రీతిమ్ - ప్రీతిని, చక్రే - చేసెను.

సర్వసమర్థుడగు శ్రీకృష్ణుడు బ్రహ్మదేవుని వరమును సత్యము చేయుటకై బలరామునితో గూడి గోకులమునందు నివసించువాడై, తన లీలచే వారికి ప్రీతిని కలుగజేసెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్థములో శ్రీకృష్ణ బలరాముల బాల్యలీలలను వర్ణించే
ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (8).

* * * * *

# అథ నవమోఽధ్యాయః

## శ్రీకృష్ణుని రోలుకు కట్టివేసే లీల

ఏకదా గృహదాసీషు యశోదా నందగేహినీ ।
కర్మాంతరనియుక్తాసు నిర్మమంథ స్వయం దధి ॥ 1

ఏకదా - ఒకనాడు, నందగేహినీ - నందుని గృహిణియగు, యశోదా - యశోద, గృహదాసీషు - ఇంటియందలి సేవికలు, కర్మ-అంతర నియుక్తాసు - ఇతరములగు పనులయందు నియోగించబడగా, దధి - పెరుగును, స్వయమ్ - తానే, నిర్మమంథ - చిలికెను.

ఒకనాడు నందుని గృహిణియగు యశోద పెరుగును తానే చిలికెను. ఎందుకంటే, ఇంటిలోని పరిచారికలనామె ఇతరములగు పనులలో నియోగించెను.

యాని యానీహ గీతాని తద్బాలచరితాని చ ।
దధినిర్మంథనే కాలే స్మరంతీ తాన్యగాయత ॥ 2

దధినిర్మంథనే - పెరుగును చిలుకుట ఉన్న, కాలే - కాలమునందు, యాని యాని - ఏయే, ఇహ - ఈ గోకులమునందు, తద్-బాలచరితాని చ - ఆ బాలకృష్ణుని లీలలను కలిగియున్న, గీతాని - పాటలు గలవో, తాని - వాటిని, స్మరంతీ - గుర్తు చేసుకొనుచున్నదై, అగాయత - పాడెను.

ఆ బాలకృష్ణుని లీలలను ఈ గోకులములో కవులు పాటలుగా రచించిరి. యశోద పెరుగును చిలికే సమయములో వాటిని గుర్తు చేసుకుంటూ పాడెను.

క్షౌమం వాసః పృథుకటితటే బిభ్రతీ సూత్రనద్ధం
పుత్రస్నేహస్నుతకుచయుగం జాతకంపం చ సుభ్రూః ।

రజ్జ్వాకర్షశ్రమభుజచలత్కంకణౌ కుండలే చ
స్విన్నం వక్త్రం కబరవిగలన్మాలతీ నిర్మమంథ ॥ 3

పృథుకటితటే - విశాలమైన జఘనభాగమునందు, క్షౌమమ్ - పట్టుతో నేసినట్టియు, సూత్రనద్ధమ్ - మొలనూలుతో కట్టబడిన, వాసః - చీరను, జాతకంపమ్ - కలిగిన చలనము గల, పుత్రస్నేహస్నుతకుచయుగం చ - పుత్రునియందలి ప్రేమచే స్రవించే పాలిండ్ల జంటను, సుభ్రూః - అందమైన కనుబొమలు గలది, రజ్జు-ఆకర్షశ్రమభుజచలత్-కంకణౌ - త్రాడును లాగుటచే శ్రమ గల భుజములయందు కదలాడే కంకణములను, కుండలే చ - కుండలములను కూడ, స్విన్నమ్ - చెమటతో కూడిన, వక్త్రమ్ - ముఖమును, బిభ్రతీ - కలిగియున్నది, కబరవిగలత్-మాలతీ - జుట్టుముడినుండి జారిపోవుచున్న జాజిపువ్వులు గలది యగు యశోద, నిర్మమంథ - చిలికెను.

యశోద నడుమునందు పట్టుచీరను బంగరు మొలనూలుతో కట్టి ధరించి పెరుగును చిలుకుచుండగా పుత్రునియందలి ప్రేమచే పాలను స్రవించే ఆమె పాలిండ్లు చలించెను. అందమైన కనుబొమలు గల ఆమె కవ్వపు త్రాడును లాగుతూ ఉంటే శ్రమ వలన భుజములయందలి కంకణములు, కుండలములు కూడ కదలుచుండెను. ఆమె ముఖముపై చెమట పొడసూపగా, జుట్టుముడినుండి జాజులు జారిపోవుచుండెను.

తాం స్తన్యకామ ఆసాద్య మథ్నంతీం జననీం హరిః ।
గృహీత్వా దధిమంథానం న్యషేధత్ప్రీతిమావహన్ ॥ 4

స్తన్యకామః - పాలను త్రాగగోరే, హరిః - శ్రీకృష్ణుడు, మథ్నంతీమ్ - పెరుగును చిలుకుచున్న, తామ్ - ఆ, జననీమ్ - తల్లిని, ఆసాద్య - దగ్గరకు వచ్చి, ప్రీతిమ్ - ప్రీతిని, ఆవహన్ - కలిగించువాడై, దధిమంథానమ్ - పెరుగును చిలికే కవ్వమును, గృహీత్వా - పట్టుకొని, న్యషేధత్ - చిలుకుటనాపెను.

శ్రీకృష్ణుడు పాలను త్రాగగోరి ఆ తల్లి వద్దకు వచ్చి ప్రీతిని కలిగిస్తూ పెరుగును చిలుకుచున్న కవ్వమును పట్టుకొని, చిలుకుటను అడ్డుకొనెను.

తమంకమారూఢమపాయయత్ స్తనం
స్నేహస్నుతం సస్మితమీక్షతీ ముఖమ్ ।
అతృప్తముత్సృజ్య జవేన సా యయౌ
ఉత్సిచ్యమానే పయసి త్వధిశ్రితే ॥ 5

అంకమ్ - ఒడిని, ఆరూఢమ్ - ఎక్కి కూర్చున్న, తమ్ - ఆ బాలకృష్ణుని, సస్మితమ్ - చిరునవ్వుతో కూడిన, ముఖమ్ - ముఖమును, ఈక్షతీ - చూచుచున్నదై, స్నేహస్నుతమ్ - ప్రేమతో స్రవించే, స్తనమ్ - పాలను, అపాయయత్ - త్రాగిపించెను, తు - కాని, అధిశ్రితే - పొయ్యి మీద పెట్టబడిన, పయసి - పాలు, ఉత్సిచ్యమానే - పొంగుచుండగా, అతృప్తమ్ - తృప్తి కలుగని కృష్ణుని, ఉత్సృజ్య - విడిచిపెట్టి, జవేన - వేగముతో, సా - ఆమె, యయౌ - వెళ్లెను.

బాలకృష్ణుడు యశోద ఒడిలో జేరి కూర్చుండగా, ఆమె ఆతని చిరునవ్వుతో కూడిన ముఖమును చూస్తూ ప్రేమతో స్రవించే పాలను త్రావించెను. కాని, ఆతడింకనూ తృప్తి జెందలేదు. ఇంతలో పొయ్యి మీద పెట్టిన పాలు పొంగుచుండగా, ఆమె ఆతనిని విడిచిపెట్టి వెళ్లెను.

సంజాతకోపస్స్ఫురితారుణాధరం
సందశ్య దద్భిర్దధిమంథభాజనమ్ ।
భిత్త్వా మృషాశ్రుర్దృషదశ్మనా రహో
జఘాస హైయంగవమంతరం గతః ॥ 6

సంజాతకోపః - పుట్టిన కోపము గల బాలకృష్ణుడు, స్ఫురిత-అరుణ -అధరమ్ - ప్రకాశించే ఎర్రని క్రింది పెదవిని, దద్భిః - పళ్లతో, సందశ్య - గట్టిగా కొరికి, దధిమంథభాజనమ్ - పెరుగు చిలికే కుండను, దృషద్-అశ్మనా - చిన్న బండరాతితో, భిత్త్వా - పగులగొట్టి, మృషా-అశ్రుః - ఉత్తుత్తి కళ్ల నీళ్లు గలవాడై, అంతరమ్ - లోపలికి, గతః - వెళ్లినవాడై, రహః - చాటున, హైయంగవమ్ - నిన్నటి వెన్నను, జఘాస - తినెను.

బాలకృష్ణుడు కోపము వచ్చి పళ్లతో ఎర్రగా ప్రకాశించే క్రింది పెదవిని గట్టిగా కొరికి బెల్లం మొత్తే రాతితో పెరుగు చిలికే కుండను పగులగొట్టెను.

ఆతడు ఉత్తుత్తి కన్నీళ్లు గలవాడై లోపలికి వెళ్లి చాటుగా నిన్నటి వెన్నను తినుచుండెను.

ఉత్తార్య గోపీ సుశృతం పయః పునః
ప్రవిశ్య సందృశ్య చ దధ్యమత్రకమ్ ।
భగ్నం విలోక్య స్వసుతస్య కర్మ తత్
జహాస తం చాపి న తత్ర పశ్యతీ ॥ 7

గోపీ - గోపికయగు యశోద, సుశృతమ్ - బాగా మరిగిన, పయః - పాలను, ఉత్తార్య - పొయ్యి దింపి, పునః - మరల, ప్రవిశ్య - ప్రవేశించి, భగ్నమ్ - పగిలిన, దధి-అమత్రకం చ - పెరుగు కుండను కూడ, సందృశ్య - పరికించి చూచి, స్వసుతస్య - తన పుత్రుని, తత్ - ఆ, కర్మ - పనిని గురించి, తం చ అపి - ఆతనిని కూడ, తత్ర - అచట, న పశ్యతీ - కాననిదై, జహాస - నవ్వెను.

గోపికయగు యశోద బాగా మరిగిన పాలను పొయ్యి దింపి మరల పెరుగు చిలికే చోటుకు వచ్చెను. అచట ఆమె పగిలిన పెరుగు కుండను చూచెను. అది తన పుత్రుని పనియేనని గుర్తించి ఆమె నవ్వుకొనెను. పైగా, ఆతడు ఆమెకు ఆ చుట్టుప్రక్కల కానరాలేదు.

ఉలూఖలాంఘ్రేరుపరి వ్యవస్థితం
మర్కాయ కామం దదతం శిచి స్థితమ్ ।
హైయంగవం చౌర్యవిశంకితేక్షణం
నిరీక్ష్య పశ్చాత్సుతమాగమచ్ఛనైః ॥ 8

ఉలూఖల-అంఘ్రేః - తిరగబడిన కొయ్య రోలుయొక్క, ఉపరి - పైభాగమునందు, వ్యవస్థితమ్ - స్థిరముగా కూర్చున్నట్టియు, శిచి - ఉట్టియందు, స్థితమ్ - ఉన్న, హైయంగవమ్ - నిన్నటి వెన్నను, మర్కాయ - కోతి కొరకు, కామమ్ - యథేచ్ఛగా, దదతమ్ - ఇచ్చుచున్నట్టియు, చౌర్యవిశంకిత-ఈక్షణమ్ - వెన్నను దొంగిలించుటచే శంకతో కూడిన చూపులు గల, సుతమ్ - పుత్రుని, నిరీక్ష్య - చూచి, శనైః - మెల్లగా, పశ్చాత్ - వెనుకకు, ఆగమత్ - వచ్చెను.

బాలకృష్ణుడు తిరగబడిన రోలుపై స్థిరముగా కూర్చుండి ఉట్టియందలి నిన్నటి వెన్నను యథేచ్ఛగా కోతికి తినిపించుచుండెను. కాని, తాను వెన్నను దొంగిలించినందు వలన ఆతని చూపులలో ఆశంక తొంగిచూచుచుండెను. యశోద ఆ విధముగా ఉన్న పుత్రుని చూచి నిశ్శబ్దముగా వెనుకకు వచ్చెను.

తామాత్తయష్టిం ప్రసమీక్ష్య సత్వరః
తతోఽవరుహ్యాపససార భీతవత్ ।
గోప్యన్వధావన్న యమాప యోగినాం
క్షమం ప్రవేష్టుం తపసేరితం మనః ॥ 9

ఆత్తయష్టిమ్ - పట్టుకొనబడిన బెత్తము గల, తామ్ - ఆమెను, ప్రసమీక్ష్య - పరికించి చూచి, సత్వరః - వేగము గలవాడై, తతః - దానినుండి, అవరుహ్య - క్రిందకు దిగి, భీతవత్ - భయపడినవాడు వలె, అపససార - తొలగిపోయెను, గోపీ - గోపికయగు యశోద, అను-అధావత్ - వెనుక పరుగెత్తెను, యమ్ - ఎవనినైతే, ప్రవేష్టుమ్ - ప్రవేశించుటకు, క్షమమ్ - యోగ్యమైన, యోగినామ్ - యోగుల, మనః - మనస్సు, తపసా - తపస్సుచే, ఈరితమ్ - ఏకాగ్రము చేయబడినను, న ఆప - చేరలేదో.

బెత్తము పట్టుకొనియున్న ఆ గోపికను పరికించి చూచిన బాలకృష్ణుడు భయపడినవాడు వలె వేగముగా ఆ రోలుపైనుండి క్రిందకు దిగి పారిపోయెను. యోగుల మనస్సు ఆయనపై నిలుచుటకు యోగ్యమైనదియే. ఐనను, తపస్సుచే ఏకాగ్రము చేయబడిన వారి మనస్సు ఆయనను చేరలేకపోవును (అనగా శ్రీహరి మనస్సునకు గోచరుడు కాడని యర్థము). అట్టి శ్రీహరి వెంట ఆమె పరుగెత్తెను.

అన్వంచమానా జననీ బృహచ్చలచ్ఛ్రోణీభరక్రాంతగతిస్సుమధ్యమా।
జవేన విస్రంసితకేశబంధనచ్యుతప్రసూనానుగతిః పరామృశత్ ॥10

బృహత్-చలత్-శ్రోణీభరక్రాంతగతిః - విశాలమైన కదలాడే జఘనభాగముయొక్క బరువుచే మెల్లనైన నడక గలది, సుమధ్యమా - సన్నని నడుము గలది, విస్రంసితకేశబంధనచ్యుతప్రసూన-అనుగతిః -

విడిపోయిన జుట్టుముడినుండి జారిన పువ్వులచే అనుసరించబడిన గమనము గలది అగు, జననీ - తల్లి యశోద, అను - అనుసరించి, అంచమానా - వెళ్లుచున్నదై, పరా - వెనుక, జవేన - వేగముతో, అమృశత్ - పరుగెత్తెను.

తల్లి యశోద బాలకృష్ణుని వెంటబడి వెనుక వేగముగా పరుగెత్తెను. విశాలమైన కటిభాగము బరువుగా కదులుచుండగా, సన్నని నడుము గల ఆమె గమనము మెల్లనగుచుండెను. విడిపోయిన జుట్టుముడినుండి పువ్వులు జారి ముందుకు సాగుచున్న ఆమె వెనుక పడుచుండెను.

కృతాగసం తం ప్రరుదంతమక్షిణీ
కషంతమంజన్మషిణీ స్వపాణినా ।
ఉద్వీక్షమాణం భయవిహ్వలేక్షణం
హస్తే గృహీత్వా భిషయంత్యవాగురత్ ॥ 11

కృత-ఆగసమ్ - చేయబడిన తప్పు కలిగినట్టియు, ప్రరుదంతమ్ - బిగ్గరగా ఏడ్చుచున్నట్టియు, అంజత్-మషిణీ - అంతటా విస్తరించుచున్న మసి గల, అక్షిణీ - కన్నులను, స్వపాణినా - తన చేతితో, కషంతమ్ - నలుపుచున్నట్టియు, ఉద్-వీక్షమాణమ్ - పైకి చూచుచున్నట్టియు, భయవిహ్వల-ఈక్షణమ్ - భయముతో వ్యాకులమైన కన్నులు గల, తమ్ - ఆ బాలకృష్ణుని, హస్తే - చేతియందు, గృహీత్వా - పట్టుకొని, భిషయంతీ - భయపెట్టుచున్నదై, అవాగురత్ - కొట్టబోయెను.

బాలకృష్ణుడు తప్పు చేసి పైగా బిగ్గరగా ఏడ్చుచుండెను. ఆతడు తన చేతితో కళ్లను నలుపుచుండగా కాటుక మసి ముఖమంతా వ్యాపించుచుండెను. భయముతో వ్యాకులమైన కన్నులతో పైకి చూస్తున్న ఆతనిని యశోద చెయ్యి పట్టుకొని భయపెడుతూ కొట్టబోయెను.

త్యక్త్వా యష్టిం సుతం భీతం విజ్ఞాయార్భకవత్సలా ।
ఇయేష కిల తం బద్ధుం దామ్నాతద్వీర్యకోవిదా ॥ 12

అర్భకవత్సలా - పిల్లవానియందు వాత్సల్యము గలది, అతద్-వీర్యకోవిదా - ఆతని శక్తి గురించి తెలియనిది అగు యశోద,

సుతమ్ - పుత్రుని, భీతమ్ - భయపడినవానినిగా, విజ్ఞాయ - గుర్తించి, యష్టిమ్ - బెత్తమును, త్యక్త్వా - విడిచిపెట్టి, తమ్ - ఆతనిని, బద్ధుమ్ - కట్టివేయుటకు, ఇయేష కిల - సంకల్పించెను.

యశోదకు పిల్లవానియందు వాత్సల్యమే గాని, ఆతని శక్తి గురించి ఆమెకు తెలియదు. పిల్లవాడు భయపడినాడని గుర్తించిన ఆమె బెత్తమును పారవేసి, పిల్లవానిని కట్టివేయుటకు సంకల్పించెను.

న చాంతర్న బహిర్యస్య న పూర్వం నాపి చాపరమ్ ।
పూర్వాపరం బహిశ్చాంతర్జగతో యో జగచ్చ యః ॥ 13

యస్య - ఎవనికి, అంతః - లోపల, న - లేదో, బహిః చ - బయట కూడ, న - లేదో, పూర్వమ్ - ఆది, న - లేదో, అపరం చ - అంతము కూడ, న - లేదో, యః - ఎవడైతే, జగతః - జగత్తుకంటె, పూర్వ-అపరమ్ - ముందు వెనుక అగువాడు, బహిః - బయట, అంతః చ - లోపల కూడ, యః - ఎవడైతే, జగత్ చ - జగత్తు కూడ.

పరమాత్మయందు బయట-లోపల అనే తేడాలు గాని, ఆది-అంతములు గాని లేవు. పరమాత్మ జగత్తుకంటె ముందు, వెనుక (ప్రళయమునందు) కూడ ఉండును. జగత్తు లోపల ఉండే పరమాత్మ జగత్తునకు అతీతుడై యుండును. వాస్తవములో పరమాత్మయే జగద్రూపముగా ఉన్నాడు.

తం మత్వాఽఽత్మజమవ్యక్తం మర్త్యలింగమధోక్షజమ్ ।
గోపికోలూఖలే దామ్నా బబంధ ప్రాకృతం యథా ॥ 14

అధోక్షజమ్ - ఇంద్రియములకు గోచరము కానట్టియు, అవ్యక్తమ్ - నామరూపములకు అతీతుడైనట్టియు, మర్త్యలింగమ్ - మానవాకారమును పొందియున్న, తమ్ - ఆ పరమాత్మను, ఆత్మజమ్ - పుత్రునిగా, మత్వా - తలచి, గోపికా - గోపికయగు యశోద, ప్రాకృతం యథా - మామూలు పిల్లవానిని వలె, దామ్నా - త్రాటితో, ఉలూఖలే - కొయ్య రోలునందు, బబంధ - కట్టివేసెను.

ఇంద్రియములకు గోచరము కానివాడు, నామరూపములకు అతీతుడు అగు పరమాత్మ మానవరూపములో అవతరించెను. అట్టి బాలకృష్ణుని గోపికయగు ఆ యశోద తన పుత్రుడని తలపోసి, మామూలు పిల్లవానిని వలె, త్రాటితో రోలునకు కట్టివేసెను.

తద్దామ బధ్యమానస్య స్వార్భకస్య కృతాగసః ।
ద్వ్యంగులోనమభూత్తేన సందధేఽన్యచ్చ గోపికా ।। 15

కృత-ఆగసః - చేయబడిన తప్పు కలిగిన, స్వ-అర్భకస్య - తన పిల్లవాడు, బధ్యమానస్య - కట్టబడుచుండగా, తత్ - ఆ, దామ - త్రాడు, ద్వి-అంగుల-ఊనమ్ - రెండు అంగుళములచే తక్కువ, అభూత్ - ఆయెను, గోపికా - గోపికయగు యశోద, తేన - దానితో, అన్యత్ చ - మరియొక త్రాడును కూడ, సందధే - జత చేసెను.

తప్పు చేసిన తన పుత్రుని గోపికయగు యశోద కట్టుచుండగా, ఆ త్రాడు రెండు అంగుళములు తక్కువ ఆయెను. ఆమె దానికి మరియొక త్రాడును జత చేసెను.

యదాఽఽసీత్తదపి న్యూనం తేనాన్యదపి సందధే ।
తదపి ద్వ్యంగులం న్యూనం యద్యదాదత్త బంధనమ్ ।। 16

యదా - ఎప్పుడైతే, తత్ అపి - అది కూడ, న్యూనమ్ - తక్కువయో, తేన - దానితో, అన్యత్ అపి - మరియొక దానిని కూడ, సందధే - జత చేసెను, తత్ అపి - అది కూడ, ద్వి-అంగులమ్ - రెండు అంగుళములు, న్యూనమ్ - తక్కువ, యత్ యత్ - ఏయే, బంధనమ్ - త్రాడును, ఆదత్త - తెచ్చెనో.

ఆ త్రాడు కూడ రెండు అంగుళములు తక్కువగా ఉండెను. అప్పుడామె మరియొక త్రాడును కూడ జత చేయగా, అది కూడ రెండు అంగుళములు తక్కువయే ఉండెను. ఈ తీరున ఎన్ని త్రాళ్లను కట్టినా, రెండు అంగుళములు తక్కువయే ఉండెను.

ఏవం స్వగేహదామాని యశోదా సందధత్యపి ।
గోపీనాం సుస్మయంతీనాం స్మయంతీ విస్మితాఽభవత్ ।। 17

ఏవమ్ - ఈ విధముగా, స్వగేహదామాని - తన ఇంటియందలి త్రాళ్లను, సందధతీ అపి - జత చేయుచునే యున్న, యశోదా - యశోద, సుస్మయంతీనామ్ - ముసి ముసి నవ్వులు నవ్వుచున్న, గోపీనామ్ - గోపికల మధ్యలో, స్మయంతీ - చిరునవ్వు నవ్వుచున్నదై, విస్మితా - ఆశ్చర్యపడినదై, అభవత్ - ఆయెను.

ఈ విధముగా యశోద తన యింటిలోని త్రాళ్లను జత చేయుచునే యుండెను. ఆమెను చూచి గోపికలు ముసి ముసి నవ్వులు నవ్వుచుండిరి. వారితో బాటు ఆమె కూడ నవ్వుతూ, చాల ఆశ్చర్యమును పొందెను.

స్వమాతుస్స్విన్నగాత్రాయా విస్రస్తకబరస్రజః ।
దృష్ట్వా పరిశ్రమం కృష్ణః కృపయాఽఽసీత్స్వబంధనే ॥ 18

స్విన్నగాత్రాయాః - చెమట పట్టిన దేహము కలిగినట్టియు, విస్రస్తకబరస్రజః - జారిపోయిన జుట్టుముడియందలి మాల కలిగిన, స్వమాతుః - తన తల్లియొక్క, పరిశ్రమమ్ - అలసటను, దృష్ట్వా - చూచి, కృష్ణః - శ్రీకృష్ణుడు, కృపయా - దయతో, స్వబంధనే - తన బంధనమునందు, ఆసీత్ - ఉండెను.

తన తల్లియగు యశోద ఒళ్లంతా చెమటలు పట్టి, జుట్టుముడినుండి పూల మాల జారిపోయెను. ఆమె అలసటను చూచిన శ్రీకృష్ణుడు దయతో తనను తానే బంధించుకొనెను.

ఏవం సందర్శితా హ్యంగ హరిణా భృత్యవశ్యతా ।
స్వవశేనాపి కృష్ణేన యస్యేదం సేశ్వరం వశే ॥ 19

అంగ - ఓ రాజా!, స-ఈశ్వరమ్ - లోకపాలకులతో కూడిన, ఇదమ్ - ఈ జగత్తు, యస్య - ఎవ్వాని, వశే - వశమునందున్నదో, హరిణా - శ్రీహరియగు, కృష్ణేన - శ్రీకృష్ణునిచే, స్వవశేన అపి - స్వతంత్రుడే ఐననూ, భృత్యవశ్యతా - భక్తులకు వశమై యుండుట, ఏవమ్ - ఈ విధముగా, హి - నిశ్చయముగా, సందర్శితా - చూపించబడినది.

ఓ పరీక్షిన్మహారాజా! లోకపాలకులతో సహా ఈ జగత్తు శ్రీహరి వశములోనున్నది. ఆ శ్రీహరి అవతారమగు శ్రీకృష్ణుడు స్వతంత్రుడే

ఐననూ, నిశ్చయముగా భక్తపరతంత్రుడు అనే విషయమును ఈ వృత్తాంతము చూపుచున్నది.

నేమం విరించో న భవో న శ్రీరప్యంగసంశ్రయా ।
ప్రసాదం లేభిరే గోపీ యత్తత్ప్రాప విముక్తిదాత్ ॥ 20

తత్ - అట్టి, ఇమమ్ - ఈ అనుగ్రహమును, విరించః - బ్రహ్మదేవుడు, న - పొందలేదు, భవః - శివుడు, న - పొందలేదు, అంగసంశ్రయా - శరీరమునాశ్రయించి ఉండే, శ్రీః అపి - లక్ష్మీదేవి కూడ, న - పొందలేదు, న లేభిరే - ముగ్గురు పొందలేదు, విముక్తిదాత్ - మోక్షప్రదాతయగు శ్రీహరినుండి, యత్ - ఏ, ప్రసాదమ్ - అనుగ్రహమునైతే, గోపీ - గోపికయగు యశోద, ప్రాప - పొందెనో.

మోక్షప్రదాతయగు శ్రీహరినుండి గోపికయగు యశోద ఏ అనుగ్రహమునైతే పొందెనో, అట్టి ఈ అనుగ్రహమును బ్రహ్మదేవుడు, శివుడు, ఆయన శరీరమునాశ్రయించే లక్ష్మీదేవి అనే ముగ్గురు కూడ పొందలేదు.

నాయం సుఖాపో భగవాన్ దేహినాం గోపికాసుతః ।
జ్ఞానినాం చాత్మభూతానాం యథా భక్తిమతామిహ ॥ 21

గోపికాసుతః - యశోద తనయుడగు, అయమ్ - ఈ, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఇహ - ఈ లోకమునందు, యథా - ఏ విధముగానైతే, ఆత్మభూతానామ్ - తానే అయి ఉన్న, జ్ఞానినామ్ - జ్ఞానులకు, భక్తిమతాం చ - భక్తి గలవారలకు కూడ, యథా - ఏ విధముగా, సుఖ-ఆపః - తేలికగా లభించువాడో ఆ విధముగా, దేహినామ్ - దేహాభిమానులకు, న - కాడు.

యశోదాతనయుడగు ఈ శ్రీకృష్ణ భగవానుడు ఈ లోకములో ఏ విధముగానైతే తానే అయి ఉన్న ఆత్మజ్ఞానులకు మరియు భక్తి గలవారలకు తేలికగా లభించునో, ఆ విధముగా దేహాభిమానము గలవారలకు లభించడు.

కృష్ణస్తు గృహకృత్యేషు వ్యగ్రాయాం మాతరి ప్రభుః ।
అద్రాక్షీదర్జునౌ పూర్వం గుహ్యకౌ ధనదాత్మజౌ ॥ 22

మాతరి - తల్లి, గృహకృత్యేషు - ఇంటి పనులయందు, వ్యగ్రాయామ్ - మునిగియుండగా, ప్రభుః - సర్వసమర్థుడగు, కృష్ణః తు - శ్రీకృష్ణుడైతే, అర్జునౌ - రెండు మద్ది చెట్లను, అద్రాక్షీత్ - చూచెను, పూర్వమ్ - గడచిన జన్మయందు, ధనద-ఆత్మజౌ - కుబేరపుత్రులగు, గుహ్యకౌ - యక్షులు.

తల్లి ఇంటి పనులలో మునిగియుండెను. సర్వసమర్థుడగు శ్రీకృష్ణునకైతే రెండు మద్ది చెట్లు కనబడెను. అవి పూర్వజన్మలో కుబేరుని పుత్రులగు ఇద్దరు యక్షులు.

పురా నారదశాపేన వృక్షతాం ప్రాపితౌ మదాత్ ।
నలకూబరమణిగ్రీవావితి ఖ్యాతౌ శ్రియాఽన్వితౌ ॥ 23

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే నవమోఽధ్యాయః ॥

శ్రియా - సంపదతో, అన్వితౌ - కూడియున్న, నలకూబరమణిగ్రీవౌ - నలకూబరుడు మణిగ్రీవుడు, ఇతి - అని, ఖ్యాతౌ - ప్రసిద్ధి గాంచినవారిద్దరు, పురా - పూర్వము, మదాత్ - గర్వము వలన, నారదశాపేన - నారదుని శాపముచే, వృక్షతామ్ - చెట్టు జన్మను, ప్రాపితౌ - పొందించబడిరి.

నలకూబరుడు, మణిగ్రీవుడు అనే ఇద్దరు యక్షులు సంపద గలవారు. గర్వించియున్న వారిద్దరిని నారదుడు చెట్లు కమ్మని శపించగా వారట్లే ఐరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్ధములో శ్రీకృష్ణుని రోలుకు కట్టివేసే లీలను వర్ణించే
తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (9).



# అథ దశమోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు అర్జున వృక్షముల జంటను పడగొట్టి గంధర్వులకు శాపవిముక్తిని కలిగించుట

రాజోవాచ ।
కథ్యతాం భగవన్నేతత్తయోశ్శాపస్య కారణమ్ ।
యత్తద్విగర్హితం కర్మ యేన వా దేవర్షేస్తమః ॥ 1

భగవన్ - ఓ పూజనీయా!, ఏతయోః - వీరిద్దరికి, శాపస్య - శాపమునకు, కారణమ్ - కారణము, కథ్యతామ్ - చెప్పబడుగాక!, తత్ - ఆ, విగర్హితమ్ - అధికముగా నిందించబడిన, కర్మ - పని, కిమ్ - ఏది?, యేన వా - దేనిచేనైతే, దేవ-ఋషేః - దేవర్షియగు నారదునకు, తమః - కోపమో.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ పూజనీయా! వీరిద్దరి శాపమునకు గల కారణమును చెప్పుడు. దేవర్షియగు నారదునకు కోపము వచ్చేటంతటి అధికముగా నిందించబడే ఏ పనిని వారు చేసిరి?

శ్రీశుక ఉవాచ ।
రుద్రస్యానుచరౌ భూత్వా సుదృప్తౌ ధనదాత్మజౌ ।
కైలాసోపవనే రమ్యే మందాకిన్యాం మదోత్కటౌ ॥ 2

వారుణీం మదిరాం పీత్వా మదాఘూర్ణితలోచనౌ ।
స్త్రీజనైరనుగాయద్భిశ్చేరతుః పుష్పితే వనే ॥ 3

ధనద-ఆత్మజౌ - కుబేరుని పుత్రులిద్దరు, రుద్రస్య - రుద్రునకు, అనుచరౌ - అనుచరులుగా, భూత్వా - అయి, సుదృప్తౌ - మిక్కిలి గర్వించినవారు, మద-ఉత్కటౌ - హర్షము అతిశయముగా గలవారు, రమ్యే - సుందరమైన, కైలాస-ఉపవనే - కైలాసపర్వతమునందలి

ఉద్యానమునందు, మందాకిన్యామ్ - గంగానది వద్ద, వారుణీమ్ - అన్నరసమునుండి నిర్మించబడిన, మదిరామ్ - మద్యమును, పీత్వా - త్రాగి, మద-ఆఘూర్ణితలోచనౌ - మత్తుతో తిరుగాడుచున్న కన్నులు గలవారై, పుష్పితే - పువ్వులతో నిండిన, వనే - ఉద్యానవనమునందు, అనుగాయద్భిః - పాటలు పాడుచున్న, స్త్రీజనైః - యువతులతో, చేరతుః - విహరించిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు చెప్పెను --- కుబేరుని పుత్రులిద్దరు రుద్రుని అనుచరులైరి. దానితో వారు మిక్కిలి గర్వించి అతిశయమగు హర్షము గలవారై సుందరమగు కైలాసపర్వతమునందలి ఉద్యానవనమునందు పాటలు పాడుచున్న యువతులతో గూడి విహరించిరి. వారచట మందాకినీ నది వద్ద పువ్వులతో నిండిన ఉద్యానమునందు అన్నరసముతో చేసిన మద్యమును త్రావిరి. వారి కన్నులు మత్తుతో తిరుగాడుచుండెను.

అంతః ప్రవిశ్య గంగాయామంభోజవనరాజిని ।
చిక్రీడతుర్యువతిభిర్గజావివ కరేణుభిః ॥ 4

అంభోజవనరాజిని - పద్మముల గుంపులతో ప్రకాశించే, గంగాయామ్ - గంగయందు, అంతః - లోపల, ప్రవిశ్య - ప్రవేశించి, గజౌ - జంట ఏనుగులు, కరేణుభిః ఇవ - ఆడు ఏనుగులతో వలె, యువతిభిః - యువతులతో, చిక్రీడతుః - క్రీడించిరి.

వారిద్దరు పద్మముల గుంపులతో ప్రకాశించే గంగ లోపల యువతులతో బాటు ప్రవేశించి, ఏనుగుల జంట ఆడు యేనుగులతో క్రీడించునట్లుగా, క్రీడించిరి.

యదృచ్ఛయా చ దేవర్షిర్భగవాంస్తత్ర కౌరవ ।
అపశ్యన్నారదో దేవౌ క్షీబాణౌ సమబుధ్యత ॥ 5

కౌరవ - కురువంశీయుడవగు ఓ రాజా!, యదృచ్ఛయా చ - అనుకోకుండా, తత్ర - అచట, దేవ-ఋషిః - దేవర్షి, భగవాన్ - పూజనీయుడు అగు, నారదః - నారదుడు, దేవౌ - ఆ ఇద్దరు యక్షులను,

అపశ్యత్ - చూచెను, క్షీబాణౌ - మత్తులో ఉన్నవారినిగా, సమబుధ్యత - తెలుసుకొనెను.

కురవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) పూజనీయుడగు దేవర్షి నారదుడు అక్కడకు వచ్చి వారిద్దరిని చూచి, వారు మత్తులో ఉన్నారని గమనించెను.

తం దృష్ట్వా వ్రీడితా దేవ్యో వివస్త్రాశ్శాపశంకితాః ।
వాసాంసి పర్యధుశ్శీఘ్రం వివస్త్రౌ నైవ గుహ్యకౌ ॥ 6

తమ్ - ఆయనను, దృష్ట్వా - చూచి, వ్రీడితాః - సిగ్గు పడిన, వివస్త్రాః - వస్త్రములు లేని, దేవ్యః - అప్సరసలు, శాపశంకితాః - శాపమును గురించి శంక గలవారై, శీఘ్రమ్ - శీఘ్రముగా, వాసాంసి - వస్త్రములను, పర్యధుః - ధరించిరి, గుహ్యకౌ - యక్షులిద్దరు, న ఏవ - ధరించనే లేదు.

ఆయనను చూచి వస్త్రములు లేని ఆ అప్సరసలు సిగ్గు పడిరి. ఆయన శపించునేమోననే శంక గలవారై వారు వెంటనే వస్త్రములను ధరించిరి. కాని, వస్త్రములు లేని ఆ యక్షులిద్దరు వస్త్రములను ధరించనే లేదు.

తౌ దృష్ట్వా మదిరామత్తౌ శ్రీమదాంధౌ సురాత్మజౌ. ।
తయోరనుగ్రహార్థాయ శాపం దాస్యన్నిదం జగౌ ॥ 7

మదిరామత్తౌ - మద్యముతో మత్తెక్కి ఉన్నట్టియు, శ్రీమద-అంధౌ - ధనగర్వముతో అంధులై ఉన్న, తౌ - ఆ; సుర-ఆత్మజౌ - యక్షకుమారుల నిద్దరిని, దృష్ట్వా - చూచి, తయోః - వారిద్దరి, అనుగ్రహ-అర్థాయ - అనుగ్రహించుట అనే ప్రయోజనము కొరకు, శాపమ్ - శాపమును, దాస్యన్ - ఈయబోవువాడై, ఇదమ్ - ఈ మాటను, జగౌ - పలికెను.

ఆ ఇద్దరు యక్షకుమారులు ధనగర్వముతో గ్రుడ్డివారై మద్యముతో మత్తెక్కి ఉండిరి. వారిని అనుగ్రహించాలనే ఉద్దేశ్యముతో నారదుడు వారికి శాపమునీయబోతూ ఇట్లనెను.

నారద ఉవాచ ।
న హ్యన్యో జుషతో జోష్యాన్ బుద్ధిభ్రంశో రజోగుణః ।
శ్రీమదాదాభిజాత్యాదిర్యత్ర స్త్రీ ద్యూతమాసవః ॥ 8

జోష్యాన్ - భోగించదగిన విషయములను, జుషతః - సేవించువానికి, శ్రీమదాత్ - ధనగర్వముకంటె, అన్యః - మరియొకటి, అభిజాత్య-ఆదిః - మంచి వంశములో పుట్టుట మొదలైనది, రజః-గుణః - రజోగుణకార్యమగు కామన మొదలైనది, బుద్ధిభ్రంశః - బుద్ధిని భ్రష్టు పట్టించేది, న హి - లేదు గదా!, యత్ర - దేనియందైతే, స్త్రీ - యువతి, ద్యూతమ్ - జూదము, ఆసవః - మద్యమో.

నారద మహర్షి ఇట్లు పలికెను --- ఇంద్రియభోగములను సేవించువాని బుద్ధిని భ్రష్టు పట్టించేది ధనగర్వము మాత్రమే. మంచి వంశములో పుట్టేననే గర్వము గాని, విద్యాగర్వము మొదలైనవి గాని, లేదా రజోగుణకార్యములైన కామనలు మొదలైనవి గాని, ధనగర్వము చేసేటంతటి హానిని చేయలేవు. యువతి, జూదము, మద్యములు ఆ ధనగర్వములో భాగములై యుండును.

హన్యంతే పశవో యత్ర నిర్దయైరజితాత్మభిః ।
మన్యమానైరిమం దేహమజరామృత్యు నశ్వరమ్ ॥ 9

యత్ర - ఏ ధనగర్వమునందైతే, నిర్దయైః - దయలేనట్టియు, అజిత-ఆత్మభిః - జయించబడని దేహేంద్రియాదులు కలిగినట్టియు, నశ్వరమ్ - నశించే స్వభావము గల, ఇమమ్ - ఈ, దేహమ్ - దేహమును, అజర-అమృత్యు - ముసలిదనము మరణము లేనిదానినిగా, మన్యమానైః - తలపోయువారిచే, పశవః - పశువులు, హన్యంతే - చంపబడునో.

ధనగర్వము గలవారికి దయ ఉండదు. వారి దేహేంద్రియాదులు వారి వశములో నుండవు. నశించే స్వభావము గల ఈ దేహము ముసలిదనము గాని, మరణము గాని లేనిదని వారు భావించెదరు. అట్టివారు తినుటకై పశువులను చంపెదరు.

దేవసంజ్ఞితమప్యంతే కృమివిడ్భస్మసంజ్ఞితమ్ ।
భూతధ్రుక్తత్కృతే స్వార్థం కిం వేద నిరయో యతః ।। 10

దేవసంజ్ఞితం అపి - నరదేవుడు భూదేవుడు మొదలైన పేర్లు గలదియే అయిననూ, అంతే - అంతమునందు, కృమివిడ్-భస్మసంజ్ఞితమ్ - క్రిములు విసర్జింపబడే పదార్థము బూడిద అనే పేర్లు గలది, తత్-కృతే - దాని కొరకై, భూతధ్రుక్ - ప్రాణులకు ద్రోహమును చేయువాడు, స్వ-అర్థమ్ - తన హితమును గురించి, కిం వేద - తెలియుచున్నాడా?, యతః - దేనివలనైతే, నిరయః - నరకమో.

నరదేవుడు (రాజు), భూదేవుడు (బ్రాహ్మణుడు) అని పిలువబడే ఈ దేహమే మరణించిన పిదప (పాతిపెట్టినచో) క్రిముల రూపమును, (వదిలిపెట్టి పశుపక్ష్యాదులు భక్షించినచో) విసర్జించబడే పదార్థముయొక్క రూపమును, (తగులబెట్టినచో) బూడిద రూపమును పొందును. దీని కొరకై ప్రాణులకు ద్రోహమును చేయువాడు తనకు ఏది హితమో తెలిసినవాడేనా? కాదు. ఎందుకంటే, ప్రాణులను హింసించుట వలన లభించేది నరకము.

దేహః కిమన్నదాతుస్స్వం నిషేక్తుర్మాతురేవ చ ।
మాతుః పితుర్వా బలినః క్రేతురగ్నేశ్శునోఽపి వా ।। 11

దేహః - దేహము, అన్నదాతుః - అన్నము పెట్టువాని, స్వం కిమ్ - సొత్తా యేమి?, నిషేక్తుః - తండ్రిదా?, మాతుః ఏవ చ - తల్లిదా?, మాతుః - తల్లియొక్క, పితుః వా - తండ్రిదా?, బలినః - బలశాలియగు రాజుదా?, క్రేతుః - కొనువానిదా?, అగ్నేః - అగ్నిదా?, శునః అపి వా - కుక్కదా?

దేహము అన్నము పెట్టేవాని సొత్తా? లేక తండ్రీదా? లేక తల్లిదా? లేక తాతదా? లేక (పన్ను వసూలు చేసే) బలశాలియగు రాజుదా? లేక జీతభత్యములనిచ్చువాడిదా? లేక (మరణించిన పిదప కాల్చే) అగ్నిదా? (కాల్చకపోతే తినే) కుక్కదా?

ఏవం సాధారణం దేహమవ్యక్తప్రభవాప్యయమ్ ।
కో విద్వానాత్మసాత్కృత్వా హంతి జంతూనృతేఽసతః ।। 12

ఏవమ్ - ఈ విధముగా, సాధారణమ్ - అందరికీ చెందినట్టియు, అవ్యక్తప్రభవ-అప్యయమ్ - ప్రకృతినుండి పుట్టి ప్రకృతియందు విలీనమయ్యే, దేహమ్ - దేహమును, ఆత్మసాత్-కృత్వా - నేను అనే అభిమానమును చేసి, అసతః ఋతే - మూర్ఖుని మినహాయించి, కః - ఏ, విద్వాన్ - వివేకి, జంతూన్ - ప్రాణులను, హంతి - చంపును?

ప్రకృతినుండి పుట్టి ప్రకృతిలో కలిసిపోయే ఈ దేహము ఈ విధముగా ఇంతమందికి చెందియున్నది. మూర్ఖుడు తప్ప వివేకి ఎవడు దీనియందు నేను అనే అభిమానము గలవాడై దీని కొరకై జంతువులను చంపును? (చంపడు).

అసతశ్శ్రీమదాంధస్య దారిద్ర్యం పరమంజనమ్ ।
ఆత్మౌపమ్యేన భూతాని దరిద్రః పరమీక్షతే ॥ 13

శ్రీమద-అంధస్య - ధనగర్వముతో గ్రుడ్డియైన, అసతః - దుష్టునకు, దారిద్ర్యమ్ - పేదరికము, పరమ్ - గొప్ప, అంజనమ్ - చూపునిచ్చే మందు, దరిద్రః పరమ్ - బీదవాడు మాత్రమే, భూతాని - ప్రాణులను, ఆత్మౌపమ్యేన - తనతోటి పోలికతో, ఈక్షతే - చూచును.

ధనగర్వముతో గ్రుడ్డియైన దుష్టునకు పేదరికము గొప్ప అంజనము (చూపునిచ్చే మందు). పేదవాడు మాత్రమే ప్రాణులను తనతో సమానముగా చూచును.

యథా కంటకవిద్ధాంగో జంతోర్నేచ్ఛతి తాం వ్యథామ్ ।
జీవసామ్యం గతో లింగైర్న తథాఽవిద్ధకంటకః ॥ 14

యథా - ఏ విధముగానైతే, కంటకవిద్ధ-అంగః - ముల్లుచే గ్రుచ్చబడిన అవయవము గలవాడు, లింగైః - చిహ్నములచే, జీవసామ్యమ్ - ప్రాణులతో సమానత్వమును, గతః - పొందినవాడై, జంతోః - ప్రాణికి, తామ్ - అట్టి, వ్యథామ్ - నొప్పిని, న ఇచ్ఛతి - కోరడో, తథా - ఆ విధముగా, అవిద్ధకంటకః - గ్రుచ్చుకొనబడని ముల్లు గలవాడు, న - కాదు.

ముల్లు గ్రుచుకున్నవానికి నొప్పి గురించి, దాని వలన దేహములో కలిగే వికారములను గురించి తెలియును. అట్టివాడు ప్రాణులతో

సమభావమును పొంది, తనకు కలిగిన నొప్పి ఇతరప్రాణులకు కలుగరాదని కోరుకొనును. కాని, ఏనాడూ ముల్లు గ్రుచ్చుకోనివాడు ఆ విధముగా ఇతరప్రాణుల గురించి తలపోయడు.

దరిద్రో నిరహంస్తంభో ముక్తస్సర్వమదైరిహ ।
కృచ్ఛ్రం యదృచ్ఛయాఽఽప్నోతి తద్ధి తస్య పరం తపః ॥ 15

ఇహ - ఈ లోకమునందు, దరిద్రః - బీదవాడు, నిరహంస్తంభః - తొలగిపోయిన అహంకారము గర్వము గలవాడు, సర్వమదైః - అన్ని గర్వములచే, ముక్తః - విడువబడినవాడు, యదృచ్ఛయా - అనుకోకుండా, కృచ్ఛ్రమ్ - ఆపదను, ఆప్నోతి - పొందును, తత్ - అది, తస్య - వానికి, పరమ్ - గొప్ప, తపః - తపస్సు, హి - నిశ్చయము.

ఈ లోకములో బీదవానియందు అహంకారము, గర్వము ఉండవు. అన్ని రకముల గర్వములు ఆతనినుండి దూరమగును. ఆతనికి అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) కష్టము వచ్చును. అది వానికి గొప్ప తపస్సు అగుట నిశ్చితము.

నిత్యం క్షుత్క్షామదేహస్య దరిద్రస్యాన్నకాంక్షిణః ।
ఇంద్రియాణ్యనుశుష్యంతి హింసాఽపి వినివర్తతే ॥ 16

నిత్యమ్ - ప్రతిదినము, క్షుత్క్షామదేహస్య - ఆకలితో కృశించిన దేహము కలిగినట్టియు, అన్నకాంక్షిణః - అన్నమును కోరే, దరిద్రస్య - బీదవానికి, అను - దేహమునను సరించి, ఇంద్రియాణి - ఇంద్రియములు, శుష్యంతి - దుర్బలములగును, హింసా అపి - హింస కూడ, వినివర్తతే - దూరమగును.

ప్రతిదినము ఆకలితో కృశించిన దేహము గలవాడై ఆహారమును కోరే బీదవానికి దేహాన్ని బట్టి ఇంద్రియములు కూడ దుర్బలములగును. అట్టివాడు హింసను చేయడు.

దరిద్రస్యైవ యుజ్యంతే సాధవస్సమదర్శినః ।
సద్భిః క్షిణోతి తం తర్షం తత ఆరాద్విశుద్ధ్యతి ॥ 17

సమదర్శినః - సమదృష్టి గల, సాధవః - సాధువులు, దరిద్రస్య ఏవ - దరిద్రునకు మాత్రమే, యుజ్యంతే - సమాగమమగుదురు, సద్భిః - సజ్జనులతో, తమ్ - ఆ, తర్షమ్ - అన్నాదులయందలి తృష్ణ, క్షిణోతి - విడిచిపెట్టును, తతః - అందువలన, ఆరాత్ - శీఘ్రముగా, విశుద్ధ్యతి - విశేషమగు శుద్ధి గలవాడగును.

సాధువులు అందరినీ సమముగా చూచెదరు. ఐననూ, వారితో సమాగమము బీదవానికి మాత్రమే కలుగును. సజ్జనులతోడి సమాగమము వలన ఆతడు అన్నాదులయందలి తృష్ణను విడనాడును. దాని వలన వాని అంతఃకరణము శీఘ్రమే విశేషముగా శుద్ధమగును.

సాధూనాం సమచిత్తానాం ముకుందచరణైషిణామ్ ।
ఉపేక్ష్యైః కిం ధనస్తంభైరసద్భిరసదాశ్రయైః ॥ 18

సమచిత్తానామ్ - సమత్వము చిత్తమునందు కలిగినట్టియు, ముకుందచరణైషిణామ్ - మోక్షప్రదాతయగు శ్రీహరి పాదములను కోరే, సాధూనామ్ - సజ్జనులకు, ఉపేక్ష్యైః - ఉపేక్షించదగినట్టియు, ధనస్తంభైః - ధనము వలని గర్వము కలిగినట్టియు, అసద్-ఆశ్రయైః - అయోగ్యములగు భోగములనాశ్రయించే, అసద్భిః - దుష్టులతో, కిమ్ - పని యేమి?

సజ్జనులు చిత్తములో సమత్వము కలిగి మోక్షప్రదాతయగు శ్రీహరి పాదములను శరణు వేడెదరు. వారికి ధనగర్వముతో దుష్టభోగములను సేవించే దుష్టులతో పని యేమి? వారిని ఉపేక్షించుటయే మేలు.

తదహం మత్తయోర్మాధ్వ్యా వారుణ్యా శ్రీమదాంధయోః ।
తమోమదం హరిష్యామి స్త్రైణయోరజితాత్మనోః ॥ 19

తత్ - అందువలన, అహమ్ - నేను, వారుణ్యా - అన్నరసమునుండి తయారు చేసిన, మాధ్వ్యా - మద్యముతో, మత్తయోః - మత్తెక్కియున్నట్టియు, శ్రీమద-అంధయోః - ధనగర్వముతో గ్రుడ్డివారైనట్టియు, స్త్రైణయోః - స్త్రీలంపటులైనట్టియు, అజిత-ఆత్మనోః - జయించబడని దేహేంద్రియములు గల వీరిద్దరికి, తమః-మదమ్ - అజ్ఞానము వలని గర్వమును, హరిష్యామి - పోగొట్టెదను.

కావున, నేను వీరిద్దరికి అజ్ఞానము వలన కలిగిన గర్వమును పోగొట్టెదను. దేహేంద్రియములకు వశులై యున్న వీరిద్దరు అన్నరసమునుండి తయారు చేసిన మద్యముతో మత్తెక్కి ఉన్నారు. స్త్రీలంపటులగు వీరు ధనగర్వముతో వివేకజ్ఞానమును కోల్పోయినారు.

యదిమౌ లోకపాలస్య పుత్రౌ భూత్వా తమఃప్లుతౌ ।
న వివాససమాత్మానం విజానీతస్సుదుర్మదౌ ॥ 20

అతోఽర్హతః స్థావరతాం స్యాతాం నైవం యథా పునః ।
స్మృతిస్స్యాన్మత్ప్రసాదేన తత్రాపి మదనుగ్రహాత్ ॥ 21

వాసుదేవస్య సాన్నిధ్యం లబ్ధ్వా దివ్యశరచ్ఛతే ।
వృత్తే స్వర్లోకతాం భూయో లబ్ధభక్తీ భవిష్యతః ॥ 22

యత్ - ఎందువలనైతే, ఇమౌ - వీరిద్దరు, లోకపాలస్య - లోకపాలకుడగు కుబేరుని, పుత్రౌ - పుత్రులు, భూత్వా - అయి, తమఃప్లుతౌ - అజ్ఞానముచే నిండియున్నవారో, సుదుర్మదౌ - మిక్కిలి చెడ్డదియగు గర్వము గలవారై, ఆత్మానమ్ - తనను, వివాససమ్ - వస్త్రములు లేనివానినిగా, న విజానీతః - తెలియకున్నారో, అతః - ఇందువలన, స్థావరతామ్ - చెట్టు జన్మను, అర్హతః - తగుదురు, యథా - ఏ విధముగానైతే, మత్-ప్రసాదేన - నా అనుగ్రహముచే, పునః - మరల, ఏవమ్ - ఈ విధముగా, న స్యాతామ్ - కాకుందురో, స్మృతిః - పూర్వజన్మజ్ఞానము, స్యాత్ - ఉండును, తత్ర అపి - ఆ జన్మయందు కూడ, మద్-అనుగ్రహాత్ - నా అనుగ్రహము వలన, దివ్యశరద్-శతే - దేవ మానమును బట్టి వంద శరత్కాలములు, వృత్తే - గడువగా, వాసుదేవస్య - వసుదేవపుత్రుడగు శ్రీకృష్ణుని, సాన్నిధ్యమ్ - సన్నిధిలో ఉండుటను, భూయః - మరల, స్వః-లోకతామ్ - స్వర్గలోకనివాసమును, లబ్ధ్వా - పొంది, లబ్ధభక్తీ - పొందబడిన భక్తి గలవారు, భవిష్యతః - కాగలరు.

వీరిద్దరు లోకపాలకుడగు కుబేరుని పుత్రులై కూడ అజ్ఞానముతో నిండి ఉన్నారు. వీరియందున్న గర్వము మిక్కిలి చెడ్డది. వీరికి తమ ఒంటిపై బట్టలు లేవనే సంగతి కూడ తెలియకున్నది. కావున, వీరికి చెట్టు జన్మ

తగినది. నా అనుగ్రహముచే వీరు మరల ఇట్లు (గర్విష్ఠులు) కాకుందురు. పైగా, వీరికి పూర్వస్మృతి ఉండును. ఆ జన్మలో కూడ నా అనుగ్రహము వలన వీరికి వసుదేవపుత్రుడగు శ్రీకృష్ణుని సన్నిధి దొరుకును. వంద దివ్యసంవత్సరములు గడచిన పిదప వీరు మరల దేవత్వమును పొందెదరు. వీరికి భక్తి కూడ కలుగును.

శ్రీశుక ఉవాచ ।
ఏవముక్త్వా స దేవర్షిర్గతో నారాయణాశ్రమమ్ ।
నలకూబరమణిగ్రీవావాసతుర్యమలార్జునౌ ॥ 23

ఏవమ్ - ఈ విధముగా, ఉక్త్వా - పలికి, సః - ఆ, దేవ-ఋషిః - దేవర్షియగు నారదుడు, నారాయణ-ఆశ్రమమ్ - నారాయణాశ్రమమును గురించి, గతః - వెళ్లినవాడు, నలకూబరమణిగ్రీవౌ - నలకూబర మణిగ్రీవులు, యమల-అర్జునౌ - జంట మద్ది చెట్లు, ఆసతుః - ఐరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఇట్లు పలికి దేవర్షి నారదుడు నారాయణాశ్రమమునకు వెళ్లెను. నలకూబర మణిగ్రీవులు జంట మద్ది చెట్లు ఐరి.

ఋషేర్భాగవతముఖ్యస్య సత్యం కర్తుం వచో హరిః ।
జగామ శనకైస్తత్ర యత్రాస్తాం యమలార్జునౌ ॥ 24

భాగవతముఖ్యస్య - భగవద్భక్తులలో ప్రముఖుడగు, ఋషేః - నారద మహర్షియొక్క, వచః - మాటను, సత్యమ్ - సత్యమునుగా, కర్తుమ్ - చేయుటకు, హరిః - శ్రీకృష్ణుడు, శనకైః - మెల్లగా, తత్ర - అచటకు, జగామ - వెళ్లెను, యత్ర - ఎక్కడైతే, యమల-అర్జునౌ - జంట మద్ది చెట్లు, ఆస్తామ్ - కలవో.

నారదుడు భగవంతుని భక్తులలో అగ్రేసరుడు. ఆయన మాటను సత్యము చేయుటకై శ్రీహరి మెల్లగా ఎక్కడనైతే జంట మద్ది చెట్లు గలవో, అచటకు వెళ్లెను.

దేవర్షిర్మే ప్రియతమో యదిమౌ ధనదాత్మజౌ ।
తత్తథా సాధయిష్యామి యద్గీతం తన్మహాత్మనా ॥ 25

యత్ - ఎందువలనైతే, దేవ-ఋషిః - దేవర్షియగు నారదుడు, మే - నా కొరకు, ప్రియతమః - మిక్కిలి ప్రియమైనవాడో, తత్ - అందువలన, మహాత్మనా - మహాత్ముడగు ఆయనచే, ఇమౌ - ఈ, ధనద-ఆత్మజౌ - కుబేరపుత్రులనిద్దరిని గురించి, యత్ - ఏదైతే, గీతమ్ - చెప్పబడినదో, తత్ - దానిని, తథా - అటులనే, సాధయిష్యామి - చేయగలను.

నాకు దేవర్షి నారదుడు మిక్కిలి ప్రియమైనవాడు. కావున, ఆయన ఈ కుబేరపుత్రులనిద్దరిని గురించి ఏమి చెప్పెనో, దానిని నేను అటులనే చేసెదను (అని భగవానుడు తలచెను).

ఇత్యంతరేణార్జునయోః కృష్ణస్తు యమయోర్యయౌ ।
ఆత్మనిర్వేశమాత్రేణ తిర్యగ్గతములూఖలమ్ ॥ 26

ఇతి - అని (తలచి), కృష్ణః తు - శ్రీకృష్ణుడైతే, యమయోః - కలిసి పుట్టిన, అర్జునయోః - మద్ది చెట్లకు, అంతరేణ - మధ్యగా, యయౌ - వెళ్లెను, ఆత్మనిర్వేశమాత్రేణ - తాను ప్రవేశించుట మాత్రము చేతనే, ఉలూఖలమ్ - రోలు, తిర్యక్ - అడ్డము, గతమ్ - ఐనది.

ఇట్లు తలపోసి శ్రీకృష్ణుడైతే కలిసి పుట్టిన మద్ది చెట్ల మధ్యలోకి వెళ్లెను. ఆయన అట్లు ప్రవేశించినంత మాత్రాన రోలు అడ్డు పడినది.

బాలేన నిష్కర్షయతాఽన్వగులూఖలం తత్
దామోదరేణ తరసోత్కలితాంఘ్రిబంధౌ ।
నిష్పేతతుః పరమవిక్రమితాతివేప-
స్కంధప్రవాలవిటపౌ కృతచండశబ్దౌ ॥ 27

అన్వక్ - వెనుక వచ్చే, తత్ - ఆ, ఉలూఖలమ్ - రోలును, నిష్కర్షయతా - లాగుచున్నట్టియు, దామ-ఉదరేణ - త్రాడు ఉదరమునందు గల, బాలేన - బాలకృష్ణునిచే, తరసా - వేగముగా, ఉత్కలిత-అంఘ్రిబంధౌ - పెకిలించబడిన వ్రేళ్ల బంధము గలవి, పరమవిక్రమిత-అతివేపస్కంధప్రవాలవిటపౌ - పరమేశ్వరుని విక్రమముచే అధికమగు కంపము గల కాండము చిగుళ్లు కొమ్మలు గలవి,

కృతచండశబ్దౌ - చేయబడిన (పెద్ద) భయమును గొల్పే చప్పుడు గలవి అగు రెండు చెట్లు, నిష్పేతతుః - మొదలంటా కూలినవి.

బాలకృష్ణుడు ఉదరము చుట్టూ ఉన్న త్రాటితో తన వెనుకనే వచ్చుచున్న ఆ రోలును వేగముగా లాగగా, ఆ రెండు చెట్లు వ్రేళ్ల బంధముతో సహా పెకిలించబడినవై (పెద్ద) భయమును గొల్పే చప్పుడు చేస్తూ మొదలంటా నేల గూలినవి. పరమేశ్వరుడగు శ్రీకృష్ణుని విక్రమముచే వాటి కాండము, కొమ్మలు, ఆకులు కూడ అధికముగా అల్లల్లాడినవి.

తత్ర శ్రియా పరమయా కకుభస్స్ఫురంతౌ
సిద్ధావుపేత్య కుజయోరివ జాతవేదాః ।
కృష్ణం ప్రణమ్య శిరసాఽఖిలలోకనాథం
బద్ధాంజలీ విరజసావిదమూచతుస్స్మ ॥ 28

తత్ర - అప్పుడు, కుజయోః - చెట్లయందు, జాతవేదాః ఇవ - అగ్ని వలె, పరమయా - గొప్ప, శ్రియా - కాంతితో, కకుభః - దిక్కులను, స్ఫురంతౌ - ప్రకాశింపజేయువారు, విరజసౌ - తొలగిన రజోగుణము (గర్వము) గలవారు అగు, సిద్ధౌ - ఇద్దరు సిద్ధపురుషులు, అఖిలలోకనాథమ్ - సకలలోకములకు ప్రభుడగు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ఉపేత్య - దగ్గరకు వచ్చి, శిరసా - శిరస్సుతో, ప్రణమ్య - నమస్కరించి, బద్ధ-అంజలీ - ఘటించబడిన దోసిలి గలవారై, ఇదమ్ - ఈ మాటను, ఊచతుః స్మ - పలికిరి.

అప్పుడు ఆ రెండు చెట్లయందు అగ్ని వలె గొప్ప కాంతితో దిక్కులను ప్రకాశింపజేసే ఇద్దరు సిద్ధపురుషులు ప్రకటమైరి. వారు రజోగుణము (గర్వము) తొలగిన యక్షకుమారులే. వారు సకలలోకప్రభుడగు శ్రీకృష్ణుని దగ్గరకు వచ్చి తల వంచి నమస్కరించి దోసిలి యొగ్గి ఇట్లు పలికిరి.

కృష్ణ కృష్ణ మహాయోగింస్త్వమాద్యః పురుషః పరః ।
వ్యక్తావ్యక్తమిదం విశ్వం రూపం తే బ్రాహ్మణా విదుః ॥ 29

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, మహాయోగిన్ - ఓ గొప్ప యోగీ!, త్వమ్ - నీవు, ఆద్యః - సర్వకారణమగు, పరః పురుషః -

పురుషోత్తముడవు, వ్యక్త-అవ్యక్తమ్ - స్థూలము సూక్ష్మము అగు, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తు, తే - నీ, రూపమ్ - రూపమని, బ్రాహ్మణాః - వేదవేత్తలు, విదుః - తెలియుచున్నారు.

ఓ శ్రీకృష్ణా! శ్రీకృష్ణా! నీవు మహాయోగివి. నీవు సర్వకారణమగు పురుషోత్తముడవు. స్థూలము (పృథివ్యాదులు) మరియు సూక్ష్మము (గంధాదులు) అగు ఈ జగత్తు నీ రూపమేనని వేదవేత్తలు తెలియుదురు.

త్వమేకస్సర్వభూతానాం దేహాస్వాత్మేంద్రియేశ్వరః ।
త్వమేవ కాలో భగవాన్ విష్ణురవ్యయ ఈశ్వరః ॥ 30

త్వమ్ - నీవు, ఏకః - ఒక్కడివే, సర్వభూతానామ్ - సకలప్రాణులకు, దేహ-అసు-ఆత్మా-ఇంద్రియ-ఈశ్వరః - దేహములు ప్రాణములు అంతఃకరణము ఇంద్రియములకు ప్రభుడవు, త్వం ఏవ - నీవే, కాలః - కాలము, భగవాన్ విష్ణుః - శ్రీహరి భగవానుడవు, అవ్యయః - వినాశము లేనివాడవు, ఈశ్వరః - శాసకుడవు.

సకలప్రాణుల దేహము-ఇంద్రియములు-అంతఃకరణము-ప్రాణములకు ప్రభుడవు నీవే. సర్వమును శాసించే కాలము నీవే. వినాశము లేని శ్రీహరి భగవానుడవు నీవే.

త్వం మహాన్ ప్రకృతిస్సూక్ష్మా రజస్సత్త్వతమోమయీ ।
త్వమేవ పురుషోఽధ్యక్షస్సర్వక్షేత్రవికారవిత్ ॥ 31

త్వమ్ - నీవు, మహాన్ - మహత్తత్త్వము, సూక్ష్మా - సూక్ష్మమైన, రజః-సత్త్వతమః-మయీ - సత్త్వరజస్తమోగుణాత్మకమగు, ప్రకృతిః - ప్రకృతి, త్వం ఏవ - నీవే, పురుషః - పురుషుడవు, అధ్యక్షః - అధిష్ఠానమైన సాక్షివి, సర్వక్షేత్రవికారవిత్ - సకలక్షేత్రములయందలి వికారములను తెలియువాడవు.

సత్త్వరజస్తమోగుణాత్మకము, సూక్ష్మము అగు ప్రకృతి నీవు. ఆ ప్రకృతినుండి ఆవిర్భవించిన మహత్తత్త్వము నీవే. ఆ ప్రకృతికి అధిష్ఠానమైన పూర్ణసాక్షి చైతన్యము నీవే. సకలక్షేత్రములయందలి మార్పులకు సాక్షియై ఉండే క్షేత్రజ్ఞుడవు నీవే.

గృహ్యమాణైస్త్వమగ్రాహ్యో వికారైః ప్రాకృతైర్గుణైః ।
కో న్విహార్హతి విజ్ఞాతుం ప్రాక్సిద్ధం గుణసంవృతః ॥ 32

గృహ్యమాణైః - దృశ్యములైనట్టియు, ప్రాకృతైః - ప్రకృతికి చెందిన, గుణైః - గుణముల కార్యములగు, వికారైః - వికారములచే, త్వమ్ - నీవు, అగ్రాహ్యః - తెలియబడువాడవు కావు, ఇహ - ఈ సంసారమునందు, గుణసంవృతః - గుణకార్యములగు దేహాదులచే కప్పివేయబడియున్న, కః ను - ఏ జీవుడు, ప్రాక్ - సృష్టికి ముందే, సిద్ధమ్ - ఉన్న నిన్ను, విజ్ఞాతుమ్ - తెలియుటకు, అర్హతి - తగును?

ప్రకృతియొక్క గుణముల కార్యములైన బుద్ధి మొదలగు వికారములు దృశ్యములు. వాటికి నీవు గోచరుడవు కావు. ఈ సంసారమునందు గుణకార్యములగు దేహాదులయందు ఆత్మభావముచే కప్పివేయబడిన వివేకము గల ఏ జీవుడు అనాది స్వయంసిద్ధుడవగు నిన్ను తెలియగల్గును? (ఎవ్వడైననూ తెలియలేడు).

తస్మై తుభ్యం భగవతే వాసుదేవాయ వేధసే ।
ఆత్మద్యోతగుణైశ్ఛన్నమహిమ్నే బ్రహ్మణే నమః ॥ 33

భగవతే - భగవానుడవైనట్టియు, వాసుదేవాయ - వసుదేవుని పుత్రుడవైనట్టియు, వేధసే - సృష్టికర్తవైనట్టియు, ఆత్మద్యోతగుణైః - తన వలన ప్రకాశించే గుణములచే, ఛన్నమహిమ్నే - కప్పివేయబడే యథార్థస్వరూపము కలిగినట్టియు, బ్రహ్మణే - పరబ్రహ్మవగు, తస్మై - అట్టి, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

వసుదేవ పుత్రుడవగు నీవే సృష్టికర్తవగు భగవానుడవు. నీ వలన ప్రకాశించే సత్త్వాది గుణములు నీ యథార్థస్వరూపమును కప్పివేయును. అట్టి పరబ్రహ్మవగు నీ కొరకు నమస్కారము.

యస్యావతారా జ్ఞాయంతే శరీరేష్వశరీరిణః ।
తైస్తైరతుల్యాతిశయైర్వీర్యైర్దేహిష్వసంగతైః ॥ 34

అతుల్య-అతిశయైః - సమానమైనది గొప్పది లేనట్టియు, దేహిషు - జీవులయందు, అసంగతైః - సంభవము కాని, తైః తైః - ఆయా, వీర్యైః -

విక్రమములచే, శరీరేషు - దేహములయందు, అశరీరిణః - శరీరము లేని, యస్య - ఎవ్వాని, అవతారాః - అవతారములు, జ్ఞాయంతే - తెలియబడుచున్నవో.

నీవు చూపే ఆయా పరాక్రమములతో సమానమైనది గాని, అంతకంటె గొప్పది గాని లేదు. అట్టి పరాక్రమములు సామాన్యప్రాణులయందు సంభవము కావు. కానైతే, నీవు శరీరము లేనివాడవు. ఏ శరీరములయందైతే అట్టి పరాక్రమములు ప్రకటమగునో, అవి నీ అవతారములని తెలియవచ్చును.

స భవాన్ సర్వలోకస్య భవాయ విభవాయ చ ।
అవతీర్ణోఽంశభాగేన సాంప్రతం పతిరాశిషామ్ ॥ 35

ఆశిషామ్ - పురుషార్థములకు, పతిః - ప్రభువైన, సః - అట్టి, భవాన్ - నీవు, సాంప్రతమ్ - ఇప్పుడు, సర్వలోకస్య - సకలప్రాణులయొక్క, భవాయ - అభ్యుదయము కొరకు, విభవాయ చ - మోక్షము కొరకు కూడ, అంశభాగేన - అంశముల ప్రాదుర్భావము గల పూర్ణరూపముతో, అవతీర్ణః - అవతరించినవాడవు.

పురుషార్థములకు ప్రభుడవగు అట్టి నీవు ఇప్పుడు సకలప్రాణుల అభ్యుదయము కొరకు, మోక్షము కొరకు కూడ అవతరించినావు. ఇది అంశముల ప్రాదుర్భావము గల నీ పూర్ణరూపము.

నమః పరమకల్యాణ నమః పరమమంగల ।
వాసుదేవాయ శాంతాయ యదూనాం పతయే నమః ॥ 36

పరమకల్యాణ - సర్వోత్తమమైన కల్యాణ (సాధన) రూపా!, నమః - నమస్కారము, పరమమంగల - సర్వోత్తమమైన కల్యాణ (సాధ్య) రూపా!, నమః - నమస్కారము, వాసుదేవాయ - వసుదేవపుత్రుడైనట్టియు, శాంతాయ - శాంతుడైనట్టియు, యదూనామ్ - యాదవులకు, పతయే - ప్రభువగు శ్రీకృష్ణుని కొరకు, నమః - నమస్కారము.

ఓ శ్రీకృష్ణా! సర్వోత్తమమైన కల్యాణసాధనములు, సర్వోత్తమమైన కల్యాణమగు మోక్షము కూడ నీ రూపములే. వసుదేవపుత్రుడవగు నీవు శాంతుడవు. యాదవుల ప్రభువగు నీకు అనేక నమస్కారములు.

అనుజానీహి నౌ భూమంస్తవానుచరకింకరౌ ।
దర్శనం నౌ భగవత ఋషేరాసీదనుగ్రహాత్ ।। 37

భూమన్ - ఓ అనంతా!, తవ - నీ, అనుచరకింకరౌ - అనుచరులకు కింకరులమైన, నౌ - మా ఇద్దరిని, అనుజానీహి - అనుమతి ఇమ్ము, భగవతః - భగవానుడవగు నీయొక్క, దర్శనమ్ - దర్శనము, నౌ - మా ఇద్దరికి, ఋషేః - నారద మహర్షియొక్క, అనుగ్రహాత్ - అనుగ్రహము వలన, ఆసీత్ - కలిగెను.

ఓ అనంతా! మేమిద్దరము నీ అనుచరుడగు నారదుని కింకరులము. మాకు అనుమతినిమ్ము. భగవానుడవగు నీ దర్శనము మాకు నారదమహర్షి అనుగ్రహము వలన కలిగినది.

వాణీ గుణానుకథనే శ్రవణౌ కథాయాం
హస్తౌ చ కర్మసు మనస్తవ పాదయోర్నః ।
స్మృత్యాం శిరస్తవ నివాసజగత్ప్రణామే
దృష్టిస్సతాం దర్శనేఽస్తు భవత్తనూనామ్ ।। 38

నః - మా, వాణీ - వాక్కు, తవ - నీ, గుణ-అనుకథనే - గుణముల వర్ణనయందు, శ్రవణౌ - చెవులు, కథాయామ్ - గాథయందు, హస్తౌ చ - చేతులు కూడ, కర్మసు - పూజ మొదలైన పనులయందు, మనః - మనస్సు, పాదయోః - పాదములయొక్క, స్మృత్యామ్ - స్మరణమునందు, శిరః - తల, తవ - నీ, నివాసజగత్-ప్రణామే - నివాసస్థానమైన జగత్తునకు ప్రణమిల్లుటయందు, దృష్టిః - చూపు, భవత్-తనూనామ్ - నీ రూపములే ఐన, సతామ్ - సత్పురుషులయొక్క, దర్శనే - చూచుటయందు, అస్తు - అగుగాక!

మా వాగింద్రియము నీ గుణములను వర్ణించుటయందు, చెవులు గాథను వినుటయందు, చేతులు పూజాది కర్మలయందు, మనస్సు నీ

పాదములను స్మరించుటయందు, శిరస్సు నీ నివాసస్థానమైన జగత్తునకు ప్రణమిల్లుటయందు, చూపు నీ రూపములే ఐన సత్పురుషులను దర్శించుటయందు సార్థకమగుగాక!

శ్రీశుక ఉవాచ ।
ఇత్థం సంకీర్తితస్తాభ్యాం భగవాన్ గోకులేశ్వరః ।
దామ్నా చోలూఖలే బద్ధః ప్రహసన్నాహ గుహ్యకౌ ॥ 39

గోకుల-ఈశ్వరః - గోకులమునకు ప్రభువు, ఉలూఖలే - రోలునందు, దామ్నా - త్రాటితో, బద్ధః చ - కట్టబడినవాడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తాభ్యామ్ - వారిద్దరిచే, ఇత్థమ్ - ఈ విధముగా, సంకీర్తితః - బాగుగా కీర్తించబడినవాడై, ప్రహసన్ - నవ్వుచున్నవాడై, గుహ్యకౌ - ఇద్దరు యక్షులనుద్దేశించి, ఆహ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆ ఇద్దరు యక్షులు గోకులప్రభుడగు శ్రీకృష్ణభగవానుని ఈ విధముగా చక్కగా కీర్తించిరి. ఆయన ఇంకనూ త్రాటితో రోటికి కట్టబడియుండెను. ఆయన నవ్వుతూ వారిద్దరితో నిట్లనెను.

శ్రీభగవానువాచ ।
జ్ఞాతం మమ పురైవైతదృషిణా కరుణాత్మనా ।
యచ్ఛ్రీమదాంధయోర్వాగ్భిర్విభ్రంశోఽనుగ్రహః కృతః ॥ 40

శ్రీమద-అంధయోః - ధనగర్వముచే వివేకమును కోల్పోయిన మీ ఇద్దరికి, కరుణ-ఆత్మనా - దయాహృదయము గల, ఋషిణా - నారదమహర్షిచే, యత్ - ఏ విధముగానైతే, వాగ్భిః - వాక్కులతో, విభ్రంశః - దేవత్వమునుండి జారిపోవుట అనే, అనుగ్రహః - అనుగ్రహము, కృతః - చేయబడినదో, ఏతత్ - ఇది, పురా ఏవ - ముందే, మమ - నాకు, జ్ఞాతమ్ - తెలియబడినది.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- మీరిద్దరు ధనగర్వముతో వివేకమును కోల్పోయినప్పుడు దయాహృదయుడగు నారదమహర్షి తన వాక్కులతో మీ ఇద్దరిని దేవత్వమునుండి కూలద్రోసి అనుగ్రహమునే చేసినాడు. ఈ విషయము నాకు ముందే తెలియును.

సాధూనాం సమచిత్తానాం సుతరాం మత్కృతాత్మనామ్ ।
దర్శనాన్నో భవేద్బంధః పుంసోఽక్ష్ణోస్సవితుర్యథా ॥ 41

సమచిత్తానామ్ - సమమైన చిత్తము కలిగినట్టియు, సుతరామ్ - పూర్తిగా, మత్-కృత-ఆత్మనామ్ - నాయందు నిలుపబడిన మనస్సు కలిగిన, సాధూనామ్ - సత్పురుషులయొక్క, దర్శనాత్ - దర్శనము వలన, సవితుః - సూర్యుని (దర్శనము వలన), అక్ష్ణోః యథా - కన్నులకు వలె, పుంసః - వ్యక్తికి, బంధః - సంసారబంధము, నో భవేత్ - ఉండదు.

సూర్యప్రకాశము రాగానే కళ్లకు చీకట్లు దూరమగును. అదే విధముగా ద్వంద్వములను సమత్వదృష్టితో స్వీకరించే సత్పురుషులను దర్శించుట వలన మానవునకు సంసారబంధము దూరమగును. సత్పురుషుల మనస్సు పూర్తిగా నా పైనే నిలిచియుండును.

తద్గచ్ఛతం మత్పరమౌ నలకూబర సాదనమ్ ।
సంజాతో మయి భావో వామీప్సితః పరమోఽభవః ॥ 42

నలకూబర - ఓ నలకూబరా!, తత్ - అందువలన, మత్-పరమౌ - నేనే పరాయణముగా గలవారై, సాదనమ్ - స్వగృహమును గురించి, గచ్ఛతమ్ - వెళ్లుడు, అభవః - పునర్జన్మ లేకుండా చేసే, మయి - నాయందలి, పరమః - అతిశయించిన, భావః - ప్రేమ, వామ్ - మీకిద్దరికి, ఈప్సితః - కోరబడినది, సంజాతః - బాగుగా కలిగినది.

ఓ నలకూబరా! కావున (సాధుదర్శనము బంధనివృత్తికి హేతువు గనుక), మీరిద్దరు మీ గృహమునకు వెళ్లుడు. నన్నే సర్వాతిశాయియగు గమ్యముగా సేవించుడు. నాయందు అతిశయించిన (నిష్కామమైన) ప్రేమ గలవానికి పునర్జన్మ లేదు. మీకు అపేక్షితమైన అట్టి ప్రేమ మీకు కలిగినది.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్తౌ తౌ పరిక్రమ్య ప్రణమ్య చ పునః పునః ।
బద్ధోలూఖలమామంత్ర్య జగ్మతుర్దిశముత్తరామ్ ॥ 43

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే దశమోఽధ్యాయః ॥

ఇతి - అని, ఉక్తౌ - చెప్పబడిన, తౌ - వారిద్దరు, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, పునః పునః - మరల మరల, ప్రణమ్య చ - నమస్కారమును కూడ చేసి, బద్ధ-ఉలూఖలమ్ - కట్టివేయబడిన రోలు గల బాలకృష్ణుని, ఆమంత్ర్య - సెలవు తీసుకొని, ఉత్తరాం దిశమ్ - ఉత్తరదిక్కును గురించి, జగ్మతుః - వెళ్లిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- రోటికి కట్టివేయబడి ఉన్న బాలకృష్ణుడు ఇట్లు పలుకగా, వారిద్దరు ఆయనకు ప్రదక్షిణము చేసి పలుమార్లు నమస్కారములను కూడ చేసి ఉత్తరదిక్కు వైపు వెళ్లిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్ధములో శ్రీకృష్ణుడు అర్జున వృక్షముల జంటను పడగొట్టి
గంధర్వులకు శాపవిముక్తిని కలిగించుటను వర్ణించే
పదవ అధ్యాయము ముగిసినది (10).



# అథ ఏకాదశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు వత్సాసుర బకాసురులను ఉద్ధరించుట

శ్రీశుక ఉవాచ ।
గోపా నందాదయశ్శ్రుత్వా ద్రుమయోః పతతో రవమ్ ।
తత్రాజగ్ముః కురుశ్రేష్ఠ నిర్ఘాతభయశంకితాః ॥ 1

కురుశ్రేష్ఠ - కురువంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ రాజా!, నంద-ఆదయః - నందుడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు, పతతోః - పడుచున్న, ద్రుమయోః - రెండు చెట్లయొక్క, రవమ్ - ధ్వనిని, శ్రుత్వా - విని, నిర్ఘాతభయశంకితాః - పిడుగుపాటు వలని భయముచే శంక గలవారై, తత్ర - అచటకు, ఆజగ్ముః - వచ్చిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- కురువంశ శ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! నందుడు మొదలుగా గల గోపాలకులు ఆ రెండు చెట్లు పడుచున్న శబ్దమును విని, పిడుగు పడిన దేమోనని భయపడి, శంకతో కూడిన మనస్సుతో అక్కడకు వచ్చిరి.

భూమ్యాం నిపతితౌ తత్ర దదృశుర్యమలార్జునౌ ।
బభ్రముస్తదవిజ్ఞాయ లక్ష్యం పతనకారణమ్ ॥ 2

ఉలూఖలం వికర్షంతం దామ్నా బద్ధం చ బాలకమ్ ।
కస్యేదం కుత ఆశ్చర్యముత్పాత ఇతి కాతరాః ॥ 3

తత్ర - అచట, భూమ్యామ్ - నేలపై, నిపతితౌ - కూలిపోయిన, యమల-అర్జునౌ - జంట మద్ది చెట్లను, దదృశుః - చూచిరి, లక్ష్యమ్ - కనబడుచున్న, ఉలూఖలమ్ - రోలును, వికర్షంతమ్ - లాగుచున్నట్టియు, చ - మరియు, దామ్నా - త్రాటితో, బద్ధమ్ - కట్టివేయబడిన, బాలకమ్ - బాలకృష్ణుని, తత్ - ఆ, పతనకారణమ్ - పడుటకు కారణమునుగా,

అవిజ్ఞాయ - తెలియక, ఆశ్చర్యమ్ - ఆశ్చర్యమును కలిగించే, ఇదమ్ - ఈ పని, కస్య - ఎవనిది?, కుతః - ఎందువలన?, ఉత్పాతః - అపశకునము, ఇతి - అని, కాతరాః - భయపడువారై, బభ్రముః - భ్రమపడిరి.

అచట నేలపై పడియున్న రెండు చెట్లను వారు చూచిరి. త్రాటితో కట్టబడి రోలును లాగుచున్న బాలకృష్ణుడు ఎదురుగా కనబడుచునే యుండెను. కాని, ఆ చెట్ల పతనమునకు ఆయనయే కారణమని వారికి తెలియలేదు. ఆశ్చర్యమును గొల్పు ఈ పనిని చేసినదెవరు? దీనికి కారణ మేమి? అంటూ భయపడి, అది అపశకునమని వారు భ్రమను జెందిరి.

బాలా ఊచురనేనేతి తిర్యగ్గతములూఖలమ్ ।
వికర్షతా మధ్యగేన పురుషావప్యచక్ష్మహి ॥ 4

తిర్యక్ - అడ్డముగా, గతమ్ - పడిన, ఉలూఖలమ్ - రోలును, వికర్షతా - లాగుచున్నట్టియు, మధ్యగేన - మధ్యను చేరిన, అనేన - ఈ బాలకృష్ణునిచే, పురుషౌ అపి - ఇద్దరు పురుషులను కూడ, అచక్ష్మహి - చూచితిమి, ఇతి - అని, బాలాః - పిల్లలు, ఊచుః - చెప్పిరి.

అడ్డముగా పడిన రోలును లాగుతూ చెట్ల మధ్యకు చేరిన ఈ బాలకృష్ణుడే వాటిని పడగొట్టినాడు. మేము ఇద్దరు పురుషులను కూడ చూచితిమి, అని పిల్లలు చెప్పిరి.

న తే తదుక్తం జగృహుర్న ఘటేతేతి తస్య తత్ ।
బాలస్యోత్పాటనం తర్వోః కేచిత్సందిగ్ధచేతసః ॥ 5

తస్య - ఆ, బాలస్య - పిల్లవానికి, తత్ - ఆ, తర్వోః - రెండు చెట్లయొక్క, ఉత్పాటనమ్ - నేల గూల్చుట, న ఘటేత - సంభవము కాదు, ఇతి - అని, తే - వారు, తత్ - ఆ, ఉక్తమ్ - మాటను, న జగృహుః - స్వీకరించలేదు, కేచిత్ - కొందరు, సందిగ్ధచేతసః - సందేహములో పడిన మనస్సు గలవారు.

ఆ పిల్లవాడు రెండు చెట్లను ఆ విధముగా పడగొట్టుట సంభవము కాదు, అంటూ వారు ఆ మాటను నమ్మలేదు. కాని, కొందరికైతే మనస్సులో (బాలకృష్ణుని పనే అని) సందేహము కలిగెను.

ఉలూఖలం వికర్షంతం దామ్నా బద్ధం స్వమాత్మజమ్ ।
విలోక్య నందః ప్రహసద్వదనో విముమోచ హ ॥ 6

ఉలూఖలమ్ - రోలును, వికర్షంతమ్ - లాగుచున్నట్టియు, దామ్నా - త్రాటితో, బద్ధమ్ - కట్టబడిన, స్వమ్ - తన, ఆత్మజమ్ - పుత్రుని, విలోక్య - చూచి, నందః - నందుడు, ప్రహసద్-వదనః - నవ్వుచున్న ముఖము గలవాడై, విముమోచ హ - విడిపించెను.

త్రాటితో కట్టబడి రోలును లాగుచున్న తన పుత్రుని చూచిన నందునకు నవ్వు ముంచుకు వచ్చెను. ఆయన అతనిని కట్టునుండి విడిపించెను.

గోపీభిః స్తోభితోఽనృత్యద్భగవాన్బాలవత్క్వచిత్ ।
ఉద్గాయతి క్వచిన్ముగ్ధస్తద్వశో దారుయంత్రవత్ ॥ 7

భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, క్వచిత్ - ఒకప్పుడు, గోపీభిః - గోపికలచే, స్తోభితః - ప్రోత్సహించబడినవాడై, అనృత్యత్ - నాట్యము చేసెను, క్వచిత్ - ఒకప్పుడు, ముగ్ధః - సుందరుడైన ఆతడు, తద్-వశః - వారి వశములో నున్నవాడై, దారుయంత్రవత్ - చెక్క యంత్రము వలె, ఉద్గాయతి - బిగ్గరగా గానము చేయును.

శ్రీకృష్ణ భగవానుడు మామూలు పిల్లవాని వలె ఆ గోపికలకు చెక్క యంత్రము వలె వశమయ్యెను. ఆయన ఒకప్పుడు వారు ప్రోత్సహించుచుండగా నాట్యమాడెను. మరియొకప్పుడు బిగ్గరగా పాడెను.

బిభర్తి క్వచిదాజ్ఞప్తః పీఠకోన్మానపాదుకమ్ ।
బాహుక్షేపం చ కురుతే స్వానాం చ ప్రీతిమావహన్ ॥ 8

క్వచిత్ - ఒకప్పుడు, ఆజ్ఞప్తః - ఆజ్ఞాపించబడినవాడై, పీఠక-ఉన్మానపాదుకమ్ - పీటను కుంచమును పాదుకను, బిభర్తి - మోయును, చ - మరియు, స్వానాం చ - తనవారికి ఇతరులకు కూడ, ప్రీతిమ్ - ఆనందమును, ఆవహన్ - కలిగించువాడై, బాహుక్షేపమ్ - జబ్బ చరుచుటను, కురుతే - చేయును.

ఒకప్పుడు గోపికలాజ్ఞాపించగా పీటను, కుంచమును, పాదుకను మోసుకువచ్చును. మరియొకప్పుడు చూచువారందరికి ప్రీతిని కలిగిస్తూ జబ్బను చరుచుకొనును.

దర్శయంస్తద్విదాం లోక ఆత్మనో భృత్యవశ్యతామ్ ।
వ్రజస్యోవాహ వై హర్షం భగవాన్ బాలచేష్టితైః ॥ 9

లోకే - లోకమునందు, తద్-విదామ్ - ఆయన గురించి తెలిసినవారలకు, ఆత్మనః - తన, భృత్యవశ్యతామ్ - భక్తులకు వశుడై యుండుటను, దర్శయన్ - చూపుచున్నవాడై, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, బాలచేష్టితైః - పిల్లల చేష్టలచే, వ్రజస్య - గోకులమునకు, హర్షమ్ - హర్షమును, వై - నిశ్చయముగా, ఉవాహ - తీసుకువచ్చెను.

లోకమునందు భగవంతుని మహిమనెరింగినవారలకు తాను భక్తులకు వశుడై యుండెదనని నిరూపించువాడై, శ్రీకృష్ణభగవానుడు తన బాల్యలీలలతో గోకులము వారికి నిశ్చయముగా హర్షమును కలిగించెను.

క్రీణీహి భోః ఫలానీతి శ్రుత్వా సత్వరమచ్యుతః ।
ఫలార్థీ ధాన్యమాదాయ యయౌ సర్వఫలప్రదః ॥ 10

భోః - ఓయీ!, ఫలాని - పళ్లను, క్రీణీహి - కొనుము, ఇతి - అని, శ్రుత్వా - విని, ఫల-అర్థీ - పళ్లను కోరువాడు, సర్వఫలప్రదః - అందరికీ కర్మఫలములనిచ్చువాడు అగు, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, సత్వరమ్ - వేగముగా, ధాన్యమ్ - వడ్లను, ఆదాయ - తీసుకొని, యయౌ - వెళ్లెను.

పళ్లను అమ్మే స్త్రీ, ఓయీ! పళ్లను కొనుక్కో, అని కేక పెట్టెను. ఆ మాట అందరికీ కర్మఫలములనిచ్చే శ్రీకృష్ణ భగవానుని చెవిన పడెను. ఆయన పళ్లను కోరి వెంటనే వడ్లను తీసుకొని (ఆమె వద్దకు) వెళ్లెను.

ఫలవిక్రయిణీ తస్య చ్యుతధాన్యం కరద్వయమ్ ।
ఫలైరపూరయద్రత్నైః ఫలభాండమపూరి చ ॥ 11

ఫలవిక్రయిణీ - పళ్లను అమ్మే స్త్రీ, చ్యుతధాన్యమ్ - విడువబడిన ధాన్యము గల, తస్య - ఆ శ్రీకృష్ణుని, కరద్వయమ్ - రెండు చేతులను, ఫలైః - పళ్లతో, అపూరయత్ - నింపెను, ఫలభాండం చ - పళ్ల బుట్ట కూడ, రత్నైః - రత్నములతో, అపూరి - నింపబడెను.

ఆ శ్రీకృష్ణుడు దోసిలిలోని ధాన్యమును ఒలకబోసుకుంటూ తీసుకువెళ్లెను. ఆమె ఆ మిగిలిన ధాన్యమును తీసుకొని బుట్టలో వేసుకొని, ఆతని రెండు చేతుల నిండా పళ్లను ఇచ్చెను. (తరువాత చూస్తే) ఆమె బుట్ట కూడ రత్నములతో నిండి యుండెను.

సరిత్తీరగతం కృష్ణం భగ్నార్జునమథాహ్వాయత్ ।
రామం చ రోహిణీ దేవీ క్రీడంతం బాలకైర్భృశమ్ ॥ 12

అథ - తరువాత, సరిత్-తీరగతమ్ - యమున ఒడ్డున ఉన్నట్టియు, భగ్న-అర్జునమ్ - మద్ది చెట్లను పడగొట్టినట్టియు, బాలకైః - పిల్లలతో, భృశమ్ - అదే పనిగా, క్రీడంతమ్ - ఆడుచున్న, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, రామం చ - బలరాముని కూడ, రోహిణీ దేవీ - రోహిణీదేవి, ఆహ్వాయత్ - పిలిచెను.

మద్ది చెట్లను కూలగొట్టిన బాలకృష్ణుడు బలరామునితో మరియు గోపబాలకులతో కూడి యమునానదీతీరమున అదే పనిగా ఆడుచుండెను. అప్పుడు రోహిణీదేవి వారిద్దరిని పిలిచెను.

నోపేయాతాం యదాऽऽహూతౌ క్రీడాసంగేన పుత్రకౌ ।
యశోదాం ప్రేషయామాస రోహిణీ పుత్రవత్సలామ్ ॥ 13

యదా - ఎప్పుడైతే, ఆహూతౌ - పిలువబడిన, పుత్రకౌ - ఇద్దరు బాలకులు, క్రీడాసంగేన - ఆటయందలి ఆసక్తిచే, న ఉపేయాతామ్ - దగ్గరకు రాలేదో అప్పుడు, రోహిణీ - రోహిణి, పుత్రవత్సలామ్ - పుత్రులయందు ప్రేమ గల, యశోదామ్ - యశోదను, ప్రేషయామాస - పంపెను.

రోహిణి పిలిచిననూ ఆ బాలకులిద్దరు ఆటయందు నిమగ్నులై యుండుటచే దగ్గరకు రాలేదు. అప్పుడు ఆమె పుత్రులయందు వాత్సల్యము గల యశోదను పంపెను.

క్రీడంతం సా సుతం బాలైరతివేలం సహాగ్రజమ్ ।
యశోదాఽఽజోహవీత్కృష్ణం పుత్రస్నేహస్నుతస్తనీ ॥ 14

పుత్రస్నేహస్నుతస్తనీ - పుత్రునియందలి ప్రేమచే స్రవించే స్తనములు గల, సా - ఆ, యశోదా - యశోద, అతివేలమ్ - వేళ దాటి, బాలైః - పిల్లలతో, క్రీడంతమ్ - ఆడుచున్నట్టియు, సహ-అగ్రజమ్ - అన్నతో కలిసి ఉన్న, సుతమ్ - పుత్రుడైన, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ఆజోహవీత్ - మళ్లీ మళ్లీ పిలిచెను.

శ్రీకృష్ణుడు అన్నతో కూడి పిల్లలతో వేళ దాటి ఆడుచుండెను. పుత్రునియందలి ప్రేమతో స్రవించే స్తనములు గల యశోద పుత్రుని పలుమార్లు పిలిచెను.

కృష్ణ కృష్ణారవిందాక్ష తాత ఏహి స్తనం పిబ ।
అలం విహారైః క్షుత్క్షాంతః క్రీడాశ్రాంతోఽసి పుత్రక ॥ 15

కృష్ణ - ఓ కృష్ణా!, కృష్ణ - ఓ కృష్ణా!, అరవింద-అక్ష - పద్మములవంటి కన్నులు గలవాడా!, తాత - బాబూ!, పుత్రక - అబ్బాయీ!, ఏహి - రమ్ము, స్తనమ్ - పాలను, పిబ - త్రాగుము, విహారైః - విహారములతో, అలమ్ - చాలును, క్షుత్క్షాంతః - ఆకలితో చిక్కినవాడవు, క్రీడాశ్రాంతః - ఆటలతో అలిసినవాడవు, అసి - అగుచున్నావు.

ఓ కృష్ణా! కృష్ణా! నీ కన్నులు పద్మములను పోలియున్నవి. బాబూ! అబ్బాయీ! రమ్ము. పాలను త్రాగుము. విహారములు చాలును. నీవు ఆకలితో చిక్కి, ఆటలతో అలసి ఉన్నావు.

హే రామాగచ్ఛ తాతాశు సానుజః కులనందన ।
ప్రాతరేవ కృతాహారస్తద్భవాన్ భోక్తుమర్హతి ॥ 16

హే రామ - ఓ రామా!, తాత - బాబూ!, కులనందన - కులమును ఆనందింప జేయువాడా!, స-అనుజః - తమ్మునితో గూడినవాడవై, ఆశు - వెంటనే, ఆగచ్ఛ - రమ్ము, ప్రాతః ఏవ - ఉదయము మాత్రమే, కృత-ఆహారః - చేయబడిన ఆహారము గలవాడవు, తత్ - అందువలన, భవాన్ - నీవు, భోక్తుమ్ - తినుటకు, అర్హతి - తగుదువు.

ఓ రామా! బాబూ! నీవు వంశమునానందింప జేయువాడవు. తమ్మునితో కూడి వెంటనే రమ్ము. నీవు ఉదయము మాత్రమే ఆహారమును తీసుకుంటివి. కావున, నీవు భోజనము చేయ తగుదువు.

ప్రతీక్షతే త్వాం దాశార్హ భోక్ష్యమాణో వ్రజాధిపః ।
ఏహ్యావయోః ప్రియం ధేహి స్వగృహాన్ యాత బాలకాః ॥ 17

దాశార్హ - దాశార్హవంశములో పుట్టినవాడా!, వ్రజ-అధిపః - గోకులమునకు ప్రభువగు నందుడు, భోక్ష్యమాణః - భుజించబోవువాడై, త్వామ్ - నిన్ను, ప్రతీక్షతే - ఎదురు చూచుచున్నాడు, ఏహి - రమ్ము, ఆవయోః - మా యిద్దరికి, ప్రియమ్ - ప్రీతిని, ధేహి - కలిగించుము, బాలకాః - పిల్లలారా!, స్వగృహాన్ - మీ ఇళ్లను గురించి, యాత - వెళ్లుడు.

దాశార్హవంశములో పుట్టిన కృష్ణా! గోకులప్రభువగు నందుడు భోజనము చేయకుండా నీ కొరకు ఎదురు చూచుచున్నాడు. రమ్ము. మా యిద్దరికి ప్రీతిని కలిగించుము. ఓ పిల్లలారా! మీ ఇళ్లకు వెళ్లుడు.

ధూలిధూసరితాంగస్త్వం పుత్ర మజ్జనమావహ ।
జన్మర్క్షమద్య భవతో విప్రేభ్యో దేహి గాశ్శుచిః ॥ 18

పుత్ర - అబ్బాయీ!, త్వమ్ - నీవు, ధూలిధూసరిత-అంగః - దుమ్ముతో బూడిదరంగు గల దేహము గలవాడవు, మజ్జనమ్ - స్నానమును, ఆవహ - చేయుము, అద్య - ఈనాడు, భవతః - నీ, జన్మ-ఋక్షమ్ - జన్మనక్షత్రము, శుచిః - శుచివై, విప్రేభ్యః - వేదవేత్తల కొరకు, గాః - గోవులను, దేహి - ఇమ్ము.

అబ్బాయీ! నీ దేహము దుమ్ముతో బూడిదరంగు వచ్చినది. స్నానము చేయుము. ఈ రోజు నీ జన్మనక్షత్రము. శుచివై వేదవేత్తలకు గోవులను దానము చేయుము.

పశ్య పశ్య వయస్యాంస్తే మాతృమృష్టాన్ స్వలంకృతాన్ ।
త్వం చ స్నాతః కృతాహారో విహరస్వ స్వలంకృతః ॥ 19

మాతృమృష్టాన్ - తల్లులచే శుభ్రము చేయబడినట్టియు, సు-అలంకృతాన్ - చక్కగా అలంకరించబడిన, తే - నీ, వయస్యాన్ - మిత్రులను, పశ్య - చూడుము, పశ్య - చూడుము, త్వం చ - నీవు కూడ, స్నాతః - స్నానము చేసినవాడవై, కృత-ఆహారః - చేయబడిన ఆహారము గలవాడవై, సు-అలంకృతః - చక్కగా అలంకరించబడినవాడవై, విహరస్వ - విహరించుము.

నీ మిత్రులను చూడుము. వారిని వారి తల్లులు స్నానము చేయించి చక్కగా అలంకరించినారు. చూడుము. నీవు కూడ స్నానము చేసి భోజనము చేసి చక్కగా అలంకరింప జేసుకొని విహరించుము.

ఇత్థం యశోదా తమశేషశేఖరం
మత్వా సుతం స్నేహనిబద్ధధీర్నృప ।
హస్తే గృహీత్వా సహరామమచ్యుతం
నీత్వా స్వవాటం కృతవత్యథోదయమ్ ॥ 20

నృప - రాజా!, ఇత్థమ్ - ఈ విధముగా, స్నేహనిబద్ధధీః - ప్రేమచే కట్టివేయబడిన మనస్సు గల, యశోదా - యశోద, అశేషశేఖరమ్ - సర్వులలో పూజనీయుడైన, అచ్యుతమ్ - శ్రీహరిని, సుతమ్ - పుత్రునిగా, మత్వా - తలచి, సహరామమ్ - బలరామునితో గూడియున్న, తమ్ - ఆ కృష్ణుని, హస్తే - చేతియందు, గృహీత్వా - పట్టుకొని, స్వవాటమ్ - తన యింటిని, నీత్వా - తీసుకువెళ్లి, అథ - తరువాత, ఉదయమ్ - మంగళకృత్యమును, కృతవతీ - చేసినది.

ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా యశోద మనస్సు ప్రేమచే కట్టివేయబడెను. ఆమె సర్వులలో పూజనీయుడగు శ్రీహరిని తన

పుత్రునిగా తలపోసెను. ఆమె బలరామునితో గూడియున్న ఆ శ్రీకృష్ణుని చెయ్యి పట్టుకొని తన యింటికి తీసుకువెళ్లి, స్నానము మొదలగు మంగళకృత్యములను చేసెను.

గోపవృద్ధా మహోత్పాతానను భూయ బృహద్వనే ।
నందాదయస్సమాగమ్య వ్రజకార్యమమంత్రయన్ ॥ 21

నంద-ఆదయః - నందుడు మొదలుగా గల, గోపవృద్ధాః - గోపాలకులలోని పెద్దలు, బృహద్వనే - మహావనమునందు, మహా-ఉత్పాతాన్ - పెద్ద అపశకునములను, అనుభూయ - అనుభవించి, సమాగమ్య - సమావేశమై, వ్రజకార్యమ్ - గోకులమునకు చేయదగిన దానిని గురించి, అమంత్రయన్ - సంప్రదించిరి.

నందుడు మొదలైన గోపాలకులలోని పెద్దలకు మహావనములో పెద్ద అపశకునములు అనుభవమునకు వచ్చెను. వారు సమావేశమై గోకులమునకు చేయదగిన పనిని గురించి సంప్రదించిరి.

తత్రోపనందనామాఽఽహ గోపో జ్ఞానవయోఽధికః ।
దేశకాలార్థతత్త్వజ్ఞః ప్రియకృద్రామకృష్ణయోః ॥ 22

తత్ర - వారియందు, జ్ఞానవయః-అధికః - జ్ఞానముచే వయస్సుచే పెద్ద, దేశకాల-అర్థతత్త్వజ్ఞః - దేశకాలములయందు ప్రయోజనముయొక్క యథార్థస్వరూపము తెలిసినవాడు, రామకృష్ణయోః - బలరామశ్రీకృష్ణులిద్దరికి, ప్రియకృత్ - ప్రియమును చేయువాడు, ఉపనందనామా - ఉపనందుడని ప్రసిద్ధి జెందిన, గోపః - గోపాలకుడు, ఆహ - పలికెను.

వారిలో ఉపనందుడని ప్రసిద్ధి చెందిన గోపాలకుడు కలడు. ఆయన జ్ఞానముచే మరియు వయస్సుచే పెద్ద. ఏ దేశకాలములలో ఏ ప్రయోజనము సిద్ధించుననే తత్త్వము ఆయనకు యెరుకయే. బలరామకృష్ణులిద్దరికీ ప్రియమును చేసే ఆయన ఇట్లు పలికెను.

ఉత్థాతవ్యమితోఽస్మాభిర్గోకులస్య హితైషిభిః ।
ఆయాంత్యత్ర మహోత్పాతా బాలానాం నాశహేతవః ॥ 23

గోకులస్య - గోకులమునకు, హితైషిభిః - హితమును కోరే, అస్మాభిః - మనచే, ఇతః - ఇక్కడనుండి, ఉత్థాతవ్యమ్ - వలస పోబడవలెను, అత్ర - ఇచట, బాలానామ్ - పిల్లల, నాశహేతవః - నాశమునకు కారణములయ్యే, మహా-ఉత్పాతాః - పెద్ద అపశకునములు, ఆయాంతి - వచ్చుచున్నవి.

మనము గోకులముయొక్క హితమును కోరేటట్లైతే, ఇక్కడనుండి నివాసమును మార్చవలెను. ఏలయన, ఇక్కడ పిల్లల వినాశమునకు కారణమయ్యే పెద్ద అపశకునములు కలుగుచున్నవి.

ముక్తః కథంచిద్రాక్షస్యా బాలఘ్న్యా బాలకో హ్యసౌ ।
హరేరనుగ్రహాన్నూనమనశ్చోపరి నాపతత్ ॥ 24

హి - ఏలయన, అసౌ - ఈ, బాలకః - బాలకృష్ణుడు, బాలఘ్న్యాః - పిల్లలను చంపే, రాక్షస్యాః - రాక్షసినుండి, కథంచిత్ - అతికష్టము మీద, ముక్తః - విడిపించబడినవాడు, చ - మరియు, నూనమ్ - నిశ్చయముగా, హరేః - శ్రీహరియొక్క, అనుగ్రహాత్ - అనుగ్రహము వలన, అనః - బండి, ఉపరి - పైన, న అపతత్ - పడలేదు.

ఎందుకంటే, ఈ బాలకృష్ణుడు అతికష్టము మీద పిల్లలను చంపే రాక్షసినుండి విముక్తిని పొందినాడు, పైగా, బండి మీద పడలేదంటే అది నిశ్చయముగా శ్రీహరి అనుగ్రహమే.

చక్రవాతేన నీతోఽయం దైత్యేన విపదం వియత్ ।
శిలాయాం పతితస్తత్ర పరిత్రాతస్సురేశ్వరైః ॥ 25

అయమ్ - ఈ బాలకృష్ణుడు, చక్రవాతేన - సుడిగాలి రూపములోనున్న, దైత్యేన - రాక్షసునిచే, విపదమ్ - పక్షులకు నెలవైన, వియత్ - ఆకాశమును గురించి, నీతః - కొనిపోబడినవాడై, శిలాయామ్ - రాతిపై, పతితః - పడినవాడు, తత్ర - అప్పుడు, సుర-ఈశ్వరైః - దేవనాయకులచే, పరిత్రాతః - అన్ని విధములుగా కాపాడబడినవాడు.

ఈ బాలకృష్ణుని సుడిగాలి రూపములోనున్న రాక్షసుడు పక్షులకు నెలవైన ఆకాశములోనికి తీసుకువెళ్లి రాతిపై పడవైచినాడు. అప్పుడు వీనిని దేవనాయకులు అన్ని విధములుగా కాపాడినారు.

యన్న మ్రియేత ద్రుమయోరంతరం ప్రాప్య బాలకః ।
అసావన్యతమో వాఽపి తదప్యచ్యుతరక్షణమ్ ॥ 26

ద్రుమయోః - రెండు చెట్లయొక్క, అంతరమ్ - మధ్యభాగమును, ప్రాప్య అపి - పొంది కూడ, అసౌ - ఈ, బాలకః - బాలకృష్ణుడు, అన్యతమః వా - మరియొక పిల్లవాడైననూ, న మ్రియేత యత్ - మరణించలేదనేది యేది గలదో, తత్ అపి - అది కూడ, అచ్యుతరక్షణమ్ - శ్రీహరి రక్షణయే.

రెండు చెట్ల మధ్య చేరి కూడా ఈ బాలకృష్ణుడు గాని, లేదా ఇంకో పిల్లవాడు గాని మరణించలేదంటే, అది శ్రీహరి చేసిన రక్షణమే.

యావదౌత్పాతికోఽరిష్టో వ్రజం నాభిభవేదితః ।
తావద్బాలానుపాదాయ యాస్యామోఽన్యత్ర సానుగాః ॥ 27

యావత్ - ఎంతవరకైతే, ఔత్పాతికః - అపశకునము వలన కలిగే, అరిష్టః - ఆపద, వ్రజమ్ - గోకులమును, న అభిభవేత్ - స్పృశించదో (పీడించదో), తావత్ - అంతలో, స-అనుగాః - అనుచరులతో కూడినవారమై, బాలాన్ - పిల్లలను, ఉపాదాయ - తోడ్కొని, ఇతః - ఇక్కడనుండి, అన్యత్ర - మరియొకచోటికి, యాస్యామః - వెళ్లెదము.

అపశకునములు కలిగించే ఆపద గోకులమును స్పృశించక (పీడించక) ముందే, మనము అనుచరులతో కూడి పిల్లలను తోడ్కొని ఇక్కడనుండి మరియొక చోటికి వెళ్లెదము.

వనం బృందావనం నామ పశవ్యం నవకాననమ్ ।
గోపగోపీగవాం సేవ్యం పుణ్యాద్రితృణవీరుధమ్ ॥ 28

బృందావనం నామ - బృందావనమని ప్రసిద్ధి గాంచిన, వనమ్ - అడవి, పశవ్యమ్ - పశువులకు హితకరమైనది, నవకాననమ్ - కొత్త చెట్ల గుంపులు గలది, గోపగోపీగవామ్ - గోపాలకులకు గోపికలకు గోవులకు, సేవ్యమ్ - సేవించ దగినది, పుణ్య-అద్రితృణవీరుధమ్ - పవిత్రమగు కొండలు (చెట్లు) గడ్డి ఓషధులు గలది.

బృందావనమని ప్రసిద్ధి గాంచిన అడవి గలదు. అది పశువులకు హితమును చేగూర్చును. కొత్త చెట్ల గుంపులతో కూడిన ఆ వనములో గోపాలకులు, గోపికలు, గోవులు సుఖించెదరు. పవిత్రమగు కొండలు గల ఆ అడవిలో చెట్లు, గడ్డి, ఓషధులు సమృద్ధిగా గలవు.

తత్తత్రాద్యైవ యాస్యామశ్శకటాన్యుం క్త మా చిరమ్ ।
గోధనాన్యగ్రతో యాంతు భవతాం యది రోచతే ॥ 29

తత్ - అందువలన, భవతామ్ - మీకు, యది రోచతే - ఇష్టమైనచో, అద్య ఏవ - ఈనాడే, తత్ర - అచటకు, యాస్యామః - వెళ్లెదము, శకటాన్ - బళ్లను, యుంక్త - కట్టుడు, మా చిరమ్ - విలంబము వద్దు, గోధనాని - గోవుల సంపదలు, అగ్రతః - ముందు, యాంతు - నడచుగాక!

కావున, మీకు అంగీకారమైనచో, ఈనాడే అచటకు వెళ్లెదము. బళ్లను కట్టుడు. విలంబము వద్దు. మన సంపద గోవులు ముందు నడువవలెను.

తచ్ఛ్రుత్వైకధియో గోపాస్సాధు సాధ్వితి వాదినః ।
వ్రజాన్ స్వాన్ స్వాన్సమాయుజ్య యయూ రూఢపరిచ్ఛదాః॥30

తత్ - ఆ మాటను, శ్రుత్వా - విని, ఏకధియః - ఒకే సమ్మతి గల, గోపాః - గోపాలకులు, సాధు - బాగు, సాధు - బాగు, ఇతి - అని, వాదినః - పలుకువారై, స్వాన్ స్వాన్ - తమ తమ, వ్రజాన్ - బళ్ల గుంపులను, సమాయుజ్య - కూడగట్టుకొని, రూఢపరిచ్ఛదాః - బండియందు ఎక్కించబడిన సామగ్రి గలవారై, యయుః - వెళ్లిరి.

ఆ మాటను విని గోపాలకులందరు బాగు బాగు అంటూ ఏకగ్రీవముగా అంగీకరించిరి. వారు తమ తమ బళ్ల గుంపులను కూడగట్టుకొని సామగ్రిని ఎక్కించుకొని వెళ్లిరి.

వృద్ధాన్ బాలాన్ స్త్రియో రాజన్ సర్వోపకరణాని చ ।
అనస్స్వారోప్య గోపాలా యత్తా ఆత్తశరాసనాః ॥ 31

రాజన్ - ఓ రాజా!, వృద్ధాన్ - వృద్ధులను, బాలాన్ - పిల్లలను, స్త్రియః - స్త్రీలను, సర్వ-ఉపకరణాని చ - సకలములైన సామగ్రులను కూడ,

అనస్సు - బళ్లయందు, ఆరోప్య - ఎక్కించి, ఆత్తశర-ఆసనాః - పట్టుకొన బడిన ధనుస్సులు గల, గోపాలాః - గోపాలకులు, యత్తాః - ఉద్యతులైరి.

ఓ పరీక్షిన్మహారాజా! గోపాలకులు వృద్ధులను, పిల్లలను, స్త్రీలను, సకలసామగ్రిని బళ్లలోకి ఎక్కించి, ధనుస్సులను పట్టుకొని, సంసిద్ధులైరి.

గోధనాని పురస్కృత్య శృంగాణ్యాపూర్య సర్వతః ।
తూర్యఘోషేణ మహతా యయుస్సహపురోహితాః ॥ 32

సహపురోహితాః - పురోహితునితో కూడియున్న గోపాలకులు, గోధనాని - సంపదయైన గోవులను, పురస్కృత్య - ముందిడుకొని, సర్వతః - అన్ని వైపులనుండి, శృంగాణి - కొమ్ము బూరాలను, ఆపూర్య - పూరించి, మహతా - పెద్ద, తూర్యఘోషేణ - వాద్యముల ధ్వనితో, యయుః - వెళ్లిరి.

గోపాలకులు పురోహితునితో గూడి వారి సంపదయైన గోవులను ముందిడికొని వెళ్లిరి. అన్ని వైపులనుండి కొమ్ము బూరాలను పూరించిరి. వాద్యముల ధ్వనిని అధికముగా చేసిరి.

గోప్యో రూఢరథా నూత్నకుచకుంకుమకాంతయః ।
కృష్ణలీలా జగుః ప్రీతా నిష్కకంఠ్యస్సువాససః ॥ 33

రూఢరథాః - అధిరోహించబడిన రథములు గలవారు, నూత్నకుచ కుంకుమకాంతయః - స్తనములయందలి కొత్త కుంకుమయొక్క కాంతులు గలవారు, నిష్కకంఠ్యః - బంగరు పదకములు కంఠములయందు గల వారు, సువాససః - కొత్త చీరలు గలవారు అగు, గోప్యః - గోపికలు, ప్రీతాః - ఆనందించినవారై, కృష్ణలీలాః - బాలకృష్ణుని లీలలను, జగుః - పాడిరి.

వక్షఃస్థలముపై కొత్త కుంకుమ (సుగంధ ద్రవ్యము) ను దాల్చిన గోపికలు కొత్త కోకలను కట్టి మెడలయందు బంగరు పదకములను పెట్టు కొని రథములనెక్కి ఆనందముతో బాలకృష్ణుని లీలలను గానము చేసిరి.

తథా యశోదారోహిణ్యావేకం శకటమాస్థితే ।
రేజతుః కృష్ణరామాభ్యాం తత్కథాశ్రవణోత్సుకే ॥ 34

తథా - అదే విధముగా, యశోదారోహిణ్యౌ - యశోద రోహిణి, ఏకమ్ - ఒక, శకటమ్ - బండిని, ఆస్థితే - ఎక్కినవారు, కృష్ణరామాభ్యామ్ - శ్రీకృష్ణ బలరాములతో, తత్-కథాశ్రవణ-ఉత్సుకే - వారి గాథలను వినాలనే ఉత్కంఠ గలవారు, రేజతుః - ప్రకాశించిరి.

అదే విధముగా యశోద, రోహిణి బలరామ కృష్ణులతో కలిసి ఒకే బండి ఎక్కిరి. వారిద్దరి గాథలను వినాలనే ఉత్కంఠతో వారు ప్రకాశించిరి.

బృందావనం సంప్రవిశ్య సర్వకాలసుఖావహమ్ ।
తత్ర చక్రుర్వ్రజావాసం శకటైరర్ధచంద్రవత్ ।। 35

సర్వకాలసుఖ-ఆవహమ్ - అన్ని కాలములయందు సుఖమును కలిగించే, బృందావనమ్ - బృందావనమును, సంప్రవిశ్య - ప్రవేశించి, తత్ర - అచట, శకటైః - బళ్లతో, అర్ధచంద్రవత్ - సగము చంద్రునివంటి, వ్రజ-ఆవాసమ్ - గోకులనివాసమును, చక్రుః - చేసిరి.

కాలములన్నింటియందు వాతావరణము సుఖముగా ఉండే బృందావనమును ప్రవేశించి, వారు (ఆ నాటికి) గోకులనివాసమును బళ్లతో అర్ధచంద్రాకారముగా చేసిరి.

బృందావనం గోవర్ధనం యమునాపులినాని చ ।
వీక్ష్యాసీదుత్తమా ప్రీతీ రామమాధవయోర్నృప ।। 36

నృప - ఓ రాజా!, బృందావనమ్ - బృందావనమును, గోవర్ధనమ్ - గోవర్ధన పర్వతమును, యమునాపులినాని చ - యమునానదియొక్క ఇసుక తిన్నెలను కూడ, వీక్ష్య - చూచి, రామమాధవయోః - బలరామ శ్రీకృష్ణులకు, ఉత్తమా - గొప్ప, ప్రీతిః - ఆనందము, ఆసీత్ - కలిగెను.

ఓ పరీక్షిన్మహారాజా! బృందావనమును, గోవర్ధన పర్వతమును, యమునానదియొక్క ఇసుకతిన్నెలను చూచి బలరామకృష్ణులకు గొప్ప ఆనందము కలిగెను.

ఏవం వ్రజౌకసాం ప్రీతిం యచ్ఛంతౌ బాలచేష్టితైః ।
కలవాక్యైస్స్వకాలేన వత్సపాలౌ బభూవతుః ।। 37

ఏవమ్ - ఈ విధముగా, బాలచేష్టితైః - పిల్లల చేష్టలచే, కలవాక్యైః - మధురమైన పలుకులతో, వ్రజ-ఓకసామ్ - బృందావన వాసులకు, ప్రీతిమ్ - ఆనందమును, యచ్ఛంతౌ - కలిగించే రామకృష్ణులు, స్వకాలేన - తమ కాలముచే, వత్సపాలౌ - దూడలను కాపాడువారు, బభూవతుః - ఐరి.

ఈ విధముగా పిల్లల చేష్టలతో, తియ్యని మాటలతో బృందావన వాసులకు ఆనందమును కలిగించే బలరామ శ్రీకృష్ణులు తగిన వయస్సు రాగానే దూడలను కాపాడే (మేపే) పనిని చేపట్టిరి.

అవిదూరే వ్రజభువస్సహ గోపాలదారకైః ।
చారయామాసతుర్వత్సాన్ నానాక్రీడాపరిచ్ఛదౌ ॥ 38

నానాక్రీడాపరిచ్ఛదౌ - పలురకముల ఆట వస్తువులు గల రామకృష్ణులు, వ్రజభువః - బృందావన స్థానమునకు, అవిదూరే - చాల దూరము కాని చోట, గోపాలదారకైః సహ - గోపాలకుల పిల్లలతో బాటు, వత్సాన్ - దూడలను, చారయామాసతుః - గడ్డి మేపుచుండిరి.

రామకృష్ణులు పలురకముల ఆటవస్తువులను తీసుకువెళ్లి గోపాల బాలకులతో బాటుగా బృందావనమునకు దగ్గరలో దూడలను మేపెడివారు.

క్వచిద్వాదయతో వేణుం క్షేపణైః క్షిపతః క్వచిత్ ।
క్వచిత్పాదైః కింకిణీభిః క్వచిత్కృత్రిమగోవృషైః ॥ 39

వృషాయమాణౌ నర్దంతౌ యుయుధాతే పరస్పరమ్ ।
అనుకృత్య రుతైర్జంతూంశ్చేరతుః ప్రాకృతౌ యథా ॥ 40

క్వచిత్ - (ఒకప్పుడు) ఒకచోట, వేణుమ్ - పిల్లనగ్రోవిని, వాదయతః - మ్రోగించెదరు, క్వచిత్ - మరియొక(ప్పుడు)చోట, క్షేపణైః - ఉట్టిత్రాళ్ల (ఒడిసెలల) తో, క్షిపతః - (బెడ్డలను) విసిరెదరు, క్వచిత్ - ఒకప్పుడు, కింకిణీభిః - గజ్జెలు గల, పాదైః - పాదములతో (నాట్యమాడెదరు), క్వచిత్ - ఒకచోట, కృత్రిమగోవృషైః - కల్పితములైన ఆవులతో ఎద్దులతో, వృషాయమాణౌ - ఎద్దులవలె నటించువారై, నర్దంతౌ - నినదించెదరు, పరస్పరమ్ - ఒకరితోనొకరు, యుయుధాతే - కుస్తీ పట్టెదరు, రుతైః -

కూతలతో, జంతూన్ - పశువులను, అనుకృత్య - అనుకరించి, ప్రాకృతౌ యథా - మామూలు పిల్లలవలె, చేరతుః - సంచరించిరి.

ఒకప్పుడు (ఒకచోట) వారిద్దరు పిల్లనగ్రోవిని వాయించెదరు. మరియొకచోట ఉట్టిత్రాళ్లలో బెడ్డలను పెట్టి త్రిప్పి విసిరెదరు. ఇంకో సమయములో కాళ్లకు గజ్జెలు గట్టి నాట్యము చేసెదరు. మరియొకచోట గోపాలకులకు వస్త్రములను కప్పి వారిని ఆవులుగా ఎద్దులుగా కల్పించి, తామిద్దరు ఎద్దులుగా తయారై నినదిస్తూ ఒకరితో నొకరు పోటీ పడెదరు. పశువులననుకరించి కూస్తూ వారిద్దరు మామూలు పిల్లలవలె సంచరించిరి.

కదాచిద్యమునాతీరే వత్సాంశ్చారయతోస్స్వకైః ।
వయస్యైః కృష్ణబలయోర్జిఘాంసుర్దైత్య ఆగమత్ ॥ 41

కదాచిత్ - ఒకనాడు, యమునాతీరే - యమునానది ఒడ్డున, స్వకైః - తమ, వయస్యైః - మిత్రులతో, వత్సాన్ - దూడలను, చారయతోః - మేపుచున్న, కృష్ణబలయోః - శ్రీకృష్ణబలరాములకు, జిఘాంసుః - హింసను చేయగోరే, దైత్యః - రాక్షసుడు, ఆగమత్ - వచ్చెను.

ఒకనాడు శ్రీకృష్ణ బలరాములు యమునానది ఒడ్డున తమ మిత్రులతో బాటు దూడలను మేపుచుండగా, వారిని చంపగోరి రాక్షసుడు వచ్చెను.

తం వత్సరూపిణం వీక్ష్య వత్సయూథగతం హరిః ।
దర్శయన్ బలదేవాయ శనైర్ముగ్ధ ఇవాసదత్ ॥ 42

వత్సరూపిణమ్ - దూడ రూపములోనున్నట్టియు, వత్సయూథగతమ్ - దూడల గుంపును చేరిన, తమ్ - ఆ రాక్షసుని, హరిః - శ్రీకృష్ణుడు, బలదేవాయ - బలదేవుని కొరకు, దర్శయన్ - చూపువాడై, ముగ్ధః ఇవ - అమాయకుడు వలె, శనైః - మెల్లగా, ఆసదత్ - సమీపించెను.

దూడ రూపముతో దూడల గుంపులో చేరిన రాక్షసుని శ్రీకృష్ణుడు బలదేవుని కొరకు చూపుతూ అమాయకుని వలె మెల్లగా దగ్గరకు వెళ్లెను.

గృహీత్వాఽపరపాదాభ్యాం సహ లాంగూలమచ్యుతః ।
భ్రామయిత్వా కపిత్థాగ్రే ప్రాహిణోద్గతజీవితమ్ ।
స కపిత్థైర్మహాకాయః పాత్యమానైః పపాత హ ॥ 43

అచ్యుతః - శ్రీకృష్ణుడు, అపరపాదాభ్యాం సహ - రెండు వెనుక కాళ్లతో సహా, లాంగూలమ్ - తోకను, గృహీత్వా - పట్టుకొని, భ్రామయిత్వా - గిర గిర త్రిప్పి, గతజీవితమ్ - పోయిన ప్రాణములు గల రాక్షసుని, కపిత్థ-అగ్రే - వెలగచెట్టు పైన, ప్రాహిణోత్ - విసిరెను, మహాకాయః - పెద్ద దేహము గల, సః - ఆ రాక్షసుడు, పాత్యమానైః - దుళ్లగొట్టబడుచున్న, కపిత్థైః - వెలగకాయలతో బాటు, పపాత హ - క్రింద పడెను.

శ్రీకృష్ణుడు ఆ రాక్షసుని రెండు వెనుక కాళ్లతో సహా తోకను పట్టుకొని గిర గిర త్రిప్పి వెలగచెట్టుపైకి విసిరెను. వాని ప్రాణములు త్రిప్పుచుండగనే పోయెను. వాని పెద్ద దేహము వెలగకాయలను దుళ్లగొట్టుతూ క్రింద పడెను.

తం వీక్ష్య విస్మితా బాలాశ్శశంసుస్సాధు సాధ్వితి ।
దేవాశ్చ పరిసంతుష్టా బభూవుః పుష్పవర్షిణః ॥ 44

తమ్ - ఆ రాక్షసుని, వీక్ష్య - చూచి, విస్మితాః - ఆశ్చర్యపోయిన, బాలాః - గోపబాలకులు, సాధు సాధు - బాగు బాగు, ఇతి - అని, శశంసుః - కొనియాడిరి, పరిసంతుష్టాః - చాల సంతోషించిన, దేవాః చ - దేవతలు కూడ, పుష్పవర్షిణః - పుష్పములను వర్షించువారు, బభూవుః - అయిరి.

ఆ రాక్షసుని చూచి ఆశ్చర్యపడిన గోపబాలకులు శ్రీకృష్ణుని, బాగు బాగు అని, కొనియాడిరి. దేవతలు కూడ చాల సంతోషించి పూలవానను కురిపించిరి.

తౌ వత్సపాలకౌ భూత్వా సర్వలోకైకపాలకౌ ।
సప్రాతరాశౌ గోవత్సాంశ్చారయంతౌ విచేరతుః ॥ 45

సర్వలోక-ఏకపాలకౌ - అన్ని లోకములకు ఏకైకరక్షకులైన, తౌ - ఆ బలరామకృష్ణులిద్దరు, వత్సపాలకౌ - దూడలను కాయువారు, భూత్వా -

అయి, సప్రాతరాశౌ - చద్ది మూటతో కూడినవారై, గోవత్సాన్ - ఆవులను దూడలను, చారయంతౌ - మేపుచున్నవారై, విచేరతుః - విహరించిరి.

సకలలోకముల ముఖ్యరక్షకులగు ఆ రామకృష్ణులు పశువుల కాపరులై చద్ది మూటను గట్టుకొని ఆవులను, దూడలను మేపుతూ విహరించిరి.

స్వం స్వం వత్సకులం సర్వే పాయయిష్యంత ఏకదా ।
గత్వా జలాశయాభ్యాశం పాయయిత్వా పపుర్జలమ్ ॥ 46

ఏకదా - ఒకనాడు, స్వం స్వమ్ - తమ తమ, వత్సకులమ్ - దూడలను, పాయయిష్యంతః - నీటిని త్రాగించబోవువారై, సర్వే - అందరు, జల-ఆశయ-అభ్యాశమ్ - నీటి చెరువు సమీపమును, గత్వా - చేరి, జలమ్ - నీటిని, పాయయిత్వా - త్రాగించి, పపుః - త్రాగిరి.

ఒకనాడు గోపాలకులందరు తమ తమ పశువుల గుంపులకు నీటిని త్రాగించుటకై నీటి చెరువు వద్దకు వెళ్లిరి. అచట వారు దూడలకు నీటిని త్రాగించి తాము కూడ త్రాగిరి.

తే తత్ర దదృశుర్బాలా మహాసత్త్వమవస్థితమ్ ।
తత్రసుర్వజ్రనిర్భిన్నం గిరేశ్శృంగమివ స్థితమ్ ॥ 47

తే - ఆ, బాలాః - గోపబాలకులు, తత్ర - అచట, అవస్థితమ్ - కూర్చునియున్న, మహాసత్త్వమ్ - పెద్ద ప్రాణిని, దదృశుః - చూచిరి, వజ్రనిర్భిన్నమ్ - వజ్రముచే తెగగొట్టబడిన, గిరేః - పర్వతముయొక్క, శృంగం ఇవ - శిఖరము వలె, స్థితమ్ - ఉన్న ఆ ప్రాణిని గురించి, తత్రసుః - భయపడిరి.

ఆ గోపాలకులకు అచట పెద్ద ప్రాణి కూర్చుని కనబడెను. వజ్రముచే తెగగొట్టబడిన పర్వతమువలెనున్న దానిని చూచి వారు భయపడిరి.

స వై బకో నామ మహానసురో బకరూపధృక్ ।
ఆగత్య సహసా కృష్ణం తీక్ష్ణతుండోఽగ్రసద్బలీ ॥ 48

సః వై - అదియైతే, బకః నామ - బకుడని ప్రసిద్ధి గాంచిన, మహాన్ - పెద్ద, అసురః - రాక్షసుడు, బకరూపధృక్ - కొంగ రూపును దాల్చినవాడు,

తీక్ష్ణతుంగః - వాడి ముక్కు గలవాడు, బలీ - బలశాలి, సహసా వేగముగా, ఆగత్య - వచ్చి, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, అగ్రసత్ - మింగెను.

అది కొంగ రూపమును దాల్చిన పెద్ద బలశాలియగు రాక్షసుడు. బకుడని ప్రసిద్ధి గాంచిన ఆ రాక్షసుని ముక్కు చాల వాడి గలది. అది వేగముగా వచ్చి శ్రీకృష్ణుని ముక్కుతో మ్రింగబోయెను.

కృష్ణం మహాబకగ్రస్తం దృష్ట్వా రామాదయోఽర్భకాః ।
బభూవురింద్రియాణీవ వినా ప్రాణం విచేతసః ॥ 49

మహాబకగ్రస్తమ్ - పెద్ద కొంగచే మ్రింగబడిన, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, దృష్ట్వా - చూచి, రామ-ఆదయః - బలరాముడు మొదలుగా గల, అర్భకాః - గోపబాలకులు, ప్రాణం వినా - ప్రాణము లేకుండా, ఇంద్రియాణి ఇవ - ఇంద్రియములు వలె, విచేతసః - స్పృహ లేనివారు, బభూవుః - ఐరి.

పెద్ద కొంగ కృష్ణుని మ్రింగుచుండగా చూచిన బలరాముడు మొదలైన గోపబాలకులు, ప్రాణము పోయినప్పుడు ఇంద్రియములు వలె, స్పృహను కోల్పోయిరి.

తం తాలుమూలం ప్రదహంతమగ్నివద్గోపాలసూనుం పితరం జగద్గురోః
చచ్ఛర్ద సద్యోఽతిరుషాఽక్షతం బకస్తుండేన హంతుం పునరభ్యపద్యత।

తాలుమూలమ్ - దవడ మొదటిని, అగ్నివత్ - నిప్పు వలె, ప్రదహంతమ్ - కాల్చివేయుచున్నట్టియు, జగద్-గురోః - జగత్తునకు తండ్రియగు బ్రహ్మగారికి, పితరమ్ - తండ్రి ఐనట్టియు, గోపాలసూనుమ్ - గోపాలకుడగు నందుని పుత్రుడగు, తమ్ - ఆ శ్రీకృష్ణుని, బకః - బకుడు, సద్యః - వెంటనే, చచ్ఛర్ద - బయటకు గ్రక్కెను, అక్షతమ్ - గాయము కాని కృష్ణుని, అతిరుషా - అతిశయించిన కోపముతో, పునః - మరల, తుండేన - ముక్కుతో, హంతుమ్ - పొడుచుటకు, అభ్యపద్యత - మీదకు ఉరికెను. 50

జగత్తునకు తండ్రియగు బ్రహ్మదేవునకు కూడ తండ్రియైన శ్రీహరి గోపాలకుడగు నందుని కొడుకయ్యెను. ఆ బాలకృష్ణుడు దవడ మొదటికి చేరగానే నిప్పు వలె కాల్చివేయజొచ్చెను. అప్పుడా కొంగ ఆయనను బయటకు గ్రక్కివేసెను. ఆయనకు గాయమేమీ కాకపోవుటచే

అతిశయించిన కోపమును పొందిన ఆ బకాసురుడు మరల ముక్కుతో పొడుచుటకు ఆయన మీదకు వచ్చెను. 50

తమాపతంతం స నిగృహ్య తుండయోః
దోర్భ్యాం బకం కంససఖం సతాం పతిః ।
పశ్యత్సు బాలేషు దదార లీలయా
ముదావహో వీరణవద్దివౌకసామ్ ॥ 51

సతామ్ - సత్పురుషులకు, పతిః - పాలకుడైన, సః - ఆ శ్రీకృష్ణుడు, ఆపతంతమ్ - మీదకు వచ్చుచున్నట్టియు, కంససఖమ్ - కంసుని మిత్రుడగు, బకమ్ - బకాసురుని, దోర్భ్యామ్ - రెండు చేతులతో, తుండయోః - రెండు ముక్కులయందు, నిగృహ్య - పట్టుకుని నిలువరించి, బాలేషు - గోపబాలకులు, పశ్యత్సు - చూచుచుండగా, దివ-ఓకసామ్ - స్వర్గవాసులగు దేవతలకు, ముద-ఆవహః - ఆనందమును కలిగించువాడై, వీరణవత్ - తుంగగడ్డి పోచను వలె, దదార - చీల్చివేసెను.

సత్పురుషులకు రక్షకుడైన ఆ శ్రీకృష్ణుడు మీదకు వచ్చుచున్న బకాసురుని రెండు ముక్కులను రెండు చేతులతో పట్టుకుని నిలువరించెను. వాడు కంసుని మిత్రుడు. గోపబాలకులు చూచుచుండగా, ఆయన వాని నోటిని తుంగగడ్డి పోచను వలె చీల్చివేసి, దేవతలకు ఆనందమును కలిగించెను.

తదా బకారిం సురలోకవాసినస్సమాకిరన్నందనమల్లికాదిభిః ।
సమీడిరే చానకశంఖసంస్తవైస్తద్వీక్ష్య గోపాలసుతా విసిస్మిరే ॥ 52

తదా - అప్పుడు, సురలోకవాసినః - స్వర్గలోకవాసులగు దేవతలు, బక-అరిమ్ - బకాసురుని సంహరించిన శ్రీకృష్ణుని, నందనమల్లికా-ఆదిభిః - నందనవనమునందలి మల్లెలు మొదలగు పుష్పములతో, సమాకిరన్ - బాగుగా చల్లిరి, ఆనకశంఖసంస్తవైః - తప్పెట్లతో శంఖములతో మంచి స్తోత్రములతో, సమీడిరే - బాగా కొనియాడిరి, తత్ - దానిని, వీక్ష్య - చూచి, గోపాలసుతాః - గోపబాలకులు, విసిస్మిరే - విస్మయపడిరి.

అప్పుడు స్వర్గలోకవాసులగు దేవతలు బకాసురసంహారకుడగు శ్రీకృష్ణునిపై నందనవనములోని మల్లెలు మొదలైన పువ్వులను అధికముగా చల్లిరి. మరియు, తప్పెట్లను శంఖములను వాయిస్తూ చక్కటి స్తోత్రములతో బాగుగా స్తుతించిరి. ఇదంతా చూసి గోపాల బాలకులు విస్మయమును పొందిరి.

ముక్తం బకాస్యాదుపలభ్య బాలకా
రామాదయః ప్రాణమివైంద్రియో గణః ।
స్థానాగతం తం పరిరభ్య నిర్వృతాః
ప్రణీయ వత్సాన్ వ్రజమేత్య తజ్జగుః ॥ 53

బక-ఆస్యాత్ - బకాసురుని నోటినుండి, ముక్తమ్ - విముక్తుడైనట్టియు, స్థాన-ఆగతమ్ - తన చోటికి వచ్చిన, తమ్ - ఆ కృష్ణుని, రామ-ఆదయః - బలరాముడు మొదలుగా గల, బాలకాః - గోపబాలకులు, పరిరభ్య - కౌగిలించుకొని, ఐంద్రియః - ఇంద్రియములకు చెందిన, గణః - సమూహము, ప్రాణమ్ - ప్రాణశక్తిని, ఉపలభ్య ఇవ - పొంది వలె, నిర్వృతాః - స్వస్థులై, వత్సాన్ - దూడలను, ప్రణీయ - తోలుకొని, వ్రజమ్ - గోకులమును గురించి, ఏత్య - వచ్చి, తత్ - ఆ విషయమును, జగుః - కీర్తించిరి.

బకాసురుని నోటినుండి విముక్తుడై శ్రీకృష్ణుడు తన చోటికి వచ్చెను. పైకి పోయిన ప్రాణశక్తి తిరిగి రాగా ఇంద్రియముల సముదాయము స్వస్థమగునట్లుగా, ఆతడు క్షేమముగా రాగా బలరాముడు మొదలైన గోపబాలకులు స్వస్థతను పొందిరి. వారాతనిని కౌగిలించుకొని, దూడలను తోలుకుంటూ గోకులమునకు వచ్చి, ఆ వృత్తాంతమును కీర్తించిరి.

శ్రుత్వా తద్విస్మితా గోపా గోప్యశ్చాతిప్రియాదృతాః ।
ప్రేత్యాగతమివౌత్సుక్యాదైక్షంత తృషితేక్షణాః ॥ 54

తత్ - ఆ వృత్తాంతమును, శ్రుత్వా - విని, విస్మితాః - ఆశ్చర్యపోయిన, గోపాః - గోపాలకులు, గోప్యః చ - గోపికలు కూడ, అతిప్రియ-ఆదృతాః - అతిశయించిన ప్రేమతో ఆదరము గలవారై, తృషిత-ఈక్షణాః - తృప్తి

జెందని కన్నులు గలవారై, ప్రేత్య - మరణించి, ఆగతం ఇవ - వచ్చిన వానిని వలె, ఔత్సుక్యాత్ - ఉత్కంఠతో, ఐక్షంత - చూచిరి.

ఆ వృత్తాంతమును విని గోపాలకులు, గోపికలు కూడ ఆశ్చర్యపడి అతిశయించిన ప్రేమతో శ్రీకృష్ణునియందు ఆదరమును చూపిరి. మరణించి వచ్చినాడా యన్నట్లు వారు శ్రీకృష్ణుని ఆదుర్దాతో చూచిననూ, వారి కన్నులకు తనివి తీరలేదు.

అహో బతాస్య బాలస్య బహవో మృత్యవోఽభవన్ ।
అప్యాసీద్విప్రియం తేషాం కృతం పూర్వం యతో భయమ్ ।।55

అహో - ఆశ్చర్యము!, అస్య - ఈ, బాలస్య - బాలకృష్ణునకు, మృత్యవః - మరణహేతువులు, బహవః - అనేకులు, అభవన్ - ఐరి, బత - అయ్యో!, అపి - ఐననూ, తేషామ్ - వారికి, విప్రియమ్ - అనర్థము, ఆసీత్ - కలిగెను, యతః - ఏలయన, పూర్వమ్ - ఇదివరలో, భయమ్ - భయము, కృతమ్ - కలిగించబడినది.

ఆశ్చర్యము! చాలమంది ఈ బాలకృష్ణుని చంపవలెనని యత్నించిరి. అయ్యో! కాని, వారికే మృత్యువు కలిగెను. ఎందుకంటే, ఇదివరలో వారందరు ఇతరప్రాణులకు భయమును కలిగించిరి.

అథాప్యభిభవంత్యేనం నైవ తే ఘోరదర్శనాః ।
జిఘాంసయైనమాసాద్య నశ్యంత్యగ్నౌ పతంగవత్ ।। 56

ఘోరదర్శనాః - భయంకరమగు రూపము గలవారు, అథ అపి - ఐనప్పటికీ, తే - వారు, ఏనమ్ - ఈ బాలకృష్ణుని, న ఏవ అభిభవంతి - పరాభవమును చేయనే లేరు, ఏనమ్ - ఈతనిని, జిఘాంసయా - చంపాలనే కోరికతో, ఆసాద్య - దగ్గరకు వచ్చి, అగ్నౌ - అగ్నియందు, పతంగవత్ - మిడుతలు వలె, నశ్యంతి - నశించెదరు.

వారు భయమును గొల్పే రూపము గలవారే అయినా, ఈ బాలకృష్ణుని పరాభవించనే లేరు. ఈతనిని చంపాలనే కోరికతో దగ్గరకు వచ్చి, అగ్నియందు మిడుతలు వలె, వారు నశించెదరు.

అహో బ్రహ్మవిదాం వాచో నాసత్యాస్సంతి కర్హిచిత్ ।
గర్గో యదాహ భగవానన్వభావి తథైవ తత్ ॥ 57

అహో - ఆశ్చర్యము!, బ్రహ్మవిదామ్ - బ్రహ్మవేత్తల, వాచః - మాటలు, కర్హిచిత్ - ఏనాడైననూ, అసత్యాః - అసత్యములు, న సంతి - కావు, భగవాన్ - పూజనీయుడగు, గర్గః - గర్గాచార్యుడు, యత్ - దేనిని, ఆహ - చెప్పినాడో, తత్ - అది, తథా ఏవ - అదే విధముగా, అన్వభావి - అనుభవమునకు వచ్చెను.

ఆశ్చర్యము! బ్రహ్మవేత్తల మాటలు ఏనాడైననూ అసత్యము కావు. పూజనీయుడగు గర్గాచార్యుడు ఏ మాటను చెప్పెనో, అది అదే విధముగా అనుభవమునకు వచ్చినది.

ఇతి నందాదయో గోపాః కృష్ణరామకథాం ముదా ।
కుర్వంతో రమమాణాశ్చ నావిందన్ భవవేదనామ్ ॥ 58

ఇతి - ఈ విధముగా, నంద-ఆదయః - నందుడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు, ముదా - ఆనందముతో, కృష్ణరామకథామ్ - శ్రీకృష్ణ బలరాముల గాథను, కుర్వంతః - చేయుచున్నవారై, రమమాణాః చ - ఆనందమును కూడ పొందువారై, భవవేదనామ్ - సంసారదుఃఖమును, న అవిందన్ - తెలియకుండిరి.

ఈ విధముగా నందుడు మొదలుగా గల గోపాలకులు సరదాగా బలరామకృష్ణుల గాథలను చెప్పుకుంటూ ఆనందమును పొందిరి. వారికి సంసారదుఃఖము అనుభవమునకు రాలేదు.

ఏవం విహారైః కౌమారైః కౌమారం జహతుర్వ్రజే ।
నిలాయనైస్సేతుబంధైర్మర్కటోత్ప్లవనాదిభిః ॥ 59

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ఏకాదశోఽధ్యాయః ॥

ఏవమ్ - ఈ విధముగా, నిలాయనైః - దాగుడుమూతలతో, సేతుబంధైః - సేతువులను కట్టుటలతో, మర్కట-ఉత్-ప్లవన-ఆదిభిః - కోతివలె పైకి

ఎగురుటలు మొదలైన, కౌమారైః - బాల్యమునకు చెందిన, విహారైః - ఆటపాటలతో, వ్రజే - గోకులమునందు, కౌమారమ్ - బాల్యమును, జహతుః - విడిచిపెట్టిరి.

ఈ విధముగా బలరామకృష్ణులు గోకులములో గోపబాలకులతో పాటు దాగుడుమూతలాడెడివారు. యమునానది ఒడ్డున ఇసుకలో ఉత్తుత్తి సేతువులను కట్టెడివారు. వారిద్దరు కోతులవలె గెంతుట, బంతులాట మొదలగు ఇట్టి బాల్యమునకు చెందిన ఆటపాటలతో గోకులమునందు బాల్యావస్థను అధిగమించిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్ధములో శ్రీకృష్ణుడు వత్సాసుర బకాసురులను ఉద్ధరించుటను
వర్ణించే పదకొండవ అధ్యాయము ముగిసినది (11).



# అథ ద్వాదశోऽధ్యాయః

## శ్రీకృష్ణుడు అఘాసురుని ఉద్ధరించుట

శ్రీశుక ఉవాచ ।
క్వచిద్వనాశాయ మనో దధద్వ్రజాత్
ప్రాతస్సముత్థాయ వయస్యవత్సపాన్ ।
ప్రబోధయఞ్ఛృంగరవేణ చారుణా
వినిర్గతో వత్సపురస్సరో హరిః ॥ 1

క్వచిత్ - ఒకనాడు, హరిః - శ్రీకృష్ణ భగవానుడు, వన-అశాయ - అడవియందు భుజించుటకై, మనః దధత్ - గట్టి కోరిక గలవాడై, ప్రాతః - ఉదయమే, సముత్థాయ - నిద్ర లేచి, వయస్యవత్సపాన్ - మిత్రులైన గోపబాలకులను, చారుణా - మధురమైన, శృంగరవేణ - కొమ్ము బూరా ధ్వనితో, ప్రబోధయన్ - సూచన చేయువాడై, వత్సపురస్సరః - దూడలను ముందిడుకున్నవాడై, వ్రజాత్ - గోకులమునుండి, వినిర్గతః - బయటపడెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఒకనాడు శ్రీకృష్ణునకు అడవియందే భుజించవలెనని గట్టి ఇచ్ఛ కలిగెను. ఆయన ఉదయమే నిద్ర లేచి మిత్రులైన గోపబాలకులకు మనోహరమైన కొమ్ము బూరా ధ్వనితో సంకేతము చేసెను. దూడలు ముందు నడచుచుండగా ఆయన గోకులమునుండి బయలు దేరెను.

తేనైవ సాకం పృథుకాస్సహస్రశః
స్నిగ్ధాస్సుశిగ్వేత్రవిషాణవేణవః ।
స్వాన్ స్వాన్ సహస్రోపరిసంఖ్యయాన్వితాన్
వత్సాన్ పురస్కృత్య వినిర్యయుర్ముదా ॥ 2

తేన - ఆ శ్రీకృష్ణునితో, సాకం ఏవ - తోడుగానే, స్నిగ్ధాః - ప్రేమ గలవారు, సుశిగ్-వేత్రవిషాణవేణవః - మంచి ఉట్టి బెత్తము కొమ్ము బూరా పిల్లనగ్రోవులు గలవారు అగు, పృథుకాః - గోపబాలకులు, సహస్రశః - వేల సంఖ్యలో, సహస్రోపరిసంఖ్యయా - వేయి సంఖ్యకంటె అధికమైన సంఖ్యతో, అన్వితాన్ - కూడిన, స్వాన్ స్వాన్ - తమ తమ, వత్సాన్ - దూడలను, పురస్కృత్య - ముందిడుకొని, ముదా - ఆనందముతో, వినిర్యయుః - బయల్వెడలిరి.

ప్రేమతో నిండిన గోపబాలకులు వేలసంఖ్యలో ఆ శ్రీకృష్ణునితోడనే ఆనందముగా బయల్వెడలిరి. వారి ముందు నడచే దూడల సంఖ్య వేల కంటె అధికముగా నుండెను. వారు మంచి భోజనపు ఉట్టిలను, బెత్తములను, కొమ్ము బూరాలను, పిల్లన గ్రోవులను కలిగియుండిరి.

కృష్ణవత్సైరసంఖ్యాకైర్యూథీకృత్య స్వవత్సకాన్ ।
చారయంతోఽర్భలీలాభిర్విజహ్రుస్తత్ర తత్ర హ ॥ 3

అసంఖ్యాకైః - లెక్క లేని, కృష్ణవత్సైః - శ్రీకృష్ణుని లేగలతో, స్వవత్సకాన్ - తమ లేగలను, యూథీకృత్య - గుంపుగా చేసి, చారయంతః - మేపుచున్నవారై, అర్భలీలాభిః - పిల్లల ఆటలతో, తత్ర తత్ర - అక్కడక్కడ, విజహ్రుః హ - విహరించిరి.

వారు అసంఖ్యాకముగానున్న శ్రీకృష్ణుని దూడలతో తమ దూడలను కలిపి గుంపుగా చేసి, అక్కడక్కడ పిల్లల ఆటలతో విహరించిరి.

ఫలప్రవాలస్తబకసుమనఃపిచ్ఛధాతుభిః ।
కాచగుంజామణిస్వర్ణభూషితా అప్యభూషయన్ ॥ 4

కాచగుంజామణిస్వర్ణభూషితాః అపి - గాజు పూసలు గురివింద పూసలు మణులు బంగరు ఆభరణములతో అలంకరింపబడినవారే ఐననూ, ఫలప్రవాలస్తబకసుమనఃపిచ్ఛధాతుభిః - పళ్లు చిగుళ్లు పూల గుత్తులు పువ్వులు నెమలి యీకలు రాళ్ల రంగులతో, అభూషయన్ - అలంకరించుకొనిరి.

గాజు పూసలు, గురివింద పూసలు, మణులు, బంగారములతో చేసిన నగలను ఆ పిల్లలు కలిగియుండిరి. ఐనా వారు పళ్లు, చిగుళ్లు, పూల గుత్తులు, పూలు, నెమలి ఈకలు, రాళ్ల రంగులతో అలంకరించుకొనిరి.

ముష్ణంతోఽన్యోన్యశిక్యాదీన్ జ్ఞాతానారాచ్చ చిక్షిపుః ।
తత్రత్యాశ్చ పునర్దూరాద్ధసంతశ్చ పునర్దదుః ॥ 5

అన్యోన్యశిక్యాదీన్ - ఒకరి ఉట్టి మొదలగుదానిని మరియొకరు, ముష్ణంతః - అపహరించువారై, జ్ఞాతాన్ - తెలియబడినవాటిని, ఆరాత్ చ - దూరముగా, చిక్షిపుః - విసిరిరి, తత్రత్యాః చ - అక్కడ ఉన్న పిల్లలు కూడ, పునః - మరల, దూరాత్ - దూరముగా, హసంతః - నవ్వుచున్నవారై, పునః - మరల, దదుః చ - ఇచ్చిరి కూడా.

ఒకరి (అన్నపు గిన్నెను భద్రము చేసే) ఉట్టి, పిల్లన గ్రోవి మొదలగువాటిని మరియొకడు అపహరించును. ఫలానా వాడు అపహరించినాడని తెలుసుకోగానే, ఆ తెలియబడినవాటిని దూరముగా విసిరెదరు. దాని కొరకు ఈతడు పరుగెత్తగా, అక్కడున్న పిల్లలు దానిని మరింత దూరము విసిరెదరు. అంతిమముగా నవ్వుతూ దానిని వానికి తిరిగి యిచ్చెదరు.

యది దూరం గతో కృష్ణో వనశోభేక్షణాయ తమ్ ।
అహం పూర్వమహం పూర్వమితి సంస్పృశ్య రేమిరే ॥ 6

కృష్ణః - శ్రీకృష్ణుడు, వనశోభా-ఈక్షణాయ - అడవి అందమును చూచుటకై, దూరమ్ - దూరమును, గతః యది - వెళ్లినవాడైనచో, అహమ్ - నేను, పూర్వమ్ - ముందు, అహమ్ - నేను, పూర్వమ్ - ముందు, ఇతి - అని, తమ్ - ఆతనిని, సంస్పృశ్య - గట్టిగా ముట్టి, రేమిరే - ఆనందించిరి.

శ్రీకృష్ణుడు అడవి అందమును తిలకించుటకై దూరము వెళ్లగా, నేను ముందు నేను ముందు అంటూ పిల్లలు (పరుగెత్తి) ఆతనిని ముట్టి ఆనందించెడివారు.

కేచిద్వేణూన్ వాదయంతో ధ్మాంతశ్శృంగాణి కేచన ।
కేచిద్భృంగైః ప్రగాయంతః కూజంతః కోకిలైః పరే ॥ 7

కేచిత్ - కొందరు, వేణూన్ - పిల్లన గ్రోవులను, వాదయంతః - వాయించుచున్నవారు, కేచన - కొందరు, శృంగాణి - కొమ్ము బూరాలను, ధ్మాంతః - పూరించుచున్నవారు, కేచిత్ - కొందరు, భృంగైః - తుమ్మెదలతో, ప్రగాయంతః - పాడుచున్నవారు, పరే - మరికొందరు, కోకిలైః - కోకిలలతో, కూజంతః - కూయువారు.

కొందరు పిల్లన గ్రోవులను వాయిస్తూ ఉంటే, మరికొందరు కొమ్ము బూరాలను పూరించుచుండిరి. కొందరు తుమ్మెదలతో బాటు ఝుమ్ అని ధ్వనిస్తూ ఉంటే, మరికొందరు కోకిలల కూతలతో కంఠమును కలిపిరి.

విచ్ఛాయాభిః ప్రధావంతో గచ్ఛంతస్సాధు హంసకైః ।
బకైరుపవిశంతశ్చ నృత్యంతశ్చ కలాపిభిః ॥ 8

వి-ఛాయాభిః - పక్షుల నీడలతో, ప్రధావంతః - వేగముగా పరుగెత్తువారు, హంసకైః - హంసలతో, సాధు - బాగుగా, గచ్ఛంతః - వెళ్లువారు, బకైః చ - కొంగలతో కూడ, ఉపవిశంతః - కూర్చుండువారు, కలాపిభిః చ - నెమళ్లతో కూడ, నృత్యంతః - నాట్యమాడువారు.

కొందరు పక్షుల నీడలతో బాటుగా వేగముగా పరుగెత్తెదరు. కొందరు హంసలతో సరిదూగునట్లుగా నడచెదరు. కొందరు కొంగల ప్రక్కన జేరి కూర్చుందురు. కొందరు పురి విప్పిన నెమళ్లతో కూడి నాట్యమాడెదరు.

వికర్షంతః కీశబాలానారోహంతశ్చ తైర్ద్రుమాన్ ।
వికుర్వంతశ్చ తైస్సాకం ప్లవంతశ్చ పలాశిషు ॥ 9

కీశబాలాన్ - కోతి పిల్లలను, వికర్షంతః - లాగువారు, తైః - వాటితో, ద్రుమాన్ చ - చెట్లను కూడ, ఆరోహంతః - ఎక్కువారు, తైః సాకమ్ - వాటితో బాటు, వికుర్వంతః చ - ముఖకవళికలను చేయువారు, పలాశిషు - చెట్లపై, ప్లవంతః చ - గెంతులను కూడ వేయువారు.

వారు కోతి పిల్లలను లాగి, వాటితో చెట్లనెక్కెదరు. వాటితో బాటు పళ్లను ఇగిలించి వెక్కిరిస్తూ చెట్లపై దుముకుచుందురు.

సాకం భేకైర్విలంఘంతస్సరిత్ప్రస్రవసంప్లుతాః ।
విహసంతః ప్రతిచ్ఛాయాశ్శపంతశ్చ ప్రతిస్వనాన్ ॥ 10

సరిత్-ప్రస్రవసంప్లుతాః - నదిలో నీటి పాయలయందు తడిసి ముద్ద అగువారై, భేకైః సాకమ్ - కప్పలతో బాటుగా, విలంఘంతః - గెంతువారు, ప్రతిచ్ఛాయాః - ప్రతిబింబములను, విహసంతః - వెక్కిరిస్తూ నవ్వువారు, ప్రతిస్వనాన్ - ప్రతిధ్వనులను, శపంతః చ - తిట్టువారు కూడ.

కొందరు నదిలో కలిసే నీటి పాయలలో దిగి తడిసి ముద్దవుతూ వాటిలోని కప్పలతో బాటు గెంతెడివారు. నీటిలోని తమ ప్రతిబింబములను కొందరు వెక్కిరించెడివారు. కొందరు కేక వేసి ప్రతిధ్వనిని తిట్టెడివారు.

ఇత్థం సతాం బ్రహ్మసుఖానుభూత్యా దాస్యం గతానాం పరదైవతేన,
మాయాశ్రితానాం నరదారకేణ సాకం విజహ్రుః కృతపుణ్యపుంజాః॥ 11

సతామ్ - జ్ఞానులకు, బ్రహ్మసుఖ-అనుభూత్యా - బ్రహ్మానందము యొక్క అనుభవమైనట్టియు, దాస్యమ్ - శరణును, గతానామ్ - పొందిన వారలకు, పరదైవతేన - పరదైవమైనట్టియు, మాయాశ్రితానామ్ - అజ్ఞానమును పట్టుకున్నవారలకు, నరదారకేణ సాకమ్ - మానవబాలకుడైన శ్రీకృష్ణునితో గూడి, కృతపుణ్యపుంజాః - చేయబడిన పుణ్యముల గుట్టలు గల గోపబాలకులు, ఇత్థమ్ - ఈ తీరున, విజహ్రుః - విహరించిరి.

జ్ఞానులకు బ్రహ్మానందమై అనుభవమునకు వచ్చేది, శరణాగతులైన భక్తులకు పరదైవతముగా ఆరాధించబడేది, అజ్ఞానబంధములో ఉన్న వారలకు మానవబాలకుడుగా తెలియబడేది ఆ శ్రీకృష్ణుడే. గోపబాలకులు గుట్టలుగా పుణ్యమును చేయబట్టి ఆయనతో ఈ తీరున విహరించిరి.

యత్పాదపాంసుర్బహుజన్మకృచ్ఛ్రతో
  ధృతాత్మభిర్యోగిభిరప్యలభ్యః ।
స ఏవ యద్దృగ్విషయస్స్వయం స్థితః
  కిం వర్ణ్యతే దిష్టమతో వ్రజౌకసామ్ ॥ 12

యత్-పాదపాంసుః - ఎవని పాదముల ధూళి, బహుజన్మకృచ్ఛ్రతః - అనేకజన్మల తపస్సు వలన, ధృత-ఆత్మభిః - నిగ్రహించబడిన మనస్సు

గల, యోగిభిః అపి - యోగులచే కూడ, అలభ్యః - పొంద శక్యము కానిదో, సః ఏవ - ఆయనయే, స్వయమ్ - స్వయముగా, యద్-దృగ్-విషయః - ఎవరికైతే కళ్లకు కనబడువాడై, స్థితః - నిలిచినాడో, వ్రజ-ఓకసామ్ - గోకుల వాసులయొక్క, దిష్టమ్ - భాగ్యము, అతః - దీనికంటె, కిం వర్ణ్యతే - ఏమి వర్ణించబడును?

అనేకజన్మలలో తపస్సు చేసి మనస్సును నిగ్రహించిన యోగులకైననూ ఆ శ్రీహరియొక్క పాదముల ధూళి లభించదు. అట్టి శ్రీహరియే స్వయముగా గోకులవాసుల కళ్లకు కనబడుతూ నిలిచినాడు. వారి భాగ్యమును ఇంతకు మించి ఏమని వర్ణించదగును?

అథాఘనామాఽభ్యపతన్మహాసురస్తేషాం సుఖక్రీడనవీక్షణాక్షమః,
నిత్యం యదంతర్నిజజీవితేప్సుభిః పీతామృతైరప్యమరైః ప్రతీక్ష్యతే। 13

అథ - తరువాత, తేషామ్ - వారియొక్క, సుఖక్రీడనవీక్షణ-అక్షమః - సుఖముగా ఆడుకొనుటను చూచుటయందు సహనము లేని, అఘనామా - అఘుడని ప్రసిద్ధి గాంచిన, మహా-అసురః - పెద్ద రాక్షసుడు, అభ్యపతత్ - అకస్మాత్తుగా వచ్చెను, యత్ - ఏ ఆటనైయైతే, నిజజీవిత-ఈప్సుభిః - తమ జీవితమునకు సాఫల్యమును కోరునట్టియు, పీత-అమృతైః - త్రాగబడిన అమృతము గల, అమరైః అపి - దేవతలచే కూడ, నిత్యమ్ - ప్రతిదినము, అంతః - మనస్సు లోపల, ప్రతీక్ష్యతే - స్మరించబడునో, (నిజజీవిత-ఈప్సుభిః - తమ జీవితములను కోరే, యద్-అంతః - ఎవని ఛిద్రము, ప్రతీక్ష్యతే - ఎదురు చూడబడుచున్నదో).

తరువాత అఘుడని ప్రసిద్ధి గాంచిన పెద్ద రాక్షసుడు అకస్మాత్తుగా వచ్చెను. వారు సుఖముగా ఆడుకొనుటను చూచి వాడు ఓర్వలేకపోయెను. దేవతలు అమృతము త్రాగినా లభించని జీవితసాఫల్యమును కోరువారై ఆ శ్రీకృష్ణుని లీలను నిత్యము మనస్సులో స్మరించుచుందురు. (అమృతమును త్రాగినా తమ జీవితములకు అఘాసురుని వలన హాని కలుగుననే భయముతో దేవతలు వాని మృత్యువు కొరకు ఎదురు చూచుచుందురు).

దృష్ట్వాఽర్భకాన్కృష్ణముఖానఘాసురః కంసానుశిష్టస్స బకీబకానుజః ।
అయన్తు మే సోదరనాశకృత్తయోర్ద్వయోర్మమైనం సబలం హనిష్యే॥

కంస-అనుశిష్టః - కంసునిచే పంపబడినవాడు, బకీబక-అనుజః - పూతనకు బకాసురునకు సోదరుడు అగు, సః - ఆ, అఘ-అసురః - అఘాసురుడు, కృష్ణముఖాన్ - శ్రీకృష్ణుడు ప్రముఖుడుగా గల, అర్భకాన్ - గోపబాలకులను, దృష్ట్వా - చూచి, అయం తు - వీడైతే, మే - నా, సోదరనాశకృత్ - సోదరుడగు బకాసురుని సోదరియగు పూతనను చంపిన వాడు, మమ - నాకు చెందిన, తయోః - ఆ, ద్వయోః - ఇద్దరికి, సబలమ్ - గోపబాలకులతో కూడియున్న, ఏనమ్ - వీనిని, హనిష్యే - చంపెదను. 14

పూతనకు బకాసురునకు సోదరుడగు అఘాసురుని కంసుడు పంపెను. వాడు కృష్ణుడు ప్రముఖుడుగా గల గోపబాలకులను చూచి ఇట్లు తలపోసెను -- నా సోదరుడగు బకాసురుని, సోదరియగు పూతనను చంపినది వీడే. నాకు చెందిన వారిద్దరికి ప్రీతిని కలిగించుటకై నేను వీనిని గోపబాలకులతో సహా చంపెదను.

ఏతే యదా మత్సుహృదోస్తిలాపః కృతాస్తదా నష్టసమా వ్రజౌకసః,
ప్రాణే గతే వర్ష్మసు కా ను చింతా ప్రజాఽసవః ప్రాణభృతో హి యే తే.

మత్-సుహృదోః - నా ప్రియబంధువులకు, ఏతే - వీరు, యదా - ఎప్పుడైతే, తిల-ఆపః - తిలోదకములుగా, కృతాః - చేయబడినారో, తదా - అప్పుడు, వ్రజ-ఓకసః - గోకులవాసులు, నష్టసమాః - చచ్చినవారితో సమానము, ప్రాణే - ప్రాణము, గతే - పోగా, వర్ష్మసు - దేహముల విషయమై, చింతా - చింత, కా ను - ఎట్టిది?, హి - ఏలయన, యే - ఏ, ప్రాణభృతః - ప్రాణులు గలరో, తే - వారు, ప్రజా-అసవః - సంతానమే ప్రాణములుగా గలవారు. 15

నా సోదరీసోదరులకు వీరిని తిలోదకములుగా చేసెదను. అప్పుడు గోకులములోని జనులు చచ్చినవారితో సమానము. ప్రాణమే పోతే దేహముల గురించి చింత యేముండును? ఎందుకంటే, ప్రాణులకు వారి సంతానమే ప్రాణము.

ఇతి వ్యవస్యాజగరం బృహద్వపుః
స యోజనాయామమహాద్రిపీవరమ్ ।
ధృత్వాఽద్భుతం వ్యాత్తగుహాఽఽననం తదా
పథి వ్యశేత గ్రసనాశయా ఖలః ।। 16

తదా - అప్పుడు, సః - ఆ, ఖలః - దుష్టుడు, ఇతి - ఈ విధముగా, వ్యవస్య - నిశ్చయించుకొని, యోజన-ఆయామమహా-అద్రిపీవరమ్ - రెండు క్రోసుల పొడవు గల పెద్ద పర్వతము వలె బలిసినట్టియు, అద్భుతమ్ - ఆశ్చర్యకరమైనట్టియు, వ్యాత్తగుహా-ఆననమ్ - తెరుచుకున్న గుహవంటి నోరు కలిగినట్టియు, ఆజగరమ్ - కొండచిలువకు చెందిన, బృహత్ - పెద్ద, వపుః - దేహమును, ధృత్వా - ధరించి, గ్రసన-ఆశయా - మ్రింగివేయవలెననే కోరికతో, పథి - దారియందు, వ్యశేత - పరుండెను.

అప్పుడా దుష్టుడు ఈ విధముగా నిశ్చయించుకొని పెద్ద కొండచిలువ దేహమును దాల్చెను. అది రెండు క్రోసుల పొడవు కలిగి పెద్ద పర్వతము వలె బలిసి ఉండెను. ఆశ్చర్యకరమగు దాని నోరు తెరుచుకుని గుహవలె నుండెను. అది గోపబాలకులను మ్రింగాలనే కోరికతో దారిలో పరుండెను.

ధరాఽధరోష్ఠో జలదోత్తరోష్ఠో దర్యాననాంతో గిరిశృంగదంష్ట్రః ।
ధ్వాంతాంతరాస్యో వితతాధ్వజిహ్వః పరుషానిలశ్వాసదవేక్షణోష్ణః ।।17

ధరా-అధర-ఓష్ఠః - నేలపై క్రింది పెదవి గలవాడు, జలద-ఉత్తర-ఓష్ఠః - మేఘములయందు పై పెదవి గలవాడు, దరీ-ఆనన-అంతః - గుహలవంటి నోటి కొనలు గలవాడు, గిరిశృంగదంష్ట్రః - కొండ కొమ్ములవంటి కోరలు గలవాడు, ధ్వాంత-అంతర-ఆస్యః - చీకటితో నిండిన నోటి లోపలి భాగము గలవాడు, వితత-అధ్వజిహ్వః - పరుచుకున్న మార్గమువంటి నాలుక గలవాడు, పరుష-అనిలశ్వాసదవ-ఈక్షణ-ఉష్ణః - వేడిగాలివంటి శ్వాస గలవాడు దావాగ్నివంటి కన్నుల వేడి గలవాడు.

ఆ అఘాసురుని క్రింది పెదవి నేలను, పై పెదవి మేఘములను తాకుచుండెను. వాని నోటి కొనలు గుహలను, కోరలు పర్వతశిఖరములను పోలియుండెను. నోటి లోపలి భాగము చీకటి. నాలుక పరుచుకున్న

మార్గమువలె నుండెను. వాని నిట్టూర్పులు వేడి గాడ్పు వలె నుండెను. వాని కన్నులు కార్చిచ్చును పోలియుండెను.

దృష్ట్వా తం తాదృశం సర్వే మత్వా వృందావనశ్రియమ్ ।
వ్యాత్తాజగరతుండేన హ్యుత్ప్రేక్షంతే స్మ లీలయా ॥ 18

తాదృశమ్ - అట్టి, తమ్ - వానిని, దృష్ట్వా - చూచి, సర్వే - అందరు, వృందావనశ్రియమ్ - బృందావనముయొక్క శోభనుగా, మత్వా - తలపోసి, లీలయా - విలాసగా, వ్యాత్త-అజగరతుండేన హి - తెరుచుకున్న కొండచిలువ నోటితోనే, ఉత్ప్రేక్షంతే స్మ - పోల్చి చెప్పుచుండిరి.

అట్టి అఘాసురుని ఆ గోపబాలకులందరు చూచి, అది బృందావనములోని సుందరదృశ్యమనియే తలపోసిరి. పైగా, ఆ దృశ్యము నోరు తెరిచిన కొండచిలువను పోలి యున్నదని విలాసగా వర్ణించిరి.

అహో మిత్రాణి గదత సత్త్వకూటం పురః స్థితమ్ ।
అస్మత్సంగ్రసనవ్యాత్తవ్యాలతుండాయతే న వా ॥ 19

అహో - ఆశ్చర్యము!, మిత్రాణి - మిత్రులారా!, గదత - చెప్పుడు, పురః - ఎదుట, స్థితమ్ - ఉన్నది, సత్త్వకూటమ్ - కదలని బండరాయివంటి ప్రాణియా?, అస్మత్-సంగ్రసనవ్యాత్తవ్యాలతుండాయతే - మనలను మ్రింగుటకొరకై బాగా తెరువబడిన కొండ చిలువ నోరు వలె ఉన్నదా?, న వా - లేదా?

ఆశ్చర్యము! మిత్రులారా! చెప్పుడు. మనముందున్న ఈ బండరాయి పెద్ద ప్రాణివలె ఉన్నది గదా? ఇది మనలను మ్రింగుటకై నోరు తెరిచిన కొండ చిలువను పోలియున్నదా? లేదా?

సత్యమర్కకరారక్తముత్తరాహనువద్ఘనమ్ ।
అధరాహనువద్రోధస్తత్ప్రతిచ్ఛాయయారుణమ్ ॥ 20

సత్యమ్ - యథార్థము, అర్కకర-ఆరక్తమ్ - సూర్యుని కిరణములచే అంతటా ఎర్రనైన, ఘనమ్ - మేఘము, ఉత్తరాహనువత్ - పై పెదవి వలె,

తత్-ప్రతిచ్ఛాయయా - ఆ మేఘముయొక్క ప్రతిఫలించుటచే, అరుణమ్ - ఎఱ్రనైన, రోధః - నది ఒడ్డు, అధరాహనువత్ - క్రింది పెదవి వలె.

నిజమే. సూర్యకిరణములచే అంతటా ఎఱ్రనైన మేఘము పై పెదవిని, ఆ మేఘమే నదియందు ప్రతిఫలించి ఎఱ్రగా కనబడే నది ఒడ్డు క్రింది పెదవిని పోలియున్నవి.

ప్రతిస్పర్ధేతే సృక్కిభ్యాం సవ్యాసవ్యే నగోదరే ।
తుంగశృంగాలయోఽప్యేతాస్తద్దంష్ట్రాభిశ్చ పశ్యత ॥ 21

సవ్య-అసవ్యే - ఎడమ కుడి అగు, నగ-ఉదరే - పర్వతగుహలు, సృక్కిభ్యామ్ - పెదవుల కొనలతో, చ - మరియు, ఏతాః - ఈ, తుంగశృంగ-ఆలయః అపి - ఎత్తైన శిఖరముల వరుసలు కూడ, తద్-దంష్ట్రాభిః చ - ఆ కొండ చిలువ కోరలతో కూడ, ప్రతిస్పర్ధేతే - పోటీ పడుచున్నవి, పశ్యత - చూడుడు.

చూడండి. ఎడమ-కుడివైపులనున్న ఈ రెండు పర్వతగుహలు కొండ చిలువ పెదవి కొనలతో, ఈ ఎత్తైన శిఖరముల వరుసలు దాని కోరలతో పోటీ పడుచున్నవి.

ఆస్తృతాయామమార్గోఽయం రసనాం ప్రతిగర్జతి ।
ఏషామంతర్గతం ధ్వాంతమేతదప్యంతరాననమ్ ॥ 22

అయమ్ - ఈ, ఆస్తృత-ఆయామమార్గః - విస్తరించిన పొడవైన దారి, రసనామ్ - నాలుకను, ఏషామ్ - ఈ పర్వతశిఖరముల, అంతః-గతమ్ - లోపలనున్న, ఏతత్ - ఈ, ధ్వాంతం అపి - చీకటి కూడ, అంతః-ఆననమ్ - నోటి మధ్యభాగమును, ప్రతిగర్జతి - గట్టిగా పోలియున్నది.

ఈ విస్తరించిన పొడవైన దారి కొండచిలువ నాలుకను, ఈ పర్వతశిఖరముల లోపలి చీకటి కూడ కొండ చిలువ నోటి మధ్యభాగమును గట్టిగా పోలియున్నవి.

దావోష్ణఖరవాతోఽయం శ్వాసవద్భాతి పశ్యత ।
తద్దగ్ధసత్త్వదుర్గంధోఽప్యంతరామిషగంధవత్ ॥ 23

అయమ్ - ఈ, దావ-ఉష్ణఖరవాతః - దావాగ్నిచే వేడెక్కిన పరుషమైన గాలి, శ్వాసవత్ - శ్వాసవలె, భాతి - ప్రకాశించుచున్నది, పశ్యత - చూడుడు, తద్-దగ్ధసత్త్వదుర్గంధః అపి - ఆ దావాగ్నిచే కాల్చివేయబడిన ప్రాణుల దుర్గంధము కూడ, అంతః-ఆమిషగంధవత్ - లోపలి మాంసపు వాసన వలె.

చూడండి. దావాగ్నిచే వేడెక్కిన పరుషమైన గాలి కొండ చిలువ శ్వాసను పోలినది. ఇంతేగాక, ఆ దావాగ్నిలో పడి కాలిపోయిన ప్రాణుల దుర్గంధము దాని కడుపు లోపలి మాంసపు వాసనను పోలియున్నది.

అస్మాన్ కిమత్ర గ్రసితా నివిష్టానయం తథా చేద్బకవద్వినంక్ష్యతి ।
క్షణాదనేనేతి బకార్యుశన్ముఖం వీక్ష్యోద్ధసంతః కరతాడనైర్యయుః ।।24

అత్ర - ఇక్కడ, నివిష్టాన్ - కూర్చున్న, అస్మాన్ - మనలను, అయమ్ - ఇది, కిం గ్రసితా - మ్రింగివేయునా యేమి?, తథా చేత్ - అట్లైనచో, బకవత్ - బకాసురుడు వలె, క్షణాత్ - క్షణములో, అనేన - ఈ శ్రీకృష్ణునిచే, వినంక్ష్యతి - వినాశమును పొందగలదు, ఇతి - అని, బక-అరి-ఉశత్-ముఖమ్ - బకాసురుని సంహరించిన శ్రీకృష్ణుని అందమగు ముఖమును, వీక్ష్య - చూచి, కరతాడనైః - చప్పట్లతో, ఉద్-హసంతః - బిగ్గరగా నవ్వుచున్నవారై, యయుః - వెళ్లిరి.

ఇది నిజముగా కొండ చిలువయే అయి, ఇక్కడ కూర్చున్న మనలను మ్రింగి వేయునా యేమి? నిజముగా కొండ చిలువయే ఐనచో, బకాసురుని సంహరించిన శ్రీకృష్ణుడు దీనిని క్షణములో నశింప జేయగలడు, అని ఆ గోపబాలకులు మాట్లాడుకొనుచుండిరి. వారు బకాసురుని సంహరించిన శ్రీకృష్ణుని అందమగు ముఖమును చూస్తూ, బిగ్గరగా నవ్వుతూ చప్పట్లతో ముందుకు సాగిరి.

ఇత్థం మిథోఽతథ్యమతజ్జ్ఞభాషితం
శ్రుత్వా విచింత్యేత్యమృషా మృషాయతే ।
రక్షో విదిత్వాఽఖిలభూతహృత్స్థితః
స్వానాం నిరోద్ధుం భగవాన్మనో దధే ।। 25

అఖిలభూతహృత్-స్థితః - సకలప్రాణుల హృదయమునందుండే, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఇత్థమ్ - ఈ విధముగా, మిథః - ఒకరితోనొకరు, అతద్-జ్ఞభాషితమ్ - ఆ రాక్షసుని గురించి తెలియని బాలకుల సంభాషణను, అతథ్యమ్ - అసత్యమును, శ్రుత్వా - విని, అమృషా - సత్యము, మృషాయతే - మిథ్యగా కనబడుచున్నది, ఇతి - అని, విచింత్య - తలపోసి, రక్షః - రాక్షసుని, విదిత్వా - గుర్తించి, స్వానామ్ - తన వారలను, నిరోద్ధుమ్ - ఆపుటకు, మనః దధే - నిశ్చయించెను.

శ్రీకృష్ణ భగవానుడు సకలప్రాణుల హృదయమునందు (ఆత్మ రూపముగా) ఉన్నాడు. ఆ రాక్షసుని గురించి తెలియని గోపబాలకులు భ్రమతో ఈ తీరున ఒకరితోనొకరు పలికిరి. ఆ మాటలను విని ఆయన, వీరికి సత్యము మిథ్యగా తోచుచున్నది, అని తలచెను. వాడు రాక్షసుడని తెలిసి, ఆయన వారిని (ముందుకు వెళ్లకుండా) ఆపుటకు నిశ్చయించెను.

తావత్ప్రవిష్టాస్త్వసురోదరాంతరం పరం న గీర్ణాశ్శిశవస్సవత్సాః।
ప్రతీక్షమాణేన బకారివేశనం హతస్వకాంతస్మరణేన రక్షసా ।।26

తావత్ - అంతలో, సవత్సాః - దూడలతో కూడియున్న, శిశవః తు - గోపబాలకులైతే, అసుర-ఉదర-అంతరమ్ - రాక్షసుని ఉదరము మధ్యభాగమును, పరమ్ - కేవలము, ప్రవిష్టాః - ప్రవేశించినవారు, బక-అరివేశనమ్ - బకాసురుని సంహరించిన శ్రీకృష్ణుని ప్రవేశమును, ప్రతీక్షమాణేన - ఎదురు చూచుచున్నట్టియు, హతస్వకాంతస్మరణేన - సంహరించబడిన తన ప్రియబంధువులను గుర్తు చేసుకున్న, రక్షసా - రాక్షసునిచే, గీర్ణాః - మ్రింగబడినవారు, న - కాదు,

అంతలోనే గోపబాలకులు దూడలతో సహా రాక్షసుని ఉదరము మధ్య లోనికి ప్రవేశించినారు. కానైతే, తన ప్రియబంధువులగు పూతనను బకాసురుని గుర్తు చేసుకున్న రాక్షసునిచే వారు మ్రింగబడలేదు. ఎందుకంటే, వాడు బకాసురుని చంపిన శ్రీకృష్ణుడు ప్రవేశించుటకై ఎదురు చూచుచుండెను.

తాన్వీక్ష్య కృష్ణస్సకలాభయప్రదో హ్యనన్యనాథాన్స్వకరాదవచ్యుతాన్।
దీనాంశ్చ మృత్యోర్జఠరాగ్నిఘాసాన్ఘృణార్దితో దిష్టకృతేన విస్మితః ॥27

సకల-అభయప్రదః - అందరికీ అభయమునిచ్చే, కృష్ణః - శ్రీకృష్ణుడు, అనన్యనాథాన్ - మరియొక రక్షకుడు లేనట్టియు, స్వకరాత్ - తన చేతినుండి, అవచ్యుతాన్ - జారిపోయినట్టియు, దీనాన్ - దీనులైనట్టియు, మృత్యోః - మృత్యువైన అఘాసురుని, జఠర-అగ్నిఘాసాన్ - జఠరాగ్నికి గడ్డియైన, తాన్ - వారిని, వీక్ష్య - చూచి, ఘృణా-అర్దితః - దయచే పీడను పొందినవాడు, దిష్టకృతేన - దైవముచే చేయబడినదానిచే, విస్మితః - ఆశ్చర్యపడినవాడు.

శ్రీకృష్ణుడు సకలప్రాణులకు అభయమునిచ్చువాడు. మరియొక రక్షకుడు లేని దీనులైన ఆ పిల్లలు ఆయన చేతినుండి జారిపోయి మృత్యురూపుడగు అఘాసురుని జఠరాగ్నికి గడ్డిపోచలవంటివారు కాబోతున్నారు. ప్రారబ్ధముచే కల్పించబడిన ఆ పరిస్థితిని చూచి ఆయన మనస్సు దయచే పీడను పొందెను. ఆయన ఆశ్చర్యచకితుడయ్యెను.

కృత్యం కిమత్రాస్య ఖలస్య జీవనం
న వా అమీషాం చ సతాం విహింసనమ్ ।
ద్వయం కథం స్యాదితి సంవిచింత్య తత్
జ్ఞాత్వాఽవిశత్తుండమశేషదృగ్ఘరిః ॥ 28

అత్ర - ఈ విషయమునందు, కృత్యమ్ - కర్తవ్యము, కిమ్ - ఏమి?, అస్య - ఈ, ఖలస్య - దుష్టుని, జీవనమ్ - జీవితము, న - ఉండరాదు, అమీషామ్ - ఈ, సతామ్ - అమాయకుల, విహింసనం వా - హింస గాని, న చ - కానే రాదు, ద్వయమ్ - రెండు, కథమ్ - ఎట్లు, స్యాత్ - కలుగును?, ఇతి - అని, సంవిచింత్య - జాగ్రత్తగా ఆలోచించి, తత్ - ఆ ఉపాయమును, జ్ఞాత్వా - తెలుసుకొని, అశేషదృక్ - సర్వసాక్షియగు, హరిః - శ్రీహరి, తుండమ్ - నోటిని, అవిశత్ - ప్రవేశించెను.

ఈ విషయములో కర్తవ్యమేమి? ఈ దుష్టుడు బ్రదికి యుండరాదు. అమాయకులైన ఈ పిల్లలకు హాని కలుగరాదు. ఈ రెండు లక్ష్యములు

నెరవేరే ఉపాయమేది? అని సర్వసాక్షియగు శ్రీకృష్ణ భగవానుడు లోతుగా ఆలోచించెను. ఆ ఉపాయము తట్టి, ఆయన వాని నోటిలో ప్రవేశించెను.

తదా ఘనచ్ఛదా దేవా భయాద్ధా హేతి చుక్రుశుః ।
జహృషుర్యే చ కంసాద్యాః కౌణపాస్త్వఘబాంధవాః ।। 29

తదా - అప్పుడు, భయాత్ - భయము వలన, ఘనచ్ఛదాః - మేఘముల మాటున నక్కిన, దేవాః - దేవతలు, హా హా - అయ్యో! అయ్యో!, ఇతి - అని, చుక్రుశుః - ఆక్రోశించిరి, కంస-ఆద్యాః - కంసుడు మొదలుగా గల, అఘబాంధవాః - అఘాసురుని బంధువులైన, కౌణపాః తు - రాక్షసులైతే, యే చ - ఎవరు గలరో వారు, జహృషుః - హర్షించిరి.

అప్పుడు కంసుని భయము వలన మేఘముల మాటున నక్కి చూస్తున్న దేవతలు అయ్యో! అయ్యో! అంటూ ఆక్రోశించిరి. అఘాసురుని బంధువులు కంసుడు మొదలైనవారెవరు గలరో, వారైతే హర్షించిరి.

తచ్ఛ్రుత్వా భగవాన్ కృష్ణస్త్వవ్యయస్సార్భవత్సకమ్ ।
చూర్ణీచికీర్షోరాత్మానం తరసా వవృధే గలే ।। 30

తత్ - ఆ ఆక్రోశమును, శ్రుత్వా - విని, అవ్యయః - వినాశము లేని, భగవాన్ కృష్ణః తు - శ్రీకృష్ణ భగవానుడైతే, స-అర్భకవత్సకమ్ - పిల్లలతో దూడలతో కూడియున్న, ఆత్మానమ్ - తనను, చూర్ణీచికీర్షోః - చూర్ణముగా చేయగోరే రాక్షసుని, గలే - కంఠమునందు, తరసా - వేగముగా, వవృధే - పెరిగెను.

వినాశము లేని శ్రీకృష్ణ భగవానుడు ఆ ఆక్రోశమును వినెను. అఘాసురుడు పిల్లలను, దూడలను, శ్రీకృష్ణుని కూడ చూర్ణము చేయ గోరెను. కాని, ఆయన మాత్రము వాని కంఠములో వేగముగా పెరిగెను.

తతోఽతికాయస్య నిరుద్ధమార్గిణో హ్యుద్గీర్ణదృష్టేర్భ్రమతస్త్వితస్తతః,
పూర్ణోఽంతరంగే పవనో నిరుద్ధో మూర్ధన్వినిష్పాట్య వినిర్గతో బహిః।31

తతః - అందువలన, నిరుద్ధమార్గిణః - అడ్డుకొనబడిన దారి కలిగినట్టియు, అతికాయస్య - పెద్ద దేహము కలిగినట్టియు, ఉద్గీర్ణదృష్టేః -

బయటకు పొడుచుకువచ్చిన కన్నులు కలిగినట్టియు, ఇతః తతః - ఇటునటు, భ్రమతః - పొర్లాడుచున్న అఘుని, అంతః-అంగే - దేహమధ్యభాగమునందు, పూర్ణః - నిండినది, నిరుద్ధః - అడ్డుకొనబడినది అగు, పవనః - ప్రాణవాయువు, మూర్ధన్ - తలయందు, వినిష్పాట్య - పగులగొట్టుకొని, బహిః - బయటకు, వినిర్గతః - వచ్చెను.

ఆయన అట్లు పెరుగుట వలన పెద్ద దేహము గల అఘాసురుని ప్రాణవాయుమార్గము మూసుకుపోయెను. కళ్లు బయటకు పొడుచుకు రాగా, వాడు ఇటునటు పొర్లాడుచుండెను. దేహమధ్యభాగమునందు అడ్డు కొనబడి నిండిపోయిన వాయువు తలపై పగులగొట్టుకొని బయల్వెడలెను.

తేనైవ సర్వేషు బహిర్గతేషు
ప్రాణేషు వత్సాన్ సుహృదః పరేతాన్ ।
దృష్ట్వా స్వయోత్థాప్య తదన్వితః పునః
వక్త్రాన్ముకుందో భగవాన్ వినిర్యయౌ ॥ 32

తేన ఏవ - అదే దారిగుండా, సర్వేషు - అన్ని, ప్రాణేషు - ప్రాణములు, బహిః - బయటకు, గతేషు - పోగా, పరేతాన్ - మరణించిన, వత్సాన్ - దూడలను, సుహృదః - మిత్రులను, స్వయా - తన, దృష్ట్వా - చూపుతో, ఉత్థాప్య - లేచునట్లు చేసి, తద్-అన్వితః - వారితో కూడినవాడై, ముకుందః - మోక్షప్రదాతయగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, పునః - మరల, వక్త్రాత్ - నోటినుండి, వినిర్యయౌ - బయటకు వచ్చెను.

ఆ దారిగుండా వాని ప్రాణములన్నీ పైకి పోయెను. దూడలు, గోపబాలకులు మరణించి పడి యుండిరి. మోక్షప్రదాతయగు శ్రీకృష్ణ భగవానుడు వారిని తన చూపుతో పైకి లేచునట్లు చేసెను. ఆయన వారితో గూడి మరల నోటినుండి బయటకు వచ్చెను.

పీనాహిభోగోత్థితమద్భుతం మహజ్జ్యోతిస్స్వధామ్నా జ్వలయద్దిశో దశ
ప్రతీక్ష్య ఖేఽవస్థితమీశనిర్గమం వివేశ తస్మిన్మిషతాం దివౌకసామ్ ॥33

పీన-అహిభోగ-ఉత్థితమ్ - బలిసిన పాముయొక్క పడగలనుండి పైకి లేచిన, అద్భుతమ్ - అద్భుతమైన, మహత్ - పెద్ద, జ్యోతిః - జ్యోతి,

స్వధామ్నా - తన కాంతితో, దశ - పది, దిశః - దిక్కులను, జ్వలయత్ - ప్రజ్వరిల్ల జేయుచున్నదై, ఖే - ఆకాశమునందు, అవస్థితమ్ - ఉన్నదై, ఈశనిర్గమమ్ - భగవానుడు బయటకు వచ్చుటను, ప్రతీక్ష్య - ఎదురు చూచి, దివ-ఓకసామ్ - స్వర్గవాసులగు దేవతలు, మిషతామ్ - చూచుచుండగనే, తస్మిన్ - ఆయనయందు, వివేశ - ప్రవేశించెను.

బలిసిన ఆ పాము పడగలనుండి అద్భుతమైన పెద్ద జ్యోతి బయటకు వచ్చెను. పది దిక్కులను తన కాంతితో ప్రజ్వరిల్ల జేయుచున్న ఆ జ్యోతి ఆకాశమునందు నిలిచి భగవానుడు బయటకు వచ్చువరకు ప్రతీక్షించెను. దేవతలు విస్తుబోయి చూచుచుండగా, అది ఆయనలో ప్రవేశించెను.

తతోఽతిహృష్టాస్స్వకృతోఽకృతార్హణం
  పుష్పైస్సురా అప్సరసశ్చ నర్తనైః ।
గీతైస్సుగా వాద్యధరాశ్చ వాద్యకైః
  స్తవైశ్చ విప్రా జయనిస్స్వనైర్గణాః ॥ 34

తతః - ఆ అఘాసురసంహారము వలన, అతిహృష్టాః - మిక్కిలి హర్షమును పొందిన, సురాః - దేవతలు, పుష్పైః - పుష్పములతో, అప్సరసః చ - అప్సరసలు కూడ, నర్తనైః - నాట్యములతో, సుగాః - బాగా పాడే గంధర్వులు, గీతైః - పాటలతో, వాద్యధరాః చ - వాద్యములను కలిగియుండే విద్యాధరులు, వాద్యకైః - వాద్యములతో, విప్రాః చ - మహర్షులు కూడ, స్తవైః - స్తోత్రములతో, గణాః - పార్షదగణములు, జయనిస్స్వనైః - జయజయధ్వానములతో, స్వకృతః - తమ పనిని చేసిన శ్రీకృష్ణునకు, అర్హణమ్ - సత్కారమును, అకృత - చేసెను.

ఆ అఘాసురవధవలన మిక్కిలి హర్షమును పొందిన దేవతలు పూలతో తమ కార్యము (రాక్షససంహారము) ను చేసిన శ్రీకృష్ణుని సత్కరించిరి, అప్సరసలు నాట్యములతో, బాగా పాడే గంధర్వులు పాటలతో, వాద్యములను కలిగియుండే విద్యాధరులు వాద్యములతో, మహర్షులు స్తోత్రములతో, పార్షదగణములు కూడ జయజయధ్వానములతో సత్కరించిరి.

తదద్భుతస్తోత్రసువాద్యగీతికా-
జయాదినైకోత్సవమంగలస్వనాన్ ।
శ్రుత్వా స్వధామ్నోఽంత్యజ ఆగతోఽచిరాత్
దృష్ట్వా మహీశస్య జగామ విస్మయమ్ ॥ 35

తద్-అద్భుతస్తోత్రసువాద్యగీతికాజయ-ఆది-న-ఏక-ఉత్సవమంగలస్వనాన్ - వారియొక్క అద్భుతములైన స్తోత్రములు చక్కని వాద్యములు పాటలు జయధ్వానములు మొదలగునవి గల అనేకములైన ఉత్సవముల మంగళధ్వనులను, స్వధామ్నః - తన ధామమునకు, అంతి - సమీపమునందు, శ్రుత్వా - విని, అజః - బ్రహ్మదేవుడు, అచిరాత్ - శీఘ్రముగా, ఆగతః - వచ్చినవాడు, ఈశస్య - శ్రీకృష్ణ భగవానుని, మహి - మహిమను, దృష్ట్వా - చూచి, విస్మయమ్ - ఆశ్చర్యమును, జగామ - పొందెను.

దేవతలు మొదలగువారి అద్భుతములైన స్తోత్రములు, చక్కని వాద్యములు, పాటలు, జయధ్వానములు మొదలగు అనేకములైన ఉత్సవముల మంగళధ్వనులు బ్రహ్మదేవునకు ఆయన ధామము దగ్గర వరకు వినిపించెను. ఆయన వెంటనే వచ్చి శ్రీకృష్ణ భగవానుని మహిమను గాంచి ఆశ్చర్యచకితుడాయెను.

రాజన్నాజగరం చర్మ శుష్కం బృందావనేఽద్భుతమ్ ।
వ్రజౌకసాం బహుతిథం బభూవాక్రీడగహ్వరమ్ ॥ 36

రాజన్ - ఓ రాజా!, అద్భుతమ్ - అద్భుతమైన, ఆజగరమ్ - కొండ చిలువకు చెందిన, శుష్కమ్ - ఎండిన, చర్మ - చర్మము, బృందావనే - బృందావనమునందు, వ్రజ-ఓకసామ్ - గోకులవాసులకు, బహుతిథమ్ - చాల కాలము, ఆక్రీడగహ్వరమ్ - ఆటలాడుకునే పెద్ద బిలము, బభూవ - ఆయెను.

ఓ పరీక్షిన్మహారాజా! అద్భుతమైన ఆ కొండ చిలువ చర్మము ఎండి పెద్ద బిలము ఆయెను. గోకులవాసులు చాల కాలము బృందావనములో దానియందు ఆటలాడెడివారు.

ఏతత్కౌమారజం కర్మ హరేరాత్మాహిమోక్షణమ్ ।
మృత్యోః పౌగండకే బాలా దృష్ట్వోచుర్విస్మితా వ్రజే ॥ 37

మృత్యోః - మృత్యువునుండి, ఆత్మాహిమోక్షణమ్ - తమను పాముసు (నుండి) విడిపించుట అనే, హరేః - శ్రీకృష్ణ భగవానుని, కౌమారజమ్ - ఐదవ ఏడు వయస్సులో జరిగిన, కర్మ - లీలను, దృష్ట్వా - చూచి, విస్మితాః - ఆశ్చర్యపడిన, బాలాః - గోపబాలకులు, వ్రజే - గోకులము నందు, పౌగండకే - ఆరవ ఏడాది వయస్సునందు, ఊచుః - చెప్పిరి.

ఈ విధముగా శ్రీకృష్ణ భగవానుడు తన ఐదవ యేట గోపబాలకులను పాము నోటిలో చావునుండి, అఘాసురుని సంసారమునుండి విముక్తులను చేసెను. దీనిని చూచిన గోపబాలకులు ఆశ్చర్యపడి, ఆ వృత్తాంతమును శ్రీకృష్ణుని ఆరవ యేట గోకులమునందు చెప్పిరి.

నైతద్విచిత్రం మనుజార్భమాయినః
పరావరాణాం పరమస్య వేధసః ।
అఘోఽపి యత్స్పర్శనధౌతపాతకః
ప్రాపాత్మసామ్యం త్వసతాం సుదుర్లభమ్ ॥ 38

మనుజ-అర్భమాయినః - మాయాశక్తిచే మానవబాలకుడైనట్టియు, పర-అవరాణామ్ - బ్రహ్మాదులకు చెట్టుచేమలు మొదలగువాటికి (కారణకార్యములకు), వేధసః - సృష్టికర్తయైన, పరమస్య - పరబ్రహ్మకు, ఏతత్ - ఇది, విచిత్రమ్ - విచిత్రము, న - కాదు, యత్ - ఏదనగా, స్పర్శధౌతపాతకః - స్పృశించుటచే కడిగివేయబడన పాపములు గల, అఘః అపి - అఘుడు కూడ, అసతాం తు - దుష్టులకైతే, సుదుర్లభమ్ - మిక్కిలి పొంద శక్యము కాని, ఆత్మసామ్యమ్ - తనతోడి సామ్యమును, ప్రాప - పొందెనో.

బ్రహ్మాది దేవతలనుండి చెట్టు చేమలవరకు సర్వమును (కార్యములైన దేహములతో కారణములైన పంచభూతములతో కూడియున్న జగత్తును) సృష్టించిన పరబ్రహ్మయే మాయాశక్తిచే మానవబాలకుడై అవతరించెను. ఆయనకు ఇది విచిత్రమేమీ కాదు. ఏదనగా -- మోక్షమైతే దుష్టులకు

సుతరాము పొంద శక్యము కానిది. కాని, ఆయనను స్పృశించుటచే పాపములన్నీ కడిగివేయబడి అఘాసురుడు కూడ మోక్షమును పొందెను. మోక్షములో జీవుడు ఈశ్వరునిలో విలీనమగును.

సకృద్యదంగప్రతిమాంతరాహితా
మనోమయీ భాగవతీం దదౌ గతిమ్ ।
స ఏవ నిత్యాత్మసుఖానుభూత్యభి-
వ్యుదస్తమాయోఽంతర్గతో హి కిం పునః ॥ 39

మనోమయీ - మనోవృత్తిరూపమైన, యద్-అంగప్రతిమా - ఎవ్వాని మూర్తియొక్క ప్రతికృతి, సకృత్ - ఒక్కసారి, అంతః - హృదయము లోపల, ఆహితా - స్థాపించబడినదై, భాగవతీమ్ - భగవద్భక్తులకు లభించే, గతిమ్ - మోక్షమును, దదౌ - ఇచ్చెనో, నిత్య-ఆత్మసుఖ-అనుభూతి-అభివ్యుదస్తమాయః - నిత్యమైన ఆత్మానందముయొక్క అనుభవముచే దూరముగా పారద్రోలబడిన అజ్ఞానము గల, సః ఏవ - ఆ భగవానుడే, అంతః-గతః - లోపల ప్రవేశించెనో, కిం పునః హి - చెప్పనదేమున్నది?

ఆ భగవానుని మూర్తియొక్క ప్రతికృతిని మనోవృత్తిరూపముగా ఎవడైతే ఒక్కసారి హృదయము లోపల ధ్యానముచే స్థాపించుకొనునో, అట్టివానికి భగవానుడు భగవద్భక్తులకు లభించే మోక్షమునిచ్చెను. హృదయములో నిత్యమైన ఆత్మానందానుభవరూపముగా ఆ భగవానుడు సాక్షాత్కరించి అజ్ఞానమును పారద్రోలును. అట్టి భగవానుడే స్వయముగా ఎవని దేహములో ప్రవేశించెనో, అట్టి అఘాసురునకు మోక్షము లభించెనని వేరుగా చెప్పవలయునా?

సూత ఉవాచ ।
ఇత్థం ద్విజా యాదవదేవదత్తశ్శ్రుత్వా స్వరాతుశ్చరితం విచిత్రమ్,
పప్రచ్ఛ భూయోఽపి తదేవ పుణ్యం వైయాసకిం యన్నిగృహీతచేతాః।

ద్విజాః - ఓ మహర్షులారా!, ఇత్థమ్ - ఈ విధముగా, యాదవదేవదత్తః - యాదవప్రభువగు శ్రీకృష్ణునిచే అనుగ్రహించబడిన పరీక్షిత్తు, స్వరాతుః -

తనను అనుగ్రహించిన శ్రీకృష్ణుని, విచిత్రమ్ - అద్భుతమగు, చరితమ్ - వృత్తాంతమును, శ్రుత్వా - విని, యత్-నిగృహీతచేతాః - ఏ చరితముచే సుతరాము వశము చేసుకొనబడిన మనస్సు గలవాడో, పుణ్యమ్ - పవిత్రమగు, తత్ ఏవ - ఆ చరితమునే, భూయః అపి - మరల కూడ, వైయాసకిమ్ - వ్యాసపుత్రుడగు శుకుని, పప్రచ్ఛ - ప్రశ్నించెను. 40

సూతమహర్షి ఇట్లు పలికెను --- ఓ శౌనకాది మహర్షులారా! యాదవప్రభువగు శ్రీకృష్ణుడే పరీక్షిత్తును కాపాడి పాండవులకు అనుగ్రహించెను. తనను కాపాడిన ఆ భగవానుని అద్భుతమగు చరితమును పరీక్షిత్తు వినుచుండెను. ఆయన మనస్సు ఆ చరితమునకు సుతరాము వశమయ్యెను. ఆయన మరల శుకమహర్షిని పవిత్రమగు ఆ చరితమును గురించియే ప్రశ్నించెను.

రాజోవాచ ।
బ్రహ్మన్ కాలాంతరకృతం తత్కాలీనం కథం భవేత్ ।
యత్కౌమారే హరికృతం జగుః పౌగండకేఽర్భకాః ॥ 41

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, కాల-అంతరకృతమ్ - మరియొక సమయమునందు చేయబడినది, తత్-కాలీనమ్ - ఆ కాలమునకు చెందినది, కథం భవేత్ - ఎట్లు అగును?, కౌమారే - ఐదవ యేట, హరికృతమ్ - శ్రీకృష్ణ భగవానునిచే చేయబడిన, యత్ - ఏ లీలను, అర్భకాః - పిల్లలు, పౌగండకే - ఆరవ యేట, జగుః - గానము చేసిరో.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! శ్రీకృష్ణ భగవానుడు తన ఐదవ యేట ఏ లీలను చేసెనో, దానిని గోపబాలకులు ఆరవ యేట గానము చేసిరి. ఒక కాలములో చేసిన లీల మరియొక కాలమునకు చెందినది యెట్లు అగును?

తద్బ్రూహి మే మహాయోగిన్ పరం కౌతూహలం గురో ।
నూనమేతద్ధరేరేవ మాయా భవతి నాన్యథా ॥ 42

మహాయోగిన్ - ఓ గొప్ప యోగీ!, గురో - ఓ గురూ!, తత్ - ఆ విషయమును, బ్రూహి - చెప్పుడు, మే - నాకు, కౌతూహలమ్ -

ఉత్కంఠ, పరమ్ - అధికము, ఏతత్ - ఇది, నూనమ్ - నిశ్చయముగా, హరేః - శ్రీహరియొక్క, మాయా ఏవ - మాయయే, భవతి - అగును, అన్యథా - మరియొకలా, న - కాదు.

ఓ మహాయోగీ! నీవు నాకు గురుడవు. నాకీ విషయమును చెప్పుడు. నాకు కుతూహలము మెండు. ఇది నిశ్చయముగా శ్రీకృష్ణ భగవానుని మాయాశక్తియే గాని, మరియొకటి కాదు.

వయం ధన్యతమా లోకే గురోఽపి క్షత్రబంధవః ।
యత్పిబామో ముహుస్త్వత్తః పుణ్యం కృష్ణకథామృతమ్ ॥ 43

గురో - ఓ గురుదేవా!, క్షత్రబంధవః అపి - క్షత్రియాధములమే ఐననూ, వయమ్ - మేము, లోకే - లోకమునందు, ధన్యతమాః - మిక్కిలి ధన్యులము, యత్ - ఏలయన, పుణ్యమ్ - పవిత్రమగు, కృష్ణకథా-అమృతమ్ - శ్రీకృష్ణుని గాథలనే అమృతమును, త్వత్తః - నీనుండి, ముహుః - మరల మరల, పిబామః - పానము చేయుచున్నామో.

ఓ గురుదేవా! మేము క్షత్రియాధులమే అయినా అందరికంటె ఎక్కువ ధన్యులము. ఎందుకంటే, మేము నీనుండి పవిత్రమైన శ్రీకృష్ణగాథలనే అమృతమును మరల మరల పానము చేయుచున్నాము.

సూత ఉవాచ ।
ఇత్థం స్మ పృష్టస్స తు బాదరాయణిః
తత్స్మారితానంతహృతాఖిలేంద్రియః ।
కృచ్ఛ్రాత్పునర్లబ్ధబహిర్దృశిశ్శనైః
ప్రత్యాహ తం భాగవతోత్తమోత్తమ ॥ 44

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ద్వాదశోఽధ్యాయః ॥

భాగవత-ఉత్తమ-ఉత్తమ - గొప్ప భగవద్భక్తులలో గొప్పవాడా!, ఇత్థమ్ - ఈ విధముగా, పృష్టః - ప్రశ్నించబడిన, సః - ఆ, బాదరాయణిః - వ్యాసపుత్రుడగు శుకుడు, తత్-స్మారిత-అనంతహృత-అఖిల-ఇంద్రియః - ఆ ప్రశ్నచే గుర్తు చేయబడిన శ్రీకృష్ణ భగవానునిచే హరించబడిన

సకలములైన ఇంద్రియములు గలవాడై, కృచ్ఛ్రాత్ - కష్టము మీద, పునః - మరల, లబ్ధబహిః-దృశిః - పొందబడిన బాహ్యదృష్టి గలవాడై, శనైః - మెల్లగా, తమ్ - ఆ రాజును గురించి, ప్రత్యాహ - బదులు చెప్పెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- ఓ శౌనకా! నీవు ఉత్తములగు భగవద్భక్తులలో ఉత్తముడవు. ఈ విధముగా రాజు ప్రశ్నించగా, వ్యాసపుత్రుడగు శుకునకు శ్రీకృష్ణ భగవానుడు స్మృతికి దగిలెను. అంతే. వెంటనే ఆయన ఇంద్రియములన్నియు అంతర్ముఖములాయెను. చాల కష్టము మీద ఆయన మరల సమాధినుండి బాహ్యజగత్తులోనికి వచ్చి, మెల్లగా ఆ రాజునకు ఇట్లు బదులు చెప్పెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్ధములో శ్రీకృష్ణుడు అఘాసురుని ఉద్ధరించుటను వర్ణించే
పన్నెండవ అధ్యాయము ముగిసినది (12).



# అథ త్రయోదశోऽధ్యాయః

## బ్రహ్మదేవుడు వ్యామోహితుడగుట

శ్రీశుక ఉవాచ ।
సాధు పృష్టం మహాభాగ త్వయా భాగవతోత్తమ ।
యన్నూతనయసీశస్య శృణ్వన్నపి కథాం ముహుః ।। 1

మహాభాగ - గొప్ప భాగ్యము గలవాడా!, భాగవత-ఉత్తమ భగవద్భక్తులలో శ్రేష్ఠుడైనవాడా!, త్వయా - నీచే, సాధు - బాగుగా పృష్టమ్ - ప్రశ్నించబడినది, యత్ - ఏలయన, ఈశస్య - శ్రీకృష్ణ భగవానుని, కథామ్ - గాథను, ముహుః - పలుమార్లు, శృణ్వన్ అపి వినువాడవే అయిననూ, నూతనయసి - కొత్తదిగా చేయుచున్నావు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! నీవు గొప్ప భాగ్యము గలవాడవు, భగవద్భక్తులలో శ్రేష్ఠుడవు. నీవు బాగుగా ప్రశ్నించితివి. ఎందుకంటే, నీవు పలుమార్లు విన్ననూ, శ్రీకృష్ణ భగవానుని గాథకు నీ ప్రశ్నల ద్వారా ఒక కొత్తదనమును కలిగించుచున్నావు.

సతామయం సారభృతాం నిసర్గో యదర్థవాణీశ్రుతిచేతసామపి,
ప్రతిక్షణం నవ్యవదచ్యుతస్య యత్ స్త్రియా విటానామివ సాధు వార్తా।

యద్-అర్థవాణీశ్రుతిచేతసాం అపి - ఏ శ్రీహరి వార్తయే విషయముగా గల వాక్కు చెవులు మనస్సు గలవారే అయిననూ, సారభృతామ్ - సారమును గ్రహించే, సతామ్ - సజ్జనులకు, అయమ్ - ఇది, నిసర్గః - స్వభావము, యత్ - ఏదనగా, విటానామ్ - కాముకులకు, స్త్రియాః ఇవ - యువతియొక్క వలె, అచ్యుతస్య - శ్రీహరి భగవానునియొక్క, వార్తా - ప్రసంగము, సాధు - బాగుగా, ప్రతిక్షణమ్ - ప్రతిక్షణము, నవ్యవత్ - కొత్తది వలెనుండునో.

సత్పురుషుల వాక్కు శ్రీహరినే కీర్తించును, చెవులు శ్రీహరి గాథనే వినును, మనస్సు ఆ శ్రీహరినే ధ్యానించును. సారమును గ్రహించే అట్టి సత్పురుషుల స్వభావము ఇదియే. ఏదనగా, విటులకు యువతుల వార్త వలె, వారికి శ్రీకృష్ణ భగవానుని ప్రసంగము ప్రతిక్షణము బాగా కొత్తదివలె నుండును.

శృణుష్వావహితో రాజన్నపి గుహ్యం వదామి తే ।
బ్రూయుస్స్నిగ్ధస్య శిష్యస్య గురవో గుహ్యమప్యుత ।। 3

రాజన్ - ఓ రాజా!, అవహితః - సావధానుడవై, శృణుష్వ - వినుము, గుహ్యం అపి - రహస్యమే ఐననూ, తే - నీకు, వదామి - చెప్పెదను, ఉత - ఏలయన, గురవః - గురువులు, స్నిగ్ధస్య - ప్రేమ గల, శిష్యస్య - శిష్యునకు, గుహ్యం అపి - రహస్యమును కూడ, బ్రూయుః - చెప్పెదరు.

ఓ పరీక్షిన్మహారాజా! సావధానుడవై వినుము. అది రహస్యమే ఐననూ, నీకు చెప్పెదను. ఎందుకంటే, గురువులు ప్రేమ గల శిష్యునకు రహస్యమునైననూ చెప్పెదరు.

తథాఽఘవదనాన్మృత్యో రక్షిత్వా వత్సపాలకాన్ ।
సరిత్పులినమానీయ భగవానిదమబ్రవీత్ ।। 4

తథా - ఆ విధముగా, మృత్యోః - మృత్యువైన, అఘవదనాత్ - అఘాసురుని నోటినుండి, వత్సపాలకాన్ - దూడలను గోపబాలకులను, రక్షిత్వా - రక్షించి, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, సరిత్-పులినమ్ - యమునానదియొక్క ఇసుకతిన్నెను గురించి, ఆనీయ - తీసుకువచ్చి, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

ఆ విధముగా శ్రీకృష్ణ భగవానుడు దూడలను, గోపబాలకులను మృత్యురూపమైన అఘాసురుని నోటినుండి రక్షించి యమునానదియొక్క ఇసుకతిన్నె వద్దకు తీసుకువచ్చి ఇట్లు పలికెను.

అహోఽతిరమ్యం పులినం వయస్యాః
స్వకేలిసంపన్మృదులాచ్ఛవాలుకమ్ ।

స్ఫుటత్సరోగంధహృతాలిపత్రిక-
ధ్వనిప్రతిధ్వానలసద్ద్రుమాకులమ్ ॥ 5

అహో - ఆహా!, వయస్యాః - మిత్రులారా!, పులినమ్ - ఇసుక తిన్నె, అతిరమ్యమ్ - చాల అందమైనది, స్వకేలిసంపత్-మృదుల-అచ్ఛ-వాలుకమ్ - మన ఆటపాటలకు సంపదలు గలది మెత్తని స్వచ్ఛమైన ఇసుక గలది, స్ఫుటత్-సరః-గంధహృత-అలిపత్రికధ్వనిప్రతిధ్వానలసద్-ద్రుమ-ఆకులమ్ - వికసించుచున్న సరస్సుయొక్క పరిమళముచే ఆకర్షించబడిన తుమ్మెదల పక్షుల నీటియందలి ధ్వనులకు ప్రతిధ్వనులచే ప్రకాశించే చెట్లతో వ్యాపించబడియున్నది.

ఆహా! మిత్రులారా! ఇసుకతిన్నె చాల అందముగా నున్నది. మెత్తని స్వచ్ఛమగు ఇసుక గల ఇది మన ఆటపాటలకు అన్ని విధముల సామగ్రిని కలిగియున్నది (విశాలమైనది). సరస్సులోని పద్మములు వికసించి సరస్సే వికసించినట్లున్నది. వాటి పరిమళముచే ఆకర్షితములైన తుమ్మెదలు, పక్షులు నీటిలో చేసే ధ్వనులను ప్రతిధ్వనిస్తూ ప్రకాశించే చెట్లతో వ్యాపించబడి యున్నది.

అత్ర భోక్తవ్యమస్మాభిర్దివాఽఽరూఢం క్షుధాఽర్దితాః ।
వత్సాస్సమీపేఽపః పీత్వా చరంతు శనకైస్తృణమ్ ॥ 6

అస్మాభిః - మనలచే, అత్ర - ఇచట, భోక్తవ్యమ్ - భోజనము చేయబడవలెను, దివా-ఆరూఢమ్ - పగలు ప్రొద్దు ఎక్కినది, క్షుధా - ఆకలిచే, అర్దితాః - పీడించబడితిమి, వత్సాః - దూడలు, అపః - నీళ్లను, పీత్వా - త్రాగి, సమీపే - సమీపమునందు, శనకైః - మెల్లగా, తృణమ్ - గడ్డిని, చరంతు - మేయుగాక!

మనము ఇక్కడనే భుజించెదము. బాగా ప్రొద్దెక్కినది. ఆకలి ఇబ్బంది పెట్టుచున్నది. దూడలు నీళ్లను త్రాగి, దగ్గరలో మెల్లగా గడ్డిని మేయుగాక!

తథేతి పాయయిత్వాఽర్భా వత్సానారుధ్య శాద్వలే ।
ముక్త్వా శిక్యాని బుభుజుస్సమం భగవతా ముదా ॥ 7

అర్భాః - గోపబాలకులు, తథా - సరే, ఇతి - అని, వత్సాన్ - దూడలను, పాయయిత్వా - నీరు త్రాగించి, శాద్వలే - పచ్చిక బయలునందు, ఆరుధ్య - కట్టివేసి, శిక్యాని - ఉట్టిలను, ముక్త్వా - ముడి విప్పి, భగవతా సమమ్ - శ్రీకృష్ణ భగవానునితో బాటు, ముదా - ఆనందముతో, బుభుజుః - భుజించిరి.

గోపబాలకులు సరేనని దూడలకు నీరు త్రాగించి వాటిని పచ్చిక బయలునందు కట్టివేసి, ఉట్టిల ముడులను విప్పి, శ్రీకృష్ణ భగవానునితో బాటుగా భోజనము చేసిరి.

కృష్ణస్య విష్వక్పురురాజిమండలైరభ్యాననాః ఫుల్లదృశో వ్రజార్భకాః ।
సహోపవిష్టా విపినే విరేజుశ్ఛదా యథాంభోరుహకర్ణికాయాః ॥ 8

విపినే - అడవియందు, కృష్ణస్య - శ్రీకృష్ణునకు, విష్వక్ - చుట్టూ, పురురాజిమండలైః - అనేకములైన వరుసల మండలములచే, సహ - కలిసి, ఉపవిష్టాః - కూర్చున్నవారు, అభి-ఆననాః - శ్రీకృష్ణునకు అభిముఖమైన ముఖములు కలిగినవారు, ఫుల్లదృశః - వికసించిన కన్నులు గలవారు అగు, వ్రజ-అర్భకాః - గోకుల బాలకులు, అంభః-రుహకర్ణికాయాః - పద్మముయొక్క దుద్దునకు, ఛదాః యథా - రేకలు వలె, విరేజుః - ప్రకాశించిరి.

అడవిలో గోకుల బాలకులు శ్రీకృష్ణునకు అభిముఖముగా ఆయన చుట్టూ గుండ్రని వరుసలలో దగ్గరగా కలిసి కూర్చుండిరి. వికసించిన కన్నులు గల వారు పద్మపు దుద్దు చుట్టూ ఉండే రేకలవలె ప్రకాశించిరి.

కేచిత్పుష్పైర్దలైః కేచిత్పల్లవైరంకురైః ఫలైః ।
శిగ్భిస్త్వగ్భిర్దృషద్భిశ్చ బుభుజుః కృతభాజనాః ॥ 9

కేచిత్ - కొందరు, పుష్పైః - పువ్వులతో, దలైః - ఆకులతో, కేచిత్ - కొందరు, పల్లవైః - చిగుళ్లతో, అంకురైః - మొలకలతో, ఫలైః - పళ్లతో, శిగ్భిః - ఉట్టిలతో, త్వగ్భిః - బెరడులతో, దృషద్భిః చ - రాళ్లతో కూడ, కృతభాజనాః - చేయబడిన భోజనపాత్రలు గలవారై, బుభుజుః - తినిరి.

కొందరికి పువ్వులు, కొందరికి ఆకులు, మరికొందరికి చిగుళ్ళు, ఇంకొందరికి మొలకలు భోజనపాత్రలైనవి. కొందరు పళ్లను, కొందరు ఉట్టిలను, కొందరు చర్మములను, మరికొందరు చెట్టు బెరడులను, ఇంకొందరు రాళ్లను పాత్రలుగా చేసుకొని భుజించిరి.

సర్వే మిథో దర్శయంతస్స్వస్వభోజ్యరుచిం పృథక్ ।
హసంతో హాసయంతశ్చాభ్యవజహ్రుస్సహేశ్వరాః ॥ 10

సర్వే - అందరు, మిథః - ఒకరికొకరు, స్వస్వభోజ్యరుచిమ్ - తమ తమ తినుబండారముల రుచిని, పృథక్ - వేర్వేరుగా, దర్శయంతః - చూపువారు, హసంతః - నవ్వుచున్నవారు, హాసయంతః చ - నవ్వించుచున్నవారు కూడా, సహ-ఈశ్వరాః - శ్రీకృష్ణ భగవానుడు తోడుగా గలవారై, అభ్యవజహ్రుః - భుజించిరి.

వారందరు తమ తమ తినుబండారముల రుచిని వేర్వేరుగా ఒకరికొకరు చూపించుచుండిరి. వారు నవ్వుతూ నవ్విస్తూ, శ్రీకృష్ణ భగవానునితో కలిసి భుజించిరి.

బిభ్రద్వేణుం జఠరపటయోశ్శృంగవేత్రే చ కక్షే
వామే పాణౌ మసృణకవలం తత్ఫలాన్యంగులీషు ।
తిష్ఠన్మధ్యే స్వపరిసుహృదో హాసయన్నర్మభిస్స్వైః
స్వర్గే లోకే మిషతి బుభుజే యజ్ఞభుగ్బాలకేళిః ॥ 11

జఠరపటయోః - ఉదరమునందలి జంట వస్త్రములయందు, వేణుమ్ - పిల్లనగ్రోవిని, వామే - ఎడమ, కక్షే - కచ్ఛయందు, శృంగవేత్రే చ - కొమ్ము బూరాను బెత్తమును కూడ, పాణౌ - చేతియందు, మసృణకవలమ్ - పెరుగు అన్నపు ముద్దను, అంగులీషు - వ్రేళ్లయందు, తత్-ఫలాని - దానికి తగ్గ ఊరగాయలను, బిభ్రత్ - ధరించువాడు, మధ్యే - మధ్యయందు, తిష్ఠన్ - ఉన్నవాడు, స్వపరిసుహృదః - తన చుట్టూ ఉన్న మిత్రులను, స్వైః - తన, నర్మభిః - పరిహాసవచనములచే, హాసయన్ - నవ్వించువాడు, యజ్ఞభుక్ - యజ్ఞభాగములను భుజించే శ్రీహరి,

బాలకేళిః - పిల్లల ఆట గలవాడై, స్వర్గే లోకే - స్వర్గలోకము, మిషతి - కళ్లప్పగించి చూచుచుండగా, బుభుజే - భుజించెను.

శ్రీకృష్ణుడు నడుము కట్టిన జంట వస్త్రములయందు పిల్లన గ్రోవిని, ఎడమ కచ్చయందు కొమ్ముబూరాను బెత్తమును పెట్టుకొనెను. ఆయన చేతిలో పెరుగు అన్నపు ముద్దను, వ్రేళ్ల సందులయందు ఊరగాయ ముక్కలను పట్టుకొనెను. మిత్రుల మధ్యలో ఉన్న ఆయన తన చుట్టూ ఉన్న మిత్రులను తన పరిహాసోక్తులతో నవ్వించుచుండెను. యజ్ఞభాగములను స్వీకరించే భగవానుడు పిల్లలతో ఆడుతూ తింటూ ఉంటే స్వర్గములోని దేవతలు కళ్లప్పగించి చూచుచుండిరి.

భారతైవం వత్సపేషు భుంజానేష్వచ్యుతాత్మసు ।
వత్సాస్త్వంతర్వనే దూరం వివిశుస్తృణలోభితాః ।। 12

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, అచ్యుత-ఆత్మసు - శ్రీకృష్ణ భగవానునియందు మనస్సు గల, వత్సపేషు - దూడలను కాసే బాలకులు, ఏవమ్ - ఈ విధముగా, భుంజానేషు - తినుచుండగా, తృణలోభితాః - గడ్డికి ఆశ పడిన, వత్సాః తు - దూడలైతే, అంతః-వనే - అడవి మధ్యయందు, దూరమ్ - దూరముగా, వివిశుః - ప్రవేశించినవి.

భరతవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! దూడలను కాసే ఆ బాలకులీ విధముగా శ్రీకృష్ణ భగవానునియందు లగ్నమైన మనస్సులు గలవారై భోజనము చేయుచుండిరి. ఇంతలో దూడలు గడ్డి మీది ఆశతో అడవి మధ్యలోనికి దూరముగా వెళ్లినవి.

తాన్ దృష్ట్వా భయసంత్రస్తానూచే కృష్ణోఽస్య భీభయమ్ ।
మిత్రాణ్యాశాన్మా విరమతేహానేష్యే వత్సకానహమ్ ।। 13

అస్య - ఈ జగత్తుయొక్క, భీభయమ్ - భయమునకు భయమైన, కృష్ణః - శ్రీకృష్ణుడు, (భీభయమ్ - భయహేతువుల వలని భయమును, అస్య - పోగొట్టి), భయసంత్రస్తాన్ - భయముతో కంగారు పడిన, తాన్ - ఆ గోపబాలకులను, దృష్ట్వా - చూచి, ఊచే - పలికెను, మిత్రాణి - ఓ మిత్రులారా!, ఆశాత్ - తినుటనుండి, మా విరమత - విరమించకుడు,

అహమ్ - నేను, వత్సకాన్ - దూడలను, ఇహ - ఇచటకు, ఆనేష్యే - తీసుకురాగలను.

ఈ జగత్తులోని భయములకు శ్రీకృష్ణుడంటే భయము. ఆ గోపబాలకులు భయముతో కంగారు పడుటను ఆయన చూచెను. దూడలు ఏమైనవో అనే ఆశంక వలన కలిగిన వారి భయమును పోగొడుతూ, ఆయన వారితో నిట్లనెను -- ఓ మిత్రులారా! మీరు భోజనమును మానకుడు. నేను దూడలను ఇక్కడకు తీసుకువచ్చెదను.

ఇత్యు క్త్వాద్రిదరీకుంజగహ్వరేష్వాత్మవత్సకాన్ ।
విచిన్వన్ భగవాన్ కృష్ణస్సపాణికబలో యయౌ ॥ 14

ఇతి - అని, ఉక్త్వా - పలికి, అద్రిదరీకుంజగహ్వరేషు - పర్వతములు గుహలు పొదరిళ్లు మరియు దాగే స్థానములయందు, ఆత్మవత్సకాన్ - తమ దూడలను, విచిన్వన్ - వెదుకుచున్నవాడై, సపాణికవలః - చేతియందలి ముద్దతో కూడిన, భగవాన్ కృష్ణః - శ్రీకృష్ణ భగవానుడు, యయౌ - వెళ్లెను.

శ్రీకృష్ణభగవానుడు ఇట్లు పలికి తమ దూడలను వెదుకుటకు వెళ్లెను. ఆయన చేతిలో అన్నపు ముద్ద అటులనే యుండెను. పర్వతములు, గుహలు, పొదరిళ్లలో మరియు దాగే స్థానములయందు ఆయన వెదికెను.

అంభోజన్మజనిస్తదంతరగతో మాయార్భకస్యేశితుః
ద్రష్టుం మంజు మహిత్వమన్యదపి తద్వత్సానితో వత్సపాన్,
నీత్వాఽన్యత్ర కురూద్వహాంతరదధాత్ఖేఽవస్థితో యః పురా
దృష్ట్వాఽఘాసురమోక్షణం ప్రభవతః ప్రాప్తః పరం విస్మయమ్॥ 15

కురు-ఉద్వహ - ఓ కురువంశశ్రేష్ఠా!, తద్-అంతరగతః - ఆ సమయము (ఛిద్రము) నందు వెళ్లిన, అంభోజన్మజనిః - పద్మమునుండి పుట్టిన బ్రహ్మదేవుడు, మాయా-అర్భకస్య - మాయచే మానవబాలకుడైన, ఈశితుః - ఈశ్వరునియొక్క, అన్యత్ - మరియొక, మంజు - ఆహ్లాదకరమైన, మహిత్వం అపి - మహిమను కూడ, ద్రష్టుమ్ - చూచుటకు, తద్-వత్సాన్ - వారి దూడలను, వత్సపాన్ - దూడలను కాసే

బాలకులను, ఇతః - ఇక్కడనుండి, అన్యత్ర - మరియొకచోటకు, నీత్వా - తీసుకుపోయి, అంతరధాత్ - అంతర్ధానమాయెను, యః - ఏ బ్రహ్మదేవుడైతే, పురా - ముందు, ఖే - ఆకాశమునందు, అవస్థితః - నిలిచియున్నవాడై, ప్రభవతః - సర్వశక్తిమంతుడగు శ్రీకృష్ణుని వలన, అఘ-అసురమోక్షణమ్ - అఘాసురుని విముక్తిని, దృష్ట్వా - చూచి, పరమ్ - అధికమగు, విస్మయమ్ - ఆశ్చర్యమును, ప్రాప్తః - పొందినవాడో.

కురువంశశ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! పద్మసంభవుడగు బ్రహ్మదేవుడు ముందు ఆకాశములోనున్నవాడై సర్వశక్తిమంతుడగు శ్రీకృష్ణుడు అఘాసురునకు విముక్తినిచ్చుటను గాంచి చాల ఆశ్చర్యమును పొందెను. ఆయన అదే సమయములో శ్రీకృష్ణుని ఆ ఇబ్బందిలో అచటకు వెళ్లెను. మాయాశక్తిచే మానవబాలకుడై అవతరించిన పరమేశ్వరుని మరియొక ఆహ్లాదకరమైన మహిమను చూడాలని ఆయన కోరిక. ఆయన దూడలను కాసే పిల్లలను, వారి దూడలను అక్కడనుండి ఇంకో చోటకు తీసుకుపోయి తాను అంతర్ధానము చెందెను.

తతో వత్సానదృష్ట్వైవ పులినేऽపి చ వత్సపాన్ ।
ఉభావపి వనే కృష్ణో విచికాయ సమంతతః ॥ 16

తతః - తరువాత, కృష్ణః - శ్రీకృష్ణుడు, వనే - అడవియందు, వత్సాన్ - దూడలను, పులినే అపి - ఇసుక తిన్నెయందు కూడ, వత్సపాన్ చ - గోపబాలకులను కూడ, ఉభౌ అపి - ఇద్దరిని కూడ, అదృష్ట్వా ఏవ - కానరాకుండానే, సమంతతః - అంతటా, విచికాయ - వెదికెను.

అప్పుడు శ్రీకృష్ణునకు అడవిలో దూడల జాడ తెలియలేదు. ఇసుకతిన్నెకు తిరిగి వస్తే ఆక్కడ గోపబాలకుల జాడ కూడ లేదు. ఆయన ఇటు దూడలను, అటు గోపబాలకులను, ఇద్దరినీ కూడ అంతటా వెదికెను.

క్వాప్యదృష్ట్వాऽంతర్విపినే వత్సాన్ పాలాంశ్చ విశ్వవిత్ ।
సర్వం విధికృతం కృష్ణస్సహసాऽవజగామ హ ॥ 17

విశ్వవిత్ - సర్వజ్ఞుడైన, కృష్ణః - శ్రీకృష్ణుడు, అంతః-విపినే - అడవి మధ్యయందు, వత్సాన్ - దూడలను, వత్సపాలాన్ చ -

గోపబాలకులనైననూ, క్వ అపి - ఎక్కడనైననూ, అదృష్ట్వా - కానరాక, సహసా - వెంటనే, సర్వమ్ - అంతా, విధికృతమ్ - బ్రహ్మదేవునిచే చేయబడినదానినిగా, అవజగామ హ - తెలుసుకొనెను.

అడవి మధ్యలో దూడలు కానరాలేదు. గోపబాలకులు కూడ ఎక్కడనైననూ కనబడలేదు. వెంటనే సర్వజ్ఞుడైన శ్రీకృష్ణునకు అదంతా బ్రహ్మదేవుడు చేసిన పనియేనని తెలిసి పోయెను.

తతః కృష్ణో ముదం కర్తుం తన్మాతౄణాం చ కస్య చ ।
ఉభయాయితమాత్మానం చక్రే విశ్వకృదీశ్వరః ॥ 18

తతః - అప్పుడు, విశ్వకృత్ - జగత్తును సృష్టించిన, కృష్ణః ఈశ్వరః - శ్రీకృష్ణ భగవానుడు, తత్-మాతౄణాం చ - ఆ గోపబాలకుల తల్లులకు, కస్య చ - బ్రహ్మదేవునకు కూడ, ముదమ్ - ఆనందమును, కర్తుమ్ - చేయుటకై, ఆత్మానమ్ - తనను, ఉభయాయితమ్ - ఇద్దరి రూపములోనున్నవానినిగా, చక్రే - చేసెను.

అప్పుడు జగత్కారణుడైన శ్రీకృష్ణ భగవానుడు ఇటు ఆ గోపబాలకుల తల్లులను, అటు బ్రహ్మదేవుని కూడ ఆనందింప జేయగోరెను. ఆయన తానే దూడలు, గోపబాలురు అనే రెండు రూపములుగా ప్రకటమయ్యెను.

యావద్వత్సపవత్సకాల్పకవపుర్యావత్కరాంఘ్ర్యాదికం
యావద్యష్టివిషాణవేణుదలశిగ్యావద్విభూషాంబరమ్ ।
యావచ్ఛీలగుణాభిధాఽఽకృతివయో యావద్విహారాదికం
సర్వం విష్ణుమయం గిరోఽంగవదజస్సర్వస్వరూపో బభౌ॥19

యావత్-వత్సపవత్సక-అల్పకవపుః - ఎన్నైతే దూడలను కాసే బాలుర మరియు దూడల చిన్ని దేహములు గలవో, యావత్-కర-అంఘ్రి-ఆదికమ్ - ఏ పరిమాణములోనైతే చేతులు కాళ్లు మొదలైనవి గలవో, యావద్-యష్టివిషాణవేణుదలశిగ్ - ఏయే బెత్తములు కొమ్ము బూరాలు పిల్లన గ్రోవులు అలంకరించుకొనే ఆకులు ఉట్టిలు గలవో, యావద్-విభూషా-అంబరమ్ - ఏయే భూషణములు వస్త్రములు గలవో, యావత్-శీలగుణ-అభిధా-ఆకృతివయః - ఏవైతే స్వభావములు గుణములు మాటతీరులు

(పేర్లు) ఆకారములు వయస్సులు గలవో, యావద్-విహార-ఆదికమ్ - ఏయే రకముల విహారములు మొదలైనవి గలవో, సర్వమ్ - సర్వము, విష్ణుమయమ్ - శ్రీహరితో నిండియున్నది అనే, గిరః - శ్రుతివచనమునకు, అంగవత్ - ప్రత్యక్షరూపము వలె, అజః - పుట్టుక లేని శ్రీహరి, సర్వస్వరూపః - అన్నింటి రూపములోనున్నవాడై, బభౌ - ప్రకాశించెను.

ఎన్ని దూడల మరియు దూడలను కాసే బాలుర చిన్ని దేహములు గలవో, ఏ ప్రమాణములో వారి చేతులు కాళ్లు ముక్కు మొదలైనవి గలవో, ఎన్నైతే బెత్తములు కొమ్ము బూరాలు పిల్లన గ్రోవులు అలంకరించుకునే ఆకులు ఉట్టిలు గలవో, ఏయే ఆభరణములు వస్త్రములు గలవో అవన్నీ ఆ శ్రీకృష్ణుడే ఆయెను. ఇంతే గాదు. ఆ దూడలకు, బాలురకు ఏయే స్వభావము, గుణములు, పేర్లు, మాట తీరులు, ఆకారములు, వయస్సులు, విహారములు, పెంకి తనములు మొదలైనవి గలవో వాటినన్నింటినీ పుట్టుక లేని ఆయన యథాతథముగా ప్రకటించెను. సర్వము విష్ణుమయమనే శ్రుతివచనమునకు ఆ స్థితి అద్దము పట్టెను.

స్వయమాత్మాऽऽత్మగోవత్సాన్ ప్రతివార్యాత్మవత్సపైః ।
క్రీడన్నాత్మవిహారైశ్చ సర్వాత్మా ప్రావిశద్వ్రజమ్ ॥ 20

స్వయమ్ - స్వయముగా, ఆత్మా - తాను, ఆత్మగోవత్సాన్ - తానే అయిన ఆవు దూడలను, ఆత్మవత్సపైః - తానే అయిన గోపబాలురచే, ప్రతివార్య - వెనుకకు దోలుకొని, ఆత్మవిహారైః చ - తానే అయిన విహారములతో కూడ, క్రీడన్ - క్రీడించువాడై, సర్వ-ఆత్మా - సర్వము తానే అయిన శ్రీకృష్ణుడు, వ్రజమ్ - గోకులమును, ప్రావిశత్ - ప్రవేశించెను.

శ్రీకృష్ణుడు స్వయముగా తానే ఆవుదూడలై, తానే వాటిని కాసే గోప బాలకులై, తానే తనతో విహరించి క్రీడిస్తూ, తానే వాటిని వెనుకకు దోలి, సర్వము (క్రియలు, కారకములు) తానే అయి గోకులములో ప్రవేశించెను.

తత్తద్వత్సాన్ పృథఙ్నీత్వా తత్తద్గోష్ఠే నివేశ్య సః ।
తత్తదాత్మాऽభవద్రాజంస్తత్తత్సద్మ ప్రవిష్టవాన్ ॥ 21

రాజన్ - ఓ రాజా!, సః - ఆయన, తత్-తద్-వత్సాన్ - ఆయా దూడలను, పృథక్ - వేరుగా, నీత్వా - తోలుకు వెళ్లి, తత్-తద్-గోష్ఠే - ఆయా ఆవుల కొట్టమునందు, నివేశ్య - కట్టివేసి, తత్-తద్-ఆత్మా - ఆయా రూపము గలవాడై, తత్-తత్-సద్మ - ఆయా ఇంటిని, ప్రవిష్టవాన్ - ప్రవేశించినవాడు.

ఓ పరీక్షిన్మహారాజా! ఆయన ఆయా దూడలను వేరుగా తోలుకు వెళ్లి ఆయా ఆవుల కొట్టములయందు కట్టివేసెను. తరువాత ఆయా గోపబాలకులై వారి వారి ఇళ్లలోనికి ప్రవేశించెను.

తన్మాతరో వేణురవత్వరోత్థితా
ఉత్థాప్య దోర్భిః పరిరభ్య నిర్భరమ్ ।
స్నేహస్నుతస్తన్యపయస్సుధాఽఽసవం
మత్వా పరం బ్రహ్మ సుతానపాయయన్ ॥ 22

వేణురవత్వరా-ఉత్థితాః - పిల్లన గ్రోవియొక్క ధ్వనిచే వేగముగా లేచి నిలబడిన, తత్-మాతరః - ఆ బాలకుల తల్లులు, పరం బ్రహ్మ - పరబ్రహ్మను, సుతాన్ - పుత్రులనుగా, మత్వా - తలచి, దోర్భిః - చేతులతో, ఉత్థాప్య - ఎత్తుకుని, నిర్భరమ్ - ప్రేమతో నిండుగా, పరిరభ్య - ఆలింగనము చేసి, స్నేహస్నుతస్తన్యపయః-సుధా-ఆసవమ్ - ప్రేమతో స్రవించే పాలిండ్లయందలి పాలు అనే అమృతమువంటి ఆసవమును, అపాయయన్ - త్రాగించిరి.

పిల్లన గ్రోవి ధ్వని వినగానే పరబ్రహ్మయగు శ్రీకృష్ణుని తమ తమ పుత్రులుగా భావించిన ఆ బాలుర తల్లులు వేగముగా లేచి పుత్రులను చేతులతో ఎత్తుకొనెడివారు. వారిని ప్రేమతో నిండుగా ఆలింగనము చేసి, ప్రేమతో స్రవించే పాలు అనే అమృతమువంటి ఆసవమును ఆ పిల్లలచే త్రాగించెడివారు.

తతో నృపోన్మర్దనమజ్జలేపనా-
లంకారరక్షాతిలకాశనాదిభిః ।

సంలాలితస్స్వాచరితైః ప్రహర్షయన్
సాయం గతో యామయమేన మాధవః ॥ 23

నృప - ఓ రాజా!, స్వ-ఆచరితైః - తన చేష్టలచే, ప్రహర్షయన్ - గొప్ప ఆనందమును కలిగించువాడు, యామయమేన - ఆఖరి జాము ఇంటికి చేరాలనే నియమముచే, సాయమ్ - సాయంకాలము, గతః - వెళ్లిన, మాధవః - శ్రీకృష్ణ భగవానుడు, తతః - తరువాత, ఉన్మర్దనమజ్జలేపన-అలంకారరక్షా తిలక-అశన-ఆదిభిః - అభ్యంగనస్నానము చందనమునలదుట అలంకారములను పెట్టుట దిష్టి తీయుట తిలకము దిద్దుట ఆహారమునిచ్చుట నిద్ర పుచ్చుట మొదలగువాటిచే, సంలాలితః - బాగుగా లాలించబడువాడు.

ఓ పరీక్షిన్మహారాజా! ఆఖరి జామున ఇంటికి చేరాలనే నియమం ప్రకారముగా శ్రీకృష్ణ భగవానుడు సాయంకాలము ఇంటికి చేరి తన చేష్టలతో తల్లులకు ఆనందమును కలిగించెడివాడు. అప్పుడు తల్లులు తమ పుత్రులకు అభ్యంగనస్నానము చేయించి, చందనమునలది, భూషణములనలంకరించి, దిష్టి తీసి, తిలకము దిద్ది, ఆహారము పెట్టి, నిద్ర పుచ్చి ఈ విధమైన పనులతో లాలించెడివారు.

గావస్తతో గోష్ఠముపేత్య సత్వరం
హుంకారఘోషైః పరిహూతసంగతాన్ ।
స్వకాన్ స్వకాన్ వత్సతరానపాయయన్
ముహుర్లిహంత్యస్స్రవదౌధసం పయః ॥ 24

గావః - ఆవులు, తతః - ఆ అడవినుండి, గోష్ఠమ్ - కొట్టమును, సత్వరమ్ - తొందరగా, ఉపేత్య - చేరుకొని, హుంకారఘోషైః - హుం అనే ధ్వనులచే, పరిహూతసంగతాన్ - పిలువబడి చేరుకున్న, స్వకాన్ స్వకాన్ - తమ తమ, వత్సతరాన్ - ఎదిగిన దూడలను, ముహుః ముహుః - మాటిమాటికీ, లిహంత్యః - నాలుకతో ఆస్వాదించుచున్నవై, స్రవత్ - స్రవించే, ఔధసమ్ - పొదుగులకు చెందిన, పయః - పాలను, అపాయయన్ - త్రాగించినవి.

ఆవులు ఆ అడవినుండి తొందరగా కొట్టమును చేరి హుంకారములతో లేగదూడలను పిలువగా అవి దగ్గరకు వచ్చెడివి. అపుడా ఆవులు తమ తమ లేగలను మాటి మాటికీ నాలుకతో ఆస్వాదిస్తూ పొదుగునుండి స్రవించే పాలను త్రాగించెడివి.

గోగోపీనాం మాతృతాఽస్మిన్ సర్వా స్నేహర్ధికాం వినా ।
పురోవదాస్వపి హరేస్తోకతా మాయయా వినా ॥ 25

గోగోపీనామ్ - ఆవులకు గోపికలకు, అస్మిన్ - ఈ శ్రీకృష్ణునియందు, మాతృతా - తల్లిదనము, సర్వా - అంతా, స్నేహ-ఋద్ధికాం వినా - ప్రేమయొక్క ఆధిక్యమును మినహాయించి, పురః-వత్ - పూర్వమునందు వలెనే, ఆసు అపి - వీరియందు కూడ, హరేః - శ్రీకృష్ణ భగవానునకు, తోకతా - సంతానమగుట, మాయయా వినా - ఆసక్తిని మినహాయించి.

ఆవులకు దూడల రూపములోనున్నట్టియు, గోపికలకు పుత్రుల రూపమునందున్న శ్రీకృష్ణునియందు తల్లుల వ్యవహారమంతా పూర్వమునందు వలెనే ఉండెను. కాని, ప్రేమయందు మాత్రము ఆధిక్యము ఉండెను. ఆయా రూపములయందున్న ఆయనకు కూడ వారియందు తల్లుల యెడల ప్రేమ పూర్వము వలెనే ఉండెను. కాని, అజ్ఞానముచే కలిగే ఆసక్తి మాత్రము లేకుండుటయే తేడా.

వ్రజౌకసాం స్వతోకేషు స్నేహవల్ల్యాబ్దమన్వహమ్ ।
శనైర్నిస్సీమ వవృధే యథా కృష్ణే త్వపూర్వవత్ ॥ 26

వ్రజ-ఓకసామ్ - గోకులవాసులకు, స్వతోకేషు - తమ పుత్రులయందు, స్నేహవల్లీ - ప్రేమప్రవాహము, అపూర్వవత్ - ఇదివరలో లేని విధముగా, కృష్ణే యథా - శ్రీకృష్ణునియందు వలె, ఆ-అబ్దమ్ - సంవత్సర పర్యంతము, అను-అహమ్ - ప్రతిదినము, నిస్సీమ - హద్దులు లేని విధముగా, శనైః - మెల్లగా, వవృధే - పెరిగెను,

గోకులవాసులకు తమ పిల్లలయందు శ్రీకృష్ణునియందు వలె ప్రేమ ఉండెడిది. కాని, ఆ ప్రేమప్రవాహము ఇదివరలో లేని విధముగా హద్దులు లేకుండా మెల్లగా సంవత్సర పర్యంతము ప్రతి దినము పెరిగెను.

ఇత్థమాత్మాఽఽత్మనాఽఽత్మానం వత్సపాలమిషేణ సః ।
పాలయన్ వత్సపో వర్షం చిక్రీడే వనగోష్ఠయోః ॥ 27

వత్సపః - గోవుల రక్షకుడగు, సః - ఆ శ్రీకృష్ణుడు, ఇత్థమ్ - ఈ విధముగా, ఆత్మా - తాను, ఆత్మనా - తనచే, ఆత్మానమ్ - తనను, పాలయన్ - కాపాడువాడై, వత్సపాలమిషేణ - దూడలు గోపబాలుర వేషముతో, వనగోష్ఠయోః - అడవియందు ఆవుల కొట్టములయందు, వర్షమ్ - సంవత్సరము, చిక్రీడే - క్రీడించెను.

గోపాలకుడగు ఆ శ్రీకృష్ణుడీ విధముగా దూడల మరియు గోపబాలుర వేషముతో తాను తనను తనచే అడవిలో మరియు ఆవుల కొట్టములో పాలించుచుండెను. ఆ విధముగా ఆయన సంవత్సరము క్రీడించెను.

ఏకదా చారయన్ వత్సాన్ సరామో వనమావిశత్ ।
పంచషాసు త్రియామాసు హాయనాపూరణీష్వజః ॥ 28

పంచషాసు - ఐదారు, త్రియామాసు - రాత్రులు, హాయన-అపూరణీషు - సంవత్సరమును పూరించునవి కాగా, ఏకదా - ఒకనాడు, సరామః - బలరామునితో గూడిన, అజః - పుట్టుక లేని శ్రీకృష్ణ భగవానుడు, వత్సాన్ - దూడలను, చారయన్ - మేపుచున్నవాడై, వనమ్ - అడవిని, ఆవిశత్ - ప్రవేశించెను.

సంవత్సరము పూర్తి యగుటకు ఇంకనూ ఐదారు రోజులు మాత్రమే మిగిలెను. ఒకనాడు పుట్టుక లేని శ్రీకృష్ణ భగవానుడు బలరామునితో గూడి దూడలను మేపుతూ అడవిని ప్రవేశించెను.

తతో విదూరాచ్చరతో గావో వత్సానుపవ్రజమ్ ।
గోవర్ధనాద్రిశిరసి చరంత్యో దదృశుస్తృణమ్ ॥ 29

గోవర్ధన-అద్రిశిరసి - గోవర్ధనపర్వతశిఖరముపై, తృణమ్ - గడ్డిని, చరంత్యః - మేయుచున్న, గావః - ఆవులు, తతః - అక్కడనుండి, విదూరాత్ - చాల దూరమునుండి, ఉపవ్రజమ్ - గోకులమునకు దగ్గరగా, చరతః - మేయుచున్న, వత్సాన్ - దూడలను, దదృశుః - చూచినవి.

గోవర్ధనపర్వతశిఖరముపై గడ్డి మేయుచున్న ఆవులు అక్కడనుండి చాల దూరముగా గొల్లపల్లెకు దగ్గరలో మేయుచున్న దూడలను చూచినవి.

దృష్ట్వాఽథ తత్స్నేహవశోఽస్మృతాత్మా స గోవ్రజోఽత్యాత్మపదుర్గమార్గః,
ద్విపాత్కకుద్గ్రీవ ఉదాస్యపుచ్ఛోఽగాద్ధుంకృతైరాస్నుపయా జవేన ।।30

దృష్ట్వా - చూచి, అథ - వెంటనే, తత్-స్నేహవశః - ఆ దూడలయందలి ప్రేమకు వశమైనది, అస్మృత-ఆత్మా - మరువబడిన దేహము గలది, అతి-ఆత్మపదుర్గమార్గః - లెక్కచేయబడని తనను పాలించే గోపబాలకులు మరియు వెళ్ల శక్యము కాని మార్గము గలది, ద్విపాత్ - రెండు కాళ్లు గలది, కకుద్-గ్రీవః - మూపురమునందు మెడ గలది, ఉదాస్యపుచ్ఛః - పైకెత్తిన తోకలు తలలు గలది, ఆస్నుపయాః - అంతటా స్రవించుచున్న పాలు గలది అగు, సః - ఆ, గోవ్రజః - గోవుల సమూహము, హుంకృతైః - హుంకారములతో, జవేన - వేగముతో, అగాత్ - వెళ్లెను.

దూడలను చూచిన వెంటనే ఆ ఆవులు దూడలయందలి ప్రేమకు వశమై ఒళ్లు మరచి తమను పాలించే గోపబాలకులను, వెళ్ల శక్యము కాని దారిని కూడ లెక్క చేయకుండా వేగముగా పరుగెత్తినవి. అవి పరుగెత్తే వేగమునకు చూపరులకు రెండే కాళ్లు ఉన్నవా యనిపించును. అవి అంతటా పాలను స్రవిస్తూ హుంకరిస్తూ తోకలను తలలను పైకెత్తి పరుగెడుతూ ఉంటే మెడలు మూపురములోనికి సంకోచమును పొందినవి.

సమేత్య గావోఽధో వత్సాన్ వత్సవత్యోఽప్యపాయయన్ ।
గిలంత్య ఇవ చాంగాని లిహంత్యస్స్వౌధసం పయః ।। 31

అధః - క్రింద, వత్సాన్ - దూడలను, సమేత్య - చేరుకొని, వత్సవత్యః అపి - లేగలు (కొట్టమునందు) గల ఆవులు కూడ, అంగాని - అవయవములను, గిలంత్యః ఇవ - మ్రింగుచున్నవా యన్నట్లు, లిహంత్యః - ఆస్వాదించుచున్నవై, స్వ-ఔధసమ్ - తమ పొదుగులకు చెందిన, పయః - పాలను, అపాయయన్ - త్రాగించినవి.

అవి పర్వతమునకు క్రిందనున్న దూడలను చేరినవి. కొట్టములో లేగలున్న ఆవులు కూడ వాటికి తమ పొదుగులలోని పాలను త్రాగించినవి. అవి దూడలను మ్రింగివేయుచున్నవా యన్నట్లు ఆస్వాదించుచుండెను.

గోపాస్తద్రోధనాయాసమౌఘ్యలజ్జోరుమన్యునా ।
దుర్గాధ్వకృచ్ఛ్రతోఽభ్యేత్య గోవత్సైర్దదృశుస్సుతాన్ ॥ 32

గోపాః - గోపాలకులు, తద్-రోధన-ఆయాసమౌఘ్యలజ్జా-ఉరుమన్యునా - వాటిని ఆపుటవలని ఆయాసముయొక్క వ్యర్థత్వముచే కలిగిన సిగ్గుతో కూడిన అధికమగు కోపముతో, దుర్గ-అధ్వకృచ్ఛ్రతః - నడువ శక్యము కాని దారియందలి కష్టము వలన, అభ్యేత్య - వచ్చి, గోవత్సైః - ఆవులతో దూడలతో బాటు, సుతాన్ - పుత్రులను, దదృశుః - చూచిరి.

గోపాలకులు వాటిని ఆపే ప్రయత్నమును చేసి విఫలమైరి. దానితో వారికి సిగ్గుతో బాటు పెద్ద కోపము కలిగినది. పైగా, వారు నడువ శక్యము కాని మార్గమును కష్టముతో దాటి వచ్చిరి. వారికి ఆవులు, దూడలతో బాటు తమ పుత్రులు కూడ కనబడిరి.

తదీక్షణోత్ప్రేమరసాప్లుతాశయా
జాతానురాగా గతమన్యవోఽర్భకాన్ ।
ఉదుహ్య దోర్భిః పరిరభ్య మూర్ధని
ఘ్రాణైరవాపుః పరమాం ముదం తే ॥ 33

తద్-ఈక్షణ-ఉత్ప్రేమరస-ఆప్లుత-ఆశయాః - వారిని చూచుటచే ఉద్బుద్ధమైన ప్రేమరసముచే వ్యాప్తమైన హృదయములు గల, తే - వారు, జాత-అనురాగాః - కలిగిన అనురాగము గలవారు, గతమన్యవః - తొలగిన కోపము గలవారై, అర్భకాన్ - పిల్లలను, ఉదుహ్య - పైకెత్తుకొని, దోర్భిః - బాహువులతో, పరిరభ్య - కౌగిలించుకొని, మూర్ధని - నుదుటిపై, ఘ్రాణైః - ఆఘ్రాణించుటలచే, పరమామ్ - సర్వాతిశాయియగు, ముదమ్ - ఆనందమును, అవాపుః - పొందిరి.

తమ పుత్రులను చూచుటతోడనే ఆ గోపాలకుల హృదయములలో ప్రేమరసము ఉద్బుద్ధమై నింపివేసెను. వారి కోపము పోయి దాని

స్థానములో అనురాగము ఉదయించెను. వారు పిల్లలను పైకెత్తుకొని చేతులతో కౌగిలించుకొని పలుమార్లు నుదుటిపై ముద్దాడి సర్వోత్కృష్టమైన ఆనందముననుభవించిరి.

తతః ప్రవయసో గోపాస్తోకాశ్లేషసునిర్వృతాః ।
కృచ్ఛ్రాచ్ఛనైరపగతాస్తదనుస్మృత్యుదశ్రవః ॥ 34

తోక-ఆశ్లేషసునిర్వృతాః - పిల్లలను ఆలింగనము చేయుటచే మంచి సంతోషము కలిగిన, ప్రవయసః - పెద్ద వయసు గల, గోపాః - గోపాలకులు, కృచ్ఛ్రాత్ - కష్టము మీద, శనైః - మెల్లగా, తతః - అక్కడనుండి, అపగతాః - తొలగినవారు, తద్-అనుస్మృతి-ఉద్-అశ్రవః - వారి స్మరణముచే పెల్లుబికిన కన్నీరు గలవారు.

పెద్ద వయస్సు గల ఆ గోపాలకులకు పిల్లలను ఆలింగనము చేయుటచే మంచి సంతోషము కలిగినది. వారు కష్టము మీద మెల్లగా అక్కడనుండి నిష్క్రమించిరి. వారికి పిల్లలు గుర్తు వచ్చినప్పుడు కన్నీరు పెల్లుబుకుచుండెను.

వ్రజస్య రామః ప్రేమర్ద్ధేర్వీక్ష్యౌత్కంఠ్యమనుక్షణమ్ ।
ముక్తస్తనేష్వపత్యేష్వప్యహేతువిదచింతయత్ ॥ 35

ముక్తస్తనేషు - విడిచిపెట్టబడిన స్తనపానము గల, అపత్యేషు అపి - బాలకులయందు కూడ, వ్రజస్య - గోకులమునకు, అనుక్షణమ్ - ప్రతిక్షణము, ప్రేమ-ఋద్ధేః - ప్రేమయొక్క వృద్ధి వలన, ఔత్కంఠ్యమ్ - ఉత్కంఠస్వభావమును, వీక్ష్య - చూచి, అహేతువిత్ - కారణము తెలియని, రామః - బలరాముడు, అచింతయత్ - తలపోసెను.

గోకులములోని తల్లులకు, ఆవులకు స్తనపానమును విడిచిపెట్టిన సంతానముపై కూడ ప్రతిక్షణము ప్రేమ వర్ధిల్లెను. దాని వలన వారిలో పిల్లల గురించి ఉత్కంఠ పెరిగెను. దీనికి కారణము తెలియక బలరాముడిట్లు తలపోసెను.

కిమేతదద్భుతమివ వాసుదేవేఽఖిలాత్మని ।
వ్రజస్య సాత్మనస్తోకేష్వపూర్వం ప్రేమ వర్ధతే ॥ 36

అఖిల-ఆత్మని - సర్వమునకు ఆత్మరూపుడైన, వాసుదేవే ఇవ - వసుదేవపుత్రుడగు శ్రీకృష్ణునియందు వలె, స-ఆత్మనః - నాతో కూడిన, వ్రజస్య - గోకులమునకు, తోకేషు - పిల్లలయందు, అపూర్వమ్ - ఇదివరలో లేని, ప్రేమ - ప్రేమ, వర్ధతే - పెరుగుచున్నది, ఏతత్ - ఈ, అద్భుతమ్ - అద్భుతము, కిమ్ - ఏమి?

సకలప్రాణులకు ఆత్మరూపుడైన వసుదేవపుత్రుడగు శ్రీకృష్ణునియందు వలె, నాతో సహా గోకులమునకు పిల్లలపై, దూడలపై ప్రేమ పెరుగుచున్నది. ఇట్టి ప్రేమ ఇదివరలో లేదు. ఈ అద్భుతమేమి?

కేయం వా కుత ఆయాతా దైవీ వా నార్యుతాసురీ ।
ప్రాయో మాయాఽస్తు మే భర్తుర్నాన్యా మేఽపి విమోహినీ ॥ 37

ఇయమ్ - ఈ, మాయా - మాయ, కా - ఎట్టిది?, కుతః - ఎక్కడనుండి, ఆయాతా - వచ్చినది?, దైవీ వా - దేవతలచే ప్రయోగించబడినదియా?, నారీ - మానవులదా?, ఉత - లేక, ఆసురీ - రాక్షసులదా?, మే అపి - నాకు కూడ, విమోహినీ - మోహమును కలిగించే ఈ మాయ, ప్రాయః - బహుశః, మే - నా, భర్తుః - ప్రభువగు శ్రీహరికి చెందినది, అస్తు - కావచ్చును, అన్యా - ఇతరము, న - కాదు.

ఈ మాయ ఎట్టిది? ఎక్కడనుండి వచ్చినది? దీనిని ప్రయోగించినది దేవతలా? మానవులా? లేక రాక్షసులా? నన్ను కూడ వ్యామోహపెట్టే ఈ మాయ బహుశః నా ప్రభువగు శ్రీహరిది కావచ్చును. ఇతరము కాజాలదు.

ఇతి సంచింత్య దాశార్హో వత్సాన్ సవయసానపి ।
సర్వానాచష్ట వైకుంఠం చక్షుషా వయునేన సః ॥ 38

దాశార్హః - యాదవవంశీయుడగు, సః - ఆ బలరాముడు, ఇతి - ఈ విధముగా, సంచింత్య - బాగా ఆలోచించి, వయునేన - జ్ఞానరూపమగు, చక్షుషా - చూపుతో, వత్సాన్ - దూడలను, సవయసాన్ - తన తోడి వయస్సువారైన, సర్వాన్ అపి - అందరిని కూడ, వైకుంఠమ్ - శ్రీకృష్ణ భగవానునిగా, ఆచష్ట - చూచెను.

యాదవవంశీయుడగు బలరాముడు ఈ విధముగా బాగా ఆలోచించి జ్ఞానమయమగు చూపుతో చూచెను. ఆయనకు దూడలయందు, తన వయస్సువారైన బాలకులయందు కూడ శ్రీకృష్ణ భగవానుడే గోచరించెను.

నైతే సురేశా ఋషయో న చైతే
త్వమేవ భాసీశ భిదాశ్రయేఽపి ।
సర్వం పృథక్త్వం నిగమాత్కథం వదే-
త్యు క్తేన వృత్తం ప్రభుణా బలోఽవైత్ ॥ 39

ఈశ - ఓ ప్రభూ!, ఏతే - వీరు, సుర-ఈశాః - లోకపాలకులు, న - కారు, ఏతే - వీరు, ఋషయః చ - మహర్షులు కూడ, న - కారు, భిదాశ్రయే అపి - భేదమునకు ఆశ్రయమైన గోపాలకుల దూడల దేహమునందు కూడ, త్వం ఏవ - నీవే, భాసి - ప్రకాశించుచున్నావు, సర్వమ్ - సర్వము, త్వమ్ - నీవు, కథమ్ - ఎట్లు?, పృథక్ - తేడాగా, వద - చెప్పుము, ఇతి - అని, ఉక్తేన - పలుకబడిన శ్రీకృష్ణునిచే, నిగమాత్ - సంక్షేపముగా, వృత్తమ్ - జరిగినదానిని, బలః - బలరాముడు, అవైత్ - తెలుసుకొనెను.

ఓ ప్రభూ! వీరు లోకపాలకులు కారు, మహర్షులు కూడ కారు. భేదమునకు ఆశ్రయమైన గోపాలకుల మరియు దూడల దేహమునందు కూడ నీవు ప్రకాశించుచున్నావు. సర్వము నీవే ఎట్లు అయితివి? ఈ విషయములో గల వివేకమును చెప్పుము, అని బలరాముడు పలుకగా శ్రీకృష్ణుడు జరిగిన వృత్తాంతమును సంక్షేపముగా చెప్పెను. అప్పుడు బలరామునకు తెలిసెను.

తావదేత్యాత్మభూరాత్మమానేన త్రుట్యనేహసా ।
పురోవదబ్దం క్రీడంతం దదృశే సకలం హరిమ్ ॥ 40

తావత్ - అంతలో, ఆత్మభూః - స్వయంభువుడగు బ్రహ్మదేవుడు, ఆత్మమానేన - తన కాలమానముచే, త్రుటి-అనేహసా - క్షణమాత్రము కాలముచే, ఏత్య - వచ్చి, అబ్దమ్ - సంవత్సరకాలము నిరంతరముగా, పురః-వత్ - ఇదివరలో వలెనే, క్రీడంతమ్ - క్రీడించుచున్న, సకలమ్ - సర్వము అయిన, హరిమ్ - శ్రీకృష్ణ భగవానుని, దదృశే - చూచెను.

అంతలో స్వయంభువుడగు బ్రహ్మదేవుడు వచ్చెను. ఆయనకు తన కాలమానముచే ఒక్క క్షణము మాత్రమే గడచెను. ఆ సంవత్సరకాలము నిరంతరముగా తానే సర్వము అయి ఇదివరలో వలెనే క్రీడించుచున్న శ్రీకృష్ణ భగవానుని ఆయన చూచెను.

యావంతో గోకులే బాలాస్సవత్సాస్సర్వ ఏవ హి ।
మాయాశయే శయానా మే నాద్యాపి పునరుత్థితాః ।। 41

గోకులే - గోకులమునందు, యావంతః - ఎంతమంది, సవత్సాః - దూడలతో కూడిన, బాలాః - బాలురు గలరో, సర్వే ఏవ - అందరు కూడ, హి - నిశ్చయముగా, మే - నా, మాయాశయే - మాయామయమైన శయ్యయందు, శయానాః - నిద్రించుచున్నవారు, అద్య అపి - ఈ నాటికి కూడా, పునః - తిరిగి, ఉత్థితాః - లేచినవారు, న - కాదు.

గోకులమునందు దూడలు, బాలురు ఎందరు గలరో వారందరు నేను మాయాశక్తితో నిర్మించిన శయ్యపై నిద్రిస్తూనే ఉన్నారు. ఈ నాటికీ వారు నిద్ర లేవలేదు. ఇది నిశ్చయము.

ఇత ఏతేఽత్ర కుత్రత్యా మన్మాయామోహితేతరే ।
తావంత ఏవ తత్రాబ్దం క్రీడంతో విష్ణునా సమమ్ ।। 42

ఇతః - ఇక్కడ, ఏతే - వీరు, మత్-మాయామోహిత-ఇతరే - నా మాయచే స్పృహ తప్పి ఉన్నవారికంటె ఇతరులు, అత్ర - ఇక్కడ, కుత్రత్యాః - ఎక్కడనుండి వచ్చినవారు?, తావంతః ఏవ - అంతే మంది, తత్ర - అచట, అబ్దమ్ - సంవత్సర కాలము నిరంతరముగా, విష్ణునా సమమ్ - శ్రీకృష్ణ భగవానునితో గూడి, క్రీడంతః - క్రీడించుచున్నారు.

నా మాయచే స్పృహ తప్పి ఉన్న వారు వేరు. ఇక్కడ వీరు వేరు. అక్కడ ఇక్కడ సమానముగా ఉన్నారు. వీరు ఎక్కడనుండి వచ్చిరి? అంతే మంది ఇచట శ్రీకృష్ణ భగవానునితో బాటు క్రీడించుచున్నారే!

ఏవమేతేషు భేదేషు చిరం ధ్యాత్వా స ఆత్మభూః ।
సత్యాః కే కతరే నేతి జ్ఞాతుం నేష్టే కథంచన ।। 43

ఏవమ్ - ఈ విధముగా, ఏతేషు - ఈ, భేదేషు - వేరుగా కనబడే దూడలు మొదలగువాటియందు, చిరమ్ - చాల సేపు, ధ్యాత్వా - ఆలోచించి, ఆత్మభూః - స్వయంభువుడగు, సః - ఆ బ్రహ్మదేవుడు, కే - ఎవరు, సత్యాః - అసలైనవారు?, కతరే - ఇద్దరిలో ఎవరు, న - కాదు, ఇతి - అని, కథంచన - ఏ విధముగానైననూ, జ్ఞాతుమ్ - తెలియుటకు, న ఈష్టే - సమర్థుడు కాలేదు.

ఈ విధముగా వేర్వేరుగా కనబడే దూడలు మొదలగువాటి గురించి స్వయంభువుడగు ఆ బ్రహ్మదేవుడు చాల సేపు ఆలోచించెను. కాని, ఆ ఇద్దరిలో ఎవరు అసలైనవారు? ఎవరు కారు? అనే విషయమును ఆయన ఏ విధముగానైననూ తెలియలేకపోయెను.

ఏవం సంమోహయన్ విష్ణుం విమోహం విశ్వమోహనమ్ ।
స్వయైవ మాయయాఽజోఽపి స్వయమేవ విమోహితః ॥ 44

ఏవమ్ - ఈ విధముగా, విమోహమ్ - మోహము లేనట్టియు, విశ్వమోహనమ్ - జగత్తునకు వ్యామోహమును కలిగించే, విష్ణుమ్ - శ్రీకృష్ణ భగవానుని, స్వయా - తనదైన, మాయయా - మాయచే, సంమోహయన్ - మోహపెట్టువాడై, అజః అపి - పుట్టుక లేని బ్రహ్మదేవుడు కూడ, స్వయం ఏవ - తానే, విమోహితః - విశేషముగా మోహమును పొందెను.

మోహము లేని శ్రీకృష్ణ భగవానుని మాయ జగత్తును మోహపెట్టును. ఆయనను తన మాయచే మోహపెట్టబోయి బ్రహ్మదేవుడు పుట్టుక లేనివాడై కూడ తానే విశేషముగా మోహమును పొందెను.

తమ్యాం తమోవన్నైహారం ఖద్యోతార్చిరివాహని ।
మహతీతరమాయైశ్యం నిహంత్యాత్మని యుంజతః ॥ 45

తమ్యామ్ - చీకటి రాత్రియందు, నైహారమ్ - మంచు వలన కలిగే, తమః-వత్ - చీకటి వలె, అహని - పగలునందు, ఖద్యోత-అర్చిః ఇవ - మిణుగురు పురుగు కాంతి వలె, మహతి - గొప్పవానియందు, యుంజతః

- మాయను ప్రయోగించువానికి, ఇతరమాయా - తక్కువ శక్తి గల మాయ, ఆత్మని - తనయందలి, ఐశ్యమ్ - సామర్థ్యమును, నిహంతి - పోగొట్టును.

రాత్రియందలి చీకటిని మంచు వలన కలిగిన చీకటి ఏమీ చేయలేదు. పైగా దానిలో విలీనమగును. పగలు సూర్యకాంతిలో మిణుగురు పురుగుయొక్క ప్రకాశము ఉన్నట్లే తెలియదు. అదే విధముగా, మహాపురుషునియందు మాయను ప్రయోగించినచో, ఆ తక్కువ స్థాయికి చెందిన మాయ ప్రయోగించినవాని సామర్థ్యమునే మట్టుబెట్టును.

తావత్సర్వే వత్సపాలాః పశ్యతోఽజస్య తత్క్షణాత్ ।
వ్యదృశ్యంత ఘనశ్యామాః పీతకౌశేయవాససః ॥ 46

తావత్ - అంతలో, అజస్య - స్వయంభువుడగు బ్రహ్మదేవుడు, పశ్యతః - చూచుచుండగనే, సర్వే - అందరు, వత్సపాలాః - దూడలు గోపబాలురు, తత్క్షణాత్ - వెనువెంటనే, ఘనశ్యామాః - మేఘమువలె శ్యామలవర్ణము గలవారు, పీతకౌశేయవాససః - పచ్చని పట్టు వస్త్రమును దాల్చినవారుగా, వ్యదృశ్యంత - కానవచ్చిరి.

అంతలో బ్రహ్మదేవుడు చూచుచుండగనే వెనువెంటనే దూడలు, గోపబాలురు అందరు మేఘమువంటి శ్యామవర్ణముతో పచ్చని పట్టు వస్త్రములతో కానవచ్చిరి.

చతుర్భుజాశ్శంఖచక్రగదారాజీవపాణయః ।
కిరీటినః కుండలినో హారిణో వనమాలినః ॥ 47

చతుర్-భుజాః - నాలుగు చేతులు గలవారు, శంఖచక్రగదారాజీవ పాణయః - శంఖము చక్రము గద పద్మము చేతులయందు గలవారు, కిరీటినః - కిరీటము గలవారు, కుండలినః - కుండలములు గలవారు, హారిణః - హారము గలవారు, వనమాలినః - అడవి పూల మాల గలవారు.

వారు నాలుగు చేతులయందు శంఖము, చక్రము, గద, పద్మములను దాల్చి, కిరీటములను కుండలములను హారములను అడవి పూల మాలను ధరించియుండిరి.

శ్రీవత్సాంగదదోరత్నకంబుకంకణపాణయః ।
నూపురైః కటకైర్భాతాః కటిసూత్రాంగులీయకైః ॥ 48

శ్రీవత్స-అంగదదోరత్నకంబుకంకణపాణయః - శ్రీవత్సమనే పుట్టుమచ్చతో కూడిన బాహుపురులు గల భుజములు గలవారు రత్నములు పొదిగిన శంఖములవంటి కంకణములు చేతులయందు గలవారు, నూపురైః - కాలియందెలతో, కటకైః - కడియములతో, కటిసూత్ర-అంగులీయకైః - నడుము త్రాళ్లతో ఉంగరములతో, భాతాః - ప్రకాశించువారు.

వారు వక్షఃస్థలముపై శ్రీవత్సమనే పుట్టుమచ్చను, చేతులయందు బాహుపురులను, చేతులకు రత్నములు పొదిగి శంఖము వలె మూడు ధారలు గల కంకణములను, కాలియందెలను, కడియములను, నడుము త్రాళ్లను, ఉంగరములను ధరించి ప్రకాశించిరి.

ఆంఘ్రిమస్తకమాపూర్ణాస్తులసీనవదామభిః ।
కోమలైస్సర్వగాత్రేషు భూరిపుణ్యవదర్పితైః ॥ 49

భూరిపుణ్యవద్-అర్పితైః - గొప్ప పుణ్యాత్ములచే సమర్పించబడినట్టియు, కోమలైః - కోమలములైన, తులసీనవదామభిః - కొత్త తులసియొక్క మాలలతో, ఆ-అంఘ్రిమస్తకమ్ - పాదములనుండి తల వరకు, సర్వగాత్రేషు - అన్ని అవయవములయందు, ఆపూర్ణాః - అంతటా నిండియున్నవారు.

గొప్ప పుణ్యాత్ములు కోమలమైన కొత్త తులసియొక్క మాలలను సమర్పించగా, వారా మాలలను కాళ్లనుండి తలదాకా అంతటా అవయవములన్నింటియందు దాల్చిరి.

చంద్రికావిశదస్మేరైస్సారుణాపాంగవీక్షితైః ।
స్వకార్థానామివ రజస్సత్త్వాభ్యాం స్రష్టృపాలకాః ॥ 50

చంద్రికావిశదస్మేరైః - వెన్నెల వలె స్వచ్ఛమైన చిరునవ్వులతో, స-అరుణ-అపాంగవీక్షితైః - ఎఱ్ఱని ఓరచూపులతో కూడిన చూపులతో, రజః-సత్త్వాభ్యామ్ - రజోగుణసత్త్వగుణములతో, స్వక-అర్థానామ్ - తమ

భక్తుల మనోరథములకు, స్రష్టృపాలకాః ఇవ - సృష్టించువారు పాలించువారు వలె.

వారు రజోగుణము వంటి ఎర్రని ఓరచూపులు గల చూపులతో తమ భక్తుల ప్రయోజనములకు సృష్టికర్తలు వలె, సత్త్వగుణమువంటి వెన్నెల వలె స్వచ్ఛమైన చిరునగవులతో వాటిని పాలించువారు వలె నుండిరి.

ఆత్మాదిస్తంబపర్యంతైర్మూర్తిమద్భిశ్చరాచరైః ।
నృత్యగీతాద్యనేకార్హైః పృథక్ పృథగుపాసితాః ॥ 51

ఆత్మ-ఆదిస్తంబపర్యంతైః - బ్రహ్మదేవునితో మొదలిడి గడ్డిపోచ వరకు ఉండే, మూర్తిమద్భిః - దేహధారులైన, చర-అచరైః - కదిలే మరియు కదలని ప్రాణులచే, నృత్యగీత-ఆది-అనేక-అర్హైః - నాట్యము గానము మొదలైన అనేకములైన పూజావిధులతో, పృథక్ పృథక్ - వేర్వేరుగా, ఉపాసితాః - ఉపాసించబడువారు.

బ్రహ్మదేవునితో మొదలిడి గడ్డిపోచవరకు ఉండే కదిలే మరియు కదలని దేహధారులందరు నాట్యము, గానము మొదలైన పూజావిధులతో వారిని వేర్వేరుగా ఉపాసించుచున్నారు.

అణిమాద్యైర్మహిమభిరజాద్యాభిర్విభూతిభిః ।
చతుర్వింశతిభిస్తత్త్వైః పరీతా మహదాదిభిః ॥ 52

అణిమా-ఆద్యైః - అణిమ మొదలైన, మహిమభిః - సిద్ధులతో, అజా-ఆద్యాభిః - మాయాశక్తి మొదలైన, విభూతిభిః - శక్తులతో, మహద్-ఆదిభిః - మహత్తు మొదలైన, చతుర్వింశతిభిః - ఇరవై నాలుగు, తత్త్వైః - తత్త్వములతో, పరీతాః - చుట్టువారబడినవారు.

అణిమ (సూక్ష్మరూపమును పొందుట), లఘిమ (తేలిక యగుట), ప్రాప్తి (దేనినైననూ పొందగల్గుట), ప్రాకామ్యము (మొక్కవోని ఇచ్ఛాశక్తి), మహిమ (పెద్ద రూపమును పొందే శక్తి), ఈశిత్వము (శాసించే శక్తి), వశిత్వము (ఇంద్రియనిగ్రహము), కామావసాయిత (నిష్కామత్వము) అనే ఎనిమిది సిద్ధులు; మాయాశక్తి, క్రియాశక్తి మొదలైన శక్తులు; మహత్తు (సమష్టి బుద్ధి), సూత్రము (సమష్టి ప్రాణము), సమష్టి అహంకారము,

మనస్సు, కన్ను ముక్కు చెవి నాలుక చర్మము అనే ఐదు జ్ఞానేంద్రియములు, కాలు చేయి మాట విసర్జనేంద్రియము జననేంద్రియము అనే ఐదు కర్మేంద్రియములు, పృథివి జలములు అగ్ని వాయువు ఆకాశము అనే పంచభూతములు, శబ్దము స్పర్శ రూపము రసము గంధము అనే తన్మాత్రలు, వెరసి ఇరవై నాలుగు తత్త్వములు మూర్తులను దాల్చి వారిని చుట్టువారి యున్నవి.

కాలస్వభావసంస్కారకామకర్మగుణాదిభిః ।
స్వమహిధ్వస్తమహిభిర్మూర్తిమద్భిరుపాసితాః ॥ 53

స్వమహిధ్వస్తమహిభిః - తమ మహిమచే తిరస్కరించబడిన మహిమ కలిగినట్టియు, మూర్తిమద్భిః - రూపు దాల్చిన, కాలస్వభావసంస్కారకామ కర్మగుణ-ఆదిభిః - కాలము స్వభావము సంస్కారము కామనలు కర్మలు సత్త్వరజస్తమోగుణములు మొదలైనవాటిచే, ఉపాసితాః - ఉపాసించబడువారు.

కాలము, స్వభావము (పదార్థముల సహజధర్మము), (వాసనలకు మూలమునందుండే) సంస్కారము, కామనలు, కర్మలు (అదృష్టము), సత్త్వరజస్తమోగుణములు, పదార్థముల జాతి మొదలైనవి రూపు దాల్చి వారిని ఉపాసించెను. వారి ముందు వాటి మహిమ వెలవెల బోయెను.

సత్యజ్ఞానానంతానందమాత్రైకరసమూర్తయః ।
అస్పృష్టభూరిమాహాత్మ్యా అపి హ్యుపనిషద్దృశామ్ ॥ 54

సత్యజ్ఞాన-అనంత-ఆనందమాత్ర-ఏకరసమూర్తయః - పరిచ్ఛేద రహితమైన సత్య-జ్ఞాన-ఆనందస్వరూపము అనే ఒకే ఒక తత్త్వముయొక్క మూర్తులు, ఉపనిషద్-దృశాం అపి - ఉపనిషత్తుల విద్వాంసులకు కూడ, అస్పృష్టభూరిమాహాత్మ్యాః - స్పృశించబడని గొప్ప మహిమ గలవారు, హి - నిశ్చయము.

వారు పరిచ్ఛేదములు లేని సత్య-జ్ఞాన-ఆనందస్వరూపమనే ఒకే ఒక (చేతనజడవిభాగము లేని) తత్త్వముయొక్క మూర్తులు. ఉపనిషత్తుల

విద్వాంసులు కూడ వారి గొప్ప మహిమను తెలియజాలరు. ఇది నిశ్చితము.

ఏవం సకృద్దదర్శాజః పరబ్రహ్మాత్మనోఽఖిలాన్ ।
యస్య భాసా సర్వమిదం విభాతి సచరాచరమ్ ॥ 55

అజః - స్వయంభువుడగు బ్రహ్మదేవుడు, ఏవమ్ - ఈ విధముగా, అఖిలాన్ - అందరిని, సకృత్ - ఏకకాలమునందు, పరబ్రహ్మ-ఆత్మనః - పరబ్రహ్మరూపులనుగా, దదర్శ - చూచెను, యస్య - ఏ పరబ్రహ్మయొక్క, భాసా - చైతన్యప్రకాశముచే, సచర-అచరమ్ - కదిలే మరియు కదలని ప్రాణులతో కూడియున్న, ఇదమ్ - ఈ, సర్వమ్ - సర్వము, విభాతి - ప్రకాశించుచున్నదో.

ఈ విధముగా స్వయంభువుడగు బ్రహ్మదేవునకు గోపబాలకులు, గోవులు అన్నీ ఏకకాలమునందు పరబ్రహ్మ (శ్రీకృష్ణ) రూపులుగా కనబడిరి. కదిలే మరియు కదలని ప్రాణులతో నిండియున్న ఈ జగత్తంతా ఆ పరబ్రహ్మయొక్క చైతన్యప్రకాశము చేతనే ప్రకాశించుచున్నది.

తతోఽతికుతుకోద్వృత్తస్తిమితైకాదశేంద్రియః ।
తద్ధామ్నాఽభూదజస్తూష్ణీం పూర్దేవ్యంతీవ పుత్రికా ॥ 56

తతః - తరువాత, తద్-ధామ్నా - వారి తేజస్సుచే, అతికుతుక-ఉద్వృత్తస్తిమిత-ఏకాదశ-ఇంద్రియః - అతిశయించిన ఆశ్చర్యముచే అలజడి చెంది స్తబ్ధములైన పదకొండు ఇంద్రియములు గల, అజః - స్వయంభువుడగు బ్రహ్మదేవుడు, పూః-దేవీ- అంతి - గోకులమునకు అధిష్ఠాత్రియగు దేవియొక్క సమీపమునందలి, పుత్రికా ఇవ - బొమ్మ వలె, తూష్ణీం అభూత్ - మిన్నకుండెను.

అప్పుడు వారి తేజస్సుచే స్వయంభువుడగు బ్రహ్మదేవుని పదకొండు ఇంద్రియములు (ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, మనస్సు) అతిశయించిన ఆశ్చర్యముచే అలజడి పొంది స్తబ్ధములైనవి. గోకులాధిష్ఠాత్రియగు దేవత వద్దనుండే బొమ్మవలె ఆయన మిన్నకుండెను.

ఇతీరే శేఽతర్క్యే నిజమహిమని స్వప్రమితికే
పరత్రాజాతోఽతన్నిరసనముఖబ్రహ్మకమితౌ ।
అనీశేఽపి ద్రష్టుం కిమిదమితి వా ముహ్యతి సతి
చఛాదాజో జ్ఞాత్వా సపది పరమోఽజాజవనికామ్ ॥ 57

ఇతి - ఈ విధముగా, అతర్క్యే - తర్కమునకు అందనట్టియు, నిజమహిమని - అసాధారణమైన మహిమ కలిగినట్టియు, స్వప్రమితికే - స్వప్రకాశానందస్వరూపమైనట్టియు, అజాతః - పుట్టుక లేని మాయాశక్తికంటె, పరత్ర - అతీతమైనట్టియు, అతత్-నిరసనముఖబ్రహ్మకమితౌ - అది కానిదానిని నిషేధించుట అనే ప్రక్రియ ద్వారా వేదాంతములచే ప్రతిపాదించబడే పరబ్రహ్మవిషయమునందు, ద్రష్టుమ్ - దర్శించుటకు, ఈరా-ఈశే అపి - సరస్వతీప్రభుడగు బ్రహ్మదేవుడు కూడ, అనీశే - అసమర్థుడు కాగా, వా - లేదా, ఇదమ్ - ఇది, కిమ్ - ఏమి?, ఇతి - అని, ముహ్యతి సతి - మోహమును పొందుచుండగా, అజః - పుట్టుక లేనివాడు, పరమః - పరబ్రహ్మయగు శ్రీకృష్ణుడు, జ్ఞాత్వా - తెలుసుకొని, సపది - వెంటనే, అజాజవనికామ్ - పుట్టుక లేని మాయ అనే తెరను, చఛాద - తప్పించెను.

అసాధారణమగు మహిమ గల పరబ్రహ్మ తర్కమునకు గోచరము కాదు. స్వప్రకాశానందస్వరూపమైన పరబ్రహ్మ పుట్టుక లేని మాయాశక్తికంటె అతీతమైనది. ఉపనిషత్తులు పరబ్రహ్మకంటె విలక్షణమైన అసత్ ను నిషేధించుట ద్వారా పరబ్రహ్మను ప్రతిపాదించును. అట్టి పరబ్రహ్మను తెలియుట సరస్వతీనాథుడగు బ్రహ్మదేవునకు కూడ చేత కాలేదు. ఇది యేమి? అని ఆయన మోహితుడు కాగా, పుట్టుక లేని శ్రీకృష్ణ పరబ్రహ్మ వెంటనే పుట్టుక లేని మాయ అనే తెరను తప్పించెను.

తతోఽర్వాక్ప్రతిలబ్ధాక్షః కః పరేతవదుత్థితః ।
కృచ్ఛ్రాదున్మీల్య వై దృష్టీరాచష్టేదం సహాత్మనా ॥ 58

తతః - అందువలన, అర్వాక్ - బయట, ప్రతిలబ్ధ-అక్షః - తిరిగి పొందబడిన చూపు గల, కః - బ్రహ్మదేవుడు, పరేతవత్ - శవము వలె, ఉత్థితః - లేచి నిలబడినవాడై, కృచ్ఛ్రాత్ - కష్టము మీద, దృష్టీః -

కనులను, ఉన్మీల్య - తెరచి, ఆత్మనా సహ - తనతో బాటుగా, ఇదం వై - ఈ జగత్తునైతే, అచష్ట - చూచెను.

శ్రీకృష్ణుడు మాయను తొలగించుట వలన బ్రహ్మదేవునకు బాహ్యదృష్టి తిరిగి కలిగినది. ఆయన శవము వలె లేచి నిలబడి కష్టముగా కన్నులను తెరచి తనను, ఈ జగత్తును కూడ చూచెను.

సపద్యేవాభితః పశ్యన్ దిశోऽపశ్యత్పురః స్థితమ్ ।
బృందావనం జనాజీవ్యద్రుమాకీర్ణం సమాప్రియమ్ ॥ 59

సపది ఏవ - వెనువెంటనే, అభితః - చుట్టూ, దిశః - దిక్కులను, పశ్యన్ - చూచువాడై, పురతః - ఎదుట, స్థితమ్ - ఉన్నట్టియు, జన-ఆజీవ్యద్రుమ-ఆకీర్ణమ్ - జనులకు బ్రదుకు దెరువును కల్పించే చెట్లతో దట్టముగా ఉన్నట్టియు, సమాప్రియమ్ - మాధవునితో కూడియున్న, బృందావనమ్ - బృందావనమును, అపశ్యత్ - చూచెను.

వెనువెంటనే చుట్టూ దిక్కులను చూచుచున్న బ్రహ్మదేవునకు ఎదురుగానున్న బృందావనము కనబడెను. జనులకు బ్రదుకు దెరువును కల్పించే చెట్లతో దట్టముగానున్న ఆ బృందావనము లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుని నివాసస్థానము.

యత్ర నైసర్గదుర్వైరాస్సహాసన్నృమృగాదయః ।
మిత్రాణీవాజితావాసద్రుతరుట్తర్షకాదికమ్ ॥ 60

యత్ర - ఎక్కడనైతే, నైసర్గదుర్వైరాః - సహజసిద్ధమైన నివారించ శక్యము కాని వైరము గల, నృమృగ-ఆదయః - మానవులు పశువులు మొదలైన ప్రాణులు, మిత్రాణి ఇవ - మిత్రులు వలె, సహ - కలిసి, ఆసన్ - ఉండెనో, అజిత-ఆవాసద్రుతరుట్-తర్షణ-ఆదికమ్ - అపరాజితుడగు శ్రీకృష్ణ భగవానుడు నివసించుటచే పారిపోవునట్లు చేయబడిన కోపము లోభము మొదలైనవి గలదియో.

సహజసిద్ధమైన నివారించ శక్యము కాని వైరము గల మానవులు, పెద్ద పులి మొదలగు క్రూరజంతువులు కూడ బృందావనమునందు కలిసి

మిత్రులు వలె జీవించును. అది శ్రీకృష్ణ భగవానుని నివాసస్థానమగుటచే అచటనుండి క్రోధము, లోభము, భయము మొదలైనవి పారిపోయినవి.

తత్రోద్వహత్పశుపవంశశిశుత్వనాట్యం
బ్రహ్మాద్వయం పరమనంతమగాధబోధమ్ ।
వత్సాన్ సఖీనివ పురా పరితో విచిన్వ-
దేకం సపాణికవలం పరమేష్ఠ్యచష్ట ॥ 61

తత్ర - అచట, పరమేష్ఠీ - సకలజగన్నాథుడగు బ్రహ్మదేవుడు, పురా ఇవ - ఇదివరలో వలెనే, పశుపవంశశిశుత్వనాట్యమ్ - గోపాలకుల వంశములోని పిల్లవానివలె నటించుటను, ఉద్వహత్ - కలిగియున్నట్టియు, అద్వయమ్ - రెండవది లేనట్టియు, పరమ్ - ప్రకృతికి అతీతమైనట్టియు, అనంతమ్ - వినాశము లేనట్టియు, అగాధబోధమ్ - హద్దులు లేని జ్ఞానమే స్వరూపముగా కలిగినట్టియు, వత్సాన్ - దూడలను, సఖీన్ - మిత్రులను, పరితః - చుట్టూ, విచిన్వత్ - వెదుకుచున్నట్టియు, ఏకమ్ - ఒక్కడైనట్టియు, సపాణికవలమ్ - అన్నపు ముద్ద గల చేతితో కూడిన, బ్రహ్మ - పరబ్రహ్మను, అచష్ట - చూచెను.

ఆ బృందావనమునందు సకలజగన్నాథుడగు బ్రహ్మదేవుడు ఇదివరలో వలెనే గోపాలకుల వంశములోని పిల్లవానివలె నటించుచున్న అవినాశి పరబ్రహ్మను చూచెను. రెండవది లేనిది, సర్వజ్ఞము అగు ఆ పరబ్రహ్మ శ్రీకృష్ణ రూపములో ఒంటరిగా ఇదివరలో వలెనే చేతిలో అన్నపు ముద్దను కలిగియుండెను. ప్రకృతికి అతీతమైన ఆ పరబ్రహ్మ దూడలను, మిత్రులైన గోపబాలకులను చుట్టూ వెదుకుచుండెను.

దృష్ట్వా త్వరేణ నిజధోరణతోఽవతీర్య
పృథ్వ్యాం వపుః కనకదండమివాభిపాత్య ।
స్పృష్ట్వా చతుర్ముకుటకోటిభిరంఘ్రియుగ్మం
నత్వా ముదశ్రుసుజలైరకృతాభిషేకమ్ ॥ 62

**దృష్ట్వా - చూచి, త్వరేణ - వేగముతో, నిజధోరణతః - తన వాహనమునుండి, అవతీర్య - దిగి, పృథ్వ్యామ్ - నేలపై, వపుః -**

దేహమును, కనకదండం ఇవ - బంగరు దండమును వలె, అభిపాత్య - పారవేసి, చతుర్-ముకుటకోటిభిః - నాలుగు కిరీటముల కొనలతో, అంఘ్రియుగ్మమ్ - పాదముల జంటను, స్పృష్ట్వా - స్పృశించి, నత్వా - నమస్కరించి, ముద్-అశ్రుసుజలైః - ఆనందము వలన స్రవించే కన్నీరు అనే మంచి జలములతో, అభిషేకమ్ - అభిషేకమును, అకృత - చేసెను.

బ్రహ్మదేవుడు శ్రీకృష్ణుని చూచి వెంటనే తన హంసవాహనమునుండి దిగి, బంగరు దండమువంటి దేహము నేలపై పడునట్లుగా సాష్టాంగనమస్కారమును చేసెను. ఆయన శ్రీకృష్ణుని రెండు పాదములకు తన నాలుగు కిరీటముల కొనలు తగులునట్లుగా నమస్కరించి, ఆనందముతో స్రవించే కన్నీరే దివ్యజలములు కాగా అభిషేకించెను.

ఉత్థాయోత్థాయ కృష్ణస్య చిరస్య పాదయోః పతన్ ।
ఆస్తే మహిత్వం ప్రాగ్దృష్టం స్మృత్వా స్మృత్వా పునః పునః ।।63

ప్రాక్ - ఇదివరలో, దృష్టమ్ - చూడబడిన, కృష్ణస్య - శ్రీకృష్ణుని, మహిత్వమ్ - మహిమను, స్మృత్వా స్మృత్వా - పలుమార్లు తలచుకొని, పునః పునః - మరల మరల, ఉత్థాయ ఉత్థాయ - లేచి లేచి, చిరస్య - చాలసేపు, పాదయోః - రెండు పాదములయందు, పతన్ - పడుచున్నవాడై, ఆస్తే - ఉండెను.

ఇదివరలో తాను చూచిన శ్రీకృష్ణుని మహిమను బ్రహ్మదేవుడు పలుమార్లు తలచుకొనుచుండెను. ఆయన చాల సేపు మరల మరల లేచి లేచి ఆయన రెండు కాళ్లపై పడుతూ ఉండెను.

**శనైరథోత్థాయ విమృజ్య లోచనే ముకుందముద్వీక్ష్య వినమ్రకంధరః ।**
**కృతాంజలిః ప్రశ్రయవాన్సమాహితస్సవేపథుర్గద్గదయైలతేలయా ।।64**

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే**
**పూర్వార్ధే త్రయోదశోఽధ్యాయః ।।**

**అథ - తరువాత, శనైః - మెల్లగా, ఉత్థాయ - పైకి లేచి, లోచనే - రెండు కళ్లను, విమృజ్య - తుడుచుకొని, ముకుందమ్ - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని, ఉద్వీక్ష్య - తల పైకెత్తి చూచి,**

వినమ్రకంధరః వంగిన మెడ గలవాడు, కృత-అంజలిః - దోసిలి యొగ్గినవాడు, ప్రశ్రయవాన్ వినయము గలవాడు, సమాహితః - ఏకాగ్రచిత్తము గలవాడు, సవేపథుః - వణుకుతో కూడినవాడు, గద్గదయా - బొంగురువోయిన, ఇలయా - వాక్కుతో, ఐలత - స్తుతించెను.

తరువాత బ్రహ్మదేవుడు మెల్లగా పైకి లేచి కళ్లను తుడుచుకొని మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని తల పైకెత్తి చూచెను. ఆ బ్రహ్మదేవుడు వినయముతో తలను వంచి దోసిలి యొగ్గి కొద్దిగా వణుకుతూ ఏకాగ్రచిత్తము గలవాడై బొంగురువోయిన కంఠముతో స్తుతించెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్ధములో బ్రహ్మదేవుడు వ్యామోహమును పొందుటను
వర్ణించే పదమూడవ అధ్యాయము ముగిసినది (13).



# అథ చతుర్దశోఽధ్యాయః

## బ్రహ్మ స్తుతి

బ్రహ్మోవాచ ।
నౌమీడ్య తేఽభ్రవపుషే తడిదంబరాయ
గుంజావతంసపరిపిచ్ఛలసన్ముఖాయ ।
వన్యస్రజే కవలవేత్రవిషాణవేణు-
లక్ష్మశ్రియే మృదుపదే పశుపాంగజాయ ॥ 1

ఈడ్య - ఓ కొనియాడ దగినవాడా!, అభ్రవపుషే - మేఘము వంటి దేహము కలిగినట్టియు, తడిద్-అంబరాయ - మెరుపు వంటి వస్త్రము కలిగినట్టియు, గుంజా-అవతంసపరిపిచ్ఛలసత్-ముఖాయ - గురివింద గింజల కర్ణాభరణముతో చుట్టూ నెమలి పింఛములతో ప్రకాశించే ముఖము కలిగినట్టియు, వన్యస్రజే - అడవి పువ్వుల మాల కలిగినట్టియు, కవలవేత్రవిషాణవేణులక్ష్మశ్రియే - అన్నపు ముద్ద బెత్తము కొమ్ము బూరా పిల్లన గ్రోవి శ్రీవత్సమనే పుట్టుమచ్చల శోభ కలిగినట్టియు, మృదుపదే - మృదువైన పాదములు కలిగినట్టియు, పశుప-అంగజాయ - గోపాలకుడగు నందుని పుత్రుడగు, తే - నీ కొరకు, నౌమి - నమస్కరించుచున్నాను.

ఓ దేవా! కొనియాడదగినవాడవు నీవే. మేఘమువంటి దేహము గల నీవు మెరుపువంటి వస్త్రమును దాల్చితివి. నీ ముఖము గురివింద గింజల కర్ణాభరణములతో, చుట్టూ నెమలి పింఛములతో శోభిల్లుచున్నది. అడవి పువ్వుల మాలను వేసుకున్న నీవు చేతిలో అన్నపు ముద్దను, బెత్తమును, కొమ్ము బూరాను, పిల్లన గ్రోవిని పట్టుకున్నావు. నీ వక్షఃస్థలము పుట్టుమచ్చతో ప్రకాశించుచున్నది. గోపాలకుడగు నందుని పుత్రుడవైన నీ పాదములు మృదువైనవి. నీకు నమస్కారము.

అస్యాపి దేవ వపుషో మదనుగ్రహస్య
స్వేచ్ఛామయస్య న తు భూతమయస్య కోఽపి ।
నేశే మహి త్వవసితుం మనసాఽఽంతరేణ
సాక్షాత్తవైవ కిముతాత్మసుఖానుభూతేః ।। 2

దేవ - ఓ దేవా!, మద్-అనుగ్రహస్య - నన్ను అనుగ్రహించునట్టియు, స్వ-ఇచ్ఛామయస్య - స్వేచ్ఛ (భక్తుల ఇచ్ఛ) చే ప్రకటితమైనట్టియు, న తు భూతమయస్య - కానైతే భౌతికము కాని, అస్య - ఈ, వపుషః - అవతారముయొక్క, మహి అపి - మహిమను కూడ, కః అపి - బ్రహ్మదేవుడనే ఐననూ (ఎవ్వడైననూ), ఆంతరేణ - అంతర్ముఖమైన, మనసా అపి - మనస్సుచేనైననూ, అవసితుమ్ - తెలియుటకు, న ఈశే - సమర్థుడను కాను (సమర్థుడు కాడు), సాక్షాత్ - సాక్షాత్తుగా, ఆత్మసుఖ-అనుభూతేః - సచ్చిద్రూపమగు ఆనందముయొక్క అనుభవమే స్వరూపముగా గల, తవ - నీ, మహి తు - మహిమనైతే, కిం ఉత - ఇక చెప్పునదేమున్నది?

ఓ దేవా! భక్తుల ఇచ్ఛననుసరించి స్వేచ్ఛచే ప్రకటితమైన ఈ నీ అవతారము భౌతికము (ప్రాకృతము) కాదు. నన్ను అనుగ్రహించే ఈ నీ దేహముయొక్క మహిమనైననూ బ్రహ్మదేవుడనగు నేనైననూ, లేదా ఎవరైననూ, అంతర్ముఖమగు మనస్సుతోనైననూ తెలియజాలరు. సాక్షాత్తుగా అద్వయపరబ్రహ్మవగు నీయొక్క సచ్చిదానందానుభూతియొక్క మహిమ గురించి చెప్పునదేమున్నది?

జ్ఞానే ప్రయాసముదపాస్య నమంత ఏవ
జీవంతి సన్ముఖరితాం భవదీయవార్తామ్ ।
స్థానే స్థితాశ్శ్రుతిగతాం తనువాఙ్మనోభిః
యే ప్రాయశోఽజిత జితోఽప్యసి తైస్త్రిలోక్యామ్ ।। 3

అజిత - ఓ పరాజయము లేనివాడా!, జ్ఞానే - జ్ఞానమునందు, ప్రయాసమ్ - ప్రయాసను, ఉదపాస్య - దూరముగా పెట్టి, స్థానే - (తమ) స్థానమునందు, స్థితాః - ఉన్నవారై, సత్-ముఖరితామ్ - సత్పురుషులచే గానము చేయబడినట్టియు, శ్రుతిగతామ్ - చెవిని పడిన, భవదీయవార్తామ్

- నీకు చెందిన గాథను, యే - ఎవరైతే, తనువాక్-మనోభిః - దేహము వాక్కు మనస్సులతో, నమంతః - సత్కరించువారై, జీవంతి - జీవించెదరో, తైః - వారిచే, ప్రాయశః - బహుశః, త్రిలోక్యామ్ - ముల్లోకములయందు, జితః అపి - జయించబడినవాడవే, అసి - అగుదువు.

ఓ దేవా! నీకు పరాజయము లేదు. ఐననూ, ఎవరైతే తమ స్థానమునందున్నవారై సత్పురుషులచే గానము చేయబడి తమ చెవిన పడిన నీ గాథను మనోవాక్కాయములతో సత్కరిస్తూ జీవించెదరో, వారు ఈ మూడు లోకములలో బహుశః నిన్ను కూడ జయించెదరు (పొందెదరు). వారు జ్ఞానమునందలి ప్రయాసను దూరముగా నుంచెదరు.

శ్రేయస్స్రుతిం భక్తిముదస్య తే విభో క్లిశ్యంతి యే కేవలబోధలబ్ధయే।
తేషామసౌ క్లేశల ఏవ శిష్యతే నాన్యద్యథా స్థూలతుషావఘాతినామ్॥4

విభో - ఓ ప్రభూ!, యే - ఎవరైతే, శ్రేయః-స్రుతిమ్ - శ్రేయస్సులను స్రవించే, భక్తిమ్ - భక్తిని, ఉదస్య - విడిచిపెట్టి, కేవలబోధలబ్ధయే - కేవలమగు జ్ఞానమును పొందుట కొరకై, క్లిశ్యంతి - కష్టపడెదరో, తేషామ్ - వారికి, స్థూలతుష-అవఘాతినాం యథా - దొడ్డైన ఊకలను దంచువారికి వలె, అసౌ - ఇది, క్లేశలః ఏవ - కష్టమును మాత్రమే ఇచ్చునదిగా, శిష్యతే - మిగులును, అన్యత్ - మరియొకటి, న - కాదు.

ఓ ప్రభూ! దొడ్డుగా ఉన్న ఊకలను దంచువారికి మిగిలేది క్లేశము మాత్రమే. అదే విధముగా శ్రేయస్సులను ప్రవాహముగా ఇచ్చే నీ భక్తిని విడిచిపెట్టి ఎవరైతే కేవల (భక్తి లేని, శుష్క) జ్ఞానముకొరకు కష్టపడెదరో, వారికి మిగిలేది క్లేశమే గాని, మరియొకటి కాదు.

పురేహ భూమన్ బహవోఽపి యోగినః
త్వదర్పితేహా నిజకర్మలబ్ధయా ।
విబుధ్య భక్త్యైవ కథోపనీతయా
ప్రపేదిరేఽంజోఽచ్యుత తే గతిం పరామ్ ॥ 5

భూమన్ - ఓ అనంతా!, అచ్యుత - ఓ అచ్యుతా!, ఇహ - ఈ లోకమునందు, పురా - పూర్వము, బహవః - అనేకులు, యోగినః అపి - యోగులు కూడ, త్వద్-అర్పిత-ఈహాః - నీయందు సమర్పించబడిన కర్మలు గలవారై, నిజకర్మలబ్ధయా - తమ కర్మల వలన పొందబడినట్టియు, కథా-ఉపనీతయా - గాథల వలన నీ సమీపమునకు కొనిరాబడిన, భక్త్యా ఏవ - భక్తితోనే, అంజః - తేలికగా, తే - నీ, పరామ్ - సర్వోత్కృష్టమగు, గతిమ్ - తత్త్వమును, విబుధ్య - తెలుసుకొని, ప్రపేదిరే - పొందిరి.

ఓ అనంతా! నీవు స్వరూపమునుండి చ్యుతి లేనివాడవు. ఈ లోకములో పూర్వము అనేకయోగులు కూడ తమ కర్మలను నీయందు సమర్పించి తద్ద్వారా చిత్తశుద్ధిని పొందిరి. వారు నీ గాథలను శ్రవణము చేసి భక్తితో నీకు దగ్గర ఐరి. ఆ భక్తితోనే వారు నీ సర్వోత్కృష్టమగు తత్త్వమును తేలికగా తెలుసుకొని మోక్షమును పొందిరి.

తథాఽపి భూమన్మహిమాఽగుణస్య తే
   విబోద్ధుమర్హత్యమలాంతరాత్మభిః ।
అవిక్రియాత్స్వానుభవాదరూపతో
   హ్యనన్యబోధ్యాత్మతయా న చాన్యథా ॥ 6

భూమన్ - ఓ అనంతా!, తథా అపి - ఐనప్పటికీ, అగుణస్య - నిర్గుణుడవగు, తే - నీ, మహిమా - మహిమ, అమల-అంతః-ఆత్మభిః - నిర్మలమగు అంతఃకరణము గలవారిచే, అవిక్రియాత్ - వికారము లేనట్టియు (విశిష్టవృత్తిరూపము కాని), అరూపతః - రూపము విషయము కాని, స్వ-అనుభవాత్ - తమ అనుభవమును బట్టి, అనన్యబోధ్య-ఆత్మతయా - ఇతరములచే తెలియబడని ఆత్మరూపముగా, విబోద్ధుమ్ - తెలియుటకు, అర్హతి - తగును, అన్యథా - మరియొక విధముగా, న చ - కానే కాదు.

ఓ అనంతా! ఐనప్పటికీ నిర్మలమగు అంతఃకరణము గలవారు నిర్గుణుడవగు నీ మహిమను ఇంద్రియములు-మనస్సు మొదలగువాటిచే తెలియబడని ఆత్మరూపముగా తెలియుట సంభవమే. ఆ జ్ఞానము

అఖండమే గాని తనకంటె భిన్నమైన ఘటాది రూపము విషయముగా గల జ్ఞానమువంటిది కాదు. మనోవికారము కాని ఆ జ్ఞానము స్వానుభవరూపమే గాని మరియొకటి కాదు.

గుణాత్మనస్తేఽపి గుణాన్ విమాతుం హితావతీర్ణస్య క ఈశిరేఽస్య,
కాలేన యైర్వా విమితాస్సుకల్పైర్భూపాంసవః ఖే మిహికా ద్యుభాసః।

గుణ-ఆత్మనః అపి - గుణములకు అధిష్ఠాతవే అయినా, అస్య - ఈ జగత్తుయొక్క, హిత-అవతీర్ణస్య - హితము కొరకు అవతరించిన, తే - నీయొక్క, గుణాన్ - గుణములను, విమాతుమ్ - లెక్కించుటకు, కే - ఎవరు, ఈశిరే - సమర్థులగుదురు?, సుకల్పైః - మంచి నిపుణులైన, యైః - ఎవరిచేనైతే, కాలేన - కాలముచే, భూపాంసవః - భూమియందలి రేణువులు, ఖే - ఆకాశమునందలి, మిహికాః - మంచు కణములు, ద్యుభాసః వా - ద్యులోకమునందు ప్రకాశించే నక్షత్రాదులు గాని, విమితాః - లెక్కించబడినవో. 7

గుణములకు అధిష్ఠాతవగు నీవు గుణాతీతుడవే అయినా, ఈ లోకముయొక్క హితము కొరకు అవతరించెదవు (గుణములు గలవాడవు అగుదువు). నిపుణులైన వ్యక్తులు చాల కాలము పని చేసి భూమియందలి రేణువులను, ఆకాశమునందలి మంచు కణములను, లేదా ద్యులోకమునందలి నక్షత్రాదులను లెక్కించవచ్చును. కాని, అట్టి నీ గుణములను లెక్కించే సామర్థ్యము ఎవరికి గలదు? (ఎవరికైననూ లేదు).

తత్తేఽనుకంపాం సుసమీక్షమాణో భుంజాన ఏవాత్మకృతం విపాకమ్,
హృద్వాగ్వపుర్భిర్విదధన్నమస్తే జీవేత యో ముక్తిపదే స దాయభాక్।

తత్ - అందువలన, యః - ఎవడైతే, తే - నీ, అనుకంపామ్ - కృపను, సుసమీక్షమాణః - పూర్తిగా ఎదురు చూచువాడై, ఆత్మకృతమ్ - తనచే సంపాదించబడిన, విపాకమ్ - కర్మఫలమును, భుంజానః ఏవ - అనుభవిస్తూనే ఉన్నవాడై, హృద్-వాగ్-వపుర్భిః - మనోవాక్కాయములతో, తే - నీ కొరకు, నమః - నమస్కారమును, విదధత్ - చేయువాడై, జీవేత -

జీవించునో, సః - అట్టివాడు, ముక్తిపదే - మోక్షమనే ఫలమునందు, దాయభాక్ - వాటా గలవాడు. 8

అందువలన ఎవడైతే ప్రతిక్షణము నీ కృప కొరకు ఎదురు చూస్తూ పూర్వకర్మార్జితమైన సుఖదుఃఖములను అనుభవిస్తూనే, మనోవాక్కాయములతో నీకు తనను సమర్పించుకొని జీవించునో, అట్టివాడు మోక్షఫలమునందు -- తండ్రి ఆస్తిలో కొడుకు వలె -- వాటా గలవాడగును.

పశ్యేశ మేఽనార్యమనంత ఆద్యే
పరాత్మని త్వయ్యపి మాయిమాయిని ।
మాయాం వితత్యేక్షితుమాత్మ వైభవం
హ్యహం కియానైచ్ఛమివార్చిరగ్నౌ ।। 9

ఈశ - ఓ ఈశ్వరా!, మే - నా, అనార్యమ్ - దౌర్జన్యమును, పశ్య - చూడుము. అనంతే - వినాశము లేనట్టియు, ఆద్యే - సర్వకారణుడవైనట్టియు, పర-ఆత్మని - ప్రకృతికి అతీతమగు ఆత్మరూపుడవైనట్టియు, మాయిమాయిని - మాయావులకు మాయావి యైన, త్వయి అపి - నీయందు కూడ, మాయామ్ - మాయను, వితత్య ప్రసరింపజేసి, ఆత్మ వైభవమ్ - నా ప్రభావమును, ఈక్షితుమ్ - చూచుటకు, ఐచ్ఛమ్ - కోరితిని, అగ్నౌ - అగ్నియందు, అర్చిః ఇవ - జ్వాల వలె, అహమ్ - నేను, కియాన్ హి - ఎంతటివాడను?

ఓ ఈశ్వరా! నా దౌర్జన్యమును చూడుము. నీవు అనంతుడవు, సర్వకారణుడవు, మాయావులకు మాయావివి. పరమాత్మవగు అట్టి నీయందు నేను మాయను ప్రసరింపజేసి నా ప్రభావమును చూడగోరితిని. అగ్నిలో జ్వాల వలె నీయందు నేనెంత? (నీముందు నేనేమీ కాదు).

అతః క్షమస్వాచ్యుత మే రజోభువో హ్యజానతస్త్వత్పృథగీశమానినః ।
అజావలేపాంధతమోఽంధచక్షుష ఏషోఽనుకంప్యో మయి నాథవానితి ।।

అచ్యుత - ఓ అచ్యుతా!, అతః - ఇందువలన, రజః-భువః - రజోగుణమునుండి పుట్టినట్టియు, అజానతః - తెలియనట్టియు,

త్వత్-పృథగ్-ఈశమానినః - నీకంటె వేరుగా ప్రభుడననే అహంకారము కలిగినట్టియు, అజ-అవలేప-అంధతమః-అంధచక్షుషః - అనాదియగు మాయతోడి సంబంధము వలన (స్వయంభువుడననే గర్వము వలన) కలిగిన గాఢమైన అజ్ఞానముచే గ్రుడ్డియగు (వివేకము కోల్పోయిన) చూపు (అంతఃకరణము) గల, మే - నాకు, క్షమస్వ - క్షమించుము, మయి - నేనుండగా, నాథవాన్ - నాథుడు గల, ఏషః - ఈతడు, అనుకంప్యః - దయ చూపదగినవాడు, ఇతి - అని. 10

ఓ అచ్యుతా! నేను రజోగుణమునుండి పుట్టినవాడనగుటచే నీ మహిమ తెలియక నీకంటె వేరుగా నేను కూడ ప్రభుడననే ఆహంకారము కలిగి యుంటిని. అనాదియగు మాయతోడి సంబంధము వలన నా అంతః కరణమునందు గాఢమగు అజ్ఞానము కలిగి వివేకజ్ఞానమును కోల్పోతిని. నేను స్వయంభువుడనని గర్వించితిని. నీవు తప్ప నాకు నాథుడు లేడు. నేను దయ చూపదగినవాడను. కావున, నన్ను క్షమించుము.

క్వాహం తమోమహదహంఖచరాగ్నివార్భూ-
సంవేష్టితాండఘటసప్తవితస్తికాయః ।
క్వేదృగ్విధావిగణితాండపరాణుచర్యా-
వాతాధ్వరోమవివరస్య చ తే మహిత్వమ్ ॥ 11

తమః-మహద్-అహంఖచర-అగ్నివార్-భూసంవేష్టిత-అండఘటసప్తవిత స్తికాయః - ప్రకృతి మహత్తత్త్వము అహంకారము ఆకాశము వాయువు అగ్ని నీరు భూమి అనువాటిచే చుట్టువారబడియున్న బ్రహ్మాండమనే ఘటమునందు ఏడు అడుగుల దేహము గల, అహమ్ - నేను, క్వ - ఎక్కడ?, ఈదృగ్-విధ-అగణిత-అండపర-అణుచర్యావాతాధ్వరోమ వివరస్య - ఈ విధమైన లెక్కలేనన్ని బ్రహ్మాండములనే పరమాణువుల పరిభ్రమణము కొరకై కిటికీలవంటి రోమకూపములు గల, తే - నీ, మహిత్వం చ - మహిమ, క్వ - ఎక్కడ?

ప్రకృతి, మహత్తత్త్వము (సమష్టి బుద్ధిశక్తి), సమష్టి అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, పృథివి అనువాటిచే చుట్టువారబడియున్న బ్రహ్మాండమనే ఘటము (నశించేది) నందు ఏడు

అడుగుల దేహము గల వేనెక్కడ? ఈ విధమైన లెక్కలేనన్ని పరమాణువులవంటి బ్రహ్మాండములు, కిటికీనుండి వచ్చే సూర్యకాంతిలోని ధూళికణములు వలె, నీ రోమకూపములయందు పరిభ్రమించుచుండును. అట్టి నీ మహిమ యెక్కడ? (చాల అంతరము గలదని భావము).

ఉత్క్షేపణం గర్భగతస్య పాదయోః కిం కల్పతే మాతురధోక్షజాగసే ।
కిమస్తినాస్తివ్యపదేశభూషితం తవాస్తి కుక్షేః కియదప్యనంతః ॥ 12

అధోక్షజ - ఇంద్రియగోచరము కాని స్వరూపము గలవాడా!, గర్భగతస్య - గర్భమునందున్న శిశువుయొక్క, పాదయోః - రెండు కాళ్లయొక్క, ఉత్క్షేపణమ్ - పైకి విసురుట, మాతుః - తల్లికి, ఆగసే - అపరాధము కొరకు, కల్పతే కిమ్ - అర్థమగునా యేమి?, అస్తినాస్తివ్యపదేశభూషితమ్ - ఉంది లేదు అనే శబ్దములచే అలంకరించబడేది, తవ - నీ, కుక్షేః - ఉదరమునకు, అనంతః - లోపల కానిది, కియత్ అపి - కొంచెమైననూ, కిం అస్తి - ఉన్నదా?

ఓ శ్రీహరీ! నీ స్వరూపము ఇంద్రియములకు గోచరమయ్యేది కాదు. గర్భమునందలి శిశువు పాదములతో తన్నుట తల్లి యెడల అపరాధమగునా? (కాదు). ఉంది లేదు అనే శబ్దములచే వ్యవహరించ బడేది కొంచెమైనా నీ ఉదరమునకు లోపల లేనిది గలదా? (లేదు).

జగత్త్రయాంతోదధిసంప్లవోదే నారాయణస్యోదరనాభినాలాత్,
వినిర్గతోఽజస్త్వితి వాఙ్న వై మృషా కిం త్వీశ్వర త్వన్న వినిర్గతోఽస్మి।

జగత్-త్రయ-అంత-ఉదధిసంప్లవ-ఉదే - ముల్లోకముల ప్రళయమునందు సముద్రముల ఏకమైన నీటియందు, నారాయణస్య - నారాయణుని, ఉదరనాభినాలాత్ - ఉదరమునందలి నాభినుండి వచ్చిన పద్మపు తూడునుండి, అజః తు - స్వయంభువుడగు బ్రహ్మదేవుడైతే, వినిర్గతః - ప్రకటమైనవాడు, ఇతి - అనే, వాక్ - మాట, న మృషా - అసత్యము కాదు, వై - నిశ్చయము, తు - కాని, ఈశ్వర - ఓ ఈశ్వరా!, త్వత్ - నీనుండి, వినిర్గతః - ప్రకటమైనవాడను, న అస్మి కిమ్ - కానా? 13

ప్రళయమునందు సముద్రములన్నీ ఏకమై ముల్లోకములు విలీనమైనవి. అప్పుడు ఆ జలములలో నారాయణుని నాభియందలి పద్మపు తూడునుండి స్వయంభువుడగు బ్రహ్మదేవుడు ప్రకటమయ్యెనని శ్రుతులు చెప్పుచున్నవి. ఆ మాట అసత్యము కాదు. ఇది నిశ్చయము. ఓ ఈశ్వరా! నేను నీనుండి ప్రకటమైనవాడను కానా? (తప్పక అగుదును).

నారాయణస్త్వం న హి సర్వదేహినా-
మాత్మాఽస్యధీశోఽఖిలలోకసాక్షీ ।
నారాయణోఽంగం నరభూజలాయనాత్
తచ్చాపి సత్యం న తవైవ మాయా ॥ 14

త్వమ్ - నీవు, నారాయణః న హి - నారాయణుడవు కావా?, సర్వదేహినామ్ - సకలప్రాణులకు, ఆత్మా - ఆత్మవు, అసి - అగుదువు, అధీశః - ప్రవర్తకుడవు, అఖిలలోకసాక్షీ - సకలప్రాణులలోని సాక్షివి, నరభూ జల-అయనాత్ - నరునినుండి పుట్టిన జలములు ఆశ్రయమగుట వలన, నారాయణః - నారాయణుడు, తవ - నీ, అంగం ఏవ - మూర్తియే, తత్ చ అపి - అది కూడ, న సత్యమ్ - యథార్థము కాదు, మాయా - లీలయే.

సకలప్రాణులకు ఆత్మవగు నీవు నారాయణుడవు (నార-అయన, అనగా జీవులకు అధిష్ఠానము) కావా? అగుదువు. సకలప్రాణులకు ప్రవర్తకుడవగు నీవు నారాయణుడవే (నార-అయన, అనగా జీవులను ప్రవర్తిల్ల జేయువాడు). సకలప్రాణులలోని బుద్ధిసాక్షివగు నీవు నారాయణుడవు (నార-అయన, జీవులలో తెలుసుకొనువాడు). నరునినుండి అనగా పరమాత్మనుండి పుట్టినవి నారములు, అనగా జలములు. అవి ఆశ్రయముగా గల నారాయణుడు కూడ నీ అంశయే. అట్టి అంశరూపముగా ప్రకటమగుట కూడ నీ లీలయే గాని పరమార్థము కాదు.

తచ్చేజ్జలస్థం తవ సజ్జగద్వపుః కిం మే న దృష్టం భగవంస్తదైవ ।
కిం వా సుదృష్టం హృది మే తదైవ కిం నో సపద్యేవ పునర్వ్యదర్శి ॥

భగవన్ - ఓ భగవానుడా!, సత్-జగత్ - ఉండే జగత్తు గల, తవ - నీ, తత్ - ఆ, వపుః - దేహము, జలస్థం చేత్ - నీటియందుండేది ఐనచో, మే -

నాచే, తదా ఏవ - అప్పుడే, కిమ్ - ఏల, న దృష్టమ్ - చూడబడలేదు?, తదా - అప్పుడు మాత్రమే, హృది - హృదయమునందు, మే - నాచే, కిం వా - ఏల, సుదృష్టమ్ - బాగుగా చూడబడినది?, పునః - మరల, సపది ఏవ - వెనువెంటనే, కిమ్ - ఏల, నో వ్యదర్శి - చూడబడలేదు? 15

ఓ భగవానుడా! జగత్తునకు ఆశ్రయమైన ఆ నీ దేహము నీటియందున్నచో, నేను ప్రకటమైన వెంటనే ఏల చూడలేకపోతిని? మరల (తపస్సును చేసి) తరువాత మాత్రమే నేను హృదయమునందు ఆ రూపమును బాగుగా చూచుటకు కారణమేమి? అదే రూపము మరల వెనువెంటనే నాకు కనబడకపోవుటకు కారణమేమి?

అత్రైవ మాయాధమనావతారే హ్యస్య ప్రపంచస్య బహిస్స్ఫుటస్య ।
కృత్స్నస్య చాంతర్జఠరే జనన్యా మాయాత్వమేవ ప్రకటీకృతం తే॥16

మాయాధమన - మాయను పోగొట్టువాడా!, అత్ర - ఈ, అవతారే ఏవ - అవతారమునందే, బహిః - బయట, స్ఫుటస్య - ప్రత్యక్షముగా కనబడుచున్న, అస్య - ఈ, కృత్స్నస్య - సకలమైన, ప్రపంచస్య - ప్రపంచముయొక్క, అంతః-జఠరే చ - ఉదరము లోపల కూడ, జనన్యాః - తల్లికి, తే - నీ, మాయాత్వం ఏవ - మాయయగుటయే, ప్రకటీకృతమ్ - ప్రకటము చేయబడినది, హి - నిశ్చయము.

మాయను పోగొట్టే ఓ శ్రీహరీ! ఈ అవతారమునందే నీవు బయట ప్రత్యక్షముగా కనబడే ఈ ప్రపంచమునంతనూ తల్లికి ఉదరము లోపల చూపి, ఈ జగత్తు నీ మాయయేనని నిశ్చయముగా ప్రకటించితివి.

యస్య కుక్షావిదం సర్వం సాత్మం భాతి యథా తథా ।
తత్త్వయ్యపీహ తత్సర్వం కిమిదం మాయయా వినా ॥ 17

యస్య - ఎవనియొక్క, కుక్షౌ - ఉదరమునందు, స-ఆత్మమ్ - నీతో కూడిన, ఇదమ్ - ఈ, సర్వమ్ - సర్వము, యథా - ఏ విధముగానైతే, భాతి - ప్రకాశించుచున్నదో, తథా - అదే విధముగా, తత్ - ఆ, సర్వమ్ - సర్వము, ఇహ అపి - ఇక్కడ (బయట) కూడ, తత్ - ఆ, ఇదమ్ - ఇది,

త్వయి - నీయందు, మాయయా వినా - మాయాశక్తి లేకుండా, కిమ్ - పొసగునా యేమి?

నీతో సహా ఈ సకలజగత్తు ఏ విధముగానైతే నీ ఉదరమునందు ప్రకాశించుచున్నదో అదే విధముగా ఆ సర్వము ఈ బయట కూడ ప్రకాశించుచున్నది. ఇదంతా నీయందు మాయాశక్తి లేకుండానే ఘటిల్లునా యేమి? (ఘటిల్లదు).

అద్యైవ త్వదృతేఽస్య కిం మమ న తే మాయాత్వమాదర్శిత
మేకోఽసి ప్రథమం తతో వ్రజసుహృద్వత్సాస్సమస్తా అపి ।
తావంతోఽసి చతుర్భుజాస్తదఖిలైస్సాకం మయోపాసితాః
తావంత్యేవ జగంత్యభూస్తదమితం బ్రహ్మాద్వయం శిష్యతే ॥18

త్వద్-ఋతే - నీవు లేకుండా, అస్య - ఈ జగత్తుయొక్క, మాయాత్వమ్ - మాయాకల్పితమై యుండుట, తే - నీచే, అద్య ఏవ - ఇప్పుడే, మమ - నాకు, కిం న ఆదర్శితమ్ - నిరూపించబడలేదా? ప్రథమమ్ - మొట్టమొదట, ఏకః - ఒక్కడవు, అసి - ఉన్నావు, తతః - తరువాత, వ్రజసుహృద్-వత్సాః - గోకులమునందలి మిత్రులు దూడలు, సమస్తాః అపి - బెత్తములు మొదలైనవన్నీ కూడ, తత్ - అప్పుడు, మయా సాకమ్ - నాతో సహా, ఉపాసితాః - ఉపాసించబడిన, తావంతః - అన్ని, చతుర్భుజాః - నాలుగు చేతులు గల రూపములు, అసి - అగుదువు, తావంతి ఏవ - అన్నియే, జగంతి - బ్రహ్మాండములు, అభూః - అయితివి, తత్ - అందువలన, అమితమ్ - పరిచ్ఛేదములు లేనట్టియు, అద్వయమ్ - రెండవది లేని, బ్రహ్మ - పరబ్రహ్మ, శిష్యతే - మిగిలి యుండును.

ఈ జగత్తు మాయచే కల్పితమనియు, నీవే దాని అధిష్ఠానమనియు నీవీ నాడు నాకు నిరూపించ లేదా? (నిరూపించితివి). మొట్టమొదట (నేను చూసినప్పుడు) నీవు ఒక్కడివే ఉంటివి. తరువాత గోకులమునందలి మిత్రులు, దూడలు, వారి బెత్తములు మొదలైనవన్నీ నీవే అయితివి. అప్పుడు చతుర్భుజరూపములు అదే సంఖ్యలో నీవే అయితివి. నాతో సహా సృష్టిలోని తత్త్వములన్నీ ఆ రూపములను ఉపాసించుచున్నవి.

తరువాత అదే సంఖ్యలో బ్రహ్మాండములు నీవే అయితివి. కావున, పరిచ్ఛేదములు లేనిది, రెండవది లేనిది అగు పరబ్రహ్మయే మిగిలినది.

అజానతాం త్వత్పదవీమనాత్మ-
న్యాత్మాऽऽత్మనా భాసి వితత్య మాయామ్ ।
సృష్టావివాహం జగతో విధాన
ఇవ త్వమేషోऽంత ఇవ త్రినేత్రః ॥ 19

త్వత్-పదవీమ్ - నీ స్వరూపమును, అజానతామ్ - తెలియనివారలకు, అనాత్మని - అనాత్మయగు ప్రకృతియందు, ఆత్మా - ఆత్మవై, ఆత్మనా - నీచే, మాయామ్ - మాయాశక్తిని, వితత్య - విస్తరించి, భాసి - ప్రకాశించుచున్నావు, జగతః - జగత్తుయొక్క, సృష్టౌ - సృష్టియందు, అహం ఇవ - నేను వలె, విధానే - పాలించుటయందు, ఏషః - ఈ, త్వం ఇవ - నీవు వలె, అంతే - ప్రళయమునందు, త్రినేత్రః ఇవ - ముక్కంటి వలె.

నీ స్వరూపమును తెలియనివారలకు నీవు నీచే (స్వతంత్రుడవై) మాయాశక్తిని విస్తరింపజేసి, అనాత్మయగు ప్రకృతియందు తాదాత్మ్యమును పొందిన పరిచ్ఛిన్నజీవుడు వలె భాసించెదవు. జగత్తును సృష్టించే సమయమునందు నీవే బ్రహ్మనగు నేను వలె, పాలించే సమయములో విష్ణువు అగు నీవు వలె, ప్రళయమునందు ముక్కంటియగు రుద్రుడు వలె నీవే భాసించుచున్నావు.

సురేష్వృషిష్వీశ తథైవ నృష్వపి తిర్యక్షు యాదస్స్వపి తేऽజనస్య ।
జన్మాసతాం దుర్మదనిగ్రహాయ ప్రభో విధాతస్సదనుగ్రహాయ చ॥ 20

ఈశ - ఓ ఈశ్వరా!, ప్రభో - ఓ ప్రభూ!, విధాతః - సర్వమును పాలించువాడా!, అజనస్య - పుట్టుక లేని, తే - నీకు, సురేషు - దేవతలయందు, ఋషిషు - మహర్షులయందు, తథా ఏవ - అదే విధముగా, నృషు అపి - మానవులయందు కూడ, తిర్యక్షు - పశువులయందు, యాదస్సు అపి - జలజంతువులయందు కూడ, జన్మ - అవతరించుట, అసతామ్ - దుష్టులయొక్క, దుర్మదనిగ్రహాయ -

పొగరును అణిచివేయుటకై, చ - మరియు, సద్-అనుగ్రహాయ - సత్పురుషులననుగ్రహించుటకై.

సర్వసమర్థుడవగు ఓ ఈశ్వరా! ఈ జగత్తును పాలించేది నీవే. నీవు దుష్టుల పొగరును అణచివేసి సత్పురుషులను రక్షించుటకై దేవత (వామనుడు) గా, మహర్షి (పరశురాముడు) గా , మానవుడు (శ్రీరాముడు) గా, పశువై కూడ (వరాహము), ఆఖరికి జలజంతువు (చేప) గానైననూ అవతరించెదవు. కాని, నీకు వాస్తవముగా పుట్టుక లేదు.

కో వేత్తి భూమన్ భగవన్ పరాత్మన్ యోగేశ్వరోతీర్భవతస్త్రిలోక్యామ్।
క్వ వా కథం వా కతి వా కదేతి విస్తారయన్క్రీడసి యోగమాయామ్॥

భూమన్ - ఓ అనంతా!, భగవన్ - ఓ భగవానుడా!, పర-ఆత్మన్ - ప్రకృతికి అతీతమైన ఆత్మస్వరూపుడా!, యోగ-ఈశ్వర- యోగమాయను శాసించువాడా!, త్రిలోక్యామ్ - ముల్లోకములయందు, భవతః - నీ, ఊతీః - లీలలను, క్వ వా - ఎక్కడ అని గాని, కథం వా - ఎట్లు అని గాని, కతి వా - ఎన్ని అని గాని, కదా ఇతి - ఎప్పుడని గాని, కః - ఎవడు, వేత్తి - తెలియును? యోగమాయామ్ - యోగమాయను, విస్తారయన్ - విస్తరింపజేయువాడవై, క్రీడసి - క్రీడించెదవు. 21

ఓ భగవానుడా! నీవు అనంతుడవు, ప్రకృతికి అతీతమైన ఆత్మవు నీవే. యోగమాయ నీ అధీనములో నుండును. నీవు యోగమాయను విస్తరింప జేసి క్రీడించెదవు. ముల్లోకములలో నీ లీలలు ఎక్కడ, ఏ విధముగా, ఎప్పుడు, ఎన్ని ప్రకటమగునో ఎవడు తెలియగల్గును? (తెలియలేరు).

తస్మాదిదం జగదశేషమసత్స్వరూపం
స్వప్నాభమస్తధిషణం పురుదుఃఖదుఃఖమ్ ।
త్వయ్యేవ నిత్యసుఖబోధతనావనంతే
మాయాత ఉద్యదపి యత్సదివావభాతి ॥ 22

తస్మాత్ - అందువలన, అసత్-స్వరూపమ్ - మిథ్యయే స్వరూపముగా గలది, స్వప్న-ఆభమ్ - కలను పోలినది, అస్తధిషణమ్ - తొలగిన చైతన్యప్రకాశము గలది, పురుదుఃఖదుఃఖమ్ - అనేకములగు దుఃఖము

తరువాత దుఃఖము గలది అగు, జగత్ - జగత్తు, అశేషమ్ - నిశ్శేషము, యత్ - ఏది గలదో, ఇదమ్ - ఇది, నిత్యసుఖబోధతనౌ - కాలపరిచ్ఛిన్నము కాని ఆనందము జ్ఞానము స్వరూపముగా గల, అనంతే - అవినాశియగు, త్వయి ఏవ - నీయందే, మాయాతః - మాయాశక్తి వలన, ఉద్యత్ అపి - కానవచ్చునదే అయిననూ, సత్ ఇవ - సత్యము వలె, అవభాతి - అజ్ఞానముచే భాసించుచున్నది.

కావున, ఈ జగత్తు అంతా వాస్తవముగా లేకున్ననూ కల వలె ఉన్నట్లు భాసించుచున్నది. దీనియందు అనేకములగు దుఃఖములు పరంపరగా కలుగుచుండును. దీనియందలి సత్తాస్ఫూర్తులు ఈశ్వరప్రతిఫలనముచే కలిగినవే గాని, జగత్తునకు స్వంతములు కావు. ఇట్టి జగత్తు మాయాశక్తి వలన అనంతజ్ఞానానందస్వరూపుడవగు నీయందు కానవచ్చుచున్నది. అవినాశియగు నీవు మాత్రమే సత్యము కాగా, అజ్ఞానము వలన ఈ జగత్తు సత్యమా యన్నట్లు తోచుచున్నది.

ఏకస్త్వమాత్మా పురుషః పురాణః
సత్యస్స్వయంజ్యోతిరనంత ఆద్యః ।
నిత్యోఽక్షరోఽజస్రసుఖో నిరంజనః
పూర్ణోఽద్వయో ముక్త ఉపాధితోఽమృతః ॥ 23

త్వమ్ - నీవు, ఏకః - సర్వవ్యాపకుడవు, పురుషః - దేహాదులయందు ఉపలభ్యమయ్యే, ఆత్మా - ఆత్మరూపుడవు, పురాణః - ఆది లేనివాడవు, సత్యః - అపరిచ్ఛిన్నసద్రూపుడవు, స్వయంజ్యోతిః - స్వయంప్రకాశచైతన్యస్వరూపుడవు, అనంతః - అవినాశివి, ఆద్యః - సర్వజగత్కారణుడవు, నిత్యః - కాలాతీతుడవు, అక్షరః - వికారములు లేనివాడవు, అజస్రసుఖః - కాలపరిచ్ఛిన్నము కాని ఆనందమే స్వరూపముగా గలవాడవు, నిరంజనః - కర్తృత్వభోక్తృత్వాదుల లేపము లేనివాడవు, పూర్ణః - దేశపరిచ్ఛేదము లేనివాడవు, అద్వయః - రెండవది లేనివాడవు, ఉపాధితః - ఉపాధియగు మాయాశక్తినుండి, ముక్తః - విముక్తుడవు, అమృతః - అంతము లేనివాడవు.

సర్వవ్యాపకుడవగు నీవు దేహాదులయందు ఆత్మరూపముగా తెలియబడెదవు. ఆద్యంతములు లేని నీవు పరిచ్ఛేదములు లేని సత్ (ఉనికి), స్వయంప్రకాశచైతన్యము, కాలపరిచ్ఛిన్నము కాని ఆనందము స్వరూపముగా గలవాడవు. కాలాతీతుడవు, అవినాశివి అగు నీవు సర్వజగత్తునకు కారణమవు. నీయందు వికారములు గాని, కర్తత్వభోక్తృత్వాదులు గాని లేవు. దేశవస్తుకాలపరిచ్ఛేదములు లేని నీవు మాయాశక్తి అనే ఉపాధినుండి విముక్తుడవు.

ఏవంవిధం త్వాం సకలాత్మనామపి
స్వాత్మానమాత్మాత్మతయా విచక్షతే ।
గుర్వర్కలబ్ధోపనిషత్సుచక్షుషా
యే తే తరంతీవ భవానృతాంబుధిమ్ ॥ 24

ఏవంవిధమ్ - ఇటువంటి, సకల-ఆత్మనాం అపి - సకలప్రాణులకు, స్వ-ఆత్మానమ్ - స్వరూపమైన, త్వామ్ - నిన్ను, యే - ఎవరైతే, గురు-అర్కలబ్ధ-ఉపనిషత్-సుచక్షుషా - గురువు అనే సూర్యునినుండి పొందబడిన వేదాంతజ్ఞానమనే గొప్ప దర్శనముతో, ఆత్మాత్మతయా - తన ఆత్మగా, విచక్షతే - దర్శించెదరో, తే - వారు, భవ-అనృత-అంబుధిమ్ - సంసారమనే మిథ్యాసముద్రమును, తరంతి ఇవ - తరించినారా యన్నట్లు ఉండెదరు.

నీవీ విధముగా సకలప్రాణులలో ఆత్మరూపుడవై ఉన్నావు. ఎవరైతే గురువనే సూర్యునినుండి వేదాంతజ్ఞానమనే దివ్యనేత్రమును సంపాదించి నిన్ను తమ ఆత్మరూపునిగా దర్శించెదరో, వారు సంసారమనే మిథ్యాసముద్రమును తరించినట్లు అగుదురు (అనగా బంధము మిథ్యయే, మోక్షము మిథ్యయే).

ఆత్మానమేవాత్మతయాఽవిజానతాం
తేనైవ జాతం నిఖిలం ప్రపంచితమ్ ।
జ్ఞానేన భూయోఽపి చ తత్ప్రలీయతే
రజ్జ్వామహేర్భోగభవాభవౌ యథా ॥ 25

ఆత్మానమ్ - తన స్వరూపమును, ఆత్మతయా - యథాతథముగా, అవిజానతామ్ - తెలియనివారలకు, తేన ఏవ - ఆ అజ్ఞానముతోనే, నిఖిలమ్ - సకలమైన, ప్రపంచితమ్ - ప్రపంచము, జాతమ్ - పుట్టినది, రజ్జ్వామ్ - త్రాడునందు, అహేః - పాముయొక్క, భోగభవ-అభవౌ యథా - పడగయొక్క ఉండుట ఉండకపోవుటలు వలె, తత్ చ - ఆ ప్రపంచము కూడ, జ్ఞానేన - జ్ఞానముచే, భూయః అపి - మరల, ప్రలీయతే - విలీనమగును.

మానవుడు తన స్వరూపమును యథాతథముగా తెలియకపోవుట చేతనే, త్రాడునందు పాము పడగ కనబడినట్లుగా, ఈ ప్రపంచమంతయు ఉన్నట్లు భాసించును. మానవుడు జ్ఞానమును పొందినచో, త్రాడునందు పాము లేకుండా పోయినట్లు, జగత్తు మరల ఆత్మయందే విలీనమగును.

అజ్ఞానసంజ్ఞౌ భవబంధమోక్షౌ ద్వౌ నామ నాన్యౌ స్త ఋతజ్ఞభావాత్ ।
అజస్రచిత్యాత్మని కేవలే పరే విచార్యమాణే తరణావివాహనీ ।। 26

భవబంధమోక్షౌ నామ - సంసారబంధము మోక్షము అని ప్రసిద్ధి చెందిన, ద్వౌ - రెండు, అజ్ఞానసంజ్ఞౌ - అజ్ఞానముచే పేరు గలవి (యొక్క పేర్లు), అజస్రచితి - నిత్యజ్ఞానమైనట్టియు, కేవలే - రెండవది లేనట్టియు, పరే - ప్రకృతికి అతీతమైన, ఆత్మని - ఆత్మ, విచార్యమాణే - విచారముచే తెలియబడగా, తరణౌ - సూర్యునియందు, అహనీ ఇవ - రాత్రింబగళ్లు వలె, ఋతజ్ఞభావాత్ - నిషేధించ శక్యము కాని జ్ఞప్తిరూపమైన సత్ కంటె, అన్యౌ - భిన్నములై, న స్తః - లేవు.

సంసారబంధము, మోక్షము అనే రెండు ప్రసిద్ధములే. కాని, ఇవి అజ్ఞానముచే కలిగిన (అజ్ఞానముయొక్క) నామములు మాత్రమే. ఆత్మ నిత్యజ్ఞానస్వరూపము, రెండవది లేనిది, ప్రకృతికి అతీతము. విచారముచే ఆత్మతత్త్వమునరయగా, సూర్యునియందు రాత్రింబగళ్లు లేనట్లే, ఈ బంధ మోక్షములు బాధించ శక్యము కాని సచ్చిత్తత్త్వమగు ఆత్మకంటె వేరుగా లేనే లేవు.

త్వామాత్మానం పరం మత్వా పరమాత్మానమేవ చ ।
ఆత్మా పునర్బహిర్మృగ్య అహోఽజ్ఞజనతాఽజ్ఞతా ॥ 27

ఆత్మానమ్ - ఆత్మరూపుడవగు, త్వామ్ - నిన్ను, పరమ్ ఇతరునిగను, పరం చ - ఇతరమైన దేహము మొదలగుదానిని, ఆత్మానం ఏవ - ఆత్మనుగను, మత్వా - తలచి, ఆత్మా పునః - ఆత్మ యైతే (నీవైతే), బహిః - బయట, మృగ్యః - వెదుకబడు దగినది, అహో - అయ్యో!, అజ్ఞజనతా-అజ్ఞతా - అజ్ఞానులగు జనుల సమూహముయొక్క అజ్ఞానము.

అజ్ఞానులగు జనులు ఆత్మరూపుడవగు నిన్ను ఇతరునిగను, ఆత్మకాని దేహాదులను ఆత్మగను తలచి, ఆత్మరూపుడవగు నిన్నైతే తమకంటె బయట వెదుకుచుందురు. అయ్యో! వారి అజ్ఞానము ఎంత బలీయమో!

అంతర్భవేఽనంత భవంతమేవ
హ్యతత్త్యజంతో మృగయంతి సంతః ।
అసంతమప్యంత్యహిమంతరేణ
సంతం గుణం తం కిము యాంతి సంతః ॥ 28

అనంత - ఓ అనంతా!, భవే అంతః - దేహము మధ్యలో, అతత్ - అనాత్మను, త్యజంతః - విడిచిపెట్టువారై, భవంతం ఏవ - నిన్నే, సంతః - వివేకము గలవారు, మృగయంతి - అన్వేషించెదరు, అసంతం అపి - లేనిదే అయిననూ, అహిమ్ - పామును, అంతరేణ - నిషేధించకుండా, అంతి - సమీపమునందు, సంతమ్ - ఉన్న, తమ్ - ఆ, గుణమ్ - త్రాడును, సంతః - వివేకులు, కిము యాంతి - తెలియుదురా యేమి?

ఓ అనంతా! పుట్టి గిట్టే దేహము మధ్యలో ఇంద్రియములు మొదలగు అనాత్మను అపవాదము చేసి వివేకులు నిన్ను ఆత్మరూపునిగా అన్వేషించి తెలియుదురు. త్రాడునందు పాము లేకున్ననూ, దానిని నిషేధించకుండా వివేకులైనా అక్కడే ఉన్న త్రాడును తెలియగల్గుదురా? (తెలియజాలరు).

అథాఽపి తే దేవ పదాంబుజద్వయప్రసాదలేశానుగృహీత ఏవ హి ।
జానాతి తత్త్వం భగవన్మహిమ్నో న చాన్య ఏకోఽపి చిరం విచిన్వన్॥

దేవ - ఓ దేవా!, అథ అపి - అయినప్పటికీ, తే - నీ, పద-అంబుజద్వయప్రసాదలేశ-అనుగృహీతః ఏవ - నీ పద్మములవంటి పాదముల జంటయొక్క అనుగ్రహముయొక్క లేశముచే అనుగ్రహించబడినవాడు మాత్రమే, భగవత్-మహిమ్నః - భగవానుని మహిమయొక్క, తత్త్వమ్ - యాథార్థ్యమును, జానాతి - తెలియును, హి - నిశ్చయము, అన్యః - ఇతరుడు, ఏకః - ఒంటరియై, చిరమ్ - చాలకాలము, విచిన్వన్ అపి - అన్వేషించు (విచారించు) వాడైననూ, న - తెలియడు, హి - నిశ్చయము. 29

ఓ దేవా! ఆత్మానాత్మవివేకముచే నిన్ను తెలియుదురనేది యథార్థమే. అయిననూ, పద్మములవంటి నీ పాదముల జంటయొక్క అనుగ్రహలేశము చేనైననూ కృతార్థుడు కానివాడు ఆత్మరూపుడగు భగవానుని మహిమను యథాతథముగా తెలియలేడనేది నిశ్చయము. నీ అనుగ్రహము లేనివాడు చాల కాలము ఒంటరియై ఆత్మవిచారము చేసిననూ నిన్ను తెలియలేడు.

తదస్తు మే నాథ స భూరిభాగో భవేఽత్ర వాఽన్యత్ర తు వా తిరశ్చామ్,
యేనాహమేకోఽపి భవజ్జనానాం భూత్వా నిషేవే తవ పాదపల్లవమ్।30

నాథ - ఓ ప్రభూ!, తత్ - అందువలన, అత్ర - ఈ, భవే - జన్మయందు, అన్యత్ర - మరియొక, తిరశ్చాం వా - పశువుల జన్మ యందైనా, మే - నాకు, సః - ఆ, భూరిభాగః - గొప్ప భాగ్యము, అస్తు - కలుగు గాక!, యేన - దేనిచే, అహమ్ - నేను, భవత్-జనానామ్ - నీ భక్తుల మధ్యలో, ఏకః అపి - ఎవడో ఒకడినే అయినా, భూత్వా - అయి, తవ - నీ, పాదపల్లవమ్ - చిగురువంటి పాదమును, నిషేవే - నిష్ఠగా సేవించెదనో.

ఓ ప్రభూ! అందువలన (నీ భక్తి లేనిదే ముక్తి లేదు గనుక), ఈ జన్మలో గాని, లేదా మరియొక పశువు మొదలైన జన్మలోనైనా, నాకు నీ చిగురువంటి పాదమును నిష్ఠతో సేవించే మహాభాగ్యము కలుగు గాక! నేను నీ భక్తులలో ఎవడో ఒక అనామకుడనైనా పరవా లేదు.

అహోఽతిధన్యా వ్రజగోరమణ్యః
స్తన్యామృతం పీతమతీవ తే ముదా ।
యాసాం విభో వత్సతరాత్మజాత్మనా
యత్తృప్తయేఽద్యాపి న చాలమధ్వరాః ॥ 31

విభో - ఓ ప్రభూ!, వ్రజగోరమణ్యః - గోకులమునందలి ఆవులు తల్లులు, అతిధన్యాః - మిక్కిలి ధన్యులు, అహో - ఆహా!, వత్సతర-ఆత్మజ-ఆత్మనా - ఎదిగిన దూడల మరియు పుత్రుల రూపము గల, తే - నీచే, యాసామ్ - ఎవరియొక్క, స్తన్య-అమృతమ్ - పాలనే అమృతము, అతీవ - అతిశయించిన, ముదా - ఆనందముతో, పీతమ్ - త్రాగబడినదో, యత్-తృప్తయే - ఏ నీ తృప్తి కొరకు, అద్య అపి - ఈ నాటికి కూడ, అధ్వరాః చ - యజ్ఞములు కూడ, న అలమ్ - సమర్థములు కాదో.

ఓ ప్రభూ! గోకులమునందలి ఆవులు, తల్లులు మిక్కిలి ధన్యులు. ఆహా! ఎందుకంటే, ఈనాటికి కూడా యజ్ఞములు నీకు కలిగించలేని తృప్తిని వారు నీకు కలిగించిరి. నీవు దూడల రూపములో అమృతము వంటి ఆవుల పాలను, గోపబాలకుల రూపములో తల్లుల పాలను అతిశయించిన ఆనందముతో త్రాగితివి.

అహో భాగ్యమహో భాగ్యం నందగోపవ్రజౌకసామ్ ।
యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్ ॥ 32

ఆహో భాగ్యమ్ - ఆహా! ఏమి భాగ్యము!, నందగోపవ్రజ-ఓకసామ్ - నందుడనే గోపాలకుని గోకులమునందు నివసించువారలకు, అహో భాగ్యమ్ - ఆహా! ఏమి భాగ్యము!, పరమ-ఆనందమ్ - సర్వాతిశాయి ఆనందమే స్వరూపముగా గలది, పూర్ణమ్ - పూర్ణము, సనాతనమ్ - కాలాతీతము అగు, బ్రహ్మ - పరబ్రహ్మ, యత్-మిత్రమ్ - ఎవరి మిత్రుడో.

ఆహా ఏమి భాగ్యము! నందుడనే గోపాలకుని గోకులమునందు నివసించువారలకు, ఆహా! ఏమి భాగ్యము! సర్వాతిశాయి ఆనందమే స్వరూపముగా గల కాలాతీతమైన పూర్ణపరబ్రహ్మ వారికి మిత్రుడైనాడు.

ఏషాం తు భాగ్యమహిమాఽచ్యుత తావదాస్తా-
మేకాదశైవ హి వయం బత భూరిభాగాః ।
ఏతద్ధృషీకచషకైరసకృత్పిబామః
శర్వాదయోఽంఘ్ర్యుదజమధ్వమృతాసవం తే ॥ 33

అచ్యుత - ఓ అచ్యుతా!, ఏషామ్ - వీరి, భాగ్యమహిమా తావత్ - భాగ్యముయొక్క గొప్పదనమైతే, ఆస్తామ్ - ఉండుగాక!, బత - ఆహా!, శర్వ-ఆదయః - రుద్రుడు మొదలుగాగల, వయమ్ - మేము, ఏకాదశ ఏవ - పదకొండుమందిమి మాత్రమే, భూరిభాగాః - గొప్ప భాగ్యము గలవారము, హి - ఏలయన, ఏతద్-హృషీకచషకైః - వీరి ఇంద్రియములనే పాత్రలతో, అసకృత్ - పలుమార్లు, తే - నీ, అంఘ్రి-ఉదజమధు-అమృత-ఆసవమ్ - పాదపద్మముల తేనె అనే అమృతరసమును, పిబామః - త్రాగుచున్నాము.

ఓ అచ్యుతా! ఈ గోకులవాసులయొక్క మహాభాగ్యమునైతే అట్లుండనిమ్ము. ఆహా! రుద్రుడు (అహంకారము), బ్రహ్మదేవుడు (బుద్ధి), చంద్రుడు (మనస్సు), దిగ్దేవతలు (వినికిడి), వాయువు (స్పర్శ), సూర్యుడు (చూపు), వరుణుడు (రసనేంద్రియము), అశ్వినీ దేవతలు (ఘ్రాణము), అగ్ని (వాక్కు), ఇంద్రుడు (చేతులు), ఉపేంద్రుడు (పాదములు) అనే మేము పదకొండు ఇంద్రియాధిష్ఠానదేవతలము మహాభాగ్యవంతులము. ఎందుకంటే, ఈ గోకులవాసుల ఇంద్రియములనే పాత్రలతో నీ పాదపద్మముల తేనె అనే అమృతరసమును పలుమార్లు పానము చేయుచున్నాము.

తద్భూరిభాగ్యమిహ జన్మ కిమప్యటవ్యాం
యద్గోకులేఽపి కతమాంఘ్రిరజోఽభిషేకమ్ ।
యజ్జీవితం తు నిఖిలం భగవాన్ ముకుందః
త్వద్యాపి యత్పదరజశ్శ్రుతిమృగ్యమేవ ॥ 34

తత్ - అది, భూరిభాగ్యమ్ - గొప్ప భాగ్యము, ఇహ - ఈ లోకము నందు, గోకులే - గోకులమునందు, అటవ్యాం అపి - అడవియందైననూ, కతమ-అంఘ్రిరజః-అభిషేకమ్ - ఎవరో ఒకరి పాదముల ధూళితో

అభిషేకము గల, కిం అపి - ఏదో ఒక, యత్ - ఏ, జన్మ - జన్మ గలదో, యత్-జీవితం తు - ఎవరి జీవితమైతే, నిఖిలమ్ - పూర్తి జీవితము, ముకుందః - మోక్షప్రదాతయగు, భగవాన్ - శ్రీహరి భగవానుడే అగునో, అద్య అపి తు - ఈ నాటికి కూడ, యత్-పదరజః - ఎవ్వాని పాదముల ధూళి, శ్రుతిమృగ్యమేవ - శ్రుతులచే వెదుకబడుచునే యున్నదో.

ఈ భూలోకములో గోకులములో అడవిలోనైనా ఏదో ఒక జన్మ యేది గలదో అదియే మహాభాగ్యము. ఎందుకంటే, ఎవరో ఒక గోపాలకుని పాదధూళితో నాకు అభిషేకము అగును. ఆ గోపాలకులకైతే జీవితమంతా మోక్షప్రదాత, శ్రీహరి భగవానుడు అగు నీవు మాత్రమే. శ్రుతులు ఈ నాటికి కూడా నీ పాదముల ధూళిని అన్వేషిస్తూనే ఉన్నవి సుమా!

ఏషాం ఘోషనివాసినాముత భవాన్ కిం దేవ రాతేతి నః
చేతో విశ్వఫలాత్ఫలం త్వదపరం కుత్రాప్యయన్ముహ్యతి ।
సద్వేషాదివ పూతనాఽపి సకులా త్వామేవ దేవాపితా
యద్ధామార్థసుహృత్ప్రియాత్మతనయప్రాణాశయాస్త్వత్కృతే॥35

దేవ - ఓ దేవా!, ఉత - మరియు, ఏషామ్ - ఈ, ఘోషనివాసినామ్ - గోకులవాసులకు, భవాన్ - నీవు, కిమ్ - దేనిని, రాతా - ఈయబోయెదవు?, ఇతి - అని, విశ్వఫలాత్ - సర్వఫలముల రూపమైన, త్వత్ - నీకంటె, అపరమ్ - మరియొక, ఫలమ్ - ఫలమును, కుత్ర అపి - ఏ దేశమునందైననూ కాలమునందైననూ, అయత్ - తెలియజాలని, నః - మా, చేతః - మనస్సు, ముహ్యతి - మోహపడుచున్నది, దేవ - ఓ దేవా!, సద్-వేషాత్ ఇవ - మంచి వేషము వలననే, సకులా - కులముతో కూడిన, పూతనా అపి - పూతన కూడ, త్వాం ఏవ - నిన్నే, ఆపితా - పొందించ బడినది, యద్-ధామ-అర్థసుహృత్-ప్రియ-ఆత్మతనయప్రాణ-ఆశయాః - ఎవరి ఇల్లు సంపద మిత్రులు ప్రియమైన వ్యక్తులు వస్తువులు దేహము సంతానము ప్రాణములు అంతఃకరణములు, త్వత్-కృతే - నీ కొరకో.

ఓ దేవా! ఇంతేగాక, ఈ గోకులవాసులకు నీవు ఏమి ఫలమునిచ్చెదవా అని ఆలోచించి మా బుద్ధి వ్యామోహమును పొందినది. మాకు ఏ దేశకాలములలోనైననూ నీకంటె మరియొక ఫలము బుద్ధికి తోచలేదు. ఓ

దేవా! పూతన సజ్జనుల వేషమును వేసుకున్నంత మాత్రాన కులముతో సహా నిన్నే పొందినది. ఈ గోకులవాసులకైతే ఇల్లు, సంపద, మిత్రులు, ప్రియమైన వ్యక్తి, ప్రియమైన వస్తువు, దేహము, సంతానము, ప్రాణములు, అంతఃకరణము అన్నీ నీ కొరకే.

తావద్రాగాదయః స్తేనాస్తావత్కారాగృహం గృహమ్ ।
తావన్మోహోఽంఘ్రినిగడో యావత్కృష్ణ న తే జనాః ॥ 36

తావత్ - అంతవరకు, రాగ-ఆదయః - రాగద్వేషాదులు, స్తేనాః - చోరులు, తావత్ - అంతవరకు, గృహమ్ - ఇల్లు, కారాగృహమ్ - కారాగారము, తావత్ - అంతవరకు, మోహః - మోహము, అంఘ్రినిగడః - కాలి సంకెల, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, యావత్ - ఎంతవరకైతే, జనాః - జనులు, తే - నీవారు, న - కారో.

ఓ శ్రీకృష్ణా! ఎంతవరకైతే జనులు నీవారు కారో, అంతవరకు మాత్రమే రాగద్వేషములు పరమార్థమును అపహరించే చోరులు, ఇల్లు కారాగారము, మోహము కాలి సంకెల యగును. (అనగా నీ భక్తులకు ఇవి యేవీ బంధహేతువులు కావని యర్థము).

ప్రపంచం నిష్ప్రపంచోఽపి విడంబయసి భూతలే ।
ప్రపన్నజనతాఽఽనందసందోహం ప్రథితుం ప్రభో ॥ 37

ప్రభో - ఓ ప్రభూ!, నిష్ప్రపంచః అపి - ప్రపంచమునకు అతీతుడవే అయిననూ, భూతలే - భూలోకమునందు, ప్రపన్నజనతా-ఆనంద సందోహమ్ - శరణాగతులైన జనసమూహముయొక్క ఆనందముల సమూహమును, ప్రథితుమ్ - విస్తరింపజేయుటకై, ప్రపంచమ్ - ప్రపంచమును, విడంబయసి - అనుకరించుచున్నావు.

ఓ ప్రభూ! నీవు ప్రపంచమునకు అతీతుడవే. అయిననూ, భూలోకమునందు శరణాగతులైన జనుల ఆనందముల సమూహమును విస్తరింప జేయుటకై నీవు ప్రపంచమును అనుకరించుచున్నావు.

జానంత ఏవ జానంతు కిం బహూక్త్యా న మే ప్రభో ।
మనసో వపుషో వాచో వైభవం తవ గోచరః ॥ 38

ప్రభో - ఓ ప్రభూ!, జానంతః ఏవ - తెలియువారే, జానంతు - తెలియుదురు గాక!, బహు-ఉక్త్యా - పలు మాటలతో, కిమ్ - ఏమి ప్రయోజనము?, తవ - నీ, వైభవమ్ - వైభవము, మే - నా, మనసః - మనస్సునకు, వపుషః - దేహమునకు, వాచః - వాక్కునకు, న గోచరః - గోచరము కాదు.

ఓ ప్రభూ! నిన్ను తెలియువారే తెలియుదురు గాక! పలు మాటలతో పని యేమి? నీ వైభవము నా మనోవాక్కాయములకు గోచరము కాదు.

అనుజానీహి మాం కృష్ణ సర్వం త్వం వేత్సి సర్వదృక్ ।
త్వమేవ జగతాం నాథో జగదేతత్తవార్పితమ్ ॥ 39

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, మామ్ - నన్ను, అనుజానీహి - అనుమతినిమ్ము, సర్వదృక్ - సర్వసాక్షివగు, త్వమ్ - నీవు, సర్వమ్ - సర్వమును, వేత్సి - తెలియుదువు, త్వం ఏవ - నీవే, జగతామ్ - జగత్తులకు, నాథః - ప్రభుడవు, ఏతత్ - ఈ, జగత్ - జగత్తు, తవ - నీకు, అర్పితమ్ - అర్పించబడినది.

ఓ శ్రీకృష్ణా! నాకు అనుమతినిమ్ము. సర్వసాక్షివగు నీకు సర్వము దెలియును. నీవే జగత్తులకు రక్షకుడవు. (నాది అనుకున్న) ఈ జగత్తును నేను నీకు సమర్పించుచున్నాను.

శ్రీకృష్ణ వృష్ణికులపుష్కరజోషదాయిన్
క్ష్మానిర్జరద్విజపశూదధివృద్ధికారిన్ ।
ఉద్ధర్మశార్వహర క్షితిరాక్షసధ్రు-
గాకల్పమార్కమర్హన్ భగవన్నమస్తే ॥ 40

శ్రీకృష్ణ - ఓ శ్రీకృష్ణా!, వృష్ణికులపుష్కరజోషదాయిన్ - వృష్ణివంశమనే పద్మమును వికసింప జేయువాడా!, క్ష్మానిర్జరద్విజపశూదధివృద్ధికారిన్ - భూమి దేవతలు వేదవేత్తలు పశువులు అనే సముద్రమును వర్ధిల్లజేయువాడా!, ఉద్ధర్మశార్వహర - ధర్మముగా కనబడే అధర్మమనే రాత్రియందలి చీకటిని పోగొట్టువాడా!, క్షితిరాక్షసధ్రుక్ - భూలోకమునందలి రాక్షసులను సంహరించువాడా!,

ఆ-అర్కమ్ - సూర్యుని వరకు, అర్హన్ - పూజించబడువాడా!, భగవన్ - ఓ భగవానుడా!, ఆకల్పమ్ - కల్పము వరకు, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ శ్రీకృష్ణ భగవానుడా! నీవు వృష్ణివంశమనే పద్మమును వికసింపజేసిన సూర్యుడవు, భూమి, దేవతలు, వేదవేత్తలు, పశువులు అనే సముద్రమును వర్ధిల్లజేసిన చంద్రుడవు, ధర్మమువలె కనబడే అధర్మమనే రాత్రి చీకటిని పోగొట్టే సూర్యుడవు. నీవు భూలోకమునందలి రాక్షసులను సంహరించెదవు. సూర్యునితో సహా అందరు నిన్ను పూజించెదరు. నీకు కల్పాంతము వరకు నేను నమస్కరించుచున్నాను.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యభిష్టూయ భూమానం త్రిః పరిక్రమ్య పాదయోః ।
నత్వాఽభీష్టం జగద్ధాతా స్వధామ ప్రత్యపద్యత ।। 41

జగద్-ధాతా - జగత్తును సృష్టించిన బ్రహ్మదేవుడు, భూమానమ్ - అనంతుడగు శ్రీకృష్ణుని, ఇతి - ఈ విధముగా, అభిష్టూయ - ఎదురుగా నిలబడి స్తుతించి, త్రిః - మూడుసార్లు, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, పాదయోః - రెండు పాదములకు, నత్వా - నమస్కరించి, అభీష్టమ్ - తాను ఇష్టపడే, స్వధామ - తన లోకమును, ప్రత్యపద్యత - తిరిగి చేరెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- జగత్తును సృష్టించిన బ్రహ్మదేవుడు అనంతుడగు శ్రీకృష్ణుని ఈ విధముగా అభిముఖముగా స్తుతించి, మూడు సార్లు ప్రదక్షిణము చేసి, రెండు పాదములకు నమస్కరించి, తాను ఇష్టపడే తన లోకమును చేరెను.

తతోఽనుజ్ఞాప్య భగవాన్ స్వభువం ప్రాగవస్థితాన్ ।
వత్సాన్ పులినమానిన్యే యథాపూర్వసఖం స్వకమ్ ।। 42

తతః - తరువాత, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, స్వభువమ్ - స్వయంభువుడగు బ్రహ్మదేవుని, అనుజ్ఞాప్య - అనుమతినిచ్చునట్లు చేసి, ప్రాక్ - ఇదివరలో వలెనే, అవస్థితాన్ - నిలబడియున్న, వత్సాన్ - దూడలను, యథాపూర్వసఖమ్ - ఇదివరలో వలెనే ఉన్న మిత్రులు గల,

స్వకమ్ - తనదైన, పులినమ్ - ఇసుకతిన్నెను గురించి, ఆనిన్యే - తీసుకు వచ్చెను.

తరువాత శ్రీకృష్ణ భగవానుడు స్వయంభువుడగు బ్రహ్మదేవుని వద్ద సెలవు తీసుకొనెను. సంవత్సరము క్రితంలో వలెనే దూడలు ఎదురుగా నిలిచి యుండెను. వాటిని తీసుకొని ఆయన తాను భోజనము చేసిన ఇసుక తిన్నె వద్దకు రాగా, అచట సంవత్సరం క్రితంలో వలెనే ఆయన మిత్రులు ఉండిరి.

ఏకస్మిన్నపి యాతేఽబ్దే ప్రాణేశం చాంతరాఽఽత్మనః ।
కృష్ణమాయాహతా రాజన్ క్షణార్ధం మేనిరేఽర్భకాః ॥ 43

రాజన్ - ఓ రాజా!, కృష్ణమాయాహతాః - శ్రీకృష్ణుని మాయచే మోహితులైన, అర్భకాః - గోపబాలకులు, ఆత్మనః - తన, ప్రాణ-ఈశం చ అంతరా - ప్రాణములకు ప్రభువగు శ్రీకృష్ణుడు లేకుండా, ఏకస్మిన్ - ఒక, అబ్దే - సంవత్సరము, యాతే అపి - గడచిననూ, క్షణ-అర్ధమ్ - క్షణముయొక్క సగమునుగా, మేనిరే - తలచిరి.

ఓ పరీక్షిన్మహారాజా! గోపబాలకులు శ్రీకృష్ణుని మాయచే మోహితులైరి. తమ ప్రాణములకు ప్రభువగు శ్రీకృష్ణుడు లేకుండా ఒక ఏడాది గడచిననూ, వారా కాలమును క్షణములో సగముగనే తలపోసిరి.

కిం కిం న విస్మరంతీహ మాయామోహితచేతసః ।
యన్మోహితం జగత్సర్వమభీక్ష్ణం విస్మృతాత్మకమ్ ॥ 44

ఇహ - ఈ లోకమునందు, మాయామోహితచేతసః - మాయచే మోహితమైన బుద్ధి గలవారలు, కిం కిమ్ - దేనిని దేనిని, న విస్మరంతి - మరువకుందురు?, యత్-మోహితమ్ - ఏ మాయచే మోహితమైన, సర్వమ్ - సకలమైన, జగత్ - జగత్తు, అభీక్ష్ణమ్ - మరల మరల, విస్మృత-ఆత్మకమ్ - విస్మరించబడిన స్వరూపము గలదియో.

ఈ లోకములో మాయచే మోహితమైన బుద్ధి గలవారలు దేనిని దేనిని విస్మరించకుందురు? (సర్వమును విస్మరించెదరు). మాయచే మోహితమైన సకలజగత్తు మరల మరల తన ఆత్మనే విస్మరించినది.

ఊచుశ్చ సుహృదః కృష్ణం స్వాగతం తేఽతిరంహసా ।
నైకోఽప్యభోజి కవల ఏహీతస్సాధు భుజ్యతామ్ ॥ 45

సుహృదః - మిత్రులు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని గురించి, ఊచుః చ - ఇంకా పలికిరి, తే - నీచే, అతిరంహసా - చాల వేగముగా, స్వాగతమ్ - బాగుగా రాబడినది, ఏకః - ఒక్క, కవలః అపి - ముద్ద కూడ, న అభోజి - తినబడలేదు, ఇతః - ఇటు, ఏహి - రమ్ము, సాధు - బాగుగా, భుజ్యతామ్ - భుజించబడుగాక!

పైగా ఆ మిత్రులు శ్రీకృష్ణునితో ఇట్లు పలికిరి --- చాల వేగముగా వచ్చితివే! ఒక్క ముద్దనైనా తింటివి కాదు (మేమింకా ఒక్క ముద్దనైననూ తినలేదు). ఇటు రమ్ము. బాగుగా భుజించుము.

తతో హసన్ హృషీకేశోఽభ్యవహృత్య సహార్భకైః ।
దర్శయంశ్చర్మాజగరం న్యవర్తత వనాద్వ్రజమ్ ॥ 46

తతః - తరువాత, హసన్ - నవ్వుచున్న, హృషీకేశః - ఇంద్రియాంతర్యామియగు శ్రీకృష్ణుడు, అర్భకైః సహ - గోపబాలకులతో బాటుగా, అభ్యవహృత్య - భోజనము చేసి, ఆజగరమ్ - కొండ చిలువకు చెందిన, చర్మ - చర్మమును, దర్శయన్ - చూపువాడై, వనాత్ - అడవినుండి, వ్రజమ్ - గోకులమును గురించి, న్యవర్తత - తిరిగి వచ్చెను.

తరువాత ఇంద్రియాంతర్యామియగు శ్రీకృష్ణుడు నవ్వుతూ గోపబాలకులతో బాటుగా భోజనము చేసి, వారికి కొండ చిలువయొక్క చర్మమును చూపిస్తూ, అడవినుండి గోకులమునకు తిరిగి వచ్చెను.

బర్హప్రసూననవధాతువిచిత్రితాంగః
ప్రోద్దామవేణుదలశృంగరవోత్సవాఢ్యః ।
వత్సాన్ గృణన్ననుగగీతపవిత్రకీర్తిః
గోపీదృగుత్సవదృశిః ప్రవివేశ గోష్ఠమ్ ॥ 47

బర్హప్రసూననవధాతువిచిత్రిత-అంగః - నెమలి పింఛము పువ్వులు తొమ్మిది రాతి రంగులచే రంగు రంగులుగా చేయబడిన అవయవములు గలవాడు, ప్ర-ఉద్దామవేణుదలశృంగరవ-ఉత్సవ-ఆఢ్యః - బిగ్గరయైన

పిల్లన గ్రోవి కొమ్ము బూరాల ధ్వనిచే కలిగే ఉత్సాహముతో సంపన్నుడు, అనుగగీతపవిత్రకీర్తిః - అనుచరులచే గానము చేయబడిన పవిత్రమైన కీర్తి గలవాడు, గోపీదృగ్-ఉత్సవదృశిః - గోపికల కళ్లకు ఉత్సవమైన దర్శనము గల శ్రీకృష్ణుడు, వత్సాన్ - దూడలను, గృణన్ - పిలుచువాడై, గోష్ఠమ్ - గోకులమును, ప్రవివేశ - ప్రవేశించెను.

శ్రీకృష్ణుడు నెమలి పింఛములను, పువ్వులను, తొమ్మిది రకముల రాతి రంగులను దాల్చుటచే ఆయన అవయవములు రంగు రంగులుగా నుండెను. ఆయన పిల్లన గ్రోవిని, కొమ్ము బూరాను బిగ్గరగా వాయిస్తూ ఆ ధ్వనిచే వర్ధిల్లిన ఉత్సవముతో సంపన్నుడై యుండెను. ఆయన అనుచరులు ఆయన పవిత్రమగు కీర్తిని గానము చేయుచుండిరి. ఆయన దూడలను పేర్లు పెట్టి పిలుస్తూ గోకులములో ప్రవేశించగానే, ఆయన దర్శనము గోపికల నేత్రముల్కకు ఉత్సవమాయెను.

అద్యానేన మహావ్యాలో యశోదానందసూనునా ।
హతోఽవితా వయం చాస్మాదితి బాలా వ్రజే జగుః ॥ 48

అద్య - ఈనాడు, యశోదానందసూనునా - యశోదానందుల పుత్రుడగు, అనేన - ఈ శ్రీకృష్ణునిచే, మహావ్యాలః - పెద్ద పాము, హతః - చంపబడినది, అస్మాత్ - దీనినుండి, వయమ్ - మేము, అవితాః చ - రక్షించబడితిమి కూడ, ఇతి - అని, బాలాః - గోపబాలకులు, వ్రజే - గోకులమునందు, జగుః - చెప్పిరి.

ఈనాడు యశోదానందుల పుత్రుడగు శ్రీకృష్ణుడు పెద్ద పామును చంపి, దానినుండి మమ్ములను కూడ కాపాడినాడని గోపబాలకులు గోకులములో చెప్పిరి.

రాజోవాచ ।
బ్రహ్మన్ పరోద్భవే కృష్ణే ఇయాన్ ప్రేమా కథం భవేత్ ।
యోఽభూతపూర్వస్తోకేషు స్వోద్భవేష్వపి కథ్యతామ్ ॥ 49

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, పర-ఉద్భవే - ఇతరులకు పుట్టిన, కృష్ణే - శ్రీకృష్ణునియందు, ఇయాన్ - ఇంతటి, ప్రేమా - ప్రేమ, కథమ్ - ఎట్లు,

భవేత్ - కలుగును?, స్వ-ఉద్భవేషు - తమకు పుట్టిన, తోకేషు అపి - పిల్లలయందు కూడ, యః - ఏ ప్రేమ, అభూతపూర్వః - ఇదివరలో లేదో, కథ్యతామ్ - చెప్పబడుగాక!

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! తమకు పుట్టిన పిల్లలయందు కూడ ఇదివరలో ఎట్టి ప్రేమ లేదో, ఇంతటి ప్రేమ ఇతరుల పిల్లవాడైన శ్రీకృష్ణునిపై ఎట్లు కలిగినది? చెప్పుడు.

శ్రీశుక ఉవాచ ।
సర్వేషామపి భూతానాం నృప స్వాత్మైవ వల్లభః ।
ఇతరేऽపత్యవిత్తాద్యాస్తద్వల్లభతయైవ హి ॥ 50

నృప - ఓ రాజా!, సర్వేషామ్ - అన్ని, భూతానామ్ - ప్రాణులకు, స్వ-ఆత్మా ఏవ - తమ ఆత్మయే, వల్లభః - ప్రియమైనది, అపత్యవిత్త-ఆద్యాః - సంతానము ధనము మొదలైన, ఇతరే - ఇతరములు, తద్-వల్లభతయా ఏవ - ఆ ఆత్మకు ప్రియములగుటచేత మాత్రమే, హి - నిశ్చయము.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! సకలప్రాణులకు తమ ఆత్మయే ప్రియమైనది. సంతానము, ధనము, అధికారము మొదలైన ఇతరములు ఆ ఆత్మకు ప్రియములగుటచే మాత్రమే ప్రియములగుచున్నవి. ఇది నిశ్చయము.

తద్రాజేంద్ర యథా స్నేహస్స్వస్వకాత్మని దేహినామ్ ।
న తథా మమతాలంబిపుత్రవిత్తగృహాదిషు ॥ 51

రాజ-ఇంద్ర - ఓ మహారాజా!, తత్ - అందువలన, దేహినామ్ - దేహధారులకు, యథా - ఏ విధముగానైతే, స్వస్వక-ఆత్మని - తమ తమ ఆత్మయందు, స్నేహః - ప్రేమయో, తథా - ఆ విధముగా, మమతా-ఆలంబిపుత్రవిత్తగృహ-ఆదిషు - మమకారమునకు ఆలంబనమైన సంతానము ధనము ఇల్లు మొదలగువాటియందు, న - ఉండదు.

ఓ పరీక్షిన్మహారాజా! కావున, దేహధారులకు తమ తమ ఆత్మయందు ఎట్టి ప్రేమ ఉండునో, అట్టి ప్రేమ మమకారమునకు ఆలంబనమైన సంతానము, ధనము, ఇల్లు, ఆస్తి మొదలగువాటియందు ఉండదు.

దేహాత్మవాదినాం పుంసామపి రాజన్యసత్తమ ।
యథా దేహః ప్రియతమస్తథా న హ్యను యే చ తమ్ ॥ 52

రాజన్యసత్తమ - ఓ మహారాజా!, దేహ-ఆత్మవాదినామ్ - దేహమే ఆత్మ అని వాదించే, పుంసాం అపి - వ్యక్తులకు కూడ, దేహః - దేహము, యథా - ఏ విధముగా, ప్రియతమః - మిక్కిలి ప్రియమో, తథా - ఆ విధముగా, యే చ - ఎవరైతే, తమ్ - ఆ దేహమును, అను - అనుసరించునో, న హి - కావు కదా!

ఓ పరీక్షిన్మహారాజా! దేహమే ఆత్మ అని వాదించే వ్యక్తులకు కూడ దేహము ఎంత అధికముగా ప్రీతిపాత్రమో, దేహమునునుసరించి వచ్చిన ధనధాన్యాదులయందైతే అంత ప్రీతి ఉండదు గదా!

దేహోఽపి మమతాభాక్చేత్తర్హ్యసౌ నాత్మవత్ప్రియః ।
యజ్జీర్యత్యపి దేహేఽస్మిన్ జీవితాశా బలీయసీ ॥ 53

దేహః అపి - దేహము కూడ, మమతాభాక్ చేత్ - నాది అనే భావనకు ఆలంబనమైనచో, తర్హి - అప్పుడు, అసౌ - ఈ దేహము, ఆత్మవత్ - ఆత్మవలె, ప్రియః - ప్రియము, న - కాదు, యత్ - ఏలయన, అస్మిన్ - ఈ, దేహే - దేహము, జీర్యతి అపి - శిథిలమైననూ, జీవిత-ఆశా - జీవితమునందలి ఆశ, బలీయసీ - బలమైనది.

కొంత వివేకము గలవారికి దేహమునందు నేను అని కాక, నాది అనే అభిమానము ఉండును. వారికైననూ దేహము ఆత్మవలె ప్రియము కాదు. ఎందుకంటే, ఈ దేహము శిథిలమైనా జీవించాలనే ఆశ బలముగా నుండును. (ఆ ఆశకు ఆస్పదము శిథిలమైన దేహము గాక, దేహవిలక్షణమైన ఆత్మయేనని భావము).

తస్మాత్ప్రియతమస్స్వాత్మా సర్వేషామపి దేహినామ్ ।
తదర్థమేవ సకలం జగదేతచ్చరాచరమ్ ॥ 54

తస్మాత్ - అందువలన, సర్వేషామ్ - అందరు, దేహినాం అపి - ప్రాణులకు కూడ, స్వ-ఆత్మా - తమ ఆత్మ, ప్రియతమః - అత్యంతము ప్రియము, ఏతత్ - ఈ, చర-అచరమ్ - కదిలే మరియు కదలని ప్రాణులు గల, జగత్ - జగత్తు, తద్-అర్థం ఏవ - ఆ ఆత్మ కొరకు మాత్రమే.

కావున, సకలప్రాణులకు కూడ ఆత్మయే అత్యంతము ప్రియము. కదిలే పుత్రాదులు, కదలని గృహాదులతో కూడిన ఈ జగత్తు ఆ ఆత్మ కొరకు మాత్రమే ప్రియమగుచున్నది.

కృష్ణమేనమవేహి త్వమాత్మానమఖిలాత్మనామ్ ।
జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా ॥ 55

త్వమ్ - నీవు, ఏనమ్ - ఈ, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, అఖిల-ఆత్మనామ్ - సకలప్రాణులకు, ఆత్మానమ్ - ఆత్మనుగా, అవేహి - తెలియుము, సః అపి - ఆయన కూడ, జగద్-హితాయ - జగత్తుయొక్క హితము కొరకు, మాయయా - మాయాశక్తిచే, దేహీ ఇవ - దేహధారి వలె, ఆభాతి - కనబడుచున్నాడు.

ఈ శ్రీకృష్ణుడు సకలప్రాణుల ఆత్మయని నీవు దెలియుము. ఈయన జగత్తునకు హితము కొరకే మాయాశక్తిచే దేహధారివలె కన్పట్టుచున్నాడు.

వస్తుతో జానతామత్ర కృష్ణం స్థాస్ను చరిష్ణు చ ।
భగవద్రూపమఖిలం నాన్యద్వస్త్విహ కించన ॥ 56

వస్తుతః - పరమార్థముగా, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, జానతామ్ - తెలియువారలకు, అత్ర - ఈ జగత్తునందు, స్థాస్ను - కదలనిది, చరిష్ణు చ - కదిలే స్వభావము గలది కూడ, అఖిలమ్ - సర్వము, భగవద్-రూపమ్ - భగవానుని రూపమే, అన్యత్ - మరియొకటి, కించన - కొంచెమైననూ, ఇహ - ఈ లోకమునందు, న అస్తి - లేదు.

శ్రీకృష్ణుని పరమార్థస్వరూపము తెలిసినవారలకు ఈ జగత్తులో కదిలేవి, కదలనివి సర్వము భగవానుని రూపమే. భగవానునికంటె వేరుగా కొంచెమైననూ ఏదీ ఈ లోకములో లేదు.

సర్వేషామపి వస్తూనాం భావార్థో భవతి స్థితః ।
తస్యాపి భగవాన్ కృష్ణః కిమతద్వస్తు రూప్యతామ్ ॥ 57

సర్వేషామ్ - అన్ని, వస్తూనామ్ - పదార్థములకు, భావ-అర్థః - పరమార్థము (కారణరూపమైన వస్తువు), స్థితః - స్థిరముగా, భవతి - ఉండును, తస్య అపి - ఆ కారణమునకు కూడ, భగవాన్ కృష్ణః - శ్రీకృష్ణ భగవానుడు, అతత్ - ఆ శ్రీకృష్ణుడు కాని, వస్తు - వస్తువు, కిమ్ - ఏదియో, నిరూప్యతామ్ - చూపించబడుగాక!

పదార్థములన్నింటికీ కారణమొకటి (ప్రకృతి) స్థిరముగా నుండును. అదియే ఆ వస్తువుయొక్క పరమార్థము. ఆ కారణమునకు కూడ శ్రీకృష్ణ భగవానుడు కారణము. ఆ శ్రీకృష్ణుడు కాని వస్తువును దేనినైననూ చూపించుడు (అట్టిది ఏదీ లేదని భావము).

సమాశ్రితా యే పదపల్లవప్లవం
మహత్పదం పుణ్యయశోమురారేః ।
భవాంబుధిర్వత్సపదం పరం పదం
పదం పదం యద్విపదాం న తేషామ్ ॥ 58

యే - ఎవరైతే, మహత్-పదమ్ - మహాత్ములకు ఆశ్రయమైనట్టియు, పుణ్యయశః-ముర-అరేః - పవిత్రమగు కీర్తి కలిగినట్టియు మురుడనే రాక్షసుని సంహరించిన శ్రీకృష్ణునియొక్క, పదపల్లవప్లవమ్ - చిగురుటాకు వంటి పాదమనే పడవను, సమాశ్రితాః - గట్టిగా పట్టుకున్నారో, తేషామ్ - వారికి, భవ-అంబుధిః - సముద్రమువంటి సంసారము, వత్సపదమ్ - దూడ గిట్ట గాడి, పరమ్ - సర్వోత్కృష్టమైన, పదమ్ - మోక్షము, పదమ్ - స్థానము, యత్ - ఏది, విపదామ్ - ఆపదలకు, పదమ్ - స్థానమో అది, న - కాదు.

మురుడనే రాక్షసుని సంహరించిన శ్రీకృష్ణుని కీర్తి పవిత్రమైనది. మహాత్ములు ఆశ్రయించే ఆయనయొక్క చిగురుటాకువంటి పాదమునెవరైతే గట్టిగా పట్టుకొనెదరో, వారు సముద్రమువంటి సంసారమును దూడ గిట్ట గాడిని దాటినంత తేలికగా తగించెదరు. వారికి

సర్వాతిశాయియగు మోక్షస్థానము లభించును. ఆపదలకు నిలయమగు సంసారము మరల వారికి కలుగదు.

ఏతత్తే సర్వమాఖ్యాతం యత్పృష్టోఽహమిహ త్వయా ।
యత్కౌమారే హరికృతం పౌగండే పరికీర్తితమ్ ॥ 59

ఏతత్ - ఈ, సర్వమ్ - అంతయు, తే - నీ కొరకు, ఆఖ్యాతమ్ - చెప్పబడినది, యత్ - ఏదైతే, అహమ్ - నేను, త్వయా - నీచే, ఇహ - ఈ విషయమునందు, పృష్టః - ప్రశ్నించబడితినో, యత్ - ఏదనగా, కౌమారే - ఐదవ ఏడు వయస్సునందు, హరికృతమ్ - శ్రీకృష్ణ భగవానునిచే చేయబడినదో అది, పౌగండే - ఆరవ ఏడు వయస్సునందు, పరికీర్తితమ్ - అంతటా చెప్పబడినది.

శ్రీకృష్ణ భగవానుడు తన ఐదవ యేట చేసిన లీలను ఆయనకు ఆరవ ఏడు వచ్చినప్పుడు అంతటా కీర్తించిరి. ఈ లీల విషయములో నీవు నన్ను అడిగిన ప్రశ్నకు ఈ సమాధానమునంతనూ నేను నీకు చెప్పితిని.

ఏతత్సుహృద్భిశ్చరితం మురారేరఘార్దనం శాద్వలజేమనం చ ।
వ్యక్తేతరద్రూపమజోర్వభిష్టవం శృణ్వన్గృణన్నేతి నరోఽఖిలార్థాన్ ॥60

ముర-అరేః - మురాసురుని సంహరించిన శ్రీకృష్ణ భగవానునియొక్క, ఏతత్ - ఈ, సుహృద్భిః - మిత్రులతోడి, చరితమ్ - నడవడిని, అఘ-అర్దనమ్ - అఘాసురుని సంహారమును, శాద్వలజేమనమ్ - పచ్చిక బయలునందు (పచ్చికను) భోజనమును చేయుటను, వ్యక్త-ఇతరద్-రూపమ్ - ఇంద్రియగోచరమయ్యే జగత్తుకంటె విలక్షణమైన చిన్మయతత్త్వమును కలిగియుండుటను, అజ-ఉరు-అభిష్టవం చ - స్వయంభువుడగు బ్రహ్మదేవునిచే గొప్ప స్తోత్రమును కూడ, శృణ్వన్ - వినువాడు, గృణన్ - చెప్పువాడు, నరః - మానవుడు, అఖిల-అర్థాన్ - సకలపురుషార్థములను, ఏతి - పొందును.

మురాసురుని సంహరించిన శ్రీకృష్ణ భగవానుడు మిత్రులతో కూడి చేసిన లీలలను, అఘాసుర సంహారమును, పచ్చిక బయలునందు భుజించుటను, దూడల రూపముగా పచ్చికను తినుటను,

ఇంద్రియగోచరమయ్యే జడజగత్తుకంటె విలక్షణమైన చైతన్యస్వరూపుడై యుండుటను, స్వయంభువుడగు బ్రహ్మదేవుడు చేసిన గొప్ప స్తోత్రమును వినే మరియు కీర్తించే మానవుడు నాలుగు పురుషార్థములను పొందును.

ఏవం విహారైః కౌమారైః కౌమారం జహతుర్వ్రజే ।
నిలాయనైస్సేతుబంధైర్మర్కటోత్ప్లవనాదిభిః ॥ 61

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్థే చతుర్దశోఽధ్యాయః ॥

ఏవమ్ - ఈ విధముగా, నిలాయనైః - దాగుడు మూతలతో, సేతుబంధైః - ఇసుకలో సేతువులను కట్టుటలతో, మర్కట-ఉత్-ప్లవన-ఆదిభిః - కోతి కొమ్మచ్చి ఆటలు మొదలగువాటితో, కౌమారైః - ఐదేళ్ల వయస్సుకు చెందిన, విహారైః - ఆటపాటలతో, వ్రజే - గోకులమునందు, కౌమారమ్ - ఐదేళ్ల వయసును, జహతుః - విడిచిపెట్టిరి.

ఈ విధముగా దాగుడు మూతలు, ఇసుకలో సేతువును కట్టుట, కోతి కొమ్మచ్చి, గోటీలు మొదలగు ఐదేళ్ల వయస్సులో ఆడే ఆటలతో బలరామకృష్ణులు గోకులములో ఆ వయస్సును గడిపి వేసిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్థములో బ్రహ్మస్తుతిని వర్ణించే పధ్నాల్గవ
అధ్యాయము ముగిసినది (14).

* * * * *

# అథ పంచదశోఽధ్యాయః

## ధేనుకాసురుని ఉద్ధరించుట

శ్రీశుక ఉవాచ ।
తతశ్చ పౌగండవయశ్శ్రితౌ వ్రజే
బభూవతుస్తౌ పశుపాలసమ్మతౌ ।
గాశ్చారయంతౌ సఖిభిస్సమం పదైః
బృందావనం పుణ్యమతీవ చక్రతుః ॥ 1

తతః - తరువాత, పౌగండవయః - ఆరు సంవత్సరములు దాటిన వయస్సును, శ్రితౌ - పొందిన, తౌ - ఆ బలరామకృష్ణులిద్దరు, వ్రజే - గోకులమునందు, పశుపాలసమ్మతౌ - పశువులను కాయుటయందు స్వీకరించబడినవారు, బభూవతుః - అయిరి, సఖిభిః సమమ్ - మిత్రులతో బాటుగా, గాః - గోవులను, చారయంతౌ - మేపువారై, పదైః - కాలి యడుగులతో, బృందావనమ్ - బృందావనమును, అతీవ - మిక్కిలి, పుణ్యమ్ - పవిత్రమునుగా, చక్రతుః - చేసిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- తరువాత బలరామకృష్ణులిద్దరి వయస్సు ఆరు సంవత్సరములు దాటెను. అప్పుడు నందాదులు వారికి (దూడలు మాత్రమే కాకుండా) పశువులను కాసే పనిని అప్పజెప్ప వచ్చునని స్వీకరించిరి. వారిద్దరు మిత్రులతో కలిసి గోవులను మేపుతూ తమ కాలి అడుగులతో బృందావనమును మిక్కిలి పవిత్రముగా చేసిరి.

తన్మాధవో వేణుముదీరయన్వృతో గోపైర్గృణద్భిస్స్వయశో బలాన్వితః
పశూన్పురస్కృత్య పశవ్యమావిశద్విహర్తుకామః కుసుమాకరం వనమ్।

వేణుమ్ - పిల్లన గ్రోవిని, ఉదీరయన్ - ఊదుచున్నవాడు, స్వయశః - తన కీర్తిని, గృణద్భిః - గానము చేయుచున్న, గోపైః - గోపబాలకులతో, వృతః - చుట్టువారబడినవాడు, బల-అన్వితః - బలరామునితో

కూడినవాడు, విహర్తుకామః - విహరించే కోరిక గలవాడు అగు, మాధవః - లక్ష్మీపతియగు శ్రీకృష్ణుడు, పశూన్ - పశువులను, పురస్కృత్య - ముందిడుకొని, పశవ్యమ్ - పశువులకు హితకరమైనట్టియు, కుసుమ-ఆకరమ్ - పుష్పముల గనియైన, తత్ - ఆ, వనమ్ - బృందావనమును, ఆవిశత్ - ప్రవేశించెను. 2

లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుడు పశువులు ముందు నడువగా బలరామునితో గూడి పిల్లన గ్రోవిని ఊదుకుంటూ పుష్పముల గనియగు ఆ బృందావనమును ప్రవేశించెను. ఆ వనము పశువులకు హితకరమైనది. గోపబాలకులు, విహరించగోరే ఆ బాలకృష్ణుని చుట్టూ చేరి ఆయన కీర్తిని గానము చేయుచుండిరి.

తన్మంజుఘోషాలిమృగద్విజాకులం మహన్మనఃప్రఖ్యపయస్సరస్వతా।
వాతేన జుష్టం శతపత్రగంధినా నిరీక్ష్య రంతుం భగవాన్మనో దధే ॥3

మంజుఘోష-అలిమృగద్విజ-ఆకులమ్ - మధురమగు ధ్వనులు గల తుమ్మెదలు లేళ్లు పక్షులతో హడావుడిగా నున్నట్టియు, మహత్-మనఃప్రఖ్యపయః-సరస్వతా - మహాత్ముల మనస్సును పోలిన నీరు గల సరస్సులు గల, శతపత్రగంధినా - పద్మముల పరిమళము గల, వాతేన - గాలితో, జుష్టమ్ - సేవించబడు, తత్ - ఆ బృందావనమును, నిరీక్ష్య - చూచి, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, రంతుమ్ - విహరించుటకు, మనః దధే - నిశ్చయించెను.

మధురమగు ధ్వనులను చేసే తుమ్మెదలు, లేళ్లు, పక్షులతో హడావుడిగానున్న ఆ బృందావనమును చూచి శ్రీకృష్ణ భగవానుడు విహరించుటకు నిశ్చయించెను. అచటి సరస్సులలోని నీరు మహాత్ముల మనస్సును పోలి (స్వచ్ఛముగా) యుండెను. గాలి ఆ నీళ్లపైనుండి వస్తూ పద్మముల సుగంధమును మోసుకువచ్చి ఆ వనమును సేవించుచుండెను.

స తత్ర తత్రారుణపల్లవశ్రియా
ఫలప్రసూనోరుభరేణ పాదయోః ।

స్పృశచ్ఛిఖాన్వీక్ష్య వనస్పతీన్ముదా
స్మయన్నివాహాగ్రజమాదిపూరుషః ॥ 4

ఆదిపూరుషః - సర్వజగత్కారణుడు పూర్ణుడు అగు, సః - ఆ శ్రీకృష్ణుడు, తత్ర తత్ర - అక్కడక్కడ, అరుణపల్లవశ్రియా - ఎఱ్ఱని చిగుళ్ల శోభ కలిగినట్టియు, ఫలప్రసూన-ఉరుభరేణ - పళ్లు పువ్వుల అధికమగు బరువు కలిగినట్టియు, పాదయోః - పాదములయందు, స్పృశత్-శిఖాన్ - స్పృశించే కొమ్మల కొనలు గల, వనస్పతీన్ - చెట్లను, వీక్ష్య - చూచి, ముదా - ఆనందముతో, స్మయన్ ఇవ - ఆశ్చర్యపడుతున్నాడా యన్నట్లు, అగ్రజమ్ - అన్ననుద్దేశించి, ఆహ - పలికెను.

సర్వజగత్కారణుడు, పూర్ణుడు అగు ఆ శ్రీకృష్ణుడు అక్కడక్కడ చెట్ల ఎఱ్ఱని చిగుళ్ల శోభకు ఆనందించెను. అధికమగు పళ్ల మరియు పువ్వుల బరువుతో వంగి కొమ్మల కొనలతో తన పాదములను స్పృశించే చెట్లను చూచి విస్మితుడాయెనా యన్నట్లు ఆయన అన్నగారితో నిట్లనెను.

శ్రీభగవానువాచ ।
అహో అమీ దేవవరామరార్చితం
పాదాంబుజం తే సుమనఃఫలార్హణమ్ ।
నమంత్యుపాదాయ శిఖాభిరాత్మనః
తమోఽపహత్యై తరుజన్మ యత్కృతమ్ ॥ 5

అహో - ఆహా!, దేవవర - ఓ దేవశ్రేష్ఠా!, అమీ - ఈ చెట్లు, ఆత్మనః - తన, తమః-అపహత్యై - పాపమును పోగొట్టుకొనుటకై, శిఖాభిః - కొమ్మలతో, సుమనః-ఫల-అర్హణమ్ - పువ్వులు పళ్లు అనే పూజాద్రవ్యమును, ఉపాదాయ - సమర్పించి, తే - నీయొక్క, అమర-అర్చితమ్, - దేవతలచే పూజించబడే, పాద-అంబుజమ్ - పద్మమువంటి పాదమును, నమంతి - నమస్కరించుచున్నవి, తరుజన్మ - చెట్టు జన్మ, యత్-కృతమ్ - ఏ పాపముచే (దేని కొరకు) కలిగించబడినదో.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- ఓ దేవశ్రేష్ఠా! ఆహా! ఈ చెట్లు తమకు ఏ పాపమైతే చెట్టు జన్మనిచ్చినదో ఆ పాపమును పోగొట్టుకొనుటకై

పువ్వులు, పళ్లు అనే పూజాసామగ్రిని సమర్పించి, దేవతలు పూజించే నీ పద్మమువంటి పాదమునకు కొమ్మలతో నమస్కరించుచున్నవి. ఇవి ఈ భాగ్యము కొరకే చెట్టు జన్మనెత్తినవి.

ఏతేఽలినస్తవ యశోఽఖిలలోకతీర్థం
గాయంత ఆదిపురుషానుపదం భజంతే ।
ప్రాయో అమీ మునిగణా భవదీయముఖ్యా
గూఢం వనేఽపి న జహత్యనఘాత్మ దైవమ్ ॥ 6

ఆదిపురుష - జగత్కారణమగు పూర్ణబ్రహ్మమా!, అనఘ - దోషములు లేనివాడా!, ఏతే - ఈ, అలినః - తుమ్మెదలు, అఖిలలోకతీర్థమ్ - సకలలోకములకు పావనమైన, తవ - నీ, యశః - కీర్తిని, గాయంతః - గానము చేయుచున్నవై, అనుపదమ్ - అడుగడుగునా, భజంతే - సేవించుచున్నవి, ప్రాయః - బహుశః, అమీ - ఇవి, భవద్దీయముఖ్యాః - నీ భక్తులలో ప్రముఖములైన, మునిగణాః - మహర్షుల గణములు, వనే - అడవియందు, గూఢం అపి - రహస్యముగా నున్ననూ, ఆత్మ దైవమ్ - తమ దైవమగు నిన్ను, న జహాతి - విడిచిపెట్టుట లేదు.

అన్నా! దోషములు లేని నీవు జగత్కారణమగు పూర్ణబ్రహ్మవే. సకలలోకములను పావనము చేసే నీ కీర్తిని గానము చేస్తూ ఈ తుమ్మెదలు నిన్ను అడుగడుగునా సేవించుచున్నవి. ఇవి బహుశః నీ భక్తులలో అగ్రగణ్యులగు మహర్షుల గణములు కాబోలు. వారు అడవిలో రహస్యముగా ఉన్నా తమ దైవమగు నిన్ను విడిచిపెట్టుట లేదు.

నృత్యంత్యమీ శిఖిన ఈడ్య ముదా హరిణ్యః
కుర్వంతి గోప్య ఇవ తే ప్రియమీక్షణేన ।
సూక్తైశ్చ కోకిలగణా గృహమాగతాయ
ధన్యా వనౌకస ఇయాన్ హి సతాం నిసర్గః ॥ 7

ఈడ్య - కొనియాడదగినవాడా!, అమీ - ఈ, శిఖినః - నెమళ్లు, ముదా - ఆనందముతో, నృత్యంతి - నాట్యమాడుచున్నవి, హరిణ్యః - లేళ్లు, గోప్యః ఇవ - గోపికలు వలె, ఈక్షణేన - చూపుతో, కోకిలగణాః చ -

కోకిలల గుంపులు కూడ, సు-ఉక్త్తైః - మధురమగు కూతలతో, గృహమ్ - ఇంటిని గురించి, ఆగతాయ - విచ్చేసిన, తే - నీ కొరకు, ప్రియమ్ - ప్రీతిని, కుర్వంతి - చేయుచున్నవి, వన-ఓకసః - అడవిలో నివసించే ప్రాణులు, ధన్యాః - కృతార్థములు, హి - ఏలయన, సతామ్ - సత్పురుషుల, నిసర్గః - స్వభావము, ఇయాన్ - ఇట్టిది.

కొనియాడదగిన ఓ రామా! ఈ నెమళ్ళు ఆనందముతో నాట్యమాడుచున్నవి. లేళ్లు గోపికలు వలె చూపుతో, మరియు కోకిలల గుంపులు మధురమగు కూతలతో ఇంటికి విచ్చేసిన నీకు ప్రీతిని కలిగించుచున్నవి. అడవిలో నివసించే ప్రాణులు కృతార్థులు. ఎందుకంటే, సత్పురుషుల స్వభావము ఇట్టిది (అతిథిని సత్కరించుట).

ధన్యేయమద్య ధరణీ తృణవీరుధస్త్వత్-
పాదస్పృశో ద్రుమలతాః కరజాభిమృష్టాః ।
నద్యోఽద్రయః ఖగమృగాస్సదయావలోకైః
గోప్యోఽంతరేణ భుజయోరపి యత్స్పృహా శ్రీః ॥ 8

అద్య - ఈ నాడు, ఇయమ్ - ఈ, ధరణీ - పృథివి, ధన్యా - ధన్యురాలు, త్వత్-పాదస్పృశః - నీపాదములను స్పృశించే, తృణవీరుధః - గడ్డి మరియు మొక్కలు, కరజ-అభిమృష్టాః - వ్రేళ్లతో స్పృశించబడే, ద్రుమలతాః - చెట్లు తీగలు, సదయా-అవలోకైః - దయతో కూడిన చూపులచే, నద్యః - నదులు, అద్రయః - పర్వతములు, ఖగమృగాః - పక్షులు పశువులు, భుజయోః - రెండు భుజములయొక్క, అంతరేణ - మధ్యభాగమగు వక్షఃస్థలముచే, గోప్యః - గోపికలు, శ్రీః అపి - లక్ష్మీదేవి కూడ, యత్-స్పృహా - ఏ వక్షఃస్థలమునందు కోరిక గలదియో.

ఈ నాడు నీ పాదస్పర్శచే ఈ భూమి, గడ్డి, మొక్కలు, నీ చేతి వ్రేళ్ల స్పర్శచే చెట్లు, తీగలు, దయతో కూడిన నీ చూపులచే నదులు, పర్వతములు, పక్షులు, పశువులు, నీ వక్షఃస్థలమును స్పృశించుటచే గోపికలు కూడ ధన్యులైరి. నీ వక్షఃస్థలమును స్పృశించవలెనని లక్ష్మీదేవి కూడ కోరుచుండును.

శ్రీశుక ఉవాచ ।
ఏవం బృందావనం శ్రీమత్కృష్ణః ప్రీతమనాః పశూన్ ।
రేమే సంచారయన్నద్రేస్సరిద్రోధస్సు సానుగః ॥ 9

ఏవమ్ - ఈ విధముగా, శ్రీమత్ - శోభాయుక్తమైన, బృందావనమ్ - బృందావనమును గురించి, ప్రీతమనాః - ప్రీతి జెందిన మనస్సు గల, కృష్ణః - శ్రీకృష్ణుడు, స-అనుగః - అనుచరులతో కూడినవాడై, అద్రేః - పర్వతముయొక్క, సరిద్-రోధస్సు - నదియొక్క తీరములయందు, పశూన్ - పశువులను, సంచారయన్ - బాగుగా మేపుచున్నవాడై, రేమే - విహరించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా శ్రీకృష్ణుని మనస్సు శోభాయుక్తమగు బృందావనమును చూచి చాల ప్రీతి జెందెను. ఆయన అనుచరులతో గూడి గోవర్ధన పర్వతమునకు సమీపములో యమునానదీతీరములయందు పశువులను బాగుగా మేపుతూ విహరించెను.

క్వచిద్గాయతి గాయత్సు మదాంధాలిష్వనువ్రతైః ।
ఉపగీయమానచరితస్స్రగ్వీ సంకర్షణాన్వితః ॥ 10

అనువ్రతైః - అనుచరులచే, ఉపగీయమానచరితః - గానము చేయబడే చరితము గలవాడు, స్రగ్వీ - వనమాలను దాల్చువాడు, సంకర్షణ-అన్వితః - బలరామునితో గూడియున్నవాడు అగు శ్రీకృష్ణుడు, మద-అంధ-అలిషు - మత్తుతో గ్రుడ్డివైన తుమ్మెదలు, గాయత్సు - పాడుచుండగా, క్వచిత్ - ఒకప్పుడు, గాయతి - పాడును.

శ్రీకృష్ణుని వెంట ఉండే గోపబాలకులు ఆయన చరితమును గానము చేయుచుండిరి. తేనెతో మత్తెక్కి తుమ్మెదలు ధ్వనిని చేయుచుండగా, బలరామునితో గూడి వనమాలను దాల్చియున్న ఆ శ్రీకృష్ణుడు ఒకప్పుడు తాను కూడ వాటితో స్వరము కలిపి పాడును.

క్వచిచ్చ కలహంసానామనుకూజతి కూజితమ్ ।
అభినృత్యతి నృత్యంతం బర్హిణం హాసయన్ క్వచిత్ ॥ 11

క్వచిత్ చ - మరియొకప్పుడు, కలహంసానామ్ - రాజహంసల, కూజితమ్ - కూతను, అనుకృత్య - అనుకరించి, కూజతి - కూయును, క్వచిత్ - ఒకప్పుడు, హాసయన్ - నవ్వునట్లు చేయుచున్నవాడై, నృత్యంతమ్ - నాట్యమాడుచున్న, బర్హిణమ్ - నెమలిని ఉద్దేశించి, అభి - ఎదురుగా, నృత్యతి - నాట్యమాడును.

మరియొకప్పుడు శ్రీకృష్ణుడు రాజహంసల కూతను అనుకరిస్తూ కూయును. ఒకప్పుడు నాట్యమాడుచున్న నెమలి ఎదురుగా నాట్యమాడి గోపబాలకులను నవ్వించును.

మేఘగంభీరయా వాచా నామభిర్దూరగాన్ పశూన్ ।
క్వచిదాహ్వయతి ప్రీత్యా గోగోపాలమనోజ్ఞయా ।। 12

క్వచిత్ - ఒకప్పుడు, మేఘగంభీరయా - మేఘగర్జన వలె గంభీరమైనట్టియు, గోగోపాలమనః-జ్ఞయా - గోవులకు గోపబాలకులకు మనోహరమైన, వాచా - వాక్కుతో, దూరగాన్ - దూరమునకు వెళ్లిన, పశూన్ - పశువులను, నామభిః - పేర్లతో, ఆహ్వయతి - పిలుచును.

ఒకప్పుడు ఆయన మేఘగర్జన వలె గంభీరమైన వాక్కుతో దూరమునకు వెళ్లిన పశువులను వాటి పేర్లతో పిలుచును. ఆయన వాక్కు గోవులకు, గోపబాలకులకు మనోహరముగా నుండును.

చకోరక్రౌంచచక్రాహ్వాభారద్వాజాంశ్చ బర్హిణః ।
అనురౌతి స్మ సత్త్వానాం భీతవద్వ్యాఘ్రసింహయోః ।। 13

చకోరక్రౌంచచక్ర-ఆహ్వాభారద్వాజాన్ - వెన్నెల పక్షి కొంగ పేరునందు చక్రము గల పక్షి ఏట్రింత పక్షులను, బర్హిణః చ - నెమళ్లను కూడ, అను రౌతి స్మ - అనుకరించి కూయును, సత్త్వానామ్ - జంతువులలో, వ్యాఘ్ర సింహయోః - పెద్ద పులి సింహములకు, భీతవత్ - భయపడినవాడు వలె.

ఆయన వెన్నెల పక్షి, కొంగ, చక్రవాక (జక్కవ) పక్షి, ఏట్రింత పక్షి, నెమళ్లను అనుకరిస్తూ కూయును. జంతువులలో పెద్దపులి, సింహముల గాండ్రింపులను విని భయపడినవాడు వలె పరుగెత్తును.

క్వచిత్క్రీడాపరిశ్రాంతం గోపోత్సంగోపబర్హణమ్ ।
స్వయం విశ్రమయత్యార్యం పాదసంవాహనాదిభిః ॥ 14

క్వచిత్ - ఒకప్పుడు, క్రీడాపరిశ్రాంతమ్ - ఆటలతో అలసినట్టియు, గోప-ఉత్సంగ-ఉపబర్హణమ్ - గోపబాలకుని ఒడియే దిండుగా గల, ఆర్యమ్ - అన్నయగు బలరాముని, స్వయమ్ - స్వయముగా, పాదసంవాహన-ఆదిభిః - కాళ్లను పట్టుట మొదలగువాటితో, విశ్రమయతి - విశ్రమింప జేయును.

ఒకప్పుడు అన్నగారగు బలరాముడు ఆటలతో అలసిపోయి గోపబాలకుని ఒడినే దిండుగా చేసుకొని పరుండగా, శ్రీకృష్ణుడు స్వయముగా ఆయన కాళ్లను పట్టుట, గాలి విసురుట మొదలగు సేవలతో విశ్రమింప జేయును.

నృత్యతో గాయతః క్వాపి వల్గతో యుధ్యతో మిథః ।
గృహీతహస్తౌ గోపాలాన్ హసంతౌ ప్రశశంసతుః ॥ 15

క్వ - ఒకప్పుడు, నృత్యతః - నాట్యమాడుచున్నట్టియు, గాయతః అపి - పాటను కూడ పాడుచున్నట్టియు, వల్గతః - గెంతుచున్నట్టియు, మిథః - ఒకరితోనొకరు, యుధ్యతః - కుస్తీ పట్టుచున్న, గోపాలాన్ - గోపబాలకులను, గృహీతహస్తౌ - పట్టుకొనబడిన చేతులు గల బలరామ కృష్ణులు, హసంతౌ - నవ్వుచున్నవారై, ప్రశశంసతుః - కొనియాడిరి.

గోపబాలకులు ఒకప్పుడు నాట్యమాడగా, మరియొకప్పుడు పాట పాడెదరు. ఒకప్పుడు గెంతి, మరియొకప్పుడు ఒకరితోనొకరు కుస్తీ పట్టెదరు. ఆయా సందర్భములలో బలరామ కృష్ణులు ఒకరి చేతులు మరియొకరు పట్టుకొని నవ్వుతూ వారిని కొనియాడెడివారు.

క్వచిత్పల్లవతల్పేషు నియుద్ధశ్రమకర్శితః ।
వృక్షమూలాశ్రయశ్శేతే గోపోత్సంగోపబర్హణః ॥ 16

క్వచిత్ - ఒకప్పుడు, నియుద్ధశ్రమకర్శితః - బాహుయుద్ధమునందలి అలసటచే చిక్కిన శ్రీకృష్ణుడు, వృక్షమూల-ఆశ్రయః - చెట్టు మొదలు ఆశ్రయముగా గలవాడు, గోప-ఉత్సంగ-ఉపబర్హణః - గోపబాలకుని

ఒడియే దిండుగా గలవారై, పల్లవతల్పేషు - చిగురుటాకుల శయ్యలయందు, శేతే - పరుండును.

ఒకప్పుడు శ్రీకృష్ణుడు బాహుయుద్ధములో బాగా అలసి, చెట్టు నీడలో గోపబాలకుని ఒడిని దిండుగా చేసుకొని చిగురుటాకుల శయ్యయందు పరుండును.

పాదసంవాహనం చక్రుః కేచిత్తస్య మహాత్మనః ।
అపరే హతపాప్మానో వ్యజనైస్సమవీజయన్ ॥ 17

కేచిత్ - కొందరు, మహాత్మనః - మహాత్ముడగు, తస్య - ఆ శ్రీకృష్ణునకు, పాదసంవాహనమ్ - కాళ్లను పట్టుటను, చక్రుః - చేసిరి, హతపాప్మనః - నశింప జేయబడిన పాపములు గల, అపరే - ఇంకొందరు, వ్యజనైః - విసిరే కర్రలతో, సమవీజయన్ - బాగుగా వీచిరి.

కొందరా మహాత్మునకు కాళ్లను పట్టగా, మరికొందరు విసిరే కర్రలతో బాగా వీచిరి. వారి పాపములు నశించెను.

అన్యే తదనురూపాణి మనోజ్ఞాని మహాత్మనః ।
గాయంతి స్మ మహారాజ స్నేహక్లిన్నధియశ్శనైః ॥ 18

మహారాజ - ఓ మహారాజా!, స్నేహక్లిన్నధియః - ప్రేమచే ఆర్ద్రములైన హృదయములు గల, అన్యే - మరికొందరు, మహాత్మనః - మహాత్ముడగు శ్రీకృష్ణునకు, తద్-అనురూపాణి - ఆయనకు తగ్గట్టియు, మనః-జ్ఞాని - మనోహరములైన పాటలను, శనైః - మెల్లగా, గాయంతి స్మ - పాడిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ప్రేమచే ఆర్ద్రములైన హృదయములు గల మరికొందరు ఆ మహాత్మునకు ఆయనకు తగ్గ మనోహరములైన పాటలను పాడి వినిపించిరి.

ఏవం నిగూఢాత్మగతిస్స్వమాయయా
గోపాత్మజత్వం చరితైర్విడంబయన్ ।
రేమే రమాలాలితపాదపల్లవో
గ్రామ్యైస్సమం గ్రామ్యవదీశచేష్టితః ॥ 19

ఏవమ్ - ఈ విధముగా, స్వచరితైః - తన చేష్టలతో, గోపాత్మజత్వమ్ - గోపాలకుని పుత్రుడగుటను, విడంబయన్ - అనుకరించువాడు, స్వమాయయా - తన మాయచే, నిగూఢ-ఆత్మగతిః - దాచిపెట్టబడిన తన స్వరూపము గలవాడు, రమాలాలితపాదపల్లవః - లక్ష్మీదేవిచే లాలించబడిన చిగుళ్లవంటి పాదములు గలవాడు, ఈశచేష్టితః - ఈశ్వరుని లీలలు గలవాడు, గ్రామ్యైః సమమ్ - గోపబాలకులతో బాటు, గ్రామ్యవత్ - గోపబాలకుని వలె, రేమే - విహరించెను.

లక్ష్మీదేవిచే లాలించబడే చిగుళ్లవంటి పాదములు గల శ్రీకృష్ణ భగవానుడు ఈ విధముగా తన చేష్టలతో గోపాలకుని పుత్రుడు వలె నటిస్తూ గోపబాలకులతో బాటు తాను కూడ ఒక గోపబాలకుడై విహరించెను. ఆయన తన స్వరూపమును మాయచే దాచియుంచిననూ, అప్పుడప్పుడు లీలలలో ఆయన అనంతశక్తి ప్రకటమయ్యేడిది.

శ్రీదామా నామ గోపాలో రామకేశవయోస్సఖా ।
సుబలస్తోకకృష్ణాద్యా గోపాః ప్రేమ్ణేదమబ్రువన్ ॥ 20

రామకేశవయోః - బలరామకృష్ణుల, సఖా - మిత్రుడు, శ్రీదామా నామ - శ్రీదాముడని ప్రసిద్ధి గాంచినవాడు, గోపాలః - గోపబాలకుడు, సుబల స్తోకకృష్ణ-ఆద్యాః - సుబలుడు స్తోకకృష్ణుడు మొదలైన, గోపాః - గోపాల కులు, ప్రేమ్ణా - ప్రేమతో, ఇదమ్ - ఈ మాటను, అబ్రువన్ - పలికిరి.

శ్రీదాముడని ప్రసిద్ధి గాంచిన గోపబాలకుడు బలరామకృష్ణుల నేస్తము. ఆతడు, సుబలుడు, స్తోక (చిన్ని) కృష్ణుడు, దేవభద్రుడు మొదలగు గోపబాలకులు ప్రేమతో ఇట్లు పలికిరి.

రామ రామ మహాబాహో కృష్ణ దుష్టనిబర్హణ ।
ఇతోఽవిదూరే సుమహద్వనం తాలాలిసంకులమ్ ॥ 21

రామ - ఓ రామా!, రామ - రమింపజేయువాడా!, మహాబాహో - గొప్ప బాహువులు గలవాడా! కృష్ణ - ఓ కృష్ణా!, దుష్టనిబర్హణ - దుష్టులను సంహరించువాడా!, ఇతః - ఇక్కడనుండి, అవిదూరే - దగ్గరలో,

తాల-అలిసంకులమ్ - తాటిచెట్ల వరుసలతో దట్టనైన, సుమహత్ - చాల పెద్ద, వనమ్ - అడవి.

గొప్ప బాహువులతో మమ్ములను రమింపజేసే ఓ బలరామా! దుష్టులను సంహరించే శ్రీకృష్ణా! ఇక్కడకి దగ్గరలో తాటి చెట్ల వరుసలు దట్టముగా ఉండే అడవి గలదు.

ఫలాని తత్ర భూరీణి పతంతి పతితాని చ ।
సంతి కిం త్వవరుద్ధాని ధేనుకేన దురాత్మనా ॥ 22

తత్ర - అక్కడ, పతంతి - పడుచున్నవి, పతితాని చ - పడినవి కూడ, ఫలాని - పళ్లు, భూరీణి - అనేకములు, సంతి - ఉన్నవి, కిం తు - కానైతే, దురాత్మనా - దుర్బుద్ధియగు, ధేనుకేన - ధేనుకాసురునిచే, అవరుద్ధాని - అడ్డుకొనబడునవి.

అక్కడ చాల పళ్లు ఇదివరకే పడినవి, కొత్తగా పడుతున్నవి ఉంటాయి. కానైతే దుర్బుద్ధియగు ధేనుకాసురుడు అడ్డు పడును.

సోఽతివీర్యోఽసురో రామ హే కృష్ణ ఖరరూపధృక్ ।
ఆత్మతుల్యబలైరన్యైర్జ్ఞాతిభిర్బహుభిర్వృతః ॥ 23

రామ - ఓ బలరామా!, హే కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, అతివీర్యః - అధికమగు పరాక్రమము గలవాడు, ఖరరూపధృక్ - గాడిద రూపమును దాల్చినవాడు అగు, సః - ఆ, అసురః - రాక్షసుడు, ఆత్మతుల్యబలైః - తనతో సమానమైన బలము గల, బహుభిః - అనేకులగు, జ్ఞాతిభిః - జ్ఞాతులతో, వృతః - చుట్టువారబడినవాడు.

ఓ బలరామా! ఓ శ్రీకృష్ణా! అధికమగు పరాక్రమము గల ఆ అసురుడు గాడిద రూపములోనుండును. వాని చుట్టూ వాని జ్ఞాతులనేకులు గలరు. వారికి కూడ వానితో సమానమగు బలము గలదు.

తస్మాత్కృతనరాహారాద్భీతైర్నృభిరమిత్రహన్ ।
న సేవ్యతే పశుగణైః పక్షిసంఘైర్వివర్జితమ్ ॥ 24

అమిత్రహన్ - శత్రువులను సంహరించువాడా!. కృతనర-ఆహారాత్ - చేయబడిన నరమాంసభక్షణము గల, తస్మాత్ - వాని వలన, భీతైః - భయపడిన, నరైః - మానవులచే, న సేవ్యతే - సేవించబడుట లేదు, పశుగణైః - పశువుల గుంపులచే, పక్షిసంఘైః - పక్షుల గుంపులచే, వివర్జితమ్ - విడిచిపెట్టబడినది.

శత్రువులను సంహరించే ఓ శ్రీకృష్ణా! నరమాంసమును భక్షించే ఆ రాక్షసునకు భయపడి మానవులు గాని, పశువుల గుంపులు గాని, పక్షుల గుంపులైననూ అటువైపు పోవుట లేదు.

విద్యంతేఽభుక్తపూర్వాణి ఫలాని సురభీణి చ ।
ఏష వై సురభిర్గంధో విషూచీనోఽవగృహ్యతే ॥ 25

అభుక్తపూర్వాణి - ఇదివరలో తినబడనివి, సురభీణి చ - పరిమళము గలవి కూడ, ఫలాని - పళ్ళు, విద్యంతే - ఉన్నవి, ఏషః - ఈ, సురభిః - పరిమళము గల, గంధః - గంధము, విషూచీనః - అంతటా వ్యాపించునది, వై - నిశ్చయము, అవగృహ్యతే - తెలియబడుచున్నది.

పరిమళముతో కూడి ఉండే ఆ పళ్లను ఇదివరలో మనమెన్నడూ తినలేదు. ఈ పళ్ల సువాసన నిశ్చయముగా అంతటా వ్యాపించుచున్నది. ఈ సుగంధము ఇచట స్పష్టముగా తెలియుచున్నది.

ప్రయచ్ఛ తాని నః కృష్ణ గంధలోభితచేతసామ్ ।
వాంఛాఽస్తి మహతీ రామ గమ్యతాం యది రోచతే ॥ 26

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, గంధలోభితచేతసామ్ - సుగంధముచే ఆకర్షించబడిన మనస్సులు గల, నః - మాకు, తాని - ఆ పళ్లను, ప్రయచ్ఛ - ఇమ్ము, రామ - ఓ బలరామా!, మహతీ - పెద్ద, వాంఛా - కోరిక, అస్తి - కలదు, రోచతే యది - అభిమతమైనచో, గమ్యతామ్ - వెళ్లబడుగాక!

ఓ శ్రీకృష్ణా! ఆ పళ్లను మాకిమ్ము. వాటి సుగంధము మా మనస్సుల నాకర్షించుచున్నది. ఓ బలరామా! మాకు వాటిపై కోరిక మెండుగా గలదు. నీకభిమతమైనచో, అచటికు వెళ్లుము.

ఏవం సుహృద్వచశ్శ్రుత్వా సుహృత్ప్రియచికీర్షయా ।
ప్రహస్య జగ్మతుర్గోపైర్వృతౌ తాలవనం ప్రభూ ॥ 27

ఏవమ్ - ఈ విధముగా, సుహృద్-వచః - మిత్రుల మాటను, శ్రుత్వా - విని, ప్రభూ - సర్వసమర్థులగు బలరామకృష్ణులు, ప్రహస్య - నవ్వి, సుహృత్-ప్రియచికీర్షయా - మిత్రుల కొరకు ప్రీతిని కలిగించే కోరికతో, గోపైః - గోపబాలకులతో, వృతౌ - చుట్టువారబడినవారై, తాలవనమ్ - తాటి చెట్ల అడవిని గురించి, జగ్మతుః - వెళ్లిరి.

మిత్రులీ విధముగా పలుకగా సర్వసమర్థులగు బలరామకృష్ణులిద్దరు నవ్విరి. వారు గోపబాలకులు చుట్టువారి రాగా, వారికి ప్రీతిని కలిగించ గోరి, ఆ తాటి చెట్ల అడవికి వెళ్లిరి.

బలః ప్రవిశ్య బాహుభ్యాం తాలాన్ సంపరికంపయన్ ।
ఫలాని పాతయామాస మతంగజ ఇవౌజసా ॥ 28

బలః - బలరాముడు, ప్రవిశ్య - ప్రవేశించి, బాహుభ్యామ్ - రెండు చేతులతో, మతంగజః ఇవ - మదించిన ఏనుగు గున్నవలె, ఓజసా - బలముతో, తాలాన్ - తాటి చెట్లను, సంపరికంపయన్ - బాగా గుండ్రముగా ఊపువాడై, ఫలాని - పళ్లను, పాతయామాస - పడగొట్టెను.

బలరాముడు మదించిన ఏనుగు గున్నవలె ఆ అడవిలో ప్రవేశించి రెండు చేతులతో బలముగా తాటిచెట్లను గట్టిగా గుండ్రముగా ఊపి, పళ్లు పడునట్లు చేసెను.

ఫలానాం పతతాం శబ్దం నిశమ్యాసురరాసభః ।
అభ్యధావత్ క్షితితలం సనగం పరికంపయన్ ॥ 29

పతతామ్ - పడుచున్న, ఫలానామ్ - పళ్లయొక్క, శబ్దమ్ - చప్పుడును, నిశమ్య - విని, అసురరాసభః - గాడిద రూపు గల రాక్షసుడు, సనగమ్ - చెట్లతో కూడియున్న, క్షితతలమ్ - భూమియొక్క ఉపరితలమును, పరికంపయన్ - అంతటా వణుకునట్లు చేయుచున్నవాడై, అభ్యధావత్ - ఎదురుగా పరుగెత్తెను.

పడుచున్న ఆ పళ్ల చప్పుడు విని గాడిద రూపములోనున్న రాక్షసుడు వారి ఎదురుగా పరుగెత్తి రాగా, చెట్లతో సహా భూతలము కంపించెను.

సమేత్య తరసా ప్రత్యగ్ద్వాభ్యాం పద్భ్యాం బలం బలీ ।
నిహత్యోరసి కాశబ్దం ముంచన్ పర్యసరత్ఖలః ॥ 30

బలీ - బలశాలి, ఖలః - దుష్టుడు అగు రాక్షసుడు, తరసా - వేగముతో, సమేత్య - వచ్చి, ద్వాభ్యామ్ - రెండు, ప్రత్యగ్ - వెనుక, పద్భ్యామ్ - కాళ్లతో, బలమ్ - బలరాముని, ఉరసి - వక్షఃస్థలముపై, నిహత్య - తన్ని, కాశబ్దమ్ - కఠోరమైన శబ్దమును, ముంచన్ - విడిచిపెట్టువాడై, పర్యసరత్ - చుట్టూ పరుగెత్తెను.

బలశాలియగు ఆ దుష్టుడు వేగముగా వచ్చి రెండు వెనుక కాళ్లతో రాముని రొమ్ముపై తన్ని కఠోరముగా ఓండ్రపెడుతూ చుట్టూ పరుగెత్తెను.

పునరాసాద్య సంరబ్ధ ఉపక్రోష్టా పరాక్ స్థితః ।
చరణావపరౌ రాజన్ బలాయ ప్రాక్షిపద్రుషా ॥ 31

రాజన్ - ఓ రాజా!, సంరబ్ధః - కోపము గలవాడు, ఉపక్రోష్టా - గాడిద రూపము గలవాడు, పునః - మరల, ఆసాద్య - దగ్గరకు వచ్చి, పరాక్ - వెనుదిరిగి, స్థితః - నిలబడినవాడు, రుషా - కోపముతో, అపరౌ - వెనుకటి, చరణౌ - రెండు కాళ్లను, బలాయ - బలరాముని కొరకు, ప్రాక్షిపత్ - విసిరెను.

ఓ పరీక్షిన్మహారాజా! గాడిద రూపములోనున్న ఆ రాక్షసుడు కోపముతో మరల దగ్గరకు వచ్చి వెనుదిరిగి నిలబడెను. వాడు బలరాముని తన్నుటకై కోపముతో రెండు వెనుక కాళ్లను విసిరెను.

స తం గృహీత్వా ప్రపదోర్భ్రామయిత్వైకపాణినా ।
చిక్షేప తృణరాజాగ్రే భ్రామణత్యక్తజీవితమ్ ॥ 32

సః - ఆ బలరాముడు, ఏకపాణినా - ఒకే చేతితో, ప్రపదోః - కాళ్ల కొనలయందు, గృహీత్వా - పట్టుకొని, భ్రామయిత్వా - గిర గిర త్రిప్పి,

భ్రామణైర్వ్య... ...తమ్ - త్రిప్పుటచే విడిచిపెట్టబడిన ప్రాణము గల వానిని, తృణరాజా...గ్రే - తాటి చెట్టు పైన, చిక్షేప - విసిరి వేసెను.

ఆ బలరాముడు ఒకే చేతితో వానిని రెండు కాళ్ల కొనలయందు పట్టుకొని గిర గిర త్రిప్పి తాటి చెట్టు పైకి విసిరెను. ఆ త్రిప్పుటలోనే వాని ప్రాణము పోయెను.

తేనాహతో మహాతాలో వేపమానో బృహచ్ఛిరాః ।
పార్శ్వస్థం కంపయన్ భగ్నస్స చాన్యం సోఽపి చాపరమ్ ।। 33

తేన - ఆ రాక్షసుని దేహముతో, అహతః - కొట్టబడిన, బృహత్-శిరాః - (విశాలమగు పైభాగము గల) మిక్కిలి యెత్తైన, మహాతాలః - పెద్ద తాటి చెట్టు, వేపమానః - ఊగుచున్నదై, పార్శ్వస్థమ్ - ప్రక్కనే ఉన్న చెట్టును, కంపయన్ - కుదిపి వేయునదై, భగ్నః - విరిగి పడెను, సః చ - ఆ చెట్టు కూడ, అన్యమ్ - మరి యొక చెట్టును, సః అపి చ - ఆ చెట్టు కూడ, అపరమ్ - ఇంకో చెట్టును.

ఆ రాక్షసుని దేహముతో కొట్టబడిన మిక్కిలి యెత్తైన (పెద్ద తల గల) ఆ పెద్ద తాటి చెట్టు ఊగిపోతూ విరిగి ప్రక్కనున్న చెట్టుపై పడగా, అది కుదిపివేయబడి విరిగెను. అది పడి ఇంకో చెట్టు, ఆ చెట్టు పడి మరో చెట్టు కూడ విరిగెను.

బలస్య లీలయోత్సృష్టఖరదేహహతాహతాః ।
తాలాశ్చకంపిరే సర్వే మహావాతేరితా ఇవ ।। 34

బలస్య - బలరామునిచే, లీలయా - అవలీలగా, ఉత్సృష్టఖరదేహహత-ఆహతాః - విసిరివేయబడిన గాడిదయొక్క దేహముచే విరుగగొట్టబడిన చెట్టుచే కొట్టబడిన, సర్వే - అన్ని, తాలాః - తాటి చెట్లు, మహావాత-ఈరితాః ఇవ - పెద్దగాలిచే కుదిపివేయబడినవా యన్నట్లు, చకంపిరే - ఊగినవి.

బలరాముడు అవలీలగా విసిరివేసిన గాడిద దేహము ఒక చెట్టును, అది విరిగి ఇంకో చెట్టును కొట్టెను. ఆ విధముగా తాటి చెట్లన్నీ ఝంఝ్ఝావాతముచే కుదిపివేయబడినవా యన్నట్లు ఊగిపోయినవి.

నైతచ్చిత్రం భగవతి హ్యనంతే జగదీశ్వరే ।
ఓతప్రోతమిదం యస్మింస్తంతుష్వంగ యథా పటః ॥ 35

అంగ - ఓయీ!, జగద్-ఈశ్వరే - జగత్తునకు ప్రభువైన, అనంతే భగవతి - అనంత భగవానుని విషయములో, ఏతత్ - ఇది, చిత్రమ్ - విడ్డూరము, న హి - కానే కాదు, యస్మిన్ - ఎవనియందైతే, ఇదమ్ - ఈ జగత్తు, తంతుషు - దారములయందు, పటః ఇవ - వస్త్రము వలె, ఓతప్రోతమ్ - పడుగు పేకవలె నున్నదో.

ఓ రాజా! జగత్తునకు ప్రభువగు అనంత భగవానుడట్లు చేయుటలో విడ్డూరమేమీ లేనే లేదు. ఎందుకంటే ఈ జగత్తు, వస్త్రము దారములయందు వలె, ఆయనయందే పడుగుపేకవలె నున్నది.

తతః కృష్ణం చ రామం చ జ్ఞాతయో ధేనుకస్య యే ।
క్రోష్టారోఽభ్యద్రవన్ సర్వే సంరబ్ధా హతబాంధవాః ॥ 36

తతః - తరువాత, ధేనుకస్య - ధేనుకాసురుని, యే - ఏ, హతబాంధవాః - సంహరించబడిన బంధువు గల, జ్ఞాతయః - జ్ఞాతులు గలరో ఆ, సర్వే - అందరు, క్రోష్టారః - గాడిదలు (పెద్దగా ఓండ్రపెట్టునవి), సంరబ్ధాః - కోపించినవై, కృష్ణం చ రామం చ అభి - బలరామకృష్ణులకెదురుగా, అద్రవన్ - పరుగెత్తిరి.

తరువాత, తమ బంధువగు ధేనుకాసురుడు సంహరించబడినందులకు వాని బంధువులగు గాడిదలకు చాల కోపము వచ్చినది. అవి అన్నీ బిగ్గరగా ఓండ్రపెడుతూ బలరామకృష్ణుల పైకి పరుగెత్తి వచ్చినవి.

తాంస్తానాపతతః కృష్ణో రామశ్చ నృప లీలయా ।
గృహీతపశ్చాచ్చరణాన్ ప్రాహిణోత్తృణరాజసు ॥ 37

నృప - ఓ రాజా!, ఆపతతః - మీదకు వచ్చుచున్న, తాన్ తాన్ - వారిని వారిని, కృష్ణః - శ్రీకృష్ణుడు, రామః చ - బలరాముడు కూడ, లీలయా - అవలీలగా, గృహీతపశ్చాత్-చరణాన్ - పట్టుకొనబడిన వెనుక కాళ్లు గలవారిని, తృణరాజసు - తాటి చెట్లయందు, ప్రాహిణోత్ - విసిరివేసెను.

ఓ పరీక్షిన్మహారాజా! మీదకు వచ్చుచున్న ఆ గాడిదలను బలరామకృష్ణులు వచ్చినవాటిని వచ్చినట్లుగా అవలీలగా వెనుక కాళ్లను పట్టుకొని తాటి చెట్లపైకి విసిరి వేసిరి.

ఫలప్రకరసంకీర్ణం దైత్యదేహైర్గతాసుభిః ।
రరాజ భూస్సతాలాగ్రైః ర్ఘనైరివ నభస్తలమ్ ॥ 38

భూః - నేల, ఫలప్రకరసంకీర్ణమ్ - పళ్ల గుట్టలతో చెల్లాచెదరుగా, గత-అసుభిః - పోయిన ప్రాణములు కలిగినట్టియు, సతాల-అగ్రైః - తాటి చెట్ల తలలతో కూడిన, దైత్యదేహైః - రాక్షసుల దేహములతో, నభః-తలమ్ - ఆకాశతలము, ఘనైః ఇవ - మేఘములతో వలె, రరాజ - ప్రకాశించెను.

నేలపై పళ్లు గుట్టలుగా పడి చెల్లాచెదరుగా నుండెను. ప్రాణములు పోయిన రాక్షసుల దేహములకు తాటి చెట్ల తలలు తోడు కాగా, నేల మేఘములతో కూడిన ఆకాశతలము వలె ప్రకాశించెను.

తయోస్తత్సుమహత్కర్మ నిశామ్య విబుధాదయః ।
ముముచుః పుష్పవర్షాణి చక్రుర్వాద్యాని తుష్టువుః ॥ 39

తయోః - వారిద్దరి, తత్ - ఆ, సుమహత్ - చాల గొప్ప, కర్మ - లీలను, నిశామ్య - చూచి, విబుధ-ఆదయః - దేవతలు మొదలగువారు, పుష్పవర్షాణి - పూల వానలను, ముముచుః - విడిచిపెట్టిరి, వాద్యాని - వాద్యములను, చక్రుః - చేసిరి, తుష్టువుః - స్తుతించిరి.

వారిద్దరి ఆ చాల గొప్ప లీలను చూచి దేవతలు పూల వానలను కురిపించిరి. గంధర్వులు వాద్యములను మ్రోయించగా, మహర్షులు స్తుతించిరి.

అథ తాలఫలాన్యాదన్మనుష్యా గతసాధ్వసాః ।
తృణం చ పశవశ్చేరుర్హతధేనుకకాననే ॥ 40

అథ - తరువాత, హతధేనుకకాననే - సంహరించబడిన ధేనుకాసురుని అడవియందు, గతసాధ్వసాః - పోయిన భయము గల, మనుష్యాః -

మానవులు, తాలఫలాని - తాటి పళ్లను, ఆదన్ - తినిరి, పశవః చ - పశువులు కూడ, తృణమ్ - గడ్డిని, చేరుః - మేసినవి.

ధేనుకాసురుని సంహరించిన తరువాత ఆ అడవిలో మానవులు భయము తొలగిపోయి తాటి పళ్లను తినిరి. పశువులు కూడ గడ్డి మేసినవి.

కృష్ణః కమలపత్రాక్షః పుణ్యశ్రవణకీర్తనః ।
స్తూయమానోఽనుగైర్గోపైస్సాగ్రజో వ్రజమావ్రజత్ ॥ 41

కమలపత్ర-అక్షః - పద్మపు రేకులవంటి కన్నులు గలవాడు, పుణ్యశ్రవణకీర్తనః - పావనము చేసే శ్రవణము కీర్తనము గలవాడు, స-అగ్రజః - అన్నతో కూడియున్నవాడు అగు, కృష్ణః - శ్రీకృష్ణుడు, అనుగైః - వెంట నడచే, గోపైః - గోపబాలకులచే, స్తూయమానః - కొనియాడబడుచున్నవాడై, వ్రజమ్ - గోకులమును, ఆవ్రజత్ - చేరెను.

పద్మపు రేకులవంటి కన్నులు గల శ్రీకృష్ణుని లీలలను విన్నా కీర్తించినా మానవుడు పవిత్రుడగును. ఆయన అన్నయగు బలరామునితో కలిసి, సహచరులగు గోపబాలకులు కొనియాడుచుండగా, గోకులమును చేరెను.

తం గోరజశ్ఛురితకుంతలబద్ధబర్హ-
వన్యప్రసూనరుచిరేక్షణచారుహాసమ్ ।
వేణుం క్వణంతమనుగైరనుగీతకీర్తిం
గోప్యో దిదృక్షితదృశోఽభ్యగమన్ సమేతాః ॥ 42

గోరజః-ఛురితకుంతలబద్ధబర్హవన్యప్రసూనరుచిర-ఈక్షణచారుహాసమ్ - గోవుల ధూళిచే వ్యాపించబడిన ముంగురులయందు కట్టబడిన నెమలి పింఛములు అడవియందలి పువ్వులు కలిగినట్టియు ప్రకాశించే చూపులు అందమగు చిరునవ్వు కలిగినట్టియు, వేణుమ్ - పిల్లన గ్రోవిని, క్వణంతమ్ - వాయించుచున్నట్టియు, అనుగైః - అనుచరులచే, అనుగీతకీర్తిమ్ - గానము చేయబడిన కీర్తి గల, తమ్ - ఆ శ్రీకృష్ణుని, దిదృక్షితదృశః - చూడగోరే కన్నులు గల, గోప్యః - గోపికలు, సమేతాః - గుమి గూడినవారై, అభ్యగమన్ - ఎదురేగిరి.

శ్రీకృష్ణుని ముంగురులు గోధూళితో నిండియుండెను. ఆయన వాటియందు నెమలి పింఛములను, అడవి పువ్వులను పెట్టుకొనెను. ప్రకాశించే చూపులు, అందమైన చిరునవ్వు గల ఆయన వేణువును వాయించుచుండగా, వెంట నడిచే గోపబాలకులు ఆయన కీర్తిని గానము చేసిరి. ఆయనను చూడగోరే కన్నులు గల గోపికలు గుంపుగా ఆయనకు ఎదురేగిరి.

పీత్వా ముకుందముఖసారఘమక్షిభృంగైః
తాపం జహుర్విరహజం వ్రజయోషితోఽహ్ని ।
తత్సత్కృతిం సమధిగమ్య వివేశ గోష్ఠం
సవ్రీడహాసవినయం యదపాంగమోక్షమ్ ॥ 43

వ్రజయోషితః - గోకులమునందలి యువతులు, ముకుందముఖసారఘమ్ - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని ముఖముయొక్క తేనెను, అక్షిభృంగైః - కన్నులనే తుమ్మెదలతో, పీత్వా - త్రాగి, అహ్ని - పగలునందు, విరహజమ్ - వియోగము వలన పుట్టిన, తాపమ్ - మనస్తాపమును, జహుః - విడిచిరి, తత్-సత్-కృతిమ్ - వారి సత్కారమును, సవ్రీడహాసవినయమ్ - సిగ్గుతో చిరునవ్వుతో వినయముతో కూడుకున్న విధముగా, సమధిగమ్య - చక్కగా స్వీకరించి, గోష్ఠమ్ - గోకులమును, వివేశ - ప్రవేశించెను, యత్ - ఏదైతే, అపాంగమోక్షమ్ - వాలు చూపులను విడుచుటయో.

గోకులమునందలి యువతులు మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని ముఖపద్మమునందలి తేనెను కన్నులనే తుమ్మెదలతో పానము చేసిరి. వారికి పగలు ఆయన విరహము వలన పుట్టిన మనస్తాపము తొలగిపోయెను. వారాయనను వాలు చూపులను విసిరి సత్కరించగా, ఆయనా సత్కారమును సిగ్గుతో, చిరునవ్వుతో, వినయముతో చక్కగా స్వీకరించి, గోకులమును ప్రవేశించెను.

తయోర్యశోదారోహిణ్యౌ పుత్రయోః పుత్రవత్సలే ।
యథాకామం యథాకాలం వ్యధత్తాం పరమాశిషః ॥ 44

పుత్రవత్సలే - పుత్రులయందు వాత్సల్యము గల, యశోదారోహిణ్యౌ - యశోద రోహిణి ఇద్దరు, పుత్రయోః - పుత్రులైన, తయోః - వారిద్దరికి, యథాకామమ్ - యథేచ్ఛగా, యథాకాలమ్ - సమయము మించిపోకుండా, పరమ-ఆశిషః - ఉత్కృష్టమైన సౌకర్యములను, వ్యధత్తామ్ - ఏర్పాటు చేసిరి.

యశోదారోహిణులిద్దరికి పుత్రవాత్సల్యము మెండు. వారు బలరామకృష్ణులకు వారి ఇచ్ఛకు తగ్గట్లుగా కాలము మించకుండా ఉత్కృష్టమైన ఆహారము మొదలగు సౌకర్యములను వ్యవస్థ చేసిరి.

గతాధ్వానశ్రమౌ తత్ర మజ్జనోన్మర్దనాదిభిః ।
నీవీం వసిత్వా రుచిరాం దివ్యస్రగ్గంధమండితౌ ॥ 45

తత్ర - ఆ గోకులమునందు, మజ్జన-ఉన్మర్దన-ఆదిభిః - స్నానము తైల మర్దనము మొదలగువాటిచే, గత-అధ్వ-అనశ్రమౌ - పోయిన మార్గము నందలి శ్రమ లేకుండుట కాని స్థితి గలవారై, రుచిరామ్ - అందమైన, నీవీమ్ - ఉదికిన వస్త్రమును, వసిత్వా - ధరించి, దివ్యస్రగ్-గంధమండితౌ - దివ్యమగు మాల మరియు గంధములచే అలంకరించబడినవారు.

ఆ గోకులములో వారిద్దరు తైలమును మర్దనా చేసుకొని స్నానము చేసి మార్గములో కలిగిన శ్రమను పోగొట్టుకొనిరి. మార్గములో శ్రమ తక్కువ యేమీ కాదు. వారు అందమైన ఉదికిన వస్త్రమును ధరించి ప్రకాశించే మాలతో, గంధముతో అలంకరించుకొనిరి.

జనన్యుపహృతం ప్రాశ్య స్వాద్వన్నముపలాలితౌ ।
సంవిశ్య వరశయ్యాయాం సుఖం సుషుపతుర్వ్రజే ॥ 46

వ్రజే - గోకులమునందు, జననీ-ఉపహృతమ్ - తల్లులిద్దరిచే తీసుకురాబడిన, స్వాదు - రుచ్యమైన, అన్నమ్ - ఆహారమును, ప్రాశ్య - తిని, ఉపలాలితౌ - లాలించబడినవారై, వరశయ్యాయామ్ - శ్రేష్ఠమైన శయ్యయందు, సంవిశ్య - నడుము వాల్చి, సుఖమ్ - సుఖముగా, సుషుపతుః - నిద్రించిరి.

వారు గోకులములో తల్లులిద్దరు లాలిస్తూ ఇచ్చిన రుచ్యమైన ఆహారమును భుజించిరి. అపుడు వారు శ్రేష్ఠమైన (మెత్తని) శయ్యపై వాలి సుఖముగా నిద్రించిరి.

ఏవం స భగవాన్ కృష్ణో బృందావనచరః క్వచిత్ ।
యయౌ రామమృతే రాజన్ కాలిందీం సఖిభిర్వృతః ॥ 47

రాజన్ - ఓ రాజా!, ఏవమ్ - ఈ విధముగా, బృందావనచరః - బృందావనమునందు సంచరించే, సః - ఆ, భగవాన్ కృష్ణః - శ్రీకృష్ణ భగవానుడు, క్వచిత్ - ఒకనాడు, రామం ఋతే - బలరాముడు లేకుండా, సఖిభిః - మిత్రులచే, వృతః - చుట్టువారబడినవాడై, కాలిందీమ్ - యమునానదిని గురించి, యయౌ - వెళ్లెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా ఆ శ్రీకృష్ణ భగవానుడు బృందావనములో సంచరించుచుండెను. ఆయన ఒకనాడు మిత్రులైన గోపబాలకులు చుట్టువారి రాగా, బలరాముడు లేకుండా, యమునానదికి వెళ్లెను.

అథ గావశ్చ గోపాశ్చ నిదాఘాతపపీడితాః ।
దుష్టం జలం పపుస్తస్యాస్తృషార్తా విషదూషితమ్ ॥ 48

అథ - అప్పుడు, నిదాఘ-ఆతపపీడితాః - వేసవి కాలపు ఎండచే పీడించబడినవారు, తృషా-ఆర్తాః - దప్పికతో పీడ గల, గావః చ - గోవులు, గోపాః చ - గోపాలకులు కూడ, తస్యాః - ఆ కాలిందియొక్క, విషదూషితమ్ - విషముచే కలుషితమైన, దుష్టమ్ - చెడు, జలమ్ - నీటిని, పపుః - త్రాగిరి.

అప్పుడు గోవులు, గోపాలకులు కూడ వేసవి కాలపు ఎండచే తాపమును పొంది దప్పికతో పీడను పొందిరి. వారు ఆ కాలిందిలోని చెడు నీటిని త్రాగిరి. ఆ నీరు విషముచే కలుషితమైనది.

విషాంభస్తదుపస్పృశ్య దైవోపహతచేతసః ।
నిపేతుర్వ్యసవస్సర్వే సలిలాంతే కురూద్వహ ॥ 49

కురు-ఉద్వహ - కురువంశశ్రేష్ఠా!, దైవ-ఉపహతచేతసః - ప్రారబ్ధముచే మోహితమైన బుద్ధి గల, సర్వే - అందరు, తత్ - ఆ, విష-అంభః - విషపు నీటిని, ఉపస్పృశ్య - త్రాగి, వి-అసవః - పోయిన ప్రాణములు గలవారై, సలిల-అంతే - నీటికి దగ్గరగా ఒడ్డుపై, నిపేతుః - పడిపోయిరి.

కురువంశశ్రేష్ఠుడవగు ఓ రాజా! ప్రారబ్ధముచే మోహితమైన బుద్ధి గల వారందరు ఆ విషపు నీటిని త్రాగి, ప్రాణములు పోగా నీటికి దగ్గరగా ఒడ్డుపై పడిపోయిరి.

వీక్ష్య తాన్ వై తథాభూతాన్ కృష్ణో యోగేశ్వరేశ్వరః ।
ఈక్షయాఽమృతవర్షిణ్యా స్వనాథాన్ సమజీవయత్ ॥ 50

యోగ-ఈశ్వర-ఈశ్వరః - శ్రేష్ఠులగు యోగులకు ప్రభువగు, కృష్ణః - శ్రీకృష్ణుడు, తథాభూతాన్ - ఆ విధముగా నున్నట్టియు, స్వనాథాన్ - తానే రక్షకుడుగా గల, తాన్ వై - వారినైతే, వీక్ష్య - చూచి, అమృతవర్షిణ్యా - అమృతమును వర్షించే, ఈక్షయా - చూపుతో, సమజీవయత్ - బ్రదికించెను.

శ్రీకృష్ణుడు గొప్ప యోగమహిమ గలవారలకు కూడ ప్రభుడు. ఆయన ఆ విధముగా పడియున్న గోపబాలకులను చూచెను. వారికి తానే రక్షకుడు. ఆయన వారిని అమృతమును వర్షించే చూపుతో బ్రదికించెను.

తే సంప్రతీతస్మృతయస్సముత్థాయ జలాంతికాత్ ।
ఆసన్ సువిస్మితాస్సర్వే వీక్షమాణాః పరస్పరమ్ ॥ 51

సంప్రతీతస్మృతయః - వెంటనే పొందబడిన స్మరణము గలవారు, సువిస్మితాః - మిక్కిలి ఆశ్చర్యమును పొందినవారు అగు, తే - ఆ గోపబాలకులు, సర్వే - అందరు, జల-అంతికాత్ - నీటి దగ్గరనుండి, సముత్థాయ - పైకి లేచి, పరస్పరమ్ - ఒకరినొకరు, వీక్షమాణాః - చూచుచున్నవారై, ఆసన్ - ఉండిరి.

ఆ గోపబాలకులందరికీ వెంటనే స్మృతి కలిగెను. వారు నీటి వద్దనుండి లేచి నిలబడి మిక్కిలి ఆశ్చర్యముతో ఒకరినొకరు చూచుకుంటూ ఉండిరి.

అన్వమంసత తద్రాజన్ గోవిందానుగ్రహేక్షితమ్ ।
పీత్వా విషం పరేతస్య పునరుత్థానమాత్మనః ॥ 52

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే పంచదశోఽధ్యాయః ॥

రాజన్ - ఓ రాజా!, విషమ్ - విషమును, పీత్వా - త్రాగి, పరేతస్య - మరణించిన, ఆత్మనః - తనకు, తత్ - ఆ, పునః - మరల, ఉత్థానమ్ - పైకి లేచుట, గోవింద-అనుగ్రహ-ఈక్షితమ్ - గోవిందుని అనుగ్రహపు చూపునుగా, అన్వమంసత - తలపోసిరి.

ఓ పరీక్షిన్మహారాజా! తాము విషజలమును త్రాగి మరణించి మరల లేచి నిలబడుట గోవిందుని అనుగ్రహదృష్టి చేతనేనని వారు తలపోసిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము
పూర్వార్ధములో ధేనుకాసురుని ఉద్ధరించుటను వర్ణించే
పదునైదవ అధ్యాయము ముగిసినది (15).



# అథ షోడశోఽధ్యాయః

## కాలీయ మర్దన లీల

శ్రీశుక ఉవాచ ।
విలోక్య దూషితాం కృష్ణాం కృష్ణః కృష్ణాహినా విభుః ।
తస్యా విశుద్ధిమన్విచ్ఛన్ సర్పం తముదవాసయత్ ॥ 1

విభుః - సర్వసమర్థుడగు, కృష్ణః - శ్రీకృష్ణుడు, కృష్ణ-అహినా - నల్ల త్రాచుచే, దూషితామ్ - కలుషితము చేయబడిన, కృష్ణామ్ - యమునానదిని, విలోక్య - చూచి, తస్యాః - ఆ నదికి, విశుద్ధిమ్ - పరిశుద్ధిని, అన్విచ్ఛన్ - కలిగించ గోరువాడై, తమ్ - ఆ, సర్పమ్ - పామును, ఉదవాసయత్ - ఉద్వాసన చెప్పెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- సర్వసమర్థుడగు శ్రీకృష్ణుడు నల్ల త్రాచుచే కలుషితము చేయబడిన ఆ యమునానదిని చూచి దానికి పరిశుద్ధిని కలిగించ గోరెను. ఆయన ఆ పామును అచటనుండి పంపించివేసెను.

రాజోవాచ ।
కథమంతర్జలేఽగాధే న్యగృహ్ణాద్భగవానహిమ్ ।
స వై బహుయుగావాసం యథాఽఽసీద్విప్ర కథ్యతామ్ ॥ 2

విప్ర - ఓ మహర్షీ!, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, అగాధే - లోతైన, అంతః-జలే - నీటి మధ్యయందు, అహిమ్ - పామును, కథమ్ - ఏ విధముగా, న్యగృహ్ణాత్ - నిగ్రహించెను?, సః వై - ఆ పామైతే, యథా - ఏ విధముగా, బహుయుగ-ఆవాసమ్ - చాల యుగములు నివసించే విధముగా, ఆసీత్ - ఉండెనో, కథ్యతామ్ - చెప్పబడుగాక!

పరీక్షిత్తు ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! శ్రీకృష్ణ భగవానుడు లోతైన నీటి మధ్యలో పామును ఎట్లు నిగ్రహించెను? ఆ పాము చాల యుగముల కాలము నీటిలో ఏ విధముగా ఉండగల్గెను? ఈ గాథను చెప్పుడు.

బ్రహ్మన్ భగవతస్తస్య భూమ్నస్స్వచ్ఛందవర్తినః ।
గోపాలోదారచరితం కస్తృప్యేతామృతం భజన్ ॥ 3

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, భూమ్నః - అనంతుడైనట్టియు, స్వచ్ఛందవర్తినః - స్వేచ్ఛావిహారియగు, తస్య - ఆ, భగవతః - శ్రీకృష్ణ భగవానుని, గోపాల-ఉదారచరితమ్ - గోవులను కాసే గొప్ప వృత్తాంతము అనే, అమృతమ్ - అమృతమును, భజన్ - సేవించే, కః - ఎవడు, తృప్యేత - తృప్తిని జెందును?

ఓ మహర్షీ! అనంతుడు, స్వేచ్ఛావిహారి అగు ఆ శ్రీకృష్ణ భగవానుడు గోవులను రక్షిస్తూ చేసిన గొప్ప లీలలు వినుటకు అమృతము వంటివి. వాటిని సేవించేవాడెవడు తృప్తిని జెందును? (ఎవడైననూ తృప్తి జెందడు).

శ్రీశుక ఉవాచ ।
కాలింద్యాం కాలియస్యాసీద్ధ్రదః కశ్చిద్విషాగ్నినా ।
శ్రప్యమాణపయా యస్మిన్ పతంత్యుపరిగాః ఖగాః ॥ 4

కాలింద్యామ్ - యమునానదియందు, కాలియస్య - కాలియనాగముయొక్క, కశ్చిత్ - ఒకానొక, హ్రదః - కుండము, ఆసీత్ - ఉండెను, విష-అగ్నినా - విషముయొక్క వేడిచే, శ్రప్యమాణపయాః - ఉడికించబడే నీరు గలది, యస్మిన్ - దేనియందైతే, ఉపరిగాః - పైన వెళ్లే, ఖగాః - పక్షులు, పతంతి - పడునో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- యమునానదిలో కాలియనాగమునకు ఒక కుండము (ప్రవాహసంబంధము లేనిది) ఉండెను. అది దాని విషముయొక్క వేడికి ఉడికిపోతూ ఉండేది. దాని పైన వెళ్లే పక్షులు మరణించి దానిలో పడేవి.

విప్రుష్మతా విషోదోర్మిమారుతేనాభిమర్శితాః ।
మ్రియంతే తీరగా యస్య ప్రాణినః స్థిరజంగమాః ॥ 5

యస్య - ఏ కుండముయొక్క, విప్రుష్మతా - నీటి బిందువులు గల, విష-ఉద-ఊర్మిమారుతేన - విషపు నీటి తరంగముల గాలిచే, అభిమర్శితాః - స్పృశించబడునట్టియు, తీరగాః - ఒడ్డునందుండునట్టియు, స్థిరజంగమాః - కదలని మరియు కదిలే, ప్రాణినః - ప్రాణులు, మ్రియంతే - మరణించునో.

ఆ కుండములోని విషపు నీటి తరంగములనుండి వీచే గాలిలో విషపు నీటి బిందువులుండేవి. ఒడ్డుపైన ఉండే ప్రాణులు కదిలేవి (పశువులు మొదలైనవి), కదలనివి (చెట్టుచేమలు) ఆ గాలి సోకి చచ్చిపోయెడివి.

తం చండవేగవిషవీర్యమవేక్ష్య తేన
దుష్టాం నదీం చ ఖలసంయమనావతారః ।
కృష్ణః కదంబమధిరుహ్యా తతోఽతితుంగం
ఆస్ఫోట్య గాఢరశనో న్యపతద్విషోదే ॥ 6

చండవేగవిషవీర్యమ్ - భయంకరమగు వేగము గల విషమే బలముగా గల, తమ్ - ఆ కాలియుని, తేన - దానిచే, దుష్టామ్ - కలుషితమైన, నదీం చ - యమునానదిని కూడ, అవేక్ష్య - చూచి, ఖలసంయమన-అవతారః - దుష్టులను నిగ్రహించుటకై అవతరించిన, కృష్ణః - శ్రీకృష్ణుడు, గాఢరశనః - గట్టిగా కట్టబడిన నడుము వస్త్రము గలవాడై, అతితుంగమ్ - మిక్కిలి ఎత్తైన, కదంబమ్ - కడిమి చెట్టును, అధిరుహ్యా - ఎక్కి, ఆస్ఫోట్య - జబ్బ చరచి, తతః - దానినుండి, విష-ఉదే - విషజలము గల కుండమునందు, న్యపతత్ - దుమికెను.

కాలియుని బలము భయంకరమగు వేగము గల విషమే. వాడు యమునానదిని కలుషితము చేసినాడు. ఈ సంగతిని చూచిన శ్రీకృష్ణుడు నడుమునకు వస్త్రమును గట్టిగా కట్టి ఎత్తైన కడిమి చెట్టునెక్కి జబ్బ చరచెను. దుష్టనిగ్రహము కొరకై అవతరించిన ఆయన ఆ చెట్టునుండి విషజలములతో నిండియున్న కుండములోనికి దుమికెను.

సర్పహ్రదః పురుషసారనిపాతవేగ-
సంక్షోభితోరగవిషోచ్ఛ్వసితాంబురాశిః ।

పర్యక్ ప్లుతో విషకషాయవిభీషణోర్మిః
ధావన్ ధనుశ్శతమనంతబలస్య కిం తత్ ॥ 7

పురుషసారనిపాతవేగసంక్షోభిత-ఉరగవిష-ఉచ్ఛ్వసిత-అంబురాశిః - పురుషోత్తముని దుముకుటయొక్క వేగముచే కలిచివేయబడిన పాముల విషముతో కూడిన సెగలను పైకి చిమ్మే నీటియొక్క సముదాయము గలది, విషకషాయవిభీషణ-ఊర్మిః - విషముచే కషాయముగా చేయబడిన భయంకరమైన కెరటములు గలది అగు, సర్పహ్రదః - కాలియుని మడుగు, ధావన్ - పరుగెత్తుచున్నదై, పర్యక్ - అంతటా, ధనుః-శతమ్ - వంద ధనుస్సుల దూరమును, ప్లుతః - ప్రసరించినది, తత్ - అది, అనంతబలస్య - అనంతమగు శక్తి గల భగవానునకు, కిమ్ - ఏమి?

పాముల విషముతో కూడిన సెగలను పైకి చిమ్మే ఆ కాలియుని మడుగులోని నీరు విషముచే కషాయముగా చేయబడి భయంకరమగు కెరటములను లేపుచుండెను. పురుషోత్తముడు వేగముగా దుముకగా, ఆ జలసమూహము వంద ధనుస్సు (8 అడుగులు) ల దూరము వరకు పరుగెత్తి అంతటా ప్రసరించెను. అనంతమగు శక్తి గల భగవానునకు అది యెంతటిది?

తస్య హ్రదే విహరతో భుజదండఘూర్ణ-
వార్ఘోషమంగ వరవారణవిక్రమస్య ।
ఆశ్రుత్య తత్స్వసదనాభిభవం నిరీక్ష్య
చక్షుశ్శ్రవాస్సమసరత్తదమృష్యమాణః ॥ 8

అంగ - ఓయీ!, హ్రదే - మడుగునందు, విహరతః - విహరించుచున్నట్టియు, వరవారణవిక్రమస్య - గొప్ప ఏనుగుయొక్క పరాక్రమముగల, తస్య - ఆ శ్రీకృష్ణునియొక్క, భుజదండఘూర్ణవార్-ఘోషమ్ - దండములవంటి భుజములచే కొట్టబడిన నీటియొక్క శబ్దమును, ఆశ్రుత్య - విని, తత్ - ఆ విహారము వలన, స్వసదన-అభిభవమ్ - తన నివాసమునకు కలిగిన దాడిని, నిరీక్ష్య - చూచి, చక్షుః-శ్రవాః - కళ్లే చెవులుగా గల సర్పము, తత్ - దానిని, అమృష్యమాణః - కోపించుచున్నదై, సమసరత్ - దగ్గరకు వచ్చెను.

ఓ రాజా! గొప్ప ఏనుగుయొక్క పరాక్రమము గల శ్రీకృష్ణుడు ఆ మడుగులో విహరిస్తూ దండములవంటి భుజములతో నీటిని కొట్టుచుండగా పెద్ద ధ్వని కలిగెను. ఆ చప్పుడును కళ్లే చెవులుగా గల కాలియుడు వినెను. ఆ సర్పము తన నివాసముపై జరిగిన ఈ దాడిని చూచి, దానిని సహింపజాలక (కోపముతో) దగ్గరకు వచ్చెను.

తం ప్రేక్షణీయసుకుమారఘనావదాతం
శ్రీవత్సపీతవసనం స్మితసుందరాస్యమ్ ।
క్రీడంతమప్రతిభయం కమలోదరాంఘ్రిం
సందశ్య మర్మసు రుషా భుజయా చఛాద ।। 9

ప్రేక్షణీయసుకుమారఘన-అవదాతమ్ - సుందరుడు సుకుమారుడు మేఘము వలె స్వచ్ఛమగు శ్యామలవర్ణము వాడు ఐనట్టియు, శ్రీవత్సపీతవసనమ్ - శ్రీవత్సమనే పుట్టుమచ్చను పచ్చని వస్త్రమును కలిగినట్టియు, స్మితసుందర-ఆస్యమ్ - చిరునవ్వుతో సుందరమైన ముఖము కలిగినట్టియు, అప్రతిభయమ్ - భయము లేకుండా, క్రీడంతమ్ - విహరించుచున్నట్టియు, కమల-ఉదర-అంఘ్రిమ్ - పద్మము పొట్టను పోలిన పాదములు కల, తమ్ - ఆ శ్రీకృష్ణుని, మర్మసు - మర్మస్థానములయందు, సందశ్య - బాగా కరిచి, రుషా - కోపముతో, భుజయా - దేహము (పడగ) తో, చఛాద - కప్పివేసెను.

సుందరుడు, సుకుమారుడు అగు శ్రీకృష్ణుడు మేఘము వలె స్వచ్ఛమైన నల్లని వర్ణము గలవాడు. రొమ్ముపై శ్రీవత్సము గల ఆయన పచ్చని వస్త్రమును ధరించెను. చిరునవ్వుతో సుందరమైన ముఖము గల ఆయన భయము లేకుండా విహరించుచుండెను. ఆయన పాదములు పద్మపు పొట్టను పోలి ఎర్రగా నుండెను. ఆయనను ఆ పాము కంఠము మొదలైన మర్మస్థానములలో కరిచి తన దేహము (పడగ) తో కప్పివేసెను.

తం నాగభోగపరివీతమదృష్టచేష్ట-
మాలోక్య తత్ప్రియసఖాః పశుపా భృశార్తాః ।
కృష్ణేఽర్పితాత్మసుహృదర్థకలత్రకామా
దుఃఖానుశోకభయమూఢధియో నిపేతుః ।। 10

నాగభోగపరివీతమ్ - పాము పడగచే చుట్టివేయబడినట్టియు, అదృష్టచేష్టమ్ - కనబడని కదలిక కలిగిన, తమ్ - ఆ శ్రీకృష్ణుని, ఆలోక్య - చూచి, తత్-ప్రియసఖాః - ఆయనకు ప్రియమిత్రులైనవారు, కృష్ణే - శ్రీకృష్ణునియందు, అర్పిత-ఆత్మసుహృద్-అర్థకలత్రకామాః - సమర్పించబడిన తాము బంధువులు సంపదలు స్త్రీలు భోగములు గల, పశుపాః - గోపాలకులు, భృశ-ఆర్తాః - అధికమగు పీడను పొందినవారై, దుఃఖ-అనుశోకభయమూఢధియః - దుఃఖము తరువాత శోకము భయములచే మొద్దుబారిన బుద్ధి గలవారై, నిపేతుః - నేల గూలిరి.

పాము పడగతో చుట్టి వేయగా ఆ శ్రీకృష్ణుని కదలికలు ఆయన ప్రియమిత్రులైన గోపాలకులకు కానరాలేదు. వారు తమను, బంధువులను, సంపదలను, స్త్రీలను, భోగములను శ్రీకృష్ణునియందే సమర్పించినవారు. వారు అధికమగు పీడను పొంది ఏడ్చిరి. బుద్ధి శోకముతో, భయముతో మొద్దుబారి పోగా, వారు నేలగూలిరి.

గావో వృషా వత్సతర్యః క్రందమానాస్సుదుఃఖితాః ।
కృష్ణే న్యస్తేక్షణా భీతా రుదత్య ఇవ తస్థిరే ।। 11

గావః - ఆవులు, వృషాః - ఎద్దులు, వత్సతర్యః - ఎదిగిన దూడలు, క్రందమానాః - ఆర్తనాదము చేయుచున్నవి, సుదుఃఖితాః - అధికమగు దుఃఖమును పొందినవి, కృష్ణే - శ్రీకృష్ణునియందు, న్యస్త-ఈక్షణాః - అప్పగించిన చూపులు గలవి, భీతాః - భయపడినవి, రుదత్యః ఇవ - ఏడ్చుచున్నవా యన్నట్లు, తస్థిరే - నిలబడినవి.

ఆవులు, ఎద్దులు, ఎదిగిన దూడలు ఆర్తనాదము చేస్తూ అధికముగా దుఃఖిస్తూ శ్రీకృష్ణుని వైపే కళ్లను అప్పగించి చూచుచుండెను. అవి భయముతో ఏడ్చుచున్నవా యన్నట్లు నిలబడి యుండెను.

అథ వ్రజే మహోత్పాతాస్త్రివిధా హ్యతిదారుణాః ।
ఉత్పేతుర్భువి దివ్యాత్మన్యాసన్నభయశంసినః ।। 12

అథ హి - వెంటనే, వ్రజే - గోకులమునందు, అతిదారుణాః - మిక్కిలి భయమును గొల్పునవి, ఆసన్నభయశంసినః - దగ్గర పడిన భయమును

చెప్పునవి అగు, త్రివిధాః - మూడు రకములైన, ఉత్పాతాః - అపశకునములు, భువి - నేలపై, దివి - అంతరిక్షమునందు, ఆత్మని - దేహమునందు, ఉత్పేతుః - బయలు దేరినవి.

వెంటనే గోకులములో నేలపై (భూకంపము), అంతరిక్షమునందు (ఉల్కలు పడుట), దేహమునందు (మగవారికి ఎడమ కన్ను అదురుట) అనే మూడు విధములైన అపశకునములు బయలు దేరినవి. మిక్కిలి భయమును గొల్పె ఆ అపశకునములు భయము దగ్గరలో రాబోవుచున్నదని సూచించును.

తానాలక్ష్య భయోద్విగ్నా గోపా నందపురోగమాః ।
వినా రామేణ గాః కృష్ణం జ్ఞాత్వా చారయితుం గతమ్ ॥ 13

తాన్ - వాటిని, ఆలక్ష్య - చూచి, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, రామేణ వినా - బలరాముడు లేకుండా, గాః - గోవులను, చారయితుమ్ - మేపుటకు, గతమ్ - వెళ్లినవానినిగా, జ్ఞాత్వా - తెలిసి, నందపురోగమాః - నందుడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు, భయ-ఉద్విగ్నాః - భయముతో ఉద్వేగమును పొందిరి.

బలరాముడు లేకుండా శ్రీకృష్ణుడు గోవులను మేపుటకు వెళ్లినాడని నందుడు మొదలుగా గల గోపాలకులకు తెలిసెను. వారా అపశకునములను చూచి భయముతో ఆందోళనను చెందిరి.

తైర్దుర్నిమిత్తైర్నిధనం మత్వా ప్రాప్తమతద్విదః ।
తత్ప్రాణాస్తన్మనస్కాస్తే దుఃఖశోకభయాతురాః ॥ 14

తైః - ఆ, దుర్-నిమిత్తైః - చెడు శకునములచే, నిధనమ్ - మృత్యువును, ప్రాప్తమ్ - వచ్చినదానినిగా, మత్వా - తలచి, అతద్-విదః - ఆ శ్రీకృష్ణుని గురించి తెలియనివారు, తత్-ప్రాణాః - ఆయననయే ప్రాణముగా గలవారు, తత్-మనస్కాః - ఆయనయందే మనస్సు గలవారు, తే - వారు, దుఃఖశోకభయ-ఆతురాః - దుఃఖము బెంగ భయములతో వ్యాకులమైనవారు.

ఆ చెడు శకునములను చూచి మృత్యువే వచ్చిపడినదని వారు దుఃఖముతో కంగారు పడిరి. వారికి శ్రీకృష్ణుడంటే ప్రాణము. వారి మనస్సు ఆయనయందే ఉండెను. కాని, వారికి ఆయన ప్రభావము తెలియదు. అందుచే వారు బెంగతో, భయముతో వ్యాకులురైరి.

ఆబాలవృద్ధవనితాస్సర్వేఽంగ పశువృత్తయః ।
నిర్జగ్ముర్గోకులాద్దీనాః కృష్ణదర్శనలాలసాః ॥ 15

అంగ - ఓ రాజా!, ఆబాలవృద్ధవనితాః - పిల్లలు మొదలుకొని వృద్ధులు స్త్రీల వరకు ఉన్నవారు, పశువృత్తయః - గోవు వంటి మనస్సు గలవారు, దీనాః - దీనులు, కృష్ణదర్శనలాలసాః - శ్రీకృష్ణుని చూచుటకై అధికమగు ఇచ్ఛ గలవారు, సర్వే - అందరు, గోకులాత్ - గోకులమునుండి, నిర్జగ్ముః - బయలు దేరిరి.

ఓ పరీక్షిన్మహారాజా! గోకులములోని వారందరు గంగిగోవు వంటివారు. వారందరు పిల్లలు, వృద్ధులు, స్త్రీలతో సహా శ్రీకృష్ణుని చూడాలనే అధికమగు ఇచ్ఛ గలవారై దీనముగా గోకులమునుండి బయలు దేరిరి.

తాంస్తథా కాతరాన్ వీక్ష్య భగవాన్ మాధవో బలః ।
ప్రహస్య కించిన్నోవాచ ప్రభావజ్ఞోఽనుజస్య సః ॥ 16

మాధవః - మధువంశీయుడు, అనుజస్య - తమ్ముని, ప్రభావజ్ఞః - ప్రభావము తెలిసినవాడు అగు, బలః భగవాన్ - బలరామ భగవానుడు, తథా - ఆ విధముగా, కాతరాన్ - వ్యాకులపడుచున్న, తాన్ - వారిని, వీక్ష్య - చూచి, ప్రహస్య - నవ్వి, కించిత్ - దేనినైననూ, న ఉవాచ - పలుకలేదు.

మధువంశీయుడగు బలరామ భగవానుడు ఆ విధముగా వ్యాకులపడుచున్న ఆ గోపాలకులను చూచి నవ్వి ఏమీ మాటలాడలేదు. ఎందుకంటే, ఆయనకు తమ్ముడగు శ్రీకృష్ణుని మహిమ తెలియును.

తేఽన్వేషమాణా దయితం కృష్ణం సూచితయా పదైః ।
భగవల్లక్షణైర్జగ్ముః పదవ్యా యమునాతటమ్ ॥ 17

దయితమ్ - ప్రియుడగు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, అన్వేషమాణాః - వెదుకుచున్న, తే - ఆ గోపాలకులు, భగవత్-లక్షణైః - భగవానుని తెలుపుదు జేసే, పదైః - అడుగులచే, సూచితయా - సూచించబడిన, పదవ్యా - దారిగుండా, యమునాతటమ్ - యమునానదీతీరమును గురించి, జగ్ముః - వెళ్లిరి.

ఆ గోపాలకులు తమకు ఇష్టుడగు శ్రీకృష్ణుని వెదుకుతూ కాలి గుర్తులను బట్టి యమునానదీతీరమును చేరిరి. కాలి గుర్తుల యందు పద్మము మొదలగు చిహ్నములు ఆయన భగవానుడని సూచించును.

తే తత్ర తత్రాబ్జయవాంకుశాశనిధ్వజోపపన్నాని పదాని విశ్పతేః,
మార్గే గవామన్యపదాంతరాంతరే నిరీక్షమాణా యయురంగ సత్వరాః।

అంగ - ఓ రాజా!, సత్వరాః - వేగము గల, తే - వారు, గవామ్ - గోవుల, మార్గే - దారియందు, తత్ర తత్ర - అక్కడక్కడ, అన్యపద-అంతర -అంతరే - ఇతరుల కాలి గురుతులకు మధ్య మధ్యయందు, అబ్జయవ-అంకుశ-అశనిధ్వజ-ఉపపన్నాని - పద్మము బార్లీ గింజ అంకుశము వజ్రము జెండాలతో కూడిన, విశ్-పతేః - గోపనాయకుడగు శ్రీకృష్ణుని, పదాని - పాదములను, నిరీక్షమాణాః - చూస్తున్నవారై, యయుః - వెళ్లిరి.

ఓ పరీక్షిన్మహారాజా! వారు గోవుల దారిలో అక్కడక్కడ ఇతరగోపాలకుల కాలి గురుతుల మధ్య మధ్యలో గోపాలకుల నాయకుడగు శ్రీకృష్ణుని కాలి గుర్తులను చూసుకుంటూ వేగముగా వెళ్లిరి. శ్రీకృష్ణుని కాలి గుర్తులయందు పద్మము, బార్లీ గింజ, అంకుశము, వజ్రము, జెండాల చిహ్నములుండును. 18

అంతర్హ్రదే భుజగభోగపరీతమారాత్
కృష్ణం నిరీహముపలభ్య జలాశయాంతే ।
గోపాంశ్చ మూఢధిషణాన్ పరితః పశూంశ్చ
సంక్రందతః పరమకశ్మలమాపురార్తాః ।। 19

హ్రదే - సరస్సునందు, అంతః - మధ్యలో, ఆరాత్ - దూరముగా, భుజగభోగపరీతమ్ - పాముయొక్క పడగలచే చుట్టివేయబడినట్టియు,

నిరీహమ్ - చేష్టలు లేని, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, జల-ఆశయ-అంతే - సరస్సు ఒడ్డునందు, మూఢధిషణాన్ - మొద్దుబారిన బుద్ధి గల, గోపాన్ చ - గోపాలకులను, పరితః - చుట్టూ, సంక్రందతః - బిగ్గరగా ఆర్తనాదము చేయుచున్న, పశూన్ చ - పశువులను కూడ, ఉపలభ్య - చూచి, ఆర్తాః - పీడితులై, పరమకశ్మలమ్ - అధికమగు మోహమును, ఆపుః - పొందిరి.

వారికి దూరముగా సరస్సు మధ్యలో పాము పడగలచే చుట్టివేయబడి చేష్టలుడిగిన శ్రీకృష్ణుడు, సరస్సు ఒడ్డునందు మొద్దుబారిన బుద్ధి గల గోపబాలకులు, మరియు చుట్టూ బిగ్గరగా ఆర్తనాదము చేస్తున్న పశువులు కూడ కనబడిరి. వారు చాల పీడితులై అధికమగు మోహమును పొందిరి.

గోప్యోఽనురక్తమనసో భగవత్యనంతే
తత్సౌహృదస్మితవిలోకగిరస్స్మరంత్యః ।
గ్రస్తేఽహినా ప్రియతమే భృశదుఃఖతప్తాః
శూన్యం ప్రియవ్యతిహృతం దదృశుస్త్రిలోకమ్ ॥ 20

అనంతే భగవతి - అనంతుడగు శ్రీకృష్ణ భగవానునియందు, అనురక్తమనసః - అనురాగముతో కూడిన మనస్సు గల, గోప్యః - గోపికలు, తత్-సౌహృదస్మితవిలోకగిరః - ఆయనయొక్క ప్రేమను చిరునవ్వును చూపులను మాటలను, స్మరంత్యః - గుర్తు చేసుకొనువారై, ప్రియతమే - మిక్కిలి ప్రియుడగు శ్రీకృష్ణుడు, అహినా - పాముచే, గ్రస్తే - పట్టుకొనబడగా, భృశదుఃఖతప్తాః - అధికమగు దుఃఖముచే తాపమును పొందినవారై, ప్రియవ్యతిహృతమ్ - ప్రియునిచే విరహితమైన, త్రిలోకమ్ - ముల్లోకములను, శూన్యమ్ - శూన్యమునుగా, దదృశుః - చూచిరి.

గోపికల మనస్సులో అనంతుడగు శ్రీకృష్ణ భగవానునియందు అనురాగము గలదు. వారు ఆయన ప్రేమను, చిరునవ్వును, చూపులను, మాటలను స్మరించుచుందురు. మిక్కిలి ప్రియుడగు శ్రీకృష్ణుని పాము పట్టుకొనగా, వారు తీవ్రమగు దుఃఖముచే తాపమును పొందిరి. వారికి ప్రియుడగు కృష్ణునిచే విరహితమైన ముల్లోకములు శూన్యముగా తోచినవి.

తాః కృష్ణమాతరమపత్యమనుప్రవిష్టాం
తుల్యవ్యథాస్సమనుగృహ్య శుచస్స్రవంత్యః ।
తాస్తా వ్రజప్రియకథాః కథయంత్య ఆసన్
కృష్ణాననేఽర్పితదృశో మృతకప్రతీకాః ॥ 21

తాః - ఆ గోపికలు, అపత్యమ్ - పుత్రుని, అను - ఉద్దేశించి, ప్రవిష్టామ్ - సరస్సులో ప్రవేశించబోయిన, కృష్ణమాతరమ్ - శ్రీకృష్ణుని తల్లియగు యశోదను, సమనుగృహ్య - పట్టుకొని, తుల్యవ్యథాః - సమానమగు దుఃఖము గలవారై, శుచః - కన్నీళ్లను, స్రవంత్యః - స్రవించుచున్నవారై, తాః తాః - ఆయా, వ్రజప్రియకథాః - గోకులమునకు ప్రియుడగు శ్రీకృష్ణుని గాథలను, కథయంత్యః - చెప్పుచున్నవారై, కృష్ణ-ఆననే - శ్రీకృష్ణుని ముఖమునందు, అర్పితదృశః - అప్పగించబడిన చూపులు గలవారై, మృతకప్రతీకాః - శవమును పోలినవారై, ఆసన్ - ఉండిరి.

తన పుత్రుడగు శ్రీకృష్ణుని వెంటే సరస్సులో ప్రవేశించబోయిన తల్లీ యశోదను ఆ గోపికలు పట్టుకొని ఆపిరి. వారికి కూడ ఆమెతో సమానమైన దుఃఖముతో కన్నీళ్లు ప్రవహించుచుండెను. వారు గోకులమునకంతకూ ప్రియుడైన శ్రీకృష్ణుని లీలలను చెప్పుచుండిరి. వారు చూపులను శ్రీకృష్ణుని ముఖముపైననే అప్పజెప్పి శవములను పోలియుండిరి.

కృష్ణప్రాణాన్నిర్విశతో నందాదీన్ వీక్ష్య తం హ్రదమ్ ।
ప్రత్యషేధత్స భగవాన్ రామః కృష్ణానుభావవిత్ ॥ 22

కృష్ణప్రాణాన్ - శ్రీకృష్ణుడే ప్రాణముగా కలిగినట్టియు, తమ్ - ఆ, హ్రదమ్ - సరస్సును, నిర్విశతః - ప్రవేశించబోయిన, నంద-ఆదీన్ - నందుడు మొదలగువారిని, వీక్ష్య - చూచి, కృష్ణ-అనుభావవిత్ - శ్రీకృష్ణుని మహిమను తెలిసిన, సః - ఆ, భగవాన్ రామః - బలరామ భగవానుడు, ప్రత్యషేధత్ - అడ్డుకొనెను.

నందుడు మొదలగు గోపాలకులకు శ్రీకృష్ణుడే ప్రాణము. వారు కూడ ఆ సరస్సులో దిగబోగా, ఆ బలరామ భగవానుడు అడ్డుకొనెను. శ్రీకృష్ణుని మహిమ ఆయనకు తెలియును.

ఇత్థం స్వగోకులమనన్యగతిం నిరీక్ష్య
సస్త్రీకుమారమతిదుఃఖితమాత్మహేతోః ।
ఆజ్ఞాయ మర్త్యపదవీమనువర్తమానః
స్థిత్వా ముహూర్తముదతిష్ఠదురంగబంధాత్ ।। 23

ఇత్థమ్ - ఈ విధముగా, స్వగోకులమ్ - తన గోకులమును, అనన్యగతిమ్ - మరియొకరు శరణు లేనిదానినిగా, నిరీక్ష్య - గమనించి, ఆత్మహేతోః - తన నిమిత్తముగా, సస్త్రీకుమారమ్ - స్త్రీలతో పిల్లలతో కూడిన, అతిదుఃఖితమ్ - చాల దుఃఖించుచున్నదానినిగా, ఆజ్ఞాయ - తెలుసుకొని, మర్త్యపదవీమ్ - మానవుల రీతిని, అనువర్తమానః - అనుసరించుచున్న శ్రీకృష్ణుడు, ముహూర్తమ్ - కొద్ది సేపు, స్థిత్వా - ఉండి, ఉరంగబంధాత్ - పాముయొక్క పట్టునుండి, ఉదతిష్ఠత్ - పైకి లేచెను.

శ్రీహరియే శ్రీకృష్ణరూపములో మానవుల రీతిని అనుసరించెను గదా! తన గోకులమునకు తాను తప్ప మరియొకరు శరణు లేరని ఆయన గమనించెను. తన నిమిత్తముగా స్త్రీలతో, పిల్లలతో సహా గోకులమంతయు దుఃఖములో మునిగిపోయినదని ఆయన తెలుసుకొనెను. ఆయన పాముయొక్క పట్టులో గంట లోపు ఉండి, తరువాత పైకి లేచెను.

తత్ప్రథ్యమానవపుషా వ్యథితాత్మభోగః
త్యక్త్వోన్నమయ్య కుపితస్స్వఫణాన్ భుజంగః ।
తస్థౌ శ్వసఞ్ఛ్వసనరంధ్రవిషాంబరీష-
స్తబ్ధేక్షణోల్ముకముఖో హరిమీక్షమాణః ।। 24

తత్-ప్రథ్యమానవపుషా - ఆ శ్రీకృష్ణుని పెరుగుచున్న దేహముచే, వ్యథిత-ఆత్మభోగః - పీడించబడిన తన పడగ గలది, శ్వసనరంధ్రవిష-అంబరీషస్తబ్ధ-ఈక్షణ-ఉల్ముకముఖః - ముక్కు పుటములయందు విషము గలది ఎర్రగా కాలిన మూకుడు వంటి స్థిరమైన కళ్లు గలది నిప్పుకణములు నోళ్లయందు గలది అగు, భుజంగః - పాము, కుపితః - కోపించినదై, స్వఫణాన్ - తన పడగలను, ఉన్నమయ్య - పైకి లేపి, శ్వసన్ - నిట్టూర్పుచున్నదై, హరిమ్ - శ్రీకృష్ణుని, త్యక్త్వా - విడిచిపెట్టి, ఈక్షమాణః - చూచుచున్నదై, తస్థౌ - ఉండెను.

ఆ శ్రీకృష్ణుని శరీరము పెరుగజొచ్చెను. దానితో పామునకు తన పడగలయందు నొప్పి కలిగెను. దాని ముక్కు పుటములయందు విషము, నోళ్లయందు మంటలు ఉండెను. దాని స్థిరమైన కళ్లు ఎర్రగా కాల్చిన పెనముల వలె నుండెను. అది కోపముతో తన పడగలను పైకెత్తి నిట్టూరుస్తూ శ్రీకృష్ణుని విడిచిపెట్టి చూస్తూ ఉండెను.

తం జిహ్వయా ద్విశిఖయా పరిలేలిహానం
ద్వే సృక్కిణీ హ్యతికరాలవిషాగ్నిదృష్టిమ్ ।
క్రీడన్నముం పరిససార యథా ఖగేంద్రో
బభ్రామ సోఽప్యవసరం ప్రసమీక్షమాణః ॥ 25

ద్విశిఖయా - రెండు కొనలు గల, జిహ్వయా - నాలుకతో, ద్వే - రెండు, సృక్కిణీ - పెదవుల కొనలను, పరిలేలిహానమ్ - చుట్టూ ఆస్వాదించుచున్నట్టియు, అతికరాలవిష-అగ్నిదృష్టిమ్ - మిక్కిలి భయంకరమైన విషముయొక్క అగ్నితో కూడిన చూపులు కలిగిన, తమ్ - ఆ, అముమ్ - ఈ పామును, ఖగ-ఇంద్రః యథా - పక్షిరాజగు గరుడుడు వలె, క్రీడన్ - క్రీడించే శ్రీకృష్ణుడు, పరిససార - చుట్టూ తిరిగెను, సః అపి - ఆ పాము కూడ, అవసరమ్ - అవకాశమును, ప్రసమీక్షమాణః - ఎదురు చూచునది.

ఆ పాము రెండు కొనలు గల నాలుకలతో పెదవుల మూలలను చుట్టూ ఆస్వాదించుచుండెను. దాని చూపులు మిక్కిలి భయంకరమగు విషముయొక్క నిప్పులను చెరగుచుండెను. శ్రీకృష్ణుడు పక్షిరాజగు గరుడుడు వలె ఆ ఈ పాముతో ఆడుకుంటూ చుట్టూ తిరిగెను. అది కూడ కాటు వేసే అవకాశము కొరకు ఎదురు చూచెను.

ఏవం పరిభ్రమహతౌజసమున్నతాంస-
మానమ్య తత్పృథుశిరస్స్వధిరూఢ ఆద్యః ।
తన్మూర్ధరత్ననికరస్పర్శాతితామ్ర-
పాదాంబుజోఽఖిలకలాఽఽదిగురుర్ననర్త ॥ 26

ఏవమ్ - ఈ విధముగా, పరిభ్రమహత-ఓజసమ్ - చుట్టూ తిరుగుటచే దెబ్బ తిన్న బలము కలిగినట్టియు, ఉన్నత-అంసమ్ - ఎత్తైన పడగలు గల పామును, ఆనమ్య - కొంచెము వంచి, తత్-పృథుశిరస్సు - దాని పెద్ద తలలయందు, అధిరూఢః - ఎక్కిన, ఆద్యః - సర్వజగత్కారణుడు, అఖిలకలా-ఆదిగురుః - సకలకళలకు మొట్టమొదటి గురువగు శ్రీకృష్ణుడు, తత్-మూర్ధరత్ననికరస్పర్శ-అతితామ్రపాద-అంబుజః - దాని తలలపై ఉండే రత్నముల సముదాయముల స్పర్శచే మిక్కిలి ఎర్రనైన పద్మములవంటి పాదములు గలవాడై, ననర్త - నాట్యమును చేసెను.

ఈ విధముగా చుట్టూ తిరుగుటచే దాని బలము దెబ్బ తినెను. శ్రీకృష్ణుడు సర్వజగత్కారణుడు, కళలన్నింటికీ మొట్టమొదటి గురువు. ఆయన ఎత్తైన పడగలు గల ఆ పామును కొంచెము వంచి దాని పెద్ద తలల పైకెక్కి నాట్యమాడెను. దాని తలలపైనుండే రత్నసమూహముల స్పర్శచే పద్మములవంటి ఆయన పాదములు మిక్కిలి ఎర్రనయ్యెను.

తం నర్తుముద్యతమవేక్ష్య తదా తదీయ-
గంధర్వసిద్ధసురచారణదేవవధ్వః ।
ప్రీత్యా మృదంగపణవానకవాద్యగీత-
పుష్పోపహారనుతిభిస్సహసోపసేదుః ॥ 27

నర్తుమ్ - నాట్యము చేయుటకు, ఉద్యతమ్ - సంసిద్ధుడైన, తమ్ - ఆ శ్రీకృష్ణుని, అవేక్ష్య - చూచి, తదా - అప్పుడు, తదీయగంధర్వసిద్ధసుర చారణదేవవధ్వః - ఆయన భక్తులైన గంధర్వులు సిద్ధులు దేవతలు చారణులు అప్సరసలు, ప్రీత్యా - ప్రీతితో, మృదంగపణవ-ఆనకవాద్యగీత పుష్ప-ఉపహారనుతిభిః - మద్దెళ్లు తప్పెట్లు భేరీలు వాద్యములు పాటలు పువ్వులు బహుమతులు స్తోత్రములతో, సహసా - వెంటనే, ఉపసేదుః - సేవించిరి.

ఆ శ్రీకృష్ణుడు నాట్యము చేయుటకు సంసిద్ధుడగుటను చూచి అప్పుడు వెంటనే ఆయన భక్తులైన చారణులు మద్దెళ్లు, తప్పెట్లు, భేరీలు మొదలగు వాద్యములను వాయించగా గంధర్వులు పాడిరి. అప్సరసలు

నాట్యమాడగా సిద్ధులు పూలవానను కురిపించి ఉపహారములను సమర్పించిరి. దేవతలు స్తుతించిరి.

యద్యచ్ఛిరో న నమతేఽంగ శతైకశీర్ష్ణః
తత్తన్మమర్ద ఖరదండధరోఽంఘ్రిపాతైః ।
క్షీణాయుషో భ్రమత ఉల్బణమాస్యతోఽసృఙ్
నస్తో వమన్ పరమకశ్మలమాప నాగః ॥ 28

అంగ - ఓ రాజా!, ఖలదండధరః - దుష్టులకు శిక్షను విధించే శ్రీకృష్ణుడు, శత-ఏకశీర్ష్ణః - నూటొక్క తలలు కలిగినట్టియు, క్షీణ-ఆయుషః - క్షీణించిన బలము కలిగినట్టియు, భ్రమతః - తిరుగుచున్న కాలియుని, యత్ యత్ - ఏయే, శిరః - తల, న నమతే - వంగదో, తత్ తత్ - దానిని దానిని, అంఘ్రిపాతైః - పాదముల త్రొక్కుడులచే, మమర్ద - మర్దించెను, ఆస్యతః - నోటినుండి, నస్తః - ముక్కునుండి, ఉల్బణమ్ - భయంకరమైన, అసృక్ - రక్తమును, వమన్ - గ్రక్కుచున్న, నాగః - పాము, పరమకశ్మలమ్ - తీవ్రమగు మూర్ఛను, ఆప - పొందెను.

ఓ పరీక్షిన్మహారాజా! దుష్టులను శిక్షించే శ్రీకృష్ణుడు నూటొక్క తలలు గల కాలియుని ఏయే తల వంగలేదో, ఆయా తలను కాళ్లతో త్రొక్కి మర్దించెను. బలము క్షీణించగా ఆ పాము గిర గిర తిరుగుతూ నోటినుండి ముక్కునుండి విషమిశ్రితమై భయంకరమైన రక్తమును గ్రక్కుతూ గట్టిగా మూర్ఛను పొందెను.

తస్యాక్షిభిర్గరలముద్వమతశ్శిరస్సు
యద్యత్సమున్నమతి నిశ్శ్వసతో రుషోచ్చైః ।
నృత్యన్ పదానునమయన్ దమయాంబభూవ
పుష్పైః ప్రపూజిత ఇవేహ పుమాన్ పురాణః ॥ 29

అక్షిభిః - కన్నులతో, గరలమ్ - విషమును, ఉద్వమతః - పైకి గ్రక్కుచున్నట్టియు, రుషా - కోపముతో, ఉచ్చైః - గట్టిగా, నిశ్శ్వసతః - నిట్టూర్పును విడుచుచున్న, తస్య - ఆ కాలియుని, శిరస్సు - తలలయందు, యత్ యత్ - ఎయ్యది, సమున్నమతి - పైకి లేచునో

దానిని, నృత్యన్ - నాట్యము చేయుచున్న శ్రీకృష్ణుడు, పదా - కాలితో, అనునమయన్ - వంగునట్లు చేయువాడై, దమయాంబభూవ - తొక్కివేసెను, ఇహ - ఈ సందర్భమునందు, పురాణః పుమాన్ - పురాణపురుషుడగు శ్రీకృష్ణుడు, పుష్పైః - పువ్వులతో, ప్రపూజితః ఇవ - పూజించబడినాడా యన్నట్లుండెను.

ఆ కాలియుడు కన్నుల గుండా విషమును గ్రక్కుతూ కోపముతో నిట్టూర్చుచుండెను. ఆతడు ఏయే తలను పైకెత్తితే దానిని శ్రీకృష్ణుడు నాట్యము చేస్తూ కాలితో తొక్కివేసెను. ఈ సందర్భములో పురాణపురుషుడగు శ్రీకృష్ణుని కాలిపై రక్తబిందువులు పడి, ఆయనను కాలియుడు ఎఱ్ఱని పువ్వులతో పూజించినాడా యన్నట్లుండెను.

తచ్చిత్రతాండవవిరుగ్ణఫణాతపత్రో
రక్తం ముఖైరురు వమన్నృప భగ్నగాత్రః ।
స్మృత్వా చరాచరగురుం పురుషం పురాణం
నారాయణం తమరణం మనసా జగామ ॥ 30

నృప - రాజా!, తత్-చిత్రతాండవవిరుగ్ణఫణ-ఆతపత్రః - ఆ శ్రీకృష్ణుని పలువిధముల తాండవముచే ఎక్కువగా గాయపడ్డ పడగలనే గొడుగులు గలవాడు, ముఖైః - నోళ్లతో, ఉరు - అధికమగు, రక్తమ్ - రక్తమును, వమన్ - క్రక్కుచున్నవాడు, భగ్నగాత్రః - విరిగిన అవయవములు గలవాడు అగు కాలియుడు, చర-అచరగురుమ్ - స్థావరజంగమాత్మకమగు ప్రాణికోటికి తండ్రియైనట్టియు, పురుషమ్ - పూర్ణుడైనట్టియు, పురాణమ్ - సర్వజగత్కారణుడైన, తమ్ - ఆ, నారాయణమ్ - నారాయణుని, మనసా - మనస్సుతో, అరణమ్ - శరణును, జగామ - పొందెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ శ్రీకృష్ణుని రకరకముల తాండవముచే కాలియుని గొడుగులవంటి పడగలు అధికముగా గాయపడెను. అవయవములు విరిగిన ఆతడు నోళ్లనుండి రక్తమునధికముగా క్రక్కుచుండెను. ఆతడు మనస్సుతో స్థావరజంగమాత్మకమగు ప్రాణికోటికి తండ్రియైన నారాయణుని మనస్సుతో శరణు వేడెను. పూర్ణుడగు ఆ నారాయణుడే సర్వజగత్తునకు కారణము.

కృష్ణస్య గర్భజగతోఽతిభరావసన్నం
పార్ష్ణిప్రహారపరిరుగ్ణఫణాతపత్రమ్ ।
దృష్ట్వాఽహిమాద్యముపసేదురముష్య పత్న్య
ఆర్తాః శ్లథద్వసనభూషణకేశబంధాః ॥ 31

గర్భజగతః - గర్భమునందు జగత్తు గల, కృష్ణస్య - శ్రీకృష్ణునియొక్క, అతిభర-అవసన్నమ్ - అధికమగు భారముచే ఆక్రమించబడినట్టియు, పార్ష్ణిప్రహారపరిరుగ్ణఫణ-ఆతపత్రమ్ - కాలి మడమల దెబ్బలచే అంతటా గాయపడిన పడగలనే గొడుగులు కలిగిన, అహిమ్ - కాలియనాగమును, దృష్ట్వా - చూచి, అముష్య - వీని, ఆర్తాః - దుఃఖితలైన, పత్న్యః - భార్యలు, శ్లథద్-వసనభూషణకేశబంధాః - జారిపోవుచున్న వస్త్రములు అలంకారములు జుట్టుముడులు గలవారై, ఆద్యమ్ - జగత్కారణుడగు శ్రీకృష్ణుని, ఉపసేదుః - సమీపించిరి.

జగత్తంతా శ్రీకృష్ణుని గర్భమునందుండును. ఆ బరువుచే ఆక్రమించబడిన కాలియుని గొడుగుల వంటి పడగలు కాలి మడమల దెబ్బలచే అంతటా గాయపడెను. ఆ స్థితిని గమనించి దుఃఖమును పొందిన ఆతని భార్యలు హడావుడిలో వస్త్రములు, భూషణములు, జుట్టుముడులు జారిపోవుచుండ, జగత్కారణుడగు శ్రీకృష్ణుని సమీపించిరి.

తాస్తం సువిగ్నమనసోఽథ పురస్కృతార్భాః
కాయం నిధాయ భువి భూతపతిం ప్రణేముః ।
సాధ్వ్యః కృతాంజలిపుటాశ్శమలస్య భర్తుః
మోక్షేప్సవశ్శరణదం శరణం ప్రపన్నాః ॥ 32

అథ - తరువాత, సువిగ్నమనసః - అధికమగు ఆందోళనను పొందిన మనస్సులు గలవారు, పురస్కృత-అర్భాః - ముందుంచుకొనబడిన పిల్లలు గలవారు, సాధ్వ్యః - పతివ్రతలు, భర్తుః - భర్తయగు కాలియుని, శమలస్య - అపరాధమునకు, మోక్ష-ఈప్సవః - విముక్తిని కోరువారు అగు, తాః - ఆ కాలియుని భార్యలు, కృత-అంజలిపుటాః - చేయబడిన దొప్పలవంటి దోసిళ్లు గలవారై, భూతపతిమ్ - ప్రాణులకు ప్రభువైనట్టియు, శరణదమ్ - శరణునిచ్చే, తమ్ - ఆ శ్రీకృష్ణుని, కాయమ్

- దేహమును, భువి - నేలయందు, నిధాయ - ఉంచి, ప్రణేముః - నమస్కరించిరి, శరణమ్ - శరణును, ప్రపన్నాః - పొందిరి.

తరువాత మిక్కిలి ఆందోళన చెందిన మనస్సు గల కాళియపత్నులు తమ పిల్లలను ముందుంచుకొని సకలప్రాణికోటికి ప్రభువగు శ్రీకృష్ణునకు దండప్రణామమునాచరించిరి. ఆ పతివ్రతలు తమ భర్తకు అపరాధమునుండి (శిక్షనుండి) విముక్తి కలగాలని కోరువారై దోసిలి యొగ్గి, శరణునిచ్చే ఆ శ్రీకృష్ణుని శరణు వేడిరి.

నాగపత్న్య ఊచుః ।
న్యాయ్యో హి దండః కృతకిల్బిషేఽస్మింస్తవావతారః ఖలనిగ్రహాయ ।
రిపోస్సుతానామపి తుల్యదృష్టేర్ధత్సే దమం ఫలమేవానుశంసన్ ।। 33

కృతకిల్బిషే - చేయబడిన పాపము గల, అస్మిన్ - వీనియందు, దండః - శిక్ష, న్యాయ్యః - న్యాయబద్ధము, హి - ఏలయన, రిపోః - శత్రువునకు, సుతానాం అపి - పుత్రులకు కూడ, తుల్యదృష్టేః - సమానమగు దృష్టి గల, తవ - నీ, అవతారః - అవతారము, ఖలనిగ్రహాయ - దుష్టులను శిక్షించుట కొరకు, ఫలం ఏవ - ఫలమును గురించియే, అనుశంసన్ - విచారించువాడవై, దమమ్ - శిక్షను, ధత్సే - వేసెదవు.

కాలియనాగుని భార్యలు ఇట్లు పలికిరి --- పాపమును చేసిన ఈతనికి నీవు శిక్షను విధించుట న్యాయమే. శత్రువునందు, పుత్రులయందు నీకు సమదృష్టి గలదు. నీవు అవతరించినది దుష్టులను శిక్షించుట కొరకే. నీవు దుష్టుడు బాగుపడే విధానమును విచారించియే శిక్షను అమలు పరచెదవు.

అనుగ్రహోఽయం భవతా కృతో హి నో
దండోఽసతాం తే ఖలు కల్మషాపహః ।
యద్దందశూకత్వమముష్య దేహినః
క్రోధోఽపి తేఽనుగ్రహ ఏవ సమ్మతః ।। 34

భవతా - నీచే, నః - మాకు, అనుగ్రహః - అనుగ్రహము, కృతః - చేయబడినది, హి - ఏలయన, అసతామ్ - దుష్టులకు, తే - నీ, దండః - శిక్ష, కల్మష-అపహః ఖలు - పాపములను పోగొట్టునది గదా!, యత్ - ఏ

పాపము వలన, అముష్య - ఈ, దేహినః - జీవునకు, దందశూకత్వమ్ - పామై యుండుటయో, తే - నీ, క్రోధః అపి - కోపము కూడ, అనుగ్రహః ఏవ - అనుగ్రహముగానే, సమ్మతః - అంగీకారము.

నీవు మాకు ఈ విధముగా అనుగ్రహమునే చూపితివి. ఎందుకంటే, నీవు దుష్టులకు వేసే శిక్ష వారి పాపములను పోగొట్టును గదా! పాపము వలననే ఈ జీవునకు పాము జన్మ కలిగినది. నీ కోపము కూడ అనుగ్రహమేనని మేము స్వీకరించెదము.

తపస్సుతప్తం కిమనేన పూర్వం నిరస్తమానేన చ మానదేన ।
ధర్మోఽథ వా సర్వజనానుకంపయా యతో భవాంస్తుష్యతి సర్వజీవః॥

నిరస్తమానేన - తొలగిన అభిమానము కలిగినట్టియు, మానదేన చ - ఇతరులకు సత్కారమును కూడ చేసే, అనేన - వీనిచే, పూర్వమ్ - పూర్వజన్మయందు, కిమ్ - ఏ, తపః - తపస్సు, సుతప్తమ్ - బాగుగా చేయబడినదో?, అథవా - లేక, సర్వజన-అనుకంపయా - సకలప్రాణుల యందు దయతో, ధర్మః - ధర్మము, యతః - వేటివలనైతే, సర్వజీవః - సర్వులకు ప్రాణశక్తినిచ్చే, భవాన్ - నీవు, తుష్యతి - ప్రీతుడవగుదువో. 35

ఈతడు పూర్వజన్మలో అభిమానమును త్రోసిపుచ్చి ఇతరులకు సత్కారమును కూడ చేస్తూ ఏదో ఒక తపస్సును బాగుగా చేసియుండును. లేదా, ఈతడు సకలప్రాణులయందు దయతో ధర్మమును చేసియుండును. ఎందుకంటే, సకలప్రాణులలోని జీవశక్తివైన నీవు ఆ తపోధర్మముల చేతనే ప్రీతుడవగుదువు.

కస్యానుభావోఽస్య న దేవ విద్మహే
తవాంఘ్రిరేణుస్పర్శాధికారః ।
యద్వాంఛయా శ్రీర్లలనాఽఽచరత్తపో
విహాయ కామాన్ సుచిరం ధృతవ్రతా ॥ 36

దేవ - ఓ దేవా!, అస్య - వీనికి, తవ - నీ, అంఘ్రిరేణుస్పర్శ-అధికారః - పాదధూళిని స్పృశించే యోగ్యత, కస్య - దేని, అనుభావః - ఫలమో, న విద్మహే - తెలియము, యద్-వాంఛయా - ఏ పాదరేణువునందలి

కోరికతో, లలనా - ఉత్తమస్త్రీయగు, శ్రీః - లక్ష్మి, కామాన్ - భోగములను, విహాయ - విడిచిపెట్టి, సుచిరమ్ - చాల కాలము, ధృతవ్రతా - ధరించబడిన నిష్ఠ గలదియై, తపః - తపస్సును, ఆచరత్ - చేసెనో.

ఓ దేవా! ఈతనికి నీ పాదధూళిని స్పృశించే యోగ్యత కలిగినది. అది ఏ తపస్సు ఫలమో (ప్రభావమో) మాకు తెలియదు. లక్ష్మీదేవి నీ పాద ధూళిని కోరి భోగములను విడిచి చిరకాలము వ్రతనిష్ఠతో తపస్సు చేసెను.

న నాకపృష్ఠం న చ సార్వభౌమం న పారమేష్ఠ్యం న రసాఽఽధిపత్యమ్
న యోగసిద్ధీరపునర్భవం వా వాంఛంతి యత్పాదరజః ప్రపన్నాః॥37

యత్-పాదరజః - ఏ పాదధూళిని, ప్రపన్నాః - శరణు పొందినవారు, నాకపృష్ఠమ్ - స్వర్గస్థానమును, న వాంఛంతి - కోరరో, సార్వభౌమం చ - భూలోకరాజ్యమును కూడ, న - కోరరో, పారమేష్ఠ్యమ్ - బ్రహ్మపదమును, న - కోరరో, రసా-ఆధిపత్యమ్ - పాతాళరాజ్యమును, న - కోరరో, యోగసిద్ధీః - యోగసిద్ధులను, అపునః-భవం వా - పునర్జన్మ లేని మోక్షమునైననూ, న - కోరరో.

నీ పాదధూళిని శరణు వేడిన భక్తులు స్వర్గస్థానమును గాని, భూలోకరాజ్యమునైననూ, బ్రహ్మపదమును గాని, పాతాళరాజ్యమును గాని, యోగసిద్ధులను గాని, పునర్జన్మ లేని మోక్షమునైననూ కోరరు.

తదేష నాథాప దురాపమన్యైస్తమోజనిః క్రోధవశోఽప్యహీశః।
సంసారచక్రే భ్రమతశ్శరీరిణో యదిచ్ఛతస్స్యాద్విభవస్సమక్షః॥38

నాథ - ఓ ప్రభూ!, తమః-జనిః - తమోగుణమునుండి పుట్టినవాడు, క్రోధవశః - కోపమునకు వశమైనవాడు, అహి-ఈశః అపి - పాములలో శ్రేష్ఠుడు అగు ఈతడు కూడ, అన్యైః - ఇతరులచే, దురాపమ్ - పొంద శక్యము కాని, తత్ - ఆ పాదధూళిని, ఆప - పొందెను, యత్ - దేనినైతే, ఇచ్ఛతః - కోరునట్టియు, సంసారచక్రే - సంసారమనే చక్రమునందు, భ్రమతః - తిరుగాడుచున్న, శరీరిణః - దేహధారికి, సమక్షః - ప్రత్యక్షమగు, విభవః - సంపద, స్యాత్ - కలుగునో.

ఓ ప్రభూ! పాములకు ప్రభువగు ఈ కాలియుడు తమోగుణమునుండి పుట్టి కోపమునకు వశవర్తియే అయినా, ఇతరులచే పొంద శక్యము కాని ఆ పాదధూళిని పొందినాడు. సంసారమనే చక్రములో తిరిగే దేహధారి ఆ పాదధూళిని కోరినచో, ఆతనికి ప్రత్యక్షముగా (స్వయముగా) సంపద కలుగును.

నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే ।
భూతావాసాయ భూతాయ పరాయ పరమాత్మనే ॥ 39

భగవతే - భగవానుడవైనట్టియు, పురుషాయ - పూర్ణుడవైనట్టియు, మహాత్మనే - సర్వమునకు ఆత్మయైనట్టియు, భూత-ఆవాసాయ - సకలప్రాణులకు అధిష్ఠానమైనట్టియు, పరాయ - పరిచ్ఛేదములు లేని, భూతాయ - సద్ఘనుడైనట్టియు, పరమ-ఆత్మనే - సర్వాంతర్యామియగు ఆత్మరూపుడవైన, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ భగవానుడా! పూర్ణుడవగు నీకు నమస్కారము. సర్వాంతర్యామి, సకలప్రాణులకు అధిష్ఠానము అగు నీవు సర్వులలో ఆత్మరూపుడవై యున్నావు. దేశకాలవస్తుపరిచ్ఛేదములు లేని సద్ఘనుడవీవే.

జ్ఞానవిజ్ఞాననిధయే బ్రహ్మణేఽనంతశక్తయే ।
అగుణాయావికారాయ నమస్తేఽప్రాకృతాయ చ ॥ 40

జ్ఞానవిజ్ఞాననిధయే - జ్ఞానవిజ్ఞానములకు నిధి యైనట్టియు, అనంతశక్తయే - అనంతమగు శక్తి కలిగినట్టియు, అగుణాయ - నిర్గుణుడైనట్టియు, అవికారాయ - వికారములు లేనట్టియు, అప్రాకృతాయ చ - ప్రకృతికి అతీతుడవైన, బ్రహ్మణే - పరబ్రహ్మవగు, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

జ్ఞానములకు, అనుభవములకు ఆశ్రయమగు పరబ్రహ్మ నీవే. నీవు నిర్గుణుడవే అయినా, నీ శక్తి అనంతము. ప్రకృతికి అతీతుడవగు నీయందు వికారములు (మార్పులు) ఏమీ ఉండవు. నీకు నమస్కారము.

కాలాయ కాలనాభాయ కాలావయవసాక్షిణే ।
విశ్వాయ తదుపద్రష్ట్రే తత్కర్త్రే విశ్వహేతవే ॥ 41

కాలాయ - కాలరూపుడైనట్టియు, కాలనాభాయ - కాలశక్తికి ఆశ్రయమైనట్టియు, కాల-అవయవసాక్షిణే - కాలముయొక్క అవయవములైన క్షణనిమేషాదులకు సాక్షివైనట్టియు, విశ్వాయ - జగద్రూపుడవైనట్టియు, తద్-ఉపద్రష్ట్రే - ఆ జగత్తునకు సాక్షియైనట్టియు, తత్-కర్త్రే - ఆ జగత్తునకు కర్తయైనట్టియు, విశ్వహేతవే - జగత్తునకు కారణమైన (నీకు నమస్కారము).

కాలరూపుడవగు నీవే కాలశక్తికి ఆశ్రయము, మరియు కాలావయవములగు క్షణనిమేషాదులకు సాక్షివి. జగత్తునకు నిమిత్త కారణము, మరియు ఉపాదాన కారణము కూడ జగద్రూపుడవగు నీవే. జగత్సాక్షివగు నీకు నమస్కారము.

భూతమాత్రేంద్రియప్రాణమనోబుద్ధ్యాశయాత్మనే ।
త్రిగుణేనాభిమానేన గూఢస్వాత్మానుభూతయే ॥ 42

భూతమాత్రా-ఇంద్రియప్రాణమనః-బుద్ధి-ఆశయ-ఆత్మనే - పంచభూతములు శబ్దాది తన్మాత్రలు ఇంద్రియములు ప్రాణములు మనస్సు బుద్ధి చిత్తముల స్వరూపమైనట్టియు, త్రిగుణేన - మూడు గుణములు గల, అభిమానేన - అభిమానముచే, గూఢస్వ-ఆత్మానుభూతయే - కప్పివేయబడిన నీ స్వరూపముయొక్క అనుభవము కలిగిన (నీకు నమస్కారము).

పంచభూతములు, శబ్దాది తన్మాత్రలు, ఇంద్రియములు, ప్రాణాపానాది ప్రాణములు, మనస్సు, బుద్ధి, చిత్తముల యథార్థతత్త్వము నీవే. సత్త్వరజస్తమోగుణాత్మకములగు ఈ దేహాదులయందు నేను, నాది అనే అభిమానము ఆత్మరూపుడవగు నీవు అనుభవమునకు రాకుండా కప్పివేయును. నీకు నమస్కారము.

నమోఽనంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే ।
నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే ॥ 43

**అనంతాయ - అనంతుడైనట్టియు, సూక్ష్మాయ - సూక్ష్ముడైనట్టియు, కూటస్థాయ - నిర్వికారుడైనట్టియు, విపశ్చితే - సర్వజ్ఞుడైనట్టియు, నానా**

వాద-అనురోధాయ - వివిధములైన వాదములను అనుసరించునట్టియు, వాచ్యవాచకశక్తయే - నామరూపముల శక్తి అయిన (నీకు నమస్కారము).

నీవు అంతము లేనివాడవు, సూక్ష్ముడవు, నిర్వికారుడవు, సర్వజ్ఞుడవు. నీవు పలు వాదములను అనుసరించి, ఆ వాదులనా రూపములలోనే అనుగ్రహించెదవు. నామరూపముల శక్తి నీవే (నీకు నమస్కారము).

నమః ప్రమాణమూలాయ కవయే శాస్త్రయోనయే ।
ప్రవృత్తాయ నివృత్తాయ నిగమాయ నమో నమః ॥ 44

ప్రమాణమూలాయ - ప్రత్యక్షాది ప్రమాణములకు మూలమునందుండే చైతన్యమైనట్టియు, కవయే - సర్వజ్ఞుడవైనట్టియు, శాస్త్రయోనయే - వేదముచే ప్రతిపాదించబడునట్టియు (వేదమునకు మూలమైనట్టియు), ప్రవృత్తాయ - ప్రవృత్తుడవైనట్టియు, నివృత్తాయ - నివృత్తుడవైనట్టియు, నిగమాయ - వేదమైన నీ కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

ప్రత్యక్షాది ప్రమాణములకు మూలమునందుండే సాక్షి చైతన్యము నీవే. సర్వజ్ఞుడవగు నీవే వేదకర్తవు, వేదప్రతిపాద్యుడవు. రామాద్యవతారములలో ప్రవృత్తి, దక్షిణామూర్త్యాద్యవతారములలోని నివృత్తి నీ స్వరూపమే. వేదరూపుడవగు నీకు అనేక నమస్కారములు.

నమః కృష్ణాయ రామాయ వసుదేవసుతాయ చ ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ సాత్వతాం పతయే నమః ॥ 45

వసుదేవసుతాయ - వసుదేవుని పుత్రుడైన, కృష్ణాయ - కృష్ణుని కొరకు, రామాయ చ - (బల)రాముని కొరకు, ప్రద్యుమ్నాయ - ప్రద్యుమ్నుని కొరకు, అనిరుద్ధాయ - అనిరుద్ధుని కొరకు, సాత్వతామ్ - భక్తులకు (యాదవులకు), పతయే - ప్రభువగు నీ కొరకు, నమః - నమస్కారము.

వసుదేవుని పుత్రుడవై భక్తులనాకర్షించే కృష్ణుడవు నీవే. (బల) రాముడవై భక్తుల హృదయములను రమింపజేసేది నీవే. ప్రద్యుమ్న (ఉత్కృష్ట ప్రకాశము గలవాడు)-అనిరుద్ధ (ఆటంకములు లేనివాడు) రూపములలో నున్నది నీవే. యాదవులకు (సత్త్వగుణప్రధానులగు భక్తులకు) ప్రభువగు నీకు నమస్కారము.

నమో గుణప్రదీపాయ గుణాత్మచ్ఛాదనాయ చ ।
గుణవృత్త్యుపలక్ష్యాయ గుణద్రష్ట్రే స్వసంవిదే ॥ 46

గుణప్రదీపాయ - గుణకార్యములగు దేహాదులను ప్రకాశింపజేయునట్టియు, గుణాత్మచ్ఛాదనాయ చ - గుణకార్యములచే తనను కప్పివేయునట్టియు, గుణవృత్తి-ఉపలక్ష్యాయ - గుణకార్యములగు అంతఃకరణము మొదలగువాటి వ్యాపారములచే నికటముగా సూచించబడునట్టియు, గుణద్రష్ట్రే - గుణకార్యములగు దేహాదులకు సాక్షియైనట్టియు, స్వసంవిదే - స్వయంప్రకాశచైతన్యరూపుడవగు (నీకు), నమః - నమస్కారము.

గుణకార్యములగు దేహాదులను ప్రకాశింపజేసే చైతన్యము నీవే ఐనా, నీ స్వరూపమును వాటియందలి అభిమానమే కప్పి వేయును. ఐతే, గుణ కార్యములగు మనస్సు మొదలగువాటి వ్యాపారములు నీ స్వరూపము వైపు సంకేతములనిచ్చుచునే యుండును. దేహేంద్రియాదులకు సాక్షియగు స్వయంప్రకాశ-ఆత్మవగు నీ కొరకు నమస్కారము.

అవ్యాకృతవిహారాయ సర్వవ్యాకృతసిద్ధయే ।
హృషీకేశ నమస్తేఽస్తు మునయే మౌనశాలినే ॥ 47

హృషీక-ఈశ - ఓ ఇంద్రియాధిపతీ!, అవ్యాకృతవిహారాయ - మాయాశక్తియందు విహరించునట్టియు, సర్వవ్యాకృతసిద్ధయే - సకలములైన నామరూపముల సిద్ధికి మూలమైనట్టియు, మునయే - మననశీలుడవైనట్టియు, మౌనశాలినే - ఆత్మారాముడవై ప్రకాశించే, తే - నీ కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!

ఇంద్రియములను ప్రవర్తిల్లజేసే ఓ దేవా! మాయాశక్తియందు విహరించే నీనుండి సకలనామరూపములు సిద్ధించుచున్నవి. ఆత్మా రాముడవై ప్రకాశించే నీ స్వభావము మౌనమే. నీకు నమస్కారమగు గాక!

పరావరగతిజ్ఞాయ సర్వాధ్యక్షాయ తే నమః ।
అవిశ్వాయ చ విశ్వాయ తద్ద్రష్ట్రేఽస్య చ హేతవే ॥ 48

పర-అవరగతిజ్ఞాయ - కారణకార్యముల తత్త్వము తెలిసినట్టియు, సర్వ-అధ్యక్షాయ - సర్వసాక్షియైనట్టియు, అవిశ్వాయ - విశ్వధర్మముల వికారము లేనట్టియు, విశ్వాయ చ - విశ్వరూపముగా కూడ ప్రకటమైనట్టియు, తద్-ద్రష్ట్రే - ఆ విశ్వమును సాక్షిగా దర్శించి ప్రకాశింపజేయునట్టియు, అస్య - ఈ విశ్వమునకు, హేతవే చ - కారణము కూడ అయిన, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

మాయాశక్తి మొదలగు కారణముల తత్త్వము, పంచభూతాది కార్యముల తత్త్వము సర్వసాక్షివగు నీకే తెలియును. నీవు జగద్రూపముగా ప్రకటమైననూ జగత్తులోని వికారములు నీకు లేవు. ఈ జగత్తునకు కారణమైన నీవే జగత్తునకు సాక్షివై జగత్తును ప్రకాశింప జేయుదువు. (విశ్వము లేని నీయందు విశ్వము ప్రకటమగుచున్నది, అనగా నీవు విశ్వమునకు వివర్తాధిష్ఠానము). నీకు నమస్కారము.

త్వం హ్యస్య జన్మస్థితిసంయమాన్ ప్రభో
గుణైరనీహోఽకృత కాలశక్తిధృక్ ।
తత్తత్స్వభావాన్ ప్రతిబోధయన్ సతః
సమీక్షయాఽమోఘవిహార ఈహసే ॥ 49

ప్రభో - ఓ ప్రభూ!, అనీహః - కామనలు (క్రియలు) లేనట్టియు, కాలశక్తిధృక్ - కాలముయొక్క శక్తిని ధరించిన, త్వమ్ - నీవు, గుణైః - గుణములతో, అస్య - ఈ జగత్తుయొక్క, జన్మస్థితిసంయమాన్ - సృష్టిస్థితిలయములను, అకృత - చేసితివి, అమోఘవిహార - వ్యర్థము కాని విహారము గలవాడా, సతః - బీజరూపముగానున్న, తత్-తత్-స్వభావాన్ - ఆయా స్వభావములను, సమీక్షయా - దర్శనముచే, ప్రతిబోధయన్ - ఉద్బుద్ధము చేయువాడవై, ఈహసే - క్రీడించుచున్నావు.

ఓ ప్రభూ! నీ విహారము అమోఘము. నీయందు క్రియ గాని, ఇచ్ఛ గాని లేదు. అయిననూ, నీవు కాలముయొక్క శక్తిని దాల్చి సత్త్వరజస్తమోగుణములతో ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను

చేయుదువు. నీయందు బీజరూపముగానున్న ఆయా ప్రాణుల స్వభావములను నీవు నీ చూపుతో ఉద్బుద్ధము చేసి క్రీడించెదవు.

తస్యైవ తేఽమూస్తనవస్త్రిలోక్యాం
శాంతా అశాంతా ఉత మూఢయోనయః ।
శాంతాః ప్రియాస్తే హ్యధునాఽవితుం సతాం
స్థాతుశ్చ తే ధర్మపరీప్సయేహతః ।। 50

త్రిలోక్యామ్ - ముల్లోకములయందు, అమూః - ఈ, శాంతాః - సత్త్వగుణప్రధానమైనవి, అశాంతాః - రజోగుణప్రధానమైనవి, ఉత - మరియు, మూఢయోనయః - తమోగుణప్రధానములైన దేహములు, తస్య - అట్టి, తవ - నీ, తనవః ఏవ - దేహములే, హి - నిశ్చయము, సతామ్ - సత్పురుషులయొక్క, ధర్మపరీప్సయా - ధర్మమును పాలించే కోరికతో, ఈహతః - ప్రవర్తిల్లునట్టియు, అవితుం చ - రక్షించుటకు కూడ, స్థాతుః - నిలబడియున్న, తే - నీకు, అధునా - ఇప్పుడు, శాంతాః - సత్త్వగుణప్రధానములు, ప్రియాః - ప్రియములు.

ముల్లోకములయందు సత్త్వగుణప్రధానములై శాంతములు (దేవాదులు), రజోగుణ ప్రధానములై అశాంతములు (మనుష్యాదులు), తమోగుణప్రధానములై మూఢములు (సర్పాదులు) అగు ఈ మూడు రకముల జన్మలు గలవు. అవన్నీ జగదధిష్ఠానమగు నీ రూపములు మాత్రమే. ఇది నిశ్చయము. ఇప్పుడు నీవు సత్పురుషుల ధర్మమును రక్షించే కోరికతో ప్రవర్తిల్లుచున్నావు. సత్పురుషులను రక్షించుటకై నడుము కట్టియున్న నీకు శాంతజనులే ప్రీతిని కలిగించెదరు.

అపరాధస్సకృద్భర్త్రా సోఢవ్యస్స్వప్రజాకృతః ।
క్షంతుమర్హసి శాంతాత్మన్ మూఢస్య త్వామజానతః ।। 51

భర్త్రా - ప్రభువుచే, స్వప్రజాకృతః - తన ప్రజలచే చేయబడిన, అపరాధః - తప్పు, సకృత్ - ఒక్కసారి, సోఢవ్యః - సహించదగినది, శాంత-ఆత్మన్ - శాంతమైన మనస్సు గలవాడా!, మూఢస్య -

తమోగుణప్రధానుడైనట్టియు, త్వామ్ - నిన్ను, అజానతః - తెలియని వీనికి, క్షంతుమ్ - క్షమించుటకు, అర్హసి - తగుదువు.

శాంతమైన మనస్సు గల ఓ ప్రభూ! ప్రభువు తన సేవకుని తప్పును ఒక్కసారి క్షమించవలెను. ఈ కాలియుడు తమోగుణప్రధానుడు, కావుననే నీ మహిమను యెరుగడు. వీనిని నీవు క్షమించ దగును.

అనుగృహ్ణీష్వ భగవన్ ప్రాణాంస్త్యజతి పన్నగః ।
స్త్రీణాం నస్సాధుశోచ్యానాం పతిః ప్రాణః ప్రదీయతామ్ ॥ 52

భగవన్ - ఓ భగవానుడా!, అనుగృహ్ణీష్వ - అనుగ్రహించుము, పన్నగః - పాము, ప్రాణాన్ - ప్రాణములను, త్యజతి - విడిచిపెట్టును, సాధుశోచ్యానామ్ - సత్పురుషులచే జాలి చూపదగిన, స్త్రీణామ్ - స్త్రీలమగు, నః - మాకు, ప్రాణః - ప్రాణమైన, పతిః - భర్త, ప్రదీయతామ్ - ఈయబడుగాక!

హే భగవన్! ఈ పామును అనుగ్రహించుము. లేనిచో ఇది ప్రాణములను కోల్పోవును. సత్పురుషులు స్త్రీలపై జాలిని చూపెదరు. స్త్రీలమగు మాకు భర్తయే ప్రాణము. మాకు పతిభిక్షను పెట్టుము.

విధేహి తే కింకరీణామనుష్ఠేయం తవాజ్ఞయా ।
యచ్ఛ్రద్ధయాఽనుతిష్ఠన్ వై ముచ్యతే సర్వతోభయాత్ ॥ 53

తే - నీ, కింకరీణామ్ - సేవికలమైన మాకు, అనుష్ఠేయమ్ - చేయదగినదానిని, విధేహి - ఆజ్ఞాపించుము, యత్ - ఏలయనగా, తవ - నీ, ఆజ్ఞయా - ఆజ్ఞచే, శ్రద్ధయా - శ్రద్ధతో, అనుతిష్ఠన్ - అనుష్ఠించువాడు, సర్వతః-భయాత్ - అన్ని వైపులనుండి భయము గల సంసారమునుండి, వై - నిశ్చయముగా, ముచ్యతే - విముక్తుడగును.

మేము నీ సేవికలము. మేము ఏమి చేయవలెనో ఆజ్ఞాపించుము. నీ ఆజ్ఞను శ్రద్ధతో అనుష్ఠించువాడు, అన్ని వైపులనుండి భయముతో కూడియున్న సంసారమునుండి నిశ్చయముగా విముక్తుడగును.

శ్రీశుక ఉవాచ ।
ఇత్థం స నాగపత్నీభిర్భగవాన్ సమభిష్టుతః ।
మూర్ఛితం భగ్నశిరసం విససర్జాంఘ్రికుట్టనైః ॥ 54

నాగపత్నీభిః - కాలియనాగుని భార్యలచే, ఇత్థమ్ - ఈ విధముగా, సమభిష్టుతః - బాగుగా స్తుతించబడిన, సః - ఆ, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, అంఘ్రికుట్టనైః - కాలి తాపులచే, మూర్ఛితమ్ - మూర్ఛిల్లినట్టియు, భగ్నశిరసమ్ - విరిగిన పడగలు కలిగిన కాలియుని, విససర్జ - విడిచిపెట్టెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణ భగవానుని కాలితాపులతో పడగలు విరిగి కాలియనాగుడు మూర్ఛిల్లెను. ఆతని భార్యలీ విధముగా చక్కగా స్తుతించగా, ఆయన వానిని విడిచిపెట్టెను.

ప్రతిలబ్ధేంద్రియప్రాణః కాలియశ్శనకైర్హరిమ్ ।
కృచ్ఛ్రాత్సముచ్ఛ్వసన్ దీనః కృష్ణం ప్రాహ కృతాంజలిః ॥ 55

ప్రతిలబ్ధ-ఇంద్రియప్రాణః - తిరిగి పొందబడిన ఇంద్రియములు ప్రాణములు గలవాడు, కృచ్ఛ్రాత్ - కష్టముగా, సముచ్ఛ్వసన్ - నిట్టూర్పులు విడుచుచున్నవాడు, దీనః - దీనుడు అగు, కాలియః - కాలియుడు, కృత-అంజలిః - దోసిలి యొగ్గినవాడై, శనకైః - మెల్లగా, హరిమ్ - పాపహరుడగు, కృష్ణమ్ - శ్రీకృష్ణ భగవానుని ఉద్దేశించి, ప్రాహ - పలికెను.

కాలియునకు పోయిన ఇంద్రియశక్తులు, ప్రాణములు తిరిగి వచ్చెను. ఆతడు కష్టముగా నిట్టూర్పులను విడుస్తూ దీనముగా దోసిలి యొగ్గి పాపహరుడగు శ్రీకృష్ణ భగవానునితో నిట్లనెను.

కాలియ ఉవాచ ।
వయం ఖలాస్సహోత్పత్త్యా తామసా దీర్ఘమన్యవః ।
స్వభావో దుస్త్యజో నాథ లోకానాం యదసద్గ్రహః ॥ 56

నాథ - ఓ ప్రభూ!, తామసాః - తమోగుణప్రధానులము, దీర్ఘమన్యవః - చిరకాలము సాగే కోపము గలవారము అగు, వయమ్ - మేము,

ఉత్పత్త్యా సహ - పుట్టుకతో బాటు, ఖలాః - దుష్టులము, లోకానామ్ - ప్రాణులకు, స్వభావః - స్వభావము, దుస్త్యజః - కష్టముచే విడువ దగినది, యత్ - ఏలయన, అసద్-గ్రహః - అయోగ్యమైన ఆగ్రహము.

కాలియుడిట్లు పలికెను --- ఓ ప్రభూ! మేము పుట్టుకతోటే దుష్టులము, తమోగుణప్రధానులము. మా కోపము చిరకాలము కొనసాగేది. ప్రాణులకు స్వభావమును విడిచిపెట్టుట దుర్ఘటము. సంసారులు దురాగ్రహము (దురభిమానము) ను కలిగియుందురు.

త్వయా సృష్టమిదం విశ్వం ధాతర్గుణవిసర్జనమ్ ।
నానాస్వభావవీర్యౌజోయోనిబీజాశయాకృతి ॥ 57

ధాతః - ఓ విధాతా!, గుణవిసర్జనమ్ - సత్త్వరజస్తమోగుణములచే రకరకములుగా సృష్టించబడేది, నానాస్వభావవీర్య-ఓజః-యోనిబీజ-ఆశయ-ఆకృతి - పలు విధముల స్వభావము దేహశక్తి ఇంద్రియశక్తి తల్లియొక్క శక్తి తండ్రియొక్క శక్తి వాసనలు రూపము గల, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తు, త్వయా - నీచే, సృష్టమ్ - సృష్టించబడినది.

ఓ విధాతా! సత్త్వరజస్తమోగుణముల కార్యమగు ఈ వైవిధ్యభరితమైన జగత్తును సృష్టించినది నీవే. దీనియందు పలు విధముల శాంతాది స్వభావములు, దేహశక్తి, ఇంద్రియశక్తి, తల్లి శక్తి, తండ్రి శక్తి, వాసనలు, రూపములు గలవు.

వయం చ తత్ర భగవన్ సర్పా జాత్యురుమన్యవః ।
కథం త్యజామస్త్వన్మాయాం దుస్త్యజాం మోహితాస్స్వయమ్ ॥ 58

భగవన్ - ఓ భగవానుడా!, తత్ర - ఆ జగత్తునందు, వయమ్ - మేము, సర్పాః చ - పాములమైతే, జాతి-ఉరుమన్యవః - పుట్టుకతో అధికమగు కోపము గలవారము, దుస్త్యజామ్ - విడువ కష్టమైన, త్వత్-మాయామ్ - నీ మాయను, మోహితాః - మోహితులమైన మేము, స్వయమ్ - మా అంత మేము, కథమ్ - ఏ విధముగా, త్యజామః - విడిచెదము?

హే భగవన్! ఆ జగత్తులో పాములము మేమైతే పుట్టుకతోనే అధికమగు కోపము గలవారము. నీ మాయను అతిక్రమించుట చాల కష్టము.

మోహితులమై యున్న మేము మా అంత మాకుగా మాయను ఎట్లు అతిక్రమించగలము? (అతిక్రమించ లేము).

భవాన్ హి కారణం తత్ర సర్వజ్ఞో జగదీశ్వరః ।
అనుగ్రహం నిగ్రహం వా మన్యసే తద్విధేహి నః ॥ 59

సర్వజ్ఞః - సర్వము తెలిసినవాడవు, జగద్-ఈశ్వరః - జగన్నాథుడవు అగు, భవాన్ హి - నీవే, తత్ర - ఆ విషయమునందు, కారణమ్ - కారణము, అనుగ్రహం వా - అనుగ్రహమును గాని, నిగ్రహం వా - శిక్షను గాని, మన్యసే - తలచెదవో, తత్ - దానిని, నః - మాకు, విధేహి - విధించుము.

జగన్నాథుడవగు నీవు సర్వము తెలిసినవాడవు. మా స్వభావమునకు కారణము నీవే. అనుగ్రహము గాని, శిక్ష గాని, దేనిని నీవు భావిస్తే, దానిని మాకు విధించుము.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యాకర్ణ్య వచః ప్రాహ భగవాన్ కార్యమానుషః ।
నాత్ర స్థేయం త్వయా సర్ప సముద్రం యాహి మా చిరమ్ ।
సర్వజ్ఞాత్యపత్యదారాఢ్యో గోనృభిర్యుజ్యతాం నదీ ॥ 60

ఇతి - అని, వచః - మాటను, ఆకర్ణ్య - విని, కార్యమానుషః - దేవకార్యము కొరకై మానవునిగా అవతరించిన, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ప్రాహ - పలికెను, సర్ప - ఓ సర్పమా!, అత్ర - ఇచట, త్వయా - నీచే, న స్థేయమ్ - ఉండబడరాదు, మా చిరమ్ - విలంబము లేకుండా, సర్వజ్ఞాతి-అపత్యదార-ఆఢ్యః - అందరు బంధువులు సంతానము భార్యలతో కూడినవాడవై, సముద్రమ్ - సముద్రమును గురించి, యాహి - వెళ్లుము, నదీ - యమునానది, గోనృభిః - గోవులచే మానవులచే, యుజ్యతామ్ - వినియోగించబడుగాక!

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణ భగవానుడు దేవకార్యము కొరకై మానవునిగా అవతరించెను. ఆయన ఈ మాటను విని, కాలియునితో నిట్లనెను: ఓ కాలియా! నీవిక్కడ ఉండవద్దు. బంధువులు,

సంతానము, భార్యలతో కూడి విలంబము లేకుండా సముద్రమునకు వెళ్లుము. ఈ నదిని గోవులు, మానవులు వినియోగించెదరు గాక!

య ఏతత్సంస్మరేన్మర్త్యస్తుభ్యం మదనుశాసనమ్ ।
కీర్తయన్నుభయోస్సంధ్యోర్న యుష్మద్భయమాప్నుయాత్ ॥61

యః - ఏ, మర్త్యః - మానవుడైతే, ఏతత్ - ఈ, తుభ్యమ్ - నీ కొరకు, మద్-అనుశాసనమ్ - నా దండమును, ఉభయోః - రెండు, సంధ్యోః - సంధ్యలయందు, కీర్తయన్ - కీర్తించుచున్నవాడై, సంస్మరేత్ - చక్కగా స్మరించునో, యుష్మద్-భయమ్ - నీ వలన భయమును, న ఆప్నుయాత్ - పొందదు.

ఏ మానవుడైతే నేను నీకిచ్చిన ఈ శిక్షను రెండు సంధ్యలయందు కీర్తిస్తూ చక్కగా స్మరించునో, అట్టివానికి నీ వలన భయము కలుగదు.

యోఽస్మిన్ స్నాత్వా మదాక్రీడే దేవాదీంస్తర్పయేజ్జలైః ।
ఉపోష్య మాం స్మరన్నర్చేత్సర్వపాపైః ప్రముచ్యతే ॥ 62

యః - ఎవడైతే, ఉపోష్య - ఉపవాసము చేసి, మద్-ఆక్రీడే - నా నాట్యము గల, అస్మిన్ - ఈ సరస్సునందు, స్నాత్వా - స్నానమును చేసి, దేవ-ఆదీన్ - దేవతలు మొదలగువారిని, జలైః - జలములతో, తర్పయేత్ - తర్పణములనిచ్చునో, మామ్ - నన్ను, స్మరన్ - స్మరించుచున్నవాడై, అర్చేత్ - పూజించునో, సర్వపాపైః - సకలపాపములనుండి, ప్రముచ్యతే - పూర్తిగా విముక్తుడగును.

ఎవడైతే ఉపవాసము చేసి నేను క్రీడించిన ఈ సరస్సులో స్నానము చేసి, దేవతలకు పితృదేవతలకు తర్పణములనిచ్చి, నన్ను స్మరిస్తూ పూజించునో, అట్టివాడు సకలపాపములనుండి పూర్తిగా విముక్తుడగును.

ద్వీపం రమణకం హిత్వా హ్రదమేతముపాశ్రితః ।
యద్భయాత్స సుపర్ణస్త్వాం నాద్యాన్మత్పాదలాంఛితమ్ ॥ 63

యద్-భయాత్ - ఏ గరుడుని వలని భయము వలన, రమణకమ్ - రమణకమనే, ద్వీపమ్ - ద్వీపమును, హిత్వా - విడిచిపెట్టి, ఏతమ్ - ఈ,

హ్రదమ్ - సరస్సును, ఉపాశ్రితః - ఆశ్రయించినవాడవో, సః - ఆ, సుపర్ణః - గరుడుడు, మత్-పాదలాంఛితమ్ - నా పాదములచే చిహ్నితమైన, త్వామ్ - నిన్ను, న అద్యాత్ - భక్షించుకుండును గాక!

గరుడుని వలన భయపడి నీవు రమణకద్వీపమును విడిచిపెట్టి ఈ సరస్సునాశ్రయించితివి. నా పాదముల గుర్తులు గల నిన్ను ఆ గరుడుడు భక్షించకుండును గాక!

శ్రీశుక ఉవాచ । ఏవముక్తో భగవతా కృష్ణేనాద్భుతకర్మణా ।
తం పూజయామాస ముదా నాగపత్న్యశ్చ సాదరమ్ ।। 64

అద్భుతకర్మణా - అచ్చెరువును గొలిపే లీలలు గల, భగవతా కృష్ణేన - శ్రీకృష్ణ భగవానునిచే, ఏవమ్ - ఈ విధముగా, ఉక్తః - పలుకబడిన కాలియుడు, ముదా - ఆనందముతో, తమ్ - ఆయనను, స-ఆదరమ్ - ఆదరముతో కూడిన విధముగా, పూజయామాస - పూజించెను, నాగపత్న్యః చ - కాలియుని భార్యలు కూడ.

శ్రీశుక మహర్షి పలికెను --- శ్రీకృష్ణ భగవానుని లీలలు అచ్చెరువును గొలుపును. ఆయన ఈ విధముగా పలుకగా, కాలియుడు మరియు ఆతని భార్యలు కూడ ఆనందముతో ఆదరపూర్వకముగా ఆయనను పూజించిరి.

దివ్యాంబరస్రఙ్మణిభిః పరార్ఘ్యైరపి భూషణైః ।
దివ్యగంధానులేపైశ్చ మహత్యోత్పలమాలయా ।। 65
పూజయిత్వా జగన్నాథం ప్రసాద్య గరుడధ్వజమ్ ।
తతః ప్రీతోఽభ్యనుజ్ఞాతః పరిక్రమ్యాభివంద్య తమ్ ।। 66

దివ్య-అంబరస్రక్-మణిభిః - ప్రకాశించే వస్త్రములు మాలలు మణులతో, పర-అర్ఘ్యైః - మిక్కిలి విలువైన, భూషణైః అపి - అలంకారములతో కూడ, దివ్యగంధ-అనులేపైః చ - దివ్యమగు గంధముల అలదుటలతో, మహత్యా - పెద్ద, ఉత్పలమాలయా - కలువల మాలతో, జగత్-నాథమ్ - జగత్తునకు ప్రభువైనట్టియు, గరుడధ్వజమ్ - గరుడుడు ధ్వజమునందు గల శ్రీకృష్ణ భగవానుని, పూజయిత్వా - పూజించి, ప్రసాద్య - ప్రసన్నునిగా చేసుకొని, తతః - తరువాత, ప్రీతః -

సంతోషించినవాడై, అభ్యనుజ్ఞాతః - అనుమతి ఈయబడినవాడై, తమ్ - ఆ శ్రీకృష్ణుని, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, అభివంద్య - నమస్కరించి.

జగన్నాథుడగు శ్రీకృష్ణుని ధ్వజముపై గరుడుడు ఉండును. కాలియుడు ప్రకాశించే వస్త్రములను, మాలలను, మణులను, మిక్కిలి విలువైన ఆభరణములను, దివ్యమగు గంధలేపనములను, పెద్ద కమలముల మాలను కూడ సమర్పించి ఆయనను పూజించెను. ఆ విధముగా ఆయనను ప్రసన్నుని చేసి, ఆతడా తరువాత ఆనందముతో ఆయనకు ప్రదక్షిణము చేసి నమస్కరించి సెలవు తీసుకొనెను.

సకలత్రసుహృత్పుత్రో ద్వీపమబ్ధేర్జగామ హ ।
తదైవ సామృతజలా యమునా నిర్విషాభవత్ ।
అనుగ్రహాద్భగవతః క్రీడామానుషరూపిణః ॥ 67

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే షోడశోధ్యాయః ॥

సకలత్రసుహృత్-పుత్రః - భార్యలు బంధువులు పుత్రులతో కూడిన కాలియుడు, అబ్ధేః - సముద్రముయొక్క, ద్వీపమ్ - ద్వీపమును గురించి, జగామ హ - వెళ్లెను, తదా - అప్పుడే, క్రీడామానుషరూపిణః - లీలకై మానవరూపమును దాల్చిన, భగవతః - శ్రీకృష్ణ భగవానుని, అనుగ్రహాత్ - అనుగ్రహము వలన, సా - ఆ, యమునా - యమున, నిర్విషా - విషము లేనిది, అమృతజలా - అమృతము వంటి నీరు గలది, అభవత్ - ఆయెను.

భార్యలు, బంధువులు, పుత్రులతో కూడి కాలియుడు సముద్రములోని రమణకద్వీపమునకు వెళ్లెను. అప్పుడే ఆ యమునానదిలోని విషము పోయి నీరు అమృతము వలె ఆయెను. అదంతా లీలకై మానవరూపమును దాల్చిన శ్రీకృష్ణ భగవానుని అనుగ్రహమే.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము పూర్వార్ధములో కాలియమర్దన లీలను వర్ణించే పదునారవ అధ్యాయము ముగిసినది (౧౬).



# అథ సప్తదశోऽధ్యాయః

## శ్రీకృష్ణుడు గోకులవాసులను దావాగ్నినుండి కాపాడుట

రాజోవాచ ।
నాగాలయం రమణకం కస్మాత్తత్యాజ కాలియః ।
కృతం కిం వా సుపర్ణస్య తేనైకేనాసమంజసమ్ ॥ 1

కాలియః - కాలియుడు, నాగ-ఆలయమ్ - సర్పములకు నివాసమగు, రమణకమ్ - రమణకద్వీపమును, కస్మాత్ - ఎందువలన, తత్యాజ - విడిచిపెట్టెను?, తేన - వానిచే, ఏకేన - ఒక్కనిచే, సుపర్ణస్య - గరుడునకు, అసమంజసమ్ - అప్రియము, కిం వా కృతమ్ - ఏమి చేయబడినది?

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- కాలియుడు సర్పములకు నివాసస్థానమగు రమణకద్వీపమును విడిచిపెట్టుటకు కారణమేమి? ఆతడొక్కడే గరుడునకు చేసిన అప్రియమెట్టిది?

శ్రీశుక ఉవాచ ।
ఉపహార్యైస్సర్పజనైర్మాసి మాసీహ యో బలిః ।
వానస్పత్యో మహాబాహో నాగానాం ప్రాఙ్నిరూపితః ॥ 2

మహాబాహో - గొప్ప బాహువులు గల ఓ రాజా!, ఇహ - ఈ ద్వీపమునందు, ప్రాక్ - పూర్వము, ఉపహార్యైః - ఆహారముగా సమర్పించబడే, సర్పజనైః - సర్పములనే పౌరులచే, మాసి మాసి - ప్రతి నెలయందు, యః - ఏ, బలిః - ఆహారము, నాగానామ్ - సర్పములకు, నిరూపితః - ఏర్పాటు చేయబడినదో అది, వానస్పత్యః - చెట్టు మొదట్లో పెట్టబడునది.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గొప్ప బాహువులు గల ఓ పరీక్షిన్మహారాజా! పూర్వము రమణకద్వీపములో గరుడునిచే సర్పములు

భక్షించబడుచుండగా, పురవాసులగు వాసుకి మొదలగువారు ఒక వ్యవస్థను చేసిరి. అదేమంటే, ప్రతి నెలా గరుడునకు ఆహారమును చెట్టు మొదట్లో పెట్టవలెను.

స్వం స్వం భాగం ప్రయచ్ఛంతి నాగాః పర్వణి పర్వణి ।
గోపీథాయాత్మనస్సర్వే సుపర్ణాయ మహాత్మనే ॥ 3

సర్వే - అందరు, నాగాః - సర్పములు, ఆత్మనః - తన, గోపీథాయ - రక్షణ కొరకై, పర్వణి పర్వణి - ప్రతి అమావాస్యనాడు, మహాత్మనే - పెద్ద శరీరము (బలము) గల, సుపర్ణాయ - గరుడుని కొరకు, స్వం స్వమ్ - తమ తమ, భాగమ్ - వంతును, ప్రయచ్ఛంతి - సమర్పించెదరు.

సర్పములన్నీ తమ రక్షణ కొరకై గొప్ప శరీరబలము గల గరుడునకు ప్రతి అమావాస్యనాడు తమ వంతు ఆహారమును సమర్పించెదరు.

విషవీర్యమదావిష్టః కాద్రవేయస్తు కాలియః ।
కదర్థీకృత్య గరుడం స్వయం తం బుభుజే బలిమ్ ॥ 4

విషవీర్యమద-ఆవిష్టః - విషముయొక్క శక్తియొక్క గర్వముచే ఆవేశించబడినవాడు, కాద్రవేయః - కద్రువ పుత్రుడు అగు, కాలియః తు - కాలియుడైతే, గరుడమ్ - గరుడుని, కదర్థీకృత్య - తిరస్కరించి, తమ్ - ఆ, బలిమ్ - ఆహారమును, స్వయమ్ - తాను, బుభుజే - తినెను.

కాలియుడు కద్రువు పుత్రుడు. విషశక్తిచే ఆతనిని గర్వము ఆవేశించెను. ఆతడు గరుడుని తిరస్కరించి ఆ ఆహారమును తానే తినెను.

తచ్ఛ్రుత్వా కుపితో రాజన్ భగవాన్ భగవత్ప్రియః ।
విజిఘాంసుర్మహావేగః కాలియం సముపాద్రవత్ ॥ 5

రాజన్ - ఓ రాజా!, భగవత్-ప్రియః - శ్రీహరి భగవానునకు ప్రియుడు, మహావేగః - గొప్ప వేగము గలవాడు అగు, భగవాన్ - గరుడ భగవానుడు, తత్ - ఆ సంగతిని, శ్రుత్వా - విని, కుపితః - కోపించినవాడై, విజిఘాంసుః - సంహరించగోరువాడై, కాలియమ్ - కాలియుని, సముపాద్రవత్ - తరుముకు వచ్చెను.

ఓ పరీక్షిన్మహారాజా! పూజనీయుడగు గరుడుడు శ్రీహరి భగవానునకు ప్రీతిపాత్రుడు. కాలియుడు తన ఆహారమును తినినాడని విని గొప్ప వేగము గల ఆ గరుడుడు కోపించి, వానిని చంపగోరి తరుముకు వచ్చెను.

తమాపతంతం తరసా విషాయుధః ప్రత్యభ్యయాదుచ్ఛ్రితనైకమస్తకః ।
దద్భిస్సుపర్ణం వ్యదశద్దదాయుధః కరాలజిహ్వోచ్ఛ్వసితోగ్రలోచనః॥6

విష-ఆయుధః - విషమే ఆయుధముగా గలవాడు, ఉచ్ఛ్రితనైకమస్తకః - పైకెత్తబడిన అనేకములగు పడగలు గలవాడు, దద్-ఆయుధః - కోరలే ఆయుధముగా గలవాడు, కరాలజిహ్వ-ఉచ్ఛ్వసిత-ఉగ్రలోచనః - భయంకరమగు నాలుక గలవాడు దీర్ఘమగు నిట్టూర్పు గలవాడు భయంకరమగు కన్నులు గలవాడు అగు కాలియుడు, తరసా - వేగముగా, ఆపతంతమ్ - మీదకు వచ్చుచున్న, తమ్ - ఆ, సుపర్ణమ్ - గరుడుని, ప్రత్యభ్యయాత్ - ఎదుర్కొనుటకై ముందుకు వెళ్లెను, దద్భిః - కోరలతో, వ్యదశత్ - కాటు వేసెను.

దూరమునుండి విషమును, దగ్గరనుండి కోరలను ఆయుధములుగా వినియోగించే కాలియుడు అనేకములగు పడగలను పైకెత్తి వేగముగా మీదకు వచ్చుచున్న ఆ గరుడుని ఎదుర్కొనుటకై ముందుకు వెళ్లెను. దీర్ఘముగా నిట్టూర్చే అతని నాలుక, కన్నులు భీతిని గొల్పుచుండెను. అతడు గరుడుని కోరలతో కాటు వేసెను.

తం తార్క్ష్యపుత్రస్స నిరస్య మన్యుమాన్
ప్రచండవేగో మధుసూదనాసనః ।
పక్షేణ సవ్యేన హిరణ్యరోచిషా
జఘాన కద్రూసుతముగ్రవిక్రమః ॥ 7

తార్క్ష్యపుత్రః - కశ్యపుని పుత్రుడు, మన్యుమాన్ - కోపము గలవాడు, ప్రచండవేగః - మిక్కిలి భయంకరమగు వేగము గలవాడు, మధుసూదన-ఆసనః - మధువు అనే రాక్షసుని సంహరించిన శ్రీహరికి ఆసనమైనవాడు, ఉగ్రవిక్రమః - భయమును గొల్పే పరాక్రమము గలవాడు అగు, సః - ఆ గరుడుడు, కద్రూసుతమ్ - కద్రువు పుత్రుడగు, తమ్ - ఆ

కాలియుని, నిరస్య - త్రోసివేసి, హిరణ్యరోచిషా - బంగరు కాంతి గల, సవ్యేన - ఎడమ, పక్షేణ - రెక్కతో, జఘాన - కొట్టెను.

మధువు అనే రాక్షసుని సంహరించిన శ్రీహరికి వాహనమైన గరుడుడు మిక్కిలి భయంకరమగు వేగము గలవాడు. కశ్యపుని పుత్రుడగు ఆయన పరాక్రమము భీతిని గొల్పును. ఆయన కోపించి కద్రువు పుత్రుడగు ఆ కాలియుని త్రోసివేసి బంగరు కాంతి గల ఎడమ రెక్కతో కొట్టెను.

సుపర్ణపక్షాభిహతః కాలియోఽతీవ విహ్వలః ।
హ్రదం వివేశ కాలింద్యాస్తదగమ్యం దురాసదమ్ ॥ 8

సుపర్ణపక్ష-అభిహతః - గరుడునిచే రెక్కతో కొట్టబడిన, కాలియః - కాలియుడు, అతీవ - మిక్కిలి, విహ్వలః - అవయవముల స్వాధీనత తప్పినవాడై, అగమ్యమ్ - చేర శక్యము కానట్టియు, దురాసదమ్ - ప్రవేశించ శక్యము కాని (లోతైన), కాలింద్యాః - యమునానదియొక్క, తత్ - ఆ, హ్రదమ్ - సరస్సును, వివేశ - ప్రవేశించెను.

గరుడుడు రెక్కతో కొట్టగా కాలియునకు అవయవముల స్వాధీనత తప్పెను. ఆతడు యమునానదియొక్క ఆ కుండమును ప్రవేశించెను. అది ఇతరులు ప్రవేశించుటకు కాని, గరుడుడు వచ్చుటకు కాని శక్యము కానిది.

తత్రైకదా జలచరం గరుడో భక్ష్యమీప్సితమ్ ।
నివారితస్సౌభరిణా ప్రసహ్య క్షుధితోఽహరత్ ॥ 9

ఏకదా - ఒకనాడు, క్షుధితః - ఆకలి గొన్న, గరుడః - గరుడుడు, సౌభరిణా - సౌభరిచే, నివారితః - వారించబడినవాడై, తత్ర - దానియందు, ఈప్సితమ్ - ప్రియమైన, భక్ష్యమ్ - భక్ష్య మైన, జలచరమ్ - చేపను, ప్రసహ్య - బలముగా, అహరత్ - కొనిపోయెను.

ఒకనాడు గరుడుడు ఆకలితోనుండెను. ఒకానొక చేప ఆయనకు ప్రియమైన భక్ష్యము. సౌభరి మహర్షి నివారించిననూ, ఆయన ఆ సరస్సులో ఆ చేపను బలాత్కారముగా కొనిపోయెను.

మీనాన్ సుదుఃఖితాన్ దృష్ట్వా దీనాన్ మీనపతౌ హృతే ।
కృపయా సౌభరిః ప్రాహ తత్రత్య క్షేమమాచరన్ ।। 10

మీనపతౌ - చేపల రాజు, హృతే - తీసుకుపోబడగా, సుదుఃఖితాన్ - మిక్కిలి దుఃఖించినట్టియు, దీనాన్ - దీనులైన, మీనాన్ - చేపలను, దృష్ట్వా - చూచి, సౌభరిః - సౌభరి, తత్రత్య క్షేమమ్ - ఆ కుండమునందలి ప్రాణులకు క్షేమమును, ఆచరన్ - కలిగించువాడై, కృపయా - దయతో, ప్రాహ - పలికెను.

గరుడుడు చేపల రాజును తీసుకుపోగా, చేపలు చాల దుఃఖించి దీనములై యుండెను. వాటిని చూచిన సౌభరి మహర్షికి దయ కలిగెను. ఆ కుండములోని ప్రాణులకు క్షేమమును కలిగించగోరి ఆయన ఇట్లనెను.

అత్ర ప్రవిశ్య గరుడో యది మత్స్యాన్ స ఖాదతి ।
సద్యః ప్రాణైర్వియుజ్యేత సత్యమేతద్బ్రవీమ్యహమ్ ।। 11

సః - ఆ, గరుడః - గరుడుడు, అత్ర - దీనియందు, ప్రవిశ్య - ప్రవేశించి, మత్స్యాన్ - చేపలను, ఖాదతి యది - తినుచో, సద్యః - వెంటనే, ప్రాణైః - ప్రాణములచే, వియుజ్యేత - వియోగమును పొందును, అహమ్ - నేను, ఏతత్ - ఈ, సత్యమ్ - సత్యమును, బ్రవీమి - చెప్పుచున్నాను.

ఆ గరుడుడు ఈ కుండములో ప్రవేశించి చేపలను తిన్నచో, వెంటనే ఆతని ప్రాణములు పోవును, నేను చెప్పిన ఈ మాట యథార్థము.

తం కాలియః పరం వేద నాన్యః కశ్చన లేలిహః ।
అవాత్సీద్గరుడాద్భీతః కృష్ణేన చ వివాసితః ।। 12

తమ్ - ఆ విషయమును, పరమ్ - కేవలము, కాలియః - కాలియుడు, వేద - తెలియును, అన్యః - మరియొక, లేలిహః - పాము, కశ్చన - ఏదైననూ, న - తెలియదు, గరుడాత్ - గరుడుని వలన, భీతః - భయపడిన ఆతడు, అవాత్సీత్ - నివసించెను, చ - మరియు, కృష్ణేన - శ్రీకృష్ణునిచే, వివాసితః - పంపించి వేయబడెను.

ఆ విషయము కేవలము కాలియునకు మాత్రమే తెలియును. మిగిలిన సర్పములు వేటికీ తెలియదు. గరుడునకు భయపడిన కాలియుడు ఆ కుండములో నివసించెను. శ్రీకృష్ణుడాతనిని అచటనుండి పంపివేసెను.

కృష్ణం హ్రదాద్వినిష్క్రాంతం దివ్యస్రగ్గంధవాససమ్ ।
మహామణిగణాకీర్ణం జాంబూనదపరిష్కృతమ్ ॥ 13

ఉపలభ్యోత్థితాస్సర్వే లబ్ధప్రాణా ఇవాసవః ।
ప్రమోదనిభృతాత్మానో గోపాః ప్రీత్యాఽభిరేభిరే ॥ 14

హ్రదాత్ - కుండమునుండి, వినిష్క్రాంతమ్ - బయటకు వచ్చినట్టియు, దివ్యస్రగ్-గంధవాససమ్ - ప్రకాశించే మాలలు గంధము వస్త్రములు కలిగినట్టియు, మహామణిగణ-ఆకీర్ణమ్ - గొప్ప మణుల సముదాయములచే అంతటా అలంకరించబడినట్టియు, జాంబూనదపరిష్కృతమ్ - బంగారముచే అలంకరించబడిన, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ఉపలభ్య - చూచి, సర్వే - అందరు, గోపాః - గోపాలకులు, లబ్ధప్రాణాః - పొందబడిన ప్రాణము గల, అసవః ఇవ - ఇంద్రియములు వలె, ఉత్థితాః - లేచి నిలబడినవారై, ప్రమోదనిభృత-ఆత్మానః - మహానందముతో నిండిన మనస్సులు గలవారై, ప్రీత్యా - ప్రేమతో, అభిరేభిరే - గట్టిగా కౌగిలించుకొనిరి.

శ్రీకృష్ణుడు కుండమునుండి బయటకు వచ్చెను. ఆయన ప్రకాశించే మాలలను, గంధమును, వస్త్రములను దాల్చి, గొప్ప మణుల సమూహములతో బంగారముతో అంతటా అలంకరించబడి యుండెను. ఆయనను చూచి గోపాలకులందరు, ప్రాణము వచ్చిన ఇంద్రియములు వలె, లేచి నిలబడిరి. వారి మనస్సులు మహానందముతో నిండిపోయెను. వారాయనను ప్రేమతో గట్టిగా కౌగిలించుకొనిరి.

**యశోదా రోహిణీ నందో గోప్యో గోపాశ్చ కౌరవ ।**
**కృష్ణం సమేత్య లబ్ధేహా ఆసంల్లబ్ధమనోరథాః ॥ 15**

**కౌరవ - కురువంశీయుడవగు ఓ రాజా!, యశోదా - యశోద, రోహిణీ - రోహిణి, నందః - నందుడు, గోప్యః - గోపికలు, గోపాః చ - గోపాలకులు**

కూడ, కృష్ణమ్ - శ్రీకృష్ణుని; సమేత్య - కలుసుకొని, లబ్ధ-ఈహాః - పొందబడిన చేష్టలు గలవారు, లబ్ధమనోరథాః - పొందబడిన మనోరథములు గలవారు, ఆసన్ - అయిరి.

యశోద, రోహిణి, నందుడు, గోపికలు, గోపాలకులు కూడ శ్రీకృష్ణుని కలుసుకొనిరి. వారిలో మరల చేష్ట వచ్చెను. వారి మనోరథము సిద్ధించెను.

రామశ్చాచ్యుతమాలింగ్య జహాసాస్యానుభావవిత్ ।
నగా గావో వృషా వత్సా లేభిరే పరమాం ముదమ్ ॥ 16

అస్య - ఈ శ్రీకృష్ణుని, అనుభావవిత్ - ప్రభావము తెలిసిన, రామః చ - బలరాముడు కూడ, అచ్యుతమ్ - శ్రీకృష్ణ భగవానుని, ఆలింగ్య - కౌగిలించుకొని, జహాస - నవ్వెను, నగాః - చెట్లు, గావః - ఆవులు, వృషాః - ఎద్దులు, వత్సాః - దూడలు, పరమామ్ - అతిశయించిన, ముదమ్ - ఆనందమును, లేభిరే - పొందినవి.

శ్రీకృష్ణ భగవానుని ప్రభావము తెలిసిన బలరాముడు కూడ ఆయనను కౌగిలించుకొని నవ్వెను. చెట్లు, ఆవులు, ఎద్దులు, దూడలు అతిశయించిన ఆనందమును పొందినవి.

నందం విప్రాస్సమాగత్య గురవస్సకలత్రకాః ।
ఊచుస్తే కాలియగ్రస్తో దిష్ట్యా ముక్తస్తవాత్మజః ॥ 17

దేహి దానం ద్విజాతీనాం కృష్ణనిర్ముక్తిహేతవే ।
నందః ప్రీతమనా రాజన్ గాస్సువర్ణం తదాఽదిశత్ ॥ 18

రాజన్ - ఓ రాజా!, సకలత్రకాః - భార్యలతో కూడియున్నవారు, విప్రాః - వేదవేత్తలు అగు, గురవః - గురువులు, నందమ్ - నందుని గురించి, సమాగత్య - విచ్చేసి, తే - వారు, ఊచుః - పలికిరి, కాలియగ్రస్తః - కాలియునిచే పట్టుకొనబడిన, తవ - నీ, ఆత్మజః - పుత్రుడు, దిష్ట్యా - దైవవశముచే, ముక్తః - విడువబడినవాడు, కృష్ణనిర్ముక్తిహేతవే - శ్రీకృష్ణునకు విముక్తి లభించిన కారణముగా, ద్విజాతీనామ్ - బ్రాహ్మణులకు, దానమ్ - దానమును, దేహి - ఇమ్ము, ప్రీతమనాః -

ప్రీతిని పొందిన మనస్సు గల, నందః - నందుడు, తదా - అప్పుడు, గాః - ఆవులను, సువర్ణమ్ - బంగారమును, అదిశత్ - ఇచ్చెను.

ఓ పరీక్షిన్మహారాజా! వేదవేత్తలైన గురువులు భార్యలతో కూడి నందుని వద్దకు వచ్చిరి. వారాయనతో -- నీ పుత్రుడు కాలియునిచే పట్టుకొనబడి విముక్తుడైనాడు; ఇది మంగళము; శ్రీకృష్ణుడు విముక్తుడైన కారణముగా బ్రాహ్మణులకు దానమునిమ్ము -- అని పలికిరి. అప్పుడు నందుడు మనస్సులో ప్రీతి గలవాడై ఆవులను, బంగారమును దానము చేసెను.

యశోదాఽపి మహాభాగా నష్టలబ్ధప్రజా సతీ ।
పరిష్వజ్యాంకమారోప్య ముమోచాశ్రుకలాం ముహుః ।। 19

మహాభాగా - గొప్ప భాగ్యవంతురాలు, నష్టలబ్ధప్రజా - కనబకుండా పోయి తిరిగి పొందబడిన పుత్రుడు గలది, సతీ - పతివ్రత అగు, యశోదా అపి - యశోద కూడ, పరిష్వజ్య - కౌగిలించుకొని, అంకమ్ - ఒడిని, ఆరోప్య - కూర్చుండబెట్టుకొని, ముహుః - పలుమార్లు, అశ్రుకలామ్ - కన్నీటి బిందువును, ముమోచ - విడిచెను.

పతివ్రతయగు యశోద గొప్ప భాగ్యవంతురాలు. ఆమెకు కనబడకుండా పోయిన పుత్రుడు మరల లభించినాడు. ఆమె శ్రీకృష్ణుని కౌగిలించుకొని, ఒడిలో కూర్చుండబెట్టుకొని, పలుమార్లు కన్నీటి బిందువులను విడిచెను.

తాం రాత్రిం తత్ర రాజేంద్ర క్షుత్తృడ్భ్యాం శ్రమకర్శితాః ।
ఊషుర్వ్రజౌకసో గావః కాలింద్యా ఉపకూలతః ।। 20

రాజ-ఇంద్ర - ఓ గొప్ప రాజా!, క్షుత్-తృడ్భ్యామ్ - ఆకలి దప్పికలతో, శ్రమకర్శితాః - అలసటచే నీరసపడిన, వ్రజ-ఓకసః - గోకులవాసులు, గావః - గోవులు, తామ్ - ఆ, రాత్రిమ్ - రాత్రిని, కాలింద్యాః - యమునానదియొక్క, ఉపకూలతః - ఒడ్డు ప్రాంతమునందు, ఊషుః - నివసించిరి.

ఓ గొప్ప రాజా! గోకులవాసులు, గోవులు ఆకలిదప్పికలతో మరియు అలసటతో కృశించియుండిరి. వారా రాత్రి యమునా నది ఒడ్డునకు దగ్గరలో నివాసము చేసిరి.

తదా శుచివనోద్భూతో దావాగ్నిస్సర్వతో వ్రజమ్ ।
సుప్తం నిశీథ ఆవృత్య ప్రదగ్ధుముపచక్రమే ॥ 21

తదా - అప్పుడు, శుచివన-ఉద్భూతః - వేసవి అడవినుండి పుట్టిన, దావ-అగ్నిః - కార్చిచ్చు, నిశీథే - రాత్రియందు, సుప్తమ్ - నిద్రించిన, వ్రజమ్ - గోకులజనమును, సర్వతః - అన్ని వైపులనుండి, ఆవృత్య - చుట్టివేసి, ప్రదగ్ధుమ్ - కాల్చివేయుటకు, ఉపచక్రమే - ఆరంభించెను.

అప్పుడు వేసవి కాలపు అడవినుండి పుట్టిన కార్చిచ్చు రాత్రి నిద్రించిన గోకులజనమును అన్ని వైపులనుండి చుట్టివేసి కాల్చుటకు ఉపక్రమించెను.

తత ఉత్థాయ సంభ్రాంతా దహ్యమానా వ్రజౌకసః ।
కృష్ణం యయుస్తే శరణం మాయామనుజమీశ్వరమ్ ॥ 22

తతః - అప్పుడు, ఉత్థాయ - నిద్ర లేచి, సంభ్రాంతాః - కంగారు పడువారు, దహ్యమానాః - కాల్చివేయబడుచున్న, తే - ఆ, వ్రజ-ఓకసః - గోకులవాసులు, ఈశ్వరమ్ - ఈశ్వరుడైనట్టియు, మాయామనుజమ్ - మాయచే మానవుడైన, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, శరణమ్ - శరణును, యయుః - పొందిరి.

అప్పుడు కాల్చివేయబడుచున్న ఆ గోకులవాసులు కంగారు పడుతూ లేచి శ్రీకృష్ణ భగవానుని శరణు వేడిరి. ఆయన మాయచే మానవరూపమును దాల్చిన ఈశ్వరుడే.

కృష్ణ కృష్ణ మహాభాగ హే రామామితవిక్రమ ।
ఏష ఘోరతమో వహ్నిస్తావకాన్ గ్రసతే హి నః ॥ 23

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, కృష్ణ - ఓ కృష్ణా!, మహాభాగ - ఓ మహానుభావా!, హే రామ - ఓ బలరామా!, అమితవిక్రమ - సీమలు లేని పరాక్రమము గలవాడా!, ఏషః - ఈ, ఘోరతమః - మిక్కిలి ఘోరమైన, వహ్నిః - అగ్ని,

తావకాన్ - నీవారమైన, నః - మమ్ములను, గ్రసతే - మ్రింగుచున్నది, హి - నిశ్చయము.

ఓ శ్రీకృష్ణా! కృష్ణా! ఓ బలరామా! నీ పరాక్రమము హద్దులు లేనిది. ఈ అగ్ని నీ వారమైన మమ్ములను నిశ్చయముగా మ్రింగి వేయుచున్నది.

సుదుస్తరాన్నస్స్వాన్ పాహి కాలాగ్నేస్సుహృదః ప్రభో ।
న శక్నుమస్త్వచ్చరణం సంత్యక్తుమకుతోభయమ్ ।। 24

ప్రభో - ఓ ప్రభూ!, సుదుస్తరాత్ - సుతరాము అధిగమించ శక్యము కాని, కాల-అగ్నేః - మృత్యువైన అగ్నినుండి, స్వాన్ - నీవారమైనట్టియు, సుహృదః - మిత్రులమైన, నః - మమ్ములను, పాహి - కాపాడుము, అకుతోభయమ్ - దేనినుండి యైననూ భయము లేని, త్వత్-చరణమ్ - నీ పాదమును, సంత్యక్తుమ్ - విడుచుటకు, న శక్నుమః - సమర్థులము కాము.

ఓ ప్రభూ! మృత్యురూపమైన ఈ అగ్నిని అధిగమించుట సుతరాము శక్యము కాదు. మేము నీ వారము, మిత్రులము. మమ్ములను దీనినుండి కాపాడుము. మేము నీ పాదమును విడిచిపెట్ట లేము. నీ పాదము నాశ్రయించువారలకు దేనినుండైననూ భయము ఉండదు.

ఇత్థం స్వజనవైక్లబ్యం నిరీక్ష్య జగదీశ్వరః ।
తమగ్నిమపిబత్తీవ్రమనంతోఽనంతశక్తిధృక్ ।। 25

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే సప్తదశోఽధ్యాయః ।।

జగద్-ఈశ్వరః - జగన్నాథుడు, అనంతశక్తిధృక్ - అనంతమగు శక్తిని ధరించువాడు, అనంతః - కాలాతీతుడు అగు శ్రీకృష్ణ భగవానుడు, ఇత్థమ్ - ఈ విధముగా, స్వజనవైక్లబ్యమ్ - తన జనుల వ్యాకులతను, నిరీక్ష్య - చూచి, తీవ్రమ్ - భయంకరమగు, తమ్ - ఆ, అగ్నిమ్ - అగ్నిని, అపిబత్ - త్రాగివేసెను.

శ్రీకృష్ణుడు జగన్నాథుడు, అనంతమగు శక్తిని ధరించువాడు, కాలాతీతుడు. ఆయన తన జనుల వ్యాకులతను చూచి భయంకరమగు ఆ అగ్నిని త్రాగివేసెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము పూర్వార్ధములో శ్రీకృష్ణుడు దావాగ్నినుండి గోకులవాసులను రక్షించుటను వర్ణించే పదిహేడవ అధ్యాయము ముగిసినది (17).



# అథ అష్టాదశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు ప్రలంబాసురుని ఉద్ధరించుట

శ్రీశుక ఉవాచ ।
అథ కృష్ణః పరివృతో జ్ఞాతిభిర్ముదితాత్మభిః ।
అనుగీయమానో న్యవిశద్వ్రజం గోకులమండితమ్ ॥ 1

అథ - తరువాత, ముదిత-ఆత్మభిః - ఆనందించిన అంతఃకరణములు గల, జ్ఞాతిభిః - బంధువులచే, పరివృతః - చుట్టువారబడియున్న, కృష్ణః - శ్రీకృష్ణుడు, అనుగీయమానః - కీర్తి గానము చేయబడుచున్నవాడై, గోకులమండితమ్ - గోవుల మందలచే అలంకరించబడిన, వ్రజమ్ - గోకులమును, న్యవిశత్ - ప్రవేశించెను.

(కార్చిచ్చునుండి రక్షించిన) పిదప ఆనందముతో నిండిన బంధువులు చుట్టూ చేరి కీర్తిని గానము చేయుచుండగా, శ్రీకృష్ణుడు గోకులములో ప్రవేశించెను. ఆ గోకులమునకు గోవుల మందలే అలంకారము.

వ్రజే విక్రీడతోరేవం గోపాలచ్ఛద్మమాయయా ।
గ్రీష్మో నామర్తురభవన్నాతిప్రేయాఞ్ఛరీరిణామ్ ॥ 2

ఏవమ్ - ఈ విధముగా, గోపాలచ్ఛద్మమాయయా - గోవులను పాలించుట అనే మిష గల మాయచే, వ్రజే - గోకులమునందు, విక్రీడతోః - (వారిద్దరు) క్రీడించుచుండగా, గ్రీష్మః నామ ఋతుః - గ్రీష్మ-ఋతువు అనేది ప్రసిద్ధి చెందినది, అభవత్ - కలిగెను, శరీరిణామ్ - ప్రాణులకు, అతిప్రేయాన్ - అధికముగా ప్రీతిని కలిగించేది, న - కాదు.

ఈ విధముగా మాయాశక్తిచే గోపాలకుల వేషముతో బలరామకృష్ణులిద్దరు గోకులమునందు క్రీడించుచుండిరి. ఇంతలో వేసవి కాలము వచ్చెను. ప్రాణులకు వేసవి అంత ప్రియమైనది కాదు.

స చ బృందావనగుణైర్వసంత ఇవ లక్షితః ।
యత్రాస్తే భగవాన్ సాక్షాద్రామేణ సహ కేశవః ।। 3

సః చ - ఆ వేసవియైతే, బృందావనగుణైః - బృందావనముయొక్క గుణములచే, వసంతః ఇవ - వసంతకాలము వలె, లక్షితః - కనబడినది, యత్ర - ఎక్కడనైతే, సాక్షాత్ - సాక్షాత్తుగా, భగవాన్ కేశవః - శ్రీహరి భగవానుడు, రామేణ సహ - బలరామునితో గూడి, ఆస్తే - ఉన్నాడో.

ఆ వేసవియైతే బృందావనముయొక్క (చెట్లు మొదలైన) సహజ గుణములను బట్టి వసంతమువలె తోచెను. పైగా, ఆ బృందావనములో సాక్షాత్తుగా శ్రీహరి భగవానుడు బలరామునితో గూడి ఉన్నాడు గదా!

యత్ర నిర్ఝరనిర్హ్రాదనివృత్తస్వనఝిల్లికమ్ ।
శశ్వత్తచ్ఛీకరర్జీషద్రుమమండలమండితమ్ ।। 4

యత్ర - ఏ వేసవియందైతే, నిర్ఝరనిర్హ్రాదనివృత్తస్వనఝిల్లికమ్ - కొండకాలువల గలగలలచే కప్పివేయబడిన ధ్వని గల ఈల పురుగులు గలది, శశ్వత్ - అన్ని వేళలా, తత్-శీకర-ఋజీషద్రుమమండలమండితమ్ - ఆ కొండ కాలువల తుంపరలచే నునుపైన చెట్ల గుంపులచే అలంకరించబడినది.

ఆ బృందావనములో వేసవియందు ఈల పురుగుల కఠోరధ్వనులను కొండ కాలువల గలగలలు కప్పివేయును. అన్నివేళలా ఆ కొండకాలువల తుంపరలచే నునుపెక్కిన చెట్ల గుంపులతో ఆ స్థానము శోభిల్లెను.

సరిత్సరఃప్రస్రవణోర్మివాయునా కహ్లారకంజోత్పలరేణుహారిణా,
న విద్యతే యత్ర వనౌకసాం దవో నిదాఘవహ్న్యర్కభవోఽతిశాద్వలే। 5

అతిశాద్వలే - మిక్కిలి పచ్చనైన, యత్ర - ఏ బృందావనమునందైతే, కహ్లారకంజ-ఉత్పలరేణుహారిణా - సౌగంధికపుష్పములు పద్మములు కలువల పుప్పొడిని తీసుకువచ్చే, సరిత్-సరఃప్రస్రవణ-ఊర్మివాయునా - నదుల సరస్సుల కొండ కాలువల తరంగముల గాలిచే, వన-ఓకసామ్ - అడవిలో నివసించువారలకు, నిదాఘవహ్ని-అర్కభవః - వేసవియందలి సూర్యుని వలన అగ్ని వలన కలిగే, దవః - తాపము, న విద్యతే - లేదో.

బృందావనము చెట్లతో, పచ్చిక బయళ్లతో పచ్చగా నుండును. అక్కడ సరస్సులలో ఉదయము సౌగంధికములు, మధ్యాహ్నము పద్మములు, రాత్రి కమలములు వికసించును. వాటి మీదనుండి వీచే గాలి వాటి పుప్పొడిని మోసుకువచ్చును. అచటి సరస్సులలో, నదులలో, కొండ కాలువలలోని తరంగములమీదనుండి వీచే గాలి వలన వనవాసీలకు తాపము లేదు. వేసవియందు కూడ ఎండ వేడికి చిచ్చు పుట్టి అడవిని దహించే ఘటనలు లేవు.

అగాధతోయహ్రదినీతటోర్మిభిః
ద్రవత్పురీష్యాః పులినైస్సమంతతః ।
న యత్ర చండాంశుకరా విషోల్బణా
భువో రసం శాద్వలితం చ గృహ్ణతే ॥ 6

యత్ర - ఏ బృందావనమునందైతే, అగాధతోయహ్రదినీతట-ఊర్మిభిః - లోతైన నీరు గల నదుల ఒడ్డులను తాకే కెరటములచే, పులినైః - ఇసుకతిన్నెలతో, సమంతతః - అంతటా, ద్రవత్-పురీష్యాః - నీటి బురద గల, భువః - నేలయొక్క, శాద్వలితమ్ - పచ్చ గడ్డి కలదిగా చేయబడిన, రసమ్ - తడిని, విష-ఉల్బణాః - విషము వలె మిక్కిలి తీక్ష్ణమైన, చండ-అంశుకరాః చ - వేసవి సూర్యుని కిరణములు కూడ, న గృహ్ణతే - గ్రహించుట లేదో.

ఆ బృందావనమునందు నదులలోని నీరు లోతుగా నుండెను. ఆ నదుల కెరటములు ఒడ్లను తాకి ఇసుకతిన్నెలతో సహా అంతటా తడి, బురద ఉండునట్లు చేయుటచే, నేలపై పచ్చగడ్డి విస్తారముగా పెరిగెను. కావుననే, వేసవి సూర్యుని కిరణములు విషమువలె చాల తీక్ష్ణముగనున్ననూ, నేలయందలి తడిని ఎండింపలేకపోయినవి.

వనం కుసుమితం శ్రీమన్నదచ్చిత్రమృగద్విజమ్ ।
గాయన్మయూరభ్రమరం కూజత్కోకిలసారసమ్ ॥ 7

వనమ్ - అడవి, కుసుమితమ్ - పువ్వులతో నిండియున్నది, శ్రీమత్ - గొప్ప శోభ గలది, నదత్-చిత్రమృగద్విజమ్ - కూసే రంగు రంగుల

మృగములు పక్షులు గలది, గాయత్-మయూరభ్రమరమ్ - గానము చేసే నెమళ్లు తుమ్మెదలు గలది, కూజత్-కోకిలసారసమ్ - కూసే కోకిలలు బెగ్గురు పక్షులు గలది.

ఆడవి పువ్వులతో నిండి గొప్పగా శోభిల్లెను. రంగు రంగుల మృగములు, పక్షులు ధ్వనులను చేయుచుండెను. నెమళ్లు, తుమ్మెదలు గానము చేయుచుండెను. కోకిలలు, బెగ్గురు పక్షులు కూయుచుండెను.

క్రీడిష్యమాణస్తత్కృష్ణో భగవాన్ బలసంయుతః ।
వేణుం విరణయన్ గోపైర్గోధనైస్సంవృతోఽవిశత్ ॥ 8

బలసంయుతః - బలరామునితో కూడియున్నవాడు, వేణుమ్ - పిల్లన గ్రోవిని, విరణయన్ - వివిధస్వరములతో వాయించువాడు అగు, భగవాన్ కృష్ణః - శ్రీకృష్ణ భగవానుడు, క్రీడిష్యమాణః - క్రీడించబోవువాడై, గోపైః - గోపాలకులతో, గోధనైః - గోవుల సంపదలతో, సంవృతః - చుట్టువారబడినవాడై, తత్ - ఆ అడవిని, అవిశత్ - ప్రవేశించెను.

శ్రీకృష్ణ భగవానుడు బలరామునితో కూడి పిల్లన గ్రోవిపై వివిధస్వరములను పలికిస్తూ, ఆ అడవిలో విహారము కొరకై ప్రవేశించెను. ఆయన చుట్టూ గోపాలకులు, మంచి ఆవుల మందలు ఉండెను.

ప్రవాలబర్హస్తబకస్రగ్ధాతుకృతభూషణాః ।
రామకృష్ణాదయో గోపా ననృతుర్యుయుధుర్జగుః ॥ 9

ప్రవాలబర్హస్తబకస్రగ్-ధాతుకృతభూషణాః - చిగుళ్లు నెమలి యీకలు పూల గుత్తులు పూల మాలలు రాతి రంగులతో (బంగరు ఆభరణములతో) చేయబడిన అలంకారము గల, రామకృష్ణ-ఆదయః - బలరాముడు కృష్ణుడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు, ననృతుః - నాట్యమాడిరి, యుయుధుః - కుస్తీలు పట్టిరి, జగుః - పాడిరి.

బలరాముడు, శ్రీకృష్ణుడు, సుదాముడు మొదలగు గోపాలకులు చిగుళ్లను, నెమలి యీకలను, పూల గుత్తులను, పూల మాలలను, రాతి రంగులను, బంగరు నగలను అలంకరించుకొనిరి. వారు పాటలు పాడుతూ, నాట్యమాడిరి. ఒకప్పుడు కుస్తీలను పట్టిరి.

కృష్ణస్య నృత్యతః కేచిజ్జగుః కేచిదవాదయన్ ।
వేణుపాణితలైశ్శృంగైః ప్రశశంసురథాపరే ॥ 10

కృష్ణస్య - శ్రీకృష్ణుడు, నృత్యతః - నాట్యమాడుచుండగా, కేచిత్ - కొందరు, జగుః - పాడిరి, కేచిత్ - కొందరు, అవాదయన్ - వాద్యములను ప్రోగించిరి, అథ - మరియు, అపరే - మరికొందరు, వేణుపాణితలైః - పిల్లన గ్రోవులతో చప్పట్లతో, శృంగైః - కొమ్ము బూరాలతో, ప్రశశంసుః - కొనియాడిరి.

శ్రీకృష్ణుడు నాట్యం చేస్తూ ఉంటే, కొందరు పాడగా, మరికొందరు వాద్యములను వాయించిరి. ఇంకొందరు పిల్లన గ్రోవిని కొమ్ము బూరాలను ఊది, చప్పట్లు కొట్టి ప్రోత్సహించిరి.

గోపజాతిప్రతిచ్ఛన్నా దేవా గోపాలరూపిణః ।
ఈడిరే కృష్ణరామౌ చ నటా ఇవ నటం నృప ॥ 11

నృప - ఓ రాజా!, గోపాలరూపిణః - గోపాలకుల రూపము గల, దేవాః - దేవతలు, గోపజాతిప్రతిచ్ఛన్నా - గోపాలకుల జన్మచే కప్పివేయబడి ఉన్న, కృష్ణరామౌ చ - శ్రీకృష్ణుని బలరాముని కూడ, నటాః - నటులు, నటం ఇవ - నటుని వలె, ఈడిరే - కొనియాడిరి.

ఓ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణ బలరాములు గోపజాతిలో జన్మించిన శ్రీహరి-ఆదిశేషులే. గోపాలకుల రూపములోనున్న దేవతలు వారిద్దరిని, ఒక నటుని ఇతరనటులు వలె, కొనియాడిరి.

భ్రామణైర్లంఘనైః క్షేపైరాస్ఫోటనవికర్షణైః ।
చిక్రీడతుర్నియుద్ధేన కాకపక్షధరౌ క్వచిత్ ॥ 12

కాకపక్షధరౌ - పిల్ల జుట్టు కలిగియున్న బలరామకృష్ణులు, క్వచిత్ - ఒకప్పుడు (ఒకచోట), భ్రామణైః - త్రిప్పుటలచే, లంఘనైః - గెంతుటలచే, క్షేపైః - విసరుటలచే, ఆస్ఫోటనవికర్షణైః - చరపులచే లాగుటలచే, నియుద్ధేన - బాహుయుద్ధముతో, చిక్రీడతుః - క్రీడించిరి.

బలరామకృష్ణుల కేశములు వక్రములై చెవుల వరకు వ్రేలాడుచుండెను. వారు ఒకప్పుడు ఒకరి చేతులు మరియొకరు పట్టుకొని గిర గిర తిరిగెదరు; గోతులపై గెంతెదరు; రాళ్లను విసిరెదరు; ఒకరినొకరు చరుపులు చరచెదరు; త్రాడును రెండు వైపులా లాగెదరు. మరియొకప్పుడు వారు బాహుయుద్ధమును చేసిరి.

క్వచిన్నృత్యత్సు చాన్యేషు గాయకౌ వాదకౌ స్వయమ్ ।
శశంసతుర్మహారాజ సాధు సాధ్వితి వాదినౌ ॥ 13

మహారాజ - మహారాజా!, క్వచిత్ - ఒకప్పుడు (ఒకచోట), అన్యేషు చ - ఇతరులు కూడ, నృత్యత్సు - నాట్యమాడుచుండగా, స్వయమ్ - తాము, గాయకౌ - పాడువారు, వాదకౌ - వాయించువారు, సాధు - బాగు, సాధు - బాగు, ఇతి - అని, వాదినౌ - పలుకువారై, శశంసతుః - కొనియాడిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ఒకప్పుడు ఇతర బాలకులు కూడ నాట్యము చేయుచుండగా బలరామకృష్ణులిద్దరు తాము స్వయముగా పాట పాడి వాద్యములను వాయించెడివారు; బాగు బాగు అంటూ కొనియాడెడివారు.

క్వచిద్బిల్వైః క్వచిత్కుంభైః క్వ చామలకముష్టిభిః ।
అస్పృశ్యనేత్రబంధాద్యైః క్వచిన్మృగఖగేహయా ॥ 14

క్వచిత్ - ఒకప్పుడు, బిల్వైః - మారేడు పళ్లతో, క్వచిత్ - ఒకప్పుడు, కుంభైః - గుగ్గిలపు పళ్లతో, క్వ చ - ఒకప్పుడు, ఆమలకముష్టిభిః - ఉసిరి పళ్ల గుప్పిళ్లతో, అస్పృశ్యనేత్రబంధ-ఆద్యైః - పరుగెత్తి ముట్టుకొనుట కళ్లకు గంతలు కట్టే ఆట మొదలగువాటితో, క్వచిత్ - ఒకప్పుడు, మృగఖగ-ఈహయా - మృగముల పక్షుల చేష్టతో.

వారు ఒకప్పుడు మారేడు పళ్లను, మరియొకప్పుడు గుగ్గిలపు పళ్లను, ఇంకో సమయములో ఉసిరిక పళ్లను గుప్పిళ్లతో విసురుతూ ఆడెడివారు. ఒకడు పరుగెత్తి ఇతరులను ముట్టుట, కళ్లకు గంతలు కట్టి ముట్టుట, కుంటుతూ ముట్టుట వంటి ఆటలను ఆడెడివారు. ఒకప్పుడు పశువుల చేష్టలను, మరియొకప్పుడు పక్షుల చేష్టలను అనుకరించి ఆడెడివారు.

క్వచిచ్చ దర్దురప్లావైర్వివిధైరుపహాసకైః ।
కదాచిత్స్పందోలికయా కర్హిచిన్నృపచేష్టయా ॥ 15

క్వచిత్ చ - మరియొక చోట, దర్దురప్లావైః - కప్ప గెంతులతో, వివిధైః - పలు రకముల, ఉపహాసకైః - నవ్వించే చేష్టలతో, కదాచిత్ - ఒకప్పుడు, స్పందోలికయా - ఉయ్యాలతో, కర్హిచిత్ - మరియొకప్పుడు, నృపచేష్టయా - రాజును అనుకరించే ఆటతో.

వారు ఒకప్పుడు కప్ప గెంతుల ఆటను ఆడెడివారు. మరియొకప్పుడు పలు రకముల చేష్టలతో ఇతరులను నవ్వించెడివారు. ఒకప్పుడు చెట్టుకు త్రాడు కట్టి ఊయలలూగెడివారు. మరియొకప్పుడు రాజును అనుకరించే ఆటను ఆడెడివారు.

ఏవం తౌ లోకసిద్ధాభిః క్రీడాభిశ్చేరతుర్వనే ।
నద్యద్రిద్రోణికుంజేషు కాననేషు సరస్సు చ ॥ 16

తౌ - వారిద్దరు, ఏవమ్ - ఈ విధముగా, లోకసిద్ధాభిః - లోకమునందు ప్రసిద్ధములైన, క్రీడాభిః - ఆటలతో, వనే - బృందావనమునందు, నదీ-అద్రిద్రోణికుంజేషు - నదీతీరములయందు కొండలపై లోయలలో తీగల డొంకలయందు, కాననేషు - అడవులయందు, సరస్సు చ - సరస్సులయందు కూడ, చేరతుః - సంచరించిరి.

వారీ విధముగా లోకప్రసిద్ధములైన ఆటలను ఆడుతూ బృందావనములోని నదీతీరములు, కొండలు, లోయలు, తీగల డొంకలు, అడవులు, సరస్సులు అనువాటియందు సంచరించిరి.

పశూంశ్చారయతోర్గోపైస్తద్వనే రామకృష్ణయోః ।
గోపరూపీ ప్రలంబోఽగాదసురస్తజ్జిహీర్షయా ॥ 17

తద్-వనే - ఆ బృందావనమునందు, రామకృష్ణయోః - బలరామకృష్ణులు, గోపైః - గోపాలకులతో, పశూన్ - పశువులను, చారయతోః - మేపుచుండగా, ప్రలంబః - ప్రలంబుడనే, అసురః - రాక్షసుడు, గోపరూపీ - గోపాలకుని రూపము గలవాడై, తత్-జిహీర్షయా - వారిద్దరిని ఎత్తుకు పోవాలనే కోరికతో, అగాత్ - వెళ్లెను.

బలరామకృష్ణులు గోపాలకులతో కూడి ఆ బృందావనమునందు పశువులను మేపుచుండిరి. వారిద్దరిని ఎత్తుకు పోవాలనే కోరికతో ప్రలంబుడనే రాక్షసుడు గోపాలకుని రూపముతో అచటకు వెళ్లెను.

తం విద్వానపి దాశార్హో భగవాన్ సర్వదర్శనః ।
అన్వమోదత తత్సఖ్యం వధం తస్య విచింతయన్ ॥ 18

దాశార్హః - దశార్హవంశీయుడు, సర్వదర్శనః - సర్వజ్ఞుడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తమ్ - ఆ రాక్షసుని గురించి, విద్వాన్ అపి - తెలిసినవాడే ఐననూ, తస్య - వాని, వధమ్ - వధను గురించి, విచింతయన్ - తలపోయుచున్నవాడై, తత్-సఖ్యమ్ - వానితోడి మైత్రిని, అన్వమోదత - అనుమోదించెను.

దశార్హ వంశములో జన్మించిన సర్వజ్ఞుడగు శ్రీకృష్ణ భగవానునకు ఆ రాక్షసుని గురించి తెలియును. అయిననూ, ఆయన వానిని వధించే ఉపాయమును గురించి ఆలోచిస్తూ, వానితోడి జట్టును అనుమోదించెను.

తత్రోపాహూయ గోపాలాన్ కృష్ణః ప్రాహ విహారవిత్ ।
హే గోపా విహరిష్యామో ద్వంద్వీభూయ యథాయథమ్ ॥ 19

విహారవిత్ - క్రీడలను గురించి తెలిసిన, కృష్ణః - శ్రీకృష్ణుడు, గోపాలాన్ - గోపాలకులను, తత్ర - అప్పుడు, ఆహూయ - పిలిచి, ప్రాహ - పలికెను, హే గోపాః - ఓ గోపాలకులారా!, యథాయథమ్ - ఎవరికి తగ్గట్లుగా వారు, ద్వంద్వీభూయ - రెండు జట్లుగా అయి, విహరిష్యామః - ఆడుకొనెదము.

శ్రీకృష్ణుడు క్రీడలలో దిట్ట. ఆయన అప్పుడు గోపాలకులను పిలిచి ఇట్లు చెప్పెను -- ఓ గోపాలకులారా! మనము ఎవరికి తగ్గ వారితో వారు రెండు జట్లుగా జత కట్టి ఆడుకొనెదము.

తత్ర చక్రుః పరివృఢౌ గోపా రామజనార్దనౌ ।
కృష్ణసంఘట్టినః కేచిదాసన్ రామస్య చాపరే ॥ 20

తత్ర - అప్పుడు, గోపాః - గోపాలకులు, రామజన-అర్దనౌ - బలరాముని దుష్టజనశిక్షకుడగు శ్రీకృష్ణుని, పరివృఢౌ - నాయకులనుగా,

చక్రుః - చేసిరి, కేచిత్ - కొందరు, కృష్ణసంఘట్టినః - శ్రీకృష్ణుని జట్టువారు, అపరే చ - మరికొందరు, రామస్య - బలరాముని.

అప్పుడా గోపాలకులు బలరామకృష్ణులనే నాయకులుగా చేసుకొనిరి. కొందరు శ్రీకృష్ణుని జట్టువారు కాగా, మిగిలిన వారు బలరాముని జట్టు.

ఆచేరుర్వివిధాః క్రీడా వాహ్యావాహకలక్షణాః ।
యత్రారోహంతి జేతారో వహంతి చ పరాజితాః ।। 21

వాహ్యావాహకలక్షణాః - మోయబడువాడు మోసేవాడు అనే రూపములోనుండే, వివిధాః - పలురకముల, క్రీడాః - ఆటలను, ఆచేరుః - ఆడిరి, యత్ర - వేటియందైతే, జేతారః - నెగ్గినవారు, ఆరోహంతి - భుజమునెక్కెదరో, పరాజితాః చ - ఓడినవారైతే, వహంతి - మోసెదరో.

మోసేవాడు, మోయబడువాడు అనే రూపములోనుండే పలు రకముల ఆటలను వారు ఆడిరి. ఆ ఆటలలో నెగ్గినవానిని భుజముపై నెక్కించుకొని ఓడినవాడు మోయును.

వహంతో వాహ్యమానాశ్చ చారయంతశ్చ గోధనమ్ ।
భాండీరకం నామ వటం జగ్ముః కృష్ణపురోగమాః ।। 22

వహంతః - మోయుచున్నవారు, వాహ్యమానాః చ - మోయబడుచున్నవారు కూడ, గోధనమ్ - పశుసంపదను, చారయంతః చ - మేపుచున్నవారు కూడ, కృష్ణపురోగమాః - శ్రీకృష్ణుడు ముందు నడచువాడుగా గలవారు, భాండీరకం నామ - భాండీరకమని ప్రసిద్ధి గాంచిన, వటమ్ - మఱ్ఱి చెట్టును గురించి, జగ్ముః - వెళ్లిరి.

మోస్తున్నవారు, మోయబడుచున్నవారు కూడ పశుసంపదను మేపే పనిని చేస్తూనే, భాండీరకమని ప్రసిద్ధి గాంచిన మఱ్ఱి చెట్టు వద్దకు వెళ్లిరి. వారికి ముందు శ్రీకృష్ణుడు ఉండెను.

రామసంఘట్టినో యర్హి శ్రీదామవృషభాదయః ।
క్రీడాయాం జయినస్తాంస్తానూహుః కృష్ణాదయో నృప ।। 23

నృప - ఓ రాజా!, యర్హి - ఎప్పుడైతే, రామసంఘట్టినః - బలరాముని జట్టుకు చెందిన, శ్రీదామవృషభ-ఆదయః - శ్రీదాముడు వృషభుడు మొదలగువారు, క్రీడాయామ్ - ఆటయందు, జయినః - జయించినవారో అప్పుడు, తాన్ తాన్ - వారిని వారిని, కృష్ణ-ఆదయః - శ్రీకృష్ణుడు మొదలగువారు, ఊహుః - మోసిరి.

ఓ పరీక్షిన్మహారాజా! బలరాముని జట్టు నెగ్గెను. అప్పుడు శ్రీదాముడు, వృషభుడు మొదలగువారిని శ్రీకృష్ణుని జట్టులోనివారు ఒకరిని ఒకరు చొప్పున మోసిరి.

ఉవాహ కృష్ణో భగవాన్ శ్రీదామానం పరాజితః ।
వృషభం భద్రసేనస్తు ప్రలంబో రోహిణీసుతమ్ ॥ 24

పరాజితః - ఓడిపోయిన, భగవాన్ కృష్ణః - శ్రీకృష్ణ భగవానుడు, శ్రీదామానమ్ - శ్రీదాముని, భద్రసేనః తు - భద్రసేనుడైతే, వృషభమ్ - వృషభుని, ప్రలంబః - ప్రలంబాసురుడు, రోహిణీసుతమ్ - రోహిణి పుత్రుడగు బలరాముని, ఉవాహ - మోసెను.

ఆటలో ఓడిన శ్రీకృష్ణ భగవానుడు శ్రీదాముని, భద్రసేనుడు వృషభుని, ప్రలంబాసురుడు రోహిణి పుత్రుడగు బలరాముని మోసిరి.

అవిషహ్యం మన్యమానః కృష్ణం దానవపుంగవః ।
వహన్ ద్రుతతరం ప్రాగాదవరోహణతః పరమ్ ॥ 25

దానవపుంగవః - రాక్షసశ్రేష్ఠుడగు ప్రలంబుడు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, అవిషహ్యమ్ - మోయ శక్యము కానివానినిగా, మన్యమానః - తలపోయుచున్నవాడై, ద్రుతతరమ్ - అందరి కంటె వేగముగా, వహన్ - మోయువాడై, అవరోహణతః - దింపే స్థానము కంటె, పరమ్ - దాటి ముందుకు, ప్రాగాత్ - వెళ్లెను.

రాక్షసశ్రేష్ఠుడగు ప్రలంబుడు శ్రీకృష్ణుని మోయుట సాధ్యము కాదని తలచి ఆయన పక్షములో చేరి బలరాముని మోసెను. ఆతడు అందరికంటె వేగముగా మోస్తూ, దింప వలసిన మర్రి కంటె ముందుకు వెళ్లిపోయెను.

తముద్వహన్ధరణిధరేంద్రగౌరవం మహాసురో విగతరయో నిజం వపుః।
స ఆస్థితః పురటపరిచ్ఛదో బభౌ తడిద్ద్యుమానుడుపతివాడివాంబుదః॥

పురటపరిచ్ఛదః - బంగరు ఆభరణములు గలవాడు, తడిద్-ద్యుమాన్ - మెరుపువంటి కాంతి గలవాడు అగు, సః - ఆ, మహా-అసురః - పెద్ద రాక్షసుడు, ధరణిధర-ఇంద్రగౌరవమ్ - గొప్ప పర్వతము వలె బరువైన, తమ్ - ఆ బలరాముని, ఉద్వహన్ - మోయుచున్నవాడై, విగతరయః - పోయిన వేగము గలవాడై, నిజమ్ - తనదైన, వపుః - రాక్షసదేహమును, ఆస్థితః - దాల్చినవాడు, ఉడుపతివాట్ - నక్షత్రరాజగు చంద్రుని మోసే, తడిద్-ద్యుమాన్ - మెరుపుల కాంతి గల, అంబుదః ఇవ - మేఘము వలె, బభౌ - ప్రకాశించెను. 26

ఆ పెద్ద రాక్షసుడు బంగరు ఆభరణములతో మెరుపు వలె ప్రకాశించుచుండెను. బలరాముడు పర్వతము వలె బరువుగా నుండుటచే వాని వేగము తగ్గిపోయెను. వాడు తన రాక్షసరూపమును దాల్చెను. అప్పుడాతడు నక్షత్రరాజగు చంద్రుని మోస్తూ మెరుపులతో ప్రకాశించే మేఘము వలె నొప్పారెను.

నిరీక్ష్య తద్వపురలమంబరే చరత్
ప్రదీప్తదృగ్భ్రుకుటితటోగ్రదంష్ట్రకమ్ ।
జ్వలచ్ఛిఖం కటకకిరీటకుండల-
త్విషాఽద్భుతం హలధర ఈషదత్రసత్ ॥ 27

అలమ్ - వేగముగా, అంబరే - ఆకాశమునందు, చరత్ - కదులుచున్నట్టియు, ప్రదీప్తదృక్ - మండే కన్నులు కలిగినట్టియు, భ్రుకుటితట-ఉగ్రదంష్ట్రమ్ - కనుబొమల పై భాగమునందు తగుల్కొన్న భయంకరమగు కోరలు కలిగినట్టియు, జ్వలత్-శిఖమ్ - మండే జుట్టు కలిగినట్టియు, కటకకిరీటకుండలత్విషా - కడియములు కిరీటము కుండలముల కాంతితో, అద్భుతమ్ - అబ్బురపరచే, తద్-వపుః - వాని దేహమును, నిరీక్ష్య - పరికించి చూచి, హలధరః - నాగలిని ధరించే బలరాముడు, ఈషత్ - కొంచెము, అత్రసత్ - భయపడెను.

మండే కన్నులు మరియు మండే కేశములు గల ఆ రాక్షసుని దేహము ఆకాశములో వేగముగా కదులుచుండెను. వాని భయంకరమగు కోరలు కనుబొమల పైన తగులుచుండెను. కడియములు, కిరీటము, కుండలములతో అబ్బురమును గొల్పే వాని ఆ దేహమును పరికించి చూచి నాగలియే ఆయుధముగా గల బలరాముడు కొంచెము భయపడెను.

అథాగతస్మృతిరభయో రిపుం బలో
విహాయసాఽర్థమివ హరంతమాత్మనః ।
రుషాఽహనచ్ఛిరసి దృఢేన ముష్టినా
సురాధిపో గిరిమివ వజ్రరంహసా ॥ 28

అథ - తరువాత, ఆగతస్మృతిః - వచ్చిన స్మరణము గల, బలః - బలరాముడు, అభయః - భయము లేనివాడై, విహాయసా - ఆకాశమార్గముచే, ఆత్మనః - తన, అర్థం ఇవ - సొత్తును వలె, హరంతమ్ - ఎత్తుకొనిపోవుచున్న, రిపుమ్ - శత్రువును, సుర-అధిపః - దేవేంద్రుడు, గిరిం ఇవ - పర్వతమును వలె, వజ్రరంహసా - వజ్రముయొక్క వేగము వంటి వేగము గల, దృఢేన - గట్టి, ముష్టినా - పిడికిలితో, రుషా - కోపముతో, శిరసి - తలపై, అహనత్ - కొట్టెను.

తరువాత బలరామునకు స్మృతి వచ్చి భయము దూరమయ్యెను. ఆయనను ప్రలంబాసురుడు ఆకాశమార్గము గుండా తన సొత్తా యన్నట్లు కొనిపోవుచుండెను. ఆయన కోపముతో ఆ శత్రువును, దేవేంద్రుడు పర్వతమును వలె, వజ్రపు వేగము గల గట్టి పిడికిలితో తలపై కొట్టెను.

స ఆహతస్సపది విశీర్ణమస్తకో ముఖాద్వమన్రుధిరమపస్మృతోఽసురః ।
మహారవం వ్యసురపతత్సమీరయన్గిరిర్యథా మఘవత ఆయుధాహతః॥

ఆహతః - కొట్టబడినవాడు, సపది - వెంటనే, విశీర్ణమస్తకః - వ్రక్కలైన తల గలవాడు అగు, సః - ఆ, అసురః - రాక్షసుడు, ముఖాత్ - నోటినుండి, రుధిరమ్ - రక్తమును, వమన్ - క్రక్కుచున్నవాడై, అపస్మృతః - పోయిన స్పృహ గలవాడు, వి-అసుః - పోయిన ప్రాణములు గలవాడై, మఘవతః - ఇంద్రుని, ఆయుధ-ఆహతః - ఆయుధముచే కొట్టబడిన, గిరిః యథా -

పర్వతము వలె, మహారవమ్ - పెద్ద శబ్దమును, సమీరయన్ - చేయుచున్నవాడై, అపతత్ - పడెను. 29

బలరాముడు కొట్టిన దెబ్బకు ఆ రాక్షసుడు నోటినుండి రక్తమును గ్రక్కెను. వాని తల వ్రక్కలై స్పృహ తప్పెను. వెంటనే వాని ప్రాణములు పోయెను. ఇంద్రుని వజ్రముచే కొట్టబడిన పర్వతము వలె వాడు పెద్ద శబ్దమును చేస్తూ నేల గూలెను.

దృష్ట్వా ప్రలంబం నిహతం బలేన బలశాలినా ।
గోపాస్సువిస్మితా ఆసన్ సాధు సాధ్వితి వాదినః ॥ 30

బలశాలినా - బలశాలియగు, బలేన - బలరామునిచే, నిహతమ్ - సంహరించబడిన, ప్రలంబమ్ - ప్రలంబుని, దృష్ట్వా - చూచి, గోపాః - గోపాలకులు, సువిస్మితాః - చాల ఆశ్చర్యమును పొందినవారు, ఆసన్ - ఐరి, సాధు - బాగు, సాధు - బాగు, ఇతి - అని, వాదినః - పలుకువారు.

బలశాలియగు బలరాముడు వధించిన ప్రలంబుని చూచి గోపాలకులు చాల ఆశ్చర్యమును పొందిరి. వారు బాగు, బాగు అని పలికిరి.

ఆశిషోఽభిగృణంతస్తం ప్రశశంసుస్తదర్హణమ్ ।
ప్రేత్యాగతమివాలింగ్య ప్రేమవిహ్వలచేతసః ॥ 31

ఆశిషః - ఆశీర్వచనములను, అభిగృణంతః - అభిముఖముగా పలుకుచున్న గోపాలకులు, ప్రేత్య - మరణించి, ఆగతం ఇవ - వచ్చినాడా యన్నట్లున్న, తమ్ - ఆ బలరాముని, ఆలింగ్య - కౌగిలించుకొని, ప్రేమవిహ్వలచేతసః - ప్రేమతో వ్యాకులమైన మనస్సులు గలవారై, తద్-అర్హణమ్ - ఆ ప్రశంసలకు అర్హుడైన ఆయనను, ప్రశశంసుః - కొనియాడిరి.

మరణించి వచ్చినాడా యన్నట్లున్న ఆ బలరాముని గోపాలకులు ఆశీర్వదిస్తూ కౌగిలించుకొనిరి. వారాయనను ప్రేమతో వ్యాకులమైన మనస్సులతో ప్రశంసించిరి. వారి పొగడ్తలకు ఆయన అర్హుడు.

పాపే ప్రలంబే నిహతే దేవాః పరమనిర్వృతాః ।
అభ్యవర్షన్ బలం మాల్యైశ్శశంసుస్సాధు సాధ్వితి ॥ 32

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే అష్టాదశోఽధ్యాయః ||

పాపే - పాపియగు, ప్రలంబే - ప్రలంబాసురుడు, నిహతే - సంహరించబడగా, పరమనిర్వృతాః - గొప్ప సుఖానుభవమును పొందిన, దేవాః - దేవతలు, బలమ్ - బలరాముని, మాల్యైః - పూల మాలలతో, అభ్యవర్షన్ - వర్షించిరి, సాధు - బాగు, సాధు - బాగు, ఇతి - అని, శశంసుః - కొనియాడిరి.

పాపియగు ప్రలంబాసురుని బలరాముడు సంహరించగా, దేవతలకు గొప్ప సుఖము అనుభవమునకు వచ్చెను. వారాయనపై పూల వానను కురిపించి, బాగు బాగు అని కొనియాడిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము పూర్వార్ధములో
బలరాముడు ప్రలంబాసురుని ఉద్ధరించుటను వర్ణించే
పదునెనిమిదవ అధ్యాయము ముగిసినది (18).

* * * * *

# అథ ఏకోనవింశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు గోవులను గోపాలకులను దావాగ్నినుండి రక్షించుట

శ్రీశుక ఉవాచ ।
క్రీడాఽఽసక్తేషు గోపేషు తద్గావో దూరచారిణీః ।
స్వైరం చరంత్యో వివిశుస్తృణలోభేన గహ్వరమ్ ॥ 1

గోపేషు - గోపాలకులు, క్రీడా-ఆసక్తేషు - ఆటలయందు నిమగ్నులై యుండగా, స్వైరమ్ - యథేచ్ఛగా, చరంత్యః - మేయుచున్న, తద్-గావః - వారి గోవులు, తృణలోభేన - గడ్డియందలి ఆశచే, దూరచారిణీః - దూరము వెళ్లినవై, గహ్వరమ్ - దట్టని అడవిని, వివిశుః - ప్రవేశించినవి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గోపాలకులు ఆటలలో నిమగ్నులై యుండగా యథేచ్ఛగా మేయుచున్న వారి గోవులు గడ్డిచే ఆకర్షితములై చాల దూరము వెళ్లి, దట్టని అడవిని ప్రవేశించినవి.

అజా గావో మహిష్యశ్చ నిర్విశంత్యో వనాద్వనమ్ ।
ఇషీకాటవీం నిర్వివిశుః క్రందంత్యో దావతర్షితాః ॥ 2

అజాః - మేకలు, గావః - గోవులు, మహిష్యః చ - గేదెలు కూడ, వనాత్ - అడవినుండి, వనమ్ - అడవిని గురించి, నిర్విశంత్యః - ప్రవేశించుచున్నవి, ఇషీక-అటవీమ్ - రెల్లు గడ్డి గల అడవిని, నిర్వివిశుః - ప్రవేశించినవి, దావతర్షితాః - ఎండ తాపముచే దప్పిక గొన్నవై, క్రందంత్యః - ఆక్రోశించుచున్నవి.

మేకలు, గోవులు, గేదెలు ఒక అడవినుండి మరియొక అడవిలోనికి వెళ్తూ, రెల్లు గడ్డి ఉన్న అడవిలోనికి ప్రవేశించినవి. అవి వేసవి తాపముచే దప్పిక గొని ఆక్రోశించుచుండెను.

**తేఽపశ్యంతః పశూన్ గోపాః కృష్ణరామాదయస్తదా ।**
**జాతానుతాపా న విదుర్విచిన్వంతో గవాం గతిమ్ ॥ 3**

పశూన్ - పశువులను, అపశ్యంతః - చూడని, తే - ఆ, కృష్ణరామ-ఆదయః - శ్రీకృష్ణుడు బలరాముడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు, తదా - అప్పుడు, జాత-అనుతాపాః - కలిగిన పశ్చాత్తాపము గలవారై, విచిన్వంతః - వెదుకుచున్నవారు, గవామ్ - గోవుల, గతిమ్ - జాడను, న విదుః - తెలియరైరి.

శ్రీకృష్ణుడు, బలరాముడు, సుదాముడు మొదలుగా గల ఆ గోపాలకులకు పశువులు కనబడలేదు. వారు ఆటలలో మునిగినందుకు పశ్చాత్తాపపడిరి. అప్పుడు వెదికిననూ వారికి పశువుల జాడ తెలియలేదు.

తృణైస్తత్ఖురదచ్ఛిన్నైర్గోష్పదైరంకితైర్గవామ్ ।
మార్గమన్వగమన్ సర్వే నష్టాజీవ్యా విచేతసః ॥ 4

నష్ట-ఆజీవ్యాః - కనబడని బ్రదుకు దెరువు గలవారు, విచేతసః - వ్యాకులమైన చిత్తము గలవారు అగు, సర్వే - అందరు, తత్-ఖురదత్-ఛిన్నైః - ఆ పశువుల డెక్కలచే దంతములచే త్రెంపబడినట్టియు, గోష్పదైః - గోవులచే సేవించబడిన, తృణైః - గడ్డి పరకలతో, గవామ్ - గోవుల, అంకితైః - డెక్కల గుర్తులతో, గవామ్ - గోవుల, మార్గమ్ - దారిని, అన్వగమన్ - అనుసరించి వెళ్లిరి.

వారికి ఆ పశువులే బ్రదుకు దెరువు. అవి కనబడకపోవుట వలన వారి చిత్తములు వ్యాకులమయ్యేను. గోవులు సేవించిన గడ్డి మైదానములలో గడ్డి పరకలు వాటి డెక్కలచే, దంతములచే త్రెంపబడి యుండును. ఆ గడ్డిని బట్టి, వాటి డెక్కల గుర్తులను బట్టి దారిని తెలుసుకుంటూ ఆ దారి వెంబడి వారు వెళ్లిరి.

ముంజాటవ్యాం భ్రష్టమార్గం క్రందమానం స్వగోధనమ్ ।
సంప్రాప్య తృషితాశ్శ్రాంతాస్తతస్తే సన్న్యవర్తయన్ ॥ 5

ముంజ-అటవ్యామ్ - రెల్లు గడ్డి అడవియందు, భ్రష్టమార్గమ్ - తప్పిపోయిన దారి కలిగినట్టియు, క్రందమానమ్ - ఆక్రోశించుచున్న, స్వగోధనమ్ - తమ గోవుల సంపదను, సంప్రాప్య - చేరుకొని, తృషితాః -

దప్పిక గలవారు, శ్రాంతాః - అలసినవారు అగు, తే - వారు, తతః అక్కడనుండి, సన్న్యవర్తయన్ - వెనుకకు మళ్లించిరి.

రెల్లు గడ్డి దట్టముగానున్న అడవిలో వారి పశుసంపద దారి తప్పి ఆక్రోశించుచుండెను. వారా గోవులను కనుగొనిరి. వారు కూడ అలసి దప్పికతో నుండిరి. వారా గోవులను ఆ అడవినుండి వెనుకకు మళ్లించిరి.

తా ఆహూతా భగవతా మేఘగంభీరయా గిరా ।
స్వనామ్నాం నినదం శ్రుత్వా ప్రతినేదుః ప్రహర్షితాః ॥ 6

భగవతా - శ్రీకృష్ణ భగవానునిచే, మేఘగంభీరయా - మేఘగర్జనవలె గంభీరమైన, గిరా - వాక్కుతో, ఆహూతాః - పిలువబడిన, తాః - ఆ ఆవులు, స్వనామ్నామ్ - తమ పేర్ల, నినదమ్ - శబ్దమును, శ్రుత్వా - విని, ప్రహర్షితాః - గొప్ప హర్షము గలవి, ప్రతినేదుః - బదులు ధ్వనిని చేసినవి.

శ్రీకృష్ణ భగవానుడు మేఘగర్జనవంటి గంభీరమగు స్వరముతో ఆ ఆవులను పిలిచెను. తమ పేర్లను వింటూనే అవి మహానందమును పొంది, అంబారవముతో బదులు చెప్పినవి.

తతస్సమంతాద్వనధూమకేతుః
యదృచ్ఛయాఽభూత్ క్షయకృద్వనౌకసామ్ ।
సమీరితస్సారథినోల్బణోల్ముకైః
విలేలిహానః స్థిరజంగమాన్ మహాన్ ॥ 7

తతః - తరువాత, యదృచ్ఛయా - అనుకోకుండా, వన-ఓకసామ్ - అడవియందు నివసించే ప్రాణులకు, క్షయకృత్ - వినాశమును కలిగించే, మహాన్ - పెద్ద, వనధూమకేతుః - కార్చిచ్చు, సారథినా - వాయువుచే, సమీరితః - ప్రేరితమై, సమంతాత్ - అన్ని వైపులనుండి, ఉల్బణ-ఉల్ముకైః - భయంకరమగు కొరివిలతో, స్థిరజంగమాన్ - కదలని మరియు కదిలే ప్రాణులను, విలేలిహానః - అధికముగా మ్రింగుచున్నదై, అభూత్ - ఆవిర్భవించెను.

అప్పుడు అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) పెద్ద కార్చిచ్చు ఆవిర్భవించెను. అది భయంకరమగు కొరివిలతో కదిలే మరియు కదలని

ప్రాణులను అధికముగా మింగివేస్తూ అడవిలోని ప్రాణులను అన్ని వైపులనుండియు వినాశము చేయజొచ్చెను. ఆ అగ్నికి వాయువు తోడై ప్రేరేపించెను.

తమాపతంతం పరితో దవాగ్నిం
గోపాశ్చ గావః ప్రసమీక్ష్య భీతాః ।
ఊచుశ్చ కృష్ణం సబలం ప్రపన్నా
యథా హరిం మృత్యుభయార్దితా జనాః ॥ 8

పరితః - చుట్టుకొని, ఆపతంతమ్ - మీదకు వచ్చుచున్న, తమ్ - ఆ, దవ-అగ్నిమ్ - కార్చిచ్చును, ప్రసమీక్ష్య - చూచి, గోపాః - గోపాలకులు, గావః చ - గోవులు కూడ, భీతాః - భయపడినవి, సబలమ్ - బలరామునితో కూడియున్న, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, మృత్యుభయ-అర్దితాః - మరణభయముచే పీడితులైన, జనాః - జనులు, హరిం యథా - శ్రీహరిని వలె, ప్రపన్నాః చ - శరణు కూడ వేడినవారు, ఊచుః - పలికిరి.

ఆ కార్చిచ్చు చుట్టుకుంటూ మీదకు వచ్చుచుండెను. దానిని చూచి గోపాలకులు, గోవులు కూడ భయపడిపోయిరి. ఆ గోపాలకులు బలరామునితో కూడియున్న శ్రీకృష్ణుని, మరణమునకు భయపడి పీడితులైన జనులు శ్రీహరిని వలె, శరణు వేడి పలికిరి.

కృష్ణ కృష్ణ మహావీర హే రామామితవిక్రమ ।
దావాగ్నినా దహ్యమానాన్ ప్రపన్నాంస్త్రాతుమర్హసి ॥ 9

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, మహావీర - గొప్ప వీరుడా!, హే రామ - ఓ బలరామా!, అమితవిక్రమ - హద్దులు లేని పరాక్రమము గలవాడా!, దావ-అగ్నినా - కార్చిచ్చుచే, దహ్యమానాన్ - తగులపెట్ట బడుచున్నవారై, ప్రపన్నాన్ - శరణు వేడినవారిని, త్రాతుమ్ - రక్షించుటకు, అర్హసి - తగుదువు.

ఓ శ్రీకృష్ణా! శ్రీకృష్ణా! నీవు గొప్ప వీరుడవు. ఓ బలరామా! నీ పరాక్రమమునకు హద్దులు లేవు. మేము కార్చిచ్చుచే కాల్చివేయబడుతూ శరణు వేడుచున్నాము. మమ్ములను నీవు కాపాడ తగుదువు.

నూనం త్వద్బాంధవాః కృష్ణ న చార్హంత్యవసీదితుమ్ ।
వయం హి సర్వధర్మజ్ఞ త్వన్నాథాస్త్వత్పరాయణాః ॥ 10

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, త్వద్-బాంధవాః - నీ బంధువులు, నూనమ్ - నిశ్చయముగా, అవసీదితుమ్ - నశించుటకు, న చ అర్హంతి - సుతరాము తగరు, హి - ఏలయన, సర్వధర్మజ్ఞ - సకలధర్మములు తెలిసినవాడా!, వయమ్ - మేము, త్వత్-నాథాః - నీవే రక్షకుడుగా గలవారము, త్వత్-పర-అయనాః - నీవే పరమగతిగా గలవారము.

ఓ శ్రీకృష్ణా! నీకు సకలధర్మములు తెలియును. నీ బందుగులమగు మేము నశించ వలసిన వారము కాము. ఇది నిశ్చయము. ఎందుకంటే, మాకు రక్షకుడవు, పరమగతివి నీవే.

శ్రీశుక ఉవాచ ।
వచో నిశమ్య కృపణం బంధూనాం భగవాన్ హరిః ।
నిమీలయత మా భైష్ట లోచనానీత్యభాషత ॥ 11

బంధూనామ్ - ప్రియమిత్రుల, కృపణమ్ - దీనమైన, వచః - మాటను, నిశమ్య - విని, భగవాన్ హరిః - శ్రీకృష్ణ భగవానుడు, మా భైష్ట - భయపడకుడు, లోచనాని - కళ్లను, నిమీలయత - మూసుకొనుడు, ఇతి - అని, అభాషత - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ప్రియమిత్రుల దీనమైన మాటను విన్న శ్రీకృష్ణ భగవానుడు -- భయపడకుడు, కళ్లను మూసుకొనుడు -- అని పలికెను.

తథేతి మీలితాక్షేషు భగవానగ్నిముల్బణమ్ ।
పీత్వా ముఖేన తాన్ కృచ్ఛ్రాద్యోగాధీశో వ్యమోచయత్ ॥ 12

తథా - సరే, ఇతి - అని, మీలిత-అక్షేషు - మూయబడిన కళ్లు కలవారు కాగా, యోగ-అధీశః - యోగసిద్ధులకు అధీశ్వరుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఉల్బణమ్ - భయమును గొల్పే, అగ్నిమ్ - అగ్నిని, ముఖేన - నోటితో, పీత్వా - త్రాగి, తాన్ - వారిని, కృచ్ఛ్రాత్ - ఆపదనుండి, వ్యమోచయత్ - విడిపించెను.

వారు సరే అని కళ్లను మూసుకొనిరి. యోగసిద్ధులకధీశ్వరుడగు శ్రీకృష్ణ భగవానుడు భయమును గొల్పె అగ్నిని నోటితో త్రాగి వారిని ఆపదనుండి విడిపించెను.

తతశ్చ తేఽక్షీణ్యున్మీల్య పునర్భాండీరమాపితాః ।
నిశామ్య విస్మితా ఆసన్నాత్మానం గాశ్చ మోచితాః ।। 13

తతః - తరువాత, తే - వారు, అక్షీణి - కళ్లను, ఉన్మీల్య - తెరిచి, పునః - మరల, భాండీరమ్ - భాండీరమనే మర్రి చెట్టును, ఆపితాః - పొందించ బడిరి, ఆత్మానమ్ - తనను, మోచితాః - విడిపించబడిన, గాః చ - గోవులను కూడ, నిశామ్య - చూచి, విస్మితాః - చకితులు, ఆసన్ - అయిరి,

తరువాత వారు కళ్లను తెరచి చూచుసరికి మరల భాండీరమనే మర్రి వద్దకు చేర్చబడిరి. తాము, గోవులు కూడ కార్చిచ్చునుండి విముక్తలగుటను గాంచి వారు ఆశ్చర్యచకితులైరి.

కృష్ణస్య యోగవీర్యం తద్యోగమాయానుభావితమ్ ।
దావాగ్నేరాత్మనః క్షేమం వీక్ష్య తే మేనిరేఽమరమ్ ।। 14

యోగమాయా-అనుభావితమ్ - యోగమాయచే సంపాదించబడిన, కృష్ణస్య - శ్రీకృష్ణునియొక్క, తత్ - ఆ, ఆత్మనః - తనకు, దావ-అగ్నేః - కార్చిచ్చునుండి, క్షేమమ్ - క్షేమకరమైన, యోగవీర్యమ్ - యోగశక్తిని, వీక్ష్య - చూచి, తే - వారు, అమరమ్ - దేవతనుగా, మేనిరే - తలచిరి.

శ్రీకృష్ణుడు యోగమాయచే వారిని కార్చిచ్చునుండి కాపాడెను. ఆయనయొక్క ఆ యోగశక్తిని చూచి వారు ఆయన దేవతయని తలచిరి.

గాస్సన్నివర్త్య సాయాహ్నే సహరామో జనార్దనః ।
వేణుం విరణయన్ గోష్ఠమగాద్గోపైరభిష్టుతః ।। 15

సాయాహ్నే - సాయంకాలమునందు, సహరామః - బలరామునితో కూడిన, జన-అర్దనః - దుష్టశిక్షకుడగు శ్రీకృష్ణుడు, గాః - గోవులను, సన్నివర్త్య - వెనుకకు మళ్లించి, వేణుమ్ - పిల్లన గ్రోవిని, విరణయన్ - వివిధస్వరములను పలికించువాడై, గోపైః - గోపాలకులచే, అభిష్టుతః -

అభిముఖముగా స్తుతించబడినవాడై, గోష్ఠమ్ - గోకులమును గురించి, అగాత్ - వెళ్లెను.

దుష్టజనశిక్షకుడగు శ్రీకృష్ణుడు బలరామునితో గూడి సాయంకాలము గోవులను వెనుకకు మళ్లించి గోకులమునకు వెళ్లెను. ఆయన దారిలో పిల్లనగ్రోవిపై వివిధస్వరములను పలికిస్తూ ఉంటే చుట్టూ ఉన్న గోపాలకులు ఆయనను స్తుతించిరి.

గోపీనాం పరమానంద ఆసీద్గోవిందదర్శనే ।
క్షణం యుగశతమివ యాసాం యేన వినాఽభవత్ ॥ 16

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ఏకోనవింశోఽధ్యాయః ॥

గోవిందదర్శనే - గోరక్షకుడగు శ్రీకృష్ణుని దర్శనము కలుగగా, గోపీనామ్ - గోపికలకు, పరమ-ఆనందః - గొప్ప ఆనందము, ఆసీత్ - కలిగెను, యాసామ్ - ఎవరికైతే, యేన వినా - ఏ శ్రీకృష్ణుడు లేకుండా, క్షణమ్ - క్షణకాలము, యుగశతం ఇవ - వంద యుగములు వలె, అభవత్ - ఆయెనో.

గోవులను పాలించే శ్రీకృష్ణుని చూడగానే గోపికలకు మహానందము కలిగెను. ఆయన లేకుండా వారికి క్షణము వంద యుగముల వలె నుండెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు పదవ స్కంధము పూర్వార్ధములో
శ్రీకృష్ణుడు గోగోపాలకులను దావాగ్నినుండి రక్షించుటను వర్ణించే
పందొమ్మిదవ అధ్యాయము ముగిసినది (19).

* * * * *

# అథ వింశోఽధ్యాయః

## వర్ష శరదృతువుల వర్ణనము

శ్రీశుక ఉవాచ ।
తయోస్తదద్భుతం కర్మ దావాగ్నేర్మోక్షమాత్మనః ।
గోపాః స్త్రీభ్యస్సమాచఖ్యుః ప్రలంబవధమేవ చ ॥ 1

ఆత్మనః - తనకు, దావ-అగ్నేః - కార్చిచ్చునుండి, మోక్షమ్ - విముక్తి, ప్రలంబవధం ఏవ చ - ప్రలంబాసురుని వధ కూడ అనే, తత్ - ఆ, తయోః - వారిద్దరి, అద్భుతమ్ - అచ్చెరువును గొలిపే, కర్మ - లీలను, గోపాః - గోపాలకులు, స్త్రీభ్యః - గోపికలకు, సమాచఖ్యుః - వివరించి చెప్పిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- బలరాముడు ప్రలంబాసురుని సంహరించుట, శ్రీకృష్ణుడు తమకు కార్చిచ్చునుండి విముక్తిని కలిగించుట అనే వారిద్దరి ఆ రెండు అద్భుతములగు లీలలను గురించి గోపాలకులు గోపికలకు వివరించి చెప్పిరి.

గోపవృద్ధాశ్చ గోప్యశ్చ తదుపాకర్ణ్య విస్మితాః ।
మేనిరే దేవప్రవరౌ కృష్ణరామౌ వ్రజం గతౌ ॥ 2

గోపవృద్ధాః చ - గోపాలకులలోని పెద్దలు, గోప్యః చ - గోపికలు కూడ, తత్ - దానిని, ఉపాకర్ణ్య - శ్రద్ధగా విని, విస్మితాః - ఆశ్చర్యపడినవారు, కృష్ణరామౌ - శ్రీకృష్ణ బలరాములను, వ్రజమ్ - గోకులమును గురించి, గతౌ - అవతరించిన, దేవప్రవరౌ - దేవనాయకులనుగా, మేనిరే - తలచిరి.

వారు చెప్పిన వృత్తాంతమును గోపాలకులలోని పెద్దలు మరియు గోపికలు కూడ శ్రద్ధగా విని ఆశ్చర్యమును పొందిరి. శ్రీకృష్ణ బలరాములు గోకులములో అవతరించిన దేవనాయకులని వారు తలపోసిరి.

తతః ప్రావర్తత ప్రావృట్ సర్వసత్త్వసముద్భవా ।
విద్యోతమానపరిధిర్విస్ఫూర్జితనభస్తలా ॥ 3

తతః - తరువాత, సర్వసత్త్వసముద్భవా - సకలప్రాణులను వర్ధిల్ల జేయునది, విద్యోతమానపరిధిః - మెరిసే దిక్కులు గలది, విస్ఫూర్జితనభః-తలా - గర్జించే ఆకాశముయొక్క తలము గలది అగు, ప్రావృట్ - వర్షకాలము, ప్రావర్తత - ఆరంభమయ్యెను.

తరువాత సకలప్రాణులను వర్ధిల్ల జేసే వర్షకాలము ఆరంభమయ్యెను. మెరుపులతో దిక్కులు ప్రకాశించగా, ఆకాశతలము మేఘగర్జనలతో ప్రతిధ్వనించెను.

సాంద్రనీలాంబుదైర్వ్యోమ సవిద్యుత్స్తనయిత్నుభిః ।
అస్పష్టజ్యోతిరాచ్ఛన్నం బ్రహ్మేవ సగుణం బభౌ ॥ 4

సవిద్యుత్స్తనయిత్నుభిః - మెరుపులతో గర్జనలతో కూడిన, సాంద్రనీల-అంబుదైః - దట్టని నల్లని మేఘములచే, ఆచ్ఛన్నమ్ - కప్పివేయబడినది, అస్పష్టజ్యోతిః - కానరాని ప్రకాశమండలములు గలది అగు, వ్యోమ - ఆకాశము, సగుణమ్ - గుణములతో కూడిన, బ్రహ్మ ఇవ - పరబ్రహ్మ వలె, బభౌ - ప్రకాశించెను.

మెరుస్తూ గర్జించే నల్లని దట్టని మేఘములు ఆకాశమును కప్పివేయుటచే సూర్యచంద్రాదులు కానవచ్చుట లేదు. అట్టి ఆకాశము సత్త్వరజస్తమోగుణములచే కప్పివేయబడిన సగుణబ్రహ్మ (జీవుడు) వలె ప్రకాశించెను. (మెరుపు సత్త్వము వంటిది, గర్జన రజోగుణము వంటిది, కప్పివేయుట తమోగుణ లక్షణము).

అష్టౌ మాసాన్ నిపీతం యద్ భూమ్యాశ్చోదమయం వసు ।
స్వగోభిర్మోక్తుమారేభే పర్జన్యః కాల ఆగతే ॥ 5

స్వగోభిః - తన కిరణములతో, అష్టౌ - ఎనిమిది, మాసాన్ - మాసములు నిరంతరముగా, భూమ్యాః - భూమినుండి, ఉదమయమ్ - నీరు రూపములోనుండే, వసు - సంపద, యత్ - ఏదైతే, నిపీతమ్ -

పానము చేయబడినదో దానిని, కాలే - కాలము, ఆగతే - రాగా, పర్జన్యః - మేఘుడు, మోక్తుమ్ - విడిచిపెట్టుటకు, ఆరేభే - ఆరంభించెను.

సూర్యుడు తన కిరణములతో నిరంతరముగా ఎనిమిది మాసములు భూమినుండి నీరు రూపములోనుండే సంపదను గ్రహించెను. వర్షకాలము రాగానే మేఘుడా నీటిని విడిచిపెట్ట నారంభించెను.

తడిత్వంతో మహామేఘాశ్చండశ్వసనవేపితాః ।
ప్రీణనం జీవనం హ్యస్య ముముచుః కరుణా ఇవ ॥ 6

తడిత్వంతః - మెరుపులు గలవి, చండశ్వసనవేపితాః - వేగము గల గాలిచే కదిల్చివేయబడిన, మహామేఘాః - పెద్ద మేఘములు, కరుణాః ఇవ - దయాళువులు వలె, అస్య - ఈ జగత్తునకు, ప్రీణనమ్ - ప్రీతిని కలిగించునది, జీవనమ్ - ప్రాణములను నిలబెట్టే నీటిని, హి - నిశ్చయముగా, ముముచుః - విడిచిపెట్టినవి.

వేగవంతమైన గాలిచే కదల్చివేయబడిన మెరుపులతో కూడిన మేఘములు, దయాళువులగు వ్యక్తులు వలె, ఈ జగత్తునకు ప్రీతిని కలిగించి ప్రాణుల ప్రాణములను నిలబెట్టే నీటిని విడిచి పెట్టినవి.

తపఃకృశా దేవమీఢా ఆసీద్వర్షీయసీ మహీ ।
యథైవ కామ్యతపసస్తనుస్సంప్రాప్య తత్ఫలమ్ ॥ 7

తపఃకృశా - వేడిచే ఎండిపోయినది, దేవమీఢా - వానదేవునిచే బాగా తడుపబడినది అగు, మహీ - నేల, యథా - ఏ విధముగానైతే, కామ్యతపసః - కామన కొరకై తపస్సు చేయువానికి, తత్ - ఆ, ఫలమ్ - ఫలమును, సంప్రాప్య - పొంది, తనుః - శరీరము, వర్షీయసీ - పుష్టమైనదగునో, ఏవ - ఇదే విధముగా, ఆసీత్ - ఆయెను.

కామన సిద్ధించుట కొరకై తపస్సు చేసిన వ్యక్తియొక్క దేహము ముందు తపస్సుచే చిక్కి, కామన సిద్ధించిన తరువాత పుష్టమగును. అదే విధముగా, నేల ముందు వేడికి ఎండినది. తరువాత వానదేవుడు బాగా తడుపగా, నేల మరల పుష్టము (పచ్చని) ఐనది.

నిశాముఖేషు ఖద్యోతాస్తమసా భాంతి న గ్రహాః ।
యథా పాపేన పాఖండా న హి వేదాః కలౌ యుగే ॥ 8

నిశాముఖేషు - సాయంసంధ్యలయందు, తమసా - చీకటిచే, ఖద్యోతాః - మిణుగురు పురుగులు, భాంతి - ప్రకాశించుచున్నవి, గ్రహాః - జ్యోతిర్మండలములు, న - ప్రకాశించుట లేదు, యథా - ఏ విధముగానైతే, కలౌ యుగే - కలియుగమునందు, పాపేన - పాపముచే, పాఖండాః - వేదవిరుద్ధములైన శాస్త్రములో, వేదాః హి - వేదములైతే, న - కావో.

కలియుగములో పాపప్రభావముచే వేదవిరుద్ధములైన శాస్త్రములు ప్రాచుర్యమును పొంది వేదములు మూలపడును. అదే విధముగా, సాయంసంధ్యలయందు చీకటిచే మిణుగురు పురుగులు ప్రకాశించు చున్నవే గాని, నక్షత్రచంద్రాది జ్యోతిర్మండలములు ప్రకాశించుట లేదు.

శ్రుత్వా పర్జన్యనినదం మండూకా వ్యసృజన్ గిరః ।
తూష్ణీం శయానాః ప్రాగ్యద్వద్బ్రాహ్మణా నియమాత్యయే ॥ 9

తూష్ణీమ్ - చప్పుడు లేకుండా, శయానాః - ఉన్న, మండూకాః - కప్పలు, పర్జన్యనినదమ్ - మేఘముల గర్జనను, శ్రుత్వా - విని, గిరః - శబ్దములను, వ్యసృజన్ - చేయజొచ్చెను, యద్వత్ - ఏ విధముగానైతే, బ్రాహ్మణాః - వేదవేత్తలు, నియమ-అత్యయే ప్రాక్ - మౌననియమము పూర్తి అగుటకు ముందు వలె.

వేదవేత్తలు కర్మకాలములో మౌనముగా నుండి తరువాత వేదాధ్యయన మును మొదలిడెదరు. అదే విధముగా, చప్పుడు లేకుండా ఉన్న కప్పలు మేఘముల గర్జనలను విని బెక బెక ధ్వనులను చేయజొచ్చినవి.

ఆసన్నుత్పథవాహిన్యః క్షుద్రనద్యోఽనుశుష్యతీః ।
పుంసో యథాఽస్వతంత్రస్య దేహద్రవిణసంపదః ॥ 10

ఉత్పథవాహిన్యః - గట్లను త్రెంచుకొని ప్రవహించే, క్షుద్రనద్యః - చిన్న నదులు, అను - తరువాత, శుష్యతీః - ఎండిపోవునవి, ఆసన్ - ఐనవి, యథా - ఏ విధముగానైతే, అస్వతంత్రస్య - స్వతంత్రుడు కాని, పుంసః -

వ్యక్తికి, దేహద్రవిణసంపదః - దేహముయొక్క ధనముయొక్క సమృద్ధులో.

ఇంద్రియములు వశములో లేని వ్యక్తియొక్క దేహారోగ్యము క్షీణించి సంపదలు నష్టమగును. అదే విధముగా, (వర్షకాలములో) గట్లను త్రెంచుకొని ప్రవహించే చిన్న నదులు తరువాతి కాలములో ఎండిపోవును.

హరితా హరిభిశ్శష్పైరింద్రగోపైశ్చ లోహితా ।
ఉచ్ఛిలీంధ్రకృతచ్ఛాయా నృణాం శ్రీరివ భూరభూత్ ॥ 11

భూః - నేల, హరిభిః - ఆకుపచ్చని, శష్పైః - లేత గడ్డి పరకలచే, హరితా - పచ్చనిది, ఇంద్రగోపైః - ఆరుద్ర పురుగులతో, లోహితా - ఎర్రనిది, ఉచ్ఛిలీంధ్రకృతచ్ఛాయా - కుక్క గొడుగులచే చేయబడిన నీడ గలది, నృణామ్ - మానవుల, శ్రీః ఇవ - సంపద వలె, అభూత్ - ఉండెను.

సంపన్నులైన మానవుల చుట్టూ రంగు రంగుల విలువైన వస్తువులు ఉండును. అదే విధముగా, పచ్చని లేత గడ్డి పరకలచే నేల పచ్చగను, ఆరుద్ర పురుగులతో ఎర్రగను, కుక్క గొడుగులచే చేయబడిన నీడ మరియు తెలుపు కలదిగను, అనేకములైన రంగులను కలిగి యుండెను.

క్షేత్రాణి సస్యసంపద్భిః కర్షకాణాం ముదం దదుః ।
ధనినాముపతాపం చ దైవాధీనమజానతామ్ ॥ 12

క్షేత్రాణి - పొలములు, సస్యసంపద్భిః - పంటల సంపదలచే, కర్షకాణామ్ - కృషీవలులకు, ముదమ్ - ఆనందమును, దైవ-అధీనమ్ - దైవఘటనను, అజానతామ్ - తెలియని, ధనినాం చ - ధనవంతులకైతే, ఉపతాపమ్ - మనస్తాపమును, దదుః - కలిగించినవి.

పొలములు పంటల సంపదలతో కృషీవలులకు ఆనందమును కలిగించినవి. లాభనష్టములు దైవాధీనములని గుర్తించని ధనికులకైతే వర్షములు మనస్తాపమునే మిగిల్చినవి.

జలస్థలౌకసస్సర్వే నవవారినిషేవయా ।
అబిభ్రద్రుచిరం రూపం యథా హరినిషేవయా ॥ 13

జలస్థల-ఓకసః - నీటియందు నేలపై నివసించే, సర్వే - సకలప్రాణులు, నవవారినిషేవయా - కొత్త నీటియొక్క సేవనముచే, హరినిషేవయా ఇవ - శ్రీహరియొక్క సేవచే వలె, రుచిరమ్ - రమ్యమైన, రూపమ్ - రూపమును, అబిభ్రత్ - దాల్చినవి.

భక్తులు శ్రీహరిని సేవించి సంపన్నముగా నుందురు. అదే తీరున, నీటి యందు నివసించే చేపలు మొదలైనవి, నేలపై ఉండే పశువులు మొదలైన సకలప్రాణులు కొత్త నీటిని సేవించి రమ్యమైన రూపమును దాల్చినవి.

సరిద్భిస్సంగతస్సింధుశ్చుక్షుభే శ్వసనోర్మిమాన్ ।
అపక్వయోగినశ్చిత్తం కామాక్తం గుణయుగ్యథా ॥ 14

సరిద్భిః - నదులచే, సంగతః - సంగమము చేయబడినది, శ్వసన-ఊర్మిమాన్ - గాలి వలని కెరటములు గలది అగు, సింధుః - సముద్రము, అపక్వయోగినః - పరిణతి లేని యోగియొక్క, కామ-ఆక్తమ్ - కామనలచే కూడియున్నట్టియు, గుణయుక్ - గుణకార్యములగు భోగములయందు ఆసక్తి గల, చిత్తం యథా - అంతఃకరణము వలె, చుక్షుభే - కల్లోలితమయ్యెను.

పరిణతి లేని సాధకుని చిత్తము కామవాసనలతో నిండి భోగములయందాసక్తమై యుండుటచే కల్లోలితమగుచుండును. అదే విధముగా, నదులు వచ్చి కలియుచున్న సముద్రము గాలిచే లేచిన కెరటములతో కల్లోలముగా నుండెను.

గిరయో వర్షధారాభిర్హన్యమానా న వివ్యథుః ।
అభిభూయమానా వ్యసనైర్యథాఽధోక్షజచేతసః ॥ 15

వర్షధారాభిః - వర్షధారలచే, హన్యమానాః - కొట్టబడుచున్న, గిరయః - పర్వతములు, వ్యసనైః - ఆపదలచే, అభిభూయమానాః - పీడించబడు చున్న, అధోక్షజచేతసః యథా - ఇంద్రియగోచరుడు కాని శ్రీహరియందు మనస్సు గలవారు వలె, న వివ్యథుః - వ్యథను పొందలేదు.

ఇంద్రియగోచరము కాని స్వరూపము గల శ్రీహరిని మనస్సులో నిలుపుకున్న భక్తులను ఆపదలు ఏమీ చేయలేవు. అదే విధముగా, వర్షధారలచే కొట్టబడుచున్ననూ, పర్వతములు వ్యథను పొందలేదు.

మార్గా బభూవుస్సందిగ్ధాస్తృణైశ్ఛన్నా హ్యసంస్కృతాః ।
నాభ్యస్యమానాశ్శ్రుతయో ద్విజైః కాలహతా ఇవ ॥ 16

తృణైః - గడ్డిలతో, ఛన్నాః - కప్పివేయబడినవి, అసంస్కృతాః - బాగు చేయబడనివి అగు, మార్గాః హి - మార్గములైతే, ద్విజైః - వేదవేత్తలచే, న అభ్యస్యమానాః - అభ్యాసము చేయబడనివై, కాలహతాః - కాలముచే నష్టములైన, శ్రుతయః ఇవ - మంత్రములు వలె, సందిగ్ధాః - సందేహము గలవి, బభూవుః - అయినవి.

వేదవేత్తలు వేదమును నిరంతరము అభ్యసించనిచో, ఆ మంత్రములు సందేహములో పడి నష్టమగును. అదే విధముగా, గడ్డి మొలిచి మార్గములను కప్పివేసినది. వాటిని ఎవ్వరూ బాగు చేయలేదు. అవి గుర్తు పట్ట వీలు లేకుండా నుండెను.

లోకబంధుషు మేఘేషు విద్యుతశ్చలసౌహృదాః ।
స్థైర్యం న చక్రుః కామిన్యః పురుషేషు గుణిష్వివ ॥ 17

లోకబంధుషు - లోకమునకు హితమును చేసే, మేఘేషు - మేఘములయందు, విద్యుతః - మెరుపులు, గుణిషు - గుణవంతులగు, పురుషేషు - పురుషులయందు, చలసౌహృదాః - నిలకడ లేని ప్రేమ గల, కామిన్యః ఇవ - పడుపు వృత్తి చేసే స్త్రీల వలె, స్థైర్యమ్ - స్థిరముగానుండుటను, న చక్రుః - చేయలేదు.

పడుపు వృత్తి చేసే స్త్రీల ప్రేమ నిలకడగా నుండదు. వారు గుణవంతులగు పురుషులపై స్థిరమైన ప్రేమను చూపరు. అదే విధముగా, మెరుపులు లోకమునకు హితమును చేసే మేఘములయందు స్థిరముగా నుండవు.

ధనుర్వియతి మాహేంద్రం నిర్గుణం చ గుణిన్యభాత్ ।
వ్యక్తే గుణవ్యతికరేఽగుణవాన్ పురుషో యథా ॥ 18

గుణిని - శబ్దమనే గుణము గల, వియతి - ఆకాశమునందు, మాహేంద్రమ్ - మహేంద్రునకు చెందిన, ధనుః - ధనుస్సు, నిర్గుణం చ - గుణము (నారి త్రాడు) లేనిదే ఐననూ, అగుణవాన్ - నిర్గుణుడైన, పురుషః - పరబ్రహ్మ, గుణవ్యతికరే - గుణముల కార్యమైన, వ్యక్తే యథా - ప్రపంచమునందు వలె, అభాత్ - ప్రకాశించెను.

సత్త్వరజస్తమోగుణముల కార్యమగు ప్రపంచమునందు నిర్గుణమే ఐనా పరబ్రహ్మ (సత్తాస్ఫూర్తుల రూపముగా) ప్రకాశించుచున్నది. అదే విధముగా, ఇంద్రధనుస్సు గుణము (నారి త్రాడు) లేనిదే ఐనా శబ్దగుణము (మేఘగర్జన) గల ఆకాశమునందు ప్రకాశించెను.

న రరాజోడుపశ్ఛన్నస్స్వజ్యోత్స్నారాజితైర్ఘనైః ।
అహంమత్యా భాసితయా స్వభాసా పురుషో యథా ।। 19

స్వజ్యోత్స్నారాజితైః - తన వెన్నెలలచే ప్రకాశింపజేయబడిన, ఘనైః - మేఘములచే, స్వభాసా - తన చైతన్యప్రకాశముచే, భాసితయా - ప్రకాశింపజేయబడే, అహంమత్యా - నేను అనే మనోవృత్తిచే, పురుషః యథా - పూర్ణ-ఆత్మ వలె, ఛన్నః - కప్పివేయబడిన, ఉడుపః - నక్షత్రరాజగు చంద్రుడు, న రరాజ - ప్రకాశించలేదు.

ఆత్మ చైతన్యముచే ప్రకాశింపజేయబడే నేను అనే మనోవృత్తి ఆ పూర్ణ-ఆత్మనే కప్పివేయును. అదే విధముగా, తన వెన్నెలలచే ప్రకాశింపజేయబడే మేఘములు కప్పివేయగా, నక్షత్రరాజగు చంద్రుడు ప్రకాశించలేదు.

మేఘాగమోత్సవా హృష్టాః ప్రత్యనందఞ్ఛిఖండినః ।
గృహేషు తప్తా నిర్విణ్ణా యథాఽచ్యుతజనాగమే ।। 20

మేఘ-ఆగమ-ఉత్సవాః - మేఘముల రాకచే ఉత్సవము గల, శిఖండినః - నెమళ్లు, గృహేషు - ఇంటియందు, తప్తాః - తాపమును పొందినవారై, నిర్విణ్ణాః - విరక్తులైన సాధకులు, అచ్యుతజన-ఆగమే యథా - శ్రీహరి భక్తుల రాకయందు వలె, హృష్టాః - ఆనందించినవై, ప్రత్యనందన్ - అభినందించినవి.

ఇంటి వ్యవహారములలో తాపమును పొంది విరక్తులైన సాధకులకు శ్రీహరి భక్తుల రాక పండుగ. అదే విధముగా, మేఘముల రాక నెమళ్లకు పండుగ. అవి ఆనందిస్తూ నాట్యమాడి మేఘములను అభినందించినవి.

పీత్వాఽపః పాదపాః పద్భిరాసన్నానాఽఽత్మమూర్తయః ।
ప్రాక్ క్షామాస్తపసా శ్రాంతా యథా కామానుసేవయా ॥ 21

ప్రాక్ - ముందు, తపసా - తాపముచే, క్షామాః - ఎండిన, పాదపాః - చెట్లు, పద్భిః - వ్రేళ్లతో, అపః - నీళ్లను, పీత్వా - త్రాగి, ప్రాక్ - ముందు, తపసా - తపస్సుచే, క్షామాః - చిక్కినవారు, శ్రాంతాః - అలసినవారు,. కామ-అనుసేవయా యథా - భోగములను తరువాత సేవించుటచే వలె, నానా-ఆత్మమూర్తయః - అనేకరూపముల దేహములు గలవియై, ఆసన్ - అయినవి.

ముందులో తపస్సుచే చిక్కి అలసి తరువాత భోగములను సేవించే వ్యక్తులు స్థూలము మొదలైన అనేకరూపముల దేహములను కలిగియుందురు. అదే విధముగా, ముందు వేసవిలో ఎండకు ఎండిన చెట్లు వ్రేళ్లతో నీళ్లను త్రాగి, చిగుళ్లు ఆకులు మొదలైన అనేకములగు అవయవములను పొందుచున్నవి.

సరస్స్వశాంతరోధస్సు న్యూషురంగాపి సారసాః ।
గృహేష్వశాంతకృత్యేషు గ్రామ్యా ఇవ దురాశయాః ॥ 22

అంగ - ఓ రాజా!, అశాంతరోధస్సు - కోసివేయబడిన గట్లు గల, సరస్సు అపి - సరస్సులయందు కూడ, సారసాః - బెగ్గురు పక్షులు, అశాంతకృత్యేషు - అశాంతిని కలిగించే పనులు గల, గృహేషు - ఇంటియందు, దురాశయాః - కలుషితమైన అంతఃకరణము గల , గ్రామ్యాః ఇవ - భోగాసక్తులు (అజ్ఞానులు) వలె, న్యూషుః - నివసించినవి.

ఓ రాజా! ఇంటిలోని పనులు మనస్సునకు అశాంతిని మాత్రమే కలిగించును. ఐనను, కలుషితమైన అంతఃకరణము గలవారై భోగాసక్తి గల గృహస్థులు ఇంటిలోననే ఉండెదరు. అదే విధముగా, గట్లు తెగి సరస్సులు కలుషితములైననూ, బెగ్గురు పక్షులు వాటియందే నివసించెను.

జలౌఘైర్నిరభిద్యంత సేతవో వర్షతీశ్వరే ।
పాఖండినామసద్వాదైర్వేదమార్గాః కలౌ యథా ॥ 23

ఈశ్వరే - పర్జన్యాధిపతియగు ఇంద్రుడు, వర్షతి - వర్షించుచుండగా, సేతవః - గట్లు, జల-ఓఘైః - నీటి ప్రవాహములచే, కలౌ - కలికాలమునందు, పాఖండినామ్ - వేదవిరోధుల, అసద్-వాదైః - తప్పు సిద్ధాంతములచే, వేదమార్గాః యథా - వేదప్రతిపాద్యమైన మర్యాదలు వలె, నిరభిద్యంత - కోసి వేయబడినవి.

కలికాలములో వేదవిరోధుల తప్పుడు సిద్ధాంతములు వేదప్రతిపాద్యమైన మర్యాదలను భగ్నము చేయును. అదే విధముగా, పర్జన్యాధిపతియగు ఇంద్రుడు వర్షించుచుండ, నీటి ప్రవాహములు గట్లను త్రెంచివేసెను.

వ్యముంచన్ వాయుభిర్నున్నా భూతేభ్యోఽథామృతం ఘనాః ।
యథాఽఽశిషో విశ్పతయః కాలే కాలే ద్విజేరితాః ॥ 24

అథ - అప్పుడు, వాయుభిః - గాలులచే, నున్నాః - ప్రేరితములైన, ఘనాః - మేఘములు, భూతేభ్యః - ప్రాణుల కొరకు, అమృతమ్ - అమృతమును, కాలే కాలే - ఆయా సమయములయందు, ద్విజ-ఈరితాః - వేదవేత్తలచే ప్రేరితులైన, విశ్-పతయః - రాజులు, ఆశిషః యథా - కామనలను వలె, వ్యముంచన్ - విడిచిపెట్టినవి.

వేదవేత్తలచే ప్రేరితులై రాజులు ఆయా కాలములయందు దానములతో ప్రజల కోరికలను తీర్చెదరు. అదే విధముగా, ఆ వర్షకాలమునందు గాలులచే ప్రేరితములై మేఘములు ప్రాణులకు అమృతమువంటి నీటిని విడిచి పెట్టినవి.

**ఏవం వనం తద్వర్షిష్ఠం పక్వఖర్జూరజంబుమత్ ।**
**గోగోపాలైర్వృతో రంతుం సబలః ప్రావిశద్ధరిః ॥ 25**

**ఏవమ్ - ఈ విధముగా, వర్షిష్ఠమ్ - సమృద్ధమైనట్టియు (బాగా వర్షము పడిన), పక్వఖర్జూరజంబుమత్ - పండిన ఖర్జూరములు నేరేడు పళ్లు గల, తత్ - ఆ, వనమ్ - బృందావనమును, గోగోపాలైః - గోవులతో**

గోపాలకులతో, వృతః - కూడియున్న, హరిః - శ్రీకృష్ణ భగవానుడు, సబలః - బలరామునితో కూడినవాడై, రంతుమ్ - విహరించుటకు, ప్రావిశత్ - ప్రవేశించెను.

ఈ విధముగా మంచి వర్షములు పడుటచే ఆ బృందావనము పండిన ఖర్జూరములతో మరియు నేరేడు పళ్లతో సమృద్ధమై యుండెను. శ్రీకృష్ణ భగవానుడు బలరామునితో, గోవులతో, గోపాలకులతో కూడి విహరించుటకై ఆ వనమును ప్రవేశించెను.

ధేనవో మందగామిన్య ఊధోభారేణ భూయసా ।
యయుర్భగవతాఽఽహూతా ద్రుతం ప్రీత్యా స్నుతస్తనీః ।। 26

ధేనవః - పాలిచ్చే ఆవులు, భూయసా - అధికమగు, ఊధః-భారేణ - పొదుగుయొక్క బరువుచే, మందగామిన్యః - మెల్లగా నడుచునవి, స్నుతస్తనీః - పాలను స్రవించే పొదుగులు గల ఆవులు, భగవతా - శ్రీకృష్ణ భగవానునిచే, ప్రీత్యా - ప్రేమతో, ఆహూతాః - పిలువబడినవై, ద్రుతమ్ - వడివడిగా, యయుః - నడచినవి.

పాలిచ్చే ఆవులు అధికమగు పొదుగుయొక్క బరువుచే మెల్లగా నడచుచుండెను. కాని, శ్రీకృష్ణ భగవానుడు ప్రేమతో పిలువగా, పొదుగులనుండి పాలు స్రవించుచుండగా, అవి వడివడిగా నడచినవి.

వనౌకసః ప్రముదితా వనరాజీర్మధుచ్యుతః ।
జలధారా గిరేర్నాదానాసన్నా దదృశే గుహాః ।। 27

వన-ఓకసః - అడవియందు నివసించే పశుపక్ష్యాదులు, ప్రముదితాః - మహానందమును పొందినవి, గిరేః - పర్వతమునుండి, జలధారాః - నీటి ధారలు, ఆసన్ - ఏర్పడినవి, మధుచ్యుతః - తేనెలను జాలువార్చే, వనరాజీః - అడవుల పంక్తులను, గుహాః - గుహలను, ఆ - అంతటా, దదృశే - చూచెను, నాదాన్ - ధ్వనులను.

అడవియందుండే పశుపక్ష్యాదులు మహానందముతో నుండెను. పర్వతమునుండి జలపాతములేర్పడెను. శ్రీకృష్ణుడు తేనెలను జాలువార్చే అడవుల వరుసలను, గుహలను అంతటా చూస్తూ శబ్దములను వినెను.

క్వచిద్వనస్పతిక్రోడే గుహాయాం చాభివర్షతి ।
నిర్విశ్య భగవాన్ రేమే కందమూలఫలాశనః ॥ 28

క్వచిత్ - ఒకనాడు, అభివర్షతి - వర్షించుచుండగా, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, వనస్పతిక్రోడే - చెట్టు తొఱ్ఱయందు, గుహాయాం చ - గుహయందు కూడ, నిర్విశ్య - కూర్చుండి, కందమూలఫల-అశనః - దుంపలు వ్రేళ్లు పళ్లను తినువాడై, రేమే - ఆనందించెను.

వర్షము కురియుచుండగా శ్రీకృష్ణ భగవానుడు ఒకనాడు చెట్టు తొఱ్ఱలో, మరియొకనాడు కొండ గుహలో కూర్చుండి దుంపలను, వ్రేళ్లను, పళ్లను తింటూ ఆనందించెను.

దధ్యోదనం సమానీతం శిలాయాం సలిలాంతికే ।
సంభోజనీయైర్బుభుజే గోపైస్సంకర్షణాన్వితః ॥ 29

సంకర్షణ-అన్వితః - బలరామునితో కూడియున్న శ్రీకృష్ణుడు, సంభోజనీయైః - కలిసి తినదగిన, గోపైః - గోపాలకులతో, సలిల-అంతికే - నీటికి దగ్గరలో, శిలాయామ్ - రాతిపై, సమానీతమ్ - తెచ్చుకున్న, దధి-ఓదనమ్ - పెరుగన్నమును, బుభుజే - తినెను.

గోపబాలకులతో కలిసి తినుట శ్రీకృష్ణునకు ప్రియము. ఆయన వారితో, బలరామునితో కలిసి, నీటికి దగ్గరలో రాతిపై కూర్చుండి, ఇంటినుండి తెచ్చుకున్న పెరుగన్నమును తినెను.

శాద్వలోపరి సంవిశ్య చర్వతో మీలితేక్షణాన్ ।
తృప్తాన్ వృషాన్ వత్సతరాన్ గాశ్చ స్వోధోభరశ్రమాః ॥ 30

ప్రావృట్శ్రియం చ తాం వీక్ష్య సర్వభూతముదావహామ్ ।
భగవాన్ పూజయాంచక్రే ఆత్మశక్త్యుపబృంహితామ్ ॥ 31

శాద్వల-ఉపరి - పచ్చిక బయలుపై, సంవిశ్య - చక్కగా కూర్చుండి, చర్వతః - నెమరు వేయుచున్నట్టియు, మీలిత-ఈక్షణాన్ - మూయబడిన కన్నులు కలిగినట్టియు, తృప్తాన్ - కడుపు నిండిన, వృషాన్ - ఎద్దులను, వత్సతరాన్ - లేగ దూడలను, స్వ-ఊధః-భరశ్రమాః - తమ పొదుగుల

బరువుచే శ్రమ గల, గాః చ - ఆవులను, సర్వభూతముదావహామ్ - సకలప్రాణులకు ఆనందమును కలిగించునట్టియు, ఆత్మశక్తి-ఉపబృంహితామ్ - తన మాయాశక్తిచే వర్ధిల్ల జేయబడిన, తామ్ - ఆ, ప్రావృట్-శ్రియం చ - వర్షర్తువుయొక్క శోభను కూడ, వీక్ష్య - చూచి, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, పూజయాంచక్రే - ప్రశంసించెను.

ఎద్దులు, లేగ దూడలు కడుపు నిండా గడ్డి మేసి పచ్చిక బయలుపై చక్కగా కూర్చుండి కళ్లు మూసుకొని నెమరు వేయుచుండెను. ఆవులు తమ పొదుగుయొక్క బరువుతో శ్రమను కలిగియుండెను. తన మాయా శక్తిచే వర్ధిల్ల జేయబడిన ఆ వర్షర్తుశోభ సకలప్రాణులకు ఆనందమును కలిగించుచుండెను. దానిని చూచి శ్రీకృష్ణ భగవానుడు మెచ్చుకొనెను.

ఏవం నివసతోస్తస్మిన్ రామకేశవయోర్వ్రజే ।
శరత్సమభవద్వ్యభ్రా స్వచ్ఛాంబ్వపరుషానిలా ॥ 32

రామకేశవయోః - బలరామ శ్రీకృష్ణ భగవానులు, ఏవమ్ - ఈ విధముగా, తస్మిన్ - ఆ, వ్రజే - గోకులమునందు, నివసతోః - నివసించుచుండగా, వి-అభ్రా - తొలగిన మేఘములు గలది, స్వచ్ఛ-అంబు-అపరుష-అనిలా - తేటపడిన నీరు మెల్లని గాలి గల, శరత్ - శరత్కాలము, సమభవత్ - వచ్చెను.

శ్రీకృష్ణ భగవానుడు, బలరాముడు ఈ విధముగా ఆ గోకులములో నివసించుచుండిరి. ఇంతలో శరత్కాలము వచ్చెను. ఆకాశములో మేఘములు తొలగిపోయెను. గాలి మెల్లగా వీచెను. నీరు తేటపడెను.

శరదా నీరజోత్పత్త్యా నీరాణి ప్రకృతిం యయుః ।
భ్రష్టానామివ చేతాంసి పునర్యోగనిషేవయా ॥ 33

నీరజ-ఉత్పత్త్యా - పద్మములను ఉత్పన్నము చేసే, శరదా - శరత్కాలముచే, నీరాణి - జలములు, పునః - మరల, యోగనిషేవయా - యోగమునభ్యసించుటచే, భ్రష్టానామ్ - యోగమార్గమునుండి జారిపోయినవారి, చేతాంసి ఇవ - మనస్సులు వలె, ప్రకృతిమ్ - తమ స్వభావమగు స్వచ్ఛత్వమును, యయుః - పొందినవి.

యోగమార్గమునుండి జారిపోయిన వారు మరల యోగమునభ్యసించినప్పుడు వారి మనస్సులు ప్రసన్నములగును. అదే విధముగా పద్మములను వికసింప జేసే శరత్కాలము కారణముగా నీరు తన సహజమైన స్వచ్ఛత్వమును, మాధుర్యమును తిరిగి పొందెను.

వ్యోమ్నోఽబ్దం భూతశాబల్యం భువః పంకమపాం మలమ్ ।
శరజ్జహారాశ్రమిణాం కృష్ణే భక్తిర్యథాఽశుభమ్ ॥ 34

శరత్ - శరత్కాలము, వ్యోమ్నః - ఆకాశమునుండి, అబ్దమ్ - మేఘమును, భూతశాబల్యమ్ - ప్రాణుల రద్దీని, భువః - నేలనుండి, పంకమ్ - బురదను, అపామ్ - నీళ్ల, మలమ్ - కాలుష్యమును, కృష్ణే - శ్రీకృష్ణునియందలి, భక్తిః - భక్తి, ఆశ్రమిణామ్ - ఆశ్రమముల వారికి, అశుభం యథా - అశుభమును వలె, జహార - తొలగించెను.

శ్రీకృష్ణునియందలి భక్తి బ్రహ్మచర్యము మొదలైన నాలుగు ఆశ్రమముల వారికి అశుభమును తొలగించును. అదే విధముగా, శరత్కాలము ఆకాశమునుండి మేఘములను, నేలనుండి బురదను, నీళ్లనుండి కాలుష్యమును తొలగించెను. శరత్కాలమునందు ప్రాణులు గుంపులుగా కాకుండా రద్దీ లేకుండా విడివిడిగా జీవించును.

సర్వస్వం జలదా హిత్వా విరేజుశ్శుభ్రవర్చసః ।
యథా త్యక్తైషణాశ్శాంతా మునయో ముక్తకిల్బిషాః ॥ 35

జలదాః - మేఘములు, సర్వస్వమ్ - తమ సొత్తునంతనూ, హిత్వా - విడిచిపెట్టి, శుభ్రవర్చసః - స్వచ్ఛమగు కాంతి గలవియై, త్యక్త-ఏషణాః - విడిచిపెట్టబడిన కామనలు గలవారు, శాంతాః - ప్రసన్నమైన మనస్సు గలవారు, ముక్తకిల్బిషాః - తొలగిపోయిన వాసనలు గలవారు అగు, మునయః యథా - మననశీలురగు సాధకులు వలె, విరేజుః - అధికముగా ప్రకాశించినవి.

కామనలను విడిచిపెట్టిన సాధకులు వాసనలు తొలగి ప్రసన్నమగు మనస్సుతో అధికముగా రాజిల్లెదరు. అదే తీరున, మేఘములు తమ సొత్తు (నీరు) నంతనూ విడిచిపెట్టి తెల్లని కాంతితో అధికముగా ప్రకాశించెను.

గిరయో ముముచుస్తోయం క్వచిన్న ముముచుశ్శివమ్ ।
యథా జ్ఞానామృతం కాలే జ్ఞానినో దదతే న వా ॥ 36

గిరయః - పర్వతములు, శివమ్ - నిర్మలమైన, తోయమ్ - నీటిని, ముముచుః - విడిచిపెట్టినవి, క్వచిత్ - అక్కడక్కడ, న - విడిచిపెట్టలేదు, యథా - ఎల్లాగైతే, జ్ఞానినః - జ్ఞానులు, కాలే - ఒక కాలమునందు, జ్ఞాన-అమృతమ్ - అమృతమువంటి జ్ఞానమును, దదతే - ఇచ్చెదరో, న వా - లేదా ఈయరో.

జ్ఞానులు అమృతమువంటి జ్ఞానమును ఒక కాలములో ఇచ్చెదరు, మరియొకప్పుడు ఈయరు. అదే విధముగా, పర్వతములు ఒకచోట నిర్మలమగు నీటిని ఇచ్చి, మరియొక చోట మానివేసినవి.

నైవావిదన్ క్షీయమాణం జలం గాధజలేచరాః ।
యథాఽఽయురన్వహం క్షయ్యం నరా మూఢాః కుటుంబినః ॥37

గాధజలేచరాః - మెరక నీటిలో సంచరించే ప్రాణులు, క్షీయమాణమ్ - ఎండిపోవుచున్న, జలమ్ - నీటిని గురించి, న ఏవ అవిదన్ - ఏ మాత్రము తెలియకున్నవి, యథా - ఎల్లాగైతే, అన్వహమ్ - ప్రతి రోజు, క్షయ్యమ్ - క్షీణించిపోయే, ఆయుః - ఆయుర్దాయమును గురించి, మూఢాః - వ్యామోహితులు, కుటుంబినః - గృహస్థులు అగు, నరాః - మానవులో.

ఇంద్రియభోగములయందు తగుల్కొని ఇల్లే సర్వము అని భావించే జనులు తమకు ప్రతి దినము తరిగిపోవుచున్న ఆయుర్దాయమును గురించి తెలియజాలరు. అదే విధముగా, లోతు లేని నీటిలో సంచరించే ప్రాణులు రోజు రోజుకీ క్షీణిస్తున్న నీటిని గురించి ఏ మాత్రమూ తెలియకున్నవి.

గాధవారిచరాస్తాపమవిందఞ్ఛరదర్కజమ్ ।
యథా దరిద్రః కృపణః కుటుంబ్యవిజితేంద్రియః ॥ 38

గాధవారిచరాః - లోతు లేని నీటిలో సంచరించే ప్రాణులు, శరద్-అర్కజమ్ - శరత్కాలసూర్యుని వలన కలిగే, తాపమ్ - తాపమును, అవిందన్ - పొందినవి, యథా - ఎల్లాగైతే, దరిద్రః - దరిద్రుడు, కృపణః -

దీనుడు, అవిజిత-ఇంద్రియః - జయించబడని ఇంద్రియములు గలవాడు అగు, కుటుంబీ - కుటుంబీకుడో.

దరిద్రుడు, దీనుడు, ఇంద్రియజయము లేనివాడు అగు కుటుంబీకుడు అనేకమనస్తాపములను పొందును. అదే విధముగా, మెరక నీటిలోనున్న ప్రాణులకు శరత్కాలసూర్యుని తాపము తప్పలేదు.

శనైశ్శనైర్జహుః పంకం స్థలాన్యామం చ వీరుధః ।
యథాఽహంమమతాం ధీరాశ్శరీరాదిష్వనాత్మసు ॥ 39

స్థలాని - నేలలు, పంకమ్ - బురదను, వీరుధః - మొక్కలు, ఆమమ్ - పచ్చిని, శనైః శనైః - మెల్లమెల్లగా, జహుః - విడిచి పెట్టినవి, యథా - ఎల్లాగైతే, ధీరాః - వివేకులు, శరీర-ఆదిషు - దేహము మొదలగు, అనాత్మసు - అనాత్మలయందు, అహంమమతామ్ - అహంకార మమకారములనో.

వివేకమునభ్యసించే సాధకులు దేహేంద్రియాదులయందు అహంకార మమకారములను క్రమముగా విడిచెదరు. అదే తీరున, నేలలు బురదను, మొక్కలు లేతదనమును, కాయలు పచ్చిని మెల్లమెల్లగా విడిచి పెట్టినవి.

నిశ్చలాంబురభూత్తూష్ణీం సముద్రశ్శరదాగమే ।
ఆత్మన్యుపరతే సమ్యఙ్మునిర్వ్యుపరతాగమః ॥ 40

శరద్-ఆగమే - శరత్కాలము రాగా, నిశ్చల-అంబుః - కదలిక లేని నీరు గల, సముద్రః - సముద్రము, తూష్ణీం అభూత్ - నిశ్శబ్దముగా నుండెను, ఆత్మని - మనస్సు, సమ్యక్ - బాగుగా, ఉపరతే - కర్మాసక్తినుండి నివృత్తము కాగా, వి-ఉపరత-ఆగమః - నివృత్తమైన వేదఘోష గల, మునిః - మననశీలుడగు సాధకుడు.

కర్మాసక్తినుండి బాగుగా మనస్సు నివృత్తము కాగా, మననశీలుడగు సాధకుడు వేదాధ్యయనము (కర్మకాండ) నుండి నివృత్తుడగును. అదే విధముగా, శరత్కాలము రాగానే సముద్రములోని నీరు (అధికమగు) కదలిక లేనిదాయెను; సముద్రము నిశ్శబ్దముగా నుండెను.

కేదారేభ్యస్త్వపోఽగృహ్ణన్ కర్షకా దృఢసేతుభిః ।
యథా ప్రాణైస్స్రవజ్జ్ఞానం తన్నిరోధేన యోగినః ॥ 41

కర్షకాః తు - కృషీవలులైతే, దృఢసేతుభిః - గట్టి గట్లతో, కేదారేభ్యః - వరి పొలములనుండి, అపః - నీళ్లను, అగృహ్ణన్ - నిలువరించిరి, యథా - ఎల్లాగైతే, ప్రాణైః - ఇంద్రియముల గుండా, స్రవత్ - జారిపోవుచున్న, జ్ఞానమ్ - జ్ఞానమును, తత్-నిరోధేన - వాటిని నిగ్రహించుటచే, యోగినః - యోగులో.

యోగులు ఇంద్రియముల గుండా జారిపోయే జ్ఞానమును ఇంద్రియనిగ్రహముతో రక్షించెదరు. అదే విధముగా, కృషీవలులు గట్టి గట్లను కట్టి వరి పొలములనుండి నీరు వెళ్లిపోకుండా నిలువరించిరి.

శరదర్కాంశుజాంస్తాపాన్ భూతానాముడుపోఽహరత్ ।
దేహాభిమానజం బోధో ముకుందో వ్రజయోషితామ్ ॥ 42

భూతానామ్ - ప్రాణులకు, శరద్-అర్క-అంశుజాన్ - శరత్కాల సూర్యుని కిరణముల వలన కలిగిన, తాపాన్ - తాపములను, ఉడుపః - నక్షత్రాధిపతియగు చంద్రుడు, అహరత్ - పోగొట్టెను, బోధః - ఆత్మజ్ఞానము, దేహ-అభిమానజమ్ - దేహమునందలి అభిమానము వలన కలిగిన తాపమును, ముకుందః - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణ భగవానుడు, వ్రజయోషితామ్ - గోకుల స్త్రీలకు.

ఆత్మజ్ఞానము దేహమునందలి అహం-మమకారముల వలన కలిగే తాపమును పోగొట్టును. మోక్షప్రదుడగు శ్రీకృష్ణ భగవానుడు యశోద మొదలైన గోకులస్త్రీలకు తాను అడవికి వెళ్లుట వలన కలిగిన క్లేశమును పోగొట్టెను. అదే విధముగా, ప్రాణులకు శరత్కాల సూర్యుని కిరణముల వలన కలిగిన తాపములను చంద్ర భగవానుడు పోగొట్టెను.

ఖమశోభత నిర్మేఘం శరద్విమలతారకమ్ ।
సత్త్వయుక్తం యథా చిత్తం శబ్దబ్రహ్మార్థదర్శనమ్ ॥ 43

నిర్మేఘమ్ - మేఘములు లేనిది, శరద్-విమలతారకమ్ - శరత్కాలముచే నిర్మలములైన నక్షత్రములు గలది అగు, ఖమ్ -

ఆకాశము, సత్త్వయుక్తమ్ - సత్త్వగుణప్రధానమైన, శబ్దబ్రహ్మ-అర్థదర్శనమ్ - భగవద్రూపమగు వేదముయొక్క తాత్పర్యమును దర్శింపజేసే, చిత్తం యథా - చిత్తము వలె, అశోభత - ప్రకాశించెను.

సత్త్వగుణప్రధానమగు మనస్సులో భగవద్రూపమగు వేదముయొక్క తాత్పర్యము ప్రకాశించును. మొగిళ్లు లేకుండా నక్షత్రములతో నిర్మలముగా ప్రకాశించే శరత్కాల-ఆకాశము అట్టి చిత్తమువలె శోభిల్లెను.

అఖండమండలో వ్యోమ్ని రరాజోడుగణైశ్శశీ ।
యథా యదుపతిః కృష్ణో వృష్ణిచక్రావృతో భువి ॥ 44

అఖండమండలః - పూర్ణమగు, మండలము గల, శశీ - చంద్రుడు, వ్యోమ్ని - ఆకాశమునందు, ఉడుగణైః - నక్షత్రముల రాశులతో, భువి - భూలోకమునందు, వృష్ణిచక్ర-ఆవృతః - యాదవుల సమూహముచే చుట్టువారబడియున్న, యదుపతిః - యాదవనాయకుడగు, కృష్ణః యథా - శ్రీకృష్ణుడు వలె, రరాజ - ప్రకాశించెను.

భూలోకములో యాదవనాయకుడగు శ్రీకృష్ణుడు యాదవుల సమూహముచే చుట్టువారబడి ప్రకాశించెను. అదే విధముగా, ఆకాశములో పూర్ణమగు కళలు గల చంద్రుడు నక్షత్రముల రాశులతో శోభిల్లెను.

ఆశ్లిష్య సమశీతోష్ణం ప్రసూనవనమారుతమ్ ।
జనాస్తాపం జహుర్గోప్యో న కృష్ణాహృతచేతసః ॥ 45

సమశీత-ఉష్ణమ్ - సమానమైన చల్లదనము వేడి గల, ప్రసూనవనమారుతమ్ - పూల అడవి గాలిని, ఆశ్లిష్య - స్పృశించి, జనాః - జనులు, తాపమ్ - తాపమును, జహుః - విడిచిరి, కృష్ణ-ఆహృతచేతసః - శ్రీకృష్ణునిచే ఆకర్షించబడిన మనస్సు గల, గోప్యః - గోపికలు, న - లేదు (గోపికలు వలె).

అడవి పూల మీదుగా వీచే గాలియందు చల్లదనము, వేడి సమపాళ్లలో నుండెను. అది తగిలి జనుల తాపము, శ్రీకృష్ణుని ఎత్తుకున్న యశోదా మొదలగువారి తాపము వలె, దూరమయ్యెను. కాని, శ్రీకృష్ణునిచే

ఆకృష్ణమైన మనస్సు గల గోపికలకు ఆయన లేనప్పుడు కలిగిన క్లేశమును ఆ గాలి పోగొట్టలేదు.

గావో మృగాః ఖగా నార్యః పుష్పిణ్యశ్శరదాఽభవన్ ।
అన్విష్యమాణాస్స్వవృషైః ఫలైరీశక్రియా ఇవ ॥ 46

గావః - ఆవులు, మృగాః - లేళ్లు, ఖగాః - పక్షులు, శరదా - శరత్కాలముచే, స్వవృషైః - తమ భర్తలచే, ఈశక్రియాః - ఈశ్వరుని (సమర్థుని) క్రియలు, ఫలైః ఇవ - ఫలముల చేతను వలె, అన్విష్యమాణాః - వెదుకబడుచున్నవి, నార్యః - యువతులు, పుష్పిణ్యః - పూల మాలలు గలవారు.

ఈశ్వరుని ఆరాధించుటకై సమర్థుడగు వ్యక్తి చేసే క్రియలను వాటి ఫలములు వెదుకుకుంటూ వచ్చును. అదే విధముగా, శరత్కాలప్రభావముచే ఎద్దులు ఆవులను, జంతువులు పక్షులు తమ జంటలను వెదుకుచుండెను. స్త్రీలు నిండా పూల మాలలను ధరించిరి.

ఉదహృష్యన్ వారిజాని సూర్యోత్థానే కుముద్వినా ।
రాజ్ఞా తు నిర్భయా లోకా యథా దస్యూన్ వినా నృప ॥ 47

నృప - ఓ రాజా!, సూర్య-ఉత్థానే - సూర్యుడు ఉదయించగా, కుముద్ వినా - కలువను మినహాయించి, వారిజాని - పద్మములు, ఉదహృష్యన్ - బాగా వికసించినవి, యథా - ఎల్లాగైతే, రాజ్ఞా - రాజుచే, లోకాః - జనులు, దస్యూన్ తు వినా - చోరులనైతే మినహాయించి, నిర్భయాః - భయము లేనివారో.

ఓ పరీక్షిన్మహారాజా! రాజు కారణముగా చోరులు తప్ప జనులు నిర్భయముగా నుండెదరు. అదే విధముగా, సూర్యుడు ఉదయించగానే పద్మములు వికసించినవి. కాని, కలువలు ముడుచుకొనియే యున్నవి.

పురగ్రామేష్వాగ్రయణైరైంద్రియైశ్చ మహోత్సవైః ।
బభౌ భూః పక్వసస్యాఢ్యా కలాభ్యాం నితరాం హరేః ॥ 48

పురగ్రామేషు - నగరములయందు గ్రామములయందు, ఆగ్రయణైః - కొత్త పంట సందర్భముగా చేసే యజ్ఞములతో, ఐంద్రియైః - ఇంద్రియభోగములకు చెందిన, మహా-ఉత్సవైః - గొప్ప ఉత్సవములతో, హరేః - శ్రీహరియొక్క, కలాభ్యాం చ - కళలైన బలరామకృష్ణులతో కూడ, పక్వసస్య-ఆఢ్యా - కోతకు వచ్చిన సస్యములతో సంపన్నమైన, భూః - భూమి, నితరామ్ - అతిశయముగా, బభౌ - ప్రకాశించెను.

నగరములలో, పల్లెలలో కొత్త పంటలు వచ్చిన సందర్భములో వైదికులు యజ్ఞములను చేయుచుండిరి. లౌకికులు వీధి నాటకములు మొదలైన కన్నులకు పండువ చేసే గొప్ప ఉత్సవములను చేయుచుండిరి. ఆ యజ్ఞములతో, ఉత్సవములతో, శ్రీహరి అంశలైన బలరామకృష్ణులతో, మరియు కోతకు వచ్చిన పంటలతో భూమి అతిశయించి శోభిల్లెను.

వణిఙ్మునినృపస్నాతా నిర్గమ్యార్థాన్ ప్రపేదిరే ।
వర్షరుద్ధా యథా సిద్ధాస్స్వపిండాన్ కాల ఆగతే ।। 49

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే వింశోఽధ్యాయః ।।

వర్షరుద్ధాః - వర్షములచే ఆపివేయబడిన, వణిక్-మునినృపస్నాతాః - వర్తకులు మునులు రాజులు స్నాతకులు, నిర్గమ్య - బయలుదేరి, కాలే - కాలము, ఆగతే - రాగా, సిద్ధాః - సిద్ధులు, స్వపిండాన్ యథా - తమ దేహములను వలె, అర్థాన్ - ప్రయోజనములను, ప్రపేదిరే - పొందిరి.

యోగసిద్ధులు సమయము వచ్చినప్పుడు తమకు యోగ్యమైన దేవాది దేహములను పొందెదరు. అదే విధముగా, వర్షముల కారణముగా ఆగిపోయిన వర్తకులు శరత్కాలము రాగానే బయలు దేరి వర్తకములను చేసిరి. మునులు మహాత్ముల దర్శనమునకు, వేదాధ్యయనము పూర్తి అయిన బ్రహ్మచారులు ఇళ్లకు (వివాహము కొరకై), రాజులు శత్రుజయము కొరకు బయల్వెడలి, ఆయా ప్రయోజనములను బడసిరి.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము పూర్వార్ధములో వర్ష శరదృతువులను వర్ణించే ఇరువదియవ అధ్యాయము ముగిసినది (20).

* * * * *

# అథ ఏకవింశోऽధ్యాయః

## వేణు గీతము

శ్రీశుక ఉవాచ ।
ఇత్థం శరత్స్వచ్ఛజలం పద్మాకరసుగంధినా ।
న్యవిశద్వాయునా వాతం సగోగోపాలకోऽచ్యుతః ॥ 1

శరత్-స్వచ్ఛజలమ్ - శరత్కాలముచే నిర్మలమైన నీరు కలిగినట్టియు, పద్మ-ఆకరసుగంధినా - పద్మముల సరస్సుల సుగంధము గల, వాయునా - వాయువుచే, వాతమ్ - వ్యాపించబడిన, ఇత్థమ్ - ఇటువంటి బృందావనమును, సగోగోపాలకః - గోవులతో గోపాలకులతో కూడియున్న, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, న్యవిశత్ - ప్రవేశించెను.

బృందావనములోని సరస్సులలోని నీరు శరత్కాలము కారణముగా నిర్మలముగా నుండెను. వాటిలోని పద్మముల మీదనుండి వీచే గాలి వనమునంతనూ వ్యాపించెను. శ్రీకృష్ణ భగవానుడు గోవులతో, గోపాలకులతో గూడి ఇటువంటి వనమును ప్రవేశించెను.

కుసుమితవనరాజిశుష్మిభృంగద్విజకులఘుష్టసరస్సరిన్మహీధ్రమ్ ।
మధుపతిరవగాహ్య చారయన్గాస్సహపశుపాలబలశ్చుకూజ వేణుమ్॥2

సహపశుపాలబలః - గోపాలకులతో బలరామునితో కూడియున్న, మధుపతిః - మధువనప్రభువగు శ్రీకృష్ణుడు, గాః - గోవులను, చారయన్ - మేపుచున్నవాడై, కుసుమితవనరాజిశుష్మిభృంగద్విజకులఘుష్టసరః-సరిత్-మహీధ్రమ్ - పుష్పించిన చెట్ల గుంపుల పంక్తులయందలి మదించిన తుమ్మెదల పక్షుల గుంపుల నాదములు గల సరస్సులు నదులు పర్వతములు గల వనమును, అవగాహ్య - ప్రవేశించి, వేణుమ్ - పిల్లన గ్రోవిని, చుకూజ - వాయించెను.

మధువనప్రభుడగు శ్రీకృష్ణుడు బలరామునితో మరియు గోపాలకులతో కూడి గోవులను మేపుతూ బృందావనమును ప్రవేశించెను. ఆ వనములోని పుష్పించిన చెట్ల గుంపుల పంక్తులు, సరస్సులు, నదులు, పర్వతములు మత్తెక్కిన తుమ్మెదల మరియు పక్షుల గుంపుల ధ్వనులతో నిండి యుండెను. అపుడాయన పిల్లన గ్రోవిని వాయించెను.

తద్వ్రజస్త్రియ ఆశ్రుత్య వేణుగీతం స్మరోదయమ్ ।
కాశ్చిత్పరోక్షం కృష్ణస్య స్వసఖీభ్యోఽన్వవర్ణయన్ ।। 3

కాశ్చిత్ - కొందరు, వ్రజస్త్రియః - గోకులమునందలి గోపికలు, స్మర-ఉదయమ్ - ప్రేమను కలిగించే, కృష్ణస్య - శ్రీకృష్ణుని, తత్ - ఆ, వేణుగీతమ్ - పిల్లన గ్రోవి గానమును, ఆశ్రుత్య - దగ్గరగా విని, పరోక్షమ్ - పరోక్షముగా, స్వసఖీభ్యః - తమ స్నేహితురాండ్రకు, అను - తరువాత, అవర్ణయన్ - వర్ణించిరి.

గోకులమునందలి గోపికలు కొందరు ప్రేమను వర్ధిల్ల జేసే శ్రీకృష్ణుని ఆ వేణుగానమును దగ్గరగా వినిరి. తరువాత వారు గోకులములోనే ఉండి వినలేకపోయిన తమ స్నేహితురాండ్రకు వర్ణించి చెప్పిరి.

తద్వర్ణయితుమారబ్ధాస్స్మరంత్యః కృష్ణచేష్టితమ్ ।
నాశకన్ స్మరవేగేన విక్షిప్తమనసో నృప ।। 4

నృప - ఓ రాజా!, తత్ - దానిని, వర్ణయితుమ్ - వర్ణించుటకు, ఆరబ్ధాః - ఆరంభించినవారు, కృష్ణచేష్టితమ్ - శ్రీకృష్ణుని చేష్టను, స్మరంత్యః - గుర్తు చేసుకున్నవారు, స్మరవేగేన - ప్రేమావేశముచే, విక్షిప్తమనసః - చెల్లాచెదరైన మనస్సు గలవారు, న అశకన్ - సమర్థులు కాలేదు.

ఓ పరీక్షిన్మహారాజా! గోపికలా వేణుగానమును వర్ణించుట మొదలిడిరి. ఇంతలో వారికి శ్రీకృష్ణుని చేష్టలు గుర్తుకు వచ్చి ప్రేమావేశముచే మనస్సు చెల్లాచెదరై వర్ణించ లేకపోయిరి.

బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీం చ మాలామ్ ।

రంధ్రాన్వేణోరధరసుధయా పూరయన్ గోపబృందైః
బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీతకీర్తిః ॥ 5

బర్హా-ఆపీడమ్ - నెమలి పింఛముల శిరోభూషణమును, నటవరవపుః - గొప్ప నటుని శరీరమువంటి శరీరమును, కర్ణయోః - రెండు చెవులయందు, కర్ణికారమ్ - కొండగోగు పువ్వును, కనకకపిశమ్ - బంగారము వలె పచ్చనైన, వాసః - వస్త్రమును, వైజయంతీమ్ - ఐదు రంగుల పువ్వులతో తయారైన, మాలాం చ - మాలను కూడ, బిభ్రత్ - ధరించినవాడు, వేణోః - పిల్లన గ్రోవియొక్క, రంధ్రాన్ - చిల్లులను, అధరసుధయా - అధరామృతముతో, పూరయన్ - పూరించువాడు, గోపవృందైః - గోపాలకుల గుంపులచే, గీతకీర్తిః - పాడబడిన యశస్సు గలవాడు అగు శ్రీకృష్ణుడు, స్వపదరమణమ్ - తన కాలి గుర్తులచే రమ్యమైన, బృందారణ్యమ్ - బృందావనమును, ప్రావిశత్ - ప్రవేశించెను.

గొప్ప నటుని శరీరమువంటి శరీరము గల శ్రీకృష్ణుడు తలపై నెమలి పింఛముల ఆభరణమును, రెండు చెవులయందు కొండగోగు పువ్వులను, బంగారము వలె పచ్చనైన వస్త్రమును, ఐదు రంగుల పువ్వులతో తయారైన మాలను ధరించెను. ఆయన పిల్లన గ్రోవిని మోవిపై ఆనించి చిల్లులను పూరించుచుండెను. గోపాలకులు గుంపులుగా చేరి ఆయన కీర్తిని పాడుచుండిరి. ఆయన తన కాలి గుర్తులచే రమ్యమైన బృందావనమును ప్రవేశించెను. (ఈ విధముగా గోపికలు స్మరించిరి).

ఇతి వేణురవం రాజన్ సర్వభూతమనోహరమ్ ।
శ్రుత్వా వ్రజస్త్రియస్సర్వా వర్ణయంత్యోఽభిరేభిరే ॥ 6

రాజన్ - ఓ రాజా!, ఇతి - ఈ విధముగా, సర్వభూతమనః-హరమ్ - సకలప్రాణుల చిత్తమును దోచే, వేణురవమ్ - వేణుధ్వనిని, శ్రుత్వా - విని, సర్వాః - అందరు, వ్రజస్త్రియః - గోకులమునందలి స్త్రీలు, వర్ణయంత్యః - వర్ణించుచున్నవారై, అభిరేభిరే - ఒకరినొకరు కౌగిలించుకొనిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా సకలప్రాణుల చిత్తమును దోచివేసే వేణుధ్వనిని గోకులములోని స్త్రీలందరు వినిరి. వారు కలుసుకున్నప్పుడు దానినే వర్ణిస్తూ ఒకరినొకరు కౌగిలించుకొనిరి.

గోప్య ఊచుః ।
అక్షణ్వతాం ఫలమిదం న పరం విదామః
సఖ్యః పశూనను వివేశయతోర్వయస్యైః ।
వక్త్రం వ్రజేశసుతయోరనువేణు జుష్టం
యైర్వా నిపీతమనురక్తకటాక్షమోక్షమ్ ॥ 7

సఖ్యః - ఓ చెలులారా!, అనువేణు - వేణువుననుసరించి ఉండునది, అనురక్తకటాక్షమోక్షమ్ - ప్రేమ గలవారియందు కటాక్షముల విడుదల కలిగినది, వయస్యైః - మిత్రులతో, పశూన్ అను - గోవులననుసరించి, వివేశయతోః - ప్రవేశపెట్టుచున్న, వ్రజ-ఈశసుతయోః - గోకులపతియగు నందుని ఇద్దరు పుత్రులయొక్క, వక్త్రమ్ - ముఖము, యైః వా - ఎవరిచేనైతే, నిపీతమ్ - త్రాగబడినదో వారిచే, జుష్టమ్ - పొందబడినది, ఇదమ్ - ఇది, అక్షణ్వతామ్ - కళ్లు గలవారలకు, ఫలమ్ - ఫలము, పరమ్ - గొప్పదానిని, న విదామః - ఎరుగము.

గోపికలిట్లు పలికిరి --- ఓ చెలులారా! గోకులప్రభుడగు నందుని పుత్రులైన బలరామకృష్ణులు మిత్రులతో కలిసి పశువులను తోలుకుంటూ అడవిలో ప్రవేశించెదరు. వారిద్దరు తమను ప్రేమించే గోపాలకుల వైపు కటాక్షములను బరపుచుందురు. వారి పెదవులపై వేణువు సిద్ధముగా నుండును. అట్టి వారి ముఖమును త్రాగుచున్నారా యన్నట్లు చూసినవారు పొందే ఆనందమేది గలదో, ఇదియే కన్నులు ఉన్నందులకు ఫలము. అంతకంటె గొప్ప ఫలము మాకైతే తెలియదు.

చూతప్రవాలబర్హస్తబకోత్పలాబ్జ-
మాలాఽనుపృక్తపరిధానవిచిత్రవేషౌ ।
మధ్యే విరేజతురలం పశుపాలగోష్ఠ్యాం
రంగే యథా నటవరౌ క్వ చ గాయమానౌ ॥ 8

చూతప్రవాలబర్హస్తబక-ఉత్పల-అబ్జమాలా-అనుపృక్తపరిధానవిచిత్రవేషౌ - మామిడి చిగుళ్లు నెమలి పింఛము పూల గుత్తులు కలువలు పద్మములు పూల మాల అనువాటిచే మిళితమై యున్న వస్త్రముల రంగు రంగుల వేషములు గల బలరామకృష్ణులు, క్వ చ - ఒకప్పుడు (ఒకచోట), పశుపాలగోష్ఠ్యామ్ - గోపాలకుల సమావేశమునందు, మధ్యే - మధ్యయందు, గాయమానౌ - పాడుచున్నవారై, రంగే - నాటకరంగమునందు, నటవరౌ యథా - గొప్ప నటులు వలె.

బలరామకృష్ణుల వస్త్రధారణము మామిడి చిగుళ్లు, నెమలి పింఛము, పూల గుత్తులు (తలపై), కలువలు (చెవులలో), పద్మములు (చేతిలో), పూల మాల (మెడలో) అనువాటితో మిళితమై అనేకములగు రంగులను కలిగియుండెను. వారు ఒకప్పుడు ఒకచోట గోపాలకుల సమావేశములో వారి మధ్యలో రంగస్థలమునందలి గొప్ప నటులు వలె పాడెడివారు.

గోప్యః కిమాచరదయం కుశలం స్మ వేణుః
దామోదరాధరసుధామపి గోపికానామ్ ।
భుంక్తే స్వయం యదవశిష్టరసం హ్రదిన్యో
హృష్యత్త్వచోఽశ్రు ముముచుస్తరవో యథాఽఽర్యాః ॥ 9

గోప్యః - ఓ గోపికలారా!, అయమ్ - ఈ, వేణుః - పిల్లన గ్రోవి, కిమ్ - ఏ, కుశలమ్ - పుణ్యమును, ఆచరత్ స్మ - చేసెను?, యత్ - ఏలయన, గోపికానామ్ - గోపికలయొక్క, దామ-ఉదర-అధరసుధాం అపి - శ్రీకృష్ణుని అధరామృతమును కూడ, స్వయమ్ - తాను, అవశిష్టరసమ్ - మిగిలిన తడి కలుగునట్లుగా (మిగలని తడి కలుగునట్లుగా), భుంక్తే - అనుభవించుచున్నదో, హ్రదిన్యః - నదులు, హృష్యత్-త్వచః - గగుర్పాటు గల చర్మము గలవి, తరవః - చెట్లు, ఆర్యాః యథా - కులవృద్ధులు వలె, అశ్రు - కన్నీటిని, ముముచుః - విడిచి పెట్టినవి.

ఓ గోపికలారా! ఈ పిల్లన గ్రోవి ఏమి పుణ్యమును చేసియుండును? ఎందుకంటే, ఇది గోపికల సొత్తైన దామోదరుని (నడుముకు కట్టబడిన త్రాడు గలవాడు) అధరామృతమును తాను తడి కూడ మిగలకుండా (తడి మాత్రమే మిగిలే విధముగా) ఆస్వాదించుచున్నది. ఈ వేణువు వచ్చిన

వెదురు పొదలకు నీటిని ఇచ్చిన నదులకు ఆనందముతో శరీరముపై గగుర్పాటు (వికసించిన పద్మములు) కలుగుచున్నది. ఆ చెట్లు తమ వంశములో పుట్టిన వేణువును తలచుకొని కులవృద్ధులు వలె ఆనందాశ్రువులను విడిచి పెట్టుచున్నవి.

బృందావనం సఖి భువో వితనోతి కీర్తిం
యద్దేవకీసుతపదాంబుజలబ్ధలక్ష్మి ।
గోవిందవేణుమను మత్తమయూరనృత్యం
ప్రేక్ష్యాద్రిసాన్వపరతాన్యసమస్తసత్త్వమ్ ॥ 10

సఖి - ఓ చెలీ!, బృందావనమ్ - బృందావనము, భువః - భూలోకముయొక్క, కీర్తిమ్ - కీర్తిని, వితనోతి - విస్తరింప జేయుచున్నది, యత్ - ఏలయన, దేవకీసుతపద-అంబుజలబ్ధలక్ష్మి - దేవకీపుత్రుడగు శ్రీకృష్ణుని అడుగులయందలి పద్మపు గుర్తుల వలన పొందబడిన శోభ గలది, గోవిందవేణుం అను - గోపాలకుడగు శ్రీకృష్ణుని వేణువును విన్న పిదప, మత్తమయూరనృత్యమ్ - మదించిన నెమళ్ల నాట్యమును, ప్రేక్ష్య - చూచి, అద్రిసాను-అపరత-అన్యసమస్తసత్త్వమ్ - కొండ చరియలయందు కదలిక లేకుండా మిగిలిన సకలప్రాణులు గలది.

ఓ చెలీ! బృందావనము భూలోకముయొక్క కీర్తిని విస్తరింప జేయుచున్నది. ఎందుకంటే, ఇచటి నేల దేవకీపుత్రుడగు శ్రీకృష్ణుని అడుగులలోని పద్మపు గుర్తుల శోభలు గలది. గోవులను కాచే నల్లనయ్యయొక్క వేణుగానమును విని మదించిన నెమళ్లు నాట్యము చేయుచుండగా, మిగిలిన ప్రాణులన్నియు కొండ చరియలయందు కదలిక లేకుండా ఆ నాట్యమును చూచుచున్నవి. (గానమును వినుచున్నవి).

ధన్యాస్స్మ మూఢమతయోఽపి హరిణ్య ఏతా
యా నందనందనముపాత్తవిచిత్రవేషమ్ ।
ఆకర్ణ్య వేణురణితం సహకృష్ణసారాః
పూజాం దధుర్విరచితాం ప్రణయావలోకైః ॥ 11

ఏతాః - ఈ, హరిణ్యః - ఆడు లేళ్లు, మూఢమతయః అపి - వికాసము లేని బుద్ధి కలవియే ఐననూ, ధన్యాః స్మ - ధన్యములు గదా!, సహకృష్ణసారాః - మగ లేళ్లతో కూడిన, యాః - ఏవైతే, వేణురణితమ్ - వేణుగానమును, ఆకర్ణ్య - విని, ఉపాత్తవిచిత్రవేషమ్ - వేయబడిన రంగు రంగుల వేషము గల, నందనందనమ్ - నందుని పుత్రుడగు శ్రీకృష్ణుని ఉద్దేశించి, ప్రణయ-అవలోకైః - అనురాగపు చూపులతో, విరచితామ్ - చేయబడిన, పూజామ్ - పూజను, దధుః - నిర్వ ర్తించినవో.

ఈ ఆడు లేళ్లు వివేకము లేనివే ఐననూ, ధన్యములు గదా! ఎందుకంటే, ఇవి మగ లేళ్లతో కలిసి వేణుగానమును విని, రంగు రంగుల వేషమును దాల్చిన నందసూనుడగు శ్రీకృష్ణుని అనురాగపు చూపులతో చూస్తూ, ఆ చూపులే పుష్పములు కాగా పూజను చేసినవి.

కృష్ణం నిరీక్ష్య వనితోత్సవరూపశీలం
శ్రుత్వా చ తత్క్వణితవేణువిచిత్రగీతమ్ ।
దేవ్యో విమానగతయస్స్మరనున్నసారా
భ్రశ్యత్ప్రసూనకబరా ముముహుర్వినీవ్యః ॥ 12

విమానగతయః - విమానములపై వెళ్లుచున్న, దేవ్యః - దేవతాస్త్రీలు, వనితా-ఉత్సవరూపశీలమ్ - యువతులకు ఉత్సాహమును కలిగించే రూపము స్వభావము గల, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, నిరీక్ష్య - పరికించి చూచి, తత్-క్వణితవేణువిచిత్రగీతం చ - ఆయనచే వాయించబడిన వేణువుయొక్క వివిధస్వరములు గల గానమును కూడ, శ్రుత్వా - విని, స్మరనున్నసారాః - మన్మథునిచే పరీక్షకు పెట్టబడిన ధైర్యము గలవారు, భ్రశ్యత్-ప్రసూనకబరాః - జారిపోవుచున్న పూలు గల జుట్టు ముడులు గలవారు, వినీవ్యః - జారిపోవుచున్న కోక ముడులు గలవారు, ముముహుః - వ్యామోహమును పొందిరి.

శ్రీకృష్ణుని రూపము, స్వభావము యువతులకు ఉత్సాహమును కలిగించును. విమానములపై వెళ్లే దేవతాస్త్రీలు ఆయనను చూచి, ఆయన వాయించిన వివిధస్వరముల వేణుగానమును కూడ విని

వ్యామోహమును పొందిరి. వారి ధైర్యమునకు మన్మథుడు పరీక్ష పెట్టినట్లాయెను. వారి జుట్టు ముడుల పూలు, కోకముడులు జారెను.

గావశ్చ కృష్ణముఖనిర్గతవేణుగీత-
పీయూషముత్తభితకర్ణపుటైః పిబంత్యః ।
శావాస్స్నుతస్తనపయఃకవలాస్స్మ తస్థుః
గోవిందమాత్మని దృశాశ్రుకలాస్స్పృశంత్యః ॥ 13

గోవిందమ్ - గోపాలకుడగు శ్రీకృష్ణుని, దృశా - చూపు గుండా, ఆత్మని - మనస్సునందు, స్పృశంత్యః - ఆలింగనము చేయునవి, అశ్రుకలాః - కన్నీటి బిందువులు గలవి అగు, గావః చ - గోవులు కూడ, కృష్ణముఖనిర్గతవేణుగీతపీయూషమ్ - శ్రీకృష్ణుని నోటినుండి బయల్వెడలిన వేణుగానమనే అమృతమును, ఉత్తభితకర్ణపుటైః - రిక్కించిన దొప్పలవంటి చెవులతో, పిబంత్యః - పానము చేయునవి, శావాః - దూడలు, స్నుతస్తనపయఃకవలాః - స్రవించే పొదుగుయొక్క పాల గుక్కెడు గలవియై, తస్థుః స్మ - నిలబడినవి.

గోవులు గోపాలకుడగు శ్రీకృష్ణుని చూపు గుండా మనస్సులో ఆలింగనము చేసుకొని కళ్ల వెంబడి ఆనందబాష్పములను విడిచి పెట్టుచున్నవి. అవి శ్రీకృష్ణుని నోటినుండి వెలువడే వేణుగానమనే అమృత మును చెవుల దొప్పలను రిక్కించి పానము చేయుచున్నవి. దూడలు స్రవించే పొదుగు పాలు గుక్కెడు నోటిలోనుండ అటులనే నిలబడినవి.

ప్రాయో బతాంబ విహగా మునయో వనేఽస్మిన్
కృష్ణేక్షితం తదుదితం కలవేణుగీతమ్ ।
ఆరుహ్య యే ద్రుమభుజాన్ రుచిరప్రవాలాన్
శృణ్వంత్యమీలితదృశో విగతాన్యవాచః ॥ 14

అంబ - అమ్మా!, అస్మిన్ - ఈ, వనే - బృందావనమునందు, యే - ఏ, విహగాః - పక్షులు గలవో అవి, రుచిరప్రవాలాన్ - ప్రకాశించే చిగుళ్లు గల, ద్రుమభుజాన్ - చెట్టు కొమ్మలను, ఆరుహ్య - అధిష్ఠించి, కృష్ణ-ఈక్షితమ్ - శ్రీకృష్ణుడు కనబడునట్లుగా, అమీలితదృశః - మూయబడని కళ్లు

గలవియై, విగత-అన్యవాచః - విడిచిపెట్టబడిన ఇతరధ్వనులు గలవియై, తద్-ఉదితమ్ - ఆయనచే వెలువరించబడిన, కలవేణుగీతమ్ - అవ్యక్తమధురమగు వేణుగానమును, శృణ్వంతి - వినుచున్నవి, ప్రాయః - బహుశః, మునయః - మునులే, బత - ఆశ్చర్యము!

అమ్మా! ఈ బృందావనమునందు పక్షులు ప్రకాశించే చిగుళ్లు గల చెట్టు కొమ్మలపై శ్రీకృష్ణుడు కనబడే విధంగా కూర్చుండి కళ్లు మూయకుండా ఇతరధ్వనులను కట్టిబెట్టి, ఆ శ్రీకృష్ణుని నోటినుండి వెలువడే వేణుగానమును వినుచుండును. ఆ గానముయొక్క మాధుర్యమును మాటలలో చెప్పుట వీలు కాదు. ఆశ్చర్యము! బహుశః ఆ పక్షులు మహర్షులే అయి ఉండును.

నద్యస్తదా తదుపధార్య ముకుందగీతం
ఆవర్తలక్షితమనోభవభగ్నవేగాః ।
ఆలింగనస్థగితమూర్మిభుజైర్మురారేః
గృహ్ణంతి పాదయుగలం కమలోపహారాః ॥ 15

తదా - అప్పుడు, నద్యః - నదులు, తత్ - ఆ, ముకుందగీతమ్ - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని గానమును, ఉపధార్య - శ్రద్ధగా విని, ఆవర్తలక్షితమనః-భవభగ్నవేగాః - సుడిగుండములచే సూచించబడిన అనురాగముచే కుంటుపడిన వేగము గలవియై, మురఅరేః - మురాసురుని సంహరించిన శ్రీకృష్ణ భగవానుని, పాదయుగలమ్ - పాదముల జంటను, ఆలింగనస్థగితమ్ - ఆలింగనముచే కప్పివేయునట్లుగా, ఊర్మిభుజైః - కెరటములనే చేతులతో, కమల-ఉపహారాః - పద్మములను సమర్పించునవియై, గృహ్ణంతి - పట్టుకొనుచున్నవి.

అప్పుడు నదులు మోక్షప్రదాతయగు ఆ శ్రీకృష్ణ భగవానుని వేణుగానమును శ్రద్ధగా విన్నవి. వెంటనే అనురాగముచే వాటి వేగము కుంటు వడినదని వాటియందలి సుడిగుండములు సూచించుచున్నవి. ఆ నదులు కెరటములనే చేతులతో మురారి పాదముల జంటకు పద్మములను సమర్పించినవి. అవి ఆ కెరటములతో ఆయన పాదములను పట్టుకొని ఆలింగనముచే కప్పివేసినవి.

దృష్ట్వాఽఽతపే వ్రజపశూన్ సహ రామగోపైః
సంచారయంతమను వేణుముదీరయంతమ్ ।
ప్రేమప్రవృద్ధ ఉదితః కుసుమావలీభిః
సఖ్యుర్వ్యధాత్స్వవపుషాంబుద ఆతపత్రమ్ ॥ 16

రామగోపైః సహ - బలరామునితో గోపాలకులతో కూడి, ఆతపే - ఎండయందు, వ్రజపశూన్ - గోకులముయొక్క పశువులను, సంచారయంతమ్ - బాగుగా మేపుచున్నట్టియు, అను - వెనుక, వేణుమ్ - వేణువును, ఉదీరయంతమ్ - వాయించుచున్న శ్రీకృష్ణుని, దృష్ట్వా - చూచి, ఉద్-ఇతః - పై భాగమును చేరినది, ప్రేమప్రవృద్ధః - అనురాగముతో బాగా పెద్దది అయిన, అంబుదః - నీటినిచ్చే మేఘము, కుసుమ-ఆవలీభిః - పూల వర్షములతో, సఖ్యుః - మిత్రుడగు శ్రీకృష్ణునకు, స్వవపుషా - తన దేహముతో, ఆతపత్రమ్ - గొడుగును, వ్యధాత్ - ఏర్పాటు చేసెను.

శ్రీకృష్ణుడు బలరామునితో, గోపాలకులతో కూడి గోకులముయొక్క పశువులను బాగుగా మేపుతూ, వాటి వెనుకనుండి వేణువును ఊదుచుండెను. తన మిత్రుడైన (తనతో సవర్ణుడైన) ఆయనను చూచి నీటితో నిండిన మేఘము ప్రేమతో పెద్దదయ్యెను. అది నింగిపైకి చేరి పూలవంటి నీటి బిందువులతో ఆయనను తడిపి తన దేహముతో గొడుగు పట్టెను.

పూర్ణాః పులింద్య ఉరుగాయపదాబ్జరాగ-
శ్రీకుంకుమేన దయితాస్తనమండితేన ।
తద్దర్శనస్మరరుజస్తృణరూషితేన
లింపంత్య ఆననకుచేషు జహుస్తదాధిమ్ ॥ 17

పులింద్యః - బోయస్త్రీలు, పూర్ణాః - కృతార్థులు, దయితాస్తనమండితేన - ప్రియురాలి స్తనములయందలమబడినట్టియు, తృణరూషితేన - గడ్డి పరకలయందు లగ్నమైన, ఉరుగాయపద-అబ్జరాగశ్రీకుంకుమేన - గొప్ప కీర్తి గల శ్రీకృష్ణుని పద్మములవంటి పాదముల ఎరుపుయొక్క శోభ గల కుంకుమచే, తద్-దర్శనస్మరరుజః - దానిని చూచుటచే ప్రేమయనే వ్యాధి గలవారై,

ఆననకుచేషు - ముఖములయందు స్తనములయందు, తత్ - దానిని, లింపంత్యః - అలదుకున్నవారై, ఆధిమ్ - మనోవ్యథను, జహుః - విడిచిరి.

బోయస్త్రీలు కృతార్థలు. ఎందుకంటే, వారికి గొప్ప కీర్తి గల శ్రీకృష్ణుని పద్మముల వంటి పాదముల ఎరుపుతో కూడి శోభిల్లిన కుంకుమ ఆయన నడచినప్పుడు గడ్డికి లగ్నమై లభించినది. అది ప్రియురాలగు గోపిక వక్షఃస్థలమునకు అలంకారమై ఆయన కాలికి తగుల్కొన్న కుంకుమ. దానిని చూడగానే వారి హృదయములలో ప్రేమ అనే వ్యాధి కలిగినది. దానిని వారు తమ ముఖములకు, స్తనములకు అలదుకొని ఆ ప్రేమవ్యాధిని పోగొట్టుకొనిరి.

హంతాయమద్రిరబలా హరిదాసవర్యో
యద్రామకృష్ణచరణస్పర్శప్రమోదః ।
మానం తనోతి సహగోగణయోస్తయోర్యత్
పానీయసూయవసకందరకందమూలైః ॥ 18

హంత - ఆహా!, అబలాః - చెలియలారా!, అయమ్ - ఈ, అద్రిః - గోవర్ధన పర్వతము, హరిదాసవర్యః - శ్రీకృష్ణ భగవానుని భక్తులలో శ్రేష్ఠమైనది, యత్ - ఏలయన, రామకృష్ణచరణస్పర్శప్రమోదః - బలరామకృష్ణుల పాదముల స్పర్శచే ఆనందము గలది, యత్ - ఏలయన, సహగోగణయోః - గోవులతో గోపాలకులతో కూడియున్న, తయోః - వారిద్దరికి, పానీయసూయవసకందరకందమూలైః - నీరు మంచి గడ్డి గుహలు దుంపలు వ్రేళ్లతో, మానమ్ - పూజను, తనోతి - అధికముగా చేయుచున్నది.

చెలియలారా! చూచేరా! ఈ గోవర్ధనపర్వతము శ్రీకృష్ణ భగవానుని భక్తులలో గొప్పది. ఎందుకంటే, ఇది బలరామకృష్ణుల పాదముల స్పర్శచే ఆనందముతో పొంగిపోవుచున్నది. పైగా, వారిద్దరు గోవులతో మరియు గోపాలకులతో కలిసి వచ్చినప్పుడు, వారి విశ్రాంతికి గుహలను, అందరికీ త్రాగే నీటిని, పశువులకు పచ్చని గడ్డిని, వారికి కందమూలఫలముల భోజనమును ఇచ్చి గొప్పగా సత్కరించుచున్నది.

గా గోపకైరనువనం నయతోరుదార-
వేణుస్వనైః కలపదైస్తనుభృత్సు సఖ్యః ।
అస్పందనం గతిమతాం పులకస్తరూణాం
నిర్యోగపాశకృతలక్షణయోర్విచిత్రమ్ ॥ 19

సఖ్యః - ఓ చెలియలారా!, గోపకైః - గోపాలకులతో, గాః - గోవులను, అనువనమ్ - ప్రతి అడవియందు, నయతోః - నడిపించునట్టియు, నిర్యోగపాశకృతలక్షణయోః - ఆవుల కాళ్లను కట్టే త్రాళ్లచే చేయబడిన గుర్తు గల బలరామకృష్ణులయొక్క, కలపదైః - మధురములైన పదములు కలిగినట్టియు, ఉదారవేణుస్వనైః - ఆనందమును కలిగించే వేణుగానములచే, తనుభృత్సు - దేహధారులయందు, గతిమతామ్ - చలనము కలవాటికి, అస్పందనమ్ - చలనము లేకపోవుట, తరూణామ్ - చెట్లకు, పులకః - గగుర్పాటు, విచిత్రమ్ - విచిత్రము.

ఓ చెలియలారా! గోపాలకులతో కూడి బలరామకృష్ణులు గోవులను ప్రతి అడవియందు నడిపించెదరు. (భుజములపై) ఆవుల కాళ్లను కట్టే త్రాళ్లతో వారిని గుర్తు పట్టవచ్చును. వారు వేణువులపై మధురములైన పదములను పలికిస్తూ ఉంటే (వినేవారికి) ఆనందము కలుగును. ఆ వేణుగానము దేహధారులలో చలనము గల పశుపక్ష్యాదులకు కదలని స్థితిని, కదలని చెట్టుచేమలకు గగుర్పాటు (కదిలే ప్రాణుల ధర్మము) ను కలిగించుట విచిత్రమే.

ఏవంవిధా భగవతో యా బృందావనచారిణః ।
వర్ణయంత్యో మిథో గోప్యః క్రీడాస్తన్మయతాం యయుః ॥ 20

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ఏకవింశోఽధ్యాయః ॥

బృందావనచారిణః - బృందావనమునందు విహరించే, భగవతః - శ్రీకృష్ణ భగవానుని, ఏవంవిధాః - ఈ ప్రకారములైన, యాః - ఏ, క్రీడాః - క్రీడలు గలవో వాటిని, మిథః - ఒకరితోనొకరు, వర్ణయంత్యః - వర్ణించి

చెప్పే, గోప్యః - గోపికలు, తత్-మయతామ్ - తన్మయత్వమును, యయుః - పొందిరి.

బృందావనవిహారియగు శ్రీకృష్ణ భగవానుడు ఈ ప్రకారముగా అనేకలీలలను నెరపెను. గోపికలు వాటిని ఒకరితో నొకరు వర్ణించి చెప్పూ తన్మయత్వమును పొందిరి.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము పూర్వార్ధములో
వేణుగీతమును వర్ణించే ఇరువది ఒకటవ
అధ్యాయము ముగిసినది (21).

* * * * *

# అథ ద్వావింశోఽధ్యాయః

## గోపికా వస్త్రాపహరణము

శ్రీశుక ఉవాచ ।
హేమంతే ప్రథమే మాసి నందవ్రజకుమారికాః ।
చేరుర్హవిష్యం భుంజానాః కాత్యాయన్యర్చనవ్రతమ్ ॥ 1

హేమంతే - హేమంత-ఋతువునందు, ప్రథమే - మొదటి, మాసి - మాసమునందు, నందవ్రజకుమారికాః - నందుని గోకులమునందలి కన్యలు, హవిష్యమ్ - హవిష్యాన్నమును, భుంజానాః - తినువారై, కాత్యయనీ-అర్చనవ్రతమ్ - కాత్యాయనీదేవిని పూజించే వ్రతమును, చేరుః - అనుష్ఠించిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- హేమంత-ఋతువు మార్గశీర్షమాసమునందు నందుని గోకులమునందలి కన్యలు కాత్యాయనీ దేవిని పూజించే వ్రతమును అనుష్ఠించిరి. వారు గోధుమ నూక, బెల్లములతో చేసిన హవిస్సును మాత్రమే భుజించుచుండిరి.

ఆప్లుత్యాంభసి కాలింద్యా జలాంతే చోదితేఽరుణే ।
కృత్వా ప్రతికృతిం దేవీమానర్చుర్నృప సైకతీమ్ ॥ 2

నృప - ఓ రాజా!, అరుణే ఉదితే - అరుణోదయవేళయందు, కాలింద్యాః - యమునానదియొక్క, అంభసి - నీటియందు, ఆప్లుత్య - స్నానమాడి, జల-అంతే - నీటి ఒడ్డున, సైకతీమ్ - ఇసుక ద్రవ్యముగా గల, ప్రతికృతిమ్ - విగ్రహమును, కృత్వా - చేసి, దేవీమ్ - కాత్యాయనీ దేవిని, ఆనర్చుః - పూజించిరి.

ఓ పరీక్షిన్మహారాజా! తెల్లవారుతుండగా వారు యమునానదీజలములలో స్నానము చేసి నీటి ఒడ్డున ఇసుక మట్టితో కాత్యాయనీ దేవియొక్క విగ్రహమును చేసి పూజించిరి.

గంధైర్మాల్యైస్సురభిభిర్బలిభిర్ధూపదీపకైః ।
ఉచ్చావచైశ్చోపహారైః ప్రవాలఫలతండులైః ॥ 3

గంధైః - గంధములతో, సురభిభిః - పరిమళభరితములైన, మాల్యైః - పూలమాలలతో, బలిభిః - సమర్పణలతో, ధూపదీపకైః - ధూపదీపములతో, ఉచ్చావచైః - గొప్పవి మామూలువి అగు, ఉపహారైః చ - నైవేద్యములతో కూడ, ప్రవాలఫలతండులైః - చిగుళ్లు పళ్లు బియ్యములతో.

వారు గంధములను, పరిమళభరితములైన పూలమాలలను, కొబ్బరి కాయ మొదలగువాటిని సమర్పించి ధూపదీపములతో పూజించిరి. చిగుళ్లతో, అక్షతలతో పూజించి గొప్పవి, మామూలువి అగు పదార్థములను, పళ్లను నైవేద్యము పెట్టిరి.

కాత్యాయని మహామాయే మహాయోగిన్యధీశ్వరి ।
నందగోపసుతం దేవి పతిం మే కురు తే నమః ।
ఇతి మంత్రం జపంత్యస్తాః పూజాం చక్రుః కుమారికాః ॥ 4

కాత్యాయని - కల్యాణనిధానమా!, మహామాయే - ఓ మహా మాయా!, మహాయోగిని - ఓ గొప్ప యోగినీ!, అధీశ్వరి - ఓ సర్వేశ్వరీ!, దేవి - ఓ దేవీ!, నందగోపసుతమ్ - నందగోపుని పుత్రుని, మే - నాకు, పతిమ్ - భర్తనుగా, కురు - చేయుము, తే - నీ కొరకు, నమః - నమస్కారము, ఇతి - అని, మంత్రమ్ - మంత్రమును, జపంత్యః - జపించు వారై, తాః - ఆ, కుమారికాః - కన్యలు, పూజామ్ - పూజను, చక్రుః - చేసిరి.

ఓ దేవీ! నీవు కల్యాణములకు నిధానమవు, మహామాయవు, గొప్ప యోగినివి, సర్వేశ్వరివి. నాకు నందగోపుని పుత్రుడగు శ్రీకృష్ణుని భర్తనుగా చేయుము, నీకు నమస్కారము, అనే మంత్రమును జపిస్తూ ఆ కన్యలు పూజను చేసిరి.

ఏవం మాసం వ్రతం చేరుః కుమార్యః కృష్ణచేతసః ।
భద్రకాలీం సమానర్చుర్భూయాన్నందసుతః పతిః ॥ 5

కృష్ణచేతసః - శ్రీకృష్ణునియందు మనస్సు గల, కుమార్యః - కన్యలు, ఏవమ్ - ఈ విధముగా, మాసమ్ - నెల నిరంతరముగా, వ్రతమ్ - వ్రతమును, చేరుః - అనుష్ఠించిరి, భద్రకాలీమ్ - భద్రకాళిని, సమానర్చుః - యథావిధిగా పూజించిరి, నందసుతః - నందుని పుత్రుడు, పతిః - భర్త, భూయాత్ - అగుగాక!

శ్రీకృష్ణునియందు మనస్సు గల కన్యలీ విధముగా నెల రోజులు నిరంతరముగా వ్రతమునునుష్ఠించిరి. తమకు నందుని పుత్రుడగు శ్రీకృష్ణుడు భర్త కావాలని వారు కల్యాణములనిచ్చే పార్వతీదేవిని యథావిధిగా ఆరాధించిరి.

ఉషస్యుత్థాయ గోత్రైః స్వైరన్యోన్యాబద్ధబాహవః ।
కృష్ణముచ్చైర్జగుర్యాంత్యః కాలింద్యాం స్నాతుమన్వహమ్ ॥ 6

అన్వహమ్ - ప్రతి దినము, ఉషసి - తెల్లవారు జామున, ఉత్థాయ - నిద్ర లేచి, స్వైః - తమ, గోత్రైః - పేర్లతో, అన్యోన్య-ఆబద్ధబాహవః - ఒకరినొకరు పట్టుకొనబడిన చేతులు గలవారై, కాలింద్యామ్ - యమునానదియందు, స్నాతుమ్ - స్నానము చేయుటకు, యాంత్యః - వెళ్లువారై, కృష్ణమ్ - శ్రీకృష్ణుని గురించి, ఉచ్చైః - బిగ్గరగా, జగుః - గానము చేసిరి.

వారు ప్రతి రోజు తెల్లవారు జామున నిద్ర లేచి తమ తమ పేర్లతో పిలుచుకుంటూ ఒకరి చేతులు మరియొకరు పట్టుకొని యమునానదికి స్నానము చేయుటకు వెళ్లెడివారు. అపుడు వారు శ్రీకృష్ణుని కీర్తిని బిగ్గరగా గానము చేసెడివారు.

నద్యాం కదాచిదాగత్య తీరే నిక్షిప్య పూర్వవత్ ।
వాసాంసి కృష్ణం గాయంత్యో విజహ్రుస్సలిలే ముదా ॥ 7

కదాచిత్ - ఒకనాడు, ఆగత్య - వచ్చి, నద్యామ్ - నది వద్ద, తీరే - గట్టుపై, పూర్వవత్ - ఇదివరలో వలెనే, వాసాంసి - వస్త్రములను, నిక్షిప్య

- ఉంచి, ముదా - ఆనందముతో, కృష్ణమ్ - శ్రీకృష్ణుని గురించి, గాయంత్యః - గానము చేయువారై, సలిలే - నీటియందు, విజహ్రుః - విహరించిరి.

ఒకనాడు వారు నది వద్దకు వచ్చి మామూలుగానే గట్టుపై బట్టలను పెట్టి, శ్రీకృష్ణుని కీర్తిని ఆనందముగా గానం చేస్తూ, నీటిలో విహరించిరి.

భగవాంస్తదభిప్రేత్య కృష్ణో యోగేశ్వరేశ్వరః ।
వయస్యైరావృతస్తత్ర గతస్తత్కర్మసిద్ధయే ॥ 8

యోగ-ఈశ్వర-ఈశ్వరః - యోగులకు యోగేశ్వరులకు కూడ ప్రభుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తత్ - ఆ వ్రతమును గురించి, అభిప్రేత్య - తెలుసుకొని, తత్-కర్మసిద్ధయే - వారి వ్రతము సిద్ధించుట కొరకై, వయస్యైః - మిత్రులతో, ఆవృతః - చుట్టువారబడినవాడై, తత్ర - అచటకు, గతః - వెళ్లినవాడు.

యోగులకు, యోగేశ్వరులకు కూడ ప్రభుడగు శ్రీకృష్ణ భగవానునకు వారి వ్రతమును గురించి తెలిసెను. వారి వ్రతమును సిద్ధింప జేయుటకై ఆయన, మిత్రులు చుట్టువారి రాగా, అచటకు వెళ్లెను.

తాసాం వాసాంస్యుపాదాయ నీపమారుహ్య సత్వరః ।
హసద్భిః ప్రహసన్ బాలైః పరిహాసమువాచ హ ॥ 9

సత్వరః - వేగము గల శ్రీకృష్ణుడు, తాసామ్ - వారి, వాసాంసి - వస్త్రములను, ఉపాదాయ - తీసుకొని, నీపమ్ - కడిమిచెట్టును, ఆరుహ్య - ఎక్కి, హసద్భిః - నవ్వుతున్న, బాలైః - పిల్లలతో, ప్రహసన్ - గట్టిగా నవ్వుచున్నవాడై, పరిహాసమ్ - వేళాకోళపు మాటను, ఉవాచ హ - పలికెను.

శ్రీకృష్ణుడు విసురుగా వారి వస్త్రములను తీసుకొని కడిమి చెట్టుపైకి ఎక్కెను. నవ్వుచున్న బాలకులతో బాటుగా ఆయన కూడ గట్టిగా నవ్వుతూ ఆ కన్యలను పరిహాసము చేస్తూ ఇట్లు పలికెను.

అత్రాగత్యాబలాః కామం స్వం స్వం వాసః ప్రగృహ్యతామ్ ।
సత్యం బ్రవాణి నో నర్మ యద్యూయం వ్రతకర్శితాః ॥ 10

అబలాః - అమ్మాయిలూ!, అత్ర - ఇచటకు, ఆగత్య - వచ్చి, కామమ్ - యథేచ్ఛగా, స్వం స్వమ్ - మీ మీ, వాసః - వస్త్రము, ప్రగృహ్యతామ్ - తీసుకొనబడుగాక!, సత్యమ్ - సత్యమును, బ్రవాణి - చెప్పెదను, నర్మ - వేళాకోళము, నో - కాదు, యత్ - ఏలయన, యూయమ్ - మీరు, వ్రతకర్శితాః - వ్రతముచే చిక్కియున్నవారు.

ఓ అమ్మాయిలూ! మీరీ చెట్టు క్రిందకు వచ్చి మీ మీ వస్త్రములను యథేచ్ఛగా తీసుకొనుడు. నేను సత్యమును చెప్పుచున్నాను. వేళాకోళము కాదు. ఎందుకంటే, మీరు వ్రతము కారణముగా కృశించినారు.

న మయోదితపూర్వం వా అనృతం తదిమే విదుః ।
ఏకైకశః ప్రతీచ్ఛధ్వం సహైవోత సుమధ్యమాః ॥ 11

మయా - నాచే, అనృతమ్ - అసత్యము, ఉదితపూర్వమ్ - ఇదివరలో చెప్పబడినది, న - కాదు, వై - నిశ్చయము, తత్ - దానిని, ఇమే - వీరు, విదుః - ఎరుగుదురు, సుమధ్యమాః - ఓ సుందరులారా!, ఏక-ఏకశః - ఒక్కొక్కరుగా, ఉత - లేక, సహ ఏవ - కలిసియే, ప్రతీచ్ఛధ్వమ్ - తీసుకొనుడు.

ఓ సుందరులారా! నేనిదివరలో అసత్యమును చెప్పలేదు. ఇది నిశ్చయము. ఈ విషయమీ గోపబాలకులకు తెలియును. మీరు ఒక్కొక్క రుగా గాని, లేదా అందరు కలిపి గాని (వస్త్రములను) తీసుకొనుడు.

తస్య తత్ క్ష్వేలితం దృష్ట్వా గోప్యః ప్రేమపరిప్లుతాః ।
వ్రీడితాః ప్రేక్ష్య చాన్యోన్యం జాతహాసా న నిర్యయుః ॥ 12

ప్రేమపరిప్లుతాః - ప్రేమచే ముంచెత్తబడిన, గోప్యః - గోపికలు, తస్య - ఆ శ్రీకృష్ణుని, తత్ - ఆ, క్ష్వేలితమ్ - పరిహాసమును, దృష్ట్వా - చూచి, వ్రీడితాః - సిగ్గు పడ్డవారు, జాతహాసాః - పుట్టిన నవ్వు గలవారు, అన్యోన్యం చ - ఒకరినొకరు, ప్రేక్ష్య - చూచి, న నిర్యయుః - బయటకు రాలేదు.

ప్రేమచే ముంచెత్తబడిన మనస్సులు గల ఆ గోపికలు ఆ శ్రీకృష్ణుని ఆ పరిహాసమును చూచి సిగ్గు పడిరి. వారు ఒకరినొకరు చూచుకుంటూ నవ్వుకొనిరే గాని, నీటినుండి బయటకు రాలేదు.

ఏవం బ్రువతి గోవిందే నర్మణాఽఽక్షిప్తచేతసః ।
ఆకంఠమగ్నాశ్శీతోదే వేపమానాస్తమబ్రువన్ ॥ 13

గోవిందే - గోపాలకుడగు శ్రీకృష్ణుడు, ఏవమ్ - ఈ విధముగా, బ్రువతి - పలుకుచుండగా, నర్మణా - పరిహాసవాక్యముచే, ఆక్షిప్తచేతసః - ఆకర్షించబడిన మనస్సులు గల గోపికలు, శీత-ఉదే - చల్లని నీటియందు, ఆకంఠమగ్నాః - కంఠము వరకు మునిగినవారై, వేపమానాః - వణుకుచున్నవారై, తమ్ - ఆయనను ఉద్దేశించి, అబ్రువన్ - పలికిరి.

గోపాలకుడగు శ్రీకృష్ణుడిట్లు పలుకగా, ఆ పరిహాసవాక్యములచే గోపికల చిత్తములాకర్షించబడెను. వారు చల్లని నీటిలో కంఠము వరకు మునిగి వణికిపోతూ ఆయనతోనిట్లనిరి.

మాఽనయం భోః కృథాస్త్వాం తు నందగోపసుతం ప్రియమ్ ।
జానీమోఽంగ వ్రజశ్లాఘ్యం దేహి వాసాంసి వేపితాః ॥ 14

భోః - ఓయీ!, అనయమ్ - అన్యాయ్యమును, మా కృథాః - చేయకుము, త్వాం తు - నిన్నైతే, ప్రియమ్ - ప్రియుడైనట్టియు, వ్రజశ్లాఘ్యమ్ - గోకులముచే కొనియాడదగినట్టియు, నందగోపసుతమ్ - నందగోపుని పుత్రుడగు శ్రీకృష్ణునిగా, జానీమః - ఎరుగుదుము, అంగ - ఓయీ!, వాసాంసి - వస్త్రములను, దేహి - ఇమ్ము, వేపితాః - వణికించబడువారలము.

ఓయీ! అన్యాయ్యమును చేయవద్దు. నీవైతే నందగోపుని ప్రియపుత్రుడవగు శ్రీకృష్ణుడవనియు, గోకులమునకు కొనియాడ దగినవాడవనియు మేము యెరుగుదుము. ఓయీ! వస్త్రములనిమ్ము. చలి మమ్ము వణికించుచున్నది.

శ్యామసుందర తే దాస్యః కరవామ తవోదితమ్ ।
దేహి వాసాంసి ధర్మజ్ఞ నో చేద్రాజ్ఞే బ్రువామహే ॥ 15

శ్యామసుందర - నల్లనివాడా! సుందరా!, తే - నీకు, దాస్యః - దాసీలము, తవ - నీ, ఉదితమ్ - చెప్పినదానిని, కరవామ - చేసెదము, ధర్మజ్ఞ - ధర్మమునెరిగినవాడా!, వాసాంసి - బట్టలను, దేహి - ఇమ్ము, నో చేత్ - లేనిచో, రాజ్ఞే - రాజు కొరకు, బ్రువామహే - చెప్పెదము.

ఓ నల్లనివాడా! నీవు ధర్మములు తెలిసిన అందగాడవు. నీకు మేము దాసీలము. నీవు చెప్పినట్లు మేము చేసెదము. వస్త్రములనిమ్ము. లేనిచో, నందమహారాజునకు చెప్పెదము.

శ్రీభగవానువాచ ।
భవత్యో యది మే దాస్యో మయోక్తం వా కరిష్యథ ।
అత్రాగత్య స్వవాసాంసి ప్రతీచ్ఛంతు శుచిస్మితాః ॥ 16

శుచిస్మితాః - ఓ స్వచ్ఛమగు చిరునగవు గల సుందరులారా!, భవత్యః - పూజనీయులగు మీరు, మే - నాకు, దాస్యః యది - దాసీలు ఐనచో, మయా - నాచే, ఉక్తమ్ - చెప్పబడినదానిని, కరిష్యథ వా - చేయబోయేటట్లైతే, అత్ర - ఇచటకు, ఆగత్య - వచ్చి, స్వవాసాంసి - మీ వస్త్రములను, ప్రతీచ్ఛంతు - స్వీకరించెదరు గాక!

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- ఓ సుందరులారా! మీ చిరునవ్వు స్వచ్ఛముగా నున్నది. పూజించదగిన మీరు నాకు దాసీలైనచో, నా మాటను చేయబోయే పక్షములో, ఇచటకు వచ్చి మీ వస్త్రములను స్వీకరించెదరు గాక!

తతో జలాశయాత్సర్వా దారికాశ్శీతవేపితాః ।
పాణిభ్యాం యోనిమాచ్ఛాద్య ప్రోత్తేరుశ్శీతకర్శితాః ॥ 17

శీతవేపితాః - చలిచే వణికించబడినవారు, శీతకర్శితాః - చలిచే కృశింపజేయబడినవారు అగు, దారికాః - కన్యలు, సర్వాః - అందరు, పాణిభ్యామ్ - రెండు చేతులతో, యోనిమ్ - జననేంద్రియమును, ఆచ్ఛాద్య - కప్పుకొని, తతః - ఆ, జల-ఆశయాత్ - నదినుండి, ప్రోత్తేరుః - బయటకు వచ్చిరి.

ఆ కన్యలు బయట చలికి వణుకుతూ లోపల చలిచే కృశించి యుండిరి. వారందరు రెండు చేతులతో జననేంద్రియమును కప్పుకొని నదినుండి బయటకు వచ్చిరి.

భగవానాహతా వీక్ష్య శుద్ధభావప్రసాదితః ।
స్కంధే నిధాయ వాసాంసి ప్రీతః ప్రోవాచ సస్మితమ్ ।। 18

శుద్ధభావప్రసాదితః - పవిత్రమగు అంతఃకరణములచే ప్రసన్నుడిగా చేయబడినవాడు, ప్రీతః - ప్రీతిని పొందినవాడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఆహతాః - చలిచే పీడించబడిన (దగ్గరకు వచ్చిన) వారిని, వీక్ష్య - చూచి, వాసాంసి - వస్త్రములను, స్కంధే - భుజముపై, నిధాయ - పెట్టుకొని, సస్మితమ్ - చిరునవ్వుతో కూడుకున్నట్లుగా, ప్రోవాచ - పలికెను.

వారి పవిత్రమగు అంతఃకరణములచే శ్రీకృష్ణ భగవానుడు ప్రసన్నుడై ప్రీతిని పొందెను. చలిచే పీడించబడుతూ దగ్గరకు వచ్చిన వారిని చూచి ఆయన వస్త్రములను భుజముపై పెట్టుకొని చిరునవ్వుతో నిట్లనెను.

యూయం వివస్త్రా యదపో ధృతవ్రతా
వ్యగాహతైతత్తదు దేవహేలనమ్ ।
బద్ధ్వాఽంజలిం మూర్ధ్న్యపనుత్తయేఽంహసః
కృత్వా నమోఽధో వసనం ప్రగృహ్యతామ్ ।। 19

ధృతవ్రతాః - దాల్చబడిన వ్రతము గల, యూయమ్ - మీరు, వివస్త్రాః - వస్త్రము లేనివారై, అపః - జలములను, వ్యగాహత యత్ - పూర్తిగా మునిగిరనేది యేది గలదో, తత్ - ఆ, ఏతత్ - ఇది, దేవహేలనం ఉ - దేవతకు అపరాధమే, అంహసః - పాపముయక్క, అపనుత్తయే - పోగొట్టుటకై, మూర్ధ్ని - తలపై, అంజలిమ్ - దోసిలిని, బద్ధ్వా - కట్టి, అధః - క్రింద, నమః - నమస్కారమును, కృత్వా - చేసి, వసనమ్ - వస్త్రము, ప్రగృహ్యతామ్ - తీసుకొనబడుగాక!

మీరు వ్రతనియమములో ఉన్నారు. అయినా వస్త్రములు లేకుండా నీటిలో స్నానమును చేసితిరి. ఆ ఈ చర్య ఖచ్చితముగా జలాధిష్ఠానదేవత

యెడల అపరాధము. ఆ దోషమును పోగొట్టుటకై మీరు తలపై దోసిలి ఘటించి వంగి నమస్కరించి, వస్త్రమును తీసుకొనుడు.

ఇత్యచ్యుతేనాభిహితం వ్రజాబలా
మత్వా వివస్త్రాప్లవనం వ్రతచ్యుతిమ్ ।
తత్పూర్తికామాస్తదశేషకర్మణాం
సాక్షాత్కృతం నేమురవద్యమృగ్యతః ॥ 20

ఇతి - అని, అచ్యుతేన - శ్రీకృష్ణ భగవానునిచే, అభిహితమ్ - చెప్పబడిన, వివస్త్ర-ఆప్లవనమ్ - నగ్నముగా స్నానము చేయుటను, వ్రతచ్యుతిమ్ - వ్రతభంగమునుగా, మత్వా - తలచి, తత్-పూర్తికామాః - ఆ వ్రతముయొక్క పూర్తిని కోరే, వ్రజ-అబలాః - గోపికలు, తద్-అశేషకర్మణామ్ - ఆ వ్రతమునకు సకలకర్మలకు, సాక్షాత్-కృతమ్ - ఫలరూపుడు (సాక్షి) అగు శ్రీకృష్ణుని, నేముః - నమస్కరించిరి, యతః - ఏలయన, అవద్యమృక్ - పాపములను తుడిచివేయుట.

శ్రీకృష్ణ భగవానుడు ఇట్లు చెప్పగా ఆ గోపికలు నగ్నముగా స్నానము చేయుట వ్రతమునకు భంగమని తెలుసుకొనిరి. ఆ వ్రతము పూర్తి కావాలనే కోరిక వారికి కలదు. వారు ఆ వ్రతమునకు మరియు సకలకర్మలకు ఫలరూపుడైన కర్మసాక్షి శ్రీకృష్ణునికే నమస్కరించిరి. ఎందుకంటే, అట్టి నమస్కారము సకలదోషములను తుడిచిపెట్టును.

తాస్తథావనతా దృష్ట్వా భగవాన్ దేవకీసుతః ।
వాసాంసి తాభ్యః ప్రాయచ్ఛత్కరుణస్తేన తోషితః ॥ 21

తథా - ఆ విధముగా, అవనతాః - నమస్కరించుచున్న, తాః - ఆ గోపికలను, దృష్ట్వా - చూచి, తేన - దానిచే, తోషితః - సంతోషింపజేయబడినవాడు, కరుణః - దయాళువు, దేవకీసుతః - దేవకి పుత్రుడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తాభ్యః - వారి కొరకు, వాసాంసి - వస్త్రములను, ప్రాయచ్ఛత్ - ఇచ్చెను.

ఆ విధముగా వారు చేసిన నమస్కారమును చూచి దేవకీపుత్రుడగు శ్రీకృష్ణుడు సంతోషించెను. దయాళువగు ఆయన వారికి వస్త్రములను యిచ్చెను.

దృఢం ప్రలబ్ధాస్త్రపయా చ హాపితాః
ప్రస్తోభితాః క్రీడనవచ్చ కారితాః ।
వస్త్రాణి చైవాపహృతాన్యథాప్యముం
తా నాభ్యసూయన్ప్రియసంగనిర్వృతాః ॥ 22

దృఢమ్ - గట్టిగా, ప్రలబ్ధాః - తప్పు పట్ట (కపటము చేయ) బడినవారు, త్రపయా - సిగ్గుచే, హాపితాః చ - విడిచిపెట్టునట్లు కూడ చేయబడినవారు, ప్రస్తోభితాః - పరిహాసము చేయబడినవారు, క్రీడనవత్ చ - ఆటబొమ్మల వలె కూడ, కారితాః - చేయబడినవారు, వస్త్రాణి చ - వస్త్రములు కూడ, అపహృతాని ఏవ - అపహరించబడినవియే, అథ అపి - అయినప్పటికీ, ప్రియసంగనిర్వృతాః - ప్రియుని కలయికచే ఆనందించిన, తాః - ఆ గోపికలు, అముమ్ - ఈ శ్రీకృష్ణుని, న అభ్యసూయన్ - తప్పు పట్టలేదు.

శ్రీకృష్ణుడు ఆ గోపికలను గట్టిగా తప్పు పట్టి కపటము చేసి వారు సిగ్గు విడుచునట్లు చేసెను. వారిని పరిహసించి ఆటబొమ్మలవలె చేసి వస్త్రములను కూడ తీసుకుపోయెను. అయిననూ, వారు తమ ప్రియుని కలయికచే ఆనందించిరే గాని, ఈ శ్రీకృష్ణునిపై తప్పు మోపలేదు.

పరిధాయ స్వవాసాంసి ప్రేష్ఠసంగమసజ్జితాః ।
గృహీతచిత్తా నో చేలుస్తస్మింల్లజ్జాయితేక్షణాః ॥ 23

ప్రేష్ఠసంగమసజ్జితాః - ప్రియతముడగు శ్రీకృష్ణుని కలయికచే పరవశులైనవారు, గృహీతచిత్తాః - దోచబడిన చిత్తములు గలవారు, తస్మిన్ - ఆ శ్రీకృష్ణునియందు, లజ్జాయిత-ఈక్షణాః - సిగ్గుతో విలాస గల చూపులు గలవారు అగు గోపికలు, స్వవాసాంసి - తమ వస్త్రములను, పరిధాయ - కట్టుకొని, నో చేలుః - కదలకుండిరి.

శ్రీకృష్ణునిచే దోచబడిన చిత్తములు గల ఆ గోపికలు తమ ప్రియతముని కలుసుకొనుటచే పరవశులై, వస్త్రములను ధరించిన పిదప

కూడ (అక్కడనుండి) వెళ్లకుండిరి. వారు సిగ్గుతో విలాసగా ఆయననే చూచుచుండిరి.

తాసాం విజ్ఞాయ భగవాన్ స్వపాదస్పర్శకామ్యయా ।
ధృతవ్రతానాం సంకల్పమాహ దామోదరోఽబలాః ॥ 24

దామోదరః భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ధృతవ్రతానామ్ - పట్టబడిన వ్రతము గల, తాసామ్ - ఆ గోపికలయొక్క, స్వపాదస్పర్శకామ్యయా - తన పాదములను స్పృశించాలనే కోరికచే, సంకల్పమ్ - సంకల్పమును, విజ్ఞాయ - గమనించి, అబలాః - ఆ యువతులనుద్దేశించి, ఆహ - పలికెను.

వ్రతమును పట్టిన ఆ గోపికల సంకల్పములో తన పాదములను స్పృశించాలనే కోరిక గలదని భగవాన్ దామోదరుడు (నడుమునకు త్రాడు కట్టబడినవాడు) గమనించెను. ఆయన ఆ యువతులతోనిట్లనెను.

సంకల్పో విదితస్సాధ్వ్యో భవతీనాం మదర్చనమ్ ।
మయాఽనుమోదితస్సోఽసౌ సత్యో భవితుమర్హతి ॥ 25

సాధ్వ్యః - ఓ పుణ్యవతులారా!, భవతీనామ్ - పూజనీయులగు మీయొక్క, సంకల్పః - సంకల్పము, మద్-అర్చనమ్ - నన్ను పూజించుట, విదితః - తెలియబడినది, మయా - నాచే, అనుమోదితః - ఆమోదించబడినది, సః - అట్టి, అసౌ - ఈ సంకల్పము, సత్యః - సత్యము, భవితుమ్ - అగుటకు, అర్హతి - తగుచున్నది.

ఓ పుణ్యవతులారా! పూజనీయులగు మీరు నన్ను పూజించాలనే సంకల్పముతోనున్నారని నాకు తెలియును. మీ సంకల్పము నాకు ఆమోదమే. మీ ఈ సంకల్పము సత్యము అగుటకు తగియున్నది.

న మయ్యావేశితధియాం కామః కామాయ కల్పతే ।
భర్జితా క్వథితా ధానా ప్రాయో బీజాయ నేష్యతే ॥ 26

మయి - నాయందు, ఆవేశితధియామ్ - ప్రవేశపెట్టబడిన బుద్ధి గలవారలకు, కామః - కామన, కామాయ - కామన కొరకు, న కల్పతే -

సమర్థమగుట లేదు, భర్జితా - కాల్చబడిన, క్వథితా - ఉడికించబడిన, ధానా - గింజ, ప్రాయః - మరల, బీజాయ - మొలకెత్తుటకు, న ఇష్యతే - అంగీకరించబడదు.

నాయందు లగ్నమైన బుద్ధి గల సాధకుల కామన సంసారభోగముల వైపు తీసుకువెళ్లదు. కాల్చిన మరియు ఉడికించిన గింజ మొలకెత్తుటకు సమర్థము కాదు.

యాతాబలా వ్రజం సిద్ధా మయేమా రంస్యథ క్షపాః ।
యదుద్దిశ్య వ్రతమిదం చేరురార్యాఽర్చనం సతీః ।। 27

అబలాః - ఓ యువతులారా!, వ్రజమ్ - గోకులమును గురించి, యాత - వెళ్లుడు, సతీః - పుణ్యవతులగు మీరు, సిద్ధాః - సిద్ధి బడసినవారు, ఇమాః - ఈ, క్షపాః - రాత్రులను, మయా - నాతో, రంస్యథ - రమించగలరు, యత్ - దేనినైతే, ఉద్దిశ్య - సంకల్పించి, ఇదమ్ - ఈ, ఆర్యా-అర్చనమ్ - ఆర్యాదేవియొక్క పూజ అనే, వ్రతమ్ - వ్రతమును, చేరుః - అనుష్ఠించిరో.

ఓ యువతులారా! మీరు గోకులమునకు వెళ్లుడు. పుణ్యవతులగు మీరు సిద్ధిని పొందితిరి. మీరు ఈ (రాబోయే) రాత్రులు నాతో రమించగలరు. ఆ సంకల్పముతోనే మీరు పార్వతీదేవిని పూజించే వ్రతమును చేసితిరి గదా!

శ్రీశుక ఉవాచ ।
ఇత్యాదిష్టా భగవతా లబ్ధకామాః కుమారికాః ।
ధ్యాయంతస్తత్పదాంభోజం కృచ్ఛ్రాన్నిర్వివిశుర్వ్రజమ్ ।। 28

లబ్ధకామాః - పొందబడిన మనోరథము గల, కుమారికాః - కన్యలు, భగవతా - శ్రీకృష్ణ భగవానునిచే, ఇతి - ఈ విధముగా, ఆదిష్టాః - ఆదేశించబడినవారై, తత్-పద-అంభః-జమ్ - ఆయనయొక్క పద్మములవంటి పాదములను, ధ్యాయంతః - ధ్యానించుచున్నవారై, కృచ్ఛ్రాత్ - కష్టముగా, వ్రజమ్ - గోకులమును, నిర్వివిశుః - ప్రవేశించిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆ కన్యల మనోరథము సిద్ధించెను. శ్రీకృష్ణ భగవానుడిట్లు ఆదేశించగా, వారు కష్టము మీద (ఆయనను

విడిచి) పద్మములవంటి ఆయన పాదములనే ధ్యానిస్తూ గోకులమును చేరిరి.

అథ గోపైః పరివృతో భగవాన్ దేవకీసుతః ।
బృందావనాద్గతో దూరం చారయన్ గాస్సహాగ్రజః ॥ 29

అథ - తరువాత, దేవకీసుతః - దేవకి పుత్రుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, గోపైః - గోపాలకులతో, పరివృతః - చుట్టువారబడినవాడై, సహ-అగ్రజః - అన్నగారితో కూడినవాడై, గాః - గోవులను, చారయన్ - మేపుచున్నవాడై, బృందావనాత్ - బృందావనమునుండి, దూరమ్ - దూరముగా, గతః - వెళ్లినవాడు.

తరువాత దేవకి పుత్రుడగు శ్రీకృష్ణ భగవానుడు అన్నగారితో కలిసి గోవులను మేపుతూ బృందావనమునుండి దూరముగా వెళ్లెను. గోప బాలకులు ఆయనను చుట్టువారి యుండిరి.

నిదాఘార్కాతపే తిగ్మే ఛాయాభిస్స్వాభిరాత్మనః ।
ఆతపత్రాయితాన్ వీక్ష్య ద్రుమానాహ వ్రజౌకసః ॥ 30

తిగ్మే - మిక్కిలి వేడియైన, నిదాఘ-అర్క-ఆతపే - ఉక్కను కలిగించే సూర్యుని ఎండయందు, స్వాభిః - తమ, ఛాయాభిః - నీడలతో, ఆత్మనః - తనకు, ఆతపత్రాయితాన్ - గొడుగు వలె వ్యవహరించే, ద్రుమాన్ - చెట్లను, వీక్ష్య - చూచి, వ్రజ-ఓకసః - గోకులవాసులగు గోపాలకులనుద్దేశించి, ఆహ - పలికెను.

సూర్యుని వేడి తీక్ష్ణముగా నుండి చెమట పట్టుచుండెను. చెట్లు తమ నీడలతో శ్రీకృష్ణునకు గొడుగు వలె పని చేయుచుండెను. వాటిని చూచి ఆయన గోకులవాసులగు గోపాలకులతో నిట్లనెను.

హే స్తోకకృష్ణ హే అంశో శ్రీదామన్ సుబలార్జున ।
విశాలర్షభ తేజస్విన్ దేవప్రస్థ వరూథప ॥ 31

హే స్తోకకృష్ణ - ఓ స్తోకకృష్ణా!, హే అంశో - ఓ అంశూ!, శ్రీదామన్ - ఓ శ్రీదామా!, సుబల - ఓ సుబలా!, అర్జున - ఓ అర్జునా!, విశాల - ఓ

విశాలా!, ఋషభ - ఓ ఋషభా!, తేజస్విన్ - ఓ తేజస్వీ!, దేవప్రస్థ - ఓ దేవప్రస్థా!, వరూథప - ఓ వరూథపా!

ఓ స్తోకకృష్ణా!, ఓ అంశూ!, ఓ శ్రీదామా!, ఓ సుబలా!, ఓ అర్జునా!, ఓ విశాలా!, ఓ ఋషభా!, ఓ తేజస్వీ!, ఓ దేవప్రస్థా! ఓ వరూథపా!

పశ్యతైతాన్మహాభాగాన్ పరార్థైకాంతజీవితాన్ ।
వాతవర్షాతపహిమాన్ సహంతో వారయంతి నః ॥ 32

మహాభాగాన్ - గొప్ప భాగ్యము కలిగినట్టియు, పర-అర్థ-ఏక-అంతజీవితాన్ - పరోపకారమే ఏకైకప్రయోజనముగా గల జీవితము కలిగిన, ఏతాన్ - ఈ చెట్లను, పశ్యత - చూడుడు, వాతవర్ష-ఆతపహిమాన్ - గాలి వాన ఎండ మంచులను, సహంతః - సహించునవియై, నః - మనకు, వారయంతి - తప్పించుచున్నవి.

గొప్ప భాగ్యము గల ఈ చెట్లను చూడుడు. ఇతరప్రాణుల ప్రయోజనమే వీటి జీవితమునకు ఏకైకలక్ష్యము. ఇవి గాలి, వాన, ఎండ, మంచులను తాము సహిస్తూ మనలను వాటినుండి తప్పించుచున్నవి.

అహో ఏషాం వరం జన్మ సర్వప్రాణ్యుపజీవనమ్ ।
సుజనస్యేవ యేషాం వై విముఖా యాంతి నార్థినః ॥ 33

అహో - ఆహా!, ఏషామ్ - వీటియొక్క, సర్వప్రాణి-ఉపజీవనమ్ - సకలప్రాణులకు బ్రదుకుదెరువునిచ్చే, జన్మ - పుట్టుక, వరమ్ - శ్రేష్ఠము, సుజనస్య ఇవ - సజ్జనునకు వలె, యేషామ్ - ఎవరికైతే, అర్థినః వై - యాచకులైతే, విముఖాః - ముఖము త్రిప్పుకున్నవారై, న యాంతి - వెళ్లిపోరో.

ఆహా! సకలప్రాణులకు బ్రదుకు దెరువునిచ్చే వీటి జన్మ గొప్పది. ఇవి సత్పురుషుని వంటివి. పళ్లు మొదలగువాటిని కోరి వీటి వద్దకు వచ్చిన జనులు ముఖము త్రిప్పుకొని వెళ్లే పని ఉండదు. (కోరిక తప్పక తీరును).

పత్రపుష్పఫలచ్ఛాయామూలవల్కలదారుభిః ।
గంధనిర్యాసభస్మాస్థితోకైర్మైః కామాన్ వితన్వతే ॥ 34

పత్రపుష్పఫలచ్ఛాయామూలవల్కలదారుభిః - ఆకులు పువ్వులు పళ్లు నీడ వ్రేళ్లు బెరడు కట్టెలతో, గంధనిర్యాసభస్మ-అస్థితోక్మైః - సుగంధము జిగురు భస్మ బొగ్గులు చిగుళ్లతో, కామాన్ - మనోరథములను, వితన్వతే - పూర్తి చేయును.

చెట్లు మానవులకు ఆకులు, పువ్వులు, పళ్లు, వ్రేళ్లు, బెరడు, కట్టెలు, జిగురు, భస్మ, బొగ్గులు, చిగుళ్లు అనే ఉపయోగకరమైన వస్తువులను ఇచ్చును. మరియు, అవి మానవులకు నీడను, సుగంధమును ఇచ్చి వారి అవసరములను తీర్చును.

ఏతావజ్జన్మసాఫల్యం దేహినామిహ దేహిషు ।
ప్రాణైరర్థైర్ధియా వాచా శ్రేయ ఏవాచరేత్సదా ॥ 35

దేహినామ్ - దేహధారులకు, ఇహ - ఈ లోకమునందు, జన్మసాఫల్యమ్ - జన్మ సఫలమగుట, ఏతావత్ - ఇంతమాత్రమే, దేహిషు - ప్రాణులయందు, ప్రాణైః - ప్రాణములతో, అర్థైః - సంపదలతో, ధియా - బుద్ధితో, వాచా - వాక్కుతో, సదా - ఎల్లవేళలా, శ్రేయః ఏవ - హితమును మాత్రమే, ఆచరేత్ - చేయవలెను.

ప్రాణములను, సంపదలను, బుద్ధిని, వాక్కును వినియోగించి ఎల్లవేళలా ప్రాణులకు హితమును మాత్రమే చేయవలెను. ఇదియే దేహధారులకు ఈ లోకములో జన్మించినందులకు సఫలత.

ఇతి ప్రవాలస్తబకఫలపుష్పదలోత్కరైః ।
తరూణాం నమ్రశాఖానాం మధ్యేన యమునాం గతః ॥ 36

ఇతి - అని, ప్రవాలస్తబకఫలపుష్పదల-ఉత్కరైః - చిగుళ్లు గుత్తులు పళ్లు పువ్వులు ఆకుల సమూహములచే, నమ్రశాఖానామ్ - వంగిన కొమ్మలు గల, తరూణామ్ - చెట్ల, మధ్యేన - మధ్య గుండా, యమునామ్ - యమునానదిని గురించి, గతః - వెళ్లినవాడు.

ఇట్లు పలికి శ్రీకృష్ణుడు చెట్ల మధ్యగుండా యమునానదికి వెళ్లెను. చిగుళ్లు, గుత్తులు, పళ్లు, పువ్వులు, ఆకుల సముదాయములతో ఆ చెట్ల కొమ్మలు వంగి యుండెను.

తత్ర గాః పాయయిత్వాఽపస్సుమృష్టాశ్శీతలాశ్శివాః ।
తతో నృప స్వయం గోపాః కామం స్వాదు పపుర్జలమ్ ॥ 37

నృప - ఓ రాజా!, తత్ర - ఆ నదియందు, గాః - గోవులను, సుమృష్టాః - స్వచ్ఛమైన, శీతలాః - చల్లని, శివాః - ఆరోగ్యమునిచ్చే, అపః - నీళ్లను, పాయయిత్వా - త్రాగించి, తతః - తరువాత, గోపాః - గోపాలకులు, స్వయమ్ - తాము, కామమ్ - కడుపు నిండా, స్వాదు - తియ్యని, జలమ్ - నీటిని, పపుః - త్రాగిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ నదియందు వారు గోవులచే నీళ్లను త్రాగించిరి. ఆ నీళ్లు స్వచ్ఛముగా, చల్లగా, ఆరోగ్యకరముగా నుండెను. తరువాత ఆ గోపాలకులు తాము కూడ తియ్యని ఆ నీటిని కడుపు నిండా త్రాగిరి.

తస్యా ఉపవనే కామం చారయంతః పశూన్నృప ।
కృష్ణరామావుపాగమ్య క్షుధార్తా ఇదమబ్రువన్ ॥ 38

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ద్వావింశోఽధ్యాయః ॥

నృప - ఓ రాజా!, తస్యాః - ఆ యమునానదియొక్క, ఉపవనే - ఉద్యానవనమునందు, పశూన్ - పశువులను, కామమ్ - యథేచ్ఛగా, చారయంతః - మేపుచున్న గోపాలకులు, క్షుధార్తాః - ఆకలిచే పీడితులై, కృష్ణరామౌ - శ్రీకృష్ణ బలరాములను, ఉపాగమ్య - సమీపించి, ఇదమ్ - ఈ మాటను, అబ్రువన్ - పలికిరి.

ఓ పరీక్షిన్మహారాజా! గోపాలకులు ఆ యమునానదిని ఆనుకుని ఉన్న ఉద్యానమునందు పశువులను యథేచ్ఛగా మేపుచుండిరి. వారికి ఆకలిచే పీడ కలిగి బలరామ కృష్ణుల వద్దకు వచ్చి ఇట్లు పలికిరి.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్ధములో గోపికా వస్త్రాపహరణమును వర్ణించే ఇరువది రెండవ
అధ్యాయము ముగిసినది (22).



# అథ త్రయోవింశోఽధ్యాయః

## యజ్ఞపత్నుల ఉద్ధారము

గోపా ఊచుః ।
రామ రామ మహావీర్య కృష్ణ దుష్టనిబర్హణ ।
ఏషా వై బాధతే క్షున్నస్తచ్ఛాంతిం కర్తుమర్హథః ॥ 1

రామ - ఓ బలరామా!, రామ - బలరామా!, మహావీర్య - గొప్ప బలము గలవాడా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, దుష్టనిబర్హణ - దుష్టులను మట్టుబెట్టువాడా!, ఏషా - ఈ, క్షుత్ - ఆకలి, నః - మమ్ములను, వై - నిశ్చయముగా, బాధతే - పీడించుచున్నది, తత్-శాంతిమ్ - దానికి శాంతిని, కర్తుమ్ - చేయుటకు, అర్హథః - మీరిద్దరు తగుదురు.

గోపాలకులిట్లు పలికిరి --- ఓ బలరామా! రామా! నీ పరాక్రమము గొప్పది. ఓ శ్రీకృష్ణా! నీవు దుష్టులను మట్టుబెట్టెదవు. ఈ ఆకలి మమ్ములను నిశ్చితముగా పీడించుచున్నది. మీరిద్దరు దీనికి ఉపశాంతిని కలిగించినచో బాగుండును.

శ్రీశుక ఉవాచ ।
ఇతి విజ్ఞాపితో గోపైర్భగవాన్ దేవకీసుతః ।
భక్తాయా విప్రభార్యాయాః ప్రసీదన్నిదమబ్రవీత్ ॥ 2

గోపైః - గోపాలకులచే, ఇతి - ఈ విధముగా, విజ్ఞాపితః - విన్నవించుకొనబడిన, దేవకీసుతః - దేవకి పుత్రుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, భక్తాయాః - భక్తురాలగు, విప్రభార్యాయాః - బ్రాహ్మణపత్నికి, ప్రసీదన్ - ప్రసన్నుడై, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గోప బాలకులు దేవకి పుత్రుడగు శ్రీకృష్ణ భగవానునకు ఇట్లు విన్నవించిరి. భక్తురాండ్రగు బ్రాహ్మణపత్నుల యెడల ఆయన ప్రసన్నుడై యుండెను. ఆయన ఇట్లు పలికెను.

ప్రయాత దేవయజనం బ్రాహ్మణా బ్రహ్మవాదినః ।
సత్రమాంగిరసం నామ హ్యాసతే స్వర్గకామ్యయా ॥ 3

దేవయజనమ్ - యజ్ఞవాటికను గురించి, ప్రయాత - వెళ్లుడు, హి - ఏలయన, బ్రహ్మవాదినః - వేదవేత్తలగు, బ్రాహ్మణాః - బ్రాహ్మణులు, స్వర్గకామ్యయా - స్వర్గమునందలి కామనతో, ఆంగిరసం నామ - ఆంగిరసమని ప్రసిద్ధి గాంచిన, సత్రమ్ - సత్రయాగమును, ఆసతే - చేయుచున్నారు.

మీరు యజ్ఞవాటికకు వెళ్లుడు. ఎందుకంటే, అచట వేదవేత్తలగు బ్రాహ్మణులు స్వర్గమును పొందాలనే కోరికతో బృహస్పతిసవమనే యాగమును చేయుచున్నారు.

తత్ర గత్వౌదనం గోపా యాచతాస్మద్విసర్జితాః ।
కీర్తయంతో భగవత ఆర్యస్య మమ చాభిధామ్ ॥ 4

గోపాః - ఓ గోపాలకులారా!, అస్మద్-విసర్జితాః - మా యిద్దరిచే పంపబడిన మీరు, తత్ర - అచటకు, గత్వా - వెళ్లి, ఆర్యస్య - అన్నగారైనట్టియు, భగవతః పూజనీయుడైన బలరాముని, చ - మరియు, మమ - నా, అభిధామ్ - పేరును, కీర్తయంతః - చెప్పువారై, ఓదనమ్ - ఆహారమును, యాచత - కోరుడు.

ఓ గోపాలకులారా! మా ఇద్దరిచే పంపబడే మీరు అచటకు వెళ్లుడు. అన్నగారు, పూజనీయుడు అగు బలరాముని పేరు చెప్పుడు. నా పేరును కూడ చెప్పి ఆహారమును కోరుడు.

ఇత్యాదిష్టా భగవతా గత్వాఽయాచంత తే తథా ।
కృతాంజలిపుటా విప్రాన్ దండవత్పతితా భువి ॥ 5

ఇతి - అని, భగవతా - శ్రీకృష్ణ భగవానునిచే, ఆదిష్టాః - ఆదేశించబడిన, తే - ఆ గోపాలకులు, గత్వా - వెళ్లి, కృత-అంజలిపుటాః - దోసిలి యొగ్గినవారై, దండవత్ - కట్టెవలె, భువి - నేలపై, పతితాః - పడిన వారై, విప్రాన్ - వేదవేత్తలను, తథా - ఆ విధముగా, అయాచంత - కోరిరి.

శ్రీకృష్ణ భగవానుడిట్లు ఆదేశించగా ఆ గోప బాలకులు వెళ్లి, వేద వేత్తలకు దోసిలి యొగ్గి సాష్టాంగప్రణామము చేసి అదే విధముగా కోరిరి.

హే భూమిదేవాశ్శృణుత కృష్ణస్యాదేశకారిణః ।
ప్రాప్తాఞ్జానీత భద్రం వో గోపాన్నో రామచోదితాన్ ॥ 6

హే భూమిదేవాః - ఓ బ్రాహ్మణోత్తములారా!, శృణుత - వినుడు, కృష్ణస్య - శ్రీకృష్ణుని, ఆదేశకారిణః - ఆజ్ఞను పాలించువారము, రామచోదితాన్ - బలరామునిచే ప్రేరితులమైనట్టియు, ప్రాప్తాన్ - వచ్చియున్న, గోపాన్ - గోపాలకులనుగా, నః - మమ్ములను, జానీత - తెలియుడు, వః - మీకు, భద్రమ్ - మంగళము.

ఓ బ్రాహ్మణోత్తములారా! వినుడు. మేము శ్రీకృష్ణుని ఆజ్ఞను పాలించే గోపాలకులము. బలరాముడు పంపగా మేము వచ్చినామని తెలియుడు. మీకు మంగళమగు గాక!

గాశ్చారయంతావవిదూర ఓదనం రామాచ్యుతౌ వో లషతో బుభుక్షితౌ,
తయోర్ద్విజా ఓదనమర్థినోర్యది శ్రద్ధా చ వో యచ్ఛత ధర్మవిత్తమాః।7

ద్విజాః - ఓ బ్రాహ్మణులారా!, అవిదూరే - మరీ దూరము కానిచోట, రామ-అచ్యుతౌ - బలరాముడు శ్రీకృష్ణ భగవానుడు, గాః - గోవులను, చారయంతౌ - మేపుచున్నవారు, బుభుక్షితౌ - ఆకలి గొన్నవారు, వః - మీ, ఓదనమ్ - అన్నమును, లషతః - కోరువారు, ధర్మవిత్తమాః - ధర్మము తెలిసినవారిలో శ్రేష్ఠులైనవారా!, వః - మీకు, శ్రద్ధా యది చ - శ్రద్ధ ఉన్నట్లైతే, అర్థినోః - కోరే, తయోః - వారిద్దరికి, ఓదనమ్ - అన్నమును, యచ్ఛత - ఇండు.

ఓ బ్రాహ్మణులారా! ఇక్కడకు దగ్గరలోనే బలరాముడు, శ్రీకృష్ణ భగవానుడు గోవులను మేపుతూ ఉన్నారు. వారు ఆకలిగా ఉన్నారు. వారు

మీరిచ్చిన ఆహారమును భుజించ గోరుచున్నారు. మీరు ధర్మము తెలిసిన వారిలో గొప్పవారు. మీకు శ్రద్ధ ఉన్నట్లైతే, వారిద్దరికి ఆహారమునిండు.

దీక్షాయాః పశుసంస్థాయాస్సౌత్రామణ్యాశ్చ సత్తమాః ।
అన్యత్ర దీక్షితస్యాపి నాన్నమశ్నన్ హి దుష్యతి ॥ 8

సత్తమాః - ఓ మహాపుణ్యాత్ములారా!, పశుసంస్థాయాః - పశువినియోగము ఉండే, దీక్షాయాః - దీక్షకంటె, సౌత్రామణ్యాః చ - సౌత్రామణి కంటె కూడ, అన్యత్ర - మిగిలిన యజ్ఞమునందు, దీక్షితస్య - దీక్షయందున్నవాని, అన్నం అపి - ఆహారమును కూడ, అశ్నన్ - తినువాడై, న దుష్యతి - దోషమును పొందడు, హి - నిశ్చయము.

ఓ గొప్ప పుణ్యాత్ములారా! పశువినియోగము ఉండే దీక్షను, సౌత్రామణిని విడిచిపెట్టి మిగిలిన యజ్ఞములయందు దీక్ష తీసుకున్నవాని ఆహారమును తిన్ననూ నిశ్చయముగా దోషము లేదు.

ఇతి తే భగవద్యాచ్ఞాం శృణ్వంతోఽపి న శుశ్రువుః ।
క్షుద్రాశా భూరికర్మాణో బాలిశా వృద్ధమానినః ॥ 9

ఇతి - అనే, భగవద్-యాచ్ఞామ్ - భగవానుని కోరికను, శృణ్వంతః అపి - వినువారే అయిననూ, తే - వారు, న శుశ్రువుః - వినలేదు, క్షుద్ర-ఆశాః - అల్పములయందు కోరిక గలవారు, భూరికర్మాణః - విస్తారమగు కర్మలు గలవారు, బాలిశాః - మూర్ఖులు, వృద్ధమానినః - మేము గొప్పవారమనే గర్వము గలవారు.

ఈ విధముగా భగవానుని కోరికను వారు విని కూడ పట్టించుకోలేదు. వారి కోరికలు స్వర్గము మొదలగు అల్పవిషయములకు చెందినవి. వారి కర్మలు చాల క్లేశముతో కూడినవి. వారు తత్త్వము తెలిసినవారు కారు. కాని, తాము జ్ఞానవృద్ధులమనే గర్వము వారికి గలదు.

దేశః కాలః పృథగ్ ద్రవ్యం మంత్రతంత్రర్త్విజోఽగ్నయః ।
దేవతా యజమానశ్చ క్రతుర్ధర్మశ్చ యన్మయః ॥ 10

దేశః - దేశము, కాలః - కాలము, పృథక్ - వేర్వేరు, ద్రవ్యమ్ - పదార్థము, మంత్రతంత్ర-ఋత్విజః - మంత్రములు కర్మను చేసే పద్ధతి ఋత్విక్కులు, అగ్నయః - అగ్నులు, దేవతాః - దేవతలు, యజమానః చ - యజ్ఞమును చేయువాడు కూడ, క్రతుః - క్రతువు, ధర్మః చ - పుణ్యము కూడ, యత్-మయః - ఏభగవానుని రూపమో.

యజ్ఞమును చేసే దేశకాలములు, దానిలోని వేర్వేరు ద్రవ్యములు, మంత్రములు, కర్మను చేసే పద్ధతి, ఋత్విక్కులు, గార్హపత్యము మొదలైన అగ్నులు, అగ్ని మొదలగు దేవతలు, యజ్ఞమును చేయువాడు, యజ్ఞము, దాని వలన కలిగే పుణ్యము అనేవి ఆ భగవానుని రూపములే.

తం బ్రహ్మ పరమం సాక్షాద్భగవంతమధోక్షజమ్ ।
మనుష్యదృష్ట్యా దుష్ప్రజ్ఞా మర్త్యాత్మానో న మేనిరే ॥ 11

దుష్ప్రజ్ఞాః - దుష్టమగు బుద్ధి గలవారు, మర్త్య-ఆత్మానః - మరణించే దేహమునందు ఆత్మబుద్ధి గలవారు అగు ఆ బ్రాహ్మణులు, సాక్షాత్ - సాక్షాత్తుగా, పరమం బ్రహ్మ - పరబ్రహ్మ ఐనట్టియు, అధోక్షజమ్ - ఇంద్రియగోచరుడు కాని, తమ్ - ఆ, భగవంతమ్ - శ్రీకృష్ణ భగవానుని, మనుష్యదృష్ట్యా - మానవుడనే భావనతో, న మేనిరే - ఆదరించలేదు.

శ్రీకృష్ణ భగవానుడు సాక్షాత్తుగా ఇంద్రియగోచరము కాని పరబ్రహ్మయే. ఆ బ్రాహ్మణులు మరణించే దేహమే ఆత్మ అనే దుష్టమగు బుద్ధి గలవారు. కావుననే, మానవుడని తలచి వారాయనను ఆదరించలేదు.

న తే యదోమితి ప్రోచుర్న నేతి చ పరంతప ।
గోపా నిరాశాః ప్రత్యేత్య తథోచుః కృష్ణరామయోః ॥ 12

పరంతప - శత్రువులను తపింపజేయువాడా!, యదా - ఎప్పుడైతే, తే - వారు, ఓమ్ - సరే, ఇతి - అని, న ప్రోచుః - చెప్పలేదో, న - కాదు, ఇతి చ - అని కూడ, న - చెప్పలేదో అప్పుడు, నిరాశాః - నిరాశ పడిన, గోపాః - గోప బాలుకులు, ప్రతి-ఏత్య - తిరిగి వచ్చి, కృష్ణరామయోః - శ్రీకృష్ణ బలరాములకు, తథా - ఆ విధముగా, ఊచుః - చెప్పిరి.

అంతశ్శత్రువులను నశింపజేసిన ఓ పరీక్షిన్మహారాజా! ఆ బ్రాహ్మణులు అవునని చెప్పలేదు, కాదని చెప్పలేదు. అప్పుడా గోపాలకులు నిరాశ జెంది తిరిగి వచ్చి ఆ విషయమును బలరామకృష్ణులకు చెప్పిరి.

తదుపాకర్ణ్య భగవాన్ ప్రహస్య జగదీశ్వరః ।
వ్యాజహార పునర్గోపాన్ దర్శయంల్లౌకికీం గతిమ్ ॥ 13

జగద్-ఈశ్వరః - జగన్నాథుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తత్ - ఆ మాటను, ఉపాకర్ణ్య - విని, ప్రహస్య - గట్టిగా నవ్వి, లౌకికీమ్ - లోకమునకు సంబంధించిన, గతిమ్ - వ్యవహారమును, దర్శయన్ - ప్రదర్శించువాడై, పునః - మరల, గోపాన్ - గోపాలకులనుద్దేశించి, వ్యాజహార - పలికెను.

జగన్నాథుడగు శ్రీకృష్ణ భగవానుడు ఆ మాటను విని బిగ్గరగా నవ్వెను. అన్నము కావాలంటే అడగాల్సింది గృహిణిని, అనే లోకవ్యవహారశైలిని ప్రదర్శించువాడై ఆయన మరల గోపాలకులతో నిట్లనెను.

మాం జ్ఞాపయత పత్నీభ్యస్ససంకర్షణమాగతమ్ ।
దాస్యంతి కామమన్నం వస్స్నిగ్ధా మయ్యుషితా ధియా ॥ 14

ససంకర్షణమ్ - బలరామునితో గూడి యున్నట్టియు, ఆగతమ్ - వచ్చి యున్న, మామ్ - నన్ను గురించి, పత్నీభ్యః - వేదవేత్తల భార్యల కొరకు, జ్ఞాపయత - తెలుపుడు, స్నిగ్ధాః - ప్రేమ గలవారు, ధియా - మనస్సుచే, మయి - నాయందు, ఉషితాః - లగ్నమైనవారు, వః - మీకు, కామమ్ - కావలసినంత, అన్నమ్ - ఆహారమును, దాస్యంతి - ఈయగలరు.

బలరామునితో గూడి నేను వచ్చియున్నానని ఆ బ్రాహ్మణుల భార్యలకు తెలుపుడు. వారు సహజప్రేమ గలవారు, మనస్సులో నన్నే భావన చేయువారు. వారు మీకు కావలసినంత ఆహారమునీయగలరు.

గత్వాఽథ పత్నీశాలాయాం దృష్ట్వాఽఽసీనాస్స్వలంకృతాః ।
నత్వా ద్విజసతీర్గోపాః ప్రశ్రితా ఇదమబ్రువన్ ॥ 15

అథ - అప్పుడు, గోపాః - గోపాలకులు, గత్వా - వెళ్లి, పత్నీశాలాయామ్ - బ్రాహ్మణపత్నుల శాలయందు, ఆసీనాః - కూర్చున్నట్టియు, సు-అలంకృతాః - చక్కగా అలంకరించుకున్న, ద్విజసతీః - బ్రాహ్మణుల పత్నులను, దృష్ట్వా - చూచి, ప్రశ్రితాః - వినయము గలవారై, ఇదమ్ - ఈ మాటను, అబ్రువన్ - పలికిరి.

అప్పుడు గోపాలకులు వెళ్లి బ్రాహ్మణపత్నుల శాలయందు కూర్చున్న బ్రాహ్మణపత్నులను చూచిరి. వారు చక్కగా అలంకరించుకొని యుండిరి. ఆ బాలకులు వారికి నమస్కరించి వినయముగా నిట్లనిరి.

నమో వో విప్రపత్నీభ్యో నిబోధత వచాంసి నః ।
ఇతోఽవిదూరే చరతా కృష్ణేనేహేషితా వయమ్ ॥ 16

విప్రపత్నీభ్యః - బ్రాహ్మణుల పత్నులగు, వః - మీ కొరకు, నమః - నమస్కారము, నః - మా, వచాంసి - మాటలను, నిబోధత - తెలియుడు, ఇతః - ఇక్కడనుండి, అవిదూరే - దగ్గరలో, చరతా - సంచరించుచున్న, కృష్ణేన - శ్రీకృష్ణునిచే, వయమ్ - మేము, ఇహ - ఇక్కడకు, ఈషితాః - పంపబడితిమి.

ఓ బ్రాహ్మణపత్నులారా! మీకు నమస్కారము. మా మాటలను దయతో వినుడు. ఇక్కడకు దగ్గరలోనే శ్రీకృష్ణుడు వచ్చియున్నాడు. ఆయన మమ్ములను ఇక్కడకు పంపినాడు.

గాశ్చారయన్ స గోపాలైస్సరామో దూరమాగతః ।
బుభుక్షితస్య తస్యాన్నం సానుగస్య ప్రదీయతామ్ ॥ 17

సరామః - బలరామునితో కూడియున్న, సః - ఆ శ్రీకృష్ణుడు, గోపాలైః - గోపాలకులతో, గాః - గోవులను, చారయన్ - మేపుచున్నవాడై, దూరమ్ - దూరము, ఆగతః - వచ్చినవాడు, బుభుక్షితస్య - ఆకలి గొన్నట్టియు, స-అనుగస్య - అనుచరులతో కూడియున్న, తస్య - ఆయనకు, అన్నమ్ - ఆహారము, ప్రదీయతామ్ - ఈయబడుగాక!

శ్రీకృష్ణుడు బలరామునితో, గోపాలకులతో కలిసి గోవులను మేపుకుంటూ చాల దూరము వచ్చినాడు. ఆయనకు, ఆయన అనుచరులకు ఆకలి వేయుచున్నది. దయచేసి వారికి ఆహారమునిండు.

శ్రుత్వాఽచ్యుతముపాయాతం నిత్యం తద్దర్శనోత్సుకాః ।
తత్కథాఽఽక్షిప్తమనసో బభూవుర్జాతసంభ్రమాః ॥ 18

నిత్యమ్ - ఎల్లవేళలా, తద్-దర్శన-ఉత్సుకాః - ఆయనను చూచుట యందు ఉత్కంఠ గలవారు, తత్-కథా-ఆక్షిప్తమనసః - ఆయన గాథలచే (వృత్తాంతముచే) ఆకర్షించబడిన మనస్సు గల బ్రాహ్మణపత్నులు, ఉప-ఆయాతమ్ - దగ్గరకు వచ్చియున్న, అచ్యుతమ్ - శ్రీకృష్ణ భగవానుని గురించి, శ్రుత్వా - విని, జాతసంభ్రమాః - కలిగిన కంగారు గలవారు, బభూవుః - ఐరి.

ఆ బ్రాహ్మణపత్నులకు శ్రీకృష్ణ భగవానుని చూడాలనే ఉత్కంఠ ఎల్లవేళలా ఉండెను. ఆయన గాథలచే వారి మనస్సులు ఆకర్షితములయ్యెను. ఆయన దగ్గరకు వచ్చియున్నాడని, ఆకలితోనున్నాడని విని వారు చాల కంగారు పడిరి.

చతుర్విధం బహుగుణమన్నమాదాయ భాజనైః ।
అభిసస్రుః ప్రియం సర్వాస్సముద్రమివ నిమ్నగాః ॥ 19

సర్వాః - వారందరు, చతుర్-విధమ్ - నాలుగు రకముల, బహుగుణమ్ - అనేకగుణములు గల, అన్నమ్ - ఆహారమును, భాజనైః - పాత్రలతో, ఆదాయ - తీసుకొని, ప్రియమ్ - ఇష్టుడగు శ్రీకృష్ణుని గురించి, నిమ్నగాః - నదులు, సముద్రం ఇవ - సముద్రమును గురించి వలె, అభిసస్రుః - అభిముఖముగా వెళ్లిరి.

ఆ బ్రాహ్మణపత్నులందరు భక్ష్య (నమిలి తినేది)-భోజ్య (త్రాగెది)-లేహ్య (ఆస్వాదించేది)-చోష్య (చప్పరించేది) ములనే నాలుగు రకముల ఆహారమును పాత్రలతో తీసుకొని తమకు ఇష్టుడగు శ్రీకృష్ణుడు ఉన్న వైపుకు, నదులు సముద్రము వైపుకు వలె, వెళ్లిరి. ఆ ఆహారమునకు రుచి, పుష్టి మొదలగు గుణములనేకము గలవు.

నిషిధ్యమానాః పతిభిర్భ్రాతృభిర్బంధుభిస్సుతైః ।
భగవత్యుత్తమశ్లోకే దీర్ఘశ్రుతధృతాశయాః ।। 20

పతిభిః - భర్తలచే, భ్రాతృభిః - సోదరులచే, బంధుభిః - బంధువులచే, సుతైః - పుత్రులచే, నిషిధ్యమానాః - అడ్డుకొనబడినవారు, ఉత్తమశ్లోకే - ఉత్తమమగు కీర్తి గల, భగవతి - శ్రీకృష్ణ భగవానునియందు, దీర్ఘశ్రుతధృత-ఆశయాః - చాల కాలమునుండి వినుట వలన లగ్నమైన మనస్సు గలవారు.

భర్తలు, సోదరులు, బంధువులు, పుత్రులు అడ్డుకున్ననూ వారు వెళ్లిరి. వారు ఉత్తమమగు కీర్తి గల శ్రీకృష్ణ భగవానుని గురించి చాల కాలము నుండి వినుచుండిరి. వారి మనస్సు ఆయనయందు లగ్నమయ్యెను.

యమునోపవనేऽశోకనవపల్లవమండితే ।
విచరంతం వృతం గోపైస్సాగ్రజం దదృశుః స్త్రియః ।। 21

అశోకనవపల్లవమండితే - అశోకవృక్షముల కొత్త చిగుళ్లచే అలంకరించబడిన, యమునా-ఉపవనే - యమునానది ఒడ్డునందలి ఉద్యానమునందు, విచరంతమ్ - విహరించుచున్నట్టియు, గోపైః - గోపాలకులతో, వృతమ్ - చుట్టువారబడినట్టియు, స-అగ్రజమ్ - అన్నగారితో కూడియున్న శ్రీకృష్ణుని, స్త్రియః - బ్రాహ్మణపత్నులు, దదృశుః - చూచిరి.

యమునానది ఒడ్డున అశోకవృక్షముల కొత్త చిగుళ్లతో అందముగానున్న ఉద్యానము గలదు. అచట అన్నగారితో, గోపాలకులతో కలిసి విహరిస్తున్న శ్రీకృష్ణుని బ్రాహ్మణపత్నులు చూచిరి.

శ్యామం హిరణ్యపరిధిం వనమాల్యబర్హ-
ధాతుప్రవాలనటవేషమనుప్రతాంసే ।
విన్యస్తహస్తమితరేణ ధునానమబ్జం
కర్ణోత్పలాలకకపోలముఖాబ్జహాసమ్ ।। 22

శ్యామమ్ - నల్లనైనట్టియు, హిరణ్యపరిధిమ్ - బంగరు వన్నెగల వస్త్రము కలిగినట్టియు, వనమాల్యబర్హధాతుప్రవాలనటవేషమ్ - అడవి

పూల మాల నెమలి పింఛము రాతి రంగులు చిగుళ్లతో నటుని వలె వేషము కలిగినట్టియు, అనువ్రత-అంసే - అనుచరుని భుజముపై, విన్యస్తహస్తమ్ - ఉంచబడిన చేయి కలిగినట్టియు, ఇతరేణ - ఇంకో చేతితో, అబ్జమ్ - పద్మమును, ధునానమ్ - త్రిప్పుచున్నట్టియు, కర్ణ-ఉత్పల-అలకకపోలముఖ-అబ్జహాసమ్ - చెవులలో కలువలు ముంగురులు చెక్కిళ్లయందు పద్మమువంటి ముఖమునందు చిరునవ్వు కలిగిన (శ్రీకృష్ణుని చూచిరి).

బంగరు వన్నె గల వస్త్రమును దాల్చిన ఆ నల్లనయ్య మెడలో అడవి పూల మాలను, తలపై నెమలి పింఛమును చిగుళ్లను, దేహముపై రాతి రంగులను అలంకరించుకొని నటుని వలె నుండెను. ఆయన ఒక చేతిని ప్రక్కనున్న అనుచరుని భుజముపై వేసి, రెండవ చేతితో పద్మమును త్రిప్పుచుండెను. ఆయన చెవులలో కలువలు, చెక్కిళ్లపై ముంగురులు, పద్మమువంటి ముఖమునందు చిరునవ్వు ఉండెను.

ప్రాయశ్శ్రుతప్రియతమోదయకర్ణపూరైః
యస్మిన్నిమగ్నమనసస్తమథాక్షిరంధ్రైః ।
అంతః ప్రవేశ్య సుచిరం పరిరభ్య తాపం
ప్రాజ్ఞం యథాఽభిమతయో విజహుర్నరేంద్ర ॥ 23

నర-ఇంద్ర - ఓ నరపతీ!, ప్రాయః - బహుశః, శ్రుతప్రియతమ-ఉదయకర్ణపూరైః - వినబడిన ప్రియతముడగు శ్రీకృష్ణుని గొప్పదనములనే చెవుల ఆభరణములచే, యస్మిన్ - ఏ శ్రీకృష్ణునియందు, నిమగ్నమనసః - లగ్నమైన మనస్సులు గల ఆ బ్రాహ్మణపత్నులు, అథ - అప్పుడు, అక్షిరంధ్రైః - కళ్లు అనే రంధ్రముల గుండా, తమ్ - ఆయనను, అంతః - లోపల, ప్రవేశ్య - ప్రవేశపెట్టి, అభిమతయః - నేను అనే అభిమానములు, ప్రాజ్ఞం యథా - చిద్ఘనమగు ఆత్మను వలె, సుచిరమ్ - చాలసేపు, పరిరభ్య - కౌగిలించుకొని, తాపమ్ - తాపమును, విజహుః - విడిచిపెట్టిరో.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ బ్రాహ్మణపత్నులకు శ్రీకృష్ణునిపై ప్రీతి మెండు. వారు ఆయన గొప్పదనములను పలుమార్లు వినుటయే కర్ణాభరణములుగా

కలిగియుండిరి. అట్లు విని వారి మనస్సు ఆయనయందు లగ్నమైనది. అప్పుడు వారాయనను కళ్లు అనే ద్వారముల గుండా లోపల (అంతఃకరణమునందు) ప్రవేశపెట్టి, మనస్సులోనే చాల సేపు కౌగిలించుకొనిరి. నిద్రావస్థలో జనుల అహంకారములు ఒకే చిద్ఘన-ఆత్మయందు విలీనమై సేద దీరునట్లుగా, అప్పుడు వారు తాపమును విడిచి పెట్టిరి.

తాస్తథా త్యక్తసర్వాశాః ప్రాప్తా ఆత్మదిదృక్షయా ।
విజ్ఞాయాఖిలదృగ్ద్రష్టా ప్రాహ ప్రహసితాననః ॥ 24

త్యక్తసర్వ-ఆశాః - విడిచిపెట్టబడిన సకలకామనలు కలిగినట్టియు, ఆత్మదిదృక్షయా - తనను చూచే కోరికతో, తథా - ఆ విధముగా, ప్రాప్తాః - వచ్చిన, తాః - వారిని, విజ్ఞాయ - తెలుసుకొని, అఖిలదృగ్-ద్రష్టా - సకలబుద్ధిసాక్షియగు శ్రీకృష్ణుడు, ప్రహసిత-ఆననః - చిరునవ్వు మోము గలవాడై, ప్రాహ - పలికెను.

శ్రీకృష్ణుడు సకలప్రాణులలో సకలబుద్ధివృత్తిసాక్షియగు ఆత్మయై ఉన్నాడు. వారు సకలకామనలను విడిచిపెట్టి తనను చూడ కోరికతో వచ్చినారని ఆయనకు తెలియును. ఆయన చిరునవ్వు మోముతోనిట్లనెను.

స్వాగతం వో మహాభాగా ఆస్యతాం కరవామ కిమ్ ।
యన్నో దిదృక్షయా ప్రాప్తా ఉపపన్నమిదం హి వః ॥ 25

మహాభాగాః - ఓ గొప్ప పుణ్యవతులారా!, వః - మీకు, స్వాగతమ్ - స్వాగతము, ఆస్యతామ్ - కూర్చుండుడు, కిమ్ - దేనిని, కరవామ - మేము చేయవలెను?, హి - ఏలయన, నః - మమ్ములను, దిదృక్షయా - చూచే కోరికతో, ప్రాప్తాః - వచ్చినవారు అనేది, యత్ - ఏది గలదో, ఇదమ్ - ఇది, వః - మీకు, ఉపపన్నమ్ - తగియున్నది.

ఓ గొప్ప పుణ్యవతులారా! మీకు స్వాగతము. కూర్చుండుడు. నేను మీకు చేయదగినది ఏది గలదు? నన్ను చూచే కోరికతో (అడ్డులను దాటి) వచ్చుట అనే ఈ మీ ప్రవృత్తి మీ (ప్రేమ) కు ఎంతయు తగియున్నది.

నన్వద్ధా మయి కుర్వంతి కుశలాస్స్వార్థదర్శనాః ।
అహైతుక్యవ్యవహితాం భక్తిమాత్మప్రియే యథా ॥ 26

కుశలాః - నేర్పు గలవారు, స్వ-అర్థదర్శనాః - తమ పురుషార్థమును స్పష్టముగా తెలియువారు, ఆత్మప్రియే - ఆత్మ మరియు ప్రియుడను అగు, మయి - నాయందు, యథా - యథార్థముగా, అద్ధా - సాక్షాత్తుగా, అహైతుకీ-అవ్యవహితామ్ - ఫలాసక్తి లేనిది వ్యవధానములు లేనిది అగు, భక్తిమ్ - భక్తిని, కుర్వంతి - చేయుదురు, నను - నిశ్చయము.

తమ పురుషార్థమును గురించి స్పష్టమగు కల్పన గల నిపుణులైన (ఆత్మానాత్మవివేకము గల) సాధకులు సాక్షాత్తుగా నాయందు యథార్థముగా భక్తిని చేయుదురు. ఇది నిశ్చయము. వారి భక్తియందు ఫలాసక్తి గాని, అంతరాయములు గాని ఉండవు. నేను సర్వులకు ఆత్మను మరియు ప్రియుడను.

ప్రాణబుద్ధిమనస్స్వాత్మదారాపత్యధనాదయః ।
యత్సంపర్కాత్ప్రియా ఆసంస్తతః కో న్వపరః ప్రియః ॥ 27

ప్రాణబుద్ధిమనః-స్వ-ఆత్మదార-అపత్యధన-ఆదయః - ప్రాణములు బుద్ధి మనస్సు తన శరీరము భార్య సంతానము ధనము మొదలైనవి, యత్-సంపర్కాత్ - ఏ ఆత్మయొక్క సంబంధము వలన, ప్రియాః - ప్రియములు, ఆసన్ - అయినవో, తతః - ఆ ఆత్మకంటె, అపరః - మరియొక, ప్రియః - ప్రియమైనది, కః ను - ఏది ఉండును?

ఆత్మతోడి (కల్పిత) సంబంధము వలననే వ్యక్తికి తన ప్రాణములు, బుద్ధి, మనస్సు, శరీరము, భార్య, సంతానము, ధనము, కీర్తి మొదలైనవి ప్రియములగుచున్నవి. అట్టి ఆత్మకంటె ప్రియమైనది మరొకటి ఏది గలదు? (లేదు).

తద్యాత దేవయజనం పతయో వో ద్విజాతయః ।
స్వసత్రం పారయిష్యంతి యుష్మాభిర్గృహమేధినః ॥ 28

తత్ - అందునలన, దేవయజనమ్ - యజ్ఞవాటమును గురించి, యాత - వెళ్లుడు, యుష్మాభిః - మీచే, గృహమేధినః - గృహస్థులైన, వః - మీ,

పతయః - భర్తలగు, ద్విజాతయః - బ్రాహ్మణులు, స్వసత్రమ్ - తమ యజ్ఞమును, పారయిష్యంతి - సమాప్తి చేయగలరు.

కావున మీరు యజ్ఞవాటమునకు వెళ్లుడు. మీ వలన గృహస్థులై మీ భర్తలగు బ్రాహ్మణులు తమ సత్రయాగమును సంపన్నము చేసుకొనెదరు.

పత్న్య ఊచుః ।
మైవం విభోఽర్హతి భవాన్ గదితుం నృశంసం
సత్యం కురుష్వ నిగమం తవ పాదమూలమ్ ।
ప్రాప్తా వయం తులసిదామ పదావసృష్టం
కేశైర్నివోఢుమతిలంఘ్య సమస్తబంధూన్ ॥ 29

విభో - ఓ ప్రభూ!, భవాన్ - నీవు, ఏవమ్ - ఈ విధముగా, నృశంసమ్ - పరుషముగా, గదితుమ్ - పలుకుటకు, మా అర్హతి - తగవు, నిగమమ్ - వేదమును, సత్యమ్ - సత్యమునుగా, కురుష్వ - చేయుము, వయమ్ - మేము, సమస్తబంధూన్ - సకలబంధువులను, అతిలంఘ్య - తిరస్కరించి, పద-అవసృష్టమ్ - కాలితో ఈయబడిన, తులసిదామ - తులసిమాలను, కేశైః - కేశములతో, నివోఢుమ్ - దాల్చుటకు, తవ - నీ, పాదమూలమ్ - పాదముల మూలమును, ప్రాప్తాః - చేరినవారము.

బ్రాహ్మణపత్నులిట్లు పలికిరి --- ఓ ప్రభూ! నీవీ విధముగా పరుషముగా పలుక తగదు. ఏకాంతభక్తులకు పునరావృత్తి లేదు, అనే వేదవాక్యము (నీ ఉపదేశము) ను సత్యము చేయుము. మేము సకలబంధువులను తిరస్కరించి నీ పాదమూలమును చేరినాము. నీవు కాలితో (తిరస్కారపూర్వకముగా) ఇచ్చిన తులసిమాలనైననూ మేము జుట్టుముడియందు దాల్చెదము.

గృహ్ణంతి నో న పతయః పితరౌ సుతా వా
న భ్రాతృబంధుసుహృదః కుత ఏవ చాన్యే ।
తస్మాద్భవత్ప్రపదయోః పతితాత్మనాం నో
నాన్యా భవేద్గతిరరిందమ తద్విధేహి ॥ 30

అరిందమ - అంతశ్శత్రువులను నిగ్రహించువాడా!, పతయః - భర్తలు, పితరౌ - తల్లిదండ్రులు, వా - లేక, సుతాః - పుత్రులు, నః - మమ్ములను, న గృహ్ణంతి - స్వీకరించరు, భ్రాతృబంధుసుహృదః - సోదరులు బంధువులు మిత్రులు, న - స్వీకరించరు, అన్యే చ - ఇతరులైతే, కుతః ఏవ - ఎందువలన?, తస్మాత్ - అందువలన, భవత్-ప్రపదయోః - నీ పాదాగ్రములయందు, పతిత-ఆత్మనామ్ - పడిన దేహములు గల, నః - మాకు, అన్యా - మరియొక, గతిః - గతి, న - లేదు, తత్ - అట్టి నీ సేవనే, విధేహి - ఏర్పాటు చేయుము.

నీవు కామక్రోధములు మొదలైన అంతశ్శత్రువులను పోగొట్టెదవు. మా భర్తలు గాని, తల్లిదండ్రులు గాని, పుత్రులు గాని, సోదరులు గాని, బంధువులు గాని, మిత్రులు గాని మమ్ములను స్వీకరించరు. ఇక ఇతరులు ఏల స్వీకరించెదరు? కాబట్టి నీ పాదాగ్రములపై పడియున్న దేహములు గల మాకు (నీవు తప్ప) మరియొక గతి లేదు. మాకు నీ దాస్యమునిమ్ము.

శ్రీభగవానువాచ ।
పతయో నాభ్యసూయేరన్ పిత్రృభ్రాతృసుతాదయః ।
లోకాశ్చ వో మయోపేతా దేవా అప్యనుమన్వతే ॥ 31

పతయః - భర్తలు, పితృభ్రాతృసుత-ఆదయః - తల్లిదండ్రులు సోదరులు కొడుకులు మొదలగువారు, లోకాః చ - జనులు కూడ, వః - మిమ్ములను, న అభ్యసూయేరన్ - తప్పు పట్టరు, మయా - నాచే, ఉపేతాః - అనుజ్ఞనీయబడినవారు, దేవాః అపి - దేవతలు కూడ, అనుమన్వతే - అంగీకరించెదరు.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- భర్తలు, తల్లిదండ్రులు, సోదరులు, కొడుకులు, బంధువులు మొదలగు వారు, జనులు కూడ మీ యెడల తప్పు పట్టరు. మీరు నాచే అనుజ్ఞనీయ బడినవారు. మిమ్ములను దేవతలు కూడ (నిర్దోషులని) స్వీకరించెదరు.

న ప్రీతయేఽనురాగాయ హ్యంగసంగో నృణామిహ ।
తన్మనో మయి యుంజానా అచిరాన్మామవాప్స్యథ ॥ 32

ఇహ - ఈ లోకమునందు, అంగసంగః - శరీరముతోడి కలయిక, నృణామ్ - మానవులకు, ప్రీతయే - సుఖము కొరకు, అనురాగాయ - అనురాగము కొరకు, న హి - కానే కాదు, తత్ - అందువలన, మనః - మనస్సును, మయి - నాయందు, యుంజానాః - లగ్నము చేయువారై, అచిరాత్ - తొందరలో, మామ్ - నన్ను, అవాప్స్యథ - పొందగలరు.

ఈ లోకములో మానవులకు శరీరముతో కలయిక ఆనందమును గాని, అనురాగమును గాని కలిగించదు. కావున, మనస్సును నాయందు లగ్నము చేయుడు. తొందరలో నన్ను పొందెదరు.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్తా ద్విజపత్న్యస్తా యజ్ఞవాటం పునర్గతాః ।
తే చానసూయవస్స్వాభిః స్త్రీభిస్సత్రమపారయన్ ॥ 33

ఇతి - ఇట్లు, ఉక్తాః - చెప్పబడిన, తాః - ఆ, ద్విజపత్న్యః - బ్రాహ్మణపత్నులు, పునః - మరల, యజ్ఞవాటమ్ - యజ్ఞవాటమును గురించి, గతాః - వెళ్లినవారు, తే చ - ఆ బ్రాహ్మణులు కూడ, అనసూయవః - తప్పు పట్టనివారై, స్వాభిః - తమ, స్త్రీభిః - భార్యలతో, సత్రమ్ - సత్రయాగమును, అపారయన్ - పూర్తి చేసిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణుడిట్లు చెప్పగా, ఆ బ్రాహ్మణపత్నులు తిరిగి యజ్ఞవాటమునకు వెళ్లిరి. వారి భర్తలు వారియెడల దోషారోపణ చేయలేదు. పైగా, ఆ బ్రాహ్మణులు తమ భార్యలతో కలిసి సత్రయాగమును పూర్తి చేసిరి.

తత్రైకా విధృతా భర్త్రా భగవంతం యథాశ్రుతమ్ ।
హృదోపగుహ్య విజహౌ దేహం కర్మానుబంధనమ్ ॥ 34

తత్ర - వారియందు, ఏకా - ఒకామె, భర్త్రా - భర్తచే, విధృతా - అడ్డుకొనబడినదై, యథాశ్రుతమ్ - విన్నదానికి తగ్గట్లుగా, భగవంతమ్ - శ్రీకృష్ణ భగవానుని, హృదా - మనస్సుతో, ఉపగుహ్య - కౌగిలించుకొని (ధ్యానించి), కర్మ-అనుబంధనమ్ - కర్మచే నిర్మితమైన, దేహమ్ - దేహమును, విజహౌ - విడిచిపెట్టెను.

వారిలో ఒకామెను భర్త వెళ్లకుండా అడ్డుకొనెను. ఆమె శ్రీకృష్ణ భగవానుని రూపమును తాను విన్నట్లుగా మనస్సుతో ఏకాగ్రముగా ధ్యానించి, కర్మఫలరూపముగా నిర్మాణమైన దేహమును విడిచిపెట్టెను.

భగవానపి గోవిందస్తేనైవాన్నేన గోపకాన్ ।
చతుర్విధేనాశయిత్వా స్వయం చ బుభుజే ప్రభుః ॥ 35

ప్రభుః - సర్వసమర్థుడు, గోవిందః - గోవులను కాపాడువాడు, భగవాన్ అపి - శ్రీకృష్ణ భగవానుడు కూడ, చతుర్-విధేన - నాలుగు రకములైన, తేన - ఆ, అన్నేన ఏవ - ఆహారముతోనే, గోపకాన్ - గోపాలకులను, ఆశయిత్వా - తినిపించి, స్వయం చ - తాను కూడ, బుభుజే - తినెను.

సర్వసమర్థుడై గోవులను కాపాడే శ్రీకృష్ణ భగవానుడు కూడ నాలుగు రకముల ఆ అన్నమునే గోపాలకులకు తినిపించి తాను కూడ తినెను.

ఏవం లీలానరవపుర్నృలోకమనుశీలయన్ ।
రేమే గోగోపగోపీనాం రమయన్ రూపవాక్కృతైః ॥ 36

లీలానరవపుః - లీలకై మానవదేహము గల శ్రీకృష్ణ భగవానుడు, ఏవమ్ - ఈ విధముగా, నృలోకమ్ - మానవజీవితమును, అనుశీలయన్ - అనుకరించుచున్నవాడై, రూపవాక్-కృతైః - రూపము వాక్కు చేష్టలతో, గోగోపగోపీనామ్ - గోవులు గోపాలకులు గోపికలకు, రమయన్ - రమింపజేయువాడై, రేమే - రమించెను.

లీలకై మానవదేహమును దాల్చిన శ్రీకృష్ణ భగవానుడీ విధముగా మనుష్యజీవితమునను కరించుచుండెను. ఆయన తన రూపముతో, మాటలతో, చేష్టలతో గోవులకు, గోపాలకులకు, గోపికలకు ఆనందమును కలిగిస్తూ, తాను కూడ రమించెను.

అథానుస్మృత్య విప్రాస్తే అన్వతప్యన్ కృతాగసః ।
యద్విశ్వేశ్వరయోర్యాచ్ఞామహన్మ నృవిడంబయోః ॥ 37

అథ - తరువాత, కృత-ఆగసః - చేయబడిన అపరాధము గల, తే - ఆ, విప్రాః - బ్రాహ్మణులు, అనుస్మృత్య - గుర్తు చేసుకొని, అను-అతప్యన్ -

పశ్చాత్తాపపడిరి, యత్ - ఏలయన, నృవిడంబయోః - మానవులననుకరించుచున్న, విశ్వ-ఈశ్వరయోః - జగన్నాథులగు బలరామకృష్ణుల, యాచ్ఞామ్ - కోరికను, అహన్మ - నిరాకరించితిమి.

మానవులననుకరించే జగన్నాథులైన బలరామకృష్ణుల కోరికను మనము నిరాకరించితిమి, అని గుర్తు చేసుకొని అపరాధము చేసిన ఆ బ్రాహ్మణులు తరువాత పశ్చాత్తాపపడిరి.

దృష్ట్వా స్త్రీణాం భగవతి కృష్ణే భక్తిమలౌకికీమ్ ।
ఆత్మానం చ తయా హీనమనుతప్తా వ్యగర్హయన్ ॥ 38

స్త్రీణామ్ - భార్యలయొక్క, కృష్ణే భగవతి - శ్రీకృష్ణ భగవానుని యందలి, అలౌకికీమ్ - లోకమునకు అతీతమైన, భక్తిమ్ - భక్తిని, తయా - ఆ భక్తిచే, హీనమ్ - హీనమైన, ఆత్మానం చ - తనను కూడ, దృష్ట్వా - చూచి, అనుతప్తాః - పశ్చాత్తాపపడిన బ్రాహ్మణులు, వ్యగర్హయన్ - నిందించుకొనిరి.

ఆ బ్రాహ్మణులు తమ భార్యలకు శ్రీకృష్ణ భగవానునియందు గల లోకాతీతమైన భక్తిని చూచిరి. అట్టి భక్తి తమయందు లేకపోవుట కూడ వారికి తెలిసెను. దానికి వారు పశ్చాత్తాపపడి తమను తాము తిట్టుకొనిరి.

ధిగ్జన్మ నస్త్రివృద్విద్యాం ధిగ్వ్రతం ధిగ్బహుజ్ఞతామ్ ।
ధిక్కులం ధిక్క్రియాదాక్ష్యం విముఖా యే త్వధోక్షజే ॥ 39

నః - మన, త్రివృత్ - మూడు ఆవృత్తుల, జన్మ - జన్మను గురించి, ధిక్ - నిందయగుగాక!, విద్యామ్ - చదువును గురించి, ధిక్ - నిందయగుగాక!, వ్రతమ్ - బ్రహ్మచర్యవ్రతమును గురించి, ధిక్ - నిందయగుగాక!, బహుజ్ఞతామ్ - అధికమగు పాండిత్యమును గురించి, ధిక్ - నిందయగుగాక!, కులమ్ - కులమును గురించి, ధిక్ - నిందయగుగాక!, క్రియాదాక్ష్యమ్ - వైదికక్రియలయందలి దక్షతను గురించి, ధిక్ - నిందయగుగాక!, యే తు - ఏ మనమైతే, అధోక్షజే - ఇంద్రియగోచరుడు కాని శ్రీహరియందు, విముఖాః - పెడమొగము గలవారమో.

మనమైతే ఇంద్రియగోచరుడు కాని శ్రీహరి యెడల పెడమొగము కలిగి యున్నాము. మన మూడు ఆవృత్తుల (తల్లి కడుపున పుట్టుట, ఉపనయనము, యజ్ఞదీక్ష) జన్మ, వేదవిద్య, బ్రహ్మచర్యవ్రతము, గొప్ప పాండిత్యము, కులము, వైదికకర్మలయందలి దక్షత అనువాటి గురించి నిందయగుగాక!

నూనం భగవతో మాయా యోగినామపి మోహినీ ।
యద్వయం గురవో నృణాం స్వార్థే ముహ్యామహే ద్విజాః ॥40

ద్విజాః - ఓ వేదవేత్తలారా!, భగవతః - శ్రీహరి భగవానుని, మాయా - మాయ, యోగినాం అపి - యోగులకు కూడ, మోహినీ - వ్యామోహమును కలిగించునది, నూనమ్ - నిశ్చయము, యత్ - ఏలయన, నృణామ్ - మానవులకు, గురవః - గురువులమైన, వయమ్ - మనము, స్వ-అర్థే - మన ప్రయోజనము విషయములో, ముహ్యామహే - మోహమును పొందుచున్నాము.

ఓ వేదవేత్తలారా! శ్రీహరి భగవానుని మాయ నిశ్చయముగా యోగులను కూడ వ్యామోహపెట్టును. ఎందుకంటే, మానవులకు గురువులమైన మనము మన పురుషార్థము విషయములో వ్యామోహము (సత్యమును తెలియలేకపోవుట) ను పొందుచున్నాము.

అహో పశ్యత నారీణామపి కృష్ణే జగద్గురౌ ।
దురంతభావం యోఽవిధ్యన్మృత్యుపాశాన్ గృహాభిధాన్ ॥ 41

అహో - ఆహా!, జగద్-గురౌ - జగత్తునకు గురువగు, కృష్ణే - శ్రీకృష్ణునియందు, నారీణాం అపి - స్త్రీలకు కూడ, దురంతభావమ్ - సర్వమును నిరాకరించే (అగాధమైన) భక్తిని, పశ్యత - చూడుడు, యః - ఏ భక్తి, గృహ-అభిధాన్ - ఇల్లు అనే పేరు గల, మృత్యుపాశాన్ - మృత్యురూపములైన పాశములను, అవిధ్యత్ - తెగగొట్టెనో.

ఆహా! జగద్గురువగు శ్రీకృష్ణునియందు స్త్రీలు కూడ సర్వమును నిరాకరించి అగాధమగు భక్తిని చేసిరి. అట్టి భక్తి ఇల్లు-వాకిలి అనే పేరు గల మృత్యురూపములైన పాశములను (ఆసక్తులను) తెగగొట్టును.

నాసాం ద్విజాతిసంస్కారో న నివాసో గురావపి ।
న తపో నాత్మమీమాంసా న శౌచం న క్రియాశ్శుభాః ॥ 42

ఆసామ్ - వీరికి, ద్విజాతిసంస్కారః - ఉపనయనసంస్కారము, న - లేదు, గురౌ - గురువువద్ద, నివాసః అపి - నివాసమైననూ, న - లేదు, తపః - తపస్సు, న - లేదు, ఆత్మమీమాంసా - ఆత్మవిచారము, న - లేదు, శౌచమ్ - శౌచము, న - లేదు, శుభాః - శుభకరములగు, క్రియాః - వైదికకర్మలు, న - లేవు.

వీరికి ఉపనయనసంస్కారము గాని, గురుకులవాసము గాని లేవు. వీరు తపస్సు గాని, ఆత్మవిచారము గాని చేయలేదు. వీరియందు (మంత్రకృత మగు) శౌచము లేదు. వీరు వేదోక్తములగు పుణ్యకర్మలను చేయలేదు.

అథాపి హ్యుత్తమశ్లోకే కృష్ణే యోగేశ్వరేశ్వరే ।
భక్తిర్దృఢా న చాస్మాకం సంస్కారాదిమతామపి ॥ 43

అథాపి - అయినప్పటికీ, ఉత్తమశ్లోకే - పవిత్రమగు కీర్తి కలిగినట్టియు, యోగ-ఈశ్వర-ఈశ్వరే - యోగులకు యోగేశ్వరులకు ప్రభుడైన, కృష్ణే - శ్రీకృష్ణునియందు, దృఢా - గట్టి, భక్తిః - భక్తి, హి - నిశ్చయము, సంస్కార-ఆదిమతాం అపి - ఉపనయనసంస్కారము మొదలైనవి గలవారమే ఐననూ, అస్మాకమ్ - మనకు, న చ - లేనే లేదు.

ఐననూ వీరికి పవిత్రకీర్తియగు శ్రీకృష్ణునియందు దృఢమగు భక్తి గలదు. ఇది నిశ్చయము. ఆయన యోగులకు, యోగేశ్వరులకు కూడ ప్రభుడు. ఉపనయనసంస్కారము, గురుకులవాసము మొదలైనవి గలవారమే అయినా, మనకు భక్తి లేనే లేదు.

నను స్వార్థవిమూఢానాం ప్రమత్తానాం గృహేహయా ।
అహో నస్స్మారయామాస గోపవాక్యైస్సతాం గతిః ॥ 44

అహో - ఆహా!, స్వ-అర్థవిమూఢానామ్ - స్వార్థముచే వ్యామోహితులైనట్టియు, గృహ-ఈహయా - ఇంటికి చెందిన చేష్టతో, ప్రమత్తానామ్ - ఆత్మవిస్మృతి కలిగియున్న, నః - మనలను, సతామ్ - సత్పురుషులకు,

గతిః - గమ్యమైన శ్రీహరి, గోపవాక్యైః - గోపాలకుల మాటల ద్వారా, స్మారయామాస - స్మరింపజేసెను, నూనమ్ - నిశ్చయము.

సత్పురుషులు పొందగోరేది భగవానుని మాత్రమే. మనమైతే గృహస్థకర్మలలో పడి స్వర్గాదికామనలే పరమార్థమనే వ్యామోహములో పడియుంటిమి. ఆహా! ఆయన మన ఆత్మవిస్మృతిని మనకు గోపాలకుల మాటల ద్వారా గుర్తు చేసినాడు. ఇది నిశ్చయము.

అన్యథా పూర్ణకామస్య కైవల్యాద్యాశిషాం పతేః ।
ఈశితవ్యైః కిమస్మాభిరీశస్యైతద్విడంబనమ్ ॥ 45

అన్యథా - అట్లు గానిచో, పూర్ణకామస్య - పూర్ణమైన కామనలు కలిగినట్టియు, కైవల్య-ఆది-ఆశిషామ్ - మోక్షము మొదలైన కామనలకు, పతేః - ప్రభుడైన, ఈశస్య - శ్రీకృష్ణ భగవానునకు, ఈశితవ్యైః - ఈశ్వరాధీనులమైన, అస్మాభిః - మనతో, కిమ్ - ఏమి ప్రయోజనము?, ఏతత్ - ఇది, విడంబనమ్ - లోకానుకరణము.

అట్లు గానిచో, శ్రీకృష్ణ భగవానునకు ఆయనచే పాలించబడే మనతో ప్రయోజనమేమి గలదు? (ఏమీ లేదు). ఆయన పూర్ణమైన కామనలు గలవాడు; మోక్షము, స్వర్గము ఇత్యాదికామనలన్నింటినీ పరిపూర్తి చేసే ప్రభుడు. ఇది (మనలను అన్నము కోరుట) లోకానుకరణము మాత్రమే.

హిత్వాఽన్యాన్ భజతే యం శ్రీః పాదస్పర్శాశయా సకృత్ ।
ఆత్మదోషాపవర్గేణ తద్యాచ్ఞా జనమోహినీ ॥ 46

సకృత్ - ఒక్కసారి, పాదస్పర్శ-ఆశయా - పాదములను స్పృశించే కోరికతో, శ్రీః - లక్ష్మీదేవి, అన్యాన్ - ఇతరులను, హిత్వా - విడిచిపెట్టి, యమ్ - ఎవనినైతే, ఆత్మదోష-అపవర్గేణ - తనయందలి దోషములను విడిచిపెట్టుటచే, భజతే - సేవించుచున్నదో, తద్-యాచ్ఞా - ఆయన యాచించుట, జనమోహినీ - జనులను మోహపెట్టునది.

ఒక్కసారి పాదములను స్పృశించవలెననే కోరికతో లక్ష్మీదేవి ఇంద్రాదులను విడిచిపెట్టి, తనయందలి చాంచల్యము మొదలగు

దోషములను ప్రక్కన బెట్టి ఆయనను సేవించుచున్నది. అట్టి శ్రీకృష్ణ భగవానుడు అన్నమును కోరుట (మనవంటి) జనులను మోహపెట్టును.

దేశః కాలః పృథగ్ద్రవ్యం మంత్రతంత్రర్త్విజోఽగ్నయః ।
దేవతా యజమానశ్చ క్రతుర్ధర్మశ్చ యన్మయః ।। 47

దేశః - దేశము, కాలః - కాలము, పృథక్ - వేర్వేరు, ద్రవ్యమ్ - పదార్థము, మంత్రతంత్ర-ఋత్విజః - మంత్రములు కర్మను చేసే పద్ధతి ఋత్విక్కులు, అగ్నయః - అగ్నులు, దేవతాః - దేవతలు, యజమానః చ - యజ్ఞమును చేయువాడు కూడ, క్రతుః - క్రతువు, ధర్మః చ - పుణ్యము కూడ, యత్-మయః - ఏభగవానుని రూపమో.

యజ్ఞమును చేసే దేశకాలములు, దానిలోని వేర్వేరు ద్రవ్యములు, మంత్రములు, కర్మను చేసే పద్ధతి, ఋత్విక్కులు, గార్హపత్యము మొదలైన అగ్నులు, అగ్ని మొదలగు దేవతలు, యజ్ఞమును చేయువాడు, యజ్ఞము, దాని వలన కలిగే పుణ్యము అనేవి ఆ భగవానుని రూపములే.

స ఏష భగవాన్ సాక్షాద్విష్ణుర్యోగేశ్వరేశ్వరః ।
జాతో యదుష్విత్యశృణ్మ హ్యపి మూఢా న విద్మహే ।। 48

యోగ-ఈశ్వర-ఈశ్వరః - యోగులకు యోగేశ్వరులకు ప్రభుడగు, సః - అట్టి, ఏషః - ఈ, విష్ణుః భగవాన్ - విష్ణుభగవానుడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, యదుషు - యాదవులయందు, జాతః - జన్మించినవాడు, ఇతి - అని, అశృణ్మ హి - వింటిమి గదా!, అపి - ఐననూ, మూఢాః - మోహమును పొందిన మనము, న విద్మహే - తెలియలేదు.

యోగులకు, యోగేశ్వరులకు ప్రభుడగు ఆ (యజ్ఞరూపుడగు) ఈ (శ్రీకృష్ణరూపుడగు) శ్రీహరి భగవానుడే సాక్షాత్తుగా యాదవులలో అవతరించెనని వింటిమి గదా! అయినా, మూఢులమగు మనమాయనను గుర్తించలేదు.

అహో వయం ధన్యతమా యేషాం నస్తాదృశీః స్త్రియః ।
భక్త్యా యాసాం మతిర్జాతా అస్మాకం నిశ్చలా హరౌ ।। 49

అహో - ఆహా!, వయమ్ - మనము, ధన్యతమాః - మిక్కిలి ధన్యులము, యేషామ్ - ఏ, నః - మనయొక్క, స్త్రియః - భార్యలు, తాదృశీః - అట్టివారో, హి - ఏలయనగా, యాసామ్ - ఏ భార్యల, భక్త్యా - భక్తిచే, అస్మాకమ్ - మనకు, హరౌ - శ్రీకృష్ణ భగవానునియందు, నిశ్చలా - చలనము లేని, మతిః - బుద్ధి, జాతా - కలిగినదో.

ఆహా! అట్టి (గొప్ప భక్తి గల) భార్యలను కలిగియున్న మనము మిక్కిలి ధన్యులము. ఏలయన, వారి భక్తిచే మన బుద్ధి కూడ శ్రీకృష్ణ భగవానునియందు నిశ్చలముగా నిలుచును.

నమస్తుభ్యం భగవతే కృష్ణాయాకుంఠమేధసే ।
యన్మాయామోహితధియో భ్రమామః కర్మవర్త్మసు ।। 50

అకుంఠమేధసే - బాధితము కాని జ్ఞానము గల, భగవతే కృష్ణాయ - శ్రీకృష్ణ భగవానుడవగు, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము, యత్-మాయామోహితధియః - ఎవని మాయచే మోహపెట్టబడిన బుద్ధి గల మేము, కర్మవర్త్మసు - కర్మమార్గములయందు, భ్రమామః - తిరుగుచున్నామో.

ఓ శ్రీకృష్ణా! నీవు బాధితము కాని జ్ఞానము గల భగవానుడవు. నీకు నమస్కారము. నీ మాయచే మోహితులమైన మేము (కామ్య)కర్మమార్గములయందు తిరుగాడుచున్నాము.

స వై న ఆద్యః పురుషస్స్వమాయామోహితాత్మనామ్ ।
అవిజ్ఞాతానుభావానాం క్షంతుమర్హత్యతిక్రమమ్ ।। 51

సః - అట్టి, ఆద్యః - జగత్కారణమైన, పురుషః - పూర్ణ పరమాత్మ, వై - నిశ్చయముగా, స్వమాయామోహిత-ఆత్మనామ్ - తన మాయచే మోహితమైన బుద్ధి కలిగినట్టియు, అవిజ్ఞాత-అనుభావానామ్ - తెలియబడని మహిమ గల, నః - మా, అతిక్రమమ్ - అపరాధమును, క్షంతుమ్ - క్షమించుటకు, అర్హతి - తగును.

జగత్కారణుడగు ఆ పూర్ణపరమాత్మయొక్క మాయచే మా బుద్ధి నిశ్చయముగా మోహమును చెందినది. కావుననే, మేము ఆయన

మహిమ తెలియక అపరాధమును చేసితిమి. ఆయన మా అపరాధమును మన్నించ దగును.

ఇతి స్వాఘమనుస్మృత్య కృష్ణే తే కృతహేలనాః ।
దిదృక్షవోఽప్యచ్యుతయోః కంసాద్భీతా న చాచలన్ ॥ 52

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే త్రయోవింశోఽధ్యాయః ॥

కృష్ణే - శ్రీకృష్ణుని యెడల, కృతహేలనాః - చేయబడిన అవహేళన గల, తే - ఆ బ్రాహ్మణులు, ఇతి - ఈ విధముగా, స్వ-అఘమ్ - తమ తప్పును, అనుస్మృత్య - గుర్తు చేసుకొని, అచ్యుతయోః - ఎల్లవేళలా ఆనందముగా ఉండే బలరామకృష్ణులను, దిదృక్షవః అపి - చూడాలనే కోరిక గలవారే ఐననూ, కంసాత్ - కంసుని వలన, భీతాః - భయపడినవారై, న చ అచలన్ - వెళ్లనే లేదు.

శ్రీకృష్ణుని అవహేళన చేసిన ఆ బ్రాహ్మణులు ఈ విధముగా తమ తప్పు తెలుసుకొనిరి. స్వరూపచ్యుతి లేని బలరామకృష్ణులను చూడాలనే కోరిక వారికి కలిగెను. కాని, ఆ విషయము కంసునకు తెలిసి శ్రీకృష్ణునకు హానిని తలపెట్టునేమో అనే భయము వలన వారు వెళ్లలేదు.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్ధములో యజ్ఞపత్నుల ఉద్ధారమును వర్ణించే
ఇరువది మూడవ అధ్యాయము ముగిసినది (23).



# అథ చతుర్వింశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు ఇంద్రయాగమునాపుట

శ్రీశుక ఉవాచ ।
భగవానపి తత్రైవ బలదేవేన సంయుతః ।
అపశ్యన్నివసన్ గోపానింద్రాయాగకృతోద్యమాన్ ॥ 1

బలదేవేన - బలరామునితో, సంయుతః - కూడిన, భగవాన్ అపి - శ్రీకృష్ణ భగవానుడు కూడ, తత్ర ఏవ - అక్కడనే, నివసన్ - నివసించుచున్న వాడై, ఇంద్రయాగకృత-ఉద్యమాన్ - ఇంద్రయాగము కొరకు చేయబడిన ఉద్యమము గల, గోపాన్ - గోపాలకులను, అపశ్యత్ - చూచెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణ భగవానుడు బలరామునితో గూడి ఆ బృందావనమునందే నివసించుచుండెను. గోపాలకులు ఇంద్రయాగమునకు ఉద్యమించుచుండుటను ఆయన చూచెను.

తదభిజ్ఞోఽపి భగవాన్ సర్వాత్మా సర్వదర్శనః ।
ప్రశ్రయావనతోఽపృచ్ఛద్వృద్ధాన్నందపురోగమాన్ ॥ 2

సర్వ-ఆత్మా - సకలప్రాణులకు ఆత్మయై, సర్వదర్శనః - సర్వమునకు సాక్షియగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తద్-అభిజ్ఞః అపి - ఆ విషయము తెలిసినవాడే ఐననూ, ప్రశ్రయ-అవనతః - వినయముతో వంగినవాడై, నందపురః-గమాన్ - నందుడు మొదలుగా గల, వృద్ధాన్ - పెద్దలను, అపృచ్ఛత్ - అడిగెను.

సకలప్రాణులకు ఆత్మయై సర్వమునకు సాక్షియగు శ్రీకృష్ణ భగవానునకు వారి అభిప్రాయము తెలియును. ఐననూ, ఆయన నందుడు మొదలుగా గల పెద్దలకు వినయముగా నమస్కరించి ప్రశ్నించెను.

కథ్యతాం మే పితః కోఽయం సంభ్రమో వ ఉపాగతః ।
కిం ఫలం కస్య చోద్దేశః కేన వా సాధ్యతే మఖః ॥ 3

పితః - తండ్రీ!, మే - నాకు, కథ్యతామ్ - చెప్పబడుగాక!, వః - మీకు, ఉపాగతః - కలిగిన, అయమ్ - ఈ, సంభ్రమః - ఉత్సాహము, కః - ఏమి?, ఫలమ్ - ఫలము, కిమ్ - ఏది?, కస్య చ - ఏ దేవతకు, ఉద్దేశః - ఉద్దేశము?, మఖః - యజ్ఞము, కేన వా - ఎవనిచే (దేనితో), సాధ్యతే - చేయబడుచున్నది?

ఓ తండ్రీ! నాకు చెప్పుడు. మీరు ఉత్సాహముగా చేయదలపెట్టిన ఈ కార్యమేమి? ఈ యజ్ఞమునకు ఫలమేమి? దేవత యెవరు? సాధనమేది? యజమానుడెవరు?

ఏతద్బ్రూహి మహాన్ కామో మహ్యం శుశ్రూషవే పితః ।
నహి గోప్యం హి సాధూనాం కృత్యం సర్వాత్మనామిహ ॥ 4

అస్త్యస్వపరదృష్టీనామమిత్రోదాస్తవిద్విషామ్ ।

పితః - ఓ తండ్రీ!, మహాన్ - పెద్ద, కామః - కోరిక, శుశ్రూషవే - వినగోరే, మహ్యమ్ - నా కొరకు, ఏతత్ - దీనిని, బ్రూహి - చెప్పుము, హి - ఏలయనగా, సర్వ-ఆత్మనామ్ - సర్వము ఆత్మయేయైనట్టియు, అస్వపరదృష్టీనామ్ - తన పరాయి అనే దృష్టి లేనట్టియు, అమిత్ర-ఉదాస్తవిద్విషామ్ - మిత్రులు ఉదాసీనులు శత్రువులు లేని, సాధూనామ్ - సజ్జనులకు, ఇహ - ఈ లోకమునందు, గోప్యమ్ - దాచదగిన, కృత్యమ్ - పని, నహి అస్తి - లేనే లేదు.

ఓ తండ్రీ! నాకు వినాలని చాల కోరిక గలదు. (మీరు పెద్ద కోరికతో చేయుచున్నారు). కావున, నాకీ విషయమును చెప్పుడు. ఏలయన, ఈ లోకములో సర్వమును ఆత్మరూపముగా చూసే సజ్జనులకు తనవారు, పరాయివారు అనే తేడాలు ఉండవు. వారికి మిత్రులు, ఉదాసీనులు, శత్రువులు అనే విభాగములు ఉండవు. అట్టివారికి దాచిపెట్టదగిన కార్యమేదియు ఉండనే ఉండదు.

ఉదాసీనోఽరివద్వర్జ్య ఆత్మవత్సుహృదుచ్యతే ॥ 5

ఉదాసీనః - ఉదాసీనుడు, అరివత్ - శత్రువు వలె, వర్జ్యః - విడువదగినవాడు, సుహృత్ - మిత్రుడు, ఆత్మవత్ - ఆత్మవంటివాడు, ఉచ్యతే - చెప్పబడుచున్నాడు.

శత్రువునకు వలె ఉదాసీనునకు కూడ రహస్యకార్యమును చెప్పరాదు. కాని, మిత్రుడు ఆత్మవంటివాడని పెద్దలు చెప్పెదరు (కాన, మిత్రునకు రహస్యమును చెప్పదగును).

జ్ఞాత్వాఽజ్ఞాత్వా చ కర్మాణి జనోఽయమనుతిష్ఠతి ।
విదుషః కర్మసిద్ధిస్స్యాత్తథా నావిదుషో భవేత్ ॥ 6

అయమ్ - ఈ, జనః - మానవుడు, జ్ఞాత్వా - తెలుసుకొని, అజ్ఞాత్వా చ - తెలుసుకోకుండా కూడ, కర్మాణి - కర్మలను, అనుతిష్ఠతి - అనుష్ఠించును, విదుషః - తెలిసి చేసినవానికి, కర్మసిద్ధిః - కర్మయొక్క సిద్ధి, స్యాత్ - కలుగును, తథా - ఆ విధముగా, అవిదుషః - తెలియనివానికి, న భవేత్ - కలుగదు.

మానవుడు తెలిసి మరియు తెలియకుండా కూడ కర్మలను చేయును. తెలిసి చేసినవానికి కర్మ సిద్ధించును. కాని, తెలియకుండా చేయువానికి కర్మ అదే స్థాయిలో ఫలమునీయదు.

తత్ర తావత్క్రియాయోగో భవతాం కిం విచారితః ।
అథవా లౌకికస్తన్మే పృచ్ఛతస్సాధు భణ్యతామ్ ॥ 7

తత్ర - ఆ విషయమునందు, భవతామ్ - మీకు, క్రియాయోగః - కర్మ అనే ఉపాయము, తావత్ - ముందుగా, విచారితః కిమ్ - విచారము చేయబడినదా యేమి?, అథవా - లేక, లౌకికః - లౌకికమైనదియేనా?, పృచ్ఛతః - అడుగుచున్న, మే - నాకు, సాధు - సరిగ్గా, భణ్యతామ్ - చెప్పబడుగాక!

అది యట్లుండ, ఈ వైదికకర్మ అనే ఉపాయమును గురించి మీరు ముందుగా విచారము చేసినారా? లేక, ఇది లౌకికమైన కర్మయేనా? ప్రశ్నించుచున్న నాకు సరిగ్గా చెప్పుడు.

నంద ఉవాచ ।
పర్జన్యో భగవానింద్రో మేఘాస్తస్యాత్మమూర్తయః ।
తేఽభివర్షంతి భూతానాం ప్రీణనం జీవనం పయః ॥ 8

భగవాన్ ఇంద్రః - ఇంద్ర భగవానుడు, పర్జన్యః - వర్షాధిపతి, మేఘాః - మేఘములు, తస్య - ఆయనకు, ఆత్మమూర్తయః - తన రూపములే, తే - అవి, భూతానామ్ - ప్రాణులకు, ప్రీణనమ్ - ప్రీతిని కలిగించునట్టియు, జీవనమ్ - ప్రాణములను నిలబెట్టే, పయః - నీటిని, అభివర్షంతి - అంతటా వర్షించును.

నందుడిట్లు పలికెను --- ఇంద్రభగవానుడు వర్షాధిపతి. మేఘములు ఆయనకు తన రూపములే. అవి అంతటా వర్షించి ప్రాణులకు ప్రీతిని కలిగించి, ప్రాణములను నిలబెట్టును.

తం తాత వయమన్యే చ వార్ముచాం పతిమీశ్వరమ్ ।
ద్రవ్యైస్తద్రేతసా సిద్ధైర్యజంతే క్రతుభిర్నరాః ॥ 9

తాత - అబ్బాయీ!, వయమ్ - మనము, అన్యే - ఇతరులైన, నరాః చ - మానవులు కూడ, వార్-ముచామ్ - నీటిని వర్షించే మేఘములకు, పతిమ్ - ప్రభుడైన, ఈశ్వరమ్ - దేవేంద్రుని, తత్-రేతసా - ఆయన ఇచ్చిన వర్షముచే, సిద్ధైః - సిద్ధించిన, ద్రవ్యైః - వస్తువులతో, యజంతే - పూజించెదరు.

అబ్బాయీ! మనమే కాకుండా ఇతరమానవులు కూడ నీటిని వర్షించే మేఘములకు ప్రభుడగు దేవేంద్రుని ద్రవ్యములతో పూజించెదరు. ఆ ద్రవ్యములు ఆయన అనుగ్రహించిన వర్షము వలన ఉత్పన్నమైనవే.

తచ్ఛేషేణోపజీవంతి త్రివర్గఫలహేతవే ।
పుంసాం పురుషకారాణాం పర్జన్యః ఫలభావనః ॥ 10

తత్-శేషేణ - ఆ యాగముయొక్క మిగిలినదానితో, త్రివర్గఫలహేతవే - ధర్మార్థకామముల ఫలము సిద్ధించుట కొరకై, ఉపజీవంతి - బ్రదుకు దెరువును కల్పించుకొనెదరు, పుంసామ్ - మానవుల, పురుషకారాణామ్ -

వ్యాపారములకు, పర్జన్యః - వర్షాధిపతి, ఫలభావనః - ఫలమును ఉత్పన్నము చేయువాడు.

ఆ యాగము చేయగా మిగిలిన ద్రవ్యములతో జనులు జీవిస్తూ ధర్మార్థ కామములను సాధించుకొనెదరు. మానవుల కృష్యాది వ్యాపారములకు ఫలమును ఉత్పన్నము చేసేది వర్షాధిపతియగు ఇంద్రుడే.

య ఏవం విసృజేద్ధర్మం పారంపర్యాగతం నరః ।
కామాల్లోభాద్భయాద్ద్వేషాత్స వై నాప్నోతి శోభనమ్ ।। 11

ఏవమ్ - ఈ విధముగా, పారంపర్య-ఆగతమ్ - పరంపరగా వచ్చిన, ధర్మమ్ - ధర్మమును, యః - ఏ, నరః - మానవుడు, కామాత్ - కామన వలన, లోభాత్ - లోభము వలన, భయాత్ - భయము వలన, ద్వేషాత్ - ద్వేషము వలన, విసృజేత్ - విడిచిపెట్టునో, సః - ఆతడు, శోభనమ్ - కల్యాణమును, న ఆప్నోతి - పొందడు, వై - నిశ్చయము.

ఈ విధముగా ఈ ధర్మము పరంపరగా వచ్చుచున్నది. దీనిని ఏ వ్యక్తియైతే భోగాసక్తి వలన, ధనలోభము వలన, దానిని వ్యతిరేకించువారి భయము వలన, లేదా దేవతాద్వేషము వలన విడిచిపెట్టునో, అట్టి వానికి శుభము కలుగదు.

శ్రీశుక ఉవాచ ।
వచో నిశమ్య నందస్య తథాఽన్యేషాం వ్రజౌకసామ్ ।
ఇంద్రాయ మన్యుం జనయన్ పితరం ప్రాహ కేశవః ।। 12

నందస్య - నందుని, తథా - మరియు, వ్రజ-ఓకసామ్ - గోకులమునందు నివసించే, అన్యేషామ్ - ఇతరుల, వచః - మాటను, నిశమ్య - విని, కేశవః - శ్రీకృష్ణ భగవానుడు, ఇంద్రాయ - ఇంద్రుని కొరకు, మన్యుమ్ - కోపమును, జనయన్ - కలిగించువాడై, పితరమ్ - తండ్రిని ఉద్దేశించి, ప్రాహ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- నందుడు మరియు గోకులములో నివసించే ఇతరులు చెప్పిన ఆ మాటను విని, శ్రీకృష్ణ భగవానుడు తండ్రితో నిట్లనెను. ఆయన పలుకులు ఇంద్రునకు కోపము తెప్పించెను.

శ్రీభగవానువాచ ।
కర్మణా జాయతే జంతుః కర్మణైవ విలీయతే ।
సుఖం దుఃఖం భయం క్షేమం కర్మణైవాభిపద్యతే ॥ 13

జంతుః - ప్రాణి, కర్మణా - కర్మచే, జాయతే - పుట్టును, కర్మణా ఏవ - కర్మ చేతనే, విలీయతే - విలీనమగును, సుఖమ్ - సుఖము, దుఃఖమ్ - దుఃఖము, భయమ్ - భయము, క్షేమమ్ - క్షేమము, కర్మణా ఏవ - కర్మ చేతనే, అభిపద్యతే - పొందును.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- జీవుడు కర్మ చేతనే పుట్టి కర్మ చేతనే మరణించును. జీవుడు కర్మ చేతనే సుఖదుఃఖభయక్షేమములను పొందుచున్నాడు.

అస్తి చేదీశ్వరః కశ్చిత్ఫలరూప్యన్యకర్మణామ్ ।
కర్తారం భజతే సోఽపి న హ్యకర్తుః ప్రభుర్హి సః ॥ 14

అన్యకర్మణామ్ - ఇతరుల కర్మలకు, ఫలరూపీ - ఫలములనిచ్చే, ఈశ్వరః - ఈశ్వరుడు, కశ్చిత్ - ఒకానొకడు, అస్తి చేత్ - ఉన్నట్లైతే, సః అపి - ఆ ఈశ్వరుడు కూడ, కర్తారమ్ - కర్తను, భజతే - ఫలముతో సేవించును, హి - ఏలయన, సః - ఆ ఈశ్వరుడు, అకర్తుః - కర్మను చేయనివానికి, ప్రభుః - ఫలమునిచ్చువాడు, న హి - కానే కాదు.

జీవుల కర్మలకు ఫలమునిచ్చే ఈశ్వరుడొకడు ఉన్నట్లైతే, ఆ ఈశ్వరుడు కూడ కర్మలను చేసినవానికే ఫలమునిచ్చును. కర్మను చేయనివానికి ఆయన కూడ ఫలమునీయలేడు గదా!

కిమింద్రేణేహ భూతానాం స్వస్వకర్మానువర్తినామ్ ।
అనీశేనాన్యథా కర్తుం స్వభావవిహితం నృణామ్ ॥ 15

స్వస్వకర్మ-అనువర్తినామ్ - తమ తమ కర్మలననుసరించే, భూతానామ్ - ప్రాణులకు, ఇహ - ఈ లోకమునందు, నృణామ్ - మానవులకు, స్వభావవిహితమ్ - పూర్వసంస్కారముచే కలిగించబడే సుఖదుఃఖములను, అన్యథా - మరియొక విధముగా, కర్తుమ్ -

చేయుటకు, అనీశేన - సమర్థుడు కాని, ఇంద్రేణ - ఇంద్రునితో, కిమ్ - ఏమి ప్రయోజనము?

మానవులకు పూర్వసంస్కారములచే కలిగించబడే సుఖదుఃఖములను మార్చే శక్తి ఇంద్రునికి లేదు. ఈ లోకములో తమ తమ కర్మల ఫలములననుభవించే ప్రాణులకు అట్టి ఇంద్రునితో పని యేమున్నది?

స్వభావతంత్రో హి జనస్స్వభావమనువర్తతే ।
స్వభావస్థమిదం సర్వం సదేవాసురమానుషమ్ ॥ 16

జనః - మానవుడు, స్వభావతంత్రః హి - స్వభావము (పూర్వసంస్కారము) నకు వశుడే, స్వభావమ్ - స్వభావమును, అనువర్తతే - అనుసరించును, సదేవ-అసురమానుషమ్ - దేవతలు అసురులు మానవులతో కూడిన, ఇదమ్ - ఈ, సర్వమ్ - సకలజగత్తు, స్వభావస్థమ్ - స్వభావమునందు నిలిచియున్నది.

జీవుడు స్వభావము (అజ్ఞానము) నకు వశుడై స్వభావమునే అనుసరించును. దేవతలు, రాక్షసులు, మానవులతో సహా సకలజగత్తు స్వభావమునందే నిలిచి యున్నది.

దేహానుచ్చావచాఞ్జంతుః ప్రాప్యోత్సృజతి కర్మణా ।
శత్రుర్మిత్రముదాసీనః కర్మైవ గురురీశ్వరః ॥ 17

జంతుః - జీవుడు, కర్మణా - కర్మచే, ఉచ్చావచాన్ - ఉత్కృష్టనికృష్టములైన, దేహాన్ - శరీరములను, ప్రాప్య - పొంది, ఉత్సృజతి - విడిచిపెట్టును, శత్రుః - శత్రువు, మిత్రమ్ - మిత్రుడు, ఉదాసీనః - ఉదాసీనుడు, గురుః - గురువు, ఈశ్వరః - ఈశ్వరుడు, కర్మ ఏవ - కర్మయే.

జీవుడు కర్మచే ఉత్కృష్టనికృష్టములగు దేహములను పొంది విడిచి పెట్టుచుండును. శత్రువు, మిత్రుడు, ఉదాసీనుడు, గురువు కర్మఫలముగనే లభించెదరు. ఈశ్వరకృప కూడ పుణ్యకర్మాధీనమే.

తస్మాత్సంపూజయేత్కర్మ స్వభావస్థస్స్వకర్మకృత్ ।
అంజసా యేన వర్తేత తదేవాస్య హి దైవతమ్ ॥ 18

తస్మాత్ - అందువలన, కర్మ - కర్మను, సంపూజయేత్ - బాగుగా పూజించవలెను, స్వభావస్థః - స్వభావమునందున్నవాడు, స్వకర్మకృత్ - తన ధర్మమునాచరించువాడు, హి - ఏలయన, యేన - దేనిచే, అంజసా - సుఖముగా, వర్తేత - జీవించునో, తత్ ఏవ - అదియే, అస్య - వీనికి, దైవతమ్ - దైవము.

కావున, మానవుడు కర్మను బాగుగా పూజించవలెను. వ్యక్తి స్వభావమునకు వశుడైయున్నంతవరకు స్వధర్మమునాచరించవలెను. వ్యక్తి దేనిచే సుఖముగా మనగల్గునో, అదియే వానికి దైవము.

ఆజీవ్యైకతరం భావం యస్త్వన్యముపజీవతి ।
న తస్మాద్విందతే క్షేమం జారం నార్యసతీ యథా ॥ 19

యః తు - ఎవడైతే, ఏకతరమ్ - రెండింటిలో ఒక, భావమ్ - వస్తువును, ఆజీవ్య - బ్రదుకు దెరువుగా ఆశ్రయించి, అసతీ - అయోగ్యురాలగు, నారీ - స్త్రీ, జారం యథా - విటుని వలె, అన్యమ్ - మరియొకదానిని, ఉపజీవతి - బ్రదుకు దెరువుగా ఆశ్రయించునో అట్టివాడు, తస్మాత్ - దాని వలన, క్షేమమ్ - క్షేమమును, న విందతే - పొందడు.

అయోగ్యురాలగు యువతి విటుని ఆశ్రయించినట్లుగా, ఎవడైతే ఒకదానిని బ్రదుకు దెరువుగా చేసుకొని జీవించి మరియొకదానిని జీవికకై ఆశ్రయించునో (సేవించునో), అట్టివాడు దాని వలన క్షేమమును పొందడు.

వర్తేత బ్రహ్మణా విప్రో రాజన్యో రక్షసా భువః ।
వైశ్యస్తు వార్తయా జీవేచ్ఛూద్రస్తు ద్విజసేవయా ॥ 20

విప్రః - బ్రాహ్మణుడు, బ్రహ్మణా - వేదముతో, రాజన్యః - క్షత్రియుడు, భువః - భూమియొక్క, రక్షసా - రక్షణతో, వర్తేత - జీవికను సంపాదించవలెను, వైశ్యః తు - వైశ్యుడైతే, వార్తయా - వార్తతో, శూద్రః తు - శూద్రుడైతే, ద్విజసేవయా - బ్రాహ్మణక్షత్రియవైశ్యుల సేవచే, జీవేత్ - జీవించవలెను.

బ్రాహ్మణునకు వేదము, క్షత్రియునకు భూపాలనము, వైశ్యునకు వార్త, శూద్రునకు వారికి సేవలనందించుట అనునవి జీవిక కాదగును.

కృషివాణిజ్యగోరక్షా కుసీదం తుర్యముచ్యతే ।
వార్తా చతుర్విధా తత్ర వయం గోవృత్తయోఽనిశమ్ ॥ 21

కృషివాణిజ్యగోరక్షాః - వ్యవసాయము వర్తకము గోవులను పాలించుటలు, కుసీదమ్ - ధర్మవడ్డీ వ్యాపారము, తుర్యమ్ - నాల్గవదని, ఉచ్యతే - చెప్పబడుచున్నది, వార్తా - వార్త, చతుర్-విధమ్ - నాల్గు రకములుగా నున్నది, వయమ్ - మనము, అనిశమ్ - అన్ని వేళలా, గోవృత్తయః - గోవులే జీవికగా కలవారము.

వ్యవసాయము, వర్తకము, గోవులను పాలించుట, ధర్మవడ్డీ వ్యాపారము అని వార్త నాల్గు రకములుగా నున్నది. మనకైతే ఎల్లవేళలా గోపాలనమే జీవిక.

సత్త్వం రజస్తమ ఇతి స్థిత్యుత్పత్త్యంతహేతవః ।
రజసోత్పద్యతే విశ్వమన్యోన్యం వివిధం జగత్ ॥ 22

సత్త్వమ్ - సత్త్వము, రజః - రజోగుణము, తమః - తమోగుణము, ఇతి - అనేవి, స్థితి-ఉత్పత్తి-అంతహేతవః - స్థితికి సృష్టికి ప్రళయమునకు కారణములు, అన్యోన్యమ్ - స్త్రీపురుషసంయోగముచే, వివిధమ్ - పలురకములైన, విశ్వమ్ - జగత్తు, రజసా - రజోగుణముచే, ఉత్పద్యతే - పుట్టుచున్నది.

సత్త్వగుణము స్థితికి, రజోగుణము సృష్టికి, తమోగుణము ప్రళయమునకు హేతువులు. స్త్రీపురుషసంయోగముచే పలు రకముల ప్రాణులతో విరాజిల్లే జగత్తు రజోగుణము కారణముగా పుట్టుచున్నది.

రజసా చోదితా మేఘా వర్షంత్యంబూని సర్వతః ।
ప్రజాస్తైరేవ సిధ్యంతి మహేంద్రః కిం కరిష్యతి ॥ 23

రజసా - రజోగుణముచే, చోదితాః - ప్రేరితములై, మేఘాః - మేఘములు, సర్వతః - అంతటా, అంబూని - జలములను, వర్షంతి -

వర్షించును, ప్రజాః - ప్రాణులు, తైః ఏవ - ఆ జలములతోనే, సిద్ధ్యంతి - జీవించుచున్నవి, మహా-ఇంద్రః - దేవేంద్రుడు, కిమ్ - దేనిని, కరిష్యతి - చేయగలడు?

రజోగుణముచే ప్రేరితములై మేఘములు అంతటా జలములను వర్షించును. ప్రాణులు ఆ జలములతోనే జీవించును. దేవేంద్రుడు చేసేదేమున్నది? (ఏమీ లేదు).

న నః పురో జనపదా న గ్రామా న గృహా వయమ్ ।
నిత్యం వనౌకసస్తాత వనశైలనివాసినః ॥ 24

తాత - ఓ తండ్రీ!, నః - మనకు, పురః - నగరములు, జనపదాః - దేశములు, న - లేవు, గ్రామాః - గ్రామములు, న - లేవు, గృహాః - ఇళ్లు, న - లేవు, వయమ్ - మనము, నిత్యమ్ - ఎల్లవేళలా, వన-ఓకసః - వనమే నివాసముగా గలవారము, వనశైలనివాసినః - అడవియందలి పర్వతములపై నివసించువారము.

ఓ తండ్రీ! మనకు దేశములు గాని, నగరములు గాని, గ్రామములు గాని, గృహములు గాని లేవు. మనము ఎల్లవేళలా అడవులయందు పర్వతములపై నివసించువారము.

తస్మాద్గవాం బ్రాహ్మణానామద్రేశ్చారభ్యతాం మఖః ।
య ఇంద్రయాగసంభారాస్తైరయం సాధ్యతాం మఖః ॥ 25

తస్మాత్ - అందువలన, గవామ్ - గోవులకు, బ్రాహ్మణానామ్ - వేదవేత్తలకు, అద్రేః చ - పర్వతమునకు కూడ, మఖః - యాగము, ఆరభ్యతామ్ - ఆరంభించబడు గాక!, ఇంద్రయాగసంభారాః - ఇంద్రయాగముయొక్క సామగ్రులు, యే - ఏవి గలవో, తైః - వాటితో, అయమ్ - ఈ, మఖః - యాగము, సాధ్యతామ్ - సంపాదించబడుగాక!

కావున, గోవులను, వేదవేత్తలను, పర్వతమును ఆరాధించే యజ్ఞమును ఆరంభించుడు. ఇంద్రయాగముయొక్క సామగ్రి యేది గలదో, దానితో ఈ యాగమును నిర్వర్తించుడు.

పచ్యంతాం వివిధాః పాకాస్సూపాంతాః పాయసాదయః ।
సంయావాపూపశష్కుల్యస్సర్వదోహశ్చ గృహ్యతామ్ ॥ 26

పాయస-ఆదయః - పాయసము ఆదిగా కలిగినట్టియు, సూప-అంతాః - పప్పు ఆఖరున గలవి, సంయావ-అపూపశష్కుల్యః - గోధుమ రవ్వ ఉప్మా అప్పములు చెగోడీలు, వివిధాః - పలు రకములైన, పాకాః - వంటలు, పచ్యంతామ్ - వండబడుగాక!, సర్వదోహః చ - సకలమైన పాలు పెరుగులు కూడ, గృహ్యతామ్ - తీసుకు రాబడుగాక!

పాయసము, పప్పు, గోధుమ రవ్వ ఉప్మా, అప్పములు, చెగోడీలు మొదలైన పలు రకముల వంటలను చేయుడు. అందరి ఇళ్లలోని పాలను, పెరుగును కూడ తీసుకురండు.

హూయంతామగ్నయస్సమ్యగ్బ్రాహ్మణైర్బ్రహ్మవాదిభిః ।
అన్నం బహువిధం తేభ్యో దేయం వో ధేనుదక్షిణాః ॥ 27

బ్రహ్మవాదిభిః - వేదవేత్తలైన, బ్రాహ్మణైః - బ్రాహ్మణులచే, అగ్నయః - అగ్నులు, సమ్యక్ - యథావిధిగా, హూయంతామ్ - హోమము చేయబడుగాక!, వః - మీచే, తేభ్యః - వారి కొరకు, బహువిధమ్ - పలు రకములైన, అన్నమ్ - ఆహారము, దేయమ్ - ఈయదగినది, ధేనుదక్షిణాః - గోవుల దక్షిణలు.

వేదవేత్తలగు బ్రాహ్మణులు యథావిధిగా అగ్నులయందు హోమమును చేయవలెను. మీరు వారికి పలు రకముల ఆహారమునిచ్చి, పాలిచ్చే ఆవులను దక్షిణగా ఈయవలెను.

అన్యేభ్యశ్చాశ్వచాండాలపతితేభ్యో యథార్హతః ।
యవసం చ గవాం దత్త్వా గిరయే దీయతాం బలిః ॥ 28

ఆశ్వచాండాలపతితేభ్యః - కుక్కలు పశుహింసకులు పతితుల వరకు, అన్యేభ్యః చ - ఇతరులకు కూడ, యథా-అర్హతః - యోగ్యతకు తగ్గట్లుగా, గవాం చ - గోవులకు కూడ, యవసమ్ - గడ్డిని, దత్త్వా - ఇచ్చి, గిరయే - పర్వతము కొరకు, బలిః - నైవేద్యము, దీయతామ్ - ఈయబడుగాక!

పశుహింసకులు, నేరస్థులు మొదలైన పతితుల వరకు, అంతిమముగా వీధి కుక్కలకు కూడ అర్హతకు తగ్గట్లుగా వస్తువులనిండు. గోవులకు గడ్డిని పెట్టుడు. పర్వతమునకు నైవేద్యమును పెట్టుడు.

స్వలంకృతా భుక్తవంతస్స్వనులిప్తాస్సువాససః ।
ప్రదక్షిణం చ కురుత గోవిప్రానలపర్వతాన్ ॥ 29

సు-అలంకృతాః - బాగుగా అలంకరించుకున్నవారు, భుక్తవంతః - భుజించినవారు, సు-అనులిప్తాః - బాగుగా సుగంధములనలదుకున్నవారు, సువాససః - మంచి వస్త్రములు గలవారు, గోవిప్ర-అనలపర్వతాన్ - గోవులను వేదవేత్తలను అగ్నులను పర్వతమును, ప్రదక్షిణం చ - ప్రదక్షిణమును కూడ, కురుత - చేయుడు.

భుజించి సుగంధములనలదుకొని మంచి వస్త్రములను దాల్చి మంచి సొమ్ములను పెట్టుకొని, గోవులకు, వేదవేత్తలకు, అగ్నులకు, గోవర్ధన పర్వతమునకు కూడ ప్రదక్షిణములను చేయుడు.

ఏతన్మమ మతం తాత క్రియతాం యది రోచతే ।
అయం గోబ్రాహ్మణాద్రీణాం మహ్యం చ దయితో మఖః ॥ 30

తాత - ఓ తండ్రీ!, ఏతత్ - ఇది, మమ - నా, మతమ్ - అభిప్రాయము, రోచతే యది - నచ్చినచో, క్రియతామ్ - చేయబడుగాక!, అయమ్ - ఈ, మఖః - యాగము, గోబ్రాహ్మణ-అద్రీనామ్ - గోవులకు వేదవేత్తలకు పర్వతమునకు, మహ్యం చ - నా కొరకు కూడ, దయితః - ప్రియమైనది.

ఓ తండ్రీ! ఇది నా అభిప్రాయము. నచ్చినచో ఆచరించుడు. ఈ యాగము గోవులకు, వేదవేత్తలకు, గోవర్ధన పర్వతమునకు, నాకు కూడ ప్రీతికరమైనది.

శ్రీశుక ఉవాచ ।
కాలాత్మనా భగవతా శక్రదర్పం జిఘాంసతా ।
ప్రోక్తం నిశమ్య నందాద్యాస్సాధ్వగృహ్ణంత తద్వచః ॥ 31

కాల-ఆత్మనా - కాలస్వరూపుడైనట్టియు, శక్రదర్పమ్ - ఇంద్రుని గర్వమును, జిఘాంసతా - పోగొట్ట గోరే, భగవతా - శ్రీకృష్ణ భగవానునిచే, ప్రోక్తమ్ - చెప్పబడినదానిని, నిశమ్య - విని, నంద-ఆద్యాః - నందుడు మొదలుగా గలవారు, తద్-వచః - ఆయనయొక్క మాటను, సాధు - మంచిది అని, అగృహ్ణాంత - స్వీకరించిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- కాలస్వరూపుడైన శ్రీకృష్ణ భగవానుడు ఇంద్రుని గర్వమునడంచ గోరి ఇట్లు చెప్పెను. నందుడు, సునందుడు మొదలుగా గలవారు ఆ మాటను బాగున్నది అంటూ స్వీకరించిరి.

తథా చ వ్యదధుస్సర్వం యథాऽऽహ మధుసూదనః ।
వాచయిత్వా స్వస్త్యయనం తద్ద్రవ్యేణ గిరిద్విజాన్ ॥ 32

ఉపహృత్య బలీన్ సర్వానాదృతా యవసం గవామ్ ।
గోధనాని పురస్కృత్య గిరిం చక్రుః ప్రదక్షిణమ్ ॥ 33

మధుసూదనః - మధువు అనే రాక్షసుని సంహరించిన శ్రీకృష్ణ భగవానుడు, యథా - ఏ విధముగా, ఆహ - చెప్పెనో, తథా చ - అదే విధముగా, సర్వమ్ - అంతను, వ్యదధుః - చేసిరి, స్వస్త్యయనం వాచయిత్వా - స్వస్తివాచనమును చేయించి, తద్-ద్రవ్యేణ - ఆ ద్రవ్యముతో, గిరిద్విజాన్ - పర్వతమును వేదవేత్తలను ఉద్దేశించి, సర్వాన్ - సకలములైన, బలీన్ - ధూపదీపాదులను నైవేద్యములను, గవామ్ - గోవులకు, యవసమ్ - గడ్డిని, ఆదృతాః - ఆదరము గలవారై, ఉపహృత్య - సమర్పించి, గోధనాని - గోవుల సంపదలను, పురస్కృత్య - ముందిడు కొని, గిరిమ్ - పర్వతమును, ప్రదక్షిణమ్ - ప్రదక్షిణమును, చక్రుః - చేసిరి.

మధువు అనే రాక్షసుని సంహరించిన శ్రీకృష్ణ భగవానుడెట్లు చెప్పెనో, వారదే విధముగా సర్వమును చేసిరి. వారు వేదవేత్తలచే స్వస్తివాచనమును చేయించిరి. ఆ ఇంద్రయాగసంభారములతో గోవర్ధన పర్వతమునకు, వేదవేత్తలకు, గోవులకు సకలములైన ధూపదీపనైవేద్యాదులను, గోవులకు గడ్డిని వారు ఆదరముగా

సమర్పించిరి. తరువాత వారు గోసంపదలు ముందు నడువగా పర్వతమునకు ప్రదక్షిణమును చేసిరి.

అనాంస్యనడుద్యు క్తాని తే చారుహ్య స్వలంకృతాః ।
గోప్యశ్చ కృష్ణవీర్యాణి గాయంత్యస్సద్విజాశిషః ।। 34

సద్విజ-ఆశిషః - వేదవేత్తల ఆశీర్వచనములతో కూడిన, తే చ - ఆ గోపాలకులు, సు-అలంకృతాః - బాగుగా అలంకరించుకున్న, గోప్యః చ - గోపికలు కూడ, అనడుద్-యుక్తాని - ఎద్దులను కట్టిన, అనాంసి - బళ్లను, ఆరుహ్య - ఎక్కి, కృష్ణవీర్యాణి - శ్రీకృష్ణుని పరాక్రమములను, గాయంత్యః - గానము చేయువారు.

ఆ గోపాలకులు వేదవేత్తల ఆశీర్వచనములను తీసుకొనిరి. గోపికలు కూడ బాగుగా అలంకరించుకొని ఎద్దులను కట్టిన బళ్లనెక్కి శ్రీకృష్ణుని పరాక్రమ గాథలను గానము చేసిరి.

కృష్ణస్త్వన్యతమం రూపం గోపవిశ్రంభణం గతః ।
శైలోఽస్మీతి బ్రువన్ భూరి బలిమాదద్బృహద్వపుః ।। 35

కృష్ణః తు - శ్రీకృష్ణుడైతే, గోపవిశ్రంభణమ్ - గోపాలకులకు విశ్వాసమును కలిగించే, అన్యతమమ్ - రూపములలో గొప్పదైన, రూపమ్ - రూపమును, గతః - స్వీకరించినవాడు, శైలః - పర్వతము, అస్మి - అగుచున్నాను, ఇతి - అని, బ్రువన్ - పలుకుచున్నవాడై, బృహద్-వపుః - పెద్ద శరీరము గలవాడు, భూరి - అధికమగు, బలిమ్ - నైవేద్యమును, ఆదత్ - తినెను.

శ్రీకృష్ణుడైతే గోపాలకులకు విశ్వాసమును కలిగించుటకై పర్వతము పైన మరియొక పెద్ద శరీరము గల రూపమును దాల్చెను. పర్వతమును నేనే అని చెప్పి, ఆయన అధికమగు నైవేద్యమును భక్షించెను.

తస్మై నమో వ్రజజనైస్సహ చక్రేఽత్మనాఽఽత్మనే ।
అహో పశ్యత శైలోఽసౌ రూపీ నోఽనుగ్రహం వ్యధాత్ ।। 36

సః - ఆ శ్రీకృష్ణుడు, వ్రజజనైః - గోకులవాసులతో, సహ - కూడి, ఆత్మనా - స్వయముగా, తస్మై - ఆ, ఆత్మనే - తన రూపము కొరకు, నమః - నమస్కారమును, చక్రే - చేసెను, అహో - ఆశ్చర్యము!, పశ్యత - చూడుడు, అసౌ - ఈ, శైలః - పర్వతము, రూపీ - రూపు దాల్చినదై, నః - మనల కొరకు, అనుగ్రహమ్ - అనుగ్రహమును, వ్యధాత్ - చేసెను.

ఆ శ్రీకృష్ణుడు గోకులవాసులతో కూడి స్వయముగా ఆ తన రూపము కొరకు నమస్కారము చేసెను. ఆశ్చర్యము! చూడుడు. ఈ పర్వతము రూపు దాల్చి మనలననుగ్రహించినది, (అని వారు పలికిరి).

ఏషోఽవజానతో మర్త్యాన్ కామరూపీ వనౌకసః ।
హంతి హ్యస్మై నమస్యామశ్శర్మణే ఆత్మనో గవామ్ ॥ 37

కామరూపీ - కోరిన రూపమును దాల్చే, ఏషః - ఈ పర్వతము, అవజానతః - అవమానించునట్టియు, వన-ఓకసః - అడవిలో నివసించే, మర్త్యాన్ - మానవులను, హంతి - హింసించును, హి - అందునలన, ఆత్మనః - మనల, గవామ్ - గోవులయొక్క, శర్మణే - క్షేమము కొరకు, అస్మై - దీని కొరకు, నమస్యామః - నమస్కరించెదము.

కోరుకున్న రూపమును దాల్చే ఈ పర్వతము అడవిలో ఉంటూ అవమానించే జనులను హింసించును. కావున, మనల మరియు గోవుల క్షేమము కొరకై దీనికి నమస్కరించెదము.

ఇత్యద్రిగోద్విజమఖం వాసుదేవప్రణోదితాః ।
యథా విధాయ తే గోపాస్సహకృష్ణా వ్రజం యయుః ॥ 38

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే చతుర్వింశోఽధ్యాయః ॥

ఇతి - ఈ విధముగా, వాసుదేవప్రణోదితాః - వసుదేవపుత్రుడగు శ్రీకృష్ణునిచే ప్రేరితులై, తే - ఆ, గోపాః - గోపాలకులు, అద్రిగోద్విజమఖమ్ - పర్వతము గోవులు వేదవేత్తల ఆరాధనను, యథా - యథావిధిగా, విధాయ - చేసి, సహకృష్ణాః - శ్రీకృష్ణునితో కూడినవారై, వ్రజమ్ - గోకులమును గురించి, యయుః - వెళ్లిరి.

ఈ విధముగా ఆ గోపాలకులు వసుదేవపుత్రుడగు శ్రీకృష్ణునిచే ప్రేరితులై గోవర్ధనపర్వతమును, గోవులను, వేదవేత్తలను ఆరాధించిరి. తరువాత వారు శ్రీకృష్ణునితో గూడి గోకులమునకు వెళ్లిరి.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్ధములో శ్రీకృష్ణుడు ఇంద్రయాగమునాపుటను వర్ణించే
ఇరువది నాల్గవ అధ్యాయము ముగిసినది (24).

* * * * *

# అథ పంచవింశోఽధ్యాయః

## గోవర్ధనోద్ధారము

శ్రీశుక ఉవాచ ।
ఇంద్రస్తదాఽఽత్మనః పూజాం విజ్ఞాయ విహతాం నృప ।
గోపేభ్యః కృష్ణనాథేభ్యో నందాదిభ్యశ్చుకోప సః ॥ 1

నృప - ఓ రాజా!, తదా - అప్పుడు, సః - ఆ, ఇంద్రః - ఇంద్రుడు, విహతామ్ - ఆపివేయబడిన, ఆత్మనః - తనయొక్క, పూజామ్ - పూజను గురించి, విజ్ఞాయ - తెలుసుకొని, కృష్ణనాథేభ్యః - శ్రీకృష్ణుడు రక్షకుడుగా కలిగినట్టియు, నంద-ఆదిభ్యః - నందుడు మొదలుగా గల, గోపేభ్యః - గోపాలకుల కొరకు, చుకోప - కోపించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుడు రక్షకుడుగా గల నందుడు మొదలైన గోపాలకులు తన పూజను ఆపివేసిరని తెలిసి, అప్పుడా ఇంద్రునకు కోపము వచ్చెను.

గణం సాంవర్తకం నామ మేఘానాం చాంతకారిణామ్ ।
ఇంద్రః ప్రాచోదయత్క్రుద్ధో వాక్యం చాహేశమాన్యుత ॥ 2

క్రుద్ధః - కోపించినవాడు, ఈశమానీ - లోకపాలకుడననే అభిమానము గలవాడు అగు, ఇంద్రః - ఇంద్రుడు, అంతకారిణామ్ - ప్రళయమును చేసే, మేఘానామ్ - మేఘములయొక్క, సాంవర్తకం నామ - సాంవర్తక మని ప్రసిద్ధి గాంచిన, గణమ్ - గుంపును, ప్రాచోదయత్ - ఆజ్ఞాపించెను, ఉత - మరియు, వాక్యం చ - వాక్యమును కూడ, ఆహ - పలికెను.

లోకపాలకుడననే అభిమానముతో కోపించిన ఇంద్రుడు సాంవర్తకమని ప్రసిద్ధి గాంచిన మేఘముల గణమును ఆజ్ఞాపించెను. ఆ మేఘములు ప్రళయమును కలిగించును. ఆయన వాటితో నిట్లనెను.

అహో శ్రీమదమాహాత్మ్యం గోపానాం కాననౌకసామ్ ।
కృష్ణం మర్త్యముపాశ్రిత్య యే చక్రుర్దేవహేలనమ్ ॥ 3

అహో - ఆహా!, కానన-ఓకసామ్ - అడవియందు నివసించే, గోపానామ్ - గోపాలకుల, శ్రీమదమాహాత్మ్యమ్ - ధనగర్వముయొక్క మహిమ, యే - ఎవరైతే, మర్త్యమ్ - మానవుడైన, కృష్ణమ్ - కృష్ణుని, ఉపాశ్రిత్య - ఆశ్రయించి, దేవహేలనమ్ - దేవతనగు నాకు అవమానమును, చక్రుః - చేసిరో.

ఆహా! అడవిలో బ్రతికే గోపాలకుల ధనగర్వముయొక్క మహిమను చూడుడు. వారు మానవుడగు కృష్ణుని ఆశ్రయించి నాకు అవమానమును చేసిరి.

యథాఽదృఢైః కర్మమయైః క్రతుభిర్నామనౌనిభైః ।
విద్యామాన్వీక్షికీం హిత్వా తితీర్షంతి భవార్ణవమ్ ॥ 4

యథా - ఏ విధముగానైతే, ఆన్వీక్షికీమ్ - ఆత్మస్వరూపమును తెలిపే, విద్యామ్ - జ్ఞానమును, హిత్వా - విడిచిపెట్టి, అదృఢైః - గట్టి లేనట్టియు, కర్మమయైః - కర్మరూపములైనట్టియు, నామనౌనిభైః - పేరుకి నావవంటివి ఐన, క్రతుభిః - యజ్ఞములతో, భవ-అర్ణవమ్ - సంసారసముద్రమును, తితీర్షంతి - తరించ గోరెదరో.

కర్మరూపములైన యజ్ఞములు పేరుకి నావవంటివి. కాని, అవి గట్టివి కావు. కొందరు ఆత్మస్వరూపమును బోధించే జ్ఞానమును ప్రక్కన బెట్టి, వాటితో సంసారసముద్రమును తరించ గోరెదరు. అదే విధముగా గోపాలకులు చేయుచున్నారు.

వాచాలం బాలిశం స్తబ్ధమజ్ఞం పండితమానినమ్ ।
కృష్ణం మర్త్యముపాశ్రిత్య గోపా మే చక్రురప్రియమ్ ॥ 5

వాచాలమ్ - వదరుబోతు ఐనట్టియు, బాలిశమ్ - మూర్ఖుడైనట్టియు, స్తబ్ధమ్ - గర్విష్ఠి ఐనట్టియు, అజ్ఞమ్ - అజ్ఞాని యైనట్టియు, పండితమానినమ్ - పండితుడననే అభిమానము కలిగినట్టియు, మర్త్యమ్ - మరణించే ధర్మము గల మానవుడైన, కృష్ణమ్ - కృష్ణుని, ఉపాశ్రిత్య -

ఆశ్రయించి, గోపాః - గోపాలకులు, మే - నాకు, అప్రియమ్ - అప్రియమును, చక్రుః - చేసిరి.

కృష్ణుడు వదరుబోతు, మూర్ఖుడు, గర్విష్ఠి, అజ్ఞాని, పండితుడననే అభిమానము గలవాడు, మరణించే స్వభావము గల మానవుడు. వానిని ఆశ్రయించి గోపాలకులు నాకు అప్రియమును చేసిరి.

ఏషాం శ్రియాఽవలిప్తానాం కృష్ణేనాధ్మాయితాత్మనామ్ ।
ధునుత శ్రీమదస్తంభం పశూన్నయత సంక్షయమ్ ॥ 6

శ్రియా - సంపదచే, అవలిప్తానామ్ - గర్వించినట్టియు, కృష్ణేన - కృష్ణునిచే, ఆధ్మాయిత-ఆత్మనామ్ - వర్ధిల్ల జేయబడిన మనస్సులు గల, ఏషామ్ - ఈ గోపాలకుల, శ్రీమదస్తంభమ్ - ధనగర్వము వలని అవినయమును, ధునుత - కడిగి వేయుడు, పశూన్ - పశువులను, సంక్షయమ్ - వినాశమును, నయత - పొందించుడు.

ధనముతో గర్వించి యున్న వీరి మనోబలమును కృష్ణుడు వర్ధిల్ల జేసినాడు. వీరి పొగరును కడిగివేయుడు. పశువులను వినాశము చేయుడు.

అహం చైరావతం నాగమారుహ్యానువ్రజే వ్రజమ్ ।
మరుద్గణైర్మహావీర్యైర్నందగోష్ఠజిఘాంసయా ॥ 7

అహం చ - నేను కూడ, ఐరావతమ్ - ఐరావతమనే, నాగమ్ - ఏనుగును, ఆరుహ్య - ఎక్కి, మహావీర్యైః - గొప్ప బలము గల, మరుద్-గణైః - మరుద్దేవతల గణములతో, నందగోష్ఠజిఘాంసయా - నందుని గోకులమును నశింపజేసే కోరికతో, వ్రజమ్ - గోకులమును గురించి, అనువ్రజే - వెనుకనే వచ్చెదను.

నందుని గోకులమును నశింప జేయగోరుచున్నాను. నేను కూడ గొప్ప బలము గల మరుత్తుల గణములతో కూడి ఐరావతమనే ఏనుగునెక్కి మీ వెంట గోకులమునకు వచ్చెదను.

శ్రీశుక ఉవాచ ।
ఇత్థం మఘవతాఽఽజ్ఞప్తా మేఘా నిర్ముక్తబంధనాః ।
నందగోకులమాసారైః పీడయామాసురోజసా ॥ 8

ఇత్థమ్ - ఈ విధముగా, మఘవతా - ఇంద్రునిచే, ఆజ్ఞప్తాః - ఆజ్ఞాపించబడిన, మేఘాః - మేఘములు, నిర్ముక్తబంధనాః - తొలగించబడిన బంధనములు గలవియై, ఓజసా - వేగముగా, నందగోకులమ్ - నందుని గోకులమును, ఆసారైః - నీటి ధారలతో, పీడయామాసుః - పీడించినవి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా ఆజ్ఞాపించి ఇంద్రుడు మేఘముల బంధనములను తొలగించివేసెను. అవి వేగముగా నందుని గోకులమునకు వచ్చి నీటి ధారలతో పీడను కలుగజేసెను.

విద్యోతమానా విద్యుద్భిః స్తనంతః స్తనయిత్నుభిః ।
తీవ్రైర్మరుద్గణైర్నున్నా వవృషుర్జలశర్కరాః ॥ 9

విద్యుద్భిః - మెరుపులతో, విద్యోతమానాః - అధికముగా ప్రకాశించునవి, స్తనయిత్నుభిః - పిడుగుల ధ్వనులతో, స్తనంతః - గర్జించుచున్నవి, తీవ్రైః - ప్రచండమైన, మరుద్-గణైః - గాలి దేవతల గణములచే, నున్నాః - ప్రేరేపించబడినవి, జలశర్కరాః - వడగళ్లను, వవృషుః - వర్షించినవి.

మెరుపులతో అధికముగా ప్రకాశిస్తూ పిడుగుల ధ్వనులతో గర్జిస్తున్న మేఘములను ప్రచండమగు గాలులతో మరుద్గణములు ప్రేరిపించినవి. అపుడా మేఘములు వడగళ్లను వర్షించినవి.

స్థూణాస్థూలా వర్షధారా ముంచత్స్వభ్రేష్వభీక్ష్ణశః ।
జలౌఘైః ప్లావ్యమానా భూర్నాదృశ్యత నతోన్నతమ్ ॥ 10

అభ్రేషు - మేఘములు, అభీక్ష్ణశః - మరల మరల, స్థూణాస్థూలాః - స్తంభములవలె దొడ్డైన, వర్షధారాః - వర్షధారలను, ముంచత్సు - విడిచిపెట్టునవి కాగా, భూః - నేల, జల-ఓఘైః - నీటి ప్రవాహములచే, ప్లావ్యమానా - ముంచెత్తబడినదై, నత-ఉన్నతమ్ - ఎత్తు పల్లములుగా, న అదృశ్యత - కానరాలేదు.

మేఘములు స్తంభములవలె దొడ్డు నీటి ధారలను నిరంతరముగా వర్షించినవి. నేల అంతా నీటి ప్రవాహములచే ముంచెత్తబడి, ఎత్తు పల్లములు కనబడకుండా పోయినవి.

అత్యాసారాతివాతేన పశవో జాతవేపనాః ।
గోపా గోప్యశ్చ శీతార్తా గోవిందం శరణం యయుః ।। 11

అతి-ఆసార-అతివాతేన - కుండపోత వర్షముతో ప్రచండమగు గాలితో, జాతవేపనాః - పుట్టిన వణుకు గల, పశవః - పశువులు, గోపాః - గోపాలకులు, గోప్యః చ - గోపికలు కూడ, శీత-ఆర్తాః - చలిచే పీడించబడినవారై, గోవిందమ్ - గోవులను రక్షించే శ్రీకృష్ణుని, శరణమ్ - రక్షకునిగా, యయుః - పొందిరి.

కుండపోత వర్షముతో కూడిన ప్రచండమగు గాలి వలన పశువులకు, గోపాలకులకు, గోపికలకు కూడ చలితో వణుకు పుట్టి బాధపడిరి. వారు గోవులను రక్షించే శ్రీకృష్ణుని శరణు వేడిరి.

శిరస్సుతాంశ్చ కాయేన ప్రచ్ఛాద్యాసారపీడితాః ।
వేపమానా భగవతః పాదమూలముపాయయుః ।। 12

ఆసారపీడితాః - కుండపోత వానచే పీడను పొందినవి, వేపమానాః - వణికిపోవుచున్నవి, శిరః - తలను, సుతాన్ చ - దూడలను కూడ, కాయేన - దేహముతో, ప్రచ్ఛాద్య - కప్పుకొని, భగవతః - శ్రీకృష్ణ భగవానుని, పాదమూలమ్ - పాదముల మూలమును, ఉపాయయుః - చేరుకున్నవి.

కుండపోత వర్షముచే పీడించబడి వణికిపోవుచున్న ఆవులు తమ తలను, దూడలను దేహము క్రింద కప్పి, శ్రీకృష్ణ భగవానుని పాదముల మూలమును చేరుకున్నవి.

కృష్ణ కృష్ణ మహాభాగ త్వన్నాథం గోకులం ప్రభో ।
త్రాతుమర్హసి దేవాన్నః కుపితాద్భక్తవత్సల ।। 13

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, మహాభాగ - ఓ మహాత్మా!, ప్రభో - ఓ ప్రభూ!, భక్తవత్సల - భక్తులయందు వాత్సల్యము గలవాడా!,

త్వత్-నాథమ్ - నీవే రక్షకుడుగా గల, గోకులమ్ - గోకులమును, నః - మమ్ములను, కుపితాత్ - కోపించిన, దేవాత్ - ఇంద్రదేవతనుండి, త్రాతుమ్ - రక్షించుటకు, అర్హసి - తగుదువు.

ఓ శ్రీకృష్ణా! ఓ శ్రీకృష్ణా! నీవు మహాత్ముడవు, భక్తులయందు వాత్సల్యము గల ప్రభుడవు. గోకులమునకు రక్షకుడవు నీవే. కోపించిన ఇంద్రునినుండి గోకులమును, మమ్ములను రక్షించుటకు నీవే తగుదువు.

శిలావర్షనిపాతేన హన్యమానమచేతనమ్ ।
నిరీక్ష్య భగవాన్మేనే కుపితేంద్రకృతం హరిః ॥ 14

శిలావర్షనిపాతేన - రాళ్ల వర్షముయొక్క పడుటచే, హన్యమానమ్ - కొట్టబడుచున్నట్టియు, అచేతనమ్ - జడముగా చేయబడిన గోకులమును, నిరీక్ష్య - చూచి, హరిః భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, కుపిత-ఇంద్రకృతమ్ - కోపించిన ఇంద్రునిచే చేయబడినదానినిగా, మేనే - తలచెను.

వడగళ్ల వర్షపు దెబ్బలకు సకలప్రాణులు స్పృహను కోల్పోవుచుండెను. ఆ దృశ్యమును చూచి శ్రీకృష్ణ భగవానుడు, అదంతా కోపించిన ఇంద్రుడు చేసిన పనియేనని తెలుసుకొనెను.

అపర్త్వత్యుల్బణం వర్షమతివాతం శిలామయమ్ ।
స్వయాగే విహతేఽస్మాభిరింద్రో నాశాయ వర్షతి ॥ 15

అప-ఋతు - తొలగిన ఋతువు గలది, అతి-ఉల్బణమ్ - మిక్కిలి భయంకరమైనది, అతివాతమ్ - అధికమగు గాలి గలది, శిలామయమ్ - రాళ్ల రూపములోనున్నది అగు, వర్షమ్ - వర్షమును, అస్మాభిః - మనచే, స్వయాగే - తన యాగము, విహతే - ఆపివేయబడగా, ఇంద్రః - ఇంద్రుడు, నాశాయ - నాశము కొరకై, వర్షతి - వర్షించుచున్నాడు.

మనము తన యాగమును ఆపివేసినందున ఇంద్రుడు మన వినాశము కొరకై వర్ష-ఋతువు కాకున్నా మిక్కిలి భయంకరమైన రాళ్ల వానను కురిపించుచున్నాడు. ఆ వర్షమునకు అధికమగు గాలి తోడై చాల భయమును గొల్పుచున్నది. (అని శ్రీకృష్ణుడు తలపోసెను).

తత్ర ప్రతివిధిం సమ్యగాత్మయోగేన సాధయే ।
లోకేశమానినాం మౌఢ్యాద్ధరిష్యే శ్రీమదం తమః ॥ 16

తత్ర - ఆ విషయమునందు, ప్రతివిధిమ్ - ప్రతిచర్యను, ఆత్మయోగేన - నా సామర్థ్యము (యోగమాయ) చే, సమ్యక్ - బాగుగా, సాధయే - సాధించెదను, మౌఢ్యాత్ - మూర్ఖత్వము వలన, లోక-ఈశమానినామ్ - లోకపాలకులమనే అభిమానము గలవారల, శ్రీమదమ్ - ధనగర్వమనే, తమః - అజ్ఞానమును, హరిష్యే - పోగొట్టెదను.

ఆ విషయమునందు ప్రతిచర్యను నేను నా సామర్థ్యము (మాయాశక్తి) చే బాగుగా సాధించెదను. మూర్ఖత్వముచే లోకపాలకులమనే అభిమానము గల ఇంద్రాదుల ధనగర్వమును, అజ్ఞానమును నేను పోగొట్టెదను.

న హి సద్భావయుక్తానాం సురాణామీశవిస్మయః ।
మత్తోఽసతాం మానభంగః ప్రశమాయోపకల్పతే ॥ 17

సద్-భావయుక్తానామ్ - సత్త్వగుణప్రధానమగు అంతఃకరణముతో కూడియున్న, సురాణామ్ - దేవతలకు, ఈశవిస్మయః - లోకపాలకులమనే గర్వము, న హి - యోగ్యము కానే కాదు, అసతామ్ - దుష్టులకు, మత్తః - నా వలన, మానభంగః - గర్వభంగము, ప్రశమాయ - అనర్థములను పోగొట్టుటకై, ఉపకల్పతే - పర్యవసించును.

దేవతలు సత్త్వప్రధానమగు అంతఃకరణము గలవారు. వారికి తాము పాలకులమనే గర్వము యుక్తము కాదు. దుష్టులకు నేను చేసే గర్వభంగము వారికి అనర్థములను పోగొట్టుటయందే పర్యవసించును.

తస్మాన్మచ్ఛరణం గోష్ఠం మన్నాథం మత్పరిగ్రహమ్ ।
గోపాయే స్వాత్మయోగేన సోఽయం మే వ్రత ఆహితః ॥ 18

తస్మాత్ - అందువలన, మత్-శరణమ్ - నేనే రక్షకుడుగా కలిగినట్టియు; మత్-నాథమ్ - నేనే ప్రభువుగా కలిగినట్టియు, మత్-పరిగ్రహమ్ - నాచే స్వీకరించబడిన (నా కుటుంబమైన), గోష్ఠమ్ - గోకులమును, స్వ-ఆత్మ యోగేన - నా మాయాశక్తిచే, గోపాయే - రక్షించెదను, సః - అట్టి, అయమ్ - ఇది, మే - నాచే, వ్రతః - వ్రతముగా, ఆహితః - స్వీకరించబడినది.

ఈ గోకులమునకు రక్షకుడను, ప్రభువును నేనే. నేనీ గోకులమును నా కుటుంబముగా స్వీకరించినాను. కావున, దీనిని నేను నా మాయాశక్తిచే రక్షించెదను. నేను అట్టి ఈ సత్పురుషులను రక్షించుట అనే వ్రతమును స్వీకరించినాను.

ఇత్యుక్త్వైకేన హస్తేన కృత్వా గోవర్ధానాచలమ్ ।
దధార లీలయా కృష్ణశ్ఛత్రాకమివ బాలకః ॥ 19

ఇతి - అని, ఉక్త్వా - పలికి, కృష్ణః - శ్రీకృష్ణుడు, ఏకేన - ఒక, హస్తేన - చేతితో, గోవర్ధన-అచలమ్ - గోవర్ధన పర్వతమును, కృత్వా - ఊడబెరకి, లీలయా - అవలీలగా, బాలకః - పిల్లవాడు, ఛత్రాకం ఇవ - కుక్క గొడుగును వలె, దధార - ధరించెను.

ఇట్లు పలికి శ్రీకృష్ణుడు ఒకే చేతితో గోవర్ధన పర్వతమునూడబెరకి, పిల్లవాడు కుక్కగొడుగును వలె, అవలీలగా ధరించెను.

అథాహ భగవాన్ గోపాన్ హేఽంబ తాత వ్రజౌకసః ।
యథోపజోషం విశత గిరిగర్తం సగోధనాః ॥ 20

అథ - అప్పుడు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, గోపాన్ - గోపాలకులనుద్దేశించి, ఆహ - పలికెను, హే అంబ - ఓ అమ్మా!, తాత - తండ్రీ!, వ్రజ-ఓకసః - ఓ గోకులవాసులారా!, గిరిగర్తమ్ - పర్వతముయొక్క పల్లమునందు, యథా-ఉపజోషమ్ - విశ్రాంతిని అతిక్రమించకుండా, సగోధనాః - గోసంపదలతో కూడినవారై, విశత - ప్రవేశించుడు.

అప్పుడు శ్రీకృష్ణ భగవానుడు గోపాలకులతో నిట్లనెను -- ఓ అమ్మా! తండ్రీ! గోకులవాసులారా! ఈ పర్వతముయొక్క పల్లమునందు గోసంపదలతో సహా ప్రవేశించి విశ్రాంతిగా నుండుడు.

న త్రాస ఇహ వః కార్యో మద్ధస్తాద్రినిపాతనే ।
వాతవర్షభయేనాలం తత్త్రాణం విహితం హి వః ॥ 21

ఇహ - ఇచట, వః - మీకు, మద్-హస్త-అద్రినిపాతనే - నా చేతినుండి పర్వతము పడిపోవుటయందు, భయః - భయము, న కార్యః - చేయబడ తగదు, వాతవర్షభయేన - గాలి వర్షముల వలని భయముతో, అలమ్ - చాలును, హి - ఏలయన, వః - మీకు, తత్-త్రాణమ్ - వాటినుండి రక్షణ, విహితమ్ - ఏర్పాటు చేయబడినది.

ఇచట నా చేతినుండి పర్వతము పడిపోవునేమోననే భయము మీకు వద్దు. మీరు గాలికి, వర్షమునకు ఇకపై భయపడవద్దు. ఎందుకంటే, వాటినుండి మీకు నేనీ రక్షణనేర్పాటు చేసినాను.

తథా నిర్వివిశుర్గర్తం కృష్ణాశ్వాసితమానసాః ।
యథావకాశం సధనాస్సవ్రజాస్సోపజీవినః ॥ 22

కృష్ణ-ఆశ్వాసితమానసాః - శ్రీకృష్ణునిచే నమ్మకము కలిగించబడిన మనస్సులు గలవారు, సధనాః - సంపదలతో కూడినవారు, సవ్రజాః - బళ్లయందలి సామగ్రి గలవారు, స-ఉపజీవినః - సేవకులు మొదలగువారితో కూడినవారు, తథా - అదే విధముగా, యథా-అవకాశమ్ - తొడతొక్కిడి లేకుండా, గర్తమ్ - గోతిని, నిర్వివిశుః - ప్రవేశించిరి.

శ్రీకృష్ణుడు వారి మనస్సులలో విశ్వాసమును కలిగించెను. అప్పుడు వారు ఆయన చెప్పినట్లుగా తమ సంపదలతో కూడి, సామానును బళ్లలో నింపుకొని, సేవకులు మొదలగువారితో సహా తొడతొక్కిడి లేకుండా విశాలమైన ఆ పర్వతము ఉండిన పల్లములోనికి ప్రవేశించిరి.

క్షుత్తృడ్వ్యథాం సుఖాపేక్షాం హిత్వా తైర్వ్రజవాసిభిః ।
వీక్ష్యమాణో దధావద్రిం సప్తాహం నాచలత్పదాత్ ॥ 23

తైః - ఆ, వ్రజవాసిభిః - గోకులవాసులచే, వీక్ష్యమాణః - చూడబడుచున్నవాడై, క్షుత్-తృడ్-వ్యథామ్ - ఆకలి దప్పికల పీడను, సుఖ-అపేక్షామ్ - సుఖమునందలి అపేక్షను, హిత్వా - విడిచిపెట్టి, అద్రిమ్ - పర్వతమును, సప్త-అహమ్ - ఏడు రోజులను (నిరంతరముగా), దధౌ - ధరించెను, పదాత్ - స్థానమునుండి, న అచలత్ - కదలలేదు.

ఆ గోకులవాసులు చూస్తూండగా, ఆకలి దప్పికల పీడ గాని, సుఖాపేక్ష గాని లేకుండా, ఆయన నిలబడ్డ చోటునుండి కదలకుండా నిరంతరముగా ఏడు రోజులు పర్వతమును మోస్తూ ఉండెను.

కృష్ణయోగానుభావం తం నిశామ్యేంద్రోఽతివిస్మితః ।
నిఃస్తంభో భ్రష్టసంకల్పస్స్వాన్మేఘాన్ సన్న్యవారయత్ ॥ 24

తమ్ - ఆ, కృష్ణయోగ-అనుభావమ్ - శ్రీకృష్ణుని యోగమాయయొక్క మహిమను, నిశామ్య - చూచి, అతివిస్మితః - మిక్కిలి విస్మయమును పొందిన, ఇంద్రః - ఇంద్రుడు, నిఃస్తంభః - తొలగిన గర్వము గలవాడు, భ్రష్టసంకల్పః - జారిన సంకల్పము గలవాడై, స్వాన్ - తన, మేఘాన్ - మేఘములను, సన్న్యవారయత్ - పూర్తిగా వెనుకకు మళ్లించెను.

శ్రీకృష్ణుని యోగమాయయొక్క ఆ మహిమను చూచి ఇంద్రుడు చాల విస్మయమును పొందెను. ఆతని గర్వము తొలగిపోయి గోకులమును నశింప జేయాలనే సంకల్పము జారిపోయెను. ఆతడు తన మేఘములను పూర్తిగా వెనుకకు మళ్లించెను.

ఖం వ్యభ్రముదితాదిత్యం వాతవర్షం చ దారుణమ్ ।
నిశామ్యోపరతం గోపాన్ గోవర్ధనధరోఽబ్రవీత్ ॥ 25

వి-అభ్రమ్ - తొలగిపోయిన మేఘములు కలిగినట్టియు, ఉదిత-ఆదిత్యమ్ - ఉదయించిన సూర్యుడు గల, ఖమ్ - ఆకాశమును, ఉపరతమ్ - ఆగిపోయిన, దారుణమ్ - దారుణమైన, వాతవర్షం చ - గాలివానను కూడ, నిశామ్య - చూచి, గోవర్ధనధరః - గోవర్ధనధారియగు శ్రీకృష్ణుడు, గోపాన్ - గోపాలకులనుద్దేశించి, అబ్రవీత్ - పలికెను.

ఆకాశములో సూర్యుడు ఉదయించి మేఘములు తొలగిపోయెను. దారుణమైన గాలివాన కూడ ఆగిపోయెను. అది చూచి గోవర్ధనధారియగు శ్రీకృష్ణుడు గోపాలకులతో నిట్లనెను.

నిర్యాత త్యజత త్రాసం గోపాస్స్త్రీధనార్భకాః ।
ఉపారతం వాతవర్షం వ్యుదప్రాయాశ్చ నిమ్నగాః ॥ 26

గోపాః - ఓ గోపాలకులారా!, సస్త్రీధన-అర్భకాః - స్త్రీలు సంపద పిల్లలతో కూడినవారై, నిర్యాత - బయటకు వెళ్లుడు, త్రాసమ్ - భయమును, త్యజత - విడువుడు, వాతవర్షమ్ - గాలివాన, ఉపారతమ్ - ఆగినది, నిమ్నగాః చ - నదులు కూడ, వి-ఉదప్రాయాః - తగ్గిన నీరు గలవి.

ఓ గోపాలకులారా! స్త్రీలు, సంపదలు, పిల్లలతో కలిసి భయమును వీడి బయటకు నడువుడు. గాలి వాన ఆగినది. నదులలో నీరు కూడ తగ్గినది.

తతస్తే నిర్యయుర్గోపాస్స్వం స్వమాదాయ గోధనమ్ ।
శకటోఢోపకరణం స్త్రీబాలస్థవిరాశ్శనైః ॥ 27

తతః - తరువాత, తే - ఆ, గోపాః - గోపాలకులు, స్త్రీబాలస్థవిరాః - స్త్రీలు పిల్లలు పెద్దలు, స్వం స్వమ్ - తమ తమ, గోధనమ్ - గోవుల సంపదను, ఆదాయ - తీసుకొని, శకట-ఊఢ-ఉపకరణమ్ - బళ్లయందు ఎక్కించబడిన సామగ్రి కలుగునట్లుగా, శనైః - మెల్లగా, నిర్యయుః - బయటకు వచ్చిరి.

పిదప ఆ గోపాలురు, స్త్రీలు, పిల్లలు, పెద్దలు తమ తమ గోసంపదను తీసుకొని, సామగ్రిని బళ్లపై ఎక్కించుకొని, మెల్లగా బయటకు వచ్చిరి.

భగవానపి తం శైలం స్వస్థానే పూర్వవత్ప్రభుః ।
పశ్యతాం సర్వభూతానాం స్థాపయామాస లీలయా ॥ 28

ప్రభుః - సర్వశక్తిమంతుడగు, భగవాన్ అపి - శ్రీకృష్ణ భగవానుడు కూడ, తమ్ - ఆ, శైలమ్ - పర్వతమును, పూర్వవత్ - ఇదివరలో వలెనే, స్వస్థానే - తన స్థానమునందు, సర్వభూతానామ్ - సకలప్రాణులు, పశ్యతామ్ - చూచుచుండగా, లీలయా - అవలీలగా, స్థాపయామాస - స్థాపించెను.

సర్వశక్తిమంతుడగు శ్రీకృష్ణ భగవానుడు కూడ సకలప్రాణులు చూచుచుండగా, ఆ పర్వతమును దాని స్థానమునందు ఇదివరలో వలెనే అవలీలగా స్థాపించెను.

తం ప్రేమవేగాన్నిభృతా వ్రజౌకసో
యథా సమీయుః పరిరంభణాదిభిః ।
గోప్యశ్చ సస్నేహమపూజయన్ముదా
దధ్యక్షతాద్భిర్యుయుజుస్సదాశిషః ॥ 29

తమ్ - ఆ శ్రీకృష్ణుని, ప్రేమవేగాత్ - ప్రేమయొక్క ఆవేశము వలన, నిభృతాః - నిండిన, వ్రజ-ఓకసః - గోకులవాసులు, యథా - యథోచితముగా, పరిరంభణ-ఆదిభిః - కౌగిలించుకొనుట మొదలగువాటిచే, సమీయుః - చక్కగా కలుసుకొనిరి, గోప్యః చ - గోపికలు కూడ, సస్నేహమ్ - ప్రేమతో కూడినట్లుగా, ముదా - ఆనందముతో, దధి-అక్షత-అద్భిః - పెరుగు అక్షతలు జలములతో, అపూజయన్ - పూజించిరి, సద్-ఆశిషః - పవిత్రమగు ఆశీస్సులను, యుయుజుః - అందజేసిరి.

ప్రేమయొక్క ఆవేశముతో నిండియున్న గోకులవాసులు ఆ శ్రీకృష్ణుని కౌగిలించుట, చేతులు కలుపుట మొదలగువాటితో యథోచితముగా కలుసుకొనిరి. గోపికలు కూడ ప్రేమతో ఆనందముతో ఆయనను పెరుగు, అక్షతలు, జలములతో పూజించి, పవిత్రమగు ఆశీస్సులనందజేసిరి.

యశోదా రోహిణీ నందో రామశ్చ బలినాం వరః ।
కృష్ణమాలింగ్య యుయుజురాశిషస్స్నేహకాతరాః ॥ 30

యశోదా - యశోద, రోహిణీ - రోహిణి, నందః - నందుడు, బలినామ్ - బలవంతులలో, వరః - శ్రేష్ఠుడగు, రామః చ - బలరాముడు కూడ, స్నేహకాతరాః - ప్రేమ వలన కంగారు గలవారై, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ఆలింగ్య - కౌగిలించుకొని, ఆశిషః - ఆశీస్సులను, యుయుజుః - అందజేసిరి.

యశోద, రోహిణి, నందుడు, బలవంతులలో శ్రేష్ఠుడగు బలరాముడు కూడ ప్రేమ వలన కంగారు పడుతూ శ్రీకృష్ణుని కౌగిలించుకొని ఆశీస్సులను పలికిరి.

దివి దేవగణాస్సాధ్యాస్సిద్ధగంధర్వచారణాః ।
తుష్టువుర్ముముచుస్తుష్టాః పుష్పవర్షాణి పార్థివ ॥ 31

పార్థివ - ఓ మహారాజా!, దివి - ఆకాశమునందు, దేవగణాః - దేవతల గణములు, సాధ్యాః - సాధ్యులు, సిద్ధగంధర్వచారణాః - సిద్ధులు గంధర్వులు చారణులు, తుష్టాః - సంతోషించినవారై, పుష్పవర్షాణి - పూల వానలను, ముముచుః - విడిచిపెట్టిరి, తుష్టువుః - స్తుతించిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ఆకాశమునందున్న దేవతల గణములు, సాధ్యులు, సిద్ధులు, గంధర్వులు, చారణులు సంతోషముతో పూల వానలను కురిపించి స్తుతించిరి.

శంఖదుందుభయో నేదుర్దివి దేవప్రణోదితాః ।
జగుర్గంధర్వపతయస్తుంబురుప్రముఖా నృప ॥ 32

నృప - ఓ రాజా!, దివి - ద్యులోకమునందు, దేవప్రణోదితాః - దేవతలచే వాయించబడిన, శంఖదుందుభయః - శంఖములు దుందుభులు, నేదుః - మ్రోగినవి, తుంబురుప్రముఖాః - తుంబురుడు మొదలుగా గల, గంధర్వపతయః - గంధర్వశ్రేష్ఠులు, జగుః - పాడిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ఆకాశమునందు దేవతలు శంఖములను, దుందుభులను మ్రోయించిరి. తుంబురుడు మొదలైన గంధర్వశ్రేష్ఠులు పాడిరి.

తతోఽనురక్తైః పశుపైః పరిశ్రితో
రాజన్ స గోష్ఠం సబలోఽవ్రజద్ధరిః ।
తథావిధాన్యస్య కృతాని గోపికా
గాయంత్య ఈయుర్ముదితా హృదిస్పృశః ॥ 33

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే పంచవింశోఽధ్యాయః ॥

రాజన్ - ఓ రాజా!, తతః - తరువాత, అనురక్తైః - అనురాగము గల, పశుపైః - గోపాలకులచే, పరిశ్రితః - చుట్టూ కూడినవాడు, సబలః - బలరామునితో కూడినవాడు అగు, సః - ఆ, హరిః - శ్రీకృష్ణ భగవానుడు,

గోష్ఠమ్ - గోకులమును గురించి, అవ్రజత్ - వెళ్లెను, హృదిస్పృశః - హృదయమును స్పృశించే, ముదితాః - ఆనందించిన, గోపికాః - గోపికలు, అస్య - ఈయనయొక్క, తథావిధాని - అటువంటి, కృతాని - లీలలను, గాయంత్యః - పాడుచున్నవారై, ఈయుః - వెళ్లిరి.

ఓ పరీక్షిన్మహారాజా! తరువాత అనురాగము గల గోపాలకులు చుట్టువారి రాగా బలరామునితో గూడి శ్రీకృష్ణ భగవానుడు గోకులమునకు వెళ్లెను. ప్రేమతో హృదయమును స్పృశించే గోపికలు ప్రేమతో హృదయమును స్పృశించే ఈ శ్రీకృష్ణుని గోవర్ధనోద్ధారమువంటి లీలలను ఆనందముతో పాడుకుంటూ వెళ్లిరి.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్థములో గోవర్ధనోద్ధారమును వర్ణించే
ఇరువది ఐదవ అధ్యాయము ముగిసినది (25).



# అథ షడ్వింశోఽధ్యాయః

## నందునితో గోపాలకులు శ్రీకృష్ణుని గురించి చర్చించుట

శ్రీశుక ఉవాచ ।
ఏవంవిధాని కర్మాణి గోపాః కృష్ణస్య వీక్ష్య తే ।
అతద్వీర్యవిదః ప్రోచుస్సమభ్యేత్య సువిస్మితాః ॥ 1

కృష్ణస్య - శ్రీకృష్ణునియొక్క, ఏవంవిధాని - ఇటువంటి, కర్మాణి - లీలలను, వీక్ష్య - చూచి, అతద్-వీర్యవిదః - ఆయనయొక్క పరాక్రమమును గురించి తెలియని, తే - ఆ, గోపాః - గోపాలకులు, సువిస్మితాః - మిక్కిలి ఆశ్చర్యమును పొందినవారై, సమభ్యేత్య - గుమిగూడి, ప్రోచుః - పలికిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధములైన శ్రీకృష్ణుని లీలలను చూచి ఆ గోపాలకులు మిక్కిలి ఆశ్చర్యమును పొందిరి. వారికి ఆయన పరాక్రమము గురించి తెలియదు. వారు ఒకచో గుమిగూడి ఇట్లు పలికిరి.

బాలకస్య యదేతాని కర్మాణ్యత్యద్భుతాని వై ।
కథమర్హత్యసౌ జన్మ గ్రామ్యేష్వాత్మజుగుప్సితమ్ ॥ 2

యత్ - ఏలనైతే, బాలకస్య - బాలకృష్ణుని, ఏతాని - ఈ, కర్మాణి - లీలలు, వై - నిశ్చయముగా, అతి-అద్భుతాని - మిక్కిలి అద్భుతములో, అసౌ - ఈతడు, గ్రామ్యేషు - పల్లెటూరివారియందు, ఆత్మజుగుప్సితమ్ - తనకు అయోగ్యమైన, జన్మ - పుట్టుకను, కథమ్ - ఏ విధముగా, అర్హతి - తగును?

ఈ బాలకృష్ణుని లీలలు నిశ్చయముగా అత్యద్భుతములు. ఈతడు పల్లెటూరివారమగు మనలో జన్మించుట ఈతనికి అయోగ్యమైన పుట్టుక. ఇది యెట్లు తగియున్నది?

యస్సప్తహాయనో బాలః కరేణైకేన లీలయా ।
కథం బిభ్రద్గిరివరం పుష్కరం గజరాడివ ॥ 3

యః - ఎవడైతే, సప్తహాయనః - ఏడేళ్ల, బాలః - బుడతడో ఆతడు, ఏకేన - ఒక, కరేణ - చేతితో, లీలయా - అవలీలగా, గజరాట్ - గొప్ప ఏనుగు, పుష్కరం ఇవ - పద్మమును వలె, గిరివరమ్ - గొప్ప పర్వతమును, కథమ్ - ఎట్లు, బిభ్రత్ - మోయును?

ఈతడు ఏడేళ్ల బుడతడు. ఒకే చేతితో పెద్ద పర్వతమును, గొప్ప యేనుగు పద్మమును వలె, అవలీలగా ఎట్లు మోసినాడు?

తోకేనామీలితాక్షేణ పూతనాయా మహౌజసః ।
పీతః స్తనస్సహ ప్రాణైః కాలేనేవ వయస్తనోః ॥ 4

తనోః - శరీరముయొక్క, వయః - వయస్సు, కాలేన ఇవ - కాలముచే వలె, ఆమీలితాక్షేణ - గట్టిగా మూయబడిన కన్నులు గల, తోకేన - బాలకునిచే, మహా-ఓజసః - గొప్ప బలము గల, పూతనాయాః - పూతనయొక్క, స్తనః - చనుబాలు, ప్రాణైః సహ - ప్రాణములతో సహా, పీతః - త్రాగబడినది.

ఈతడు చిన్నపిల్లవాడుగ నుండగనే గట్టిగా కళ్లను మూసుకొని గొప్ప బలము గల పూతనయొక్క చనుబాలను ఆమె ప్రాణములతో సహా, కాలము దేహముయొక్క వయస్సును వలె, త్రాగివేసెను.

హిన్వతోఽధశ్శయానస్య మాస్యస్య చరణావుదక్ ।
అనోఽపతద్విపర్యస్తం రుదతః ప్రపదా హతమ్ ॥ 5

అధః - క్రింద, శయానస్య - పరున్నట్టియు, మాస్యస్య - మూడు నెలల వయస్సు కలిగినట్టియు, చరణౌ - రెండు కాళ్లను, ఉదక్ - పైకి, హిన్వతః - తన్నుచున్నట్టియు, రుదతః - ఏడ్చుచున్న బాలకృష్ణుని, ప్రపదా - కాలి కొనతో, హతమ్ - తన్నబడిన, అనః - బండి, విపర్యస్తమ్ - తల్లక్రిందులై, అపతత్ - పడెను.

ఈతడు మూడు నెలల పిల్లవాడుగా నున్నప్పుడు బండి క్రింద (చిక్కములో) పరుండి కాళ్లను రెండింటినీ పైకి ఊపుచుండెను. ఈతడు ఏడుస్తూ కాలి కొనతో తన్నగా బండి తల్లక్రిందులై పడిపోయెను.

ఏకహాయన ఆసీనో హ్రియమాణో విహాయసా ।
దైత్యేన యస్తృణావర్తమహన్ కంఠగ్రహాతురమ్ ॥ 6

యః - ఏ బాలకృష్ణుడైతే, ఏకహాయనః - ఒక ఏడు వయస్సు గలవాడు, ఆసీనః - కూర్చున్నవాడు, దైత్యేన - రాక్షసునిచే, విహాయసా - ఆకాశము గుండా, హ్రియమాణః - ఎత్తుకుపోబడుచున్నవాడు, కంఠగ్రహ-ఆతురమ్ - కంఠమును పట్టుకొనుటచే పీడితుడైన, తృణావర్తమ్ - తృణావర్తుని, అహన్ - సంహరించెనో.

ఒక ఏడు వయస్సు గల బాలకృష్ణుడు కూర్చుని యుండగా తృణావర్తుడనే రాక్షసుడు ఆకాశమార్గము గుండా ఎత్తుకుపోయెను. అపుడాతడు వాని కంఠమును పట్టి నొక్కి వానిని సంహరించెను.

క్వచిద్ధైయంగవస్తైన్యే మాత్రా బద్ధ ఉలూఖలే ।
గచ్ఛన్నర్జునయోర్మధ్యే బాహుభ్యాం తావపాతయత్ ॥ 7

క్వచిత్ - ఒకనాడు, హైయంగవస్తైన్యే - నిన్నటి వెన్నను చోరీ చేసిన విషయమునందు, మాత్రా - తల్లిచే, ఉలూఖలే - రోలునందు, బద్ధః - కట్టబడినవాడు, అర్జునయోః - జంట మద్ది చెట్ల, మధ్యే - మధ్యయందు, బాహుభ్యామ్ - రెండు చేతులతో, గచ్ఛన్ - వెళ్లువాడై, తౌ - వాటిని, అపాతయత్ - పడగొట్టెను.

ఒకనాడు అప్పుడే చిలికిన వెన్ననీతడు అపహరించగా తల్లి రోలునందు ఈతనిని కట్టివేసెను. అపుడీతడు జంట మద్ది చెట్ల మధ్యగుండా వెళ్తూ రెండు చేతులతో వాటిని పడగొట్టెను.

వనే సంచారయన్ వత్సాన్ సరామో బాలకైర్వృతః ।
హంతుకామం బకం దోర్భ్యాం ముఖతోఽరిమపాటయత్ ॥ 8

వనే - అడవియందు, వత్సాన్ - దూడలను, సంచారయన్ - బాగుగా మేపుచున్నవాడు, సరామః - బలరామునితో కూడియున్నవాడు, బాలకైః - పిల్లలతో, వృతః - చుట్టువారబడినవాడు, హంతుకామమ్ - చంపగోరిన, అరిమ్ - శత్రువగు, బకమ్ - బకాసురుని, దోర్భ్యామ్ - రెండు చేతులతో, ముఖతః - ముక్కులను, అపాటయత్ - చీల్చివేసెను.

ఈతడు అడవిలో బలరామునితో గూడి గోప బాలకులు చుట్టువారియుండ దూడలను చక్కగా మేపుచుండెను. ఈతనిని చంపగోరి బకాసురుడనే శత్రువు రాగా, ఈతడు వాని ముక్కులను చీల్చి చంపెను.

వత్సేషు వత్సరూపేణ ప్రవిశంతం జిఘాంసయా ।
హత్వా న్యపాతయత్తేన కపిత్థాని చ లీలయా ॥ 9

జిఘాంసయా - చంపాలనే కోరికతో, వత్సేషు - దూడలయందు, వత్సరూపేణ - దూడ రూపముతో, ప్రవిశంతమ్ - ప్రవేశించుచున్న రాక్షసుని, లీలయా - అవలీలగా, హత్వా - చంపి, తేన - ఆ దేహముతో, కపిత్థాని - వెలగ పళ్లను కూడ, అపాతయత్ - పడగొట్టెను.

ఈతనిని చంపాలనే కోరికతో ఒక రాక్షసుడు దూడ రూపముతో దూడలలో ప్రవేశించెను. ఈతడు వానిని చంపి ఆ దేహమును విసరగా అది తగిలి వెలగ చెట్ల పళ్లు రాలెను.

హత్వా రాసభదైతేయం తద్బంధూంశ్చ బలాన్వితః ।
చక్రే తాలవనం క్షేమం పరిపక్వఫలాన్వితమ్ ॥ 10

బల-అన్వితః - బలరామునితో కూడిన శ్రీకృష్ణుడు, రాసభదైతేయమ్ - గాడిద రూపములోనున్న రాక్షసుని, తద్-బంధూన్ చ - వాని బంధువులను కూడ, హత్వా - చంపి, పరిపక్వఫల-అన్వితమ్ - బాగా ముగ్గిన పళ్లతో కూడిన, తాలవనమ్ - తాటిచెట్ల అడవిని, క్షేమమ్ - భద్రత కలదానినిగా, చక్రే - చేసెను.

ఈతడు బలరామునితో కలిసి గాడిద రూపములోనున్న ధేనుకాసురుని, వాని బంధువులను కూడ సంహరించి, తాటి చెట్ల వనమునందు భద్రతను నెలకొల్పెను. దానియందు బాగా ముగ్గిన పళ్లు గలవు.

ప్రలంబం ఘాతయిత్వోగ్రం బలేన బలశాలినా ।
అమోచయద్వ్రజపశూన్ గోపాంశ్చారణ్యవహ్నితః ।। 11

బలశాలినా - బలశాలియగు, బలేన - బలరామునిచే, ఉగ్రమ్ - భయంకరుడగు, ప్రలంబమ్ - ప్రలంబుని, ఘాతయిత్వా - సంహరింపజేసి, వ్రజపశూన్ - గోకులముయొక్క పశువులను, గోపాన్ - గోప బాలకులను, అరణ్యవహ్నితః - అడవియందలి కార్చిచ్చునుండి, అమోచయత్ - విడిపించెను.

ఈతడు బలశాలియగు బలరామునిచే భయంకరుడగు ప్రలంబాసురుని సంహరింపజేసెను. గోకులముయొక్క పశువులను, గోప బాలకులను అడవిలో దావాగ్నినుండి విడిపించెను.

ఆశీవిషతమాహీంద్రం దమిత్వా విమదం హ్రదాత్ ।
ప్రసహ్యోద్వాస్య యమునాం చక్రేఽసౌ నిర్విషోదకామ్ ।। 12

అసౌ - ఈతడు, ఆశీవిషతమ-అహి-ఇంద్రమ్ - మిక్కిలి భయంకరమగు విషము గల సర్పరాజును, ప్రసహ్య - బలముగా, దమిత్వా - త్రొక్కి, విమదమ్ - పొగరు అడగిన ఆ సర్పమును, హ్రదాత్ - సరస్సునుండి, ఉద్వాస్య - ఉద్వాసన చెప్పి, యమునామ్ - యమునా నదిని, నిర్విష-ఉదకామ్ - విషము లేని నీరు కలదానిని, చక్రే - చేసెను.

ఈతడు మిక్కిలి భయంకరమగు విషము గల సర్పరాజగు కాలియుని పడగలపై బలముగా తొక్కి వాని గర్వమునడంచెను. వానికి యమునానది లోని సరస్సునుండి ఉద్వాసన చెప్పి ఆ నీటికి విషము పోవునట్లు చేసెను.

దుస్త్యజశ్చానురాగోఽస్మిన్ సర్వేషాం నో వ్రజౌకసామ్ ।
నంద తే తనయేఽస్మాసు తస్యాప్యౌత్పత్తికః కథమ్ ।। 13

వ్రజ-ఓకసామ్ - గోకులమునందు నివసించే, నః - మాకు, సర్వేషామ్ - అందరికి, అస్మిన్ - ఈ, తే - నీ, తనయే - పుత్రునియందు, దుస్త్యజః - విడువ శక్యము కాని, ఔత్పత్తికః - సహజమైన, అనురాగః - ప్రేమ, నంద - ఓ నందా!, తస్య అపి - ఆతనికి కూడ, అస్మాసు - మాపై, కథమ్ - ఎట్లు?

ఓ నంద మహారాజా! గోకులమునందు నివసించే మాకందరికీ నీ పుత్రుడగు ఈతనిపై విడువ శక్యము కాని ప్రేమ. ఆతనికి కూడ మాపై సహజసిద్ధమైన ప్రేమ గలదు. దీనికి కారణమేమై యుండును?

క్వ సప్తహాయనో బాలః క్వ మహాద్రివిధారణమ్ ।
తతో నో జాయతే శంకా వ్రజనాథ తవాత్మజే ॥ 14

వ్రజనాథ - గోకులమునకు ప్రభువైన ఓ నందా!, సప్తహాయనః - ఏడేళ్ల, బాలః - పిల్లవాడు, క్వ - ఎక్కడ?, మహా-అద్రివిధారణమ్ - పెద్ద పర్వతమును మోయుట, క్వ - ఎక్కడ?, తతః - అందువలన, నః - మాకు, తవ - నీ, ఆత్మజే - పుత్రునియందు, శంకా - అనుమానము, జాయతే - కలుగుచున్నది.

గోకులప్రభువగు ఓ నందా! ఏడేళ్ల పిల్లవాడెక్కడ? పెద్ద పర్వతమును మోయుట యెక్కడ? అందువలన, మాకు నీ పుత్రునిపై అనుమానము కలుగుచున్నది.

నంద ఉవాచ ।
శ్రూయతాం మే వచో గోపా వ్యేతు శంకా చ వోఽర్భకే ।
ఏనం కుమారముద్దిశ్య గర్గో మే యదువాచ హ ॥ 15

గోపాః - ఓ గోపాలకులారా!, మే - నా, వచః - మాట, శ్రూయతామ్ - వినబడుగాక!, వః - మీకు, అర్భకే - పిల్లవానియందలి, శంకా చ - అనుమానము, వి-ఏతు - తొలగిపోవుగాక!, ఏనమ్ - ఈ, కుమారమ్ - పిల్లవానిని, ఉద్దిశ్య - ఉద్దేశించి, హ - ఒకనాడు, మే - నాకు, గర్గః - గర్గాచార్యుడు, యత్ - దేనిని, ఉవాచ - చెప్పెనో.

నందుడు ఇట్లు పలికెను --- ఈ పిల్లవానిని గురించి ఒకనాడు గర్గాచార్యుడు నాకు చెప్పిన మాటను చెప్పెదను. మీరు నా మాటను విని వీనిపై గల అనుమానమును తొలగించుకొనుడు.

వర్ణాస్త్రయః కిలాస్యాసన్ గృహ్ణతోఽనుయుగం తనూః ।
శుక్లో రక్తస్తథా పీత ఇదానీం కృష్ణతాం గతః ॥ 16

అనుయుగమ్ - ప్రతి యుగమునందు, తనూః - అవతారములను, గృహ్ణతః - స్వీకరించే, అస్య - ఈతనికి, శుక్లః - తెలుపు, రక్తః - ఎరుపు, పీతః - పచ్చని అనే, త్రయః - మూడు, వర్ణాః - రంగులు, ఆసన్ కిల - ఉండెనట, ఇదానీమ్ - ఇప్పుడు, కృష్ణతామ్ - నల్లదనమును, గతః - పొందినవాడు.

ఈయన ప్రతియుగమునందు అవతారములనెత్తును. ఈయనకు తెలుపు, ఎరుపు, పచ్చని అనే మూడు రంగులుండెనట. ఇప్పుడీతడు నల్లనివాడైనాడు.

ప్రాగయం వసుదేవస్య క్వచిజ్జాతస్తవాత్మజః ।
వాసుదేవ ఇతి శ్రీమానభిజ్ఞాస్సంప్రచక్షతే ॥ 17

అయమ్ - ఈ, తవ - నీ, ఆత్మజః - పుత్రుడు, ప్రాక్ - ఇదివరలో, క్వచిత్ - ఒకచోట (ఒకప్పుడు), వసుదేవస్య - వసుదేవునకు, జాతః - పుట్టినవాడు, శ్రీమాన్ - శోభాయుక్తుడు, వాసుదేవః - వసుదేవపుత్రుడు, ఇతి - అని, అభిజ్ఞాః - జ్ఞానులు, సంప్రచక్షతే - చెప్పుచున్నారు.

ఈ నీ పుత్రుడు పూర్వము ఒకప్పుడు ఎక్కడనో వసుదేవునకు పుట్టినాడు. ఆ రహస్యము తెలిసినవారు ఈతడు శ్రీమాన్ వాసుదేవుడని చెప్పెదరు.

బహూని సంతి నామాని రూపాణి చ సుతస్య తే ।
గుణకర్మానురూపాణి తాన్యహం వేద నో జనాః ॥ 18

తే - నీ, సుతస్య - పుత్రునకు, గుణకర్మ-అనురూపాణి - గుణములకు లీలలకు తగిన, బహూని - చాల, నామాని - పేర్లు, రూపాణి చ - రూపములు కూడ, సంతి - కలవు, తాని - వాటిని, అహమ్ - నేను, వేద - ఎరుగుదును, జనాః - జనులు, నో - ఎరుగరు.

నీ పుత్రునకు గుణములు-లీలలను బట్టి అనేకములగు పేర్లు, రూపములు కూడ కలవు. అవి నాకు తెలియునే గాని, జనులకు తెలియవు.

ఏష వశ్శ్రేయ ఆధాస్యద్గోపగోకులనందనః ।
అనేన సర్వదుర్గాణి యూయమంజస్తరిష్యథ ॥ 19

గోపగోకులనందనః - గోపాలకులు మరియు గోవుల సమూహములనానందింప జేసే, ఏషః - ఈతడు, వః - మీకు, శ్రేయః - గొప్ప హితమును, ఆధాస్యత్ - చేయువాడు, యూయమ్ - మీరు, అనేన - వీనితో, సర్వదుర్గాణి - అన్ని ఆపదలను, అంజః - తేలికగా, తరిష్యథ - దాటి వేసెదరు.

ఈతడు గోపాలకులను, గోవులను ఆనందింప జేసి, మీకు గొప్ప హితమును చేయును. మీరు ఈతని ద్వారా ఆపదలనన్నింటినీ తేలికగా దాటి వేయగలరు.

పురాఽనేన వ్రజపతే సాధవో దస్యుపీడితాః ।
అరాజకే రక్ష్యమాణా జిగ్యుర్దస్యూన్ సమేధితాః ॥ 20

వ్రజపతే - గోకులమునకు ప్రభువగు ఓ నందా!, పురా - పూర్వము, అరాజకే - రాజు లేని స్థితియందు, దస్యుపీడితాః - చోరులచే పీడించబడిన, సాధవః - సత్పురుషులు, అనేన - వీనిచే, రక్ష్యమాణాః - రక్షించబడువారై, సమేధితాః - వర్ధిల్ల జేయబడినవారు, దస్యూన్ - చోరులను, జిగ్యుః - జయించిరి.

గోకులమునకు ప్రభువగు ఓ నందా! పూర్వము అరాచకమేర్పడినప్పుడు చోరులు సత్పురుషులను దోచుకొనుచుండిరి. అప్పుడు ఈతడు వారిని రక్షించి వారికి బలమును కలుగజేసెను. అప్పుడు వారా చోరులను జయించిరి.

య ఏతస్మిన్మహాభాగాః ప్రీతిం కుర్వంతి మానవాః ।
నారయోఽభిభవంత్యేతాన్ విష్ణుపక్షానివాసురాః ॥ 21

మహాభాగాః - గొప్ప భాగ్యము గల, యే - ఏ, మానవాః - మానవులు, ఏతస్మిన్ - ఈతనియందు, ప్రీతిమ్ - ప్రేమను, కుర్వంతి - చేయుదురో, ఏతాన్ - వీరిని, విష్ణుపక్షాన్ - విష్ణువు పక్షమునందు గల దేవత లను,

అసురాః ఇవ - రాక్షసులు వలె, అరయః - శత్రువులు, న అభిభవంతి - పరాభవించరు.

విష్ణుపక్షీయులైన దేవతలను రాక్షసులు ఏమీ చేయలేరు. అదే విధముగా, ఏ మానవులైతే ఈతనియందు ప్రేమను కలిగియుందురో, వారు గొప్ప భాగ్యవంతులు. వీరిని శత్రువులు పరాభవించలేరు.

తస్మాన్నంద కుమారోఽయం నారాయణసమో గుణైః ।
శ్రియా కీర్త్యాఽనుభావేన తత్కర్మసు న విస్మయః ॥ 22

నంద - ఓ నందా!, తస్మాత్ - అందువలన, అయమ్ - ఈ, కుమారః - పిల్లవాడు, గుణైః - గుణములచే, శ్రియా - శోభచే, కీర్త్యా - కీర్తిచే, అను భావేన - మహిమచే, నారాయణసమః - నారాయణునితో సమానుడు, తత్ -కర్మసు - ఆతని లీలల విషయమై, విస్మయః - ఆశ్చర్యము, న - లేదు.

ఓ నందా! కాబట్టి, ఈ పిల్లవాడు గుణములు, శోభ, కీర్తి, మహిమలలో నారాయణునితో సమానమైనవాడు. ఆతని లీలలలో ఆశ్చర్యము లేదు.

ఇత్యద్ధా మాం సమాదిశ్య గర్గే చ స్వగృహం గతే ।
మన్యే నారాయణస్యాంశం కృష్ణమక్లిష్టకారిణమ్ ॥ 23

ఇతి - అని, అద్ధా - సాక్షాత్తు, గర్గే - గర్గాచార్యుడు, మామ్ - నన్ను, సమాదిశ్య - ఉపదేశించి, స్వగృహమ్ - తన యింటిని గురించి, గతే చ - వెళ్లగా, అక్లిష్టకారిణమ్ - కష్టములను పోగొట్టే పనులను చేసే, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, నారాయణస్య - నారాయణుని, అంశమ్ - అంశనుగా, మన్యే - తలచుచున్నాను.

సాక్షాత్తు గర్గాచార్యుడు ఈ విధముగా నాకు ఉపదేశించి తన యింటికి వెళ్లెను. తన లీలలచే మన కష్టములను పోగొట్టే ఈ శ్రీకృష్ణుడు నారాయణుని అవతారమని నేను తలంచుచున్నాను.

ఇతి నందవచశ్శ్రుత్వా గర్గగీతం వ్రజౌకసః ।
దృష్టశ్రుతానుభావాస్తే కృష్ణస్యామితతేజసః ।
ముదితా నందమానర్చుః కృష్ణం చ గతవిస్మయాః ॥ 24

ఇతి - అని, నందవచః - నందుని మాటను, గర్గగీతమ్ - గర్గునిచే చేయ బడిన ఉపదేశమును, శ్రుత్వా - విని, అమితతేజసః - అనంతమగు శక్తి గల, కృష్ణస్య - శ్రీకృష్ణునియొక్క, దృష్టశ్రుత-అనుభావాః - కనబడిన వినబడిన మహిమలు గల, తే - ఆ, వ్రజ-ఓకసః - గోకులవాసులు, ముదితాః - ఆనందించినవారు, గతవిస్మయాః - తొలగిన ఆశ్చర్యము గలవారు, నందమ్ - నందుని, కృష్ణం చ - శ్రీకృష్ణుని కూడ, ఆనర్చుః - పూజించిరి.

ఈ విధముగా గర్గుని ఉపదేశమును నందుని మాటల ద్వారా విన్న గోకులవాసులకు ఆశ్చర్యము తొలగిపోయినది. వారు అనంతశక్తియగు శ్రీకృష్ణుని మహిమలను చూచినవారు, విన్నవారే. వారు ఆనందముతో నందుని, శ్రీకృష్ణుని కూడ పూజించిరి.

దేవే వర్షతి యజ్ఞవిప్లవరుషా వజ్రాశ్మవర్షానిలైః
సీదత్పాలపశుస్త్రి ఆత్మశరణం దృష్ట్వాఽనుకంప్యుత్స్మయన్ ।
ఉత్పాట్యైకకరేణ శైలమబలో లీలోచ్ఛిలీంధ్రం యథా
బిభ్రద్గోష్ఠమపాన్మహేంద్రమదభిత్ ప్రీయాన్న ఇంద్రో గవామ్ ।।25

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే షడ్వింశోఽధ్యాయః ।।

యజ్ఞవిప్లవరుషా - యజ్ఞమును ఆపుట వలని కోపముతో, దేవే - ఇంద్రదేవుడు, వజ్ర-అశ్మవర్షఅనిలైః - పిడుగులు వడగళ్లు వర్షము గాలులతో, వర్షతి - వర్షించుచుండగా, సీదత్-పాలపశుస్త్రి - పీడించబడుచున్న గోపాలకులు పశువులు స్త్రీలు కలిగినట్టియు, ఆత్మశరణమ్ - తాను రక్షకుడుగా గల, గోష్ఠమ్ - గోకులమును, దృష్ట్వా - చూచి, అనుకంపీ - దయగలవాడు, ఉత్స్మయన్ - చిరునవ్వు నవ్వుచున్నవాడు, ఏకకరేణ - ఒక చేతితో, అబలః - బలము లేని పిల్లవాడు, లీలా-ఉచ్ఛిలీంధ్రం యథా - ఆట కొరకై కుక్క గొడుగును వలె, శైలమ్ - పర్వతమును, ఉత్పాట్య - ఊడబెరకి, బిభ్రత్ - ధరించువాడై, అపాత్ - కాపాడెను, మహా-ఇంద్రమదభిత్ - దేవేంద్రుని గర్వమును పోగొట్టినవాడు, గవామ్ - గోవులకు, ఇంద్రః - ప్రభువు, నః - మన కొరకు, ప్రీ యాత్ - ప్రీతిని జెందుగాక!

ఇంద్రునకు తనను ఆరాధించే యజ్ఞమును ఆపివేయుట వలన కోపము వచ్చి సుడిగాలితో పాటుగా పిడుగులను, వడగళ్లను, వర్షధారలను వర్షించెను. అప్పుడు గోకులములోని గోపాలకులు, పశువులు, స్త్రీలు పీడను పొందిరి. వారికి శ్రీకృష్ణుడే రక్షకుడు. ఆయన వారిని చూచి దయ గలవాడై చిరునవ్వుతో, బలము లేని పిల్లవాడు కుక్క గొడుగును అవలీలగా పట్టుకున్న విధముగా, పర్వతమును ఒకే చేతితో ఊడబెరకి పట్టుకొని గోకులమును కాపాడెను. ఆ విధముగా ఆయన ఇంద్రునకు గర్వభంగమును చేసెను. అట్టి గోవిందుడు మన యెడల ప్రీతిని జెందు గాక!

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్ధములో గోపాలకులు నందునితో శ్రీకృష్ణుని గురించి
చర్చించుటను వర్ణించే ఇరువది ఆరవ అధ్యాయము ముగిసినది (26).

* * * * *

# అథ సప్తవింశోఽధ్యాయః

## కామధేనువు శ్రీకృష్ణుని గోవిందునిగా అభిషేకించుట

శ్రీశుక ఉవాచ ।
గోవర్ధనే ధృతే శైలే ఆసారాద్రక్షితే వ్రజే ।
గోలోకాదావ్రజత్ కృష్ణం సురభిశ్శక్ర ఏవ చ ॥ 1

గోవర్ధనే శైలే - గోవర్ధన పర్వతము, ధృతే - మోయబడగా, వ్రజే - గోకులము, ఆసారాత్ - కుండపోత వర్షమునుండి, రక్షితే - రక్షించబడగా,. గోలోకాత్ - గోలోకమునుండి, సురభిః - కామధేనువు, శక్రః ఏవ చ - ఇంద్రుడు కూడ, కృష్ణమ్ - శ్రీకృష్ణుని గురించి, ఆవ్రజత్ - విచ్చేసెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమునెత్తి గోకులమును కుండపోత వర్షమునుండి రక్షించెను. అప్పుడు గోలోకమునుండి కామధేనువు ఇంద్రునితో కలిసి ఆయన వద్దకు వచ్చెను.

వివిక్త ఉపసంగమ్య వ్రీడితః కృతహేలనః ।
పస్పర్శ పాదయోరేనం కిరీటేనార్కవర్చసా ॥ 2

కృతహేలనః - చేయబడిన తిరస్కారము గలవాడు, వ్రీడితః - సిగ్గు పడినవాడు అగు ఇంద్రుడు, వివిక్తే - ఏకాంతమునందు, ఉపసంగమ్య - దగ్గరగా వచ్చి, ఏనమ్ - ఈ శ్రీకృష్ణుని, అర్కవర్చసా - సూర్యుని కాంతి వంటి కాంతి గల, కిరీటేన - కిరీటముతో, పాదయోః - రెండు పాదములయందు, పస్పర్శ - స్పృశించెను.

ఇంద్రుడు ఈ శ్రీకృష్ణుని యెడల అపరాధమును చేయుటచే సిగ్గు పడెను. ఆయన ఏకాంతములో శ్రీకృష్ణుని వద్దకు వచ్చి సూర్యుని వలె వెలిగిపోయే కిరీటము రెండు పాదములకు తగులునట్లు నమస్కరించెను.

దృష్టశ్రుతానుభావోఽస్య కృష్ణస్యామితతేజసః ।
నష్టత్రిలోకేశమద ఇంద్ర ఆహ కృతాంజలిః ॥ 3

అమితతేజసః - అనంతశక్తి గల, అస్య - ఈ, కృష్ణస్య - శ్రీకృష్ణునియొక్క, దృష్టశ్రుత-అనుభావః - కనబడిన వినబడిన మహిమ గలవాడు, నష్టత్రిలోక-ఈశమదః - నశించిన ముల్లోకములకు ప్రభువుననే గర్వము కలవాడు అగు, ఇంద్రః - ఇంద్రుడు, కృత-అంజలిః - చేయబడిన అంజలి గలవాడై, ఆహ - పలికెను.

అనంతశక్తియగు శ్రీకృష్ణుని ప్రభావమును గురించి విని చూచిన ఇంద్రునకు తాను ముల్లోకములకు ప్రభువుననే గర్వము నశించెను. ఆయన చేతులు జోడించి నమస్కరించి ఇట్లు పలికెను.

ఇంద్ర ఉవాచ ।
విశుద్ధసత్త్వం తవ ధామ శాంతం
తపోమయం ధ్వస్తరజస్తమస్కమ్ ।
మాయామయోఽయం గుణసంప్రవాహో
న విద్యతే తేఽగ్రహణానుబంధః ॥ 4

తవ - నీ, ధామ - స్వరూపము, విశుద్ధసత్త్వమ్ - విశుద్ధమైన సత్త్వగుణము గలది, శాంతమ్ - వికారములు లేనిది, తపః-మయమ్ - జ్ఞానప్రధానము, ధ్వస్తరజః-తమస్కమ్ - నశించిన రజస్తమోగుణములు గలది, అయమ్ - ఈ, గుణసంప్రవాహః - గుణముల ప్రవాహరూపమగు సంసారము, మాయామయః - అవిద్యతో నిండియున్నది, అగ్రహణ-అనుబంధః - అజ్ఞానముచే అనుభవమునకు వచ్చేది, తే - నీకు, న విద్యతే - లేదు.

ఇంద్రుడిట్లు పలికెను --- నీ స్వరూపము శుద్ధ (రజస్తమస్సులచే పరాభూతము కాని) సత్త్వప్రధానము, (కావుననే) జ్ఞానఘనము, వికారములు లేనిది. నీ స్వరూపమునందు రజస్తమోగుణములు లేవు. సత్త్వరజస్తమోగుణముల ప్రవాహమైన ఈ సంసారము ఇంద్రజాలము

(మాయాశక్తియొక్క కార్యము). ఇది ఆత్మస్వరూపముయొక్క అజ్ఞానముచే మాత్రమే అనుభవమునకు వచ్చును. ఇది నిన్ను బంధించదు.

కుతో ను తద్ధేతవ ఈశ తత్కృతా లోభాదయో యేఽబుధలింగభావాః ।
తథాఽపి దండం భగవాన్ బిభర్తి ధర్మస్య గుప్త్యై ఖలనిగ్రహాయ ॥ 5

ఈశ - ఓ ఈశ్వరా!, తద్-హేతవః - ఆ సంసారమునకు కారణమైనవి, తత్-కృతాః - ఆ అజ్ఞానముచే కలిగించబడేవి, అబుధలింగభావాః - అజ్ఞానుల లక్షణములైన భావములు, లోభ-ఆదయః - లోభము మొదలైనవి, యే - ఏవి గలవో అవి, కుతః ను - ఎక్కడనుండి వచ్చును?, తథాపి - ఐనప్పటికీ, భగవాన్ - భగవానుడవగు నీవు, ధర్మస్య - ధర్మముయొక్క, గుప్త్యై - రక్షణ కొరకు, ఖలనిగ్రహాయ - దుష్టశిక్షణ కొరకు, దండమ్ - శిక్షను, బిభర్తి - అమలు చేసెదవు.

ఓ ఈశ్వరా! లోభము, క్రోధము మొదలగు భావములు అజ్ఞానుల లక్షణములు. అవి అజ్ఞానము వలన పుట్టి సంసారమునకు హేతువులగును. అవి నీయందెక్కడనుండి వచ్చును? (నీయందు లేవు). అయిననూ, నీవు దుష్టులను శిక్షించి ధర్మమును కాపాడుటకై శిక్షను అమలు చేసెదవు.

పితా గురుస్త్వం జగతామధీశో దురత్యయః కాల ఉపాత్తదండః,
హితాయ స్వేచ్ఛాతనుభిస్సమీహసే మానం విధున్వఞ్జగదీశమానినామ్

త్వమ్ - నీవు, జగతామ్ - ప్రాణులకు, పితా - తండ్రివి, గురుః - గురుడవు, అధి-ఈశః - అధీశ్వరుడవు, దురత్యయః - అతిక్రమించ శక్యము కానిది, ఉపాత్తదండః - స్వీకరించబడిన దండము గల, కాలః - కాలము, జగద్-ఈశమానినామ్ - జగత్తునకు ప్రభువులమని గర్వించువారలకు, హితాయ - హితము కొరకు, మానమ్ - గర్వమును, విధున్వన్ - కడిగి వేయువాడవై, స్వ-ఇచ్ఛాతనుభిః - లీలకొరకైన అవతారములచే, సమీహసే - ప్రవర్తిల్లెదవు. 6

ప్రాణులకు తండ్రివి, గురుడవు, అధీశ్వరుడవు నీవే. దండము (శిక్ష) ను చేపట్టిన, అతిక్రమించ శక్యము కాని కాలము నీవే. నీవు లీల కొరకై అవతారములనెత్తి, జగత్తునకు ప్రభువులమని గర్వించువారల

గర్వమునడంచి, లోకమునకు (తద్ద్వారా వారికి) హితమును చేస్తూ ప్రవర్తిల్లెదవు.

యే మద్విధాజ్ఞా జగదీశమానినః
త్వాం వీక్ష్య కాలేఽభయమాశు తన్మదమ్ ।
హిత్వాఽఽర్యమార్గం ప్రభజంత్యపస్మయా
ఈహా ఖలానామపి తేఽనుశాసనమ్ ॥ 7

యే - ఎవరైతే, మద్-విధ-అజ్ఞాః - నావంటి అజ్ఞానులు గలరో వారు, జగద్-ఈశమానినః - జగత్తునకు ప్రభువులమని గర్వించువారు, కాలే - కాలమునందు, అభయమ్ - భయము లేని, త్వామ్ - నిన్ను, వీక్ష్య - చూచి, తత్ - ఆ, మదమ్ - గర్వమును, హిత్వా - విడిచిపెట్టి, అపస్మయాః - తొలగిన గర్వము గలవారై, ఆర్యమార్గమ్ - సత్పురుషుల దారిని, ప్రభజంతి - సేవించెదరు, తే - నీ, ఈహా - లీల, ఖలానాం అపి - దుష్టులకు కూడ, అనుశాసనమ్ - అనుశాసనమగును.

నావంటి అజ్ఞానులు జగత్తునకు తామే ప్రభువులమని విర్రవీగెదరు. కాని, వారు కాలము (మృత్యువు) నకు భయపడెదరు. నీవైతే కాలము వలని భయము లేనివాడవు. నిన్ను చూచి వారు ఆ గర్వమును విడిచిపెట్టెదరు. గర్వము తొలగి వారు సత్పురుషుల దారిలో నడచెదరు. నీ లీల దుష్టులను కూడ శిక్షించి దారికి తెచ్చును.

స త్వం మమైశ్వర్యమదప్లుతస్య కృతాగసస్తేఽవిదుషః ప్రభావమ్,
క్షంతుం ప్రభోఽథార్హసి మూఢచేతసో మైవం పునర్భూన్మతిరీశ మేఽసతీ.

ప్రభో - ఓ ప్రభూ!, ఐశ్వర్యమదప్లుతస్య - అధికార గర్వముచే వ్యాపించబడినట్టియు, కృత-ఆగసః - చేయబడిన అపరాధము కలిగినట్టియు, ప్రభావమ్ - మహిమను, అవిదుషః - తెలియనట్టియు, మూఢచేతసః - వ్యామోహితమైన బుద్ధి గల, మమ - నాకు, సః - అట్టి, త్వమ్ - నీవు, క్షంతుమ్ - క్షమించుటకు, అర్హసి - తగుదువు, అథ - ఈ పైన, పునః - మరల, మే - నాకు, ఏవమ్ - ఈ విధముగా, అసతీ - దుష్టమగు, మతిః - బుద్ధి, మా భూత్ - కలుగకుండు గాక! 8

ఓ ప్రభూ! ఒళ్లంతా అధికారగర్వము గలవాడనై నేను అపరాధమును చేసితిని. నీ మహిమను యెరుగని నా బుద్ధి వ్యామోహమును పొందెను. అట్టి సర్వేశ్వరుడవగు నీవు నన్ను క్షమించ దగును. నాకు ఈ పైన మరల ఇట్టి దుర్బుద్ధి కలుగకుండు గాక!

తవావతారోఽయమధోక్షజేహ స్వయంభరాణామురుభారజన్మనామ్ ।
చమూపతీనామభవాయ దేవ భవాయ యుష్మచ్చరణానువర్తినామ్ ।।9

అధోక్షజ - ఇంద్రియగోచరము కాని స్వరూపము గలవాడా!, దేవ - ఓ దేవా!, ఇహ - ఈ లోకమునందు, అయమ్ - ఈ, తవ - నీ, అవతారః - అవతారము, స్వయంభరాణామ్ - తమ పొట్టను తాము పోసుకొనునట్టియు, ఉరుభారజన్మనామ్ - పెద్ద భారమైన పుట్టుక కలిగిన, చమూపతీనామ్ - సేనలకు నాయకులగు రాజుల, అభవాయ - వినాశము కొరకు, యుష్మత్-చరణ-అనువర్తినామ్ - నీ పాదములను శరణు జొచ్చినవారల, భవాయ - అభ్యుదయము కొరకు.

ఇంద్రియగోచరము కాని స్వరూపము గల ఓ దేవా! స్వార్థపరులై భూమికి పెద్ద భారమైన జన్మ కలిగి సేనలను నడిపే దుష్టరాజులను వినాశము చేయుటకై నీవు ఈ భూలోకమునందవతరించితివి. మరియు, నీ అవ తారము నీ పాదములను శరణు జొచ్చినవారికి క్షేమమును కలిగించును.

నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే ।
వాసుదేవాయ కృష్ణాయ సాత్వతాం పతయే నమః ।। 10

భగవతే - భగవంతుడవైనట్టియు, పురుషాయ - పూర్ణుడవైనట్టియు, మహా-ఆత్మనే - సర్వమునకు ఆత్మయైనట్టియు, వాసుదేవాయ - వసుదేవపుత్రుడవైనట్టియు, కృష్ణాయ - కృష్ణుడవైనట్టియు, సాత్వతామ్ - యాదవులకు (భక్తులకు), పతయే - పాలకుడవైన, తుభ్యమ్ - నీ కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

ఓ శ్రీకృష్ణ భగవానుడా! నీవు పూర్ణ పరమాత్మవు. వసుదేవపుత్రుడవగు నీవు యాదవులను, భక్తులను పాలించెదవు. నీకు అనేక నమస్కారములు.

స్వచ్ఛందోపాత్తదేహాయ విశుద్ధజ్ఞానమూర్తయే ।
సర్వస్మై సర్వబీజాయ సర్వభూతాత్మనే నమః ॥ 11

స్వ-ఛంద-ఉపాత్తదేహాయ - స్వేచ్ఛచే స్వీకరించబడిన అవతారము కలిగినట్టియు, విశుద్ధజ్ఞానమూర్తయే - కేవలమగు జ్ఞానమే స్వరూపముగా కలిగినట్టియు, సర్వస్మై - సర్వము ఐనట్టియు, సర్వబీజాయ - సర్వకారణుడైనట్టియు, సర్వభూత-ఆత్మనే - సకలప్రాణుల ఆత్మయగు నీ కొరకు, నమః - నమస్కారము.

కేవలజ్ఞానఘనుడవగు నీవు యథేచ్ఛగా అవతారములను స్వీకరించెదవు. సర్వకారణుడవైన నీవే సర్వమై యున్నావు. సకలప్రాణులలో ఆత్మరూపుడవైన నీకు నమస్కారము.

మయేదం భగవన్ గోష్ఠనాశాయాసారవాయుభిః ।
చేష్టితం విహతే యజ్ఞే మానినా తీవ్రమన్యునా ॥ 12

భగవన్ - ఓ భగవానుడా! యజ్ఞే - యజ్ఞము, విహతే - అడ్డుకొనబడగా, మానినా - గర్విష్ఠినైనట్టియు, తీవ్రమన్యునా - తీవ్రమగు కోపము గల, మయా - నాచే, ఆసారవాయుభిః - కుండపోత వానలతో గాలులతో, గోష్ఠనాశాయ - గోకులముయొక్క వినాశము కొరకై, ఇదమ్ - ఇది, చేష్టితమ్ - చేయబడినది.

ఓ భగవానుడా! గర్విష్ఠినగు నాకు తీవ్రమగు కోపము గలదు. నా యజ్ఞము అడ్డుకొనబడగా, నేను గోకులమును నాశనము చేయుటకై ఈ విధముగా కుండపోత వానను, తుఫాను గాలులను కలిగించితిని.

త్వయేశానుగృహీతోఽస్మి ధ్వస్తస్తంభో వృథోద్యమః ।
ఈశ్వరం గురుమాత్మానం త్వామహం శరణం గతః ॥ 13

ఈశ - ఓ ఈశ్వరా!, త్వయా - నీచే, అనుగృహీతః - అనుగ్రహించబడినవాడను, ధ్వస్తస్తంభః - నశించిన గర్వము గలవాడను, వృథా-ఉద్యమః - వ్యర్థమైన ఉద్యమము గలవాడను, అస్మి - అగుచున్నాను, ఈశ్వరమ్ - ఈశ్వరుడవైనట్టియు, గురుమ్ -

తండ్రివైనట్టియు, ఆత్మానమ్ - ఆత్మవైన, త్వామ్ - నిన్ను, అహమ్ - నేను, శరణమ్ - రక్షకునిగా, గతః - పొందుచున్నాను.

ఓ ఈశ్వరా! నా ఉద్యమము వ్యర్థమై నా గర్వము నశించినది. నీవు నన్ను అనుగ్రహించితివి. నీవు ఈశ్వరుడవు, తండ్రివి, ఆత్మస్వరూపుడవు. నేను నిన్ను శరణు వేడుచున్నాను.

శ్రీశుక ఉవాచ ।
ఏవం సంకీర్తితః కృష్ణో మఘోనా భగవానముమ్ ।
మేఘగంభీరయా వాచా ప్రహసన్నిదమబ్రవీత్ ।। 14

మఘోనా - ఇంద్రునిచే, ఏవమ్ - ఈ విధముగా, సంకీర్తితః - చక్కగా కీర్తించబడిన, కృష్ణః భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ప్రహసన్ - నవ్వుచున్నవాడై, అముమ్ - వీనిని ఉద్దేశించి, మేఘగంభీరయా - మేఘగర్జనవలె గంభీరమైన, వాచా - వాక్కుతో, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఇంద్రుడీ విధముగా శ్రీకృష్ణ భగవానుని చక్కగా స్తుతించెను. అప్పుడాయన నవ్వి మేఘగర్జనవలె గంభీరమైన స్వరముతో ఇంద్రునితో నిట్లనెను.

శ్రీభగవానువాచ ।
మయా తేఽకారి మఘవన్మఖభంగోఽనుగృహ్ణతా ।
మదనుస్మృతయే నిత్యం మత్తస్యేంద్రశ్రియా భృశమ్ ।। 15

మఘవన్ - ఓ ఇంద్రా!, ఇంద్రశ్రియా - దేవరాజ్యముతో, భృశమ్ - మిక్కిలి, మత్తస్య - గర్వించిన, తే - నీకు, అనుగృహ్ణతా - అనుగ్రహించుచున్న, మయా - నాచే, నిత్యమ్ - నిత్యము, మద్-అనుస్మృతయే - నన్ను స్మరించుటకై, మఖభంగః - యజ్ఞమునకు విఘాతము, అకారి - చేయబడినది.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- ఓ ఇంద్రా! నీవు దేవరాజ్యముతో మిక్కిలి గర్వించి యుంటివి. నిన్ను అనుగ్రహించుటకే నేను యజ్ఞమునకు

విఘాతమును కలిగించితిని. దీని వలన నీవు నిత్యము నన్ను స్మరించెదవు.

మామైశ్వర్యశ్రీమదాంధో దండపాణిం న పశ్యతి ।
తం భ్రంశయామి సంపద్భ్యో యస్య చేచ్ఛామ్యనుగ్రహమ్ ।।16

ఐశ్వర్యశ్రీమద-అంధః - అధికారముతో సంపదతో మదించి గ్రుడ్డివాడైనవాడు, దండపాణిమ్ - దండము చేతియందు గల, మామ్ - నన్ను, న పశ్యతి - చూడడు, తమ్ - వానిని, సంపద్భ్యః - సంపదలనుండి, భ్రంశయామి - జారిపోవునట్లు చేసెదను, యస్య చ - ఎవనికైతే, అనుగ్రహమ్ - అనుగ్రహమును, ఇచ్ఛామి - కోరెదనో.

జనులు అధికారముచే సంపదచే గర్వించి వివేకమును కోల్పోవుదురు. దండము చేతియందు పట్టుకొనియున్న నన్ను వారు తెలుసుకోరు. నేను ఎవరిని అనుగ్రహించ గోరెదనో, వారి సంపదలను పోగొట్టెదను.

గమ్యతాం శక్ర భద్రం వః క్రియతాం మేఽనుశాసనమ్ ।
స్థీయతాం స్వాధికారేషు యుక్తైర్వః స్తంభవర్జితైః ।। 17

శక్ర - ఓ ఇంద్రా!. గమ్యతామ్ - వెళ్లబడుగాక!, వః - మీకు, భద్రమ్ - మంగళమగుగాక!, మే - నా, అనుశాసనమ్ - ఆజ్ఞ, క్రియతామ్ - చేయబడుగాక!, యుక్తైః - ఏకాగ్రచిత్తము కలిగినట్టియు, స్తంభవర్జితైః - గర్వముచే విడిచిపెట్టబడిన, వః - మీచే, స్వ-అధికారేషు - మీ అధికారములయందు, స్థీయతామ్ - నిలిచి యుండబడుగాక!

ఓ ఇంద్రా! వెళ్లి నా ఆజ్ఞను పాలించుము. నీకు శుభము కలుగును. మీరు (లోకపాలకులు) గర్వమును విడనాడి ఏకాగ్రచిత్తముతో మీ అధికారము (బాధ్యత) లను నిర్వర్తించుడు.

అథాహ సురభిః కృష్ణమభివంద్య మనస్వినీ ।
స్వసంతానైరుపామంత్ర్య గోపరూపిణమీశ్వరమ్ ।। 18

అథ - తరువాత, మనస్వినీ - ప్రశస్తమగు మనస్సు గల, సురభిః - కామధేనువు, గోపరూపిణమ్ - గోపాలకుని రూపములోనున్న, ఈశ్వరమ్ -

ఈశ్వరుడైన, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, అభివాద్య - నమస్కరించి, స్వసంతానైః - తన సంతానములైన గోవులతో, ఉపామంత్ర్య - సంబోధించి, ఆహ - పలికెను.

గోపాలకుని రూపములోనున్న ఈశ్వరుడే శ్రీకృష్ణుడు. తరువాత ప్రశస్తమైన మనస్సు గల కామధేనువు తన సంతానమైన గోవులతో కూడి ఆయనను సంబోధించి ఇట్లు పలికెను.

సురభిరువాచ ।
కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వసంభవ ।
భవతా లోకనాథేన సనాథా వయమచ్యుత ।। 19

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, మహాయోగిన్ - ఓ గొప్ప యోగీ!, విశ్వ-ఆత్మన్ - జగత్తునకు ఆత్మయైనవాడా!, విశ్వసంభవ - ఓ జగత్కారణా!, అచ్యుత - స్వరూపమునుండి చ్యుతి లేనివాడా!, లోకనాథేన - లోకములకు ప్రభువగు, భవతా - నీచే, వయమ్ - మేము, సనాథాః - రక్షకుడు గలవారము.

కామధేనువు ఇట్లు పలికెను --- ఓ శ్రీకృష్ణా! ఓ శ్రీకృష్ణా! నీవు గొప్ప యోగివి. సర్వమునకు ఆత్మయైన నీనుండియే జగత్తు పుట్టినది. నీకు స్వరూపచ్యుతి లేదు. లోకములకు ప్రభువగు నీవే మాకు రక్షకుడవు.

త్వం నః పరమకం దైవం త్వం న ఇంద్రో జగత్పతే ।
భవాయ భవ గోవిప్రదేవానాం యే చ సాధవః ।। 20

త్వమ్ - నీవు, నః - మాకు, పరమకమ్ - సర్వాతిశాయివగు, దైవమ్ - దైవము, జగత్-పతే - ఓ జగన్నాథా!, త్వమ్ - నీవు, నః - మాకు, ఇంద్రః - ఇంద్రుడవు, గోవిప్రదేవానామ్ - గోవులు వేదవేత్తలు దేవతల, భవాయ - క్షేమము కొరకు, భవ - అగుము, యే - ఏ, సాధవః చ - సత్పురుషులు కూడ గలరో.

నీవు మా పరమదైవము. ఓ జగన్నాథా! నీవే మా ఇంద్రుడవు (ఈశ్వరుడవు). నీవు గోవులకు, వేదవేత్తలకు, దేవతలకు, సత్పురుషులు ఎవరు గలరో వారికి, క్షేమమును కలిగించుము.

ఇంద్రం నస్త్వాఽభిషేక్ష్యామో బ్రహ్మణా నోదితా వయమ్ ।
అవతీర్ణోఽసి విశ్వాత్మన్ భూమేర్భారాపనుత్తయే ॥ 21

బ్రహ్మణా - బ్రహ్మదేవునిచే, నోదితాః - ప్రేరేపించబడిన, వయమ్ - మేము, త్వా - నిన్ను, ఇంద్రమ్ - ఇంద్రునిగా, అభిషేక్ష్యామః - అభిషేకించెదము, విశ్వ-ఆత్మన్ - జగత్తునకు సారమైనవాడా!, భూమేః - భూమియొక్క, భార-అపనుత్తయే - బరువును పోగొట్టుటకై, అవతీర్ణః - అవతరించినవాడవు, అసి - అగుచున్నావు.

జగత్తునకు ఆత్మయైన ఓ దేవా! బ్రహ్మదేవుని ప్రేరణను పొందిన మేము నిన్ను ఇంద్రునిగా అభిషేకించెదము. నీవు భూమియొక్క బరువును పోగొట్టుటకై అవతరించితివి.

శ్రీశుక ఉవాచ ।
ఏవం కృష్ణముపామంత్ర్య సురభిః పయసాఽఽత్మనః ।
జలైరాకాశగంగాయా ఐరావతకరోద్ధృతైః ॥ 22

ఇంద్రస్సురర్షిభిస్సాకం నోదితో దేవమాతృభిః ।
అభ్యషించత దాశార్హం గోవింద ఇతి చాభ్యధాత్ ॥ 23

ఏవమ్ - ఈ విధముగా, సురభిః - కామధేనువు, దాశార్హమ్ - యదువంశోద్భవుడగు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ఉపామంత్ర్య - సంబోధించి, ఆత్మనః - తన, పయసా - పాలతో, దేవమాతృభిః - దేవమాతలచే, నోదితః - ప్రేరితుడైన, ఇంద్రః - ఇంద్రుడు, సుర-ఋషిభిః సాకమ్ - దేవర్షులతో కూడి, ఐరావతకర-ఉద్ధృతైః - ఐరావతముయొక్క తుండముచే పైకి పోయబడిన, ఆకాశగంగాయాః - ఆకాశగంగయొక్క, ఉదకైః - జలములతో, అభ్యషించత - అభిషేకించెను, గోవిందః - గోవిందుడు, ఇతి చ - అని కూడ, అభ్యధాత్ - పేరు పెట్టెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా యదువంశోద్భవుడగు శ్రీకృష్ణుని సంబోధించి కామధేనువు తన పాలతో అభిషేకించెను. అదితి మొదలైన దేవమాతలు ప్రేరేపించగా, ఇంద్రుడు కూడ నారదాది దేవర్షులతో కూడి ఐరావతగజము పైకి ఎత్తి పోసిన ఆకాశగంగయొక్క

జలములతో అభిషేకించి, గోవిందుడు (గోవులను కాపాడువాడు) అని బిరుదమునిచ్చెను.

తత్రాగతాస్తుంబురునారదాదయో
గంధర్వవిద్యాధరసిద్ధచారణాః ।
జగుర్యశో లోకమలాపహం హరేః
సురాంగనాస్సంననృతుర్ముదాఽన్వితాః ॥ 24

తత్ర - అచటకు, ఆగతాః - విచ్చేసిన, తుంబురునారద-ఆదయః - తుంబురుడు నారదుడు మొదలగువారు, గంధర్వవిద్యాధరసిద్ధచారణాః - గంధర్వులు విద్యాధరులు సిద్ధులు చారణులు, హరేః - శ్రీహరియొక్క, లోకమల-అపహమ్ - జనుల పాపములను పోగొట్టే, యశః - కీర్తిని, జగుః - పాడిరి, ముదా - ఆనందముతో, అన్వితాః - కూడియున్న, సుర-అంగనాః - అప్సరసలు, సంననృతుః - చక్కగా నాట్యము చేసిరి.

అచటకు విచ్చేసిన దేవర్షి నారదుడు, తుంబురుడు, చిత్రరథుడు మొదలైన గంధర్వులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులు జనుల పాపములను పోగొట్టే శ్రీహరి కీర్తిని గానము చేసిరి. అప్సరసలు ఆనందముతో కూడి నాట్యమాడిరి.

తం తుష్టువుర్దేవనికాయకేతవో
వ్యవాకిరంశ్చాద్భుతపుష్పవృష్టిభిః ।
లోకాః పరాం నిర్వృతిమాప్నువంస్త్రయో
గావస్తదా గామనయన్పయోద్రుతామ్ ॥ 25

దేవనికాయకేతవః - దేవగణముల ప్రముఖులు, తమ్ - ఆ శ్రీకృష్ణుని, తుష్టువుః - స్తుతించిరి, అద్భుతపుష్పవృష్టిభిః - ఆశ్చర్యమును గొలిపే పూల వానలతో, అవాకిరన్ - చల్లిరి, త్రయః - మూడు, లోకాః - లోకములు, పరామ్ - సర్వోత్కృష్టమైన, నిర్వృతిమ్ - ఆనందమును, ఆప్నువన్ - పొందినవి, తదా - అప్పుడు, గావః - ఆవులు, గామ్ - భూమిని, పయః-ద్రుతామ్ - పాలతో తడిసిన దానినిగా, అనయన్ - చేసినవి.

అప్పుడు దేవగణములలోని ప్రముఖులు ఆ శ్రీకృష్ణుని స్తుతించి అచ్చెరువును గొలిపే పూలవానలను కురిపించిరి. ముల్లోకములు మహానందమును పొందెను. ఆవులు భూమిపై పాల వరదను కలిగించినవి.

నానారసౌఘాస్సరితో వృక్షా ఆసన్మధుస్రవాః ।
అకృష్టపచ్యౌషధయో గిరయోఽబిభ్రదున్మణీన్ ॥ 26

సరితః - నదులు, నానారస-ఓఘాః - పలు రసముల ప్రవాహములు గలవి, ఆసన్ - అయినవి, వృక్షాః - చెట్లు, మధుస్రవాః - తేనెలను స్రవించునవి, అకృష్టపచ్య-ఓషధయః - నేలను దున్నకుండానే పండిన పంటలు, గిరయః - పర్వతములు, మణీన్ - మణులను, ఉత్ - బయటకు, అబిభ్రత్ - ప్రకటించినవి.

నదులు పలు రసముల జలప్రవాహములను, చెట్లు తేనెల ధారలను, దున్నకుండానే నేలలు పంటలను ప్రకటించగా, పర్వతములు తమలోని మణులను బాహ్యమునందు ప్రకటించినవి.

కృష్ణేఽభిషిక్త ఏతాని సత్త్వాని కురునందన ।
నిర్వైరాణ్యభవంస్తాత క్రూరాణ్యపి నిసర్గతః ॥ 27

కురునందన - కురువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా!, తాత - నాయనా!, కృష్ణే - శ్రీకృష్ణుడు, అభిషిక్తే - అభిషేకించబడగా, నిసర్గతః - స్వభావము వలన, క్రూరాణి అపి - క్రూరములే అయిననూ, ఏతాని - ఈ, సత్త్వాని - ప్రాణులు, నిర్వైరాణి - వైరము లేనివి, అభవన్ - అయినవి.

కురువంశీయుడవగు ఓ రాజా! నాయనా! శ్రీకృష్ణుడు అభిషేకించబడగా, స్వభావము చేతనే క్రూరములైన పులి మొదలగు జంతువులు కూడ వైరమును విడిచి పెట్టినవి.

ఇతి గోగోకులపతిం గోవిందమభిషిచ్య సః ।
అనుజ్ఞాతో యయౌ శక్రో వృతో దేవాదిభిర్దివమ్ ॥ 28

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే సప్తవింశోఽధ్యాయః ॥

సః - ఆ, శక్రః - ఇంద్రుడు, దేవ-ఆదిభిః - దేవతలు మొదలగువారితో, వృతః - చుట్టువారబడినవాడై, ఇతి - ఈ విధముగా, గోగోకులపతిమ్ - గోవులకు గోకులమునకు నాయకుడగు శ్రీకృష్ణుని, గోవిందమ్ - గోవిందునిగా, అభిషిచ్య - అభిషేకించి, అనుజ్ఞాతః - అనుమతి ఈయబడినవాడై, దివమ్ - స్వర్గమును గురించి, యయౌ - వెళ్లెను.

ఆ ఇంద్రుడీ విధముగా దేవతలు, గంధర్వులు మొదలగువారు చుట్టువారియుండగా, గోవులకు గోకులమునకు నాయకుడగు శ్రీకృష్ణుని గోవిందునిగా అభిషేకించెను. తరువాత ఆయన అనుమతి తీసుకొని స్వర్గమునకు వెళ్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్ధములో కామధేనువు శ్రీకృష్ణుని గోవిందునిగా అభిషేకించుటను
వర్ణించే ఇరువది ఏడవ అధ్యాయము ముగిసినది (27).

* * * * *

# అథ అష్టావింశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు నందుని వరుణలోకమునుండి విడిపించుట

శ్రీశుక ఉవాచ ।
ఏకాదశ్యాం నిరాహారస్సమభ్యర్చ్య జనార్దనమ్ ।
స్నాతుం నందస్తు కాలింద్యా ద్వాదశ్యాం జలమావిశత్ ॥ 1

నందః తు - నందుడైతే, ఏకాదశ్యామ్ - ఏకాదశియందు, నిరాహారః - ఉపవాసము చేసినవాడై, జన-అర్దనమ్ - దుష్టజనశిక్షకుడగు శ్రీహరిని, సమభ్యర్చ్య - బాగుగా పూజించి, ద్వాదశ్యామ్ - ద్వాదశియందు, స్నాతుమ్ - స్నానము చేయుటకై, కాలింద్యాః - యమునానదియొక్క, జలమ్ - నీటిని, ఆవిశత్ - ప్రవేశించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- నందుడైతే ఏకాదశినాడు ఉపవాసము చేసి, దుష్టజనశిక్షకుడగు శ్రీహరిని బాగుగా పూజించెను. ద్వాదశినాడు స్నానము కొరకై యమునానదీజలములయందు ప్రవేశించెను.

తం గృహీత్వాఽనయద్భృత్యో వరుణస్యాసురోఽంతికమ్ ।
అవిజ్ఞాయాసురీం వేలాం ప్రవిష్టముదకం నిశి ॥ 2

భృత్యః - సేవకుడగు, అసురః - రాక్షసుడు, నిశి - రాత్రియందు, ఆసురీమ్ - రాక్షసులకు చెందిన, వేలామ్ - సమయమును, అవిజ్ఞాయ - తెలుసుకోకుండా, ఉదకమ్ - నీటిని, ప్రవిష్టమ్ - ప్రవేశించిన, తమ్ - ఆ నందుని, గృహీత్వా - పట్టుకొని, వరుణస్య - వరుణుని, అంతికమ్ - సమీపమును గురించి, అనయత్ - కొనిపోయెను.

అది రాత్రియందలి రాక్షసులకు చెందిన వేళ. ఆ విషయము తెలియని నందుడు నీటిలో ప్రవేశించెను. వరుణుని సేవకుడగు రాక్షసుడాతనిని పట్టుకొని వరుణుని వద్దకు తీసుకొని పోయెను.

చుక్రుశుస్తమపశ్యంతః కృష్ణ రామేతి గోపకాః ।
భగవాంస్తదుపశ్రుత్య పితరం వరుణాహృతమ్ ।
తదంతికం గతో రాజన్ స్వానామభయదో విభుః ॥ 3

రాజన్ - ఓ రాజా!, తమ్ - ఆ నందుని, అపశ్యంతః - కానరాని, గోపకాః - రక్షకులైన గోపాలకులు, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, రామ - ఓ బలరామా!, ఇతి - అని, చుక్రుశుః - ఆక్రోశించిరి, స్వానామ్ - తనవారలకు, అభయదః - అభయమునిచ్చే, విభుః - శ్రీకృష్ణుడు, తత్ - దానిని, ఉపశ్రుత్య - విని, పితరమ్ - తండ్రిని, వరుణ-ఆహృతమ్ - వరుణునిచే కొనిపోబడినవానినిగా (తెలుసుకొని), తద్-అంతికమ్ - ఆ వరుణుని సమీపమును గురించి, గతః - వెళ్లినవాడు.

ఓ పరీక్షిన్మహారాజా! నందుని రక్షకులగు గోపాలకులకు ఆయన కానరాలేదు. అపుడు వారు ఓ శ్రీకృష్ణా! ఓ బలరామా! అంటూ ఆక్రోశించిరి. అది విని, వరుణుడు నందుని కొనిపోయినాడని శ్రీకృష్ణుడు తెలుసుకొనెను. తన వారలకు అభయమునిచ్చే ఆయన ఆ వరుణుని వద్దకు వెళ్లెను.

ప్రాప్తం వీక్ష్య హృషీకేశం లోకపాలస్సపర్యయా ।
మహత్యా పూజయిత్వాఽఽహ తద్దర్శనమహోత్సవః ॥ 4

ప్రాప్తమ్ - విచ్చేసిన, హృషీక-ఈశమ్ - ఇంద్రియాంతర్యామియగు శ్రీకృష్ణ భగవానుని, వీక్ష్య - చూచి, తద్-దర్శనమహా-ఉత్సవః - ఆయన దర్శనముచే గొప్ప ఉత్సాహము గల, లోకపాలః - లోకపాలకుడగు వరుణుడు, మహత్యా - గొప్ప, సపర్యయా - సపర్యతో, పూజయిత్వా - పూజించి, ఆహ - పలికెను.

ఇంద్రియాధిపతియగు శ్రీకృష్ణుడు వచ్చుటను పశ్చిమదిక్పాలకుడగు వరుణుడు చూచెను. ఆయన దర్శనముచే వరుణునకు గొప్ప

ఉత్సాహము కలిగెను. ఆయన ఆ భగవానుని గొప్ప సపర్యతో పూజించి ఇట్లు పలికెను.

వరుణ ఉవాచ ।
అద్య మే నిభృతో దేహోఽద్యైవార్థోఽధిగతః ప్రభో ।
త్వత్పాదభాజో భగవన్నవాపుః పారమధ్వనః ॥ 5

ప్రభో - ఓ ప్రభూ!, అద్య - ఈనాడు, మే - నా, దేహః - శరీరము, నిభృతః - ధరించబడినది, అద్య ఏవ - ఈనాడే, అర్థః - ప్రయోజనము, అధిగతః - పొందబడినది, భగవన్ - ఓ భగవానుడా!, త్వత్-పాదభాజః - నీ పాదములను పొందువారు, అధ్వనః - సంసారమార్గముయొక్క, పారమ్ - ఆవలి తీరమును, అవాపుః - పొందిరి.

వరుణుడిట్లు పలికెను --- ఓ ప్రభూ! ఈనాడు నా జన్మ సార్థకమైనది. నాకీనాడే పరమప్రయోజనము సిద్ధించినది. ఓ భగవానుడా! నీ పాదములను శరణు వేడువారు సంసారమార్గముయొక్క ఆవలి గట్టు (మోక్షము) ను చేరెదరు.

నమస్తుభ్యం భగవతే బ్రహ్మణే పరమాత్మనే ।
న యత్ర శ్రూయతే మాయా లోకసృష్టివికల్పనా ॥ 6

భగవతే - భగవానుడవైనట్టియు, బ్రహ్మణే - పరబ్రహ్మవైనట్టియు, పరమాత్మనే - పరమాత్మవైన, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము, యత్ర - ఏ నీయందు, లోకసృష్టివికల్పనా - లోకముల సృష్టిరూపములోనుండే వివిధములైన కల్పనలు గల, మాయా - మాయ, న - లేదు అని, శ్రూయతే - వినబడుచున్నదో.

నిర్గుణపరబ్రహ్మవు, సగుణబ్రహ్మవు, ప్రాణులలోని అంతరతమమగు ఆత్మవు నీవే. నీకు నమస్కారము. లోకముల సృష్టిరూపములోనుండే వివిధములగు కల్పనలకు ఆశ్రయమైన మాయాశక్తి నీయందు నీకంటె భిన్నముగా లేదని శ్రుతి చెప్పుచున్నది.

అజానతా మామకేన మూఢేనాకార్యవేదినా ।
ఆనీతోఽయం తవ పితా తద్భవాన్ క్షంతుమర్హతి ॥ 7

మూఢేన - మూర్ఖుడైనట్టియు, అకార్యవేదినా - చేయదగిన పనిని గురించి పరిజ్ఞానము లేనట్టియు, అజానతా - తెలియని, మామకేన - నా సేవకునిచే, అయమ్ - ఈ, తవ - నీ, పితా - తండ్రి, ఆనీతః - తీసుకురాబడినవాడు. తత్ - దానిని, భవాన్ - నీవు, క్షంతుమ్ - క్షమించుటకు, అర్హతి - తగుదువు.

నా సేవకుడు కార్యపరిజ్ఞానము లేని మూర్ఖుడు. నీ తండ్రి అని తెలియక ఈయనను తీసుకువచ్చినాడు. ఆ పనిని నీవు క్షమించదగును.

మమాప్యనుగ్రహం కృష్ణ కర్తుమర్హస్యశేషదృక్ ।
గోవింద నీయతామేష పితా తే పితృవత్సల ॥ 8

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, అశేషదృక్ - సకలసాక్షివగు నీవు, మమ అపి - నాకు కూడ, అనుగ్రహమ్ - అనుగ్రహమును, కర్తుమ్ - చేయుటకు, అర్హసి - తగుదువు, గోవింద - ఓ గోవిందా!, పితృవత్సల - తండ్రియందు ప్రేమ గలవాడా!, ఏషః - ఈ, తే - నీ, పితా - తండ్రి, నీయతామ్ - కొనిపోబడుగాక!

ఓ శ్రీకృష్ణా! నీవు సకలసాక్షివి, గోవిందుడవు, తండ్రియందు అనురాగము గలవాడవు. నీవు నన్ను కూడ అనుగ్రహించవలెను. ఈ నీ తండ్రిని నీతోబాటు తీసుకువెళ్లుము.

శ్రీశుక ఉవాచ ।
ఏవం ప్రసాదితః కృష్ణో భగవానీశ్వరేశ్వరః ।
ఆదాయాగాత్స్వపితరం బంధూనాం చావహన్ముదమ్ ॥ 9

ఈశ్వర-ఈశ్వరః - లోకపాలకులకు కూడ ప్రభుడగు, కృష్ణః భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఏవమ్ - ఈ విధముగా, ప్రసాదితః - ప్రసన్నుడుగా చేయబడినవాడై, స్వపితరమ్ - తన తండ్రిని, ఆదాయ - తీసుకొని, బంధూనామ్ - బంధువులకు, ముదమ్ - ఆనందమును, ఆవహన్ - కలిగించువాడై, అగాత్ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- లోకపాలకులకు కూడ ప్రభుడగు శ్రీకృష్ణ భగవానుని వరుణుడీ విధముగా ప్రసన్నుని చేసెను. ఆయన తన తండ్రిని తీసుకువెళ్లెను. నందుని చూచి బంధువులు ఆనందించిరి.

నందస్త్వతీంద్రియం దృష్ట్వా లోకపాలమహోదయమ్ ।
కృష్ణే చ సన్నతిం తేషాం జ్ఞాతిభ్యో విస్మితోఽబ్రవీత్ ॥ 10

నందః తు - నందుడైతే, అతి-ఇంద్రియమ్ - ఇంద్రియగోచరము కాని, లోకపాలమహా-ఉదయమ్ - లోకపాలకుడగు వరుణుని గొప్ప ఐశ్వర్యమును, తేషామ్ - వారియొక్క, కృష్ణే - శ్రీకృష్ణునియందలి, సంనతిం చ - వినయమును కూడ, దృష్ట్వా - చూచి, విస్మితః - ఆశ్చర్యపడినవాడై, జ్ఞాతిభ్యః - బంధువుల కొరకు, అబ్రవీత్ - చెప్పెను.

లోకపాలకుడగు వరుణుని ఐశ్వర్యము మామూలుగా కంటికి కానరాదు. నందుడైతే దానిని చూచెను. పైగా, ఆ లోకములోని వారందరు శ్రీకృష్ణుని యెడల చూపిన వినయమును చూచి నందుడు ఆశ్చర్యపడి, ఆ విషయమును బంధువులకు చెప్పెను.

తే త్వౌత్సుక్యధియో రాజన్ మత్వా గోపాస్తమీశ్వరమ్ ।
అపి నస్స్వగతిం సూక్ష్మాముపాధాస్యదధీశ్వరః ॥ 11

రాజన్ - ఓ రాజా!, ఔత్సుక్యధియః - ఉత్కంఠ గల బుద్ధి గల, తే - ఆ, గోపాః తు - గోపాలకులైతే, తమ్ - ఆ శ్రీకృష్ణుని, ఈశ్వరమ్ - ఈశ్వరునిగా, మత్వా - తెలుసుకొని, అధి-ఈశ్వరః - సర్వేశ్వరుడు, నః - మనకు, సూక్ష్మామ్ - సూక్ష్మమైన, స్వగతిమ్ - తన స్థానమును, అపి ఉపాధాస్యత్ - చూపించునా?

ఓ పరీక్షిన్మహారాజా! ఆ గోపాలకులైతే ఆ శ్రీకృష్ణుడు ఈశ్వరుడని తెలుసుకొనిరి. ఈ సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుడు మనకు ఇంద్రియగోచరము కాని తన ధామమును చూపునా? అని వారి మనస్సులలో ఉత్కంఠ కలిగెను.

ఇతి స్వానాం స భగవాన్ విజ్ఞాయాఖిలదృక్ స్వయమ్ ।
సంకల్పసిద్ధయే తేషాం కృపయైతదచింతయత్ ॥ 12

అఖిలదృక్ - సర్వసాక్షియగు, సః - ఆ, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఇతి - ఈ విధమైన, స్వానామ్ - తనవారల (అభిప్రాయమును), స్వయమ్ - తాను, విజ్ఞాయ - తెలుసుకొని, తేషామ్ - వారి, సంకల్పసిద్ధయే - సంకల్పము సిద్ధించుటకై, కృపయా - దయతో, ఏతత్ - దీనిని గురించి, అచింతయత్ - తలపోసెను.

సర్వసాక్షియగు ఆ శ్రీకృష్ణ భగవానుడు తన వారలకున్న ఈ విధమైన అభిప్రాయమును స్వయముగా గుర్తించెను. ఆయన దయతో వారి అభిలాష సిద్ధించుటకై ఈ విధముగా సంకల్పించెను.

జనో వై లోక ఏతస్మిన్నవిద్యాకామకర్మభిః ।
ఉచ్చావచాసు గతిషు న వేద స్వాం గతిం భ్రమన్ ॥ 13

ఏతస్మిన్ - ఈ, లోకే - లోకమునందు, జనః వై - మానవుడైతే, అవిద్యాకామకర్మభిః - అజ్ఞానము కామనలు కర్మలచే, ఉచ్చావచాసు - ఉత్తమములు అధమములు అగు, గతిషు - జన్మలయందు, భ్రమన్ - పరిభ్రమించువాడై, స్వామ్ - తనదైన, గతిమ్ - స్వరూపమును, న వేద - తెలియడు.

మానవుడైతే ఈ లోకములో అజ్ఞానము-కామనలు-కర్మలచే ఉత్తమములు మరియు అధమములు అగు జన్మలను పొందుతూ పరిభ్రమించుచుండునే గాని, తన స్వరూపమును తెలుసుకొనడు.

ఇతి సంచింత్య భగవాన్ మహాకారుణికో హరిః ।
దర్శయామాస లోకం స్వం గోపానాం తమసః పరమ్ ॥ 14

మహాకారుణికః - గొప్ప కరుణామయుడగు, హరిః భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఇతి - ఈ విధముగా, సంచింత్య - సంకల్పించి, గోపానామ్ - గోపాలకులలకు, తమసః - చీకటికి, పరమ్ - ఆవలనుండే, స్వమ్ - తనదైన, లోకమ్ - లోకమును, దర్శయామాస - చూపించెను.

గొప్ప కరుణామయుడగు శ్రీకృష్ణ భగవానుడీ విధముగా సంకల్పించి, గోపాలకులలకు అజ్ఞానమునకు ఆవలనుండే తన ధామమును చూపెను.

సత్యం జ్ఞానమనంతం యద్బ్రహ్మ జ్యోతిస్సనాతనమ్ ।
యద్ధి పశ్యంతి మునయో గుణాపాయే సమాహితాః ॥ 15

యత్ - ఏ, బ్రహ్మ - పరబ్రహ్మ, అనంతమ్ - పరిచ్ఛేదములు లేని, సత్యమ్ - సత్యమో, జ్ఞానమ్ - జ్ఞానమో, సనాతనమ్ - కాలాతీతమైన, జ్యోతిః - స్వయంప్రకాశచైతన్యమో, యత్ హి - దేనినైతే, సమాహితాః - ఏకాగ్రచిత్తము గల, మునయః - మహర్షులు, గుణ-అపాయే - గుణములు తొలగిపోగా, పశ్యంతి - చూచెదరో.

ఆ ధామము అనంతపరబ్రహ్మయే. అది కాలాతీతమైన స్వయంప్రకాశ చైతన్యము. మహర్షులు ఏకాగ్రమగు చిత్తముతో సత్త్వరజస్తమోగుణముల నధిగమించి ఆ పరబ్రహ్మను ఆత్మరూపముగా దర్శించెదరు.

తే తు బ్రహ్మహ్రదం నీతా మగ్నాః కృష్ణేన చోద్ధృతాః ।
దదృశుర్బ్రహ్మణో లోకం యత్రాక్రూరోఽధ్యగాత్పురా ॥ 16

తే తు - వారైతే, కృష్ణేన - శ్రీకృష్ణునిచే, బ్రహ్మహ్రదమ్ - పరబ్రహ్మ అనే కాసారమును గురించి, నీతాః - తీసుకొని వెళ్లబడినవారు, మగ్నాః - నిమగ్నమైనవారు, ఉద్ధృతాః చ - పైకి లేవనెత్తబడినవారు, బ్రహ్మణః - పరబ్రహ్మయొక్క, లోకమ్ - వైకుంఠలోకమును, దదృశుః - చూచిరి, యత్ర - దేనియందైతే, పురా - పూర్వము, అక్రూరః - అక్రూరుడు, అధ్యగాత్ - దర్శించెనో.

ఏ జలాశయమునందైతే భగవానుడు అక్రూరునకు తన స్వరూపమును చూపెనో, అదే జలాశయమునకు శ్రీకృష్ణుడు ఆ గోపాలకులను తీసుకువెళ్లెను. వారు దానిలో మునిగి పరబ్రహ్మయొక్క వైకుంఠ ధామమును దర్శించిరి. వారిని ఆయన మరల పైకి తీసుకువచ్చెను.

నందాదయస్తు తం దృష్ట్వా పరమానందనిర్వృతాః ।
కృష్ణం చ తత్రచ్ఛందోభిః స్తూయమానం సువిస్మితాః ॥ 17

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే అష్టావింశోఽధ్యాయః ॥

నంద-ఆదయః తు - నందుడు మొదలగువారైతే, తత్ర - అచట, ఛందోభిః చ - వేదములచే కూడ, స్తూయమానమ్ - స్తుతించబడుచున్న, తమ్ - ఆ, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, దృష్ట్వా - చూచి, పరమ-ఆనందనిర్వృతాః - అతిశయించిన ఆనందమునందు నిమగ్నమైన వారు, సువిస్మితాః - మిక్కిలి ఆశ్చర్యమును పొందినవారు.

నందుడు మొదలగు గోపాలకులైతే ఆ లోకమునందు వేదములు కూడ ఆ శ్రీకృష్ణుని స్తుతించుచుండుటను గాంచి పరమాశ్చర్యమునందు, మహానందమునందు నిమగ్నులైరి.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్ధములో శ్రీకృష్ణుడు నందుని వరుణలోకమునుండి విడిపించుటను
వర్ణించే ఇరువది ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (28).



# అథ ఏకోనత్రింశోఽధ్యాయః

## రాస పంచాధ్యాయి - ఉపక్రమము

శ్రీశుక ఉవాచ ।
భగవానపి తా రాత్రీశ్శరదోత్ఫుల్లమల్లికాః ।
వీక్ష్య రంతుం మనశ్చక్రే యోగమాయాముపాశ్రితః ॥ 1

భగవాన్ అపి - శ్రీకృష్ణ భగవానుడు కూడ, శరదా - శరత్కాలముచే, ఉత్ఫుల్లమల్లికాః - వికసించిన మల్లెలు గల, తాః - ఆ, రాత్రీః - రాత్రులను, వీక్ష్య - చూచి, యోగమాయామ్ - యోగమాయను, ఉపాశ్రితః - ఆశ్రయించినవాడై, రంతుమ్ - రమించుటకు, మనః చక్రే - నిశ్చయించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అది శరత్కాలము. రాత్రులయందు మల్లెలు వికసించి యుండెను. వాటిని చూచి శ్రీకృష్ణభగవానుడు కూడ యోగమాయను ఆశ్రయించి విహరించుటకు నిశ్చయించెను.

తదోడురాజః కకుభః కరైర్ముఖం
ప్రాచ్యా విలింపన్నరుణేన శంతమైః ।
స చర్షణీనాముదగాచ్ఛుచో మృజన్
ప్రియః ప్రియాయా ఇవ దీర్ఘదర్శనః ॥ 2

తదా - అప్పుడు, సః - ఆ, ఉడురాజః - నక్షత్రరాజగు చంద్రుడు, శంతమైః - మిక్కిలి సుఖమునిచ్చే (చల్లని), కరైః - కిరణములతో, ప్రాచ్యాః కకుభః - తూర్పు దిక్కుయొక్క, ముఖమ్ - ముఖమును, దీర్ఘదర్శనః - చాల కాలమునకు కనబడిన, ప్రియః - ప్రియుడు, ప్రియాయాః ఇవ - ప్రియురాలి ముఖమును వలె, అరుణేన - ఎరుపు రంగుతో, విలింపన్ - అలదుచున్నవాడై, చర్షణీనామ్ - మానవుల, శుచః - తాపములను, మృజన్ - తుడిచివేయుచున్నవాడై, ఉదగాత్ - ఉదయించెను.

అప్పుడే చంద్రుడు ఉదయించెను. చాల కాలము తరువాత కనబడిన ప్రియుడు కుంకుమతో ప్రియురాలి ముఖమును వలె, ఆ చంద్రుడు తన మిక్కిలి చల్లని కిరణములతో తూర్పు దిక్కుయొక్క ముఖమును ఎర్రగా చేసెను. ఇంకా ఆ చంద్రుడు జనుల తాపములను కూడ తుడిచి వేసెను.

దృష్ట్వా కుముద్వంతమఖండమండలం
రమాఽఽననాభం నవకుంకుమారుణమ్ ।
వనం చ తత్కోమలగోభిరంజితం
జగౌ కలం వామదృశాం మనోహరమ్ ॥ 3

అఖండమండలమ్ - పూర్ణమగు మండలము కలిగినట్టియు, రమా-ఆనన-ఆభమ్ - లక్ష్మీదేవి ముఖముయొక్క శోభ వంటి శోభ కలిగినట్టియు, నవకుంకుమ-అరుణమ్ - కొత్త కుంకుమ వలె ఎర్రనైన, కుముద్వంతమ్ - చంద్రుని, తత్-కోమలగోభిః - ఆ చంద్రుని సుకుమారమైన కిరణములచే, అంజితమ్ - అంతటా సుందరముగా చేయబడిన, వనం చ - అడవిని కూడ, దృష్ట్వా - చూచి, కలమ్ - మధురముగా, వామదృశామ్ - అందమైన కన్నులు గల యువతులకు, మనః-హరమ్ - హృదయమును దోచేదిగా, జగౌ - పాడెను.

పూర్ణమగు మండలము కలిగి లక్ష్మీదేవి ముఖముయొక్క శోభవంటి శోభ గల చంద్రుడు కొత్త కుంకుమ వలె ఎర్రగా నుండెను. ఆయనయొక్క సుకుమారమైన కిరణములు అడవిని అంతటా సుందరముగా చేయుచుండెను. శ్రీకృష్ణుడు ఆ దృశ్యమును చూచి మధురముగా వేణువును మ్రోగించెను. ఆ ధ్వని అందమైన కన్నులు గల యువతుల హృదయములను దోచివేసెను.

నిశమ్య గీతం తదనంగవర్ధనం వ్రజస్త్రియః కృష్ణగృహీతమానసాః,
ఆజగ్మురన్యోన్యమలక్షితోద్యమాస్స యత్ర కాంతో జవలోలకుండలాః।

అనంగవర్ధనమ్ - ప్రేమను ఉద్దీపింపజేసే, తత్ - ఆ, గీతమ్ - గానమును, నిశమ్య - విని, కృష్ణగృహీతమానసాః - శ్రీకృష్ణునిచే ఆకర్షించబడిన మనస్సులు గల, వ్రజస్త్రియః - గోకులమునందలి

యువతులు, అన్యోన్యమ్ - ఒకరికి మరియొకరు, అలక్షిత-ఉద్యమాః - తెలియబడని ఉద్యమము గలవారై, జవలోలకుండలాః - వేగముచే కదలాడుచున్న కుండలములు గలవారై, ఆజగ్ముః - వచ్చిరి, యత్ర - ఎక్కడనైతే, సః - ఆ, కాంతః - ప్రియుడు గలడో. 4

భగవానునియందలి ప్రేమను వర్ధిల్లజేసే ఆ గానమును విని గోకులమునందలి స్త్రీలు శ్రీకృష్ణునిచే వశము చేసుకొనబడిన మనస్సులు గలవారై వచ్చివేసిరి. ఒకరు వచ్చుచున్నట్లు మరియొకరికి తెలియకుండగా వారు వేగముగా వచ్చుచుండగా వారి కుండలములు అల్లలాడుచుండెను. వారు ప్రియుడగు శ్రీకృష్ణుడు ఉన్న స్థానమును చేరిరి.

దుహంత్యోఽభియయుః కాశ్చిద్దోహం హిత్వా సముత్సుకాః ।
పయోఽధిశ్రిత్య సంయావమనుద్వాస్యాపరా యయుః ॥ 5

సముత్సుకాః - చాల ఉత్సాహము గల, కాశ్చిత్ - కొందరు గోపికలు, దుహంత్యః - పాలను పితుకుతున్నవారు, దోహమ్ - పితుకుటను, హిత్వా - విడిచిపెట్టి, పయః - పాలను, అధిశ్రిత్య - పొయ్యి మీద పెట్టి, అపరాః - మరికొందరు గోపికలు, సంయావమ్ - గోధుమ హవిస్సును, అనుద్వాస్య - పొయ్యి దింపకుండా, యయుః - వెళ్లిరి.

ఉత్సాహము అధికముగా నుండుట వలన పాలను పితుకుతున్న కొందరు గోపికలు ఆ పనిని సగములో ఆపివేసి, పాలను కాచుచున్న గోపికలు పాలను పొయ్యి మీదనే ఉంచి, గోధుమ హవిస్సును చేయుచున్న గోపికలు దానిని పొయ్యి మీదనుండి దింపకుండా వెళ్లిరి.

పరివేషయంత్యస్తద్ధిత్వా పాయయంత్యశ్శిశూన్ పయః ।
శుశ్రూషంత్యః పతీన్ కాశ్చిదశ్నంత్యోఽపాస్య భోజనమ్ ॥ 6

పరివేషయంత్యః - వడ్డిస్తున్న గోపికలు, తత్ - ఆ వడ్డనను, శిశూన్ - పిల్లలను, పయః - పాలను, పాయయంత్యః - త్రాగించుచున్నవారు, పతీన్ - భర్తలను, శుశ్రూషత్యః - సేవ చేయుచున్న, కాశ్చిత్ - కొందరు గోపికలు, తత్ - ఆ పనిని, హిత్వా - విడిచిపెట్టి, అశ్నంత్యః - తినుచున్నవారు, భోజనమ్ - భోజనమును, అపాస్య - విడిచిపెట్టి.

అన్నము వడ్డిస్తున్న గోపికలు, పిల్లలకు పాలను త్రాగించుచున్న వారు, భర్తలకు సేవను చేయుచున్నవారు, భోజనము చేయుచున్న గోపికలు, ఆయా పనులను సగములోనే విడిచిపెట్టి వెళ్లిరి.

లింపంత్యః ప్రమృజంత్యోఽన్యా అంజంత్యః కాశ్చ లోచనే ।
వ్యత్యస్తవస్త్రాభరణాః కాశ్చిత్కృష్ణాంతికం యయుః ।। 7

కాశ్చ - కొందరు గోపికలు, లింపంత్యః - చందనాదులను అలదుకొనుచున్నవారు, ప్రమృజంత్యః - నలుగు పెట్టుకొనుచున్నవారు, అన్యాః - మరికొందరు, లోచనే - కంటియందు, అంజంత్యః - కాటుక పెట్టుకొనుచున్నవారు, కాశ్చిత్ - కొందరు, వ్యత్యస్త వస్త్ర-ఆభరణాః - తల్లక్రిందులైన వస్త్రములు ఆభరణములు గలవారు, కృష్ణ-అంతికమ్ - శ్రీకృష్ణుని సమీపమును గురించి, యయుః - వెళ్లిరి.

కొందరు గోపికలు చందనాదులను అలదుకుంటూ మానివేసి, కొందరు అభ్యంగనమును సగములో విడిచిపెట్టి, మరికొందరు కంటికి కాటుక పెట్టుకుంటూ మానివేసి, కొందరు చీరలను వ్యత్యస్తముగా (పై కొంగు క్రిందికి, క్రింది కొంగు పైకి) కట్టుకొని, మరికొందరు ఆభరణములను తప్పుగా (కంకణములను పాదములకు, నూపురములను చేతులకు) పెట్టుకొని, శ్రీకృష్ణుని వద్దకు వెళ్లిరి.

తా వార్యమాణా పతిభిః పితృభిర్భ్రాతృబంధుభిః ।
గోవిందాపహృతాత్మానో న న్యవర్తంత మోహితాః ।। 8

పతిభిః - భర్తలచే, పితృభిః - తల్లిదండ్రులచే, భ్రాతృబంధుభిః - సోదరులచే బంధువులచే, వార్యమాణాః - వారించబడుచున్నవారు, గోవింద-అపహృత-ఆత్మానః - గోవిందునిచే దోచివేయబడిన మనస్సు గలవారు, మోహితాః - మోహమును పొందినవారు, న న్యవర్తంత - వెనుదిరుగలేదు.

ఆ గోపికల మనస్సును గోవిందుడు దోచివేసెను. భర్తలు, తల్లిదండ్రులు, సోదరులు, బంధువులు ఆపుతున్నా, మోహములో పడిపోయిన ఆ గోపికలు ఆగలేదు.

అంతర్గృహగతాః కాశ్చిద్గోప్యోఽలబ్ధవినిర్గమాః ।
కృష్ణం తద్భావనాయుక్తా దధ్యుర్మీలితలోచనాః ॥ 9

అంతః-గృహగతాః - మధ్య ఇంటియందుండిపోయిన, కాశ్చిత్ - కొందరు, గోప్యః - గోపికలు, అలబ్ధవినిర్గమాః - లభించని బయటకు వచ్చుట గలవారై, తద్-భావనాయుక్తాః - ఆ శ్రీకృష్ణుని భావనతో కూడినవారై, మీలితలోచనాః - మూయబడిన కన్నులు గలవారై, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, దధ్యుః - ధ్యానించిరి.

ఇంటి మధ్యలో ఉండిపోయి బయటకు వచ్చే అవకాశము దొరకని కొందరు గోపికలు మనస్సులో ఆ శ్రీకృష్ణుని భావన చేస్తూ కళ్లను మూసుకొని ఆయననే ధ్యానించిరి.

దుస్సహప్రేష్ఠవిరహతీవ్రతాపధుతాశుభాః ।
ధ్యానప్రాప్తాచ్యుతాశ్లేషనిర్వృత్యా క్షీణమంగలాః ॥ 10

దుస్సహప్రేష్ఠవిరహతీవ్రతాపధుత-అశుభాః - సహించ శక్యము కాని ప్రియతముని విరహముయొక్క తీవ్రమైన తాపముచే కడిగివేయబడిన చెడు వాసనలు గలవారు, ధ్యానప్రాప్త-అచ్యుత-ఆశ్లేషనిర్వృత్యా - ధ్యానముచే పొందబడిన శ్రీకృష్ణ భగవానుని కౌగిలి వలని ఆనందముచే, క్షీణమంగలాః - క్షయమైన పుణ్యవాసనలు గలవారు.

ప్రియతముడగు శ్రీకృష్ణుని విరహము సహించ శక్యము కానిది. అట్టి విరహము వలన కలిగిన తాపముచే వారి చెడు వాసనలు కడిగివేయబడెను. వారు ధ్యానమునందు శ్రీకృష్ణ భగవానుని కౌగిలిని పొంది మహానందమునునుభవించుటచే పుణ్యవాసనలు క్షయమయ్యెను.

తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాఽపి సంగతాః ।
జహుర్గుణమయం దేహం సద్యః ప్రక్షీణబంధనాః ॥ 11

తమ్ - ఆ, పరమాత్మానం ఏవ - శ్రీకృష్ణ పరమాత్మనే, జారబుద్ధ్యా అపి - జారుడనే భావనతోనే ఐనా, సంగతాః - కలుసుకున్న గోపికలు, సద్యః - వెనువెంటనే, ప్రక్షీణబంధనాః - క్షయించిన కర్మబంధము

గలవారై, గుణమయమ్ - త్రిగుణముల కార్యమగు, దేహమ్ - దేహమును, సద్యః - వెనువెంటనే, జహుః - విడిచిపెట్టిరి.

వారు ఆ శ్రీకృష్ణ పరమాత్మనే జారుడనే భావనతోటే అయినా కలుసుకొనిరి. వెంటనే వారి కర్మబంధము నశించి, త్రిగుణముల కార్యమగు దేహమును (దేహాభిమానమును) విడిచిపెట్టిరి.

రాజోవాచ ।
కృష్ణం విదుః పరం కాంతం న తు బ్రహ్మతయా మునే ।
గుణప్రవాహోపరమస్తాసాం గుణధియాం కథమ్ ॥ 12

మునే - ఓ మహర్షీ!, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, పరమ్ - మిక్కిలి, కాంతమ్ - ప్రియునిగా, విదుః - భావించిరి, బ్రహ్మతయా తు - పరబ్రహ్మభావనతోనైతే, న - కాదు, గుణధియామ్ - గుణకార్యమగు దేహమునందు ఆత్మబుద్ధి గల, తాసామ్ - ఆ గోపికలకు, గుణప్రవాహ-ఉపరమః - గుణకార్యములగు సుఖదుఃఖాదుల ప్రవాహరూపమైన సంసారము తొలగిపోవుట, కథమ్ - ఎట్లు?

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ శుకమహర్షీ! వారు శ్రీకృష్ణుని ప్రియతమునిగా భావించిరే గాని, పరబ్రహ్మగానైతే కాదు. వారికి గుణముల కార్యమగు దేహమునందు ఆత్మబుద్ధి గలదు. గుణకార్యములగు సుఖదుఃఖముల ప్రవాహము రూపములోనుండే సంసారము అట్టివారికి ఎట్లు తొలగినది?

శ్రీశుక ఉవాచ ।
ఉక్తం పురస్తాదేతత్తే చైద్యస్సిద్ధిం యథా గతః ।
ద్విషన్నపి హృషీకేశం కిముతాధోక్షజప్రియాః ॥ 13

ఏతత్ - ఈ విషయము, పురా - ఇదివరలో, తే - నీకు, ఉక్తమ్ - చెప్పబడినది, యథా - ఏ విధముగానైతే, చైద్యః - చేదిదేశరాజగు శిశుపాలుడు, హృషీక-ఈశమ్ - ఇంద్రియములకు అంతర్యామియగు శ్రీకృష్ణ భగవానుని, ద్విషన్ అపి - ద్వేషించువాడే ఐననూ, సిద్ధిమ్ - సిద్ధిని, గతః - పొందినాడో, అధోక్షజప్రియాః - ఇంద్రియగోచరము కాని

స్వరూపము గల శ్రీకృష్ణ భగవానుని ప్రేమించువారు, కిం ఉత - వేరుగా చెప్పవలెనా?

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విషయమును నేనిదివరలో నీకు చెప్పియుంటిని. ఇంద్రియములకు అంతర్యామియగు శ్రీహరిని ద్వేషించి కూడ చేదిదేశప్రభువగు శిశుపాలుడు సిద్ధిని పొందిన విషయమును నేను చెప్పితిని. ఇంద్రియములకు అతీతుడగు శ్రీహరిని ప్రేమించువారు సిద్ధిని పొందెదరని వేరుగా చెప్పవలయునా?

నృణాం నిశ్శ్రేయసార్థాయ వ్యక్తిర్భగవతో నృప ।
అవ్యయస్యాప్రమేయస్య నిర్గుణస్య గుణాత్మనః ॥ 14

నృప - ఓ రాజా!, అవ్యయస్య - వినాశము లేనట్టియు, అప్రమేయస్య - ప్రమాణగోచరుడు కానట్టియు, నిర్గుణస్య - గుణములు లేనట్టియు, గుణ-ఆత్మనః - గుణములకు అంతర్యామియగు, భగవతః - శ్రీహరి భగవానునకు, వ్యక్తిః - ప్రకటరూపము, నృణామ్ - మానవుల, నిశ్శ్రేయస-అర్థాయ - మోక్షమనే ప్రయోజనము కొరకు.

ఓ పరీక్షిన్మహారాజా! అవినాశియగు శ్రీహరి భగవానుడు ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుడు కాడు. గుణముల కార్యమగు జగత్తునకు అంతర్యామియగు ఆయన నిర్గుణుడు. ఆయన మానవులకు మోక్షమనే ప్రయోజనము సిద్ధించుటకై విశిష్టమగు రూపములో ప్రకటమగును.

కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవ చ ।
నిత్యం హరౌ విదధతో యాంతి తన్మయతాం హి తే ॥ 15

కామమ్ - ప్రేమను, క్రోధమ్ - కోపమును, భయమ్ - భయమును, స్నేహమ్ - మైత్రిని, సౌహృదం ఏవ చ - భక్తిని కూడ, నిత్యమ్ - నిత్యము, హరౌ - శ్రీహరియందు, విదధతః - చేయుచున్నవారు, తే - వారు, హి - నిశ్చయముగా, తత్-మయతామ్ - ఆయనయొక్క సాయుజ్యమును, యాంతి - పొందెదరు.

నిత్యము ప్రేమను (గోపికలు) గాని, కోపమును (శిశుపాలుడు) గాని, భయమును (కంసుడు) గాని, మైత్రిని (అర్జునుడు) గాని, భక్తిని

(నారదుడు) గాని శ్రీహరియందు భావన చేయు వారు ఆయనతోడి సాయుజ్యమును పొందెదరు.

న చైవం విస్మయః కార్యో భవతా భగవత్యజే ।
యోగేశ్వరేశ్వరే కృష్ణే యత ఏతద్విముచ్యతే ।। 16

అజే - పుట్టుక లేనట్టియు, యోగ-ఈశ్వర-ఈశ్వరే - యోగసిద్ధులు గలవారికి యోగిరాజులకు కూడ ప్రభువైన, కృష్ణే - శ్రీకృష్ణునియందు, ఏవమ్ - ఈ విధముగా, విస్మయః - సందేహము, న చ కార్యః - చేయబడదగినది కానే కాదు, యతః - ఎవనివలనైతే, ఏతత్ - ఈ ప్రాణివర్గము, విముచ్యతే - విముక్తి ఈయబడునో.

శ్రీకృష్ణుడు పుట్టుక లేనివాడు, యోగులకు యోగిరాజులకు కూడ ప్రభువు. ఆయనయందు నీవిట్టి సందేహమును చేయనే రాదు. ఏలయన, ఈ ప్రాణివర్గము ఆయన వలననే మోక్షమును పొందును.

తా దృష్ట్వాఽంతికమాయాతా భగవాన్ వ్రజయోషితః ।
అవదద్వదతాం శ్రేష్ఠో వాచః పేశైర్విమోహయన్ ।। 17

అంతికమ్ - సమీపమును, ఆయాతాః - వచ్చియున్న, తాః - ఆ, వ్రజయోషితః - గోకులస్త్రీలను, దృష్ట్వా - చూచి, వదతామ్ - వక్తలలో, శ్రేష్ఠః - శ్రేష్ఠుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, వాచః - వాక్కుయొక్క, పేశైః - విలాసలతో, విమోహయన్ - మోహమును కలిగించువాడై, అవదత్ - పలికెను.

తన సమీపమునకు వచ్చిన ఆ గోపికలను చూచి వక్తలలో శ్రేష్ఠుడగు శ్రీకృష్ణ భగవానుడు ఇట్లు పలికెను. ఆయన వాక్కుయొక్క విలాసలచే వారికి మోహము కలిగెను.

శ్రీభగవానువాచ ।
స్వాగతం వో మహాభాగాః ప్రియం కిం కరవాణి వః ।
వ్రజస్యానామయం కచ్చిద్బ్రూతాగమనకారణమ్ ।। 18

మహాభాగాః - గొప్ప భాగ్యవతులారా!, వః - మీకు, స్వాగతమ్ - స్వాగతము, వః - మీకు, కిమ్ - దేనిని, ప్రియమ్ - ప్రియమును, కరవాణి - చేయుదును?, వ్రజస్య - గోకులమునకు, అనామయం కచ్చిత్ - క్షేమమేనా?, ఆగమనకారణమ్ - వచ్చుటకు కారణమును, బ్రూత - చెప్పుడు.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- ఓ యువతులారా! మీరు గొప్ప భాగ్యవతులు. మీకు స్వాగతము. మీకు నేనేమి ప్రియమును చేయవలెను? గోకులము క్షేమమేనా? మీరు వచ్చుటకు గల కారణమును చెప్పుడు.

రజన్యేషా ఘోరరూపా ఘోరసత్త్వనిషేవితా ।
ప్రతియాత వ్రజం నేహ స్థేయం స్త్రీభిస్సుమధ్యమాః ।। 19

సుమధ్యమాః - ఓ సుందరయువతులారా!, ఇయమ్ - ఈ, రజనీ - రాత్రి, ఘోరరూపా - భయమును గొల్పే రూపము గలది, ఘోరసత్త్వనిషేవితా - భయమును గొల్పే ప్రాణులచే సేవించబడునది, వ్రజమ్ - గోకులమును గురించి, ప్రతియాత - తిరిగి వెళ్ళుడు, స్త్రీభిః - స్త్రీలచే, ఇహ - ఇచట, న స్థేయమ్ - ఉండబడరాదు.

ఓ సుందర యువతులారా! భయమును గొల్పే రూపము గల ఈ రాత్రియందు భయమును గొల్పే ప్రాణులు సంచరించుచుండును. గోకులమునకు తిరిగి వెళ్ళుడు. యువతులు ఇక్కడ ఉండరాదు.

మాతరః పితరః పుత్రా భ్రాతరః పతయశ్చ వః ।
విచిన్వంతి హ్యపశ్యంతో మా కృఢ్వం బంధుసాధ్వసమ్ ।। 20

హి - ఏలయన, వః - మీ, మాతరః - తల్లులు, పితరః - తండ్రులు, పుత్రాః - పుత్రులు, భ్రాతరః - సోదరులు, పతయః చ - భర్తలు కూడ, అపశ్యంతః - కానరానివారై, విచిన్వంతి - వెదుకుచున్నారు, బంధుసాధ్వసమ్ - బంధువులకు భయమును, మా కృఢ్వమ్ - కలిగించకుడు.

ఎందుకంటే మీ తల్లులు, తండ్రులు, పుత్రులు, సోదరులు, మరియు భర్తలు మీరు కనబడక మీ కోసం వెదుకుచుందురు. వారికి భయమును, కంగారును కలిగించవద్దు.

దృష్టం వనం కుసుమితం రాకేశకరరంజితమ్ ।
యమునాఽనిలలీలైజత్తరుపల్లవశోభితమ్ ॥ 21

కుసుమితమ్ - పూలతో నిండినది, రాకా-ఈశకరరంజితమ్ - రాత్రికి నాయకుడగు చంద్రుని కిరణములచే ప్రకాశింప జేయబడినది, యమునా-అనిలలీలా-ఏజత్-తరుపల్లవశోభితమ్ - యమునానదియొక్క గాలియొక్క మందగమనముచే కదలాడే చెట్ల చిగుళ్లతో శోభిల్లునది అగు, వనమ్ - అడవి, దృష్టమ్ - చూడబడినది.

పూలతో నిండిన ఈ అడవిని మీరు చూచితిరి. దీనిని రాత్రికి నాయకుడగు చంద్రుడు తన కిరణములతో ప్రకాశింప జేయుచున్నాడు. యమునానదిమీదనుండి మెల్లగా విలాసగా వీచే గాలికి కదలాడే చెట్ల చిగుళ్లతో ఈ అడవి శోభిల్లుచున్నది.

తద్యాత మా చిరం గోష్ఠం శుశ్రూషధ్వం పతీన్ సతీః ।
క్రందంతి వత్సా బాలాశ్చ తాన్ పాయయత దుహ్యత ॥ 22

తత్ - అందువలన, గోష్ఠమ్ - గోకులమును గురించి, యాత - వెళ్లుడు, చిరమ్ - విలంబము, మా - వద్దు, సతీః - ఓ పతివ్రతలారా!, పతీన్ - భర్తలను, శుశ్రూషధ్వమ్ - శుశ్రూష చేయుడు, వత్సాః - దూడలు, బాలాః చ - పిల్లలు కూడ, క్రందంతి - ఏడుస్తున్నారు, తాన్ - వారిని, పాయయత - పాలను త్రాగించుడు, దుహ్యత - పాలను పితుకుడు.

ఓ పతివ్రతలారా! గోకులమునకు వెళ్లుడు. విలంబము చేయకుడు. భర్తలకు సేవను చేయుడు. పిల్లలు, దూడలు కూడ పాలకై ఏడుస్తున్నారు. పిల్లలకు, దూడలకు పాలను త్రాగించుడు. ఆవులను పాలను పితుకుడు.

అథవా మదభిస్నేహాద్భవత్యో యంత్రితాశయాః ।
ఆగతా హ్యుపపన్నం వః ప్రీయంతే మయి జంతవః ॥ 23

అథవా - అట్లు కాకపోవచ్చును, మద్-అభిస్నేహాత్ - నాయందలి అనురాగము వలన, యంత్రిత-ఆశయాః - వశము చేసుకొనబడిన అంతఃకరణము గల, భవత్యః - మీరు, ఆగతాః - వచ్చినవారు, వః - మీకు,

ఉపపన్నమ్ - తగియే యున్నది, హి - ఏలయన, జంతవః - ప్రాణులు, మయి - నాయందు, ప్రీయంతే - ప్రీతిని కలిగి యుందురు.

అట్లు కాకపోవచ్చును. మీరు నాయందలి అనురాగముచే వశము చేసు కొనబడిన అంతఃకరణము గలవారై వచ్చిరి. ఈ రాక మీ ప్రేమకు తగియే యున్నది. ఎందుకంటే, ప్రాణులు నాయందు ప్రీతిని కలిగియుందురు.

భర్తుశ్శుశ్రూషణం స్త్రీణాం పరో ధర్మో హ్యమాయయా ।
తద్బంధూనాం చ కల్యాణ్యః ప్రజానాం చానుపోషణమ్ ॥ 24

కల్యాణ్యః - ఓ కల్యాణవతులారా!, అమాయయా - నిష్కపటముగా, భర్తుః - భర్తకు, తద్-బంధూనాం చ - వాని బంధువులకు కూడ, శుశ్రూషణమ్ - సేవను చేయుట, ప్రజానామ్ - పిల్లలకు, అనుపోషణం చ - పోషించుట, స్త్రీణామ్ - స్త్రీలకు, పరః - గొప్ప, ధర్మః - ధర్మము.

ఓ కల్యాణవతులారా! నిష్కపటముగా భర్తను ఆతని బంధువులను సేవించుట, సంతానమును పోషించుట స్త్రీలకు సర్వోత్తమమైన ధర్మము.

దుశ్శీలో దుర్భగో వృద్ధో జడో రోగ్యధనోఽపి వా ।
పతిః స్త్రీభిర్న హాతవ్యో లోకేప్సుభిరపాతకీ ॥ 25

దుశ్శీలః - చెడు స్వభావము గలవాడు, దుర్భగః - దురదృష్టవంతుడు, వృద్ధః - ముదుసలి, జడః - సోమరి, రోగీ - రోగము గలవాడు, అధనః అపి వా - దరిద్రుడే అయినా, పతిః - భర్త, అపాతకీ - పాపి కానివాడు, లోక-ఈప్సుభిః - పుణ్యలోకములను కోరే, స్త్రీభిః - స్త్రీలచే, హాతవ్యః - విడువబడదగినవాడు, న - కాదు.

భర్త చెడు స్వభావము గలవాడు గాని, దురదృష్టవంతుడు గాని, ముదుసలి గాని, సోమరి గాని, రోగము గలవాడు గాని, దరిద్రుడే గాని, పాపి కానిచో, పుణ్యలోకమును కోరే స్త్రీలు అట్టి భర్తను విడిచి పెట్టరాదు.

అస్వర్గ్యమయశస్యం చ ఫల్గు కృచ్ఛ్రం భయావహమ్ ।
జుగుప్సితం చ సర్వత్ర ఔపపత్యం కులస్త్రియాః ॥ 26

కులస్త్రియాః - కులస్త్రీకి, ఔపపత్యమ్ - పరపురుషసంబంధము, సర్వత్ర - అన్ని దేశకాలములయందు, అస్వర్గ్యమ్ - స్వర్గమును పోగొట్టునది, అయశస్యం చ - కీర్తిని కూడ పోగొట్టునది, ఫల్గు - తుచ్ఛమైనది, కృచ్ఛ్రమ్ - కష్టమునకు హేతువు, భయ-ఆవహమ్ - భయమును కలిగించునది, జుగుప్సితం చ - ఏవగించుకొనబడేది కూడ.

సర్వదేశకాలములలో కులస్త్రీకి పరపురుషసంబంధము స్వర్గమును, కీర్తిని కూడ నశింప జేయును. తుచ్ఛమైన ఆ సుఖము కష్టములను, భయమును కలిగించును. అందరు అట్టి సుఖమునేవగించుకొనెదరు.

శ్రవణాద్దర్శనాద్ధ్యానాన్మయి భావోఽనుకీర్తనాత్ ।
న తథా సన్నికర్షేణ ప్రతియాత తతో గృహాన్ ॥ 27

శ్రవణాత్ - వినుట వలన, దర్శనాత్ - చూచుట వలన, ధ్యానాత్ - ధ్యానించుట వలన, అనుకీర్తనాత్ - కీర్తించుట వలన, మయి - నాయందు, భావః - భక్తి, సన్నికర్షేణ - ప్రక్కన ఉండుట వలన, తథా - ఆ విధముగా, న - కాదు, తతః - అందువలన, గృహాన్ - ఇంటిని గురించి, ప్రతియాత - తిరిగి వెళ్లుడు.

నా గాథలను వినుట, నా రూపమును చూచుట, నన్ను కీర్తించుట, నన్ను ధ్యానించుట అనువాటి వలన నాపై ఏర్పడే భక్తి నా ప్రక్కన ఉండుట వలన ఏర్పడదు. కావున, మీరు ఇంటికి తిరిగి వెళ్లుడు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి విప్రియమాకర్ణ్య గోప్యో గోవిందభాషితమ్ ।
విషణ్ణా భగ్నసంకల్పాశ్చింతామాపుర్దురత్యయామ్ ॥ 28

ఇతి - ఈ విధముగా, విప్రియమ్ - ఇష్టము కాని, గోవిందభాషితమ్ - గోవిందుని మాటను, ఆకర్ణ్య - విని, గోప్యః - గోపికలు, విషణ్ణాః - ఖేదమును పొందినవారు, భగ్నసంకల్పాః - భగ్నమైన సంకల్పము గలవారు, దురత్యయామ్ - అతిక్రమించ శక్యము కాని, చింతామ్ - దుఃఖమును, ఆపుః - పొందిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గోవిందుని ఈ వచనములు గోపికలకు ప్రియము కాలేదు. సంకల్పము భగ్నమగుటచే వారు ఖేదమును పొందిరి. వారికి అతిక్రమించ శక్యము కాని దుఃఖము కలిగెను.

కృత్వా ముఖాన్యవ శుచశ్శ్వసనేన శుష్యద్-
బింబాధరాణి చరణేన భువం లిఖంత్యః ।
అస్రైరుపాత్తమషిభిః కుచకుంకుమాని
తస్థుర్మృజంత్య ఉరుదుఃఖభరాస్స్మ తూష్ణీమ్ ॥ 29

శుచః - దుఃఖముయొక్క, శ్వసనేన - నిట్టూర్పుచే, శుష్యద్-బింబ-అధరాణి - శుష్కించుచున్న దొండపండువంటి క్రింది పెదవులు గల, ముఖాని - ముఖములను, అవ - క్రిందికి, కృత్వా - దించి, చరణేన - కాలితో, భువమ్ - నేలను, లిఖంత్యః - వ్రాయుచున్నవారు, ఉపాత్తమషిభిః - పట్టుకొనబడిన మసి గల, అస్రైః - కన్నీళ్లతో, కుచకుంకుమాని - స్తనములయందలి కుంకుమలను, మృజంత్యః - చెరిపి వేయుచున్నవారు, ఉరుదుఃఖభరాః - అధికమగు దుఃఖభారము గలవారు, తూష్ణీమ్ - ఏమీ మాటలాడకుండా, తస్థుః స్మ - నిలబడిరి.

ఆ గోపికలు దుఃఖముతో విడిచే వేడి నిట్టూర్పులకు వారి దొండపండువంటి క్రింది పెదవులు వాడిపోవుచుండెను. వారు ముఖములను క్రిందకు దించి నేలపై కాలితో రాస్తూంటే, పెల్లుబికే కన్నీళ్లు కాటుకతో నల్లనై స్తనములయందలి కుంకుమలను చెరిపివేయుచుండెను. వారు అధికమగు దుఃఖభారముతో మిన్నకుండిరి.

ప్రేష్ఠం ప్రియేతరమివ ప్రతిభాషమాణం
కృష్ణం తదర్థవినివర్తితసర్వకామాః ।
నేత్రే విమృజ్య రుదితోపహతే స్మ కించిత్-
సంరంభగద్గదగిరోఽబ్రువతానురక్తాః ॥ 30

అనురక్తాః - అనురాగము గలవారు, తద్-అర్థవినివర్తితసర్వకామాః - ఆ శ్రీకృష్ణుని కొరకై విడిచిపెట్టబడిన సకలకామనలు గలవారు అగు గోపికలు, రుదిత-ఉపహతే - ఏడ్చుటచే వాడిపోయిన (చూపు అడ్డు పడిన), నేత్రే -

రెండు కళ్లను, విమృజ్య - తుడుచుకొని, కించిత్-సంరంభగద్గదగిరః - కొంచెము కోపముతో గద్గదమైన వాక్కు గలవారై, ప్రేష్ఠమ్ - ప్రియతముడైనట్టియు, ప్రియ-ఇతరం ఇవ - ప్రియుడు కానివాడు వలె, ప్రతిభాషమాణమ్ - తిరస్కరించుచున్న, కృష్ణమ్ - శ్రీకృష్ణుని ఉద్దేశించి, అబ్రువత స్మ - పలికిరి.

గోపికలకు శ్రీకృష్ణునిపై అనురాగము మెండు. వారు ఆయన కొరకై సకలకామనలను విడిచిపెట్టిరి. ప్రియతముడైన శ్రీకృష్ణుడు ప్రియుడు కాడన్నట్లు తిరస్కరించెను. ఏడ్పుటచే వారి కన్నులు వాడిపోయి చూపు అడ్డు పడుచుండెను. కొంచెము కోపము వలన వారి మాట గద్గదమయ్యెను. వారు కళ్లను తుడుచుకొని ఆయనతో నిట్లనిరి.

గోప్య ఊచుః ।
మైవం విభోఽర్హతి భవాన్ గదితుం నృశంసం
సంత్యజ్య సర్వవిషయాంస్తవ పాదమూలమ్ ।
భక్తా భజస్వ దురవగ్రహ మా త్యజాస్మాన్
దేవో యథాఽఽదిపురుషో భజతే ముముక్షూన్ ॥ 31

విభో - ఓ ప్రభూ!, దురవగ్రహ - మొండి పట్టుదల వాడా!, భవాన్ - నీవు, ఏవమ్ - ఈ విధముగా, నృశంసమ్ - క్రూరమైన మాటను, గదితుమ్ - పలుకుటకు, మా అర్హతి - తగవు, సర్వవిషయాన్ - సకలభోగములను, సంత్యజ్య - పూర్తిగా విడిచిపెట్టి, తవ - నీ, పాదమూలమ్ - పాదముల మూలమును, భక్తాః - సేవించువారము, అస్మాన్ - మమ్ములను, భజస్వ - సేవించుము, మా త్యజ - విడిచి పెట్టకుము, యథా - ఏ విధముగానైతే, ఆదిపురుషః - జగత్కారణుడు పూర్ణుడు అగు, దేవః - పరమాత్మ, ముముక్షూన్ - మోక్షకాములను, భజతే - సేవించునో.

గోపికలిట్లు పలికిరి --- ఓ ప్రభూ! నీది మొండి పట్టుదల. నీవీ విధముగా క్రూరముగా పలుకుట తగదు. మేము సకలభోగములను పూర్తిగా విడిచి పెట్టి నీ పాదముల మూలమును సేవించుచున్నాము. మోక్షమును కోరే సాధకులను జగత్కారణుడు, పూర్ణుడు అగు పరమాత్మ సేవించే విధముగా, నీవు కూడ మమ్ములను సేవించుము, విడిచి పెట్టకుము.

యత్పత్యపత్యసుహృదామనువృత్తిరంగ
స్త్రీణాం స్వధర్మ ఇతి ధర్మవిదా త్వయోక్తమ్ ।
అస్త్వేవమేతదుపదేశపదే త్వయీశే
ప్రేష్ఠో భవాంస్తనుభృతాం కిల బంధురాత్మా ॥ 32

అంగ - ఓయీ!, స్త్రీణామ్ - స్త్రీలకు, పతి-అపత్యసుహృదామ్ - భర్త సంతానము బంధువుల, అనువృత్తిః - సేవ, స్వధర్మః - స్వధర్మమ్ము, ఇతి - అని, యత్ - ఏ మాట, ధర్మవిదా - ధర్మము తెలిసిన, త్వయా - నీచే, ఉక్తమ్ - చెప్పబడినదో, ఏతత్ - ఈ మాట, ఏవమ్ - ఈ విధముగనే, ఉపదేశపదే - ఉపదేశములకు విషయమగు, ఈశే - ఈశ్వరుడవగు, త్వయి - నీయందు, అస్తు - ఉండుగాక!, తనుభృతామ్ - దేహధారులకు, భవాన్ - నీవు, ప్రేష్ఠః కిల - ప్రియతముడవు గదా!, బంధుః - బంధుడవు, ఆత్మా - ఆత్మవు.

ఓ ప్రభూ! స్త్రీలకు భర్తను, సంతానమును, బంధువులను సేవించుట స్వధర్మమని ధర్మము తెలిసిన ఈశ్వరుడవగు నీవు ఉపదేశించితివి. నీ ఉపదేశము యథార్థమే. ఈ ఉపదేశము ఉపదేశకుడవగు నీయందే ఉండు గాక! ఉపదేశములన్నింటికీ పరమలక్ష్యము నీవే. నీవు దేహధారులకు ప్రియతముడవు, బంధుడవు, ఆత్మవు గదా!

కుర్వంతి హి త్వయి రతిం కుశలాస్స్వ ఆత్మన్
నిత్యప్రియే పతిసుతాదిభిరార్తిదైః కిమ్ ।
తన్నః ప్రసీద పరమేశ్వర మా స్మ ఛింద్యా
ఆశాం భృతాం త్వయి చిరాదరవిందనేత్ర ॥ 33

కుశలాః - నేర్పరులైన సాధకులు, స్వే - తమదైన, ఆత్మన్ - ఆత్మయైనట్టియు, నిత్యప్రియే - నిత్యము ప్రియమైన, త్వయి - నీయందు, రతిమ్ - ప్రీతిని, కుర్వంతి హి - చేయుదురు గదా!, ఆర్తిదైః - దుఃఖమునిచ్చే, పతిసుత-ఆదిభిః - భర్త కొడుకు మొదలగువారితో, కిమ్ - పని యేమి?, పరమేశ్వర - ఓ పరమేశ్వరా!, తత్ - అందువలన, నః - మా కొరకు, ప్రసీద - ప్రసన్నుడవు కమ్ము, అరవిందనేత్ర - పద్మములవంటి

కన్నులు గలవాడా!, చిరాత్ - చాలకాలము, త్వయి - నీయందు, భృతామ్ - నిబద్ధమైన, ఆశామ్ - ఆశను, మా స్మ ఛింద్యాః - విఫలము చేయకుము.

ఓ పరమేశ్వరా! నేర్పరులైన (వివేకవంతులగు) సాధకులు తమ ఆత్మరూపుడవై నిత్యప్రియుడవగు నీయందు ప్రేమను చేయుదురు. ఇది నిశ్చయము. దుఃఖమును మిగిల్చే భర్త, కొడుకు, కూతురు మొదలగువారితో పని యేమున్నది? కావున, మాపై ప్రసన్నుడవు కమ్ము. పద్మములవంటి కన్నులు గలవాడా! మేము చాల కాలమునుండి నీపై ఆశలను పెట్టుకున్నాము. మా ఆశలను వమ్ము చేయకుము.

చిత్తం సుఖేన భవతాఽపహృతం గృహేషు
యన్నిర్విశత్యుత కరావపి గృహ్యకృత్యే ।
పాదౌ పదం న చలతస్తవ పాదమూలాద్
యామః కథం వ్రజమథో కరవామ కిం వా ॥ 34

చిత్తమ్ - చిత్తము, (సుఖేన - ఆనందఘనుడవగు), భవతా - నీచే, సుఖేన - తేలికగా, అపహృతమ్ - అపహరించబడినది, యత్ - ఏది, గృహేషు - ఇంటియందు, నిర్విశతి - ప్రవేశించునో, ఉత - మరియు, కరౌ అపి - రెండు చేతులు కూడ, గృహ్యకృత్యే - ఇంటి పనియందు, పాదౌ - రెండు కాళ్లు, తవ - నీ, పాదమూలాత్ - పాదముల మూలమునుండి, పదమ్ - అడుగును, న చలతః - కదలకున్నవి, వ్రజమ్ - గోకులమును గురించి, కథమ్ - ఏ విధముగా, యామః - వెళ్లెదము?, అథో - మరియు, కిం వా - దేనిని, కరవామ - చేయుదుము?

మా మనస్సు ఇంటియందు లగ్నమైనప్పుడు చేతులు ఇంటి పనులలో నిమగ్నమయ్యేడివి. కాని ఆనందఘనుడవగు నీవు మా మనస్సును తేలికగా దోచినావు. ఇప్పుడు మనస్సు ఇంటియందు, చేతులు ఇంటి పనులయందు లగ్నమగుట లేదు. రెండు కాళ్లు నీ పాదమూలమునుండి ఒక్క అడుగును కూడ వేయుట లేదు. మేము గోకులమును వెళ్లుట యెట్లు? మరియు, వెళ్లి మేమేమి చేయవలెను?

సించాంగ నస్త్వదధరామృతపూరకేణ
హాసావలోకకలగీతజహృచ్ఛయాగ్నిమ్ ।
నో చేద్వయం విరహజాగ్న్యుపయుక్తదేహా
ధ్యానేన యామ పదయోః పదవీం సఖే తే ॥ 35

అంగ - ఓయీ!, సఖే - మిత్రమా!, నః - మాకు, హాస-అవలోకకలగీతజహృత్-శయ-అగ్నిమ్ - చిరునవ్వు చూపులు మధురమగు గానములనుండి పుట్టిన ప్రేమ అనే అగ్నిని, త్వద్-అధర-అమృతపూరకేణ - నీ అధరామృతప్రవాహముచే, సించ - తడుపుము, నో చేత్ - అట్లు గానిచో, విరహజ-అగ్ని-ఉపయుక్తదేహాః - విరహము వలన పుట్టిన అగ్నిచే దహించబడిన దేహములు గల, వయమ్ - మేము, ధ్యానేన - ధ్యానముచే, తే - నీ, పదయోః - రెండు పాదముల, పదవీమ్ - సన్నిధానమును, యామ - పొందెదము.

ఓ మిత్రమా! నీ చిరునవ్వు, చూపులు, మధురగానములచే మా హృదయములలో పుట్టిన ప్రేమ అనే అగ్నిని నీ అధరామృతప్రవాహముతో ఆర్పుము. అట్లు చేయనిచో, నీ విరహము వలన పుట్టిన అగ్ని మా దేహములను దహించివేయును. మేము ధ్యానముచే నీ పాదముల సన్నిధానమును చేరెదము.

యర్హ్యంబుజాక్ష తవ పాదతలం రమాయా
దత్తక్షణం క్వచిదరణ్యజనప్రియస్య ।
అస్ప్రాక్ష్మ తత్ప్రభృతి నాన్యసమక్షమంగ
స్థాతుం త్వయాఽభిరమితా బత పారయామః ॥ 36

అంగ - ఓయీ!, అంబుజ-అక్ష - పద్మములవంటి కన్నులు గలవాడా!, యర్హి - ఎప్పుడైతే, క్వచిత్ - ఒకప్పుడు, రమాయాః - లక్ష్మీదేవికి, దత్తక్షణమ్ - ఈయబడిన ఉత్సవము గల, అరణ్యజనప్రియస్య - అడవియందు నివసించే గోపాలకులు ప్రియులైన (గోపాలకులకు ప్రియమైన), తవ - నీ, పాదతలమ్ - పాదతలమును, అస్ప్రాక్ష్మ - స్పృశించితిమో, త్వయా - నీచే, అభిరమితాః - ఆనందింపజేయబడితిమో, తత్-ప్రభృతి - అప్పటినుండియు,

అన్యసమక్షమ్ - ఇతరుల యెదుట, స్థాతుమ్ - నిలుచుటకు, న పారయామః - సమర్థులము కాము.

ఓయీ! నీ కన్నులు పద్మములను పోలియున్నవి. నీకు అడవిలో ఉండే గోపాలకులంటే ప్రీతి. వారికి నీవంటే ప్రీతి. నీ పాదములను స్పృశించే ఆనందము లక్ష్మీదేవికైననూ అప్పుడప్పుడు మాత్రమే లభించును. అట్టి నీ పాదమును మేము స్పృశించితిమి. ఆ విధముగా మమ్ములను నీవు ఎప్పుడు ఆనందింప జేసితివో, అప్పటినుండియు ఇతరుల యెదుట నిలుచుట కూడ మాకు చేతగాకున్నది.

శ్రీర్యత్పదాంబుజరజశ్చకమే తులస్యా
లబ్ధ్వాఽపి వక్షసి పదం కిల భృత్యజుష్టమ్ ।
యస్యాస్స్వవీక్షణకృతేఽన్యసురప్రయాసః
తద్వద్వయం చ తవ పాదరజః ప్రపన్నాః ॥ 37

శ్రీః - లక్ష్మీదేవి, వక్షసి - వక్షఃస్థలమునందు, పదమ్ - స్థానమును, లబ్ధ్వా అపి - పొంది కూడ, తులస్యా - తులసితో కూడి, భృత్యజుష్టమ్ - భక్తులచే సేవించబడే, యత్-పద-అంబుజరజః - ఏ నీయొక్క పాదపద్మముల ధూళిని, చకమే కిల - కోరెనో గదా!, యస్యాః - ఏ లక్ష్మీదేవియొక్క, స్వవీక్షణకృతే - తమను చూచుట కొరకై, అన్యసురప్రయాసః - ఇతరదేవతల ప్రయాసయో, తద్వత్ - ఆమె వలెనే, వయం చ - మేము కూడ, తవ - నీ, పాదరజః - పాదముల ధూళిని, ప్రపన్నాః - శరణు వేడినాము.

లక్ష్మీదేవి తమపై చూపులను బరపవలెనని ఇతరదేవతలు ప్రయాసపడుచుందురు. అట్టి ఆమె నీ వక్షఃస్థలమునందు స్థానమును పొంది యున్నది. అయిననూ, ఆమె తులసీదేవితో పోటీపడి, భక్తులు సేవించే నీ పాదపద్మముల ధూళిని కోరినది. ఆమె వలెనే మేము కూడ నీ పాదముల ధూళిని శరణు వేడినాము.

తన్నః ప్రసీద వృజినార్దన తేఽంఘ్రిమూలం
ప్రాప్తా విసృజ్య వసతీస్త్వదుపాసనాశాః ।

త్వత్సుందరస్మితనిరీక్షణతీవ్రకామ-
తప్తాత్మనాం పురుషభూషణ దేహి దాస్యమ్ ॥ 38

వృజిన-అర్దన - పాపములను నశింపజేయువాడా!, తత్ - అందువలన, నః - మా కొరకు, ప్రసీద - ప్రసన్నుడవు కమ్ము, వసతీః - భర్త మొదలగు వారితో కూడిన ఇళ్లను, విసృజ్య - విడిచిపెట్టి, త్వద్-ఉపాసన-ఆశాః - నిన్ను సేవించాలనే కోరికతో, తే - నీ, అంఘ్రిమూలమ్ - పాదముల మూలమును, ప్రాప్తాః - పొందినవారము, పురుషభూషణ - ఓ పురుషోత్త మా!, త్వత్-సుందరస్మితనిరీక్షణతీవ్రకామతప్త-ఆత్మనామ్ - నీ అందమగు చిరునవ్వును చూడాలనే తీవ్రమగు కోరికచే తపింపజేయబడిన చిత్తములు గల మాకు, దాస్యమ్ - సేవ చేసే అవకాశమును, దేహి - ఇమ్ము.

పాపములను నశింపజేసే ఓ పురుషోత్తమా! మేము భర్త మొదలగు వారితో కూడియున్న ఇళ్లను విడిచిపెట్టి నిన్ను సేవించాలనే కోరికతో నీ పాదమూలమును చేరినవారము. కావున, మాకై ప్రసన్నుడవు కమ్ము. నీ అందమైన చిరునవ్వును చూడాలనే తీవ్రమైన కోరికచే మా చిత్తములు తాపమును పొందియున్నవి. మాకు నీ దాస్యమునను గ్రహించుము.

వీక్ష్యాలకావృతముఖం తవ కుండలశ్రీ-
గండస్థలాధరసుధం హసితావలోకమ్ ।
దత్తాభయం చ భుజదండయుగం విలోక్య
వక్షఃశ్రియైకరమణం చ భవామ దాస్యః ॥ 39

కుండలశ్రీగండస్థల-అధరసుధమ్ - కుండలముల శోభతో కూడిన చెక్కిళ్లు కలిగినట్టియు అధరామృతము కలిగినట్టియు, హసిత-అవలోకమ్ - చిరునవ్వుతో కూడిన చూపులు గల, తవ - నీ, అలక-ఆవృతముఖమ్ - ముంగురులచే కప్పివేయబడిన ముఖమును, వీక్ష్య - చూచి, దత్త-అభయమ్ - ఈయబడిన అభయము గల, భుజదండయుగం చ - దండములవంటి భుజముల జంటను కూడ, శ్రియైకరమణమ్ - లక్ష్మీదేవికి ఏకైకవిహారస్థానమైన, వక్షః చ - వక్షఃస్థలమును కూడ, విలోక్య - చూచి, దాస్యః - దాసీలము, భవామ - అగుదుము గాక!

కుండలముల శోభతో ప్రకాశించే చెక్కిళ్లు గల నీ ముఖము ముంగురులచే కప్పివేయబడి యున్నది. అధరామృతము గల నీ ముఖము చిరునవ్వుతో కూడిన చూపులతో అలరారుచున్నది. దండముల వంటి నీ భుజముల జంట భక్తులకు అభయమునిచ్చుచున్నది. నీ వక్షఃస్థలము లక్ష్మీదేవికి ఏకైకవిహారస్థానము. ఈ సర్వమును చూచి మేము నీకు దాసీలమైనాము.

కా స్త్ర్యంగ తే కలపదాయతమూర్ఛ్ఛితేన
సమ్మోహితాఽఽర్యచరితాన్న చలేత్త్రిలోక్యామ్ ।
త్రైలోక్యసౌభగమిదం చ నిరీక్ష్య రూపం
యద్గోద్విజద్రుమమృగాః పులకాన్యబిభ్రన్ ॥ 40

అంగ - ఓయీ!, త్రిలోక్యామ్ - ముల్లోకములయందు, తే - నీ, కలపద-ఆయతమూర్ఛ్ఛితేన - మధురమగు పదములు కల దీర్ఘమైన స్వరముల ఆరోహావరోహముచే, సమ్మోహితా - మోహమును పొందించబడిన, కా - ఏ, స్త్రీ - యువతి, త్రైలోక్యసౌభగమ్ - ముల్లోకములలో సుందరమైన, ఇదమ్ - ఈ, రూపం చ - రూపమును కూడ, నిరీక్ష్య - చూచి, ఆర్యచరితాత్ - సత్ప్రవర్తననుండి, న చలేత్ - చలించకుండును?, యత్ - వేటి వలన, గోద్విజద్రుమమృగాః - గోవులు పక్షులు చెట్లు పశువులు, పులకాని - రోమాంచములను, అబిభ్రన్ - కలిగియున్నవో.

నీ గానము మధురమగు పదములతో దీర్ఘమైన స్వరముల ఆరోహ-అవరోహములను కలిగియున్నది. ఈ నీ రూపము ముల్లోకములలో అతిశయించిన అందము గలది. ఈ గానమును విని, ఈ రూపమును చూచి గోవులు, పక్షులు, చెట్లు, పశువులు కూడ రోమాంచములను పొందును. అట్టిచో, ముల్లోకములలో ఏ స్త్రీ ఈ గానమును విని, రూపమును చూచి మోహమును పొంది సత్ప్రవర్తననుండి చలించకుండును? (చలించి తీరును).

వ్యక్తం భవాన్ వ్రజభయార్తిహరోఽభిజాతో
దేవో యథాఽఽదిపురుషస్సురలోకగోప్తా ।

తన్నో నిధేహి కరపంకజమార్తబంధో
తప్తస్తనేషు చ శిరస్సు చ కింకరీణామ్ ॥ 41

ఆర్తబంధో - పీడితులను రక్షించువాడా!, భవాన్ - నీవు, వ్రజభయ-ఆర్తిహరః - గోకులముయొక్క భయమును పీడను పోగొట్టువాడవు, అభిజాతః - అవతరించినవాడవు, వ్యక్తమ్ - స్పష్టము, యథా - ఏ విధముగానైతే, ఆదిపురుషః - జగత్కారణుడు పూర్ణుడు అగు, దేవః - శ్రీహరి, సురలోకగోప్తా - దేవలోకమునకు రక్షకుడో, తత్ - అందువలన, కరపంకజమ్ - పద్మమువంటి చేతిని, కింకరీణామ్ - సేవకురాండ్రమగు, నః - మాయొక్క, తప్తస్తనేషు చ - తాపమును పొందిన వక్షఃస్థలమునందు, శిరస్సు చ - తలలపై కూడ, నిధేహి - ఉంచుము.

పీడితులను రక్షించువాడా! జగత్కారణుడు, పూర్ణుడు అగు శ్రీహరి దేవుడు దేవలోకమునకు రక్షకుడు. అదే విధముగా, నీవు గోకులముయొక్క భయమును, పీడను పోగొట్టుటకై అవతరించినాడవనేది స్పష్టమే. కావుననే, పద్మమువంటి నీ చేతిని తాపమును పొందియున్న సేవకురాండ్రమగు మా వక్షఃస్థలమునందు, తలలపై కూడ నుంచుము.

శ్రీశుక ఉవాచ ।
ఇతి విక్లవితం తాసాం శ్రుత్వా యోగేశ్వరేశ్వరః ।
ప్రహస్య సదయం గోపీరాత్మారామోఽప్యరీరమత్ ॥ 42

యోగ-ఈశ్వర-ఈశ్వరః - యోగులకు యోగిరాజులకు కూడ ప్రభువగు శ్రీకృష్ణుడు, ఇతి - ఈ విధమైన, తాసామ్ - ఆ గోపికల, విక్లవితమ్ - దీనవచనమును, శ్రుత్వా - విని, సదయమ్ - దయతో కూడునట్లుగా, ప్రహస్య - నవ్వి, ఆత్మారామః అపి - తన స్వరూపమునందే రమించువాడైననూ, గోపీః - గోపికలను, అరీరమత్ - రమింప జేసెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- యోగులకు, యోగిరాజులకు కూడ ప్రభువగు శ్రీకృష్ణుడు ఆ గోపికల ఈ దీనవచనములను విని దయతో నవ్వెను. ఆయన తన స్వరూపమునందు రమించువాడే ఐననూ, వారిని రమింపజేసెను.

తాభిస్సమేతాభిరుదారచేష్టితః ప్రియేక్షణోత్ఫుల్లముఖీభిరచ్యుతః ।
ఉదారహాసద్విజకుందదీధితిర్వ్యరోచతైణాంక ఇవోడుభిర్వృతః ॥ 43

ఉదారచేష్టితః - కోరికలను తీర్చే చేష్టలు కలిగినవాడు, ఉదారహాసద్విజకుందదీధితిః - పెద్ద నవ్వుచే మల్లె మొగ్గలవంటి దంతముల కాంతి గలవాడు అగు, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, సమేతాభిః - గుమిగూడినట్టియు, ప్రియ-ఈక్షణ-ఉత్ఫుల్లముఖీభిః - ప్రియుని చూపుచే వికసించిన ముఖములు గల, తాభిః - ఆ గోపికలచే, వృతః - చుట్టువారబడినవాడై, ఉడుభిః - నక్షత్రములతో, ఐణ-అంకః ఇవ - శశాంకుడు వలె, వ్యరోచత - అధికముగా ప్రకాశించెను.

శ్రీకృష్ణ భగవానుడు తన గానాదులతో వారి మనోరథమును తీర్చెను. అట్టి తమ ప్రియుని చూచుటచే వారి ముఖములు వికసించెను. ఆయన పెద్దగా నవ్వినప్పుడు దంతములు మల్లె మొగ్గలవలె ప్రకాశించెను. ఆ గోపికలచే చుట్టువారబడిన ఆయన నక్షత్రముల మధ్యలో చంద్రుడు వలె విశేషముగా ప్రకాశించెను.

ఉపగీయమాన ఉద్గాయన్ వనితాశతయూథపః ।
మాలాం బిభ్రద్వైజయంతీం వ్యచరన్మండయన్ వనమ్ ॥ 44

ఉపగీయమానః - గానము చేయబడుచున్నవాడు, ఉద్గాయన్ - బిగ్గరగా గానము చేయువాడు, వనితాశతయూథపః - యువతుల వందయొక్క గుంపునకు నాయకుడు, వైజయంతీమ్ - వైజయంతి అనే, మాలామ్ - మాలను, బిభ్రత్ - ధరించువాడు అగు శ్రీకృష్ణుడు, వనమ్ - అడవిని, మండయన్ - అలంకరించువాడై, వ్యచరత్ - విహరించెను.

వందలాది గోపికల సమూహమునకు నాయకుడగు శ్రీకృష్ణుని కీర్తిని వారు గానము చేయగా, ఆయన కూడ వారి ప్రేమను ప్రశంసిస్తూ గానము చేసెను. ఆయన వైజయంతి మాలను ధరించి విహరిస్తూ అడవికే అలంకారమాయెను.

నద్యాః పులినమావిశ్య గోపీభిర్హిమవాలుకమ్ ।
రేమే తత్తరలానందకుముదామోదవాయునా ॥ 45

గోపీభిః - గోపికలతో, నద్యాః - యమునానదియొక్క, హిమవాలుకమ్ - చల్లని ఇసుక గల, పులినమ్ - ఇసుకతిన్నెను, ఆవిశ్య - ప్రవేశించి, తత్-తరల-ఆనందకుముద-ఆమోదవాయునా - ఆ నదియొక్క పిల్ల కెరటముల ఆహ్లాదము కలువల పరిమళము గల గాలిచే, రేమే - విహరించెను.

ఆయన గోపికలతో గూడి యమునానదియొక్క ఇసుకతిన్నెను ప్రవేశించి విహరించెను. ఆ నదియొక్క పిల్ల కెరటములమీదనుండి వీచే చల్లని గాలి కలువల పరిమళముతో ఆహ్లాదమును కలిగించుచుండెను.

బాహుప్రసారపరిరంభకరాలకోరు-
నీవీస్తనాలభననర్మనఖాగ్రపాతైః ।
క్ష్వేల్యాఽవలోకహసితైర్వ్రజసుందరీణాం
ఉత్తంభయన్ రతిపతిం రమయాంచకార ॥ 46

బాహుప్రసారపరిరంభకర-అలక-ఊరునీవీస్తన-ఆలభననర్మనఖ-అగ్రపాతైః - చేతులను చాపుట కౌగిలింత చేతులను ముంగురులను ఊరువులను కోకముడిని స్తనములను స్పృశించుట పరిహాసములు గోటికొనలతో గిచ్చుటలచే, క్ష్వేల్యా - క్రీడచే, అవలోకహసితైః - చూపులతో నవ్వులతో, వ్రజసుందరీణామ్ - గోకులముయొక్క యువతులకు, రతిపతిమ్ - ప్రేమను, ఉత్తంభయన్ - ఉద్దీపింపజేయువాడై, రమయాంచకార - రమించెను.

ఆయన చేతులను చాచి కౌగిలించి చేతులు, ముంగురులు, ఊరువులు, కోకముడులు, వక్షఃస్థలములను స్పృశించి గోటికొనలతో గిచ్చి పరిహాసములతో చూపులతో నవ్వులతో క్రీడిస్తూ, గోకులముయొక్క యువతులకు ప్రేమను వర్ధిల్లజేస్తూ విహరించెను.

ఏవం భగవతః కృష్ణాల్లబ్ధమానా మహాత్మనః ।
ఆత్మానం మేనిరే స్త్రీణాం మానిన్యోఽభ్యధికం భువి ॥ 47

ఏవమ్ - ఈ విధముగా, మహాత్మనః - గొప్ప మనస్సు గల, భగవతః కృష్ణాత్ - శ్రీకృష్ణ భగవానునినుండి, లబ్ధమానాః - పొందబడిన మనోరథము గల, మానిన్యః - అభిమానవతులగు గోపికలు, ఆత్మానమ్ -

తనను, భువి - భూలోకమునందలి, స్త్రీణామ్ - యువతులలో, అభ్యధికమ్ - చాల గొప్పగా, మేనిరే - తలపోసిరి.

ఈ విధముగా అభిమానవతులగు గోపికల మనోరథమును గొప్ప మనస్సు గల శ్రీకృష్ణ భగవానుడు సఫలము చేసెను. వారు భూలోకమునందలి స్త్రీలలో తామే చాల గొప్ప యని తలపోసిరి.

తాసాం తత్సౌభగమదం వీక్ష్య మానం చ కేశవః ।
ప్రశమాయ ప్రసాదాయ తత్రైవాంతరధీయత ॥ 48

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ఏకోనత్రింశోఽధ్యాయః ॥

తాసామ్ - వారియొక్క, తత్ - ఆ, సౌభగమదమ్ - సౌందర్యము వలని గర్వమును, మానం చ - అభిమానమును కూడ, వీక్ష్య - చూచి, కేశవః - శ్రీకృష్ణ భగవానుడు, ప్రశమాయ - గర్వము పోవుటకు, ప్రసాదాయ - అనుగ్రహించుటకు, తత్ర ఏవ - అక్కడనే, అంతరధీయత - అంతర్ధానము చెందెను.

ఆ గోపికలకు తాము సౌందర్యవతులమనే గర్వము, శ్రీకృష్ణుడు తమవాడనే అభిమానము ఉండుటను ఆయన గమనించెను. వాటిని పోనాడి వారిని అనుగ్రహించుటకై శ్రీకృష్ణ భగవానుడు అక్కడనే అంతర్ధానమాయెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్ధములో రాసపంచాధ్యాయి - ఉపక్రమమును వర్ణించే
ఇరువది తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (29).

* * * * *

# అథ త్రింశోऽధ్యాయః

## గోపికలు అంతర్హితుడైన శ్రీకృష్ణుని వెదుకుట

శ్రీశుక ఉవాచ ।
అంతర్హితే భగవతి సహసైవ వ్రజాంగనాః ।
అతప్యంస్తమచక్షాణాః కరిణ్య ఇవ యూథపమ్ ॥ 1

భగవతి - శ్రీకృష్ణ భగవానుడు, సహసా ఏవ - అకస్మాత్తుగనే, అంతర్హితే - అంతర్ధానము కాగా, వ్రజ-అంగనాః - గోకులయువతులు, తమ్ - ఆయనను, అచక్షాణాః - కానరానివారై, యూథపమ్ - దండునకు నాయకుడగు ఏనుగును (కానరాని), కరిణ్యః ఇవ - ఆడు యేనుగులు వలె, అతప్యన్ - తాపమును పొందిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీభగవానుడు అకస్మాత్తుగా అంతర్ధానము కాగా, ఆ గోపికలు ఆయన కానరాక, దండు నాయకుని కానరాని ఆడు యేనుగులు వలె, పీడను పొందిరి.

గత్యాऽనురాగస్మితవిభ్రమేక్షితైర్మనోరమాలాపవిహారవిభ్రమైః ।
ఆక్షిప్తచిత్తాః ప్రమదా రమాపతేస్తాస్తా విచేష్టా జగృహుస్తదాత్మికాః ॥ 2

రమాపతేః - లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుని, గత్యా - నడకచే, అనురాగస్మితవిభ్రమ-ఈక్షితైః - ప్రేమ చిరునవ్వు విలాసపు చూపులచే, మనః-రమ-ఆలాపవిహారవిభ్రమైః - మనోహరములైన కబుర్లు విహారములు మోహమును కలిగించే ఇతరచేష్టలచే, ఆక్షిప్తచిత్తాః - ఆకర్షించబడిన చిత్తములు గల, ప్రమదాః - యువతులు, తద్-ఆత్మికాః - ఆయనతో అభేదమును పొందిన (ఆయనయందే మనస్సు గల) వారై, తాః తాః - ఆయా, విచేష్టాః - లీలలను, జగృహుః - చేసిరి.

లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుని నడక, ప్రేమ, చిరునవ్వు, విలాసపు చూపులు, మనోహరములైన కబుర్లు, విహారములు, మోహమును కలిగించే ఇతరచేష్టలు ప్రేమావేశము గల ఆ గోపికల చిత్తములను విశేషముగా ఆకర్షించినవి. వారాయనతో అభేదమును భావన చేస్తూ ఆయనయందే మనస్సు గలవారై ఆయన చేసిన ఆయా లీలలను అనుకరించిరి.

గతిస్మితప్రేక్షణభాషణాదిషు ప్రియాః ప్రియస్య ప్రతిరూఢమూర్తయః।
అసావహం త్విత్యబలాస్తదాత్మికా న్యవేదిషుః కృష్ణవిహారవిభ్రమాః ॥3

ప్రియస్య - ప్రియుడగు శ్రీకృష్ణుని, గతిస్మితప్రేక్షణభాషణ-ఆదిషు - నడక చిరునవ్వు చూపులు మాటలు మొదలగువాటియందు, ప్రతిరూఢమూర్తయః - ఆవేశించబడిన దేహములు గలవారు, ప్రియాః - ప్రేమ గలవారు, కృష్ణవిహారవిభ్రమాః - శ్రీకృష్ణుని విహారముయొక్క విలాసలు గలవారు, తద్-ఆత్మికాః - ఆయనతో అభేదమును పొందినవారు అగు, అబలాః - గోపికలు, అసౌ - ఈ కృష్ణుడు, అహమ్ - నేనే, ఇతి - అని, న్యవేదిషుః - విన్నవించిరి.

శ్రీకృష్ణునియందు ప్రేమ గల గోపికలు ప్రియుడగు ఆయనయొక్క నడక, చిరునవ్వు, చూపులు, మాటలు మొదలగువాటియందు ఆయనతో అభేదమునే పొందిరి. వారి దేహములయందు కూడ అవే లక్షణములు ప్రకటమాయెను. వారు శ్రీకృష్ణుని విహారముయొక్క విలాసననుకరిస్తూ, ఇదిగో! శ్రీకృష్ణుడను నేనే, అని ప్రకటించుకొనిరి.

గాయంత్య ఉచ్చైరముమేవ సంహతా
విచిక్యురున్మత్తకవద్వనాద్వనమ్ ।
పప్రచ్ఛురాకాశవదంతరం బహిః
భూతేషు సంతం పురుషం వనస్పతీన్ ॥ 4

ఉచ్చైః - బిగ్గరగా, గాయంత్యః - గానము చేయువారు, సంహతాః - గుమిగూడినవారై, వనాత్ - అడవినుండి, వనమ్ - అడవిని, అముం ఏవ - ఈ శ్రీకృష్ణునే, ఉన్మత్తకవత్ - పిచ్చివారు వలె, విచిక్యుః - వెదికిరి, ఆకాశవత్ - ఆకాశము వలె, భూతేషు - ప్రాణులయందు, అంతరమ్ -

లోపలా, బహిః - బయట, సంతమ్ - ఉండే, పురుషమ్ - పూర్ణపరబ్రహ్మను గురించి, వనస్పతీన్ - చెట్లను, పప్రచ్ఛుః - అడిగిరి.

వారు గుమిగూడి బిగ్గరగా గానము చేస్తూ పిచ్చివారు వలె ఒక అడవినుండి మరియొక అడవికి వెళ్తూ ఈ శ్రీకృష్ణునే వెదికిరి. ఆయన ఆకాశము వలె ప్రాణుల లోపల బయట కూడ ఉండే పూర్ణపరబ్రహ్మ. వారాయనను గురించి చెట్లను అడిగిరి.

దృష్టో వః కచ్చిదశ్వత్థ ప్లక్ష న్యగ్రోధ నో మనః ।
నందసూనుర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః ॥ 5

అశ్వత్థ - ఓ రావిచెట్టూ!, ప్లక్ష - ఓ జువ్వీ!, న్యగ్రోధ - ఓ మర్రీ!, నందసూనుః - నందుని పుత్రుడగు శ్రీకృష్ణుడు, ప్రేమహాస-అవలోకనైః - ప్రేమతో చిరునవ్వుతో కూడిన చూపులతో, నః - మా, మనః - మనస్సును, హృత్వా - అపహరించి, గతః - వెళ్లినాడు, వః - మీచే, కచ్చిత్ దృష్టః - చూడబడినాడా?

ఓ రావీ! జువ్వీ! మర్రీ! నందుని పుత్రుడు శ్రీకృష్ణుడు ప్రేమతో మరియు చిరునవ్వుతో కూడిన చూపులతో మా మనస్సును అపహరించి వెళ్లిపోయినాడు. మీకు కనబడినాడా?

కచ్చిత్కురవకాశోకనాగపున్నాగచంపకాః ।
రామానుజో మానినీనామితో దర్పహరస్మితః ॥ 6

కురవక-అశోకనాగపున్నాగచంపకాః - ఎర్ర చామంతీ! కంకేళీ! పొన్నా! సురపొన్నా! సంపెంగా!, రామ-అనుజః - బలరాముని తమ్ముడు, మానినీనామ్ - గర్వవతుల, దర్పహరస్మితః - గర్వమును పోగొట్టే చిరునవ్వు గలవాడు అగు శ్రీకృష్ణుడు, కచ్చిత్ ఇతః - ఇటు వచ్చినాడా?

ఓ ఎర్ర చామంతీ! కంకేళీ! పొన్నా! సురపొన్నా! సంపెంగా! బలరాముని తమ్ముడగు శ్రీకృష్ణుడు, మేము సుందరులమనే గర్వము గల యువతుల గర్వమునడంచే చిరునవ్వు గలవాడు. ఆయన ఇటు వచ్చెనా?

కచ్చిత్తులసి కల్యాణి గోవిందచరణప్రియే ।
సహ త్వాఽలికులైర్బిభ్రద్దృష్టస్తేఽతిప్రియోఽచ్యుతః ॥ 7

తులసి - ఓ తులసీ!, కల్యాణి - ఓ కల్యాణీ!, గోవిందచరణప్రియే - గోవిందుని పాదములు ప్రియమైనదానా!, అలికులైః సహ - తుమ్మెదల గుంపులతో బాటుగా, త్వా - నిన్ను, బిభ్రత్ - దాల్చువాడు, తే - నీ కొరకు, అతిప్రియః - మిక్కిలి ప్రియుడు అగు, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, కచ్చిత్ దృష్టః - కనబడినాడా?

ఓ తులసీ! నీవు మంగళకరురాలవు. నీకు గోవిందుని పాదములపై ప్రీతి మెండు. నీకు మిక్కిలి ప్రియుడగు ఆ శ్రీకృష్ణ భగవానుడు తుమ్మెదల గుంపులతో కూడిన నిన్ను దాల్చును. ఆయన కనబడినాడా?

మాలత్యదర్శి వః కచ్చిన్మల్లికే జాతి యూథికే ।
ప్రీతిం వో జనయన్ యాతః కరస్పర్శేన మాధవః ॥ 8

మాలతి - ఓ జాజీ!, మల్లికే - ఓ మల్లీ!, జాతి - ఓ ఉసిరీ!, యూథికే - ఓ అడవి మొల్లా!, మాధవః - లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుడు, కరస్పర్శేన - చేతి స్పర్శతో, వః - మీకు, ప్రీతిమ్ - ప్రీతిని, జనయన్ - కలిగించువాడై, యాతః - వెళ్లినవాడు, వః - మీచే, కచ్చిత్ అదర్శి - కనబడినాడా?

ఓ జాజీ! మల్లీ! ఉసిరీ! ఓ అడవి మొల్లా! లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుడు చేతితో తాకి మీకు ఆనందమును కలిగిస్తూ వెళ్లినాడు. మీకు కనబడినాడా?

చూతప్రియాలపనసాసనకోవిదార
జంబ్వర్కబిల్వబకులామ్రకదంబనీపాః ।
యేఽన్యే పరార్థభవకా యమునోపకూలాః
శంసంతు కృష్ణపదవీం రహితాత్మనాం నః ॥ 9

చూతప్రియాలపనస-ఆసనకోవిదారజంబూ-అర్కబిల్వబకుల-ఆమ్రకదంబనీపాః - రసాల మామిడీ! మోరటీ! పనసా! వేగిసా! రక్తకాంచనమా! నేరేడూ! జిల్లేడూ! మారేడూ! పొగడా! మామిడీ! కడిమీ! మంకెనా!,

పర-అర్థభవకాః - ఇతరుల కొరకే జన్మ గలవి, యమునా-ఉపకూలాః - యమునానదీతీరమునందుండే, అన్యే - ఇతరములైన, యే - ఏ చెట్లు గలవో అవి, రహిత-ఆత్మనామ్ - శూన్యమైన మనస్సు గల, నః - మాకు, కృష్ణపదవీమ్ - శ్రీకృష్ణుని మార్గమును, శంసంతు - చెప్పుగాక!

ఓ రసాల మామిడీ! మోరటీ! పనసా! వేగిసా! రక్తకాంచనమా! నేరేడూ! జిల్లేడూ! మారేడూ! పొగడా! మామిడీ! కడిమీ! మంకెనా! మీరు, మరియు యమునానదీతీరమునందు పెరిగే ఇతరములగు చెట్లు ఏవి గలవో అవి మాకు శ్రీకృష్ణుని మార్గమును చెప్పుగాక! ఏలయన, పరోపకారము కొరకే మీరు జన్మించితిరి. శ్రీకృష్ణుడు లేక మా మనస్సు శూన్యముగా నున్నది.

కిం తే కృతం క్షితి తపో బత కేశవాంఘ్రి-
స్పర్శోత్సవోత్పులకితాంగరుహైర్విభాసి ।
అప్యంఘ్రిసంభవ ఉరుక్రమవిక్రమాద్వా
ఆహో వరాహవపుషః పరిరంభణేన ॥ 10

బత - ఆశ్చర్యము!, క్షితి - ఓ భూమీ!, తే - నీచే, కిమ్ - ఏమి, తపః - తపస్సు, కృతమ్ - చేయబడినది?, కేశవ-అంఘ్రిస్పర్శ-ఉత్సవా - శ్రీకృష్ణ భగవానుని పాదముల స్పర్శచే ఉత్సవము గలదానవు, అంగరుహైః - ఉపరితలమునందు మొలచిన చెట్టుచేమలతో, ఉత్పులకితా - రోమాంచము గలదానవై, విభాసి - ప్రకాశించుచున్నావు, అంఘ్రిసంభవః అపి - పాదముల వలన కలిగినదా?, ఉరుక్రమవిక్రమాత్ వా - పెద్ద అడుగులను వేసిన శ్రీహరి అడుగులను వేయుట వలనా?, ఆహో - లేక, వరాహవపుషః - వరాహమూర్తియొక్క, పరిరంభణేన - కౌగిలి చేతనా?

ఆశ్చర్యము! ఓ పృథివీ! శ్రీకృష్ణ భగవానుని పాదముల స్పర్శచే ఉత్సవము గల నీవేమి తపస్సును చేసితివి? పైభాగమునందు మొలచిన చెట్టుచేమలే రోమాంచము కాగా నీవు విశేషముగా ప్రకాశించుచున్నావు. ఈ శోభ శ్రీకృష్ణుని పాదస్పర్శ వలనా? లేక, (అంతకుముందు). వామనుడై పెద్ద అడుగులను వేసిన శ్రీహరి నీపై వేసిన అడుగు వలనా? లేక, (ఇంకా ముందు) వరాహమూర్తియై నిన్ను కౌగిలించినందులకా?

అప్యేణపత్న్యుపగతః ప్రియయేహ గాత్రైః
తన్వన్ దృశాం సఖి సునిర్వృతిమచ్యుతో వః ।
కాంతాంగసంగకుచకుంకుమరంజితాయాః
కుందస్రజః కులపతేరిహ వాతి గంధః ॥ 11

సఖి - ఓ సఖీ!, ఏణపత్ని - ఓ ఆడు లేడీ!, వః - మీ, దృశామ్ - చూపులకు, గాత్రైః - అవయవములచే, సునిర్వృతిమ్ - గొప్ప సుఖమును, తన్వన్ - విస్తరింపజేసే, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, ఇహ - ఇచటకు, ప్రియయా - ప్రియురాలితో, అపి ఉపగతః - కనబడినాడా?, కాంతా-అంగసంగకుచకుంకుమరంజితాయాః - ప్రియురాలి కౌగిలిచే వక్షఃస్థలమునందలి కుంకుమచే ఎర్రగా చేయబడిన, కులపతేః - గోకులప్రభువగు శ్రీకృష్ణుని, కుందస్రజః - మల్లెల మాలయొక్క, గంధః - సుగంధము, వాతి - వీచుచున్నది.

ఓ ఆడు లేడీ! నీవు నాకు చెలికత్తెవు. శ్రీకృష్ణ భగవానుని దేహావయవములను చూచుటచే మీకు గొప్ప ఆనందము విస్తరించును సుమా! ఆయన ప్రియురాలితో కలిసి వచ్చి నీ కంట బడినాడా? ఎందుకంటే, గోకులప్రభువగు ఆయన దాల్చిన మల్లెల మాలయొక్క పరిమళమును గాలి మోసుకువచ్చుచున్నది. ఆతడు ఆమెను కౌగిలించినప్పుడు ఆమె వక్షఃస్థలమునందలి కుంకుమచే ఆ మాల ఎర్రనై యుండును.

బాహుం ప్రియాంస ఉపధాయ గృహీతపద్మో
రామానుజస్తులసికాలికులైర్మదాంధైః ।
అన్వీయమాన ఇహ వస్తరవః ప్రణామం
కిం వాభినందతి చరన్ ప్రణయావలోకైః ॥ 12

తరవః - ఓ వృక్షములారా!, బాహుమ్ - చేతిని, ప్రియా-అంసే - ప్రియురాలి భుజముపై, ఉపధాయ - ఉంచి, గృహీతపద్మః - పట్టుకొనబడిన పద్మము గల, రామ-అనుజః - బలరాముని సోదరుడగు శ్రీకృష్ణుడు, మద-అంధైః - మత్తుచే గ్రుడ్డివైన, తులసికా-అలికులైః - తులసిమాలయొక్క తుమ్మెదల గుంపులచే, అన్వీయమానః - అనుసరించబడుచున్నవాడై, ఇహ - ఇచట, చరన్ - సంచరించువాడై, వః -

మీ, ప్రణామమ్ - అభివాదమును, ప్రణయ-అవలోకైః - ప్రేమతో కూడిన చూపులతో, కిం వా అభినందతి - అభినందించినాడా?

ఓ వృక్షములారా! బలరాముని సోదరుడగు శ్రీకృష్ణుడు ఒక చేతిని ప్రియురాలి భుజముపై వేసి మరో చేతితో పద్మమును పట్టుకొని ఇక్కడ సంచరించి యుండును. ఆయన ధరించిన తులసి మాల చుట్టూ మత్తుతో గ్రుడ్డివైన తుమ్మెదల గుంపులు ఆయనను వెంటాడును. మీరు వంగి చేసిన అభివాదమును ఆయన ప్రేమతో కూడిన చూపులతో అభినందించినాడా?

పృచ్ఛతేమా లతా బాహూనప్యాశ్లిష్టా వనస్పతేః ।
నూనం తత్కరజస్పృష్టా బిభ్రత్యుత్పులకాన్యహో ॥ 13

అహో - ఓ చెలికత్తెలారా!, వనస్పతేః - చెట్టుయొక్క, బాహూన్ - కొమ్మలను, ఆశ్లిష్టాః - కౌగిలించి యున్న, ఇమాః - ఈ, లతాః అపి - లతలను కూడ, పృచ్ఛత - అడుగుడు, నూనమ్ - నిశ్చయముగా, తత్-కరజస్పృష్టాః - ఆతని చేతి గోళ్లచే స్పృశించబడినవి, ఉత్పులకాని - రోమాంచములను, బిభ్రతి - కలిగియున్నవి.

ఓ చెలికత్తెలారా! చెట్టు కొమ్మలను కౌగిలించియున్న ఈ తీగలను కూడ అడుగుడు. ఆతడు తన చేతి గోళ్లతో వీటిని నిశ్చయముగా స్పృశించి యుండును. ఇవి రోమాంచములను (చిగుళ్లు) కలిగి యున్నవి సుమా!

ఇత్యున్మత్తవచోగోప్యః కృష్ణాన్వేషణకాతరాః ।
లీలా భగవతస్తాస్తా హ్యనుచక్రుస్తదాత్మికాః ॥ 14

ఇతి - ఈ విధముగా, కృష్ణ-అన్వేషణకాతరాః - శ్రీకృష్ణుని వెదుకుటయందు వ్యాకులత చెందినవారు, ఉన్మత్తవచః-గోప్యః - పిచ్చివాళ్ల మాటలు కలిగిన గోపికలు, తద్-ఆత్మికాః హి - నిశ్చయముగా ఆయనతో అభేదమును పొందినవారై, భగవతః - శ్రీకృష్ణ భగవానుని, తాః తాః - ఆయా, లీలాః - లీలలను, అనుచక్రుః - అనుకరించిరి.

ఈ విధముగా శ్రీకృష్ణుని వెదుకుటలో వ్యాకులురైన గోపికలు పిచ్చి మాటలను పలుకుచుండిరి. వారు నిశ్చయముగా భగవానునితో భావాత్మక -ఐక్యమును పొంది ఆయనయొక్క ఆయా లీలలను అనుకరించిరి.

కస్యాశ్చిత్పూతనాయంత్యాః కృష్ణాయంత్యపిబత్ స్తనమ్ ।
తోకాయిత్వా రుదత్యన్యా పదాఽహఞ్ఛకటాయతీమ్ ॥ 15

పూతనాయంత్యాః - పూతనవలె ఆచరించుచున్న, కస్యాశ్చిత్ - ఒకానొక గోపికయొక్క, స్తనమ్ - స్తనమును, కృష్ణాయంతీ - కృష్ణుని వలె ఆచరించే గోపిక, అపిబత్ - త్రాగెను, అన్యా - మరియొక గోపిక, తోకాయిత్వా - బాలకృష్ణుని వలె ఆచరించి, పదా - కాలితో, శకటాయతీమ్ - బండివలె ఆచరించే గోపికను, అహన్ - తన్నెను.

ఒక గోపిక పూతనను అనుకరించగా మరియొక గోపిక బాలకృష్ణుని అనుకరిస్తూ ఆమె స్తనమును త్రాగెను. ఒకామె బాలకృష్ణుని అనుకరిస్తూ, శకటాసురుని అనుకరించే గోపికను కాలితో తన్నెను.

దైత్యాయిత్వా జహారాన్యామేకా కృష్ణార్భభావనామ్ ।
రింగయామాస కాప్యంఘ్రీ కర్షంతీ ఘోషనిస్స్వనైః ॥ 16

ఏకా - ఒక గోపిక, దైత్యాయిత్వా - తృణావర్తుని వలె ఆచరించి, కృష్ణ-అర్భభావనామ్ - శ్రీకృష్ణుని బాల్యమునునుకరించే, అన్యామ్ - ఇంకో గోపికను, జహార - ఎత్తుకు పోయెను, కా అపి - మరో గోపిక కూడ, ఘోషనిస్స్వనైః - కాలియందెల ధ్వనులతో, అంఘ్రీ - రెండు పాదములను, కర్షంతీ - లాగుచున్నదై, రింగయామాస - పాకెను.

ఒక గోపిక తృణావర్తుని అనుకరిస్తూ బాలకృష్ణుని అనుకరించే మరియొకామెను ఎత్తుకుపోయెను. ఒక గోపిక కాలియందెలు ధ్వనించునట్లుగా రెండు కాళ్లను (బాలకృష్ణుని వలె) లాగుతూ పాకెను.

కృష్ణరామాయితే ద్వే తు గోపాయంత్యశ్చ కాశ్చన ।
వత్సాయతీం హంతి చాన్యా తత్రైకా తు బకాయతీమ్ ॥ 17

ద్వే తు - ఇద్దరు గోపికలైతే, కృష్ణరామాయితే - శ్రీకృష్ణ బలరాములవలె ఆచరించువారు, కాశ్చన - కొందరు, గోపాయంత్యః చ - గోపాలకుల వలె కూడ ఆచరించువారు, తత్ర - వారిలో, అన్యా చ - మరియొక గోపిక కూడ, వత్సాయతీమ్ - వత్సాసురుని వలె ఆచరించే

గోపికను, హంతి - సంహరించును, ఏకా తు - ఒకామెయైతే, బకాయతీమ్ - బకాసురుని వలె ఆచరించే గోపికను.

ఇద్దరు గోపికలు బలరామకృష్ణులను, కొందరు గోపాలకులను అనుకరించిరి. ఒకామె కృష్ణుని అనుకరిస్తూ వత్సాసురుని అనుకరించే గోపికను, ఇంకో గోపిక బకాసురుని అనుకరించే గోపికను సంహరించినట్లు నటించిరి.

ఆహూయ దూరగా యద్వత్కృష్ణస్తమనుకుర్వతీమ్ ।
వేణుం క్వణంతీం క్రీడంతీమన్యాశ్శంసంతి సాధ్వితి ॥ 18

కృష్ణః యద్వత్ - శ్రీకృష్ణుడు వలె, దూరగాః - దూరమునందున్న గోవులను, ఆహూయ - పిలిచి, తమ్ - ఆయనను, అనుకుర్వతీమ్ - అనుకరించుచున్నట్టియు, వేణుమ్ - పిల్లన గ్రోవిని, క్వణంతీమ్ - ఊదుచున్నట్టియు, క్రీడంతీమ్ - క్రీడించుచున్న గోపికను, అన్యాః - ఇతరగోపికలు, సాధు - బాగు, ఇతి - అని, శంసంతి - కొనియాడుదురు.

ఒక గోపిక శ్రీకృష్ణుని అనుకరించి వేణువును వాయించి దూరమునందలి గోవులను పిలుస్తూ క్రీడించగా, ఆమెను బాగు అంటూ ఇతరగోపికలు కొనియాడుచుండిరి.

కస్యాంచిత్స్వభుజం న్యస్య చలంత్యాహాపరా నను ।
కృష్ణోఽహం పశ్యత గతిం లలితామితి తన్మనాః ॥ 19

తత్-మనాః - ఆ కృష్ణునియందు లగ్నమైన మనస్సు గల, అపరా - మరియొకామె, కస్యాంచిత్ - ఒకానొక గోపికపై, స్వభుజమ్ - తన చేతిని, న్యస్య - ఉంచి, చలంతీ - నడచుచున్నదై, అహమ్ - నేను, కృష్ణః - కృష్ణుడను, లలితామ్ - అందమైన, గతిమ్ - నడకను, పశ్యత - చూడుడు, ఇతి - అని, ఆహ - పలికెను.

శ్రీకృష్ణునియందు లగ్నమైన మనస్సు గల మరియొక గోపిక ఇంకో గోపికపై తన చేతిని వేసి నడుస్తూ, నేను శ్రీకృష్ణుడను, నా అందమైన నడకను చూడుడు, అని పలికెను.

మా భైష్ట వాతవర్షాభ్యాం తత్త్రాణం విహితం మయా ।
ఇత్యుక్త్వైకేన హస్తేన యతంత్యున్నిదధేఽంబరమ్ ॥ 20

వాతవర్షాభ్యామ్ - గాలి వర్షముల వలన, మా భైష్ట - భయపడకుడు, మయా - నాచే, తత్-త్రాణమ్ - వాటినుండి రక్షణ, విహితమ్ - ఏర్పాటు చేయబడినది, ఇతి - అని, ఉక్త్వా - పలికి, ఏకేన - ఒక, హస్తేన - చేతితో, యతంతీ - ప్రయత్నమును చేయుచున్నదై, అంబరమ్ - పై కొంగును, ఉన్నిదధే - పైకి పట్టుకొనెను.

గాలికి, వర్షమునకు భయపడకుడు. వాటినుండి రక్షణవ్యవస్థను నేను చేసేను, అంటూ ఒక గోపిక ఒకే చేతితో ప్రయత్నపూర్వకముగా చీర కొంగును పైకి ఎత్తి పట్టుకొనెను.

ఆరుహ్యైకా పదాఽఽక్రమ్య శిరస్యాహాపరాం నృప ।
దుష్టాహే గచ్ఛ జాతోఽహం ఖలానాం నను దండధృక్ ॥ 21

నృప - ఓ రాజా!, ఏకా - ఒకామె, అపరామ్ - మరియొకామెను, శిరసి - తలపై, ఆరుహ్యా - ఎక్కి, పదా - కాలితో, ఆక్రమ్య - తొక్కి, దుష్ట-అహే - ఓ పాడు సర్పమా!, గచ్ఛ - పొమ్ము, నను - నిశ్చయముగా, దండధృక్ - శిక్షను అమలు చేసే, అహమ్ - నేను, జాతః - పుట్టినవాడను.

ఓ పరీక్షిన్మహారాజా! ఒక గోపిక మరియొక గోపికయొక్క తల పైకెక్కి కాలితో తొక్కి, ఓ పాడు సర్పమా! పొమ్ము, దుష్టులను నిశ్చయముగా శిక్షించుటకై నేను అవతరించితిని, అని పలికెను.

తత్రైకోవాచ హే గోపా దావాగ్నిం పశ్యతోల్బణమ్ ।
చక్షూంష్యాశ్వపిదధ్వం వో విధాస్యే క్షేమమంజసా ॥ 22

తత్ర - వారియందు, ఏకా - ఒకామె, ఉవాచ - పలికెను, హే గోపాః - ఓ గోపాలకులారా!, ఉల్బణమ్ - భయంకరమగు, దావ-అగ్నిమ్ - కార్చిచ్చును, పశ్యత - చూడుడు, ఆశు - వెంటనే, చక్షూంషి - కళ్లను, అపిదధ్వమ్ - మూసుకొనుడు, వః - మీకు, అంజసా - తేలికగా, క్షేమమ్ - క్షేమమును, విధాస్యే - చేయగలను.

వారిలో ఒకామె ఇట్లు పలికెను -- గోపాలకులారా! భయంకరమగు కార్చిచ్చును కనుడు. వెంటనే కళ్లను మూసుకొనుడు. మీకు నేను తేలికగా క్షేమమును కలిగించెదను.

బద్ధాఽన్యయా స్రజా కాచిత్తన్వీ తత్ర ఉలూఖలే ।
భీతా సుదృక్ పిధాయాస్యం భేజే భీతివిడంబనమ్ ।। 23

తత్ర - వారియందు, కాచిత్ - ఒకానొక, తన్వీ - సుందరి, అన్యయా - మరియొక గోపికచే, ఉలూఖలే - రోటియందు, స్రజా - మాలతో, బద్ధా - కట్టబడినది, భీతా - భయపడినదై, సుదృక్ - అందమైన కళ్లు గల, ఆస్యమ్ - ముఖమును, పిధాయ - కప్పుకొని, భీతివిడంబనమ్ - భయముయొక్క అనుకరణమును, భేజే - చేసెను.

వారిలో ఒక సుందరి మరియొక గోపికను రోటికి మాలతో కట్టివేసెను. అపుడా గోపిక భయపడుతూ అందమైన కళ్లు గల ముఖమును చేతులతో కప్పుకొని, భయపడే శ్రీకృష్ణుని అనుకరించెను.

ఏవం కృష్ణం పృచ్ఛమానా బృందావనలతాస్తరూన్ ।
వ్యచక్షత వనోద్దేశే పదాని పరమాత్మనః ।। 24

ఏవమ్ - ఈ విధముగా, బృందావనలతాః - బృందావనమునందలి లతలను, తరూన్ - చెట్లను, కృష్ణమ్ - శ్రీకృష్ణుని గురించి, పృచ్ఛమానాః - అడుగుచున్న గోపికలు, వన-ఉద్దేశే - అడవి ప్రదేశమునందు, పరమాత్మనః - శ్రీకృష్ణ పరమాత్మయొక్క, పదాని - కాలి గుర్తులను, వ్యచక్షత - చూచిరి.

ఈ విధముగా గోపికలు బృందావనమునందలి చెట్లను, లతలను శ్రీకృష్ణ పరమాత్మ గురించి ప్రశ్నించుచుండిరి. ఇంతలో వారికి అడవి ప్రదేశమునందు ఆయన కాలి గుర్తులు కనబడెను.

పదాని వ్యక్తమేతాని నందసూనోర్మహాత్మనః ।
లక్ష్యంతే హి ధ్వజాంభోజవజ్రాంకుశయవాదిభిః ।। 25

ఏతాని - ఇవి, వ్యక్తమ్ - స్పష్టముగా, మహా-ఆత్మనః - దొడ్డ మనసు గల, నందసూనోః - నందపుత్రుడగు శ్రీకృష్ణుని, పదాని - కాళ్ల ముద్రలు, హి - ఏలయన, ధ్వజ-అంభః-జవజ్ర-అంకుశయవ-ఆదిభిః - జెండా పద్మము వజ్రము అంకుశము గోధుమ గింజ మొదలగువాటిచే, లక్ష్యంతే - గుర్తు పట్టబడుచున్నవి.

ఇవి స్పష్టముగా దొడ్డ మనసు గల శ్రీకృష్ణుని కాలి గురుతులే. ఏలయన, జెండా, పద్మము, వజ్రము, అంకుశము, ధాన్యపు గింజ, చక్రము మొదలగువాటిచే నందపుత్రుని కాలి ముద్రలను గుర్తు పట్టవచ్చును.

తైస్తైః పదైస్తత్పదవీమన్విచ్ఛంత్యోऽగ్రతోऽబలాః ।
వధ్వాః పదైస్సుపృక్తాని విలోక్యార్తాస్సమబ్రువన్ ॥ 26

తైః తైః - ఆయా, పదైః - కాలి గురుతులచే, తత్-పదవీమ్ - ఆ శ్రీకృష్ణుని మార్గమును, అన్విచ్ఛంత్యః - వెదుకుచున్న, అబలాః - గోపికలు, అగ్రతః - ఎదుట, వధ్వాః - యువతియొక్క, పదైః - కాలి గురుతులతో, సుపృక్తాని - బాగా కలిసి ఉన్నవాటిని, విలోక్య - కనుగొని, ఆర్తాః - పీడను పొందినవారై, సమబ్రువన్ - పలికిరి.

ఆయా కాలి ముద్రలతో ఆ శ్రీకృష్ణుని మార్గమునా గోపికలు వెదుకు చుండిరి. ఇంతలో వారికి ఆయన కాలి గురుతులతో బాగా కలిసి ఉన్న స్త్రీ కాలి ముద్రలు కనబడెను. వారు మనోవ్యథను పొంది ఇట్లు పలికిరి.

కస్యాః పదాని చైతాని యాతాయా నందసూనునా ।
అంసన్యస్తప్రకోష్ఠాయాః కరేణోః కరిణా యథా ॥ 27

ఏతాని - ఇవి, నందసూనునా - నందపుత్రుడగు శ్రీకృష్ణునితో, యాతాయాః - వెళ్లినట్టియు, కరిణా - మగ ఏనుగుచే, కరేణోః యథా - ఆడు ఏనుగుయొక్క వలె, అంసన్యస్తప్రకోష్ఠాయాః - భుజముపై ఉంచబడిన ముంజేయి గల, కస్యాః - ఏ యువతియొక్క, పదాని చ - కాలి గురుతులు?

నందపుత్రుడగు శ్రీకృష్ణుడు ఒక యువతి భుజముపై తన ముంజేతిని, మగ ఏనుగు తుండమును ఆడు ఏనుగుపై వలె ఉంచి కలిసి నడచినట్లు ఈ కాలి గురుతులను బట్టి తెలియుచున్నది. ఆమె ఎవరై యుండును?

అనయాఽఽరాధితో నూనం భగవాన్ హరిరీశ్వరః ।
యన్నో విహాయ గోవిందః ప్రీతో యామనయద్రహః ॥ 28

ఈశ్వరః - జగన్నాథుడగు, భగవాన్ హరిః - శ్రీకృష్ణ భగవానుడు, నూనమ్ - నిశ్చయముగా, అనయా - ఈమెచే, ఆరాధితః - ఆరాధించబడినవాడు, యత్ - ఏలయన, ప్రీతః - ప్రీతుడైన, గోవిందః - గోవిందుడు, నః - మనలను, విహాయ - విడిచిపెట్టి, యామ్ - ఏ స్త్రీని, రహః - ఏకాంతస్థానమును గురించి, అనయత్ - తీసుకువెళ్లెనో.

ఈమె నిశ్చయముగా జగన్నాథుడగు శ్రీకృష్ణ భగవానుని ఆరాధించి ప్రీతుని చేసినది. ఎందుకంటే, ఆ గోవిందుడు మనలను ప్రక్కనబెట్టి ఏకాంతముగా ఆమెతో కలిసి నడచి వెళ్లెను.

ధన్యా అహో అమీ ఆల్యో గోవిందాంఘ్ర్యబ్జరేణవః ।
యాన్ బ్రహ్మేశో రమా దేవీ దధుర్మూర్ధ్న్యఘనుత్తయే ॥ 29

ఆల్యః - సఖులారా!, అహో - ఆహా!, అమీ - ఈ, గోవింద-అంఘ్రి-అబ్జరేణవః - గోవిందుని పాదపద్మముల ధూళి కణములు, ధన్యాః - పవిత్రమైనవి, యాన్ - వేటిని, బ్రహ్మ - బ్రహ్మదేవుడు, ఈశః - శివుడు, రమా దేవీ - లక్ష్మీదేవి, అఘనుత్తయే - దోషనివారణ కొరకు, మూర్ధ్ని - తలపై, దధుః - దాల్చిరో.

ఆహా! చెలికత్తెలారా! ఈ గోవిందుని పాదపద్మముల ధూలికణములు పరమపవిత్రములు. ఎందుకంటే బ్రహ్మదేవుడు, శివుడు, లక్ష్మీదేవి దోషనివారణకై వాటిని తమ తలపై దాల్చిరి.

తస్యా అమూని నః క్షోభం కుర్వంత్యుచ్చైః పదాని యత్ ।
యైకాఽపహృత్య గోపీనాం రహో భుంక్తేఽచ్యుతాధరమ్ ॥ 30

తస్యాః - ఆమెయొక్క, అమూని - ఈ, పదాని - కాలి గురుతులు, యత్ - ఏవి గలవో అవి, నః - మనకు, ఉచ్చైః - అధికముగా, క్షోభమ్ - క్షోభను, కుర్వంతి - చేయుచున్నవి, యా - ఏ యువతి, గోపీనామ్ - గోపికల, అచ్యుత-అధరమ్ - శ్రీకృష్ణ భగవానుని అధరమును, అపహృత్య - అపహరించి, రహః - ఏకాంతమునందు, భుంక్తే - అనుభవించుచున్నదో.

ఆ యువతి గోపికల సొత్తనదగిన శ్రీకృష్ణ భగవానుని ఎత్తుకుపోయి ఆయన అధరముననుభవించుచున్నది. ఆమెయొక్క ఈ కాలి గురుతులు మనకు అధికముగా మానసికక్షోభను కలిగించుచున్నవి.

న లక్ష్యంతే పదాన్యత్ర తస్యా నూనం తృణాంకురైః ।
ఖిద్యత్సుజాతాంఘ్రితలామున్నిన్యే ప్రేయసీం ప్రియః ॥ 31

అత్ర - ఇచట, తస్యాః - ఆమెయొక్క, పదాని - కాలి గురుతులు, న లక్ష్యంతే - కనబడుట లేదు, తృణ-అంకురైః - గడ్డి కొనలచే, ఖిద్యత్-సుజాత-అంఘ్రితలామ్ - నొప్పి కలిగిన సుకుమారమైన అరికాళ్లు గల, ప్రేయసీమ్ - ప్రియురాలిని, ప్రియః - ప్రియుడు, ఉన్నిన్యే - ఎత్తుకొని తీసుకువెళ్లెను, నూనమ్ - నిశ్చయము.

ఇచట ఆమె కాలి గురుతులు కనబడుట లేదు. ప్రియుడగు గోవిందుడు ప్రియురాలి సుకుమారమైన అరికాళ్లకు గడ్డి కొనలచే నొప్పి కలుగగా ఎత్తుకొని తీసుకువెళ్లి యుండును. ఇది నిశ్చయము.

ఇమాన్యధికమగ్నాని పదాని వహతో వధూమ్ ।
గోప్యః పశ్యత కృష్ణస్య భారాక్రాంతస్య కామినః ॥ 32

గోప్యః - ఓ గోపికలారా!, వధూమ్ - ప్రియురాలిని, వహతః - మోయుచున్నట్టియు, భార-ఆక్రాంతస్య - బరువుచే నొక్కివేయబడినట్టియు, కామినః - కాముకుడగు, కృష్ణస్య - శ్రీకృష్ణుని, అధికమగ్నాని - ఎక్కువ లోతైన, ఇమాని - ఈ, పదాని - కాలి గురుతులను, పశ్యత - చూడుడు.

ఓ గోపికలారా! ఇక్కడి కాలి గురుతులను చూడుడు. ఇవి బాగా లోతుగా నున్నవి. కాముకుడగు శ్రీకృష్ణుడు ప్రియురాలిని మోసినప్పుడు ఆ బరువుచే కాళ్లు దిగబడియుండును.

అత్రావరోపితా కాంతా పుష్పహేతోర్మహాత్మనా ।
అత్ర ప్రసూనావచయః ప్రియార్థే ప్రేయసా కృతః ।
ప్రపదాక్రమణే ఏతే పశ్యతాసకలే పదే ॥ 33

మహా-ఆత్మనా - దొడ్డ మనసు గల శ్రీకృష్ణునిచే, పుష్పహేతోః - పువ్వుల కారణముగా, కాంతా - ప్రియురాలు, అత్ర - ఇచట, అవరోపితా - క్రింద దింపబడినది, అత్ర - ఇచట, ప్రేయసా - ప్రియుడగు శ్రీకృష్ణునిచే, ప్రియ-అర్థే - ప్రియురాలి ప్రయోజనము విషయమునందు, ప్రసూన-అవచయః - పూల కోయుట, కృతః - చేయబడినది, ఏతే - ఈ, అసకలే - పూర్తిగా లేని, ప్రపద-ఆక్రమణే - కాలి అగ్రములచే తొక్కుట గల, పదే - కాలి గురుతులను, పశ్యత - చూడుడు.

ఇచట చూడుడు. మట్టిలో కాలి అగ్రభాగముల గుర్తులు మాత్రమే పడినవి. పూర్తి కాలి గుర్తులు పడలేదు. దీనిని బట్టి, శ్రీకృష్ణుడు ప్రియురాలినిక్కడ క్రింద దింపి ఆమె కొరకు (ఎత్తున ఉన్న) పూలను కోసి యుండును. ఆయన దొడ్డ మనసు గల ప్రియుడే.

కేశప్రసాధనం త్వత్ర కామిన్యాః కామినా కృతమ్ ।
తాని చూడయతా కాంతాముపవిష్టమిహ ధ్రువమ్ ॥ 34

అత్ర తు - ఇక్కడనైతే, కామినా - ప్రియుడగు శ్రీకృష్ణునిచే, కామిన్యాః - ప్రియురాలి, కేశప్రసాధనమ్ - కేశములను ముడివేసి అలంకరించుట, కృతమ్ - చేయబడినది, కాంతామ్ - ప్రియురాలిని, తాని - ఆ పూలను, చూడయతా - జుట్టులో తురుముచున్న శ్రీకృష్ణునిచే, ఇహ - ఇచట, ఉపవిష్టమ్ - కూర్చుంబడినది, ధ్రువమ్ - నిశ్చయము.

ప్రియుడగు శ్రీకృష్ణుడు నిశ్చయముగా ఇక్కడనైతే కూర్చుండి ప్రియురాలి జుట్టు సరిచేసి ముడివేసి ఆ పూలను ముడిలో తురిమియుండును.

రేమే తయా చాత్మరత ఆత్మారామోఽప్యఖండితః ।
కామినాం దర్శయన్ దైన్యం స్త్రీణాం చైవ దురాత్మతామ్ ॥ 35

ఆత్మరతః - తనయందే రమించువాడు, ఆత్మారామః - తనయందే క్రీడించువాడు, అఖండితః - పూర్ణుడు అగు శ్రీకృష్ణుడు, కామినామ్ -

కాముకుల, దైన్యమ్ - దీనావస్థను, స్త్రీణామ్ - కామినుల, దురాత్మతాం చ ఏవ - దౌర్జన్యమును కూడ, దర్శయన్ - చూపువాడై, తయా - ఆమెతో, రేమే - విహరించెను.

శ్రీకృష్ణుడు తనయందే రమించి క్రీడించే పూర్ణుడు. కాముకులు దైన్యమును పొందెదరనియు, కాముకుల యెడల కామినులు దౌర్జన్యమును చూపెదరనియు లోకమునకు నిరూపించువాడై ఆయన ఆమెతో విహరించెను (ఇది శుకుని వచనము).

ఇత్యేవం దర్శయంత్యస్తాశ్చేరుర్గోప్యో విచేతసః ।
యాం గోపీమనయత్కృష్ణో విహాయాన్యాః స్త్రియో వనే ॥ 36

సా చ మేనే తదాఽఽత్మానం వరిష్ఠం సర్వయోషితామ్ ।
హిత్వా గోపీః కామయానా మామసౌ భజతే ప్రియః ॥ 37

ఇతి - అని, ఏవమ్ - ఈ విధముగా, దర్శయంత్యః - చూపించువారు, విచేతసః - మతి పోయినట్లున్నవారు అగు, తాః - ఆ, గోప్యః - గోపికలు, చేరుః - సంచరించిరి, వనే - అడవియందు, అన్యాః - ఇతరులగు, స్త్రియః - యువతులను, విహాయ - విడిచిపెట్టి, యామ్ - ఏ, గోపీమ్ - గోపికను, కృష్ణః - శ్రీకృష్ణుడు, అనయత్ - తీసుకువెళ్లెనో, సా చ - ఆమెయు, తదా - అప్పుడు, ఆత్మానమ్ - తనను, సర్వయోషితామ్ - స్త్రీలందరిలో, వరిష్ఠమ్ - గొప్పదానినిగా, మేనే - తలపోసెను, కామయానాః - కోరే, గోపీః - గోపికలను, హిత్వా - విడిచిపెట్టి, అసౌ - ఈ, ప్రియః - ప్రియుడు, మామ్ - నన్ను, భజతే - సేవించుచున్నాడు.

ఈ విధముగా మతి పోయినట్లున్న ఆ గోపికలు శ్రీకృష్ణుని కాలి గుర్తులను చూపిస్తూ సంచరించిరి. అడవిలో ఇతరయువతులను విడిచిపెట్టి శ్రీకృష్ణుడు ఏ గోపికను తీసుకువెళ్లెనో, ఆమె తాను యువతులందరిలో గొప్పదానినని తలపోసెను. ప్రియుడైన శ్రీకృష్ణుడు తనను కోరే ఇతరగోపికలను కాదని నన్ను సేవించుచున్నాడని ఆమె తలంపు.

తతో గత్వా వనోద్దేశం దృప్తా కేశవమబ్రవీత్ ।
న పారయేఽహం చలితుం నయ మాం యత్ర తే మనః ॥ 38

దృప్తా - గర్వించిన ఆ గోపిక, తతః - తరువాత, వన-ఉద్దేశమ్ - అడవి ప్రదేశమును, గత్వా - చేరి, కేశవమ్ - శ్రీకృష్ణ భగవానుని ఉద్దేశించి, అబ్రవీత్ - పలికెను, అహమ్ - నేను, చలితుమ్ - నడచుటకు, న పారయే - సమర్థురాలను కాను, యత్ర - ఎక్కడనైతే, తే - నీ, మనః - మనస్సో అచటకు, మామ్ - నన్ను, నయ - ఎత్తుకొని తీసుకు వెళ్లుము.

గర్వించిన ఆ గోపిక తరువాత అడవిలోని ఒక స్థానమును చేరి శ్రీకృష్ణ భగవానునితో నిట్లనెను -- నేను నడవ లేకున్నాను. ఎక్కడకు వెళ్లాలని నీవు తలచెదవో, అచటకు నన్ను మోసుకొని పొమ్ము.

ఏవముక్తః ప్రియామాహ స్కంధ ఆరుహ్యతామితి ।
తతశ్చాంతర్దధే కృష్ణస్సా వధూరన్వతప్యత ॥ 39

ఏవమ్ - ఈ విధముగా, ఉక్తః - పలుకబడిన, కృష్ణః - శ్రీకృష్ణుడు, ప్రియామ్ - ప్రియురాలిని ఉద్దేశించి, స్కంధః - భుజము, ఆరుహ్యతామ్ - ఎక్కబడుగాక!, ఇతి - అని, ఆహ - పలికెను, తతః - తరువాత, అంతర్దధే చ - అంతర్ధానము కూడ ఆయెను, సా - ఆ, వధూః - గోపిక, అన్వతప్యత - పశ్చాత్తాపపడెను.

అనురాగవతియగు ఆ గోపిక ఇట్లు పలుకగా శ్రీకృష్ణుడు భుజము నెక్కుము అని చెప్పి అంతర్ధానమాయెను. ఆ యువతి (అట్లు అన్నందుకు) పశ్చాత్తాపపడెను.

హా నాథ రమణ ప్రేష్ఠ క్వాసి క్వాసి మహాభుజ ।
దాస్యాస్తే కృపణాయా మే సఖే దర్శయ సన్నిధిమ్ ॥ 40

హా నాథ - ఓ ప్రభూ!, రమణ - రమింపజేయువాడా!, ప్రేష్ఠ - ప్రియతమా!, క్వ - ఎక్కడ, అసి - ఉన్నావు?, క్వ - ఎక్కడ, అసి - ఉన్నావు?, మహాభుజ - గొప్ప భుజములు గలవాడా!, తే - నీ, దాస్యాః - దాసీ ఐనట్టియు, కృపణాయాః - దీనురాలనగు, మే - నాకు, సన్నిధిమ్ - సన్నిధిని, దర్శయ - చూపుము.

ఓ ప్రభూ! ఆహ్లాదమును కలిగించువాడా! నీవు ప్రియతముడవు, గొప్ప భుజశక్తి గలవాడవు. ఎక్కడ ఉన్నావు? ఎక్కడ ఉన్నావు? నేను దీనురాలను, నీ దాసిని. నాకు నీ సాన్నిధ్యమును కలిగించుము.

అన్విచ్ఛంత్యో భగవతో మార్గం గోప్యోఽవిదూరతః ।
దదృశుః ప్రియవిశ్లేషమోహితాం దుఃఖితాం సఖీమ్ ॥ 41

భగవతః - శ్రీకృష్ణ భగవానుని, మార్గమ్ - మార్గమును, అన్విచ్ఛంత్యః - వెదుకుచున్న, గోప్యః - గోపికలు, అవిదూరతః - దగ్గరలో, ప్రియవిశ్లేషమోహితామ్ - ప్రియుని విరహముచే మోహమును పొందినట్టియు, దుఃఖితామ్ - దుఃఖితురాలైన, సఖీమ్ - చెలియను, దదృశుః - చూచిరి.

శ్రీకృష్ణ భగవానుని మార్గమును వెదుకుచున్న గోపికలకు వారి చెలికత్తె కనిపించెను. ఆమె ప్రియుడగు శ్రీకృష్ణుని విరహముచే దుఃఖితురాలై మోహమును పొంది యుండెను.

తయా కథితమాకర్ణ్య మానప్రాప్తిం చ మాధవాత్ ।
అవమానం చ దౌరాత్మ్యాద్విస్మయం పరమం యయుః ॥ 42

తయా - ఆమెచే, కథితమ్ - చెప్పబడిన, మాధవాత్ - లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుని వలన, మానప్రాప్తిం చ - సమ్మానము లభించుటను, దౌరాత్మ్యాత్ - దౌర్జన్యము వలన, అవమానం చ - అవమానమును కూడ, ఆకర్ణ్య - విని, పరమ్ - మిక్కిలి, విస్మయమ్ - ఆశ్చర్యమును, యయుః - పొందిరి.

లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుడు తనను సమ్మానించుటను, తాను దౌర్జన్యము చేసి ఆయనను అవమానించుటను (ఆయన అంతర్ధానమై తనను అవమానించుటను) గురించి కూడ ఆమె చెప్పెను. ఆ వృత్తాంతమును విన్న గోపికలకు చాల ఆశ్చర్యము కలిగెను.

తతోఽవిశన్ వనం చంద్రజ్యోత్స్నా యావద్విభావ్యతే ।
తమః ప్రవిష్టమాలక్ష్య తతో నివవృతుః స్త్రియః ॥ 43

తతః - తరువాత, యావత్ - ఎంతవరకైతే, చంద్రజ్యోత్స్నా - చంద్రుని వెన్నెల, విభావ్యతే - కనబడుచున్నదో అంతవరకు, వనమ్ - అడవిని, అవిశన్ - ప్రవేశించిరి, తతః - తరువాత, ప్రవిష్టమ్ - ప్రవేశించిన, తమః - చీకటిని, ఆలక్ష్య - చూచి, స్త్రియః - గోపికలు, నివవృతుః - వెనుదిరిగిరి.

తరువాత చంద్రుని వెన్నెలలో అడవి కనబడుచున్నంతవరకు వారా అడవిలో శ్రీకృష్ణుని వెదికిరి. తరువాత అంతటా చీకటి వచ్చుటను గాంచి ఆ గోపికలు వెనుదిరిగిరి.

తన్మనస్కాస్తదాలాపాస్తద్విచేష్టాస్తదాత్మికాః ।
తద్గుణానేవ గాయంత్యో నాత్మాగారాణి సస్మరుః ॥ 44

తత్-మనస్కాః - ఆ శ్రీకృష్ణునియందే మనస్సు గలవారు, తద్-ఆలాపాః - ఆయన గురించియే మాటలాడువారు, తద్-విచేష్టాః - ఆయన చేష్టలే గలవారు, తద్-ఆత్మికాః - ఆయనతో అభేదమును పొందినవారు, తద్-గుణాన్ ఏవ - ఆయన గుణములను మాత్రమే, గాయంత్యః - గానము చేయువారు, ఆత్మాగారాణి - తమ దేహము (గృహము) లను, న సస్మరుః - స్మరించలేదు.

ఆ గోపికల మనస్సు శ్రీకృష్ణునియందు మాత్రమే లగ్నమై యుండెను. వారు ఆయన గురించియే మాటలాడుతూ ఆయన చేష్టలనే అనుకరిస్తూ ఆయనతో అభేదమును పొందిరి. ఆయన గుణములనే గానము చేయుచున్న ఆ గోపికలకు తమ దేహముల స్పృహ గాని, ఇళ్ల గురించి గుర్తు గాని లేకుండెను.

పునః పులినమాగత్య కాలింద్యాః కృష్ణభావనాః ।
సమవేతా జగుః కృష్ణం తదాగమనకాంక్షితాః ॥ 45

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే త్రింశోఽధ్యాయః ॥

కృష్ణభావనాః - శ్రీకృష్ణునే భావన చేయువారు, తద్-ఆగమనకాంక్షితాః - ఆ శ్రీకృష్ణుని రాకను కోరువారు అగు గోపికలు, పునః - మరల, కాలింద్యాః - యమునానదియొక్క, పులినమ్ - ఇసుకతిన్నెను గురించి,

ఆగత్య - వచ్చి, సమవేతాః - కలిసినవారై, కృష్ణమ్ - శ్రీకృష్ణుని గురించి, జగుః - గానము చేసిరి.

శ్రీకృష్ణుని రాకను ఆకాంక్షించే ఆ గోపికలు శ్రీకృష్ణునే ధ్యానిస్తూ మరల యమునానదియొక్క ఇసుకతిన్నె వద్దకు వచ్చిరి. వారందరు కలిసి ఆయన గురించి గానము చేసిరి.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్ధములో గోపికలు అంతర్హితుడైన శ్రీకృష్ణుని వెదుకుటను
వర్ణించే ముప్పదియవ అధ్యాయము ముగిసినది (30).

* * * * *

# అథ ఏకత్రింశోఽధ్యాయః

## గోపికా గీతము

గోప్య ఊచుః ।
జయతి తేఽధికం జన్మనా వ్రజశ్శ్రయత ఇందిరా శశ్వదత్ర హి ।
దయిత దృశ్యతాం దిక్షు తావకాస్త్వయి ధృతాసవస్త్వాం విచిన్వతే ॥ 1

దయిత - ఓ ప్రియుడా!, తే - నీ, జన్మనా - జన్మచే, వ్రజః - గోకులము, అధికమ్ - అధికముగా, జయతి - సర్వోత్కృష్టముగా నున్నది, హి - ఏలయన, ఇందిరా - లక్ష్మి, శశ్వత్ - శాశ్వతముగా, అత్ర - ఇచట, శ్రయతే - ఉంటున్నది, ధృత-అసవః - ధరించబడిన ప్రాణములు గల, తావకాః - నీవారు, దిక్షు - దిక్కులయందు, త్వామ్ - నిన్ను, విచిన్వతే - వెదుకుచున్నారు, దృశ్యతామ్ - చూడబడుగాక!

గోపికలిట్లు పలికిరి --- ఓ ప్రియుడా! నీ జన్మచే గోకులము స్వర్గాదులకంటె అధికముగా సర్వోత్కృష్టముగా నున్నది. ఎందుకంటే, లక్ష్మి శాశ్వతముగా ఇచటనే ఉంటున్నది. కాని, నీ కొరకు మాత్రమే ప్రాణములను ధరించియున్న (కొన ప్రాణము గల) నీ వారు దిక్కులలో నిన్ను వెదుకుచున్నారు. చూడుము (తెలుసుకో) !

శరదుదాశయే సాధుజాతసత్సరసిజోదరశ్రీముషా దృశా ।
సురతనాథ తేఽశుల్కదాసికా వరద నిఘ్నతో నేహ కిం వధః ॥ 2

సురతనాథ - ఓ ఆనందనాయకా!, వరద - వరమునిచ్చువాడా!, శరద్-ఉద్-ఆశయే - శరత్కాలమునందలి జలాశయమునందు, సాధుజాతసత్-సరసిజ-ఉదరశ్రీముషా - చక్కగా పుట్టిన బాగా వికసించిన పద్మముయొక్క పొట్టయొక్క సౌందర్యమునపహరించే, దృశా - చూపుతో, అశుల్కదాసికాః - జీతము లేని దాసీలను, నిఘ్నతః - హింస పెట్టే, తే - నీకు, ఇహ - ఇక్కడ, వధః - హత్య, న కిమ్ - కాదా యేమి?

ఓ ఆనందనాయకా! నీవు వరములనిచ్చువాడవు. మేము నీకు జీతము లేని దాసీలము. కాని, శరత్కాలములో చెరువునందు చక్కగా పుట్టి బాగా వికసించిన పద్మముయొక్క లోపలి సౌందర్యమును దొంగిలించిన చూపుతో నీవు మమ్ములను హింస పెట్టుచున్నావు. ఈ లోకములో ఇది హత్య కాదా యేమి? (కత్తితో పొడిస్తేనే హత్య యగునా యేమి?)

విషజలాప్యయాద్వ్యాలరాక్షసాద్వర్షమారుతాద్వైద్యుతానలాత్,
వృషమయాత్మజాద్విశ్వతోభయాదృషభ తే వయం రక్షితా ముహుః।3

ఋషభ - ఓ పురుషశ్రేష్ఠా!, విషజల-అప్యయాత్ - విషపు నీటి వలన నాశమునుండి, వ్యాలరాక్షసాత్ - అఘాసురుని నుండి, వర్షమారుతాత్ - వాననుండి గాలినుండి, వైద్యుత-అనలాత్ - పిడుగుపాటు వలన కలిగే అగ్నినుండి, వృషమయ-ఆత్మజాత్ - అరిష్టమునుండి మయుని పుత్రుడగు వ్యోమాసురునినుండి, విశ్వతః - సర్వమునుండి, భయాత్ - భయమునుండి, తే - నీచే, వయమ్ - మేము, ముహుః - పలుమార్లు, రక్షితాః - రక్షించబడితిమి.

ఓ పురుషశ్రేష్ఠా! కాలియుని విషపు నీటి వలన కలిగే నాశమునుండి, కొండ చిలువ రూపములోనున్న అఘాసురునినుండి, ఇంద్రుడు పంపిన గాలివాననుండి, తృణావర్తునినుండి, ఇంద్రుని వజ్రము (పిడుగుపాటు) వలన కలిగిన అగ్నినుండి, వృషభాసురుని రూపములోనున్న అరిష్టమునుండి, మయుని పుత్రుడగు వ్యోమాసురునినుండి, అన్ని రకముల భయములనుండి నీవు మమ్ములను కాపాడితివి.

న ఖలు గోపికానందనో భవానఖిలదేహినామంతరాత్మదృక్ ।
విఖనసార్థితో విశ్వగుప్తయే సఖ ఉదేయివాన్ సాత్వతాం కులే ॥ 4

సఖే - ఓ మిత్రమా!, భవాన్ - నీవు, గోపికానందనః - గోపికయగు యశోదయొక్క పుత్రుడవు, న ఖలు - నిశ్చయముగా కాదు, అఖిలదేహినామ్ - సకలప్రాణుల, అంతరాత్మదృక్ - మనస్సాక్షివి, విఖనసా - బ్రహ్మదేవునిచే, విశ్వగుప్తయే - జగత్తుయొక్క రక్షణ కొరకై,

అర్థితః - ప్రార్థించబడినవాడవై, సాత్వతామ్ - యాదవుల, కులే - వంశమునందు, ఉదేయివాన్ - పుట్టితివి.

ఓ మిత్రమా! నీవు గోపికయగు యశోద పుత్రుడవు కావు. నీవు సకల ప్రాణులలో మనోవృత్తుల సాక్షియగు పరమాత్మవు. బ్రహ్మదేవుడు జగత్తును రక్షించుటకై కోరగా నీవు యాదవుల వంశములో అవతరించితివి.

విరచితాభయం వృష్ణిధుర్య తే చరణమీయుషాం సంసృతేర్భయాత్ ।
కరసరోరుహం కాంత కామదం శిరసి ధేహి నశ్శ్రీకరగ్రహమ్ ॥ 5

వృష్ణిధుర్య - వృష్ణివంశీయులలో శ్రేష్ఠుడా!, కాంత - ఓ ప్రియుడా!, సంసృతేః - సంసారము వలని, భయాత్ - భయము వలన, తే - నీ, చరణమ్ - పాదమును, ఈయుషామ్ - పొందినవారలకు, విరచిత-అభయమ్ - చేయబడిన అభయము కలిగినట్టియు, కామదమ్ - కోరికల నీడేర్చు, శ్రీకరగ్రహమ్ - లక్ష్మీదేవి చేతిని పట్టుకునే, కరసరః-రుహమ్ - పద్మమువంటి చేతిని, నః - మా, శిరసి - తలపై, ధేహి - ఉంచుము.

ఓ ప్రియుడా! నీవు వృష్ణివంశీయులలో శ్రేష్ఠుడవు. సంసారము వలన భయపడినవారు నీ పాదములను శరణు వేడినప్పుడు వారికి నీవు పద్మమువంటి చేతితో అభయమునిచ్చెదవు. లక్ష్మీదేవి చేతిని పట్టుకొని భక్తుల కోరికలనీడేర్చే నీ చేతిని మా తలపై నుంచుము.

వ్రజజనార్తిహన్ వీర యోషితాం నిజజనస్మయధ్వంసనస్మిత ।
భజ సఖే భవత్కింకరీస్స్మ నో జలరుహాననం చారు దర్శయ ॥ 6

వ్రజజన-ఆర్తిహన్ - గోకులమునందలి జనుల ఇడుములను బాపువాడా!, వీర - వీరుడా!, నిజజనస్మయధ్వంసనస్మిత - తన వారల గర్వమును పోనాడే చిరునవ్వు గలవాడా!, సఖే - మిత్రమా!, భవత్-కింకరీః - నీ దాసీలమగు, నః - మమ్ములను, భజ స్మ - నిశ్చయముగా సేవించుము, చారు - సుందరమైన, జలరుహ-ఆననమ్ - పద్మమువంటి ముఖమును, యోషితామ్ - అబలలమగు మాకు, దర్శయ - చూపుము.

ఓ మిత్రమా! నీవు గోకులమునందలి జనుల ఇడుములను బాపే వీరుడవు. నీ వారల గర్వమును పోనాడుటకు నీ చిరునవ్వు చాలును. నీ

దాసీలమగు మాకు తప్పకుండా ఆనందమును కలిగించుము. అబలలమగు మాకు పద్మమువలె సుందరమైన నీ ముఖమును చూపుము.

ప్రణతదేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీనికేతనమ్ ।
ఫణిఫణార్పితం తే పదాంబుజం
కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్ ॥ 7

ప్రణతదేహినామ్ - శరణాగతి చేసిన ప్రాణులకు, పాపకర్శనమ్ - పాపములను పోగొట్టునట్టియు, తృణచర-అనుగమ్ - గడ్డిని మేసే పశువుల వెంటనుండునట్టియు, శ్రీనికేతనమ్ - లక్ష్మీదేవికి నివాసమైనట్టియు, ఫణిఫణ-అర్పితమ్ - కాలియనాగుని పడగలపై ఉంచబడిన, తే - నీ పద-అంబుజమ్ - పద్మమువంటి పాదమును, నః - మా, కుచేషు స్తనములయందు, కృణు - ఉంచుము, హృత్-శయమ్ హృదయమునందలి తాపమును, కృంధి - పోగొట్టుము.

శరణు జొచ్చిన ప్రాణుల పాపములను పోగొట్టే నీ పాదపద్మములు గడ్డిని మేసే పశువులను వెంబడించును. లక్ష్మీదేవికి నివాసమైన నీ పాదములతో కాలియనాగుని పడగలను తొక్కితివి. నీ పాదములను మా వక్షఃస్థలముపై నుంచి, మా హృదయములలోని తాపమును తొలగించుము.

మధురయా గిరా వల్గువాక్యయా బుధమనోజ్ఞయా పుష్కరేక్షణ ।
విధికరీరిమా వీర ముహ్యతీరధరసీధునాఽఽప్యాయయస్వ నః ॥ 8

పుష్కర-ఈక్షణ - పద్మములవంటి కన్నులు గలవాడా!, వీర - ఓ వీరుడా!, మధురయా - మధురమైనట్టియు, వల్గువాక్యయా - మనోహరములగు వాక్యములు కలిగినట్టియు, బుధమనః-జ్ఞయా - పండితులను మెప్పించే, గిరా - వాక్కుతో, ముహ్యతీః - మోహమును పొందుచున్నట్టియు, విధికరీః - నీవు చెప్పినట్లు చేసే, ఇమాః - ఈ, నః - మమ్ములను, అధరసీధునా - అధరామృతముతో, ఆప్యాయయస్వ - జీవింప జేయుము.

ఓ వీరా! నీ కన్నులు పద్మములను పోలియున్నవి. మనోహరములగు వాక్యములు గల నీ మధురమగు వాక్కు పండితులను కూడ మెప్పించును. నీ ఆజ్ఞను పాలించే మేము అట్టి నీ వాక్కుచే మోహమును పొందితిమి. ఇట్టి మమ్ములను నీ అధరామృతముతో జీవింప జేయుము.

తవ కథామృతం తప్తజీవనం కవిభిరీడితం కల్మషాపహమ్ ।
శ్రవణమంగలం శ్రీమదాతతం భువి గృణంతి యే భూరిదా జనాః ॥9

తప్తజీవనమ్ - తాపపీడితులకు జీవితమునిచ్చునట్టియు, కవిభిః - విద్వాంసులచే, ఈడితమ్ - కొనియాడబడునట్టియు, కల్మష-అపహమ్ - పాపములను పోగొట్టునట్టియు, శ్రవణమంగలమ్ - వినుటచే కల్యాణమును కలిగించునట్టియు, శ్రీమత్ - మిక్కిలి సుందరమైనట్టియు, ఆతతమ్ - విస్తృతమగు, తవ - నీ, కథా-అమృతమ్ - గాథ అనే అమృతమును, భువి - భూలోకమునందు, యే - ఎవరైతే, గృణంతి - వర్ణించెదరో ఆ, జనాః - జనులు, భూరిదాః - గొప్ప దానము చేయువారు.

విద్వాంసులచే కొనియాడబడే నీ గాథ అనే అమృతము తాపసంతప్తులకు జీవితమునిచ్చును. నీ గాథ విన్నంత మాత్రాన పాపములను పోగొట్టి మంగళమును కలిగించును. మిక్కిలి సుందరము మరియు విస్తృతము అగు నీ కథామృతమును ఈ లోకములో ఏ జనులైతే వర్ణించెదరో, వారే గొప్ప దాతలు (జ్ఞానము కంటె గొప్ప దానము లేదు).

ప్రహసితం ప్రియ ప్రేమవీక్షణం విహరణం చ తే ధ్యానమంగలమ్,
రహసి సంవిదో యా హృదిస్పృశః కుహక నో మనః క్షోభయంతి హి।

ప్రియ - ఓ ప్రియుడా!, కుహక - మోసగాడా!, ధ్యానమంగలమ్ - ధ్యానించుటచే మంగళప్రదమైన, తే - నీ, ప్రహసితమ్ - నవ్వు, ప్రేమవీక్షణమ్ - ప్రేమతోడి చూపు, విహరణం చ - విహారము కూడ, రహసి - ఏకాంతమునందు, హృదిస్పృశః - హృదయమును తాకే, యాః - ఏ, సంవిదః - రహస్యసంకేతములు గలవో అవి, నః - మా, మనః - మనస్సును, క్షోభయంతి - క్షోభ పెట్టుచున్నవి, హి - నిశ్చయము. 10

ఓ ప్రియా! నీవు మోసగాడవు. ధ్యానమాత్రముచే మంగళములనిచ్చే నీ నవ్వు, ప్రేమతో కూడిన చూపు, విహారము, హృదయమును తాకే ఏకాంతమునందలి ఏ నీ రహస్యసంకేతములు (వినోదవచనములు) గలవో అవి, మాకు నిశ్చయముగా మనస్తాపమును కలిగించుచున్నవి.

చలసి యద్వ్రజాచ్చారయన్ పశూన్నలినసుందరం నాథ తే పదమ్ ।
శిలతృణాంకురైస్సీదతీతి నః కలిలతాం మనః కాంత గచ్ఛతి ॥ 11

నాథ - ఓ ప్రభూ!, కాంత - ఓ ప్రియుడా!, యత్ - ఎప్పుడైతే, వ్రజాత్ - గోకులమునుండి, పశూన్ - పశువులను, చారయన్ - మేపువాడవై, చలసి - వెళ్లెదవో అప్పుడు, నలినసుందరమ్ - పద్మమువలె అందమైన, తే - నీ, పదమ్ - పాదము, శిలతృణ-అంకురైః - ధాన్యపు కంకులు దర్భగడ్డి వాడి మొలకలచే, సీదతి - నొప్పిని పొందును, ఇతి - అని, నః - మా, మనః - మనస్సు, కలిలతామ్ - అస్వస్థతను, గచ్ఛతి - పొందును.

ఓ ప్రియ ప్రభూ! నీవు గోకులమునుండి ఆవులను మేపుతూ వెళ్లినప్పుడు పద్మమువలె అందమైన (కోమలమైన) నీ పాదములకు ధాన్యపు కంకులు (చిన్న రాళ్లు), దర్భగడ్డి, వాడి మొలకలు గుచ్చుకొని నొప్పి కలుగుననే తలపుతో మా మనస్సు అస్వస్థమగుచుండును.

దినపరిక్షయే నీలకుంతలైర్వనరుహాననం బిభ్రదావృతమ్ ।
ఘనరజస్వలం దర్శయన్ముహుర్మనసి నస్స్మరం వీర యచ్ఛసి॥12

వీర - ఓ వీరుడా!, దినపరిక్షయే - సాయంకాలమునందు, నీలకుంతలైః - నల్లని కేశములతో, ఆవృతమ్ - కప్పివేయబడినట్టియు, ఘనరజస్వలమ్ - దట్టనైన దుమ్ము గల, వనరుహ-ఆననమ్ - పద్మమువంటి ముఖమును, బిభ్రత్ - దాల్చువాడవై, ముహుః - పలు మార్లు, దర్శయన్ - చూపువాడవై, నః - మాకు, మనసి - మనస్సునందు, స్మరమ్ - అనురాగమును, యచ్ఛసి - కలిగించుచున్నావు.

ఓ వీరుడా! సాయంకాలము పద్మమువంటి నీ ముఖము రేగిన జుట్టుతో కప్పబడి దట్టని దుమ్ము కలిగియుండును. అట్టి నీ ముఖమును మాకు పలు మార్లు చూపించి మా మనస్సునందు ప్రేమను కలిగించుచున్నావు.

ప్రణతకామదం పద్మజార్చితం ధరణిమండనం ధ్యేయమాపది ।
చరణపంకజం శంతమం చ తే రమణ నః స్తనేష్వర్పయాధిహన్।।13

రమణ - రమించువాడా!, ఆధిహన్ - మనోదుఃఖమును పోగొట్టువాడా!, ప్రణతకామదమ్ - నమస్కరించినవారి కోరికలనీడేర్చునట్టియు, పద్మజ-అర్చితమ్ - పద్మమునుండి ఆవిర్భవించిన బ్రహ్మదేవుని (లక్ష్మీదేవి) చే పూజించబడునట్టియు, ధరణిమండనమ్ - భూలోకమునకు అలంకారమైనట్టియు, ఆపది - విపత్తునందు, ధ్యేయమ్ - ధ్యానించదగినట్టియు, శంతమం చ - మహానందమునిచ్చేది కూడా అగు, తే - నీ, చరణపంకజమ్ - పద్మమువంటి పాదమును, నః - మా, స్తనేషు - వక్షఃస్థలములయందు, అర్పయ - ఉంచుము.

ఓ శ్రీకృష్ణా! నీవు మనస్సునందలి దుఃఖమును పోగొట్టి రమించెదవు. పద్మమువంటి నీ పాదములను నమస్కరించువారికి కోరికలీడేరును. పద్మమునుండి పుట్టిన బ్రహ్మదేవుని (లక్ష్మీదేవి) చే పూజించబడే నీ పాదము ఇప్పుడు భూలోకమునకు అలంకారమై యున్నది. మహానందదాయకమగు నీ పాదము విపత్తునందు ధ్యానించ దగినది. అట్టి నీ పాదమును మా హృదయములలో నిలుపుము.

సురతవర్ధనం శోకనాశనం స్వరితవేణునా సుష్ఠు చుంబితమ్ ।
ఇతరరాగవిస్మారణం నృణాం వితర వీర నస్తేఽధరామృతమ్ ।। 14

వీర - ఓ వీరుడా!, సురతవర్ధనమ్ - ప్రేమను పెంచునట్టియు, శోకనాశనమ్ - శోకమును పోగొట్టునట్టియు, స్వరితవేణునా - నాదము చేయబడే వేణువుచే, సుష్ఠు - బాగుగా, చుంబితమ్ - చుంబించబడునట్టియు, నృణామ్ - మానవస్త్రీలకు, ఇతరరాగవిస్మారణమ్ - ఇతరములపై రాగమును మరిపింప జేసే, తే - నీ, అధర-అమృతమ్ - అధరామృతమును, నః - మా కొరకు, వితర - ఇమ్ము.

ఓ వీరా! ప్రేమను పెంచి శోకమును పోగొట్టే నీ అధరామృతమును మాకిమ్ము. నీవు వేణునాదము చేయునప్పుడు వేణువును నీ అధరము

బాగుగా ముద్దిడును. నీపై ప్రేమ కలిగిన మానవులకు ఇతరములపై రాగము మరుపునకు వచ్చును.

అటతి యద్భవానహ్ని కాననం త్రుటిర్యుగాయతే త్వామపశ్యతామ్,
కుటిలకుంతలం శ్రీముఖం చ తే జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్॥15

అహ్ని - పగలునందు, యత్ - ఎప్పుడైతే, భవాన్ - నీవు, కాననమ్ - అడవిని గురించి, అటతి - వెళ్లెదవో అప్పుడు, త్వామ్ - నిన్ను, అపశ్యతామ్ - చూడని వారలకు, త్రుటిః - క్షణము, యుగాయతే - యుగము వలె ఆచరించుచున్నది, కుటిలకుంతలమ్ - వక్రమైన కేశములు గల, తే - నీ, శ్రీముఖమ్ - అందమైన ముఖమును, ఉదీక్షతామ్ - చూచువారల, దృశామ్ - కన్నులకు, పక్ష్మకృత్ - రెప్పలను సృష్టించిన బ్రహ్మదేవుడు, జడః - మందబుద్ధి.

పగలు నీవు అడవికి వెళ్లినప్పుడు నిన్ను చూడలేని మాకు క్షణము యుగమువలె నుండును. వంకరలు తిరిగిన జుట్టుతో అందమైన నీ ముఖమును చూచే మా కళ్లకు రెప్పపాటును పెట్టిన బ్రహ్మదేవుడు మందబుద్ధి.

పతిసుతాన్వయభ్రాతృబాంధవానతివిలంఘ్య తేఽంత్యచ్యుతాగతాః।
గతివిదస్తవోద్గీతమోహితాః కితవ యోషితః కస్త్యజేన్నిశి ॥ 16

అచ్యుత - ఓ అచ్యుతా!, తవ - నీ, ఉద్గీతమోహితాః - బిగ్గరయైన గానముచే / మోహమును పొందిన మేము, పతిసుత-అన్వయభ్రాతృబాంధవాన్ - భర్తలను పుత్రులను వంశము వారిని సోదరులను బంధువులను, అతివిలంఘ్య - అనాదరము చేసి, గతివిదః - మా రాక గురించి తెలిసిన, తే - నీ, అంతి - వద్దకు, ఆగతాః - వచ్చినవారము, కితవ - మోసగాడా!, నిశి - రాత్రియందు, యోషితః - స్త్రీలను, కః - ఎవడు, త్యజేత్ - విడిచిపెట్టును?

ఓ అచ్యుతా! నీవు మోసగాడవు. నీవు అందరికీ వినపడేలా చేసిన వేణుగానముచే మోహితులమై మేము భర్తలను, పుత్రులను వంశమర్యాదలను, సోదరులను, బంధువులను కాదని నీ వద్దకు వచ్చితిమి. మేము వచ్చిన విషయము (సంగీతస్వరములు) నీకు తెలియును. రాత్రి

పూట స్త్రీలను ఒంటరిగా ఎవడు విడిచిపెట్టును? (ఎవడైననూ విడిచిపెట్టడు).

రహసి సంవిదం హృచ్ఛయోదయం
ప్రహసితాననం ప్రేమవీక్షణమ్ ।
బృహదురశ్శ్రియో వీక్ష్య ధామ తే
ముహురతిస్పృహా ముహ్యతే మనః ॥ 17

రహసి - ఏకాంతమునందు, సంవిదమ్ - సంకేతభాషణమును, హృత్-శయ-ఉదయమ్ - అనురాగమును ఉత్పన్నము చేసే, ప్రహసిత-ఆననమ్ - చిరునవ్వు ముఖమును, ప్రేమవీక్షణమ్ - ప్రేమతోడి చూపును, శ్రియః - లక్ష్మీదేవికి, ధామ - నివాసమైన, బృహత్ - విశాలమైన, తే - నీ, ఉరః - వక్షఃస్థలమును, వీక్ష్య - చూచి, అతిస్పృహా - అధికమగు అనురాగము, ముహుః - పలుమార్లు, మనః - మనస్సు, ముహ్యతే - మోహమును పొందుచున్నది.

ఏకాంతములో నీవు చేసే సంకేతపు పలుకులు, హృదయములో ప్రేమను కలిగించే నీ చిరునవ్వు ముఖము, ప్రేమ తోడి చూపు, లక్ష్మీ దేవికి నివాసమగు విశాల వక్షఃస్థలము -- వీటిని చూచి మాకు అధికమగు ప్రేమ కలిగి, మనస్సు పలుమార్లు మోహమును పొందుచున్నది.

వ్రజవనౌకసాం వ్యక్తిరంగ తే
వృజినహంత్ర్యలం విశ్వమంగలమ్ ।
త్యజ మనాక్ చ నస్త్వత్స్పృహాత్మనాం
స్వజనహృద్రుజాం యన్నిషూదనమ్ ॥ 18

అంగ - ఓయీ!, తే - నీ, వ్యక్తిః - అవతారము, వ్రజవన-ఓకసామ్ - గోకులమునందు అడవియందు నివసించువారలకు, వృజినహంత్రీ - దుఃఖములను పోగొట్టునది, అలమ్ - అతిశయించి, విశ్వమంగలమ్ - జగత్తునకు కల్యాణమును చేయునది, త్వత్-స్పృహా-ఆత్మనామ్ - నీయందలి అనురాగము మనస్సునందు గల, నః - మాకు, స్వజనహృద్-రుజామ్ - తనవారల హృదయమునందలి పీడలకు, యత్ -

ఏ, నిషూదనమ్ - నివారణము గలదో దానిని, మనాక్ చ - కొంచెమైననూ, త్యజ - విడిచి పెట్టుము.

ఓయీ! నీ అవతారము గోకులవాసులకు, అడవియందు నివసించే మహర్షులకు దుఃఖములను పోగొట్టి, జగత్తునకు అతిశయముగా కల్యాణమును కలిగించును. మా హృదయములలో నీపై అనురాగము మెండు. మేము నీ వారము. మా హృదయముల పీడను నాశము చేసే ఔషధమును కొంచెమైననూ మా కొరకు విడిచి పెట్టుము.

యత్తే సుజాతచరణాంబురుహం స్తనేషు
భీతాశ్శనైః ప్రియ దధీమహి కర్కశేషు ।
తేనాటవీమటసి తద్వ్యథతే న కింస్విత్
కూర్పాదిభిర్భ్రమతి ధీర్భవదాయుషాం నః ॥ 19

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే ఏకత్రింశోఽధ్యాయః॥

ప్రియ - ఓ ప్రియా!, తే - నీ, యత్ - ఏ, సుజాతచరణ-అంబురుహమ్ - సుకుమారమైన పద్మమువంటి పాదమును, కర్కశేషు - కఠినమైన, స్తనేషు - స్తనములయందు, భీతాః - భయపడిన మేము, శనైః - మెల్లగా, దధీమహి - ధరించెదమో, తేన - దానితో, అటవీమ్ - అడవిని, అటసి - తిరిగెదవు, తత్ - ఆ పాదము, కూర్ప-ఆదిభిః - వాడియైన రాళ్లచే, న కింస్విత్ వ్యథతే - నొప్పిని పొందుట లేదా?, భవద్-ఆయుషామ్ - నీవే ప్రాణముగా గల, నః - మాకు, ధీః - బుద్ధి, భ్రమతి - భ్రమించుచున్నది.

ఓ ప్రియా! నీ పాదము పద్మము వలె సుకుమారమైనది. కావుననే, మేము దానిని కఠినమగు మా వక్షఃస్థలములపై భయపడుతూ మెల్లగా ధరించెదము. అట్టి పాదముతో నీవు అడవిలో తిరిగెదవు. వాడియైన రాళ్ల వలన నీ పాదమునకు నొప్పి కలుగుట లేదా? అని ఆలోచించి మా బుద్ధి భ్రమించుచున్నది. మాకు జీవితము నీవే సుమా!

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో గోపికా గీతమును వర్ణించే ముప్పది ఒకటవ అధ్యాయము ముగిసినది (31).

* * * * *

# అథ ద్వాత్రింశోऽధ్యాయః

## శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై గోపికలనోదార్చుట

శ్రీశుక ఉవాచ ।
ఇతి గోప్యః ప్రగాయంత్యః ప్రలపంత్యశ్చ చిత్రధా ।
రురుదుస్సుస్వరం రాజన్ కృష్ణదర్శనలాలసాః ॥ 1

రాజన్ - ఓ రాజా!, ఇతి - ఈ విధముగా, చిత్రధా - అనేకప్రకారములుగా, ప్రగాయంత్యః - గానము చేయుచున్నవారు, ప్రలపంత్యః చ - మాటలాడుచున్నవారు, కృష్ణదర్శనలాలసాః - శ్రీకృష్ణుని దర్శించుటయందు ఉత్కటమగు ఇచ్ఛ గలవారు అగు, గోప్యః - గోపికలు, సుస్వరమ్ - మంచి స్వరము కలుగునట్లుగా, రురుదుః - ఏడ్చిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుని చూడాలనే ఉత్కటమగు ఇచ్ఛ గల గోపికలు ఈ విధముగా అనేకప్రకారములుగా గానము చేస్తూ, మాటలాడుచుండిరి. వారు మధురమగు స్వరముతో ఏడ్చిరి.

తాసామావిరభూచ్ఛౌరిస్స్మయమానముఖాంబుజః ।
పీతాంబరధరస్స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః ॥ 2

స్మయమానముఖ-అంబుజః - చిరునవ్వు నవ్వే పద్మమువంటి ముఖము గలవాడు, పీత-అంబరధరః - పచ్చని వస్త్రమును దాల్చినవాడు, స్రగ్వీ - వనమాల గలవాడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, మన్మథమన్మథః - మన్మథునకు కూడ మన్మథుడు అగు, శౌరిః - శూరవంశీయుడగు శ్రీకృష్ణుడు, తాసామ్ - వారికి, ఆవిరభూత్ - ప్రత్యక్షమయ్యెను.

శూరవంశీయుడగు శ్రీకృష్ణుడు చిరునవ్వుతో వారికి ప్రత్యక్షమయ్యెను. పద్మమువంటి మోము గల ఆయన పచ్చని వస్త్రమును వనమాలను దాల్చి, సాక్షాత్తుగా మన్మథునకు కూడ మన్మథుడు వలె నుండెను.

తం విలోక్యాగతం ప్రేష్ఠం ప్రీత్యుత్ఫుల్లదృశోఽబలాః ।
ఉత్తస్థుర్యుగపత్సర్వాస్తన్వః ప్రాణమివాగతమ్ ॥ 2

ఆగతమ్ - వచ్చిన, తమ్ - ఆ, ప్రేష్ఠమ్ - ప్రియతముడగు శ్రీకృష్ణుని, విలోక్య - చూచి, ప్రీతి-ఉత్ఫుల్లదృశః - ప్రేమతో వికసించిన కన్నులు గల, అబలాః - గోపికలు, సర్వాః - అందరు, ఆగతమ్ - వచ్చిన, ప్రాణమ్ - ప్రాణమును, తన్వః ఇవ - అవయవములు వలె, యుగపత్ - ఒకేసారి, ఉత్తస్థుః - లేచి నిలబడిరి.

పోయిన ప్రాణము రాగా దేహములోని అవయవములన్నీ ఒక్కసారి జీవంతములగును. అదే విధముగా, వచ్చిన ప్రియతముడగు ఆ శ్రీకృష్ణుని చూచి గోపికల కన్నులు ప్రేమతో వికసించినవి. వారందరు ఒక్కసారిగా లేచి నిలబడిరి.

కాచిత్కరాంబుజం శౌరేర్జగృహేఽంజలినా ముదా ।
కాచిద్దధార తద్బాహుమంసే చందనరూషితమ్ ॥ 4

కాచిత్ - ఒకానొక గోపిక, శౌరేః - శ్రీకృష్ణుని, కర-అంబుజమ్ - పద్మమువంటి చేతిని, అంజలినా - దోసిలితో, ముదా - ఆనందముతో, జగృహే - పట్టుకొనెను, కాచిత్ - ఒక గోపిక, చందనరూషితమ్ - చందనమలదిన, తద్-బాహుమ్ - ఆయన చేతిని, అంసే - భుజముపై, దధార - వేసుకొనెను.

శ్రీకృష్ణుని పద్మమువంటి చేతిని ఒక గోపిక ఆనందముతో తన దోసిలితో పట్టుకొనగా, మరియొక గోపిక చందనమలదిన ఆయన చేతిని తన భుజముపై వేసుకొనెను.

కాచిదంజలినాఽగృహ్ణాత్తన్వీ తాంబూలచర్వితమ్ ।
ఏకా తదంఘ్రికమలం సంతప్తా స్తనయోరధాత్ ॥ 5

కాచిత్ - ఒకానొక, తన్వీ - సుందరి, తాంబూలచర్వితమ్ - నోటియందలి తాంబూలమును, అంజలినా - దోసిలితో, అగృహ్ణాత్ - తీసుకొనెను, సంతప్తా - తాపమును పొందిన, ఏకా - ఒకామె, తద్-అంఘ్రికమలమ్ - ఆయనయొక్క పద్మమువంటి పాదమును, స్తనయోః - స్తనములపై, అధాత్ - ఉంచుకొనెను.

ఒకానొక సుందరి ఆయన నోటిలోని తాంబూలమును దోసిలితో తీసుకొనగా, తాపమును పొందిన మరియొక గోపిక పద్మమువంటి ఆయన పాదమును వక్షఃస్థలముపై నుంచుకొనెను.

ఏకా భ్రుకుటిమాబధ్య ప్రేమసంరంభవిహ్వలా ।
ఘ్నతీవైక్షత్కటాక్షేపైస్సందష్టదశనచ్ఛదా ॥ 6

ప్రేమసంరంభవిహ్వలా - ప్రేమయందలి కోపముచే స్వాధీనత తప్పినది, సందష్టదశనచ్ఛదా - కొరకబడిన క్రింది పెదవి గలది అగు, ఏకా - ఒకామె, భ్రుకుటిమ్ - కనుబొమను, ఆబధ్య - ముడివేసి, కట-ఆక్షేపైః - ఓరచూపుల విసురుటలచే, ఘ్నతీ ఇవ - కొట్టుచున్నదా యన్నట్లు, ఐక్షత్ - చూచెను.

ఒక గోపిక ప్రణయకోపముచే స్వాధీనత తప్పి క్రింది పెదవిని కొరుకుతూ కనుబొమలను ముడివేసి ఓరచూపులను విసురుతూ కొట్టుచున్నదా యన్నట్లు చూచెను.

అపరానిమిషద్దృగ్భ్యాం జుషాణా తన్ముఖాంబుజమ్ ।
ఆపీతమపి నాతృప్యత్సంతస్తచ్చరణం యథా ॥ 7

అపరా - మరియొకామె, అనిమిషద్-దృగ్భ్యామ్ - రెప్పపాటు లేని కన్నులతో, ఆపీతమపి - బాగుగా పానము చేయబడినదే అయిననూ, తత్-ముఖ-అంబుజమ్ - ఆయన పద్మమువంటి ముఖమును, జుషాణా - సేవించుచున్నదై, సంతః - సత్పురుషులు, తత్-చరణం యథా - ఆయన పాదమును వలె, న అతృప్యత్ - తృప్తి జెందలేదు.

సత్పురుషులకు ఆయన చరణములను ఎంత సేవించినా తనివి దీరదు. అదే తీరున, మరియొకామెకు పద్మమువంటి ఆయన ముఖమును

రెప్పపాటు లేని కళ్లతో చూచి ఆస్వాదించి మరల చూచినా తనివి దీరలేదు.

తం కాచిన్నేత్రరంధ్రేణ హృది కృత్య నిమీల్య చ ।
పులకాంగ్యుపగుహ్యాస్తే యోగీవానందసంప్లుతా ।। 8

కాచిత్ - ఒకామె, తమ్ - ఆయనను, నేత్రరంధ్రేణ - కన్ను అనే ద్వారము గుండా, హృది - హృదయమునందు, కృత్య - ప్రవేశపెట్టి, నిమీల్య చ - కళ్లను మూసివేసి, ఉపగుహ్య - కౌగిలించి, పులక-అంగీ - రోమాంచము గల దేహము గలదియై, యోగీ ఇవ - యోగి వలె, ఆనందసంప్లుతా - ఆనందముచే ముంచెత్తబడినదై, ఆస్తే - ఉన్నది.

ఒకామె ఆయనను కళ్లు అనే ద్వారము గుండా హృదయములో ప్రవేశపెట్టి ఆ ద్వారమును మూసివేసెను. అపుడామె ఆయనను కౌగిలించుకొనగా, ఆమెకు దేహమంతటా గగుర్పాటు కలిగెను. యోగి వలె ఆమె ఆనందసముద్రములో మునిగిపోయెను.

సర్వాస్తాః కేశవాలోకపరమోత్సవనిర్వృతాః ।
జహుర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథా జనాః ।। 9

కేశవ-ఆలోకపరమ-ఉత్సవనిర్వృతాః - శ్రీకృష్ణ భగవానుని చూచుట అనే గొప్ప ఉత్సవముచే ఆనందించిన, తాః - ఆ, సర్వాః - అందరు, విరహజమ్ - విరహము వలన కలిగిన, తాపమ్ - తాపమును, ప్రాజ్ఞమ్ - జ్ఞానిని, ప్రాప్య - పొంది, జనాః యథా - జనులు వలె, జహుః - విడిచిరి.

శ్రీకృష్ణ భగవానుని దర్శనమే గొప్ప ఉత్సవము కాగా వారందరు ఆనందించిరి. బ్రహ్మజ్ఞానిని పొందిన సంసారి జనులు వలె, వారు విరహము వలన కలిగిన తాపమును విడిచి పెట్టిరి.

తాభిర్విధూతశోకాభిర్భగవానచ్యుతో వృతః ।
వ్యరోచతాధికం తాత పురుషశ్శక్తిభిర్యథా ।। 10

తాత - ఓ కుమారా!, విధూతశోకాభిః - ఎగురగొట్టబడిన శోకము గల, తాభిః - వారిచే, వృతః - చుట్టువారబడిన, అచ్యుతః భగవాన్ - శ్రీకృష్ణ

భగవానుడు, పురుషః - పూర్ణ పరమాత్మ, శక్తిభిః యథా - శక్తులతో వలె, అధికమ్ - అధికముగా, వ్యరోచత - ప్రకాశించెను.

నాయనా! ఆ గోపికల శోకము ఎగిరిపోయెను. వారా శ్రీకృష్ణ భగవానుని చుట్టుముట్టిరి. పూర్ణ పరమాత్మ జ్ఞానక్రియాదిశక్తులతో వలె ఆయన వారితో గూడి విశేషముగా ప్రకాశించెను.

తాస్సమాదాయ కాలింద్యా నిర్విశ్య పులినం విభుః ।
వికసత్కుందమందారసురభ్యనిలషట్పదమ్ ॥ 11

శరచ్చంద్రాంశుసందోహధ్వస్తదోషాతమశ్శివమ్ ।
కృష్ణాయా హస్తతరలాచితకోమలవాలుకమ్ ॥ 12

విభుః - సర్వసమర్థుడగు శ్రీకృష్ణ భగవానుడు, తాః - వారిని, సమాదాయ - తీసుకొని, వికసత్-కుందమందారసురభి-అనిలషట్-పదమ్ - వికసించుచున్న మల్లెల మందారముల పరిమళము గల వాయువు వలన తుమ్మెదలు కలిగినట్టియు, శరత్-చంద్ర-అంశుసందోహధ్వస్తదోషాతమః - శరత్కాలచంద్రుని కిరణముల సమూహములచే నశింపజేయబడిన రాత్రియొక్క చీకటి కలిగినట్టియు, శివమ్ - సుఖకరమైనట్టియు, కృష్ణాయాః - యమునానదియొక్క, హస్తతరల-ఆచితకోమలవాలుకమ్ - చేతులవంటి కెరటములచే తడుపబడిన మెత్తని ఇసుకలు గల, కాలింద్యాః - యమునానదియొక్క, పులినమ్ - ఇసుకతిన్నెను, నిర్విశ్య - ప్రవేశించి --.

సర్వసమర్థుడగు శ్రీకృష్ణ భగవానుడు ఆ గోపికలతో గూడి యమునానదియొక్క సుఖకరమైన ఇసుకతిన్నెను చేరెను. వికసించుచున్న మల్లెల, మందారముల పరిమళము గల వాయువు అచటకు తుమ్మెదలను కొనివచ్చుచుండెను. శరత్కాలచంద్రుని కిరణముల గుంపులు రాత్రి చీకట్లను తరిమి కొట్టెను. యమునానదియొక్క చేతులవంటి కెరటములు అచటి మెత్తని ఇసుకను తడుపుచుండెను.

తద్దర్శనాహ్లాదవిధూతహృద్రుజో
మనోరథాంతం శ్రుతయో యథా యయుః ।

స్వైరుత్తరీయైః కుచకుంకుమాంకితైః
అచీక్లుపన్నాసనమాత్మబంధవే ॥ 13

తద్-దర్శన-ఆహ్లాదవిధూతహృద్-రుజః - ఆయన దర్శనము వలని ఆనందముచే కడిగివేయబడిన హృదయతాపము గల గోపికలు, శ్రుతయః యథా - శ్రుతులు వలె, మనః-రథ-అంతమ్ - కోరికల అంతమును, యయుః - పొందిరి, ఆత్మబంధవే - ఆత్మబంధువగు శ్రీకృష్ణుని కొరకు, కుచకుంకుమ-అంకితైః - వక్షఃస్థలమునందలి కుంకుమచే చిహ్నితమైన, స్వైః - తమ, ఉత్తరీయైః - పై కొంగులతో, ఆసనమ్ - ఆసనమును, అచీక్లుపన్ - కల్పించిరి.

ఆయన దర్శనముచే వారి హృదయములలోని తాపము తొలగి ఆనందము కలిగెను. పరబ్రహ్మస్వరూపమును వర్ణించిన శ్రుతులు వలె వారు కూడ కోరికల అంతమును (పూర్ణత్వమును) పొందిరి. వారు ఆత్మబంధువగు శ్రీకృష్ణునికి తమ ఉత్తరీయములతో ఆసనమును కల్పించిరి. ఆ ఉత్తరీయములపై వారి వక్షఃస్థలమునందలి కుంకుమ చిహ్నములు ఉండెను.

తత్రోపవిష్టో భగవాన్ స ఈశ్వరో యోగేశ్వరాంతర్హృది కల్పితాసనః ।
చకాస గోపీపరిషద్గతోఽర్చితస్త్రైలోక్యలక్ష్మ్యైకపదం వపుర్దధత్ ॥ 14

తత్ర - దానిపై, ఉపవిష్టః - కూర్చున్నవాడు, ఈశ్వరః - జగన్నాథుడు, యోగ-ఈశ్వర-అంతః-హృది - యోగిరాజుల లోపల హృదయమునందు, కల్పిత-ఆసనః - కల్పించబడిన స్థానము గలవాడు, గోపీపరిషద్-గతః - గోపికల సభయందున్నవాడు, అర్చితః - పూజించబడినవాడు అగు, సః - ఆ, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, త్రైలోక్యలక్ష్మి-ఏకపదమ్ - ముల్లోకముల శోభకు ఏకైకస్థానమైన, వపుః - దేహమును, దధత్ - ధరించువాడై, చకాస - ప్రకాశించెను.

యోగిరాజుల హృదయము లోపల స్థిరనివాసముండే ఆ జగన్నాథుడు వారి పై కొంగుపై కూర్చుండెను. ముల్లోకముల శోభకు ఒకే ఒక

ఆశ్రయమైన దేహమును దాల్చి గోపికల సభయందున్న ఆయనను వారు పూజించిరి. అపుడాయన గొప్పగా శోభిల్లెను.

సభాజయిత్వా తమనంగదీపనం
సహాసలీలేక్షణవిభ్రమభ్రువా ।
సంస్పర్శనేనాంకకృతాంఘ్రిహస్తయోః
సంస్తుత్య ఈషత్కుపితా బభాషిరే ॥ 15

అనంగదీపనమ్ - అనురాగమును వర్ధిల్లజేసే, తమ్ - ఆ శ్రీకృష్ణుని, సహాసలీలా-ఈక్షణవిభ్రమభ్రువా - నవ్వుతో కూడిన విలాసపు చూపులతో విరుపులు గల కనుబొమతో, సభాజయిత్వా - సత్కరించి, అంకకృత-అంఘ్రిహస్తయోః - వక్షఃస్థలమునందుంచుకొనబడిన పాదముయొక్క చేతియొక్క, సంస్పర్శనేన - స్పర్శచే, సంస్తుత్య - బాగా స్తుతించి, ఈషత్-కుపితాః - కొంచెము కోపించిన గోపికలు, బభాషిరే - పలికిరి.

అనురాగమును వర్ధిల్లజేసే ఆయనను గోపికలు నవ్వుతో కూడిన విలాసపు చూపులతో మరియు కనుబొమల విరుపులతో సత్కరించిరి. ఒకామె ఆయన చేతిని, మరియొకామె ఆయన కాలిని తమ వక్షఃస్థలముపై నుంచుకొనిరి. వారా స్పర్శను నిమిత్తముగా చేసుకొని ఆయనను గొప్పగా కొనియాడిరి. అపుడు గోపికలు కొంత కోపించి ఆయనతో నిట్లనిరి.

గోప్య ఊచుః ।
భజతోఽను భజంత్యేక ఏక ఏతద్విపర్యయమ్ ।
నోభయాంశ్చ భజంత్యేక ఏతన్నో బ్రూహి సాధు భోః ॥ 16

ఏకే - కొందరు, భజతః - ప్రేమించువారిని, అను - తరువాత, భజంతి - ప్రేమించెదరు, ఏకే - కొందరు, ఏతద్-విపర్యయమ్ - దీనికి తల్లక్రిందులు, ఏకే - కొందరు, ఉభయాన్ చ - ఇద్దరిని కూడ, న భజంతి - ప్రేమించరు, భోః - ఓయీ!, ఏతత్ - ఇది ఇట్లున్నది, నః - మాకు, సాధు - మంచి దానిని, బ్రూహి - చెప్పుము.

గోపికలిట్లు పలికిరి --- కొందరు తమను ప్రేమించే ఇతరులను ఆ తరువాత ప్రేమించెదరు. కొందరు దీనికి తల్లక్రిందులు, అనగా ఇతరులు

ప్రేమించకున్ననూ వారిని ప్రేమించెదరు. కొందరు తమను ప్రేమించువారిని, ప్రేమించనివారిని కూడ ప్రేమించరు. ఓయీ! ఈ ప్రవృత్తులలో ఏది యోగ్యమైనదో మాకు చెప్పుము.

శ్రీభగవానువాచ ।
మిథో భజంతి యే సఖ్యస్స్వార్థైకాంతోద్యమా హి తే ।
న తత్ర సౌహృదం ధర్మస్స్వార్థార్థం తద్ధి నాన్యథా ॥ 17

సఖ్యః - చెలులారా!, యే - ఎవరైతే, మిథః - పరస్పరము, భజంతి - ప్రేమించెదరో, తే - వారు, హి - నిశ్చయముగా, స్వ-అర్థ-ఏక-అంత-ఉద్యమాః - తమ ప్రయోజనమునందు మాత్రమే నియతమైన ఉద్యమము గలవారు, తత్ర - ఆ ప్రవృత్తియందు, సౌహృదమ్ - ప్రేమ, ధర్మః - ధర్మము, న - లేదు, హి - ఏలయన, తత్ - ఆ ప్రేమ, స్వ-అర్థ-అర్థమ్ - స్వంత ప్రయోజనము కొరకు, అన్యథా - మరియొక విధముగా, న - కాదు.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- చెలులారా! ఇతరులు ప్రేమిస్తేనే వారిని ప్రేమించువారు తమ ప్రయోజనమునందు మాత్రమే నిశ్చితమైన ఉద్యమము గలవారు. వారి ఆ ప్రవృత్తిలో యథార్థమగు ప్రేమ గాని, ధర్మము గాని లేవు. ఆ ప్రేమ కేవలము స్వంత ప్రయోజనము కొరకే గాని, వేరు కాదు.

భజంత్యభజతో యే వై కరుణాః పితరో యథా ।
ధర్మో నిరపవాదోఽత్ర సౌహృదం చ సుమధ్యమాః ॥ 18

సుమధ్యమాః - ఓ సుందరయువతులారా!, యే వై - ఎవరైతే, పితరః యథా - తల్లిదండ్రులు వలె, అభజతః - ప్రేమించనివారిని, భజంతి - ప్రేమించెదరో వారు, కరుణాః - దయామయులు, అత్ర - దీనియందు, నిరపవాదః - నిర్బాధమగు, ధర్మః - ధర్మము, సౌహృదం చ - సాధుత్వము కూడ.

ఓ సుందరులారా! దయామయులు తల్లిదండ్రులవలె ప్రేమించనివారిని కూడ ప్రేమించెదరు. వారి ఈ ప్రేమలో నిశ్చలపూర్ణధర్మము మరియు సాధుత్వము కూడ గలవు.

భజతోఽపి న వై కేచిద్భజంత్యభజతః కుతః ।
ఆత్మారామా హ్యాప్తకామా అకృతజ్ఞా గురుద్రుహః ॥ 19

కేచిత్ - కొందరు, భజతః అపి - ప్రేమించే వారిని కూడ, న వై భజంతి - ప్రేమించనే ప్రేమించరు, అభజతః - ప్రేమించనివారిని, కుతః - ఏల?, హి - ఏలయన, ఆత్మారామాః - ఆత్మనిష్ఠులగు మహాత్ములు, ఆప్తకామాః - పూర్ణమైన కామనలు గలవారు, అకృతజ్ఞాః - చేసిన ఉపకారమును మరచువారు, గురుద్రుహః - గురువునకు ద్రోహమును చేయువారు.

కొందరు ప్రేమించేవారిని కూడ నిశ్చయముగా ప్రేమించరు. వారు ప్రేమించనివారిని ఏల ప్రేమించెదరు? (ప్రేమించరు). అట్టివారు ఆత్మనిష్ఠులు, పూర్ణకాములు అగు మహాత్ములు కావచ్చును; లేదా, చేసిన ఉపకారమును మరిచినవారు కావచ్చును; లేదా, గుర్తున్నా గురువువంటి ఉపకారము చేసిన వ్యక్తి యెడల ద్రోహబుద్ధి గలవారు కావచ్చును.

నాహం తు సఖ్యో భజతోఽపి జంతూన్భజామ్యమీషామనువృత్తివృత్తయే,
యథాఽధనో లబ్ధధనే వినష్టే తచ్చింతయాఽన్యన్నిభృతో న వేద ॥ 20

సఖ్యః - చెలియలారా!, అమీషామ్ - ఈ భక్తుల, అనువృత్తివృత్తయే - ధ్యానము కొనసాగుటకై, భజతః - ప్రేమించే, జంతూన్ అపి - ప్రాణులను కూడ, అహం తు - నేనైతే, న భజామి - ప్రేమించను, యథా - ఏ విధముగానైతే, అధనః - ధనము లేనివాడు, లబ్ధధనే - పొందబడిన ధనము, వినష్టే - నష్టము కాగా, తత్-చింతయా - దాని చింతచే, నిభృతః - వ్యాపించబడినవాడై, అన్యత్ - మరియొక దానిని, న వేద - తెలియడో.

ఓ చెలియలారా! ధనము లేనివానికి ధనము లభించి అది నష్టమైనచో, ఆతడు నిరంతరముగా దానినే చింతిస్తూ ఇతరమును విస్మరించును. అదే విధముగా, నన్ను ప్రేమించే భక్తులకు నా ధ్యానము నిరంతరముగా

కొనసాగుటకై, నేను కనబడి అంతర్ధానమగుచుందును. అంతేగాని, నేను వారికి నిరంతరముగా కనిపిస్తూ ఉండను.

ఏవం మదర్థోజ్ఝితలోకవేద-
స్వానాం హి వో మయ్యనువృత్తయేఽబలాః ।
మయా పరోక్షం భజతా తిరోహితం
మాఽసూయితుం మాఽర్హథ తత్ప్రియం ప్రియాః ॥ 21

అబలాః - ఓ అబలలారా!, ప్రియాః - ప్రియురాండ్రలారా!, ఏవమ్ - ఈ విధముగా, మద్-అర్థ-ఉజ్ఝితలోకవేదస్వానామ్ - నా కొరకై విడిచిపెట్టబడిన లోకము వేదములు తమవారు గల, వః - మీకు, మయి - నాయందు, అనువృత్తయే - ధ్యానము కొరకై, పరోక్షమ్ - పరోక్షముగా, భజతా - ప్రేమించే, మయా - నాచే, తిరోహితమ్ - అంతర్ధానము కాబడినది, హి - నిశ్చయము, తత్ - అందువలన, ప్రియమ్ - ప్రియుడనగు, మా - నన్ను, అసూయితుమ్ - తప్పు పట్టుటకు, మా అర్హథ - తగరు.

ఓ అబలలారా! మీపై నాకు ప్రీతి మెండు. మీరీ విధముగా నా కొరకై లోకములోని మర్యాదను, వేదములచే విధించబడిన గృహస్థాశ్రమనియమములను, బంధువులను విడిచిపెట్టితిరి. మీకు నాపై ధ్యానము కొనసాగుట కొరకు మాత్రమే నేను అంతర్హితుడనైతిని. నేను కనబడకపోయినా మిమ్ములను ప్రేమిస్తూనే ఉన్నాను. ఇది నిశ్చయము. కాబట్టి, మీ ప్రియుడనగు నాయందు మీరు తప్పులనెన్నుట తగదు.

న పారయేఽహం నిరవద్యసంయుజాం
స్వసాధుకృత్యం విబుధాయుషాఽపి వః ।
యా మాఽభజన్ దుర్జరగేహశృంఖలాః
సంవృశ్చ్య తద్వః ప్రతియాతు సాధునా ॥ 22

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ద్వాత్రింశోఽధ్యాయః ॥

నిరవద్యసంయుజామ్ - నిష్కపటమైన ప్రేమ గల, వః - మీకు, విబుధ-ఆయుషా అపి - దేవతల ఆయుర్దాయముచేనైననూ, అహమ్

నేను, స్వసాధుకృత్యమ్ - నా ప్రత్యుపకారమును, న పారయే - సమర్థుడను కాను, యాః - ఏ మీరు, దుర్జరగేహశృంఖలాః - శిథిలము కాని ఇల్లు-వాకిలి అనే సంకెళ్లను, సంవృశ్చ్య - పూర్తిగా తెగగొట్టి, మా - నన్ను, అభజన్ - ప్రేమించిరో, తత్ - అది, వః - మీ, సాధునా - సత్కార్యముచే, ప్రతియాతు - ప్రత్యుపకారమును పొందుగాక!

మీ ప్రేమ నిష్కపటమైనది. మీరు నాపై చూపిన ఈ ప్రేమకు ప్రత్యుపకారమును నేను దేవతల ఆయుర్దాయమును పొందినా చేయజాలను. ఇల్లు-వాకిలి అనే సంకెళ్లు మిక్కిలి దృఢమైనవి. కాని, మీరు వాటిని కూడ పూర్తిగా తెగగొట్టి నన్ను ప్రేమించినారు. మీ ప్రేమకు ప్రత్యుపకారము మీ ప్రేమయే యగుగాక!

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము పూర్వార్ధములో
శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై గోపికలనోదార్చుటను వర్ణించే
ముప్పది రెండవ అధ్యాయము ముగిసినది (32).



# అథ త్రయస్త్రింశోऽధ్యాయః

## మహా రాస లీల

శ్రీశుక ఉవాచ ।
ఇత్థం భగవతో గోప్యశ్శ్రుత్వా వాచస్సుపేశలాః ।
జహుర్విరహజం తాపం తదంగోపచితాశిషః ।। 1

ఇత్థమ్ - ఈ విధముగా, గోప్యః - గోపికలు, భగవతః - శ్రీకృష్ణ భగవానునినుండి, సుపేశలాః - మిక్కిలి మధురమైన, వాచః - మాటలను, శ్రుత్వా - విని, తద్-అంగ-ఉపచిత-ఆశిషః - ఆయన అవయవములచే పూర్ణమైన మనోరథములు గలవారై, విరహజమ్ - విరహము వలన కలిగిన, తాపమ్ - తాపమును, జహుః - విడిచిపెట్టిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా శ్రీకృష్ణ భగవానుడు చెప్పిన మిక్కిలి మధురమైన మాటలను విని గోపికలకు విరహము వలన కలిగిన తాపము దూరమయ్యెను. ఆయన చేతులను, కాళ్లను స్పృశించుటచే వారి మనోరథములు పూర్ణమయ్యెను.

తత్రారభత గోవిందో రాసక్రీడామనువ్రతైః ।
స్త్రీరత్నైరన్వితః ప్రీతైరన్యోన్యాబద్ధబాహుభిః ।। 2

అనువ్రతైః - వశవర్తినులైనట్టియు, ప్రీతైః - ప్రీతి కలిగినట్టియు, అన్యోన్య -ఆబద్ధబాహుభిః - పరస్పరము పట్టుకొనబడిన చేతులు గల, స్త్రీరత్నైః - గొప్ప యువతులతో, అన్వితః - కూడియున్న, గోవిందః - గోవిందుడు, తత్ర - అచట, రాసక్రీడామ్ - రాసక్రీడను, ఆరభత - ఆరంభించెను.

గోవిందునకు వశవర్తినులై ప్రేమ గల ఆ గొప్ప యువతులతో గోవిందుడు అచట రాసక్రీడ (గుండ్రముగా చేసే నాట్యము,

రసోల్లాసమును కలిగించేది) ను ప్రారంభించెను. వారు ఒకరి చేతులను మరియొకరు పట్టుకొనిరి.

రాసోత్సవస్సంప్రవృత్తో గోపీమండలమండితః ।
యోగేశ్వరేణ కృష్ణేన తాసాం మధ్యే ద్వయోర్ద్వయోః ।
ప్రవిష్టేన గృహీతానాం కంఠే స్వనికటం స్త్రియః ॥ 3
యం మన్యేరన్నభస్తావద్విమానశతసంకులమ్ ।
దివౌకసాం సదారాణామౌత్సుక్యాపహృతాత్మనామ్ ॥ 4

తాసామ్ - వారిలో, ద్వయోః ద్వయోః - ఇద్దరిద్దరి, మధ్యే - మధ్యయందు, ప్రవిష్టేన - ప్రవేశించిన, యోగ-ఈశ్వరేణ - యోగులకు ప్రభువగు, కృష్ణేన - శ్రీకృష్ణునిచే, కంఠే - కంఠమునందు, గృహీతానామ్ - కౌగిలించుకొనబడిన, గోపీమండలమండితః - గోపికల మండలముచే అలంకరించబడిన, రాస-ఉత్సవః - రాసలీల అనే ఉత్సవము, సంప్రవృత్తః - ఆరంభమైనది, స్త్రియః - గోపికలు, యమ్ - ఏ శ్రీకృష్ణుని, స్వనికటమ్ - తమకు దగ్గరగా నున్నవానినిగా, మన్యేరన్ - తలపోయుదురో, తావత్ - అంతలో, నభః - ఆకాశము, సదారాణామ్ - భార్యలతో కూడియున్నట్టియు, ఔత్సుక్య-అపహృత-ఆత్మనామ్ - ఉత్కంఠచే అపహరించబడిన మనస్సులు గల, దివ-ఓకసామ్ - స్వర్గవాసుల, విమానశతసంకులమ్ - విమానముల వందలచే రద్దీగా నున్నది.

శ్రీకృష్ణుడు మండలాకారముగా నిలబడిన గోపికలే అలంకారము కాగా రాసలీల అనే ఉత్సవమునారంభించెను. యోగమాయకు ప్రభుడగు శ్రీకృష్ణుడు వారిలో ఇద్దరిద్దరి మధ్య ప్రవేశించి వారిని కంఠమునందు కౌగిలించెను. ప్రతి గోపికకు శ్రీకృష్ణుడు తన ప్రక్కనే కానవచ్చెను. స్వర్గవాసులగు దేవతలు ఉత్కంఠతో పరవశమైన మనస్సులు గలవారై భార్యలతో సహా వచ్చిరి. వారి విమానములతో ఆకాశము రద్దీగా నుండెను.

తతో దుందుభయో నేదుర్నిపేతుః పుష్పవృష్టయః ।
జగుర్గంధర్వపతయస్సస్త్రీకాస్తద్యశోఽమలమ్ ॥ 5

తతః - అప్పుడు, దుందుభయః - దుందుభులు, నేదుః - మ్రోగినవి, పుష్పవృష్టయః - పూలవానలు, నిపేతుః - పడినవి, సస్త్రీకాః - అప్సరసలతో కూడియున్న, గంధర్వపతయః - గంధర్వనాయకులు, అమలమ్ - పవిత్రమైన, తద్-యశః - ఆ శ్రీకృష్ణుని కీర్తిని, జగుః - పాడిరి.

అప్పుడు దేవదుందుభులు మ్రోగి పూల వానలు కురిసినవి. గంధర్వనాయకులు అప్సరసలతో కూడి ఆ శ్రీకృష్ణుని నిర్మలమైన కీర్తిని గానము చేసిరి.

వలయానాం నూపురాణాం కింకిణీనాం చ యోషితామ్ ।
సప్రియాణామభూచ్ఛబ్దస్తుములో రాసమండలే ॥ 6

రాసమండలే - రాసక్రీడయొక్క వలయమునందు, సప్రియాణామ్ - ప్రియుడగు శ్రీకృష్ణునితో కూడిన, యోషితామ్ - గోపికలయొక్క, వలయానామ్ - కంకణములయొక్క, నూపురాణామ్ - కాలియందెలయొక్క, కింకిణీనాం చ - వడ్డాణపు చిరుగంటలయొక్క, శబ్దః - శబ్దము, తుములః - సంకులము, అభూత్ - ఆయెను.

రాసక్రీడయొక్క వలయమునందు ప్రియుడగు శ్రీకృష్ణునితో కూడి గోపికలు నాట్యము చేసిరి. వారి కంకణములు, కాలియందెలు, వడ్డాణముల చిరుగంటలు సంకులమగు ధ్వనిని చేసినవి.

తత్రాతిశుశుభే తాభిర్భగవాన్ దేవకీసుతః ।
మధ్యే మణీనాం హైమానాం మహామరకతో యథా ॥ 7

తత్ర - అచట, దేవకీసుతః - దేవకి పుత్రుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తాభిః - వారితో, హైమానామ్ - బంగరు రంగు గల, మణీనామ్ - మణుల, మధ్యే - మధ్యయందు, మహామరకతః యథా - పెద్ద నీలమణి వలె, అతిశుశుభే - అతిశయించి శోభిల్లెను.

**దేవకి పుత్రుడగు శ్రీకృష్ణ భగవానుడు ఆ రాసమండలమునందు ఆ గోపికలతో గూడి, హారములో బంగరు రంగు గల మణుల మధ్యలో పెద్ద నీలమణి వలె, అతిశయించి శోభిల్లెను.**

పాదన్యాసైర్భుజవిధుతిభిస్సస్మితైర్భ్రూవిలాసైః
భజ్యన్మధ్యైశ్చలకుచపటైః కుండలైర్గండలోలైః ।
స్విద్యన్ముఖ్యః కబరరశనాగ్రంథయః కృష్ణవధ్వో
గాయంత్యస్తం తడిత ఇవ తా మేఘచక్రే విరేజుః ॥ 8

పాదన్యాసైః - అడుగుల వేయుటలచే, భుజవిధుతిభిః - చేతుల కదలికలతో, సస్మితైః - చిరునవ్వుతో కూడిన, భ్రూవిలాసైః - కనుబొమల విరుపులతో, భజ్యత్-మధ్యైః - విరిగినవా యనిపించే నడుములతో, చలకుచపటైః - చంచలమైన పై కొంగులతో, గండలోలైః - చెక్కిళ్లయందు కదలాడే, కుండలైః - కుండలములతో, స్విద్యత్-ముఖ్యః - చెమట పట్టిన ముఖములు గలవారు, కబరరశనాగ్రంథయః - జుట్టునందు కాంచియందు ముడులు గలవారు అగు, కృష్ణవధ్వః - శ్రీకృష్ణుని ప్రేమించే, తాః - ఆ గోపికలు, తమ్ - ఆయనను గురించి, గాయంత్యః - గానము చేయుచున్నవారై, మేఘచక్రే - మేఘముల సమూహమునందు, తడితః ఇవ - మెరుపులు వలె, విరేజుః - అధికముగా ప్రకాశించిరి.

శ్రీకృష్ణుని ప్రేమించే ఆ గోపికలు అడుగులను వేస్తూ, చేతులను త్రిప్పుతూ, చిరునవ్వుతో కనుబొమలను విరుస్తూ నాట్యమును చేయుచుండిరి. వారి నడుములు విరిగినవా యన్నట్లు వంగుచుండెను. వారి పై కొంగులు ఎగురుచుండగా కదలాడే కుండలములు చెక్కిళ్లపై ప్రకాశించెను. వారు జుట్టును, కాంచిని గట్టిగా ముడివేసుకొని నాట్యము చేస్తూంటే ముఖముపై చెమట పొడసూపెను. వారు కృష్ణుని కీర్తిని గానము చేస్తూ, మేఘముల గుంపులో మెరుపుల వలె అధికముగా శోభిల్లిరి.

ఉచ్చైర్జగుర్నృత్యమానా రక్తకంఠ్యో రతిప్రియాః ।
కృష్ణాభిమర్శముదితా యద్గీతేనేదమావృతమ్ ॥ 9

నృత్యమానాః - 'నాట్యము చేయుచున్నవారు, రక్తకంఠ్యః - ఎఱ్ఱని కంఠములు గలవారు, రతిప్రియాః - విహారమును ప్రేమించువారు, కృష్ణ-అభిమర్శనముదితాః - శ్రీకృష్ణుని స్పర్శచే ఆనందించువారు అగు గోపికలు, ఉచ్చైః - బిగ్గరగా, జగుః - గానము చేసిరి, యద్-గీతేన - ఎవరి గానముచే, ఇదమ్ - ఈ రాసమండలము, ఆవృతమ్ - ఆవరించబడినదో.

ఎఱ్రని కంఠము గల గోపికలకు విహారమంటే ప్రీతి. వారు నాట్యము చేస్తూ బిగ్గరగా గానము చేసిరి. శ్రీకృష్ణుని స్పర్శచే వారికి ఆనందము కలిగెను. వారి గానముతో రాసమండలము ప్రతిధ్వనించెను.

కాచిత్సమం ముకుందేన స్వరజాతీరమిశ్రితాః ।
ఉన్నిన్యే పూజితా తేన ప్రీయతా సాధు సాధ్వితి ।
తదేవ ధ్రువమున్నిన్యే తస్యై మానం చ బహ్వదాత్ ॥ 10

కాచిత్ - ఒక గోపిక, ముకుందేన సమమ్ - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణునితో గూడి, అమిశ్రితాః - సంకీర్ణము కాని, స్వరజాతీః - రాగముల ఆలాపనగతులను, ఉన్నిన్యే - హెచ్చు స్వరముతో గానము చేసెను, ప్రీయతా - ప్రీతిని పొందిన, తేన - ఆయనచే, సాధు - బాగు, సాధు - బాగు, ఇతి - అని, పూజితా - కొనియాడబడినది, తద్ ఏవ - అదే రాగాలాపనను, ధ్రువమ్ - ధ్రువతాళమును, ఉన్నిన్యే - హెచ్చు స్వరముతో పాడెను, తస్యై చ - ఆమె కొరకు, బహు - అధికమగు, మానమ్ - పొగడ్తను, అదాత్ - ఇచ్చెను.

ఒక గోపిక మోక్షప్రదాతయగు శ్రీకృష్ణునితో కలిపి పాడెను. కాని ఆమె తన రాగముల ఆలాపన గతులు శ్రీకృష్ణుని రాగముతో కలిసిపోకుండా హెచ్చు స్వరముతో గానము చేసెను. అపుడాయన సంతోషించి, బాగు బాగు అని ప్రశంసించెను. ఇంకో గోపిక అదే హెచ్చు స్వరముతో ధ్రువ తాళమును పాడెను. ఆయన ఆమెను కూడ అధికముగా కొనియాడెను.

కాచిద్రాసపరిశ్రాంతా పార్శ్వస్థస్య గదాభృతః ।
జగ్రాహ బాహునా స్కంధం శ్లథద్వలయమల్లికా ॥ 11

రాసపరిశ్రాంతా - రాసక్రీడచే అలసిపోయినది, శ్లథద్-వలయమల్లికా - జారిపోవుచున్న కంకణములు మల్లె పూలు గలది అగు, కాచిత్ - ఒకానొక గోపిక, పార్శ్వస్థస్య - ప్రక్కనున్న, గదాభృతః - శ్రీకృష్ణ భగవానుని, స్కంధమ్ - భుజమును, బాహునా - చేతితో, జగ్రాహ - పట్టుకొనెను.

ఇంకో గోపిక రాసక్రీడచే అలసిపోయెను. ఆమె చేతినుండి కంకణములు, జుట్టునుండి మల్లె పూలు జారిపోవుచుండెను. ఆమె ప్రక్కనే ఉన్న వేణుధారియగు శ్రీకృష్ణ భగవానుని భుజమును చేతితో పట్టుకొనెను.

తత్రైకాంసగతం బాహుం కృష్ణస్యోత్పలసౌరభమ్ ।
చందనాలిప్తమాఘ్రాయ హృష్టరోమా చుచుంబ హ ॥ 12

తత్ర - వారిలో, ఏకా - ఒకామె, అంసగతమ్ - భుజముపైనున్నట్టియు, ఉత్పలసౌరభమ్ - కలువయొక్క పరిమళమువంటి పరిమళము కలిగిన, చందన-ఆలిప్తమ్ - గంధముచే అంతటా అలదబడిన, కృష్ణస్య - శ్రీకృష్ణుని, బాహుమ్ - చేతిని, ఆఘ్రాయ - ఆఘ్రాణించి, హృష్టరోమా - నిక్కబొడుచుకున్న రోమములు గలదై, చుచుంబ హ - ముద్దాడెను.

వారిలో ఒకామె తన భుజముపైనున్న శ్రీకృష్ణుని చేతిని ఆఘ్రాణించి ముద్దాడి రోమాంచమును పొందెను. కలువల సుగంధము గల ఆ చేయి అంతటా చందనము అలదబడి యుండెను.

కస్యాశ్చిన్నాట్యవిక్షిప్తకుండలత్విషమండితమ్ ।
గండం గండే సందధత్యా అదాత్తాంబూలచర్వితమ్ ॥ 13

నాట్యవిక్షిప్తకుండలత్విషమండితమ్ - నాట్యముచే కదలాడే కుండలముల కాంతిచే అలంకరించబడిన, గండమ్ - చెక్కిలిని, గండే - చెక్కిలియందు, సందధత్యాః - ఆనించే, కస్యాశ్చిత్ - ఒకానొక గోపికకు, తాంబూలచర్వితమ్ - తాంబూలచర్వితమును, అదాత్ - ఇచ్చెను.

ఒకామె నాట్యము చేస్తూంటే కదలాడే కుండలముల కాంతియే చెక్కిలికి అలంకారమాయెను. ఆమె ఆ చెక్కిలిని తన చెక్కిలికి ఆనించగా, శ్రీకృష్ణుడామెకు తాంబూలచర్వితమునిచ్చెను.

నృత్యంతీ గాయతీ కాచిత్కూజన్నూపురమేఖలా ।
పార్శ్వస్థాచ్యుతహస్తాబ్జం శ్రాంతాఽధాత్ స్తనయోశ్శివమ్ ॥ 14

నృత్యంతీ - నాట్యము చేయుచున్నది, గాయతీ - పాడుచున్నది, కూజత్-నూపురమేఖలా - శబ్దము చేయుచున్న కాలియందెలు కాంచి

గలది అగు, కాచిత్ - ఒక గోపిక, శ్రాంతా - అలసినదై, శివమ్ - సుఖకరమైన, పార్శ్వస్థ-అచ్యుతహస్త-అబ్జమ్ - ప్రక్కనే ఉన్న శ్రీకృష్ణుని పద్మమువంటి చేతిని, స్తనయోః - స్తనములపై, అధాత్ - ఉంచెను.

ఒక గోపిక కాలియందెలు, కాంచి ధ్వని చేయునట్లుగా నాట్యము చేసి పాడి అలసిపోయెను. ఆమె తన ప్రక్కనే ఉన్న శ్రీకృష్ణ భగవానుని పద్మమువంటి సుఖకరమైన చేతిని తన వక్షఃస్థలముపై ఉంచుకొనెను.

గోప్యో లబ్ధ్వాఽచ్యుతం కాంతం శ్రియ ఏకాంతవల్లభమ్ ।
గృహీతకంఠ్యస్తద్దోర్భ్యాం గాయంత్యస్తం విజహ్రిరే ॥ 15

గోప్యః - గోపికలు, కాంతమ్ - ప్రియుడైనట్టియు, శ్రియః - లక్ష్మీదేవికి, ఏకాంతవల్లభమ్ - అతిప్రియుడగు, అచ్యుతమ్ - శ్రీకృష్ణ భగవానుని, లబ్ధ్వా - పొంది, తద్-దోర్భ్యామ్ - ఆయనయొక్క రెండు చేతులచే, గృహీతకంఠ్యః - పట్టుకొనబడిన కంఠములు గలవారై, తమ్ - ఆయనను, గాయంత్యః - గానము చేయువారై, విజహ్రిరే - విహరించిరి.

లక్ష్మీదేవికి మిక్కిలి ప్రియుడగు శ్రీకృష్ణ భగవానుని ప్రియునిగా పొందిన గోపికలు ఆయన కీర్తిని గానము చేస్తూ విహరించిరి. ఆయన తన రెండు చేతులతో వారిని కంఠములయందు కౌగిలించెను.

కర్ణోత్పలాలకవిటంకకపోలఘర్మ-
వక్త్రశ్రియో వలయనూపురఘోషవాద్యైః ।
గోప్యస్సమం భగవతా ననృతుస్స్వకేశ-
స్రస్తస్రజో భ్రమరగాయకరాసగోష్ఠ్యామ్ ॥ 16

కర్ణ-ఉత్పల-అలకవిటంకకపోలఘర్మవక్త్రశ్రియః - చెవులయందలి కలువలచే ముంగురులచే అలంకరించబడిన చెక్కిళ్లచే చెమట బిందువులచే ముఖమునందు శోభ గలవారు, స్వకేశస్రస్తస్రజః - తమ కేశములనుండి జారిన మాలలు గలవారు అగు, గోప్యః - గోపికలు, భగవతా సమమ్ - శ్రీకృష్ణ భగవానునితో గూడి, వలయనూపుర ఘోషవాద్యైః - కంకణములు కాలియందెలు వడ్డాణముల చిరుగంటలు

అనే వాద్యములతో, భ్రమరగాయకరాసగోష్ఠ్యామ్ - తుమ్మెదలు పాటగాళ్లుగా గల రాససభయందు, ననృతుః - నాట్యము చేసిరి.

చెవులయందు కలువలను పెట్టుకొని గోపికలు శ్రీకృష్ణభగవానునితో గూడి రాససభయందు నాట్యము చేసిరి. ముంగురులే అలంకారములైన చెక్కిళ్లయందలి చెమట బిందువులతో వారి ముఖములు శోభిల్లెను. కంకణములు, కాలియందెలు, వడ్డాణముల చిరుగంటలు ఆ నాట్యమునకు వాద్యములు కాగా, తుమ్మెదలే పాటగాళ్లు ఆయెను. ఇట్లు వారు నాట్యమాడుచుండ, వారి కేశములయందలి మాలలు జారిపోవుచుండెను.

ఏవం పరిష్వంగకరాభిమర్శస్నిగ్ధేక్షణోద్దామవిలాసహాసైః ।
రేమే రమేశో వ్రజసుందరీభిర్యథాఽర్భకస్స్వప్రతిబింబవిభ్రమః ॥ 17

ఏవమ్ - ఈ విధముగా, రమా-ఈశః - లక్ష్మీపతియగు శ్రీకృష్ణుడు, పరిష్వంగకర-అభిమర్శస్నిగ్ధ-ఈక్షణ-ఉద్దామవిలాసహాసైః - ఆలింగనము చేతులతో స్పృశించుట ప్రేమతో చూచుట గొప్ప విలాస చిరునవ్వులతో, వ్రజసుందరీభిః - గోకులమునందలి సుందరయువతులతో, స్వప్రతిబింబవిభ్రమః - తన ప్రతిబింబములతో ఆట గల, అర్భకః యథా - పిల్లవాడు వలె, రేమే - రమించెను.

ఈ విధముగా లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుడు గోకులమునందలి సుందరయువతులతో కలిసి క్రీడించెను. పిల్లవాడు తన ప్రతిబింబములతో ఆడుకున్నట్లుగా, ఆయన (నిర్వికారముగా) వారిని కౌగిలించి చేతులతో స్పృశించి ప్రేమతో చూస్తూ గొప్ప విలాసను ప్రకటిస్తూ నవ్వుచుండెను.

తదంగసంగప్రముదాఽఽకులేంద్రియాః
కేశాన్ దుకూలం కుచపట్టికాం వా ।
నాంజః ప్రతివ్యోఢుమలం వ్రజస్త్రియో
విస్రస్తమాలాఽఽభరణాః కురూద్వహ ॥ 18

కురు-ఉద్వహ - ఓ కురువంశశ్రేష్ఠా!, తద్-అంగసంగప్రముదా - ఆయనయొక్క శరీరముతోడి కలయిక వలన కలిగిన గొప్ప ఆనందముతో, ఆకుల-ఇంద్రియాః - పరవశమైన ఇంద్రియములు గలవారు,

విస్రస్తమాలా-ఆభరణాః - జారిపోయిన మాలలు ఆభరణములు గలవారు అగు, వ్రజస్త్రియః - గోకులయువతులు, కేశాన్ - కేశములను, దుకూలమ్ - కోకను, కుచపట్టికాం వా - కంచుకమునైననూ, అంజః - సమగ్రముగా, ప్రతివ్యోఢుమ్ - సర్దుకొనుటకు, అలం న - సమర్థులు కాలేదు.

ఓ పరీక్షిన్మహారాజా! నీవు కురువంశీయులలో శ్రేష్ఠుడవు. ఆ శ్రీకృష్ణుని దేహముతోడి కలయిక వలన మహానందముతో గోకులమునందలి యువతుల ఇంద్రియములు పరవశమయ్యెను. వారి పుష్పమాలలు, ఆభరణములు జారిపోవుచుండెను. వారు జుట్టును, కోకను, కంచుకమునైననూ సరిగ్గా సర్దుకొనజాలరైరి.

కృష్ణవిక్రీడితం వీక్ష్య ముముహుః ఖేచరస్త్రియః ।
కామార్దితాశ్శశాంకశ్చ సగణో విస్మితోఽభవత్ ॥ 19

కృష్ణవిక్రీడితమ్ - శ్రీకృష్ణుని విహారమును, వీక్ష్య - చూచి, ఖేచరస్త్రియః - ఆకసమునందు సంచరించే దేవతల భార్యలు, కామ-అర్దితాః - కామనచే పీడితులైనవారు, సగణః - నక్షత్రగణములతో కూడిన, శశాంకః చ - చంద్రుడు కూడ, విస్మితః - ఆశ్చర్యపడినవాడు, అభవత్ - ఆయెను.

శ్రీకృష్ణుని విహారమును చూచి ఆకసమునందు సంచరించే దేవతల భార్యలు కామనచే పీడించబడిరి. నక్షత్రముల గుంపులతో కూడిన చంద్రుడు కూడ ఆశ్చర్యమును పొందెను.

కృత్వా తావంతమాత్మానం యావతీర్గోపయోషితః ।
రేమే స భగవాంస్తాభిరాత్మారామోఽపి లీలయా ॥ 20

గోపయోషితః - గోపికలు, యావతీః - ఎంతమందియో, తావంతమ్ - అంతమందినిగా, ఆత్మానమ్ - తనను, లీలయా - యోగమాయచే, కృత్వా - ప్రకటించి, సః - ఆ, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఆత్మారామః అపి - తనయందే రమించువాడే అయిననూ, తాభిః - వారితో, రేమే - విహరించెను.

ఆ శ్రీకృష్ణ భగవానుడు తనయందే రమించువాడు (పూర్ణుడు). అయిననూ, గోపికలెంతమంది గలరో అంతమందిగా యోగమాయచే తానే ప్రకటమై వారితో విహరించెను.

తాసామతివిహారేణ శ్రాంతానాం వదనాని సః ।
ప్రామృజత్కరుణః ప్రేమ్ణా శంతమేనాంగ పాణినా ॥ 21

అంగ - ఓయీ!, అతివిహారేణ - అధికమగు విహారముచే, శ్రాంతానామ్ - అలసిన, తాసామ్ - వారియొక్క, వదనాని - ముఖములను, కరుణః - దయాళువగు, సః - ఆ శ్రీకృష్ణుడు, ప్రేమ్ణా - ప్రేమతో, శంతమేన - మిక్కిలి సుఖకరమగు, పాణినా - చేతితో, ప్రామృజత్ - తుడిచెను.

ఓ పరీక్షిన్మహారాజా! అధికమగు విహారముచే ఆ గోపికలు అలసిపోయిరి. అప్పుడు కరుణామయుడగు ఆ శ్రీకృష్ణుడు మిక్కిలి సుఖకరమగు తన చేతితో వారి ముఖములను ప్రేమతో తుడిచెను.

గోప్యస్స్ఫురత్పురటకుండలకుంతలత్విడ్-
గండశ్రియా సుధితహాసనిరీక్షణేన ।
మానం దధత్య ఋషభస్య జగుః కృతాని
పుణ్యాని తత్కరరుహస్పర్శప్రమోదాః ॥ 22

తత్-కరరుహస్పర్శప్రమోదాః - ఆ శ్రీకృష్ణుని చేతి గోళ్ల స్పర్శచే గొప్ప ఆనందము గల, గోప్యః - గోపికలు, స్ఫురత్-పురటకుండలకుంతల త్విడ్-గండశ్రియా - ప్రకాశించే (కదలాడే) బంగరు కుండలముల మరియు ముంగురుల కాంతిచే చెక్కిళ్లయందలి శోభచే, సుధితహాసనిరీక్షణేన - అమృతమువంటి చిరునవ్వుతో కూడిన చూపుతో, ఋషభస్య - పురుష శ్రేష్ఠుడగు శ్రీకృష్ణునకు, మానమ్ - సమ్మానమును, దధత్యః - చేయుచున్నవారై, పుణ్యాని - పావనములైన, కృతాని - లీలలను, జగుః - పాడిరి.

శ్రీకృష్ణుని చేతి గోళ్ల స్పర్శచే గోపికలకు గొప్ప ఆనందము కలిగెను. వారా పురుషశ్రేష్ఠునకు ప్రకాశిస్తూ కదలాడే బంగరు కుండలముల మరియు ముంగురుల కాంతి గల చెక్కిళ్ల శోభతో, మరియు

అమృతమువంటి చిరునవ్వుతో కూడిన చూపులతో సమ్మానమును చేసిరి. అపుడు వారు పావనములగు ఆయన లీలలను గానము చేసిరి.

తాభిర్యుతశ్శ్రమమపోహితుమంగసంగ-
ఘృష్టస్రజస్స కుచకుంకుమరంజితాయాః ।
గంధర్వపాలిభిరనుద్రుత ఆవిశద్వాః
శ్రాంతో గజీభిరిభరాడివ భిన్నసేతుః ॥ 23

కుచకుంకుమరంజితాయాః - వక్షఃస్థలమునందలి కుంకుమచే ఎఱ్ఱనైన, అంగసంగఘృష్టస్రజః - దేహముల కలయికచే నలిగిపోయిన మాలకు చెందిన, గంధర్వప-అలిభిః - గంధర్వనాయకులవంటి తుమ్మెదలచే, అనుద్రుతః - వెంబడించబడినవాడు, శ్రాంతః - అలసినవాడు అగు, సః - ఆ శ్రీకృష్ణుడు, తాభిః - ఆ గోపికలతో, యుతః - కూడినవాడై, శ్రమమ్ - శ్రమను, అపోహితుమ్ - పోగొట్టుకొనుటకు, వాః - నీటిని, భిన్నసేతుః - పగులగొట్టబడిన ఒడ్లు గల, ఇభరాట్ - గజేంద్రుడు, గజీభిః ఇవ - ఆడు యేనుగులతో వలె, ఆవిశత్ - ప్రవేశించెను.

అలసిన ఆ శ్రీకృష్ణుడు శ్రమను పోగొట్టుటకొనుటకై ఆ గోపికలతో కూడి యమునానదియందు ప్రవేశించెను. వక్షఃస్థలమునందలి కుంకుమచే ఎఱ్ఱనై దేహముల కలయికచే నలిగిపోయిన వనమాల చుట్టూ తిరుగాడే తుమ్మెదలు గంధర్వనాయకుల వలె గానము చేస్తూ ఆయనను వెంబడించినవి. ఆయన ఆడు యేనుగులతో కూడి ఒడ్లను పగులగొట్టి నీటిలో ప్రవేశించిన గజేంద్రుని పోలి యుండెను.

సోఽంభస్యలం యువతిభిః పరిషిచ్యమానః
ప్రేమ్ణేక్షితః ప్రహసతీభిరితస్తతోఽంగ ।
వైమానికైః కుసుమవర్షిభిరీడ్యమానో
రేమే స్వయం స్వరతిరత్ర గజేంద్రలీలః ॥ 24

అంగ - ఓ రాజా!, అత్ర - ఈ, అంభసి - నీటియందు, ప్రహసతీభిః - బిగ్గరగా నవ్వుచున్న, యువతిభిః - గోపికలచే, అలమ్ - అధికముగా, ఇతః తతః - ఇటునటు, పరిషిచ్యమానః - నీరు చల్లబడుచున్నవాడు, ప్రేమ్ణా -

ప్రేమతో, ఈక్షితః - చూడబడువాడు, కుసుమవర్షిభిః - పూలను వర్షించే, వైమానికైః - విమానములయందలి దేవతలచే, ఈడ్యమానః - కొనియాడబడువాడు, స్వయమ్ - తాను, స్వరతిః - తనయందు రమించువాడు అగు, సః - ఆ శ్రీకృష్ణుడు, గజ-ఇంద్రలీలః - గజేంద్రుని లీలవంటి లీల గలవాడై, రేమే - క్రీడించెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ నీటియందు బిగ్గరగా నవ్వే గోపికలు ఆయనను ప్రేమతో చూస్తూ ఇటునటు నీళ్లను అధికముగా చల్లుచుండిరి. విమానములయందలి దేవతలు పూల వానలను కురిపిస్తూ ఆయనను స్తుతించుచుండిరి. ఆత్మారాముడు, పూర్ణుడు అగు ఆ శ్రీకృష్ణుడు గజేంద్రుని లీల గలవాడై ఆ యమునానదియందు క్రీడించెను.

తతశ్చ కృష్ణోపవనే జలస్థలప్రసూనగంధానిలజుష్టదిక్తటే,
చచార భృంగప్రమదాగణావృతో యథా మదచ్యుద్ద్విరదః కరేణుభిః।25

చ - మరియు, తతః - తరువాత, జలస్థలప్రసూనగంధ-అనిలజుష్టదిక్-తటే - నీటియందు గట్టు మీద పుష్పముల పరిమళము గల వాయువుచే వ్యాపించబడిన దిక్కుల అంతములు గల, కృష్ణా-ఉపవనే - యమునానదియొక్క ఉద్యానవనమునందు, భృంగప్రమదాగణ-ఆవృతః - తుమ్మెదలచే గోపికల గుంపులచే చుట్టువారబడియున్న శ్రీకృష్ణుడు, మదచ్యుత్ - మదమును స్రవించే, ద్విరదః - ఏనుగు, కరేణుభిః యథా - ఆడు యేనుగులతో వలె, చచార - సంచరించెను.

ఇంతేగాక, జలక్రీడ అయిన పిదప శ్రీకృష్ణుడు యమునానది ఒడ్డున ఉన్న ఉద్యానవనములో, మదమును స్రవించే గొప్ప ఏనుగు ఆడు యేనుగులతో వలె, విహరించెను. తుమ్మెదలే గాక, గోపికల గుంపులు కూడ ఆయనను చుట్టువారి యుండెను. నీటిలోని మరియు గట్టుమీది పువ్వుల సుగంధమును గాలి దిక్కుల అంతముల వరకు వ్యాపింపజేసెను.

ఏవం శశాంకాంశువిరాజితా నిశాస్స సత్యకామోఽనురతాబలాగణః ।
సిషేవ ఆత్మన్యవరుద్ధసౌరతస్సర్వాశ్శరత్కావ్యకథారసాశ్రయాః ।। 26

ఏవమ్ - ఈ విధముగా, సత్యకామః - సత్యసంకల్పుడు, అనురత-అబలాగణః - ప్రేమతో కూడిన గోపికల గణము గలవాడు, ఆత్మని - మనస్సునందు, అవరుద్ధసౌరతః - స్థాపించబడిన హావభావములు గలవాడు అగు, సః - ఆ శ్రీకృష్ణుడు, శశ-అంక-అంశువిరాజితాః - చంద్రుని కిరణములచే ప్రకాశింపజేయబడునట్టియు, శరత్-కావ్యరస-ఆశ్రయాః - శరత్కాలమునకు చెందినట్టియు కావ్యములయందలి రసములకు ఆశ్రయమైన, నిశాః - రాత్రులను, సర్వాః - అన్నింటినీ, సిషేవే - సేవించెను.

సత్యసంకల్పుడగు శ్రీకృష్ణుడు ఈ విధముగా శరత్కాలరాత్రులన్నింటియందు నిరంతరముగా విహరించెను. మనస్సునందు స్థాపించుకున్న హావభావములు గల ఆయనను ప్రేమతో కూడిన గోపికలు గుంపులుగా అనుసరించిరి. కావ్యముల శృంగారహాస్యాది రసములకు ఆలంబన మయ్యే ఆ రాత్రులను చంద్రుడు తన కిరణములతో ఉజ్జ్వలముగా చేసెను.

రాజోవాచ ।
సంస్థాపనాయ ధర్మస్య ప్రశమాయేతరస్య చ ।
అవతీర్ణో హి భగవానంశేన జగదీశ్వరః ॥ 27

ధర్మస్య - ధర్మముయొక్క, సంస్థాపనాయ - చక్కగా స్థాపించుట కొరకు, ఇతరస్య - అధర్మముయొక్క, ప్రశమాయ చ - నివృత్తి కొరకు గూడ, జగద్-ఈశ్వరః - జగన్నాథుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, అంశేన - అంశయగు బలరామునితో గూడి, అవతీర్ణః హి - అవతరించినవాడు గదా!

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ధర్మమును చక్కగా స్థాపించి అధర్మమును నశింప జేయుటకై జగన్నాథుడగు శ్రీకృష్ణ భగవానుడు తన అంశయే అయిన బలరామునితో గూడి అవతరించినాడు గదా!

స కథం ధర్మసేతూనాం వక్తా కర్తాఽభిరక్షితా ।
ప్రతీపమాచరద్బ్రహ్మన్ పరదారాభిమర్శనమ్ ॥ 28

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, ధర్మసేతూనామ్ - ధర్మ మర్యాదలకు, వక్తా - ఉపదేశించువాడు, కర్తా - చేయువాడు, అభిరక్షితా - రక్షించువాడు అగు, సః - ఆ శ్రీకృష్ణుడు, ప్రతీపమ్ - ధర్మవిరుద్ధమగు, పరదార-అభిమర్శనమ్ - ఇతరుని భార్యను స్పృశించుటను, కథమ్ - ఎట్లు, ఆచరత్ - చేసెను?

ఓ మహర్షీ! ఆ శ్రీకృష్ణ భగవానుడు ధర్మమర్యాదలను సృష్టించి, ఉపదేశించి, రక్షించువాడు. ఆయన ధర్మవిరుద్ధముగా ఇతరుని భార్యను స్పృశించుట అనే పనిని ఎట్లు చేసెను?

ఆప్తకామో యదుపతిః కృతవాన్ వై జుగుప్సితమ్ ।
కిమభిప్రాయ ఏతం నస్సంశయం ఛింధి సువ్రత ।। 29

సువ్రత - గొప్ప నియమనిష్ఠలు గల ఓ మహర్షీ!, ఆప్తకామః - పొందబడిన కామనలు గలవాడు, యదుపతిః - యాదవులకు ప్రభువు అగు శ్రీకృష్ణుడు, జుగుప్సితమ్ - ఏవగించుకొనబడిన పనిని, కిమభిప్రాయః - ఏమి అభిప్రాయము గలవాడై, వై - నిశ్చయముగా, కృతవాన్ - చేసినవాడు?, నః - మాయొక్క, ఏతమ్ - ఈ, సంశయమ్ - సంశయమును, ఛింధి - పోగొట్టుము.

సదాచారనిష్ఠుడవగు ఓ మహర్షీ! పూర్ణకాముడగు భగవానుడై యాదవులకు ప్రభువుగా అవతరించి ఏవగించుకొనబడే పనిని చేయుటలో ఆయన అభిప్రాయమేమి? ఈ మా సంశయమును నివారించుడు.

శ్రీశుక ఉవాచ ।
ధర్మవ్యతిక్రమో దృష్ట ఈశ్వరాణాం చ సాహసమ్ ।
తేజీయసాం న దోషాయ వహ్నేస్సర్వభుజో యథా ।। 30

ఈశ్వరాణామ్ - సమర్థులైనవారికి, ధర్మవ్యతిక్రమః - ధర్మమునతిక్రమించుట, సాహసం చ - శాస్త్రవిరుద్ధమగు ఆచరణము కూడ, దృష్టమ్ - కనబడును, సర్వభుజః - సర్వభక్షకుడగు, వహ్నేః యథా - అగ్నికి వలె, తేజీయసామ్ - గొప్ప తేజశ్శాలురకు, దోషాయ - దోషము కొరకు, న - కాదు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- సమర్థులైనవారు ధర్మము నుల్లంఘించి శాస్త్రవిరుద్ధముగా ప్రవర్తించుట మనకు కనబడును. సర్వ భక్షకుడగు అగ్నికి వలె గొప్ప తేజశ్శాలురకు అది దోషమును కలిగించదు.

నైతత్సమాచరేజ్జాతు మనసాఽపి హ్యనీశ్వరః ।
వినశ్యత్యాచరన్మౌఢ్యాద్యథాఽరుద్రోఽబ్ధిజం విషమ్ ॥ 31

అనీశ్వరః - సమర్థుడు కానివాడు, ఏతత్ - ఈ అధర్మమును, జాతు - ఏనాడైననూ, మనసా అపి - మనస్సుతో నైననూ, న హి సమాచరేత్ - చేయనే రాదు, మౌఢ్యాత్ - మూర్ఖత్వము వలన, ఆచరన్ - చేయువాడు, అరుద్రః - రుద్రుడు కానివాడు, అబ్ధిజమ్ - సముద్రమునుండి పుట్టిన, విషం యథా - విషమును వలె, వినశ్యతి - నశించును.

యోగశక్తి లేని అసమర్థుడీ అధర్మమును ఏ నాడైననూ సంకల్పించనే రాదు. మూర్ఖత్వము వలన అధర్మమును చేయువాడు నశించును. రుద్రుడు కానివాడు సముద్రమునుండి పుట్టిన విషమును త్రాగినచో మరణించును.

ఈశ్వరాణాం వచస్సత్యం తథైవాచరితం క్వచిత్ ।
తేషాం యత్స్వవచోయుక్తం బుద్ధిమాంస్తత్సమాచరేత్ ॥ 32

ఈశ్వరాణామ్ - తేజశ్శాలురయొక్క, వచః - మాట, సత్యమ్ - యథార్థము, ఆచరితమ్ - ఆచరణము, క్వచిత్ - ఒకప్పుడు, తథా ఏవ - అదే విధముగా సత్యము, తేషామ్ - వారియొక్క, స్వవచః-యుక్తమ్ - వారి ఉపదేశముతో కూడిన, యత్ - ఏ ఆచరణము గలదో, బుద్ధిమాన్ - బుద్ధిమంతుడు, తత్ - దానిని, సమాచరేత్ - బాగుగా ఆచరించవలెను.

తేజశ్శాలుర ఉపదేశము సత్యము. కాని, వారి ఆచరణము మాత్రము అప్పుడప్పుడు సత్యము కావచ్చును, కాకపోవచ్చును. కాబట్టి వారి ఏ ఆచరణము ఉపదేశమునకు అనుకూలమో దానిని మాత్రమే బుద్ధిమంతుడు అనుసరించవలెను.

**కుశలాచరితేనైషామిహ స్వార్థో న విద్యతే ।**
**విపర్యయేణ వాఽనర్థో నిరహంకారిణాం ప్రభో ॥ 33**

# అథ షట్త్రింశోఽధ్యాయః

## వృషభాసురుని ఉద్ధారము - కంసుడు అక్రూరుని గోకులమునకు పంపుట

శ్రీశుక ఉవాచ ।
అథ తర్హ్యాగతో గోష్ఠమరిష్టో వృషభాసురః ।
మహీం మహాకకుత్కాయః కంపయన్ ఖురవిక్షతామ్ ॥ 1

అథ - తరువాత, తర్హి - అప్పుడు, మహాకకుత్-కాయః - పెద్ద మూపురము దేహము గలవాడు, ఖురవిక్షతామ్ - డెక్కలచే పగులగొట్టబడిన, మహీమ్ - భూమిని, కంపయన్ - కంపింపజేయువాడు, అరిష్టః - అరిష్టుడని పేరు గలవాడు, వృషభ-అసురః - ఎద్దు రూపములోనున్న రాక్షసుడు, గోష్ఠమ్ - గోకులమును గురించి, ఆగతః - వచ్చినవాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణుడు గోకులములో ప్రవేశించిన తరువాత అప్పుడు గోకులమునకు అరిష్టుడనే రాక్షసుడు వచ్చెను. ఆతడు పెద్ద మూపురముతో కూడిన దేహము గల ఎద్దు రూపములో నుండెను. ఆ ఎద్దు డెక్కలతో భూమిని పగులగొడుతూంటే భూమి కంపించెను.

రంభమాణః ఖరతరం పదా చ విలిఖన్మహీమ్ ।
ఉద్యమ్య పుచ్ఛం వప్రాణి విషాణాగ్రేణ చోద్ధరన్ ॥ 2

ఖరతరమ్ - కర్కశముగా, రంభమాణః - రంకె వేయుచున్నవాడు, పదా - కాలితో, మహీం చ - నేలను కూడ, విలిఖన్ - దుమ్ము రేగగొట్టుచున్నవాడు, పుచ్ఛమ్ - తోకను, ఉద్యమ్య - పైకెత్తి, విషాణ-అగ్రేణ - కొమ్ము కొనతో, వప్రాణి చ - మట్టి పెళ్లలను కూడ, ఉద్ధరన్ - పైకి ఎత్తుచున్నవాడు.

కడిగివేయబడిన సకలకర్మల బంధములు గల, మునయః అపి - జ్ఞానులు కూడ, స్వైరమ్ - యథేచ్ఛగా, చరంతి - సంచరించెదరో, న నహ్యమానాః - బంధమును పొందువారు కారో, ఇచ్ఛయా - తన ఇచ్ఛచే, ఆత్తవపుషః - పొందబడిన శరీరము గల, తస్య - ఆ శ్రీహరికి, బంధః - కర్మబంధము, కుతః ఏవ - ఎందువలన?

సాధకులు ఆ ఈశ్వరుని పద్మములవంటి పాదముల ధూళిని సేవించి (శరణాగతి చేసి) తృప్తి (భోగకాంక్షలనుండి నివృత్తి) ని చెందెదరు. వారు కర్మయోగముయొక్క మహిమచే సకలకర్మల బంధములను కడిగి వేయుదురు. వారైననూ యథేచ్ఛగా సంచరించి బంధమును పొందరు. అట్టిచో, తన ఇచ్ఛచే దేహమును స్వీకరించిన శ్రీహరికి కర్మబంధము ఎందువలన కలుగును? (కలుగదు).

గోపీనాం తత్పతీనాం చ సర్వేషామేవ దేహినామ్ ।
యోఽంతశ్చరతి సోఽధ్యక్షః క్రీడనేనేహ దేహభాక్ ॥ 36

గోపీనామ్ - గోపికలకు, తత్-పతీనాం చ - వారి భర్తలకు కూడ, సర్వేషామ్ - అందరు, దేహినాం ఏవ - ప్రాణులకు కూడ, యః - ఏ భగవానుడైతే, అంతః - లోపల, చరతి - నియంత్రించుచున్నాడో, సః - ఆ, అధ్యక్షః - సకలబుద్ధిసాక్షియగు ఈశ్వరుడు, క్రీడనేన - లీల కారణముగా, ఇహ - ఈ లోకమునందు, దేహభాక్ - దేహమును పొందువాడు.

సకలబుద్ధిసాక్షియగు పరమేశ్వరుడు గోపికలకు, వారి భర్తలకు మాత్రమే గాక, సకలప్రాణులకు కూడ అంతర్యామియై ఉన్నాడు. ఆయన ఈ లోకములో తన లీలలను ప్రకటించుటకై దేహమును స్వీకరించినాడు.

అనుగ్రహాయ భూతానాం మానుషం దేహమాస్థితః ।
భజతే తాదృశీః క్రీడా యాశ్శ్రుత్వా తత్పరో భవేత్ ॥ 37

భూతానామ్ - ప్రాణుల, అనుగ్రహాయ - అనుగ్రహము కొరకు, మానుషమ్ - మానవజాతికి చెందిన, దేహమ్ - దేహమును, ఆస్థితః - స్వీకరించినవాడు, తాదృశీః - అటువంటి, క్రీడాః - లీలలను, భజతే -

చేయును, యాః - వేటిని, శ్రుత్వా - విని, తత్-పరః - ఆ ఈశ్వరునియందు లగ్నమైనవాడు, భవేత్ - అగునో.

పరమేశ్వరుడు ప్రాణులననుగ్రహించుటకై మానవదేహమును దాల్చినాడు గనుక, ఆ దేహమునకు తగ్గ లీలలనే ప్రకటించును. ఆ లీలలను విన్న మానవుడు పరమేశ్వరునియందు నిమగ్నుడగును.

నాసూయన్ ఖలు కృష్ణాయ మోహితాస్తస్య మాయయా ।
మన్యమానాస్స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః ।। 38

తస్య - ఆ శ్రీకృష్ణుని, మాయయా - యోగమాయచే, మోహితాః - మోహమును పొందిన, వ్రజ-ఓకసః - గోకులవాసులు, స్వాన్ స్వాన్ - తమ తమ, దారాన్ - భార్యలను, స్వపార్శ్వస్థాన్ - తమ ప్రక్కనే ఉన్నవారినిగా, మన్యమానాః - తలపోయుచున్నవారై, కృష్ణాయ - శ్రీకృష్ణుని కొరకు, న అసూయన్ ఖలు - తప్పులనెన్నలేదు గదా!

గోకులవాసులగు జనులకు శ్రీకృష్ణునియందు దోషబుద్ధి కలుగనే లేదు. ఎందుకంటే, ఆయన యోగమాయచే మోహితులైన వారికి తమ తమ భార్యలు తమ ప్రక్కనే ఉన్నట్లుగా తోచెను.

బ్రహ్మరాత్ర ఉపావృత్తే వాసుదేవానుమోదితాః ।
అనిచ్ఛంత్యో యయుర్గోప్యస్స్వగృహాన్ భగవత్ప్రియాః ।। 39

బ్రహ్మరాత్రే - బ్రాహ్మముహూర్తము, ఉపావృత్తే - రాగా, వాసుదేవ-అనుమోదితాః - వసుదేవపుత్రుడగు శ్రీకృష్ణునిచే అనుమతి ఈయ (ప్రేరేపించ) బడినవారు, భగవత్-ప్రియాః - భగవానునకు ప్రీతిపాత్రులు అగు, గోప్యః - గోపికలు, అనిచ్ఛంత్యః - ఇష్టము లేనివారై, స్వగృహాన్ - తమ ఇళ్లను గురించి, యయుః - వెళ్లిరి.

ఇంతలో బ్రాహ్మముహూర్తము (తెల్లవారు జాము) ఆయెను. వసుదేవ పుత్రుడగు శ్రీకృష్ణుడు తనకు ప్రీతిపాత్రులగు గోపికలకు అనుమతి నిచ్చెను (ప్రేరేపించెను). ఇచ్ఛ లేకున్ననూ వారు తమ తమ ఇళ్లకు వెళ్లిరి.

విక్రీడితం వ్రజవధూభిరిదం చ విష్ణోః
శ్రద్ధాన్వితోఽనుశృణుయాదథ వర్ణయేద్యః ।
భక్తిం పరాం భగవతి ప్రతిలభ్య కామం
హృద్రోగమాశ్వపహినోత్యచిరేణ ధీరః ॥ 40

విష్ణోః - శ్రీహరియొక్క, వ్రజవధూభిః - గోకులమునందలి గోపికలతో, ఇదమ్ - ఈ, విక్రీడితం చ - లీలను, యః - ఎవడైతే, శ్రద్ధా-అన్వితః - శ్రద్ధతో కూడినవాడై, అను - క్రమముగా, శృణుయాత్ - వినునో, అథ - మరియు, వర్ణయేత్ - వర్ణించునో అట్టివాడు, అచిరేణ - విలంబము లేకుండా, ధీరః - జితేంద్రియుడై, భగవతి - శ్రీహరి భగవానునియందు, పరామ్ - ఉత్కృష్టమగు, భక్తిమ్ - భక్తిని, ప్రతిలభ్య - పొంది, హృద్-రోగమ్ - హృదయమునకు రోగమైన, కామమ్ - కామనను, ఆశు - శీఘ్రముగా, అపహినోతి - త్రోసిపుచ్చును.

శ్రీహరి గోకులమునందలి గోపికలతో కలిసి చేసిన ఈ లీలను ఎవడైతే శ్రద్ధతో గూడి క్రమముగా వినునో, లేదా వర్ణించునో, అట్టివాడు విలంబము లేకుండా జితేంద్రియుడగును. మరియు ఆతడు శ్రీహరి భగవానునిపై నిష్కామమగు భక్తిని పొంది వెంటనే హృదయమునకు రోగమనదగిన కామనను తొలగించుకొనును.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము పూర్వార్ధములో
మహారాసలీలను వర్ణించే ముప్పది మూడవ
అధ్యాయము ముగిసినది (33).

* * * * *

# అథ చతుస్త్రింశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు సుదర్శనుని శంఖచూడుని ఉద్ధరించుట

శ్రీశుక ఉవాచ ।
ఏకదా దేవయాత్రాయాం గోపాలా జాతకౌతుకాః ।
అనోభిరనడుద్యుక్తైః ప్రయయుస్తేఽంబికావనమ్ ॥ 1

ఏకదా - ఒకప్పుడు, దేవయాత్రాయామ్ - మహాదేవుని పూజ కొరకై చేసే యాత్రయందు, జాతకౌతుకాః - పుట్టిన ఉత్సాహము గల, తే - ఆ, గోపాలాః - గోపాలకులు, అనడుద్-యుక్తైః - ఎద్దులు పూన్చిన, అనోభిః - బళ్లతో, అంబికావనమ్ - అంబికావనమును గురించి, ప్రయయుః - వెళ్లిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు చెప్పెను --- ఒకప్పుడు (శివరాత్రి) మహాదేవుని పూజకై యాత్రను చేయాలనే ఉత్సాహము ఆ గోపాలకులకు కలిగెను. వారు బళ్లకు ఎద్దులను పూన్చి అంబికావనము అనే క్షేత్రమునకు వెళ్లిరి.

తత్ర స్నాత్వా సరస్వత్యాం దేవం పశుపతిం విభుమ్ ।
ఆనర్చురర్హణైర్భక్త్యా దేవీం చ నృపతేఽంబికామ్ ॥ 2

నృపతే - ఓ రాజా!, తత్ర - అచట, సరస్వత్యామ్ - సరస్వతీనదియందు, స్నాత్వా - స్నానము చేసి, విభుమ్ - సర్వ వ్యాపకుడైనట్టియు, పశుపతిమ్ - జీవులకు అధీశ్వరుడగు, దేవమ్ - మహా దేవుని, అంబికామ్ - జగన్మాతయగు, దేవీం చ - పార్వతీదేవిని కూడ, భక్త్యా - భక్తితో, అర్హణైః - ఉపహారములతో, ఆనర్చుః - పూజించిరి.

ఓ పరీక్షిన్మహారాజా! అచట వారు సరస్వతీనదిలో స్నానము చేసిరి. వారు సర్వవ్యాపకుడు, జీవులకు అధీశ్వరుడు అగు మహాదేవునకు, జగన్మాతయగు పార్వతీదేవికి భక్తితో ఉపహారములనర్పించి పూజించిరి.

గావో హిరణ్యం వాసాంసి మధు మధ్వన్నమాదృతాః ।
బ్రాహ్మణేభ్యో దదుస్సర్వే దేవో నః ప్రీయతామితి ॥ 3

సర్వే - అందరు, ఆదృతాః - ఆదరము గలవారై, దేవః - మహాదేవుడ నః - మన కొరకు, ప్రీయతామ్ - ప్రీతిని జెందుగాక!, ఇతి - అని, గావః గోవులను, హిరణ్యమ్ - బంగారమును, వాసాంసి - వస్త్రములను, మధ - తేనెను, మధు-అన్నమ్ - మధురమైన ఆహారమును, బ్రాహ్మణేభ్యః బ్రాహ్మణుల కొరకు, దదుః - ఇచ్చిరి.

వారందరికి మహాదేవుడు తమ యెడల ప్రీతిని జెందుటయే లక్ష్యము దాని కొరకై వారందరు గోవులను, బంగారమును, వస్త్రములను, తేనెను, మధురమైన ఆహారమును శ్రద్ధతో బ్రాహ్మణులకు దానము చేసిరి.

ఊషుస్సరస్వతీతీరే జలం ప్రాశ్య ధృతవ్రతాః ।
రజనీం తాం మహాభాగా నందసునందకాదయః ॥ 4

ధృతవ్రతాః - దాల్చబడిన వ్రతనిష్ఠ గలవారు, మహాభాగాః - గొప్ప పుణ్యాత్ములు అగు, నందసునందక-ఆదయః - నందుడు సునందుడు మొదలగువారు, జలమ్ - నీటిని, ప్రాశ్య - ఆహారముగా తీసుకొని, సరస్వతీతీరే - సరస్వతి నది ఒడ్డున, తామ్ - ఆ, రజనీమ్ - రాత్రిని, ఊషుః - నివసించిరి.

నందుడు, సునందుడు (నందుని తమ్ముడు) మొదలగు గోపాలకులు గొప్ప పుణ్యాత్ములు. వారు శివరాత్రివ్రతదీక్షను పూని నీటిని మాత్రమే ఆహారముగా తీసుకొని, సరస్వతి నది ఒడ్డున ఆ రాత్రి నివసించిరి.

కశ్చిన్మహానహిస్తస్మిన్ విపినేఽతిబుభుక్షితః ।
యదృచ్ఛయాఽఽగతో నందం శయానమురగోఽగ్రసీత్ ॥ 5

తస్మిన్ - ఆ, విపినే - అడవియందు, మహాన్ - పెద్దది, అతిబుభుక్షితః - చాల ఆకలి గొన్నది అగు, కశ్చిత్ - ఒకానొక, ఉరగః - ప్రాకే జంతువైన, అహిః - పాము, యదృచ్ఛయా - అనుకోకుండా, ఆగతః - వచ్చినదై, శయానమ్ - నిద్రిస్తున్న, నందమ్ - నందుని, అగ్రసీత్ - కరిచెను.

ఆ అంబికావనములో ఒక పెద్ద కొండ చిలువ ఉండెను. అది ఆకలి గొని అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) పాకుతూ (కనబడకుండా) వచ్చి (శివరాత్రి మరునాడు) నిద్రిస్తున్న నందుని పట్టుకొనెను.

స చుక్రోశాహినా గ్రస్తః కృష్ణ కృష్ణ మహానయమ్ ।
సర్పో మాం గ్రసతే తాత ప్రపన్నం పరిమోచయ ॥ 6

అహినా - కొండచిలువచే, గ్రస్తః - పట్టుకొనబడిన, సః - ఆ నందుడు, చుక్రోశ - ఆక్రోశించెను, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, అయమ్ - ఈ, మహాన్ - పెద్ద, సర్పః - పాము, మామ్ - నన్ను, గ్రసతే - మ్రింగుచున్నది, తాత - అబ్బాయి!, ప్రపన్నమ్ - శరణు పొందిన (ఆపదలో పడిన) నన్ను, పరిమోచయ - విడిపించుము.

కొండ చిలువ పట్టుకొనగా ఆ నందుడిట్లు ఆక్రోశించెను -- ఓ శ్రీకృష్ణా! ఓ శ్రీకృష్ణా! ఈ పెద్ద పాము నన్ను మ్రింగుచున్నది. అబ్బాయి! ఆపదలో పడి శరణు వేడిన నన్ను విడిపించుము.

తస్య చాక్రందితం శ్రుత్వా గోపాలాస్సహసోత్థితాః ।
గ్రస్తం చ దృష్ట్వా విభ్రాంతాస్సర్పం వివ్యధురుల్ముకైః ॥ 7

తస్య - ఆయనయొక్క, ఆక్రందితమ్ - ఆక్రందనను, శ్రుత్వా - విని, సహసా - వెంటనే, ఉత్థితాః - నిద్ర లేచిన, గోపాలాః చ - గోపాలకులు కూడ, గ్రస్తమ్ - పట్టుకొనబడిన నందుని, దృష్ట్వా చ - చూచి, విభ్రాంతాః - కంగారు పడినవారై, సర్పమ్ - పామును, ఉల్ముకైః - కాగడాలతో, వివ్యధుః - కొట్టిరి.

ఆయన ఆక్రందనమును విన్న గోపాలకులు కూడ వెంటనే నిద్ర లేచి పాముచే పట్టుకొనబడిన నందుని చూచి కంగారు పడిరి. వారా పామును కాగడా కర్రలతో కొట్టిరి.

అలాతైర్దహ్యమానోఽపి నాముంచత్తమురంగమః ।
తమస్పృశత్పదాఽభ్యేత్య భగవాన్ సాత్వతాం పతిః ॥ 8

అలాతైః - కాగడాలతో, దహ్యమానః అపి - దహించబడుచున్నదే అయిననూ, ఉరంగమః - పాము, తమ్ - ఆ నందుని, న అముంచత్ - విడిచిపెట్టలేదు, సాత్వతామ్ - యాదవులకు, పతిః - ప్రభువగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, అభ్యేత్య - ఎదురుగా వచ్చి, తమ్ - దానిని, పదా - కాలితో, అస్పృశత్ - స్పృశించెను.

కాగడాలతో ఒళ్లు కాలుచున్నా పాము ఆ నందుని విడిచిపెట్టలేదు. అప్పుడు యాదవులకు (సత్త్వగుణప్రధానులగు భక్తులకు) పాలకుడగు శ్రీకృష్ణ భగవానుడు ఎదురుగా వచ్చి దానిని కాలితో తాకెను.

స వై భగవతశ్శ్రీమత్పాదస్పర్శహతాశుభః ।
భేజే సర్పవపుర్హిత్వా రూపం విద్యాధరార్చితమ్ ॥ 9

వై - నిశ్చయముగా, భగవతః - శ్రీకృష్ణ భగవానుని, శ్రీమత్-పాదస్పర్శహత-అశుభః - శోభాయుక్తమగు పాదముయొక్క స్పర్శచే నశింప జేయబడిన పాపములు గల, సః - ఆ పాము, సర్పవపుః - పాము దేహమును, హిత్వా - విడిచిపెట్టి, విద్యాధర-అర్చితమ్ - విద్యాధరులయందు పూజించబడే, రూపమ్ - రూపమును, భేజే - పొందెను.

శ్రీకృష్ణ భగవానుని శోభాయుక్తమగు పాదము తాకుటచే ఆ సర్పము యొక్క పాపములు పూర్ణముగా నశించెను. అది పాము దేహమును విడిచి విద్యాధరులయందు పూజించబడే అందమగు రూపమును పొందెను.

తమపృచ్ఛద్ధృషీకేశః ప్రణతం సముపస్థితమ్ ।
దీప్యమానేన వపుషా పురుషం హేమమాలినమ్ ॥ 10

దీప్యమానేన - వెలిగిపోవుచున్న, వపుషా - దేహముతో, ప్రణతమ్ - నమస్కరించినట్టియు, సముపస్థితమ్ - దగ్గరగా నిలబడినట్టియు, హేమమాలినమ్ - బంగరు మాల గల, తమ్ - ఆ, పురుషమ్ - విద్యాధరుని, హృషీక-ఈశః - ఇంద్రియాంతర్యామియగు శ్రీకృష్ణుడు, అపృచ్ఛత్ - ప్రశ్నించెను.

బంగరు మాల గల ఆ విద్యాధరుడు వెలిగిపోవుచున్న దేహముతో నమస్కరించి దగ్గరకు వచ్చి నిలబెడను. ఇంద్రియాంతర్యామియగు శ్రీకృష్ణ భగవానుడు ఆతనిని ఇట్లు ప్రశ్నించెను.

కో భవాన్ పరయా లక్ష్మ్యా రోచతేఽద్భుతదర్శనః ।
కథం జుగుప్సితామేతాం గతిం వా ప్రాపితోఽవశః ॥ 11

అద్భుతదర్శనః - అచ్చెరువును గొలిపే దర్శనము గల, భవాన్ - నీవు, పరయా - సర్వాతిశాయియగు, లక్ష్మ్యా - శోభతో, రోచతే - ప్రకాశించుచున్నావు, కః - ఎవడవు?, ఏతామ్ - ఈ, జుగుప్సితామ్ - ఏవగించుకొనబడే, గతిమ్ - దశను, ప్రాపితః - పొందించబడినవాడవై, అవశః - పర (కర్మ) వశుడవు, కథం వా - ఎట్లు అయితివి?

నిన్ను చూస్తే ఆశ్చర్యము కలుగుచున్నది. నీవు సర్వోత్కృష్టమగు శోభతో ప్రకాశించుచున్నావు. నీవెవరు? ఈ పాము జన్మ జుగుప్సను కలిగించేది. పర (కర్మ) వశుడవై నీవీ జన్మను పొందుటకు కారణమేమి?

సర్ప ఉవాచ ।
అహం విద్యాధరః కశ్చిత్సుదర్శన ఇతి శ్రుతః ।
శ్రియా స్వరూపసంపత్త్యా విమానేనాచరం దిశః ॥ 12

అహమ్ - నేను, కశ్చిత్ - ఒకానొక, విద్యాధరః - విద్యాధరుడను, సుదర్శనః - సుదర్శనుడు, ఇతి - అని, శ్రుతః - పేరు వడసినవాడను, శ్రియా - సంపదతో, స్వరూపసంపత్త్యా - సౌందర్యసమృద్ధితో, విమానేన - విమానముచే, దిశః - దిక్కులను, అచరమ్ - సంచరించితిని.

సర్పమై ఉండిన విద్యాధరుడిట్లు పలికెను -- నేను ఒక విద్యాధరుడను. సుదర్శనుడని నాకు ప్రసిద్ధి. సంపద, సౌందర్యసమృద్ధి గలవాడనై నేను విమానముపై దిక్కులలో సంచరించితిని.

ఋషీన్ విరూపానంగిరసః ప్రాహసం రూపదర్పితః ।
తైరిమాం ప్రాపితో యోనిం ప్రలబ్ధైస్స్వేన పాప్మనా ॥ 13

రూపదర్పితః - అందముతో గర్వించిన నేను, విరూపాన్ - అందము లేని, అంగిరసః ఋషీన్ - అంగిరసగోత్రీయులగు మహర్షులను, ప్రాహసమ్ - పరిహాసము చేసితిని, ప్రలబ్ధైః - నిందించబడిన, తైః - వారిచే, స్వేన - నాదైన, పాప్మనా - పాపముచే, ఇమామ్ - ఈ, యోనిమ్ - జన్మను, ప్రాపితః - పొందించబడితిని.

అందముతో గర్వించిన నేను అందము లేని అంగిరసగోత్రీయులగు మహర్షులను పరిహాసము చేసితిని. నాచే పరిహసించబడిన ఆ ఋషులు నా పాపమునకు ఫలముగా ఈ జన్మను కలిగించిరి.

శాపో మేఽనుగ్రహాయైవ కృతస్తైః కరుణాత్మభిః ।
యదహం లోకగురుణా పదా స్పృష్టో హతాశుభః ॥ 14

కరుణాత్మభిః - దయాహృదయులగు, తైః - వారిచే, మే - నాకు, అనుగ్రహాయ ఏవ - అనుగ్రహము కొరకు మాత్రమే, శాపః - శాపము, కృతః - చేయబడినది, యత్ - ఏలయన, అహమ్ - నేను, లోకగురుణా - లోకములకు తండ్రియగు తమరిచే, పదా - కాలితో, స్పృష్టః - తాకబడితిని, హత-అశుభః - నశించిన పాపములు గలవాడను.

దయామయులగు ఆ మహర్షులు నన్ను అనుగ్రహించుటకే నాకు శాపమునిచ్చిరి. ఎందుకంటే, జగత్తునకు తండ్రివగు నీవు నన్ను కాలితో తాకగా నా పాపములు నశించినవి.

తం త్వాఽహం భవభీతానాం ప్రపన్నానాం భయాపహమ్ ।
ఆపృచ్ఛే శాపనిర్ముక్తః పాదస్పర్శాదమీవహన్ ॥ 15

అమీవహన్ - పాపములను (దుఃఖములను) పారద్రోలువాడా!, భవభీతానామ్ - సంసారము వలన భయపడునట్టియు, ప్రపన్నానామ్ - శరణు పొందినవారలకు, భయ-అపహమ్ - భయమును పోగొట్టే, త్వా - నిన్ను, పాదస్పర్శాత్ - పాదముయొక్క తాకుట వలన, శాపనిర్ముక్తః - శాపమునుండి విముక్తిని పొందిన, అహమ్ - నేను, ఆపృచ్ఛే - అడిగెదను.

పాపములను, దుఃఖములను పారద్రోలే ఓ శ్రీకృష్ణా! సంసారమునకు భయపడి శరణు జొచ్చినవారి భయమును నీవు పారద్రోలెదవు. నీ

పాదము తాకుటచే నాకు శాపమునుండి విముక్తి కలిగినది. నేను వెళ్లుటకు అనుమతిని అడుగుచున్నాను.

ప్రపన్నోఽస్మి మహాయోగిన్ మహాపురుష సత్పతే ।
అనుజానీహి మాం దేవ సర్వలోకేశ్వరేశ్వర ।। 16

మహాయోగిన్ - ఓ యోగీశ్వరా!, మహాపురుష - ఓ పురుషోత్తమా!, సత్-పతే - సజ్జనులను పాలించువాడా!, దేవ - ఓ దేవా!, సర్వలోక-ఈశ్వర-ఈశ్వర - సకలలోకములకు లోకపాలకులకు ప్రభుడా!, ప్రపన్నః - శరణు పొందినవాడను, అస్మి - అగుచున్నాను, మామ్ - నన్ను, అనుజానీహి - అనుమతినిమ్ము.

ఓ దేవా! నీవు యోగీశ్వరుడవు, పురుషోత్తముడవు. సజ్జనులను పాలించే నీవే సకలలోకములకు, లోకపాలకులకు ప్రభుడవు. నేను నిన్ను శరణు పొందుచున్నాను. నాకు అనుమతినిమ్ము.

బ్రహ్మదండాద్విముక్తోఽహం సద్యస్తేఽచ్యుత దర్శనాత్ ।
యన్నామ గృహ్ణన్నఖిలాన్ శ్రోతౄనాత్మానమేవ చ ।
సద్యః పునాతి కిం భూయస్తస్య స్పృష్టః పదా హి తే ।। 17

అచ్యుత - ఓ అచ్యుతా!, తే - నీ, దర్శనాత్ - దర్శనము వలన, అహమ్ - నేను, సద్యః - వెంటనే, బ్రహ్మదండాత్ - మహర్షుల శాపమునుండి, విముక్తః - విముక్తుడను, యత్-నామ - ఏ నీ నామమును, గృహ్ణన్ - ఉచ్చరించువాడు, అఖిలాన్ - అందరు, శ్రోతౄన్ - వినువారిని, ఆత్మానం ఏవ చ - తనను కూడ, సద్యః - వెంటనే, పునాతి - పవిత్రము చేయునో, తస్య - అట్టి, తే - నీ, పదా - కాలితో, స్పృష్టః - తాకబడితిని, భూయః - గొప్పది, కిమ్ - ఏమి గలదు?

ఓ అచ్యుతా! నీ దర్శనము వలన నేను వెంటనే మహర్షుల శాపమునుండి విముక్తుడనైతిని. నీ నామమునుచ్చరించువాడు శ్రోతలనందరినీ తనను కూడ వెంటనే పావనము చేయును. అట్టి నీ కాలితో నేను స్పృశించబడితిని. ఇంతకంటె గొప్ప భాగ్యమేమి గలదు? (లేదు).

ఇత్యనుజ్ఞాప్య దాశార్హం పరిక్రమ్యాభివంద్య చ ।
సుదర్శనో దివం యాతః కృచ్ఛ్రాన్నందశ్చ మోచితః ॥ 18

ఇతి - అని, దాశార్హమ్ - దశార్హవంశీయుడగు శ్రీకృష్ణుని, అనుజ్ఞాప్య - అనుమతి ఇచ్చునట్లు చేసి, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, అభివంద్య చ - నమస్కారమును కూడ చేసి, సుదర్శనః - సుదర్శనుడు, దివమ్ - స్వర్గమును గురించి, యాతః - వెళ్లినవాడు, నందః చ - నందుడు కూడ, కృచ్ఛ్రాత్ - ఆపదనుండి, మోచితః - విడిపించబడినవాడు.

సుదర్శనుడు ఈ విధముగా దశార్హవంశీయుడగు శ్రీకృష్ణుని అనుమతిని పొంది ఆయనకు ప్రదక్షిణమును, నమస్కారమును కూడ చేసి స్వర్గమునకు వెళ్లెను. నందుడు కూడ ఆపదనుండి విముక్తుడాయెను.

నిశామ్య కృష్ణస్య తదాత్మవైభవం
వ్రజౌకసో విస్మితచేతసస్తతః ।
సమాప్య తస్మిన్నియమం పునర్వ్రజం
నృపాయయుస్తత్కథయంత ఆదృతాః ॥ 19

నృప - ఓ రాజా!, కృష్ణస్య - శ్రీకృష్ణుని, తత్ - ఆ, ఆత్మవైభవమ్ - స్వీయమహిమను, నిశామ్య - చూచి, విస్మితచేతసః - ఆశ్చర్యపడిన మనస్సు గల, వ్రజ-ఓకసః - గోకులవాసులు, తస్మిన్ - ఆ అంబికావనమునందు, నియమమ్ - శివరాత్రివ్రతమును, సమాప్య - ముగించి, తత్ - ఆ వృత్తాంతమును, ఆదృతాః - ఆదరము గలవారై, కథయంతః - చెప్పుకొనుచున్నవారై, తతః - అచటనుండి, పునః - మరల, వ్రజమ్ - గోకులమును గురించి, ఆయయుః - వచ్చిరి.

ఓ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుని ఆ అసాధారణమగు మహిమను చూచి గోకులవాసులు మనస్సులో ఆశ్చర్యమును పొందిరి. వారు ఆ అంబికా వనమునందు శివరాత్రివ్రతమును ముగించుకొని అచటనుండి మరల గోకులమునకు వచ్చిరి. వారు ఆదరముగా ఆ వృత్తాంతమునే చెప్పుకొనిరి.

కదాచిదథ గోవిందో రామశ్చాద్భుతవిక్రమః ।
విజహ్రతుర్వనే రాత్ర్యాం మధ్యగౌ వ్రజయోషితామ్ ॥ 20

అథ - తరువాత, కదాచిత్ - ఒకనాడు, అద్భుతవిక్రమః - అచ్చెరువును గొలిపే పరాక్రమము గల, గోవిందః - గోవిందుడు, రామః చ - బలరాముడు కూడ, వనే - బృందావనమునందు, రాత్ర్యామ్ - రాత్రియందు, వ్రజయోషితామ్ - గోకులయువతుల, మధ్యగౌ - మధ్యనున్నవారై, విజహ్రతుః - విహరించిరి.

తరువాత ఒకనాడు గోవిందుడు మరియు బలరాముడు కూడ బృందావనములో రాత్రియందు గోపికల మధ్యలో ఉండి విహరించిరి. శ్రీకృష్ణుని (రాబోవు) పరాక్రమము అచ్చెరువును గొలుపును.

ఉపగీయమానౌ లలితం స్త్రీజనైర్బద్ధసౌహృదైః ।
స్వలంకృతానులిప్తాంగౌ స్రగ్విణౌ విరజోఽంబరౌ ॥ 21

బద్ధసౌహృదైః - దృఢమైన ప్రేమ గల, స్త్రీజనైః - గోపికలచే, లలితమ్ - లలితముగా, ఉపగీయమానౌ - గానము చేయబడుచున్నవారు, సు-అలంకృత-అనులిప్త-అంగౌ - చక్కగా అలంకరించబడిన చందనమలదబడిన దేహములు గలవారు, స్రగ్విణౌ - మాలలు గలవారు, విరజః-అంబరౌ - స్వచ్ఛమైన వస్త్రములు గలవారు.

దృఢమైన ప్రేమ గల గోపికలు బలరామకృష్ణుల కీర్తిని మనోహరముగా గానము చేయుచుండిరి. వారిద్దరు స్వచ్ఛమగు వస్త్రములను దాల్చి, బాగా అలంకరించుకొని, చందనాదులనలదుకొని వనమాలలను ధరించిరి.

నిశాముఖం మానయంతావుదితోడుపతారకమ్ ।
మల్లికాగంధమత్తాలి జుష్టం కుముదవాయునా ॥ 22

ఉదిత-ఉడుపతారకమ్ - ఉదయించిన నక్షత్రరాజగు చంద్రుడు నక్షత్రములు కలిగినట్టియు, మల్లికాగంధమత్త-అలి - మల్లెల పరిమళముచే మత్తెక్కిన తుమ్మెదలు కలిగినట్టియు, కుముదవాయునా - కలువల గాలిచే, జుష్టమ్ - సేవించబడిన, నిశాముఖమ్ - రాత్రి ఆరంభమును, మానయంతౌ - కొనియాడువారు.

రాత్రి ఆరంభమయ్యెను. నక్షత్రరాజగు చంద్రుడు నక్షత్రములతో కూడి ఉదయించెను. మల్లెల పరిమళముచే తుమ్మెదలు మత్తెక్కి యుండెను.

కలువల మీదనుండి గాలి వీచుచుండెను. ఆ రాత్రియొక్క శోభను బలరామకృష్ణులిద్దరు కొనియాడిరి.

జగతుస్సర్వభూతానాం మనశ్శ్రవణమంగలమ్ ।
తౌ కల్పయంతౌ యుగపత్స్వరమండలమూర్ఛ్ఛితమ్ ॥ 23

తౌ - వారిద్దరు, స్వరమండలమూర్ఛ్ఛితమ్ - స్వరసమూహము యొక్క సంగతులను, యుగపత్ - ఒకేసారి, కల్పయంతౌ - కల్పించు వారై, సర్వభూతానామ్ - సకలప్రాణులకు, మనః-శ్రవణమంగలమ్ - మనస్సునకు చెవులకు సుఖము కలుగునట్లుగా, జగతుః - పాడిరి.

వారిద్దరు స్వరసమూహముయొక్క సంగతులను (ఆరోహ-అవరోహణములను) ఒకేసారి కల్పిస్తూ సకలప్రాణులకు మనస్సునకు, చెవులకు సుఖము కలిగే విధముగా పాడిరి.

గోప్యస్తద్గీతమాకర్ణ్య మూర్ఛ్ఛితా నావిదన్నృప ।
స్రంసద్దుకూలమాత్మానం స్రస్తకేశస్రజం తతః ॥ 24

నృప - ఓ రాజా!, తద్-గీతమ్ - వారిద్దరి పాటను, ఆకర్ణ్య - విని, మూర్ఛ్ఛితాః - మోహమును పొందిన, గోప్యః - గోపికలు, తతః - దాని వలన, స్రంసద్-దుకూలమ్ - జారిపోవుచున్న పై కొంగు కలిగినట్టియు, స్రస్తకేశస్రజమ్ - జారిపోయిన జుట్టునందలి మాల కలిగిన, ఆత్మానమ్ - శరీరమును, న అవిదన్ - తెలియరైరి.

ఓ మహారాజా! వారిద్దరి పాటను విన్న గోపికలకు మోహము కలిగెను. దానిచే వారికి తమ దేహము తమకే తెలియలేదు. జారిపోవుచున్న పై కొంగును, జారిన జుట్టుముడిలోని మాలను వారు గుర్తించలేదు.

ఏవం విక్రీడతోస్స్వైరం గాయతోస్సంప్రమత్తవత్ ।
శంఖచూడ ఇతి ఖ్యాతో ధనదానుచరోఽభ్యగాత్ ॥ 25

ఏవమ్ - ఈ విధముగా, సంప్రమత్తవత్ - పిచ్చెక్కినవారు వలె, స్వైరమ్ - యథేచ్ఛగా, విక్రీడతోః - వారిద్దరు విహరించుచుండగా, గాయతోః - పాడుచుండగా, శంఖచూడః - శంఖచూడుడు, ఇతి - అని,

ఖ్యాతః - ప్రసిద్ధికెక్కిన, ధనద-అనుచరః - కుబేరుని అనుచరుడు, అభ్యగాత్ - అచటకు వెళ్లెను.

వారిద్దరు ఈ విధముగా పిచ్చివారు వలె యథేచ్ఛగా విహరిస్తూ పాడుచుండిరి. అప్పుడు శంఖచూడుడని ప్రసిద్ధి గాంచిన కుబేరుని అనుచరుడు అచటకు వెళ్లెను.

తయోర్నిరీక్షతో రాజంస్తన్నాథం ప్రమదాజనమ్ ।
క్రోశంతం కాలయామాస దిశ్యుదీచ్యామశంకితః ॥ 26

రాజన్ - ఓ రాజా!, తయోః - వారిద్దరు, నిరీక్షతోః - చూచుచుండగా, అశంకితః - భయము లేని శంఖచూడుడు, తత్-నాథమ్ - వారిద్దరే రక్షకులుగా కలిగినట్టియు, క్రోశంతమ్ - ఆక్రోశించుచున్న, ప్రమదాజనమ్ - గోపికల సమూహమును, ఉదీచ్యాం దిశి - ఉత్తరదిక్కునందు, కాలయామాస - తరిమెను.

ఓ పరీక్షిన్మహారాజా! వారిద్దరు చూచుచుండగనే భయము లేని ఆతడు ఆక్రోశిస్తున్న గోపికల సముదాయమును ఉత్తరదిక్కు వైపు తరిమెను. ఆ గోపికలకు బలరామకృష్ణులు మాత్రమే రక్షకులు.

క్రోశంతం కృష్ణ రామేతి విలోక్య స్వపరిగ్రహమ్ ।
యథా గా దస్యునా గ్రస్తా భ్రాతరావన్వధావతామ్ ॥ 27

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, రామ - ఓ బలరామా!, ఇతి - అని, క్రోశంతౌ - ఆక్రోశించుచున్న, స్వపరిగ్రహమ్ - తమ వారైన యువతులను, విలోక్య - చూచి, భ్రాతరౌ - అన్నదమ్ములిద్దరు, దస్యునా - చోరునిచే, గ్రస్తాః - పట్టుకొనబడిన, గాః యథా - గోవులను వలె, అను - వెంబడి, అధావతామ్ - పరుగెత్తిరి.

తమ వారైన గోపికలు ఓ శ్రీకృష్ణా! ఓ బలరామా! అని ఆక్రోశించిరి. చోరుడు (పెద్దపులి) గోవులను తీసుకొని పోవుచుండగా వెంట పరుగెత్తే విధముగా, వారిని చూచి అన్నదమ్ములిద్దరు వెంబడి పరుగెత్తిరి.

మా భైష్టేత్యభయారావౌ శాలహస్తౌ తరస్వినౌ ।
ఆసేదతుస్తం తరసా త్వరితం గుహ్యకాధమమ్ ॥ 28

మా భైష్ట - భయపడకుడు, ఇతి - అని, అభయ-ఆరావౌ - భయమును పోగొట్టే శబ్దము గలవారు, శాలహస్తౌ - మద్ది చెట్టు చేతియందు గలవారు, తరస్వినౌ - వేగము గలవారు అగు రామకృష్ణులు, తరసా - వేగముగా, త్వరితమ్ - తొందరగా, తమ్ - ఆ, గుహ్యక-అధమమ్ - యక్షులలో అధముడగు శంఖచూడుని గురించి, ఆసేదతుః - సమీపించిరి.

రామకృష్ణులిద్దరు భయపడకుడని శబ్దము చేస్తూ వేగముగా పరుగెత్తిరి. వారు చేతులలో మద్ది చెట్లు పట్టుకొనిరి. వారు వేగముగా పరుగెత్తి శీఘ్రముగా యక్షులలో అధముడగు ఆ శంఖచూడుని సమీపించిరి.

స వీక్ష్య తావనుప్రాప్తౌ కాలమృత్యూ ఇవోద్విజన్ ।
విసృజ్య స్త్రీజనం మూఢః ప్రాద్రవజ్జీవితేచ్ఛయా ॥ 29

కాలమృత్యూ ఇవ - కాలుడు యముడు వలె, అనుప్రాప్తౌ - వెనుక సమీపించిన, తౌ - వారిద్దరిని, వీక్ష్య - చూచి, ఉద్విజన్ - భయపడువాడు, మూఢః - మూర్ఖుడు అగు, సః - ఆ శంఖచూడుడు, స్త్రీజనమ్ - గోపికల సముదాయమును, విసృజ్య - విడిచిపెట్టి, జీవిత-ఇచ్ఛయా - బ్రతుకునందలి కోరికతో, ప్రాద్రవత్ - పరుగెత్తెను.

కాలుడు, యముడు వలె వెంటబడిన వారిద్దరిని దగ్గరలో చూచి మూర్ఖుడైన ఆ శంఖచూడుడు భయపడెను. వాడు ఆ గోపికల సమూహమును విడిచిపెట్టి బ్రదుకుమీది తీపితో పరుగెత్తెను.

తమన్వధావద్గోవిందో యత్ర యత్ర స ధావతి ।
జిహీర్షుస్తచ్ఛిరోరత్నం తస్థౌ రక్షన్ స్త్రియో బలః ॥ 30

సః - వాడు, యత్ర యత్ర - ఎక్కడెక్కడైతే, ధావతి - పరుగెత్తునో, తమ్ - వానిని, అను - వెనుక, తత్-శిరః-రత్నమ్ - వాని తలపైని రత్నమును, జిహీర్షుః - లాగగోరే, గోవిందః - శ్రీకృష్ణుడు, అధావత్ - పరుగెత్తెను, బలః - బలరాముడు, స్త్రియః - గోపికలను, రక్షన్ - రక్షించువాడై, తస్థౌ - ఆగిపోయెను.

ఆ శంఖచూడుడు ఎక్కడెక్కడికి పరుగెడితే శ్రీకృష్ణుడు అక్కడక్కడికి వాని వెనుకనే పరుగెత్తెను. వాని తల మీది రత్నమును లాగవలెనని ఆయన కోరిక. బలరాముడు స్త్రీలకు రక్షకుడుగా ఆగిపోయెను.

అవిదూర ఇవాభ్యేత్య శిరస్తస్య దురాత్మనః ।
జహార ముష్టినైవాంగ సహ చూడామణిం విభుః ॥ 31

అంగ - ఓ రాజా!, విభుః - సర్వసమర్థుడగు శ్రీకృష్ణుడు, అవిదూరే ఇవ - దగ్గరగానే, అభ్యేత్య - ఎదురుగా వచ్చి, దురాత్మనః - దుర్బుద్ధియగు, తస్య - వాని, శిరః - తలను, చూడామణిమ్ - చూడామణిని, సహ ఏవ - ఒకే సారి, ముష్టినా - పిడికిలితో, జహార - ఊడబెరకెను.

ఓ పరీక్షిన్మహారాజా! సర్వసమర్థుడగు శ్రీకృష్ణుడు వానిని సమీపించి ఎదురుగా వచ్చి పిడికిలితో గుద్ది దుర్బుద్ధియగు వాని తలను, చూడామణిని ఒకే సారి ఊడబెరకెను.

శంఖచూడం నిహత్యైవం మణిమాదాయ భాస్వరమ్ ।
అగ్రజాయాదదాత్ప్రీత్యా పశ్యంతీనాం చ యోషితామ్ ॥ 32

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే చతుస్త్రింశోఽధ్యాయః.

ఏవమ్ - ఈ విధముగా, శంఖచూడమ్ - శంఖచూడుని, నిహత్య - సంహరించి, భాస్వరమ్ - ప్రకాశించే, మణిమ్ - చూడామణిని, ఆదాయ - తీసుకొని, యోషితామ్ - గోపికలు, పశ్యంతీనాం చ - చూచుచుండగనే, ప్రీత్యా - ప్రేమతో, అగ్రజాయ - అన్నగారి కొరకు, అదదాత్ - ఇచ్చెను.

ఈ విధముగా శ్రీకృష్ణుడు శంఖచూడుని సంహరించి ప్రకాశించే చూడామణిని తెచ్చెను. దానినాతడు గోపికలు చూచుచుండగనే ప్రేమతో అన్నగారికి ఇచ్చెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము పూర్వార్ధములో
శ్రీకృష్ణుడు సుదర్శనుని, శంఖచూడుని ఉద్ధరించుటను వర్ణించే
ముప్పది నాల్గవ అధ్యాయము ముగిసినది (34).

* * * * *

# అథ పంచత్రింశోఽధ్యాయః

## గోపికా యుగళ గీతము

శ్రీశుక ఉవాచ ।
గోప్యః కృష్ణే వనం యాతే తమనుద్రుతచేతసః ।
కృష్ణలీలాః ప్రగాయంత్యో నిన్యుర్దుఃఖేన వాసరాన్ ॥ 1

కృష్ణే - శ్రీకృష్ణుడు, వనమ్ - అడవిని గురించి, యాతే - వెళ్లగా, తమ్ - ఆయనను ఉద్దేశించి, అనుద్రుతచేతసః - ఆసక్తి గల మనస్సులు గల, గోప్యః - గోపికలు, కృష్ణలీలాః - శ్రీకృష్ణుని లీలలను, ప్రగాయంత్యః - గానము చేయువారై, వాసరాన్ - పగటి సమయములను, దుఃఖేన - కష్టముతో, నిన్యుః - గడిపిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణుడు అడవికి వెళ్లినప్పుడు ఆయన వెంట గోపికల మనస్సు కూడ వెళ్లిపోయెడిది. వారు శ్రీకృష్ణుని లీలలను గానము చేస్తూ కష్టముగా పగళ్లను గడిపిరి.

గోప్య ఊచుః ।
వామబాహుకృతవామకపోలో వల్గితభ్రురధరార్పితవేణుమ్ ।
కోమలాంగులిభిరాశ్రితమార్గం గోప్య ఈరయతి యత్ర ముకుందః ॥ 2

వ్యోమయానవనితాస్సహ సిద్ధైర్విస్మితాస్తదుపధార్య సలజ్జాః ।
కామమార్గణసమర్పితచిత్తాః కశ్మలం యయురపస్మృతనీవ్యః ॥ 3

గోప్యః - ఓ గోపికలారా!, వామబాహుకృతవామకపోలః - ఎడమ చేతియందు ఉంచబడిన ఎడమ చెక్కిలి గలవాడు, వల్గితభ్రుః - నాట్యము చేసే కనుబొమలు గలవాడు అగు, ముకుందః - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుడు, కోమల-అంగులిభిః - సుకుమారమైన వ్రేళ్లతో, ఆశ్రితమార్గమ్ - ఆశ్రయించబడిన ఛిద్రములు గల, అధర-అర్పితవేణుమ్ - క్రింది పెదవిపై

అన్చబడిన పిల్లనగ్రోవిని, యత్ర - ఎప్పుడైతే, ఈరయతి - వాయించునో అప్పుడు, సిద్ధైః సహ - సిద్ధులతో గూడి, వ్యోమయానవనితాః - ఆకాశ మార్గము గుండా వెళ్లే (విమానములయందలి) సిద్ధయువతులు, తత్ - ఆ గానమును, ఉపధార్య - విని, విస్మితాః - ఆశ్చర్యపడినవారు, సలజ్జాః - సిగ్గుతో కూడిన వారు, కామమార్గణసమర్పితచిత్తాః - మన్మథుని బాణముల కొరకు అర్పించి వేయబడిన మనస్సులు గలవారు, అపస్మృతనీవ్యః - మరువబడిన కోకముడులు గలవారు, కశ్మలమ్ - మోహమును, యయుః - పొందిరి.

ఓ గోపికలారా! మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుడు ఎడమ భుజముపై ఎడమచెక్కిలిని అన్చి పిల్లనగ్రోవిని క్రింది పెదవిపై అన్చి సుకుమారమగు వ్రేళ్లను దాని ఛిద్రములపై నుంచి వాయించినప్పుడు ఆతని కనుబొమలు నాట్యము చేయుచుండును. ఆ సమయములో సిద్ధులతో గూడి ఆకాశమార్గము గుండా విమానములలో వెళ్లే సిద్ధయువతులు ఆ గానమును విని ముందు ఆశ్చర్యమును పొందెదరు. వెనువెంటనే మనస్సు మన్మథుని బాణములచే పరవశము కాగా, వారు కోకముడుల సంగతి మరచిపోయి సిగ్గు పడుతూ మోహమును పొందెదరు.

హంత చిత్రమబలాశ్శృణుతేదం హారహాస ఉరసి స్థిరవిద్యుత్ ।<br>
నందసూనురయమార్తజనానాం నర్మదో యర్హి కూజితవేణుః ।। 4

బృందశో వ్రజవృషా మృగగావో వేణువాద్యహృతచేతస ఆరాత్ ।<br>
దంతదష్టకవలా ధృతకర్ణా నిద్రితా లిఖితచిత్రమివాసన్ ।। 5

హంత - ఏమర్రా!, అబలాః - యువతులారా!, ఇదమ్ - ఈ, చిత్రమ్ - చిత్రమును, శృణుత - వినుడు, హారహాసః - ముత్యాల హారము వంటి చిరునవ్వు గలవాడు (హారమునందు ప్రతిఫలించే చిరునవ్వు గలవాడు), ఉరసి - వక్షఃస్థలమునందు, స్థిరవిద్యుత్ - కదలని మెరుపు గలవాడు, అయమ్ - ఈ, నందసూనుః - నందుని పుత్రుడగు శ్రీకృష్ణుడు, ఆర్తజనానామ్ - పీడితులైన జనులకు, నర్మదః - సుఖమునిచ్చువాడు, యర్హి - ఎప్పుడైతే, కూజితవేణుః - వాయించబడిన పిల్లన గ్రోవి గలవాడో అప్పుడు, వ్రజవృషాః - గోకులముయొక్క ఎద్దులు, మృగగావః - లేళ్లు

ఆవులు, ఆరాత్ - దూరమునుండి, వేణువాద్యహృతచేతసః - వేణు గానముచే దోచివేయబడిన మనస్సులు గలవి, బృందశః - గుంపులు గుంపులుగా, దంతదష్టకవలాః - దంతములచే కొరుకబడిన గడ్డి దుబ్బులు గలవి, ధృతకర్ణాః - పైకెత్తబడిన చెవులు గలవి, నిద్రితాః ఇవ - నిద్రిస్తున్నవి వలె, లిఖితచిత్రం ఇవ - వ్రాయబడిన బొమ్మ వలె, ఆసన్ - ఉండెను.

ఏమద్రా! యువతులారా! ఈ చిత్రాన్ని విన్నారా! ముత్యాల హారమువంటి శ్రీకృష్ణుని చిరునవ్వు మెడలోని హారముపై ప్రతిఫలిస్తూ ఉంటుంది. (మేఘమువంటి) ఆయన వక్షఃస్థలముపై కదలని మెరుపువంటి శ్రీవత్సమున్నది. నందుని పుత్రుడగు ఈ శ్రీకృష్ణుడు పీడితజనులకు సుఖమునిచ్చువాడు. ఈతడు వేణువును వాయించినప్పుడు గోకులమునకు చెందిన ఎద్దులు, ఆవులే గాక అడవిలోని లేళ్లు కూడ దూరమునుండి వినగానే, వాటి మనస్సు దోచివేయబడును. అవి గుంపులు గుంపులుగా చేరి కదలకుండా వినుటచే, సగము కొరికిన గడ్డి దుబ్బులు నోట్లో అటులనే ఉండును. అవి చెవులను రిక్కించి వింటూ ఉంటే నిద్ర పోతున్నాయా! చిత్రకారుడు వ్రాసిన బొమ్మయా! అన్నట్లు ఉండును.

బర్హిణస్తబకధాతుపలాశైర్బద్ధమల్లపరిబర్హవిడంబః ।
కర్హిచిత్సబల ఆలి స గోపైర్గాస్సమాహ్వయతి యత్ర ముకుందః ॥ 6

తర్హి భగ్నగతయస్సరితో వై తత్పదాంబుజరజోఽనిలనీతమ్,
స్పృహయతీర్వయమివాబహుపుణ్యాః ప్రేమవేపితభుజాః స్తిమితాపః।7

ఆలి - ఓ సఖీ!, బర్హిణస్తబకధాతుపలాశైః - నెమలి పింఛములు పూలగుత్తులు రాతి రంగులు చిగుళ్లతో, బద్ధమల్లపరిబర్హవిడంబః - కట్టబడిన మల్లుల వేషమును అనుకరించువాడు, సబలః - బలరామునితో కూడియున్నవాడు అగు, సః - ఆ, ముకుందః - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుడు, గోపైః - గోపాలకులతో కూడి, కర్హిచిత్ - ఒకప్పుడు, యత్ర - ఎక్కడనైతే, గాః - గోవులను, సమాహ్వయతి - పిలుచునో, తర్హి - అప్పుడు, భగ్నగతయః - ఆగిపోయిన ప్రవాహము గల, సరితః వై - నదులు కూడ, అనిలనీతమ్ - గాలిచే తీసుకురాబడిన, తత్-పద-అంబుజరజః - ఆయనయొక్క పద్మములవంటి పాదముల

ధూళిని, స్పృహయతీః - కోరుచున్నవి, వయం ఇవ - మనము వలె, అబహుపుణ్యాః - ఎక్కువ పుణ్యము లేనివి, ప్రేమవేపితభుజాః - ప్రేమచే వణుకునట్లు చేయబడిన చేతులు (కెరటములు) గలవి, స్తిమిత-ఆపః - నిశ్చలమైన జలములు గలవి.

ఓ సఖీ! మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుడు తలపై నెమలి పింఛములను, ముంగురులయందు పూల గుత్తులను చిగుళ్లను, దేహమునందు గైరికాది ధాతువుల (రాతి రంగుల) ను అలంకరించుకున్నప్పుడు ఆతని వేషము మల్లుల వేషమును పోలియుండును. ఆయన బలరామునితో, గోపాలకులతో కూడి ఒకప్పుడు ఎక్కడనైతే వేణువుతో గోవులను వాటి పేర్లతో పిలుచునో, అప్పుడు నదుల ప్రవాహములాగిపోవును. నదులు కూడ గాలి మోసుకువచ్చే ఆయన పద్మములవంటి పాదముల ధూళిని కోరును సుమా! కాని, వాటికి కూడ మనవలె పుణ్యము ఎక్కువ లేదు. (అనగా, పాదములను స్పృశించే భాగ్యము లభించలేదు). వాటి చేతుల వంటి కెరటములు ప్రేమచే వణుకుచుండ, జలములు నిశ్చలములగును.

అనుచరైస్సమనువర్ణితవీర్య ఆదిపూరుష ఇవాచలభూతిః ।
వనచరో గిరితటేషు చరంతీర్వేణునాऽऽహ్వయతి గాస్స యదా హి ।।8

వనలతాస్తరవ ఆత్మని విష్ణుం వ్యంజయంత్య ఇవ పుష్పఫలాఢ్యాః ।
ప్రణతభారవిటపా మధుధారాః ప్రేమహృష్టతనవస్ససృజుస్స్మ ।। 9

ఆదిపూరుషః ఇవ - జగత్కారణుడు పూర్ణుడు అగు విష్ణువు వలె, అనుచరైః - వెంటనుండే (దేవతలచే) గోపాలకులచే, సమనువర్ణితవీర్యః - బాగుగా వర్ణించబడిన పరాక్రమము గలవాడు, అచలభూతిః - శాశ్వతమగు సంపద (లక్ష్మి) గలవాడు అగు, సః - ఆ శ్రీకృష్ణుడు, యదా హి - ఎప్పుడైతే, వనచరః - బృందావనమునందు సంచరించువాడై, వేణునా - వేణువుతో, గిరితటేషు - కొండ చరియలయందు, చరంతీః - మేయుచున్న, గాః - గోవులను, ఆహ్వయతి - పిలుచునో, వనలతాః - అడవియందలి తీగలు, తరవః - చెట్లు, ఆత్మని - తనయందు, విష్ణుమ్ - పూర్ణమగు ఆనందమును, వ్యంజయంత్యః ఇవ - ప్రకటించుచున్నవా యన్నట్లు, పుష్పఫల-ఆఢ్యాః - పూలతో పళ్లతో సంపన్నములై,

ప్రణతభారవిటపాః - బరువుచే వంగిన కొమ్మలు గలవై, ప్రేమహృష్టతనవః - ప్రేమతో పులకించిన దేహములు గలవియై, మధుధారాః - తేనెల ధారలను, ససృజుః స్మ - వర్షించినవి.

జగత్కారణుడు, పూర్ణుడు అగు విష్ణువును వెంట ఉండే దేవతలు స్తుతించెదరు. లక్ష్మి సర్వదా ఆయనతో ఉండును. అదే విధముగా, బృందావనములో సంచరించే ఆ శ్రీకృష్ణుని వెన్నంటి ఉండే గోపాలకులు ఆయన పరాక్రమమును చక్కగా వర్ణించుచుందురు. ఆయన సంపద కూడ శాశ్వతమైనదియే. కొండ చరియలపై మేయుచున్న గోవులను ఆయన వేణువునూది పిలిచినప్పుడు అడవియందలి తీగలు, చెట్లు తమయందు పూర్ణమగు ఆనందమును ప్రకటించుచున్నవా యన్నట్లుండును. పూలతో, పళ్లతో సంపన్నములై బరువునకు వంగిన కొమ్మలు గల చెట్లు ప్రేమతో పులకించిన దేహములు కలిగి నమస్కరించే భక్తులను పోలియుండును. అవి తేనెల ధారలను వర్షించును.

దర్శనీయతిలకో వనమాలాదివ్యగంధతులసీమధుమత్తైః ।
అలికులైరలఘు గీతమభీష్టమాద్రియన్ యర్హి సంధితవేణుః ॥ 10

సరసి సారసహంసవిహంగాశ్చారుగీతహృతచేతస ఏత్య ।
హరిముపాసత తే యతచిత్తా హంత మీలితదృశో ధృతమౌనాః ॥ 11

దర్శనీయతిలకః - అందమైన తిలకము గల (అందమైనవారిలో శ్రేష్ఠుడగు) శ్రీకృష్ణుడు, వనమాలాదివ్యగంధతులసీమధుమత్తైః - వనమాలయందలి దివ్యమగు పరిమళము గల తులసియొక్క తేనెచే మత్తెక్కిన, అలికులైః - తుమ్మెదల గుంపులచే, అలఘు - బిగ్గరమైనట్టియు, అభీష్టమ్ - ప్రీతిని కలిగించే, గీతమ్ - ఝుంకారమును, ఆద్రియన్ - సమ్మానించువాడై, యర్హి - ఎప్పుడైతే, సంధితవేణుః - ఊదబడిన వేణువు గలవాడగునో అప్పుడు, సరసి - సరస్సునందలి, సారసహంసవిహంగాః - బెగ్గురు పక్షులు హంసలు ఇతరపక్షులు, చారుగీతహృతచేతసః - మధురమగు గానముచే దోచివేయబడిన మనస్సు గలవి, హంత - సఖీ!, యతచిత్తాః - నిగ్రహించబడిన మనస్సు గలవి, మీలితదృశః - మూయబడిన కన్నులు గలవి, ధృతమౌనాః - దాల్చబడిన

మౌనము గలవి, తే - అవి, ఏత్య - వచ్చి, హరిం ఉప - శ్రీకృష్ణ భగవానునకు దగ్గరగా, ఆసత - కూర్చుండెను.

ఓ సఖీ! అందగాళ్లలో అందగాడగు శ్రీకృష్ణ .భగవానుడు అందమైన తిలకమును దిద్దుకొని వనమాలను ధరించును. ఆ వనమాలయందలి దివ్యమగు పరిమళము గల తులసియొక్క తేనెచే మత్తెక్కిన తుమ్మెదలు గుంపులుగా చేరి బిగ్గరగా ఝంకారమును చేయును. ఆయనకు ఆ ధ్వనియందు ప్రీతి. ఆయన ఆ ధ్వనిని సమ్మానిస్తూ వేణువును పెదవులకానించి పాడును. ఆ మధురగానముచే సరస్సునందలి బెగ్గురు పక్షులు, హంసలు, ఇతరపక్షుల మనస్సు దోచివేయబడును. అవి కూతలను మానివేసి మనస్సును నిగ్రహించుకొని శ్రీకృష్ణుని వద్దకు వచ్చి కన్నులను మూసుకొని (యోగీశ్వరుల వలె) దగ్గరగా కూర్చుండును.

సహబలస్స్రగవతంసవిలాసస్సానుషు క్షితిభృతో వ్రజదేవ్యః ।
హర్షయన్ యర్హి వేణురవేణ జాతహర్ష ఉపరంభతి విశ్వమ్ ।।12

మహదతిక్రమణశంకితచేతా మందమందమనుగర్జతి మేఘః ।
సుహృదమభ్యవర్షత్సుమనోభిశ్ఛాయయా చ విదధత్ప్రతపత్రమ్ ।।13

వ్రజదేవ్యః - గోకులమునకు దేవతలైన ఓ గోపికలారా!, సహబలః - బలరామునితో కూడియున్నవాడు, స్రగ్-అవతంసవిలాసః - మాల కర్ణాభరణముల విలాస గలవాడు, జాతహర్షః - కలిగిన హర్షము గలవాడు అగు శ్రీకృష్ణుడు, క్షితిభృతః - గోవర్ధన పర్వతముయొక్క, సానుషు - చరియలయందు, యర్హి - ఎప్పుడైతే, విశ్వమ్ - జగత్తును, హర్షయన్ - హర్షింపజేయువాడై, వేణురవేణ - వేణుగానముతో, ఉపరంభతి - నినదింప జేయునో అప్పుడు, మహద్-అతిక్రమణశంకితచేతాః - పెద్దలను జవదాటెదనేమో అనే శంక గల మనస్సు గల, మేఘః - మేఘము, అను - అనుసరించి, మందమందమ్ - మెల్లమెల్లగా, గర్జతి - గర్జించును, సుహృదమ్ - ప్రియమిత్రుడగు శ్రీకృష్ణుని, సుమనోభిః - పుష్పములవంటి నీటి బిందువులతో, అభ్యవర్షత్ - వర్షించెను, చ - మరియు, ఛాయయా - నీడతో, ప్రతపత్రమ్ - గొడుగును, విదధత్ - వ్యవస్థ చేయునది.

ఓ గోకుల దేవతలారా! మాల, కర్ణాభరణముల విలాస గల శ్రీకృష్ణుడు బలరామునితో గూడి గోవర్ధన పర్వతముయొక్క చరియలయందు సంచరించును. ఆయనకు హర్షము కలిగినప్పుడు వేణువును ఊది జగత్తునకు హర్షమును కలుగజేస్తూ వేణుధ్వనితో నినదింప జేయును. అప్పుడు మేఘము (జగత్తునకు) పెద్దయగు శ్రీకృష్ణుని యెదుట అల్లరి యగునేమో అనే శంక గలదై, వేణునాదముననుసరిస్తూ మెల్ల మెల్లగా గర్జించును. అంతేగాక, అది తన ప్రియమిత్రుడగు (తన వలె నల్లనివాడు) శ్రీకృష్ణునిపై పూలవానవంటి నీటి బిందువులను కురిపించి, తన నీడతో గొడుగు పట్టును.

వివిధగోపచరణేషు విదగ్ధో వేణువాద్య ఉరుధా నిజశిక్షాః ।
తవ సుతస్సతి యదాఽధరబింబే దత్తవేణురనయత్స్వరజాతీః ॥ 14

సవనశస్తదుపధార్య సురేశాశ్శక్రశర్వపరమేష్ఠిపురోగాః ।
కవయ ఆనతకంధరచిత్తాః కశ్మలం యయురనిశ్చితతత్త్వాః ॥ 15

సతి - ఓ యశోదా!, వివిధగోపచరణేషు - పలు రకముల గోపాలకుల ఆటలయందు, విదగ్ధః - దిట్టయగు, తవ - నీ, సుతః - కొడుకు, యదా - ఎప్పుడైతే, అధరబింబే - దొండ పండువంటి క్రింది పెదవిపై, దత్తవేణుః - అన్చబడిన పిల్లన గ్రోవి గలవాడై, వేణువాద్యే - వేణువాదనవిషయమునందు, ఉరుధా - అనేకప్రకారములుగా, నిజశిక్షాః - తనదైన శిక్షణ గల, స్వరజాతీః - స్వరముల ఆలాపములను, అనయత్ - వాయించెనో అప్పుడు, శక్రశర్వపరమేష్ఠిపురోగాః - ఇంద్రుడు శివుడు బ్రహ్మదేవుడు మొదలుగా గల, సుర-ఈశాః - దేవనాయకులు, తత్ - ఆ గానమును, సవనశః - ఆయా సమయములయందు, ఆనతకంధరచిత్తాః - వంచబడిన మెడలు మనస్సులు గలవారై, ఉపధార్య - విని, కవయః - పండితులే ఐననూ, అనిశ్చితతత్త్వాః - నిశ్చయము కాని తత్త్వము గలవారై, కశ్మలమ్ - వ్యామోహమును, యయుః - పొందిరి.

ఓ యశోదా! నీ కొడుకు పలు రకముల గోపాలకుల ఆటలలో దిట్ట. ఆతడు దొండపండువంటి పెదవిపై పిల్లన గ్రోవిని అన్చి పాడును. ఆతడు వేణువాదనములోని వివిధప్రకారములను తనకు తానుగా అభ్యాసము

చేసినాడు. ఆతని ఆ పాటను ఇంద్రుడు, శివుడు, బ్రహ్మదేవుడు మొదలైన దేవనాయకులు ఆయా సమయములలో మెడలను వంచి వినుచుందురు. వారి చిత్తము దానిచే ఆకర్షించబడును. కాని, వారు ఎంతటి సంగీతనిపుణులైనా, ఆ గానముయొక్క స్వరతత్త్వము తెలియక (రాగతాళములను గుర్తు పట్టలేక) వ్యామోహపడుచుందురు.

నిజపదాబ్జదలైర్ధ్వజవజ్రనీరజాంకుశవిచిత్రలలామైః ।
వ్రజభువశ్శమయన్ ఖురతోదం వర్ష్మధుర్యగతిరీడితవేణుః ।। 16

వ్రజతి తేన వయం సవిలాసవీక్షణార్పితమనోభవవేగాః ।
కుజగతిం గమితా న విదామః కశ్మలేన కబరం వసనం వా ।।17

ధ్వజవజ్రనీరజ-అంకుశవిచిత్రలలామైః - జెండా వజ్రము పద్మము అంకుశములనే పలు రకముల చిహ్నములు గల, నిజపద-అబ్జదలైః - తన పద్మపత్రములవంటి అడుగులతో, వ్రజభువః - గోకులములోని నేలయొక్క, ఖురతోదమ్ - డెక్కల నొప్పిని, శమయన్ - తగ్గించువాడు, వర్ష్మధుర్యగతిః - దేహముచే పెద్దదైన ఏనుగుయొక్క నడక వంటి నడక గలవాడు అగు శ్రీకృష్ణుడు, ఈడితవేణుః - వాయించబడిన వేణువు గలవాడై, వ్రజతి - వెళ్లును, తేన - దానిచే, సవిలాసవీక్షణ-అర్పితమనః-భవవేగాః - విలాసతో కూడిన చూపులచే కలిగించబడిన ప్రేమయొక్క వేగము గల, వయమ్ - మేము, కుజగతిమ్ - చెట్ల దశను, గమితాః - పొందించబడువారము, కశ్మలేన - మోహముచే, కబరమ్ - జుట్టుముడిని గాని, వసనం వా - వస్త్రమును గాని, న విదామః - ఎరుగము.

జెండా, వజ్రము, పద్మము, అంకుశము అనే పలురకముల చిహ్నములు కలిగి పద్మపు రేకులను పోలిన అడుగులతో శ్రీకృష్ణుడు నడిచి వెళ్లుచుండగా, నేలకు పశువుల డెక్కల వలన కలిగిన నొప్పి దూరమగును. ఆయన ఏనుగు వలె ఠీవిగా నడుస్తూ వేణువును వాయిస్తూ వెళ్లును. ఆయన వెళ్తూ మాకేసి విలాసతో కూడిన చూపులను విసురును. దానిచే మాయందు ప్రేమావేశము కలిగి మేము చెట్లవలె చేష్టలుడిగి యుందుము. ఆ మోహముచే మాకు జుట్టు ముడి ఊడినదని గాని, కొంగు జారినదని గాని తెలియకుండును.

మణిధరః క్వచిదాగణయన్ గా మాలయా దయితగంధతులస్యాః ।
ప్రణయినోఽనుచరస్య కదాంఽసే ప్రక్షిపన్ భుజమగాయత యత్ర ॥18

క్వణితవేణురవవంచితచిత్తాః కృష్ణమన్వసత కృష్ణగృహిణ్యః ।
గుణగణార్ణమనుగత్య హరిణ్యో గోపికా ఇవ విముక్తగృహాశాః ॥ 19

దయితగంధతులస్యాః - ప్రియమైన గంధముగల తులసియొక్క, మాలయా - మాలతో, మణిధరః - మణులను ధరించే శ్రీకృష్ణుడు, క్వచిత్ - ఒకచోట, గాః - గోవులను, ఆ - అంతటా, గణయన్ - లెక్క పెట్టుచున్నవాడై, కదా - ఒకప్పుడు, ప్రణయినః - ప్రేమ గల, అనుచరస్య - అనుచరుని, అంసే - భుజముపై, భుజమ్ - చేతిని, ప్రక్షిపన్ - వేయువాడై, యత్ర - ఎప్పుడైతే, అగాయత - గానము చేసెనో అప్పుడు, క్వణితవేణురవవంచితచిత్తాః - వాయించబడిన వేణువుయొక్క ధ్వనిచే దోచివేయబడిన చిత్తములు గల, కృష్ణగృహిణ్యః - మగ లేడుల జతలైన, హరిణ్యః - ఆడు లేడులు, విముక్తగృహ-ఆశాః - విడిచిపెట్టబడిన ఇంటియందలి ఆశ గల, గోపికాః ఇవ - గోపికలు వలె, గుణగణ-అర్ణమ్ - గుణముల సమూహములకు సముద్రమైన, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, అనుగత్య - చేరి, అన్వసత - నిలిచి యుండెను.

శ్రీకృష్ణునకు పరిమళభరితమగు తులసిమాలయందు ప్రీతి మెండు. ఆతడు గోవులను లెక్కించుటకై మణుల మాలను దగ్గర పెట్టుకొనును. ఆయన ఒకచోట ఆ మాలతో గోవులను అన్ని వైపులా లెక్కిస్తూ, ప్రియుడగు గోపబాలకుని భుజముపై చేతిని వేసి ఏదో ఒక సమయములో వేణువును వాయించెను. ఆ వేణుగానము ఆడు లేడుల చిత్తములను దోచివేయును. అవి తమ జతలైన మగ లేడులను విడిచిపెట్టి, ఇంటియందు ఆశను వదులుకున్న గోపికలు వలె, సద్గుణపుంజములకు సముద్రమువంటివాడగు శ్రీకృష్ణుని వద్దకు చేరి అచటనే నిలిచియుండెను.

కుందదామకృతకౌతుకవేషో గోపగోధనవృతో యమునాయామ్ ।
నందసూనురనఘే తవ వత్సో నర్మదః ప్రణయినాం విజహార ॥ 20

మందవాయురుపవాత్యనుకూలం మానయన్ మలయజస్పర్శేన ।
వందినస్తముపదేవగణా యే వాద్యగీతబలిభిః పరివవ్రుః ।। 21

అనఘే - ఓ పుణ్యాత్మురాలా! యశోదా!, కుందదామకృతకౌతుకవేషః - గన్నేరు పువ్వుల మాలతో చేయబడిన ఉత్సవవేషము గలవాడు, గోపగోధనవృతః - గోపాలకులతో గోసంపదతో కూడినవాడు, నందసూనుః - నందుని పుత్రుడు అగు, తవ - నీ, వత్సః - ముద్దుల బిడ్డడు, ప్రణయినామ్ - ప్రేమ గలవారలకు, నర్మదః - హర్షమునిచ్చువాడై, యమునాయామ్ - యమునానదీతీరమునందు, విజహార - విహరించెను, మందవాయుః - మెల్లగా వీచే గాలి, మలయజస్పర్శేన - చందనముయొక్క స్పర్శతో, తమ్ - ఆ శ్రీకృష్ణుని, మానయన్ - సమ్మానించునదై, అనుకూలమ్ - అనుకూలముగా, ఉపవాతి - వీచును, వందినః - స్తోత్రపాఠకులగు, ఉపదేవగణాః - గంధర్వుల గణములు, యే - ఎవరు గలరో వారు, వాద్యగీతబలిభిః - వాద్యములు గానములు ఉపహారములతో, పరివవ్రుః - చుట్టూ చేరి ఉపాసించిరి.

పుణ్యాత్మురాలవగు ఓ యశోదా! నందుని పుత్రుడు, నీ ముద్దుల బిడ్డడు అగు శ్రీకృష్ణుడు ప్రేమించువారలకు హర్షమును కలిగిస్తూ యమునానదీతీరమునందు విహరించెను. ఆతడు గన్నేరు పూల మాలతో ఉత్సవమునకు తగ్గ వేషమును దాల్చెను. ఆతని చుట్టూ గోపాలకులు, గోధనము ఉండెను. అప్పుడు గాలి చందనపు స్పర్శతో ఆయనను సమ్మానిస్తూ మెల్లగా అనుకూలముగా వీచును. గంధర్వుల గణములు స్తోత్రములను పఠిస్తూ ఆయనను చుట్టువారి వాద్యములు, గీతములు, ఉపహారములతో సేవించెదరు.

వత్సలో వ్రజగవాం యదగధ్రో వంద్యమానచరణః పథి వృద్ధైః ।
కృత్స్నగోధనముపోహ్య దినాంతే గీతవేణురనుగేడితకీర్తిః ।। 22

ఉత్సవం శ్రమరుచాపి దృశీనామున్నయన్ ఖురరజశ్ఛురితస్రక్।
దిత్సయైతి సుహృదాశిష ఏష దేవకీజఠరభూరుడురాజః ।। 23

వ్రజగవామ్ - గోకులమునకు గోవులకు, వత్సలః - హితమును చేయువాడు, యత్ - ఏలయన, అగధ్రః - పర్వతమునెత్తినవాడు, పథి - మార్గమునందు, వృద్ధైః - పెద్దలచే, వంద్యమానచరణః - నమస్కరించబడుచున్న పాదములు గలవాడు, దిన-అంతే - సాయంకాలమునందు, కృత్స్నగోధనమ్ - సకలమైన గోసంపదను, ఉపోహ్య - మందనుగా చేసి, గీతవేణుః - గానము చేయబడిన వేణువు గలవాడు, అనుగ-ఈడితకీర్తిః - వెంటవచ్చే గోపాలకులచే స్తుతించబడే కీర్తి గలవాడు, శ్రమరుచా అపి - శ్రమతో కూడిన కాంతితో కూడ, దృశీనామ్ - కళ్లకు, ఉత్సవమ్ - ఉత్సవమును, ఉన్నయన్ - అధికముగా కలిగించువాడు, ఖురరజః-ఛురితస్రక్ - డెక్కల ధూళిచే వ్యాపించబడిన మాల గలవాడు, ఏషః - ఈ, దేవకీజఠరభూః - దేవకి (యశోద) గర్భము నుండి జన్మించిన, ఉడురాజః - చంద్రుడు, సుహృద్-ఆశిషః - మిత్రుల మనోరథమునకు, దిత్సయా - ఇచ్చే కోరికతో, ఏతి - వచ్చుచున్నాడు.

యశోద గర్భమునందు జన్మించిన ఈ శ్రీకృష్ణ చంద్రుడు గోకులమునకు గోవులకు హితమును చేయువాడు. కావుననే, గోవర్ధమునెత్తినాడు. ఈతడు సాయంకాలము గోసంపదనంతనూ మందగా చేసి వేణువును వాయించుకుంటూ వస్తూ ఉంటే, వెంట వచ్చే గోపాలకులు ఆతని కీర్తిని గానము చేయుచుండిరి. మార్గమునందు పెద్దలు కూడ ఆతని పాదములకు నమస్కరించుచున్నారు. ఆతడు అలసినా కాంతి తగ్గలేదు. డెక్కల ధూళిచే వ్యాప్తమైన మాలను ధరించియున్న ఆతని దర్శనము కన్నులకు పెద్ద పండువయే. ఈ శ్రీకృష్ణ చంద్రుడు మిత్రులమైన మన మనోరథములను పరిపూర్ణము చేయు కోరికతో వచ్చుచున్నాడు.

మదవిఘూర్ణితలోచన ఈషన్మానదస్స్వసుహృదాం వనమాలీ,
బదరపాండువదనో మృదుగండం మండయన్కనకకుండలలక్ష్మ్యా।24

యదుపతిర్ద్విరదరాజవిహారో యామినీపతిరివైష దినాంతే,
ముదితవక్త్ర ఉపయాతి దురంతం మోచయన్ వ్రజగవాం దినతాపమ్।

ఈషత్ - కొంచెము, మదవిఘూర్ణితలోచనః - హర్షవికారముచే స్వాధీనత తప్పిన కళ్లు గలవాడు, స్వసుహృదామ్ - తన మిత్రులకు,

మానదః - సమ్మానమునిచ్చువాడు, వనమాలీ - వనమాలను ధరించినవాడు, బదరపాండువదనః - ప్రత్తి జడ వలె పాలిపోయిన ముఖము గలవాడు, కనకకుండలలక్ష్మ్యా - బంగరు కుండలముల కాంతిచే, మృదుగండమ్ - సుకుమారమగు చెక్కిలిని, మండయన్ - అలంకరింప జేయువాడు, యదుపతిః - యాదవులకు ప్రభుడు, ద్విరదరాజవిహారః - గజేంద్రుని ఠీవి గలవాడు, ఏషః - ఈ శ్రీకృష్ణుడు, దినాంతే - సాయంకాలమునందు, యామినీపతిః ఇవ - రాత్రికి ప్రభుడగు చంద్రుడు వలె, ముదితవక్త్రః - ఆనందముతో నిండిన మోము గలవాడు, వ్రజగవామ్ - గోకులమునకు గోవులకు, దురంతమ్ - నివారించ శక్యము కాని, దినతాపమ్ - పగటి తాపమును, మోచయన్ - తొలగింప జేయువాడై, ఉపయాతి - దగ్గరగా వచ్చుచున్నాడు. 25

తన మిత్రులను సమ్మానించే ఈ శ్రీకృష్ణుడు సాయంకాలమగుసరికి రాత్రికి ప్రభుడగు చంద్రుడు వలె దగ్గరకు వచ్చుచున్నాడు. తన మిత్రులకు సమ్మానమునిచ్చే ఈతడు ఇంటికి వచ్చే ఆనందముచే కొంచెము స్వాధీనత తప్పిన కన్నులు గలవాడు. వనమాలను దాల్చిన ఈతని ముఖము ప్రత్తి జడవలె పాలిపోయి ఉన్నది. అయినా, బంగరు కుండలముల కాంతి సుకుమారమగు చెక్కిలిని అలంకరింప జేయుచునే యున్నది. యాదవులకు ప్రభుడగు ఈతడు గజేంద్రుని ఠీవితో నడుస్తూ వచ్చుచున్నాడు. గోకులమునకు, గోవులకు పగటి తాపము సాయంకాల మగుసరికి చంద్రునివంటి ఈతని దర్శనముచే తొలగిపోవుచున్నది.

శ్రీశుక ఉవాచ ।
ఏవం వ్రజస్త్రియో రాజన్ కృష్ణలీలా ను గాయతీః ।
రేమిరేఽహస్సు తచ్చిత్తాస్తన్మనస్కా మహోదయాః ॥ 26

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే పంచత్రింశోఽధ్యాయః ॥

రాజన్ - ఓ రాజా!, తత్-చిత్తాః - ఆయనయందే జీవితము గలవారు, తత్-మనస్కాః - ఆయనయందే మనస్సు గలవారు, మహా-ఉదయాః - గొప్ప ఉత్సవము గలవారు అగు, వ్రజస్త్రియః - గోకులమునందలి

స్త్రీలు, కృష్ణలీలాః ను - శ్రీకృష్ణుని లీలలనే, గాయతీః - గానము చేయువారై, అహస్సు - పగటి సమయములయందు, రేమిరే - రమించిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! గోకులమునందలి స్త్రీలకు శ్రీకృష్ణుడే జీవితము, ఆతని దర్శనమే గొప్ప ఉత్సవము. వారి మనస్సు ఆయనయందే లగ్నమయ్యెడిది. వారు పగటియందు కూడ ఆయన లీలలనే గానము చేస్తూ ఆనందించెడివారు.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము పూర్వార్ధములో
గోపికా యుగల గీతమును వర్ణించే ముప్పది ఐదవ
అధ్యాయము ముగిసినది (35).

* * * * *

# అథ షట్త్రింశోఽధ్యాయః

## వృషభాసురుని ఉద్ధారము - కంసుడు అక్రూరుని గోకులమునకు పంపుట

శ్రీశుక ఉవాచ ।
అథ తర్హ్యాగతో గోష్ఠమరిష్టో వృషభాసురః ।
మహీం మహాకకుత్కాయః కంపయన్ ఖురవిక్షతామ్ ॥ 1

అథ - తరువాత, తర్హి - అప్పుడు, మహాకకుత్-కాయః - పెద్ద మూపురము దేహము గలవాడు, ఖురవిక్షతామ్ - డెక్కలచే పగులగొట్టబడిన, మహీమ్ - భూమిని, కంపయన్ - కంపింపజేయువాడు, అరిష్టః - అరిష్టుడని పేరు గలవాడు, వృషభ-అసురః - ఎద్దు రూపములోనున్న రాక్షసుడు, గోష్ఠమ్ - గోకులమును గురించి, ఆగతః - వచ్చినవాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణుడు గోకులములో ప్రవేశించిన తరువాత అప్పుడు గోకులమునకు అరిష్టుడనే రాక్షసుడు వచ్చెను. ఆతడు పెద్ద మూపురముతో కూడిన దేహము గల ఎద్దు రూపములో నుండెను. ఆ ఎద్దు డెక్కలతో భూమిని పగులగొడుతూంటే భూమి కంపించెను.

రంభమాణః ఖరతరం పదా చ విలిఖన్మహీమ్ ।
ఉద్యమ్య పుచ్ఛం వప్రాణి విషాణాగ్రేణ చోద్ధరన్ ॥ 2

ఖరతరమ్ - కర్కశముగా, రంభమాణః - రంకె వేయుచున్నవాడు, పదా - కాలితో, మహీం చ - నేలను కూడ, విలిఖన్ - దుమ్ము రేగగొట్టుచున్నవాడు, పుచ్ఛమ్ - తోకను, ఉద్యమ్య - పైకెత్తి, విషాణ-అగ్రేణ - కొమ్ము కొనతో, వప్రాణి చ - మట్టి పెళ్లలను కూడ, ఉద్ధరన్ - పైకి ఎత్తుచున్నవాడు.

ఆ రాక్షసుడు కర్కశముగా రంకెలు వేస్తూ, కాలితో నేలను రాసి దుమ్ము రేగగొడుతూ, తోకను పైకెత్తి కొమ్ము కొనతో మట్టి పెళ్లలను పైకి ఎత్తి విసిరెను.

కించిత్కించిచ్ఛకృన్ముంచన్ మూత్రయన్ స్తబ్ధలోచనః ।
యస్య నిర్హ్రాదితేనాంగ నిష్ఠురేణ గవాం నృణామ్ ॥ 3

పతంత్యకాలతో గర్భాస్స్రవంతి స్మ భయేన వై ।
నిర్విశంతి ఘనా యస్య కకుద్యచలశంకయా ॥ 4

కించిత్ కించిత్ - కొంచెము కొంచెము, శకృత్ - పేడను, ముంచన్ - విడుచుచున్నవాడు, మూత్రయన్ - మూత్రమును పోయువాడు, స్తబ్ధలోచనః - కదలిక లేని కళ్లు గలవాడు, అంగ - ఓయీ!, నిష్ఠురేణ - భయంకరమైన, యస్య - ఎవని, నిర్హ్రాదితేన - శబ్దముచే, గవామ్ - ఆవులయొక్క, నృణామ్ - మానవస్త్రీలయొక్క, గర్భాః - గర్భములు, భయేన - భయముచే, వై - నిశ్చయముగా, అకాలతః - ప్రసవసమయము కాకుండానే, స్రవంతి - స్రవించునో, పతంతి - పడిపోవునో, యస్య - ఎవని, కకుది - మూపురమునందు, అచలశంకయా - పర్వతమనే భ్రాంతిచే, ఘనాః - మేఘములు, నిర్విశంతి - ఆగుచున్నవో.

ఓ పరీక్షిన్మహారాజా! నిశ్చలమగు కన్నులు గల ఆ ఎద్దు కొంచెము కొంచెము పేడను వేస్తూ మూత్రమును పోయుచుండెను. అది వేసే భయంకరమగు రంకెలకు ఆవులకే గాక, మానవస్త్రీలకు కూడ గర్భములు ప్రసవసమయము రాకుండానే స్రవించును, లేదా పడిపోవును. వాని మూపురమునందు పర్వతమనే భ్రాంతిచే మేఘములు ఆగుచున్నవి.

తం తీక్ష్ణశృంగముద్వీక్ష్య గోప్యో గోపాశ్చ తత్రసుః ।
పశవో దుద్రువుర్భీతా రాజన్ సంత్యజ్య గోకులమ్ ॥ 5

తీక్ష్ణశృంగమ్ - వాడి కొమ్ములు గల, తమ్ - ఆ ఎద్దును, వీక్ష్య - చూచి, గోప్యః - గోపికలు, గోపాః చ - గోపాలకులు కూడ, తత్రసుః - భయపడిరి, రాజన్ - ఓ రాజా!, భీతాః - భయపడిన పశువులు, గోకులమ్ - గోకులమును, సంత్యజ్య - విడిచిపెట్టి, దుద్రువుః - పరుగెత్తినవి.

ఓ పరీక్షిన్మహారాజా! వాడి కొమ్ములు గల ఆ ఎద్దును చూచి గోపికలు మాత్రమే గాక గోపాలకులు కూడ భయపడిరి. పశువులు భయపడి గోకులమును విడిచిపెట్టి పరుగులు తీసినవి.

కృష్ణ కృష్ణేతి తే సర్వే గోవిందం శరణం యయుః ।
భగవానపి తద్వీక్ష్య గోకులం భయవిద్రుతమ్ ॥ 6

మా భైష్టేతి గిరాఽఽశ్వాస్య వృషాసురముపాహ్వయత్ ।
గోపాలైః పశుభిర్మంద త్రాసితైః కిమసత్తమ ॥ 7

తే - వారు, సర్వే - అందరు, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, ఇతి - అని, గోవిందమ్ - గోవిందుని, శరణమ్ - రక్షకునిగా, యయుః - పొందిరి, భగవాన్ అపి - శ్రీకృష్ణ భగవానుడు కూడ, భయవిద్రుతమ్ - భయముతో పరుగులు తీయుచున్న, తత్ - ఆ, గోకులమ్ - గోకులమును, వీక్ష్య - చూచి, మా భైష్ట - భయపడకుడు, ఇతి - అనే, గిరా - మాటతో, ఆశ్వాస్య - ఓదార్చి, వృష-అసురమ్ - ఎద్దు రూపములోనున్న రాక్షసుని, ఉపాహ్వయత్ - తన వద్దకు పిలిచెను, మంద - ఓరీ జడుడా!, అసత్-తమ - పరమదుష్టుడా!, త్రాసితైః - భయపెట్టబడిన, గోపాలైః - గోపాలకులతో, పశుభిః - పశువులతో, కిమ్ - పని యేమి?

వారందరు ఓ శ్రీకృష్ణా! ఓ శ్రీకృష్ణా! అంటూ గోవిందుని శరణు జొచ్చిరి. శ్రీకృష్ణ భగవానుడు కూడ గోకులము భయముతో పరుగులు తీయుచుండుటను గాంచి, భయపడకుడు అని వారికి ధైర్యమును చెప్పెను. అపుడాయన ఆ వృషభాసురుని సవాలు చేసి తన వద్దకు పిలుస్తూ ఇట్లు పలికెను --- ఓరీ జడుడా! నీవు పరమదుష్టుడవు. గోపాలకులను, పశువులను భయపెట్టి ప్రయోజనమేమున్నది?

బలదర్పహాఽహం దుష్టానాం త్వద్విధానాం దురాత్మనామ్ ।
ఇత్యాస్ఫోట్యాచ్యుతోఽరిష్టం తలశబ్దేన కోపయన్ ॥ 8

అహమ్ - నేను, త్వద్-విధానామ్ - నీవంటి, దుష్టానామ్ - దుష్టులకు, దురాత్మనామ్ - దుర్బుద్ధులకు, బలదర్పహా - బలము వలని గర్వమును అడంచువాడను, ఇతి - అని, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, ఆస్ఫోట్య -

జబ్బ చరచి, తలశబ్దేన - చప్పట్ల శబ్దముతో, అరిష్టమ్ - అరిష్టాసురుని, కోపయన్ - కోపము కలిగించువాడు.

నీవంటి దుర్బుద్ధులగు దుష్టులకు బలము వలన కలిగే గర్వమును నేను అడంచెదను, అని పలికి శ్రీకృష్ణ భగవానుడు జబ్బ చరచి చప్పట్లను కొట్టి ఆ అరిష్టాసురునకు కోపమును కలిగించెను.

సఖ్యురంసే భుజాభోగం ప్రసార్యావస్థితో హరిః ।
సోఽప్యేవం కోపితోఽరిష్టః ఖురేణావనిముల్లిఖన్ ।
ఉద్యత్పుచ్ఛభ్రమన్మేఘః క్రుద్ధః కృష్ణముపాద్రవత్ ॥ 9

హరిః - శ్రీకృష్ణ భగవానుడు, సఖ్యుః - మిత్రుని, అంసే - భుజముపై, భుజాభోగమ్ - పాము పడగవంటి భుజమును, ప్రసార్య - చాపి ఉంచి, అవస్థితః - నిలబడినవాడు, ఏవమ్ - ఈ విధముగా, కోపితః - కోపము కలిగించబడిన, అరిష్టః అపి - అరిష్టాసురుడు కూడ, ఖురేణ - గిట్టతో, అవనిమ్ - నేలను, ఉల్లిఖన్ - త్రవ్వుచున్నవాడై, ఉద్యత్-పుచ్ఛభ్రమత్-మేఘః - పైకెత్తబడిన తోకయందు తిరుగుచున్న మేఘములు గలవాడై, క్రుద్ధః - కోపించినవాడై, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ఉపాద్రవత్ - మీదకు ఉరికెను.

శ్రీకృష్ణ భగవానుడు పాము పడగవంటి తన భుజమును ఒక మిత్రుని భుజముపై వేసి నిలబడెను. ఈ విధముగా శ్రీకృష్ణుడు కోపమును కలిగించగా, అరిష్టాసురుడు చాల కోపించెను. ఆతడు కాలి గిట్టతో నేలను త్రవ్వుతూ, తోకను పైకెత్తి దానితో మేఘములను గిర గిర త్రిప్పెను. వాడు శ్రీకృష్ణుని మీదకు ఉరికెను.

అగ్రన్యస్తవిషాణాగ్రః స్తబ్ధాసృగ్లోచనోఽచ్యుతమ్ ।
కటాక్షిప్యాద్రవత్తూర్ణమింద్రముక్తోఽశనిర్యథా ॥ 10

అగ్రన్యస్తవిషాణ-అగ్రః - ముందుకు ఉంచబడిన కొమ్ముల కొనలు గలవాడు, స్తబ్ధ-అసృగ్-లోచనః - నిశ్చలమైన రక్తమువంటి కన్నులు గలవాడు అగు రాక్షసుడు, అచ్యుతమ్ - శ్రీకృష్ణ భగవానుని, కటా - చూపుతో, ఆక్షిప్య - అర్థముగా చూచి, తూర్ణమ్ - వెంటనే, ఇంద్రముక్తః -

ఇంద్రునిచే విడిచిపెట్టబడిన, అశనిః యథా - వజ్రము వలె, అద్రవత్ - మీదకు ఉరికెను.

నిశ్చలమైన రక్తమువంటి కన్నులు గల ఆ రాక్షసుడు తన కొమ్ముల కొనలను ముందుకు ఉంచెను. వాడు శ్రీకృష్ణ భగవానుని అడ్డముగా చూస్తూ, ఇంద్రుడు విడిచిపెట్టిన వజ్రము వలె, వెంటనే మీదకు ఉరికెను.

గృహీత్వా శృంగయోస్తం వా అష్టాదశ పదాని సః ।
ప్రత్యపోవాహ భగవాన్ గజః ప్రతిగజం యథా ।। 11

సః - ఆ, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తమ్ - వానిని, శృంగయోః - రెండు కొమ్ములయందు, గృహీత్వా - పట్టుకొని, గజః - ఏనుగు, ప్రతి గజం యథా - ప్రతిస్పర్ధియగు ఏనుగును వలె, అష్టాదశ - పదునెనిమిది, పదాని - అడుగులను, ప్రత్యపోవాహ వై - గట్టిగా వెనుకకు పడగొట్టెను.

ఆ శ్రీకృష్ణ భగవానుడు ఆ అరిష్టాసురుని కొమ్ములను రెండింటినీ పట్టుకొని, ఏనుగు తన ప్రతిస్పర్ధియగు ఏనుగును వలె, వెనుకకు పదునెనిమిది అడుగుల దూరము గట్టిగా త్రోసి పడగొట్టెను.

సోఽపవిద్ధో భగవతా పునరుత్థాయ సత్వరః ।
ఆపతత్స్విన్నసర్వాంగో నిశ్శ్వసన్ క్రోధమూర్ఛితః ।। 12

భగవతా - శ్రీకృష్ణ భగవానునిచే, అపవిద్ధః - క్రింద పడగొట్టబడిన, సః - వాడు, సత్వరః - వేగముతో కూడినవాడై, పునః - మరల, ఉత్థాయ - పైకి లేచి, స్విన్నసర్వ-అంగః - చెమటతో తడిసిన సకలావయవములు గలవాడై, నిశ్శ్వసన్ - నిట్టూర్పులు విడుచుచున్నవాడు, క్రోధమూర్ఛితః - కోపముతో వ్యాపించబడినవాడు, ఆపతత్ - మీదకు వచ్చెను.

శ్రీకృష్ణ భగవానుడు క్రింద పడగొట్టగా ఆ రాక్షసుడు మరల వేగముగా పైకి లేచెను. వాడు కోపావిష్టుడై నిట్టూర్పులను విడుస్తూ మీదకు వచ్చెను. వాని అవయవములన్నియు చెమటతో తడిసెను.

తమాపతంతం స నిగృహ్య శృంగయోః
పదా సమాక్రమ్య నిపాత్య భూతలే ।

నిష్పీడయామాస యథాఽఽర్ద్రమంబరం
కృత్వా విషాణేన జఘాన సోఽపతత్ ॥ 13

ఆపతంతమ్ - మీదకు ఉరుకుచున్న, తమ్ - వానిని, శృంగయోః - రెండు కొమ్ములయందు, నిగృహ్య - గట్టిగా పట్టుకొని, సః - ఆ శ్రీకృష్ణుడు, భూతలే - నేలపై, నిపాత్య - పడగొట్టి, పదా - కాలితో, సమాక్రమ్య - గట్టిగా తొక్కిపెట్టి, ఆర్ద్రమ్ - తడియైన, అంబరం యథా - వస్త్రమును వలె, నిష్పీడయామాస - పిండివేసెను, కృత్వా - ఊడబెరకి, విషాణేన - కొమ్ముతో, జఘాన - పొడిచెను, సః - వాడు, అపతత్ - నేల గూలెను.

మీదకు ఉరుకుచున్న ఆ రాక్షసుని శ్రీకృష్ణుడు రెండు కొమ్ములయందు గట్టిగా పట్టుకొనెను. వానిని ఆయన నేలపై పడగొట్టి కాలితో గట్టిగా తొక్కిపెట్టెను. తడి బట్టను పిండినట్లుగా ఆయన వానిని పిండి వాని కొమ్మును ఊడబెరకి దానితో వానిని పొడువగా, వాడు నేల గూలెను.

అసృగ్వమన్మూత్రశకృత్సముత్సృజన్
క్షిపంశ్చ పాదానవస్థితేక్షణః ।
జగామ కృచ్ఛ్రం నిరృతేరథ క్షయం
పుష్పైః కిరంతో హరిమీడిరే సురాః ॥ 14

అసృక్ - రక్తమును, వమన్ - కక్కుచున్నవాడు, మూత్రశకృత్ - మూత్రమును పేడను, సముత్సృజన్ - అధికముగా విడిచిపెట్టువాడు, పాదాన్ చ - కాళ్లను కూడ, క్షిపన్ - కొట్టుకొనుచున్నవాడు, అనవస్థిత-ఈక్షణః - నిలకడ లేని చూపులు గలవాడు అగు రాక్షసుడు, కృచ్ఛ్రమ్ - కష్టముగా, నిరృతేః - మృత్యుదేవతయొక్క, క్షయమ్ - నివాసమును, జగామ - పొందెను, అథ - అప్పుడు, సురాః - దేవతలు, పుష్పైః - పూవులతో, కిరంతః - చల్లుచున్నవారై, హరిమ్ - శ్రీకృష్ణ భగవానుని, ఈడిరే - స్తుతించిరి.

ఆ రాక్షసుడు రక్తమును గ్రక్కుతూ మూత్రమును పేడను అధికముగా విడిచిపెడ్తూ కాళ్లను కూడ కొట్టుకొనుచుండెను. వాని చూపులో నిలకడ

లేకుండెను. వాడు కష్టపడుతూ మృత్యుదేవత ఒడిని చేరెను. తరువాత దేవతలు పూలవానలను కురిపించి శ్రీకృష్ణ భగవానుని స్తుతించిరి.

ఏవం కకుద్మినం హత్వా స్తూయమానస్స్వజాతిభిః ।
వివేశ గోష్ఠం సబలో గోపీనాం నయనోత్సవః ॥ 15

ఏవమ్ - ఈ విధముగా, కకుద్మినమ్ - పెద్ద మూపురము గల వృషభాసురుని, హత్వా - సంహరించి, స్వజాతిభిః - తన జ్ఞాతులైన గోపాలకులచే, స్తూయమానః - కొనియాడబడుచున్నవాడు, గోపీనామ్ - గోపికలకు, నయన-ఉత్సవః - కన్నుల పండువయైన శ్రీకృష్ణుడు, సబలః - బలరామునితో గూడినవాడై, గోష్ఠమ్ - గోకులమును, వివేశ - ప్రవేశించెను.

శ్రీకృష్ణుడీ విధముగా పెద్ద మూపురము గల వృషభాసురుని సంహరించెను. గోపాలకులు ఆయనను ప్రశంసించిరి. గోపికలకు కన్నుల పండువయగు గోవిందుడు బలరామునితో గోకులమును ప్రవేశించెను.

అరిష్టే నిహతే దైత్యే కృష్ణేనాద్భుతకర్మణా ।
కంసాయాథాహ భగవాన్ నారదో దేవదర్శనః ॥ 16

అద్భుతకర్మణా - ఆశ్చర్యకరమగు లీలలను నెరపే, కృష్ణేన - శ్రీకృష్ణునిచే, అరిష్టే దైత్యే - అరిష్టాసురుడు, నిహతే - సంహరించబడగా, అథ - అప్పుడు, భగవాన్ - పూజనీయుడు, దేవదర్శనః - దేవర్షి (దేవుని దర్శించువాడు, దర్శింపజేయువాడు) యగు, నారదః - నారదుడు, కంసాయ - కంసుని కొరకు, ఆహ - చెప్పెను.

ఆశ్చర్యకరమగు లీలలను చేసే శ్రీకృష్ణుడు అరిష్టాసురుని వధించెను. అప్పుడు దేవర్షియగు నారద భగవానుడు కంసునితో ఈ క్రింది విధముగా చెప్పెను. నారదుడు తాను దేవుని దర్శించుటయే గాక, భక్తులకు కూడ దేవుని దర్శింపజేయును.

యశోదాయాస్సుతాం కన్యాం దేవక్యాః కృష్ణమేవ చ ।
రామం చ రోహిణీపుత్రం వసుదేవేన బిభ్యతా ॥ 17

న్యస్తౌ స్వమిత్రే నందే వై యాభ్యాం తే పురుషా హతాః ।
నిశమ్య తద్భోజపతిః కోపాత్ప్రచలితేంద్రియః ॥ 18

యశోదాయాః - యశోదయొక్క, సుతామ్ - కుమార్తెయగు, కన్యామ్ - కన్యను గురించి, దేవక్యాః - దేవకియొక్క పుత్రుడగు, కృష్ణం ఏవ చ - శ్రీకృష్ణుని గురించి కూడ, రోహిణీపుత్రమ్ - రోహిణియొక్క పుత్రుడగు, రామం చ - బలరాముని గురించి కూడ, బిభ్యతా - భయపడుచున్న, వసుదేవేన - వసుదేవునిచే, స్వమిత్రే - తన మిత్రుడగు, నందే వై - నందునియందైతే, న్యస్తౌ - ఉంచబడినవారు, యాభ్యామ్ - ఏ ఇద్దరిచేనైతే, తే - నీ, పురుషాః - అనుచరులు, హతాః - చంపబడినారో, తత్ - ఆ విషయమును, నిశమ్య - విని, భోజపతిః - భోజదేశప్రభుడగు కంసుడు, కోపాత్ - కోపము వలన, ప్రచలిత-ఇంద్రియః - వ్యాకులమైన ఇంద్రియములు గలవాడు.

యశోదకు పుట్టినది ఆడపిల్లయే గాని కృష్ణుడు కాదనియు, కృష్ణుడు దేవకి పుత్రుడనియు, రోహిణియొక్క పుత్రుడు బలరాముడనియు, వారిద్దరిని నీకు భయపడిన వసుదేవుడు తన మిత్రుడగు నందుని వద్ద దాచినాడనియు, వారిద్దరే నీ అనుచరులను సంహరించినారనియు నారదుడు చెప్పెను. ఆ విషయమును విన్న భోజదేశాధిపతియగు కంసునకు ఇంద్రియములు, మనస్సు వ్యాకులమయ్యెను.

నిశాతమసిమాదత్త వసుదేవజిఘాంసయా ।
నివారితో నారదేన తత్సుతౌ మృత్యుమాత్మనః ॥ 19

జ్ఞాత్వా లోహమయైః పాశైర్బబంధ సహ భార్యయా ।
ప్రతియాతే తు దేవర్షౌ కంస ఆభాష్య కేశినమ్ ॥ 20

ప్రేషయమాస హన్యేతాం భవతా రామకేశవౌ ।

వసుదేవజిఘాంసయా - వసుదేవుని చంపే కోరికతో, నిశాతమ్ - వాడియైన, అసిమ్ - కత్తిని, ఆదత్త - తీసుకొనెను, నారదేన - నారదునిచే, నివారితః - అడ్డుకొనబడినవాడు, తత్-సుతౌ - ఆ వసుదేవుని పుత్రులిద్దరిని, ఆత్మనః - తనకు, మృత్యుమ్ - మృత్యువునుగా, జ్ఞాత్వా -

తెలుసుకొని, భార్యయా సహ - భార్యయగు దేవకితో సహా, పాశైః - సంకెళ్లతో, బబంధ - బంధించెను, దేవ-ఋషౌ తు - దేవర్షియైతే, ప్రతియాతే - తిరిగి వెళ్లగా, కంసః - కంసుడు, కేశినమ్ - కేశిని, ఆభాష్య - పిలిపించి, ప్రేషయామాస - పంపించెను, భవతా - నీచే, రామకేశవౌ - బలరాముడు శ్రీకృష్ణుడు, హన్యేతామ్ - సంహరించ బడుగాక!

కంసుడు వసుదేవుని చంపగోరి వాడి కత్తిని తీసుకోగా, నారద మహర్షి అడ్డుకొనెను. బలరామకృష్ణులు తనకు మృత్యువు అని తెలిసిన కంసుడు వసుదేవుని దేవకితో సహా సంకెళ్లతో బంధించెను. దేవర్షి నారదుడు తిరిగి వెళ్లెను. అప్పుడు కంసుడు కేశిని పిలిపించి, నీవు బలరామకృష్ణులను సంహరించుమని పంపించెను.

తతో ముష్టికచాణూరశలతోశలకాదికాన్ ।। 21

అమాత్యాన్ హస్తిపాంశ్చైవ సమాహూయాహ భోజరాట్ ।
భో భో నిశమ్యతామేతద్వీరచాణూరముష్టికౌ ।। 22

తతః - తరువాత, భోజరాట్ - భోజదేశప్రభువగు కంసుడు, ముష్టికచాణూరశలతోశలక-ఆదికాన్ - ముష్టికుడు చాణూరుడు శలుడు తోశలకుడు మొదలగువారిని, అమాత్యాన్ - మంత్రులను, హస్తిపాన్ చ ఏవ - మావటీంద్రను కూడ, సమాహూయ - ఆహ్వానించి, ఆహ - పలికెను, భోః - ఓయీ!, భోః - ఓయీ!, వీరచాణూరముష్టికౌ - వీరులగు చాణూరముష్టికులారా!, ఏతత్ - ఈ మాట, నిశమ్యతామ్ - వినబడుగాక!

కేశిని పంపిన తరువాత భోజదేశప్రభుడగు కంసుడు, ముష్టికుడు, చాణూరుడు, శలుడు, తోశలుడు మొదలగు మల్లులను, మంత్రులను, మావటీంద్రను కూడ పిలిపించి ఇట్లు పలికెను -- ఓయీ! ముష్టికా! ఓయీ! చాణూరా! మీరిద్దరు వీరులు. మీరు నా మాటను వినుడు.

నందవ్రజే కిలాసాతే సుతావానకదుందుభేః ।
రామకృష్ణౌ తతో మహ్యం మృత్యుః కిల నిదర్శితః ।। 23

ఆనకదుందుభేః - వసుదేవునియొక్క, సుతౌ - పుత్రులిద్దరు, రామకృష్ణౌ - బలరామకృష్ణులు, నందవ్రజే - నందుని గోకులమునందు,

ఆసాతే కిల - ఉన్నారు సుమా!, తతః - వారిద్దరి వలన, మహ్యామ్ - నా కొరకు, మృత్యుః - మరణము, నిదర్శితః కిల - చెప్పబడినది గదా!

వసుదేవుని పుత్రులగు బలరామకృష్ణులు నందుని గోకులములో ఉన్నారు సుమా! వారిద్దరి వలననే నాకు మరణము వచ్చునని ఆకాశవాణి చెప్పినది గదా!

భవద్భ్యామిహ సంప్రాప్తౌ హన్యేతాం మల్లలీలయా ।
మంచాః క్రియంతాం వివిధా మల్లరంగపరిశ్రితాః ।
పౌరా జానపదాస్సర్వే పశ్యంతు స్వైరసంయుగమ్ ॥ 24

భవద్భ్యామ్ - మీ యిద్దరిచే, ఇహ - ఇచటకు, సంప్రాప్తౌ - వచ్చిన బలరామకృష్ణులిద్దరు, మల్లలీలయా - మల్లక్రీడచే, హన్యేతామ్ - సంహరించబడుగాక!, మల్లరంగపరిశ్రితాః - మల్లయుద్ధరంగమునందు చుట్టూ ఉన్న, వివిధాః - పలురకముల, మంచాః - ఎత్తైన ఆసనములు, క్రియంతామ్ - చేయబడుగాక!, స్వైరసంయుగమ్ - యథేచ్ఛగా జరిగే యుద్ధమును, పౌరాః - నగరప్రజలు, జానపదాః - పల్లెవాసులు, సర్వే - అందరు, పశ్యంతు - చూచెదరు గాక!

బలరామకృష్ణులిద్దరు ఇచటకు వచ్చినప్పుడు మీరిద్దరు వారిని మల్లక్రీడలో సంహరించుడు. మల్లయుద్ధరంగమునందు చుట్టూ పలురకముల ఎత్తైన ఆసనములను ఏర్పాటు చేయుడు. నగరప్రజలు, పల్లెవాసులు యథేచ్ఛగా జరిగే మల్లయుద్ధమును చూచెదరు గాక!

మహామాత్ర త్వయా భద్ర రంగద్వార్యుపనీయతామ్ ।
ద్విపః కువలయాపీడో జహి తేన మమాహితౌ ॥ 25

మహామాత్ర - ఓ మావటీ!, భద్ర - మంగళకరా!, త్వయా - నీచే, కువలయాపీడః - కువలయాపీడమనే, ద్విపః - ఏనుగు, రంగద్వారి - మల్ల రంగముయొక్క ద్వారమునందు, ఉపనీయతామ్ - తీసుకురాబడు గాక!, తేన - దానితో, మమ - నా, అహితౌ - శత్రువులనిద్దరిని, జహి - చంపుము.

ఓ మావటీ! నాకు హితమును చేసేది నీవే. నీవు కువలయాపీడమనే ఏనుగును మల్లరంగద్వారము వద్దకు తీసుకు రమ్ము. దానితో నా శత్రువులగు బలరామకృష్ణులిద్దరిని సంహరించుము.

ఆరభ్యతాం ధనుర్యాగశ్చతుర్దశ్యాం యథావిధి ।
విశసంతు పశూన్మేధ్యాన్ భూతరాజాయ మీఢుషే ॥ 26

చతుర్దశ్యామ్ - చతుర్దశినాడు, యథావిధి - విధినతిక్రమించకుండగా, ధనుర్యాగః - ధనుస్సు అనే యజ్ఞము, ఆరభ్యతామ్ - ఆరంభించబడుగాక!, మీఢుషే - కోరికలను వర్షించే, భూతరాజాయ - భూతనాథుడగు భైరవుని కొరకు, మేధ్యాన్ - పవిత్రములైన, పశూన్ - పశువులను, విశసంతు - బలిని ఇచ్చెదరు గాక!

చతుర్దశినాడు ధనుస్సు అనే (శత్రువుపై విజయమునిచ్చే) యాగమును యథావిధిగా ఆరంభించుడు. కోరికలను వర్షించే భూతనాథుడగు భైరవుని కొరకు పవిత్రములైన పశువులను బలి యిండు.

ఇత్యాజ్ఞాప్యార్థతంత్రజ్ఞ ఆహూయ యదుపుంగవమ్ ।
గృహీత్వా పాణినా పాణిం తతోఽక్రూరమువాచ హ ॥ 27

అర్థతంత్రజ్ఞః - కార్యములను సాధించుటయందు నేర్పరియగు కంసుడు, ఇతి - ఈ విధముగా, ఆజ్ఞాప్య - ఆజ్ఞాపించి, తతః - తరువాత, యదుపుంగవమ్ - యాదవులలో శ్రేష్ఠుడగు, అక్రూరమ్ - అక్రూరుని, ఆహూయ - పిలిచి, పాణినా - చేతితో, పాణిమ్ - చేతిని, గృహీత్వా - పట్టుకొని, ఉవాచ హ - పలికెను.

కంసుడు స్వార్థసంపాదనములో పండితుడు. ఆతడు ఈ విధముగా వారిని ఆజ్ఞాపించి తరువాత యాదవశ్రేష్ఠుడగు అక్రూరుని పిలిచెను. ఆయన చేతిని తన చేతితో పట్టుకొని, కంసుడు ఆయనతో నిట్లనెను.

భో భో దానపతే మహ్యం క్రియతాం మైత్రమాదృతః ।
నాన్యస్త్వత్తో హితతమో విద్యతే భోజవృష్ణిషు ॥ 28

భోః - ఓయీ!, భోః - ఓయీ!, దానపతే - ఉదారులలో శ్రేష్ఠుడా!, ఆదృతః - శ్రద్ధ గలవాడవై, మహ్యామ్ - నా కొరకు, మైత్రమ్ - మిత్రకార్యము, క్రియతామ్ - చేయబడుగాక!, త్వత్తః - నీకంటె, హితతమః - ఎక్కువ హితమును చేయువాడు, భోజవృష్ణిషు - భోజవృష్ణివంశీయులయందు, అన్యః - మరియొకడు, న విద్యతే - లేడు.

ఓయీ! ఓయీ! అక్రూరా! నీవు ఉదారులలో శ్రేష్ఠుడవు. నాకు నీవు మిత్రుడు చేసే ఉపకారమును ఆదరముతో చేయవలెను. భోజవృష్ణి వంశీయులలో నీకంటె ఎక్కువ హితమును కోరువాడు మరియొకడు లేడు.

అతస్త్వామాశ్రితస్సౌమ్య కార్యగౌరవసాధనమ్ ।
యథేంద్రో విష్ణుమాశ్రిత్య స్వార్థమధ్యగమద్విభుః ॥ 29

సౌమ్య - ఓ సౌమ్యుడా!, అతః - ఇందువలన, కార్యగౌరవసాధనమ్ - పనిని గొప్పగా సాధించి పెట్టే, త్వామ్ - నిన్ను, ఆశ్రితః - ఆశ్రయించినవాడను, యథా - ఏ విధముగానైతే, విభుః - సర్వసమర్థుడగు, ఇంద్రః - ఇంద్రుడు, విష్ణుమ్ - విష్ణువును, ఆశ్రిత్య - ఆశ్రయించి, స్వ-అర్థమ్ - తన ప్రయోజనమును, అధ్యగమత్ - పొందెనో.

ఓ ప్రియదర్శనా! అక్రూరా! కావుననే, ఏ విధముగానైతే ఇంద్రుడు సర్వసమర్థుడే అయినా, విష్ణువు నాశ్రయించి తన రాజ్యమును తిరిగి పొందెనో, అదే విధముగా, నేను నిన్ను ఆశ్రయించుచున్నాను. నీవు పనిని గొప్పగా సాధించి పెట్టెదవు.

గచ్ఛ నందవ్రజం తత్ర సుతావానకదుందుభేః ।
ఆసాతే తావిహానేన రథేనానయ మా చిరమ్ ॥ 30

నందవ్రజమ్ - నందుని గోకులమును గురించి, గచ్ఛ - వెళ్లుము, తత్ర - అచట, ఆనకదుందుభేః - వసుదేవునియొక్క, సుతౌ - పుత్రులిద్దరు, ఆసాతే - ఉన్నారు, తౌ - వారిద్దరిని, అనేన - ఈ, రథేన - రథముచే, ఇహ - ఇచటకు, ఆనయ - తీసుకురమ్ము, చిరమ్ - విలంబము, మా - వద్దు.

నందుని గోకులమునకు వెళ్లుము. అచట వసుదేవుని పుత్రులిద్దరు ఉన్నారు. వారిని ఈ రథముపై ఇచటకు తీసుకు రమ్ము. విలంబము వద్దు.

నిసృష్టః కిల మే మృత్యుర్దేవైర్వైకుంఠసంశ్రయైః ।
తావానయ సమం గోపైర్నందాద్యైస్సాభ్యుపాయనైః ॥ 31

వైకుంఠసంశ్రయైః - విష్ణువు ఆశ్రయముగా గల, దేవైః - దేవతలచే, మే - నా, మృత్యుః - మరణము, నిసృష్టః కిల - కల్పించబడినదిట గదా!, తౌ - వారిద్దరిని, స-అభ్యుపాయనైః - మంచి కానుకలతో కూడిన, నంద-ఆద్యైః - నందుడు మొదలుగా గల, గోపైః సమమ్ - గోపాలకులతో బాటుగా, ఆనయ - తీసుకు రమ్ము.

విష్ణువు ఆశ్రయముగా గల దేవతలు వారిద్దరిని నాకు మరణహేతువులుగా నిర్దేశించిరట గదా! వారిద్దరిని తీసుకు రమ్ము. వారితో బాటుగా నందుడు మొదలగు గోపాకులను కూడ కానుకలనిచ్చి తీసుకు రమ్ము.

ఘాతయిష్య ఇహానీతౌ కాలకల్పేన హస్తినా ।
యది ముక్తౌ తతో మల్లైర్ఘాతయే వైద్యుతోపమైః ॥ 32

ఇహ - ఇచటకు, ఆనీతౌ - తీసుకు రాబడిన వారిద్దరిని, కాలకల్పేన - మృత్యువుతో సమానమైన, హస్తినా - ఏనుగుచే, ఘాతయిష్యే - చంపించెదను, ముక్తౌ యది - విడుదలను పొందినవారైనచో, తతః - తరువాత, వైద్యుత-ఉపమైః - పిడుగుతో పోల్చదగిన, మల్లైః - మల్లులచే, ఘాతయే - చంపించెదను.

ఇచటకు తీసుకు రాబడిన వారిద్దరిని మృత్యువుతో సమానమైన ఏనుగుచే చంపించెదను. ఒకచో వారు ఏనుగును తప్పించుకున్నచో, పిడుగులవంటి మల్లులచే వారిని చంపించెదను.

తయోర్నిహతయోస్తప్తాన్ వసుదేవపురోగమాన్ ।
తద్బంధూన్నిహనిష్యామి వృష్ణిభోజదశార్హకాన్ ॥ 33

తయోః - వారిద్దరు, నిహతయోః - చంపబడగా, తప్తాన్ - దుఃఖితులైన, వసుదేవపురోగమాన్ - వసుదేవుడు మొదలుగా గల, తద్-బంధూన్ - వారి బంధువులను, వృష్ణిభోజదశార్హకాన్ - వృష్ణిభోజదశార్హవంశీయులను, నిహనిష్యామి - సంహరించెదను.

వారిద్దరు మరణించగా వారి బంధువులు, వృష్ణిభోజదశార్హవంశములకు చెందిన వసుదేవుడు మొదలగువారు దుఃఖితులగుదురు. వారిని కూడ సంహరించెదను.

ఉగ్రసేనం చ పితరం స్థవిరం రాజ్యకాముకమ్ ।
తద్భ్రాతరం దేవకం చ యే చాన్యే విద్విషో మమ ॥ 34

పితరమ్ - తండ్రియైనట్టియు, స్థవిరమ్ - ముదుసలి యైనట్టియు, రాజ్యకాముకమ్ - రాజ్యమునందు కోరిక గల, ఉగ్రసేనం చ - ఉగ్రసేనుని కూడ, తద్-భ్రాతరమ్ - ఆయన సోదరుడగు, దేవకం చ - దేవకుని కూడ, యే - ఏ, అన్యే చ - ఇతరులు కూడ, మమ - నాకు, విద్విషః - శత్రువులో.

నా తండ్రి ఉగ్రసేనుడు ముదుసలియైనా రాజ్యమునందు కోరిక గలవాడు. ఆయనను, ఆయన సోదరుడగు దేవకుని, ఇంకా నన్ను ద్వేషించే ఇతర శత్రువులెవరు గలరో వారిని కూడ సంహరించెదను.

తతశ్చైషా మహీ మిత్ర భవిత్రీ నష్టకంటకా ।
జరాసంధో మమ గురుర్ద్వివిదో దయితస్సఖా ॥ 35

మిత్ర - ఓ మిత్రమా!, తతః చ - తరువాతనైతే, ఏషా - ఈ, మహీ - భూమి, నష్టకంటకా - నశింపజేయబడిన ముళ్లవంటి శత్రువులు గలది, భవిత్రీ - కానున్నది, మమ - నాకు, జరాసంధః - జరాసంధుడు, గురుః - గురువు, ద్వివిదః - ద్వివిదుడు, దయితః - ప్రియమైన, సఖా - మిత్రుడు.

ఓ మిత్రమా! తరువాతనైతే ఈ రాజ్యము ముళ్లవంటి శత్రువులు లేనిది యగును. నాకు జరాసంధుడు గురువు, ద్వివిదుడు ప్రియమిత్రుడు.

శంబరో నరకో బాణో మయ్యేవ కృతసౌహృదాః ।
తైరహం సురపక్షీయాన్ హత్వా భోక్ష్యే మహీం నృపాన్ ॥ 36

శంబరః - శంబరుడు, నరకః - నరకుడు, బాణః - బాణుడు, మయి ఏవ - నాయందే, కృతసౌహృదాః - చేయబడిన ప్రేమ గలవారు, తైః - వారితో కూడి, అహమ్ - నేను, సురపక్షీయాన్ - దేవతల పక్షమున ఉండే, నృపాన్

- రాజులను, హత్వా - సంహరించి, మహీమ్ - భూమిని, భోక్ష్యే - భోగించగలను.

శంబరుడు, నరకుడు, బాణుడు నాయందే ప్రేమ గలవారు. వారితో కూడి నేను దేవతల పక్షమునకు చెందిన రాజులను చంపి భూసామ్రాజ్యమును అనుభవించెదను.

ఏతజ్జ్ఞాత్వాऽऽనయ క్షిప్రం రామకృష్ణావిహార్భకౌ ।
ధనుర్మఖనిరీక్షార్థం ద్రష్టుం యదుపురశ్రియమ్ ॥ 37

ఏతత్ - ఈ విషయమును, జ్ఞాత్వా - తెలుసుకొని, అర్భకౌ - బుడతలైన, రామకృష్ణౌ - బలరామకృష్ణులను, ఇహ - ఇచటకు, ధనుః-మఖనిరీక్షా-అర్థమ్ - ధనుర్యాగమును చూచుట కొరకు, యదుపురశ్రియమ్ - యాదవుల నగరమైన మథురయొక్క శోభను, ద్రష్టుమ్ - చూచుటకు, క్షిప్రమ్ - శీఘ్రముగా, ఆనయ - తీసుకురమ్ము.

ఈ రహస్యము నీకు తెలిసినది. నీవు బలరామకృష్ణులనే బుడతలనిచటకు తీసుకు రమ్ము. ధనుర్యాగమును, యాదవుల నగరమైన మథురయొక్క సంపదను చూచుట కొరకు, అని మాత్రమే చెప్పుము.

అక్రూర ఉవాచ ।
రాజన్ మనీషితం సమ్యక్తవ స్వావద్యమార్జనమ్ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమం కుర్యాద్దైవం హి ఫలసాధనమ్ ॥ 38

రాజన్ - ఓ రాజా!, స్వ-అవద్యమార్జనమ్ - నీ మరణమును తప్పించే, తవ - నీ, మనీషితమ్ - విచారము, సమ్యక్ - బాగు, సిద్ధి-అసిద్ధ్యోః - సిద్ధించుటయందు సిద్ధించకపోవుటయందు, సమమ్ - సమమగు చిత్తమును, కుర్యాత్ - చేసుకొనవలెను, హి - ఏలయన, ఫలసాధనమ్ - ఫలమును సంపాదించి పెట్టేది, దైవమ్ - అదృష్టము.

అక్రూరుడిట్లు పలికెను --- ఓ రాజా! మరణమును తప్పించుకొనే ఉపాయమును నీవు బాగానే విచారించినావు. కాని, మనము కార్యము సిద్ధించుట, సిద్ధించకపోవుట అనే రెండు పరిస్థితులను సమచిత్తముతో స్వీకరించవలెను. ఏలయన, కార్యసిద్ధి దైవాధీనము.

మనోరథాన్ కరోత్యుచ్చైర్జనో దైవహతానపి ।
యుజ్యతే హర్షశోకాభ్యాం తథాऽప్యాజ్ఞాం కరోమి తే ॥ 39

జనః - మానవుడు, దైవహతాన్ - దైవముచే చెడగొట్టబడిన, ఉచ్చైః - పెద్ద, మనః-రథాన్ అపి - కోరికలను కూడ, కరోతి - చేయును, హర్షశోకాభ్యామ్ - హర్షశోకములతో, యుజ్యతే - సంయోగమును పొందును, తథా అపి - అయినప్పటికీ, తే - నీ, ఆజ్ఞామ్ - ఆదేశమును, కరోమి - చేసెదను.

మానవుడు పెద్ద పెద్ద కోరికలను కోరును; దైవముచే తిరస్కరించబడే కోరికలను కూడ కోరును. కోరిక సిద్ధిస్తే హర్షమును, సిద్ధించకపోతే శోకమును పొందును. అయిననూ, నేను నీ ఆదేశమును పాటించెదను.

శ్రీశుక ఉవాచ ।
ఏవమాదిశ్య చాక్రూరం మంత్రిణశ్చ విసృజ్య సః ।
ప్రవివేశ గృహం కంసస్తథాऽక్రూరస్స్వమాలయమ్ ॥ 40

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే షట్త్రింశోऽధ్యాయః ॥

సః - ఆ, కంసః - కంసుడు, అక్రూరమ్ - అక్రూరుని, మంత్రిణః చ - మంత్రులను కూడ, ఏవమ్ - ఈ విధముగా, ఆదిశ్య - ఆదేశించి, విసృజ్య చ - సెలవును కూడ యిచ్చి, గృహమ్ - ఇంటిని, ప్రవివేశ - ప్రవేశించెను, తథా - అదే విధముగా, అక్రూరః - అక్రూరుడు, స్వమ్ - తనదైన, ఆలయమ్ - ఇంటిని.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆ కంసుడు అక్రూరునకు, మంత్రులకు కూడ ఆ విధముగా ఆదేశములనిచ్చి వారికి వెళ్లుటకు అనుమతినిచ్చి తాను ప్రాసాదమును ప్రవేశించెను. అక్రూరుడు తన గృహమునకు చేరుకొనెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము పూర్వార్ధములో
వృషభాసురుని ఉద్ధారమును, కంసుడు అక్రూరుని గోకులమునకు
పంపుటను వర్ణించే ముప్పది ఆరవ అధ్యాయము ముగిసినది (36).

* * * * *

# అథ సప్తత్రింశోऽధ్యాయః

## శ్రీకృష్ణుడు కేశిని, వ్యోమాసురుని ఉద్ధరించుట - నారద స్తుతి

శ్రీశుక ఉవాచ ।
కేశీ తు కంసప్రహితః ఖురైర్మహీం మహాహయో నిర్జరయన్మనోజవః ।
సటావధూతాభ్రవిమానసంకులం కుర్వన్నభో హేషితభీషితాఖిలః ।। 1

కంసప్రహితః - కంసునిచే పంపబడిన, కేశీ తు - కేశియైతే, మనః-జవః - మనస్సుయొక్క వేగము వంటి వేగము గల, మహాహయః - పెద్ద గుఱ్ఱమై, ఖురైః - డెక్కలతో, మహీమ్ - నేలను, నిర్జరయన్ - పగులగొట్టుచున్నవాడు, నభః - ఆకాశమును, సటా-అవధూత-అభ్రవిమానసంకులమ్ - జూలుచే చెదరగొట్టబడిన మేఘములతో విమానములతో చెల్లాచెదరైనదానినిగా, కుర్వన్ - చేయువాడు, హేషితభీషిత-అఖిలః - సకిలింపుచే భయపెట్టబడిన సర్వులు గలవాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- కంసుడు పంపిన కేశి (జూలు గలవాడు) పెద్ద గుఱ్ఱమై మనోవేగముతో బృందావనమునకు వచ్చెను. ఆతడు డెక్కలతో నేలను చీల్చివేయుచుండెను. ఆతడు జూలును విదల్చగా ఆకాశములోని మేఘములు, దేవతల విమానములు చెల్లాచెదరగుచుండెను. ఆతని సకిలింపునకు అందరు భయపడిరి.

విశాలనేత్రో వికటాస్యకోటరో బృహద్గలో నీలమహాంబుదోపమః,
దురాశయః కంసహితం చికీర్షుర్వ్రజం స నందస్య జగామ కంపయన్

విశాలనేత్రః - నిడివి కన్నులవాడు, వికట-ఆస్యకోటరః - చెట్టు తొఱ్ఱవంటి వంకర మూతి గలవాడు, బృహద్-గలః - పెద్ద కంఠము గలవాడు, నీలమహా-అంబుద-ఉపమః - నల్లని పెద్ద మేఘమును పోలిన

వాడు, దురాశయః - దుర్బుద్ధి, కంసహితమ్ - కంసునకు హితమును, చికీర్షుః - చేయగోరువాడు అగు, సః - ఆ కేశి, నందస్య - నందుని, వ్రజమ్ - గోకులమును, కంపయన్ - వణికించువాడై, జగామ - వెళ్లెను. 2

నిడివి కన్నులు, చెట్టు తొఱ్ఱవంటి వంకర మూతి, పెద్ద కంఠము కలిగిన ఆ కేశి నల్లని పెద్ద మేఘమును పోలియుండెను. ఆ దుర్బుద్ధి కంసుని హితమును చేయగోరి నందుని గోకులమునకు రాగా భూమి కంపించెను.

తం త్రాసయంతం భగవాన్స్వగోకులం
తద్ధేషితైర్వాలవిఘూర్ణితాంబుదమ్ ।
ఆత్మానమాజౌ మృగయంతమగ్రణీః
ఉపాహ్వయత్స వ్యనదన్మృగేంద్రవత్ ॥ 3

తద్-హేషితైః - అట్టి సకిలింపులతో, స్వగోకులమ్ - తన గోకులమును, త్రాసయంతమ్ - భయపెట్టుచున్నట్టియు, వాలవిఘూర్ణిత-అంబుదమ్ - తోకచే గిరగిర త్రిప్పబడిన మేఘములు కలిగినట్టియు, ఆత్మానమ్ - తనను, ఆజౌ - యుద్ధము విషయమునందు, మృగయంతమ్ - వెదుకుచున్న, తమ్ - ఆ కేశిని, అగ్రణీః - అగ్రేసరుడగు, సః - ఆ, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఉపాహ్వయత్ - దగ్గరకు రమ్మని సవాలు విసిరెను, మృగ-ఇంద్రవత్ - సింహము వలె, వ్యనదత్ - నాదము చేసెను.

అట్టి (కర్కశమైన) సకిలింపులతో కేశి శ్రీకృష్ణ భగవానుని గోకులమును భయపెట్టుచుండెను. ఆతడు తోకతో మేఘములను గిరగిర త్రిప్పుచుండెను. ఆతడు యుద్ధము చేయుటకు శ్రీకృష్ణుని కొరకై వెదుకుచుండెను. అపుడు గోకులనాయకుడగు శ్రీకృష్ణుడు వానిని రమ్మని సవాలు చేసి, సింహము వలె నాదము చేసెను.

**స తం నిశామ్యాభిముఖో ముఖేన ఖం పిబన్నివాభ్యద్రవదత్యమర్షణః,**
**జఘాన పద్భ్యామరవిందలోచనం దురాసదశ్చండజవో దురత్యయః॥4**

**దురాసదః - సమీపించ శక్యము కానివాడు, చండజవః - భయంకరమగు వేగము గలవాడు, దురత్యయః - అతిక్రమించ శక్యము కానివాడు అగు, సః - ఆ కేశి, తమ్ - ఆ, అరవిందలోచనమ్ -**

పద్మములవంటి కన్నులు గల శ్రీకృష్ణుని, నిశామ్య - చూచి, అతి-అమర్షణః - అధికమగు కోపము గలవాడై, అభిముఖః - ఎదురుగా నున్నవాడై, ముఖేన - నోటితో, ఖమ్ - ఆకాశమును, పిబన్ ఇవ - త్రాగుచున్నాడా యన్నట్లు, అభి-అద్రవత్ - అభిముఖముగా పరుగెత్తెను, పద్భ్యామ్ - రెండు కాళ్లతో, జఘాన - తన్నెను.

ఆ కేశి సమీపించుట కాని, అతిక్రమించుట కాని శక్యము కాని భయంకరమగు వేగము గలవాడు. ఆతడు పద్మములవంటి కన్నులు గల ఆ శ్రీకృష్ణుని చూచి పెద్ద కోపముతో ఆయనకు ఎదురుగా వచ్చెను. నోటితో ఆకాశమును త్రాగుచున్నాడా యన్నట్లు ఆతడు ఆయనకు ఎదురుగా పరుగెత్తి వెనుక కాళ్లతో తన్నెను.

తద్వంచయిత్వా తమధోక్షజో రుషా
  ప్రగృహ్య దోర్భ్యాం పరివిధ్య పాదయోః ।
సావజ్ఞముత్సృజ్య ధనుశ్శతాంతరే
  యథోరగం తార్క్ష్యసుతో వ్యవస్థితః ॥ 5

అధోక్షజః - ఇంద్రియగోచరము కాని స్వరూపము గల శ్రీకృష్ణుడు, తత్ - ఆ దెబ్బను, వంచయిత్వా - తప్పించుకొని, రుషా - కోపముతో, తమ్ - వానిని, తార్క్ష్యసుతః - కశ్యపుని పుత్రుడగు గరుడుడు, ఉరగం యథా - పామును వలె, దోర్భ్యామ్ - రెండు చేతులతో, పాదయోః - రెండు కాళ్ల యందు, ప్రగృహ్య - గట్టిగా పట్టుకొని, పరివిధ్య - త్రిప్పి, ధనుః -శత-అంతరే - వంద ధనుస్సుల దూరమునందు, స-అవజ్ఞమ్ - తిరస్కార పూర్వకముగా, ఉత్సృజ్య - పారవైచి, వ్యవస్థితః - నిలబడినవాడు.

ఇంద్రియగోచరము కాని స్వరూపము గల శ్రీకృష్ణుడు ఆ దెబ్బను తప్పించుకొనెను. ఆయన కోపముతో వానిని, కశ్యప ప్రజాపతి పుత్రుడగు గరుడుడు పామును వలె, రెండు చేతులతో రెండు వెనుక కాళ్లను పట్టుకొని గిర గిర త్రిప్పి, తిరస్కార పూర్వకముగా వంద ధనుస్సుల దూరమునకు విసిరి వైచి నిలబడెను.

స లబ్ధసంజ్ఞః పునరుత్థితో రుషా
వ్యాదాయ కేశీ తరసాఽఽపతద్ధరిమ్ ।
సోఽప్యస్య వక్త్రే భుజముత్తరం స్మయన్
ప్రవేశయామాస యథోరగం బిలే ॥ 6

లబ్ధసంజ్ఞః - పొందబడిన స్పృహ గలవాడు, పునః - మరల, ఉత్థితః - లేచి నిలబడినవాడు అగు, సః - ఆ, కేశీ - కేశి, రుషా - కోపముతో, వ్యాదాయ - నోరు తెరిచి, తరసా - వేగముతో, హరిమ్ - శ్రీకృష్ణ భగవానుని గురించి, ఆపతత్ - మీదకు వచ్చెను, సః అపి - ఆయన కూడ, స్మయన్ - నవ్వుచున్నవాడై, అస్య - వీని, వక్త్రే - నోటియందు, ఉత్తరమ్ - ఎడమ, భుజమ్ - చేతిని, ఉరగమ్ - పామును, బిలే యథా - కలుగునందు వలె, ప్రవేశయమాస - ప్రవేశపెట్టెను.

ఆ కేశి స్పృహ వచ్చి మరల లేచి నిలబడి కోపముతో నోరు తె... వేగముగా శ్రీకృష్ణుని మీదకు వచ్చెను. ఆయన కూడ నవ్వుతూ నోటిలో ఎడమ చేతిని, కలుగులో పామును వలె, ప్రవేశపెట్టెను.

దంతా నిపేతుర్భగవద్భుజస్పృశః
తే కేశినస్తప్తమయస్పృశో యథా ।
బాహుశ్చ తద్దేహగతో మహాత్మనో
యథాఽఽమయస్సంవవృధే ఉపేక్షితః ॥

భగవద్-భుజస్పృశః - శ్రీకృష్ణ భగవానుని చేతిని స్పృశించిన, కేశినః - కేశియొక్క, తే - ఆ, దంతాః - దంతములు, తప్తమయస్పృశః యథా - లోహపు ముద్దను స్పృశించినవి వలె, నిపేతుః - రాలినవి, మహా-ఆత్మనః - సర్వమునకు ఆత్మయగు శ్రీకృష్ణుని, తద్-దేహగతః - వాని దేహమునందున్న, బాహుః చ - చేయి కూడ, ఉపేక్షితః - ఉపేక్ష చేయ బడిన, ఆమయః యథా - రోగము వలె, సంవవృధే - బాగా పెరిగెను.

శ్రీకృష్ణ భగవానుని చేతిని కేశి దంతములతో కొరకబోగా, అవి లోహపు ముద్దను కొరికినవా యన్నట్లు రాలినవి. సర్వమునకు ఆత్మయగు

భగవానుని చేయి కూడ వాని దేహము లోపల, ఉపేక్ష చేయబడిన జలోదర రోగము వలె, బాగా పెరిగి పెద్దదాయెను.

సమేధమానేన స కృష్ణబాహునా నిరుద్ధవాయుశ్చరణాంశ్చ విక్షిపన్,
ప్రస్విన్నగాత్రః పరివృత్తలోచనః పపాత లేండం విసృజన్ క్షితౌ వ్యసుః.

సమేధమానేన - బాగా పెద్దదగుచున్న, కృష్ణబాహునా - శ్రీకృష్ణుని చేతిచే, నిరుద్ధవాయుః - అడ్డుకొనబడిన ఊపిరి గల, సః - ఆ కేశి, చరణాన్ చ - కాళ్లను కూడ, విక్షిపన్ - కొట్టుకొనుచున్నవాడు, ప్రస్విన్నగాత్రః - చెమటతో తడిసిన దేహము గలవాడు, పరివృత్తలోచనః - బయటకు పొడుచుకు వచ్చిన కళ్లు గల వాడు, లేండమ్ - పేడను, విసృజన్ - విడిచిపెట్టుచున్నవాడు, వి-అసుః - పోయిన ప్రాణములు గలవాడై, క్షితౌ - నేలపై, పపాత - పడెను. 8

శ్రీకృష్ణుని చేయి బాగా పెద్దది కాగా, ఆ కేశికి ఊపిరి అడ్డుకొనబడెను. వాని దేహము చెమటతో తడిసి ముద్దయై కళ్లు బయటకు పొడుచుకు వచ్చెను. వాడు కాళ్లను కొట్టుకుంటూ పేడను వేస్తూ ప్రాణములు పోయి నేల గూలెను.

తద్దేహతః కర్కటికాఫలోపమాద్వ్యసోరపాకృష్య భుజం మహాభుజః ।
అవిస్మితోఽయత్నహతారిరుత్స్మయైః ప్రసూనవర్షైర్దివిషద్భిరీడితః ॥9

మహాభుజః - గొప్ప భుజశక్తి గలవాడు, అయత్నహత-అరిః - ప్రయత్నము లేకుండగనే సంహరించబడిన శత్రువులు గలవాడు అగు శ్రీకృష్ణుడు, కర్కటికాఫల-ఉపమాత్ - దోసపండును పోలియున్నట్టియు, వి-అసోః - పోయిన ప్రాణములు గల, తద్-దేహతః - వాని దేహమునుండి, భుజమ్ - చేతిని, అపాకృష్య - బయటకు లాగి, అవిస్మితః - గర్వము కాని ఆశ్చర్యము కాని లేనివాడై, ఉత్-స్మయైః - ఆశ్చర్యముతో కూడినట్టియు, ప్రసూనవర్షైః - పూల వానలు గల, దివిషద్భిః - స్వర్గలోకవాసులగు దేవతలచే, ఈడితః - స్తుతించబడినవాడు.

శ్రీకృష్ణుడు గొప్ప భుజశక్తి గలవాడు. ఆయన ప్రయత్నము లేకుండగనే శత్రువులను సంహరించును. కేశి మరణించినందులకు ఆయనకు గర్వము

గాని, ఆశ్చర్యము గాని లేవు. కాని, దేవతలు చాల ఆశ్చర్యపడిరి. ఆయన తన చేతిని వాని దేహమునుండి బయటకు తీసుకోగానే, వారు పూల వానలను కురిపిస్తూ స్తుతించిరి.

దేవర్షిరుపసంగమ్య భాగవతప్రవరో నృప ।
కృష్ణమక్లిష్టకర్మాణం రహస్యేతదభాషత ॥ 10

నృప - ఓ రాజా!, భాగవతప్రవరః - భగవద్భక్తులలో శ్రేష్ఠుడు, దేవ-ఋషిః - దేవర్షి అగు నారదుడు, అక్లిష్టకర్మాణమ్ - సునాయాసముగా గొప్ప పనులను చేసే, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, రహసి - ఏకాంతమునందు, ఉపసంగమ్య - దగ్గరకు వచ్చి, ఏతత్ - ఈ మాటను, అభాషత - పలికెను.

ఓ పరీక్షిన్మహారాజా! దేవర్షియగు నారదుడు భగవానుని భక్తులలో అగ్రగణ్యుడు. ఆయన సునాయాసముగా గొప్ప పనులను చేసే శ్రీకృష్ణుడు ఏకాంతముగానున్నప్పుడు దగ్గరకు వచ్చి ఇట్లు పలికెను.

కృష్ణ కృష్ణాప్రమేయాత్మన్ యోగేశ జగదీశ్వర ।
వాసుదేవాఖిలావాస సాత్వతాం ప్రవర ప్రభో ॥ 11

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, అప్రమేయ-ఆత్మన్ - ఊహకు చిక్కని స్వరూపము గలవాడా!, యోగ-ఈశ - యోగులకు ప్రభుడా!, జగద్-ఈశ్వర - జగత్తును శాసించువాడా!, వాసుదేవ - వసుదేవుని పుత్రుడా!, అఖిల-ఆవాస - సర్వజగత్తునకు అధిష్ఠానమైనవాడా!, సాత్వతామ్ - యాదవులలో, ప్రవర - శ్రేష్ఠా!, ప్రభో - ఓ ప్రభూ!

ఓ శ్రీకృష్ణా! ఓ శ్రీకృష్ణా! నీ స్వరూపము ఊహకు గాని, ఇంద్రియములకు గాని అందేది కాదు. వసుదేవుని పుత్రుడవగు నీవు యోగులకు ప్రభుడవు, జగత్తును శాసించువాడవు. సకలజగత్తునకు అధిష్ఠానము నీవే. యాదవులలో శ్రేష్ఠుడవగు ఓ ప్రభూ!

త్వమాత్మా సర్వభూతానామేకో జ్యోతిరివైధసామ్ ।
గూఢో గుహాశయస్సాక్షీ మహాపురుష ఈశ్వరః ॥ 12

ఏధసామ్ - కట్టెలలో, ఏకః - ఒకే ఒక, జ్యోతిః ఇవ - అగ్ని వలె, త్వమ్ - నీవు, సర్వభూతానామ్ - సకలప్రాణుల, గూఢః - నిగూఢమైన, ఆత్మా - ఆత్మవు, గుహా-ఆశయః - హృదయమనే గుహయందు ప్రకటమగువాడవు, సాక్షీ - సాక్షివి, మహాపురుషః - పురుషోత్తముడవు, ఈశ్వరః - శాసకుడవు.

కట్టెలు వేరైనా వాటియందలి అగ్ని ఒక్కటే. అదే విధముగా, సకలప్రాణుల హృదయగుహయందు సకలబుద్ధివృత్తులకు సాక్షియగు నిగూఢ-ఆత్మ చైతన్యము నీవే. సర్వాంతర్యామివగు పురుషోత్తముడవీవే.

ఆత్మనాఽఽత్మాశ్రయః పూర్వం మాయయా ససృజే గుణాన్ ।
తైరిదం సత్యసంకల్పస్సృజస్యత్స్యవసీశ్వరః ।। 13

ఆత్మా-ఆశ్రయః - స్వతంత్రుడవు, సత్యసంకల్పః - అమోఘమగు సంకల్పములు గలవాడవు, ఈశ్వరః - సర్వనియామకుడవు అగు నీవు, ఆత్మనా - తానే అయిన, మాయయా - మాయాశక్తిచే, పూర్వమ్ - మున్ముందు, గుణాన్ - సత్త్వరజస్తమోగుణములను, ససృజే - సృష్టించితివి, తైః - వాటితో, ఇదమ్ - ఈ జగత్తును, సృజసి - సృష్టించుచున్నావు, అత్సి - ఉపసంహరించుచున్నావు, అవసి - పాలించుచున్నావు.

స్వతంత్రుడవగు నీ సంకల్పము అమోఘము. సర్వనియామకుడవగు నీవు నీవే అయి ఉన్న మాయాశక్తిచే మున్ముందుగా సత్త్వరజస్తమోగుణములను సృష్టించితివి. వాటితో ఈ జగత్తును నీవు సృష్టించి పాలించి ఉపసంహరించుచున్నావు.

స త్వం భూధరభూతానాం దైత్యప్రమథరక్షసామ్ ।
అవతీర్ణో వినాశాయ సేతూనాం రక్షణాయ చ ।। 14

సః - అట్టి, త్వమ్ - నీవు, భూధరభూతానామ్ - రాజులై పుట్టిన, దైత్యప్రమథరక్షసామ్ - దితిపుత్రులు రుద్రప్రమథులు రాక్షసులయొక్క, వినాశాయ - వినాశము కొరకు, సేతూనామ్ - ధర్మమర్యాదల, రక్షణాయ చ - రక్షించుట కొరకు కూడ, అవతీర్ణః - అవతరించినవాడవు.

దితిపుత్రులు, బాణుడు మొదలగు ప్రమథులు, రాక్షసులు రాజుల రూపములోనున్నారు. వారిని నశింపజేసి ధర్మమర్యాదలను నిలబెట్టుటకై నీవు అవతరించితివి.

దిష్ట్యా తే నిహతో దైత్యో లీలయాఽయం హయాకృతిః ।
యస్య హేషితసంత్రస్తాస్త్యజంత్యనిమిషా దివమ్ ॥ 15

అయమ్ - ఈ, హయ-ఆకృతిః - గుర్రపు రూపు గల, దైత్యః - రాక్షసుడు, తే - నీచే, లీలయా - అవలీలగా, నిహతః - సంహరించబడినాడు, దిష్ట్యా - మంగళము, యస్య - ఎవని, హేషితసంత్రస్తాః - సకిలింపు వలన చాల భయపడిన, అనిమిషాః - దేవతలు, దివమ్ - స్వర్గమును, త్యజంతి - విడిచిపెట్టెదరో.

ఈ గుర్రము రూపములోనున్న రాక్షసుని నీవు అవలీలగా సంహరించితివి. ఇది మంగళము. వీడు స్వర్గము వద్దకు వచ్చి సకిలించినచో, దేవతలు స్వర్గమును వీడి పరుగెత్తెదరు.

చాణూరం ముష్టికం చైవ మల్లానన్యాంశ్చ హస్తినమ్ ।
కంసం చ నిహతం ద్రక్ష్యే పరశ్వోఽహని తే విభో ॥ 16

విభో - ఓ ప్రభూ!, చాణూరమ్ - చాణూరుని, ముష్టికం చ ఏవ - ముష్టికుని కూడ, అన్యాన్ - ఇతరులైన, మల్లాన్ - మల్లవీరులను, హస్తినమ్ - కువలయాపీడమనే ఏనుగును, కంసం చ - కంసుని కూడ, పరశ్వః - ఎల్లుండి, అహని - పగలునందు, తే - నీచే, నిహతమ్ - సంహరించబడినవానినిగా, ద్రక్ష్యే - చూడగలను.

ఓ ప్రభూ! ఎల్లుండి పగలు నీవు చాణూరుని, ముష్టికుని, శలుడు మొదలైన ఇతరమల్లులను, కువలయాపీడమనే ఏనుగును, కంసుని కూడ సంహరించగలవు. నేను చూచెదను.

తస్యాను శంఖయవనమురాణాం నరకస్య చ ।
పారిజాతాపహరణమింద్రస్య చ పరాజయమ్ ॥ 17

తస్య - వానికి, అను - తరువాత, శంఖయవనమురాణామ్ - శంఖుడు కాలయవనుడు మురుల, చ - మరియు, నరకస్య - నరకుని (వధను), పారిజాత-అపహరణమ్ - కల్పవృక్షమును లాగుకువచ్చుట, ఇంద్రస్య - ఇంద్రునకు, పరాజయం చ - పరాజయమును కూడ (చూచెదను).

ఆ కంసుని తరువాత నీవు శంఖుని, కాలయవనుని, మురుని, నరకుని కూడ సంహరించెదవు. తరువాత నీవు ఇంద్రుని పరాభవించి కల్పవృక్షమును లాగుకొని వచ్చెదవు.

ఉద్వాహం వీరకన్యానాం వీర్యశుల్కాదిలక్షణమ్ ।
నృగస్య మోక్షణం పాపాద్ద్వారకాయాం జగత్పతే ।। 18

జగత్-పతే - ఓ జగన్నాథా!, వీర్యశుల్క-ఆదిలక్షణమ్ - పరాక్రమమే కట్నము అనే రూపము గల, వీరకన్యానామ్ - క్షత్రియకన్యల, ఉద్వాహమ్ - వివాహమును, ద్వారకాయామ్ - ద్వారకయందు, నృగస్య - నృగునకు, పాపాత్ - పాపమునుండి, మోక్షణమ్ - విముక్తిని (చూచెదను).

ఓ జగన్నాథా! నీవు నీ పరాక్రమము, సౌందర్యము మొదలగు గుణములే కట్నము కాగా క్షత్రియకన్యలను వివాహమాడెదవు. నీవు ద్వారకలో నృగుని పాపమునుండి విముక్తుని చేసెదవు.

స్యమంతకస్య చ మణేరాదానం సహ భార్యయా ।
మృతపుత్రప్రదానం చ బ్రాహ్మణస్య స్వధామతః ।। 19

భార్యయా సహ - భార్యతో బాటుగా, స్యమంతకస్య మణేః చ - స్యమంతకమణికి కూడ, ఆదానమ్ - తీసుకువచ్చుట, బ్రాహ్మణస్య - బ్రాహ్మణునకు, స్వధామతః - తమ స్థానమునుండి, మృతపుత్రప్రదానం చ - మరణించిన పుత్రులను అప్పగించుటను కూడ (చూడగలను).

నీవు భార్యతో బాటుగా స్యమంతకమణిని కూడ పొందెదవు. నీవు మరణించిన బ్రాహ్మణపుత్రులను వారి స్థానమునుండి తెచ్చి యిచ్చెదవు.

పౌండ్రకస్య వధం పశ్చాత్కాశిపుర్యాశ్చ దీపనమ్ ।
దంతవక్త్రస్య నిధనం చైద్యస్య చ మహాక్రతౌ ।। 20

పౌండ్రకస్య - పౌండ్రకుని, వధమ్ - వధను, పశ్చాత్ - తరువాత, కాశిపుర్యాః - కాశీనగరముయొక్క, దీపనం చ - కాల్చివేయుటను, దంతవక్త్రస్య - దంతవక్త్రుని, మహాక్రతౌ - గొప్ప యజ్ఞమునందు, చైద్యస్య - చేదిరాజగు శిశుపాలుని, నిధనం చ - వధను కూడ (చూచెదను).

నీవు పౌండ్రకుని సంహరించి తరువాత కాశీనగరమును తగులబెట్టెదవు. దంతవక్త్రుని, గొప్ప యజ్ఞమునందు చేదిరాజగు శిశుపాలుని కూడ సంహరించెదవు.

యాని చాన్యాని వీర్యాణి ద్వారకామావసన్ భవాన్ ।
కర్తా ద్రక్ష్యామ్యహం తాని గేయాని కవిభిర్భువి ।। 21

ద్వారకామ్ - ద్వారకను, ఆవసన్ - అధిష్ఠించే, భవాన్ - నీవు, యాని - ఏ, అన్యాని -ఇతరములగు, వీర్యాణి చ - పరాక్రమములను కూడ, కర్తా - చేయగలవో, భువి - భూలోకమునందు, కవిభిః - కవులచే, గేయాని - కీర్తించదగిన, తాని - వాటిని, అహమ్ - నేను, ద్రక్ష్యామి - చూడగలను.

ద్వారకానగరమునధిష్ఠించి నీవు ఇంకా ఏ పరాక్రమములను చేసెదవో, వాటిని కూడ నేను చూడగలను. భూలోకమునందు కవులు వర్ణించదగ్గవి ఈ లీలలే.

అథ తే కాలరూపస్య క్షపయిష్ణోరముష్య వై ।
అక్షౌహిణీనాం నిధనం ద్రక్ష్యామ్యర్జునసారథేః ।। 22

అథ - తరువాత, కాలరూపస్య - మృత్యువు రూపములోనున్నట్టియు, అముష్య - దీనికి (ఈ భూభారమునకు), వై - నిశ్చయముగా, క్షపయిష్ణోః - తగ్గించగోరునట్టియు, అర్జునసారథేః - అర్జునునకు సారథియగు, తే - నీయొక్క, అక్షౌహిణీనామ్ - అక్షౌహిణులయొక్క, నిధనమ్ - సంహారమును, ద్రక్ష్యామి - చూడగలను.

తరువాత మృత్యురూపుడవగు నీవు ఈ భూమియొక్క భారమును తగ్గించగోరి అర్జునునకు సారథివి కాగలవు. అపుడు సైన్యముల అక్షౌహిణులు నాశమును పొందును. దానిని నేను చూడగలను.

విశుద్ధవిజ్ఞానఘనం స్వసంస్థయా సమాప్తసర్వార్థమమోఘవాంఛితమ్ ।
స్వతేజసా నిత్యనివృత్తమాయాగుణప్రవాహం భగవంతమీమహి ॥ 23

విశుద్ధవిజ్ఞానఘనమ్ - ధర్మాధర్మములకు అతీతమైన ముద్ద గట్టిన ఎరుకయైనట్టియు, స్వసంస్థయా - తన ఉనికి చేతనే, సమాప్తసర్వ-అర్థమ్ - బాగుగా పొందబడిన సకలములైన కామనలు కలిగినట్టియు, అమోఘవాంఛితమ్ - మొక్కవోని సంకల్పములు కలిగినట్టియు, స్వతేజసా - తన చైతన్యశక్తిచే, నిత్యనివృత్తమాయాగుణప్రవాహమ్ - సర్వకాలములయందు తొలగియున్న మాయాశక్తియొక్క గుణముల ప్రవాహము కలిగినట్టియు, భగవంతమ్ - షడ్గుణైశ్వర్యసంపన్నుడవగు నిన్ను, ఈమహి - శరణు పొందెదము.

నీవు ధర్మాధర్మములకు అతీతమైన జ్ఞానఘనుడవు. ఆనందఘనమగు నీ సన్నిధిమాత్రముచే సకలకామనలు పూర్ణముగా సిద్ధించును. నీ సంకల్పములు అమోఘములు. మాయాశక్తియొక్క సత్త్వరజస్తమో గుణముల ప్రవాహము (సంసారము) చైతన్యఘనుడవగు నీయందే కాలమునందైనా లేదు. షడ్గుణసంపన్నుడవగు నిన్ను శరణు జొచ్చెదము.

త్వామీశ్వరం స్వాశ్రయమాత్మమాయయా
వినిర్మితాశేషవిశేషకల్పనమ్ ।
క్రీడార్థమద్యాత్తమనుష్యవిగ్రహం
నతోఽస్మి ధుర్యం యదువృష్ణిసాత్వతామ్ ॥ 24

ఈశ్వరమ్ - జగన్నియామకుడవైనట్టియు, స్వ-ఆశ్రయమ్ - స్వతంత్రుడవైనట్టియు, ఆత్మమాయయా - తన మాయాశక్తిచే, వినిర్మిత-అశేషవిశేషకల్పనమ్ - సృష్టించబడిన సకలవిశేషముల రచన కలిగినట్టియు, అద్య - ఈ కాలమునందు, క్రీడా-అర్థమ్ - లీల కొరకై, ఆత్తమనుష్యవిగ్రహమ్ - స్వీకరించబడిన మానవదేహము కలిగినట్టియు, యదువృష్ణిసాత్వతామ్ - యాదవ వృష్ణి సాత్వత వంశీయులలో, ధుర్యమ్ - అగ్రేసరుడవైన, త్వామ్ - నిన్ను, నతః అస్మి - ప్రణమిల్లెదను.

నీవు స్వతంత్రుడవై జగత్తును నియమించెదవు. నీవు నీ మాయాశక్తిచే సకలవిశేషముల (నామరూపముల) సమాహారమగు జగత్తును కల్పించినావు. ఈ కాలములో నీవు లీల కొరకై మానవదేహమును స్వీకరించి యున్నావు. యాదవ వృష్ణి సాత్వత వంశీయులలో అగ్రేసరుడవగు నీకు నేను నమస్కరించుచున్నాను.

శ్రీశుక ఉవాచ ।
ఏవం యదుపతిం కృష్ణం భాగవతప్రవరో మునిః ।
ప్రణిపత్యాభ్యనుజ్ఞాతో యయౌ తద్దర్శనోత్సవః ॥ 25

భాగవతప్రవరః - భగవద్భక్తులలో శ్రేష్ఠుడగు, మునిః - నారద మహర్షి, ఏవమ్ - ఈ విధముగా, యదుపతిమ్ - యాదవులకు ప్రభుడైన, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ప్రణిపత్య - ప్రణమిల్లి, అభ్యనుజ్ఞాతః - అనుజ్ఞ నీయబడినవాడై, తద్-దర్శన-ఉత్సవః - ఆయన దర్శనముచే ఉత్సవము గలవాడై, యయౌ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- భగవద్భక్తులలో అగ్రేసరుడగు నారదమహర్షికి ఆ శ్రీకృష్ణుని దర్శనమే పండుగ. ఆయనీ విధముగా ఆ యాదవప్రభుని ప్రణమిల్లి ఆయన సెలవు తీసుకొని వెళ్లెను.

భగవానపి గోవిందో హత్వా కేశినమాహవే ।
పశూనపాలయత్పాలైః ప్రీతైర్వ్రజసుఖావహః ॥ 26

వ్రజసుఖ-ఆవహః - గోకులమునకు సుఖమును కలిగించే, గోవిందః భగవాన్ అపి - గోవింద భగవానుడు కూడ, ఆహవే - యుద్ధమునందు, కేశినమ్ - కేశిని, హత్వా - సంహరించి, ప్రీతైః - సంతోషించిన, పాలైః - గోపాలకులతో, పశూన్ - పశువులను, అపాలయత్ - పాలించెను.

గోకులమునకు సుఖమును కలిగించే గోవింద భగవానుడు యుద్ధములో కేశిని కూడ సంహరించగా గోపాలకులు సంతోషించిరి. ఆయన వారితో కలిసి పశువులను పాలించెను.

ఏకదా తే పశూన్ పాలాశ్చారయంతోఽద్రిసానుషు ।
చక్రుర్నిలాయనక్రీడాశ్చోరపాలాపదేశతః ॥ 27

ఏకదా - ఒకనాడు, తే - ఆ, పాలాః - గోపాలకులు, పశూన్ - పశువులను, అద్రిసానుషు - గోవర్ధన పర్వతముయొక్క చరియలయందు, చారయంతః - మేపుచున్నవారై, చోరపాల-అపదేశతః - చోరుడు రక్షకుడు అనే కల్పనల నిమిత్తముగా, నిలాయనక్రీడాః - దాగుడు మూతలనే ఆటలను, చక్రుః - ఆడిరి.

ఒకనాడు ఆ గోపాలకులు గోవర్ధన పర్వతముయొక్క సమతలప్రదేశములయందు పశువులను మేపుచుండిరి. వారిలో కొందరు చోరులని, ఇంకొందరు రక్షకులని కల్పించుకొని వారు దాగుడు మూతల ఆటలను ఆడిరి.

తత్రాసన్ కతిచిచ్చోరాః పాలాశ్చ కతిచిన్నృప ।
మేషాయితాశ్చ తత్రైకే విజహ్రురకుతోభయాః ॥ 28

నృప - ఓ రాజా!, తత్ర - వారిలో, కతిచిత్ - కొంతమంది, చోరాః - చోరులు, కతిచిత్ చ - మరికొందరు, పాలాః - రక్షకులు, తత్ర - వారిలో, ఏకే - కొందరు, మేషాయితాః చ - మేకలు వలె ఆచరించువారు, అకుతః-భయాః - దేనివలనైననూ భయము లేనివారై, విజహ్రుః - విహరించిరి.

ఓ పరీక్షిన్మహారాజా! వారిలో కొందరు మేకలు వలె నటించగా, కొందరు చోరులుగను, కొందరు రక్షకులుగను అయి, భయమంటే ఏమిటో తెలియకుండా విహరిస్తూ ఆడుకొనుచుండిరి.

మయపుత్రో మహామాయో వ్యోమో గోపాలవేషధృక్ ।
మేషాయితానపోవాహ ప్రాయశ్చోరాయితో బహూన్ ॥ 29

మయపుత్రః - మయుని పుత్రుడు, మహామాయః - పెద్ద మాయావి అగు, వ్యోమః - వ్యోముడు, గోపాలవేషధృక్ - గోపాలకుని వేషమును ధరించువాడై, ప్రాయః - పలుమార్లు, చోరాయితః - చోరుడు వలె ఆచరించువాడై, మేషాయితాన్ - మేకల వలె ఆచరించే గోపబాలకులను, బహూన్ - చాలమందిని, అపోవాహ - ఎత్తుకుపోయెను.

మయుని పుత్రుడగు వ్యోముడు పెద్ద మాయావి. వాడు గోపాలకుని వేషముతో వారిలో చేరి ఆటలో పలుమార్లు చోరుడుగా ఉండెను. ఈ

తీరున వాడు మేకలవలె ఆచరించే చాలమంది గోపబాలకుల నెత్తుకుపోయెను.

గిరిదర్యాం వినిక్షిప్య నీతం నీతం మహాసురః ।
శిలయా పిదధే ద్వారం చతుఃపంచావశేషితాః ॥ 30

మహా-అసురః - ఆ పెద్ద రాక్షసుడు, నీతం నీతమ్ - ఎత్తుకుపోబడిన ప్రతి గోపబాలకుని, గిరిదర్యామ్ - పర్వతగుహయందు, వినిక్షిప్య - ఉంచి, ద్వారమ్ - ద్వారమును, శిలయా - రాతితో, పిదధే - మూసెను, చతుఃపంచ - నలుగురైదుగురు, అవశేషితాః - మిగిలియున్నవారు.

ఆ బలశాలియగు రాక్షసుడు ఎత్తుకుపోయిన ప్రతి గోపబాలకుని ఒక పర్వతగుహలో దాచి దాని ద్వారమును రాతితో మూసివేసెను. గోపబాలకులు నలుగురైదుగురు మాత్రమే బయట మిగిలియుండిరి.

తస్య తత్కర్మ విజ్ఞాయ కృష్ణశ్శరణదస్సతామ్ ।
గోపాన్నయంతం జగ్రాహ వృకం హరిరివౌజసా ॥ 31

సతామ్ - సత్పురుషులకు, శరణదః - రక్షణనిచ్చే, కృష్ణః - శ్రీకృష్ణుడు, తస్య - వాని, తత్ - ఆ, కర్మ - పనిని, విజ్ఞాయ - గమనించి, గోపాన్ - గోపబాలకులను, నయంతమ్ - ఎత్తుకుపోవుచున్న రాక్షసుని, హరిః - సింహము, వృకం ఇవ - తోడేలును వలె, ఓజసా - బలముగా, జగ్రాహ - పట్టుకొనెను.

శ్రీకృష్ణుడు సత్పురుషులకు రక్షకుడు. ఆ వ్యోమాసురుడు చేస్తున్న పని ఆయనకు తెలిసిపోయెను. గోపబాలకులను ఎత్తుకుపోవుచున్న ఆ రాక్షసుని ఆయన, సింహము తోడేలును వలె, బలముగా పట్టుకొనెను.

స నిజం రూపమాస్థాయ గిరీంద్రసదృశం బలీ ।
ఇచ్ఛన్ విమోక్తుమాత్మానం నాశక్నోద్గ్రహణాతురః ॥ 32

బలీ - బలశాలియగు, సః - ఆ రాక్షసుడు, గ్రహణ-ఆతురః - పట్టుకొనుటచే పీడను పొందినవాడై, ఆత్మానమ్ - తనను, విమోక్తుమ్ - విడిపించుకొనుటకు, ఇచ్ఛన్ - కోరువాడై, గిరి-ఇంద్రసదృశమ్ - గొప్ప

పర్వతమును పోలిన, నిజమ్ - తనదైన, రూపమ్ - రూపమును, ఆస్థాయ - స్వీకరించి, న అశక్నోత్ - సమర్థుడు కాలేదు.

ఆ రాక్షసుడు బలశాలియే అయినా, శ్రీకృష్ణుడు పట్టుకొనుటచే పీడను పొందెను. వాడు తనను విడిపించుకొనగోరి పెద్ద పర్వతమును పోలిన తన యథార్థరూపమును పొందెను. ఐననూ వాడు విడిపించుకొనలేకపోయెను.

తం నిగృహ్యాచ్యుతో దోర్భ్యాం పాతయిత్వా మహీతలే ।
పశ్యతాం దివి దేవానాం పశుమారమమారయత్ ॥ 33

అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, దివి - అంతరిక్షమునందు, దేవానామ్ - దేవతలు, పశ్యతామ్ - చూచుచుండగా, తమ్ - వానిని, దోర్భ్యామ్ - రెండు చేతులతో, నిగృహ్య - గట్టిగా పట్టుకొని, మహీతలే - భూతలమునందు, పాతయిత్వా - పడునట్లు చేసి, పశుమారమ్ - పశువును చంపునట్లుగా, అమారయత్ - సంహరించెను.

అంతరిక్షములో దేవతలు చూచుచుండిరి. శ్రీకృష్ణ భగవానుడు వానిని రెండు చేతులతో గట్టిగా పట్టుకొని నేలపై పడవైచెను. అపుడాయన వానికి పశువును చంపునట్లుగా గాలి ఆడకుండా చేసి సంహరించెను.

గుహాపిధానం నిర్భిద్య గోపాన్నిస్సార్య కృచ్ఛ్రతః ।
స్తూయమానస్సురైర్గోపైః ప్రవివేశ స్వగోకులమ్ ॥ 34

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే సప్తత్రింశోఽధ్యాయః ॥

గుహాపిధానమ్ - గుహయొక్క మూసి ఉంచే రాతిని, నిర్భిద్య - పగులగొట్టి, గోపాన్ - గోపబాలకులను, కృచ్ఛ్రతః - ఆపదనుండి, నిస్సార్య - బయట పడవేసి, సురైః - దేవతలచే, గోపైః - గోపాలకులచే, స్తూయమానః - స్తుతించబడుచున్నవాడై, స్వగోకులమ్ - తన గోకులమును, ప్రవివేశ - ప్రవేశించెను.

ఆయన గుహను మూసి ఉంచిన రాతిని పగులగొట్టి గోపబాలకులను ఆపదనుండి బయటకు తెచ్చెను. దేవతలు, గోపాలకులు స్తుతించుచుండగా, ఆయన తన గోకులమును ప్రవేశించెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము పూర్వార్ధములో శ్రీకృష్ణుడు కేశిని, వ్యోమాసురుని ఉద్ధరించుటను, నారద స్తుతిని వర్ణించే ముప్పది ఏడవ అధ్యాయము ముగిసినది (37).

* * * * *

# అథ అష్టాత్రింశోఽధ్యాయః

## అక్రూరుడు గోకులమునకు వెళ్లుట

శ్రీశుక ఉవాచ ।
అక్రూరోఽపి చ తాం రాత్రిం మధుపుర్యాం మహామతిః ।
ఉషిత్వా రథమాస్థాయ ప్రయయౌ నందగోకులమ్ ॥ 1

మహామతిః - గొప్ప బుద్ధిశాలియగు, అక్రూరః అపి చ - అక్రూరుడు కూడ, తామ్ - ఆ, రాత్రిమ్ - రాత్రిని, మధుపుర్యామ్ - మథురానగరమునందు, ఉషిత్వా - నివసించి, రథమ్ - రథమును, ఆస్థాయ - ఎక్కి, నందగోకులమ్ - నందుని గోకులమును గురించి, ప్రయయౌ - బయలు దేరెను.

అక్రూరుడు గొప్ప బుద్ధిశాలి. ఆయన ఆ రాత్రిని మథురానగరమునందు గడిపెను. ఆయన రథమునెక్కి నందుని గోకులమునకు బయలు దేరెను.

గచ్ఛన్ పథి మహాభాగో భగవత్యంబుజేక్షణే ।
భక్తిం పరాముపగత ఏవమేతదచింతయత్ ॥ 2

మహాభాగః - గొప్ప పుణ్యాత్ముడగు అక్రూరుడు, పథి - మార్గమునందు, గచ్ఛన్ - వెళ్లుచున్నవాడై, అంబుజ-ఈక్షణే - పద్మమువంటి కన్నులు గల, భగవతి - శ్రీకృష్ణ భగవానునియందు, పరామ్ - సర్వోత్కృష్టమైన, భక్తిమ్ - భక్తిని, ఉపగతః - పొందినవాడై, ఏతత్ - దీనిని, ఏవమ్ - ఈ విధముగా, అచింతయత్ - తలపోసెను.

అక్రూరుడు గొప్ప పుణ్యాత్ముడు. ఆయనకు దారిలో వెళ్తూ ఉండగా, పద్మమును పోలిన కన్నులు గల శ్రీకృష్ణునియందు సర్వాతిశాయియగు భక్తి కలిగెను. ఆయన దీనినీ విధముగా తలపోసెను.

కిం మయాఽఽచరితం భద్రం కిం తప్తం పరమం తపః ।
కిం వాఽథాప్యర్హతే దత్తం యద్ద్రక్ష్యామ్యద్య కేశవమ్ ॥ 3

మయా - నాచే, భద్రమ్ - పుణ్యకార్యము, కిమ్ - ఏది, ఆచరితమ్ - చేయబడినది?, పరమమ్ - గొప్ప, తపః - తపస్సు, కిమ్ - ఏది, తప్తమ్ - తపించబడినది?, అథవా - లేక, అర్హతే - యోగ్యుని కొరకు, కిమ్ - ఏది, దత్తం అపి - దానము కూడ చేయబడినది?, యత్ - దేనివలనైతే, అద్య - ఈ నాడు, కేశవమ్ - శ్రీకృష్ణ భగవానుని, ద్రక్ష్యామి - చూడగలనో.

నేనీ నాడు శ్రీకృష్ణ భగవానుని చూడబోతున్నాను. ఇది దేని ఫలమో? నేను ఏమి పుణ్యమును చేసియుందును? ఏ గొప్ప తపస్సును అనుష్ఠించి యుందును? లేదా, యోగ్యునకు ఏది దానము చేసియుందును?

మమైతద్దుర్లభం మన్య ఉత్తమశ్లోకదర్శనమ్ ।
విషయాత్మనో యథా బ్రహ్మకీర్తనం శూద్రజన్మనః ॥ 4

ఏతత్ - ఈ, ఉత్తమశ్లోకదర్శనమ్ - పవిత్రకీర్తియగు శ్రీకృష్ణుని దర్శనము, విషయ-ఆత్మనః - భోగపరాయణుడనగు, మమ - నాకు, శూద్రజన్మనః - శూద్రబాలకునకు, బ్రహ్మకీర్తనం యథా - వేదాధ్యయనము వలె, దుర్లభమ్ - దుఃఖముచే పొందదగినదని, మన్యే - తలచెదను.

నేను ఇంద్రియభోగములయందు లగ్నమైనవాడను. పవిత్రకీర్తియగు శ్రీకృష్ణుని దర్శనము, శూద్రబాలకునకు వేదాధ్యయనము వలె, నాకు లభించుట చాల కష్టమని తలచెదను.

మైవం మమాధమస్యాపి స్యాదేవాచ్యుతదర్శనమ్ ।
హ్రియమాణః కాలనద్యా క్వచిత్తరతి కశ్చన ॥ 5

ఏవమ్ - ఇట్లు, మా - కాదు, అధమస్య - అధముడనగు, మమ అపి - నాకు కూడ, అచ్యుతదర్శనమ్ - శ్రీకృష్ణ భగవానుని దర్శనము, స్యాత్ ఏవ - కలిగియే తీరును, కాలనద్యా - కాలమనే ప్రవాహముచే, హ్రియమాణః - తీసుకొనిపోబడువాడు, కశ్చన - ఎవడైననూ, క్వచిత్ - ఒకచోట, తరతి - తరించును.

ఇట్లు తలచుట సరి కాదు. అధముడనే అయినా నాకు కూడ శ్రీకృష్ణ భగవానుని దర్శనము కలిగి తీరును. కాలప్రవాహములో అందరు

కొట్టుకొనిపోవుచున్నారు. యథార్థమే. కాని, ఒక్కొక్కడు ఒక్కోచోట సంసారమనే ఆ నదిని తరించును.

మమాద్యామంగలం నష్టం ఫలవాంశ్చైవ మే భవః ।
యన్నమస్యే భగవతో యోగిధ్యేయాంఘ్రిపంకజమ్ ॥ 6

అద్య - ఈనాడు, మమ - నా, అమంగలమ్ - అశుభము, నష్టమ్ - నశించినది, మే - నా, భవః చ - జన్మ కూడ, ఫలవాన్ - సఫలము, యత్ - ఏలయన, భగవతః - శ్రీకృష్ణ భగవానుని, యోగిధ్యేయ-అంఘ్రిపంకజమ్ - యోగులచే ధ్యానించబడే పద్మమువంటి పాదమును, నమస్యే - నమస్కరించెదనో.

ఈనాడు నా అశుభము నశించి, జన్మ కూడ సఫలమైనది. ఏలయన, యోగులచే ధ్యానించబడే పద్మమువంటి శ్రీకృష్ణ భగవానుని పాదమును నేను నమస్కరించెదను.

కంసో బతాద్యాకృత మేఽత్యనుగ్రహం
ద్రక్ష్యేఽంఘ్రిపద్మం ప్రహితోఽమునా హరేః ।
కృతావతారస్య దురత్యయం తమః
పూర్వేఽతరన్ యన్నఖమండలత్విషా ॥ 7

బత - ఆహా!, అద్య - ఈనాడు, కంసః - కంసుడు, మే - నా కొరకు, అతి-అనుగ్రహమ్ - గొప్ప అనుగ్రహమును, అకృత - చేసినాడు, అమునా - వీనిచే, ప్రహితః - పంపబడిన నేను, కృత-అవతారస్య - చేయబడిన అవతారము గల, హరేః - శ్రీకృష్ణ భగవానుని, అంఘ్రిపద్మమ్ - పద్మము వంటి పాదమును, ద్రక్ష్యే - చూడగలను, యత్-నఖమండలత్విషా - ఎవ్వాని కాలిగోళ్ల సమూహపు కాంతిచే, పూర్వే - పూర్వీకులు, దురత్యయమ్ - దాట శక్యము కాని, తమః - అజ్ఞానమును, అతరన్ - దాటినారో.

ఆహా! ఈనాడు కంసుడు నాకు పెద్ద అనుగ్రహమును చేసినాడు. కంసునిచే పంపబడిన నేను శ్రీకృష్ణునిగా అవతరించిన శ్రీహరియొక్క పద్మమువంటి పాదమును దర్శించగలను. ఆయన పాదపు గోళ్ల కాంతిచే పూర్వీకులు అతిక్రమించ శక్యము కాని అజ్ఞానమనే చీకటిని దాటి వేసిరి.

యదర్చితం బ్రహ్మభవాదిభిస్సురైః
శ్రియా చ దేవ్యా మునిభిస్ససాత్వతైః ।
గోచారణాయానుచరైశ్చరద్వనే
యద్గోపికానాం కుచకుంకుమాంకితమ్ ॥ 8

యత్ - ఏ పాదము, బ్రహ్మభవ-ఆదిభిః - బ్రహ్మదేవుడు శివుడు మొదలైన, సురైః - దేవతలచే, శ్రియా దేవ్యా చ - లక్ష్మీదేవిచే కూడ, ససాత్వతైః - భక్తులతో కూడిన, మునిభిః - మునులచే, అర్చితమ్ - పూజించబడినదో, గోచారణాయ - గోవులను మేపుటకై, అనుచరైః - అనుచరులగు గోపాలకులతో గూడి, వనే - అడవియందు, చరత్ - సంచరించునో, యత్ - ఏ పాదము, గోపికానామ్ - గోపికల, కుచకుంకుమ-అంకితమ్ - వక్షఃస్థలమునందలి కుంకుమచే చిహ్నితమో.

ఆ శ్రీహరి పాదమును బ్రహ్మదేవుడు, శివుడు, ఇంద్రుడు మొదలైన దేవతలు మరియు లక్ష్మీదేవి కూడ పూజించెదరు. గోవులను మేపుటకై అడవిలో గోపాలకులతో బాటుగా సంచరించే ఆ పాదమును భక్తులు, మహర్షులు పూజించెదరు. ఆ పాదము గోపికల వక్షఃస్థలమునందలి కుంకుమయొక్క చిహ్నములు గలది.

ద్రక్ష్యామి నూనం సుకపోలనాసికం
స్మితావలోకారుణకంజలోచనమ్ ।
ముఖం ముకుందస్య గుడాలకావృతం
ప్రదక్షిణం మే ప్రచరంతి వై మృగాః ॥ 9

సుకపోలనాసికమ్ - అందమైన చెక్కిళ్లు ముక్కు కలిగినట్టియు, స్మిత-అవలోక-అరుణకంజలోచనమ్ - చిరునవ్వుతో కూడిన చూపులు ఎఱ్ఱని పద్మమువంటి కళ్లు కలిగినట్టియు, గుడ-అలక-ఆవృతమ్ - దట్టని గిరజాల జుట్టుతో చుట్టువారబడిన, ముకుందస్య - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని, ముఖమ్ - ముఖమును, నూనమ్ - నిశ్చయముగా, ద్రక్ష్యామి - చూడగలను, మృగాః - లేళ్లు, మే - నాకు, ప్రదక్షిణమ్ - ప్రదక్షిణముగా, ప్రచరంతి వై - సంచరించుచున్నవి గదా!

లేళ్లు నాకు ప్రదక్షిణముగా తిరుగుచున్నవి. కాబట్టి, మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని ముఖము నాకు నిశ్చయముగా కనబడగలదు. ఆ ముఖము అందమైన చెక్కిళ్లు, అందమైన ముక్కు, చిరునవ్వుతో కూడిన చూపులు, చుట్టూ దట్టని గిరజాల జుట్టుతో శోభిల్లును.

అప్యద్య విష్ణోర్మనుజత్వమీయుషో
భారావతారాయ భువో నిజేచ్ఛయా ।
లావణ్యధామ్నో భవితోపలంభనం
మహ్యం న న స్యాత్ఫలమంజసా దృశః ॥ 10

భువః - భూమియొక్క, భార-అవతారాయ - బరువును దించుట కొరకై, నిజ-ఇచ్ఛయా - తన సంకల్పముచే, మనుజత్వమ్ - మానవజన్మను, ఈయుషః - పొందినట్టియు, లావణ్యధామ్నః - సౌందర్యమునకు నిధానమైన, విష్ణోః - విష్ణువుయొక్క, ఉపలంభనమ్ - దర్శనము, అద్య - ఈనాడు, అపి భవితా - కలుగబోయే పక్షములో, మహ్యమ్ - నా కొరకు, దృశః - చూపునకు, అంజసా - తేలికగా, ఫలమ్ - ఫలము, న స్యాత్ - లేదు అనేది, న - లేదు.

భూభారమును తగ్గించుటకై విష్ణువు స్వేచ్ఛచే మానవుడై జన్మించినాడు. ఆ సౌందర్యనిధానమగు విష్ణువుయొక్క దర్శనమీనాడు నాకు కలిగే పక్షములో, నా చూపునకు ఫలము తేలికగా లభించలేదని చెప్పుటకు వీలు లేదు.

య ఈక్షితాహంరహితోఽప్యసత్సతోస్స్వతేజసాఽపాస్తతమోభిదాభ్రమః,
స్వమాయయాఽఽత్మన్ రచితైస్తదీక్షయా ప్రాణాక్షధీభిస్సదనేష్వభీయతే।

యః - ఏ శ్రీహరి, అసత్-సతోః - కార్యకారణముల, ఈక్షితా అపి - సాక్షియే అయిననూ, అహంరహితః - కర్తృత్వాభిమానము లేనివాడో, స్వతేజసా - తన చైతన్యప్రకాశముచే, అపాస్తతమః-భిదాభ్రమః - పారద్రోలబడిన అజ్ఞానము భేదముయొక్క భ్రమ గలవాడో, తద్-ఈక్షయా - ఆయనయొక్క సంకల్పముచే, స్వమాయయా - తన మాయాశక్తిచే, ఆత్మన్ - తనయందే, రచితైః - ప్రకటించబడిన, ప్రాణ-అక్షధీభిః -

ప్రాణములు ఇంద్రియములు బుద్ధి అనువాటితో కూడిన జీవులతో, సదనేషు - గృహములయందు, అభీయతే - తెలియబడుచున్నాడు. 11

కార్యకారణరూపమగు జగత్తునకు ఆ శ్రీహరి సాక్షి. ఆయనయందు ఈ జగత్తును నేను చేసితిననే కర్తృత్వాభిమానము లేదు. ఆయన తన చైతన్యప్రకాశముచే అజ్ఞానమును, దాని వలన పుట్టే భేదబుద్ధిని పారద్రోలును. అయిననూ, ఆయన తన సంకల్పముచే తన మాయాశక్తి ద్వారా తనయందే ప్రాణములు, ఇంద్రియములు, బుద్ధి అనువాటితో కూడిన జీవులను ప్రకటించును. ఆయన ఆ జీవులతో (గోకులములోని) వారి గృహములయందు సంచరించుచున్నట్లు కానవచ్చును.

యస్యాఖిలామీవహభిస్సుమంగలైర్వాచో విమిశ్రా గుణకర్మజన్మభిః ।
ప్రాణంతి శుంభంతి పునంతి వై జగద్యాస్తద్విరక్తాశ్శవశోభనా మతాః॥

అఖిల-అమీవహాభిః - సకలపాపములను పోగొట్టునట్టియు, సుమంగలైః - పరమకల్యాణకరములైన, గుణకర్మజన్మభిః - గుణములు లీలలు అవతారములచే, విమిశ్రాః - కూడియున్న, వాచః - వచనములు, జగత్ - జగత్తును, ప్రాణంతి - జీవింప జేయును, శుంభంతి - శోభిల్లజేయును, వై - నిశ్చయముగా, పునంతి - పావనము చేయును, యాః - ఏ వచనములు, తద్-విరక్తాః - ఆ వర్ణన లేనివియో, శవశోభనాః - శవముయొక్క శోభ గలవిగా, మతాః - తెలియబడును. 12

శ్రీహరి గుణములు, లీలలు, అవతారములను వర్ణించే వాక్కులు సకలపాపములను పోగొట్టి పరమకల్యాణములనిచ్చును. ఆ వచనములు ప్రాణిమాత్రమును నిశ్చయముగా ఉజ్జీవింప జేసి శోభను కలిగించి పావనము చేయును. అట్టి వర్ణనలు లేని వచనముల శోభ శవముయొక్క శోభ వంటిది (వ్యర్థము) అని పెద్దల అభిప్రాయము.

స చావతీర్ణః కిల సాత్వతాన్వయే
స్వసేతుపాలామరవర్యశర్మకృత్ ।
యశో వితన్వన్ వ్రజ ఆస్త ఈశ్వరో
గాయంతి దేవా యదశేషమంగలమ్ ॥ 13

ధ్వసేతుపాల-అమరవర్యశర్మకృత్ - తన ధర్మమర్యాదలను పాలించే లోకపాలకులకు సుఖమును కలిగించే, సః - ఆ, ఈశ్వరః చ - జగన్నాథుడగు శ్రీహరియైతే, సాత్వత-అన్వయే - యాదవుల వంశమునందు, అవతీర్ణః కిల - అవతరించినాడు గదా!, యశః - కీర్తిని, వితన్వన్ - విస్తరింప జేయువాడై, వ్రజే - గోకులమునందు, ఆస్తే - ఉన్నాడు, అశేషమంగలమ్ - సకలకల్యాణములనిచ్చే, యత్ - ఏ కీర్తిని, దేవాః - దేవతలు, గాయంతి - గానము చేయుదురో.

జగన్నాథుడగు శ్రీహరిచే రచించబడిన ధర్మమర్యాదలను లోక పాలకులు కాపాడెదరు. వారికి సుఖమును కలిగించే ఆ ఈశ్వరుడు యాదవవంశములో అవతరించి, యశస్సును విస్తరింపజేస్తూ గోకులము నందున్నాడు. అందరికీ సకలకల్యాణములనిచ్చే ఆ యశస్సును దేవతలు గానము చేయుచున్నారు.

తం త్వద్య నూనం మహతాం గతిం గురుం
త్రైలోక్యకాంతం దృశిమన్మహోత్సవమ్ ।
రూపం దధానం శ్రియ ఈప్సితాస్పదం
ద్రక్ష్యే మమాసన్నుషసస్సుదర్శనాః ॥ 14

మహతామ్ - మహాత్ములకు, గతిమ్ - పరమలక్ష్యమైనట్టియు, గురుమ్ - తండ్రియైనట్టియు, త్రైలోక్యకాంతమ్ - ముల్లోకములలో సుందరుడైనట్టియు, దృశిమత్-మహా-ఉత్సవమ్ - చూపు గలవారలకు గొప్ప పండుగయైన, శ్రియః - లక్ష్మీదేవికి, ఈప్సిత-ఆస్పదమ్ - ప్రీతికి ఆశ్రయమైన, రూపమ్ - రూపమును, దధానమ్ - ధరించియున్న, తం తు - ఆ భగవానునైతే, అద్య - ఈ నాడు, ద్రక్ష్యే - చూడగలను, మమ - నాకు, ఉషసః - ప్రాతఃకాలమునుండి, సుదర్శనాః - శుభశకునములు, ఆసన్ - కలిగినవి.

మహాత్ములకు పరమలక్ష్యము తండ్రియగు ఆ భగవానుడే. ముల్లోకములలో సుందరుడగు ఆ భగవానుని దర్శనము కన్నులకు పెద్ద పండుగ యగును. ఆయన దాల్చిన ఈ శ్రీకృష్ణ రూపము

లక్ష్మీదేవియొక్క ప్రీతికి నిధానము. ఆయనను నేనీనాడు చూచెదను. ఎందుకంటే, ఈనాడు నాకు ఉదయమునుండి శుభశకునములు కలిగినవి.

అథావరూఢస్సపదీశయో రథాత్
ప్రధానపుంసోశ్చరణం స్వలబ్ధయే ।
ధియా ధృతం యోగిభిరప్యహం ధ్రువం
నమస్య ఆభ్యాం చ సఖీన్ వనౌకసః ॥ 15

అథ - తరువాత, సపది - వెంటనే, రథాత్ - రథమునుండి, అవరూఢః - దిగిన, అహమ్ - నేను, ఈశయోః - జగన్నియామకులైనట్టియు, ప్రధానపుంసోః - పురుషోత్తములగు బలరామకృష్ణులయొక్క, స్వలబ్ధయే - స్వరూపజ్ఞానమును పొందుటకై, యోగిభిః అపి - యోగులచే కూడ, ధియా - బుద్ధిచే, ధృతమ్ - పట్టుకొనబడిన, చరణమ్ - పాదమును, ఆభ్యామ్ - వీరితో కూడియున్న, సఖీన్ - మిత్రులైన, వన-ఓకసః చ - బృందావనవాసులను కూడ, ధ్రువమ్ - నిశ్చితముగా, నమస్యే - నమస్కరించెదను.

బలరామకృష్ణులను చూచిన వెంటనే నేను రథము దిగి వారి పాదములకు నమస్కరించెదను. వారిద్దరు జగన్నియామకులైన పురుషోత్తములు. యోగులు కూడ స్వరూపజ్ఞానమును పొందుటకై వారి పాదములను హృదయమునందు ధ్యానించెదరు. ఇంతేగాక, వారికి తోడుగా ఉండే వారి మిత్రులైన బృందావనవాసులకు కూడ తప్పనిసరిగా నమస్కరించెదను.

అప్యంఘ్రిమూలే పతితస్య మే విభుః
శిరస్యధాస్యన్నిజహస్తపంకజమ్ ।
దత్తాభయం కాలభుజంగరంహసా
ప్రోద్వేజితానాం శరణైషిణాం నృణామ్ ॥ 16

అంఘ్రిమూలే - పాదముల మొదట, పతితస్య - పడిన, మే - నా, శిరసి - తలపై, విభుః - సర్వేశ్వరుడు, కాలభుజంగరంహసా - కాలమనే పాముయొక్క వేగముచే, ప్ర-ఉద్వేజితానామ్ - అధికముగా ఉద్వేగమును

పొందినట్టియు, శరణైషిణామ్ - శరణు కోరే, నృణామ్ - మానవులకు, దత్త-అభయమ్ - ఈయబడిన అభయము గల, నిజహస్తపంకజమ్ - తన పద్మమువంటి చేతిని, అపి అధాస్యత్ - ఉంచునా?

తన పాదముల మొదట పడిన నా తలపై ఆ సర్వేశ్వరుడు తన పద్మమువంటి చేతిని ఉంచునా? కాలమనే పాముయొక్క వేగమునకు చాల భయపడి శరణు కోరే మానవులకు ఆ చేయి అభయమునిచ్చును.

సమర్హణం యత్ర నిధాయ కౌశికః
తథా బలిశ్చాప జగత్త్రయేంద్రతామ్ ।
యద్వా విహారే వ్రజయోషితాం శ్రమం
స్పర్శేన సౌగంధికగంధ్యపానుదత్ ।। 17

కౌశికః - ఇంద్రుడు, తథా - అదే విధముగా, బలిః చ - బలి కూడ, యత్ర - ఏ చేతియందు, సమర్హణమ్ - పూజాద్రవ్యమును, నిధాయ - ఉంచి, జగత్-త్రయ-ఇంద్రతామ్ - ముల్లోకముల ప్రభుత్వమును, ఆప - పొందెనో, వా - ఆహా!, సౌగంధికగంధి - దివ్యపద్మముయొక్క పరిమళము గల, యత్ - ఏ చేయి, విహారే - రాసలీలయందు, స్పర్శేన - స్పర్శచే, వ్రజయోషితామ్ - గోకులయువతులయొక్క, శ్రమమ్ - అలసటను, అపానుదత్ - తొలగించెనో.

ఆ చేతియందు పూజాద్రవ్యమును సమర్పించి ఒకానొక కల్పములో కౌశికగోత్రోత్పన్నుడగు ఇంద్రుడు, మరియు బలిచక్రవర్తి కూడ ముల్లోకముల ఆధిపత్యమును పొందిరి. ఆహా! రాసలీలయందు దివ్యపద్మముయొక్క పరిమళము గల ఆ చేతియొక్క స్పర్శచే గోకులమునందలి గోపికల శ్రమ దూరమయ్యెడిది.

న మయ్యుపైష్యత్యరిబుద్ధిమచ్యుతః
కంసస్య దూతః ప్రహితోఽపి విశ్వదృక్ ।
యోఽంతర్బహిశ్చేతస ఏతదీహితం
క్షేత్రజ్ఞ ఈక్షత్యమలేన చక్షుషా ।। 18

ప్రహితః - పంపబడిన, కంసస్య - కంసుని, దూతః అపి - దూతనే అయిననూ, విశ్వదృక్ - సర్వసాక్షియగు, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, మయి - నాయందు, అరిబుద్ధిమ్ - శత్రువు అనే భావనను, న ఉపైష్యతి - పొందబోడు, క్షేత్రజ్ఞః - క్షేత్రసాక్షియగు, యః - ఏ శ్రీకృష్ణుడు, చేతసః - మనస్సునకు, అంతః - లోపల, బహిః - బయట, ఏతత్ - ఈ, ఈహితమ్ - చేష్టను, అమలేన - నిర్వికారమైన, చక్షుషా - చూపుతో, ఈక్షతి - చూచునో.

నేను కంసునిచే పంపబడిన దూతను. ఐనా, సర్వసాక్షియగు శ్రీకృష్ణుడు నేను శత్రువునని తలబోయడు. ఏలయన, ఆయన క్షేత్రము (దేహేంద్రియమనస్సంఘాతము) నకు సాక్షియై ప్రాణుల మనోవృత్తులను మాత్రమే గాక దేహేంద్రియములయందుండే ఈ చేష్టలను కూడ నిర్వికారమగు చూపుతో చూచుచుండును.

అప్యంఘ్రిమూలేఽవహితం కృతాంజలిం
మామీక్షితా సస్మితమార్ద్రయా దృశా ।
సపద్యపధ్వస్తసమస్తకిల్బిషో
వోఢా ముదం వీతవిశంక ఊర్జితామ్ ॥ 19

అంఘ్రిమూలే - పాదముల మొదట, అవహితమ్ - ఏకాగ్రచిత్తుడనై, కృత-అంజలిమ్ - ఒగ్గబడిన దోసిలి గల, మామ్ - నన్ను, సస్మితమ్ - చిరునవ్వుతో కూడుకున్నట్లుగా, ఆర్ద్రయా - దయతో కూడిన, దృశా - చూపుతో, అపి ఈక్షితా - చూచునా?, సపది - వెంటనే, అపధ్వస్తసమస్తకిల్బిషః - నశింప జేయబడిన సకలపాపములు గలవాడను, వీతవిశంకః - తొలగిపోయిన సందేహములు గలవాడనై, ఊర్జితామ్ - వర్ధిల్లిన, ముదమ్ - ఆనందమును, వోఢా - పొందగలను.

నేను ఏకాగ్రమగు చిత్తముతో ఆయన పాదముల మొదట దోసిలి యొగ్గి నమస్కరించెదను. అప్పుడాయన నన్ను చిరునవ్వుతో దయతో కూడిన చూపుతో చూచునా? అట్లు చూచినప్పుడు వెనువెంటనే నా సకలపాపములు నశించి పోవును. నేను సందేహములు తీరి, గొప్ప ఆనందమును పొందెదను.

సుహృత్తమం జ్ఞాతిమనన్యదైవతం
దోర్భ్యాం బృహద్భ్యాం పరిరప్స్యతేऽథ మామ్ ।
ఆత్మా హి తీర్థీక్రియతే తదైవ
బంధశ్చ కర్మాత్మక ఉచ్ఛ్వసిత్యతః ॥ 20

అథ - తరువాత, సుహృత్-తమమ్ - అత్యధికముగా హితమును కోరునట్టియు, జ్ఞాతిమ్ - బంధువైనట్టియు, అనన్యదైవతమ్ - మరియొక దైవము లేని, మామ్ - నన్ను, బృహద్భ్యామ్ - పొడవైన, దోర్భ్యామ్ - రెండు చేతులతో, పరిరప్స్యతే - కౌగిలించుకొనగలడు, తదా ఏవ - అదే క్షణమునందు, అతః - దీనివలన, ఆత్మా - అంతఃకరణము, తీర్థీక్రియతే - పావనముగా చేయబడును, హి - నిశ్చయము, కర్మ-ఆత్మకః - కర్మల రూపములోనుండే, బంధః చ - బంధము కూడ, ఉచ్ఛ్వసితి - శిథిలమగును.

దయతో చూచిన తరువాత ఆయన తన పొడవైన చేతులతో బంధువునగు నన్ను కౌగిలించుకొనును. నేను ఆయన హితమును కోరువారిలో మొట్టమొదటివాడను. పైగా, నాకు ఆయన తప్ప మరియొక దైవము లేదు. ఆ ఆలింగనము వలన అదే క్షణములో నా అంతఃకరణము పావనము (తాను పవిత్రమై ఇతరులను పవిత్రము చేయగలిగేది) అగును. నాకు కర్మల బంధము కూడ శిథిలమగును.

లబ్ధాంగసంగం ప్రణతం కృతాంజలిం
మాం వక్ష్యతేऽక్రూర తతేత్యురుశ్రవాః ।
తదా వయం జన్మభృతో మహీయసా
నైవాదృతో యో ధిగముష్య జన్మ తత్ ॥ 21

ఉరుశ్రవాః - గొప్ప కీర్తి గల శ్రీకృష్ణుడు, లబ్ధ-అంగసంగమ్ - పొందబడిన ఆలింగనము కలిగినట్టియు, ప్రణతమ్ - నమస్కరించినట్టియు, కృత-అంజలిమ్ - చేయబడిన దోసిలి గల, మామ్ - నన్ను ఉద్దేశించి, అక్రూర - ఓ అక్రూరా!, తత - తండ్రీ!, ఇతి - అని, వక్ష్యతే - పలుకగలడు, తదా - అప్పుడు, వయమ్ - మేము, జన్మభృతః - సఫలమగు జన్మ గలవారము, యః - ఎవడైతే, మహీయసా -

సర్వోత్తముడగు భగవానునిచే, న ఏవ ఆదృతః - సుతరాము ఆదరించ బడలేదో, అముష్య - వీని, తత్ - ఆ, జన్మ - పుట్టుకను గురించి, ధిక్ - ధిక్కారమగుగాక!

ఆలింగనము తరువాత నేను నమస్కరించి చేతులు జోడించి నిల బడెదను. అప్పుడు గొప్ప కీర్తి గల శ్రీకృష్ణుడు నన్ను, తండ్రీ! అక్రూరా! అని పలుకరించును. అదే క్షణములో మా కుటుంబము వారమందరము సఫలమగు జన్మ గలవారమగుదుము. సర్వోత్తముడగు శ్రీకృష్ణభగవానుడు ఎవనినైతే సుతరాము ఆదరించడో, అట్టివాని ఆ జన్మ నిందార్హము.

న తస్య కశ్చిద్దయితస్సుహృత్తమో
న చాప్రియో ద్వేష్య ఉపేక్ష్య ఏవ వా ।
తథాఽపి భక్తాన్ భజతే యథా తథా
సురద్రుమో యద్వదుపాశ్రితోఽర్థదః ।। 22

తస్య - ఆయనకు, కశ్చిత్ - ఒకడు, దయితః - ప్రియుడు, సుహృత్తమః - అత్యధికముగా హితమును చేయువాడు, న - కాడు, అప్రియః చ - ప్రియుడు కానివాడు కూడ, ద్వేష్యః - ద్వేషించదగినవాడు, వా - లేక, ఉపేక్ష్యః - ఉపేక్షించదగినవాడు, న ఏవ - లేనే లేడు, తథా అపి - అయినప్పటికీ, యథా - ఏ విధముగానైతే (భక్తులు భజింతురో), భక్తాన్ - భక్తులను, తథా - అదే విధముగా (భజించును), యద్వత్ - ఎల్లాగైతే, సురద్రుమః - కల్పవృక్షము, ఉప-ఆశ్రితః - ఆశ్రయించబడినదై, అర్థదః - కామనలనిచ్చునదియో.

ఆయనకు ఒకడు ప్రియుడని గాని, మరియొకడు అధికముగా హితమును చేసినవాడని గాని, ఒకడు ద్వేషించదగినవాడని గాని, మరియొకడు ఉపేక్షించదగినవాడని గాని లేనే లేదు. కల్పవృక్షము తనను ఆశ్రయించినవారి కోరికలను మాత్రమే ఈడేర్చును. అదే విధముగా, భక్తులు ఆయనను ఏ విధముగా సేవిస్తే, వారిని ఆయన అదే విధముగా సేవించును.

కిం చాగ్రజో మాఽవనతం యదూత్తమః
స్మయన్ పరిష్వజ్య గృహీతమంజలౌ ।
గృహం ప్రవేశ్యాప్తసమస్తసత్కృతం
సంప్రక్ష్యతే కంసకృతం స్వబంధుషు ॥ 23

కిం చ - ఇంతే గాక, అగ్రజః - అన్నగారు, యదు-ఉత్తమః - యాదవులలో శ్రేష్ఠుడు అగు బలరాముడు, స్మయన్ - నవ్వుచున్నవాడై, అవనతమ్ - నమస్కరించిన, మా - నన్ను, పరిష్వజ్య - కౌగిలించుకొని, అంజలౌ - దోసిలియందు, గృహీతమ్ - పట్టుకొనబడిన నన్ను, గృహమ్ - ఇంటిని, ప్రవేశ్య - ప్రవేశపెట్టి, ఆప్తసమస్తసత్-కృతమ్ - పొందబడిన సకల సత్కారములు గల నన్ను, స్వబంధుషు - తన బంధువుల యెడల, కంసకృతమ్ - కంసుని చేష్టను గురించి, సంప్రక్ష్యతే - ప్రశ్నించగలడు.

ఇంతేగాక శ్రీకృష్ణుని అన్నగారు, యదుకులశ్రేష్ఠుడు అగు బలరామునకు నేను దోసిలియొగ్గి నమస్కరించెదను. ఆయన నవ్వుతూ నన్ను కౌగిలించుకొని నా రెండు చేతులను పట్టుకొని ఇంటిలోనికి తీసుకు వెళ్లును. తరువాత ఆయన నాకు సకలసత్కారములను చేయును. తన బంధువుల యెడల కంసుని చేష్టను గురించి ఆయన నన్ను ప్రశ్నించును.

శ్రీశుక ఉవాచ ।
ఇతి సంచింతయన్ కృష్ణం శ్వఫల్కతనయోఽధ్వని ।
రథేన గోకులం ప్రాప్తస్సూర్యశ్చాస్తగిరిం నృప ॥ 24

నృప - ఓ రాజా!, ఇతి - ఈ విధముగా, అధ్వని - మార్గమునందు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని గురించి, సంచింతయన్ - ధ్యానము చేయుచున్న, శ్వఫల్కతనయః - శ్వఫల్కుని పుత్రుడగు అక్రూరుడు, రథేన - రథముచే, గోకులమ్ - గోకులమును, సూర్యః చ - సూర్యుడు కూడ, అస్తగిరిమ్ - అస్తమించే పర్వతమును, ప్రాప్తః - చేరినవాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను -- ఓ రాజా! శ్వఫల్కుని పుత్రుడగు అక్రూరుడు ఈ విధముగా దారిలో శ్రీకృష్ణుని ధ్యానిస్తూ, సూర్యుడు అస్తపర్వతమును చేరుసరికి రథముపై గోకులమును చేరుకొనెను.

పదాని తస్యాఖిలలోకపాలకిరీటజుష్టామలపాదరేణోః ।
దదర్శ గోష్ఠే క్షితికౌతుకాని విలక్షితాన్యబ్జయవాంకుశాద్యైః ।। 25

గోష్ఠే - గోకులమునందు, అఖిలలోకపాలకిరీటజుష్ట-అమలపాదరేణోః - సకలలోకపాలకుల కిరీటములచే సేవించబడే స్వచ్ఛమైన పాదముల రేణువులు గల, తస్య - ఆ శ్రీకృష్ణునియొక్క, క్షితికౌతుకాని - భూమికి అలంకారములైనట్టియు, అబ్జయవ-అంకుశ-ఆద్యైః - పద్మము ధాన్యపు గింజ అంకుశము మొదలగువాటిచే, విలక్షితాని - గుర్తు పట్టబడే, పదాని - కాలి గురుతులను, దదర్శ - చూచెను.

అక్రూరుడు గోకులమునందు శ్రీకృష్ణుని (అరి)కాలి గురుతులను చూచి పద్మము, ధాన్యపు గింజ, అంకుశము, జెండా మొదలగు చిహ్నాములను బట్టి గుర్తు పట్టెను. ఆ శ్రీకృష్ణుని స్వచ్ఛమైన పాదముల రేణువులను సకలలోకపాలకులు తమ కిరీటములతో సేవించెదరు. ఆ గురుతులు భూమికే అలంకారములాయెను.

తద్దర్శనాహ్లాదవివృద్ధసంభ్రమః ప్రేమ్ణోర్ధ్వరోమాశ్రుకలాఽఽకులేక్షణః,
రథాదవస్కంద్య స తేష్వచేష్టత ప్రభోరమూన్యంఘ్రిరజాంస్యహో ఇతి,

తద్-దర్శన-ఆహ్లాదవివృద్ధసంభ్రమః - వాటిని చూచుట వలని ఆనందముచే వర్ధిల్లిన పరవశత్వము కలవాడు, ప్రేమ్ణా - ప్రేమచే, ఊర్ధ్వరోమ-అశ్రుకలా-ఆకుల-ఈక్షణః - గగుర్పాటు కన్నీటి బిందువులచే చూపు కానరాని కన్నులు గల, సః - ఆ అక్రూరుడు, రథాత్ - రథమునుండి, అవస్కంద్య - దిగి, తేషు - వాటియందు, అమూని - ఇవి, ప్రభోః - శ్రీకృష్ణ ప్రభుని, అంఘ్రిరజాంసి - పాదరేణువులు, అహో - ఆహా!, ఇతి - అని, అచేష్టత - పొర్లాడెను. 26

ఆ కాలి గురుతులను చూడగానే వర్ధిల్లిన ఆనందముతో ఆ అక్రూరుడు పరవశుడాయెను. ప్రేమతో ఆయనకు గగుర్పాటు కలిగి కళ్లు నీటితో నిండగా చూపు కానరాలేదు. ఆయన రథమునుండి దిగి, ఆహా! ఇవి శ్రీకృష్ణ ప్రభుని పాదరేణువులు, అంటూ వాటియందు దొర్లెను.

దేహంభృతామియానర్థో హిత్వా దంభం భియం శుచమ్ ।
సందేశాద్యో హరేర్లింగదర్శనశ్రవణాదిభిః ॥ 27

దంభమ్ - డాంబీకమును, భియమ్ - భయమును, శుచమ్ - దుఃఖమును, హిత్వా - విడిచిపెట్టి, సందేశాత్ - (కంసుని) సందేశమునుండి, హరేః - శ్రీకృష్ణ భగవానుని, లింగదర్శనశ్రవణ-ఆదిభిః - చిహ్నముల చూచుట వినుట మొదలగువాటితో, యః - ఏది గలదో, దేహంభృతామ్ - దేహధారులకు, ఇయాన్ - ఇంతే, అర్థః - పురుషార్థము.

కంసుని సందేశముతో మొదలిడి అక్రూరుడు డాంబీకమును, భయమును, దుఃఖమును విడిచిపెట్టి శ్రీకృష్ణ భగవానుని చిహ్నములను చూచి భక్తిని పొందుట అనేది యేది గలదో, ఇదియే దేహధారులకు పురుషార్థము. శ్రీహరి కీర్తనమును వినుట, ధ్యానించుట మొదలగు సాధనల వలన కూడ ఇట్టి భక్తి కలుగును.

దదర్శ కృష్ణం రామం చ వ్రజే గోదోహనం గతౌ ।
పీతనీలాంబరధరౌ శరదంబురుహేక్షణౌ ॥ 28

వ్రజే - గోకులమునందు, గోదోహనమ్ - పాలు పితుకు(ట) చోటును, గతౌ - పొందినట్టియు, పీతనీల-అంబరధరౌ - పచ్చని నల్లని వస్త్రములను ధరించినట్టియు, శరద్-అంబురుహ-ఈక్షణౌ - శరత్కాలమునందలి పద్మమును పోలిన కన్నులు గల, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, రామం చ - బలరాముని కూడ, దదర్శ - చూచెను.

శ్రీకృష్ణుడు పచ్చని వస్త్రమును, బలరాముడు నీలవస్త్రమును ధరించి పాలు పితికే చోట పాలను పితుకుచుండిరి. శరత్కాలపద్మములను పోలిన కళ్లు గల వారిద్దరిని అక్రూరుడు చూచెను.

కిశోరౌ శ్యామలశ్వేతౌ శ్రీనికేతౌ బృహద్భుజౌ ।
సుముఖౌ సుందరవరౌ బాలద్విరదవిక్రమౌ ॥ 29

కిశోరౌ - యౌవనము రానివారు, శ్యామలశ్వేతౌ - నల్లని తెల్లనివారు, శ్రీనికేతౌ - సౌందర్యమునకు నిధానములు, బృహద్-భుజౌ - పొడవైన చేతులు గలవారు, సుముఖౌ - అందమగు ముఖములు గలవారు,

సుందరవరౌ - అందగాళ్లలో శ్రేష్ఠులు, బాలద్విరదవిక్రమౌ - గున్న ఏనుగుయొక్క ఠీవివంటి ఠీవి గలవారు.

బలరాముడు తెల్లని వాడు కాగా, శ్రీకృష్ణుడు నల్లనివాడు. సౌందర్యమునకు నిధానములైన వారిద్దరికి ఇంకనూ యౌవనము రాలేదు. పొడవాటి చేతులు, అందమైన ముఖము గల వారిద్దరు అందగాళ్లలో శ్రేష్ఠులు. వారికి గున్న యేనుగు ఠీవివంటి ఠీవి గలదు.

ధ్వజవజ్రాంకుశాంభోజైశ్చిహ్నితైరంఘ్రిభిర్వ్రజమ్ ।
శోభయంతౌ మహాత్మానావనుక్రోశస్మితేక్షణౌ ॥ 30

ధ్వజవజ్ర-అంకుశ-అంభోజైః - జెండా వజ్రము అంకుశము పద్మములతో, చిహ్నితైః - చిహ్నించబడిన, అంఘ్రిభిః - కాలి ముద్రలతో, వ్రజమ్ - గోకులమును, శోభయంతౌ - ప్రకాశింప జేయువారు, మహాత్మానౌ - పెద్ద మనసు గలవారు, అనుక్రోశస్మిత-ఈక్షణౌ - దయ చిరునవ్వు గల చూపులు గలవారు.

జెండా, వజ్రము, అంకుశము, పద్మము అనువాటి గుర్తులు గల కాలి ముద్రలతో వారిద్దరు గోకులమును ప్రకాశింప జేయుచుండిరి. పెద్ద మనసు గల వారి చూపులలో దయ, చిరునవ్వు తొణికిసలాడుచుండును.

ఉదారరుచిరక్రీడౌ స్రగ్విణౌ వనమాలినౌ ।
పుణ్యగంధానులిప్తాంగౌ స్నాతౌ విరజవాససౌ ॥ 31

ఉదారరుచిరక్రీడౌ - శ్రేష్ఠములు మనోహరములు అగు లీలలు గలవారు, స్రగ్విణౌ - హారములు గలవారు, వనమాలినౌ - వనమాలలు గలవారు, పుణ్యగంధ-అనులిప్త-అంగౌ - పవిత్రమగు గంధముచే అలదబడిన దేహములు గలవారు, స్నాతౌ - స్నానము చేసినవారు, విరజవాససౌ - స్వచ్ఛమగు వస్త్రములను ధరించినవారు.

బలరామకృష్ణులు శ్రేష్ఠమైన మరియు మనోహరములైన లీలలను నెరపెడివారు. వారు స్నానము చేసి స్వచ్ఛమగు వస్త్రములను దాల్చి పవిత్రమగు చందనమును దేహమునకు అలదుకొని హారమును, వనమాలను కూడ ధరించి యుండిరి.

ప్రధానపురుషావాద్యౌ జగద్ధేతూ జగత్పతీ ।
అవతీర్ణౌ జగత్యర్థే స్వాంశేన బలకేశవౌ ॥ 32

బలకేశవౌ - బలరామ శ్రీకృష్ణులు, ప్రధానపురుషౌ - ప్రకృతి పురుషులు, ఆద్యౌ - కాలమునకు అతీతులు, జగద్-హేతూ - జగత్తునకు కారణమైనవారు, జగత్-పతీ - జగత్తును పాలించువారు, జగతీ-అర్థే - జగత్తుయొక్క ప్రయోజనము విషయములో, స్వ-అంశేన - తమ పూర్ణస్వరూపముచే, అవతీర్ణౌ - అవతరించినవారు.

కాలమునకు అతీతులగు శ్రీహరి సంకర్షణులే జగత్తునకు కారణమగు పురుషుడు మరియు ప్రకృతి. జగద్రక్షకులగు వారిద్దరు జగత్తుయొక్క రక్షణకొరకై తమ పూర్ణస్వరూపముతో శ్రీకృష్ణ బలరాములుగా అవతరించినారు.

దిశో వితిమిరా రాజన్ కుర్వాణౌ ప్రభయా స్వయా ।
యథా మారకతశ్శైలో రౌప్యశ్చ కనకాచితౌ ॥ 33

రాజన్ - ఓ రాజా!, స్వయా - తమదైన, ప్రభయా - కాంతిచే, దిశః - దిక్కులను, వితిమిరాః - తొలగిన చీకట్లు గలవిగా, కుర్వాణౌ - చేయుచున్నవారు, కనక-ఆచితౌ - బంగారముచే వ్యాపించబడిన, మారకతః - ఇంద్రనీలమునకు చెందిన, శైలః - పర్వతము, రౌప్యః చ - వెండి పర్వతము, యథా - వలె.

ఓ రాజా! బలరాముడు బంగారముచే వ్యాపించబడిన వెండి పర్వతము వలె, శ్రీకృష్ణుడు బంగారముతో నిండిన ఇంద్రనీలపర్వతము వలె ప్రకాశిస్తూ, తమ కాంతిచే దిక్కుల చీకట్లు తొలగునట్లు చేయుచుండిరి.

రథాత్తూర్ణమవప్లుత్య సోఽక్రూరస్స్నేహవిహ్వలః ।
పపాత చరణోపాంతే దండవద్రామకృష్ణయోః ॥ 34

స్నేహవిహ్వలః - ప్రేమచే పరవశుడైన, సః - ఆ, అక్రూరః - అక్రూరుడు, రథాత్ - రథమునుండి, తూర్ణమ్ - శీఘ్రముగా, అవప్లుత్య - దిగి, రామకృష్ణయోః - బలరామశ్రీకృష్ణుల, చరణ-ఉపాంతే - పాదములకు సమీపమునందు, దండవత్ - కట్టెవలె, పపాత - పడెను.

ప్రేమచే పరవశుడైన ఆ అక్రూరుడు రథమునుండి వేగముగా దిగి, బలరామ శ్రీకృష్ణుల పాదముల వద్ద సాష్టాంగ నమస్కారమును చేసెను.

భగవద్దర్శనాహ్లాదబాష్పపర్యాకులేక్షణః ।
పులకాచితాంగ ఔత్కంఠ్యాత్స్వాఖ్యానే నాశకన్నృప ॥ 35

నృప - ఓ రాజా!, భగవద్-దర్శన-అహ్లాదబాష్పపరి-ఆకుల-ఈక్షణః - భగవానుని దర్శనముచే కలిగిన ఆనందముచే కలిగిన కన్నీళ్లచే అంతటా నిండిన కన్నులు గలవాడు, పులక-ఆచిత-అంగః - రోమాంచముతో వ్యాపించబడిన దేహము గలవాడు అగు అక్రూరుడు, ఔత్కంఠ్యాత్ - వేగిరపాటు (డగ్గుత్తిక) వలన, స్వ-ఆఖ్యానే - తన పేరును చెప్పుటయందు, న అశకత్ - సమర్థుడు కాలేదు.

ఓ పరీక్షిన్మహారాజా! భగవానుని దర్శనముచే కలిగిన ఆనందబాష్పములతో అక్రూరుని కళ్లు అంతటా నిండిపోయెను. ఆతని శరీరమంతయు రోమాంచముతో వ్యాపించబడెను. ఆతడు వేగిరపాటు, డగ్గుత్తికల వలన తన పేరును చెప్పలేకపోయెను.

భగవాంస్తమభిప్రేత్య రథాంగాంకితపాణినా ।
పరిరేభేఽభ్యుపాకృష్య ప్రీతః ప్రణతవత్సలః ॥ 36

ప్రణతవత్సలః - శరణాగతులయందు వాత్సల్యము గల, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తమ్ - ఆయనను, అభిప్రేత్య - తెలుసుకొని, ప్రీతః - ప్రీతిని పొందినవాడై, రథ-అంగ-అంకితపాణినా - చక్రముచే కాయ కాసిన చేతితో, అభి - అభిముఖముగా, ఉప - దగ్గరకు, ఆకృష్య - లాగి, పరిరేభే - కౌగిలించుకొనెను.

శరణాగతవత్సలుడగు శ్రీకృష్ణ భగవానునకు ఆయన అక్రూరుడని తెలిసిపోయెను. చక్రముతో కాయ కాసిన చేతితో ఆయన అక్రూరుని అభిముఖముగా దగ్గరకు లాగి కౌగలించుకొనెను.

సంకర్షణశ్చ ప్రణతముపగుహ్య మహామనాః ।
గృహీత్వా పాణినా పాణీ అనయత్సానుజో గృహమ్ ॥ 37

మహామనాః - పెద్ద మనసు గల, సంకర్షణః చ - బలరాముడు కూడ, ప్రణతమ్ - నమస్కరించిన అక్రూరుని, ఉపగుహ్య - కౌగిలించుకుని, స-అనుజః - తమ్మునితో గూడినవాడై, పాణినా - చేతితో, పాణీ - రెండు చేతులను, గృహీత్వా - పట్టుకొని, గృహమ్ - ఇంటిని గురించి, అనయత్ - తీసుకు వెళ్లెను.

పెద్ద మనసు గల బలరాముడు కూడ తనకు నమస్కరించిన అక్రూరుని కౌగిలించుకొనెను. ఆయన ఒక చేతిని, తమ్ముడు రెండవ చేతిని పట్టుకొని, ఆయనను ఇంటిలోనికి తీసుకు వెళ్లిరి.

పృష్ట్వాఽథ స్వాగతం తస్మై నివేద్య చ వరాసనమ్ ।
ప్రక్షాల్య విధివత్పాదౌ మధుపర్కార్హణమాహరత్ ॥ 38

అథ - తరువాత, సు-ఆగతమ్ - ప్రయాణమును బాగా చేసి వచ్చుటను గురించి, పృష్ట్వా - ప్రశ్నించి, తస్మై - ఆయన కొరకు, వర-ఆసనం చ - మంచి ఆసనమును కూడ, నివేద్య - సమర్పించి, విధివత్ - యథావిధిగా, పాదౌ - రెండు కాళ్లను, ప్రక్షాల్య - కడిగి, మధుపర్క-అర్హణమ్ - మధు పర్కమనే పూజాద్రవ్యమును, ఆహరత్ - తీసుకువచ్చి సమర్పించెను.

తరువాత శ్రీకృష్ణుడు ఆయన ప్రయాణము బాగా సాగుటను గురించి ప్రశ్నించి, ఆయనకు మంచి ఆసనమును ఇచ్చి, యథావిధిగా రెండు కాళ్లను కడిగి, మధుపర్కము (తేనె మొదలైన మంగళద్రవ్యము) ను తీసుకువచ్చి సమర్పించెను.

నివేద్య గాం చాతిథయే సంవాహ్య శ్రాంతమాదృతః ।
అన్నం బహుగుణం మేధ్యం శ్రద్ధయోపాహరద్విభుః ॥ 39

విభుః - సర్వసమర్థుడగు భగవానుడు, ఆదృతః - ఆదరము గలవాడై, అతిథయే - అతిథియగు అక్రూరుని కొరకు, గాం చ - గోవును కూడ, నివేద్య - సమర్పించి, శ్రాంతమ్ - అలసిన అక్రూరుని, సంవాహ్య - కాళ్లను ఒత్తి, బహుగుణమ్ - అనేకరుచులు కలిగినట్టియు, మేధ్యమ్ - పవిత్రమైన, అన్నమ్ - ఆహారమును, శ్రద్ధయా - శ్రద్ధతో, ఉపాహరత్ - దగ్గరకు తెచ్చి సమర్పించెను.

సర్వసమర్థుడగు భగవానుడు అతిథియగు అక్రూరునకు ఒక గోవును సాదరముగా సమర్పించెను. తరువాత ఆయనకు కాళ్లను ఒత్తి అలసట తీరునట్లు చేసెను. తరువాత ఆయనకు అనేకరుచులు గల పవిత్రమైన ఆహారమును తెచ్చి శ్రద్ధతో సమర్పించెను.

తస్మై భుక్తవతే ప్రీత్యా రామః పరమధర్మవిత్ ।
ముఖవాసైర్గంధమాల్యైః పరాం ప్రీతిం వ్యధాత్పునః ।। 40

పరమధర్మవిత్ - గొప్ప ధర్మవేత్తయగు, రామః - బలరాముడు, భుక్తవతే - భుజించిన, తస్మై - ఆ అక్రూరుని కొరకు, ప్రీత్యా - ప్రేమతో, ముఖవాసైః - తాంబూలద్రవ్యములతో, పునః - ఆ తరువాత, గంధమాల్యైః - గంధము మాలలతో, పరామ్ - గొప్ప, ప్రీతిమ్ - ప్రీతిని, వ్యధాత్ - కలిగించెను.

బలరాముడు గొప్ప ధర్మవేత్త. ఆయన అక్రూరునకు భోజనము చేసిన తరువాత ప్రేమతో తాంబూలద్రవ్యములను, గంధమును, పుష్ప మాలలను సమర్పించి, ఆయనకు గొప్ప ఆనందమును కలిగించెను.

పప్రచ్ఛ సత్కృతం నందః కథం స్థ నిరనుగ్రహే ।
కంసే జీవతి దాశార్హ సౌనపాలా ఇవావయః ।। 41

సత్-కృతమ్ - సత్కరించబడిన అక్రూరుని, నందః - నందుడు, పప్రచ్ఛ - ప్రశ్నించెను, దాశార్హ - ఓ యాదవా!, నిరనుగ్రహే - మిక్కిలి క్రూరుడగు, కంసే - కంసుడు, జీవతి - జీవించియుండ, సౌనపాలాః - కసాయి కాపలాదారుగా గల, అవయః ఇవ - గొర్రెలు వలె, కథమ్ - ఎట్లు, స్థ - ఉన్నారు?

సత్కారమును పొందియున్న అక్రూరుని నందుడిట్లు ప్రశ్నించెను --- ఓ యాదవా! కంసుడు పరమక్రూరుడు. ఆతడు జీవించియుండగా, కసాయి కాపలాదారుగా గల గొర్రెలు వలె, మీరు ఎట్లు ఉన్నారు?

యోఽవధీత్స్వస్వసుస్తోకాన్ క్రోశంత్యా అసుతృప్ ఖలః ।
కిం ను స్విత్తత్ప్రజానాం వః కుశలం విమృశామహే ।। 42

అసుతృప్ - కేవలము ఇంద్రియములను తృప్తి పరచువాడు, ఖలః - దుష్టుడు అగు, యః - ఏ కంసుడైతే, క్రోశంత్యాః - ఆక్రోశించుచున్న, స్వస్వసుః - తన చెల్లెలి, తోకాన్ - పుత్రులను, అవధీత్ - చంపెనో, తత్-ప్రజానామ్ - వానిచే పాలించబడే ప్రజలైన, వః - మీయొక్క, కుశలమ్ - క్షేమమును, కిం ను స్విత్ విమృశామహే - ఏమి విచారము చేసెదము?

కంసుడు కేవలము తన ఇంద్రియభోగములే ప్రధానముగా గల దుష్టుడు. ఆతడు ఆక్రోశించుచున్న తన చెల్లెలి పుత్రులను చంపినాడు. ఆతనిచే పాలించబడే ప్రజలు మీరు. మీ క్షేమమును గురించి ఏమని విచారించవలెను?

ఇత్థం సూనృతయా వాచా నందేన సుసభాజితః ।
అక్రూరః పరిపృష్టేన జహావధ్వపరిశ్రమమ్ ॥ 43

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే అష్టాత్రింశోఽధ్యాయః ॥

ఇత్థమ్ - ఈ విధముగా, పరిపృష్టేన - క్షేమమును గురించి అడుగబడిన, నందేన - నందునిచే, సూనృతయా - మధురమగు, వాచా - మాటతో; సుసభాజితః - బాగా సత్కరించబడిన, అక్రూరః - అక్రూరుడు, అధ్వపరిశ్రమమ్ - మార్గపు అలసటను, జహౌ - విడిచిపెట్టెను.

నందుని అక్రూరుడు ముందే క్షేమసమాచారమునడిగెను. నందుడీ విధముగా మధురమగు వచనముతో బాగా సత్కరించగా, అక్రూరుడు మార్గమునందలి అలసటను విడిచి పెట్టెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధము
పూర్వార్ధములో అక్రూరుడు గోకులమునకు వెళ్లుటను వర్ణించే
ముప్పది ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (38).



# అథ ఏకోనచత్వారింశోఽధ్యాయః

## అక్రూరుడు బలరామ కృష్ణులను గోకులమునుండి తీసుకువెళ్లుట

శ్రీశుక ఉవాచ ।
సుఖోపవిష్టః పర్యంకే రామకృష్ణోరుమానితః ।
లేభే మనోరథాన్ సర్వాన్ పథి యాన్ స చకార హ ॥ 1

పర్యంకే - ఆసనమునందు, సుఖేన - సుఖముగా, ఉపవిష్టః - కూర్చున్నవాడు, రామకృష్ణ-ఉరుమానితః - బలరామకృష్ణులచే అధికముగా సమ్మానించబడినవాడు అగు, సః - ఆ అక్రూరుడు, సర్వాన్ - అన్ని, మనః-రథాన్ - కోరికలను, లేభే - పొందెను, యాన్ - వేటినైతే, పథి - మార్గమునందు, చకార హ - చేసెనో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అక్రూరుడు ఆసనముపై సుఖముగా కూర్చుండెను. ఆయనను బలరామకృష్ణులు గొప్పగా సత్కరించిరి. ఆయన దారిలో మనసులో సంకల్పించిన కోరికలన్నీ తీరిపోయెను.

కిమలభ్యం భగవతి ప్రసన్నే శ్రీనికేతనే ।
తథాపి తత్పరా రాజన్న హి వాంఛంతి కించన ॥ 2

రాజన్ - ఓ రాజా!, శ్రీనికేతనే - లక్ష్మీదేవికి నివాసస్థానమగు, భగవతి - శ్రీకృష్ణ భగవానుడు, ప్రసన్నే - ప్రసన్నుడు కాగా, అలభ్యమ్ - పొంద శక్యము కానిది, కిమ్ - ఏమి ఉండును?, తథా అపి - అయినప్పటికీ, తత్-పరాః - ఆయనయే పరమలక్ష్యముగా గలవారలు, కించన - దేనినైననూ, న హి వాంఛంతి - కోరనే కోరరు.

ఓ పరీక్షిన్మహారాజా! లక్ష్మీదేవికి నివాసస్థానమగు శ్రీకృష్ణ భగవానుడే ప్రసన్నమైనప్పుడు లభించనిది ఏమి ఉండును? (ఉండదు). అయిననూ, ఆయనయే పరమలక్ష్యముగా గల భక్తులు దేనినైననూ కోరనే కోరరు.

సాయంతనాశనం కృత్వా భగవాన్ దేవకీసుతః ।
సుహృత్సు వృత్తం కంసస్య పప్రచ్ఛాన్యచ్చికీర్షితమ్ ॥ 3.

దేవకీసుతః - దేవకియొక్క పుత్రుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, సాయంతన-అశనమ్ - సాయంకాల భోజనమును, కృత్వా - చేసి, సుహృత్సు - హితైషుల విషయమై, కంసస్య - కంసుని, వృత్తమ్ - వ్యవహారశైలిని గురించి, చికీర్షితమ్ - చేయగోరిన, అన్యత్ చ - ఇతరమును గురించి కూడ, పప్రచ్ఛ - ప్రశ్నించెను.

దేవకీనందనుడగు శ్రీకృష్ణ భగవానుడు సాయంకాల భోజనమును చేసి, కంసుడు తమ హితైషుల యెడల ప్రవర్తించే తీరును, కంసుడు చేయదలచిన ఇతరకార్యములను గురించి అక్రూరుని ప్రశ్నించెను.

శ్రీభగవానువాచ ।
తాత సౌమ్యాగతః కచ్చిత్స్వాగతం భద్రమస్తు వః ।
అపి స్వజ్ఞాతిబంధూనామనమీవమనామయమ్ ॥ 4

తాత - తండ్రీ!, సౌమ్య - ప్రియదర్శనా!, సు-ఆగతమ్ - సుఖముగా వచ్చే విధముగా, ఆగతః కచ్చిత్ - వచ్చితిరా?, వః - మీ కొరకు, భద్రమ్ - మంగళము, అస్తు - అగుగాక!, స్వజ్ఞాతిబంధూనామ్ - మా జ్ఞాతులకు బంధువులకు, అపి అనమీవమ్ - (కంసుని) పాపాచరణము లేదు గదా?, అనామయమ్ - క్షేమమేనా?

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- తండ్రీ! తమరిని చూచుటచే ప్రీతి కలిగినది. తమరి రాక సుఖముగా జరిగినదా? మీకు మంగళమగు గాక! మా జ్ఞాతులు, బంధువుల యెడల కంసుడు పాపమును చేయలేదు గదా? వారు క్షేమమేనా?

కిం ను నః కుశలం పృచ్ఛే ఏధమానే కులామయే ।
కంసే మాతులనామ్న్యంగ స్వానాం నస్తత్ప్రజాసు చ ॥ 5

అంగ - అయ్యా!, మాతులనామ్ని - మేనమామ అనే పేరు గల, నః - మా, కుల-ఆమయే - వంశముయొక్క వ్యాధి, ఏధమానే - పెరుగుచుండగా, నః - మాకు, స్వానామ్ - మా బంధువులకు, తత్-ప్రజాసు చ - వాని ప్రజలయందు కూడ, కుశలమ్ - క్షేమమును గురించి, కిం ను - ఏమి, పృచ్ఛే - ప్రశ్నించను?

అయ్యా! మా వంశములో మేనమామ అనే పేరుతో వ్యాధి పెరుగుచున్నది. అట్టిచో, మాకు, మా బంధువులకు, కంసునిచే పాలించబడే ప్రజలకు క్షేమమును గురించి ఏమని ప్రశ్నించెదను?

అహో అస్మదభూద్భూరి పిత్రోర్వృజినమార్యయోః ।
యద్ధేతోః పుత్రమరణం యద్ధేతోర్బంధనం తయోః ।। 6

అహో - అయ్యో!, అస్మత్ - మా నిమిత్తముగా, ఆర్యయోః - పూజనీయులైన, పిత్రోః - తల్లిదండ్రులకు, భూరి - పెద్ద, వృజినమ్ - దుఃఖము, అభూత్ - కలిగెను, యద్-హేతోః - ఏ నా కారణముగా, పుత్రమరణమ్ - పుత్రుల మరణమో, యద్-హేతోః - ఏ నా కారణముగా, తయోః - వారిద్దరికి, బంధనమ్ - చెరసాలయో.

అయ్యో! నా కారణముగా పూజనీయులైన మా తల్లిదండ్రులకు దుఃఖము కలిగినది. నా కారణముగానే వారిద్దరికి పుత్రుల మరణము, చెరసాల కలిగినవి.

దిష్ట్యాఽద్య దర్శనం స్వానాం మహ్యాం వస్సౌమ్య కాంక్షితమ్ ।
సంజాతం వర్ణ్యతాం తాత తవాగమనకారణమ్ ।। 7

సౌమ్య - ఓ ప్రియదర్శనా!, మహ్యామ్ - నా కొరకు, స్వానామ్ - నావారియొక్క, దర్శనమ్ - దర్శనము, కాంక్షితమ్ - కోరబడినది, అద్య - ఈనాడు, వః - మీ (దర్శనము), సంజాతమ్ - కలిగినది, దిష్ట్యా - ఆనందము, తాత - ఓ తండ్రీ!, తవ - నీ, ఆగమనకారణమ్ - వచ్చుటకు కారణము, వర్ణ్యతామ్ - వర్ణించబడుగాక!

ఓ ప్రియదర్శనా! తండ్రీ! నా వారి దర్శనమును నేను కోరుచుంటిని. ఈనాడు నాకు మీ దర్శనము కలిగినది. ఆనందము. తమరి రాకకు కారణమును చెప్పుడు.

శ్రీశుక ఉవాచ ।
పృష్టో భగవతా సర్వం వర్ణయామాస మాధవః ।
వైరానుబంధం యదుషు వసుదేవవధోద్యమమ్ ॥ 8

భగవతా - శ్రీకృష్ణ భగవానునిచే, పృష్టః - ప్రశ్నించబడిన, మాధవః - మధువంశీయుడగు అక్రూరుడు, యదుషు - యాదవులయందు, వైర-అనుబంధమ్ - శత్రువుయొక్క ప్రవృత్తిని, వసుదేవవధ-ఉద్యమమ్ - వసుదేవుని వధించుటకు ప్రయత్నమును, సర్వమ్ - సర్వమును, వర్ణయామాస - వర్ణించి చెప్పెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను: శ్రీకృష్ణ భగవానుడిట్లు ప్రశ్నించగా, మధువంశోద్భవుడగు అక్రూరుడు -- యాదవుల యెడల కంసుడు కత్తి కట్టుట, వసుదేవుని వధించే ప్రయత్నమును చేయుట -- అనే సర్వమును వర్ణించి చెప్పెను.

యత్సందేశో యదర్థం వా దూతస్సంప్రేషితస్స్వయమ్ ।
యదుక్తం నారదేనాస్య స్వజన్మాఽఽనకదుందుభేః ॥ 9

యత్-సందేశః - ఏ సందేశము గల, దూతః - దూత, యద్-అర్థం వా - ఏ ప్రయోజనము కొరకు, స్వయమ్ - తాను, సంప్రేషితః - పంపబడినాడో, అస్య - వీనికి, నారదేన - నారద మహర్షిచే, యత్ - ఏది, ఉక్తమ్ - చెప్పబడినదో, ఆనకదుందుభేః - వసుదేవుని వలన, స్వజన్మ - తన పుట్టుక.

కంసుడు తనను ఏ సందేశముతో ఏ ప్రయోజనము కొరకు దూతగా పంపెనో, వసుదేవుని వలన తాను (శ్రీకృష్ణుడు) జన్మించినాడని నారదుడీ కంసునకు ఏమి చెప్పెనో, (ఆ సర్వమును వర్ణించి చెప్పెను).

శ్రుత్వాఽక్రూరవచః కృష్ణో బలశ్చ పరవీరహా ।
ప్రహస్య నందం పితరం రాజ్ఞాఽఽదిష్టం విజజ్ఞతుః ॥ 10

పరవీరహా - శత్రువీరులను సంహరించే, కృష్ణః - శ్రీకృష్ణుడు, బలః చ - బలరాముడు కూడ, అక్రూరవచః - అక్రూరుని మాటను, శ్రుత్వా - విని, ప్రహస్య - నవ్వి, రాజ్ఞా - కంసప్రభునిచే, ఆదిష్టమ్ - ఆదేశించబడిన విషయమును, పితరమ్ - తండ్రియగు, నందమ్ - నందుని గురించి, విజజ్ఞతుః - విన్నవించిరి.

శత్రువీరులను సంహరించే బలరామకృష్ణులు అక్రూరుని మాటను విని నవ్విరి. వారు కంసుని ఆదేశము (వారిద్దరికి ధనుర్యాగమునకు ఆహ్వానము) ను తండ్రియగు నందునకు విన్నవించిరి.

గోపాన్ సమాదిశత్సోఽపి గృహ్యతాం సర్వగోరసః ।
ఉపాయనాని గృహ్ణీధ్వం యుజ్యంతాం శకటాని చ ।। 11

సః అపి - ఆ నందుడు కూడ, గోపాన్ - గోపాలకులను, సమాదిశత్ - ఆదేశించెను, సర్వగోరసః - సకలమైన గోవుల సారము, గృహ్యతామ్ - తీసుకువెళ్లబడుగాక!, ఉపాయనాని - బహుమతులను, గృహ్ణీధ్వమ్ - తీసుకురండు, శకటాని చ - బళ్లు కూడ, యుజ్యంతామ్ - కట్టబడుగాక!

ఆ నందుడు కూడ గోపాలకులను ఆదేశించెను -- సకలగోరసము (పాలు, వెన్న ఇత్యాది) ను తీసుకురండు. బహుమతులను కూడ తీసుకు రండు. బళ్లను కట్టుడు.

యాస్యామశ్శ్వో మధుపురీం దాస్యామో నృపతే రసాన్ ।
ద్రక్ష్యామస్సుమహత్పర్వ యాంతి జానపదాః కిల ।
ఏవమాఘోషయత్ క్షత్త్రా నందగోపస్స్వగోకులే ।। 12

శ్వః - రేపు, మధుపురీమ్ - మథురా నగరమును గురించి, యాస్యామః - వెళ్లెదము, నృపతేః - మహారాజునకు, రసాన్ - పాలు పెరుగు మొదలగువాటిని, దాస్యామః - ఇచ్చెదము, సుమహత్ - చాల గొప్ప, పర్వ - పండుగను, ద్రక్ష్యామః - చూచెదము, జానపదాః - దేశవాసులు, యాంతి కిల - వెళ్లుచున్నారు గదా!, ఏవమ్ - ఈ విధముగా, నందగోపః - గోపాలకుడగు నందుడు, స్వగోకులే - తన గోకులమునందు, క్షత్త్రా - గోకులాధిపతిచే, ఆ-అఘోషయత్ - అంతటా చాటింపు వేయించెను.

రేపు మధురా నగరమునకు వెళ్లి మహారాజునకు పాలు, పెరుగు మొదలగువాటిని సమర్పించి, గొప్ప ధనుర్యాగోత్సవమును చూచెదము. దేశవాసులు వెళ్లుచున్నారు -- అని నందుడు గోకులాధిపతిచే అంతటా చాటింపు వేయించెను.

గోప్యస్తాస్తదుపశ్రుత్య బభూవుర్వ్యథితా భృశమ్ ।
రామకృష్ణౌ పురీం నేతుమక్రూరం వ్రజమాగతమ్ ॥ 13

తత్ - అప్పుడు, రామకృష్ణౌ - బలరామకృష్ణులను, పురీమ్ - మధురా నగరమును గురించి, నేతుమ్ - తీసుకువెళ్లుటకు, వ్రజమ్ - గోకులమును గురించి, ఆగతమ్ - వచ్చిన, అక్రూరమ్ - అక్రూరుని గురించి, ఉపశ్రుత్య - విని, తాః - ఆ, గోప్యః - గోపికలు, భృశమ్ - మిక్కిలి, వ్యథితాః - దుఃఖము గలవారు, బభూవుః - అయిరి.

అప్పుడు బలరామకృష్ణులను మధురా నగరమునకు తీసుకు వెళ్లుటకై అక్రూరుడు గోకులమునకు వచ్చినాడని విని ఆ గోపికలు చాల దుఃఖమును పొందిరి.

కాశ్చిత్తత్కృతహృత్తాపశ్వాసమ్లానముఖశ్రియః ।
స్రంసద్దుకూలవలయకేశగ్రంథ్యశ్చ కాశ్చన ॥ 14

కాశ్చిత్ - కొందరు గోపికలు, తత్-కృతహృత్-తాపశ్వాసమ్లాన ముఖశ్రియః - ఆ వార్తచే కలిగించబడిన హృదయతాపముచే కలిగిన నిట్టూర్పుచే వాడిపోయిన ముఖకాంతి గలవారు, కాశ్చన చ - మరి కొందరు గోపికలు, స్రంసద్-దుకూలవలయకేశగ్రంథ్యః - జారిపోవుచున్న వస్త్రములు కంకణములు జుట్టు ముడులు కలవారు.

ఆ వార్త విని కొందరు గోపికలకు హృదయతాపము కలిగి దాని వలన కలిగిన వేడి నిట్టూర్పులకు ముఖకాంతి వాడిపోయెను. మరికొందరు గోపికలకు వస్త్రములు, కంకణములు, జుట్టు ముడులు జారిపోయెను.

అన్యాశ్చ తదనుధ్యాననివృత్తాశేషవృత్తయః ।
నాభ్యజానన్నిమం లోకమాత్మలోకం గతా ఇవ ॥ 15

తద్-అనుధ్యాననివృత్త-అశేషవృత్తయః - ఆ శ్రీకృష్ణుని ధ్యానముచే తొలగిన సకలవ్యాపారములు గల, అన్యాః చ - మరి కొందరు గోపికలు, ఆత్మలోకమ్ - ఆత్మ అనే లోకమును, గతాః ఇవ - పొందివారు వలె, ఇమమ్ - ఈ, లోకమ్ - (లోకము) దేహమును, న అభ్యజానన్ - తెలియకుండిరి.

ఆ శ్రీకృష్ణుని ధ్యానముచే మరి కొందరు గోపికలకు ఇంద్రియ వ్యాపారములన్నీ తొలగిపోయెను. వారికి ఆత్మసాక్షాత్కారమును పొందిన యోగులకు వలె దేహస్పృహ, ఈ లోకముయొక్క జ్ఞానము లేకుండెను.

స్మరంత్యశ్చాపరాశ్శౌరేరనురాగస్మితేరితాః ।
హృదిస్పృశశ్చిత్రపదా గిరస్సంముముహుః స్త్రియః ॥ 16

అపరాః - ఇతరులైన, స్త్రియః - గోపికలు, శౌరేః - శ్రీకృష్ణుని, అనురాగస్మిత-ఈరితాః - అనురాగముచే కలిగిన చిరునవ్వుతో పలుకబడినట్టియు, హృదిస్పృశః - హృదయమును తాకునట్టియు, చిత్ర పదాః - చిత్రములైన (అబ్బురపరచే) పదములు గల, గిరః - మాటలను, స్మరంత్యః - స్మరించువారై, సంముముహుః - మోహమును పొందిరి.

మరి కొందరు గోపికలు శ్రీకృష్ణుడు ప్రేమతో కూడిన చిరునవ్వుతో పలికిన పలుకులను గుర్తు చేసుకొని మోహమును పొందిరి. చిత్రమగు (అబ్బురపరచే) పదములు గల ఆ పలుకులు వారి హృదయములను స్పృశించినవి.

గతిం సులలితాం చేష్టాం స్నిగ్ధహాసావలోకనమ్ ।
శోకాపహాని నర్మాణి ప్రోద్దామచరితాని చ ॥ 17

చింతయంత్యో ముకుందస్య భీతా విరహకాతరాః ।
సమేతాస్సంఘశః ప్రోచురశ్రుముఖ్యోఽచ్యుతాశయాః ॥ 18

ముకుందస్య - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణునియొక్క, సులలితామ్ - మిక్కిలి అందమైన, గతిమ్ - నడకను, చేష్టామ్ - చేష్టను, స్నిగ్ధహాస-అవ లోకనమ్ - ప్రేమ నిండిన చిరునవ్వుతో కూడిన చూపును, శోక-అపహాని - దుఃఖమును పోగొట్టే, నర్మాణి - పరిహాస వచనములను, ప్ర-ఉద్దామ

చరితాని చ - చాల గొప్ప లీలలను కూడ, చింతయంత్యః - ధ్యానించు వారు, భీతాః - భయపడినవారు, విరహకాతరాః - విరహముచే వ్యాకుల పడినవారు, అశ్రుముఖ్యః - కన్నీరు ముఖములయందు గలవారు, అచ్యుత -ఆశయాః - శ్రీకృష్ణుడే హృదయమునందు గలవారు అగు గోపికలు, సంఘశః - గుంపుగా, సమేతాః - గుమిగూడినవారై, ప్రోచుః - పలికిరి.

మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని మిక్కిలి అందమైన నడకను, చేష్టను, ప్రేమ నిండిన చిరునవ్వుతో కూడిన చూపును, దుఃఖమును బాపే పరిహాస వచనములను, చాల గొప్ప లీలలను కూడ ధ్యానించే గోపికలు ఆయన దూరమగునేమో అనే భయముతో విరహముతో వ్యాకులపడిరి. ముఖముపై కన్నీళ్లు, హృదయములో శ్రీకృష్ణభగవానుడు గల ఆ గోపికలు గుంపుగా గుమిగూడి ఇట్లు పలికిరి.

గోప్య ఊచుః ।
అహో విధాతస్తవ న క్వచిద్దయా
సంయోజ్య మైత్ర్యా ప్రణయేన దేహినః ।
తాంశ్చాకృతార్థాన్ వియునంక్ష్యపార్థకం
విక్రీడితం తేఽర్భకచేష్టితం యథా ।। 19

అహో - అయ్యో!, విధాతః - ఓ బ్రహ్మదేవుడా!, తవ - నీకు, క్వచిత్ - ఏ కాలమునందైననూ, దయా - దయ, న - లేదు, దేహినః - ప్రాణులను, మైత్ర్యా - మైత్రితో, ప్రణయేన - ప్రేమతో, సంయోజ్య - కలిపి, అకృత-అర్థాన్ - కృతార్థులు కాని, తాన్ చ - వారినే, వియునంక్షి - విడదీసెదవు, తే - నీ, విక్రీడితమ్ - చేష్ట, అర్భకచేష్టితం యథా - పిల్లవాని చేష్ట వలె, అప-అర్థకమ్ - నిరర్థకము.

గోపికలిట్లు పలికిరి --- అయ్యో! ఓ బ్రహ్మదేవుడా! నీకు ఏ కాలమునందైననూ దయ లేదు. నీవు ప్రాణులను మైత్రితో, ప్రేమతో కలిపి వారి మనోరథములు సిద్ధించ కుండగనే వారిని విడదీసెదవు. నీ చేష్ట పిల్లవాని చేష్ట వలె నిరర్థకము.

యస్త్వం ప్రదర్శ్యాసితకుంతలావృతం
ముకుందవక్త్రం సుకపోలమున్నసమ్ ।
శోకాపనోదస్మితలేశసుందరం
కరోషి పారోక్ష్యమసాధు తే కృతమ్ ॥ 20

యః - ఏ, త్వమ్ - నీవు, అసితకుంతల-ఆవృతమ్ - నల్లని ముంగురులతో చుట్టువారబడినట్టియు, సుకపోలమ్ - చక్కని చెక్కిళ్లు కలిగినట్టియు, ఉత్-నసమ్ - ఎత్తైన ముక్కు కలిగినట్టియు, శోక-అపనోదస్మిత లేశసుందరమ్ - శోకమును పోగొట్టే చిరునవ్వుతో అందమైన, ముకుంద వక్త్రమ్ - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణ భగవానుని ముఖమును, ప్రదర్శ్య - చూపించి, పారోక్ష్యమ్ - కనబడనిదానినిగా, కరోషి - చేయుచున్నావు, తే - నీచే, అసాధు - దుష్టకృత్యము, కృతమ్ - చేయబడినది.

ఏలయన, నీవు మోక్షప్రదాతయగు శ్రీకృష్ణ భగవానుని ముఖమును చూపించి మరల కనబడకుండా చేయుచున్నావు. నల్లని ముంగురులతో ఆవరించబడియుండే ఆయన ముఖము చక్కని చెక్కిళ్లతో, ఎత్తైన ముక్కుతో, అందమైన చిరునవ్వుతో శోకమును పోగొట్టును. నీవు దుష్టులు చేసే పనిని చేయుచున్నావు.

క్రూరస్త్వమక్రూరసమాఖ్యయా స్మ నశ్చక్షుర్హి దత్తం హరసే బతాజ్ఞవత్,
యేనైకదేశేఽఖిలసర్గసౌష్ఠవం త్వదీయమద్రాక్ష్మ వయం మధుద్విషః ॥

త్వమ్ - నీవు, అక్రూరసమాఖ్యయా - అక్రూరుడనే పేరుతో, క్రూరః స్మ - క్రూరుడవే, హి - ఏలయన, నః - మా కొరకు, దత్తమ్ - ఈయబడిన, చక్షుః - చూపును, అజ్ఞవత్ - అజ్ఞాని వలె, హరసే - అపహరించుచున్నావు, బత - అయ్యో!, యేన - ఏ చూపుతో, వయమ్ - మేము, త్వదీయమ్ - నీకు చెందిన, అఖిలసర్గసౌష్ఠవమ్ - సకలమైన సృష్టినైపుణిని, మధుద్విషః - మధువనే రాక్షసుని సంహరించిన శ్రీకృష్ణ భగవానుని, ఏకదేశే - ఒకే అవయవమునందు, అద్రాక్ష్మ - చూచితిమో.

అయ్యో! నీవు అక్రూరుడనే పేరుతోనున్న క్రూరుడవు. ఎందుకంటే, మాకు చూపును ఇచ్చిన నీవే ఆ చూపును అజ్ఞానివలె

అపహరించుచున్నావు. మేమా చూపుతో నీ సకలసృష్టినైపుణ్యమును మధువనే రాక్షసుని సంహరించిన శ్రీకృష్ణ భగవానుని ముఖము, కన్ను మొదలైన ఒకే అవయవములో చూచెడివారము. 21

న నందసూనుః క్షణభంగసౌహృదస్సమీక్షతే నస్స్వకృతాతురా బత,
విహాయ గేహాన్ స్వజనాన్ సుతాన్పతీంస్తద్దాస్యమద్ధోపగతా నవప్రియః.

బత - అయ్యో!, క్షణభంగసౌహృదః - అస్థిరమైన ప్రేమ గలవాడు, నవప్రియః - కొత్తవారిపై ప్రేమ గలవాడు, నందసూనుః - నందుని పుత్రుడు అగు శ్రీకృష్ణుడు, స్వకృత-ఆతురాః - తన చేష్టలచే పరవశలమైన, నః - మమ్ములను, న సమీక్షతే - చూచుట లేదు, గేహాన్ - ఇళ్లను, స్వజనాన్ - తమ బంధువులను, సుతాన్ - పుత్రులను, పతీన్ - భర్తలను, విహాయ - విడిచిపెట్టి, అద్ధా - సాక్షాత్తుగా, తద్-దాస్యమ్ - ఆయనయొక్క దాస్యమును, ఉపగతాః - పొందినవారము. 22

ఇళ్లు, బంధువులు, పుత్రులు, భర్తలను విడిచిపెట్టి మేము సాక్షాత్తుగా శ్రీకృష్ణుని దాస్యమును స్వీకరించితిమి. అయ్యో! కొత్తవారిపై ప్రేమ గల ఆ నందుని పుత్రుడు తన చేష్టలతో మమ్ములను పరవశులను చేసి ఆపై మాకేసి చూచుట మానివేసినాడు. ఆతని ప్రేమ క్షణభంగురము.

సుఖంప్రభాతా రజనీయమాశిషః
సత్యా బభూవుః పురయోషితాం ధ్రువమ్ ।
యాస్సంప్రవిష్టస్య ముఖం వ్రజస్పతేః
పాస్యంత్యపాంగోత్కలితస్మితాసవమ్ ॥ 23

పురయోషితామ్ - మథురానగరయువతులకు, ఇయమ్ - ఈ, రజనీ - రాత్రి, సుఖంప్రభాతా - సుఖకరమైన ఉదయము గలది, ఆశిషః - మనోరథములు, సత్యాః - సత్యములు, బభూవుః - అయినవి, ధ్రువమ్ - నిశ్చయము, యాః - ఎవరైతే, సంప్రవిష్టస్య - ప్రవేశించిన, వ్రజస్పతేః - గోకుల ప్రభువగు శ్రీకృష్ణుని, అపాంగ-ఉత్కలితస్మిత-ఆసవమ్ - కను కొలుకులచే ఉజ్జ్వలము చేయబడిన చిరునవ్వు అనే మద్యము గల, ముఖమ్ - ముఖమును, పాస్యంతి - పానము చేయగలరో.

మధురానగర యువతులకీ రాత్రి శుభోదయమగును. వారి మనోరథములు యథార్థములైనవి. ఎందుకంటే, గోకులప్రభుడగు శ్రీకృష్ణుడు వారి నగరములో ప్రవేశించును. వారు కనుకొలుకులచే ఉజ్జ్వలముగా చేయబడిన చిరునవ్వు అనే మద్యము గల ఆతని ముఖమును (కన్నులతో) పానము చేయబోవుచున్నారు.

తాసాం ముకుందో మధుమంజుభాషితైః
గృహీతచిత్తః పరవాన్మనస్వ్యపి ।
కథం పునర్నః ప్రతియాస్యతేఽబలా
గ్రామ్యాస్సలజ్జస్మితవిభ్రమైర్భ్రమన్ ॥ 24

అబలాః - ఓ అబలలారా!, మనస్వీ అపి - ధీరుడే అయిననూ, పరవాన్ - ఇతరుల అధీనములో ఉండే, ముకుందః - శ్రీకృష్ణుడు, తాసామ్ - ఆ యువతులయొక్క, మధుమంజుభాషితైః - తేనెవలె తియ్యని పలుకులచే, గృహీతచిత్తః - ఆకర్షించబడిన మనస్సు గలవాడై, సలజ్జస్మితవిభ్రమైః - సిగ్గుతో కూడిన చిరునవ్వుయొక్క విలాసలచే, భ్రమన్ - అంతా మరచినవాడై, పునః - మరల, గ్రామ్యాః - పల్లెటూరివారలమగు, నః - మనలనుద్దేశించి, కథమ్ - ఏ విధముగా, ప్రతియాస్యతే - తిరిగి రాగలడు?

ఓ అబలలారా! శ్రీకృష్ణుడు ధీరుడే అయినా ఇతరుల అధీనములో నుండును. ఆ నగరయువతుల తేనెవంటి తియ్యని పలుకులకు ఆతని మనస్సు ఆకర్షించబడును. వారి సిగ్గుతో కూడిన చిరునవ్వుయొక్క విలాసలచే ఆతడు అంతా మరచి పోవును. అట్టివాడు మరల తిరిగి మనవద్దకు ఎట్లు వచ్చును? మనము పల్లెటూరివారము గదా!

అద్య ధ్రువం తత్ర దృశో భవిష్యతే
దాశార్హభోజాంధకవృష్ణిసాత్వతామ్ ।
మహోత్సవశ్శ్రీరమణం గుణాస్పదం
ద్రక్ష్యంతి యే చాధ్వని దేవకీసుతమ్ ॥ 25

అద్య - ఈనాడు, తత్ర - అచట, ధ్రువమ్ - నిశ్చయముగా, దాశార్హభోజ-అంధకవృష్ణిసాత్వతామ్ - దాశార్హ భోజ అంధక వృష్ణి

సాత్వతవంశీయులకు, దృశః - చూపునకు, మహా-ఉత్సవః - గొప్ప ఉత్సవము, భవిష్యతే - కలుగగలదు, శ్రీరమణమ్ - లక్ష్మీదేవిని రమింపజేయునట్టియు, గుణ-ఆస్పదమ్ - సద్గుణములకు నిధానమైనట్టియు, దేవకీసుతమ్ - దేవకియొక్క పుత్రుడగు శ్రీకృష్ణుని, ద్రక్ష్యంతి - చూడగలరు, అధ్వని - మార్గమునందు, యే చ - ఎవరు గలరో వారు కూడ.

ఈనాడు ఆ మథురానగరములోని దాశార్హ భోజ అంధక వృష్ణి సాత్వత వంశీయుల కన్నులకు గొప్ప ఉత్సవమే కలుగగలదు. వారు లక్ష్మిని రమింపజేసే శ్రీకృష్ణుని చూడగలరు. దారిలోనున్న జనులు కూడ సద్గుణనిధానమగు ఆ దేవకీనందనుని చూడగలరు.

మైతద్విధస్యాకరుణస్య నామ భూత్
అక్రూర ఇత్యేతదతీవ దారుణః ।
యోఽసావనాశ్వాస్య సుదుఃఖితం జనం
ప్రియాత్ప్రియం నేష్యతి పారమధ్వనః ॥ 26

ఏతద్-విధస్య - ఇటువంటి చేష్ట కలిగినట్టియు, అకరుణస్య - దయ లేనివానికి, అక్రూరః - అక్రూరుడు, ఇతి - అనే, ఏతత్ - ఈ, నామ - పేరు, మా భూత్ - ఉండకూడదు, అతీవ - మిక్కిలి, దారుణః - క్రూరుడు, యః - ఏ, అసౌ - ఈతడు, సుదుఃఖితమ్ - అధికముగా దుఃఖించుచున్న, జనమ్ - జనుని, అనాశ్వాస్య - ఓదార్చకుండా, ప్రియాత్ - ప్రియమైన ప్రాణముకంటె, ప్రియమ్ - ప్రియుడైన శ్రీకృష్ణుని, అధ్వనః - మార్గముయొక్క, పారమ్ - అంతమును గురించి, నేష్యతి - తీసుకొనిపోవునో.

ఇటువంటి చేష్ట కలిగి దయ లేని ఈ వ్యక్తికి అక్రూరుడనే ఈ పేరు ఉండరాదు. ఈతడు మిక్కిలి క్రూరుడు. ఎందుకంటే, ఈతడు దుఃఖించుచున్న మనలను ఓదార్చకుండా, ప్రాణములకంటె ప్రియుడగు శ్రీకృష్ణుని మార్గముయొక్క అంతము వరకు తీసుకొని పోవును.

అనార్ద్రధీరేష సమాస్థితో రథం తమన్వమీ చ త్వరయంతి దుర్మదాః,
గోపా అనోభిః స్థవిరైరుపేక్షితం దైవం చ నోఽద్య ప్రతికూలమీహతే।27

అనార్ద్రధీః - ప్రేమ లేని మనస్సు గల, ఏషః - ఈ శ్రీకృష్ణుడు, రథమ్ - రథమును, సమాస్థితః - ఎక్కినవాడు, తమ్ - ఆతనిని, అను - అనుసరించి, అనోభిః - బళ్లతో, దుర్మదాః - పొగరెక్కిన, అమీ - ఈ, గోపాః చ - గోపాలకులు కూడ, త్వరయంతి - తొందర పెట్టుచున్నారు, స్థవిరైః - పెద్దలచే, ఉపేక్షితమ్ - ఉపేక్షించబడినది, అద్య - ఈ నాడు, దైవం చ - దైవము కూడ, నః - మనకు, ప్రతికూలమ్ - విరుద్ధముగా, ఈహతే - ఆచరించుచున్నాడు.

ఈ శ్రీకృష్ణుని మనస్సులో ప్రేమ లేదు. అప్పుడే రథమునెక్కి కూర్చున్నాడు. పొగరెక్కిన ఈ గోపాలకులు కూడ బళ్లను సిద్ధం చేసుకొని ఆతని వెంటబడి తొందర పెట్టుచున్నారు. పెద్దలు పట్టనట్లు మిన్నకున్నారు. ఈనాడు దైవము కూడ మనకు విరుద్ధముగా ఆచరించుచున్నది.

నివారయామస్సముపేత్య మాధవం
కిం నోఽకరిష్యన్ కులవృద్ధబాంధవాః ।
ముకుందసంగాన్నిమిషార్ధదుస్త్యజాత్
దైవేన విధ్వంసితదీనచేతసామ్ ।। 28

సముపేత్య - గుమిగూడి, మాధవమ్ - లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుని, నివారయామః - అడ్డుకొనెదము, నిమిష-అర్ధదుస్త్యజాత్ - అర నిముషము విడువ శక్యము కాని, ముకుందసంగాత్ - శ్రీకృష్ణ భగవానుని సంగమునుండి, దైవేన - దైవముచే, విధ్వంసితదీనచేతసామ్ - వియోగము కలిగించబడి దీనమైన మనస్సులు గల, నః - మనలకు, కులవృద్ధబాంధవాః - కులములోని పెద్దలు బంధువులు, కిం అకరిష్యన్ - ఏమి చేయుదురు?

మనము కట్టు కట్టుకొని లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుడు వెళ్లకుండా అడ్డుకొనెదము. మోక్షప్రదాతయగు శ్రీకృష్ణ భగవానుని సంగమును అర నిముషమైననూ విడిచిపెట్టుట దుర్ఘటము. కాని, దైవము

మనకట్టి వియోగమును కలిగించినది. దీనమైన మనస్సులు గల మనలను కులములోని పెద్దలు, బంధువులు ఏమి చేయుదురు?

యస్యానురాగలలితస్మితవల్గుమంత్ర-
లీలావలోకపరిరంభణరాసగోష్ఠ్యామ్ ।
నీతాస్స్మ నః క్షణమివ క్షణదా వినా తం
గోప్యః కథం న్వతితరేమ తమో దురంతమ్ ॥ 29

గోప్యః - ఓ గోపికలారా!, అనురాగలలితస్మితవల్గుమంత్రలీలా-అవలోకపరిరంభణరాసగోష్ఠ్యామ్ - ప్రేమతో సుందరమైన చిరునవ్వు మనోహరమైన రహస్యసంభాషణము విలాసగా చూచుటలు ఆలింగనములు గల రాసక్రీడయొక్క సభయందు, నః - మనకు, క్షణదాః - రాత్రులు, క్షణం ఇవ - క్షణము వలె, నీతాః స్మ - గడుపబడినవి, తం వినా - ఆ శ్రీకృష్ణుడు లేకుండా, దురంతమ్ - అంతము లేని, తమః - దుఃఖమును, కథం ను - ఏ విధముగా, అతితరేమ - అతిక్రమించెదము?

ఓ గోపికలారా! రాసక్రీడయందు శ్రీకృష్ణుడు ప్రేమతో కూడిన సుందరమైన చిరునవ్వు నవ్వుతూ విలాసముగా చూస్తూ మనోహరమైన రహస్యసంభాషణములను చేస్తూ కౌగిలించెడివాడు. మనమెన్నో రాత్రులను క్షణము వలె గడిపి వేసితిమి. అట్టి కృష్ణుడు లేకుండా అంతు లేని విరహదుఃఖమును మనమెట్లు అతిక్రమించవలెను?

యోఽహ్నః క్షయే వ్రజమనంతసఖః పరీతో
గోపైర్విశన్ ఖురరజశ్ఛురితాలకస్రక్ ।
వేణుం క్వణన్ స్మితకటాక్షనిరీక్షణేన
చిత్తం క్షిణోత్యముమృతే ను కథం భవేమ ॥ 30

అనంతసఖః - బలరాముడు తోడుగా గల, యః - ఏ శ్రీకృష్ణుడైతే, అహ్నః - పగటియొక్క, క్షయే - అంతమునందు, గోపైః - గోపబాలకులతో, పరీతః - చుట్టువారబడినవాడై, వ్రజమ్ - గోకులమును, విశన్ - ప్రవేశించువాడు, ఖురరజః-ఛురిత-అలకస్రక్ - (గోవుల) గిట్టల ధూళిచే బూడిదగా చేయబడిన ముంగురులు మాల గలవాడై, వేణుమ్ -

వేణువును, క్వణన్ - వాయించువాడై, స్మితకటాక్షనిరీక్షణేన - చిరునవ్వుతో కూడిన ఓర చూపుతో, చిత్తమ్ - మనస్సును, క్షిణోతి - దోచివేయునో, అముం ఋతే - ఈతడు లేకుండా, కథమ్ - ఏ విధముగా, భవేమ ను - మనగల్గెదము?

శ్రీకృష్ణుడు బలరాముడు తోడు కాగా గోప బాలకులు చుట్టువారియుండ సాయంకాలమునందు వేణువును వాయిస్తూ గోకులమును ప్రవేశించును. ఆయన ముంగురులు, వనమాల గోవుల గిట్టలనుండి లేచే దుమ్ముతో బూడిద రంగును కలిగియుండును. ఆయన చిరునవ్వుతో ఓరచూపులు చూస్తూ మన మనస్సును దోచివేయును. అట్టి ఈ శ్రీకృష్ణుడు లేకుండా మనమెట్లు మనగల్గుదుము?

శ్రీశుక ఉవాచ ।
ఏవం బ్రువాణా విరహాతురా భృశం వ్రజస్త్రియః కృష్ణవిషక్తమానసాః,
విసృజ్య లజ్జాం రురుదుస్స్మ సుస్వరం గోవింద దామోదర మాధవేతి.

భృశమ్ - మిక్కుటముగా, విరహ-ఆతురాః - వియోగముచే పీడను పొందినవారు, కృష్ణవిషక్తమానసాః - శ్రీకృష్ణునియందు అధికముగా లగ్నమైన మనస్సులు గలవారు అగు, వ్రజస్త్రియః - గోకులమునందలి గోపికలు, లజ్జామ్ - సిగ్గును, విసృజ్య - విడిచిపెట్టి, ఏవమ్ - ఈ విధముగా, బ్రువాణాః - పలుకుచున్నవారై, గోవింద - ఓ గోవిందా!, దామోదర - ఓ దామోదరా!, మాధవ - ఓ మాధవా!, ఇతి - అని, సుస్వరమ్ - మధురమైన ధ్వని కలుగునట్లుగా, రురుదుః స్మ - ఏడ్చిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గోకులమునందలి గోపికలు శ్రీకృష్ణుని (కలుగబోయే) విరహముచే అధికమగు పీడను పొందిరి. వారి మనస్సు శ్రీకృష్ణునియందే విశేషముగా లగ్నమై యుండెను. వారు సిగ్గును విడిచి ఈ విధముగా పలుకుతూ, ఓ గోవిందా! ఓ దామోదరా! ఓ మాధవా! అంటూ మధురమైన స్వరముతో ఏడ్చిరి.

స్త్రీణామేవం రుదంతీనాముదితే సవితర్యథ ।
అక్రూరశ్చోదయామాస కృతమైత్రాదికో రథమ్ ॥ 32

అథ - తరువాత, సవితరి - సూర్యుడు, ఉదితే - ఉదయించగా, స్త్రీణామ్ - గోపికలు, ఏవమ్ - ఈ విధముగా, రుదంతీనామ్ - ఏడ్చుచుండగా, కృతమైత్ర-ఆదికః - చేయబడిన మిత్రుడు దేవతగా గల ప్రాతస్సంధ్య గలవాడై, రథమ్ - రథమును, చోదయామాస - తోలెను.

గోపికలీ విధముగా ఏడ్చుచుండగనే సూర్యుడు ఉదయించెను. తరువాత అక్రూరుడు మిత్రదేవతాకమైన ప్రాతస్సంధ్యను చేసుకొని, రథమును ముందుకు నడిపెను.

గోపాస్తమన్వసజ్జంత నందాద్యాశ్శకటైస్తతః ।
ఆదాయోపాయనం భూరి కుంభాన్ గోరససంభృతాన్ ॥ 33

తతః - తరువాత (ఆ గోకులమునుండి), నంద-ఆద్యాః - నందుడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు, భూరి - అధికమగు, ఉపాయనమ్ - బహుమానమును, గోరససంభృతాన్ - ఆవు పాలు మొదలగువాటితో నిండిన, కుంభాన్ - కడవలను, ఆదాయ - తీసుకొని, శకటైః - బండ్లతో, తమ్ - ఆ శ్రీకృష్ణుని, అను-అసజ్జంత - వెనుక వెళ్లిరి.

తరువాత (ఆ గోకులమునుండి) ఆ శ్రీకృష్ణుని వెనుక నందుడు, సునందుడు మొదలగు గోపాలకులు బళ్లపై వెళ్లిరి. వారు అనేక బహుమతులను, ఆవు పాలు మొదలగువాటిని నింపిన కడవలను తీసుకు వెళ్లిరి.

గోప్యశ్చ దయితం కృష్ణమనువ్రజ్యానురంజితాః ।
ప్రత్యాదేశం భగవతః కాంక్షంత్యశ్చావతస్థిరే ॥ 34

అనురంజితాః - అనురాగవతులైన, గోప్యః చ - గోపికలు కూడ, దయితమ్ - ప్రియుడగు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, అనువ్రజ్య - వెనుక వెళ్లి, భగవతః - శ్రీకృష్ణ భగవానుని, ప్రత్యాదేశమ్ - సందేశమును, కాంక్షంత్యః చ - కోరువారై, అవతస్థిరే - నిలిచి యుండిరి.

అనురాగవతులగు గోపికలు కూడ ప్రియుడగు శ్రీకృష్ణుని వెనుక వెళ్లిరి. ఆయనచే వారించబడి వారు ఆయన సందేశము కొరకు ఎదురు చూస్తూ ఉండిపోయిరి.

తాస్తథా తప్యతీర్వీక్ష్య స్వప్రస్థానే యదూత్తమః ।
సాంత్వయామాస సప్రేమైరాయాస్య ఇతి దౌత్యకైః ।। 35

స్వప్రస్థానే - తన ప్రయాణము విషయములో, తథా - ఆ విధముగా, తప్యతీః - దుఃఖించుచున్న, తాః - ఆ గోపికలను, వీక్ష్య - చూచి, యదు-ఉత్తమః - యాదవులలో గొప్పవాడగు శ్రీకృష్ణుడు, ఆయాస్యే - రాగలను, ఇతి - అనే, సప్రేమైః - ప్రేమతో కూడిన, దౌత్యకైః - దూత వాక్యములచే, సాంత్వయామాస - ఓదార్చెను.

తన ప్రయాణము విషయములో ఆ విధముగా దుఃఖించుచున్న గోపికలను యదువంశశిరోమణియగు శ్రీకృష్ణుడు చూచెను. నేను తిరిగి వచ్చెదను, అని ఆయన దూత ద్వారా ప్రేమసందేశమును పంపి వారిని ఓదార్చెను.

యావదాలక్ష్యతే కేతుర్యావద్రేణూ రథస్య చ ।
అనుప్రస్థాపితాత్మానో లేఖ్యానీవోపలక్షితాః ।। 36

యావత్ - ఎంతవరకైతే, కేతుః - జెండా, ఆ - కొంచెము, లక్ష్యతే - కనబడునో, యావత్ - ఎంతవరకైతే, రథస్య - రథముయొక్క, రేణుః చ - ధూళి కూడ, అనుప్రస్థాపిత-ఆత్మానః - వెనుక పంపబడిన మనస్సులు గలవారై, లేఖ్యాని ఇవ - చిత్రపటములు వలె, ఉపలక్షితాః - కానవచ్చిరి.

ఎంతవరకైతే రథము జెండా కొంచెమైననూ కనబడెనో, రథముయొక్క ధూళి కనబడెనో, అంతవరకు గోపికలు నిలబడి చూచిరి. వారు తమ మనస్సులను శ్రీకృష్ణునితో బాటే పంపివేసి చిత్రపటముల వలె నిలబడిరి.

తా నిరాశా నివవృతుర్గోవిందవినివర్తనే ।
విశోకా అహనీ నిన్యుర్గాయంత్యః ప్రియచేష్టితమ్ ।। 37

గోవిందవినివర్తనే - గోవిందుని వెనుకకు మళ్లించుటయందు, నిరాశాః - ఆశ లేని, తాః - ఆ గోపికలు, నివవృతుః - వెనుకకు దిరిగిరి, ప్రియచేష్టితమ్ - ప్రియుడగు శ్రీకృష్ణుని లీలను, గాయంత్యః - గానము చేయువారు, విశోకాః - తొలగిన శోకము గలవారు, అహనీ - రాత్రింబగళ్లను, నిన్యుః - గడిపిరి.

ఆ గోపికలకు గోవిందుడు వెనుకకు మరలి వచ్చుననే ఆశ తొలగిపోయి వారు వెను దిరిగిరి. వారు రాత్రింబగళ్లు ప్రియుడగు శ్రీకృష్ణుని లీలలను గానము చేస్తూ దుఃఖమును మరచి గడిపిరి.

భగవానపి సంప్రాప్తో రామాక్రూరయుతో నృప ।
రథేన వాయువేగేన కాలిందీమఘనాశినీమ్ ॥ 38

రామ-అక్రూరయుతః - బలరాముడు అక్రూరులతో కూడియున్న, భగవాన్ అపి - శ్రీకృష్ణ భగవానుడు కూడ, వాయువేగేన - వాయువుయొక్క వేగమువంటి వేగము గల, రథేన - రథముచే, అఘనాశినీమ్ - పాపములను నాశనము చేసే, కాలిందీమ్ - యమునానదిని, సంప్రాప్తః - చేరినవాడు.

బలరాముడు, అక్రూరులతో గూడి శ్రీకృష్ణ భగవానుడు వాయువేగముతో నడిచే రథముపై పాపములను వినాశము చేసే యమునా నదిని చేరెను.

తత్రోపస్పృశ్య పానీయం పీత్వా మృష్టం మణిప్రభమ్ ।
వృక్షషండముపవ్రజ్య సరామో రథమావిశత్ ॥ 39

తత్ర - ఆ యమునయందు, మణిప్రభమ్ - మణి వలె నిర్మలమైనట్టియు, మృష్టమ్ - తియ్యని, పానీయమ్ - నీటిని, ఉపస్పృశ్య - ముఖము చేతులు కాళ్లను కడుగుకొని, పీత్వా - త్రాగి, వృక్షషండమ్ - చెట్ల గుంపును, ఉపవ్రజ్య - సమీపించి, సరామః - రామునితో కూడినవాడై, రథమ్ - రథమును, ఆవిశత్ - ప్రవేశించెను.

బలరామకృష్ణులు మణి వలె స్వచ్ఛము, తియ్యనిది అగు ఆ యమునానదియొక్క నీటితో ముఖమును, చేతులను, కాళ్లను కడుగుకొని, నీటిని త్రాగి, తిరిగి వచ్చి చెట్ల గుంపులో ఆగిన రథమునెక్కిరి.

అక్రూరస్తావుపామంత్ర్య నివేశ్య చ రథోపరి ।
కాలింద్యా హ్రదమాగత్య స్నానం విధివదాచరత్ ॥ 40

అక్రూరః - అక్రూరుడు, తౌ - వారిద్దరిని, రథ-ఉపరి - రథముపై, నివేశ్య - కూర్చుండబెట్టి, ఉపామంత్ర్య చ - అనుమతిని కూడ తీసుకొని, కాలింద్యాః - యమునానదియొక్క, హ్రదమ్ - సరస్సును గురించి, ఆగత్య - వచ్చి, విధివత్ - యథావిధిగా, స్నానమ్ - స్నానమును, ఆచరత్ - చేసెను.

అక్రూరుడు వారిరువురిని రథముపై కూర్చుండబెట్టి వారి అనుమతితో యమునానదియొక్క సరస్సునకు వచ్చి యథావిధిగా స్నానము చేసెను.

నిమజ్జ్య తస్మిన్ సలిలే జపన్ బ్రహ్మ సనాతనమ్ ।
తావేవ దదృశేఽక్రూరో రామకృష్ణౌ సమన్వితౌ ॥ 41

అక్రూరః - అక్రూరుడు, తస్మిన్ - ఆ, సలిలే - నీటియందు, నిమజ్జ్య - మునిగి, సనాతనమ్ - కాలపరిచ్ఛేదము లేని, బ్రహ్మ - మంత్రమును, జపన్ - జపించువాడై, సమన్వితౌ - కలిసియున్న, తౌ - ఆ, రామకృష్ణౌ ఏవ - బలరామకృష్ణులనే, దదృశే - చూచెను.

అక్రూరుడు ఆ నీటిలో మునిగి కాలపరిచ్ఛేదము లేని గాయత్రీ మంత్రమును జపించుచుండెను. అచట ఆయనకు కలిసి ఉన్న బలరామకృష్ణులే కనబడిరి.

తౌ రథస్థౌ కథమిహ సుతావానకదుందుభేః ।
తర్హిస్విత్స్యందనే న స్త ఇత్యున్మజ్జ్య వ్యచష్ట సః ॥ 42

రథస్థౌ - రథమునందున్న, ఆనకదుందుభేః - వసుదేవుని, తౌ - ఆ, సుతౌ - ఇద్దరు పుత్రులు, ఇహ - ఇక్కడ, కథమ్ - ఎట్లు?, తర్హిస్విత్ - అట్లైనచో, స్యందనే - రథమునందు, న స్తః - ఉండరు, ఇతి - అని, ఉన్మజ్జ్య - పైకి లేచి, సః - ఆతడు, వ్యచష్ట - చూచెను.

వసుదేవుని పుత్రులగు బలరామకృష్ణులు ఇక్కడకు ఎట్లు వచ్చిరి? అయితే రథమునందు ఉండరు, అని తలచి ఆ అక్రూరుడు నీటినుండి తలను పైకెత్తి చూచెను.

తత్రాపి చ యథాపూర్వమాసీనౌ పునరేవ సః ।
న్యమజ్జద్దర్శనం యన్మే మృషా కిం సలిలే తయోః ॥ 43

తత్ర అపి చ - అక్కడ కూడ, యథాపూర్వమ్ - ముందులో వలెనే, ఆసీనౌ - కూర్చుని యున్నవారు, సః - ఆ అక్రూరుడు, పునః ఏవ - మరల, న్యమజ్జత్ - మునిగెను, సలిలే - నీటియందు, మే - నాయొక్క, తయోః - వారిద్దరి, దర్శనమ్ - చూచుట, యత్ - ఏది గలదో అది, కిం మృషా - మిథ్యయా?

ఆ రథమునందు కూడ వారిద్దరు ముందులో వలెనే కూర్చుని యుండిరి. ఐతే నేను నీటిలో వారిని చూచినది మిథ్యయా? అనుకుంటూ ఆ అక్రూరుడు మరల నీటిలో మునిగెను.

భూయస్తత్రాపి సోఽద్రాక్షీత్ స్తూయమానమహీశ్వరమ్ ।
సిద్ధచారణగంధర్వైరసురైర్నతకంధరైః ॥ 44

సః - ఆ అక్రూరుడు, భూయః - మరల, తత్ర అపి - అక్కడ కూడ, నతకంధరైః - వంచబడిన మెడలు గల, సిద్ధచారణగంధర్వైః - సిద్ధులచే చారణులచే గంధర్వులచే, అసురైః - అసురులచే, స్తూయమానమ్ - కొనియాడబడుచున్న, అహి-ఈశ్వరమ్ - నాగనాయకుడగు ఆదిశేషుని, అద్రాక్షీత్ - చూచెను.

ఆ అక్రూరునకు మరల అచట నీటిలో నాగనాయకుడగు ఆదిశేషుడు కనబడెను. ఆయనను సిద్ధులు, చారణులు, గంధర్వులు, అసురులు (ప్రహ్లాదుడు మొదలగువారు) మెడలు వంచి స్తుతించుచుండిరి.

సహస్రశిరసం దేవం సహస్రఫణమౌలినమ్ ।
నీలాంబరం బిసశ్వేతం శృంగైశ్శ్వేతమివ స్థితమ్ ॥ 45

సహస్రశిరసమ్ - వేయి తలలు కలిగినట్టియు, సహస్రఫణమౌలినమ్ - వేయి పడగలయందు కిరీటములు కలిగినట్టియు, నీల-అంబరమ్ - నల్లని వస్త్రము కలిగినట్టియు, బిసశ్వేతమ్ - తామరతూడు వలె తెల్లగా నున్నట్టియు, శృంగైః - బంగరు శిఖరములతో, శ్వేతం ఇవ - మేరు పర్వతము వలె, స్థితమ్ - ఉన్న, దేవమ్ - సంకర్షణ దేవుని (చూచెను).

ఆ శేషదేవుడు వేయి పడగలను కలిగియుండెను. ప్రతి పడగపై బంగరు కిరీటమును ధరించి బంగరు శిఖరములు గల మేరు పర్వతము వలె నుండెను. తామరతూడువలె తెల్లని ఆయన నల్లని వస్త్రమును ధరించెను.

తస్యోత్సంగే ఘనశ్యామం పీతకౌశేయవాససమ్ ।
పురుషం చతుర్భుజం శాంతం పద్మపత్రారుణేక్షణమ్ ॥ 46

తస్య - ఆ శేషుని, ఉత్సంగే - దేహముయొక్క అర్ధభాగమునందు, ఘనశ్యామమ్ - మేఘము వలె నల్లనైనట్టియు, పీతకౌశేయవాససమ్ - పచ్చని పట్టు వస్త్రమును కలిగినట్టియు, చతుర్భుజమ్ - నాలుగు చేతులు కలిగినట్టియు, శాంతమ్ - ప్రసన్నుడైనట్టియు, పద్మపత్ర-అరుణ-ఈక్షణమ్ - పద్మపత్రము వలె ఎర్రనైన కన్నులు గల, పురుషమ్ - పురుషోత్తముని--.

అక్రూరుడు ఆ శేషుని కుండలాకారపు అర్ధదేహముపై పద్మపత్రము వలె ఎర్రనైన కన్నులు గల శ్రీమహావిష్ణువును చూచెను. మేఘము వలె నల్లని ఆయన పచ్చని పట్టు వస్త్రమును దాల్చెను. నాలుగు చేతులు గల ఆయన ప్రసన్నముగా నుండెను.

చారుప్రసన్నవదనం చారుహాసనిరీక్షణమ్ ।
సుభ్రూన్నసం చారుకర్ణం సుకపోలారుణాధరమ్ ॥ 47

చారుప్రసన్నవదనమ్ - సుందరము ప్రసన్నము అగు ముఖము కలిగినట్టియు, చారుహాసనిరీక్షణమ్ - సుందరమగు నవ్వుతో కూడిన చూపు కలిగినట్టియు, సుభ్రూ-ఉత్-నసమ్ - అందమైన కనుబొమలు ఎత్తైన ముక్కు కలిగినట్టియు, చారుకర్ణమ్ - అందమైన చెవులు కలిగినట్టియు, సుకపోల-అరుణ-అధరమ్ - అందమైన చెక్కిళ్లు ఎర్రని క్రింది పెదవి కలిగిన (పురుషోత్తముని చూచెను).

ఆ పురుషోత్తముడు ప్రసన్నసుందరమగు ముఖమును, అందమైన నవ్వుతో కూడిన చూపును, అందమైన కనుబొమలను, ఎత్తైన ముక్కును, అందమైన చెవులను, అందమైన చెక్కిళ్లను, ఎర్రని క్రింది పెదవిని కలిగియుండెను.

ప్రలంబపీవరభుజం తుంగాంసోరఃస్థలశ్రియమ్ ।
కంబుకంఠం నిమ్ననాభిం వలిమత్పల్లవోదరమ్ ॥ 48

ప్రలంబపీవరభుజమ్ - పొడవాటి బలమైన చేతులు కలిగినట్టియు, తుంగ-అంస-ఉరఃస్థలశ్రియమ్ - ఎత్తైన భుజస్కంధములు కలిగినట్టియు వక్షఃస్థలముపై లక్ష్మి కలిగినట్టియు, కంబుకంఠమ్ - శంఖము వంటి కంఠము కలిగినట్టియు, నిమ్ననాభిమ్ - లోతైన నాభి కలిగినట్టియు, వలిమత్-పల్లవ-ఉదరమ్ - ముడుతలు గల చిగురుటాకువంటి ఉదరము కలిగిన (పురుషోత్తముని చూచెను).

ఆయన చేతులు పొడవుగా బలముగా నుండెను. ఎత్తైన భుజస్కంధములతో శోభిల్లే వక్షఃస్థలముపై ఆయన లక్ష్మి (రేఖ) ని కలిగియుండెను. శంఖము వంటి కంఠముతో, లోతైన నాభితో, మూడు ముడుతలు కలిగి రావియాకుని పోలిన ఉదరముతో ఆయన శోభిల్లెను.

బృహత్కటితటశ్రోణికరభోరుద్వయాన్వితమ్ ।
చారుజానుయుగం చారుజంఘాయుగలసంయుతమ్ ॥ 49

బృహత్-కటితటశ్రోణికరభ-ఊరుద్వయ-అన్వితమ్ - విశాలమైన నడుము పిరుదులు ఏనుగు తొండము వంటి రెండు తొడలతో కూడి నట్టియు, చారుజానుయుగమ్ - అందమైన మోకాళ్ల జంట కలిగినట్టియు, చారుజంఘాయుగలసంయుతమ్ - అందమైన పిక్కల జంట కలిగిన --.

ఆయన విశాలమైన నడుమును, పిరుదులను, ఏనుగు తొండము వంటి తొడలను, అందమైన మోకాళ్లను, అందమైన పిక్కలను కలిగియుండెను.

తుంగగుల్ఫారుణనఖవ్రాతదీధితిభిర్వృతమ్ ।
నవాంగుల్యంగుష్ఠదలైర్విలసత్పాదపంకజమ్ ॥ 50

తుంగగుల్ఫ-అరుణనఖవ్రాతదీధితిభిః - ఎత్తైన చీలమండలు ఎర్రని గోళ్ల సమూహముయొక్క కాంతులతో, వృతమ్ - కూడినట్టియు, నవ-అంగులీ-అంగుష్ఠదలైః - కోమలమైన వ్రేళ్లు బొటనవ్రేళ్లు అనే రేకులతో, విలసత్-పాదపంకజమ్ - ప్రకాశించే పద్మములవంటి పాదములు కలిగిన (పురుషోత్తముని చూచెను).

ఆయన చీలమండలు ఎత్తుగనుండెను. గోటి వ్రేళ్ల సమూహము కాంతులను విరజిమ్మెను. పాదములు పద్మములను, కోమలమైన వ్రేళ్లు బొటనవ్రేళ్లు పద్మపత్రములను పోలి ప్రకాశించెను.

సుమహార్ఘమణివ్రాతకిరీటకటకాంగదైః ।
కటిసూత్రబ్రహ్మసూత్రహారనూపురకుండలైః ॥ 51

భ్రాజమానం పద్మకరం శంఖచక్రగదాధరమ్ ।
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభం వనమాలినమ్ ॥ 52

సుమహా-అర్ఘమణివ్రాతకిరీటకటక-అంగదైః - మిక్కిలి విలువైన మణుల సముదాయములు గల కిరీటము కంకణములు భుజపురులతో, కటిసూత్రబ్రహ్మసూత్రహారనూపురకుండలైః - మొలనూలు యజ్ఞోపవీతము హారములు కాలి యందెలు కుండలములతో, భ్రాజమానమ్ - ప్రకాశించుచున్నట్టియు, పద్మకరమ్ - పద్మము చేతియందున్నట్టియు, శంఖచక్రగదాధరమ్ - శంఖమును చక్రమును గదను ధరించినట్టియు, శ్రీవత్సవక్షసమ్ - శ్రీవత్సమనే పుట్టుమచ్చ వక్షఃస్థలముపై కలిగినట్టియు, భ్రాజత్-కౌస్తుభమ్ - ప్రకాశించే కౌస్తుభమాణిక్యము కలిగినట్టియు, వనమాలినమ్ - వనమాల గల (పురుషోత్తముని చూచెను).

ఆయన మిక్కిలి విలువైన మణుల సమూహములు పొదిగిన కిరీటమును, కంకణములను, భుజపురులను ధరించెను. ఆయన ప్రకాశించే మొలనూలును, యజ్ఞోపవీతమును, కాలి యందెలను, కుండలములను కలిగియుండెను. ఆయన చేతులలో పద్మమును, శంఖమును, చక్రమును, గదను ధరించెను. ఆయన వక్షఃస్థలముపై శ్రీవత్సమనే పుట్టుమచ్చ, మెడలో కౌస్తుభమాణిక్యము, వనమాల ప్రకాశించుచుండెను.

సునందనందప్రముఖైః పార్షదైస్సనకాదిభిః ।
సురేశైర్బ్రహ్మరుద్రాద్యైర్నవభిశ్చ ద్విజోత్తమైః ॥ 53

ప్రహ్లాదనారదవసుప్రముఖైర్భాగవతోత్తమైః ।
స్తూయమానం పృథగ్భావైర్వచోభిరమలాత్మభిః ॥ 54

అమల-ఆత్మభిః - నిర్మలమైన అంతఃకరణములు గల, సునందనందప్రముఖైః - సునందుడు నందుడు మొదలుగా గల, పార్షదైః - అనుచరులచే, సనక-ఆదిభిః - సనకుడు మొదలుగా గల యోగులచే, బ్రహ్మరుద్ర-ఆద్యైః - బ్రహ్మదేవుడు రుద్రుడు మొదలుగా గల, సుర-ఈశైః - దేవనాయకులచే, నవభిః - తొమ్మండుగురు, ద్విజ-ఉత్తమైః - ప్రజాపతులచే, ప్రహ్లాదనారదవసుప్రముఖైః - ప్రహ్లాదుడు నారదుడు ఉపరిచరవసువు మొదలైన, భాగవత-ఉత్తమైః - భగవంతుని భక్తశిఖామణులచే, పృథగ్-భావైః - వేర్వేరు భావములు గల, వచోభిః - వాక్కులచే, స్తూయమానమ్ - స్తుతించబడుచున్న (శ్రీహరిని చూచెను).

నిర్మలమైన అంతఃకరణములు గల సునందుడు, నందుడు మొదలుగా గల అనుచరులు ప్రభుభావముతో ఆ శ్రీహరిని స్తుతించుచుండిరి. సనకుడు, సనందనుడు మొదలగు యోగులు పరబ్రహ్మభావముతో స్తుతించుచుండిరి. బ్రహ్మదేవుడు, రుద్రుడు మొదలుగా గల దేవనాయకులు సర్వేశ్వరుడనే భావముతో స్తుతించిరి. మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు, దక్షుడు అనే తొమ్మండుగురు ప్రజాపతులు మరియు ప్రహ్లాదుడు, నారదుడు, ఉపరిచరవసువు మొదలగు భగవానుని భక్తశిఖామణులు ఆత్మబంధువునుగను, ఈ విధముగా వేర్వేరు భావములను ప్రకటించే వచనములతో స్తుతించుచుండిరి.

శ్రియా పుష్ట్యా గిరా కాంత్యా కీర్త్యా తుష్ట్యేలయోర్జయా ।
విద్యయాఽవిద్యయా శక్త్యా మాయయా చ నిషేవితమ్ ॥ 55

శ్రియా - శ్రీదేవిచే, పుష్ట్యా - పుష్టిచే, గిరా - సరస్వతీదేవిచే, కాంత్యా - కాంతిచే, కీర్త్యా - కీర్తిచే, తుష్ట్యా - తుష్టిచే, ఇలయా - భూదేవిచే, ఊర్జయా - శక్తిచే, విద్యయా - విద్యచే, అవిద్యయా - అవిద్యచే, శక్త్యా - శక్తిచే, మాయయా చ - మాయచే కూడ, నిషేవితమ్ - సేవించబడిన శ్రీహరిని --

సంపద, పుష్టి, వాక్కు, కాంతి, కీర్తి, తుష్టి, భూమి, ఊర్జ (సామర్థ్యము), విద్య, అవిద్య, చిచ్ఛక్తి, మాయాశక్తి కూడ రూపు దాల్చి ఆ శ్రీహరిని సేవించుచుండెను.

విలోక్య సుభృశం ప్రీతో భక్త్యా పరమయా యుతః ।
హృష్యత్తనూరుహో భావపరిక్లిన్నాత్మలోచనః ॥ 56

విలోక్య - చూచి, సుభృశమ్ - అతిశయముగా, ప్రీతః - ప్రీతిని పొందినవాడు, పరమయా - ఉత్కృష్టమైన, భక్త్యా - భక్తితో, యుతః - కూడినవాడు, హృష్యత్-తనూరుహః - గగుర్పాటు చెందిన రోమములు గలవాడు, భావపరిక్లిన్న-ఆత్మలోచనః - భక్తిభావముచే ఆర్ద్రమైన హృదయము తడిదైయైన కన్నులు గలవాడు.

శ్రీహరిని చూచిన అక్రూరునకు అతిశయమగు ప్రీతి, ఉత్కృష్టమగు (నిష్కామ) భక్తి కలిగెను. ఆయనకు రోమాంచము కలిగెను. హృదయము భక్తిభావముతో ఆర్ద్రము కాగా, కన్నులయందు నీరు తిరిగెను.

గిరా గద్గదయాఽస్తౌషీత్సత్త్వమాలంబ్య సాత్వతః ।
ప్రణమ్య మూర్ధ్నావహితః కృతాంజలిపుటశ్శనైః ॥ 57

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ఏకోనచత్వారింశోఽధ్యాయః ॥

సాత్వతః - యదువంశీయుడు (భక్తుడు) అగు అక్రూరుడు, సత్త్వమ్ - ధైర్యమును, ఆలంబ్య - తెచ్చుకొని, మూర్ధ్నా - తలతో, ప్రణమ్య - ప్రణమిల్లి, అవహితః - ఏకాగ్రచిత్తము గలవాడై, కృత-అంజలిపుటః - ఒగ్గబడిన మొగ్గవంటి దోసిలి గలవాడై, గద్గదయా - బొంగురువోయిన, గిరా - వాక్కుతో, శనైః - మెల్లగా, అస్తౌషీత్ - స్తుతించెను.

యదువంశీయుడు, సత్త్వగుణప్రధానుడు అగు అక్రూరుడు ధైర్యము తెచ్చుకొని తల వంచి దోసిలి యొగ్గి నమస్కరించెను. ఆయన ఏకాగ్రమగు చిత్తముతో బొంగురు వోయిన వాక్కుతో మెల్లగా శ్రీకృష్ణ భగవానుని స్తుతించెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో అక్రూరుడు
బలరామకృష్ణులను గోకులమునుండి తీసుకువెళ్లుటను వర్ణించే
ముప్పది తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (39).

* * * * *

# అథ చత్వారింశోఽధ్యాయః

## అక్రూరుడు శ్రీకృష్ణుని స్తుతించుట

అక్రూర ఉవాచ ।
నతోఽస్మ్యహం త్వాఽఖిలహేతుహేతుం
నారాయణం పూరుషమాద్యమవ్యయమ్ ।
యన్నాభిజాతాదరవిందకోశాత్
బ్రహ్మాఽఽవిరాసీద్యత ఏష లోకః ॥ 1

అహమ్ - నేను, అఖిలహేతుహేతుమ్ - సకలకారణములకు కారణమైనట్టియు, పూరుషమ్ - పూర్ణుడవైనట్టియు, ఆద్యమ్ - సృష్టికి మూలమునందున్నట్టియు, అవ్యయమ్ - వినాశము లేనట్టియు, నారాయణమ్ - నారాయణుడవగు, త్వా - నిన్ను, నతః - నమస్కరించువాడను, అస్మి - అగుచున్నాను, యత్-నాభిజాతాత్ - ఎవ్వాని నాభినుండి పుట్టిన, అరవిందకోశాత్ - పద్మపు మొగ్గనుండి, బ్రహ్మా - బ్రహ్మదేవుడు, ఆవిః-ఆసీత్ - ఆవిర్భవించెనో, యతః - ఏ బ్రహ్మదేవునినుండి, ఏషః - ఈ, లోకః - లోకమో.

అక్రూరుడిట్లు పలికెను --- నేను సర్వకారణకారణుడైన నారాయణుడవగు నిన్ను నమస్కరించుచున్నాను. నీవు పూర్ణుడవు, సృష్టికి మూలమునందున్నవాడవు, వినాశరహితుడవు. నీ నాభినుండి పుట్టిన పద్మపు మొగ్గనుండి బ్రహ్మదేవుడు ఆవిర్భవించి, ఈ బ్రహ్మాండమును సృష్టించినాడు.

భూస్తోయమగ్నిః పవనః ఖమాదిర్మహానజాఽఽదిర్మన ఇంద్రియాణి ।
సర్వేంద్రియార్థా విబుధాశ్చ సర్వే యే హేతవస్తే జగతోఽంగభూతాః ॥ 2

భూః - పృథివి, తోయమ్ - జలములు, పవనః - వాయువు, ఖమ్ - అకాశము, ఆదిః - సమష్టి అహంకారము, మహాన్ - మహత్తత్త్వము, అజా

- పుట్టుక లేని మాయాశక్తి, ఆదిః - మాయావచ్ఛిన్నుడైన ఈశ్వరుడు, మనః - మనస్సు, ఇంద్రియాణి - ఇంద్రియములు, సర్వ-ఇంద్రియ-అర్థాః - సకలములైన ఇంద్రియవిషయములు, సర్వే - అందరు, విబుధాః చ - ఇంద్రియాధిష్ఠాన దేవతలు కూడ, జగతః - జగత్తునకు, యే - ఏ, హేతవః - కారణములు గలవో అవి, తే - నీ, అంగభూతాః - నీ స్వరూపమునుండి పుట్టినవియే.

పృథివి, జలములు, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచ భూతములు, వాటికి కారణమగు సమష్టి అహంకారము, దాని కారణమగు మహత్తత్త్వము, దాని కారణమగు పుట్టుక లేని మాయాశక్తి, దానితో కూడిన పురుషుడు (ఈశ్వరుడు), మనస్సు, ఇంద్రియములు, శబ్దస్పర్శరూప రసగంధములనే ఇంద్రియవిషయములు, వాటి అధిష్ఠానదేవతలు అందరు కూడ నీ స్వరూపమునుండియే ఆవిర్భవించిరి.

నైతే స్వరూపం విదురాత్మనస్తే
హ్యజాఽఽదయోఽనాత్మతయా గృహీతాః ।
అజోఽనుబద్ధస్స గుణైరజాయా
గుణాత్పరం వేద న తే స్వరూపమ్ ॥ 3

అనాత్మతయా - ఆత్మ కానిదిగా, గృహీతాః - తెలియబడే, ఏతే - ఈ, అజా-ఆదయః - మాయాశక్తి మొదలైనవి, ఆత్మనః - ఆత్మవగు, తే - నీ, స్వరూపమ్ - స్వరూపమును, న విదుః హి - తెలియవు గదా!, సః - ఆ, అజః - స్వయంభువుడగు బ్రహ్మదేవుడు (పుట్టుక లేని జీవుడు), అజాయాః - మాయాశక్తియొక్క, గుణైః - గుణములచే, అనుబద్ధః - బంధించబడినవాడై, గుణాత్ - గుణముకంటె, పరమ్ - అతీతమైన, తే - నీ, స్వరూపమ్ - స్వరూపమును, న వేద - తెలియడు.

ఈ మాయాశక్తి, మహత్తత్త్వము మొదలైనవి దృశ్యములుగా తెలియ బడును గనుక అవి ఆత్మ (అధిష్ఠానము) అగు నీ స్వరూపమును తెలియ జాలవు. జీవుడు పుట్టుక లేని పరబ్రహ్మయే అయిననూ, మాయాశక్తి యొక్క సత్త్వరజస్తమోగుణములచే బంధించబడి యుండును గనుక,

గుణములకు అతీతమగు నీ స్వరూపమును తెలియకున్నాడు. (బ్రహ్మ దేవుడు రజోగుణమునకు అతీతమగు నీ తత్త్వమును తెలియకున్నాడు).

త్వాం యోగినో యజంత్యద్ధా మహాపురుషమీశ్వరమ్ ।
సాధ్యాత్మం సాధిభూతం చ సాధిదైవం చ సాధవః ॥ 4

మహాపురుషమ్ - పురుషోత్తముడవైనట్టియు, ఈశ్వరమ్ - జగన్నియామకుడవైనట్టియు, స-అధి-ఆత్మమ్ - అధ్యాత్మముతో కూడినట్టియు, స-అధిభూతం చ - అధిభూతముతో కూడినట్టియు, స-అధిదైవం చ - అధిదైవముతో కూడ కూడిన, త్వామ్ - నిన్ను, సాధవః - సత్పురుషులగు, యోగినః - సాధకులు, అద్ధా - సాక్షాత్తుగా, యజంతి - ఆరాధించెదరు.

అధ్యాత్మము (దేహేంద్రియమనస్సంఘాతము), అధిభూతము (పంచభూతములు), అధిదైవము (దేవతలు) నీ స్వరూపములో భాగమే. నీవు జగన్నియామకుడవగు పురుషోత్తముడవు. సత్పురుషులగు సాధకులు నిన్ను తమ ఆత్మరూపముగా ధ్యానించెదరు. (యోగులు నిన్ను ఆత్మరూపముగా, పంచభూతముల రూపముగా, దేవతల రూపముగా దర్శించెదరు).

త్రయ్యా చ విద్యయా కేచిత్త్వాం వై వైతానికా ద్విజాః ।
యజంతే వితతైర్యజ్ఞైర్నానారూపామరాఖ్యయా ॥ 5

కేచిత్ - కొందరు, వైతానికాః - యాజ్ఞికులైన, ద్విజాః - వేదవేత్తలు, త్వాం వై - నిన్నే, త్రయ్యా - ఋగ్యజుస్సామవేదరూపమైన, విద్యయా చ - విద్యచే కూడ, వితతైః - విస్తృతమైన, యజ్ఞైః - యజ్ఞములతో, నానారూప-అమర-ఆఖ్యయా - అనేక రూపములు గల దేవతల పేర్లతో, యజంతే - ఆరాధించుచున్నారు.

కొందరు యాజ్ఞికులైన వేదవేత్తలు ఋగ్యజుస్సామవేదములచే బోధించబడే విస్తృతమగు యజ్ఞములను చేసి అనేక రూపములు గల దేవతల పేర్లతో నిన్నే ఆరాధించుచున్నారు.

ఏకే త్వాఽఖిలకర్మాణి సన్న్యస్యోపశమం గతాః ।
జ్ఞానినో జ్ఞానయజ్ఞేన యజంతి జ్ఞానవిగ్రహమ్ ॥ 6

ఉపశమమ్ - వైరాగ్యము (శాంతి) ను, గతాః - పొందిన, ఏకే - కొద్దిమంది, జ్ఞానినః - జ్ఞానయోగులు, అఖిలకర్మాణి - సకలకర్మలను, సన్న్యస్య - సన్న్యసించి, జ్ఞానవిగ్రహమ్ - జ్ఞానఘనుడవగు, త్వా - నిన్ను, జ్ఞానయజ్ఞేన - జ్ఞానయజ్ఞముచే, యజంతి - ఆరాధించుచున్నారు.

విరక్తులై శాంతులైన కొద్దిమంది జ్ఞానయోగులు సర్వకర్మలను సన్న్యసించి జ్ఞానఘనుడవగు నిన్ను జ్ఞానయజ్ఞముతో ఆరాధించెదరు.

అన్యే చ సంస్కృతాత్మానో విధినాఽభిహితేన తే ।
యజంతి త్వన్మయాస్త్వాం వై బహుమూర్త్యేకమూర్తికమ్ ॥ 7

తే - నీచే, అభిహితేన - చెప్పబడిన, విధినా - విధిచే, సంస్కృత-ఆత్మానః - సంస్కరించబడిన దేహేంద్రియములు గల, అన్యే చ - మరికొందరు కూడ, త్వత్-మయాః - తమను నీ రూపముగా భావించువారై, బహుమూర్తి-ఏకమూర్తికమ్ - అనేకమూర్తులు మరియు ఒకే మూర్తి గల, త్వాం వై - నిన్నే, యజంతి - ఆరాధించుచున్నారు.

కొందరు నీచే చెప్పబడిన కల్పముచే దేహేంద్రియములను సంస్కరించుకొని నిన్ను తమయందు భావన చేస్తూ నిన్నే రామకృష్ణాద్యనేక రూపములయందు, నారాయణుడు అనే ఒకే రూపమునందు కూడ కొలుచుచున్నారు.

త్వామేవాన్యే శివోక్తేన మార్గేణ శివరూపిణమ్ ।
బహ్వాచార్యవిభేదేన భగవన్ సముపాసతే ॥ 8

భగవన్ - ఓ భగవానుడా!, అన్యే - ఇతరులు, శివ-ఉక్తేన - శివునిచే చెప్పబడిన, మార్గేణ - మార్గముచే, శివరూపిణమ్ - శివుని రూపము గల, త్వాం ఏవ - నిన్నే, బహు-ఆచార్యవిభేదేన - అనేకులగు ఆచార్యుల తేడాచే, సముపాసతే - ఉపాసించుచున్నారు.

ఓ భగవానుడా! శివునిచే చెప్పబడిన మార్గముననుసరించి దధీచుడు మొదలైన అనేకులగు ఆచార్యులచే బోధించబడిన పద్ధతులకనుగుణముగా మరికొందరు శివుని రూపములోనున్న నిన్నే ఉపాసించుచున్నారు.

సర్వ ఏవ యజంతి త్వాం సర్వదేవమయేశ్వరమ్ ।
యేఽప్యన్యదేవతాభక్తా యద్యప్యన్యధియః ప్రభో ॥ 9

ప్రభో - ఓ ప్రభూ!, అన్యదేవతాభక్తాః - ఇతరదేవతల భక్తులైన, యే - ఎవరు గలరో, అపి - వారు కూడ, అన్యధియః - ఇతరదేవతలయందు మనస్సు గలవారు (వేరు అనే భావన గలవారు), యది అపి - అయినప్పటికీ, సర్వదేవమయ-ఈశ్వరమ్ - సకలదేవతాస్వరూపుడవు సకలశాసకుడవు అగు, త్వాం ఏవ - నిన్నే, సర్వే - అందరు, యజంతి - ఆరాధించుచున్నారు.

ఓ ప్రభూ! కొందరు ఇతరదేవతల భక్తులు గలరు. వారి మనస్సు ఆ ఇతరదేవతలయందు లగ్నమగును. ఆయా దేవతలు నీకంటె భిన్నమని వారు తలంచెదరు. అయినప్పటికీ, వారు కూడ సకల దేవతాస్వరూపుడవు, సకలనియంతవు అగు నిన్నే ఆరాధించుచున్నారు.

యథాఽద్రిప్రభవా నద్యః పర్జన్యాపూరితాః ప్రభో ।
విశంతి సర్వతస్సింధుం తద్వత్త్వాం గతయోఽంతతః ॥ 10

ప్రభో - ఓ ప్రభూ!, యథా - ఏ విధముగానైతే, అద్రిప్రభవాః - పర్వతములనుండి పుట్టే, నద్యః - నదులు, పర్జన్య-ఆపూరితాః - మేఘములచే నింపబడినవై, సర్వతః - అన్ని వైపులనుండి, సింధుమ్ - సముద్రమును, విశంతి - ప్రవేశించునో, తద్వత్ - అదే విధముగా, గతయః - ఆరాధనాపద్ధతులు, అంతతః - అంతిమముగా, త్వామ్ - నిన్ను ---.

ఓ ప్రభూ! పర్వతములనుండి పుట్టిన నదులు మేఘములచే నీరు నింపబడి అన్ని వైపులనుండి సముద్రములో ప్రవేశించును. అదే విధముగా, ఆరాధనాపద్ధతులన్నీ అంతిమముగా నీ ఆరాధనలే యగును.

**సత్త్వం రజస్తమ ఇతి భవతః ప్రకృతేర్గుణాః ।**
**తేషు హి ప్రాకృతాః ప్రోతా ఆబ్రహ్మస్థావరాదయః ॥ 11**

సత్త్వమ్ - సత్త్వము, రజః - రజస్సు, తమః - తమస్సు, ఇతి - అనేవి, భవతః - నీ, ప్రకృతేః - మాయాశక్తియొక్క, గుణాః - గుణములు, ఆబ్రహ్మ స్థావర-ఆదయః - బ్రహ్మదేవునితో మొదలిడి చెట్టుచేమలవరకు ఉండేవి, ప్రాకృతాః - ప్రకృతిపరిణామమైన దేహములతో తాదాత్మ్యమును చెందిన జీవులు, తేషు హి - ఆ గుణములయందే, ప్రోతాః - ప్రవేశించియున్నారు.

నీ మాయాశక్తి సత్త్వరజస్తమోగుణాత్మకము. బ్రహ్మదేవునితో మొదలిడి చెట్టుచేమలవరకు ఉండే ప్రాణులు ఆ మాయాశక్తియొక్క పరిణామమగు దేహములతో తాదాత్మ్యము గలవై గుణములచే బంధింపబడి యున్నవి.

తుభ్యం నమస్తేఽస్త్వవిషక్తదృష్టయే
సర్వాత్మనే సర్వధియాం చ సాక్షిణే ।
గుణప్రవాహోఽయమవిద్యయా కృతః
ప్రవర్తతే దేవనృతిర్యగాత్మసు ॥ 12

అవిషక్తదృష్టయే - అసంగమగు జ్ఞానము కలిగినట్టియు, సర్వ-ఆత్మనే - సర్వమునకు ఆత్మయైనట్టియు, సర్వధియాం చ - సకలబుద్ధివృత్తులకు కూడ, సాక్షిణే - సాక్షియైన, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!, తే - నీ గురించిన, అవిద్యయా - అజ్ఞానముచే, కృతః - చేయబడిన, అయమ్ - ఈ, గుణప్రవాహః - గుణముల ప్రవాహమైన సంసారము, దేవనృతిర్యగ్-ఆత్మసు - దేవమానవపశుపక్ష్యాది దేహములయందు ఆత్మాభిమానము గలవారియందు, ప్రవర్తతే - సాగిపోవుచున్నది.

నీకు నమస్కారమగుగాక! నీ (స్వరూపమగు) జ్ఞానము అసంగము. నీవు సకలప్రాణులలో సకలబుద్ధివృత్తులకు సాక్షియగు ఆత్మవు. నీ స్వరూపము తెలియకనే అజ్ఞానులు దేవమానవపశుపక్ష్యాది దేహములయందు ఆత్మాభిమానము గలవారై సత్త్వరజస్తమోగుణముల ప్రవాహమైన జననమరణరూపమగు సంసారమునందు కొట్టుకుపోవుచున్నారు.

అగ్నిర్ముఖం తేఽవనిరంఘ్రిరీక్షణం
సూర్యో నభో నాభిరథో దిశశ్శ్రుతిః ।

ద్యౌః కం సురేంద్రాస్తవ బాహవోఽర్ణవాః
కుక్షిర్మరుత్ప్రాణబలం ప్రకల్పితమ్ ।। 13

అగ్నిః - అగ్ని, తే - నీ, ముఖమ్ - నోరు, అవనిః - భూమి, అంఘ్రిః - పాదము, సూర్యః - సూర్యుడు, ఈక్షణమ్ - కన్ను, నభః - ఆకాశము, నాభిః - నాభి, అథో - మరియు, దిశః - దిక్కులు, శ్రుతిః - చెవి, ద్యౌః - ద్యులోకము, కమ్ - తల, సుర-ఇంద్రాః - లోకపాలకులు, తవ - నీ, బాహవః - చేతులు, అర్ణవాః - సముద్రములు, కుక్షిః - ఉదరము, మరుత్ - వాయువు, ప్రాణబలమ్ - ఊపిరి బలము అని, ప్రకల్పితమ్ - ఉపాసించబడినది.

నీకు అగ్ని నోరు, భూమి పాదములు, సూర్యుడు కన్ను, ఆకాశము నాభి, దిక్కులు చెవులు, ద్యులోకము తల, నలుగురు లోకపాలకులు నాలుగు చేతులు, సముద్రములు ఉదరము, వాయువు ఊపిరి మరియు బలము అని మహాత్ములు ఉపాసించెదరు.

రోమాణి వృక్షౌషధయశ్శిరోరుహా మేఘాః పరస్యాస్థినఖాని తేఽద్రయః,
నిమేషణం రాత్ర్యహనీ ప్రజాపతిర్మేఢ్రస్తు వృష్టిస్తవ వీర్యమిష్యతే।14

పరస్య - పరమేశ్వరుడవగు, తే - నీకు, వృక్ష-ఓషధయః - చెట్లు మొక్కలు, రోమాణి - రోమములు, మేఘాః - మేఘములు, శిరోరుహాః - కేశములు, అద్రయః - పర్వతములు, అస్థినఖాని - ఎముకలు గోళ్లు, రాత్రి-అహనీ - రాత్రింబగళ్లు, నిమేషణమ్ - రెప్పపాటు, ప్రజాపతిః తు - బ్రహ్మదేవుడైతే (దక్షుడు), మేఢ్రః - జననేంద్రియము, తవ - నీకు, వృష్టిః - వర్షము, వీర్యమ్ - వీర్యమని, ఇష్యతే - భావన చేయబడును.

పరమేశ్వరుడవగు నీకు చెట్లు మొక్కలు రోమములు, మేఘములు. కేశములు, పర్వతములు ఎముకలు మరియు గోళ్లు, రాత్రింబగళ్లు రెప్పపాటు, బ్రహ్మదేవుడు (దక్షుడు) జననేంద్రియము, వర్షము వీర్యము అని (మహాత్ములచే) భావన చేయబడును.

త్వయ్యవ్యయాత్మన్ పురుషే ప్రకల్పితా
లోకాస్సపాలా బహుజీవసంకులాః ।

యథా జలే సంజిహతే జలౌకసో-
ప్యుదుంబరే వా మశకా మనోమయే ।। 15

అవ్యయ-ఆత్మన్ - మార్పులు లేని స్వరూపము గలవాడా!, పురుషే - పూర్ణుడవైనట్టియు, మనోమయే - మనస్సు ప్రధానముగా గల, త్వయి - నీయందు, సపాలాః - పాలకులతో కూడినవి, బహుజీవసంకులాః - అనేకప్రాణులచే వ్యాప్తమై ఉండే, లోకాః - లోకములు, ప్రకల్పితాః - భాసించునవి, జలే - నీటియందు, జల-ఓకసః యథా - జలజంతువులు వలె, వా - లేదా, ఉదుంబరే - మేడిపండునందు, మశకాః అపి - క్రిములు వలె, సంజిహతే - సంచరించుచున్నవి.

ఓ ఈశ్వరా! నీవు పూర్ణుడవు. నీవు మనస్సే ప్రధానముగా కలిగియున్నప్పుడు లోకపాలకులతో కూడి అనేకప్రాణులచే వ్యాప్తమైన ఈ లోకములు నీయందు భాసించును. నీటియందు జలజంతువులు వలె, మేడిపండునందు క్రిములు వలె, ఈ లోకములు నీయందే సంచరించును. కాని నీ స్వరూపము కూటస్థము (మార్పులు లేనిది).

యాని యానీహ రూపాణి క్రీడనార్థం బిభర్షి హి ।
తైరామృష్టశుచో లోకా ముదా గాయంతి తే యశః ।। 16

ఇహ - ఈ లోకమునందు, క్రీడా-అర్థమ్ - లీల కొరకై, యాని యాని - ఏయే, రూపాణి - రూపములను, బిభర్షి - ధరించెదవో, తైః - వాటిచే, ఆమృష్టశుచః - తుడువబడిన దుఃఖము గల, లోకాః - జనులు, ముదా - ఆనందముతో, తే - నీ, యశః - కీర్తిని, గాయంతి - పాడుచున్నారు.

ఈ లోకములో లీల కొరకై నీవు మత్స్యము మొదలైన ఏయే రూపములను ధరించితివో, వాటిచే తుడిచివేయబడిన శోకము గల జనులు ఆనందముతో నీ కీర్తిని గానము చేయుచున్నారు.

నమః కారణమత్స్యాయ ప్రలయాబ్ధిచరాయ చ ।
హయశీర్ష్ణే నమస్తుభ్యం మధుకైటభమృత్యవే ।। 17

కారణమత్స్యాయ - కారణముచే చేపవైన, ప్రలయ-అబ్ధిచరాయ చ - ప్రళయకాలమునందలి సముద్రమునందు సంచరించునట్టియు,

హయశీర్ష్ణే - హయగ్రీవుడవైనట్టియు, మధుకైటభమృత్యవే - మధు కైటభులకు మృత్యువైన, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

వేదరక్షణనిమిత్తమై చేపవై ప్రళయకాలసముద్రమునందు సంచరించిన నీకు నమస్కారము. హయగ్రీవుడవై మధుకైటభులను సంహరించిన నీకు నమస్కారము.

అకూపారాయ బృహతే నమో మందరధారిణే ।
క్షిత్యుద్ధారవిహారాయ నమస్సూకరమూర్తయే ॥ 18

మందరధారిణే - మందర పర్వతమును మోసిన, బృహతే - పెద్ద, అకూపారాయ - తాబేలు కొరకు, నమః - నమస్కారము, క్షితి-ఉద్ధారవిహారాయ - భూమిని పైకి తీయుట అనే విహారము గల, సూకరమూర్తయే - వరాహమూర్తి కొరకు, నమః - నమస్కారము.

నీవు తాబేలువై మందరపర్వతమును మోసితివి. నీవు వరాహమూర్తివై భూమిని అవలీలగా పైకి తెచ్చితివి. నీకు అనేక నమస్కారములు.

నమస్తేఽద్భుతసింహాయ సాధులోకభయాపహ ।
వామనాయ నమస్తుభ్యం క్రాంతత్రిభువనాయ చ ॥ 19

సాధులోకభయ-అపహ - సజ్జనుల భయమును పోగొట్టువాడా!, అద్భుతసింహాయ - అచ్చెరువును గొలిపే సింహమైన, తే - నీ కొరకు, నమః - నమస్కారము, వామనాయ - వామనుడవై, క్రాంతత్రిభువనాయ చ - పాదములతో కొలవబడిన ముల్లోకములు గల, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

సజ్జనుల భయమును పోగొట్టే ఓ దేవా! నీ సింహరూపము సగము మనిషి యగుటచే అచ్చెరువును గొల్పును. నీవు వామనుడవై ముల్లోకములను పాదములతో కొలిచితివి. నీకు అనేక నమస్కారములు.

నమో భృగూణాం పతయే దృప్తక్షత్రవనచ్ఛిదే ।
నమస్తే రఘువర్యాయ రావణాంతకరాయ చ ॥ 20

దృప్తక్షత్రవనచ్ఛిదే - గర్వించిన క్షత్రియుల అడవిని ఛేదించిన, భృగూణామ్ - భృగువంశీయుల, పతయే - ప్రభువగు రాముని కొరకు, నమః - నమస్కారము, రావణ-అంతకరాయ - రావణాసురుని మట్టుబెట్టిన, రఘువర్యాయ చ - రఘువంశశ్రేష్ఠుడగు రాముడవైన, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

గర్వించిన క్షత్రియుల సముదాయమును నశింప జేసిన భార్గవరాముడవు నీవే. రావణాసురుని మట్టుబెట్టిన రాఘవరాముడవు నీవే. నీ కొరకు అనేక నమస్కారములు.

నమస్తే వాసుదేవాయ నమస్సంకర్షణాయ చ ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ సాత్వతాం పతయే నమః ॥ 21

సాత్వతామ్ - యాదవులకు, పతయే - ప్రభువైన, వాసుదేవాయ - వాసుదేవుడవగు, తే - నీ కొరకు, నమః - నమస్కారము, సంకర్షణాయ చ - సంకర్షణుని కొరకు కూడ, నమః - నమస్కారము, ప్రద్యుమ్నాయ - ప్రద్యుమ్నుని కొరకు, అనిరుద్ధాయ - అనిరుద్ధుని కొరకు, నమః - నమస్కారము.

యాదవులకు (సత్త్వగుణప్రధానులగు భక్తులకు) రక్షకుడవగు వాసుదేవుడవీవే. నీకు నమస్కారము. బలరామునకు, ప్రద్యుమ్న (శ్రీకృష్ణుని పుత్రుడు), అనిరుద్ధుల (మనుమడు) కు నమస్కారము. ఆ నామములు గల నాలుగు వ్యూహములకు నమస్కారము. సర్వజగన్నివాసుడు, ప్రకాశ స్వరూపుడు, ప్రేమస్వరూపుడై భక్తులను తన వద్దకు ఆకర్షించువాడు, తేజస్స్వరూపుడు, స్వతంత్రుడు అగు భగవానునకు నమస్కారము.

నమో బుద్ధాయ శుద్ధాయ దైత్యదానవమోహినే ।
మ్లేచ్ఛప్రాయక్షత్రహంత్రే నమస్తే కల్కిరూపిణే ॥ 22

శుద్ధాయ - శుద్ధుడైనట్టియు, దైత్యదానవమోహినే - దైత్యులను దానవులను మోహపెట్టిన, బుద్ధాయ - బుద్ధుని కొరకు, నమః - నమస్కారము, మ్లేచ్ఛప్రాయక్షత్రహంత్రే - ఇంచుమించు మ్లేచ్ఛులై

పోయిన క్షత్రియులను సంహరించే, కల్కిరూపిణే - కల్కి రూపుడవగు, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

నీవు శుద్ధుడగు (అహింసను బోధించే) బుద్ధుడవై దైత్యులను, దానవులను మోహపెట్టితివి. ఇంచుమించు మ్లేచ్ఛులై పోయిన క్షత్రియులను నీవు కల్కివై సంహరించెదవు. నీకు నమస్కారములు.

భగవజ్జీవలోకోఽయం మోహితస్తవ మాయయా ।
అహంమమేత్యసద్గ్రాహో భ్రామ్యతే కర్మవర్త్మసు ॥ 23

భగవన్ - ఓ భగవానుడా!, అయమ్ - ఈ, జీవలోకః - ప్రాణిసమూహము, తవ - నీ, మాయయా - మాయచే, మోహితః - మోహపెట్టబడినది, అహమ్ - నేను, మమ - నాది, ఇతి - అనే, అసద్-గ్రాహః - తప్పు ఆగ్రహము గలది, కర్మవర్త్మసు - కర్మమార్గములయందు, భ్రామ్యతే - తిరుగాడుచున్నది.

ఓ భగవానుడా! ఈ జీవసముదాయము నీ మాయచే మోహమును పొంది, నేను-నాది అనే దురాగ్రహము గలదియై కామ్యకర్మల మార్గములయందు పరిభ్రమించుచున్నది.

అహం చాత్మాత్మజాగారదారార్థస్వజనాదిషు ।
భ్రమామి స్వప్నకల్పేషు మూఢస్సత్యధియా విభో ॥ 24

విభో - ఓ ప్రభూ!, మూఢః - మూర్ఖుడనగు, అహం చ - నేను కూడ, స్వప్నకల్పేషు - కలవంటి, ఆత్మా-ఆత్మజ-ఆగారదార-అర్థస్వజన-ఆదిషు - దేహము సంతానము ఇల్లు భార్య ధనము నావారు మొదలగువాటియందు, సత్యధియా - సత్యములనే భావనతో, భ్రమామి - తిరుగాడుచున్నాను.

ఓ ప్రభూ! మూర్ఖుడనగు నేను కూడ కలవంటి దేహము, సంతానము, ఇల్లు, భార్య, ధనము, నావారు, నా పొలము మొదలైనవాటియందు అవి సత్యములనే భావనతో పరిభ్రమించుచున్నాను.

అనిత్యానాత్మదుఃఖేషు విపర్యయమతిర్హ్యహమ్ ।
ద్వంద్వారామస్తమోవిష్టో న జానే త్వాఽఽత్మనః ప్రియమ్ ॥ 25

అనిత్య-అనాత్మదుఃఖేషు - నిత్యము కానిది ఆత్మ కానిది దుఃఖము అనువాటియందు, విపర్యయమతిః - విరుద్ధమగు బుద్ధి గలవాడను, ద్వంద్వ-ఆరామః - శీతోష్ణాది ద్వంద్వములయందు రమించువాడను, తమః-విష్టః - అజ్ఞానముచే వ్యాపించబడినవాడను అగు, అహమ్ - నేను, ఆత్మనః - నాకు, ప్రియమ్ - ప్రియుడవైన, త్వా - నిన్ను, న జానే - తెలియకుంటిని.

నేను అజ్ఞానముచే వ్యాపించబడి యుండుటచే అనిత్యమగు కర్మఫలము నిత్యమని, అనాత్మయగు దేహము ఆత్మయని, దుఃఖహేతువులగు ధనాదులు సుఖహేతువులని భ్రమిస్తూ, శీతోష్ణాది ద్వంద్వములయందు రమించుచున్నాను. అట్టి నేను నాకు ఆత్మస్వరూపుడవై ప్రియుడవైన నిన్ను తెలియకున్నాను.

యథాఽబుధో జలం హిత్వా ప్రతిచ్ఛన్నం తదుద్భవైః ।
అభ్యేతి మృగతృష్ణాం వై తద్వత్త్వాఽహం పరాఙ్ముఖః ॥ 26

యథా - ఏ విధముగానైతే, అబుధః - మూర్ఖుడు, తద్-ఉద్భవైః - ఆ నీటియందు పుట్టిన నాచు మొదలగువాటిచే, ప్రతిచ్ఛన్నమ్ - కప్పివేయ బడిన, జలమ్ - నీటిని, హిత్వా - విడిచి, మృగతృష్ణాం వై - ఎండ మావిని, అభ్యేతి - అభిముఖముగా వెళ్లునో, తద్వత్ - ఆ విధముగా, అహమ్ - నేను, త్వా - నిన్ను గురించి, పరాఙ్-ముఖః - పెడ మోము వాడను.

మూర్ఖుడు నీటిలో పుట్టి నీటిని కప్పివేసే నాచుచే కప్పివేయబడిన నీటిని విడిచిపెట్టి ఎండ మావుల వెంట పరుగెత్తును. అదే విధముగా, నేను (దేహాదులయందు ఆత్మబుద్ధిచే కప్పివేయబడిన ఆత్మవగు) నీకు పెడ మోము (సంసారము వైపు మోము) కలిగియున్నాను.

నోత్సహేఽహం కృపణధీః కామకర్మహతం మనః ।
రోద్ధుం ప్రమాథిభిశ్చాక్షైర్హ్రియమాణమితస్తతః ॥ 27

కృపణధీః - దీనమగు మనస్సు గల, అహమ్ - నేను, కామకర్మహతమ్ - కామనలచే కర్మలచే క్షోభ పెట్టబడినట్టియు, ప్రమాథిభిః - అధికబలము గల, అక్షైః - ఇంద్రియములచే, ఇతః - ఇటు, తతః - అటు, హ్రియమాణమ్ - లాగబడుతూ ఉండే, మనః - మనస్సును, రోద్ధుమ్ - నిగ్రహించుటకు, న ఉత్సహే - సమర్థుడను కాను.

నా మనస్సు కామవాసనలచే, కర్మవాసనలచే క్షోభను పొందియున్నది. దానిని ప్రబలమైన ఇంద్రియములు ఇటునటు ఆకర్షించుచున్నవి. దీనుడనగు నేను దానిని నిగ్రహించ లేకున్నాను.

సోఽహం తవాంఘ్ర్యుపగతోఽస్మ్యసతాం దురాపం
తచ్చాప్యహం భవదనుగ్రహ ఈశ మన్యే ।
పుంసో భవేద్యర్హి సంసరణాపవర్గః
త్వయ్యబ్జనాభ సదుపాసనయా మతిస్స్యాత్ ॥ 28

సః - అట్టి, అహమ్ - నేను, అసతామ్ - దుష్టులకు, దురాపమ్ - పొంద శక్యము కాని, తవ - నీ, అంఘ్రి - పాదమును, ఉపగతః - చేరినవాడను, అస్మి - అగుచున్నాను, ఈశ - ఓ ఈశ్వరా!, తత్ చ అపి - అది కూడ, భవద్-అనుగ్రహః - నీ అనుగ్రహమని, అహమ్ - నేను, మన్యే - తలచెదను, అబ్జనాభ - ఓ పద్మనాభా!, యర్హి - ఎప్పుడైతే, పుంసః - వ్యక్తికి, సంసరణ-అపవర్గః - సంసారముయొక్క సమాప్తి, భవేత్ - భావన చేయబడునో అప్పుడు, సద్-ఉపాసనయా - సత్పురుషుల సాంగత్యముచే, త్వయి - నీయందు, మతిః - బుద్ధి, స్యాత్ - కలుగును.

అట్టి నేను దుష్టులు పొందలేని నీ పాదమును శరణు పొందినాను. ఓ ఈశ్వరా! ఇది కూడ నీ అనుగ్రహమేనని తలచెదను. ఎందుకంటే, ఓ పద్మనాభా! ఎప్పుడైతే వ్యక్తికి సంసారమునకు అంతము భావనకు వచ్చునో, అప్పుడు వాని మనస్సు సత్సాంగత్యముచే నీయందు లగ్నమగును.

నమో విజ్ఞానమాత్రాయ సర్వప్రత్యయహేతవే ।
పురుషేశప్రధానాయ బ్రహ్మణేఽనంతశక్తయే ॥ 29

విజ్ఞానమాత్రాయ - చైతన్యమే స్వరూపముగా కలిగినట్టియు, సర్వప్రత్యయహేతవే - సకలవిజ్ఞానములకు కారణమైనట్టియు, పురుష-ఈశప్రధానాయ - జీవుడు ఈశ్వరుడు మాయాశక్తి అయినట్టియు, అనంతశక్తయే - అనంతమగు శక్తి గల, బ్రహ్మణే - పరబ్రహ్మ కొరకు, నమః - నమస్కారము.

పరబ్రహ్మయొక్క స్వరూపము చైతన్యము. ఆ చైతన్యము వలననే బుద్ధియందు వివిధజ్ఞానములు కలుగుచున్నవి. ఆ పరబ్రహ్మయే ఉపాధులను బట్టి జీవుడు, ఈశ్వరుడు, ప్రకృతి అగుచున్నాడు. అనంతమగు శక్తి గల ఆ పరబ్రహ్మకు నమస్కారము.

నమస్తే వాసుదేవాయ సర్వభూతక్షయాయ చ ।
హృషీకేశ నమస్తుభ్యం ప్రపన్నం పాహి మాం ప్రభో ॥ 30

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే చత్వారింశోఽధ్యాయః ॥

సర్వభూతక్షయాయ - సకలప్రాణుల నివాసస్థానమైన, వాసుదేవాయ - వాసుదేవుడవగు, తే - నీ కొరకు, నమః - నమస్కారము; హృషీక-ఈశ - ఓ ఇంద్రియాంతర్యామీ!, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము, ప్రభో - ఓ ప్రభూ!, ప్రపన్నమ్ - శరణు వేడిన, మామ్ - నన్ను, పాహి - రక్షించుము.

ఓ ప్రభూ! సకలప్రాణుల నివాసస్థానమైన వాసుదేవుడవు నీవే. ఇంద్రియముల అంతర్యామివి నీవే. నీకు నమస్కారము. నేను శరణు వేడుచున్నాను. నన్ను రక్షించుము.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో
అక్రూరుడు శ్రీకృష్ణుని స్తుతించుటను వర్ణించే
నలుబదియవ అధ్యాయము ముగిసినది (40).

* * * * *

# అథ ఏకచత్వారింశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు మథురలో ప్రవేశించి మాలాకారుని అనుగ్రహించుట

శ్రీశుక ఉవాచ ।
స్తువతస్తస్య భగవాన్ దర్శయిత్వా జలే వపుః ।
భూయస్సమాహరత్కృష్ణో నటో నాట్యమివాత్మనః ॥ 1

భగవాన్ కృష్ణః - శ్రీకృష్ణ భగవానుడు, జలే - నీటియందు, వపుః - రూపమును, దర్శయిత్వా - చూపించి, తస్య - ఆ అక్రూరుడు, స్తువతః - స్తుతించుచుండగా, భూయః - మరల, నటః - నటుడు, ఆత్మనః - తన, నాట్యం ఇవ - నటనను వలె, సమాహరత్ - ఉపసంహరించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణ భగవానుడు తన రూపమును నీటియందు చూపించి, ఆ అక్రూరుడు స్తుతించుచుండగా, తరువాత నటుడు తన నటనను వలె ఉపసంహరించెను.

సోఽపి చాంతర్హితం వీక్ష్య జలాదున్మజ్జ్య సత్వరః ।
కృత్వా చావశ్యకం సర్వం విస్మితో రథమాగమత్ ॥ 2

విస్మితః - విస్మయమును పొందిన, సః అపి - ఆ అక్రూరుడు కూడ, అంతర్హితమ్ - అంతర్ధానమగుటను, వీక్ష్య - గుర్తించి, సత్వరః - వేగము గలవాడై, జలాత్ - నీటినుండి, ఉన్మజ్జ్య - బయటకు వచ్చి, ఆవశ్యకమ్ - నిత్యకర్మను, సర్వం చ - అంతనూ, కృత్వా - చేసి, రథమ్ - రథమును గురించి, ఆగమత్ - వచ్చెను.

విస్మయమును పొందిన ఆ అక్రూరుడున్నూ శ్రీహరి అంతర్ధానమైన సంగతిని గుర్తించి వేగముగా నీటి బయటకు వచ్చి నిత్యకర్మనంతనూ పూర్తి చేసుకొని రథము వద్దకు వచ్చెను.

తమపృచ్ఛద్ధృషీకేశః కిం తే దృష్టమివాద్భుతమ్ ।
భూమౌ వియతి తోయే వా తథా త్వాం లక్షయామహే ॥ 3

హృషీక-ఈశః - ఇంద్రియాంతర్యామియగు శ్రీకృష్ణుడు, తమ్ - ఆ అక్రూరుని, అపృచ్ఛత్ - ప్రశ్నించెను, తే - నీచే, భూమౌ - నేలపై గాని, వియతి - ఆకాశమునందు గాని, తోయే వా - నీటియందు గాని, అద్భుతమ్ - వింత, కిమ్ - ఏమి, దృష్టం ఇవ - చూడబడినట్లున్నది?, త్వామ్ - నిన్ను, తథా - ఆ విధముగా, లక్షయామహే - కనుచున్నాము.

ఆ అక్రూరుని ఇంద్రియాంతర్యామియగు శ్రీకృష్ణ భగవానుడిట్లు ప్రశ్నించెను --- నీ ముఖము చూస్తే నీవు నేలపై గాని, ఆకసములో గాని, నీటిలో గాని ఏదో ఒక వింతను చూచినావా అని తోచుచున్నది. ఏమది?

అక్రూర ఉవాచ ।
అద్భుతానీహ యావంతి భూమౌ వియతి వా జలే ।
త్వయి విశ్వాత్మకే తాని కిం మేఽదృష్టం విపశ్యతః ॥ 4

భూమౌ - నేలపై గాని, వియతి - ఆకాశమునందు గాని, జలే వా - నీటియందు గాని, ఇహ - ఈ లోకమునందు, యావంతి - ఎన్ని, అద్భుతాని - వింతలు గలవో, తాని - అవి, విశ్వ-ఆత్మకే - జగద్రూపుడవగు, త్వయి - నీయందు, విపశ్యతః - విశేషముగా చూచుచున్న, మే - నాకు, కిమ్ - ఏది, అదృష్టమ్ - చూడబడనిది?

అక్రూరుడిట్లు పలికెను --- నేలపై గాని, ఆకాశమునందు గాని, నీటియందు గాని ఈ లోకములో ఎన్ని వింతలు గలవో, అవి అన్నీ జగద్రూపుడవగు నీయందే ఉన్నవి. నిన్ను విశేషముగా చూచుచున్న నేను చూడని వింత ఏమి ఉండును? (ఏదీ ఉండదు).

యత్రాద్భుతాని సర్వాణి భూమౌ వియతి వా జలే ।
తం త్వాఽనుపశ్యతో బ్రహ్మన్ కిం మే దృష్టమిహాద్భుతమ్ ॥ 5

బ్రహ్మన్ - ఓ పరబ్రహ్మ!, యత్ర - ఏ నీయందు, సర్వాణి - సకలములైన, అద్భుతాని - వింతలు గలవో, తమ్ - అట్టి, త్వా - నిన్ను, అనుపశ్యతః - చూచుచున్న, మే - నాచే, ఇహ - ఈ లోకమునందు,

భూమౌ - నేలపై గాని, వియతి - ఆకాశమునందు గాని, జలే వా - నీటియందు గాని, అద్భుతమ్ - వింత, కిమ్ - ఏమి, దృష్టమ్ - చూడబడినది?

ఓ పరబ్రహ్మా! వింతలన్నీ నీయందే ఉన్నవి. అట్టి నిన్ను నేను చూస్తూనే ఉన్నాను. ఇంక నేను ఈ లోకములో నేలపై గాని, నీటిలో గాని, ఆకాశములో గాని చూచే వింత ఏమి ఉండును? (ఏదీ ఉండదు).

ఇత్యుక్త్వా చోదయామాస స్యందనం గాందినీసుతః ।
మథురామనయద్రామం కృష్ణం చైవ దినాత్యయే ॥ 6

ఇతి - అని, ఉక్త్వా - పలికి, గాందినీసుతః - గాందినీదేవి పుత్రుడగు అక్రూరుడు, స్యందనమ్ - రథమును, చోదయామాస - నడిపెను, రామమ్ - బలరాముని, కృష్ణం చ - శ్రీకృష్ణుని కూడ, దిన-అత్యయే - సాయంకాలమునందు, మథురామ్ - మథురానగరమును గురించి, అనయత్ - తీసుకువచ్చెను.

ఇట్లు పలికి గాందినీదేవి పుత్రుడగు అక్రూరుడు రథమును నడిపి, సాయంకాలమగుసరికి బలరామకృష్ణులను మథురకు తీసుకువచ్చెను.

మార్గే గ్రామజనా రాజంస్తత్ర తత్రోపసంగతాః ।
వసుదేవసుతౌ వీక్ష్య ప్రీతా దృష్టిం న చాదదుః ॥ 7

రాజన్ - ఓ రాజా!, మార్గే - మార్గమునందు, తత్ర తత్ర - అక్కడక్కడ, ఉపసంగతాః - గుమిగూడిన, గ్రామజనాః - గ్రామములయందలి జనులు, వసుదేవసుతౌ - వసుదేవుని పుత్రులిద్దరిని, వీక్ష్య - చూచి, ప్రీతాః చ - సంతోషించినవారై, దృష్టిమ్ - చూపును, న ఆదదుః - మరల్చనే లేదు.

ఓ పరీక్షిన్మహారాజా! మార్గములో అక్కడక్కడ గుమిగూడిన గ్రామములలోని జనులు వసుదేవుని పుత్రులిద్దరినీ చూచి సంతోషించిరి. వారు తమ చూపును వారిద్దరి మీదనుండి మరల్చనే లేదు.

తావద్వ్రజౌకసస్తత్ర నందగోపాదయోఽగ్రతః ।
పురోపవనమాసాద్య ప్రతీక్షంతోఽవతస్థిరే ॥ 8

తావత్ - అంతలో, నందగోప-ఆదయః - నందగోపుడు మొదలైన, వ్రజ-ఓకసః - గోకుల వాసులు, అగ్రతః - ముందుగా, తత్ర - అచటకు, పురా - ముందే, ఉపవనమ్ - ఉద్యానవనమును, ఆసాద్య - చేరుకొని, ప్రతీక్షంతః - ఎదురు చూచుచున్నవారై, అవతస్థిరే - ఉండిరి.

అంతలో నందగోపుడు మొదలైన గోకుల వాసులు వారికంటె ముందే అచటకు చేరి ఉద్యానవనమునందు ఉండి వారి కొరకు ఎదురు చూచిరి.

తాన్ సమేత్యాహ భగవానక్రూరం జగదీశ్వరః ।
గృహీత్వా పాణినా పాణిం ప్రశ్రితం ప్రహసన్నివ ।। 9

జగద్-ఈశ్వరః - జగన్నాథుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తాన్ - వారిని, సమేత్య - చేరుకొని, ప్రశ్రితమ్ - వినయము గల, అక్రూరమ్ - అక్రూరుని, పాణినా - చేతితో, పాణిమ్ - చేతిని, గృహీత్వా - పట్టుకొని, ప్రహసన్ ఇవ - నవ్వుచున్నాడా యన్నట్లు, ఆహ - పలికెను.

జగన్నాథుడగు శ్రీకృష్ణ భగవానుడు వారిని కలుసుకొనెను. అక్రూరుడు వినీతుడై నిలబడియుండెను. శ్రీకృష్ణుడు ఆయన చేతిని తన చేతితో పట్టుకొని చిరునవ్వుతో నిట్లనెను.

భవాన్ ప్రవిశతామగ్రే సహయానః పురీం గృహమ్ ।
వయం త్విహావముచ్యాథ తతో ద్రక్ష్యామహే పురీమ్ ।। 10

సహయానః - రథముతో కూడియున్న, భవాన్ - నీవు, అగ్రే - ముందుగా, పురీమ్ - నగరమును, గృహమ్ - ఇంటిని, ప్రవిశతామ్ - ప్రవేశించెదవు గాక!, వయం తు - మేమైతే, ఇహ - ఇక్కడ, అవముచ్య - బండ్లను దింపుకొని, తతః అథ - ఆ వెనువెంటనే, పురీమ్ - నగరమును, ద్రక్ష్యామహే - చూడగలము.

నీవు రథముపై ముందు నగరమునకు వెళ్లి ఇంటికి చేరుకొనుము. మేమైతే బండ్లనిక్కడ దించి తరువాత వెంటనే నగరమును చూచెదము.

అక్రూర ఉవాచ ।
నాహం భవద్భ్యాం రహితః ప్రవేక్ష్యే మథురాం ప్రభో ।
త్యక్తుం నార్హసి మాం నాథ భక్తం తే భక్తవత్సల ॥ 11

ప్రభో - ఓ ప్రభూ!, నాథ - రక్షకా!, భక్తవత్సల - భక్తులపై ప్రేమ గలవాడా!, భవద్భ్యామ్ - మీ ఇద్దరితో, రహితః - కూడిలేని, అహమ్ - నేను, మథురామ్ - మథురను, న ప్రవేక్ష్యే - ప్రవేశించను, తే - నీ, భక్తమ్ - భక్తుడనైన, మామ్ - నన్ను, త్యక్తుమ్ - విడుచుటకు, న అర్హసి - తగవు.

అక్రూరుడిట్లు పలికెను --- ఓ ప్రభూ! నీకు భక్తులపై ప్రేమ మెండు. నాకు రక్షకుడవు నీవే. మీరిద్దరు లేకుండా నేను మథురా నగరమును ప్రవేశించను. నేను నీ భక్తుడను. నన్ను విడిచిపెట్టుట నీకు తగదు.

ఆగచ్ఛ యామ గేహాన్నస్సనాథాన్ కుర్వధోక్షజ ।
సహాగ్రజస్సగోపాలైస్సుహృద్భిశ్చ సుహృత్తమ ॥ 12

అధోక్షజ - ఇంద్రియగోచరము కాని స్వరూపము గలవాడా!, సహ-అగ్రజః - అన్నగారితో కూడినవాడవై, ఆగచ్ఛ - రమ్ము, సుహృత్-తమ - సర్వాతిశాయియగు హితమును చేయువాడా!, సగోపాలైః - గోపాలకులతో కూడిన, సుహృద్భిః - మిత్రులతో, నః - మా, గేహాన్ - ఇంటిని గురించి, యామ - వెళ్లెదము, నః - మమ్ములను, సనాథాన్ - నాథుడు గలవారినిగా, కురు - చేయుము.

ఓ శ్రీకృష్ణా! నీ స్వరూపము ఇంద్రియగోచరము కాదు. సర్వాతిశాయియగు హితము (మోక్షము) ను నీవు చేసెదవు. నీవు అన్నగారితో కూడి రమ్ము. గోపాలకులతో, మిత్రులతో కలిసి మా ఇంటికి వచ్చి మమ్ములను నాథుడు గలవారినిగా చేయుము.

పునీహి పాదరజసా గృహాన్నో గృహమేధినామ్ ।
యచ్ఛౌచేనానుతృప్యంతి పితరస్సాగ్నయస్సురాః ॥ 13

గృహమేధినామ్ - గృహస్థులమగు, నః - మా, గృహాన్ - ఇంటిని, పాదరజసా - పాదముల ధూళితో, పునీహి - పవిత్రము చేయుము, యత్-శౌచేన - ఏ పాదములను కడిగిన నీటిచే, పితరః - పితృదేవతలు,

స-అగ్నయః - అగ్నులతో కూడిన, సురాః - దేవతలు, అనుతృప్యంతి - అనుక్షణము తృప్తిని జెందెదరో.

గృహస్థులమగు మా ఇంటిని నీ పాదధూళితో పవిత్రము చేయుము. నీ పాదములను కడిగిన నీటితో పితృదేవతలు, అగ్నులు, దేవతలు అనుక్షణము తృప్తిని జెందెదరు.

అవనిజ్యాంఘ్రియుగలమాసీచ్ఛ్లోక్యో బలిర్మహాన్ ।
ఐశ్వర్యమతులం లేభే గతిం చైకాంతినాం తు యా ॥ 14

మహాన్ బలిః - మహాబలి, అంఘ్రియుగలమ్ - పాదముల జంటను, అవనిజ్య - కడిగి, శ్లోక్యః - కీర్తించదగినవాడు, ఆసీత్ - ఆయెను, అతులమ్ - సాటి లేని, ఐశ్వర్యమ్ - ఐశ్వర్యమును, లేభే - పొందెను, గతిం చ - సాయుజ్యమును కూడ, యా తు - ఏదైతే, ఏకాంతినామ్ - నిష్కామభక్తులకో.

మహాబలి నీ రెండు పాదములను కడిగి కీర్తించదగినవాడాయెను. అంతేగాక, ఆతడు సాటి లేని ఐశ్వర్యమును, నిష్కామభక్తులు పొందే సాయుజ్యమును కూడ పొందెను.

ఆపస్తేఽంఘ్ర్యవనేజన్యస్త్రీంల్లోకాఞ్ఛుచయోఽపునన్ ।
శిరసాఽధత్త యాశ్శర్వస్స్వర్యాతాస్సగరాత్మజాః ॥ 15

శుచయః - పవిత్రములైన, తే - నీ, అంఘ్రి-అవనేజన్యః - పాదములను కడిగిన, ఆపః - జలములు, త్రీన్ - మూడు, లోకాన్ - లోకములను, అపునన్ - పావనము చేసినవి, యాః - ఏ జలములను, శర్వః - శివుడు, శిరసా - శిరస్సుతో, అధత్త - ధరించెనో, సగర-ఆత్మజాః - సగరుని పుత్రులు, స్వః - స్వర్గమును, యాతాః - పొందిరో.

నీ పాదములను కడిగిన జలములు పవిత్రములు. అవి ముల్లోకములను పావనము చేసినవి. వాటిని (గంగను) శివుడు తలపై దాల్చెను. వాటిచే సగరుని పుత్రులు స్వర్గమును పొందిరి.

దేవదేవ జగన్నాథ పుణ్యశ్రవణకీర్తన ।
యదూత్తమోత్తమశ్లోక నారాయణ నమోఽస్తు తే ॥ 16

దేవదేవ - ఓ దేవదేవా!, జగత్-నాథ - జగత్తును కాపాడువాడా!, పుణ్యశ్రవణకీర్తన - పవిత్రమైన వినుట కీర్తించుట గలవాడా!, యదు-ఉత్తమ - యాదవశ్రేష్ఠా!, ఉత్తమశ్లోక - గొప్ప కీర్తి గలవాడా!, నారాయణ - ఓ నారాయణా!, తే - నీ కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!

ఓ నారాయణా! దేవదేవుడవగు నీవే జగత్తును కాపాడెదవు. నీ లీలలను విని కీర్తించుటచే మానవుడు పవిత్రుడగును. యాదవశ్రేష్ఠుడవగు నీ కీర్తి ఉత్తమమైనది. నీకు నమస్కారమగుగాక!

శ్రీభగవానువాచ ।
ఆయాస్యే భవతో గేహమహమార్యసమన్వితః ।
యదుచక్రద్రుహం హత్వా వితరిష్యే సుహృత్ప్రియమ్ ॥ 17

ఆర్యసమన్వితః - అన్నగారితో కూడియున్న, అహమ్ - నేను, భవతః - తమరి, గేహమ్ - ఇంటిని గురించి, ఆయాస్యే - రాగలను, యదుచక్రద్రుహమ్ - యదువంశీయులకు ద్రోహమును చేయుచున్న కంసుని, హత్వా - సంహరించి, సుహృత్-ప్రియమ్ - మిత్రులకు ప్రీతిని, వితరిష్యే - ఈయగలను.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- నేను అన్నగారితో కలిసి మీ ఇంటికి వచ్చెదను. యదువంశీయులకు ద్రోహమును చేయుచున్న కంసుని వధించి మిత్రులకు ప్రీతిని కలిగించెదను.

శ్రీశుక ఉవాచ ।
ఏవముక్తో భగవతా సోఽక్రూరో విమనా ఇవ ।
పురీం ప్రవిష్టః కంసాయ కర్మావేద్య గృహం యయౌ ॥ 18

భగవతా - శ్రీకృష్ణ భగవానునిచే, ఏవమ్ - ఈ విధముగా, ఉక్తః - పలుకబడిన, సః - ఆ, అక్రూరః - అక్రూరుడు, విమనాః ఇవ - చెడిన మనస్సు గలవాడు వలె, పురీమ్ - మధురానగరమును, ప్రవిష్టః -

ప్రవేశించినవాడు, కంసాయ - కంసుని కొరకు, కర్మ - పనిని, ఆవేద్య - విన్నవించి, గృహమ్ - ఇంటిని గురించి, యయౌ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణ భగవానుడిట్లు చెప్పగా అక్రూరుని మనస్సు చెడిపోయినదా అన్నట్లు ఆయెను. ఆయన మథురా నగరమును ప్రవేశించి, కంసునకు కార్యమును విన్నవించి ఇంటికి వెళ్లెను.

అథాపరాహ్ణే భగవాన్ కృష్ణస్సంకర్షణాన్వితః ।
మథురాం ప్రావిశద్గోపైర్దిదృక్షుః పరివారితః ॥ 19

అథ - తరువాత, అపరాహ్ణే - సాయంకాలమునందు, సంకర్షణ-అన్వితః - బలరామునితో కూడియున్నవాడు, గోపైః - గోపాలకులతో, పరివారితః - చుట్టువారబడి యున్నవాడు అగు, భగవాన్ కృష్ణః - శ్రీకృష్ణ భగవానుడు, దిదృక్షుః - చూడగోరువాడై, మథురామ్ - మథురానగరమును, ప్రావిశత్ - ప్రవేశించెను.

తరువాత సాయంకాలము శ్రీకృష్ణ భగవానుడు మథురా నగరమును చూడగోరి ఆ నగరములో ప్రవేశించెను. ఆయన వెంట బలరాముడు కూడ ఉండెను. గోపాలకులు ఆయనను చుట్టువారి యుండిరి.

దదర్శ తాం స్ఫాటికతుంగగోపురద్వారాం బృహద్ధేమకపాటతోరణామ్।
తామ్రారకోష్ఠాం పరిఖాదురాసదాముద్యానరమ్యోపవనోపశోభితామ్॥20

స్ఫాటికతుంగగోపురద్వారామ్ - స్ఫటికములు పొదిగిన ఎత్తైన గోపురము ద్వారములు కలిగినట్టియు, బృహద్-హేమకపాటతోరణామ్ - పెద్ద బంగరు తలుపులు బహిర్ద్వారము కలిగినట్టియు, తామ్ర-ఆరకోష్ఠామ్ - రాగి ఇత్తడిల శాలలు కలిగినట్టియు, పరిఖాదురాసదామ్ - అగడ్తచే ప్రవేశించ శక్యము కానట్టియు, ఉద్యానరమ్య-ఉపవన-ఉపశోభితామ్ - బయటనుండే అడవులు లోపల ఉండే అందమైన ఉద్యానవనములతో శోభిల్లే, తామ్ - ఆ నగరమును, దదర్శ - చూచెను.

శ్రీకృష్ణుడు స్ఫటికములు పొదిగిన ఎత్తైన గోపురములు ద్వారములు కల ఆ నగరమును చూచెను. దాని బహిర్ద్వారమునకు పెద్ద బంగరు తలుపులు ఉండెను. రాగి, ఇత్తడిలతో చేసిన శాలలు గల ఆ నగరము

చుట్టూ అగడ్త ఉండుటచే దానిని (అనుమతి లేకుండా) ప్రవేశించుట దుర్ఘటము. వెలుపల అడవులు, లోపల అందమైన ఉద్యానములు ఆ నగరమునకు శోభను చేకూర్చుచుండెను.

సౌవర్ణశృంగాటకహర్మ్యనిష్కుటైశ్శ్రేణీసభాభిర్భవనైరుపస్కృతామ్ ।
వైదూర్యవజ్రామలనీలవిద్రుమైర్ముక్తాహరిద్భిర్వలభీషు వేదిషు ॥ 21

జుష్టేషు జాలాముఖరంధ్రకుట్టిమే-
ష్వావిష్టపారావతబర్హినాదితామ్ ।
సంసిక్తరథ్యాఽఽపణమార్గచత్వరాం
ప్రకీర్ణమాల్యాంకురలాజతండులామ్ ॥ 22

సౌవర్ణశృంగాటకహర్మ్యనిష్కుటైః - బంగరు వస్తువులు గల కూడళ్ళు ప్రాసాదములు తోటలతో, శ్రేణీసభాభిః - శిల్పకారులు కూర్చుండే సభలతో, భవనైః - భవనములతో, ఉపస్కృతామ్ - అలంకరించబడినట్టియు, వైదూర్యవజ్ర-అమలనీలవిద్రుమైః - వైడూర్యములు వజ్రములు స్ఫటికములు నీలమణులు పగడములతో, ముక్తాహరిద్భిః - ముత్యములు పచ్చలతో, జుష్టేషు - పొదగబడిన, వలభీషు - చంద్రశాలలయందు, వేదిషు - అరుగులయందు, జాలాముఖరంధ్రకుట్టిమేషు - కిటికీ సందులయందు రాతి కట్టడపు నేలలపై, ఆవిష్టపారావతబర్హినాదితామ్ - కూర్చున్న పావురములు నెమళ్ళచే నినదింపజేయబడినట్టియు, సంసిక్తరథ్యా-ఆపణచత్వరామ్ - నీళ్లు చల్లబడిన రథమార్గములు బజారులు కూడళ్లు కలిగినట్టియు, ప్రకీర్ణమాల్య-అంకురలాజతండులామ్ - చల్లబడిన పుష్పమాలలు చిగుళ్లు పేలాలు బియ్యము కలిగిన (నగరమును చూచెను).

ఆ నగరములోని కూడళ్లు, ప్రాసాదములు, వాటి చుట్టూ ఉండే తోటలు, శిల్పకారులు కూర్చుండే సభలు, ఇతర భవనములు బంగరు వస్తువులతో నగరమునకు అలంకారములాయెను. చంద్రశాలలు, అరుగులు, కిటికీలు, రాతి కట్టడపు నేలలయందు వైడూర్యములు, వజ్రములు, స్ఫటికములు, నీలమణులు, పగడములు, ముత్యములు, పచ్చలు పొదగబడెను. పావురములు, నెమళ్లు కిటికీ సందులలో, అరుగులపై కూర్చుని కూయుచుండెను. రథమార్గములు, బజారులు,

కూడళ్లలో నీళ్లను చల్లి, పుష్పమాలలతో చిగుళ్లతో అలంకరించి, పేలాలను బియ్యమును మాంగళ్యము కొరకై చల్లిరి.

ఆపూర్ణకుంభైర్దధిచందనోక్షితైః ప్రసూనదీపావలిభిస్సపల్లవైః,
సవృందరంభాక్రముకైస్సకేతుభిస్స్వలంకృతద్వారగృహాం సపట్టికైః|23

దధిచందన-ఉక్షితైః - పెరుగు చందనములతో చల్లబడినట్టియు, ప్రసూనదీప-ఆవలిభిః - పువ్వుల దీపముల పంక్తులు కలిగినట్టియు, సపల్లవైః - చిగుళ్లతో కూడినట్టియు, సవృందరంభాక్రముకైః - పళ్ల గుత్తులు గల అరటి పోక మొక్కలు కలిగినట్టియు, సకేతుభిః - జెండాలతో కూడినట్టియు, సపట్టికైః - పట్టువస్త్రములతో కూడిన, ఆపూర్ణకుంభైః - నిండా నీరు నింపిన కడవలతో, సు-అలంకృతద్వారగృహామ్ - చక్కగా అలంకరించబడిన ద్వారములు గల గృహములు గల (నగరమును చూచెను).

ఆ నగరములోని ఇళ్ల ద్వారములకు రెండు వైపులా నిండా నీరు నింపిన కడవలనుంచి వాటిపై పెరుగును, చందనమును చల్లి చుట్టూ పుష్పమాలలతో, దీపముల వరుసలతో అలంకరించిరి. వాటి అంచులకు పట్టు వస్త్రములను చుట్టి పైన చిగుళ్లతో, పళ్ల గుత్తులు గల అరటి పోక మొక్కలతో కూడ అలంకరించిరి. వాటికి ప్రక్కన జెండాలనలంకరించిరి.

తాం సంప్రవిష్టౌ వసుదేవనందనౌ
వృతౌ వయస్యైర్నరదేవవర్త్మనా।
ద్రష్టుం సమీయుస్త్వరితాః పురస్త్రియో
హర్మ్యాణి చైవారురుహుర్నృపోత్సుకాః ।। 24

నృప - ఓ రాజా!, వయస్యైః - మిత్రులతో, వృతౌ - చుట్టువారబడియున్న, వసుదేవనందనౌ - వసుదేవుని పుత్రులగు బలరామకృష్ణులు, నరదేవవర్త్మనా - రాజమార్గముచే, తామ్ - ఆ నగరమును, సంప్రవిష్టౌ - ప్రవేశించినవారు, పురస్త్రియః - నగరస్త్రీలు, ఉత్సుకాః - ఉత్సాహము గలవారై, త్వరితాః - వేగము గలవారై, ద్రష్టుమ్ - చూచుటకు, సమీయుః - గుమిగూడిరి, హర్మ్యాణి చ ఏవ - ప్రాసాదములను కూడ, ఆరురుహుః - ఎక్కిరి.

ఓ పరీక్షిన్మహారాజా! మిత్రులు చుట్టువారి రాగా వసుదేవుని పుత్రులగు బలరామకృష్ణులు రాజమార్గము గుండా ఆ నగరమును ప్రవేశించిరి. నగరస్త్రీలు వారిని చూడాలనే ఉత్సాహముతో గుమిగూడి వేగముగా ప్రాసాదముల పైకి ఎక్కిరి.

కాశ్చిద్విపర్యగ్ధృతవస్త్రభూషణా విస్మృత్య చైకం యుగలేష్వథాపరాః,
కృతైకపత్రశ్రవణైకనూపురా నాంక్త్వా ద్వితీయం త్వపరాశ్చ లోచనమ్।

కాశ్చిత్ - కొందరు స్త్రీలు, విపర్యగ్-ధృతవస్త్రభూషణాః - తల్లక్రిందులుగా ధరించబడిన వస్త్రములు నగలు గలవారు, అథ - మరియు, అపరాః - మరి కొందరు, యుగలేషు - జంటలయందు, ఏకమ్ - ఒకదానిని, విస్మృత్య - మరచి, కృత-ఏకపత్రశ్రవణ-ఏకనూపురాః - ధరించబడిన ఒక కర్ణాభరణము గల చెవులు గలవారు ఒకే కాలియందె గలవారు, అపరాః చ తు - మరికొందరు స్త్రీలైతే, ద్వితీయమ్ - రెండవ, లోచనమ్ - కన్నును, న అంక్త్వా - కాటుక పెట్టుకోకుండా (వచ్చిరి). 25

కొందరు స్త్రీలు (శ్రీకృష్ణుని చూడాలనే కంగారులో) వస్త్రములను (క్రిందిది పైన, పైది క్రింద), ఆభరణములను (కాలిది చేతికి, చేతిది కాలికి) తల్లక్రిందులుగా ధరించిరి. కొందరు జంట నగలలో ఒక్కొక్క దానిని మాత్రమే, అనగా ఒకే చెవికి ఆభరణమును, ఒకే కాలికి అందెను ధరించి వచ్చిరి. మరికొందరైతే ఒకే కంటికి కాటుకను పెట్టుకొనిరి.

అశ్నంత్య ఏకాస్తదపాస్య సోత్సవా
అభ్యజ్యమానా అకృతోపమజ్జనాః ।
స్వపంత్య ఉత్థాయ నిశమ్య నిస్స్వనం
ప్రపాయయంత్యోఽర్భమపోహ్య మాతరః ॥ 26

స-ఉత్సవాః - ఉత్సాహముతో కూడిన, ఏకాః - కొద్దిమంది, అశ్నంత్యః - తినుచున్నవారు, తత్ - దానిని, అపాస్య - ప్రక్కన బెట్టి, అభ్యజ్యమానాః - అభ్యంగనము చేయుచున్నవారు, అకృత-ఉపమజ్జనాః - చేయబడని స్నానము గలవారు, స్వపంత్యః - నిద్రించుచున్నవారు, ఉత్థాయ - లేచి, ప్రపాయయంత్యః - పాలిచ్చుచున్న, మాతరః - తల్లులు, నిస్స్వనమ్ -

కోలాహలమును, నిశమ్య - విని, అర్భమ్ - పిల్లవానిని, అపోహ్య - విడిచిపెట్టి (వచ్చిరి).

అన్నము తినుచున్నవారు కోలాహలమును విని శ్రీకృష్ణుని చూడాలనే ఉత్సాహముతో దానిని విడిచిపెట్టి వచ్చిరి. అభ్యంగనము చేయుచున్నవారు పూర్తిగా స్నానము చేయకుండా, నిద్రిస్తున్నవారు నిద్ర లేచి, పిల్లలకు పాలిచ్చుచున్న తల్లులు పిల్లలను విడిచిపెట్టి వచ్చిరి.

మనాంసి తాసామరవిందలోచనః ప్రగల్భలీలాహసితావలోకనైః,
జహార మత్తద్విరదేంద్రవిక్రమో దృశాం దదచ్ఛ్రీరమణాత్మనోత్సవమ్।

అరవిందలోచనః - పద్మమువంటి కన్నులు గలవాడు, మత్తద్విరద-ఇంద్రవిక్రమః - మదించిన గజేంద్రుని నడకవంటి నడక గలవాడు అగు శ్రీకృష్ణుడు, ప్రగల్భలీలాహసిత-అవలోకనైః - చతురమైన విలాస నవ్వు చూపులతో, శ్రీరమణ-ఆత్మనా - లక్ష్మీదేవిని రమింపజేసే దేహముతో, దృశామ్ - కన్నులకు, ఉత్సవమ్ - పండుగను, దదత్ - ఇచ్చుచున్నవాడై, తాసామ్ - వారి, మనాంసి - మనస్సులను, జహార - దోచివేసెను. 27

పద్మములవంటి కన్నులు గల శ్రీకృష్ణుడు మదించిన గజేంద్రుని వలె ఠీవిగా నడచును. ఆయన చతురమగు విలాసతో, నవ్వుతో, చూపులతో, లక్ష్మీదేవిని సైతము రమింపజేసే దేహముతో ఆ యువతుల కన్నులకు పండుగను చేస్తూ వారి మనస్సులను దోచివేసెను.

దృష్ట్వా ముహుశ్శ్రుతమనుద్రుతచేతసస్తం
తత్ప్రేక్షణోత్స్మితసుధోక్షణలబ్ధమానాః।
ఆనందమూర్తిముపగుహ్య దృశాఽఽత్మలబ్ధం
హృష్యత్త్వచో జహురనంతమరిందమాధిమ్ ॥ 28

అరిందమ - శత్రువులను నిగ్రహించిన ఓ రాజా!, ముహుః - పలుమార్లు, శ్రుతమ్ - వినబడిన, తమ్ - ఆయనను, దృష్ట్వా - చూచి, అనుద్రుతచేతసః - ఆయనయందు లగ్నమైన మనస్సులు గల ఆ యువతులు, తత్-ప్రేక్షణ-ఉత్స్మితసుధా-ఉక్షణలబ్ధమానాః

- ఆయనయొక్క చూపుతో కూడిన గొప్ప నవ్వు అనే అమృతముచే తడుపబడుటచే పొందబడిన సత్కారము గలవారై, దృశా - చూపుతో, ఆత్మలబ్ధమ్ - అంతఃకరణమునందు పొందబడిన, ఆనందమూర్తిమ్ - ఆనందమూర్తియగు శ్రీకృష్ణుని, ఉపగుహ్య - కౌగిలించుకొని, హృష్యత్-త్వచః - గగుర్పాటు కలిగిన దేహము గలవారై, అనంతమ్ - అంతు లేని, ఆధిమ్ - మనోవ్యథను, జహుః - విడిచిపెట్టిరి.

శత్రువులను నిగ్రహించిన ఓ పరీక్షిన్మహారాజా! ఆ యువతులు పలుమార్లు శ్రీకృష్ణుని గురించి వినియుండుటచే, వారి మనస్సు ఆయనయందు లగ్నమై యుండెను. ఇపుడాయనను వారు చూచిరి. ఆయన గొప్ప చూపుతో కూడిన నవ్వు అనే అమృతమును వారిపై కురిపించి వారిని సత్కరించెను. వారు చూపుతో ఆ ఆనందమూర్తిని అంతఃకరణములో స్థాపించి కౌగిలించిరి. దానితో వారికి దేహమంతా గగుర్పాటు కలిగినది. వారు ఆయనను చూడలేకపోతిమనే అంతు లేని మనోవ్యాధిని విడిచిపెట్టిరి.

ప్రాసాదశిఖరారూఢాః ప్రీత్యుత్ఫుల్లముఖాంబుజాః ।
అభ్యవర్షన్ సౌమనస్యైః ప్రమదా బలకేశవౌ ॥ 29

ప్రాసాదశిఖర-ఆరూఢాః - ప్రాసాదముల అగ్రభాగములనెక్కినవారు, ప్రీతి-ఉత్ఫుల్లముఖ-అంబుజాః - ప్రేమతో వికసించిన పద్మమువంటి ముఖములు గలవారు అగు, ప్రమదాః - సుందరయువతులు, బలకేశవౌ - బలరాముని శ్రీకృష్ణ భగవానుని, సౌమనస్యైః - బుట్టెడేసి పువ్వులతో, అభ్యవర్షన్ - ముంచెత్తిరి.

ప్రేమతో వికసించిన పద్మమువంటి ముఖములు గల సుందరయువతులు ప్రాసాదముల పైకి ఎక్కి బలరాముని, శ్రీకృష్ణ భగవానుని బుట్టెడేసి పువ్వులను చల్లి ముంచెత్తిరి.

దధ్యక్షతైస్సోదపాత్రైస్స్రగ్గంధైరభ్యుపాయనైః ।
తావానర్చుః ప్రముదితాస్తత్ర తత్ర ద్విజాతయః ॥ 30

ప్రముదితాః - బాగా ఆనందించిన, ద్విజాతయః - వేదవేత్తలు, తత్ర తత్ర - అక్కడక్కడ, దధి-అక్షతైః - పెరుగుతో అక్షతలతో, స-ఉదపాత్రైః - పూర్ణకుంభములతో, స్రగ్-గంధైః - పూల మాలలతో చందనముతో, అభ్యుపాయనైః - బహుమతులతో, తౌ - వారిద్దరిని, ఆనర్చుః - పూజించిరి.

చాల ఆనందపడిన వేదవేత్తలు అక్కడక్కడ పెరుగును, అక్షతలను, పూర్ణకుంభములను, పూల మాలలను, చందనమును, బహుమతులను (పళ్లను) సమర్పించి వారిద్దరిని పూజించిరి.

ఊచుః పౌరా అహో గోప్యస్తపః కిమచరన్మహత్ ।
యా హ్యేతావను పశ్యంతి నరలోకమహోత్సవౌ ॥ 31

పౌరాః - నగరస్త్రీలు, ఊచుః - పలికిరి, అహో - ఆహా!, గోప్యః - గోపికలు, కిమ్ - ఏ, మహత్ - గొప్ప, తపః - తపస్సును, అచరన్ - చేసిరో?, హి - ఏలయన, యాః - ఎవరైతే, నరలోకమహా-ఉత్సవౌ - మానవలోకమునకే గొప్ప పండువయైన, ఏతౌ - వీరిద్దరిని, అను - ప్రతిక్షణము, పశ్యంతి - చూచెదరో.

ఆహా! గోపికలేమి తపస్సును చేసిరో? ఎందుకంటే, మానవలోకమునకే కన్నులకు పండువయైన వీరిద్దరిని వారు ప్రతి క్షణము చూచుచుందురు, అని నగరమునందలి యువతులు చెప్పుకొనిరి.

రజకం కంచిదాయాంతం రంగకారం గదాగ్రజః ।
దృష్ట్వాఽయాచత వాసాంసి ధౌతాన్యత్యుత్తమాని చ ॥ 32

గదాగ్రజః - గదుడు అన్నగారైన శ్రీకృష్ణుడు, ఆయాంతమ్ - వచ్చుచున్న, కంచిత్ - ఒకానొక, రంగకారమ్ - బట్టలకు రంగులను వేసే, రజకమ్ - చాకలివానిని, దృష్ట్వా - చూచి, ధౌతాని - ఉతకబడినట్టియు, అతి-ఉత్తమాని చ - మిక్కిలి శ్రేష్ఠమైన, వాసాంసి - వస్త్రములను, అయాచత - కోరెను.

బట్టలకు రంగులను వేసే ఒక చాకలి వచ్చుచుండెను. గదుని (వసుదేవుని పుత్రులలో ఒకడు) తమ్ముడగు శ్రీ కృష్ణుడు వానిని చూచి ఉతికిన మిక్కిలి శ్రేష్ఠమగు వస్త్రములను కోరెను.

దేహ్యావయోస్సముచితాన్యంగ వాసాంసి చార్హతోః ।
భవిష్యతి పరం శ్రేయో దాతుస్తే నాత్ర సంశయః ॥ 33

అంగ - ఓయీ!, అర్హతోః - అర్హులమైన, ఆవయోః చ - మా ఇద్దరికి కూడ, సముచితాని - తగిన, వాసాంసి - వస్త్రములను, దేహి - ఇమ్ము, దాతుః - దాతవైన, తే - నీకు, పరమ్ - సర్వోత్కృష్టమైన, శ్రేయః - హితము, భవిష్యతి - కలుగగలదు, అత్ర - ఈ విషయమునందు, సంశయః - సందేహము, న - లేదు.

ఓయీ! మేమిద్దరము చక్కని వస్త్రములకు తగ్గవారము. మాకట్టి వస్త్రములనిమ్ము. మాకిచ్చినచో నీకు గొప్ప శ్రేయస్సు కలుగగలదు. ఈ విషయములో సందేహము వలదు.

స యాచితో భగవతా పరిపూర్ణేన సర్వతః ।
సాక్షేపం రుషితః ప్రాహ భృత్యో రాజ్ఞస్సుదుర్మదః ॥ 34

రాజ్ఞః - కంసరాజుయొక్క, భృత్యః - సేవకుడు, సుదుర్మదః - బాగా గర్వించినవాడు అగు, సః - ఆతడు, సర్వతః - అన్ని విధములుగా, పరిపూర్ణేన - పరిపూర్ణుడైన, భగవతా - శ్రీకృష్ణ భగవానునిచే, యాచితః - కోరబడినవాడై, రుషితః - కోపించినవాడై, స-ఆక్షేపమ్ - నిందతో కూడుకొనునట్లుగా, ప్రాహ - పలికెను.

ఆతడు కంసరాజునకు సేవకుడు, బాగా గర్వించి యున్నవాడు. అన్ని విధములుగా పరిపూర్ణుడైన శ్రీకృష్ణ భగవానుడీ విధముగా కోరగా, ఆతడు కోపించి నిందాపూర్వకముగా ఇట్లు పలికెను.

ఈదృశాన్యేవ వాసాంసి నిత్యం గిరివనేచరాః ।
పరిధత్త కిముద్వృత్తా రాజద్రవ్యాణ్యభీప్సథ ॥ 35

ఉద్వృత్తాః - విడిచిపెట్టబడిన సదాచారము గలవారా!, నిత్యమ్ - నిత్యము, గిరవనేచరాః - కొండలపై అడవులలో తిరిగే మీరు, ఈదృశాని - ఇటువంటి, వాసాంసి ఏవ - వస్త్రములనే, కిం పరిధత్త - ధరించెదరా?, రాజద్రవ్యాణి - రాజుయొక్క వస్తువులను, అభీప్సథ - కోరుచున్నారు.

ఓయీ! మీరు సదాచారమును విడిచిపెట్టి రాజుయొక్క వస్తువులను కోరుచున్నారు. నిత్యము కొండలపై అడవులలో తిరిగే మీరు ఇట్టి వస్త్రములనే ధరించెదరా?

యాతాశు బాలిశా మైవం ప్రార్థ్యం యది జిజీవిషా ।
బధ్నంతి ఘ్నంతి లుంపంతి దృప్తం రాజకులాని వై ।। 36

బాలిశాః - ఓ అజ్ఞానులారా!, ఆశు - తొందరగా, యాత - వెళ్లుడు, జిజీవిషా యది - బ్రతకాలనే కోరిక ఉన్నచో, ఏవమ్ - ఈ విధముగా, మా ప్రార్థ్యమ్ - కోరబడరాదు, రాజకులాని - రాజభటులు, దృప్తమ్ - గర్వించినవానిని, వై - నిశ్చయముగా, బధ్నంతి - బంధించెదరు, ఘ్నంతి - కొట్టెదరు, లుంపంతి - ఆస్తి లాగుకొనెదరు.

ఓ అజ్ఞానులారా! తొందరగా వెళ్లుడు. మీకు బ్రతకాలని ఉంటే ఇట్టి కోరికలు కోరకుడు. గర్వించిన వ్యక్తిని రాజభటులు నిశ్చితముగా బంధించి, కొట్టి, వాని సంపదను లాగుకొనెదరు.

ఏవం వికత్థమానస్య కుపితో దేవకీసుతః ।
రజకస్య కరాగ్రేణ శిరః కాయాదపాతయత్ ।। 37

ఏవమ్ - ఈ విధముగా, వికత్థమానస్య - బీరములు పలుకుచున్న, రజకస్య - చాకలివాని, శిరః - తలను, కుపితః - కోపించిన, దేవకీసుతః - దేవకి పుత్రుడగు శ్రీకృష్ణుడు, కర-అగ్రేణ - చేతి గోటితో, కాయాత్ - మొండెమునుండి, అపాతయత్ - పడునట్లు చేసెను.

శ్రీకృష్ణుడు కోపించినవాడై ఈ విధముగా బీరములు పలుకుచున్న ఆ చాకలివాని తలను చేతి గోటితో మొండెమునుండి వేరు చేసి పడవేసెను.

తస్యానుజీవినస్సర్వే వాసఃకోశాన్ విసృజ్య వై ।
దుద్రువుస్సర్వతో మార్గం వాసాంసి జగృహేఽచ్యుతః ।। 38

తస్య - వాని, అనుజీవినః - జీతగాళ్లు, సర్వే - అందరు, వాసఃకోశాన్ - వస్త్రముల మూటలను, విసృజ్య - విడిచిపెట్టి, మార్గమ్ - మార్గమును,

సర్వతః - అన్ని వైపులకు, దుద్రువుః - పరుగెత్తిరి, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, వాసాంసి - వస్త్రములను, జగృహే - తీసుకొనెను.

వాని జీతగాళ్లందరు వస్త్రముల మూటలను విడిచిపెట్టి దారికి అన్ని వైపులా పరుగెత్తిరి. శ్రీకృష్ణ భగవానుడు వస్త్రములను తీసుకొనెను.

వసిత్వాऽऽత్మప్రియే వస్త్రే కృష్ణస్సంకర్షణస్తథా ।
శేషాణ్యాదత్త గోపేభ్యో విసృజ్య భువి కానిచిత్ ॥ 39

కృష్ణః - శ్రీకృష్ణుడు, తథా - అదే విధముగా, సంకర్షణః - బలరామదేవుడు, ఆత్మప్రియే - తమకు నచ్చిన, వస్త్రే - వస్త్రముల జతలను, వసిత్వా - ధరించి, శేషాణి - మిగిలినవాటిని, గోపేభ్యః - గోపాలకుల కొరకు, ఆదత్త - ఇచ్చెను, కానిచిత్ - కొన్నింటిని, భువి - నేలపై, విసృజ్య - విడిచిపెట్టి (వెళ్లెను).

శ్రీకృష్ణుడు మరియు బలరామదేవుడు తమకు నచ్చిన వస్త్రముల జతలను కట్టుకొని, మిగిలిన వాటిని గోపాలకులకు ఇచ్చిరి. కొన్నింటిని నేలపై విడిచిపెట్టి వెళ్లిరి.

తతస్తు వాయకః ప్రీతస్తయోర్వేషమకల్పయత్ ।
విచిత్రవర్ణైశ్చైలేయైరాకల్పైరనురూపతః ॥ 40

తతః - తరువాత, వాయకః తు - బట్టల నేయువాడైతే, ప్రీతః - సంతోషించినవాడై, తయోః - వారిద్దరికీ, విచిత్రవర్ణైః - రంగు రంగుల, చైలేయైః - వస్త్రములతో చేసిన, ఆకల్పైః - అలంకారములతో, అనురూపతః - తగిన విధముగా, వేషమ్ - వేషమును, అకల్పయత్ - ఏర్పాటు చేసెను.

తరువాత ఒక బట్టలను నేయువాడు వారిద్దరినీ చూచి సంతోషించి రంగు రంగుల వస్త్రములతో కుట్టిన అలంకారములతో వారి రూపుకు తగ్గట్లుగా వేషమును ఏర్పాటు చేసెను.

నానాలక్షణవేషాభ్యాం కృష్ణరామౌ విరేజతుః ।
స్వలంకృతౌ బాలగజౌ పర్వణీవ సితేతరౌ ॥ 41

కృష్ణరామౌ - శ్రీకృష్ణ బలరాములు, నానాలక్షణవేషాభ్యామ్ - అనేక విధముల వేషములచే, సు-అలంకృతౌ - బాగుగా అలంకరించబడినవారై, పర్వణి - ఉత్సవమునందలి, సిత-ఇతరౌ - తెలుపు నలుపులగు, బాలగజౌ ఇవ - రెండు ఏనుగు గున్నలవలె, విరేజతుః - విశేషముగా ప్రకాశించిరి.

శ్రీకృష్ణ బలరాములు అనేక విధముల వేషములతో బాగుగా అలంకరించబడినవారై, ఉత్సవమునందలి నలుపు-తెలుపు జంట ఏనుగు గున్నలవలె విశేషముగా ప్రకాశించిరి.

తస్య ప్రసన్నో భగవాన్ ప్రాదాత్సారూప్యమాత్మనః ।
శ్రియం చ పరమాం లోకే బలైశ్వర్యస్మృతీంద్రియమ్ ॥ 42

తస్య - వానికి, ప్రసన్నః - ప్రసన్నుడైన, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఆత్మనః - తన, సారూప్యమ్ - సమానరూపమును కలిగియుండుటను, లోకే - లోకమునందు, పరమామ్ - సర్వోత్తమమైన, శ్రియమ్ - సంపదను, బల-ఐశ్వర్యస్మృతి-ఇంద్రియం చ - బలమును ఈశ్వరభావమును తన జన్మయొక్క స్మరణమును ఇంద్రియశక్తిని కూడ, ప్రాదాత్ - ఇచ్చెను.

ప్రసన్నుడైన భగవానుడు వానికి ఇహలోకమునందు సర్వోత్తమమైన సంపదను, బలమును, ఈశ్వరభావమును, తన జన్మయొక్క స్మరణమును, ఇంద్రియశక్తిని, మరణించిన తరువాత తనతో సమానమైన రూపమును కూడ అనుగ్రహించెను.

తతస్సుదామ్నో భవనం మాలాకారస్య జగ్మతుః ।
తౌ దృష్ట్వా స సముత్థాయ ననామ శిరసా భువి ॥ 43

తతః - తరువాత, మాలాకారస్య - పుష్పమాలలను తయారు చేసే, సుదామ్నః - సుదామయొక్క, భవనమ్ - భవనమును గురించి, జగ్మతుః - వెళ్లిరి, తౌ - వారిద్దరిని, దృష్ట్వా - చూచి, సః - ఆతడు, సముత్థాయ - లేచి నిలబడి, భువి - నేలపై, శిరసా - శిరస్సుతో, ననామ - నమస్కరించెను.

తరువాత వారిద్దరు మాలలను తయారు చేసే సుదాముని ఇంటికి వెళ్లిరి. వారిని చూసి ఆతడు లేచి నిలబడి తరువాత సాష్టాంగప్రణామమును చేసెను.

తయోరాసనమానీయ పాద్యం చార్ఘ్యార్హణాదిభిః ।
పూజాం సానుగయోశ్చక్రే స్రక్తాంబూలానులేపనైః ॥ 44

స-అనుగయోః - అనుచరులతో కూడియున్న, తయోః - వారిద్దరికి, ఆసనమ్ - ఆసనమును, పాద్యమ్ - కాళ్లను కడుగుకొనే నీటిని, అర్ఘ్య-అర్హణ-ఆదిభిః - త్రాగే నీరు పూజాద్రవ్యములు మొదలగువాటితో బాటు, ఆనీయ - తీసుకువచ్చి, స్రక్-తాంబూల-అనులేపనైః - పూల మాలలు తాంబూలము చందనలేపనములతో, పూజామ్ - పూజను, చక్రే - చేసెను.

ఆతడు వారిద్దరికి వారి అనుచరులకు కూడ కాళ్లను కడుగుకొనే నీటిని, త్రాగే నీటిని తెచ్చి ఇచ్చెను. తరువాత ఆసనము, పూల మాలలు, తాంబూలము, చందన లేపనము, ఆహారము మొదలగు ద్రవ్యములతో వారికి పూజను చేసెను.

ప్రాహ నస్సార్థకం జన్మ పావితం చ కులం ప్రభో ।
పితృదేవర్షయో మహ్యం తుష్టా హ్యాగమనేన వామ్ ॥ 45

ప్రాహ - పలికెను, ప్రభో - ఓ ప్రభూ!, వామ్ - మీ ఇద్దరి, ఆగమనేన - రాకచే, నః - మా, జన్మ - పుట్టుక, కులం చ - కులము కూడ, పావితమ్ - పవిత్రము చేయబడినది, మహ్యామ్ - నా కొరకు, పితృదేవ-ఋషయః - పితరులు దేవతలు మహర్షులు, తుష్టాః - సంతుష్టులు, హి - నిశ్చయము.

ఆతడిట్లు పలికెను -- ఓ ప్రభూ! మీ యిద్దరి రాకచే మా జన్మ, కులము కూడ పవిత్రమైనవి. పితృదేవతలు, దేవతలు, మహర్షులు నా యెడల నిశ్చయముగా సంతుష్టులైనారు.

భవంతౌ కిల విశ్వస్య జగతః కారణం పరమ్ ।
అవతీర్ణావిహాంశేన క్షేమాయ చ భవాయ చ ॥ 46

భవంతౌ - మీరిద్దరు, విశ్వస్య - సకలమైన, జగతః - జగత్తునకు, పరమ్ - సర్వాతిశాయియైన, కారణం కిల - కారణము గదా!, క్షేమాయ చ - క్షేమము కొరకు, భవాయ చ - అభ్యుదయము కొరకు, ఇహ - ఈ లోకమునందు, అంశేన - పూర్ణస్వరూపముతో, అవతీర్ణౌ - అవతరించినవారు.

మీరిద్దరు సకలజగత్తునకు పరమకారణము గదా! మీరు జనుల క్షేమము కొరకు, అభ్యుదయము కొరకు ఈ లోకమునందు పూర్ణరూపముతో అవతరించినారు.

న హి వాం విషమా దృష్టిస్సుహృదోర్జగదాత్మనోః ।
సమయోస్సర్వభూతేషు భజంతం భజతోరపి ॥ 47

సుహృదోః - హితకారులైనట్టియు, జగద్-ఆత్మనోః - జగత్తునకు ఆత్మలైనట్టియు, సర్వభూతేషు - సకలప్రాణులయందు, సమయోః - సమభావము కలిగినట్టియు, భజంతమ్ - ప్రేమించువానిని, భజతోః అపి - ప్రేమను కూడ చూపే, వామ్ - మీ ఇద్దరికి, విషమా - విషమమైన, దృష్టిః - భావము, న హి - లేనే లేదు.

మీరు ప్రేమించువానిని ప్రేమించెదరు. కాని, మీయందు విషమదృష్టి లేదు. మీరు జగత్తునకు ఆత్మరూపులు, హితకారులు. మీరు సకలప్రాణులయందు సమచిత్తమును కలిగియుందురు.

తావాజ్ఞాపయతం భృత్యం కిమహం కరవాణి వామ్ ।
పుంసోత్యనుగ్రహో హ్యేష భవద్భిర్యన్నియుజ్యతే ॥ 48

తౌ - అట్టి మీ ఇద్దరు, భృత్యమ్ - సేవకుని, ఆజ్ఞాపయతమ్ - ఆదేశించుడు, వామ్ - మీ ఇద్దరి కొరకు, అహమ్ - నేను, కిమ్ - దేనిని, కరవాణి - చేసెదను గాక?, ఏషః - ఇది, పుంసః - మనిషికి, అతి-అనుగ్రహః - అతిశయించిన అనుగ్రహము, యత్ - ఏదనగా, భవద్భిః - మీచే, నియుజ్యతే - నియోగించబడుచున్నాడో.

అట్టి (ఆత్మరూపులైన) మీ ఇద్దరు సేవకుడనగు నన్ను ఆదేశించుడు. నేను మీకు చేయదగినది ఏమున్నది? మీచే నియోగించబడుట మానవునకు అతిశయించిన అనుగ్రహమే.

ఇత్యభిప్రేత్య రాజేంద్ర సుదామా ప్రీతమానసః ।
శస్తైస్సుగంధైః కుసుమైర్మాలా విరచితా దదౌ ॥ 49

రాజ-ఇంద్ర - ఓ మహారాజా!, ఇతి - ఈ విధముగా, అభిప్రేత్య - అభిప్రాయమును తెలుసుకొని, ప్రీతమానసః - ప్రీతి జెందిన మనస్సు గల, సుదామా - సుదాముడు, శస్తైః - ప్రశస్తమైన, సుగంధైః - మంచి పరిమళము గల, కుసుమైః - పూలచే, విరచితాః - తయారు చేయబడిన, మాలాః - మాలలను, దదౌ - ఇచ్చెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా వారి అభిప్రాయమును తెలుసుకొని సుదాముని మనస్సు ప్రీతిని జెందెను. ఆతడు వారికి ప్రశస్తమైన పూలతో తయారైన పరిమళభరితమగు మాలలను ఇచ్చెను.

తాభిస్స్వలంకృతౌ ప్రీతౌ కృష్ణరామౌ సహానుగౌ ।
ప్రణతాయ ప్రపన్నాయ దదతుర్వరదౌ వరాన్ ॥ 50

తాభిః - వాటితో, సు-అలంకృతౌ - చక్కగా అలంకరించుకున్నవారు, ప్రీతౌ - ప్రీతిని జెందినవారు, సహ-అనుగౌ - అనుచరులతో కూడియున్నవారు, వరదౌ - వరములనిచ్చువారు అగు, కృష్ణరామౌ - శ్రీకృష్ణ బలరాములు, ప్రణతాయ - ప్రణమిల్లినట్టియు, ప్రపన్నాయ - శరణు వేడిన సుదాముని కొరకు, వరాన్ - వరములను, దదతుః - ఇచ్చిరి.

ఆ బలరామకృష్ణులు అనుచరులతో కూడి వాటితో చక్కగా అలంకరించుకొని సంతోషించిరి. ప్రణమిల్లి శరణు వేడిన సుదాముని కొరకు వరప్రదాతలగు వారిద్దరు వరములనిచ్చిరి.

సోఽపి వవ్రేఽచలాం భక్తిం తస్మిన్నేవాఖిలాత్మని ।
తద్భక్తేషు చ సౌహార్దం భూతేషు చ దయాం పరామ్ ॥ 51

సః అపి - ఆ సుదాముడు కూడ, అఖిల-ఆత్మని - సకలప్రాణులలో ఆత్మరూపముగానుండే, తస్మిన్ ఏవ - ఆ శ్రీకృష్ణునియందే, అచలామ్ - దృఢమైన, భక్తిమ్ - భక్తిని, తద్-భక్తేషు - ఆయనయొక్క భక్తులయందు, సౌహార్దం చ - మైత్రిని కూడ, భూతేషు - ప్రాణులయందు, పరామ్ - కారణము లేని, దయాం చ - దయను కూడ, వవ్రే - వరములుగా కోరెను.

ఆ సుదాముడున్నూ సకలప్రాణులలో ఆత్మరూపుడుగానుండే ఆ శ్రీకృష్ణునియందే దృఢమగు భక్తిని, ఆయనయొక్క భక్తులయందు మైత్రిని, ప్రాణులపై నిష్కారణమైన దయను కూడ వరములుగా కోరెను.

ఇతి తస్మై వరం దత్త్వా శ్రియం చాన్వయవర్ధినీమ్ ।
బలమాయుర్యశః కాంతిం నిర్జగామ సహాగ్రజః ॥ 52

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ఏకచత్వారింశోऽధ్యాయః ॥

ఇతి - ఈ విధముగా, తస్మై - వాని కొరకు, అన్వయవర్ధినీమ్ - వంశమునందు వర్ధిల్లే, శ్రియమ్ - సంపదను, బలమ్ - బలమును, ఆయుః - ఆయుర్దాయమును, యశః - కీర్తిని, కాంతిమ్ - తేజస్సును, దత్త్వా - ఇచ్చి, సహ-అగ్రజః - అన్నగారితో కూడినవాడై, నిర్జగామ - నిష్క్రమించెను.

ఈ విధముగా శ్రీకృష్ణుడు వానికి వంశపరంపరతో బాటు వర్ధిల్లే సంపదను, బలమును, ఆయుర్దాయమును, కీర్తిని, తేజస్సును వరములుగా నిచ్చి, అన్నగారితో కలిసి అక్కడనుండి నిష్క్రమించెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో శ్రీకృష్ణుడు
మథురలో ప్రవేశించి మాలాకారుని అనుగ్రహించుటను వర్ణించే
నలుబది ఒకటవ అధ్యాయము ముగిసినది (41).



# అథ ద్విచత్వారింశోऽధ్యాయః

## శ్రీకృష్ణుడు కుబ్జను అనుగ్రహించి ధనుర్భంగమును చేయుట

శ్రీశుక ఉవాచ ।
అథ వ్రజన్ రాజపథేన మాధవః
స్త్రియం గృహీతాంగవిలేపభాజనామ్ ।
విలోక్య కుబ్జాం యువతీం వరాననాం
పప్రచ్ఛ యాంతీం ప్రహసన్ రసప్రదః ॥ 1

అథ - తరువాత, రాజపథేన - రాజమార్గముచే, వ్రజన్ - వెళ్లుచున్నవాడు, రసప్రదః - ప్రేమనిచ్చే, మాధవః - శ్రీకృష్ణ భగవానుడు, గృహీత-అంగవిలేపభాజనామ్ - పట్టుకొనబడిన చందనవిలేపనముయొక్క పాత్ర కలిగినట్టియు, కుబ్జామ్ - గూనిదైయైనట్టియు, యువతీమ్ - యువతియైనట్టియు, వర-ఆననామ్ - అందమైన ముఖము కలిగినట్టియు, యాంతీమ్ - వెళ్లుచున్న, స్త్రియమ్ - స్త్రీని, ప్రహసన్ - నవ్వుచున్నవాడై, పప్రచ్ఛ - అడిగెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- సుదాముని అనుగ్రహించిన పిదప శ్రీకృష్ణ భగవానుడు రాజమార్గము గుండా వెళ్లుచుండెను. ప్రేమనిచ్చే ఆయనకు చందనవిలేపనమున్న పాత్రను పట్టుకొని వెళ్తూ ఒక యువతి కనబడెను. ఆమె అందమైన ముఖము కలదియే అయినా గూనిది. ఆయన నవ్వుతూ ఆమెనిట్లడిగెను.

కా త్వం వరోర్వేతదు హానులేపనం
కస్యాంగనే వా కథయస్వ సాధు నః ।
దేహ్యావయోరంగవిలేపముత్తమం
శ్రేయస్తతస్తే న చిరాద్భవిష్యతి ॥ 2

వరోరు - ఓ సుందరీ!, త్వమ్ - నీవు, కా - ఎవతెవు?, అంగనే - ఓ యువతీ!, ఏతత్ - ఈ, అనులేపనమ్ - చందనలేపనము, కస్య ఉ హ - ఎవనిది చెప్పుమా!, నః - మాకు, సాధు - సత్యమును, కథయస్వ - చెప్పుము, ఉత్తమమ్ - గొప్ప, అంగవిలేపనమ్ - చందన విలేపమును, ఆవయోః - మా ఇద్దరికి, దేహి - ఇమ్ము, తతః - దానివలన, తే - నీకు, న చిరాత్ - తొందరలో, శ్రేయః - హితము, భవిష్యతి - కలుగగలదు.

ఓ సుందరీ! నీవెవతెవు? యువతీ! ఈ చందనలేపనమెవనికి చెప్పుమా! మాకు సత్యమును చెప్పుము. మా ఇద్దరికి ఉత్తమమగు అంగ లేపమునిమ్ము. ఆ ఇచ్చుట వలన నీకు తొందరలో హితము కలుగగలదు.

సైరంధ్ర్యువాచ ।
దాస్యస్మ్యహం సుందర కంససమ్మతా త్రివక్రనామా హ్యనులేపకర్మణి
మద్భావితం భోజపతేరతిప్రియం వినా యువాం కోఽన్యతమస్తదర్హతి।3

సుందర - ఓ సుందరుడా!, అహమ్ - నేను, అనులేపకర్మణి - అంగలేపమును చేసే పనియందు, కంససమ్మతా - కంసునిచే స్వీకరించ బడినట్టియు, త్రివక్రనామా - త్రివక్ర అనే పేరు కలిగిన, దాసీ - దాసీని, అస్మి - అగుదును, మద్-భావితమ్ - నాచే తయారుచేయబడినది, భోజ పతేః - భోజదేశప్రభువగు కంసునకు, అతిప్రియమ్ - మిక్కిలి ప్రియము, యువాం వినా - మీ ఇద్దరిని మినహాయించి, అన్యతమః - అందరిలో మరియొకడు, కః - ఎవడు, తత్ - దానిని, అర్హతి - అర్హుడగును?

సైరంధ్రి ఇట్లు పలికెను --- ఓ సుందరుడా! నేను త్రివక్ర (మూడు వంకరలు గలది) అనే సార్థక నామము గల దాసీని. కంసుడు నన్ను అంగలేపమును చేసే పనియందు స్వీకరించినాడు. నేను చేసిన అంగలేపము ఆ భోజప్రభునకు ఇష్టము. మీ ఇద్దరిని మినహాయిస్తే దీనికి తగ్గవాడు మరియొకడెవడు గలడు? (ఎవడూ లేడు).

రూపపేశలమాధుర్యహసితాలాపవీక్షితైః ।
ధర్షితాత్మా దదౌ సాంద్రముభయోరనులేపనమ్ ॥ 4

రూపపేశలమాధుర్యహసిత-ఆలాపవీక్షితైః - రూపము సౌకుమార్యము సహృదయత నవ్వు పలుకు చూపులచే, ధర్షిత-ఆత్మా - మోహితమైన మనస్సు గల సైరంధ్రి, ఉభయోః - ఇద్దరికి, సాంద్రమ్ - ముద్దవంటి, అనులేపనమ్ - అంగలేపనమును, దదౌ - ఇచ్చెను.

శ్రీకృష్ణుని సౌందర్యము, సౌకుమార్యము, సహృదయత, నవ్వు, పలుకులచే సైరంధ్రి మనస్సు మోహమును పొందెను. ఆమె వారిద్దరికి అంగరాగపు ముద్దను ఇచ్చెను.

తతస్తావంగరాగేణ స్వవర్ణేతరశోభినా ।
సంప్రాప్తాపరభాగేన శుశుభాతేఽనురంజితౌ ॥ 5

తతః - తరువాత, స్వవర్ణ-ఇతరశోభినా - తమ రంగుకంటె భిన్నమైన రంగుతో శోభిల్లునట్టియు, సంప్రాప్త-అపరభాగేన - పొందబడిన పై భాగము గల, అంగరాగేణ - అంగలేపనముచే, అనురంజితౌ - లేపనము చేయబడిన, తౌ - వారిద్దరు, శుశుభాతే - ప్రకాశించిరి.

తరువాత వారిద్దరు తమ దేహముయొక్క రంగుకంటె భిన్నమైన రంగు గల అంగలేపనమును తీసుకొని నాభికి పైభాగమునందు అలదుకొనిరి. దానిచే వారిద్దరు శోభిల్లిరి.

ప్రసన్నో భగవాన్ కుబ్జాం త్రివక్రాం రుచిరాననామ్ ।
ఋజ్వీం కర్తుం మనశ్చక్రే దర్శయన్ దర్శనే ఫలమ్ ॥ 6

ప్రసన్నః - ప్రసన్నుడు, దర్శనే - దర్శనమునందలి, ఫలమ్ - ఫలమును, దర్శయన్ - నిరూపించువాడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, కుబ్జామ్ - గూనిది అయినట్టియు, రుచిర-ఆననామ్ - అందమైన మోము గల, త్రివక్రామ్ - త్రివక్రను, ఋజ్వీమ్ - తిన్నని వ్యక్తిగా, కర్తుమ్ - చేయుటకు, మనః - సంకల్పమును, చక్రే - చేసెను.

ప్రసన్నుడైన శ్రీకృష్ణ భగవానుడు తనను దర్శించినందులకు ఫలమును ఆమెకు చూపదలచెను. గూనిదే అయినను, అందమైన మోము గల ఆమెను తిన్నని వ్యక్తిగా చేయాలని ఆయన సంకల్పించెను.

పద్భ్యామాక్రమ్య ప్రపదే ద్వ్యంగుల్యుత్తానపాణినా ।
ప్రగృహ్య చిబుకేఽధ్యాత్మముదనీనమదచ్యుతః ॥ 7

అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, ప్రపదే - పాదముల కొనలను రెండింటినీ, పద్భ్యామ్ - రెండు పాదములతో, ఆక్రమ్య - తొక్కి నొక్కిపెట్టి, ద్వి-అంగులి-ఉత్తానపాణినా - రెండు వ్రేళ్లు ఎత్తుగానున్న చేతితో, చిబుకే - గెడ్డమునందు, ప్రగృహ్య - గట్టిగా పట్టుకొని, అధ్యాత్మమ్ - దేహమును, ఉదనీనమత్ - పైకి యెత్తెను.

శ్రీకృష్ణ భగవానుడు ఆమె రెండు పాదముల కొనలపై తన పాదములను వేసి నొక్కిపెట్టెను. రెండు వ్రేళ్లను ఎత్తుగా పెట్టి చేతితో ఆమె గెడ్డమును పట్టుకొని శరీరమును పైకి యెత్తెను.

సా తదర్జుసమానాంగీ బృహచ్ఛ్రోణిపయోధరా ।
ముకుందస్పర్శనాత్సద్యో బభూవ ప్రమదోత్తమా ॥ 8

సా - ఆమె, ముకుందస్పర్శనాత్ - శ్రీకృష్ణ భగవాను స్పర్శ వలన, తదా - అప్పుడు, సద్యః - వెంటనే, ఋజుసమాన-అంగీ - తిన్నని సమానమైన దేహము గలది, బృహత్-శ్రోణిపయోధరా - విశాలమైన కటిభాగము వక్షఃస్థలము గలది అగు, ప్రమదా-ఉత్తమా - అందమైన యువతులలో ఉత్తమురాలు, బభూవ - ఆయెను.

ఆమె దేహము శ్రీకృష్ణ భగవానుని స్పర్శచే అప్పుడు వెంటనే తిన్నగా సమానముగా ఆయెను. ఆమె విశాలమైన కటిభాగము, వక్షఃస్థలముతో అందమైన యువతులలో ఉత్తమురాలు ఆయెను.

తతో రూపగుణౌదార్యసంపన్నా ప్రాహ కేశవమ్ ।
ఉత్తరీయాంతమాకృష్య స్మయంతీ జాతహృచ్ఛయా ॥ 9

తతః - తరువాత, రూపగుణ-ఔదార్యసంపన్నా - రూపములు గుణములు ఔదార్యములతో నిండియున్నది, జాతహృచ్ఛయా - పుట్టిన ప్రేమ గలది అగు సైరంధ్రి, స్మయంతీ - చిరునవ్వు నవ్వుచున్నదై, ఉత్తరీయ-అంతమ్ - ఉత్తరీయపు కొంగును, ఆకృష్య - లాగి, కేశవమ్ - శ్రీకృష్ణ భగవానుని ఉద్దేశించి, ప్రాహ - పలికెను.

అప్పుడు రూపము, సద్గుణములు, ఔదార్యములతో నిండియున్న ఆ సైరంధ్రికి హృదయములో ప్రేమ కలిగెను. ఆమె చిరునవ్వుతో శ్రీకృష్ణ భగవానుని ఉత్తరీయపు కొంగును లాగి ఇట్లు పలికెను.

ఏహి వీర గృహం యామో న త్వాం త్యక్తుమిహోత్సహే ।
త్వయోన్మథితచిత్తాయాః ప్రసీద పురుషర్షభ ॥ 10

వీర - ఓ వీరుడా!, ఏహి - రమ్ము, గృహమ్ - ఇంటిని గురించి, యామః - వెళ్లెదము, త్వామ్ - నిన్ను, ఇహ - ఇచట, త్యక్తుమ్ - విడుచుటకు, న ఉత్సహే - సమర్థురాలను కాను, పురుష-ఋషభ - ఓ పురుషశ్రేష్ఠా!, త్వయా - నీచే, ఉన్మథితచిత్తాయాః - చిలికివేయబడిన మనస్సు గల నాకు, ప్రసీద - అనుగ్రహించుము.

ఓ వీరుడా! రమ్ము, ఇంటికి వెళ్లెదము. నిన్ను ఇక్కడనే విడిచిపెట్టుట నా వల్ల కాదు. నీవు నా మనస్సును కలిచివేసితివి. ఓ పురుషశ్రేష్ఠా! నాపై అనుగ్రహమును చూపుము.

ఏవం స్త్రియా యాచ్యమానః కృష్ణో రామస్య పశ్యతః ।
ముఖం వీక్ష్యానుగానాం చ ప్రహసంస్తామువాచ హ ॥ 11

ఏవమ్ - ఈ విధముగా, స్త్రియా - ఆ యువతిచే, యాచ్యమానః - కోరబడుచున్న, కృష్ణః - శ్రీకృష్ణుడు, రామస్య - బలరాముడు, పశ్యతః - చూచుచుండగా, అనుగానామ్ - అనుచరుల, ముఖం చ - ముఖమును కూడ, వీక్ష్య - చూచి, ప్రహసన్ - నవ్వుచున్నవాడై, తామ్ - ఆమెను ఉద్దేశించి, ఉవాచ హ - పలికెను.

ఆ యువతి ఈ విధముగా కోరుచుండ బలరాముడు చూచుచుండెను. శ్రీకృష్ణుడు అనుచరుల ముఖమును చూచి నవ్వుతూ ఆమెతోనిట్లనెను.

ఏష్యామి తే గృహం సుభ్రూః పుంసామాధివికర్శనమ్ ।
సాధితార్థోఽగృహాణాం నః పాంథానాం త్వం పరాయణమ్ ॥ 12

సుభ్రూః - అందమైన కనుబొమలు గలదానా!, సాధిత-అర్థః - సాధించబడిన ప్రయోజనము గలవాడనై, పుంసామ్ - వ్యక్తులకు,

ఆధివికర్శనమ్ - మనోవ్యాధిని కృశింపజేసే, తే - నీ, గృహమ్ - ఇంటిని గూర్చి, ఏష్యామి - రాగలను, అగృహాణామ్ - ఇల్లు లేనట్టియు, పాంథానామ్ - బాటసారులమగు, నః - మాకు, త్వమ్ - నీవు, పరాయణమ్ - గొప్ప ఆశ్రయము.

ఓ సుందరీ! నేను వచ్చిన పని పూర్తి చేసుకొని నీ ఇంటికి వచ్చెదను. వ్యక్తియొక్క మనోవ్యాధిని నీ యిల్లు కృశింపజేయును. మేము ఇల్లు లేని బాటసారులము. మాకు నీవు గొప్ప ఆశ్రయము.

విసృజ్య మాధ్వ్యా వాణ్యా తాం వ్రజన్మార్గే వణిక్పథైః ।
నానోపాయనతాంబూలస్రగ్గంధైస్సాగ్రజోఽర్చితః ॥ 13

మాధ్వ్యా - తియ్యని, వాణ్యా - మాటతో, తామ్ - ఆమెను, విసృజ్య - విడిచిపెట్టి, మార్గే - మార్గమునందు, స-అగ్రజః - అన్నగారితో కూడినవాడై, వ్రజన్ - వెళ్లుచున్న శ్రీకృష్ణుడు, వణిక్-పథైః - బజారువీథియందుండే జనులచే, నానా-ఉపాయనతాంబూలస్రగ్-గంధైః - అనేకములగు బహుమతులు తాంబూలము మాలలు గంధములతో, అర్చితః - పూజించబడినవాడు.

శ్రీకృష్ణుడు తియ్యని మాటను చెప్పి ఆమెను పంపివేసెను. మార్గములో వెళ్లుచున్న ఆయనను, అన్నగారిని బజారు వీథిలోని వర్తకులు బహుమతులు, తాంబూలము, మాలలు, గంధములతో పూజించిరి.

తద్దర్శనస్మరక్షోభాదాత్మానం నావిదన్ స్త్రియః ।
విస్రస్తవాసఃకబరవలయాలేఖ్యమూర్తయః ॥ 14

తద్-దర్శనస్మరక్షోభాత్ - ఆయన దర్శనము వలన కలిగిన అనురాగముయొక్క ఆవేశము వలన, స్త్రియః - యువతులు, ఆత్మానమ్ - దేహమును, న అవిదన్ - ఎరుగకుండిరి, విస్రస్తవాసఃకబరవలయ-ఆలేఖ్యమూర్తయః - జారిన కొంగులు జుట్టుముడులు కంకణములు గలవారు చిత్రపటమునందలి బొమ్మలు వంటివారు.

ఆయన దర్శనము వలన స్త్రీలకు హృదయములో అనురాగావేశముచే దేహస్పృహ లేకుండెను. వారి వస్త్రములు, జుట్టుముడులు, కంకణములు జారిపోయెను. వారు చిత్రపటమునందలి బొమ్మలవలె నిలబడిరి.

తతః పౌరాన్ పృచ్ఛమానో ధనుషః స్థానమచ్యుతః ।
తస్మిన్ ప్రవిష్టో దదృశే ధనురైంద్రమివాద్భుతమ్ ॥ 15

తతః - తరువాత, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, ధనుషః - ధనుర్యాగముయొక్క, స్థానమ్ - చోటును గురించి, పౌరాన్ - పుర జనులను, పృచ్ఛమానః - అడుగుచున్నవాడై, తస్మిన్ - ఆ స్థానమునందు, ప్రవిష్టః - ప్రవేశించినవాడై, ఐంద్రం ఇవ - ఇంద్రధనుస్సు వలె, అద్భుతమ్ - అచ్చెరువును గొలిపే, ధనుః - ధనుస్సును, దదృశే - చూచెను.

తరువాత శ్రీకృష్ణ భగవానుడు ధనుర్యాగము జరుగుచున్న చోటును గురించి పురజనులను అడుగుతూ ఆ చోటికి చేరెను. అచట ఆయనకు ఇంద్రధనుస్సు వలె అచ్చెరువును గొలిపే ధనుస్సు కనబడెను.

పురుషైర్బహుభిర్గుప్తమర్చితం పరమర్ద్ధిమత్ ।
వార్యమాణో నృభిః కృష్ణః ప్రసహ్య ధనురాదదే ॥ 16

బహుభిః - అనేకమంది, పురుషైః - భటులచే, గుప్తమ్ - రక్షించబడినది, అర్చితమ్ - పూజించబడినది, పరమ-ఋద్ధిమత్ - గొప్ప సమృద్ధి (బరువు) గలది అగు, ధనుః - ధనుస్సును, నృభిః - భటులచే, వార్యమాణః - అడ్డుకొనబడుచున్న, కృష్ణః - శ్రీకృష్ణుడు, ప్రసహ్య - బలాత్కారముగా, ఆదదే - తీసుకొనెను.

పూజించబడిన ఆ ధనుస్సును అనేకరక్షకభటులు కాపలా కాయుచుండిరి. బంగరు ఆభరణములచే అలంకరించబడిన ఆ ధనుస్సు గొప్ప సమృద్ధి, బరువు గలది. శ్రీకృష్ణుడు రక్షకభటులు అడ్డుకున్నా బలాత్కారముగా దానిని చేతిలోనికి తీసుకొనెను.

కరేణ వామేన సలీలముద్ధృతం
సజ్యం చ కృత్వా నిమిషేణ పశ్యతామ్ ।

నృణాం వికృష్య ప్రబభంజ మధ్యతో
యథేక్షుదండం మదకర్యురుక్రమః ।। 17

ఉరుక్రమః - గొప్ప పరాక్రమము గల శ్రీకృష్ణుడు, వామేన - ఎడమ, కరేణ - చేతితో, సలీలమ్ - అవలీలగా, ఉద్ధృతమ్ - పైకెత్తబడిన ధనుస్సును, నృణామ్ - భటులు, పశ్యతామ్ - చూచుచుండగా, సజ్యం చ - నారిత్రాడు కలదానినిగా కూడ, కృత్వా - చేసి, నిమిషేణ - రెప్పపాటు కాలముచే, వికృష్య - లాగి, మధ్యతః - మధ్యయందు, మదకరీ - మదించిన ఏనుగు, ఇక్షుదండం యథా - చెరుకు గడను వలె, ప్రబభంజ - విరిచెను.

గొప్ప పరాక్రమము గల శ్రీకృష్ణుడు ఎడమ చేతితో ఆ ధనుస్సును అవలీలగా పైకెత్తి నారిత్రాడును తగిల్చెను. భటులు చూస్తూండగావే రెప్పపాటు కాలములో ఆయన దానిని లాగి, మదించిన ఏనుగు చెరుకు గడను వలె, మధ్యలో విరిచెను.

ధనుషో భజ్యమానస్య శబ్దః ఖం రోదసీ దిశః ।
పూరయామాస యం శ్రుత్వా కంసస్త్రాసముపాగమత్ ।। 18

భజ్యమానస్య - విరువబడుచున్న, ధనుషః - ధనుస్సుయొక్క, శబ్దః - శబ్దము, ఖమ్ - ఆకాశమును, రోదసీ - ద్యులోకభూలోకములను, దిశః - దిక్కులను, పూరయామాస - నింపివేసెను, యమ్ - ఏ ధ్వనిని, శ్రుత్వా - విని, కంసః - కంసుడు, త్రాసమ్ - భయమును, ఉపాగమత్ - పొందెనో.

ఆ ధనుస్సును విరుచుచుండగా బయలుదేరిన శబ్దము ఆకాశమును, ద్యులోకభూలోకములను, దిక్కులను నింపివేసెను. ఆ ధ్వనిని విని కంసుడు హడలిపోయెను.

తద్రక్షిణస్సానుచరాః కుపితా ఆతతాయినః ।
గ్రహీతుకామా ఆవవ్రుర్గృహ్యతాం బధ్యతామితి ।। 19

తద్-రక్షిణః - ఆ ధనుస్సును రక్షించే భటులు, స-అనుచరాః - అనుచరులతో కూడినవారు, కుపితాః - కోపించినవారు, ఆతతాయినః - పట్టుకొనబడిన ఆయుధములు గలవారై, గ్రహీతుకామాః - పట్టుకొనే కోరిక

గలవారై, గృహ్యతామ్ - పట్టుకొనబడు గాక!, బధ్యతామ్ - బంధించబడు గాక!, ఇతి - అని, ఆవవ్రుః - చుట్టుముట్టిరి.

ఆ ధనుస్సును రక్షించే భటులకు, వారి అనుచరులకు కోపము వచ్చెను. వారు ఆయనను పట్టుకొనగోరి ఆయుధములను పట్టుకొని, పట్టుకొనుడు, బంధించుడు, అంటూ ఆయనను చుట్టుముట్టిరి.

అథ తాన్ దురభిప్రాయాన్ విలోక్య బలకేశవౌ ।
క్రుద్ధౌ ధన్వన ఆదాయ శకలే తాంశ్చ జఘ్నతుః ॥ 20

అథ - అప్పుడు, దురభిప్రాయాన్ - తప్పు అభిప్రాయము గల, తాన్ - ఆ భటులను, విలోక్య - చూచి, బలకేశవౌ - బలరాముడు శ్రీకృష్ణ భగవానుడు, క్రుద్ధౌ - కోపించినవారై, ధనుషః - ధనుస్సుయొక్క, శకలే - రెండు ముక్కలను, ఆదాయ - తీసుకొని, తాన్ చ - వారిని కూడ, జఘ్నతుః - కొట్టిరి.

అప్పుడు వారి దుష్టమైన అభిప్రాయమును గ్రహించిన బలరాముడు, శ్రీకృష్ణ భగవానుడు కోపించి ధనుస్సుయొక్క ముక్కలను తీసుకొని, వారిని కూడ బాదిరి.

బలం చ కంసప్రహితం హత్వా శాలాముఖాత్తతః ।
నిష్క్రమ్య చేరతుర్హృష్టౌ నిరీక్ష్య పురసంపదః ॥ 21

కంసప్రహితమ్ - కంసునిచే పంపబడిన, బలం చ - సైన్యమును కూడ, హత్వా - చంపి, తతః - తరువాత, శాలాముఖాత్ - యజ్ఞశాలయొక్క ముఖద్వారమునుండి, నిష్క్రమ్య - బయటకు వచ్చి, పురసంపదః - నగరముయొక్క సమృద్ధులను, నిరీక్ష్య - చూచి, హృష్టౌ - ఆనందించినవారై, చేరతుః - విహరించిరి.

వారు కంసునిచే పంపబడిన సైన్యమును కూడ మట్టుబెట్టిరి. తరువాత అందరు కలిసి యజ్ఞశాల ముఖద్వారమునుండి బయటకు వచ్చి నగరముయొక్క సంపదలను చూసి ఆనందిస్తూ విహరించిరి.

తయోస్తదద్భుతం వీర్యం నిశామ్య పురవాసినః ।
తేజః ప్రాగల్భ్యం రూపం చ మేనిరే విబుధోత్తమౌ ॥ 22

తయోః - వారిద్దరియొక్క, తత్ - ఆ, అద్భుతమ్ - అద్భుతమైన, వీర్యమ్ - పరాక్రమమును, తేజః - తేజస్సును, ప్రాగల్భ్యమ్ - సాహసమును, రూపం చ - రూపమును కూడ, నిశామ్య - చూచి, పురవాసినః - నగరప్రజలు, విబుధ-ఉత్తమౌ - దేవతలలో ఉత్తములనుగా, మేనిరే - తలపోసిరి.

వారిద్దరి ఆ అద్భుతమగు పరాక్రమమును, తేజస్సును, సాహసమును, రూపమును కూడ చూచి నగరప్రజలు వారిని దేవతాశ్రేష్ఠులని తలపోసిరి.

తయోర్విచరతోః స్వైరమాదిత్యోఽస్తముపేయివాన్ ।
కృష్ణరామౌ వృతౌ గోపైః పురాచ్ఛకటమీయతుః ॥ 23

తయోః - వారిద్దరు, స్వైరమ్ - యథేచ్ఛగా, విచరతోః - సంచరించుచుండగా, ఆదిత్యః - సూర్యుడు, అస్తమ్ - అస్తాద్రిని, ఉపేయివాన్ - చేరుకున్నవాడు, కృష్ణరామౌ - శ్రీకృష్ణుడు బలరాముడు, గోపైః - గోపాలకులచే, వృతౌ - చుట్టువారబడినవారై, పురాత్ - నగరమునుండి, శకటమ్ - బళ్లు ఉన్న చోటును, ఈయతుః - చేరుకొనిరి.

ఆ బలరామకృష్ణులీ విధముగా గోపాలకులతో కలిసి యథేచ్ఛగా విహరించుచుండగా సూర్యుడు అస్తమించెను. అపుడు వారు నగరమునుండి బళ్లను ఆపుకున్న ఉద్యానమునకు చేరుకొనిరి.

గోప్యో ముకుందవిగమే విరహాతురా యా
ఆశాసతాశిష ఋతా మధుపుర్యభూవన్ ।
సంపశ్యతాం పురుషభూషణగాత్రలక్ష్మీం
హిత్వేతరాన్ ను భజతశ్చకమేఽయనం శ్రీః ॥ 24

ముకుందవిగమే - శ్రీకృష్ణుని ప్రయాణసమయమునందు, విరహ-ఆతురాః - విరహము వలన పీడను పొందిన, గోప్యః - గోపికలు, యాః - ఏ, ఆశిషః - ఆశీస్సులను, ఆశాసత - పలికిరో అవి, మధుపురి - మథురా నగరమునందు, పురుషభూషణగాత్రలక్ష్మీమ్ - మానవులకే

అలంకారమైన శ్రీకృష్ణుని దేహముయొక్క శోభను, సంపశ్యతామ్ - బాగుగా చూచినవారలకు, ఋతాః - సత్యములు, అభూవన్ - అయినవి, భజతః - సేవించుచున్న, ఇతరాన్ - ఇతరులను, హిత్వా - విడిచిపెట్టి, శ్రీః - లక్ష్మీదేవి, అయనమ్ - ఆశ్రయమునుగా, చకమే ను - కోరెనో గదా!

శ్రీకృష్ణుడు ప్రయాణము చేసిన సమయములో గోకులములోని గోపికలు ఆయన విరహము వలన పీడను పొంది మథురానగరవాసులను గురించి ఆశీస్సులను పలికిరి. మానవులకే అలంకారమైన శ్రీకృష్ణుని దేహశోభను చూచిన మథురా నగరవాసులకు ఆ ఆశీస్సులు సత్యములైనవి. లక్ష్మీదేవి తనను సేవించే ఇంద్రాదులను విడిచిపెట్టి శ్రీకృష్ణుని దేహమునే ఆశ్రయమునుగా కోరెను గదా!

అవనిక్తాంఘ్రియుగలౌ భుక్త్వా క్షీరోపసేచనమ్ ।
ఊషతుస్తాం సుఖం రాత్రిం జ్ఞాత్వా కంసచికీర్షితమ్ ॥ 25

అవనిక్త-అంఘ్రియుగలౌ - కడుగబడిన రెండు కాళ్లు గలవారిద్దరు, క్షీర-ఉపసేచనమ్ - పాలను కలిపిన అన్నమును, భుక్త్వా - తిని, కంస చికీర్షితమ్ - కంసుడు చేయగోరినదానిని, జ్ఞాత్వా - తెలుసుకొని, తామ్ - ఆ, రాత్రిమ్ - రాత్రిని, సుఖమ్ - సుఖముగా, ఊషతుః - నివసించిరి.

వారు రెండు కాళ్లను కడుగుకొని పాలను కలిపిన అన్నమును తినిరి. మరునాడు కంసుడు చేయగోరిన ఉద్యమము గురించి వారికి తెలియును. వారిద్దరు ఆ రాత్రి సుఖముగా విశ్రమించిరి.

కంసస్తు ధనుషో భంగం రక్షిణాం స్వబలస్య చ ।
వధం నిశమ్య గోవిందరామవిక్రీడితం పరమ్ ॥ 26

కంసః తు - కంసుడైతే, ధనుషః - ధనుస్సుయొక్క, భంగమ్ - విరుచుటను గురించి, రక్షిణామ్ - రక్షకభటులయొక్క, స్వబలస్య - తన సైన్యముయొక్క, వధం చ - సంహారమును గురించి కూడ, పరమ్ - కేవలము, గోవిందరామవిక్రీడితమ్ - గోవిందుడు బలరాముల క్రీడను గురించి, నిశమ్య - విని -

గోవింద బలరాములు ధనుస్సును విరుచుటను, రక్షకభటులను తాను పంపిన సైన్యమును కూడ సంహరించుటను, ఈ పనినంతనూ వారు ఒక ఆటవలె చేయుటను గురించి కంసుడైతే వినెను.

దీర్ఘప్రజాగరో భీతో దుర్నిమిత్తాని దుర్మతిః ।
బహూన్యచష్టోభయథా మృత్యోర్దౌత్యకరాణి చ ॥ 27

దీర్ఘప్రజాగరః - చాల సేపు తెలివిగా ఉన్నవాడు, భీతః - భయపడినవాడు, దుర్మతిః - దుర్బుద్ధి అగు కంసుడు, ఉభయథా - జాగ్రత్స్వప్నములనే రెండు ప్రకారములుగా, మృత్యోః - మృత్యుదేవతకు, దౌత్యకరాణి - రాకను సూచించే, బహూని - చాల, దుర్నిమిత్తాని - చెడు శకునములను, అచష్ట - చూచెను.

కంసుడు భయముతో నిద్ర పట్టక చాలసేపు తెలివిగా నుండెను. వానికి తెలివిలో మరియు నిద్రలోని కలలో కూడ అనేకములగు అపశకునములు కనబడి రాబోయే మృత్యువును సూచించెను.

అదర్శనం స్వశిరసః ప్రతిరూపే చ సత్యపి ।
అసత్యపి ద్వితీయే చ ద్వైరూప్యం జ్యోతిషాం తథా ॥ 28

ప్రతిరూపే - ప్రతిబింబము, సతి అపి - ఉన్నప్పుడు కూడ, స్వశిరసః - తన తలయొక్క, అదర్శనమ్ - కనబడకపోవుట, తథా - అదే విధముగా, జ్యోతిషామ్ - ప్రకాశించే చంద్రుడు మొదలగువాటి, ద్వితీయే - రెండవ ప్రతిరూపము, అసతి అపి - లేకున్ననూ, ద్వైరూప్యమ్ - రెండు రూపములుండుట.

ఆతడు అద్దములో చూచినప్పుడు ప్రతిబింబము కనబడునే గాని తన తల కనపడదు. మరియు, వస్తువులు రెండుగా కనబడుటకు కారణమైన కళ్లలోని నీరు మొదలైనవి లేకుండానే, చంద్రుడు మొదలగు జ్యోతిర్మండలములు రెండుగా కనబడెను. (జాగ్రదవస్థలోని అపశకునము).

ఛిద్రప్రతీతిశ్ఛాయాయాం ప్రాణఘోషానుపశ్రుతిః ।
స్వర్ణప్రతీతిర్వృక్షేషు స్వపదానామదర్శనమ్ ॥ 29

ఛాయాయామ్ - నీడయందు, ఛిద్రప్రతీతిః - చిల్లు కనబడుట, ప్రాణఘోష-అనుపశ్రుతిః - ప్రాణముయొక్క శబ్దము వినబడకపోవుట, వృక్షేషు - చెట్లయందు, స్వర్ణప్రతీతిః - బంగరు రంగు కనబడుట, స్వపదానామ్ - తన కాళ్లయొక్క, అదర్శనమ్ - కనకుండుట.

నీడయందు చిల్లు కనబడుట, చెవులను మూసిననూ ప్రాణముయొక్క ఘోష వినబడకపోవుట, చెట్లు బంగరు వర్ణముతో కనబడుట, తన కాళ్లు తనకు కనబడకుండుట (అనే అపశకునములు ఆతనికి జాగ్రదవస్థలో కలిగెను).

స్వప్నే ప్రేతపరిష్వంగః ఖరయానం విషాదనమ్ ।
యాయాన్నలదమాల్యేకస్తైలాభ్యక్తో దిగంబరః ॥ 30

స్వప్నే - కలయందు, ప్రేతపరిష్వంగః - శవమును కౌగిలించుట, ఖరయానమ్ - గాడిదపై ప్రయాణము, విషాదనమ్ - విషమును తినుట, నలదమాలీ - వట్టివేళ్ల మాల గలవాడు, ఏకః - ఒంటరి, తైల-అభ్యక్తః - నూనె పూసిన దేహము గలవాడు, దిగంబరః - వస్త్రములు లేనివాడు, యాయాత్ - వెళ్లును. (స్వప్నములోని అపశకునములు).

ఆతనికి కలలో శవమును కౌగిలించుకున్నట్లు విషమును తిన్నట్లు కనబడెను. ఆతడు కలలో వట్టివేళ్ల మాలను ధరించి దేహమునకు నూనె రాసుకొని వస్త్రములు లేకుండా ఒంటరిగా గాడిదపై పయనించెను.

అన్యాని చేత్థంభూతాని స్వప్నజాగరితాని చ ।
పశ్యన్మరణసంత్రస్తో నిద్రాం లేభే న చింతయా ॥ 31

ఇత్థంభూతాని - ఇటువంటి, స్వప్నజాగరితాని - కలలయందు జాగ్రదవస్థయందు కలిగే, అన్యాని - ఇతరములైన దృశ్యములను, పశ్యన్ - చూచువాడై, మరణసంత్రస్తః - మృత్యువు వలన చాల భయపడినవాడై, చింతయా - బెంగతో, నిద్రామ్ - నిద్రను, న లేభే - పొందలేదు.

ఈ విధముగా జాగ్రదవస్థలో మరియు కలలలో కంసునకు ఇటువంటి అపశకునములు కనబడెను. ఆతనికి తాను మరణిస్తాననే భయము పట్టుకొనెను. బెంగతో ఆతనికి నిద్ర కరువయ్యెను.

వ్యుష్టాయాం నిశి కౌరవ్య సూర్యే చాద్భ్యస్సముత్థితే ।
కారయామాస వై కంసో మల్లక్రీడామహోత్సవమ్ ।। 32

కౌరవ్య - కురువంశీయుడవగు ఓ రాజా!, నిశి - రాత్రి, వ్యుష్టాయామ్ - తెల్లవారగా, సూర్యే చ - సూర్యుడు కూడ, అద్భ్యః - జలములనుండి, సముత్థితే - పైకి రాగా, కంసః వై - కంసుడైతే, మల్లక్రీడామహా-ఉత్సవమ్ - మల్లయుద్ధక్రీడల పెద్ద ఉత్సవమును, కారయామాస - చేయించెను.

కురువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! రాత్రి తెల్లవారెను. సూర్యుడు తూర్పు సముద్రమునుండి పైకి వచ్చెను. ఆనాడు కంసుడు మల్లయుద్ధక్రీడల పెద్ద ఉత్సవమును నడిపించెను.

ఆనర్చుః పురుషా రంగం తూర్యభేర్యశ్చ జఘ్నిరే ।
మంచాశ్చాలంకృతాస్స్రగ్భిః పతాకాచైలతోరణైః ।। 33

పురుషాః - రాజపురుషులు, రంగమ్ - క్రీడాస్థానమును, ఆనర్చుః - అలంకరించిరి, తూర్యభేర్యః చ - వాద్యములను దుందుభులను, జఘ్నిరే - మ్రోగించిరి, మంచాః చ - ఆసనములు కూడ, స్రగ్భిః - మాలలతో, పతాకాచైలతోరణైః - జెండాలు వస్త్రములు మామిడి ఆకుల తోరణములతో, అలంకృతాః - అలంకరించబడినవి.

రాజపురుషులు క్రీడారంగమునలంకరించిరి. వాద్యములను, దుందుభులను మ్రోగించిరి. పుష్పమాలలు, జెండాలు, వస్త్రములు, మామిడాకుల తోరణములతో కూర్చునే ఆసనములను అలంకరించిరి.

తేషు పౌరా జానపదా బ్రహ్మక్షత్రపురోగమాః ।
యథోపజోషం వివిశూ రాజానశ్చ కృతాసనాః ।। 34

తేషు - వాటిపై, పౌరాః - నాగరికులు, జానపదాః - పల్లెలనుండి వచ్చినవారు, బ్రహ్మక్షత్రపురోగమాః - బ్రాహ్మణులు క్షత్రియులు మొదలగువారు, యథా-ఉపజోషమ్ - హాయిగా, వివిశుః - కూర్చుండిరి, రాజానః చ - రాజవంశీయులు కూడ, కృత-ఆసనాః - స్వీకరించబడిన ఆసనములు గలవారు.

వాటిపై నాగరికులు, పల్లెలనుండి వచ్చిన జనులు బ్రాహ్మణులు క్షత్రియులు మొదలైనవారు హాయిగా కూర్చుండిరి. రాజవంశీయులు కూడ ఆసనములను స్వీకరించిరి.

కంసః పరివృతోఽమాత్యై రాజమంచ ఉపావిశత్ ।
మండలేశ్వరమధ్యస్థో హృదయేన విదూయతా ॥ 35

అమాత్యైః - అమాత్యులచే, పరివృతః - చుట్టువారబడినవాడు, మండల-ఈశ్వరమధ్యస్థః - మండలాధిపతుల మధ్యనున్నవాడు అగు, కంసః - కంసుడు, విదూయతా - తాపమును పొందిన, హృదయేన - హృదయముతో, రాజమంచే - రాజసింహాసనముపై, ఉపావిశత్ - కూర్చుండెను.

కంసుడు తాపముతో నిండిన హృదయముతో రాజసింహాసనముపై కూర్చుండెను. ఆతని చుట్టూ అమాత్యులు, మండలాధిపతులు ఉండిరి.

వాద్యమానేషు తూర్యేషు మల్లతాలోత్తరేషు చ ।
మల్లాస్స్వలంకృతా దృప్తాస్సోపాధ్యాయాస్సమావిశన్ ॥ 36

మల్లతాల-ఉత్తరేషు - మల్లుల చరుపులు అధికముగా వినబడుచున్న, తూర్యేషు - వాద్యములు, వాద్యమానేషు - మ్రోగించబడుచుండగా, సు-అలంకృతాః - బాగుగు అలంకరించుకున్నవారు, దృప్తాః - గర్వించినవారు, స-ఉపాధ్యాయాః - గురువులతో కూడినవారు అగు, మల్లాః - మల్లులు, సమావిశన్ - విచ్చేసిరి.

వాద్యములు మ్రోగించబడుచుండెను. కాని, మల్లుల చరుపులే బిగ్గరగా వినబడుచుండెను. గర్వించిన మల్లులు బాగా అలంకరించుకొని తమ గురువులతో బాటు విచ్చేసిరి.

చాణూరో ముష్టికః కూటశ్శలస్తోశల ఏవ చ ।
తే ఆసేదురుపస్థానం వల్గువాద్యప్రహర్షితాః ॥ 37

చాణూరః - చాణూరుడు, ముష్టికః - ముష్టికుడు, కూటః - కూటుడు, శలః - శలుడు, తోశలః ఏవ చ - తోశలుడు కూడ, వల్గువాద్యప్రహర్షితాః -

మధురమైన వాద్యములచే గొప్ప హర్షమును పొందిన, తే - వారు, ఉపస్థానమ్ - మల్లక్రీడయొక్క స్థానమును, ఆసేదుః - చేరుకొనిరి.

చాణూరుడు, ముష్టికుడు, కూటుడు, శలుడు, తోశలుడు మొదలైన మల్లులకు వాద్యముల ధ్వని మనోహరముగానుండి ఉత్సాహమును వర్ధిల్లజేసెను. వారు మల్లరంగమును చేరిరి.

నందగోపాదయో గోపా భోజరాజసమాహుతాః ।
నివేదితోపాయనాస్తే ఏకస్మిన్మంచ ఆవిశన్ ॥ 38

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ద్విచత్వారింశోఽధ్యాయః ॥

భోజరాజసమాహుతాః - భోజరాజగు కంసునిచే ఆహ్వానించబడినవారు, నివేదిత-ఉపాయనాః - సమర్పించబడిన బహుమానములు గలవారు అగు, తే - ఆ, నందగోప-ఆదయః - గోపాలకుడగు నందుడు మొదలుగా గల, గోపాః - గోపాలకులు, ఏకస్మిన్ - ఒక, మంచే - విశాలమగు ఆసనముపై, ఆవిశన్ - కూర్చుండిరి.

నందగోపుడు, సునందుడు మొదలగు గోపాలకులు భోజరాజగు కంసుని ఆహ్వానముపై వచ్చిరి. వారు తాము తెచ్చిన బహుమానములను కంసునకు సమర్పించిరి. వారందరు ఒకే పెద్ద ఆసనముపై కూర్చుండిరి.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో శ్రీకృష్ణుడు
కుబ్జను అనుగ్రహించి ధనుర్భంగమును చేయుటను వర్ణించే
నలుబది రెండవ అధ్యాయము ముగిసినది (42).

* * * * *

# అథ త్రిచత్వారింశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు కువలయాపీడమునుద్ధరించి మల్లరంగములో ప్రవేశించుట

శ్రీశుక ఉవాచ ।
అథ కృష్ణశ్చ రామశ్చ కృతశౌచౌ పరంతప ।
మల్లదుందుభినిర్ఘోషం శ్రుత్వా ద్రష్టుముపేయతుః ॥ 1

పరంతప - శత్రువులను తపింపజేయు ఓ రాజా!, అథ - తరువాత, కృష్ణః చ - శ్రీకృష్ణుడు, రామః చ - బలరాముడు కూడ, కృతశౌచౌ - చేయబడిన స్నానాదికము గలవారై, మల్లదుందుభినిర్ఘోషమ్ - మల్లులయొక్క మరియు దుందుభుల ధ్వనిని, శ్రుత్వా - విని, ద్రష్టుమ్ - చూచుటకు, ఉపేయతుః - విచ్చేసిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శత్రువులను తపింపజేసే ఓ రాజా! తరువాత బలరాముడు శ్రీకృష్ణుడు స్నానాదికమును ముగించిరి. వారు మల్లుల ధ్వనులను, దుందుభుల ధ్వనులను విని, చూచుటకై విచ్చేసిరి.

రంగద్వారం సమాసాద్య తస్మిన్నాగమవస్థితమ్ ।
అపశ్యత్కువలయాపీడం కృష్ణోఽంబష్ఠప్రచోదితమ్ ॥ 2

కృష్ణః - శ్రీకృష్ణుడు, రంగద్వారమ్ - మల్లరంగపు ద్వారమును, సమాసాద్య - సమీపించి, తస్మిన్ - దాని వద్ద, అవస్థితమ్ - ఉన్నట్టియు, అంబష్ఠప్రచోదితమ్ - మావటివానిచే నియంత్రించబడే, కువలయాపీడమ్ - కువలయాపీడమనే, నాగమ్ - ఏనుగును, అపశ్యత్ - చూచెను.

శ్రీకృష్ణుడు మల్లరంగముయొక్క ద్వారమును సమీపించి అక్కడ కువలయాపీడమనే ఏనుగును చూచెను. అది మావటీనిచే నియంత్రించబడెను.

బద్ధ్వా పరికరం శౌరిస్సముహ్య కుటిలాలకాన్ ।
ఉవాచ హస్తిపం వాచా మేఘనాదగభీరయా ॥ 3

శౌరిః - శూరవంశోద్భవుడగు శ్రీకృష్ణుడు, పరికరమ్ - నడుముకట్టును, బద్ధ్వా - బిగించి, కుటిల-అలకాన్ - గిరజాల ముంగురులను, సముహ్య - కలిపి కట్టి, మేఘనాదగభీరయా - మేఘగర్జనవలె గంభీరమైన, వాచా - వాక్కుతో, హస్తిపమ్ - మావటీనిని ఉద్దేశించి, ఉవాచ - పలికెను.

శూరవంశోద్భవుడగు శ్రీకృష్ణుడు నడుము కట్టును బిగించి గిరజాల ముంగురులను కలిపి కట్టెను. ఆయన మేఘగర్జన వలె గంభీరమైన వాక్కుతో మావటీనితో నిట్లనెను.

అంబష్ఠాంబష్ఠ మార్గం నౌ దేహ్యపక్రమ్య మా చిరమ్ ।
నో చేత్సకుంజరం త్వాఽద్య నయామి యమసాదనమ్ ॥ 4

అంబష్ఠ - ఓ మావటీ!, అంబష్ఠ - ఓ మావటీ!, మా చిరమ్ - విలంబము లేకుండా, అపక్రమ్య - ప్రక్కకు తొలగి, నౌ - మాకిద్దరికి, మార్గమ్ - దారిని, దేహి - ఇమ్ము, నో చేత్ - లేనిచో, సకుంజరమ్ - ఏనుగుతో కూడియున్న, త్వా - నిన్ను, అద్య - ఈనాడు, యమసాదనమ్ - యముని భవనమును గురించి, నయామి - పంపించెదను.

ఓ మావటీ! ఓ మావటీ! విలంబము లేకుండా ప్రక్కకు జరిగి మా ఇద్దరికి దారిమ్ము. లేనిచో, నిన్నీ నాడు ఏనుగుతో సహా యమపురికి పంపెదను.

ఏవం నిర్భర్త్సితోఽంబష్ఠః కుపితః కోపితం గజమ్ ।
చోదయామాస కృష్ణాయ కాలాంతకయమోపమమ్ ॥ 5

ఏవమ్ - ఈ విధముగా, నిర్భర్త్సితః - అదలించబడిన, అంబష్ఠః - మావటివాడు, కుపితః - కోపించినవాడై, కోపితమ్ - కోపము వచ్చునట్లు చేయబడినట్టియు, కాల-అంతకయమ-ఉపమమ్ - కాలముచే జనులను అంతము చేసే యముని పోలియున్న, గజమ్ - ఏనుగును, కృష్ణాయ - శ్రీకృష్ణుని కొరకు, చోదయామాస - తోలెను.

ఈ విధముగా శ్రీకృష్ణుడు అదలించగా, మావటివానికి కోపము వచ్చెను. ఆతడు (అంకుశముతో పొడిచి) ఏనుగునకు కోపము వచ్చునట్లు చేసెను. అది కాలముచే ప్రాణుల ఆయుర్దాయమును హరించే యముని పోలియుండెను. దానిని ఆతడు కృష్ణుని పైకి తోలెను.

కరీంద్రస్తమభిద్రుత్య కరేణ తరసాఽగ్రహీత్ ।
కరాద్విగలితస్సోఽముం నిహత్యాంఘ్రిష్వలీయత ॥ 6

కరి-ఇంద్రః - ఆ గజేంద్రము, తమ్ - ఆ శ్రీకృష్ణుని, అభిద్రుత్య - అభిముఖముగా పరుగెత్తి, తరసా - వేగముతో, కరేణ - తొండముతో, అగ్రహీత్ - పట్టుకొనెను, సః - ఆయన, అముమ్ - దీనిని, నిహత్య - కొట్టి, కరాత్ - తొండమునుండి, విగలితః - విడిపించుకున్నవాడై, అంఘ్రిషు - పాదముల వద్ద, అలీయత - కానరాలేదు.

ఆ గజేంద్రము ఆ శ్రీకృష్ణునకు అభిముఖముగా పరుగెత్తి తొండముతో వేగముగా ఆయనను పట్టుకొనెను. ఆయన దానిని పిడికిలితో కొట్టి తొండమునుండి విడిపించుకొని, కాళ్ల మధ్య దూరి దానికి కానరాకుండెను.

సంక్రుద్ధస్తమచక్షాణో ఘ్రాణదృష్టిస్స కేశవమ్ ।
పరామృశత్పుష్కరేణ స ప్రసహ్య వినిర్గతః ॥ 7

సంక్రుద్ధః - బాగా కోపించినది, ఘ్రాణదృష్టిః - ముక్కుతో పసిగట్టునది అగు, సః - ఆ ఏనుగు, తమ్ - ఆ, కేశవమ్ - శ్రీకృష్ణ భగవానుని, అచక్షాణః - చూడనిదై, పుష్కరేణ - తొండముతో, పరామృశత్ - వెదికి పట్టుకొనెను, సః - ఆయన, ప్రసహ్య - బలాత్కారముగా, వినిర్గతః - విడిపించుకొనెను.

బాగా కోపించిన ఆ ఏనుగు ఆ శ్రీకృష్ణ భగవానుని కంటితో చూడలేకపోయినా, ముక్కుతో పసిగట్టి తొండముతో వెదికి పట్టుకొనెను. ఆయన బలముగా దాని పట్టునుండి తప్పించుకొనెను.

పుచ్ఛే ప్రగృహ్యాతిబలం ధనుషః పంచవింశతిమ్ ।
విచకర్ష యథా నాగం సుపర్ణ ఇవ లీలయా ॥ 8

అతిబలమ్ - ఎక్కువ బలము గల ఆ ఏనుగును, పుచ్ఛే - తోకయందు, ప్రగృహ్య - గట్టిగా పట్టుకొని, ధనుషః - ధనుస్సుయొక్క, పంచవింశతిమ్ - ఇరవై అయిదును, లీలయా - అవలీలగా, సుపర్ణః - గరుడుడు, నాగం ఇవ - పామును వలె, యథా - ఉన్నదానిని ఉన్నట్లుగా, విచకర్ష - లాగెను.

మహాబలశాలియగు ఆ ఏనుగును శ్రీకృష్ణుడు తోక పట్టుకొని, గరుడుడు సర్పమును వలె, అవలీలగా ఉన్నదానిని ఉన్నట్లుగా ఇరవై ఐదు ధనుస్సుల (వంద బారల) దూరమును లాగివేసెను.

స పర్యావర్తమానేన సవ్యదక్షిణతోఽచ్యుతః ।
బభ్రామ భ్రామ్యమాణేన గోవత్సేనేవ బాలకః ॥ 9

సః - ఆ, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, సవ్యదక్షిణతః - ఎడమ కుడి వైపులకు, పర్యావర్తమానేన - తిరుగుచున్న ఏనుగుతో, భ్రామ్యమాణేన - తిరుగునట్లు చేయబడుచున్న, గోవత్సేన - ఆవుదూడతో, బాలకః ఇవ - పిల్లవాడు వలె, బభ్రామ - తిరిగెను.

ఆ ఏనుగు కుడి యెడమలకు తిరుగుచుండగా ఆ శ్రీకృష్ణ భగవానుడు కూడ, చుట్టూ తిరుగుచున్న దూడ తోక పట్టుకున్న పిల్లవాడు (ఒకప్పటి బాలకృష్ణుడు) వలె, ఎడమ కుడివైపులకు తిరిగెను.

తతోఽభిముఖమభ్యేత్య పాణినాఽఽహత్య వారణమ్ ।
ప్రాద్రవన్ పాతయామాస స్పృశ్యమానః పదే పదే ॥ 10

తతః - తరువాత, అభిముఖమ్ - ఎదురుగా, అభ్యేత్య - వచ్చి, వారణమ్ - ఏనుగును, పాణినా - చేతితో, ఆహత్య - కొట్టి, పదే పదే - ప్రతి అడుగునందు, స్పృశ్యమానః - స్పృశించబడుచున్నవాడై, ప్రాద్రవన్ - గట్టిగా చుట్టూ పరుగెత్తువాడై, పాతయామాస - పడగొట్టెను.

తరువాత ఆయన ఆ ఏనుగునకు ఎదురుగా వచ్చి చేతితో కొట్టి చుట్టూ గట్టిగా పరుగెత్తుతూ, అది వేసే ప్రతి అడుగునందు తాను దానికి దొరికిపోయినాడా యన్నట్లు కనబడుతూ, దానినే పడగొట్టెను.

స ధావన్ క్రీడయా భూమౌ పతిత్వా సహసోత్థితః ।
తం మత్వా పతితం క్రుద్ధో దంతాభ్యాం సోఽహనత్ క్షితిమ్ ॥ 11

ధావన్ - పరుగెత్తుచున్న, సః - ఆయన, భూమౌ - నేలపై, పతిత్వా - పడి, సహసా - వెంటనే, ఉత్థితః - లేచి నిలబడినవాడు, తమ్ - ఆయనను, పతితమ్ - పడినవానినిగా, మత్వా - తలచి, క్రుద్ధః - కోపించిన, సః - ఆ ఏనుగు, దంతాభ్యామ్ - రెండు దంతములతో, క్షితిమ్ - నేలను, అహనత్ - పొడిచెను.

ఆయన పరుగెత్తుతూ నేలపై పడెను. కోపించియున్న ఆ ఏనుగు ఆయన పడి ఉన్నాడనే తలచి రెండు దంతములతో పొడిచెను. కాని, ఆయన ముందు క్షణమే లేచి తప్పించుకొనుటచే దెబ్బ నేలకు తగిలెను.

స్వవిక్రమే ప్రతిహతే కుంజరేంద్రోఽత్యమర్షితః ।
చోద్యమానో మహామాత్రైః కృష్ణమభ్యద్రవద్రుషా ॥ 12

కుంజర-ఇంద్రః - గజేంద్రము, స్వవిక్రమే - తన పరాక్రమము, ప్రతిహతే - మొక్కవోగా, అతి-అమర్షితః - అధికమగు కోపమును పొందినదై, మహామాత్రైః - మావటివాండ్రచే, చోద్యమానః - రెచ్చగొట్టబడుచున్నదై, రుషా - కోపముతో, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, అభ్యద్రవత్ - అభిముఖముగా పరుగెత్తెను.

ఆ గజేంద్రముయొక్క పరాక్రమము వ్యర్థము కాగా, దానికి చాల కోపము వచ్చెను. పైగా, మావటీండ్రు దానిని రెచ్చగొట్టుచుండిరి. అప్పుడది కోపముతో శ్రీకృష్ణునకభిముఖముగా పరుగెత్తెను.

తమాపతంతమాసాద్య భగవాన్మధుసూదనః ।
నిగృహ్య పాణినా హస్తం పాతయామాస భూతలే ॥ 13

ఆపతంతమ్ - మీదకు ఉరుకుచున్న, తమ్ - ఆ ఏనుగును, ఆసాద్య - సమీపించి, మధుసూదనః - మధువును సంహరించిన, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, పాణినా - చేతితో, హస్తమ్ - తొండమును, నిగృహ్య - గట్టిగా పట్టుకొని, భూతలే - నేలపై, పాతయామాస - పడవేసెను.

మధువు అనే రాక్షసుని సంహరించిన శ్రీకృష్ణ భగవానుడు మీదకు ఉరుకుచున్న ఆ ఏనుగును సమీపించి, దాని తొండమును చేతితో గట్టిగా పట్టుకొని నేలపై పడవేసెను.

పతితస్య పదాఽఽక్రమ్య మృగేంద్ర ఇవ లీలయా ।
దంతముత్పాట్య తేనేభం హస్తిపాంశ్చాహనద్ధరిః ॥ 14

హరిః - శ్రీకృష్ణ భగవానుడు, మృగ-ఇంద్రః ఇవ - సింహము వలె, లీలయా - అవలీలగా, పదా - కాలితో, ఆక్రమ్య - తొక్కిపెట్టి, పతితస్య - క్రింద పడిన ఏనుగుయొక్క, దంతమ్ - దంతమును, ఉత్పాట్య - ఊడబెరకి, తేన - దానితో, ఇభమ్ - ఏనుగును, హస్తిపాన్ చ - మావటి వాళ్లను కూడ, అహనత్ - సంహరించెను.

శ్రీకృష్ణ భగవానుడు సింహము వలె అవలీలగా, క్రింద పడిన ఆ ఏనుగుయొక్క దంతమునూడబెరకి దానితో ఏనుగును, మావటీంద్రను కూడ సంహరించెను.

మృతకం ద్విపముత్సృజ్య దంతపాణిస్సమావిశత్ ।
అంసన్యస్తవిషాణోఽసృఙ్మదబిందుభిరంకితః ।
విరూఢస్వేదకణికావదనాంబురుహో బభౌ ॥ 15

మృతకమ్ - మరణించిన, ద్విపమ్ - ఏనుగును, ఉత్సృజ్య - విడిచిపెట్టి, దంతపాణిః - దంతము చేతియందు గల శ్రీకృష్ణుడు, సమావిశత్ - ప్రవేశించెను, అంసన్యస్తవిషాణః - భుజముపై పెట్టబడిన దంతము గలవాడు, అసృక్-మదబిందుభిః - రక్తము మదముల బిందువులతో, అంకితః - డాగులు పడినవాడు, విరూఢస్వేదకణికావదన-అంబురుహః - వెలికి వచ్చుచున్న చెమట బిందువులు గల పద్మమువంటి ముఖము గలవాడు, బభౌ - ప్రకాశించెను.

శ్రీకృష్ణుడు మరణించిన ఏనుగును విడిచిపెట్టి చేతిలో దంతముతో మల్లరంగమును ప్రవేశించి దంతమును భుజముపై నుంచెను. ఆయన శరీరముపై ఏనుగు మదము, రక్తము డాగులు పడెను. పద్మమువంటి ముఖముపై మొలకెత్తుచున్న చెమట బిందువులతో ఆయన శోభిల్లెను.

వృతౌ గోపైః కతిపయైర్బలదేవజనార్దనౌ ।
రంగం వివిశతూ రాజన్ గజదంతవరాయుధౌ ।। 16

రాజన్ - ఓ రాజా!, కతిపయైః - కొందరు, గోపైః - గోపాలకులచే, వృతౌ - చుట్టువారబడినవారు, గజదంతవర-ఆయుధౌ - గొప్ప ఏనుగు దంతమే ఆయుధములుగా గలవారు అగు, బలదేవజన-అర్దనౌ - బలదేవుడు దుష్టజనశిక్షకుడగు శ్రీకృష్ణ భగవానుడు, రంగమ్ - మల్లరంగమును, వివిశతుః - ప్రవేశించిరి.

ఓ పరీక్షిన్మహారాజా! బలదేవుడు, దుష్టజనశిక్షకుడగు శ్రీకృష్ణ భగవానుడు శ్రేష్ఠమగు ఏనుగు దంతమే ఆయుధము కాగా, మల్లరంగ మును ప్రవేశించిరి. కొద్దిమంది గోపాలకులు వారిని చుట్టువారి యుండిరి.

మల్లానామశనిర్నృణాం నరవరః స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం క్షితిభుజాం శాస్తా స్వపిత్రోశ్శిశుః ।
మృత్యుర్భోజపతేర్విరాడవిదుషాం తత్త్వం పరం యోగినాం
వృష్ణీనాం పరదేవతేతి విదితో రంగం గతస్సాగ్రజః ।। 17

మల్లానామ్ - మల్లులకు, అశనిః - పిడుగు, నృణామ్ - జనులకు, నరవరః - గొప్ప మనిషి, స్త్రీణామ్ - యువతులకు, మూర్తిమాన్ - రూపు దాల్చిన, స్మరః - మన్మథుడు, గోపానామ్ - గోపాలకులకు, స్వజనః - తమవాడు, అసతామ్ - దుష్టులైన, క్షితిభుజామ్ - రాజులకు, శాస్తా - శిక్షించువాడు, స్వపిత్రోః - తన తల్లిదండ్రులకు, శిశుః - పిల్లవాడు, భోజపతేః - భోజప్రభువగు కంసునకు, మృత్యుః - మరణము, అవిదుషామ్ - అజ్ఞానులకు, విరాట్ - ప్రాకృతమానవుడు, యోగినామ్ - జ్ఞానులకు, పరం తత్త్వమ్ - పరమాత్మతత్త్వము, వృష్ణీనామ్ - యాదవులకు, పరదేవతా - గొప్ప దైవము, ఇతి - అని, విదితః - తెలియబడిన శ్రీకృష్ణుడు, స-అగ్రజః - అన్నగారితో కూడినవాడై, రంగమ్ - మల్లరంగమును గురించి, గతః - వెళ్లినవాడు.

శ్రీకృష్ణుని మల్లులు పిడుగని, సామాన్యజనులు గొప్ప మనిషియని, యువతులు రూపు దాల్చిన మన్మథుడని, గోపాలకులు తమ వాడని,

దుష్టులైన రాజులు తమను శిక్షించువాడని, తల్లిదండ్రులు పిల్లవాడని, భోజరాజగు కంసుడు మృత్యువని, అజ్ఞానులు ప్రాకృతమానవుడని, యోగులు పరమాత్మతత్త్వమని భావించెడివారు. ఆయన అన్నగారితో కలిసి మల్లరంగమును ప్రవేశించెను.

హతం కువలయాపీడం దృష్ట్వా తావపి దుర్జయౌ ।
కంసో మనస్వ్యపి తదా భృశముద్వివిజే నృప ।। 18

నృప - ఓ రాజా!, హతమ్ - సంహరించబడిన, కువలయాపీడమ్ - కువలయాపీడమును, దుర్జయౌ - జయించ శక్యము కాని, తౌ అపి - వారిద్దరిని కూడ, దృష్ట్వా - చూచి, కంసః - కంసుడు, మనస్వీ అపి - ధైర్యశాలియే అయిననూ, భృశమ్ - మిక్కిలి, ఉద్వివిజే - ఉద్విగ్నుడాయెను.

ఓ పరీక్షిన్మహారాజా! కంసుడు ధైర్యశాలియే. అయినా, కువలయాపీడమును సంహరించి జయింప శక్యము కాకుండా నిలబడి యున్న వారిద్దరిని చూచి ఆతడు అధికమైన ఉద్వేగమును పొందెను.

తౌ రేజతూ రంగగతౌ మహాభుజౌ విచిత్రవేషాభరణస్రగంబరౌ ।
యథా నటావుత్తమవేషధారిణౌ మనః క్షిపంతౌ ప్రభయా నిరీక్షతామ్ ।।

రంగగతౌ - మల్లరంగమును చేరినవారు, మహాభుజౌ - గొప్ప భుజశక్తి గలవారు, విచిత్రవేష-ఆభరణస్రగ్-అంబరౌ - రంగు రంగుల వేషముల ఆభరణములు పుష్పమాలలు వస్త్రములు గలవారు అగు, తౌ - వారిద్దరు, ఉత్తమవేషధారిణౌ - గొప్ప వేషమును వేసుకున్న, నటౌ యథా - నటులు వలె, నిరీక్షతామ్ - చూచువారల, మనః - మనస్సును, ప్రభయా - కాంతితో, క్షిపంతౌ - దోచువారై, రేజతుః - ప్రకాశించిరి. 19

గొప్ప భుజశక్తి గల వారిద్దరు మల్లరంగమును చేరి గొప్ప వేషము వేసుకున్న నటులు వలె ప్రకాశించిరి. వారు రంగు రంగుల వేషములను, ఆభరణములను, పుష్పమాలలను, వస్త్రములను ధరించిరి. వారు తమ కాంతిచే చూచువారల మనస్సును దోచివేయుచుండిరి.

నిరీక్ష్య తావుత్తమపూరుషౌ జనా మంచస్థితా నాగరరాష్ట్రకా నృప ।
ప్రహర్షవేగోత్కలితేక్షణాననాః పపుర్న తృప్తా నయనైస్తదాననమ్ ।। 20

నృప - ఓ రాజా!, మంచస్థితాః - ఆసనములపైనున్న, నాగరరాష్ట్రికాః - నగరమునకు దేశమునకు చెందిన, జనాః - జనులు, ఉత్తమపూరుషౌ - పురుషోత్తములైన, తౌ - వారిద్దరిని, నిరీక్ష్య - చూచి, ప్రహర్షవేగ-ఉత్కలిత-ఈక్షణ-ఆననాః - ఆనందముయొక్క వేగముచే విప్పారిన కన్నులు ముఖములు గలవారై, నయనైః - కళ్లతో, తద్-ఆననమ్ - వారిద్దరి ముఖమును, పపుః - త్రాగిరి, న తృప్తాః - తృప్తిని జెందనివారు.

ఓ పరీక్షిన్మహారాజా! నగరమునుండి పల్లెలనుండి వచ్చి ఆసనములపై కూర్చున్న జనులు ఆ పురుషోత్తములిద్దరిని చూచి మహానందమును పొందిరి. వారి కన్నులు, ముఖములు విప్పారెను. వారు వారిద్దరి ముఖమును కళ్లతోనే పానము చేసిరి. అయిననూ, వారికి తృప్తి కాలేదు.

పిబంత ఇవ చక్షుర్భ్యాం లిహంత ఇవ జిహ్వయా ।
జిఘ్రంత ఇవ నాసాభ్యాం శ్లిష్యంత ఇవ బాహుభిః ॥ 21

చక్షుర్భ్యామ్ - రెండు కళ్లతో, పిబంతః ఇవ - త్రాగుచున్నారా యన్నట్లు, జిహ్వయా - నాలుకతో, లిహంతః ఇవ - ఆస్వాదించుచున్నారా యన్నట్లు, నాసాభ్యామ్ - రెండు ముక్కు పుటములతో, జిఘ్రంతః ఇవ - ఆఘ్రాణించుచున్నారా యన్నట్లు, బాహుభిః - చేతులతో, శ్లిష్యంతః ఇవ - కౌగిలించుచున్నారా యన్నట్లు (ఉండిరి).

జనులు వారిద్దరిని కళ్లతో త్రాగుచున్నారా యన్నట్లు, నాలుకతో ఆస్వాదించుచున్నారా యన్నట్లు, ముక్కు పుటములతో ఆఘ్రాణించుచున్నారా యన్నట్లు, చేతులతో కౌగిలించుచున్నారా యన్నట్లు చూచిరి.

ఊచుః పరస్పరం తే వై యథాదృష్టం యథాశ్రుతమ్ ।
తద్రూపగుణమాధుర్యప్రాగల్భ్యస్మారితా ఇవ ॥ 22

తద్-రూపగుణమాధుర్యప్రాగల్భ్యస్మారితాః ఇవ - వారిద్దరి రూపము సద్గుణములు మాధుర్యము నిర్భయత్వము (నైపుణ్యము) లచే గుర్తు చేయబడినారా యన్నట్లున్న, తే వై - ఆ జనులైతే, యథాదృష్టమ్ -

చూసినదానికి తగ్గట్లుగా, యథాశ్రుతమ్ - విన్నదానికి తగ్గట్లుగా, పరస్పరమ్ - ఒకరితోనొకరు, ఊచుః - చెప్పిరి.

వారిద్దరి రూపమును, సద్గుణములను, మాధుర్యమును, నిర్భయత్వమును, నైపుణ్యమును చూచి జనులకు వారి లీలలు గుర్తుకు వచ్చినట్లుండెను. జనులు వారిద్దరి గురించి తాము చూచిన (ధనుర్భంగాది) దానిని, విన్న (గోవర్ధనోద్ధరణాది) దానిని ఒకరితోనొకరు చెప్పిరి.

ఏతౌ భగవతస్సాక్షాద్ధరేర్నారాయణస్య హి ।
అవతీర్ణావిహాంశేన వసుదేవస్య వేశ్మని ॥ 23

ఏతౌ - వీరిద్దరు, సాక్షాత్ - సాక్షాత్తుగా, హరేః - దుఃఖములను పోగొట్టే, భగవతః నారాయణస్య - నారాయణ భగవానుని, అంశేన - అంశ (స్వరూపము) చే, ఇహ - ఈ లోకమునందు, వసుదేవస్య - వసుదేవుని, వేశ్మని - ఇంటియందు, అవతీర్ణౌ హి - అవతరించినవారు సుమా!

దుఃఖములను పోగొట్టే నారాయణ భగవానుడే సాక్షాత్తుగా ఈ లోకములో వీరిద్దరి రూపములో వసుదేవుని ఇంటియందు తన అంశ (స్వరూపము) చే అవతరించెను సుమా!

ఏష వై కిల దేవక్యాం జాతో నీతశ్చ గోకులమ్ ।
కాలమేతం వసన్ గూఢో వవృధే నందవేశ్మని ॥ 24

ఏషః వై - ఈ శ్రీకృష్ణుడైతే, దేవక్యామ్ - దేవకియందు, జాతః కిల - పుట్టినవాడట, గోకులమ్ - గోకులమును గురించి, నీతః చ - తీసుకుపోబడినవాడు, ఏతమ్ - ఈ, కాలమ్ - కాలమును, గూఢః - తెలియబడనివాడై, నందవేశ్మని - నందుని ఇంటియందు, వసన్ - నివసించువాడై, వవృధే - పెరిగి పెద్ద ఆయెను.

ఈ శ్రీకృష్ణుడైతే దేవకికి పుట్టినవాడు. ఈతనిని వసుదేవుడు గోకులమునకు కొనిపోయెను. అచట నందుని ఇంట్లో ఈతడు ఇంత కాలము రహస్యముగా ఉంటూ పెరిగి పెద్దవాడాయెను.

పూతనాఽనేన నీతాఽంతం చక్రవాతశ్చ దానవః ।
అర్జునౌ గుహ్యకః కేశీ ధేనుకోఽన్యే చ తద్విధాః ॥ 25

అనేన - వీనిచే, పూతనా - పూతన, అంతమ్ - అంతమును, నీతా - పొందించబడినది, చక్రవాతః - సుడిగాలి రూపములోనున్న, దానవః చ - రాక్షసుడు కూడ, అర్జునౌ - జంట మద్ది చెట్లు, గుహ్యకః - శంఖచూడుడు, కేశీ - కేశి, ధేనుకః - ధేనుకుడు, తద్-విధాః - అట్టి ప్రవృత్తి గల, అన్యే చ - ఇతరులు కూడ.

పూతన, సుడిగాలి రూపము గల తృణావర్తుడు, శంఖచూడుడు, కేశి, ధేనుకుడు, ఇంకా ఇట్టి రాక్షసప్రవృత్తి గల ఇతరులు (అఘాసురుడు ఇత్యాదులు) ఈతనిచే వధించబడిరి. ఈతడు జంట మద్ది చెట్లను నేల గూల్చెను.

గావస్సపాలా ఏతేన దావాగ్నేః పరిమోచితాః ।
కాలియో దమితస్సర్ప ఇంద్రశ్చ విమదః కృతః ॥ 26

ఏతేన - ఈతనిచే, గావః - గోవులు, సపాలాః - రక్షకుడు గలవి, దావ-అగ్నేః - కార్చిచ్చునుండి, పరిమోచితాః - విడిపించబడినవి, కాలియః - కాలియుడనే, సర్పః - సర్పము, దమితః - పొగరు అణచబడినది, ఇంద్రః చ - ఇంద్రుడు కూడ, విమదః - గర్వము లేనివాడుగా, కృతః - చేయబడినవాడు.

ఈతడు గోవులకు రక్షకుడు. ఈతడు వాటిని కార్చిచ్చునుండి కాపాడినాడు. ఈతడు కాలియసర్పముయొక్క పొగరును అణచినాడు. ఈతడు ఇంద్రునకు కూడ గర్వభంగమును చేసినాడు.

సప్తాహమేకహస్తేన ధృతోఽద్రిప్రవరోఽమునా ।
వర్షవాతాశనిభ్యశ్చ పరిత్రాతం చ గోకులమ్ ॥ 27

అమునా - వీనిచే, అద్రిప్రవరః - పర్వతములలో గొప్పది, సప్త-అహమ్ - ఏడు దినములు నిరంతరముగా, ఏకహస్తేన - ఒకే చేతితో, ధృతః - మోయబడినది, గోకులం చ - గోకులము కూడ, వర్షవాత-అశనిభ్యః చ - వర్షము గాలి పిడుగులనుండి కూడ, పరిత్రాతమ్ - కాపాడబడినది.

ఈతడు పెద్ద కొండను ఏడు రోజులు నిరంతరముగా ఒక్క చేతితో ఎత్తి పట్టుకొని గోకులమును వర్షము, సుడిగాలి, పిడుగులనుండి కాపాడెను.

గోప్యోఽస్య నిత్యముదితహసితప్రేక్షణం ముఖమ్ ।
పశ్యంత్యో వివిధాంస్తాపాంస్తరంతి స్మాశ్రమం ముదా ॥ 28

గోప్యః - గోపికలు, అస్య - వీని, నిత్యముదితహసితప్రేక్షణమ్ - ఎల్లప్పుడు ఆనందము చిరునవ్వులతో కూడిన చూపులు గల, ముఖమ్ - ముఖమును, పశ్యంత్యః - చూచుచున్నవారై, వివిధాన్ - పలు రకముల, తాపాన్ - దుఃఖములను, అశ్రమమ్ - శ్రమ లేనట్లుగా, ముదా - ఆనందముతో, తరంతి స్మ - అధిగమించిరి.

ఈతని ముఖముపై ఆనందము, చిరునవ్వుతో కూడిన చూపులు ఎల్లవేళలా ఉండును. గోపికలు ఈతని ముఖమును చూస్తూ పలు రకముల దుఃఖములను శ్రమ లేకుండా ఆనందముతో అధిగమించిరి.

వదంత్యనేన వంశోఽయం యదోస్సుబహువిశ్రుతః ।
శ్రియం యశో మహత్త్వం చ లప్స్యతే పరిరక్షితః ॥ 29

అనేన - వీనిచే, పరిరక్షితః - అన్ని విధములుగా రక్షించబడే, అయమ్ - ఈ, యదోః - యదువుయొక్క, వంశః - వంశము, సుబహువిశ్రుతః - చాల ఎక్కువ ప్రసిద్ధి గలది, శ్రియమ్ - సంపదను, యశః - కీర్తిని, మహత్త్వం చ - గొప్పదనమును కూడ, లప్స్యతే - పొందగలదని, వదంతి - చెప్పెదరు.

ఈతడు యదువంశమును అన్ని విధములుగా రక్షించుననియు, వీని వలన చాల గొప్ప ప్రసిద్ధి గల ఆ వంశము సంపదను, కీర్తిని, గొప్పదనమును కూడ పొందగలదని పెద్దలు చెప్పుచున్నారు.

అయం చాస్యాగ్రజశ్శ్రీమాన్ రామః కమలలోచనః ।
ప్రలంబో నిహతో యేన వత్సకో యే బకాదయః ॥ 30

అయం చ - ఈతడైతే, అస్య - ఈ శ్రీకృష్ణుని, అగ్రజః - అన్న, శ్రీమాన్ - శోభ గలవాడు, రామః - బలరాముడు, కమలలోచనః - పద్మమువంటి కన్నులు గలవాడు, యేన - ఎవనిచే, ప్రలంబః - ప్రలంబుడు, నిహతః -

సంహరించబడినాడో, వత్సకః - వత్సాసురుడు, బక-ఆదయః - బకాసురుడు మొదలుగా గల, యే - ఏ రాక్షసులు గలరో.

పద్మమువంటి కన్నులతో శోభిల్లే ఈతడు ఈ శ్రీకృష్ణుని అన్నయగు బలరాముడు. ప్రలంబుడు, వత్సాసురుడు, బకుడు, ధేనుకుడు మొదలైన రాక్షసులను ఈతడు సంహరించెను.

జనేష్వేవం బ్రువాణేషు తూర్యేషు నినదత్సు చ ।
కృష్ణరామౌ సమాభాష్య చాణూరో వాక్యమబ్రవీత్ ॥ 31

జనేషు - జనులు, ఏవమ్ - ఈ విధముగా, బ్రువాణేషు - చెప్పుకొనుచుండగా, తూర్యేషు చ - వాద్యములు కూడ, నినదత్సు - శబ్దమును చేయుచుండగా, కృష్ణరామౌ - శ్రీకృష్ణ బలరాములను, సమాభాష్య - సంబోధించి, చాణూరః - చాణూరుడు, వాక్యమ్ - మాటను, అబ్రవీత్ - పలికెను.

జనులు ఇట్లు చెప్పుకొనుచుండిరి. వాద్యములు మ్రోగుచుండెను. అప్పుడు శ్రీకృష్ణ బలరాములను సంబోధించి చాణూరుడిట్లు పలికెను.

హే నందసూనో హే రామ భవంతౌ వీరసంమతౌ ।
నియుద్ధకుశలౌ శ్రుత్వా రాజ్ఞాఽఽహూతౌ దిదృక్షుణా ॥ 32

హే నందసూనో - ఓ నందుని పుత్రుడా!, హే రామ - ఓ బలరామా!, భవంతౌ - మీరిద్దరు, వీరసంమతౌ - వీరులని పేరు వడసినవారు (వీరులచే ఆదరించబడినవారు), నియుద్ధకుశలౌ - మల్లయుద్ధములో నేర్పరులు అని, శ్రుత్వా - విని, దిదృక్షుణా - చూడగోరిన, రాజ్ఞా - కంసప్రభునిచే, ఆహూతౌ - ఆహ్వానించబడినవారు.

నందుని పుత్రుడవగు ఓ శ్రీకృష్ణా! ఓ బలరామా! మీరిద్దరు వీరులని పేరు వడసినవారు, వీరులచే సమ్మానించబడువారు. మీరు మల్ల యుద్ధములో నిపుణులని విని కంసప్రభుడు చూడగోరి ఆహ్వానించినాడు.

ప్రియం రాజ్ఞః ప్రకుర్వంత్యః శ్రేయో విందంతి వై ప్రజాః ।
మనసా కర్మణా వాచా విపరీతమతోఽన్యథా ॥ 33

రాజ్ఞః - రాజునకు, మనసా - మనస్సుతో, వాచా - వాక్కుతో, కర్మణా - కర్మతో, ప్రియమ్ - ప్రీతిని, ప్రకుర్వంత్యః - కలిగించే, ప్రజాః - ప్రజలు, వై - నిశ్చయముగా, శ్రేయః - శ్రేయస్సును, విందంతి - పొందెదరు, అతః - దీనికంటె, అన్యథా - భిన్నముగా, విపరీతమ్ - విరుద్ధము.

రాజునకు మనోవాక్కాయములతో ప్రీతిని కలిగించే జనులు నిశ్చయముగా శ్రేయస్సును పొందెదరు. దీనికి విరుద్ధముగా ఆచరించువారు హానిని పొందెదరు.

నిత్యం ప్రముదితా గోపా వత్సపాలా యథా స్ఫుటమ్ ।
వనేషు మల్లయుద్ధేన క్రీడంతశ్చారయంతి గాః ।। 34

వత్సపాలాః - దూడలను కాచే, గోపాః - గోపాలకులు, ప్రముదితాః - చాల ఆనందముగా నుండువారు, వనేషు - అడవులయందు, నిత్యమ్ - ప్రతిదినము, మల్లయుద్ధేన - మల్లయుద్ధముతో, క్రీడంతః - ఆడుకొనుచున్నవారై, గాః - గోవులను, చారయంతి - మేపెదరు, యథా - ఇది యెట్లో అట్లు, స్ఫుటమ్ - ప్రసిద్ధము.

గోపాలకులు దూడలను కాయుదురు. వారు ఆనందముగా జీవించెదరు. వారు అడవులలో ప్రతిదినము గోవులను మేపుతూ మల్లయుద్ధమును ఆటగా ఆడెదరు. ఈ విషయము అందరికీ తెలిసినదే.

తస్మాద్రాజ్ఞః ప్రియం యూయం వయం చ కరవామ హే ।
భూతాని నః ప్రసీదంతి సర్వభూతమయో నృపః ।। 35

హే - ఓయీ!, తస్మాత్ - అందువలన, యూయమ్ - మీరు, వయం చ - మేము కూడ, రాజ్ఞః - రాజునకు, ప్రియమ్ - ప్రీతిని, కరవామ - చేసెదము, భూతాని - ప్రాణులు, నః - మనకొరకు, ప్రసీదంతి - ప్రసన్నములగును, నృపః - రాజు, సర్వభూతమయః - సకలప్రాణిరూపుడు.

ఓయీ! కాబట్టి మీరు మేము కూడ రాజునకు ప్రీతిని కలిగించెదము. అట్లు చేసినచో, రాజు (సకలప్రాణిరక్షకుడు) సకలప్రాణిరూపుడు గనుక, సకలప్రాణులు మన యెడల ప్రసన్నములగును.

తన్నిశమ్యాబ్రవీత్కృష్ణో దేశకాలోచితం వచః ।
నియుద్ధమాత్మనోఽభీష్టం మన్యమానోఽభినంద్య చ ॥ 36

తత్ - ఆ మాటను, నిశమ్య - విని, నియుద్ధమ్ - మల్లయుద్ధమును, ఆత్మనః - తనకు, అభీష్టమ్ - అభీష్టమునుగా, మన్యమానః - తలపోయుచున్న, కృష్ణః - శ్రీకృష్ణుడు, అభినంద్య చ - అనుమోదించి, దేశకాల-ఉచితమ్ - దేశకాలములకు తగిన, వచః - మాటను, అబ్రవీత్ - పలికెను.

ఆ మాటను విని శ్రీకృష్ణుడు మల్లయుద్ధము తమకు కూడ అభీష్టమేనని తలపోసెను. ఆయన వానికి తన అనుమోదమును తెలిపి దేశకాలములకు తగిన మాటను ఇట్లు పలికెను.

ప్రజా భోజపతేరస్య వయం చాపి వనేచరాః ।
కరవామ ప్రియం నిత్యం తన్నః పరమనుగ్రహః ॥ 37

వనేచరాః - అడవులలో తిరిగే, వయం చ అపి - మేము కూడ, భోజపతేః - భోజదేశప్రభువగు, అస్య - వీనియొక్క, ప్రజాః - ప్రజలము, నిత్యమ్ - ఎల్లవేళలా, ప్రియమ్ - ప్రియమును, కరవామ - చేసెదము గాక!, తత్ - అది, నః - మా కొరకు, పరమ్ - గొప్ప, అనుగ్రహః - అనుగ్రహము.

అడవులలో తిరిగే మేము కూడ భోజదేశప్రభువగు ఈ కంసుని ప్రజలమే. కావున, మేము ఎల్లవేళలా వీనికి ప్రియమును చేసెదము. పైగా, అట్లు రాజునకు ప్రీతిని కలిగించుట మాకు గొప్ప అనుగ్రహము. (మేము రాజునకు ప్రియమగు మల్లయుద్ధమును నిత్యము అడవిలో చేయుట మాపై ఈశ్వరుని గొప్ప అనుగ్రహమే).

బాలా వయం తుల్యబలైః క్రీడిష్యామో యథోచితమ్ ।
భవేన్నియుద్ధం మాఽధర్మస్స్పృశేన్మల్ల సభాసదః ॥ 38

మల్ల - ఓ మల్లుడా!, వయమ్ - మేము, బాలాః - పిల్లలము, తుల్యబలైః - సమానమైన బలము గలవారితో, యథా-ఉచితమ్ - ఔచిత్యమునతిక్రమించకుండా, క్రీడిష్యామః - క్రీడించగలము, సభాసదః -

సభాసదులను, అధర్మః - అధర్మము, మా స్పృశేత్ - స్పృశించరాదు, నియుద్ధమ్ - మల్లయుద్ధము, భవేత్ - జరుగవలెను.

ఓ మల్లా! మేము పిల్లలము. కాబట్టి ఔచిత్యమునతిక్రమించకుండా మాతో సమానమైన బలము గలవారితో మేము మల్లయుద్ధక్రీడను చేయగలము. సభాసదులకు అధర్మము (అన్యాయమును చూచుట) అంటుకోనివిధముగా మల్లయుద్ధము జరుగవలెను.

చాణూర ఉవాచ ।
న బాలో న కిశోరస్త్వం బలశ్చ బలినాం వరః ।
లీలయేభో హతో యేన సహస్రద్విపసత్త్వభృత్ ।। 39

త్వమ్ - నీవు, బాలః - బాలుడవు, న - కావు, కిశోరః - పిల్లవాడవు, న - కావు, బలః చ - బలరాముడు కూడ, బలినామ్ - బలవంతులలో, వరః - శ్రేష్ఠుడవు, యేన - ఏ నీచే, సహస్రద్విపసత్త్వభృత్ - వేయి ఏనుగుల బలమును కలిగియున్న, ఇభః - ఏనుగు, లీలయా - అవలీలగా, హతః - చంపబడినదో.

చాణూరుడిట్లు పలికెను --- నీవు, బలరాముడు పాలు త్రాగే పిల్లలు కాదు, వీధిలో ఆటలాడే పిల్లలు కాదు. మీరిద్దరు బలవంతులలో శ్రేష్ఠులు. వేయి ఏనుగుల బలము గల కువలయాపీడమును నీవు అవలీలగా చంపితివి.

తస్మాద్భవద్భ్యాం బలిభిర్యోద్ధవ్యం నానయోఽత్ర వై ।
మయి విక్రమ వార్ష్ణేయ బలేన సహ ముష్టికః ।। 40

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే త్రిచత్వారింశోఽధ్యాయః ।।

తస్మాత్ - కావున, బలిభిః - బలశాలురగు, భవద్భ్యామ్ - మీ యిద్దరిచే, యోద్ధవ్యమ్ - యుద్ధము చేయబడవలెను, అత్ర - దీనియందు, వై - నిశ్చయముగా, అనయః - అన్యాయ్యము, న - లేదు, వార్ష్ణేయ - వృష్ణివంశీయుడవగు ఓ కృష్ణా!, మయి - నాపై, విక్రమ - పరాక్రమించుము, ముష్టికః - ముష్టికుడు, బలేన సహ - బలరామునితో గూడి.

కావున, బలశాలురగు మీరిద్దరు మల్లయుద్ధమును చేయవలెను. దీనిలో నిశ్చయముగా అన్యాయము లేదు. వృష్ణివంశీయుడవగు ఓ కృష్ణా! నీ పరాక్రమమును నాపై చూపుము. ముష్టికుడు బలరామునితో యుద్ధమును చేయగలడు.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో శ్రీకృష్ణుడు కువలయాపీడమునుద్ధరించి మల్లరంగములో ప్రవేశించుటను వర్ణించే నలుబది మూడవ అధ్యాయము ముగిసినది (43).



# అథ చతుశ్చత్వారింశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు చాణూరాదులను కంసుని సంహరించి ఉద్ధరించుట

శ్రీశుక ఉవాచ ।
ఏవం చర్చితసంకల్పో భగవాన్మధుసూదనః ।
ఆససాదాథ చాణూరం ముష్టికం రోహిణీసుతః ॥ 1

అథ - అప్పుడు, ఏవమ్ - ఈ విధముగా, చర్చితసంకల్పః - నిశ్చయించబడిన సంకల్పము గలవాడు, మధుసూదనః - మధువును సంహరించినవాడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, చాణూరమ్ - చాణూరుని, రోహిణీసుతః - రోహిణియొక్క పుత్రుడగు బలరాముడు, ముష్టికమ్ - ముష్టికుని, ఆససాద - ఎదుర్కొనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- మధువును మట్టుబెట్టిన శ్రీకృష్ణ భగవానుడీ విధముగా చర్చించి నిశ్చితమగు సంకల్పమునకు వచ్చెను. ఆయన చాణూరుని, రోహిణి పుత్రుడగు బలరాముడు ముష్టికుని ఎదుర్కొనిరి.

హస్తాభ్యాం హస్తయోర్బద్ధ్వా పద్భ్యామేవ చ పాదయోః ।
విచకర్షతురన్యోన్యం ప్రసహ్య విజిగీషయా ॥ 2

విజిగీషయా - నెగ్గాలనే కోరికతో, అన్యోన్యమ్ - ఒకరిని మరియొకరు, హస్తాభ్యామ్ - చేతులతో, హస్తయోః - చేతులయందు, పద్భ్యాం ఏవ చ - కాళ్లతో కూడ, పాదయోః - కాళ్లయందు, బద్ధ్వా - బంధించి, ప్రసహ్య - బలముగా, విచకర్షతుః - పట్టి లాగిరి.

వారు (మల్లక్రీడలో) నెగ్గాలనే కోరికతో ఒకరిని మరియొకరు చేతులతో చేతులను, కాళ్లతో కాళ్లను కూడ బంధించి బలముగా పట్టి లాగిరి.

అరత్నీ ద్వే అరత్నిభ్యాం జానుభ్యాం చైవ జానునీ ।
శిరశ్శీర్ష్ణోరసోరస్తావన్యోన్యమభిజఘ్నతుః ॥ 3

తౌ - వారిద్దరు, అన్యోన్యమ్ - ఒకరిని మరియొకరు, ద్వే - రెండు, అరత్నీ - మోచేతులను, అరత్నిభ్యామ్ - మోచేతులతో, జానునీ చ ఏవ - మోకాళ్లను కూడ, జానుభ్యామ్ - మోకాళ్లతో, శిరః - తలను, శీర్ష్ణా - తలతో, ఉరః - వక్షఃస్థలమును, ఉరసా - వక్షఃస్థలముతో, అభిజఘ్నతుః - కొట్టుకొనిరి.

వారిద్దరు (శ్రీకృష్ణ-చాణూరులు, బలరామ-ముష్టికులు) ఒకరినొకరు మోచేతులను మోచేతులతో, మోకాళ్లను మోకాళ్లతో, తలను తలతో, వక్షఃస్థలమును కూడ వక్షఃస్థలముతో కొట్టుకొనిరి.

పరిభ్రామణవిక్షేపపరిరంభావపాతనైః ।
ఉత్సర్పణాపసర్పణైశ్చాన్యోన్యం ప్రత్యరుంధతామ్ ॥ 4

పరిభ్రామణవిక్షేపపరిరంభ-అవపాతనైః - గిరగిర త్రిప్పుట త్రోసివేయుట కౌగిలిలో బిగించుట క్రింద పడద్రోయుటలచే, ఉత్సర్పణ-అపసర్పణైః చ - ముందుకు దుముకుట వెనుకకు తగ్గుటలచే కూడ, అన్యోన్యమ్ - ఒకరిని మరియొకరు, ప్రత్యరుంధతామ్ - అడ్డుకొనిరి.

ఒకరిని మరియొకరు పట్టి గిర గిర త్రిప్పుట, త్రోసివేయుట, కౌగిలిలో బిగించుట, క్రింద పడద్రోయుట, ముందుకు దుముకుట, వెనుకకు తగ్గుట మొదలగు విన్యాసములతో ఒకరి ఉద్యమమును మరియొకరు అడ్డుకొనిరి.

ఉత్థాపనైరున్నయనైశ్చాలనైః స్థాపనైరపి ।
పరస్పరం జిగీషంతావపచక్రతురాత్మనః ॥ 5

పరస్పరమ్ - ఒకరినొకరు, జిగీషంతౌ - జయించగోరే వారు, ఉత్థాపనైః - ముద్దగా చేసి పైకి యెత్తుటలచే, ఉన్నయనైః - చేతులను పట్టి పైకెత్తుటలచే, చాలనైః - విదలించుకొనుటలచే, స్థాపనైః అపి - నేలపై నొక్కి ఉంచుటలచే కూడ, ఆత్మనః - దేహమునకు, అపచక్రతుః - పీడను కలిగించుకొనిరి.

వారు ఒకరినొకరు జయించగోరి ప్రతిస్పర్ధి దేహమును ముద్దగా చేసి పైకెత్తుట, చేతులను పట్టి పైకెత్తుట, విదలించి కొట్టుట, నేలపై నొక్కి ఉంచుట మొదలైన విన్యాసములతో, ఒకరి దేహమునకు మరియొకరు పీడను కలిగించిరి.

తద్బలాబలవద్యుద్ధం సమేతాస్సర్వయోషితః ।
ఊచుః పరస్పరం రాజన్ సానుకంపా వరూథశః ॥ 6

రాజన్ - ఓ రాజా!, వరూథశః - గుంపులుగా, సమేతాః - కలిసివచ్చిన, సర్వయోషితః - అందరు స్త్రీలు, స-అనుకంపాః - దయతో కూడినవారై, పరస్పరమ్ - ఒకరితో నొకరు, తత్ - ఆ, యుద్ధమ్ - యుద్ధమును, బల-అబలవత్ - బలవంతులు బలహీనులు గలదిగా, ఊచుః - చెప్పిరి.

ఓ పరీక్షిన్మహారాజా! స్త్రీలందరు గుంపులుగా కలిసివచ్చిరి. వారా యుద్ధమును చూసి దయ గలవారై, ఇది బలహీనులకు బలవంతులతో జరిగే యుద్ధము, అని ఒకరితోనొకరు చెప్పుకొనిరి.

మహానయం బతాధర్మ ఏషాం రాజసభాసదామ్ ।
యే బలాబలవద్యుద్ధం రాజ్ఞోఽన్విచ్ఛంతి పశ్యతః ॥ 7

బత - అయ్యో!, ఏషామ్ - ఈ, రాజసభాసదామ్ - రాజుయొక్క సభలోని జనులకు, అయమ్ - ఇది, మహాన్ - పెద్ద, అధర్మః - అధర్మము, యే - ఎవరైతే, రాజ్ఞః - రాజు, పశ్యతః - చూచుచుండగా, బల-అబలవత్ - బలవంతులు బలహీనులు గల, యుద్ధమ్ - యుద్ధమును, అన్విచ్ఛంతి - అనుమోదించుచున్నారో.

అయ్యో! రాజుయొక్క సభలోని జనులకు ఇది పెద్ద అధర్మము. ఎందుకంటే, వారు రాజు చూచుచుండగనే (రాజునను సరించి) బలహీనులగు పిల్లలకు బలవంతులగు మల్లులతో జరుగుచున్న యుద్ధమునను మోదించుచున్నారు.

క్వ వజ్రసారసర్వాంగౌ మల్లౌ శైలేంద్రసన్నిభౌ ।
క్వ చాతిసుకుమారాంగౌ కిశోరౌ నాప్తయౌవనౌ ॥ 8

వజ్రసారసర్వ-అంగౌ - వజ్రముయొక్క చేవ గల సకలములైన అవయవములు గలవారు, శైల-ఇంద్రసన్నిభౌ - గొప్ప పర్వతమును పోలినవారు అగు, మల్లౌ - మల్లులు, క్వ - ఎక్కడ?, అతిసుకుమార-అంగౌ - మిక్కిలి సుకుమారమైన దేహములు గలవారు, న-ఆప్తయౌవనౌ - రాని యౌవనము గలవారు, కిశోరౌ - ఆడుకునే పిల్లలు, క్వ చ - ఎక్కడ?

అవయవములన్నింటియందు వజ్రముయొక్క చేవ కలిగి గొప్ప పర్వతమును పోలిన మల్లులెక్కడ? మిక్కిలి సుకుమారమైన దేహములు గల ఇంకా యౌవనము రాని ఆడుకునే పిల్లలెక్కడ? (పోలిక లేదు).

ధర్మవ్యతిక్రమో హ్యస్య సమాజస్య ధ్రువం భవేత్ ।
యత్రాధర్మస్సముత్తిష్ఠేన్న స్థేయం తత్ర కర్హిచిత్ ॥ 9

అస్య - ఈ, సమాజస్య - సభకు, ధ్రువమ్ - నిశ్చయముగా, ధర్మవ్యతిక్రమః - ధర్మమునతిక్రమించుట, భవేత్ హి - కలుగును గదా!, యత్ర - ఎక్కడనైతే, అధర్మః - అధర్మము, సముత్తిష్ఠేత్ - బలపడునో, తత్ర - అక్కడ, కర్హిచిత్ - ఎక్కడనైననూ, న స్థేయమ్ - ఉండబడరాదు.

ఈ సభాసదులకు నిశ్చయముగా ధర్మమునుల్లంఘించిన పాపము కలుగును. ఎక్కడనైతే అధర్మము బలపడునో, ఆ స్థానము ఏదైనా, అచట ఉండరాదు.

న సభాం ప్రవిశేత్ప్రాజ్ఞస్సభ్యదోషాననుస్మరన్ ।
అబ్రువన్ విబ్రువన్నజ్ఞో నరః కిల్బిషమశ్నుతే ॥ 10

సభ్యదోషాన్ - సభ్యుల దోషములను, అనుస్మరన్ - తెలుసుకున్న, ప్రాజ్ఞః - బుద్ధిమంతుడు, సభామ్ - సభను, న ప్రవిశేత్ - ప్రవేశించరాదు, అబ్రువన్ - చెప్పనివాడు, విబ్రువన్ - తప్పును చెప్పువాడు, అజ్ఞః - తెలియదని చెప్పువాడు, నరః - మానవుడు, కిల్బిషమ్ - పాపమును, అశ్నుతే - పొందును.

సభ్యులలోని దోషము గురించి తెలిసిన బుద్ధిమంతుడగు వ్యక్తి ఆ సభకు పోరాదు. ఎందుకంటే, అక్కడకు వెళ్లిన వ్యక్తి సత్యము తెలిసి

చెప్పకున్నా, తప్పుగా చెప్పినా, తెలిసి నాకు తెలియదని చెప్పినా కూడ పాపమును పొందును.

వల్గతశ్శత్రుమభితః కృష్ణస్య వదనాంబుజమ్ ।
వీక్ష్యతాం శ్రమవార్యుప్తం పద్మకోశమివాంబుభిః ॥ 11

శత్రుమ్ - శత్రువగు చాణూరుని, అభితః - చుట్టూ, వల్గతః - పరుగెత్తుచున్న, కృష్ణస్య - శ్రీకృష్ణుని, శ్రమవారి-ఉప్తమ్ - చెమట బిందువులతో వ్యాప్తమైనట్టియు, అంబుభిః - నీటి బిందువులతో కూడిన, పద్మకోశం ఇవ - పద్మపు మొగ్గవంటి, వదన-అంబుజమ్ - పద్మమువంటి ముఖము, వీక్ష్యతామ్ - చూడబడుగాక!

శత్రువగు చాణూరుని చుట్టూ పరుగెత్తుచున్న శ్రీకృష్ణుని పద్మమువంటి ముఖమును చూడుడు. చెమట బిందువులతో నిండిన ఆ ముఖము నీటి బిందువులతో కూడిన పద్మపు మొగ్గను పోలియున్నది.

కిం న పశ్యత రామస్య ముఖమాతామ్రలోచనమ్ ।
ముష్టికం ప్రతి సామర్షం హాససంరంభశోభితమ్ ॥ 12

రామస్య - బలరాముని, ఆతామ్రలోచనమ్ - కొంచెము ఎర్రనైన కళ్లు కలిగినట్టియు, ముష్టికం ప్రతి - ముష్టికుని గురించి, స-అమర్షమ్ - కోపముతో కూడిన, హాససంరంభశోభితమ్ - నవ్వుయొక్క వేగముచే శోభిల్లిన, ముఖమ్ - ముఖమును, కిం న పశ్యత - చూచుట లేదా?

బలరాముని ముఖము కొంచెము ఎర్రనైన కళ్లతో, ముష్టికుని యెడల కోపముతో, నవ్వుయొక్క వేగముతో శోభిల్లుచున్నది. మీకు కనబడ లేదా?

పుణ్యా బత వ్రజభువో యదయం నృలింగ-
గూఢః పురాణపురుషో వనచిత్రమాల్యః ।
గాః పాలయన్ సహబలః క్వణయంశ్చ వేణుం
విక్రీడయాఽంచతి గిరిత్రరమార్చితాంఘ్రిః ॥ 13

బత - ఆహా!, వ్రజభువః - గోకులమునందలి చోటులు, పుణ్యాః - పవిత్రములు, యత్ - ఏలయన, నృలింగగూఢః - మానవుడనే వేషముచే

రహస్యముగానున్న, అయమ్ - ఈ, గిరిత్రరమా-అర్చిత-అంఘ్రిః - కైలాసాధిపతియగు శివునిచే లక్ష్మీదేవిచే పూజించబడే పాదములు గల, పురాణపురుషః - పురుషోత్తముడు, వనచిత్రమాల్యః - అడవియందలి రంగు రంగుల పూల మాల గలవాడై, సహబలః - బలరామునితో గూడినవాడై, గాః - గోవులను, పాలయన్ - కాయుచున్నవాడు, వేణుం చ - వేణువును కూడ, క్వణయన్ - వాయించువాడు, విక్రీడయా - పలురకముల ఆటతో, అంచతి - విహరించును.

ఆహా! గోకులమునందలి స్థానములు పావనములు. ఎందుకంటే, కైలాసాధిపతియగు శివునిచే మరియు లక్ష్మీదేవిచే ఆరాధించబడే పాదములు గల ఈ పురుషోత్తముడు మనుష్యవేషముతో ఎవరికీ తెలియకుండా అచట సంచరించును. బలరాముడు తోడు కాగా, ఈయన అడవియందలి రంగు రంగుల పూల మాలను దాల్చి, గోవులను కాపలా కాస్తూ, వేణువును వాయిస్తూ, వివిధక్రీడలతో విహరించును.

గోప్యస్తపః కిమచరన్ యదముష్య రూపం
లావణ్యసారమసమోర్ధ్వమనన్యసిద్ధమ్ ।
దృగ్భిః పిబంత్యనుసవాభినవం దురాపం
ఏకాంతధామ యశసశ్శ్రియ ఐశ్వరస్య ॥ 14

గోప్యః - గోపికలు, కిమ్ - ఏమి, తపః - తపస్సును, అచరన్ - చేసిరో? యత్ - దేని వలన, అముష్య - ఈ శ్రీకృష్ణునియొక్క, లావణ్యసారమ్ - లావణ్యముయొక్క సారమైనట్టియు, అసమ-ఊర్ధ్వమ్ - సమానము గొప్పది లేనట్టియు, అనన్యసిద్ధమ్ - ఇతరములగు ఆభరణాదులచే సిద్ధించనట్టియు, అనుసవ-అభినవమ్ - ప్రతి క్షణము నూతనమైనట్టియు, దురాపమ్ - పొంద శక్యము కానట్టియు, యశసః - కీర్తికి, శ్రియః - శోభకు, ఐశ్వరస్య - ఈశ్వరభావమునకు, ఏకాంతధామ - ఒకే ఒక స్థానమైన, రూపమ్ - రూపమును, దృగ్భిః - కన్నులతో, పిబంతి - త్రాగెదరో.

గోపికలు ఏమి తపస్సును చేసిరో? ఎందుకంటే, వారు ఈ శ్రీకృష్ణుని లావణ్యముయొక్క సారమైన ముఖమును కన్నులతో పానము చేసెదరు. ప్రతి క్షణము నూతనమైన ఈ రూపముతో సమానమైనది గాని, గొప్పది

గాని మరియొకటి లేదు. పొంద శక్యము కాని ఈ రూపము ఇతరములగు ఆభరణాదులచే సిద్ధించేది కాదు. ఈ రూపము కీర్తికి, శోభకు, ఈశ్వరభావమునకు ఏకైకనిత్యనివాసస్థానము.

యా దోహనేఽవహననే మథనోపలేప-
ప్రేంఖేంఖనార్భరుదితోక్షణమార్జనాదౌ ।
గాయంతి చైనమనురక్తధియోఽశ్రుకంఠ్యో
ధన్యా వ్రజస్త్రియ ఉరుక్రమచిత్తయానాః ॥ 15

అనురక్తధియః - ప్రేమతో నిండిన బుద్ధి గలవారు, ధన్యాః - ధన్యులు, ఉరుక్రమచిత్తయానాః - శ్రీహరియందలి చిత్తముతో పనులను చేసుకొనే, యాః - ఏ గోపికలు, దోహనే - పాలను పితుకుటయందు, అవహననే - ధాన్యమును దంపుటయందు, మథన-ఉపలేపప్రేంఖ-ఈంఖన-అర్భరుదిత -ఉక్షణమార్జన-ఆదౌ - పెరుగును చిలుకుట నీళ్లు చల్లుట ఉయ్యాలనూపుట ఏడ్చే పిల్లవానిని సముదాయించుట మొక్కలకు నీళ్లను పోయుట ఇంటిని తుడుచుట మొదలగుదానియందు, అశ్రుకంఠ్యః - కన్నీరుతో బొంగురువోయిన కంఠములు గలవారై, ఏనం చ - ఈ శ్రీకృష్ణుని గురించియే, గాయంతి - గానము చేయుదురో.

గోపికలు ధన్యలు. వారి బుద్ధి ఈ శ్రీకృష్ణునిపై ప్రేమతో నిండినది. పాదములతో ముల్లోకములను కొలిచిన ఈ భగవానుని తలపు వారి కళ్లకు నీటిని, కంఠమునకు డగ్గుత్తికను కలిగించును. పనులను చేసుకునేటప్పుడు కూడ వారి మనస్సు ఆయనమీదనే లగ్నమై యుండును. పాలను పితుకుట, ధాన్యమును దంపుట, పెరుగు చిలుకుట, నీళ్లు చల్లుట, ఉయ్యాలనూపుట, ఏడ్చే పిల్లవానిని సముదాయించుట, (ఆ పిల్లలకు స్నానము చేయించుట), మొక్కలకు నీళ్లను పోయుట, ఇంటిని తుడుచుట, స్నానమును చేయుట మొదలగు పనులను చేసుకుంటూ వారు ఈ శ్రీకృష్ణుని లీలలను గానము చేయుదురు.

ప్రాతర్వ్రజాద్వ్రజత ఆవిశతశ్చ సాయం
గోభిస్సమం క్వణయతోఽస్య నిశమ్య వేణుమ్ ।

నిర్గమ్య తూర్ణమబలాః పథి భూరిపుణ్యాః
పశ్యంతి సస్మితముఖం సదయాఽవలోకమ్ ॥ 16

గోభిః సమమ్ - గోవులతో బాటుగా, ప్రాతః - ఉదయము, వ్రజాత్ - గోకులమునుండి, వ్రజతః - వెళ్లునట్టియు, సాయం చ - సాయంకాలము, ఆవిశతః - తిరిగి వచ్చునట్టియు, క్వణయతః - వేణువును వాయించే, అస్య - వీనియొక్క, వేణుమ్ - వేణువును, నిశమ్య - విని, తూర్ణమ్ - వెంటనే, నిర్గమ్య - బయటకు వచ్చి, భూరిపుణ్యాః - గొప్ప పుణ్యము గల, అబలాః - యువతులు, పథి - మార్గమునందు, సస్మితముఖమ్ - చిరునవ్వుతో కూడిన ముఖము కలిగినట్టియు, సదయా-అవలోకమ్ - దయతో కూడిన చూపులు గల శ్రీకృష్ణుని, పశ్యంతి - చూచెదరు.

ఈతడు గోవులతో బాటుగా ఉదయమే గోకులమునుండి అడవికి వెళ్లి సాయంకాలమగుసరికి వేణువును వాయించుకుంటూ తిరిగి వచ్చును. గోపికలు మహాపుణ్యవతులు. వారా వేణునాదమును విని వెంటనే బయటకు వచ్చి మార్గములో చిరునవ్వుతో కూడిన ఆయన ముఖమును చూచెదరు. ఆయన వారివైపు దయతో చూచును.

ఏవం ప్రభాషమాణాసు స్త్రీషు యోగేశ్వరో హరిః ।
శత్రుం హంతుం మనశ్చక్రే భగవాన్ భరతర్షభ ॥ 17

భరత-ఋషభ - భరతవంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ రాజా!, స్త్రీషు - స్త్రీలు, ఏవమ్ - ఈ విధముగా, ప్రభాషమాణాసు - మాటలాడుచుండగా, యోగ-ఈశ్వరః - యోగశక్తులకు అధీశ్వరుడు, హరిః - పాపనాశకుడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, శత్రుమ్ - శత్రువును, హంతుమ్ - వధించుటకు, మనః - సంకల్పమును, చక్రే - చేసెను.

భరతవంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! స్త్రీలు ఇట్లు మాటలాడుచుండగనే పాపనాశకుడగు శ్రీకృష్ణ భగవానుడు శత్రువును అంతమొందించుటకు సంకల్పించెను. ఆయన యోగసిద్ధులకధీశ్వరుడు.

సభయాః స్త్రీగిరశ్శ్రుత్వా పుత్రస్నేహశుచాఽఽతురౌ ।
పితరావన్వతప్యేతాం పుత్రయోరబుధౌ బలమ్ ॥ 18

పుత్రస్నేహశుచా - పుత్రులయందలి ప్రేమ వలన దుఃఖముచే, ఆతురౌ - ఆదుర్దా గలవారు, పుత్రయోః - పుత్రులిద్దరి, బలమ్ - శక్తిని గురించి, అబుధౌ - తెలియనివారు అగు, పితరౌ - తల్లిదండ్రులు, సభయాః - భయముతో కూడిన, స్త్రీగిరః - స్త్రీల మాటలను, శ్రుత్వా - విని, అన్వతప్యేతామ్ - మనస్తాపమును పొందిరి.

బలరామకృష్ణుల తల్లిదండ్రులగు దేవకీవసుదేవులు కారాగారములో ఉండిరి. స్త్రీల భయపూర్ణమగు పలుకులు వారి చెవిన పడినవి. వారికి తమ పుత్రుల శక్తి గురించి తెలియదు. పుత్రులయందలి ప్రేమచే శోకముతో వారు చాల ఆదుర్దాను, మనస్తాపమును పొందిరి.

తైస్తైర్నియుద్ధవిధిభిర్వివిధైరచ్యుతేతరౌ ।
యుయుధాతే యథాऽన్యోన్యం తథైవ బలముష్టికౌ ॥ 19

యథా - ఏ విధముగానైతే, అచ్యుత-ఇతరౌ - శ్రీకృష్ణ భగవానుడు చాణూరుడు, అన్యోన్యమ్ - ఒకరితోనొకరు, తైః తైః - ఆయా, వివిధైః - పలురకములైన, నియుద్ధవిధిభిః - మల్లయుద్ధ పద్ధతులతో, యుయుధాతే - యుద్ధమును చేసిరో, బలముష్టికౌ - బలరాముడు ముష్టికుడు, తథా ఏవ - అదే విధముగా.

శ్రీకృష్ణ భగవానుడు, చాణూరుడు ఒకరితోనొకరు పలురకములైన ఆయా మల్లయుద్ధపద్ధతులతో యుద్ధమును చేసిరి. బలరాముడు, ముష్టికుడు కూడ అటులనే యుద్ధము చేసిరి.

భగవద్గాత్రనిష్పాతైర్వజ్రనిష్పేషనిష్ఠురైః ।
చాణూరో భజ్యమానాంగో ముహుర్గ్లానిమవాప హ ॥ 20

వజ్రనిష్పేషనిష్ఠురైః - వజ్రముయొక్క గట్టి దెబ్బ వలె కఠినమైన, భగవద్-గాత్ర నిష్పాతైః - శ్రీకృష్ణ భగవానుని అవయవముల దెబ్బలచే, భజ్యమాన- అంగః - విరుగకొట్టబడుచున్న అవయవములు గల, చాణూరః - చాణూరుడు, ముహుః - పలుమార్లు, గ్లానిమ్ - వ్యథను, అవాప హ - పొందెను.

శ్రీకృష్ణ భగవానుడు చేతులతో, మోకాళ్లతో కొట్టిన దెబ్బలు వజ్రము యొక్క దెబ్బలవలె చాల కఠోరముగా నుండెను. ఆ దెబ్బలకు చాణూరుని అవయవములు నుజ్జు అగుచుండెను. ఆతనికి అధికమగు పీడ కలిగెను.

స శ్యేనవేగ ఉత్పత్య ముష్టీకృత్య కరావుభౌ ।
భగవంతం వాసుదేవం క్రుద్ధో వక్షస్యబాధత ॥ 21

శ్యేనవేగః - డేగయొక్క వేగమువంటి వేగము గలవాడు, క్రుద్ధః - కోపించినవాడు అగు, సః - ఆ చాణూరుడు, ఉత్పత్య - పైకెగిరి, ఉభౌ - రెండు, కరౌ - చేతులను, ముష్టీకృత్య - పిడికిలిగా చేసి, వాసుదేవమ్ - వసుదేవుని పుత్రుడగు, భగవంతమ్ - శ్రీకృష్ణ భగవానుని, వక్షసి - వక్షఃస్థలమునందు, అబాధత - కొట్టెను.

ఆ చాణూరుడు డేగయొక్క వేగమువంటి వేగము గలవాడు. వాడు కోపముతో పైకెగిరి రెండు చేతులను పిడికిలిగా చేసి, వసుదేవపుత్రుడగు శ్రీకృష్ణ భగవానుని వక్షఃస్థలముపై కొట్టెను.

నాచలత్తత్ప్రహారేణ మాలాఽఽహత ఇవ ద్విపః ।
బాహ్వోర్నిగృహ్య చాణూరం బహుశో భ్రామయన్ హరిః ॥ 22

మాలా-ఆహతః - మాలచే కొట్టబడిన, ద్విపః ఇవ - ఏనుగు వలె, హరిః - శ్రీకృష్ణ భగవానుడు, తత్-ప్రహారేణ - ఆ దెబ్బచే, న అచలత్ - చలించలేదు, చాణూరమ్ - చాణూరుని, బాహ్వోః - రెండు చేతులయందు, నిగృహ్య - గట్టిగా పట్టుకొని, బహుశః - పలుమార్లు, భ్రామయన్ - త్రిప్పువాడు.

శ్రీకృష్ణ భగవానుడు మాలచే కొట్టబడిన ఏనుగు వలె ఆ దెబ్బకు చలించలేదు. ఆయన చాణూరుని రెండు చేతులను గట్టిగా పట్టుకొని పలు మార్లు గిర గిరా త్రిప్పెను.

భూపృష్ఠే పోథయామాస తరసా క్షీణజీవితమ్ ।
విస్రస్తాకల్పకేశస్రగింద్రధ్వజ ఇవాపతత్ ॥ 23

తరసా - వేగముచే, క్షీణజీవితమ్ - సన్నగిల్లిన ప్రాణములు గల ఆ చాణూరుని, భూపృష్ఠే - నేలపై, పోథయామాస - వేసి కొట్టెను, విస్రస్త-ఆకల్పకేశస్రక్ - అస్తవ్యస్తమైన ఆభరణములు కేశములు మాలలు గలవాడై, ఇంద్రధ్వజః ఇవ - ఇంద్రధ్వజము వలె, అపతత్ - పడెను.

ఆ వేగమునకు వాని పై ప్రాణములు పైనే పోయెను. శ్రీకృష్ణుడు వానిని నేలపై వేసి కొట్టెను. ఆభరణములు, కేశములు, మాలలు చెల్లాచెదరై వాడు ఇంద్రుని పూజకై నిలబెట్టిన జెండా వలె నేల గూలెను.

తథైవ ముష్టికః పూర్వం స్వముష్ట్యాభిహతేన వై ।
బలభద్రేణ బలినా తలేనాభిహతో భృశమ్ ॥ 24

తథా ఏవ - అదే విధముగా, ముష్టికః వై - ముష్టికుడైతే, పూర్వమ్ - ముందు, స్వముష్ట్యా - తన పిడికిలిచే, అభిహతేన - కొట్టబడిన, బలినా - బలశాలియగు, బలభద్రేణ - బలరామునిచే, తలేన - అరచేతితో, భృశమ్ - గట్టిగా, అభిహతః - కొట్టబడినవాడు.

బలరామముష్టికుల యుద్ధము కూడ అదే రీతిలో సాగెను. ముందుగా ముష్టికుడు బలశాలియగు బలరాముని తన పిడికిలితో కొట్టగా, ఆయన వానిని అరచేతితో గట్టిగా చెంపకాయ కొట్టెను.

ప్రవేపితస్స రుధిరముద్వమన్ముఖతోఽర్దితః ।
వ్యసుః పపాతోర్వ్యుపస్థే వాతాహత ఇవాంఘ్రిపః ॥ 25

ప్రవేపితః - వణుకునట్లు చేయబడినవాడు, అర్దితః - పీడను పొందించబడినవాడు అగు, సః - ఆ ముష్టికుడు, ముఖతః - నోటినుండి, రుధిరమ్ - రక్తమును, ఉద్వమన్ - క్రక్కుచున్నవాడై, వి-అసుః - పోయిన ప్రాణములు గలవాడై, వాత-ఆహతః - గాలిచే పెకిలించబడిన, అంఘ్రిపః ఇవ - చెట్టు వలె, ఉర్వీ-ఉపస్థే - నేల మీద, పపాత - పడెను.

ఆ దెబ్బకు ఆ ముష్టికుడు వణికిపోయి చాల పీడను పొందెను. వాడు నోటినుండి రక్తమును క్రక్కుతూ ప్రాణములు పోయి, గాలిచే పెకిలించివేయబడిన చెట్టువలె, నేలపై గూలెను.

తతః కూటమనుప్రాప్తం రామః ప్రహరతాం వరః ।
అవధీల్లీలయా రాజన్ సావజ్ఞం వామముష్టినా ॥ 26

రాజన్ - ఓ రాజా!, తతః - తరువాత, ప్రహరతామ్ - యోద్ధలలో, వరః - శ్రేష్ఠుడైన, రామః - బలరాముడు, అనుప్రాప్తమ్ - వరుసలో ముందుకు వచ్చిన, కూటమ్ - కూటుని, స-అవజ్ఞమ్ - తిరస్కారముతో కూడుకున్నట్లుగా, వామముష్టినా - ఎడమ పిడికిలితో, లీలయా - అవలీలగా, అవధీత్ - సంహరించెను.

ఓ పరీక్షిన్మహారాజా! తరువాత వరుసలో కూటుడు ముందుకు వచ్చెను. యోద్ధలలో దిట్టయగు బలరాముడాతనిని తిరస్కారపూర్వకముగా ఎడమచేతి పిడికిలితో కొట్టి అవలీలగా సంహరించెను.

తర్హ్యేవ హి శలః కృష్ణపదాపహతశీర్షకః ।
ద్విధా విదీర్ణస్తోశలక ఉభావపి నిపేతతుః ॥ 27

తర్హి ఏవ హి - అదే సమయమునందు, శలః - శలుడు, కృష్ణపద-అపహతశీర్షకః - శ్రీకృష్ణుని కాలిచే ఊడగొట్టబడిన తల గలవాడు, తోశలకః - తోశలకుడు, ద్విధా - రెండుగా, విదీర్ణః - చీల్చబడినవాడు, ఉభౌ అపి - ఇద్దరు కూడ, నిపేతతుః - నేల గూలిరి.

అదే సమయమునందు శ్రీకృష్ణుడు కాలితో శలుని తలను ఊడగొట్టి, తోశలకుని రెండుగా చీల్చెను. వారిద్దరు ఆ విధముగా నేల గూలిరి.

చాణూరే ముష్టికే కూటే శలే తోశలకే హతే ।
శేషాః ప్రదుద్రువుర్మల్లాస్సర్వే ప్రాణపరీప్సవః ॥ 28

చాణూరే - చాణూరుడు, ముష్టికే - ముష్టికుడు, కూటే - కూటుడు, శలే - శలుడు, తోశలకే - తోశలకుడు, హతే - సంహరించబడగా, శేషాః - మిగిలిన, మల్లాః - మల్లులు, సర్వే - అందరు, ప్రాణపరీప్సవః - ప్రాణములను కాపాడుకొనగోరి, ప్రదుద్రువుః - పారిపోయిరి.

చాణూర ముష్టిక కూట శల తోశలకులు (ఈ తీరున) సంహరించబడిరి. మిగిలిన మల్లులందరు ప్రాణములను కాపాడుకొనగోరి పారిపోయిరి.

గోపాన్ వయస్యానాకృష్య తైస్సంసృజ్య విజహ్రతుః ।
వాద్యమానేషు తూర్యేషు వల్గంతౌ రుతనూపురౌ ॥ 29

తూర్యేషు - వాద్యములు, వాద్యమానేషు - ప్రయోగించబడుచుండగా, రుతనూపురౌ - శబ్దము చేసే కాలి యందెలు గల బలరామకృష్ణులిద్దరు, వయస్యాన్ - మిత్రులైన, గోపాన్ - గోపాలకులను, ఆకృష్య - లాగి, తైః - వారితో, సంసృజ్య - కలిసి, వల్గంతౌ - మల్లుల చేష్టను చేయువారై, విజహ్రతుః - విహరించిరి.

అప్పుడు వాద్యములు ప్రయోగించబడెను. బలరామకృష్ణుల కాలి యందెలు శబ్దమును చేయుచుండెను. వారు తమ మిత్రులైన గోపాలకులను చేయి పట్టుకు లాగి వారితో కలిసి మల్లుల చేష్టలను చేస్తూ విహరించిరి.

జనాః ప్రజహృషుస్సర్వే కర్మణా రామకృష్ణయోః ।
ఋతే కంసం విప్రముఖ్యాస్సాధవస్సాధు సాధ్వితి ॥ 30

కంసం ఋతే - కంసుని తప్పించి, సర్వే - అందరు, జనాః - జనులు, రామకృష్ణయోః - బలరామకృష్ణుల, కర్మణా - పనిచే, జహృషుః - హర్షమును పొందిరి, విప్రముఖ్యాః - బ్రాహ్మణశ్రేష్ఠులు, సాధవః - సజ్జనులు, సాధు - బాగు, సాధు - బాగు, ఇతి - అని.

కంసుని తప్పించి జనులందరు బలరామకృష్ణులు చేసిన పనికి హర్షమును పొందిరి. బ్రాహ్మణశ్రేష్ఠులు, సజ్జనులు బాగు, బాగు అని కొనియాడిరి.

హతేషు మల్లవర్యేషు విద్రుతేషు చ భోజరాట్ ।
న్యవారయత్స్వతూర్యాణి వాక్యం చేదమువాచ హ ॥ 31

మల్లవర్యేషు - మల్లులలో శ్రేష్ఠులు, హతేషు - సంహరించబడగా, విద్రుతేషు చ - పారిపోగా, భోజరాట్ - భోజప్రభువగు కంసుడు, స్వతూర్యాణి - తన వాద్యముల వారిని, న్యవారయత్ - నివారించెను, ఇదమ్ - ఈ, వాక్యం చ - వాక్యమును కూడ, హ - స్పష్టముగా, ఉవాచ - పలికెను.

మల్లులలో శ్రేష్ఠులు సంహరించబడగా మిగిలినవారు పారిపోయిరి. అప్పుడు కంసుడు తన వాద్యముల వారిని ఆపి స్పష్టముగా ఈ మాటను పలికెను.

నిస్సారయత దుర్వృత్తౌ వసుదేవాత్మజౌ పురాత్ ।
ధనం హరత గోపానాం నందం బధ్నీత దుర్మతిమ్ ॥ 32

దుర్వృత్తౌ - దుష్టమగు నడవడి గల, వసుదేవ-ఆత్మజౌ - వసుదేవుని పుత్రులిద్దరిని, పురాత్ - నగరమునుండి, నిస్సారయత - బహిష్కరించుడు, గోపానామ్ - గోపాలకుల, ధనమ్ - సంపదను, హరత - లాగుకొనుడు, దుర్మతిమ్ - దుర్బుద్ధియగు, నందమ్ - నందుని, బధ్నీత - బంధించుడు.

వసుదేవుని పుత్రులగు బలరామకృష్ణులు దుష్టమగు చేష్టలు గలవారు. వారిని నగరమునుండి బహిష్కరించుడు. గోపాలకుల సంపదను లాగుకొనుడు. దుర్బుద్ధియగు నందుని బంధించుడు.

వసుదేవస్తు దుర్మేధా హన్యతామాశ్వసత్తమః ।
ఉగ్రసేనః పితా చాపి సానుగః పరపక్షగః ॥ 33

దుర్మేధాః - దుర్బుద్ధి, అసత్తమః - పరమదుష్టుడు అగు, వసుదేవః తు - వసుదేవుడైతే, ఆశు - వెంటనే, హన్యతామ్ - సంహరించబడుగాక!, పితా అపి - తండ్రి అయినా, ఉగ్రసేనః చ - ఉగ్రసేనుడు కూడ, సానుగః - అనుచరులతో కూడినవాడై, పరపక్షగః - శత్రుపక్షమును చేరినవాడు.

వసుదేవుడు దుర్బుద్ధి, పరమదుష్టుడు. వానినైతే వెంటనే చంపివేయుడు. ఉగ్రసేనుడు నా తండ్రియే అయినా, తన అనుచరులతో కూడి శత్రువుల పక్షములో చేరినాడు.

ఏవం వికత్థమానే వై కంసే ప్రకుపితోఽవ్యయః ।
లఘిమ్నోత్పేత్య తరసా మంచముత్తుంగమారుహత్ ॥ 34

కంసే వై - కంసుడైతే, ఏవమ్ - ఈ విధముగా, వికత్థమానే - వదరుచుండగా, ప్రకుపితః - మిక్కిలి కోపించినవాడు, అవ్యయః -

క్షీణించని బలము కలవాడు అగు శ్రీకృష్ణ భగవానుడు, లఘిమ్నా - లాఘవముచే, ఉత్ప్లుత్య - పైకెగిరి, తరసా - వేగముగా, ఉత్తుంగమ్ - ఎత్తైన, మంచమ్ - సింహాసనమును, ఆరుహత్ - ఎక్కెను.

కంసుడీ విధముగా వదరుచుండగా శ్రీకృష్ణునకు చాల కోపము వచ్చెను. ఆయన బలమేమియు క్షీణించలేదు. ఆయన లాఘవముచే వేగముగా పైకెగిరి ఎత్తైన సింహాసనమునెక్కెను.

తమావిశంతమాలోక్య మృత్యుమాత్మన ఆసనాత్ ।
మనస్వీ సహసోత్థాయ జగృహే సోఽసిచర్మణీ ॥ 35

ఆవిశంతమ్ - ఎక్కుచున్నట్టియు, ఆత్మనః - తనకు, మృత్యుమ్ - మృత్యువైన, తమ్ - ఆ శ్రీకృష్ణుని, ఆలోక్య - చూచి, మనస్వీ - ధీరుడగు, సః - ఆ కంసుడు, సహసా - వెంటనే, ఉత్థాయ - లేచి, అసిచర్మణీ - కత్తిని డాలును, జగృహే - తీసుకొనెను.

తనకు మృత్యువైన శ్రీకృష్ణుడు మీదకు వచ్చుచుండుటను చూచి, ధీరుడగు ఆ కంసుడు వెంటనే లేచి కత్తిని, డాలును తీసుకొనెను.

తం ఖడ్గపాణిం విచరంతమాశు శ్యేనం యథా దక్షిణసవ్యమంబరే ।
సమగ్రహీద్దుర్విషహోగ్రతేజా యథోరగం తార్క్ష్యసుతః ప్రసహ్య ॥36

దుర్విషహ-ఉగ్రతేజాః - మిక్కిలి సహించ శక్యము కాని భయంకరమగు తేజస్సు గల శ్రీకృష్ణుడు, ఖడ్గపాణిమ్ - కత్తి చేతియందు కలిగినట్టియు, అంబరే - ఆకాశమునందు, శ్యేనం యథా - డేగ వలె, దక్షిణసవ్యమ్ - కుడివైపు ఎడమవైపు, విచరంతమ్ - తిరుగుచున్న, తమ్ - ఆ కంసుని, తార్క్ష్యసుతః - కశ్యపుని పుత్రుడగు గరుత్మంతుడు, ఉరగం యథా - పామును వలె, ప్రసహ్య - బలముగా, ఆశు - వెంటనే, సమగ్రహీత్ - గట్టిగా పట్టుకొనెను.

కంసుడు కత్తిని చేతబట్టి ఆకాశములో డేగ వలె కుడి ఎడమలకు తిరుగుచుండెను. శ్రీకృష్ణుని తేజస్సు మిక్కిలి సహించ శక్యము కానిది. ఆయన వెంటనే వానిని, కశ్యపపుత్రుడగు గరుడుడు పామును వలె, బలముగా గట్టిగా పట్టుకొనెను.

ప్రగృహ్య కేశేషు చలత్కిరీటం నిపాత్య రంగోపరి తుంగమంచాత్ ।
తస్యోపరిష్టాత్స్వయమబ్జనాభః పపాత విశ్వాశ్రయ ఆత్మతంత్రః ।। 37

విశ్వ-ఆశ్రయః - జగత్తునకు ఆశ్రయమైనవాడు, ఆత్మతంత్రః - స్వతంత్రుడు అగు, అబ్జనాభః - శ్రీకృష్ణ భగవానుడు, చలత్-కిరీటమ్ - అల్లల్లాడుచున్న కిరీటము కలిగిన కంసుని, కేశేషు - కేశములయందు, ప్రగృహ్య - గట్టిగా పట్టుకొని, తుంగమంచాత్ - ఎత్తైన సింహాసనమునుండి, రంగ-ఉపరి - మల్లరంగముపై, నిపాత్య - పడవైచి, తస్య - వాని, ఉపరిష్టాత్ - పైన, స్వయమ్ - తాను, పపాత - పడెను.

శ్రీకృష్ణ భగవానుడు స్వతంత్రుడు, జగత్తునకు ఆశ్రయమైనవాడు. ఆయన అల్లల్లాడే కిరీటము గల కంసుని జుట్టు గట్టిగా పట్టుకొని ఎత్తైన సింహాసనమునుండి మల్లరంగముపై పడవైచి వాని పైన తాను పడెను.

తం సంపరేతం విచకర్ష భూమౌ హరిర్యథేభం జగతో విపశ్యతః ।
హా హేతి శబ్దస్సుమహాంస్తదాఽభూదుదీరితస్సర్వజనైర్నరేంద్ర ।। 38

నర-ఇంద్ర - ఓ రాజా!, జగతః - జనసమూహము, విపశ్యతః - చూచుచుండగా, సంపరేతమ్ - మరణించిన, తమ్ - వానిని, హరిః - సింహము, ఇభం యథా - ఏనుగును వలె, భూమౌ - నేలపై, విచకర్ష - లాగెను, తదా - అప్పుడు, సర్వజనైః - సకలజనులచే, ఉదీరితః - పలుకబడిన, హా - అయ్యో!, హా - అయ్యో!, ఇతి - అనే, సుమహాన్ - చాల పెద్ద, శబ్దః - శబ్దము, అభూత్ - కలిగెను.

ఓ పరీక్షిద్రాజా! జనసమూహము చూచుచుండిరి. సింహము ఏనుగును వలె, శ్రీకృష్ణుడు మరణించిన ఆ కంసుని నేలపై లాగెను. అప్పుడు జనులందరు కలిసి అయ్యో! అయ్యో! అంటూ చాల పెద్ద శబ్దము చేసిరి.

స నిత్యదోద్విగ్నధియా తమీశ్వరం
పిబన్ వదన్ వా విచరన్ స్వపఞ్ఛ్వసన్ ।
దదర్శ చక్రాయుధమగ్రతో యతః
తదేవ రూపం దురవాపమాప ।। 39

యతః - ఎందువల్లనైతే, సః - ఆ కంసుడు, నిత్యదా - అన్ని వేళలా, ఉద్విగ్నధియా - భయముతో నిండిన బుద్ధితో, చక్ర-ఆయుధమ్ - చక్రమే ఆయుధముగా గల, తమ్ - ఆ, ఈశ్వరమ్ - శ్రీకృష్ణ భగవానుని, పిబన్ - త్రాగుచున్న వాడై, వదన్ - మాటలాడుచున్నవాడై, విచరన్ వా - లేదా సంచరించు చున్నవాడై, స్వపన్ - నిద్రిస్తున్నవాడై, శ్వసన్ - గాలి పీల్చుచున్న వాడై, అగ్రతః - ఎదుట, దదర్శ - చూచెనో, దురవాపమ్ - పొంద శక్యము కాని, తత్ - ఆ, రూపం ఏవ - రూపమునే, ఆప - పొందెను.

భయముతో నిండిన బుద్ధి గల ఆ కంసుడు అన్ని వేళలా నీటిని త్రాగుతూ, మాటలాడుతూ, సంచరిస్తూ, నిద్రిస్తూ, గాలిని పీలుస్తూ, చక్రము ఆయుధముగా గల ఆ శ్రీకృష్ణ భగవానుని తన యెదుట చూచెను. అందువలననే, ఆతడు పొంద శక్యము కాని అదే రూపమును పొందెను.

తస్యానుజా భ్రాతరోఽష్టౌ కంకన్యగ్రోధకాదయః ।
అభ్యధావన్నభిక్రుద్ధా భ్రాతుర్నిర్వేశకారిణః ॥ 40

తస్య - ఆ కంసుని, అనుజాః - తరువాత పుట్టిన, అష్టౌ - ఎనమండుగురు, కంకన్యగ్రోధక-ఆదయః - కంకుడు న్యగ్రోధకుడు మొదలైన, భ్రాతరః - సోదరులు, అభిక్రుద్ధాః - మిక్కిలి కోపించినవారై, భ్రాతుః - అన్నగారి, నిర్వేశకారిణః - ఋణమును తీర్చుకొనువారై, అభ్యధావన్ - అభిముఖముగా ఉరికిరి.

ఆ కంసునకు కంకుడు, న్యగ్రోధకుడు మొదలగు ఎనమండుగురు తమ్ములు గలరు. వారు చాల కోపించి అన్నగారి ఋణమును తీర్చుకొనగోరి బలరామకృష్ణుల పైకి ఉరికిరి.

తథాఽతిరభసాంస్తాంస్తు సంయత్తాన్ రోహిణీసుతః ।
అహన్ పరిఘముద్యమ్య పశూనివ మృగాధిపః ॥ 41

తథా - ఆ విధముగా, అతిరభసాన్ - అధికమగు వేగము కలిగినట్టియు, సంయత్తాన్ - కయ్యమునకు కాలు దువ్వుచున్న; తాన్ తు - వారినైతే, రోహిణీసుతః - రోహిణి పుత్రుడగు బలరాముడు, పరిఘమ్ - ఇనుప

గుదియను, ఉద్యమ్య - పైకెత్తి, మృగ-అధిపః - మృగరాజు, పశూన్ ఇవ - పశువులను వలె, అహన్ - సంహరించెను.

ఆ విధముగా ఆ కంసుని తమ్ములైతే అధికమగు వేగముతో కయ్యమునకు కాలు దువ్వుచుండిరి. రోహిణీనందనుడగు బలరాముడు ఇనుప గుదియను పైకెత్తి వారిని, సింహము పశువులను వలె, వధించెను.

నేదుర్దుందుభయో వ్యోమ్ని బ్రహ్మేశాద్యా విభూతయః ।
పుష్పైః కిరంతస్తం ప్రీతాశ్శశంసుర్ననృతుః స్త్రియః ।। 42

వ్యోమ్ని - ఆకాశమునందు, దుందుభయః - దుందుభులు, నేదుః - మ్రోగినవి, ప్రీతాః - ప్రీతిని పొందిన, బ్రహ్మేశాద్యాః - బ్రహ్మదేవుడు శివుడు మొదలైన, విభూతయః - భగవానుని విభూతులు, పుష్పైః - పుష్పములతో, కిరంతః - చల్లుచున్నవారై, తమ్ - ఆ శ్రీకృష్ణుని, శశంసుః - స్తుతించిరి, స్త్రియః - స్త్రీలు, ననృతుః - నాట్యము చేసిరి.

ఆకాశములో దేవదుందుభులు మ్రోగినవి. భగవానుని విభూతులైన (అంశలు) బ్రహ్మదేవుడు, శివుడు, ఇంద్రుడు మొదలగువారు హర్షముతో ఆ శ్రీకృష్ణునిపై పూలను చల్లి స్తుతించిరి. అప్సరసలు నాట్యము చేసిరి.

తేషాం స్త్రియో మహారాజ సుహృన్మరణదుఃఖితాః ।
తత్రాభీయుర్వినిఘ్నంత్యశ్శీర్షాణ్యశ్రువిలోచనాః ।। 43

మహారాజ - ఓ మహారాజా!, సుహృత్-మరణదుఃఖితాః - తమ భర్తల మరణములచే దుఃఖించిన, తేషామ్ - వారి, స్త్రియః - భార్యలు, శీర్షాణి - తలలను, వినిఘ్నంత్యః - కొట్టుకొనుచున్నవారై, అశ్రువిలోచనాః - కన్నీరు గల కన్నులు గలవారై, తత్ర - ఆ మల్లరంగమునందు, అభీయుః - వచ్చిరి.

ఓ పరీక్షిన్మహారాజా! కంసుని భార్యలు మరియు వాని సోదరుల భార్యలు తమ తమ భర్తల మృతికి దుఃఖించుచుండిరి. వారి కన్నులు కన్నీటితో నిండిపోయెను. వారు తలలను కొట్టుకుంటూ అచటకు వచ్చిరి.

శయానాన్ వీరశయ్యాయాం పతీనాలింగ్య శోచతీః ।
విలేపుస్సుస్వరం నార్యో విసృజంత్యో ముహుశ్శుచః ।। 44

శోచతీః - దుఃఖించుచున్న, నార్యః - ఆ స్త్రీలు, వీరశయ్యాయామ్ - వీరులకు శయ్యవంటిది యగు యుద్ధభూమియందు, శయానాన్ - వాలిపోయిన, పతీన్ - భర్తలను, ఆలింగ్య - కౌగిలించుకొని, ముహుః - అదే పనిగా, శుచః - కన్నీళ్లను, విసృజంత్యః - విడిచిపెట్టుచున్నవారై, సుస్వరమ్ - అధికమగు స్వరము కలుగునట్లుగా, విలేపుః - రోదించిరి.

దుఃఖముతో నిండిన ఆ స్త్రీలు వీరశయ్యయైన యుద్ధభూమిలో వాలిపోయిన తమ భర్తలను కౌగిలించుకొని నిరంతరముగా కన్నీటిని విడుస్తూ బిగ్గరగా రోదించిరి.

హా నాథ ప్రియ ధర్మజ్ఞ కరుణానాథవత్సల ।
త్వయా హతేన నిహతా వయం తే సగృహప్రజాః ।। 45

హా - అయ్యో!, నాథ - నాథా!, ప్రియ - ప్రియుడా!, ధర్మజ్ఞ - ధర్మము తెలిసినవాడా!, కరుణ - దయ గలవాడా!, అనాథవత్సల - నాథుడు లేనివారియందు ప్రేమ గలవాడా!, త్వయా - నీవు, హతేన - సంహరించబడగా, సగృహప్రజాః - ఇల్లు సంతానముతో కూడియున్న, తే - నీ, వయమ్ - మేము, నిహతాః - హతులమైతిమి.

అయ్యో! ప్రియమైన నాథా! నీవు ధర్మము తెలిసినవాడవు, దయ గలవాడవు, నాథుడు లేని వారియందు ప్రేమ గలవాడవు. నీవు వధించబడగా, నీవారలమైన మేము ఇళ్లు పిల్లలతో సహా హతులమైతిమి.

త్వయా విరహితా పత్యా పురీయం పురుషర్షభ ।
న శోభతే వయమివ నివృత్తోత్సవమంగలా ।। 46

పురుష-ఋషభ - ఓ పురుషశ్రేష్ఠా!, పత్యా - ప్రభుడవగు, త్వయా - నీతో, విరహితా - విరహమును పొందిన, ఇయమ్ - ఈ, పురీ - నగరము, వయం ఇవ - మేము వలె, నివృత్త-ఉత్సవమంగలా - తొలగిపోయిన ఉత్సవము మంగళము గలదై, న శోభతే - శోభిల్లుట లేదు.

ఓ పురుషశ్రేష్ఠా! మాకు, ఈ నగరమునకు ప్రభుడవగు నీవు లేకుండా పోయినావు. మాకు, ఈ నగరమునకు ఉత్సవము, మంగళము దూరమైనవి. మేము శోభిల్లము, ఈ నగరము శోభిల్లదు.

అనాగసాం త్వం భూతానాం కృతవాన్ ద్రోహముల్బణమ్ ।
తేనేమాం భో దశాం నీతో భూతధ్రుక్కో లభేత శమ్ ॥ 47

త్వమ్ - నీవు, అనాగసామ్ - అపరాధమునెరుగని, భూతానామ్ - ప్రాణులకు, ఉల్బణమ్ - ఘోరమైన, ద్రోహమ్ - ద్రోహమును, కృతవాన్ - చేసినవాడవు, భోః - ఓయీ!, తేన - దానిచే, ఇమామ్ - ఈ, దశామ్ - స్థితిని, నీతః - పొందించబడినవాడవు, భూతధ్రుక్ - భూతములకు ద్రోహమును చేయు, కః - ఎవడు, శమ్ - సుఖమును, లభతే - పొందును?

ఓయీ! నీవు నిరపరాధులగు ప్రాణులకు ఘోరమైన ద్రోహమును చేసితివి. అదియే నిన్నీ దుఃస్థితికి చేర్చినది. ప్రాణులకు ద్రోహమును చేసే ఎవడు సుఖమును పొందును? (ఎవ్వడైననూ పొందడు).

సర్వేషామిహ భూతానామేష హి ప్రభవాప్యయః ।
గోప్తా చ తదవధ్యాయీ న క్వచిత్సుఖమేధతే ॥ 48

ఇహ - ఈ లోకమునందు, సర్వేషామ్ - సకలములైన, భూతానామ్ - ప్రాణులకు, ఏషః హి - ఈ శ్రీకృష్ణుడే, ప్రభవ-అప్యయః - ఆవిర్భవించిన మూలము మరియు విలీనమయ్యే నిధానము, గోప్తా చ - రక్షకుడు కూడ, తద్-అవధ్యాయీ - ఆయనను అవమానించువాడు, క్వచిత్ - ఎక్కడైననూ (ఎప్పుడైననూ), సుఖమ్ - సుఖముగా, న ఏధతే - వర్ధిల్లడు.

ఈ శ్రీకృష్ణుడు ఈ లోకములోని సకలప్రాణులను సృష్టించి, పాలించి, తనలో విలీనము చేసుకొనే పరమేశ్వరుడే. ఆయనను అవమానించే వ్యక్తి ఏ దేశమునందైననూ ఏ కాలమునందైననూ సుఖముగా వర్ధిల్లడు.

శ్రీశుక ఉవాచ । రాజయోషిత ఆశ్వాస్య భగవాంల్లోకభావనః ।
యామాహుర్లౌకికీం సంస్థాం హతానాం సమకారయత్ ॥ 49

లోకభావనః - లోకములకు మనుగడనిచ్చే, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, రాజయోషితః - రాజపత్నులను, ఆశ్వాస్య - ఓదార్చి, హతానామ్ - సంహరించబడినవారలకు, యామ్ - ఏ, లౌకికీమ్ - పరలోకమునకు చెందిన, సంస్థామ్ - దహనకర్మను, ఆహుః - చెప్పెదరో దానిని, సమకారయత్ - చేయించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- లోకములకు మనుగడనిచ్చే శ్రీకృష్ణ భగవానుడు రాజపత్నులనోదార్చెను. మరణించినవారలకు పరలోకమునకు చెందిన ఏ అపరకర్మను స్మృతికారులు చెప్పిరో, దానిని వధించబడిన కంసాదులకు ఆయన చేయించెను.

మాతరం పితరం చైవ మోచయిత్వాఽథ బంధనాత్ ।
కృష్ణరామౌ వవందాతే శిరసాఽఽస్ప్రుశ్య పాదయోః ॥ 50

అథ - తరువాత, కృష్ణరామౌ - బలరామకృష్ణులు, మాతరమ్ - తల్లిని, పితరం చ ఏవ - తండ్రిని కూడ, బంధనాత్ - కారాగారమునుండి, మోచయిత్వా - విడిపించి, శిరసా - తలతో, పాదయోః - పాదములయందు, ఆస్ప్రుశ్య - స్ప్రుశించి, వవందాతే - నమస్కరించిరి.

తరువాత బలరామకృష్ణులు తల్లిదండ్రులను చెరనుండి విడిపించి వారి పాదములకు తల మోపి నమస్కారమును చేసిరి.

దేవకీ వసుదేవశ్చ విజ్ఞాయ జగదీశ్వరౌ ।
కృతసంవందనౌ పుత్రౌ సస్వజాతే న శంకితౌ ॥ 51

ఇతి శ్రీమద్భాగవతే దశమస్కంధే చతుశ్చత్వారింశోఽధ్యాయః ॥

దేవకీ - దేవకి, వసుదేవః చ - వసుదేవుడు కూడ, కృతసంవందనౌ - చేయబడిన నమస్కారము గల, పుత్రౌ - పుత్రులనిద్దరిని, జగద్-ఈశ్వరౌ - జగన్నాథులనుగా, విజ్ఞాయ - తెలుసుకొని, శంకితౌ - శంక గలవారై, న సస్వజాతే - కౌగిలించుకొనలేదు.

తమకు నమస్కారము చేసిన పుత్రులిద్దరు జగన్నాథులని గుర్తించిన దేవకీవసుదేవులు (అపరాధమగునేమోననే) శంకతో వారిని కౌగిలించుకొనలేదు.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో శ్రీకృష్ణుడు
చాణూరాదులను కంసుని సంహరించి ఉద్ధరించుటను వర్ణించే
నలుబది నాల్గవ అధ్యాయము ముగిసినది (44).

* * * * *

# అథ పంచచత్వారింశోఽధ్యాయః

## శ్రీకృష్ణ బలరాముల ఉపనయనము, గురుకుల ప్రవేశము, విద్యాధ్యయనము, గురుదక్షిణ

శ్రీశుక ఉవాచ ।
పితరావుపలబ్ధార్థౌ విదిత్వా పురుషోత్తమః ।
మా భూదితి నిజాం మాయాం తతాన జనమోహినీమ్ ॥ 1

పురుషోత్తమః - శ్రీకృష్ణ భగవానుడు, పితరౌ - తల్లిదండ్రులను, ఉపలబ్ధ-అర్థౌ - తెలియబడిన తన స్వరూపము గలవారినిగా, విదిత్వా - తెలుసుకొని, మా భూత్ - అట్లు కారాదు, ఇతి - అని, జనమోహినీమ్ - జనులను మోహపెట్టే, నిజామ్ - తనదైన, మాయామ్ - యోగమాయను, తతాన - విస్తరింపజేసెను.

శ్రీశుక మహర్షి పలికెను --- తన యథార్థస్వరూపము తల్లి దండ్రులకు తెలిసినదని శ్రీకృష్ణ భగవానుడు గమనించెను. అట్లు కారాదని తలచి ఆయన జనులను మోహపెట్టే తన యోగమాయను విస్తరిల్ల జేసెను.

ఉవాచ పితరావేత్య సాగ్రజస్సాత్వతర్షభః ।
ప్రశ్రయావనతః ప్రీణన్నంబ తాతేతి సాదరమ్ ॥ 2

సాత్వత-ఋషభః - యదువంశీయులలో శ్రేష్ఠుడగు శ్రీకృష్ణుడు, స-అగ్రజః - అన్నగారితో కూడినవాడై, పితరౌ - తల్లిదండ్రులను గురించి, ఏత్య - వచ్చి, ప్రశ్రయ-అవనతః - వినయముతో నమ్రుడై, ప్రీణన్ - ప్రీతిని కలిగించువాడై, సాదరమ్ - ఆదరపూర్వకముగా, అంబ - అమ్మా!, తాత - తండ్రీ!, ఇతి - అని, ఉవాచ - పలికెను.

యదువంశశ్రేష్ఠుడగు శ్రీకృష్ణుడు అన్నగారితో కలిసి తల్లిదండ్రుల వద్దకు వచ్చెను. ఆయన వినయముతో నమ్రుడై సాదరముగా అమ్మా! తండ్రీ! అని పిలుస్తూ, వారికి ప్రీతిని కలిగించెను.

నాస్మత్తో యువయోస్తాత నిత్యోత్కంఠితయోరపి ।
బాల్యపౌగండకైశోరాః పుత్రాభ్యామభవన్ క్వచిత్ ॥ 3

తాత - తండ్రీ!, పుత్రాభ్యామ్ - పుత్రులమగు, అస్మత్తః - మా ఇద్దరి నిమిత్తముగా, నిత్యమ్ - ఎల్లవేళలా, ఉత్కంఠితయోః అపి - ఆదుర్దా పడినప్పటికీ, యువయోః - మీకిద్దరికి, బాల్యపౌగండకైశోరాః - బాల్యము పౌగండము కిశోరావస్థలకు చెందిన సుఖములు, క్వచిత్ - ఏనాడైననూ, న అభవన్ - కలుగలేదు.

తండ్రీ! పుత్రులమగు మా ఇద్దరి నిమిత్తముగా మీరు చాల ఆదుర్దాను అనుభవించిరి. అయిననూ, ఐదు ఏళ్లు, ఆరు ఏళ్లు, పది యేళ్లు వయస్సులలో పుత్రుల వలన కలిగే సుఖము మీకేనాడు కలుగలేదు.

న లబ్ధో దైవహతయోర్వాసో నౌ భవదంతికే ।
యాం బాలాః పితృగేహస్థా విందంతే లాలితా ముదమ్ ॥ 4

దైవహతయోః - దైవముచే వంచించబడిన, నౌ - మాకిద్దరికి, భవద్-అంతికే - మీ ఇద్దరి వద్ద, వాసః - నివాసము, న లబ్ధః - లభించలేదు, పితృగేహస్థాః - తల్లిదండ్రుల ఇంటియందు ఉన్నవారై, లాలితాః - లాలించబడే, బాలాః - పిల్లలు, యామ్ - ఏ, ముదమ్ - ఆనందమును, విందంతే - పొందెదరో.

పిల్లలు తల్లిదండ్రుల ఇంటిలో ఉంటూ వారిచే లాలించబడుతూ ఆనందమును పొందెదరు. దైవవంచితులమైన మాకిద్దరికి మీ ఇద్దరి వద్ద నివాసము గాని, ఆ ఆనందము గాని లభించలేదు.

సర్వార్థసంభవో దేహో జనితః పోషితో యతః ।
న తయోర్యాతి నిర్వేశం పిత్రోర్మర్త్యశ్శతాయుషా ॥ 5

యతః - ఎందువలననైతే, సర్వ-అర్థసంభవః - సకలపురుషార్థముల పుట్టుక గల, దేహః - దేహము, జనితః - జన్మనీయబడినదై, పోషితః - పోషించబడినదో అందువలన, మర్త్యః - మానవుడు, శత-ఆయుషా - వంద యేళ్ల ఆయుర్దాయముతో, పిత్రోః - తల్లిదండ్రుల, నిర్వేశమ్ - ఋణము తీర్చుటను, న యాతి - పొందడు.

తల్లిదండ్రులు సకలపురుషార్థముల సాధనకు మూలమైన దేహమునకు జన్మనిచ్చి పోషించెదరు. కావున, మానవుడు వంద యేళ్ల జీవితమంతా సేవ చేసినా వారిద్దరి ఋణము తీరదు.

యస్తయోరాత్మజః కల్ప ఆత్మనా చ ధనేన చ ।
వృత్తిం న దద్యాత్తం ప్రేత్య స్వమాంసం ఖాదయంతి హి ॥ 6

యః - ఏ, ఆత్మజః - పుత్రుడు, కల్పః - సమర్థుడై, ఆత్మనా - దేహముతో, ధనేన చ - ధనముతో కూడ, తయోః - ఆ తల్లిదండ్రులకు, వృత్తిమ్ - జీవనాధారమును, న దద్యాత్ - ఈయడో, తమ్ - వానిని, ప్రేత్య - మరణించి, స్వమాంసమ్ - తన మాంసమును, హి - నిశ్చయముగా, ఖాదయంతి - తినిపించెదరు.

ఏ కొడుకైతే సమర్థుడై అట్టి తల్లిదండ్రులకు ధనమును వెచ్చించి సేవ చేసి జీవనాధారమును కల్పించడో, అట్టివాడు మరణించిన తరువాత నరకములో యమదూతలు వానికి వాని శరీరముయొక్క మాంసమునే తినిపించెదరు.

మాతరం పితరం వృద్ధం భార్యాం సాధ్వీం సుతం శిశుమ్ ।
గురుం విప్రం ప్రపన్నం చ కల్పోఽబిభ్రచ్ఛ్వసన్మృతః ॥ 7

వృద్ధమ్ - వృద్ధుడైన, పితరమ్ - తండ్రిని, మాతరమ్ - తల్లిని, సాధ్వీమ్ - పతివ్రతయగు, భార్యామ్ - భార్యను, శిశుమ్ - పిల్లవాడైన, సుతమ్ - పుత్రుని, గురుమ్ - గురువును, విప్రమ్ - వేదవేత్తను, ప్రపన్నం చ - శరణు పొందినవానిని కూడ, కల్పః - సమర్థుడై, అబిభ్రత్ - పోషించని వాడు, శ్వసన్ - గాలి పీల్చువాడైననూ, మృతః - మరణించినవాడు.

వృద్ధులైన తల్లిదండ్రులను, పతివ్రతయైన భార్యను, పిల్లవాడైన పుత్రుని, గురువును, వేదవేత్తను, శరణు పొందినవానిని కూడ సమర్థుడై ఉండి ఎవడు పోషించడో, అట్టివాడు గాలిని పీలుస్తున్నా మృతుడే.

తన్నావకల్పయోః కంసాన్నిత్యముద్విగ్నచేతసోః ।
మోఘమేతే వ్యతిక్రాంతా దివసా వామనర్చతోః ।। 8

తత్ - అందువలన, అకల్పయోః - అసమర్థులమైనట్టియు, కంసాత్ - కంసుని వలన, నిత్యమ్ - ఎల్లవేళలా, ఉద్విగ్నచేతసోః - భయపడిన మనస్సులు గల, నౌ - మేము, వామ్ - మీ ఇద్దరిని, అనర్చతోః - పూజించనివారమై యుండగా, ఏతే - ఈ, దివసాః - దినములు, మోఘమ్ - వ్యర్థముగా, వ్యతిక్రాంతాః - గడచిపోయినవి.

అందువలన, ఎల్లవేళలా కంసుని వలన భయపడిన బుద్ధి గల మేమిద్దరము అసమర్థులమై మిమ్ములనిద్దరినీ పూజించకుండానే ఇంత కాలము వ్యర్థముగా గడిచిపోయినది.

తత్ క్షంతుమర్హథస్తాత మాతర్నౌ పరతంత్రయోః ।
అకుర్వతోర్వాం శుశ్రూషాం క్లిష్టయోర్దుర్హృదా భృశమ్ ।। 9

తాత - తండ్రీ!, మాతః - తల్లీ!, తత్ - అందువలన, పరతంత్రయోః - అస్వతంత్రులమైనట్టియు, దుర్హృదా - దుర్బుద్ధియగు కంసునిచే, భృశమ్ - మిక్కిలి, క్లిష్టయోః - క్లేశమును పొందించబడినట్టియు, వామ్ - మీ ఇద్దరికి, శుశ్రూషామ్ - సేవను, అకుర్వతోః - చేయని, నౌ - మా ఇద్దరికి, క్షంతుమ్ - క్షమించుటకు, అర్హథః - తగుదురు.

ఓ తండ్రీ! తల్లీ! అందువలన, దుర్బుద్ధియగు కంసునిచే మిక్కిలి క్లేశమునకు గురిచేయబడిన మేమిద్దరము అస్వతంత్రులమై మీ ఇద్దరికి సేవను చేయకపోతిమి. మమ్ములను మీరు క్షమించ దగును.

శ్రీశుక ఉవాచ ।
ఇతి మాయామనుష్యస్య హరేర్విశ్వాత్మనో గిరా ।
మోహితావంకమారోప్య పరిష్వజ్యాపతుర్ముదమ్ ।। 10

మాయామనుష్యస్య - యోగమాయచే మానవుడైనట్టియు, విశ్వ-ఆత్మనః - జగత్తునకు ఆత్మయైన, హరేః - శ్రీకృష్ణ భగవానుని, ఇతి - ఈ విధమైన, గిరా - వాక్కుచే, మోహితౌ - మోహింపజేయబడిన తల్లిదండ్రులు, అంకమ్ - ఒడిని, ఆరోప్య - కూర్చుండబెట్టుకొని, పరిష్వజ్య - కౌగిలించి, ముదమ్ - ఆనందమును, ఆపతుః - పొందిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- జగత్తునకు ఆత్మయైన శ్రీకృష్ణ భగవానుడు యోగమాయచే మానవుడైనాడు. ఆయన పలికిన ఈ పలుకులకు తల్లిదండ్రులు మోహితులై ఆతనిని ఒడిలో కూర్చుండబెట్టుకొని కౌగిలించుకొని ఆనందమును పొందిరి.

సించంతావశ్రుధారాభిస్స్నేహపాశేన చావృతౌ ।
న కించిదూచతూ రాజన్ బాష్పకంఠౌ విమోహితౌ ॥ 11

రాజన్ - ఓ రాజా!, అశ్రుధారాభిః - కన్నీటి ధారలతో, సించంతౌ - తడుపుచున్నవారు, స్నేహపాశేన చ - ప్రేమ అనే పాశముచే, ఆవృతౌ - ఆవరించబడినవారు, బాష్పకంఠౌ - కన్నీటి వలన బొంగురుపోయిన కంఠము గలవారు, విమోహితౌ - అధికమగు మోహమును పొందినవారు, కించిత్ - దేనినీ, న ఊచతుః - పలుకలేదు.

ఓ రాజా! వారిద్దరు తమ పుత్రులను కన్నీటి ధారలతో తడిపిరి. వారు అధికమగు మోహమును పొంది ప్రేమ అనే పాశముచే ఆవరించబడిరి. వారి కంఠము కన్నీటి వలన బొంగురుపోయి వారేమీ మాటలేడలేదు.

ఏవమాశ్వాస్య పితరౌ భగవాన్ దేవకీసుతః ।
మాతామహం తూగ్రసేనం యదూనామకరోన్నృపమ్ ॥ 12

దేవకీసుతః - దేవకి పుత్రుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఏవమ్ - ఈ విధముగా, పితరౌ - తల్లిదండ్రులను, ఆశ్వాస్య - ఓదార్చి, మాతామహమ్ - మాతామహుడగు, ఉగ్రసేనం తు - ఉగ్రసేనునైతే, యదూనామ్ - యాదవులకు, నృపమ్ - రాజునుగా, అకరోత్ - చేసెను.

దేవకి పుత్రుడగు శ్రీకృష్ణ భగవానుడీ విధముగా తల్లిదండ్రులనోదార్చి, మాతామహుడగు ఉగ్రసేనుని యాదవులకు రాజునుగా చేసెను.

ఆహ చాస్మాన్మహారాజ ప్రజాశ్చాజ్ఞప్తుమర్హసి ।
యయాతిశాపాద్యదుభిర్నాసితవ్యం నృపాసనే ॥ 13

ఆహ చ - పలికెను కూడా, మహారాజ - ఓ మహారాజా!, అస్మాన్ - మమ్ములను, ప్రజాః చ - ప్రజలను కూడ, ఆజ్ఞప్తుమ్ - ఆజ్ఞాపించుటకు, అర్హసి - తగుదువు, యయాతిశాపాత్ - యయాతియొక్క శాపము వలన, యదుభిః - యాదవులచే, నృప-ఆసనే - రాజసింహాసనముపై, న ఆసితవ్యమ్ - కూర్చుండబడరాదు.

ఆయన ఉగ్రసేనునితో ఇట్లు పలికెను -- ఓ మహారాజా! తమరు మమ్ములను, ప్రజలను కూడ శాసించుడు. యయాతియొక్క శాపము వలన యాదవులు రాజసింహాసనముపై కూర్చుండ రాదు. (కాని నా మాట వలన దోషము ఉండదు).

మయి భృత్య ఉపాసీనే భవతో విబుధాదయః ।
బలిం హరంత్యవనతాః కిముతాన్యే నరాధిపాః ॥ 14

భృత్యే - సేవకుడనగు, మయి - నేను, ఉప-ఆసీనే - సేవించుచుండగా, భవతః - తమరికి, విబుధ-ఆదయః - దేవతలు మొదలగువారు, అవనతాః - వినమ్రులై, బలిమ్ - సత్కారమును, హరంతి - తీసుకువచ్చెదరు, అన్యే - ఇతరులగు, నర-అధిపాః - నరపాలులు, కిం ఉత - తీసుకువచ్చెదరని వేరుగా చెప్పవలెనా?

నేను సేవకుడనై మిమ్ములను సేవించుచుండగా, దేవతలు మొదలగువారు కూడ సత్కారములను తీసుకువచ్చెదరు. ఇతర నరపాలురు అట్లు చేయుదురని వేరుగా చెప్పవలయునా?

సర్వాన్ స్వజ్ఞాతిసంబంధాన్ దిగ్భ్యః కంసభయాకులాన్ ।
యదువృష్ణ్యంధకమధుదాశార్హకుకురాదికాన్ ॥ 15

సభాజితాన్ సమాశ్వాస్య విదేశావాసకర్శితాన్ ।
న్యవాసయత్స్వగేహేషు విత్తైస్సంతర్ప్య విశ్వకృత్ ॥ 16

విశ్వకృత్ - జగత్కారణుడగు శ్రీకృష్ణ భగవానుడు, కంసభయ-ఆకులాన్ - కంసుని వలని భయము వలన వ్యాకులురైన, స్వజ్ఞాతిసంబంధాన్ - తన జ్ఞాతులను బంధువులను, సర్వాన్ - అందరిని, విదేశ-ఆవాసకర్శితాన్ - పొరుగు దేశములలో నివసించుటచే కృశించిన, యదువృష్ణి-అంధకమధుదాశార్హకుకుర-ఆదికాన్ - యదు వృష్ణి అంధక మధు దాశార్హ కుకుర ఇత్యాదివంశీయులను, దిగ్భ్యః - దిక్కులనుండి, సభాజితాన్ - సత్కరించబడినవారిని, సమాశ్వాస్య - ఓదార్చి, విత్తైః - సంపదలతో, సంతర్ప్య - సంతృప్తిని కలిగించి, స్వగేహేషు - తమ గృహములయందు, న్యవాసయత్ - నివసింప జేసెను.

కంసునకు భయపడి యదు వృష్ణి అంధక మధు దాశార్హ కుకుర సాత్వత ఇత్యాది వంశీయులు నాలుగు దిక్కులకు పారిపోయిరి. జగత్కారణుడగు శ్రీకృష్ణుడు తనకు జ్ఞాతులు, బంధువులు అగు వారినందరినీ రప్పించెను. విదేశములో నివాసముచే కృశించియున్న వారిని ఆయన బాగా సత్కరించి సంపదలతో తృప్తి పరచి వారి వారి గృహములలో నివసింప జేసెను.

కృష్ణసంకర్షణభుజైర్గుప్తా లబ్ధమనోరథాః ।
గృహేషు రేమిరే సిద్ధాః కృష్ణరామగతజ్వరాః ॥ 17

కృష్ణసంకర్షణభుజైః - శ్రీకృష్ణ బలరాముల భుజములచే, గుప్తాః - రక్షించబడినవారు, లబ్ధమనః-రథాః - పొందబడిన ఆకాంక్షలు గలవారు, సిద్ధాః - కృతార్థులు, కృష్ణరామగతజ్వరాః - కృష్ణ బలరాములచే పోయిన దుఃఖము గలవారు, గృహేషు - గృహములయందు, రేమిరే - రమించిరి.

యాదవులు శ్రీకృష్ణ బలరాముల భుజములచే రక్షించబడిరి. వారిద్దరి కారణముగా వారి మనోరథములు సఫలమై దుఃఖములు దూరమయ్యెను. వారు కృతార్థులై తమ గృహములయందు రమించిరి.

వీక్షంతోఽహరహః ప్రీతా ముకుందవదనాంబుజమ్ ।
నిత్యం ప్రముదితం శ్రీమత్సదయస్మితవీక్షణమ్ ॥ 18

నిత్యమ్ - ఎల్లవేళలా, ప్రముదితమ్ - గొప్ప ఆనందము కలిగినట్టియు, శ్రీమత్ - శోభాయుక్తమైనట్టియు, సదయస్మితవీక్షణమ్ - దయ చిరునవ్వులతో కూడిన చూపులు గల, ముకుందవదన-అంబుజమ్ - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని పద్మమువంటి ముఖమును, అహః-అహః - ప్రతి దినము, వీక్షంతః - చూచువారు. ప్రీతాః - ప్రీతి గలవారు.

మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని పద్మమువలె శోభిల్లే ముఖము ఎల్లవేళలా గొప్ప ఆనందమును కలిగియుండును. ఆయన సదా దయ, చిరునవ్వులతో కూడిన చూపులను బరపును. ఆయన ముఖమును ప్రతి దినము చూచి యాదవులు ప్రీతిని జెందిరి.

తత్ర ప్రవయసోఽప్యాసన్ యువానోఽతిబలౌజసః ।
పిబంతోఽక్షైర్ముకుందస్య ముఖాంబుజసుధాం ముహుః ॥ 19

తత్ర - ఆ మధురయందు, అక్షైః - కన్నులతో, ముకుందస్య - మోక్షదాతయగు శ్రీకృష్ణ భగవానుని, ముఖ-అంబుజసుధామ్ - పద్మమువంటి ముఖము అనే అమృతమును, ముహుః - పలుమార్లు, పిబంతః - పానము చేసే, ప్రవయసః అపి - వయసు మళ్లినవారు కూడ, అతిబల-ఓజసః - గొప్ప శరీరబలము ఇంద్రియపాటవము గల, యువానః - యువకులు, ఆసన్ - అయిరి.

ఆ మధురలో మోక్షదాతయగు శ్రీకృష్ణుని పద్మమువంటి ముఖము అనే అమృతమును కన్నులతో పానము చేసే వ్యక్తులు వయసు మళ్లినవారు కూడ గొప్ప శరీరబలము, ఇంద్రియపాటవము గల యువకులు అయిరి.

అథ నందం సమాసాద్య భగవాన్ దేవకీసుతః ।
సంకర్షణశ్చ రాజేంద్ర పరిష్వజ్యేదమూచతుః ॥ 20

రాజ-ఇంద్ర - ఓ మహారాజా!, అథ - తరువాత, దేవకీసుతః - దేవకి పుత్రుడగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, సంకర్షణః చ - శేషావతారమగు బలరాముడు కూడ, నందమ్ - నందుని, సమాసాద్య - దగ్గరకు వెళ్లి, పరిష్వజ్య - కౌగిలించుకొని, ఇదమ్ - ఈ మాటను, ఊచతుః - పలికిరి.

ఓ పరీక్షిన్మహారాజా! దేవకి పుత్రుడగు శ్రీకృష్ణ భగవానుడు, శేషావతారమగు బలరాముడు కూడ తరువాత నందుని వద్దకు వెళ్లి ఆయనను కౌగిలించుకొని ఈ మాటను చెప్పిరి.

పితర్యువాభ్యాం స్నిగ్ధాభ్యాం పోషితౌ లాలితౌ భృశమ్ ।
పిత్రోరభ్యధికా ప్రీతిరాత్మజేష్వాత్మనోఽపి హి ॥ 21

పితః - ఓ తండ్రీ!, స్నిగ్ధాభ్యామ్ - ప్రేమ గల, యువాభ్యామ్ - మీ ఇద్దరిచే, భృశమ్ - అధికముగా, పోషితౌ - పోషించబడినవారము, లాలితౌ - లాలించబడినవారము, హి - ఏలయన, పిత్రోః - తల్లిదండ్రులకు, ఆత్మజేషు - పుత్రులయందు, ఆత్మనః అపి - శరీరముకంటె కూడ, అభ్యధికా - చాల ఎక్కువ, ప్రీతిః - ప్రేమ.

ఓ తండ్రీ! ప్రేమ గల మీరిద్దరు మమ్ములనిద్దరినీ అధికముగా పోషించి లాలించితిరి. ఎందుకంటే, తల్లిదండ్రులకు తమ శరీరము కంటె కూడ పుత్రులయందు ప్రేమ చాల ఎక్కువగా నుండును.

స పితా సా చ జననీ యౌ పుష్ణీతాం స్వపుత్రవత్ ।
శిశూన్ బంధుభిరుత్సృష్టానకల్పైః పోషరక్షణే ॥ 22

సః - ఆయన, పితా - తండ్రి, సా చ - ఆమెయే, జననీ - తల్లి, యౌ - ఏ ఇద్దరైతే, పోషరక్షణే - పోషించుటయందు రక్షించుటయందు, అకల్పైః - అసమర్థులైన, బంధుభిః - బంధువులచే, ఉత్సృష్టాన్ - విడిచిపెట్టబడిన, శిశూన్ - పిల్లలను, స్వపుత్రవత్ - తమ పుత్రులను వలె, పుష్ణీతామ్ - పోషించెదరో.

బంధువులు పోషించి రక్షించలేక విడిచిపెట్టిన పిల్లలను తమ పిల్లల వలె ఎవరైతే పోషించెదరో, వారే యథార్థమైన తల్లిదండ్రులగుదురు.

యాత యూయం వ్రజం తాత వయం చ స్నేహదుఃఖితాన్ ।
జ్ఞాతీన్ వో ద్రష్టుమేష్యామో విధాయ సుహృదాం సుఖమ్ ॥ 23

తాత - తండ్రీ!, యూయమ్ - తమరు, వ్రజమ్ - గోకులమును గురించి, యాత - వెళ్లుడు, వయం చ - మేమైతే, సుహృదామ్ -

ఆత్మబంధువులకు, సుఖమ్ - సుఖమును, విధాయ - కలిగించి, స్నేహదుఃఖితాన్ - ప్రేమచే దుఃఖితులైన, జ్ఞాతీన్ - బంధువులైన, వః - మిమ్ములను, ద్రష్టుమ్ - చూచుటకు, ఏష్యామః - రాగలము.

ఓ తండ్రీ! తమరు గోకులమునకు వెళ్లుడు. మేము ఆత్మబంధువులగు వసుదేవాదులకు సుఖమును కలిగించి మిమ్ములను చూచుటకు వచ్చెదము. మీరు ప్రేమచే దుఃఖితులగుదురని నాకు తెలియును.

ఏవం సాంత్వయ్య భగవాన్నందం సవ్రజమచ్యుతః ।
వాసోఽలంకారకుప్యాద్యైరర్హయామాస సాదరమ్ ॥ 24

అచ్యుతః భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఏవమ్ - ఈ విధముగా, సవ్రజమ్ - గోకులవాసులతో కూడిన, నందమ్ - నందుని, సాంత్వయ్య - ఒప్పించి, స-ఆదరమ్ - ఆదరపూర్వకముగా, వాసః-అలంకారకుప్య-ఆద్యైః - వస్త్రములు అలంకారములు కంచు పాత్రలు మొదలగువాటితో, అర్హయామాస - పూజించెను.

శ్రీకృష్ణ భగవానుడీ విధముగా గోకులవాసులను, నందుని ఒప్పించి. వారిని ఆదరముతో వస్త్రములు, అలంకారములు, (పాలు పితికే) కంచు పాత్రలు, బళ్లు మొదలగువాటినిచ్చి సత్కరించెను.

ఇత్యుక్తస్తౌ పరిష్వజ్య నందః ప్రణయవిహ్వలః ।
పూరయన్నశ్రుభిర్నేత్రే సహ గోపైర్వ్రజం యయౌ ॥ 25

ప్రణయవిహ్వలః - ప్రేమచే వ్యాకులపడిన, నందః - నందుడు, ఇతి - ఈ విధముగా, ఉక్తః - పలుకబడినవాడై, తౌ - వారిద్దరిని, పరిష్వజ్య - కౌగిలించుకొని, నేత్రే - రెండు కళ్లను, అశ్రుభిః - కన్నీళ్లతో, పూరయన్ - నింపుకొనువాడై, గోపైః సహ - గోపాలకులతో కూడి, వ్రజమ్ - గోకులమును గురించి, యయౌ - వెళ్లెను.

ప్రేమతో వ్యాకులుడైన నందుడు ఈ మాటలను విని వారిద్దరిని కౌగిలించుకొనెను. ఆయన కన్నులు నీటితో నిండిపోయెను. ఆయన గోపాలకులతో కూడి గోకులమునకు వెళ్లెను.

అథ శూరసుతో రాజన్ పుత్రయోస్సమకారయత్ ।
పురోధసా బ్రాహ్మణైశ్చ యథావద్ద్విజసంస్కృతిమ్ ॥ 26

రాజన్ - ఓ రాజా!, అథ - తరువాత, శూరసుతః - శూరుని పుత్రుడగు వసుదేవుడు, పుత్రయోః - పుత్రులిద్దరికి, పురోధసా - పురోహితునిచే, బ్రాహ్మణైః చ - బ్రాహ్మణులచే కూడ, యథావత్ - యథావిధిగా, ద్విజసంస్కృతిమ్ - ఉపనయన సంస్కారమును, సమకారయత్ - బాగుగా చేయించెను.

ఓ పరీక్షిన్మహారాజా! తరువాత శూరుని పుత్రుడగు వసుదేవుడు పుత్రులిద్దరికి పురోహితునిచే, వేదవేత్తలచే యథావిధిగా ఉపనయన సంస్కారమును బాగుగా చేయించెను.

తేభ్యోఽదాద్దక్షిణా గావో రుక్మమాలాస్స్వలంకృతాః ।
స్వలంకృతేభ్యస్సంపూజ్య సవత్సాః క్షౌమమాలినీః ॥ 27

సు-అలంకృతేభ్యః - బాగుగా అలంకరించబడిన, తేభ్యః - వారి కొరకు, సంపూజ్య - బాగుగా పూజించి, దక్షిణాః - దక్షిణలను, రుక్మమాలాః - బంగరు మాలలు కలిగినట్టియు, సు-అలంకృతాః - చక్కగా అలంకరించ బడినట్టియు, సవత్సాః - దూడలతో కూడినట్టియు, క్షౌమమాలినీః - పట్టు వస్త్రములు పుష్పమాలలు గల, గావః - గోవులను, అదాత్ - ఇచ్చెను.

ఆయన ఆ వేదవేత్తలను బాగా అలంకారములతో సత్కరించి దక్షిణలను, దూడలతో కూడిన గోవులను ఇచ్చెను. ఆ గోవులు బంగరు మాలలు, పట్టు వస్త్రములు, పుష్పమాలలతో చక్కగా అలంకరించబడెను.

యాః కృష్ణరామజన్మర్క్షే మనోదత్తా మహామతిః ।
తాశ్చాదదాదనుస్మృత్య కంసేనాధర్మతో హృతాః ॥ 28

కృష్ణరామజన్మ-ఋక్షే - శ్రీకృష్ణుడు బలరాముడు పుట్టిన నక్షత్రములయందు, యాః - ఏ గోవులు, మనః-దత్తాః - మానసికముగా దానము చేయబడినవో, కంసేన - కంసునిచే, అధర్మతః - అధర్మముగా, హృతాః - లాగుకొనబడిన, తాః చ - ఆ గోవులను కూడ, మహామతిః -

గొప్ప ఔదార్యము గల వసుదేవుడు, అనుస్మృత్య - తరువాత గుర్తుకు తెచ్చుకొని, అదదాత్ - దానము చేసెను.

శ్రీకృష్ణుడు, బలరాముడు పుట్టిన నక్షత్రములయందు వసుదేవుడు మానసికముగా గోవులను దానము చేసెను. గొప్ప ఉదారస్వభావము గల ఆయన ఆ విషయమును తరువాత గుర్తు చేసుకొని వాటిని దానము చేసెను. ఆ గోవులు కంసుడు అధర్మముగా ఆయననుండి లాగుకున్నవి.

తతశ్చ లబ్ధసంస్కారౌ ద్విజత్వం ప్రాప్య సువ్రతౌ ।
గర్గాద్యదుకులాచార్యాద్గాయత్రం వ్రతమాస్థితౌ ॥ 29

తతః చ - తరువాత కూడ, లబ్ధసంస్కారౌ - పొందబడిన ఉపనయన సంస్కారము గలవారు, ద్విజత్వమ్ - ద్వితీయజన్మను కలిగియుండుటను, ప్రాప్య - పొంది, సువ్రతౌ - మంచి వ్రతనియమములు గలవారు, యదుకుల-ఆచార్యాత్ - యాదవవంశమునకు ఆచార్యుడైన, గర్గాత్ - గర్గునినుండి, గాయత్రం వ్రతమ్ - బ్రహ్మచర్య వ్రతమును, ఆస్థితౌ - స్వీకరించినవారు.

ఉపనయన సంస్కారము రెండవ జన్మ. దానిని పొందిన తరువాత మంచి నియమనిష్ఠలు గల వారిద్దరు యాదవవంశమునకు ఆచార్యుడైన గర్గుని వద్ద గాయత్రీమంత్రోపదేశముతో ఆరంభమయ్యే బ్రహ్మచర్య వ్రతమును స్వీకరించిరి.

ప్రభవౌ సర్వవిద్యానాం సర్వజ్ఞౌ జగదీశ్వరౌ ।
నాన్యసిద్ధామలజ్ఞానం గూహమానౌ నరేహితైః ॥ 30

సర్వవిద్యానామ్ - సకలవిద్యలకు, ప్రభవౌ - ఉత్పత్తిస్థానములు, సర్వజ్ఞౌ - సర్వము దెలిసినవారు, జగద్-ఈశ్వరౌ - జగన్నాథులు, న-అన్యసిద్ధ-అమలజ్ఞానమ్ - స్వతస్సిద్ధమైన శుద్ధమగు జ్ఞానమును, నర-ఈహితైః - మానవుల చేష్టలచే, గూహమానౌ - దాచియుంచుచున్నవారు.

వారిద్దరు సకలవిద్యలకు ఉత్పత్తిస్థానములు, సర్వము దెలిసిన జగన్నాథులు. అయిననూ, వారు మానవుల ప్రవృత్తిననుకరిస్తూ తమ స్వతస్సిద్ధమైన శుద్ధజ్ఞానమును దాచియుంచిరి.

అథో గురుకులే వాసమిచ్ఛంతావుపజగ్మతుః ।
కాశ్యం సాందీపనిం నామ హ్యావంతీపురవాసినమ్ ।। 31

అథో - తరువాత, గురుకులే - గురుకులమునందు, వాసమ్ - నివాసమును, ఇచ్ఛంతౌ - కోరే బలరామకృష్ణులు, కాశ్యమ్ - కాశ్యపగోత్రోద్భవుడైనట్టియు, అవంతీపురవాసినమ్ - అవంతీ నగరమునందు నివసించే, సాందీపనిం నామ - సాందీపనుడని ప్రసిద్ధి గాంచిన గురువును, ఉపజగ్మతుః - దగ్గరకు వెళ్ళిరి.

తరువాత బలరామకృష్ణులు గురుకులవాసమును చేయగోరిరి. కాశ్యపగోత్రోద్భవుడు, (కాశీలో పుట్టినవాడు, కాశీలో చదివినవాడు) సాందీపని అని ప్రసిద్ధి జెందిన అవంతీ (ఉజ్జయినీ) నగరమునందు నివసించుచున్న గురువు వద్దకు వారు వెళ్ళిరి.

యథోపసాద్య తౌ దాంతౌ గురౌ వృత్తిమనిందితామ్ ।
గ్రాహయంతావుపేతౌ స్మ భక్త్యా దేవమివాదృతౌ ।। 32

దాంతౌ - వినీతులు, ఆదృతౌ - ఆదరము గలవారు అగు, తౌ - వారిద్దిరు, యథా - యథావిధిగా, ఉపసాద్య - దగ్గరకు వచ్చి, గురౌ - గురువునందు, అనిందితామ్ - దోషములు లేని, వృత్తిమ్ - ప్రవృత్తిని, గ్రాహయంతౌ - మానవులకు ఆదర్శమును చూపువారై, భక్త్యా - భక్తితో, దేవం ఇవ - దేవుని వలె, ఉపేతౌ - సేవించినవారు.

వారిద్దరు వినయముతో యథావిధిగా గురువు వద్దకు వెళ్ళిరి. వారు లోకమునకు దోషములు లేకుండా గురువు వద్ద నడుచుకోవలసిన పద్ధతిని ఆదర్శముగా చూపుతూ ఆదరముతో, భక్తితో గురువును దేవుని వలె సేవించిరి.

తయోర్ద్విజవరస్తుష్టశ్శుద్ధభావానువృత్తిభిః ।
ప్రోవాచ వేదానఖిలాన్ సాంగోపనిషదో గురుః ।। 33

ద్విజవరః - వేదవేత్తలలో శ్రేష్ఠుడగు, గురుః - ఆ గురువు, తయోః - వారిద్దరియొక్క, శుద్ధభావ-అనువృత్తిభిః - పరిశుద్ధమగు అంతఃకరణము గల సేవలచే, తుష్టః - సంతోషించినవాడై, స-అంగ-ఉపనిషదః -

అంగములతో ఉపనిషత్తులతో కూడిన, అఖిలాన్ - సకలములైన, వేదాన్ - వేదములను, ప్రోవాచ - బోధించెను.

వేదవేత్తలలో శ్రేష్ఠుడగు ఆ గురువు వారిద్దరు శుద్ధమైన భావముతో చేసే సేవలకు సంతోషించి, వారికి వేదాంగములు (శిక్ష, కల్పము, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము, నిరుక్తము), ఉపనిషత్తులతో నాల్గు వేదములను బోధించెను.

సరహస్యం ధనుర్వేదం ధర్మాన్న్యాయపథాంస్తథా ।
తథా చాన్వీక్షికీం విద్యాం రాజనీతిం చ షడ్విధామ్ ॥ 34

సరహస్యమ్ - మంత్రములు దేవతల జ్ఞానముతో కూడిన, ధనుః-వేదమ్ - ధనుర్వేదమును, ధర్మాన్ - ధర్మశాస్త్రములను, తథా - అదే విధముగా, న్యాయపథాన్ - మీమాంస మొదలైన న్యాయ మార్గములను, తథా - అదే విధముగా, అన్వీక్షికీం విద్యామ్ - తర్క విద్యను, షడ్-విధమ్ - ఆరు విధములైన, రాజనీతిం చ - రాజనీతిని కూడ.

మంత్రదేవతాసహితమైన ధనుర్వేదమును, ధర్మశాస్త్రములను, మీమాంసాది న్యాయమార్గములను, తర్కవిద్యను, సంధివిగ్రహయాన-ఆసనద్వైధీభావసమాశ్రయములనే ఆరు విధముల రాజనీతిని కూడ ఆయన వారికి బోధించెను.

సర్వం నరవరశ్రేష్ఠౌ సర్వవిద్యాప్రవర్తకౌ ।
సకృన్నిగదమాత్రేణ తౌ సంజగృహతుర్నృప ॥ 35

నృప - ఓ రాజా!, నరవరశ్రేష్ఠౌ - గొప్ప మానవులలో గొప్పవారు, సర్వవిద్యాప్రవర్తకౌ - సకలవిద్యలను ప్రవర్తిల్ల జేసినవారు అగు, తౌ - వారిద్దరు, సర్వమ్ - సర్వమును, సకృత్ - ఒక్కసారి, నిగదమాత్రేణ - చెప్పుట మాత్రముచే, సంజగృహతుః - చక్కగా గ్రహించిరి.

ఓ పరీక్షిన్మహారాజా! గొప్ప మానవులలో గొప్పవారగు వారిద్దరు సకలవిద్యలను లోకములో ప్రవర్తిల్లజేసిన భగవానులే. వారు విద్యలనన్నింటినీ ఒక్కసారి చెప్పగానే చక్కగా గ్రహించెడివారు.

అహోరాత్రైశ్చతుష్షష్ట్యా సంయత్తౌ తావతీః కలాః ।
గురుదక్షిణయాఽఽచార్యం ఛందయామాసతుర్నృప ॥ 36

నృప - ఓ రాజా!, సంయత్తౌ - మనోనిగ్రహము గల వారిద్దరు, చతుష్షష్ట్యా - అరవై నాలుగు, అహోరాత్రైః - దినములచే, తావతీః - అన్నియే, కలాః - కళలను (నేర్చిరి), ఆచార్యమ్ - గురువును, గురుదక్షిణయా - గురుదక్షిణతో, ఛందయామాసతుః - కోరునట్లు చేసిరి.

ఓ పరీక్షిన్మహారాజా! మనోజయము గల వారిద్దరు అరవై నాలుగు దినములలో గానము మొదలైన అరవై నాలుగు కళలను నేర్చిరి. వారు ఆచార్యుని ప్రార్థించి ఆయన గురుదక్షిణను కోరునట్లు చేసిరి.

ద్విజస్తయోస్తం మహిమానమద్భుతం
సంలక్ష్య రాజన్నతిమానుషీం మతిమ్ ।
సమ్మంత్ర్య పత్న్యా స మహార్ణవే మృతం
బాలం ప్రభాసే వరయాంబభూవ హ ॥ 37

రాజన్ - ఓ రాజా!, తయోః - వారిద్దరియొక్క, తమ్ - అట్టి, అద్భుతమ్ - ఆశ్చర్యకరమగు, మహిమానమ్ - మహిమను, అతిమానుషీమ్ - మానవులకంటె అతీతమైన, మతిమ్ - బుద్ధిని, సంలక్ష్య - చూచి, పత్న్యా - భార్యతో, సంమంత్ర్య - సంప్రదించి, సః - ఆయన, ప్రభాసే - ప్రభాస క్షేత్రమునందు, మహా-అర్ణవే - మహాసముద్రమునందు, మృతమ్ - మరణించిన, బాలమ్ - పుత్రుని, వరయాంబభూవ హ - వరము కోరెను.

ఓ పరీక్షిన్మహారాజా! వారిద్దరి అట్టి ఆశ్చర్యకరమగు మహిమను, మానవులకంటె అతీతమైన బుద్ధిశక్తిని చూచి గురువు తన భార్యతో సంప్రదించెను. వారి పుత్రుడు ప్రభాసక్షేత్రములో మహాసముద్రములో పడి మరణించెను. ఆయన ఆ పుత్రుని తెచ్చి ఇమ్మని వరముగా కోరెను.

తథేత్యథారుహ్య మహారథౌ రథం ప్రభాసమాసాద్య దురంతవిక్రమౌ,
వేలాముపవ్రజ్య నిషీదతుః క్షణం సింధుర్విదిత్వాఽర్హణమాహరత్తయోః।

తథా - సరే, ఇతి - అని, అథ - తరువాత, మహారథౌ - మహారథులు, దురంతవిక్రమౌ - అనంతమగు పరాక్రమము కలవారు అగు వారిద్దరు,

రథమ్ - రథమును, ఆరుహ్య - ఎక్కి, ప్రభాసమ్ - ప్రభాసక్షేత్రమును, ఆసాద్య - చేరుకొని, వేలామ్ - చెలియలి కట్టను, ఉపవ్రజ్య - సమీపించి, క్షణమ్ - కొద్ది సేపు, నిషీదతుః - కూర్చుండిరి, సింధుః - సముద్రుడు, విదిత్వా - తెలుసుకొని, తయోః - వారిద్దరికి, అర్హణమ్ - పూజాద్రవ్యమును, ఆహరత్ - తీసుకువచ్చెను. 38

బలరామకృష్ణులు మహారథులు. వారి పరాక్రమమునకు అంతము లేదు. వారిద్దరు సరే అని చెప్పి వెంటనే రథమెక్కి ప్రభాస క్షేత్రమును చేరి చెలియలి కట్టకు వెళ్లి క్షణకాలము కూర్చుండిరి. వారి రాక గురించి తెలిసి సముద్రుడు పూజాద్రవ్యములతో వారి వద్దకు వచ్చెను.

తమాహ భగవానాశు గురుపుత్రః ప్రదీయతామ్ ।
యోఽసావిహ త్వయా గ్రస్తో బాలకో మహతోర్మిణా ॥ 39

భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, తమ్ - ఆతనిని ఉద్దేశించి, ఆహ - పలికెను, త్వయా - నీచే, ఇహ - ఇక్కడ, మహతా - పెద్ద, ఊర్మిణా - కెరటముతో, గ్రస్తః - మ్రింగివేయబడిన, అసౌ - ఈ, గురుపుత్రః - గురువుయొక్క పుత్రుడగు, బాలకః - పిల్లవాడు, ఆశు - వెంటనే, ప్రదీయతామ్ - ఈయబడుగాక!

శ్రీకృష్ణ భగవానుడు ఆ సముద్రునితో నిట్లనెను -- నీవు పెద్ద కెరటముతో ఇక్కడ మా గురువుగారి పుత్రుడగు పిల్లవానిని మ్రింగివేసితివి. ఈ పిల్లవానిని వెంటనే మాకు అప్పజెప్పుము.

సముద్ర ఉవాచ ।
నైవాహార్షమహం దేవ దైత్యః పంచజనో మహాన్ ।
అంతర్జలచరః కృష్ణ శంఖరూపధరోఽసురః ॥ 40

ఆస్తే తేనాహృతో నూనం తచ్ఛ్రుత్వా సత్వరం ప్రభుః ।
జలమావిశ్య తం హత్వా నాపశ్యదుదరేఽర్భకమ్ ॥ 41

దేవ - ఓ దేవా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, అహమ్ - నేను, న ఏవ అహార్షమ్ - అపహరించనే లేదు, పంచజనః - పంచజనుడు, మహాన్ - పెద్ద, దైత్యః - దితి పుత్రుడు, అంతః-జలచరః - లోపల నీటిలో సంచరించువాడు,

శంఖరూపధరః - శంఖముయొక్క రూపమును దాల్చినవాడు, అసురః - రాక్షసుడు, ఆస్తే - ఉన్నాడు, తేన - వానిచే, అహృతః - అపహరించబడినవాడు, నూనమ్ - నిశ్చయము, తత్ - ఆ మాటను, శ్రుత్వా - విని, ప్రభుః - శ్రీకృష్ణ ప్రభుడు, సత్వరమ్ - వేగముగా, జలమ్ - నీటిని, ఆవిశ్య - ప్రవేశించి, తమ్ - వానిని, హత్వా - సంహరించి, ఉదరే - పొట్టయందు, అర్భకమ్ - పిల్లవానిని, న అపశ్యత్ - కనలేదు.

సముద్రుడిట్లు పలికెను --- ఓ దేవా! శ్రీకృష్ణా! ఆ పిల్లవానిని నేను సుతరాము అపహరించ లేదు. పంచజనుడనే దితివంశీయుడగు పెద్ద రాక్షసుడు నీటి లోపల శంఖము రూపు దాల్చి సంచరించును. వాడు పిల్లవానిని అపహరించినాడు. ఇది యథార్థము, అని సముద్రుడు చెప్పెను. ఆ మాటను విని శ్రీకృష్ణ ప్రభుడు వేగముగా నీటిలో ప్రవేశించి, ఆ పంచజనుని సంహరించి చూడగా వాని పొట్టలో పిల్లవాడు కానరాలేదు.

తదంగప్రభవం శంఖమాదాయ రథమాగమత్ ।
తతస్సంయమనీం నామ యమస్య దయితాం పురీమ్ ॥ 42

గత్వా జనార్దనశ్శంఖం ప్రదధ్మౌ సహలాయుధః ।

తద్-అంగప్రభవమ్ - ఆ రాక్షసుని శరీరమునుండి పుట్టిన, శంఖమ్ - శంఖమును, ఆదాయ - తీసుకొని, రథమ్ - రథమును గురించి, ఆగమత్ - వచ్చెను, తతః - తరువాత, యమస్య - యమునకు, దయితామ్ - ప్రియమైన, సంయమనీమ్ - సంయమని అనే, పురీమ్ - నగరమును గురించి, గత్వా - వెళ్లి, జన-అర్దనః - దుష్టజనులను శిక్షించే శ్రీకృష్ణ భగవానుడు, సహల-ఆయుధః - నాగలి ఆయుధముగా గల బలరామునితో కూడినవాడై, శంఖమ్ - శంఖమును, ప్రదధ్మౌ - పూరించెను.

దుష్టజనశిక్షకుడగు శ్రీకృష్ణ భగవానుడు ఆ రాక్షసుని శరీరమునుండి పుట్టిన శంఖము (పాంచజన్యము) ను తీసుకొని రథము వద్దకు వచ్చెను. ఆయన నాగలియే ఆయుధముగా గల బలరామునితో కూడి యమునకు ప్రియమైన సంయమనీ నగరమునకు వెళ్లి, శంఖమును పూరించెను.

శంఖనిర్హ్రాదమాకర్ణ్య ప్రజాసంయమనో యమః ॥ 43

తయోస్సపర్యాం మహతీం చక్రే భక్త్యుపబృంహితమ్ ।

ప్రజాసంయమనః - ప్రాణులను శాసించే, యమః - యముడు, శంఖనిర్హ్రాదమ్ - శంఖధ్వనిని, ఆకర్ణ్య - విని, తయోః - వారిద్దరికి, భక్తి-ఉపబృంహితమ్ - భక్తిచే వర్ధిల్ల జేయబడిన, మహతీమ్ - గొప్ప, సపర్యామ్ - పూజను, చక్రే - చేసెను.

ప్రాణులను శాసించే యముడు శంఖధ్వనిని విని వారిద్దరికి భక్తి భావముతో నిండిన గొప్ప పూజను చేసెను.

ఉవాచావనతః కృష్ణం సర్వభూతాశయాలయమ్ ।
లీలామనుష్య హే విష్ణో యువయోః కరవామ కిమ్ ॥ 44

అవనతః - వినమ్రుడై, సర్వభూత-ఆశయ-ఆలయమ్ - సకలప్రాణుల హృదయమే నివాసముగా గల, కృష్ణమ్ - శ్రీకృష్ణ భగవానుని ఉద్దేశించి, ఉవాచ - పలికెను, లీలామనుష్య - లీల కొరకై మానవరూపమును దాల్చినవాడా!, హే విష్ణో - ఓ విష్ణూ!, యువయోః - మీకిద్దరికి, కిమ్ - దేనిని, కరవామ - చేసెదము?

యముడు వినమ్రుడై సకలప్రాణుల హృదయములో నివసించే శ్రీకృష్ణ భగవానునితో నిట్లనెను -- ఓ విష్ణూ! నీవు లీల కొరకై మానవదేహమును దాల్చి యున్నావు. మీకిద్దరికి నేనేమి చేయవలెను?

శ్రీభగవానువాచ ।
గురుపుత్రమిహానీతం నిజకర్మనిబంధనమ్ ।
ఆనయస్వ మహారాజ మచ్ఛాసనపురస్కృతః ॥ 45

మహారాజ - ఓ మహారాజా!, ఇహ - ఇచటకు, ఆనీతమ్ - తీసుకురాబడినట్టియు, నిజకర్మనిబంధనమ్ - తన కర్మయే బంధనముగా గల, గురుపుత్రమ్ - గురువుయొక్క పుత్రుని, మత్-శాసనపురస్కృతః - నా ఆజ్ఞచే ప్రేరితుడవై, ఆనయస్వ - తీసుకు రమ్ము.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- ఓ యమరాజా! తన కర్మయే బంధనము కాగా మా గురువుగారి పుత్రుడు ఇచటకు తీసుకు రాబడినాడు. నీవు నా ఆజ్ఞచే ప్రేరితుడవై వానిని తీసుకు రమ్ము.

తథేతి తేనోపానీతం గురుపుత్రం యదూత్తమౌ ।
దత్త్వా స్వగురవే భూయో వృణీష్వేతి తమూచతుః ॥ 46

తథా - సరే, ఇతి - అని, తేన - ఆ యమునిచే, ఉపానీతమ్ - తీసుకురాబడిన, గురుపుత్రమ్ - గురువుయొక్క పుత్రుని, యదు-ఉత్తమౌ - యదువంశీయులలో శ్రేష్ఠులగు వారిద్దరు, స్వగురవే - తమ గురువు కొరకు, దత్త్వా - అప్పజెప్పి, భూయః - మరల, వృణీష్వ - కోరుకొనుడు, ఇతి - అని, తమ్ - ఆయనను ఉద్దేశించి, ఊచతుః - పలికిరి.

సరే అని చెప్పి యముడు ఆ బాలకుని తీసుకువచ్చెను. యదువంశశ్రేష్ఠులగు వారిద్దరు ఆ గురుపుత్రుని తమ గురువునకు అప్పజెప్పి, ఇంకనూ కోరుకొనుడు, అని పలికిరి.

గురురువాచ ।
సమ్యక్సంపాదితో వత్స భవద్భ్యాం గురునిష్క్రయః ।
కో ను యుష్మద్విధగురోః కామానామవశిష్యతే ॥ 47

వత్స - నాయనా!, భవద్భ్యామ్ - మీ యిద్దరిచే, గురునిష్క్రయః - గురువుయొక్క ఋణమును తీర్చుకొనుట, సమ్యక్ - బాగుగా, సంపాదితః - సంపన్నము చేయబడినది, యుష్మద్-విధగురోః - మీ వంటివారల గురువునకు, కామానామ్ - కోరికలలో, కః ను - ఏది, అవశిష్యతే - మిగిలియుండును?

గురువు ఇట్లు పలికెను --- నాయనలారా! మీరిద్దరు గురువుయొక్క ఋణమును పూర్తిగా తీర్చివేసినారు. మీవంటి వారికి గురువైన వానికి ఇంకనూ కోరికలేమి మిగిలియుండును? (ఉండవు).

గచ్ఛతం స్వగృహం వీరౌ కీర్తిర్వామస్తు పావనీ ।
ఛందాంస్యయాతయామాని భవంత్విహ పరత్ర చ ॥ 48

వీరౌ - ఓ వీరులారా!, స్వగృహమ్ - మీ ఇంటిని గురించి, గచ్ఛతమ్ - వెళ్లుడు, వామ్ - మీ ఇద్దరికి, పావనీ - పవిత్రము చేసే, కీర్తిః - కీర్తి, అస్తు - కలుగుగాక!, ఇహ - ఈ లోకమునందు, పరత్ర చ - పరలోకమునందు కూడ, ఛందాంసి - విద్యలు, అయాతయామాని - తొలగిపోని సారము గలవి (సఫలములు), భవంతు - అగుగాక!

ఓ వీరులారా! మీరిద్దరు మీ ఇంటికి వెళ్లుడు. మీకు జనులను పవిత్రము చేసే కీర్తి కలుగుగాక! మీరు నేర్చిన విద్యలు ఇహపరలోకములయందు నిస్సారములు కాకుండు గాక! (సఫలములగుగాక!)

గురుణైవమనుజ్ఞాతౌ రథేనానిలరంహసా ।
ఆయాతౌ స్వపురం తాత పర్జన్యనినదేన వై ॥ 49

తాత - నాయనా!, గురుణా - గురువుచే, ఏవమ్ - ఈ విధముగా, అనుజ్ఞాతౌ - అనుమతి ఈయబడినవారై, అనిలరంహసా - వాయువుయొక్క వేగమువంటి వేగము కలిగినట్టియు, పర్జన్యనినదేన - మేఘముయొక్క ధ్వనివంటి ధ్వని గల, రథేన - రథముచే, స్వపురం వై - తమ నగరమును గురించియైతే, ఆయాతౌ - వచ్చినవారు.

నాయనా! పరీక్షిత్తూ! వారిద్దరు గురువు అనుమతి తీసుకొని రథమునెక్కి తమ నగరము (మథుర) నకు తిరిగి వచ్చిరి. వాయువుతో సమానమైన వేగముతో నడిచే ఆ రథముయొక్క ధ్వని మేఘగర్జనను పోలియుండును.

సమనందన్ ప్రజాస్సర్వా దృష్ట్వా రామజనార్దనౌ ।
అపశ్యంత్యో బహ్వాహాని నష్టలబ్ధధనా ఇవ ॥ 50

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే పంచచత్వారింశోఽధ్యాయః ॥

రామజన-అర్దనౌ - బలరాముని దుష్టజనులను శిక్షించే శ్రీకృష్ణ భగవానుని, దృష్ట్వా - చూచి, బహు-అహాని - చాల రోజులను, అపశ్యంత్యః - చూడని, ప్రజాః - జనులు, సర్వే - అందరు, నష్టలబ్ధధనాః

ఇవ - పోయి దొరికిన ధనము గలవారు వలె, సమనందన్ - బాగా ఆనందించిరి.

బలరాముని, దుష్టజనశిక్షకుడగు శ్రీకృష్ణ భగవానుని అచటి జనులు చాల రోజులు చూడలేదు. ఇప్పుడు వారందరు వారిద్దరిని చూచి, పోయిన సంపద మరల దొరికినవారు వలె, చాల ఆనందించిరి.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో శ్రీకృష్ణ బలరాముల ఉపనయనము, గురుకుల ప్రవేశము, విద్యాధ్యయనము, గురుదక్షిణలను వర్ణించే నలుబది ఐదవ అధ్యాయము ముగిసినది (45).



# అథ షట్చత్వారింశోఽధ్యాయః

## ఉద్ధవుడు గోకులమునకు వెళ్లుట

శ్రీశుక ఉవాచ ।
వృష్ణీనాం ప్రవరో మంత్రీ కృష్ణస్య దయితస్సఖా ।
శిష్యో బృహస్పతేస్సాక్షాదుద్ధవో బుద్ధిసత్తమః ॥

వృష్ణీనామ్ - యాదవులలో, ప్రవరః - శ్రేష్ఠుడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, బృహస్పతేః - బృహస్పతికి, శిష్యః - శిష్యుడు, బుద్ధిమత్-తమః - బుద్ధిమంతులలో శ్రేష్ఠుడగు, ఉద్ధవః - ఉద్ధవుడు, కృష్ణస్య - శ్రీకృష్ణునకు, మంత్రీ - సలహాదారు, దయితః - ప్రియమైన, సఖా - మిత్రుడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- యాదవులలో శ్రేష్ఠుడగు ఉద్ధవుడు సాక్షాత్తు బృహస్పతి శిష్యుడు, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు. ఆయన శ్రీకృష్ణునకు మంత్రి మరియు ప్రియమిత్రుడు.

తమాహ భగవాన్ ప్రేష్ఠం భక్తమేకాంతినం క్వచిత్ ।
గృహీత్వా పాణినా పాణిం ప్రపన్నార్తిహరో హరిః ॥ 2

క్వచిత్ - ఒకనాడు, ప్రపన్న-ఆర్తిహరః - శరణాగతుల పీడలను పోగొట్టువాడు, హరిః - పాపములను పోగొట్టువాడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ప్రేష్ఠమ్ - మిక్కిలి ప్రియుడైనట్టియు, ఏకాంతినమ్ - అన్యము లేని, భక్తమ్ - భక్తుడైన, తమ్ - ఆ ఉద్ధవుని, పాణినా - చేతితో, పాణిమ్ - చేతిని, గృహీత్వా - పట్టుకొని, ఆహ - పలికెను.

శ్రీకృష్ణ భగవానుడు శరణాగతుల పీడలను, పాపములను పోగొట్టును. ఆయనకు ఉద్ధవుడు మిక్కిలి ప్రియుడు మరియు అనన్యభక్తుడు. ఆయన ఒకనాడు ఉద్ధవుని చేతిని చేతితో పట్టుకొని ఇట్లు పలికెను.

గచ్ఛోద్ధవ వ్రజం సౌమ్య పిత్రోర్నౌ ప్రీతిమావహ ।
గోపీనాం మద్వియోగాధిం మత్సందేశైర్విమోచయ ॥ 3

ఉద్ధవ - ఓ ఉద్ధవా!, వ్రజమ్ - గోకులమును గురించి, గచ్ఛ - వెళ్లుము, సౌమ్య - ఓ ప్రియదర్శనా!, నౌ - మా ఇద్దరి, పిత్రోః - తల్లిదండ్రులకు, ప్రీతిమ్ - ప్రీతిని, ఆవహ - కలిగించుము, మత్-సందేశైః - నా సందేశములతో, గోపీనామ్ - గోపికలయొక్క, వియోగ-ఆధిమ్ - వియోగదుఃఖమును, విమోచయ - విముక్తిని కలిగించుము.

ఓ ఉద్ధవా! నీవు ప్రియదర్శనుడవు. నీవు గోకులమునకు వెళ్లి మా ఇద్దరి తల్లిదండ్రులకు ప్రీతిని కలిగించుము. నా సందేశములతో గోపికలకు వియోగదుఃఖమునుండి విముక్తిని కలిగించుము.

తా మన్మనస్కా మత్ప్రాణా మదర్థే త్యక్తదైహికాః ।
మామేవ దయితం ప్రేష్ఠమాత్మానం మనసా గతాః ।
యే త్యక్తలోకధర్మాశ్చ మదర్థే తాత తాన్ బిభర్మ్యహమ్ ॥ 4

తాః - వారు, మత్-మనస్కాః - నాయందు మనస్సు గలవారు, మత్-ప్రాణాః - నేనే ప్రాణముగా గలవారు, మదర్థే - నా ప్రయోజనమునందు, త్యక్తదైహికాః - విడువబడిన దేహసంబంధము గల బంధువులు గలవారు, మాం ఏవ - నన్నే, దయితమ్ - ప్రియునిగా, ప్రేష్ఠమ్ - ప్రియతమునిగా, ఆత్మానమ్ - ఆత్మనుగా, మనసా - మనస్సుచే, గతాః - పొందినవారు, తాత - నాయనా!, యే - ఎవరైతే, మద్-అర్థే - నా అనుగ్రహము కొరకు, త్యక్తలోకధర్మాః చ - విడువబడిన సుఖములు ధర్మములు కూడ గలవారో, తాన్ - వారిని, అహమ్ - నేను, బిభర్మి - పాలించెదను.

నాయనా! ఆ గోపికల మనస్సు నామీదే గలదు. వారికి నేనే ప్రాణము. వారు నా కొరకై దేహముతో సంబంధము గల బంధువులను కూడ విడిచిపెట్టినారు. వారు నన్నే ప్రియునిగా, ప్రియతమునిగా, ఆత్మనుగా మనస్సుచే పొందినవారు. ఎవరైతే నా అనుగ్రహము కొరకై ఇహపర సుఖములను, ధర్మములను కూడ విడిచెదరో, వారిని నేను పాలించెదను.

మయి తాః ప్రేయసాం ప్రేష్ఠే దూరస్థే గోకులస్త్రియః ।
స్మరంత్యోఽంగ విముహ్యంతి విరహౌత్కంఠ్యవిహ్వలాః ॥ 5

అంగ - ఓయీ!, ప్రేష్ఠే - ప్రియతముడైన, మయి - నేను, దూరస్థే - దూరమునందుండగా, విరహ-ఔత్కంఠ్యవిహ్వలాః - విరహముచే కలిగిన ఉత్కంఠ వలన వ్యాకులపడిన, తాః - ఆ, గోకులస్త్రియః - గోకులమునందలి స్త్రీలు, స్మరంత్యః - గుర్తు చేసుకొనువారై, విముహ్యంతి - అధికముగా మోహమును పొందెదరు.

ఓయీ! గోపికలకు ప్రియతముడనైన నేను వారికి దూరము కాగా, ఆ విరహముచే వారు ఉత్కంఠతో వ్యాకులపడెదరు. వారు నన్ను గుర్తు చేసుకొని అధికమగు మోహమును పొందెదరు.

ధారయంత్యతికృచ్ఛ్రేణ ప్రాయః ప్రాణాన్ కథంచన ।
ప్రత్యాగమనసందేశైర్వల్లవ్యో మే మదాత్మికాః ॥ 6

మద్-ఆత్మికాః - నాతో అభేదమును పొందిన, వల్లవ్యః - గోపికలు, ప్రాయః - బహుశః, మే - నా, ప్రతి-ఆగమనసందేశైః - తిరిగి రాగలననే సందేశములచే, అతికృచ్ఛ్రేణ - చాల కష్టముతో, కథంచన - ఏదో విధముగా, ప్రాణాన్ - ప్రాణములను, ధారయంతి - ధరించుచుందురు.

గోపికలు నాతో అభేదమును పొందిరి. బహుశా వారు నేను తిరిగి రాగలననే సందేశములచే చాల కష్టముతో ఏదో విధముగా ప్రాణములను నిలబెట్టుకొని యుందురు.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్త ఉద్ధవో రాజన్ సందేశం భర్తురాదృతః ।
ఆదాయ రథమారుహ్య ప్రయయౌ నందగోకులమ్ ॥ 7

రాజన్ - ఓ రాజా!, ఇతి - అని, ఉక్తః - పలుకబడిన, ఉద్ధవః - ఉద్ధవుడు, ఆదృతః - ఆదరము గలవాడై, భర్తుః - శ్రీకృష్ణ ప్రభుని, సందేశమ్ - సందేశమును, ఆదాయ - తీసుకొని, రథమ్ - రథమును, ఆరుహ్య - ఎక్కి, నందగోకులమ్ - నందుని గోకులమును గురించి, యయౌ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- మహారాజా! శ్రీకృష్ణుడిట్లు చెప్పగా, ఉద్ధవుడు ఆదరముతో ఆ ప్రభుని సందేశమును తీసుకొని, రథమునెక్కి నందుని గోకులమునకు వెళ్లెను.

ప్రాప్తో నందవ్రజం శ్రీమాన్ నిమ్లోచతి విభావసౌ ।
ఛన్నయానః ప్రవిశతాం పశూనాం ఖురరేణుభిః ॥ 8

శ్రీమాన్ - శోభాయుక్తుడగు ఉద్ధవుడు, విభావసౌ - సూర్యుడు, నిమ్లోచతి - అస్తమించుచుండగా, నందవ్రజమ్ - నందుని గోకులమును, ప్రాప్తః - చేరినవాడు, ప్రవిశతామ్ - ప్రవేశించుచున్న, పశూనామ్ - పశువుల, ఖురరేణుభిః - డెక్కల ధూళికణములచే, ఛన్నయానః - కప్పివేయబడిన రథము గలవాడు.

శోభాయుక్తుడగు ఉద్ధవుడు సూర్యుడస్తమించు సరికి నందుని గోకులమును చేరెను. ఇళ్లకు తిరిగి వెళ్లే పశువుల డెక్కల ధూళిచే ఆయన రథము కప్పివేయబడెను.

వాసితార్థేఽభియుధ్యద్భిర్నాదితం శుష్మిభిర్వృషైః ।
ధావంతీభిశ్చ వాస్రాభిరూధోభారైస్స్వవత్సకాన్ ॥ 9

వాసిత-అర్థే - ఆవుల విషయమునందు, అభియుధ్యద్భిః - పోటీ పడుచున్న, శుష్మిభిః - మదించిన, వృషైః - ఎద్దులచే, నాదితమ్ - నినదింప జేయబడినట్టియు, ఊధోభారైః - పొదుగుల బరువుతో, స్వవత్సకాన్ - తమ దూడల గురించి, ధావంతీభిః - పరుగెత్తుచున్న, వాస్రాభిః - ఆవులచే (అలంకృతమైన గోకులమును చేరెను).

పశువుల మందలోని మదించిన ఎద్దులు ఆవులకై పోటీ పడుతూ నాదములను చేయుచుండెను. బరువెక్కిన పొదుగులతో ఆవులు తమ దూడల కొరకు పరుగులు తీయుచుండెను.

ఇతస్తతో విలంఘద్భిర్గోవత్సైర్మండితం సితైః ।
గోదోహశబ్దాభిరవం వేణూనాం నిస్స్వనేన చ ॥ 10

ఇతః తతః - ఇటునటు, విలంఘద్భిః - గెంతులు వేయుచున్న, సితైః - తెల్లని, గోవత్సైః - ఆవు దూడలచే, మండితమ్ - అలంకరించబడినట్టియు, గోదోహశబ్ద-అభిరవమ్ - పాలను పితికే శబ్దములతో చుట్టూ ధ్వనించుచున్నట్టియు, వేణూనామ్ - పిల్లన గ్రోవుల, నిస్స్వనేన చ - శబ్దముచే కూడ (అలంకరించబడిన గోకులమును చేరెను).

ఇటునటు గెంతులు వేయుచున్న ఆవు దూడలు గోకులమునకు అలంకారమాయెను. గోకులమంతా పాలను పితికే శబ్దములతో మరియు పిల్లన గ్రోవుల ధ్వనులతో నినదించెను.

గాయంతీభిశ్చ కర్మాణి శుభాని బలకృష్ణయోః ।
స్వలంకృతాభిర్గోపీభిర్గోపైశ్చ సువిరాజితమ్ ॥ 11

బలకృష్ణయోః - బలరామ శ్రీకృష్ణుల, శుభాని - మంగళకరములైన, కర్మాణి - లీలలను, గాయంతీభిః - పాడుచున్నట్టియు, సు-అలంకృతాభిః - బాగుగా అలంకరించుకున్న, గోపీభిః చ - గోపికలతో, గోపైః చ - గోపాలకులతో కూడ, సువిరాజితమ్ - బాగా ప్రకాశిస్తున్న (గోకులమును--)

గోపికలు చక్కగా అలంకరించుకొని బలరామ శ్రీకృష్ణుల మంగళకరమైన లీలలను గానము చేయుచుండిరి. వారు, గోపాలకులు గోకులముయొక్క శోభను ఇనుమడింప జేసిరి.

అగ్న్యర్కాతిథిగోవిప్రపితృదేవార్చనాన్వితైః ।
ధూపదీపైశ్చ మాల్యైశ్చ గోపావాసైర్మనోరమమ్ ॥ 12

అగ్ని-అర్క-అతిథిగోవిప్రపితృదేవ-అర్చన-అన్వితైః - అగ్నులు సూర్యుడు అతిథులు గోవులు వేదవేత్తలు పితృదేవతలు దేవతల అర్చనలతో కూడిన, గోప-ఆవాసైః - గోపాలకుల ఇళ్లతో, ధూపదీపైః చ - ధూపదీపములతో, మాల్యైః చ - పుష్పమాలలతో కూడ, మనః-రమమ్ - మనోహరమైన (గోకులమును చేరెను).

అగ్నులు, సూర్యుడు, అతిథులు, గోవులు, వేదవేత్తలు, పితృదేవతలు, దేవతలను ఆరాధించే గోపాలకుల ఇళ్లతో, ధూపదీపములతో, మరియు పుష్పమాలలతో గోకులము శోభిల్లెను.

సర్వతః పుష్పితవనం ద్విజాలికులనాదితమ్ ।
హంసకారండవాకీర్ణైః పద్మషండైశ్చ మండితమ్ ॥ 13

సర్వతః - అంతటా, పుష్పితవనమ్ - పుష్పించిన అడవులు కలిగినట్టియు, ద్విజ-అలికులనాదితమ్ - పక్షులచే తుమ్మెదల గుంపులచే ధ్వనించుచున్నట్టియు, హంసకారండవ-ఆకీర్ణైః - హంసలచే కారండవ పక్షులచే వ్యాపించబడిన, పద్మషండైః చ - పద్మముల సమూహములచే కూడ, మండితమ్ - అలంకరించబడిన (గోకులమును చేరెను).

గోకులమునందు అంతటా పుష్పించిన అడవులలో పక్షులు, తుమ్మెదలు గుంపులు నినదించుచుండెను. పద్మములతో నిండిన సరస్సులు హంసలతో, కారండవ (టర్కీ) పక్షులతో వ్యాప్తమై శోభిల్లెను.

తమాగతం సమాగమ్య కృష్ణస్యానుచరం ప్రియమ్ ।
నందః ప్రీతః పరిష్వజ్య వాసుదేవధియాఽర్చయత్ ॥ 14

కృష్ణస్య - శ్రీకృష్ణునకు, ప్రియమ్ - ప్రియుడైన, అనుచరమ్ - అనుచరుడైనట్టియు, ఆగతమ్ - వచ్చిన, తమ్ - ఆ ఉద్ధవుని, సమాగమ్య - కలుసుకొని, ప్రీతః - ప్రీతిని పొందిన, నందః - నందుడు, పరిష్వజ్య - కౌగిలించుకొని, వాసుదేవధియా - శ్రీకృష్ణుడే అనే భావనతో, అర్చయత్ - సత్కరించెను.

వచ్చిన ఉద్ధవుడు శ్రీకృష్ణునకు ప్రియమైన అనుచరుడు. నందుడు ఆయనను కలిసి ప్రీతిని పొందెను. నందుడు ఆయనను కౌగిలించుకొని, ఈతడు శ్రీకృష్ణుడే అనే భావనతో సత్కారములను చేసెను.

భోజితం పరమాన్నేన సంవిష్టం కశిపౌ సుఖమ్ ।
గతశ్రమం పర్యపృచ్ఛత్పాదసంవాహనాదిభిః ॥ 15

పరమ-అన్నేన - శ్రేష్ఠమైన ఆహారముతో, భోజితమ్ - భుజించునట్లు చేయబడినట్టియు, కశిపౌ - ఆసనమునందు, సుఖమ్ - సుఖముగా, సంవిష్టమ్ - కూర్చున్నట్టియు, పాదసంవాహన-ఆదిభిః - కాళ్లను పట్టుట మొదలగువాటిచే, గతశ్రమమ్ - తొలగిన శ్రమ గల ఉద్ధవుని, పర్యపృచ్ఛత్ - ప్రశ్నించెను.

ఉద్ధవుడు శ్రేష్ఠమైన ఆహారమును భుజించి సుఖముగా ఆసనముపై కూర్చుండెను. కాళ్లను నొక్కుట, వీచుట మొదలైన (సేవకుల) సపర్యలచే ఆయన శ్రమ దూరమయ్యెను. అప్పుడు నందుడిట్లు ప్రశ్నించెను.

కచ్చిదంగ మహాభాగ సఖా నశ్శూరనందనః ।
ఆస్తే కుశల్యపత్యాద్యైర్యుక్తో ముక్తస్సుహృద్వృతః ॥ 16

అంగ - ఓయీ!, మహాభాగ - గొప్ప భాగ్యవంతుడా!, నః - మా, సఖా - మిత్రుడు, ముక్తః - కారాగారమునుండి విడుదలయైనవాడు, శూరనందనః - శూరుని పుత్రుడు అగు వసుదేవుడు, అపత్య-ఆద్యైః - సంతానము మొదలగువారితో, యుక్తః - కూడినవాడై, సుహృద్-వృతః - మిత్రులచే చుట్టువారబడినవాడై, కుశలీ - క్షేమము గలవాడుగా, ఆస్తే కచ్చిత్ - ఉన్నాడా?

ఓయీ ఉద్ధవా! నీవు గొప్ప భాగ్యశాలివి. శూరుని పుత్రుడగు వసుదేవుడు మా మిత్రుడు. ఆయన కారాగారమునుండి విడుదల ఆయెను. ఆయన సంతానము, మిత్రులు, బంధువులు మొదలగువారితో కలిసి కుశలముగా నున్నాడా?

దిష్ట్యా కంసో హతః పాపస్సానుగస్స్వేన పాప్మనా ।
సాధూనాం ధర్మశీలానాం యదూనాం ద్వేష్టి యస్సదా ॥ 17

పాపః - పాపియగు, కంసః - కంసుడు, స-అనుగః - అనుచరులతో కూడినవాడై, స్వేన - తన, పాప్మనా - పాపముచే, హతః - సంహరించబడినవాడు, దిష్ట్యా - మంగళము, యః - ఎవడైతే, సదా - అన్ని వేళలా, సాధూనామ్ - సజ్జనులైనట్టియు, ధర్మశీలానామ్ - ధర్మశీలురైన, యదూనామ్ - యాదవులకు, ద్వేష్టి - ద్వేషించునో.

పాపియగు కంసుడు తన అనుచరులతో దైవానుగ్రహముచే తన పాపముచేతనే సంహరించబడినాడు. ఆతడు సజ్జనులు, ధర్మశీలురు అగు యాదవులను సర్వకాలములయందు ద్వేషించెడివాడు.

అపి స్మరతి నః కృష్ణో మాతరం సుహృదస్సఖీన్ ।
గోపాన్ వ్రజం చాత్మనాథం గావో బృందావనం గిరిమ్ ॥ 18

కృష్ణః - శ్రీకృష్ణుడు, నః - మమ్ములను, మాతరమ్ - తల్లిని, సుహృదః - బంధువులను, సఖీన్ - మిత్రులను, గోపాన్ - గోపాలకులను, ఆత్మనాథమ్ - తానే రక్షకుడుగా గల, వ్రజం చ - గోకులమును, గావః - గోవులు, బృందావనమ్ - బృందావనమును, గిరిమ్ - పర్వతమును, అపి స్మరతి - స్మరించుచున్నాడా?

శ్రీకృష్ణుడు మమ్ములను, తల్లిని, బంధువులను, మిత్రులను, గోపాలకులను, తానే రక్షకుడుగా గల గోకులమును, గోవులను, బృందావనమును, గోవర్ధన పర్వతమును స్మరించుచున్నాడా?

అప్యాయాస్యతి గోవిందస్స్వజనాన్ సకృదీక్షితుమ్ ।
తర్హి ద్రక్ష్యామ తద్వక్త్రం సునసం సుస్మితేక్షణమ్ ॥ 19

గోవిందః - గోవిందుడు, స్వజనాన్ - తనవారలను, సకృత్ - ఒక్కసారి, ఈక్షితుమ్ - చూచుటకు, అపి ఆయాస్యతి - వచ్చునా?, తర్హి - అప్పుడు, సునసమ్ - అందమైన ముక్కు కలిగినట్టియు, సుస్మిత-ఈక్షణమ్ - చక్కని చిరునవ్వుతోడి చూపులు కల, తద్-వక్త్రమ్ - ఆతని ముఖమును, ద్రక్ష్యామ - చూడగలము.

గోవిందుడు తనవారిని చూచుటకు ఒక్కసారి వచ్చునా? వచ్చినచో, అందమైన ముక్కు, చక్కని చిరునవ్వుతో కూడిన చూపులు గల ఆతని ముఖమును అప్పుడు చూచెదము.

దావాగ్నేర్వాతవర్షాచ్చ వృషసర్పాచ్చ రక్షితాః ।
దురత్యయేభ్యో మృత్యుభ్యః కృష్ణేన సుమహాత్మనా ॥ 20

సుమహాత్మనా - గొప్ప మహాత్ముడగు, కృష్ణేన - శ్రీకృష్ణునిచే, దావ-అగ్నేః - కార్చిచ్చునుండి, వాతవర్షాత్ చ - గాలి వాననుండి కూడ, వృషసర్పాత్ చ - వృషభాసురునినుండి అఘాసురునినుండి, దురత్యయేభ్యః - అతిక్రమించ శక్యము కాని, మృత్యుభ్యః - మృత్యువులనుండి, రక్షితాః - రక్షించబడినవారము.

శ్రీకృష్ణుడు గొప్ప మహాత్ముడు. ఆయన మమ్ములను కార్చిచ్చు, గాలివాన, వృషభాసురుడు, అఘాసురుడు మొదలైన అతిక్రమించ శక్యము కాని మృత్యువులనుండి రక్షించినాడు.

స్మరతాం కృష్ణవీర్యాణి లీలాఽపాంగనిరీక్షితమ్ ।
హసితం భాషితం చాంగ సర్వా నశ్శిథిలాః క్రియాః ॥ 21

అంగ - ఓయీ!, కృష్ణవీర్యాణి - శ్రీకృష్ణుని పరాక్రమములను, లీలా-అపాంగనిరీక్షితమ్ - విలాసతోడి ఓరచూపును, హసితమ్ - నవ్వును, భాషితం చ - పలుకును కూడ, స్మరతామ్ - స్మరించుచున్న, నః - మా, క్రియాః - పనులు, సర్వాః - అన్నీ, శిథిలాః - చెడినవి.

ఓయీ! మేము పనులను చేసుకుంటూండగా, శ్రీకృష్ణుని పరాక్రమములు, విలాసతోడి ఓరచూపు, నవ్వు, పలుకు గుర్తుకు వచ్చి ఆ పనులు చెడిపోవుచున్నవి.

సరిచ్ఛైలవనోద్దేశాన్ముకుందపదభూషితాన్ ।
ఆక్రీడానీక్షమాణానాం మనో యాతి తదాత్మతామ్ ॥ 22

ముకుందపదభూషితాన్ - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణ భగవానుని కాలిగుర్తులచే అలంకరించబడిన, సరిత్-శైలవన-ఉద్దేశాన్ - నది ఒడ్లు పర్వతములు అడవుల స్థానములను, ఆక్రీడాన్ - ఆట స్థలములను, ఈక్షమాణానామ్ - చూచుచున్న మాకు, మనః - మనస్సు, తద్-ఆత్మతామ్ - ఆయనతో అభేదమును, యాతి - పొందుచున్నది.

మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని పాదముల గుర్తులచే అలంకరించబడిన నదీతీరములను, పర్వతసానువులను, అడవులను, ఆట స్థలములను చూస్తూంటే మా మనస్సు ఆయనతో ఐక్యమును పొందుచున్నది.

మన్యే కృష్ణం చ రామం చ ప్రాప్తావిహ సురోత్తమౌ ।
సురాణాం మహదర్థాయ గర్గస్య వచనం తథా ॥ 23

కృష్ణమ్ - శ్రీకృష్ణుని, రామం చ - బలరాముని కూడ, సురాణామ్ - దేవతలయొక్క, మహద్-అర్థాయ - గొప్ప ప్రయోజనము కొరకు, ఇహ -

ఇచటకు, ప్రాప్తౌ - వచ్చిన, సుర-ఉత్తమౌ - దేవనాయకులనుగా, మన్యే - తలచెదను, యథా - ఏ విధముగానైతే, గర్గస్య - గర్గాచార్యుని, వచనమ్ - మాటయో.

శ్రీకృష్ణ బలరాములు దేవతలయొక్క గొప్ప ప్రయోజనమును సిద్ధింప జేయుటకై ఇచటకు వచ్చిన దేవనాయకులని నేను తలచెదను. గర్గాచార్యుడు అటులనే చెప్పినారు.

కంసం నాగాయుతప్రాణం మల్లౌ గజపతిం తథా ।
అవధిష్టాం లీలయైవ పశూనివ మృగాధిపః ।। 24

నాగ-అయుతప్రాణమ్ - పదివేల ఏనుగుల బలము కలిగిన, కంసమ్ - కంసుని, మల్లౌ - మల్లులిద్దరిని, తథా - అదే విధముగా, గజపతిమ్ - గజరాజును, లీలయా ఏవ - అవలీలగానే, మృగ-అధిపః - మృగేంద్రుడగు సింహము, పశూన్ ఇవ - పశువులను వలె, అవధిష్టామ్ - సంహరించిరి.

వారిద్దరు పదివేల ఏనుగుల బలము గల కంసుని, చాణూరముష్టికులనే ఇద్దరు మల్లులను, గజరాజును అవలీలగానే, మృగేంద్రుడగు సింహము పశువులను వలె, సంహరించిరి.

తాలత్రయం మహాసారం ధనుర్యష్టిమివేభరాట్ ।
బభంజైకేన హస్తేన సప్తాహమదధాద్గిరిమ్ ।। 25

తాలత్రయమ్ - మూడు తాటి చెట్ల పొడవు కలిగినట్టియు, మహాసారమ్ - మిక్కిలి దృఢమైన, ధనుః - ధనుస్సును, ఇభరాట్ - గజేంద్రుడు, యష్టిం ఇవ - కట్టెను వలె, ఏకేన - ఒక్క, హస్తేన - చేతితో, బభంజ - విరుగకొట్టెను, గిరిమ్ - పర్వతమును, సప్త-అహమ్ - ఏడు రోజులు నిరంతరముగా, అదధాత్ - పట్టుకొనెను.

మూడు తాటి చెట్ల పొడవు కలిగి మిక్కిలి దృఢమైన ధనుస్సును శ్రీకృష్ణుడు ఒక్క చేతితో, గజేంద్రుడు కట్టెను వలె, విరుగగొట్టెను. ఆయన ఏడు రోజులు నిరంతరముగా గోవర్ధన పర్వతమును పట్టుకొని నిలబడెను.

ప్రలంబో ధేనుకోఽరిష్టస్తృణావర్తో బకాదయః ।
దైత్యాస్సురాసురజితో హతా యేనేహ లీలయా ॥ 26

యేన - ఏ శ్రీకృష్ణునిచే, ఇహ - ఈ బృందావనమునందు, ప్రలంబః - ప్రలంబుడు, ధేనుకః - ధేనుకుడు, అరిష్టః - అరిష్టాసురుడు, తృణావర్తః - తృణావర్తుడు, బక-ఆదయః - బకుడు మొదలగు, సుర-అసురజితః - దేవతలను రాక్షసులను జయించిన, దైత్యాః - రాక్షసులు, లీలయా - అవలీలగా, హతాః - సంహరించబడిరో.

ఆ శ్రీకృష్ణుడు ఈ బృందావనములో ప్రలంబుడు, ధేనుకుడు, అరిష్టాసురుడు, తృణావర్తుడు, బకుడు, అఘాసురుడు మొదలైన రాక్షసులను అవలీలగా పరిమార్చెను. వారందరు దేవతలపై మరియు రాక్షసులపై ఇదివరలో విజయమును సాధించినవారే.

శ్రీశుక ఉవాచ ।
ఇతి సంస్మృత్య సంస్మృత్య నందః కృష్ణానురక్తధీః ।
అత్యుత్కంఠోఽభవత్తూష్ణీం ప్రేమప్రసరవిహ్వలః ॥ 27

కృష్ణ-అనురక్తధీః - శ్రీకృష్ణునియందు అనురాగము గల బుద్ధిగల, నందః - నందుడు, ఇతి - ఈ విధముగా, సంస్మృత్య సంస్మృత్య - పలుమార్లు స్మరించి, అతి-ఉత్కంఠః - అధికమగు ఉత్కంఠ గలవాడు, ప్రేమప్రసరవిహ్వలః - ప్రేమయొక్క ప్రవాహముచే వ్యాకులపడినవాడు, తూష్ణీం అభవత్ - మిన్నకుండెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- మనస్సులో శ్రీకృష్ణునిపై అధికమగు అనురాగము గల నందుడీ విధముగా పలు మార్లు స్మరించి, ప్రేమయొక్క ప్రవాహముచే వ్యాకులుడాయెను. శ్రీకృష్ణుని చూడాలనే అతిశయించిన ఉత్కంఠ గల ఆయన మిన్నకుండెను.

యశోదా వర్ణ్యమానాని పుత్రస్య చరితాని చ ।
శృణ్వంత్యశ్రూణ్యవాస్రాక్షీత్ స్నేహస్నుతపయోధరా ॥ 28

స్నేహస్నుతపయోధరా - ప్రేమచే స్రవించిన పాలిండ్లు గల, యశోదా - యశోద, వర్ణ్యమానాని - వర్ణింపబడుచున్న, పుత్రస్య - పుత్రుడగు

శ్రీకృష్ణుని, చరితాని చ - లీలలనైతే, శృణ్వంతీ - వినుచున్నదై, అశ్రూణి - కన్నీళ్లను, అవాస్రాక్షీత్ - వర్షించెను.

శ్రీకృష్ణునియందలి ప్రేమచే యశోద పాలిండ్లు పాలను స్రవించెను. ఆమె పుత్రుని లీలలు వర్ణించబడుతూంటే వింటూ కన్నీళ్లను వర్షించెను.

తయోరిత్థం భగవతి కృష్ణే నందయశోదయోః ।
వీక్ష్యానురాగం పరమం నందమాహోద్ధవో ముదా ।। 29

తయోః - ఆ, నందయశోదయోః - నందయశోదలకు, భగవతి కృష్ణే - శ్రీకృష్ణ భగవానునియందు, ఇత్థమ్ - ఇటువంటి, పరమమ్ - అతిశయించిన, అనురాగమ్ - అనురాగమును, వీక్ష్య - చూచి, ఉద్ధవః - ఉద్ధవుడు, ముదా - ఆనందముతో, నందమ్ - నందుని ఉద్దేశించి, ఆహ - పలికెను.

యశోదానందులకు శ్రీకృష్ణ భగవానునిపై ఇటువంటి అతిశయించిన ప్రేమ గలదు. దానిని చూచి ఉద్ధవుడు ఆనందముతో నందునితోనిట్లనెను.

ఉద్ధవ ఉవాచ ।
యువాం శ్లాఘ్యతమౌ నూనం దేహినామిహ మానద ।
నారాయణేఽఖిలగురౌ యత్కృతా మతిరీదృశీ ।। 30

మానద - సమ్మానమునీయువాడా!, ఇహ - ఈ లోకమునందు, దేహినామ్ - ప్రాణులలో, యువామ్ - మీరిద్దరు, నూనమ్ - నిశ్చయముగా, శ్లాఘ్యతమౌ - అత్యధికముగా కొనియాడదగినవారు, యత్ - ఏలయన, అఖిలగురౌ - సకలప్రాణులకు తండ్రియగు, నారాయణే - నారాయణునియందు, ఈదృశీ - ఇటువంటి, మతిః - ప్రేమ, కృతా - చేయబడినదో.

ఉద్ధవుడిట్లు పలికెను --- సమ్మానమునిచ్చే ఓ నందా! ఈ లోకములోని ప్రాణులలో మీరిద్దరు అత్యధికముగా కొనియాడ దగినవారు. ఏలయన, సకలప్రాణులకు తండ్రియగు నారాయణునిపై మీరు ఇటువంటి ప్రేమను కలిగియున్నారు.

ఏతౌ హి విశ్వస్య చ బీజయోనీ రామో ముకుందః పురుషః ప్రధానమ్,
అన్వీయ భూతేషు విలక్షణస్య జ్ఞానస్య చేశాత ఇమౌ పురాణౌ ॥ 31

రామః - బలరాముడు, ముకుందః చ - మోక్షప్రదాతయగు శ్రీకృష్ణ భగవానుడు, ఏతౌ - వీరిద్దరు, విశ్వస్య - జగత్తుయొక్క, బీజయోనీ - ఉపాదాననిమిత్తకారణములైన, ప్రధానమ్ - మాయాశక్తి, పురుషః - పూర్ణబ్రహ్మ, హి - నిశ్చయము, పురాణౌ - కాలాతీతులగు, ఇమౌ చ - వీరిద్దరు, భూతేషు - ప్రాణులయందు, అన్వీయ - ప్రవేశించి, విలక్షణస్య - వివిధభేదభిన్నమైన, జ్ఞానస్య - అంతఃకరణవిశిష్టమగు జ్ఞానమునకు, ఈశాతే - అంతర్యాములై నియంత్రించెదరు.

మోక్షప్రదాత, పూర్ణబ్రహ్మ అగు శ్రీకృష్ణుడు జగత్తుయొక్క నిమిత్తకారణము కాగా, మాయాశక్తియగు బలరాముడు ఉపాదాన కారణము. కాలాతీతులగు వీరిద్దరు ప్రాణులలో ప్రవేశించి, వివిధములైన అంతఃకరణములను అంతర్యాములై నియంత్రించుచున్నారు.

యస్మిఞ్జనః ప్రాణవియోగకాలే క్షణం సమావేశ్య మనో విశుద్ధమ్,
నిర్హృత్య కర్మాశయమాశు యాతి పరాం గతిం బ్రహ్మమయోఽర్కవర్ణః।

జనః - మానవుడు, ప్రాణవియోగకాలే - ప్రాణము పోయే సమయమునందు, విశుద్ధమ్ - పరిశుద్ధమైన, మనః - మనస్సును, యస్మిన్ - ఎవనియందైతే, సమావేశ్య - ఏకాగ్రము చేసి, కర్మ-ఆశయమ్ - కర్మల రాశిని, ఆశు - వెంటనే, నిర్హృత్య - దహించి, పరామ్ - సర్వోత్కృష్టమైన, గతిమ్ - మోక్షమును, యాతి - పొందునో, అర్కవర్ణః - సూర్యుని వలె స్వయంప్రకాశుడు, బ్రహ్మమయః - బ్రహ్మలీనుడు అగునో.

మానవుడు ప్రాణము పోయే సమయములో మనస్సును ఆ పరమాత్మపై ఏకాగ్రము చేసినచో, వాని కర్మరాశి వెంటనే దగ్ధమగును. అట్టివాడు సర్వోత్కృష్టపురుషార్థమగు మోక్షమును పొంది స్వయంప్రకాశపరబ్రహ్మయందు విలీనమగును. 32

తస్మిన్ భవంతావఖిలాత్మహేతౌ
నారాయణే కారణమర్త్యమూర్తౌ ।

భావం విధత్తాం నితరాం మహాత్మన్
కిం వావశిష్టం యువయోస్సుకృత్యమ్ ॥ 33

అఖిల-ఆత్మహేతౌ - సకలజగత్తునకు ఉపాదాననిమిత్తకారణము·లైనట్టియు, కారణమర్త్యమూర్తౌ - కారణముచే మానవరూపమును దాల్చినట్టియు, మహాత్మన్ - సర్వవ్యాపకుడైన, తస్మిన్ - ఆ, నారాయణే - నారాయణునియందు, భవంతౌ - మీరిద్దరు, నితరామ్ - నిరతిశయమైన, భావమ్ - అనురాగమును, విధత్తామ్ - చేసిరి, యువయోః - మీకిద్దరికి, సుకృత్యమ్ - మంచి కర్మ, కిం వా - ఏది, అవశిష్టమ్ - మిగిలియున్నది?

ఆ నారాయణుడే సకలజగత్తునకు ఉపాదాననిమిత్తములగుచున్నాడు. ఆయన దేవకార్యమును చక్కబెట్టుటకై మానవరూపమును దాల్చిన సర్వవ్యాపకుడు. ఆయనయందు మీరిద్దరు నిరతిశయమైన అనురాగమును చేసిరి. మీరింకనూ చేయవలసిన పుణ్యకర్మ మిగిలియున్నదా? (లేదు).

ఆగమిష్యత్యదీర్ఘేణ కాలేన వ్రజమచ్యుతః ।
ప్రియం విధాస్యతే పిత్రోర్భగవాన్ సాత్వతాం పతిః ॥ 34

సాత్వతామ్ - యాదవులకు (భక్తులకు), పతిః - పాలకుడగు, అచ్యుతః భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, అదీర్ఘేణ - దీర్ఘము కాని, కాలేన - కాలముచే, వ్రజమ్ - గోకులమును గూర్చి, ఆగమిష్యతి - రాగలడు, పిత్రోః - తల్లిదండ్రులకు, ప్రియమ్ - ప్రీతిని, విధాస్యతే - కలుగ జేయగలడు.

యాదవప్రభుడు (భక్తపాలకుడు) అగు శ్రీకృష్ణ భగవానుడు తొందరలోనే గోకులమునకు వచ్చి తల్లిదండ్రులకు ప్రీతిని కలిగించగలడు.

హత్వా కంసం రంగమధ్యే ప్రతీపం సర్వసాత్వతామ్ ।
యదాహ వస్సమాగత్య కృష్ణస్సత్యం కరోతి తత్ ॥ 35

కృష్ణః - శ్రీకృష్ణుడు, సర్వసాత్వతామ్ - సకలయాదవులకు, ప్రతీపమ్ - శత్రువగు, కంసమ్ - కంసుని, రంగమధ్యే - మల్లరంగముయొక్క మధ్యయందు, హత్వా - వధించి, వః - మిమ్ములను గురించి, సమాగత్య - కలిసి, యత్ - ఏ మాటను, ఆహ - చెప్పెనో, తత్ - దానిని, సత్యమ్ - సత్యమునుగా, కరోతి - చేయును.

శ్రీకృష్ణుడు సకలయాదవులకు (భక్తులకు) శత్రువగు కంసుని మల్లరంగము మధ్యలో వధించిన వెంటనే మీ వద్దకు వచ్చి ఏ మాటను చెప్పెనో, దానిని ఆయన తప్పక నిలబెట్టుకొనును.

మా ఖిద్యతం మహాభాగౌ ద్రక్ష్యథః కృష్ణమంతికే ।
అంతర్హృది స భూతానామాస్తే జ్యోతిరివైధసి ॥ 36

మహాభాగౌ - ఓ మహాభాగ్యశాలులారా!, మా ఖిద్యతమ్ - మీరిద్దరు ఖేదపడకుడు, అంతికే - తొందరలో, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ద్రక్ష్యథః - చూడగలరు, సః - ఆయన, భూతానామ్ - ప్రాణులయొక్క, అంతః-హృది - హృదయము లోపల, జ్యోతిః - అగ్ని, ఏధసి ఇవ - కట్టెయందు వలె, ఆస్తే - ఉన్నాడు.

ఓ యశోదానందులారా! మీరు మహాభాగ్యశాలురు. మీరు ఖేదపడకుడు. మీరు తొందరలో శ్రీకృష్ణుని చూచెదరు. కట్టెలయందు అగ్ని వలె, ఆయన ప్రాణుల హృదయము లోపల ఉన్నాడు.

న హ్యస్యాస్తి ప్రియః కశ్చిన్నాప్రియో వాఽస్త్యమానినః ।
నోత్తమో నాధమో నాపి సమానస్యాసమోఽపి వా ॥ 37

అమానినః - దేహాభిమానము లేనట్టియు, సమానస్య - సమదృష్టి గల, అస్య - ఈ శ్రీకృష్ణునకు, కశ్చిత్ - ఎవడైననూ, ప్రియః - ప్రియుడు, న అస్తి హి - నిశ్చయముగా లేడు, అప్రియః వా - ప్రియుడు కానివాడు గాని, న - లేడు, ఉత్తమః - గొప్పవాడు, న - లేడు, అధమః అపి - తక్కువవాడు కూడ, న - లేడు, ఆసమః అపి వా - అన్ని విధములుగా సమానమైనవాడైనా, న - లేడు.

శ్రీకృష్ణుడు దేహాభిమానము లేనివాడు, సమదృష్టి గలవాడు. ఆయనకు ఎవడైననూ ప్రియుడు గాని, ప్రియము కానివాడు గాని, ఎక్కువ వాడు గాని, తక్కువ వాడు గాని లేడు. ఆయనకు అన్ని విధములుగా సమానమైనవాడు, అనగా ఉపేక్షించదగినవాడైననూ లేడు.

న మాతా న పితా తస్య న భార్యా న సుతాదయః ।
నాత్మీయో న పరశ్చాపి న దేహో జన్మ ఏవ చ ॥ 38

తస్య - ఆయనకు, మాతా - తల్లి, న - లేదు, పితా - తండ్రి, న - లేదు, భార్యా - భార్య, న - లేదు, సుత-ఆదయః - పుత్రుడు మొదలగువారు, న - లేరు, ఆత్మీయః - తనవాడు, న - లేడు, పరః చ అపి - పరాయివాడు కూడ, న - లేడు, దేహః - దేహము, న - లేదు, జన్మ ఏవ చ - పుట్టుకయైననూ, న - లేదు.

ఆయనకు తల్లి, తండ్రి, భార్య, పుత్రుడు, సోదరుడు మొదలగువారు, తన వాడు, పరాయి వాడు, దేహము, పుట్టుక అనేవి లేనే లేవు.

న చాస్య కర్మ వా లోకే సదసన్మిశ్రయోనిషు ।
క్రీడార్థస్సోఽపి సాధూనాం పరిత్రాణాయ కల్పతే ॥ 39

లోకే - లోకమునందు, అస్య - ఈయనకు, కర్మ వా - కర్మయైననూ, న చ - లేనే లేదు, సత్-అసత్-మిశ్రయోనిషు - దేవాదులయందు పశ్వాదులయందు మానవులయందు, క్రీడా-అర్థః - లీలయే ప్రయోజనముగా గలది, సః అపి - ఆ జన్మ కూడ, సాధూనామ్ - సత్పురుషుల, పరిత్రాణాయ - రక్షించుట కొరకై, కల్పతే - ప్రకటమగును.

ఈ లోకములో ఈయనకు కర్మబంధము లేదు. ఐనా, లీల కొరకు సత్పురుషులను రక్షించుటకై ఆయన దేవాది సద్యోనులలో, పశ్వాది అసద్యోనులలో, మానవుడనే మిశ్రయోనియందు స్వేచ్ఛచే ప్రకటమగును.

సత్త్వం రజస్తమ ఇతి భజతే నిర్గుణో గుణాన్ ।
క్రీడన్నతీతోఽత్ర గుణైస్సృజత్యవతి హంత్యజః ॥ 40

నిర్గుణః - గుణములు లేనివాడు, అజః - పుట్టుక లేనివాడు అగు పరమాత్మ, సత్త్వమ్ - సత్త్వము, రజః - రజస్సు, తమః - తమస్సు, ఇతి - అనే, గుణాన్ - గుణములను, భజతే - సేవించును, అతీతః - అతీతుడైననూ, అత్ర - ఈ లోకమునందు, క్రీడన్ - క్రీడించువాడై, గుణైః - గుణములతో, సృజతి - సృష్టించును, అవతి - పాలించును, హంతి - విలీనము చేసుకొనును.

ఆ పరమాత్మ గుణములకతీతుడు, పుట్టుక లేనివాడు. ఐననూ, ఆయన సత్త్వరజస్తమోగుణములను సేవించును. ఆయన ఈ లోకమునందు

క్రీడించును. ఈ లోకమును ఆయన గుణములతో సృష్టించి, పాలించి, తనలో విలీనము చేసుకొనును.

యథా భ్రమరికాదృష్ట్యా భ్రామ్యతీవ మహీయతే ।
చిత్తే కర్తరి తత్రాఽఽత్మా కర్తేవాహంధియా స్మృతః ॥ 41

యథా - ఏ విధముగానైతే, భ్రమరికాదృష్ట్యా - గిర గిర తిరుగుతూ చూసే చూపుచే, మహీ - భూమి, భ్రామ్యతి ఇవ - తిరుగుచున్నది వలె, ఈయతే - కనబడునో, చిత్తే - చిత్తము, కర్తరి - క్రియను చేయుచుండగా, తత్ర - దానియందు, అహంధియా - నేననే బుద్ధిచే, ఆత్మా - ఆత్మ, కర్తా ఇవ - కర్త వలె, స్మృతః - తెలియబడినది.

గిర గిర తిరిగే చక్రముపై కూర్చుని తిరిగినప్పుడు భూమియే తిరుగుచున్నట్లు కానవచ్చును. అదే విధముగా, చిత్తము పనులను చేయుచుండ, దానియందు నేననే తాదాత్మ్యబుద్ధిచే ఆత్మ (తాను) యే కర్తవలె అనుభవమునకు వచ్చును. (ఈశ్వరునియందు కర్తృత్వము లేదు).

యువయోరేవ నైవాయమాత్మజో భగవాన్ హరిః ।
సర్వేషామాత్మజో హ్యాత్మా పితా మాతా స ఈశ్వరః ॥ 42

అయమ్ - ఈ, భగవాన్ హరిః - శ్రీకృష్ణ భగవానుడు, యువయోః - మీ ఇద్దరి, ఆత్మజః ఏవ - కొడుకు మాత్రమే, న ఏవ - కానే కాదు, హి - ఏలయన, సః - ఆ, ఈశ్వరః - ఈశ్వరుడు, సర్వేషామ్ - అందరికీ, ఆత్మజః - కొడుకు, ఆత్మా - ఆత్మ, పితా - తండ్రి, మాతా - తల్లి.

ఈ శ్రీకృష్ణ భగవానుడు మీ ఇద్దరికి మాత్రమే పుత్రుడు కానే కాదు. ఎందుకంటే, ఆ ఈశ్వరుడు అందరికీ పుత్రుడు మాత్రమే గాక, ఆత్మ, తండ్రి, తల్లి కూడ అగును.

దృష్టం శ్రుతం భూతభవద్భవిష్యత్ స్థాస్నుశ్చరిష్ణుర్మహదల్పకం చ,
వినాఽచ్యుతాద్వస్తు తరాం న వాచ్యం స ఏవ సర్వం పరమార్థభూతః।

దృష్టమ్ - చూడబడినది, శ్రుతమ్ - వినబడినది, భూతభవద్-భవిష్యత్ - గడచినది వర్తమానకాలములోనిది రాబోయే కాలములోనిది, స్థాస్నుః -

కదలనిది, చరిష్ణుః - కదిలేది, మహత్ - పెద్దది, అల్పకం చ - చిన్నది కూడ, వస్తు - వస్తువు, అచ్యుతాత్ వినా - వినాశము లేని పరబ్రహ్మ లేకుండా, న తరాం వాచ్యమ్ - ఉన్నదని చెప్పుటకు సుతరాము వీలు లేనిది, సర్వమ్ - సర్వము, పరమ-అర్థభూతః - పరమార్థతత్త్వమైన, సః ఏవ - ఆ పరమాత్మయే. 43

చూచినది, విన్నది, గడచిపోయినది, ఇప్పటిది, భవిష్యత్తులోనిది, పెద్దది, చిన్నది, వస్తువు ఏదైనా ఆ పరమాత్మ లేకుండా దానికి వస్తువుగా మనుగడయే లేదు. సర్వము పరమార్థసద్రూపుడగు పరమాత్మయే.

ఏవం నిశా సా బ్రువతోర్వ్యతీతా నందస్య కృష్ణానుచరస్య రాజన్,
గోప్యస్సముత్థాయ నిరూప్య దీపాన్వాస్తూన్సమభ్యర్చ్య దధీన్యమథ్నన్

రాజన్ - ఓ రాజా!, నందస్య - నందుడు, కృష్ణ-అనుచరస్య - కృష్ణుని అనుచరుడగు ఉద్ధవుడు, ఏవమ్ - ఈ విధముగా, బ్రువతోః - మాటలాడుచుండగా, సా - ఆ, నిశా - రాత్రి, వ్యతీతా - గడచినది, గోప్యః - గోపికలు, సముత్థాయ - నిద్ర లేచి, దీపాన్ - దీపములను, నిరూప్య - వెలిగించి, వాస్తూన్ - ముంగడ మొదలగువాటిని, సంపూజ్య - ముగ్గులతో అలంకరించి, దధీని - పెరుగులను, అమథ్నన్ - చిలికిరి. 44

ఓ పరీక్షిన్మహారాజా! నందుడు, శ్రీకృష్ణుని అనుచరుడగు ఉద్ధవుడు మాటలాడుచుండగనే ఆ రాత్రి గడిచిపోయెను. ఇంతలో గోపికలు (తెల్లవారు జామున) నిద్ర లేచి దీపములను వెలిగించి, ముంగిట వాకిటి మొదలగువాటిని ముగ్గులతో అలంకరించి, పెరుగులను చిలికిరి.

తా దీపదీప్తైర్మణిభిర్విరేజూ రజ్జూర్వికర్షద్భుజకంకణస్రజః ।
చలన్నితంబస్తనహారకుండలత్విషత్కపోలారుణకుంకుమాననాః ।। 45

రజ్జూః - త్రాళ్లను, వికర్షద్-భుజకంకణస్రజః - లాగే చేతులయందు కంకణముల వరుసలు గలవారు, చలత్-నితంబస్తనహారకుండలత్విషత్-కపోల-అరుణకుంకుమ-ఆననాః - కదలాడే నితంబములు స్తనములు హారములు గలవారు కుండలములచే ప్రకాశించే చెక్కిళ్లు గలవారు ఎర్రని కుంకుమ గల ముఖములు గలవారు

అగు, తాః - ఆ గోపికలు, దీపదీప్తైః - దీపములచే మెరియునట్లు చేయబడిన, మణిభిః - మణులతో, విరేజుః - అధికముగా ప్రకాశించిరి.

ఆ గోపికలు కంకణముల వరుసలు గల భుజములతో (పెరుగును చిలికే) త్రాళ్లను లాగుతూ ఉంటే నితంబములు, స్తనములు, హారములు కదలాడుచుండెను. వారి చెక్కిళ్లు కుండలముల కాంతులతో, ముఖములు ఎర్రని కుంకుమతో శోభిల్లెను. ఆభరణములయందలి మణులు దీపకాంతులలో ధగధగలాడుచుండ వారు అధికముగా ప్రకాశించిరి.

ఉద్గాయతీనామరవిందలోచనం వ్రజాంగనానాం దివమస్పృశద్ధ్వనిః ।
దధ్నశ్చ నిర్మంథనశబ్దమిశ్రితో నిరస్యతే యేన దిశామమంగలమ్।।46

అరవిందలోచనమ్ - పద్మములవంటి కన్నులు గల శ్రీకృష్ణుని గురించి, ఉద్గాయతీనామ్ - బిగ్గరగా గానము చేయుచున్న, వ్రజ-అంగనానామ్ - గోకులమునందలి యువతులయొక్క, ధ్వనిః - ధ్వని, దధ్నః - పెరుగు యొక్క, నిర్మంథనశబ్దమిశ్రితః చ - చిలికే ధ్వనితో కూడ కలిసినదై, దివమ్ - అంతరిక్షమును, అస్పృశత్ - తాకెను, యేన - ఏ ధ్వనిచే, దిశామ్ - దిక్కుల, అమంగలమ్ - అమంగళము, నిరస్యతే - పారద్రోలబడునో.

గోపికలు పద్మములవంటి కన్నులు గల శ్రీకృష్ణుని కీర్తిని బిగ్గరగా గానము చేయుచుండిరి. ఆ ధ్వని పెరుగును చిలికే ధ్వనితో కలిసి అంతరిక్షమును తాకి, దిక్కులయందు వ్యాపించి వాటియందలి అమంగళమును పారద్రోలును.

భగవత్యుదితే సూర్యే నందద్వారి వ్రజౌకసః ।
దృష్ట్వా రథం శాతకౌంభం కస్యాయమితి చాబ్రువన్ ।। 47

భగవతి సూర్యే - సూర్యభగవానుడు, ఉదితే - ఉదయించగా, వ్రజ-ఓకసః - గోకులవాసులు, నందద్వారి - నందుని ద్వారము వద్ద, శాతకౌంభమ్ - బంగరు, రథమ్ - రథమును, దృష్ట్వా - చూచి, అయమ్ - ఇది, కస్య - ఎవనిది?, ఇతి - అని, అబ్రువన్ చ - అడిగిరి.

సూర్యభగవానుడుదయించెను. గోకులవాసులు నందుని ఇంటి వద్ద బంగరు రథమును చూచి, ఇది యెవరిది? అని ప్రశ్నించుకొనిరి.

అక్రూర ఆగతః కిం వా యః కంసస్యార్థసాధకః ।
యేన నీతో మధుపురీం కృష్ణః కమలలోచనః ॥ 48

అక్రూరః - అక్రూరుడు, ఆగతః కిం వా - వచ్చినాడా యేమి?, యః - ఎవడైతే, కంసస్య - కంసునకు, అర్థసాధకః - పనులను చేసి పెట్టువాడో, యేన - ఎవనిచేనైతే, కమలలోచనః - పద్మములవంటి కన్నులు గల, కృష్ణః - శ్రీకృష్ణుడు, మధుపురీమ్ - మథురానగరమును గురించి, నీతః - కొనిపోబడినాడో.

కంసునకు పనులను చేసి పెట్టే అక్రూరుడు వచ్చినాడా యేమి? ఈతడు పద్మములవంటి కన్నులు గల కృష్ణుని మథురకు కొనిపోయినాడు.

కిం సాధయిష్యత్యస్మాభిర్భర్తుః ప్రేతస్య నిష్కృతిమ్ ।
ఇతి స్త్రీణాం వదంతీనాముద్ధవోఽగాత్కృతాహ్నికః ॥ 49

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే షట్చత్వారింశోఽధ్యాయః ॥

ప్రేతస్య - మరణించిన, భర్తుః - ప్రభువునకు, అస్మాభిః - మనతో, కిమ్ - ఏమి, నిష్కృతిమ్ - పిండప్రదానమును, సాధయిష్యతి - చేయునా యేమి?, ఇతి - అని, స్త్రీణామ్ - స్త్రీలు, వదంతీనామ్ - పలుకుచుండగా, కృత-ఆహ్నికః - చేయబడిన స్నానాదులు గల, ఉద్ధవః - ఉద్ధవుడు, అగాత్ - వెళ్లెను.

మరణించిన తన ప్రభువగు కంసునకు మనతో పిండములను చేసి సమర్పించునా యేమి? అని స్త్రీలు పలుకుచుండిరి. ఇంతలో ఉద్ధవుడు స్నానాదికమును పూర్తి చేసుకొని వారి వద్దకు వెళ్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో
ఉద్ధవుడు గోకులమునకు వెళ్లుటను వర్ణించే
నలుబది ఆరవ అధ్యాయము ముగిసినది (46).

* * * * *

# అథ సప్తచత్వారింశోఽధ్యాయః

## ఉద్ధవుడు గోపికలతో మాటలాడుట - భ్రమర గీతము

శ్రీశుక ఉవాచ ।
తం వీక్ష్య కృష్ణానుచరం వ్రజస్త్రియః
ప్రలంబబాహుం నవకంజలోచనమ్ ।
పీతాంబరం పుష్కరమాలినం లస-
న్ముఖారవిందం మణిమృష్టకుండలమ్ ॥ 1

కృష్ణ-అనుచరమ్ - శ్రీకృష్ణుని అనుచరుడైనట్టియు, ప్రలంబబాహుమ్ - పొడవైన చేతులు కలిగినట్టియు, నవకంజలోచనమ్ - అప్పుడే వికసించిన పద్మములవంటి కన్నులు కలిగినట్టియు, పీత-అంబరమ్ - పచ్చని వస్త్రమును దాల్చినట్టియు, పుష్కరమాలినమ్ - పద్మముల మాల కలిగినట్టియు, లసత్-ముఖ-అరవిందమ్ - ప్రకాశించే పద్మమువంటి ముఖము కలిగినట్టియు, మణిమృష్టకుండలమ్ - మణులతోడి ఉజ్జ్వలమైన కుండలములు గల, తమ్ - ఆ ఉద్ధవుని, వ్రజస్త్రియః - గోకులమునందలి స్త్రీలు, వీక్ష్య - చూచి.

శ్రీశుక మహర్షి పలికెను --- శ్రీకృష్ణుని అనుచరుడగు ఉద్ధవుడు పచ్చని వస్త్రమును, పద్మముల మాలను దాల్చెను. పొడవైన చేతులు, అప్పుడే వికసించిన పద్మముల వంటి కన్నులు, పద్మమువలె ప్రకాశించే ముఖము, మణులు పొదిగిన ఉజ్జ్వలకుండలములు గల ఆయనను గోపికలు చూచిరి.

శుచిస్మితాః కోఽయమపీచ్యదర్శనః కుతశ్చ కస్యాచ్యుతవేషభూషణః,
ఇతి స్మ సర్వాః పరివవ్రురుత్సుకాస్తముత్తమశ్లోకపదాంబుజాశ్రయమ్ ।2

అపీచ్యదర్శనః - మనోహరమైన రూపము గలవాడు, అచ్యుతవేషభూషణః - శ్రీకృష్ణ భగవానుని వేషము అలంకారములవంటి వేషము అలంకారములు గలవాడు అగు, అయమ్ - ఈతడు, కః - ఎవడు?, కుతః చ - ఎక్కడనుండి?, కస్య - ఎవనివాడు?, ఇతి - అంటూ, శుచిస్మితాః - స్వచ్ఛమగు చిరునగవు గల, సర్వాః - వారందరు, ఉత్సుకాః

- కుతూహలము గలవారై, ఉత్తమశ్లోకపద-అంబుజ-ఆశ్రయమ్ - పుణ్యకీర్తియగు శ్రీకృష్ణుని పద్మములవంటి పాదములను ఆశ్రయించిన, తమ్ - ఆ ఉద్ధవుని, పరివవ్రుః స్మ - చుట్టూ మూగిరి.

మనోహరమైన రూపము, శ్రీకృష్ణ భగవానుని వేషాలంకారములను పోలిన వేషాలంకారములు గల ఈతడు ఎవడు? ఎక్కడనుండి వచ్చినాడు? ఎవరివాడు? అంటూ స్వచ్ఛమగు చిరునగవు గల గోపికలందరు కుతూహలముతో ఆయన చుట్టూ చేరిరి. ఆయన పుణ్యకీర్తి యగు శ్రీకృష్ణుని పద్మములవంటి పాదములను నమ్ముకున్నవాడు.

తం ప్రశ్రయేణావనతాస్సుసత్కృతం సవ్రీడహాసేక్షణసూనృతాదిభిః ।
రహస్యపృచ్ఛన్నుపవిష్టమాసనే విజ్ఞాయ సందేశహరం రమాపతేః ॥3

తమ్ - ఆ ఉద్ధవుని, రమాపతేః - లక్ష్మీపతియగు శ్రీకృష్ణ భగవానుని, సందేశహరమ్ - సందేశమును తీసుకువచ్చినవానినిగా, విజ్ఞాయ - తెలిసి, సవ్రీడహాస-ఈక్షణసూనృత-ఆదిభిః - సిగ్గుతో కూడిన నవ్వు చూపులు మధురభాషణము మొదలగువాటితో, సుసత్కృతమ్ - బాగా సత్కరించబడినట్టియు, రహసి - ఏకాంతమునందు, ఆసనే - ఆసనము నందు, ఉపవిష్టమ్ - కూర్చున్న ఉద్ధవుని, అవనతాః - నమస్కరించిన గోపికలు, ప్రశ్రయేణ - వినయముతో, అపృచ్ఛన్ - అడిగిరి.

ఆ ఉద్ధవుడు లక్ష్మీపతియగు శ్రీకృష్ణుని సందేశమును తీసుకువచ్చినాడని తెలిసి ఆ గోపికలు ఆయనను ఏకాంతములో ఆసనముపై కూర్చుండబెట్టి, సిగ్గుతో కూడిన నవ్వుతో, చూపులతో, మధురభాషణముతో, అర్ఘ్యాదులతో సత్కరించిరి. తరువాత వారు ఆయనకు నమస్కరించి వినయముతో ఇట్లు ప్రశ్నించిరి.

జానీమస్త్వాం యదుపతేః పార్షదం సముపాగతమ్ ।
భర్త్రేహ ప్రేషితః పిత్రోర్భవాన్ ప్రియచికీర్షయా ॥ 4

యదుపతేః - యాదవప్రభుడగు శ్రీకృష్ణుని, పార్షదమ్ - అనుచరునిగా, సముపాగతమ్ - వచ్చినవానినిగా, త్వామ్ - నిన్ను, జానీమః - తెలియుదుము, భవాన్ - తమరు, భర్త్రా - శ్రీకృష్ణ ప్రభునిచే, పిత్రోః -

తల్లిదండ్రులకు, ప్రియచికీర్షయా - ప్రీతిని చేయాలనే కోరికతో, ఇహ - ఇచటకు, ప్రేషితః - పంపబడినవాడవు.

తమరు యాదవప్రభుడగు శ్రీకృష్ణుని అనుచరుడవనియు, ఆ ప్రభుడు తన తల్లిదండ్రులకు ప్రీతిని కలిగించగోరి పంపగా నీవు వచ్చినాడవనియు మాకు తెలియును.

అన్యథా గోవ్రజే తస్య స్మరణీయం న చక్ష్మహే ।
స్నేహానుబంధో బంధూనాం మునేరపి సుదుస్త్యజః ॥ 5

అన్యథా - అట్లు గానిచో, తస్య - ఆయనకు, గోవ్రజే - గోకులమునందు, స్మరణీయమ్ - స్మరించదగినది, న చక్ష్మహే - కానరాము, బంధూనామ్ - బంధువులయొక్క, స్నేహ-అనుబంధః - ప్రేమ అనే పాశము, మునేః అపి - మునికి కూడ, సుదుస్త్యజః - మిక్కిలి విడువ శక్యము కానిది.

అట్లు గానిచో (తల్లిదండ్రులు తప్ప), ఆయనకీ గోకులమునందు గుర్తు రాదగ్గది ఏదీ ఉన్నట్లు మాకు కనబడదు. బంధువులయందలి ప్రేమ అనే పాశమును మహర్షులు కూడ తేలికగా విడిచిపెట్టలేరు.

అన్యేష్వర్థకృతా మైత్రీ యావదర్థవిడంబనమ్ ।
పుంభిః స్త్రీషు కృతా యద్వత్సుమనస్స్వివ షట్పదైః ॥ 6

అన్యేషు - ఇతరులయందు, అర్థకృతా - ప్రయోజనము నిమిత్తముగా చేయబడిన, మైత్రీ - స్నేహము, యావత్ - ఎంతవరకైతే, అర్థవిడంబనమ్ - ప్రయోజనమును బట్టి అనుకరణము, పుంభిః - పురుషులచే, స్త్రీషు - స్త్రీలయందు, కృతా యద్వత్ - చేయబడిన స్నేహము వలె, షట్-పదైః - తుమ్మెదలచే, సుమనస్సు ఇవ - పుష్పములయందు వలె.

మానవుడు బంధువులు కానివారియందు స్నేహమును ఏదో ఒక ప్రయోజనము నిమిత్తముగా చేసి, ఆ ప్రయోజనము తీరువరకు స్నేహమును అనుకరించును. పురుషులు స్త్రీలయందు, తుమ్మెదలు పువ్వులయందు చేసే స్నేహము ఈ కోవకు చెందినదియే.

నిస్స్వం త్యజతి గణికా అకల్పం నృపతిం ప్రజాః ।
అధీతవిద్యా ఆచార్యమృత్విజో దత్తదక్షిణమ్ ॥ 7

గణికా - వేశ్య, నిస్స్వమ్ - సొత్తు లేనివానిని, త్యజతి - విడిచిపెట్టును, ప్రజాః - జనులు, అకల్పమ్ - సమర్థత లేని, నృపతిమ్ - రాజును, అధీతవిద్యాః - అధ్యయనము చేయబడిన విద్య గలవారు, ఆచార్యమ్ - ఆచార్యుని, ఋత్విజః - ఋత్విక్కులు, ధత్తదక్షిణమ్ - ఈయబడిన దక్షిణ గలవానిని.

వేశ్య సొత్తు లేనివానిని, జనులు సమర్థుడు కాని రాజును, విద్యాభ్యాసము పూర్తి అయిన విద్యార్థులు ఆచార్యుని, ఋత్విక్కులు దక్షిణలనిచ్చిన యజమానుని విడిచిపెట్టెదరు.

ఖగా వీతఫలం వృక్షం భుక్త్వా చాతిథయో గృహమ్ ।
దగ్ధం మృగాస్తథాఽరణ్యం జారో భుక్త్వా రతాం స్త్రియమ్ ॥ 8

ఖగాః - పక్షులు, వీతఫలమ్ - రాలిపోయిన పళ్లు గల, వృక్షమ్ - చెట్టును, అతిథయః చ * అతిథులు కూడ, భుక్త్వా - భుజించి, గృహమ్ - ఇంటిని, తథా - అదే విధముగా, మృగాః - మృగములు, దగ్ధమ్ - కాలిపోయిన, అరణ్యమ్ - అడవిని, జారః - జారుడు, భుక్త్వా - అనుభవించి, రతామ్ - ప్రీతితో కూడిన, స్త్రియమ్ - స్త్రీని (విడుచును).

పక్షులు పళ్లు రాలిపోయిన చెట్టును, అతిథులు భుజించిన పిదప ఆ ఇంటిని, మృగములు కాలిపోయిన అడవిని విడిచిపెట్టును. జారులు స్త్రీని అనుభవించి ఆమెకు ప్రేమ ఉన్ననూ విడిచిపెట్టెదరు.

ఇతి గోప్యో హి గోవిందే గతవాక్కాయమానసాః ।
కృష్ణదూతే వ్రజం యాతే ఉద్ధవే త్యక్తలౌకికాః ॥ 9

గోవిందే - గోవిందునియందు, గతవాక్-కాయమానసాః - లగ్నమైన వాక్కు దేహము మనస్సు గల, గోప్యః హి - గోపికలైతే, వ్రజమ్ - గోకులమును గురించి, యాతే - వెళ్లిన, కృష్ణదూతే - శ్రీకృష్ణుని దూతయగు, ఉద్ధవే - ఉద్ధవుని విషయములో, త్యక్తలౌకికాః - విడిచిపెట్టబడిన లోకస్మృతి గలవారు.

గోపికలు మనోవాక్కాయములతో గోవిందునకే అర్పితమైనవారు. శ్రీకృష్ణుని దూతయై గోకులమునకు వెళ్లిన ఉద్ధవుని యెదుట వారు లోకవ్యవహారములో ఉండే సంకోచమును విడిచిపెట్టిరి.

గాయంత్యః ప్రియకర్మాణి రుదత్యశ్చ గతహ్రియః ।
తస్య సంస్మృత్య సంస్మృత్య యాని కైశోరబాల్యయోః ॥ 10

తస్య - ఆ శ్రీకృష్ణుని, కైశోరబాల్యయోః - పదేళ్ల వయసు అంతకంటె తక్కువ వయస్సులయందు, యాని - ఏ, ప్రియకర్మాణి - ప్రీతికరములైన లీలలు గలవో వాటిని, సంస్మృత్య సంస్మృత్య - మరల మరల గుర్తు చేసుకొని, గాయంత్యః - గానము చేయువారు, గతహ్రియః - తొలగిన సిగ్గు గలవారై, రుదత్యః చ - ఏడ్చువారు కూడ.

ఆ శ్రీకృష్ణుడు చిన్నతనమునుండి పదేళ్ల వయస్సు వరకు చేసిన ప్రీతికరమైన లీలలేవి గలవో వాటిని ఆ గోపికలు మరల మరల గుర్తు చేసుకొని గానము చేయుచుండిరి. ఇంతేగాక, వారు సిగ్గు విడిచి ఏడ్చుచుండిరి.

కాచిన్మధుకరం దృష్ట్వా ధ్యాయంతీ కృష్ణసంగమమ్ ।
ప్రియప్రస్థాపితం దూతం కల్పయిత్వేదమబ్రవీత్ ॥ 11

కృష్ణసంగమమ్ - శ్రీకృష్ణునితోడి కలయికను, ధ్యాయంతీ - ధ్యానించుచున్న, కాచిత్ - ఒకానొక గోపిక, మధుకరమ్ - తుమ్మెదను, దృష్ట్వా - చూచి, ప్రియప్రస్థాపితమ్ - ప్రియుడగు శ్రీకృష్ణునిచే పంపబడిన, దూతమ్ - దూతనుగా, కల్పయిత్వా - కల్పించి, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

ఒకామె శ్రీకృష్ణునితోడి కలయికను ధ్యానించుచుండగా తుమ్మెద కనబడెను. ఆమె దానిని ప్రియుడగు శ్రీకృష్ణుడు పంపిన దూతగా కల్పించి ఇట్లు పలికెను.

గోప్యువాచ ।
మధుప కితవబంధో మా స్పృశాంఘ్రిం సపత్న్యాః
కుచవిలులితమాలాకుంకుమశ్మశ్రుభిర్నః ।

వహతు మధుపతిస్తన్మానినీనాం ప్రసాదం
యదుసదసి విడంబ్యం యస్య దూతస్త్వమీదృక్ ॥ 12

మధుప - ఓ తుమ్మెదా!, కితవబంధో - మోసగానికి పని చేసి పెట్టుదానా!, సపత్న్యాః - సవతియొక్క, కుచవిలులితమాలాకుంకుమ శ్మశ్రుభిః - స్తనములచే నొక్కబడిన వనమాలయందలి కుంకుమ గల మీసములతో, నః - మా, అంఘ్రిమ్ - పాదమును, మా స్పృశ - తాకవద్దు, మధుపతిః - మధుదేశప్రభువగు కృష్ణుడు, మానినీనామ్ - నగరస్త్రీల, తత్ - ఆ, ప్రసాదమ్ - అనుగ్రహమును, వహతు - ధరించుగాక!, యదుసదసి - యాదవుల సభయందు, విడంబ్యమ్ - పరిహాసము చేయదగ్గది, ఈదృక్ - ఇట్టి, త్వమ్ - నీవు, యస్య - ఎవ్వాని, దూతః - దూతవో.

గోపిక ఇట్లు పలికెను --- ఓ తుమ్మెదా! నీవు మోసగాడగు శ్రీకృష్ణునకు పని చేసిపెట్టుదానవు. సవతియొక్క వక్షఃస్థలముచే నొక్కబడిన వనమాలయందు ఆమె వక్షఃస్థలమునందలి కుంకుమ అంటుకొనగా, అది నీ మీసములకు తగుల్కొన్నది. నీవు అట్టి మీసములతో మా పాదములను తాకవద్దు. మధురానగరములోని నాగరికయువతుల ప్రసాదమైన ఆ కుంకుమను మధురానగరాధిపతియగు శ్రీకృష్ణుడే ధరించి యాదవుల సభలో అపహాస్యము పాలు అగును. అట్టి (కుంకుమ గల) వానికి నీవు ఇట్టి (కుంకుమ గల) దూతవు.

సకృదధరసుధాం స్వాం మోహినీం పాయయిత్వా
సుమనస ఇవ సద్యస్తత్యజేఽస్మాన్ భవాదృక్ ।
పరిచరతి కథం తత్పాదపద్మం తు పద్మా
హ్యపి బత హృతచేతా ఉత్తమశ్లోకజల్పైః ॥ 13

భవాదృక్ - నీవంటి ఆ శ్రీకృష్ణుడు, సకృత్ - ఒక్కసారి, స్వామ్ - తన, మోహినీమ్ - మోహపెట్టే, అధరసుధామ్ - అధరామృతమును, పాయయిత్వా - పానము చేయనిచ్చి, సుమనసః ఇవ - పుష్పములను వలె, అస్మాన్ - మమ్ములను, సద్యః - వెంటనే, తత్యాజే - విడిచిపెట్టెను, పద్మా తు - లక్ష్మీదేవియైతే, తత్-పాదపద్మమ్ - వాని పద్మమువంటి పాదమును, కథమ్ - ఏ విధముగా, పరిచరతి - సేవించుచున్నది?, బత -

అయ్యో!, హి - నిశ్చయముగా, ఉత్తమశ్లోకజల్పైః - పవిత్రమగు కీర్తి గలవాడనే మాటలచే, హృతచేతాః అపి - అపహరించబడిన మనస్సు గలది అయి ఉండును!

నీవు తేనెను త్రాగి పూవులను విడిచిపెట్టే మోసగాడవు. శ్రీకృష్ణుడు కూడ నీవంటి మోసగాడే. ఆతడు మోహమును కలిగించే తన అధరామృతమును ఒక్కసారి మాచే పానము చేయించి వెంటనే మమ్ములను విడిచిపెట్టినాడు. ఆ లక్ష్మీదేవియైతే ఇతగాడిని ఎట్లు సేవించు చున్నది చెప్పుమా? అయ్యో! పవిత్రమగు కీర్తి గలవాడు అనే నారదా దుల పొగడ్తలచే ఆమె మనస్సు దోచివేయబడి మోసపోయినది కాబోలు!

కిమిహ బహు షడంఘ్రే గాయసి త్వం యదూనా-
మధిపతిమగృహాణామగ్రతో నః పురాణమ్ ।
విజయసఖసఖీనాం గీయతాం తత్ప్రసంగః
క్షపితకుచరుజస్తే కల్పయంతీష్టమిష్టాః ॥ 14

షడ్-అంఘ్రే - ఓ తుమ్మెదా!, త్వమ్ - నీవు, ఇహ - ఇచట, అగృహాణామ్ - ఇళ్లు లేని, నః - మా, అగ్రతః - ఎదుట, పురాణమ్ - పాతవాడైన, యదూనాం అధిపతిమ్ - యాదవప్రభువగు శ్రీకృష్ణుని గురించి, బహు - అధికముగా, కిం గాయసి - ఏల గానము చేసెదవు?, విజయసఖసఖీనామ్ - అర్జునుని మిత్రుడగు శ్రీకృష్ణుని స్నేహితులైన మథురానగరయువతుల (యెదుట), తత్-ప్రసంగః - ఆయన ప్రసంగము, గీయతామ్ - గానము చేయబడుగాక!, క్షపితకుచరుజః - చెరిపి వేయబడిన హృదయముల దుఃఖము గల, ఇష్టాః - శ్రీకృష్ణునకు ప్రియురాండ్రైన ఆ యువతులు, తే - నీ కొరకు, ఇష్టమ్ - అభీష్టమును, కల్పయంతి - ఇచ్చెదరు.

ఓ తుమ్మెదా! నీవు అడవిలో నివసించే మా యెదుట యాదవప్రభుడగు శ్రీకృష్ణుని గురించి అధికప్రసంగమేల చేసెదవు? ఆయన మాకు పాతవాడే. ఆ అర్జునమిత్రునకు క్రొత్తగా మథురానగర యువతులు సఖురాండ్రైనారు. పోయి వాళ్ల దగ్గర ఆయన ప్రసంగమును

గానము చేయుము. ఆయన వారి హృదయములలోని దుఃఖమును పోగొట్టి వారికి ప్రియుడైనాడు. వారు నీకు నీవు కోరిన దానిని ఇచ్చెదరు.

దివి భువి చ రసాయాం కాః స్త్రియస్తద్దురాపాః
కపటరుచిరహాసభ్రూవిజృంభస్య యాస్స్యుః ।
చరణరజ ఉపాస్తే యస్య భూతిర్వయం కా
అపి చ కృపణపక్షే హ్యుత్తమశ్లోకశబ్దః ॥ 15

దివి - స్వర్గలోకమునందు, భువి చ - భూలోకమునందు కూడ, రసాయామ్ - పాతాళమునందు, యాః - ఏ, స్త్రియః - స్త్రీలు, స్యుః - ఉండెదరో, కపటరుచిరహాసభ్రూవిజృంభస్య - మోసపు అందమైన చిరునవ్వు కనుబొమల విరుపు గల, తత్ - వానికి, కాః - ఎవరు, దురాపాః - పొంద శక్యము కానివారు?, యస్య - ఎవ్వాని, చరణరజః - పాదధూళిని, భూతిః - లక్ష్మీదేవి, ఉపాస్తే - ఉపాసించుచున్నదో, వయమ్ - మేము, కాః - ఎవరము?, అపి చ - కానైతే, ఉత్తమశ్లోకశబ్దః - ఉత్తమమగు కీర్తి గలవాడు అనే బిరుదు, కృపణపక్షే హి - దీనులను దయ చూచువానియందు గదా!

ఆ శ్రీకృష్ణుడు మోసగాడు. వాని అందమైన చిరునవ్వునకు, కనుబొమల విరుపునకు లొంగిపోని స్త్రీ స్వర్గమునందు కాని, భూలోకమునందు కాని, పాతాళమునందు కాని ఎవరు గలరు? (ఎవ్వరూ లేరు). సాక్షాత్తుగా లక్ష్మీదేవి వాని పాదధూళిని సేవించుచున్నది. వానికి మా లెక్క యెంత? (ఏమీ కాదు). కానైతే, వానికి ఉత్తమశ్లోకుడు (గొప్ప కీర్తి గలవాడు) అనే బిరుదము గలదు. ఆ బిరుదము దీనులపై దయ చూపువానికి మాత్రమే సార్థకమగును సుమా! (శ్రీకృష్ణుడట్లు చేయుట లేదు గనుక, వానికి ఆ బిరుదు వ్యర్థమని వానితో చెప్పుము).

విసృజ శిరసి పాదం వేద్మ్యహం చాటుకారైః
అనునయవిదుషస్తేఽభ్యేత్య దౌత్యైర్ముకుందాత్ ।
స్వకృత ఇహ విసృష్టాపత్యపత్యన్యలోకా
వ్యసృజదకృతచేతాః కిం ను సంధేయమస్మిన్ ॥ 16

శిరసి - తలపైనున్న, పాదమ్ - కాలిని, విసృజ - విడిచిపెట్టుము, ముకుందాత్ - శ్రీకృష్ణునినుండి, అభ్యేత్య - అభ్యసించి, దౌత్యైః - దూతకార్యములైన, చాటుకారైః - ప్రియవచనములచే, అనునయవిదుషః - అనునయించుటలో పండితుడవైన, తే - నీ (మోసమును), అహమ్ - నేను, వేద్మి - ఎరుగుదును, అకృతచేతాః - చపలచిత్తుడగు కృష్ణుడు, స్వకృతే - తన కొరకై, విసృష్ట-అపత్యపతి-అన్యలోకాః - విడిచిపెట్టబడిన సంతానము భర్త పరలోకములు గల మమ్ములను, ఇహ - ఇచట, వ్యసృజత్ - విడిచిపెట్టెను, అస్మిన్ - వీనియందు, సంధేయమ్ - సంధితో పొందునది, కిం ను - ఏది గలదు?

ఓ తుమ్మెదా! నీ నక్కవినయములు కట్టిపెట్టు. నీ తలపైనున్న నా కాలిని విడిచిపెట్టుము. ఇట్టి దూతకార్యములను, ప్రియవచనములను ఆ మోసగాడగు శ్రీకృష్ణుని వద్ద నేర్చి పండితుడవైనావని నాకు తెలియును, శ్రీకృష్ణుడు చపలచిత్తుడు. ఆయన కొరకు మేము పిల్లలను, భర్తలను, పర లోకమును కూడ వదిలిపెడితే, ఆయన మమ్మలనీ బృందావనములో విడిచిపెట్టినాడు. వానితో సంధి చేసుకొని మేము పొందేది ఏమున్నది?

మృగయురివ కపీంద్రం వివ్యధే లుబ్ధధర్మా
స్త్రియమకృత విరూపాం స్త్రీజితః కామయానామ్ ।
బలిమపి బలిమత్త్వావేష్టయద్ ధ్వాంక్షవద్యః
తదలమసితసఖ్యైర్దుస్త్యజస్తత్కథార్థః ॥ 17

లుబ్ధధర్మా - క్రూర (కిరాతుని) స్వభావము గలవాడై, మృగయుః ఇవ - వేటగాడు వలె, కపి-ఇంద్రమ్ - వానరరాజును, వివ్యధే - కొట్టెను, స్త్రీజితః - స్త్రీచే జయించబడినవాడై, కామయానామ్ - కోరుచున్న, స్త్రియమ్ - స్త్రీని, విరూపామ్ - వికృతరూపనుగా, అకృత - చేసెను, యః - ఎవడైతే, ధ్వాంక్షవత్ - కాకివలె, బలిమ్ - పూజాదికమును, అత్త్వా - స్వీకరించి, బలిమ్ - మహాబలిని, ఆవేష్టయత్ - పాశములచే బంధింప జేసెను, తత్ - కావున, అసితసఖ్యైః - నల్లవాని స్నేహములతో, అలమ్ - చాలును, తత్-కథా-అర్థః - వాని గాథ అనే విషయము, దుస్త్యజః - విడువ శక్యము కానిది.

క్రూర (కిరాత) స్వభావము గల ఈతడు రామావతారములో వానరరాజగు వాలిని వేటగాడు వలె (దాగియుండి) సంహరించెను. ఇంతేగాక, ఒక స్త్రీకి వశుడై తనను ప్రేమించుచున్న మరియొక స్త్రీ (శూర్పణఖ) ను వికృత రూపము గలదానినిగా చేసెను. ఈతడు మహాబలి సమర్పించిన పూజాదికమును కాకి వలె స్వీకరించి ఆతనిని పాశములచే బంధింప జేసెను. కావున, ఈ నల్లవాని స్నేహములు మనకిక వద్దు. కాని, వాని లీలల ప్రసంగమును విడువ లేకున్నాము.

యదనుచరితలీలాకర్ణపీయూషవిప్రుట్-
సకృదదనవిధూతద్వంద్వధర్మా వినష్టాః ।
సపది గృహకుటుంబం దీనముత్సృజ్య దీనా
బహవ ఇహ విహంగా భిక్షుచర్యాం చరంతి ॥ 18

యద్-అనుచరితలీలాకర్ణపీయూషవిప్రుట్-సకృద్-అదనవిధూతద్వంద్వ ధర్మాః - ఎవ్వాని అవతారముల చరితమనే లీలలనే చెవుల అమృతముయొక్క బిందువును ఒక్కసారి ఆస్వాదించుటచే కడిగివేయబడిన సుఖదుఃఖాది ద్వంద్వములయందలి ఆసక్తి గలవారు, వినష్టాః - గాలిలో కలిసిపోయినవారు, సపది - వెనువెంటనే, దీనమ్ - దీనమైన, గృహకుటుంబమ్ - ఇంటియందలి కుటుంబమును, ఉత్సృజ్య - విడిచిపెట్టి, దీనాః - సుఖములు లేనివారై, విహంగాః ఇవ - పక్షులు వలె, ఇహ - ఈ లోకమునందు, బహవః - అనేకులు, భిక్షుచర్యామ్ - భిక్షువుల జీవనశైలిని, చరంతి - అనుసరించుచున్నారు.

ఆ శ్రీకృష్ణుని అవతారచరితములనే లీలలు చెవులకు అమృతము వలె నుండును. ఆ అమృతముయొక్క ఒక్క బిందువునైననూ ఒక్కసారి ఆస్వాదించిన వ్యక్తికి సుఖదుఃఖాది ద్వంద్వములయందలి ఆసక్తి కడిగివేయబడును. అట్టివారు లౌకికజీవనములో ఇమడలేక గాలిలో కలిసిపోయెదరు. ఇట్టివారు ఎంతోమంది ఈ లోకములో ఇల్లును, దీనులైన కుటుంబములోని వ్యక్తులను విడిచిపెట్టి సుఖము లేకుండా పక్షులవలె భిక్షాటనము చేస్తూ జీవించెదరు. (ఈయనను నమ్ముకున్నవారి గతి యింతే).

వయమృతమివ జిహ్మవ్యాహృతం శ్రద్దధానాః
కులికరుతమివాజ్ఞాః కృష్ణవధ్వో హరిణ్యః ।
దదృశురసకృదేతత్తన్నఖస్పర్శతీవ్ర-
స్మరరుజ ఉపమంత్రిన్ భణ్యతామన్యవార్తా ॥ 19

ఉపమంత్రిన్ - ఓ దూతా!, కులికరుతమ్ - వేటగాని గానమును, అజ్ఞాః - తెలియని, కృష్ణవధ్వః - కృష్ణసారమృగముయొక్క ప్రియురాండ్రైన, హరిణ్యః ఇవ - ఆడు లేళ్లు వలె, అజ్ఞాః - అజ్ఞానులమైన, వయమ్ - మేము, జిహ్మవ్యాహృతమ్ - మోసపు పలుకును, ఋతం ఇవ - సత్యమును వలె, శ్రద్దధానాః - శ్రద్ధ గలవారమై, అసకృత్ - పలుమార్లు, ఏతత్ - దీనిని, దదృశుః - చూచితిమి, తత్-నఖస్పర్శతీవ్రస్మరరుజః - వాని చేతి గోళ్ల స్పర్శచే అధికమైన ప్రేమయొక్క పీడ గలవారము, అన్యవార్తా - మరియొక వార్త, భణ్యతామ్ - చెప్పబడుగాక!

ఓ దూతా! కృష్ణసారమృగముయొక్క ప్రియురాండ్రైన ఆడు లేళ్లు వేటగాని గానమును విని అది మోసమని తెలియక వాని వలలో పడి దుఃఖించును. అదే విధముగా, మేము కూడ ఇతగాడి అసత్యవచనములను సత్యములని నమ్మి ఈ పరిస్థితిని పలుమార్లు చూచితిమి. ఈతని చేతి గోళ్ల స్పర్శచే ప్రేమ అధికమై పీడనే పొందితిమి. చాలు చాలు. ఇంకేదైనా వార్తను చెప్పుము.

ప్రియసఖ పునరాగాః ప్రేయసా ప్రేషితః కిం
వరయ కిమనురుంధే మాననీయోఽసి మేఽంగ ।
నయసి కథమిహాస్మాన్ దుస్త్యజద్వంద్వపార్శ్వం
సతతమురసి సౌమ్య శ్రీర్వధూస్సాకమాస్తే ॥ 20

అంగ - ఓయీ!, ప్రియసఖ - ప్రియుడగు శ్రీకృష్ణుని మిత్రమా!, ప్రేయసా - ప్రియుడగు శ్రీకృష్ణునిచే, ప్రేషితః - పంపబడినవాడవై, పునః - మరల, ఆగాః కిమ్ - వచ్చినావా యేమి?, వరయ - కోరుకొనుము, కిమ్ - దేనిని, అనురుంధే - పొంద గోరెదవు?, మే - నాకు, మాననీయః - గౌరవించ దగినవాడవు, అసి - అగుచున్నావు, ఇహ - ఇప్పుడు, దుస్త్యజద్వంద్వపార్శ్వమ్ - విడువ శక్యము కాని జంట గలవాని

సమీపమును గురించి, అస్మాన్ - మమ్ములను, కథమ్ - ఎట్లు, నయసి - నడిపించెదవు?, సౌమ్య - ఓ ప్రియదర్శనా!, శ్రీః - లక్ష్మీదేవి అనే, వధూః - యువతి, సాకమ్ - తోడుగా, సతతమ్ - ఎల్లవేళలా, ఉరసి - వక్షఃస్థలమునందు, ఆస్తే - ఉండును.

ఓయీ! నీవు శ్రీకృష్ణుని ప్రియమిత్రుడవు గదా! ప్రియుడగు శ్రీకృష్ణుడు పంపగా మరల విచ్చేసినావా? నీకేదేని కోరిక ఉన్నచో కోరుకొనుము. నిన్ను గౌరవించుట నా ధర్మము. ఇప్పుడు నీవు మమ్ములను ఆ శ్రీకృష్ణుని వద్దకు తీసుకుపోయెదవా? అది సరియగునా? ఆయన ఇప్పటికే జతగట్టి యున్నాడు. ఆతనికి ఆ జత విడువ శక్యము కాదు. ఓ ప్రియదర్శనా! ఆతనికి తోడుగా వక్షఃస్థలముపై లక్ష్మీదేవి అనే సుందరి ఎల్లవేళలా కాపురమున్నది సుమా!

అపి బత మధుపుర్యామార్యపుత్రోఽధునాఽఽస్తే
స్మరతి స పితృగేహాన్ సౌమ్య బంధూంశ్చ గోపాన్ ।
క్వచిదపి స కథా నః కింకరీణాం గృణీతే
భుజమగురుసుగంధం మూర్ధ్న్యధాస్యత్కదా ను ॥ 21

సౌమ్య - ఓ ప్రియదర్శనా!, ఆర్యపుత్రః - పూజనీయుడగు నందుని పుత్రుడు, అధునా - ఇప్పుడు, మధుపుర్యామ్ - మధురానగరియందు, అపి బత ఆస్తే - ఉన్నాడా?, సః - ఆతడు, పితృగేహాన్ - తండ్రి యింటిని, బంధూన్ - బంధువులను, గోపాన్ చ - గోపాలకులనైననూ, స్మరతి - స్మరించునా?, క్వచిత్ అపి - ఎప్పుడైననూ, కింకరీణామ్ - దాసులమైన, నః - మాయొక్క, కథాః - వార్తలను, గృణీతే - మాటలాడునా?, కదా ను - ఎప్పుడు, అగురుసుగంధమ్ - అగురు పరిమళము గల, భుజమ్ - చేతిని, మూర్ధ్ని - తలపై, అధాస్యత్ - ఉంచగలడు?

ఓ ప్రియదర్శనా! పూజనీయుడగు నందుని కొడుకు ఇప్పుడు మధురానగరిలోనే ఉన్నాడా? ఆతడు తండ్రి యింటిని, బంధువులను, గోపాలకులనైనా స్మరించునా? దాసీలమగు మాగురించి ఎప్పుడైనా మాటలాడునా? ఆతడు అగురువుయొక్క పరిమళము గల భుజమును మా తలపై ఎప్పుడు ఉంచగలడు?

శ్రీశుక ఉవాచ ।
అథోద్ధవో నిశమ్యైవం కృష్ణదర్శనలాలసాః ।
సాంత్వయన్ ప్రియసందేశైర్గోపీరిదమభాషత ॥ 22

అథ - తరువాత, ఉద్ధవః - ఉద్ధవుడు, ఏవమ్ - ఈ విధముగా, కృష్ణదర్శనలాలసాః - శ్రీకృష్ణుని చూచుటయందు ఉత్కంఠ గల, గోపీః - గోపికలను, నిశమ్య - చూచి, ప్రియసందేశైః - ప్రియుడగు శ్రీకృష్ణుని సందేశములతో, సాంత్వయన్ - ఓదార్చువాడై, ఇదమ్ - ఈ మాటను, అభాషత - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గోపికలు శ్రీకృష్ణుని చూచుటయందు ఈ విధమైన ఉత్కంఠను కలిగియున్నారనే విషయమును చూచిన ఉద్ధవుడు అప్పుడు వారిని ప్రియుడగు శ్రీకృష్ణుని సందేశవాక్యములతో ఓదార్చి ఇట్లు పలికెను.

ఉద్ధవ ఉవాచ ।
అహో యూయం స్మ పూర్ణార్థా భవత్యో లోకపూజితాః ।
వాసుదేవే భగవతి యాసామిత్యర్పితం మనః ॥ 23

అహో - ఆహా!, యూయమ్ - మీరు, పూర్ణ-అర్థాః - కృతకృత్యులు, స్మ - నిశ్చయము, భవత్యః - మీరు, లోకపూజితాః - లోకములయందు పూజించబడువారు, యాసామ్ - ఏ మీకైతే, వాసుదేవే భగవతి - శ్రీకృష్ణ భగవానునియందు, మనః - మనస్సు, ఇతి - ఈ విధముగా, అర్పితమ్ - సమర్పించబడినదో.

ఉద్ధవుడిట్లు పలికెను --- ఆహా! మీరు నిశ్చయముగా కృతార్థులు. మిమ్ములను లోకములు పూజించును. ఎందుకంటే, మీ మనస్సు శ్రీకృష్ణ భగవానునియందు ఇంతగా సమర్పితమైనది.

దానవ్రతతపోహోమజపస్వాధ్యాయసంయమైః ।
శ్రేయోభిర్వివిధైశ్చాన్యైః కృష్ణే భక్తిర్హి సాధ్యతే ॥ 24

దానవ్రతతపః-హోమజపస్వాధ్యాయసంయమైః - దానములు వ్రతములు తపస్సులు హోమములు జపములు వేదాధ్యయనము

ఇంద్రియనిగ్రహములచే, అన్యైః - ఇతరములగు, వివిధైః - పలురకముల, శ్రేయోభిః చ - కల్యాణసాధనములచే, కృష్ణే - శ్రీకృష్ణునియందలి, భక్తిః - భక్తి, సాధ్యతే హి - సాధించబడును గదా!

దానములు, వ్రతములు, తపస్సులు, హోమములు, జపములు, వేదాధ్యయనము, ఇంద్రియనిగ్రహము, ఇతరములగు కల్యాణ సాధనములు పరిపక్వమైనప్పుడు శ్రీకృష్ణునియందు భక్తి కలుగును.

భగవత్యుత్తమశ్లోకే భవతీభిరనుత్తమా ।
భక్తిః ప్రవర్తితా దిష్ట్యా మునీనామపి దుర్లభా ।। 25

ఉత్తమశ్లోకే - ఉత్తమమగు కీర్తి గల, భగవతి - శ్రీకృష్ణ భగవానునియందు, భవతీభిః - మీచే, అనుత్తమా - సర్వోత్తమమైనది, మునీనాం అపి - మునులకు కూడ, దుర్లభా - పొంద శక్యము కాని, భక్తిః - ప్రేమ, ప్రవర్తితా - చేయబడినది, దిష్ట్యా - మంగళము.

ఉత్తమకీర్తియగు శ్రీకృష్ణ భగవానునియందు మీరు సర్వోత్తమమైన భక్తిని చేసిరి. ఇది మంగళము. ఇట్టి భక్తి మునులకు కూడ సాధ్యము కాదు.

దిష్ట్యా పుత్రాన్ పతీన్ దేహాన్ స్వజనాన్ భవనాని చ ।
హిత్వాఽవృణీత యూయం యత్కృష్ణాఖ్యం పురుషం పరమ్ ।। 26

పుత్రాన్ - పుత్రులను, పతీన్ - భర్తలను, దేహాన్ - దేహములను, స్వజనాన్ - తమవారిని, భవనాని చ - ఇళ్లను కూడ, హిత్వా - విడిచిపెట్టి, యూయమ్ - మీరు, కృష్ణ-ఆఖ్యమ్ - శ్రీకృష్ణుడనే పేరు గల, పరం పురుషమ్ - పురుషోత్తముని, అవృణీత - వరించిరి అనేది, యత్ - ఏది గలదో అది, దిష్ట్యా - మంగళము.

మీరు పుత్రులను, భర్తలను, దేహాభిమానమును, తమ వారిని, ఇళ్లను కూడ విడిచిపెట్టి పురుషోత్తముడగు శ్రీకృష్ణుని వరించిరి. ఇది మంగళము.

సర్వాత్మభావోఽధికృతో భవతీనామధోక్షజే ।
విరహేణ మహాభాగా మహాన్మేఽనుగ్రహః కృతః ।। 27

మహాభాగాః - గొప్ప భాగ్యవతులారా!, అధోక్షజే - శ్రీకృష్ణ భగవానునియందు, భవతీనామ్ - మీకు, సర్వ-ఆత్మభావః - సర్వమునకు ఆత్మ అనే జ్ఞానము, అధికృతః - పొందబడినది, విరహేణ - విరహముచే, మే - నా కొరకు, మహాన్ - గొప్ప, అనుగ్రహః - అనుగ్రహము, కృతః - చేయబడినది.

ఓ గొప్ప భాగ్యవతులారా! శ్రీకృష్ణుని యథార్థతత్త్వము ఇంద్రియగోచరము కాని సర్వాత్మత్వము. దానిని మీరు పొందిరి. మీ విరహము కారణముగా ఈ సందర్భమును కనుట అనేది నాకు గొప్ప అనుగ్రహమైనది.

శ్రూయతాం ప్రియసందేశో భవతీనాం సుఖావహః ||
యమాదాయాగతో భద్రా అహం భర్తూ రహస్కరః || 28

భవతీనామ్ - మీకు, సుఖ-ఆవహః - సుఖమును కలిగించే, ప్రియసందేశః - ప్రియుడగు శ్రీకృష్ణుని సందేశము, శ్రూయతామ్ - వినబడుగాక!, భద్రాః - ఓ మంగళవతులారా!, భర్తుః - శ్రీకృష్ణ ప్రభునకు, రహః-కరః - రహస్యకార్యములను చేసే, అహమ్ - నేను, యమ్ - దేనిని, ఆదాయ - తీసుకొని, ఆగతః - వచ్చినవాడనో.

ఓ మంగళవతులారా! శ్రీకృష్ణ ప్రభునకు రహస్యకార్యములను చేసి పెట్టే నేను ఆయన సందేశమును తీసుకొని వచ్చినాను. మీకు ప్రియుడగు శ్రీకృష్ణుని సందేశము మీకు సుఖమును కలిగించగలదు. వినుడు.

శ్రీభగవానువాచ ।
భవతీనాం వియోగో మే న హి సర్వాత్మనా క్వచిత్ ।
యథా భూతాని భూతేషు ఖం వాయ్వగ్నిర్జలం మహీ ।
తథాఽహం చ మనఃప్రాణభూతేంద్రియగుణాశ్రయః || 29

మే - నాకు, భవతీనామ్ - మీయొక్క, వియోగః - వియోగము, క్వచిత్ - ఎప్పుడైననూ ఎక్కడైననూ, న హి - లేనే లేదు, సర్వ-ఆత్మనా - సర్వమునకు ఆత్మగా (ఉన్నాను), యథా - ఏ విధముగానైతే, ఖమ్ - ఆకాశము, వాయు-అగ్నిః - వాయువుతో కూడిన అగ్ని, జలమ్ - జలము,

మహీ - పృథివి అనే, భూతాని - పంచభూతములు, భూతేషు - ప్రాణులయందో, తథా - అదే విధముగా, అహం చ - నేను కూడ, మనఃప్రాణభూత-ఇంద్రియగుణ-ఆశ్రయః - మనస్సు ప్రాణాపానాదులు ఇంద్రియములు పంచభూతములు గుణములకు ఆశ్రయము.

శ్రీకృష్ణ భగవానుడిట్లు చెప్పెను -- సర్వమునకు ఆత్మ (పారతత్త్వము) నేనే. కాబట్టి నాకు ఎప్పుడైననూ ఎక్కడైననూ మీ వియోగము లేనే లేదు. ఆకాశము, వాయువు, అగ్ని, జలములు, పృథివి అనే పంచభూతములు ప్రాణులన్నింటియందు వ్యాపించి యున్నవి. అదే విధముగా, మనస్సు, ప్రాణాపానాదులు, ఇంద్రియములు, పంచభూతములు, సత్త్వరజస్తమోగుణములు అనువాటికి అధిష్ఠానముగా నేనే ఉన్నాను.

ఆత్మన్యేవాత్మనాఽఽత్మానం సృజే హన్మ్యనుపాలయే ।
ఆత్మమాయాఽనుభావేన భూతేంద్రియగుణాత్మనా ॥ 30

ఆత్మనా - నాచే, ఆత్మని ఏవ - నాయందే, ఆత్మానమ్ - నన్ను, ఆత్మమాయా-అనుభావేన - నా మాయాశక్తియొక్క మహిమచే, భూత-ఇంద్రియగుణ-ఆత్మనా - పంచభూతములు ఇంద్రియములు గుణముల రూపముగా, సృజే - సృష్టించెదను, హన్మి - ఉపసంహారము చేసెదను, అనుపాలయే - పాలించెదను.

నేను నా మాయాశక్తియొక్క ప్రభావముచే నన్ను నాయందే నాచేతనే పంచభూతములు, ఇంద్రియములు, సత్త్వరజస్తమోగుణముల రూపముగా క్రమముగా సృష్టించి, పాలించి, ఉపసంహరించెదను.

ఆత్మా జ్ఞానమయశ్శుద్ధో వ్యతిరిక్తోఽగుణాన్వయః ।
సుషుప్తిస్వప్నజాగ్రద్భిర్మాయావృత్తిభిరీయతే ॥ 31

జ్ఞానమయః - జ్ఞానఘనము, శుద్ధః - ధర్మాధర్మసంస్పర్శ లేనిది, వ్యతిరిక్తః - దేహేంద్రియాదులకంటె విలక్షణము, అగుణ-అన్వయః - సత్త్వరజస్తమోగుణముల స్పర్శ లేనిది, మాయావృత్తిభిః - మాయాశక్తియొక్క వృత్తులైన, సుషుప్తిస్వప్నజాగ్రద్భిః - సుషుప్తి స్వప్నము జాగ్రత్తు అనే అవస్థల ద్వారా, ఈయతే - పొందబడుచున్నది.

జ్ఞానఘనమగు ఆత్మయందు ధర్మాధర్మముల స్పర్శ గాని, సత్త్వ రజస్తమోగుణముల అనువృత్తి గాని లేదు. ఆత్మ దేహేంద్రియాదులకంటె విలక్షణము. మాయాశక్తి జాగ్రత్స్వప్నసుషుప్తులనే మూడు అవస్థలుగా ప్రకటమగుచున్నది. ఆ అవస్థల సాక్షిగా ఆత్మ అనుభవమునకు వచ్చును.

యేనేంద్రియార్థాన్ ధ్యాయేత మృషాస్వప్నవదుత్థితః ।
తన్నిరుంధ్యాదింద్రియాణి వినిద్రః ప్రత్యపద్యత ॥ 32

ఉత్థితః - నిద్ర లేచినవాడు, మృషాస్వప్నవత్ - మిథ్యయగు స్వప్నమును వలె, యేన - ఏ మనస్సుతో, ఇంద్రియ-అర్థాన్ - ఇంద్రియములకు విషయములగు శబ్దాదులను, ధ్యాయేత - ధ్యానించునో, ఇంద్రియాణి - ఇంద్రియములను, ప్రత్యపద్యత - పొందెనో, తత్ - ఆ మనస్సును, వినిద్రః - జాగరూకుడై, నిరుంధ్యాత్ - నిగ్రహించవలెను.

నిద్ర లేచినవాడు మిథ్యయే అయిన స్వప్నమును గురించి ధ్యానించును. అదే విధముగా మనస్సు మిథ్యయే అయిన ఇంద్రియవిషములగు శబ్దాదులను ధ్యానించును. దేహేంద్రియాదుల మనుగడ కూడ మనస్సుయొక్క చలనముపైననే ఆధారపడును. అట్టి మనస్సును మనము జాగరూకులమై నిగ్రహించవలెను.

ఏతదంతస్సమామ్నాయో యోగస్సాంఖ్యం మనీషిణామ్ ।
త్యాగస్తపో దమస్సత్యం సముద్రాంతా ఇవాపగాః ॥ 33

మనీషిణామ్ - పండితులకు, సమామ్నాయః - వేదోక్తమైన సాధనకలాపము, యోగః - కర్మయోగము, సాంఖ్యమ్ - జ్ఞానయోగము, త్యాగః - త్యాగము, తపః - తపస్సు, దమః - ఇంద్రియనిగ్రహము, సత్యమ్ - సత్యము, సముద్ర-అంతాః - సముద్రములో అంతమయ్యే, అపగాః ఇవ - నదులు వలె, ఏతద్-అంతః - ఈ మనోనిగ్రహమే ఫలముగా గలది.

నదులు అంతమయ్యేది సముద్రములోనే. అదే విధముగా వివేకవంతులకు వేదముచే చెప్పబడిన సాధనకలాపము, కర్మయోగము,

జ్ఞానయోగము, త్యాగము, తపస్సు, ఇంద్రియనిగ్రహము, సత్యము అనువాటికి అన్నింటికీ పర్యవసానము (ఫలము) ఈ మనోనిగ్రహమే.

యత్త్వహం భవతీనాం వై దూరే వర్తే ప్రియో దృశామ్ ।
మనసస్సన్నికర్షార్థం మదనుధ్యానకామ్యయా ॥ 34

ప్రియః - ప్రియుడనగు, అహమ్ - నేను, దృశామ్ - కన్నులకు, వై - నిశ్చయముగా, దూరే - దూరమునందు, వర్తే - ఉన్నాను అనేది, యత్ తు - ఏదైతే గలదో అది, మద్-అనుధ్యానకామ్యయా - నన్ను నిరంతరముగా ధ్యానించాలనే కోరికతో, మనసః - మనస్సునకు, సన్నికర్ష-అర్థమ్ - సాన్నిధ్యము కొరకు.

ప్రియుడనగు నేను మీ కన్నులకు దూరముగా నుండుట వాస్తవమే. మీరు నన్నే నిరంతరముగా ధ్యానిస్తూ మనస్సుతో నా సన్నిధిని అనుభవించాలనే ఆకాంక్షతో మాత్రమే నేను మీకు దూరముగా నున్నాను.

యథా దూరచరే ప్రేష్ఠే మన ఆవిశ్య వర్తతే ।
స్త్రీణాం చ న తథా చేతస్సన్నికృష్టేఽక్షిగోచరే ॥ 35

స్త్రీణామ్ - స్త్రీలకు, దూరచరే - దూరమునకు వెళ్లిన, ప్రేష్ఠే - ప్రియతమునియందు, యథా - ఏ విధముగానైతే, మనః - మనస్సు, ఆవిశ్య - ఏకాగ్రమై, వర్తతే - నిలుచునో, తథా - ఆ విధముగా, చేతః - మనస్సు, సన్నికృష్టే - సమీపమునందున్నట్టియు, అక్షిగోచరే - కంటికి కనబడేవానియందు, న చ - నిలువనే నిలువదు.

స్త్రీలకు దూరమునకు వెళ్లిన ప్రియతమునియందు ఏ విధముగానైతే మనస్సు ఏకాగ్రమై నిలుచునో, ఆ విధముగా దగ్గరగా కంటికి కనబడుతూ ఉండేవానియందు మనస్సు నిలబడదు.

మయ్యావేశ్య మనః కృత్స్నం విముక్తాశేషవృత్తి యత్ ।
అనుస్మరంత్యో మాం నిత్యమచిరాన్మాముపైష్యథ ॥ 36

విముక్త-అశేషవృత్తి - విడిచిపెట్టబడిన సకలవ్యాపారములు గల, మనః - మనస్సు, యత్ - ఏది గలదో దానిని, కృత్స్నమ్ - పూర్ణముగా, మయి

- నాయందు, ఆవేశ్య - ఏకాగ్రము చేసి, మామ్ - నన్ను, నిత్యమ్ - ఎల్లవేళలా, అనుస్మరంత్యః - స్మరించువారై, అచిరాత్ - తొందరగా, మామ్ - నన్ను, ఉపైష్యథ - పొందగలరు.

సకలవృత్తులను విడిచిపెట్టి మనస్సును పూర్ణముగా నాయందు ఏకాగ్రము చేసి ఎల్లవేళలా నన్నే స్మరించుడు. మీరు తొందరలో నన్ను పొందగలరు.

యా మయా క్రీడతా రాత్ర్యాం వనేఽస్మిన్ వ్రజ ఆస్థితాః ।
అలబ్ధరాసాః కల్యాణ్యో మాఽఽపుర్మద్వీర్యచింతయా ॥ 37

కల్యాణ్యః - ఓ పుణ్యవతులారా!, వ్రజే - గోకులమునందు, ఆస్థితాః - ఉండిపోయిన గోపికలు, అస్మిన్ - ఈ, వనే - బృందావనమునందు, రాత్ర్యామ్ - రాత్రియందు, క్రీడతా - క్రీడించిన, మయా - నాతో, అలబ్ధరాసాః - పొందబడని రాసక్రీడ గలవారు, మద్-వీర్యచింతయా - నా లీలల ధ్యానముచే, మా - నన్ను, ఆపుః - పొందిరి.

ఓ పుణ్యవతులారా! గోకులములో ఉంటూ, నేను బృందావనములో క్రీడించినప్పుడు నాతో రాసక్రీడలో పాల్గొనని గోపికలు నా లీలలనే ధ్యానిస్తూ నన్ను పొందిరి.

శ్రీశుక ఉవాచ ।
ఏవం ప్రియతమాదిష్టమాకర్ణ్య వ్రజయోషితః ।
తా ఊచురుద్ధవం ప్రీతాస్తత్సందేశాగతస్మృతీః ॥ 38

ఏవమ్ - ఈ విధముగా, ప్రియతమ-ఆదిష్టమ్ - ప్రియతముడగు శ్రీకృష్ణుని ఆదేశమును, ఆకర్ణ్య - విని, తాః - ఆ, వ్రజయోషితః - గోకులయువతులు, ప్రీతాః - ప్రీతి జెందినవారు, తత్-సందేశ-ఆగతస్మృతీః - ఆయనయొక్క సందేశముచే వచ్చిన స్మృతులు గలవారై, ఉద్ధవమ్ - ఉద్ధవుని గురించి, ఊచుః - పలికిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ప్రియతముడగు శ్రీకృష్ణుడు పంపిన ఈ సందేశమును విని ఆ గోపికలు ఆనందమును పొందిరి. వారికి ఆ

సందేశము వలన గడచిన లీలలు గుర్తుకు వచ్చెను. వారు ఉద్ధవునితోనిట్లనిరి.

గోప్య ఊచుః ।
దిష్ట్యాఽహితో హతః కంసో యదూనాం సానుగోఽఘకృత్ ।
దిష్ట్యాఽప్తైర్లబ్ధసర్వార్థైః కుశల్యాస్తేఽచ్యుతోఽధునా ॥ 39

యదూనామ్ - యాదవులకు, అహితః - శత్రువు, అఘకృత్ - పాపములను చేసినవాడు అగు, కంసః - కంసుడు, స-అనుగః - అనుచరులతో కూడినవాడై, హతః - వధించబడినవాడు, దిష్ట్యా - మంగళము, అధునా - ఇప్పుడు, ఆప్తసర్వ-అర్థైః - పొందబడిన సకలసంపదలు గల, ఆప్తైః - ఆప్తులతో, అచ్యుతః - శ్రీకృష్ణ భగవానుడు, కుశలీ - కుశలము గలవాడై, ఆస్తే - ఉన్నాడు, దిష్ట్యా - మంగళము.

గోపికలిట్లు పలికిరి. --- యాదవులకు శత్రువై పాపములను చేసిన కంసుడు వాని అనుచరులతో సహా వధించబడినాడు. ఇది మంగళము. శ్రీకృష్ణ భగవానుని ఆప్తులు సకలసంపదలను పొందినారు. వారితో కూడి ఆయన క్షేమముగా నున్నాడు. ఇది మంగళము.

కచ్చిద్గదాగ్రజస్సౌమ్య కరోతి పురయోషితామ్ ।
ప్రీతిం నస్స్నిగ్ధసవ్రీడహాసోదారేక్షణార్చితః ॥ 40

సౌమ్య - ఓ ప్రియదర్శనా!, నః - మాయొక్క, స్నిగ్ధసవ్రీడహాస-ఉదార-ఈక్షణ-అర్చితః - ప్రేమ నిండిన సిగ్గుతో కూడిన చిరునవ్వుతో కోరికలను తీర్చే చూపులతో ఆరాధించబడువాడు, గద-అగ్రజః - గదుడు అన్నగా గల శ్రీకృష్ణుడు, పురయోషితామ్ - నగరములోని యువతులకు, ప్రీతిమ్ - ప్రేమను, కచ్చిత్ కరోతి - చేయుచున్నాడా?

ఓ ప్రియదర్శనా! గదుని తమ్ముడగు శ్రీకృష్ణుని మేము ప్రేమ నిండిన చూపులతో, సిగ్గుతో కూడిన చిరునవ్వుతో, కోరికలను తీర్చే చూపులతో సత్కరించితిమి. ఆయన మథురానగరములోని యువతులకు ప్రీతిని కలిగించుచున్నాడా?

కథం రతివిశేషజ్ఞః ప్రియశ్చ వరయోషితామ్ ।
నానుబధ్యేత తద్వాక్యైర్విభ్రమైశ్చానుభాజితః ।। 41

రతివిశేషజ్ఞః - ప్రేమ అనే కళ బాగా తెలిసినవాడు, వరయోషితామ్ - సుందరమైన యువతులకు, ప్రియః చ - ప్రియుడు, తద్-వాక్యైః - వారి పలుకులచే, విభ్రమైః చ - విలాసలచే కూడ, అనుభాజితః - సత్కరించబడువాడు అగు శ్రీకృష్ణుడు, కథమ్ - ఏ విధముగా, న అనుబధ్యేత - వశము కాకుండును?

ప్రేమ అనే కళ బాగా తెలిసిన శ్రీకృష్ణుడు సుందరమైన యువతులకు ప్రియుడు అగును. వారు తమ పలుకులతో, విలాసలతో ఆయనను సత్కరించెదరు. ఆయన వారికి వశము కాకుండా ఎట్లుండును? (వశమగును).

అపి స్మరతి నస్సాధో గోవిందః ప్రస్తుతే క్వచిత్ ।
గోష్ఠిమధ్యే పురస్త్రీణాం గ్రామ్యాస్స్వైరకథాంతరే ।। 42

సాధో - ఓ సజ్జనుడా!, పురస్త్రీణామ్ - నగరమునందలి యువతులయొక్క, గోష్ఠిమధ్యే - సభయొక్క మధ్యయందు, స్వైరకథా-అంతరే - యథేచ్ఛగా చెప్పే గాథల మధ్యభాగము, ప్రస్తుతే - నడచుచుండగా, గ్రామ్యాః - పల్లెటూరివారమైన, నః - మమ్ములను, గోవిందః - గోవిందుడు, అపి స్మరతి - స్మరించుచున్నాడా?

ఓ సజ్జనుడా! గోవిందుడు నగరమునందలి యువతుల సభామధ్యమునందు యథేచ్ఛగా విహరిస్తూ కబుర్లాడుచుండును. ఆ ప్రసంగముల మధ్యలో పల్లెటూరివారమగు మమ్ములను స్మరించునా?

తాః కిం నిశాస్స్మరతి యాసు తదా ప్రియాభిః
బృందావనే కుముదకుందశశాంకరమ్యే ।
రేమే క్వణచ్చరణనూపురరాసగోష్ఠ్యాం
అస్మాభిరీడితమనోజ్ఞకథః కదాచిత్ ।। 43

ఈడితమనోజ్ఞకథః - స్తుతించబడిన మనోహరములగు గాథలు గల శ్రీకృష్ణుడు, తదా - అప్పుడు, కుముదకుందశశాంకరమ్యే - తెల్ల కలువలు తెల్ల గన్నేరు పువ్వులు చంద్రునితో సుందరమైన, బృందావనే - బృందా

వనమునందు, క్వణత్-చరణనూపురరాసగోష్ఠ్యామ్ - ధ్వని చేసే కాలి యందెలు గల రాససభయందు, ప్రియాభిః - ప్రియురాండ్రమగు, అస్మాభిః - మాతో, యాసు - ఏ రాత్రులయందు, రేమే - రమించెనో, తాః - ఆ, నిశాః - రాత్రులను, కదాచిత్ - ఒకప్పుడైనా, కిం స్మరతి - స్మరించునా?

అందరిచే కొనియాడబడే మనోహరములైన లీలలు గల శ్రీకృష్ణుడు బృందావనములో నుండెడివాడు. అప్పుడు తెల్ల కలువలు, తెల్ల గన్నేరు పువ్వులు, చంద్రునితో సుందరమైన అడవిలో రాససభ జరిగెడిది. మా కాలియందెల ధ్వనితో నినదించే ఆ సభలో ఆతడు ప్రియురాండ్రమగు మాతో రమించెడివాడు. ఆ రాత్రులను ఆతడు ఒకప్పుడైనా స్మరించునా?

అప్యేష్యతీహ దాశార్హస్తప్తాస్స్వకృతయా శుచా ।
సంజీవయన్ను నో గాత్రైర్యథేంద్రో వనమంబుదైః ॥ 44

స్వకృతయా - తనచే కలిగించబడిన, శుచా - దుఃఖముతో, తప్తాః - తపించుచున్న, నః - మమ్ములను, గాత్రైః - అవయవములచే, ఇంద్రః - పర్జన్యాధిపతి, అంబుదైః - మేఘములతో, వనం ఇవ - అడవిని వలె, సంజీవయన్ - ఉజ్జీవింపజేయుచున్నవాడై, దాశార్హః - దాశార్హవంశీయుడగు శ్రీకృష్ణుడు, ఇహ - ఇచటకు, అపి ఏష్యతి - వచ్చునా?

దాశార్హవంశీయుడగు శ్రీకృష్ణుని నిమిత్తముగా మేము దుఃఖముతో తపించబడుచున్నాము. పర్జన్యాధిపతియగు ఇంద్రుడు మేఘములతో వచ్చి అడవిని ఉజ్జీవింపజేయును. అదే విధముగా ఆతడు వచ్చి తన కరచరణాదులతో మమ్ములను ఉజ్జీవింప జేయునా?

కస్మాత్కృష్ణ ఇహాయాతి ప్రాప్తరాజ్యో హతాహితః ।
నరేంద్రకన్యా ఉద్వాహ్య ప్రీతస్సర్వసుహృద్వృతః ॥ 45

ప్రాప్తరాజ్యః - పొందబడిన రాజ్యము గలవాడు, హత-అహితః - వధించబడిన శత్రువులు గలవాడు, నర-ఇంద్రకన్యాః - మహారాజ పుత్రికలను, ఉద్వాహ్య - వివాహమాడి, ప్రీతః - సంతోషించువాడు, సర్వసుహృద్-వృతః - సకలబంధువులచే చుట్టువారబడువాడు, కృష్ణః - కృష్ణుడు, కస్మాత్ - ఎందువలన, ఇహ - ఇచటకు, ఆయాతి - వచ్చును?

శ్రీకృష్ణుడు ఇక్కడికి ఎందుకు వచ్చును? (రాడు). ఆతడు శత్రువును వధించి రాజ్యమును పొందినాడు. ఆతడు మహారాజకన్యలను వివాహమాడి సుఖించును. ఆతని చుట్టూ బంధువులు ఉండెదరు.

కిమస్మాభిర్వనౌకోభిరన్యాభిర్వా మహాత్మనః ।
శ్రీపతేరాప్తకామస్య క్రియేతార్థః కృతాత్మనః ॥ 46

మహాత్మనః - మహాత్ముడైనట్టియు, శ్రీపతేః - లక్ష్మీపతియైనట్టియు, ఆప్తకామస్య - పొందబడిన కామనలు కలిగినట్టియు, కృత-ఆత్మనః - మనోనిగ్రహము గల శ్రీకృష్ణునకు, వన-ఓకోభిః - అడవిలో నివసించే, అస్మాభిః - మనతో, అన్యాభిః వా - ఇతరస్త్రీలతో గాని, కిమ్ - ఏమి, అర్థః ప్రయోజనము, క్రియేత - చేయబడును?

శ్రీకృష్ణుడు మహాత్ముడు, లక్ష్మీపతి. ఆయన సకలకామనలు సిద్ధించినవాడు, మనోనిగ్రహము గలవాడు. ఆయనకు అడవిలో నివసించే మనము గాని, ఇతరస్త్రీలు గాని చేసే ఉపకారమేమున్నది?

పరం సౌఖ్యం హి నైరాశ్యం స్వైరిణ్యప్యాహ పింగలా ।
తజ్జానతీనాం నః కృష్ణే తథాప్యాశా దురత్యయా ॥ 47

నైరాశ్యమ్ - ఆశ లేకుండుట, పరమ్ - గొప్ప, సౌఖ్యం హి - సౌఖ్యము గదా!, స్వైరిణీ - వేశ్యయగు, పింగలా అపి - పింగళ కూడ, ఆహ - చెప్పెను, తత్ - ఆ విషయమును, జానతీనాం అపి - తెలిసినవారమే అయిననూ, నః - మాకు, కృష్ణే - శ్రీకృష్ణునియందు, తథా - ఆ విధముగా, దురత్యయా - అతిక్రమించ శక్యము కాని, ఆశా - ఆశ.

ఆశ లేకుండుట గొప్ప సౌఖ్యమని వేశ్యయగు పింగళ కూడ చెప్పెను. మనకా విషయము తెలియును. అయిననూ, మాకు శ్రీకృష్ణునియందు అతిక్రమించ శక్యము కాని అట్టి ఆశ గలదు.

క ఉత్సహేత సంత్యక్తుముత్తమశ్లోకసంవిదమ్ ।
అనిచ్ఛతోఽపి యస్య శ్రీరంగాన్న చ్యవతే క్వచిత్ ॥ 48

ఉత్తమశ్లోకసంవిదమ్ - పుణ్యకీర్తియగు శ్రీకృష్ణుని ఏకాంతవార్తను, సంత్యక్తుమ్ - విడిచిపెట్టుటకు, కః - ఎవడు, ఉత్సహేత - ఉత్సాహపడును?, అనిచ్ఛతః అపి - కోరకున్ననూ, యస్య - ఎవ్వాని, అంగాత్ - దేహమునుండి, శ్రీః - లక్ష్మీదేవి, క్వచిత్ - ఏనాడైననూ, న చ్యవతే - జారిపోదో.

పుణ్యకీర్తియగు శ్రీకృష్ణుని ఏకాంతవార్తను విడిచిపెట్టుటకు ఎవడు ఉత్సాహపడును? (ఎవడైననూ విడిచిపెట్టడు). ఆయన కోరకున్ననూ లక్ష్మీదేవి ఆయన దేహమును ఏనాడైననూ విడిచిపెట్టదు.

సరిచ్ఛైలవనోద్దేశా గావో వేణురవా ఇమే ।
సంకర్షణసహాయేన కృష్ణేనాచరితాః ప్రభో ॥ 49

ప్రభో - ఓ ప్రభూ!, సరిత్-శైలవన-ఉద్దేశాః - నదులు పర్వతములు అడవులలోని ప్రదేశములు, గావః - గోవులు, ఇమే - ఈ, వేణురవాః - వేణునాదములు, సంకర్షణసహాయేన - బలదేవుడు తోడుగా గల, కృష్ణేన - శ్రీకృష్ణునిచే, ఆచరితాః - సేవించబడినవి.

ఓ ఉద్ధవప్రభూ! ఈ నదులు, పర్వతములు, అడవులలోని ప్రదేశములు, గోవులు, వేణునాదములు, బలదేవుడు తోడుగా గల శ్రీకృష్ణునిచే సేవించబడినవియే.

పునః పునస్స్మారయంతి నందగోపసుతం బత ।
శ్రీనికేతైస్తత్పదకైర్విస్మర్తుం నైవ శక్నుమః ॥ 50

బత - అయ్యో!, శ్రీనికేతైః - శోభకు నిలయములైన, తత్-పదకైః - వాని కాలి గురుతులచే, పునః పునః - మరల మరల, నందగోపసుతమ్ - నందగోపుని పుత్రుడగు శ్రీకృష్ణుని, స్మారయంతి - గుర్తుకు తెచ్చుచున్నవి, విస్మర్తుమ్ - మరచుటకు, న శక్నుమః ఏవ - సమర్థులము కానే కాము.

అయ్యో! శోభకు నిలయములైన ఆ నందగోపుని పుత్రుడగు శ్రీకృష్ణుని కాలి గురుతులచే ఈ ప్రదేశములు ఆయననే మరల మరల గుర్తుకు తెస్తున్నవి. మేమాతనిని సుతరాము మరువ లేకున్నాము.

గత్యా లలితయోదారహాసలీలావలోకనైః ।
మాధ్వ్యా గిరా హృతధియః కథం తం విస్మరామహే ॥ 51

లలితయా - సుందరమైన, గత్యా - నడకచే, ఉదారహాసలీలా-అవలోకనైః - మనోరథములను పూరించే చిరునవ్వు విలాసతో కూడిన చూపులతో, మాధ్వ్యా - తియ్యని, గిరా - పలుకుతో, హృతధియః - దోచివేయబడిన మనస్సులు గల మేము, తమ్ - వానిని, కథమ్ - ఏ విధముగా, విస్మరామహే - మరువగలము?

అందమైన నడకతో, మనోరథములను పూరించే చిరునవ్వుతో, విలాసలతో కూడిన చూపులతో ఆ శ్రీకృష్ణుడు మా మనసులను దోచినాడు. మేమాయనను ఎట్లు మరువగలము? (మరువలేము).

హే నాథ హే రమానాథ వ్రజనాథార్తినాశన ।
మగ్నముద్ధర గోవింద గోకులం వృజినార్ణవాత్ ॥ 52

హే నాథ - ఓ నాథా!, రమానాథ - లక్ష్మీపతీ!, వ్రజనాథ - గోకులమును కాపాడువాడా!, ఆర్తినాశన - దుఃఖములను పోనాడువాడా!, గోవింద - ఓ గోవిందా!, మగ్నమ్ - మునిగిన, గోకులమ్ - గోకులమును, వృజిన-అర్ణవాత్ - దుఃఖసముద్రమునుండి, ఉద్ధర - పైకి తీయుము.

ఓ గోవిందా! మాకు, లక్ష్మీదేవికి, గోకులమునకు రక్షకుడవు నీవే. దుఃఖములను పోగొట్టువాడా! దుఃఖసముద్రములో మునిగిపోవుచున్న గోకులమును ఉద్ధరించుము.

శ్రీశుక ఉవాచ ।
తతస్తాః కృష్ణసందేశైర్వ్యపేతవిరహజ్వరాః ।
ఉద్ధవం పూజయాంచక్రుర్జ్ఞాత్వాऽऽత్మానమధోక్షజమ్ ॥ 53

తతః - తరువాత, కృష్ణసందేశైః - శ్రీకృష్ణుని సందేశవచనములచే, వ్యపేతవిరహజ్వరాః - తొలగిపోయిన విరహపీడ గల, తాః - ఆ గోపికలు, అధోక్షజమ్ - ఇంద్రియగోచరము కాని స్వరూపము గల శ్రీకృష్ణుని, ఆత్మానమ్ - ఆత్మరూపునిగా, జ్ఞాత్వా - తెలుసుకొని, ఉద్ధవమ్ - ఉద్ధవుని, పూజయాంచక్రుః - పూజించిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీకృష్ణుని సందేశవచనములచే గోపికల విరహతాపము దూరమ య్యేను. తరువాత వారు శ్రీకృష్ణుని స్వరూపము ఇంద్రియగోచరము కాద నియు, ఆయన ఆత్మరూపుడనియు తెలుసుకొని, ఉద్ధవుని పూజించిరి.

ఉవాస కతిచిన్మాసాన్ గోపీనాం వినుదఞ్ఛుచః ।
కృష్ణలీలాకథాం గాయన్ రమయామాస గోకులమ్ ।। 54

గోపీనామ్ - గోపికల, శుచః - శోకములను, వినుదన్ - పోగొట్టుచున్న వాడై, కతిచిత్ - కొన్ని, మాసాన్ - మాసములను, ఉవాస - నివసించెను, కృష్ణలీలాకథామ్ - శ్రీకృష్ణుని లీలల గాథలను, గాయన్ - గానము చేయువాడై, గోకులమ్ - గోకులమును, రమయామాస - రమింప జేసెను.

ఉద్ధవుడు గోపికల శోకములను పోగొడుతూ అక్కడనే కొన్ని మాసములు నివసించెను. ఆయన శ్రీకృష్ణుని లీలల గాథలను గానము చేస్తూ గోకులమును రమింప జేసెను.

యావన్త్యహాని నన్దస్య వ్రజేఽవాత్సీత్స ఉద్ధవః ।
వ్రజౌకసాం క్షణప్రాయాణ్యాసన్ కృష్ణస్య వార్తయా ।। 55

సః - ఆ, ఉద్ధవః - ఉద్ధవుడు, నందస్య - నందుని, వ్రజే - గోకులమునందు, యావంతి - ఎన్ని, అహాని - దినములను, అవాత్సీత్ - నివసించెనో అవి, కృష్ణస్య - శ్రీకృష్ణుని, వార్తయా - ప్రసంగముచే, వ్రజ-ఓకసామ్ - గోకులవాసులకు, క్షణప్రాయాణి - క్షణముతో సమానమైనవి, ఆసన్ - అయినవి.

ఆ ఉద్ధవుడు నందుని గోకులములో ఎన్ని రోజులుండెనో, అన్ని రోజులు శ్రీకృష్ణుని ప్రసంగమును చేసెను. దానిచే, గోకులవాసులకు ఆ రోజులు క్షణములుగా గడిచిపోయెను.

సరిద్వనగిరిద్రోణీర్వీక్షన్ కుసుమితాన్ ద్రుమాన్ ।
కృష్ణం సంస్మారయన్ రేమే హరిదాసో వ్రజౌకసామ్ ।। 56

సరిద్-వనగిరిద్రోణీన్ - నదులను అడవులను పర్వతములను లోయలను, కుసుమితాన్ - పుష్పించిన, ద్రుమాన్ - చెట్లను, వీక్షన్ - చూచువాడు, వ్రజ-ఓకసామ్ - గోకులవాసులకు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, సంస్మారయన్ - స్మరింప జేయువాడు, హరిదాసః - శ్రీకృష్ణ భగవానుని శరణు పొందిన భక్తుడు అగు ఉద్ధవుడు, రేమే - రమించెను.

ఉద్ధవుడు శ్రీకృష్ణ భగవానుని శరణు జొచ్చిన భక్తుడు. ఆయన నదులను, అడవులను, పర్వతములను, లోయలను, పుష్పించిన చెట్లను చూస్తూ, గోకులవాసులకు శ్రీకృష్ణుని స్మరింపజేస్తూ విహరించెను.

దృష్ట్వైవమాది గోపీనాం కృష్ణావేశాత్మవిక్లవమ్ ।
ఉద్ధవః పరమప్రీతస్తా నమస్యన్నిదం జగౌ ॥ 57

ఏవం-ఆది - ఈ ప్రకారము మొదలైన, గోపీనామ్ - గోపికలయొక్క, కృష్ణ-ఆవేశ-ఆత్మవిక్లవమ్ - శ్రీకృష్ణునియందలి ఆవేశముచే మనస్సుయొక్క వ్యాకులతను, దృష్ట్వా - చూచి, పరమప్రీతః - గొప్ప ప్రీతిని పొందిన, ఉద్ధవః - ఉద్ధవుడు, తాః - వారిని, నమస్యన్ - నమస్కరించువాడై, ఇదమ్ - ఈ గీతిని, జగౌ - గానము చేసెను.

ఈ పైన చెప్పినది మొదలుగా గల ప్రకారములచే గోపికల మనస్సు శ్రీకృష్ణునియందు లగ్నమై వ్యాకులపడెను. దానిని చూచిన ఉద్ధవుడు గొప్ప ప్రీతిని పొంది వారికి నమస్కరిస్తూ ఈ గీతిని గానము చేసెను.

ఏతాః పరం తనుభృతో భువి గోపవధ్వో
గోవింద ఏవ నిఖిలాత్మని రూఢభావాః ।
వాంఛంతి యద్భవభియో మునయో వయం చ
కిం బ్రహ్మజన్మభిరనంతకథారసస్య ॥ 58

నిఖిల-ఆత్మని - సర్వమునకు ఆత్మరూపుడైన, గోవిందే ఏవ - గోవిందునియందు మాత్రమే, రూఢభావాః - దృఢమైన ప్రేమ గల, ఏతాః - ఈ, గోపవధ్వః పరమ్ - కేవలము గోపాలకుల భార్యలు మాత్రమే, భువి - భూలోకమునందు, తనుభృతః - సఫలమైన జన్మ గలవారు, యత్ - ఏ ప్రేమను, భవభియః - సంసారము వలని భయము గల, మునయః -

మహర్షులు, వయం చ - మేము కూడ, వాంఛంతి - కోరుచున్నారో, అనంతకథారసస్య - శ్రీకృష్ణ భగవానుని గాథలయందు ప్రీతి గలవానికి, బ్రహ్మజన్మభిః - బ్రహ్మదేవునిగా పుట్టుటలతో, కిమ్ - పని యేమి?

సర్వాత్మరూపుడగు గోవిందునియందు ఈ గోపికల ప్రేమ దృఢముగా నెలకొన్నది. ఈ భూలోకములో కేవలము ఈ గోపికల జన్మ మాత్రమే సార్థకమైనది. సంసారము వలన భయపడే మేము, మహర్షులు కూడ అట్టి ప్రేమనే కోరుచున్నాము. శ్రీకృష్ణ భగవానుని గాథలయందు ప్రీతి గల వానికి పలు బ్రహ్మదేవుని జన్మలను పొందిననూ లాభమేమున్నది? (ఏమీ లేదు).

క్వేమాః స్త్రియో వనచరీర్వ్యభిచారదుష్టాః
కృష్ణే క్వ చైష పరమాత్మని రూఢభావః ।
నన్వీశ్వరోఽనుభజతోఽవిదుషోఽపి సాక్షాత్
శ్రేయస్తనోత్యగదరాజ ఇవోపయుక్తః ॥ 59

వనచరీః - అడవులయందు సంచరించువారు, వ్యభిచారదుష్టాః - శిష్టాచారము లేక చెడినవారా యన్నట్లున్న, ఇమాః - ఈ, స్త్రియః - స్త్రీలు, క్వ - ఎక్కడ?, కృష్ణే పరమాత్మని - శ్రీకృష్ణపరమాత్మయందు, ఏషః - ఇట్టి, రూఢభావః - దృఢమైన ప్రేమ, క్వ చ - ఎక్కడ?, ఈశ్వరః - ఈశ్వరుడు, అనుభజతః - నిత్యము భక్తి చేయువానికి, అవిదుషః అపి - అజ్ఞానికే అయిననూ, ఉపయుక్తః - వినియోగించబడిన, అగదరాజః - శ్రేష్ఠమగు మందు వలె, సాక్షాత్ - స్వయముగా, శ్రేయః - శ్రేయస్సును, తనోతి - విస్తారముగా ఇచ్చును, నను - నిశ్చయము.

అడవులలో తిరుగుతూ శిష్టాచారమునెరుగని ఈ స్త్రీలు యెక్కడ? శ్రీకృష్ణపరమాత్మయందు వీరి ఇట్టి నిశ్చలమగు ప్రేమ యెక్కడ? (అసంభవమనుకున్నది సంభవమైనది). నిరంతరమగు భక్తిని చేయువాడు అజ్ఞానియే అయినా, బాగుగా వినియోగించబడిన శ్రేష్ఠమైన మందు (అమృతము) వలె, ఈశ్వరుడు వానికి స్వయముగా విస్తృతమగు శ్రేయస్సును కలిగించుననుటలో సందేహము లేదు.

నాయం శ్రియోఽంగ ఉ నితాంతరతేః ప్రసాదః
స్వర్యోషితాం నలినగంధరుచాం కుతోఽన్యాః ।
రాసోత్సవేఽస్య భుజదండగృహీతకంఠ-
లబ్ధాశిషాం య ఉదగాద్వ్రజవల్లవీనామ్ ॥ 60

అయమ్ - ఈ, ప్రసాదః - అనుగ్రహము, నితాంతరతేః - ఏకాంతమైన ప్రేమ గల, అంగే - వక్షఃస్థలమునందలి, శ్రియః - లక్ష్మీదేవికి, నలినగంధరుచామ్ - పద్మముయొక్క పరిమళము కాంతి వంటి పరిమళము కాంతి గల, స్వః-యోషితామ్ - దేవతాస్త్రీలకు, న - లేదు, అన్యాః - ఇతరస్త్రీలు, కుతః - ఎందువలన?, ఉ - ఆశ్చర్యము!, యః - ఏ అనుగ్రహమైతే, రాస-ఉత్సవే - రాసక్రీడయందు, అస్య - ఈ శ్రీకృష్ణుని, భుజదండగృహీతకంఠలబ్ధ-ఆశిషామ్ - దండములవంటి భుజములచే కౌగిలించబడిన కంఠముచే పొందబడిన మనోరథములు గల, వ్రజవల్లవీనామ్ - గోపాంగనలకు, ఉదగాత్ - ఆవిర్భవించెనో.

రాసక్రీడయందు ఈ శ్రీకృష్ణుడు దండమువంటి తన భుజములతో గోపాంగనల కంఠమును కౌగిలించినప్పుడు, వారి మనోరథములు పూర్ణమై ఒక అనుగ్రహము (ప్రసన్నత) ఆవిష్కృతమయ్యెడిది. ఆశ్చర్యము! అట్టి అనుగ్రహము ఆయనయందు ఏకాంతమగు ప్రేమ కలిగి వక్షఃస్థలమునందు నిత్యనివాసము చేసే లక్ష్మీదేవికి కలుగలేదు. పద్మముల సుగంధము, కాంతి గల దేవతాస్త్రీలకు ఆ అనుగ్రహము కలుగలేదు. ఇతరస్త్రీల గురించి చెప్పునదేమున్నది?

ఆసామహో చరణరేణుజుషామహం స్యాం
బృందావనే కిమపి గుల్మలతౌషధీనామ్ ।
యా దుస్త్యజం స్వజనమార్యపథం చ హిత్వా
భేజుర్ముకుందపదవీం శ్రుతిభిర్విమృగ్యామ్ ॥ 61

అహో - ఆహా!, అహమ్ - నేను, బృందావనే - బృందావనమునందు, ఆసామ్ - ఈ గోపికల, చరణరేణుజుషామ్ - పాదధూళిని సేవించే, గుల్మలతా-ఓషధీనామ్ - పొదలు తీగలు మొక్కలలో, కిం అపి - ఏదో ఒకటి, స్యామ్ - అగుదును గాక!, యాః - ఏ గోపికలైతే, దుస్త్యజమ్ -

విడువ శక్యము కాని, స్వజనమ్ - బంధుజనమును, ఆర్యపథం చ - పెద్దల ధర్మమును కూడ, హిత్వా - విడిచిపెట్టి, శ్రుతిభిః - వేదములచే, విమృగ్యామ్ - వెదుకదగిన, ముకుందపదవీమ్ - శ్రీకృష్ణ భగవానుని మార్గమును, భేజుః - సేవించిరో.

శ్రుతులు మోక్షప్రదాతయగు శ్రీకృష్ణుని పొందే మార్గమును వెదుకుచునే యుండును. ఈ గోపికలు బంధుజనమును, పెద్దల ధర్మమును కూడ విడిచిపెట్టి అట్టి ప్రేమమార్గమును సేవించిరి. ఆహా! నేను బృందావనములో ఈ గోపికల పాదధూళిని సేవించే పొదలు, తీగలు, మొక్కలలో ఏదో ఒకటి అగుదును గాక!

యా వై శ్రియాఽర్చితమజాదిభిరాప్తకామైః
యోగేశ్వరైరపి యదాత్మని రాసగోష్ఠ్యామ్ ।
కృష్ణస్య తద్భగవతశ్చరణారవిందం
న్యస్తం స్తనేషు విజహుః పరిరభ్య తాపమ్ ॥ 62

యత్ - ఏ పాదము, శ్రియా - లక్ష్మీదేవిచే, ఆప్తకామైః - పొందబడిన మనోరథములు గల, అజ-ఆదిభిః - బ్రహ్మదేవుడు మొదలగువారిచే, యోగ-ఈశ్వరైః అపి - యోగిరాజులచే కూడ, ఆత్మని - హృదయమునందు, అర్చితమ్ - పూజించబడినదో, కృష్ణస్య భగవతః - శ్రీకృష్ణ భగవానుని, తత్ - ఆ, రాసగోష్ఠ్యామ్ - రాససభయందు, స్తనేషు - స్తనములయందు, న్యస్తమ్ - ఉంచబడిన, చరణ-అరవిందమ్ - పద్మమువంటి పాదమును, పరిరభ్య - కౌగిలించి, యాః వై - ఏ గోపికలైతే, తాపమ్ - తాపమును, విజహుః - విడిచిపెట్టిరో.

శ్రీకృష్ణ భగవానుని పద్మమువంటి పాదమును లక్ష్మీదేవి, పొందబడిన మనోరథములు గల బ్రహ్మదేవుడు ఇంద్రుడు మొదలగువారు పూజించెదరు. మరియు యోగిరాజులు కూడ హృదయమునందు ఆ పాదమునే ధ్యానించెదరు. గోపికలు రాససభయందు ఆ పాదమును వక్షఃస్థలమునందుంచుకొని కౌగిలించి తాపమును విడనాడిరి.

వందే నందవ్రజస్త్రీణాం పాదరేణుమభీక్ష్ణశః ।
యాసాం హరికథోద్గీతం పునాతి భువనత్రయమ్ ।। 63

నందవ్రజస్త్రీణామ్ - నందగోకులమునందలి గోపికల, పాదరేణుమ్ - పాదధూళిని, అభీక్ష్ణశః - మరల మరల, వందే - నమస్కరించుచున్నాను, యాసామ్ - ఏ గోపికలయొక్క, హరికథా-ఉద్గీతమ్ - శ్రీహరి లీలలతో బాటుగా గానము చేయబడే చరితము, భువనత్రయమ్ - ముల్లోకములను, పునాతి - పవిత్రము చేయునో.

శ్రీహరి లీలలతో కలిపి గోపికల చరితము గానము చేయబడును. ఆ గానముచే ముల్లోకములు పవిత్రమగును. అట్టి నందగోకులమునందలి గోపికల పాదధూళికి నేను మరల మరల నమస్కరించుచున్నాను.

శ్రీశుక ఉవాచ ।
అథ గోపీరనుజ్ఞాప్య యశోదాం నందమేవ చ ।
గోపానామంత్ర్య దాశార్హో యాస్యన్నారురుహే రథమ్ ।। 64

అథ - తరువాత, దాశార్హః - దాశార్హవంశీయుడగు ఉద్ధవుడు, గోపీః - గోపికలను, యశోదామ్ - యశోదను, నందం ఏవ చ - నందుని కూడ, అనుజ్ఞాప్య - అనుమతినిచ్చునట్లు చేసి, గోపాన్ - గోపాలకులను, ఆమంత్ర్య - సెలవు తీసుకొని, యాస్యన్ - వెళ్లబోవువాడై, రథమ్ - రథమును, ఆరురుహే - అధిష్ఠించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- తరువాత దాశార్హవంశీయుడగు ఉద్ధవుడు గోపికలు, యశోద, నందుడు, గోపాలకుల వద్ద సెలవు తీసుకొని ప్రయాణమునకు సిద్ధమై రథమునెక్కెను.

తం నిర్గతం సమాసాద్య నానోపాయనపాణయః ।
నందాదయోఽనురాగేణ ప్రావోచన్నశ్రులోచనాః ।। 65

నిర్గతమ్ - బయలుదేరిన, తమ్ - ఆ ఉద్ధవుని, నానా-ఉపాయనపాణయః - అనేకములగు బహుమతులు చేతులయందు గలవారు, అనురాగేణ - ప్రేమచే, అశ్రులోచనాః - నీటితో నిండిన కళ్లు

గలవారు అగు, నంద-ఆదయః - నందుడు మొదలగువారు, సమాసాద్య - దగ్గరకు వచ్చి, ప్రావోచన్ - పలికిరి.

నందుడు, సుదాముడు మొదలగువారు చేతులలో అనేకములగు బహుమతులను పట్టుకొని బయలుదేరుచున్న ఉద్ధవుని వద్దకు వచ్చి ఇట్లు పలికిరి. ప్రేమ వలన వారి కన్నులలో నీరు ఉబుకుచుండెను.

మనసో వృత్తయో నస్స్యుః కృష్ణపాదాంబుజాశ్రయాః ।
వాచోఽభిధాయినీర్నామ్నాం కాయస్తత్ప్రహ్వాణాదిషు ॥ 66

నః - మా, మనసః - మనస్సుయొక్క, వృత్తయః - వృత్తులు, కృష్ణపాద-అంబుజ-ఆశ్రయాః - శ్రీకృష్ణుని పద్మమువంటి పాదములే ఆశ్రయముగా గలవి, వాచః - వాక్కులు, నామ్నామ్ - నామములకు, అభిధాయినీః - పలుకునవి, కాయః - దేహము, తత్-ప్రహ్వాణ-ఆదిషు - ఆయనకు నమస్కరించుట మొదలగువాటియందు, స్యుః - ఉండుగాక!

మా మనోవృత్తులు శ్రీకృష్ణుని పద్మమువంటి పాదమునందు నిలిచియుండునవి, వాగింద్రియము ఆయన మాటలను పలుకునది, దేహము ఆయనకు నమస్కరించుట, ప్రదక్షిణము చేయుట మొదలగువాటిని చేయునది అగుగాక!

కర్మభిర్భ్రామ్యమాణానాం యత్ర క్వాపీశ్వరేచ్ఛయా ।
మంగలాచరితైర్దానై రతిర్నః కృష్ణ ఈశ్వరే ॥ 67

కర్మభిః - కర్మలతో, ఈశ్వర-ఇచ్ఛయా - ఈశ్వరుని ఇచ్ఛచే, యత్ర క్వ అపి - ఏవేవో జన్మలయందు, భ్రామ్యమాణానామ్ - తిరుగాడుచున్న, నః - మాకు, మంగల-ఆచరితైః - పుణ్యకార్యముల ఆచరణలచే, దానైః - దానములచే, ఈశ్వరే - ఈశ్వరుడగు, కృష్ణే - శ్రీకృష్ణునిపై, రతిః - ప్రేమ.

కర్మల కారణముగా ఈశ్వరసంకల్పముచే మేము ఏవో జన్మలను పొంది పుణ్యకార్యములను, దానములను చేయుదుము. ఆ పుణ్యముయొక్క ప్రభావముచే మాకు సర్వేశ్వరుడగు శ్రీకృష్ణునియందు ప్రేమ కలుగు గాక!

ఏవం సభాజితో గోపైః కృష్ణభక్త్యా నరాధిప ।
ఉద్ధవః పునరాగచ్ఛన్మథురాం కృష్ణపాలితామ్ ॥ 68

నర-అధిప - ఓ మహారాజా!, ఏవమ్ - ఈ విధముగా, గోపైః - గోపాలకులచే, కృష్ణభక్త్యా - శ్రీకృష్ణునియందలి భక్తిచే, సభాజితః - సత్కరించబడిన, ఉద్ధవః - ఉద్ధవుడు, పునః - మరల, కృష్ణపాలితామ్ - శ్రీకృష్ణునిచే రక్షించబడిన, మథురామ్ - మథురానగరమును గురించి, ఆగచ్ఛత్ - వచ్చెను.

ఓ పరీక్షిన్మహారాజా! గోపాలకులు శ్రీకృష్ణునియందలి భక్తిచే ఉద్ధవుని ఈ విధముగా సత్కరించిరి. ఆయన శ్రీకృష్ణునిచే రక్షించబడే మథురా నగరమునకు తిరిగి వచ్చెను.

కృష్ణాయ ప్రణిపత్యాహ భక్త్యుద్రేకం వ్రజౌకసామ్ ।
వసుదేవాయ రామాయ రాజ్ఞే చోపాయనాన్యదాత్ ॥ 69

ఇతి శ్రీమద్భాగవతే దశమస్కంధే సప్తచత్వారింశోఽధ్యాయః ॥

కృష్ణాయ - శ్రీకృష్ణుని కొరకు, ప్రణిపత్య - నమస్కరించి, వ్రజ-ఓకసామ్ - గోకులవాసుల, భక్తి-ఉద్రేకమ్ - భక్తియొక్క ఆధిక్యమును గురించి, ఆహ - చెప్పెను, వసుదేవాయ - వసుదేవుని కొరకు, రామాయ - బలరాముని కొరకు, రాజ్ఞే చ - ఉగ్రసేన మహారాజు కొరకు కూడ, ఉపాయనాని - బహుమతులను, అదాత్ - ఇచ్చెను.

ఉద్ధవుడు శ్రీకృష్ణునకు నమస్కరించి గోకులవాసుల భక్తియొక్క ఆధిక్యమును గురించి చెప్పెను. వసుదేవుడు, బలరాముడు, ఉగ్రసేన మహారాజులకు ఉద్ధవుడు తాను తెచ్చిన బహుమతులనిచ్చెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో
ఉద్ధవుడు గోపికలతో మాటలాడుటను, భ్రమరగీతమును వర్ణించే
నలుబది ఏడవ అధ్యాయము ముగిసినది (47).



# అథ అష్టాచత్వారింశోఽధ్యాయః

## శ్రీకృష్ణుడు అక్రూరుని ఇంటికి వెళ్లుట

శ్రీశుక ఉవాచ ।

అథ విజ్ఞాయ భగవాన్ సర్వాత్మా సర్వదర్శనః ।
సైరంధ్ర్యాః కామతప్తాయాః ప్రియమిచ్ఛన్ గృహం యయౌ ॥1

అథ - తరువాత, సర్వ-ఆత్మా - సర్వప్రాణులలో ఆత్మ, సర్వదర్శనః - సర్వజ్ఞుడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, విజ్ఞాయ - తెలుసుకొని, కామతప్తాయాః - అనురాగముచే పీడితురాలైన, సైరంధ్ర్యాః - సైరంధ్రికి, ప్రియమ్ - ప్రీతిని, ఇచ్ఛన్ - కోరువాడై, గృహమ్ - ఇంటిని గురించి, యయౌ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఉద్ధవుడు చెప్పిన విషయములను శ్రీకృష్ణ భగవానుడు తెలుసుకొనెను. ఆయన సకలప్రాణులలో ఆత్మరూపముగానుండే సర్వజ్ఞుడు. ఆయన ప్రేమచే పీడించబడిన సైరంధ్రి (త్రివక్ర) కి ప్రీతిని కలిగించగోరి ఆమె ఇంటికి వెళ్లెను.

మహార్హోపస్కరైరాఢ్యం కామోపాయోపబృంహితమ్ ।
ముక్తాదామపతాకాభిర్వితానశయనాసనైః ।
ధూపైస్సురభిభిర్దీపైస్స్రగ్గంధైరపి మండితమ్ ॥ 2

మహా-అర్హ-ఉపస్కరైః - మిక్కిలి విలువైన సామగ్రులతో, ఆఢ్యమ్ - సంపన్నమైనట్టియు, కామ-ఉపాయ-ఉపబృంహితమ్ - ప్రేమను వర్ధిల్లజేసే ఉపాయములతో సమృద్ధమైనట్టియు, ముక్తాదామపతాకాభిః - ముత్యాల హారములతో జెండాలతో, వితానశయన-ఆసనైః - చాందినీలు శయ్యాలు ఆసనములతో, సురభిభిః - పరిమళము గల, ధూపైః - ధూపములతో, దీపైః - దీపములతో, స్రగ్-గంధైః అపి - పుష్పమాలలతో గంధములతో, మండితమ్ - అలంకరించబడిన (ఇంటికి వెళ్లెను).

ఆ ఇల్లు మిక్కిలి విలువైన సామగ్రులతో, ప్రేమను వర్ధిల్లజేసే ఉపాయములతో సమృద్ధమై యుండెను. ముత్యాల హారములు, జెండాలు, చాందినీలు, శయ్యలు, ఆసనములు, పరిమళ ధూపములు, దీపములు, పుష్పమాలలు, గంధములతో ఆ గృహము సంపన్నమై యుండెను.

గృహం తమాయాంతమవేక్ష్య సాఽసనాత్
సద్యస్సముత్థాయ హి జాతసంభ్రమా ।
యథోపసంగమ్య సఖీభిరచ్యుతం
సభాజయామాస సదాసనాదిభిః ॥ 3

గృహమ్ - ఇంటిని గురించి, ఆయాంతమ్ - వచ్చుచున్న, తమ్ - ఆ, అచ్యుతమ్ - శ్రీకృష్ణ భగవానుని, అవేక్ష్య - చూచి, జాతసంభ్రమా - కలిగిన కంగారు గల, సా - ఆ సైరంధ్రి, ఆసనాత్ - ఆసనమునుండి, సద్యః - వెంటనే, సముత్థాయ - లేచి నిలబడి, సఖీభిః - చెలులతో కూడి, యథా - తగిన విధముగా, ఉపసంగమ్య - దగ్గరకు వెళ్లి, సద్-ఆసనాదిభిః - మంచి ఆసనము మొదలగువాటితో, సభాజయామాస - సత్కరించెను.

ఇంటికి వచ్చుచున్న ఆ శ్రీకృష్ణ భగవానుని చూచి ఆ సైరంధ్రి కంగారు పడెను. ఆమె వెంటనే ఆసనమునుండి లేచి నిలబడి చెలులతో బాటుగా తగిన విధముగా ఆయనకు ఎదురేగి, మంచి ఆసనము పాద్యము మొదలగువాటితో సత్కరించెను.

తథోద్ధవస్సాధు తయాఽభిపూజితో న్యషీదదుర్వ్యామభిమృశ్య చాసనమ్,
కృష్ణోఽపి తూర్ణం శయనం మహాధనం వివేశ లోకాచరితాన్యనువ్రతః।4

తథా - అదే విధముగా, ఉద్ధవః - ఉద్ధవుడు, తయా - ఆమెచే, సాధు - బాగుగా, అభిపూజితః - పూజించబడినవాడు, ఆసనం చ - ఆసనమును, అభిమృశ్య - స్పృశించి, ఉర్వ్యామ్ - నేలపై, న్యషీదత్ - కూర్చుండెను, లోక-ఆచరితాని - జనుల చేష్టలను, అనువ్రతః - అనుసరించే, కృష్ణః అపి - శ్రీకృష్ణుడున్నూ, తూర్ణమ్ - వెంటనే, మహాధనమ్ - మిక్కిలి విలువైన, శయనమ్ - శయ్యను, వివేశ - అధిష్ఠించెను.

ఆమె అదే విధముగా ఉద్ధవుని కూడ సత్కరించెను. కాని, ఆయన ఆమె చూపించిన ఆసనమును చేతితో స్పృశించి నేలపై కూర్చుండెను. శ్రీకృష్ణుడు జనుల చేష్టలను అనుసరించును. ఆయన వెంటనే మిక్కిలి విలువైన శయ్యనధిష్ఠించెను.

సా మజ్జనాలేపదుకూలభూషణస్రగ్గంధతాంబూలసుధాసవాదిభిః ।
ప్రసాధితాత్మోపససార మాధవం సవ్రీడలీలోత్స్మితవిభ్రమేక్షితైః ॥ 5

మజ్జన-ఆలేపదుకూలభూషణస్రగ్-గంధతాంబూలసుధా-ఆసవ-ఆదిభిః - స్నానము చందనాదులనలదుకొనుట కోకను దాల్చుట అలంకారములు పుష్పమాలలు గంధము తాంబూలము అమృతమువంటి పానీయము మొదలగువాటితో, ప్రసాధిత-ఆత్మా - రమింప యోగ్యముగా చేయబడిన దేహము గల, సా - ఆమె, సవ్రీడలీలా-ఉత్స్మితవిభ్రమ-ఈక్షితైః - సిగ్గుతో విలాసతో పైకి వచ్చే నవ్వు గల కనుబొమల విరుపుతోడి చూపులతో, మాధవమ్ - శ్రీకృష్ణ భగవానుని, ఉపససార - దగ్గరకు వచ్చెను.

ఆమె స్నానము చేసి చందనాదులనలదుకొని కోకను దాల్చి సొమ్ములను పెట్టుకొని పుష్పమాలలనలంకరించుకొని తాంబూలము వేసుకొని అమృతమువంటి పానీయమును సేవించి కాటుక మొదలగువాటితో తనను అందముగా తీర్చి దిద్దుకొనెను. ఆమె సిగ్గుతో విలాసగా నవ్వుతూ కనుబొమల విరుపులతో ఓరగా చూస్తూ శ్రీకృష్ణ భగవానుని దగ్గరకు వచ్చెను.

ఆహూయ కాంతాం నవసంగమహ్రియా
విశంకితాం కంకణభూషితే కరే ।
ప్రగృహ్య శయ్యామధివేశ్య రామయా
రేమేఽనులేపార్పణపుణ్యలేశయా ॥ 6

నవసంగమహ్రియా - కొత్తగా కలుసుకొనుట వలని సిగ్గుతో, విశంకితామ్ - సందేహిస్తున్న, కాంతామ్ - సుందరిని, ఆహూయ - పిలిచి, కంకణభూషితే - కంకణములచే అలంకరించబడిన, కరే - రెండు చేతులను, ప్రగృహ్య - పట్టుకొని, శయ్యామ్ - శయ్యను, అధివేశ్య -

అధిష్ఠింపజేసి, అనులేప-అర్పణపుణ్యలేశయా - గంధమునర్పించిన పిసరంత పుణ్యము గల, రామయా - సుందరితో, రేమే - రమించెను.

కొత్త కలయిక వలని సిగ్గుతో సందేహిస్తున్న ఆ సుందరిని ఆయన దగ్గరకు పిలిచెను. కంకణములనలంకరించిన ఆమె రెండు చేతులను పట్టుకొని ఆయన ఆమెను శయ్యపై కూర్చుండబెట్టెను. ఆయనకు గంధమునర్పించిన పిసరంత పుణ్యము గల ఆమెతో ఆయన రమించెను.

సాఽనంగతప్తకుచయోరురసస్తథాఽక్ష్ణోః
జిఘ్రంత్యనంతచరణేన రుజో మృజంతీ ।
దోర్భ్యాం స్తనాంతరగతం పరిరభ్య కాంతం
ఆనందమూర్తిమజహాదతిదీర్ఘతాపమ్ ॥ 7

జిఘ్రంతీ - ఆఘ్రాణించుచున్న, సా - ఆమె, అనంతచరణేన - శ్రీకృష్ణ భగవానుని పాదముచే, అనంగతప్తకుచయోః - మన్మథతాపము గల స్తనములయొక్క, ఉరసః - హృదయముయొక్క, తథా - మరియు, అక్ష్ణోః - రెండు కన్నులయొక్క, రుజః - పీడలను, మృజంతీ - తొలగించుచున్నదై, దోర్భ్యామ్ - రెండు చేతులతో, స్తన-అంతరగతమ్ - వక్షఃస్థలముపైనున్నట్టియు, కాంతమ్ - ప్రియుడైనట్టియు, ఆనందమూర్తిమ్ - రూపు గట్టిన ఆనందమైన శ్రీకృష్ణుని, పరిరభ్య - కౌగిలించి, అతిదీర్ఘతాపమ్ - చిరకాలతాపమును, అజహాత్ - విడిచిపెట్టెను.

ఆమె శ్రీకృష్ణ భగవానుని పాదమునాఘ్రాణించి, వక్షఃస్థలముపై ఆన్చి, రెండు కళ్లతో చూసి హృదయములోని తాపమును తుడిచివేసెను. ఆనందమూర్తియగు శ్రీకృష్ణుడు ఆమె వక్షఃస్థలముపైనుండెను. ఆ ప్రియుని ఆమె రెండు చేతులతో కౌగిలించి చిరకాలతాపమును విడిచెను.

సైవం కైవల్యనాథం తం ప్రాప్య దుష్ప్రాపమీశ్వరమ్ ।
అంగరాగార్పణేనాహో దుర్భగేదమయాచత ॥ 8

అహో - అయ్యో!, దుర్భగా - దురదృష్టవంతురాలగు, సా - ఆ సైరంధ్రి, ఏవమ్ - ఈ విధముగా, అంగరాగ-అర్పణేన - ఒంటికి రాసుకొనే గంధమును అర్పించుటచే, కైవల్యనాథమ్ - మోక్షమునిచ్చే

ప్రభుడైనట్టియు, దుష్ప్రాపమ్ - పొంద శక్యము కాని, తమ్ - ఆ, ఈశ్వరమ్ - శ్రీకృష్ణ భగవానుని, ప్రాప్య - పొంది, ఇదమ్ - దీనిని, అయాచత - కోరెను.

అయ్యో! ఏమి దురదృష్టము! మోక్షమునిచ్చే ప్రభుడగు ఆ శ్రీకృష్ణ భగవానుని పొందుట శక్యము కాదు. కాని, ఆ సైరంధ్రి ఒంటికి రాసుకొనే గంధమును అర్పించుటచే ఆయనను పొంది కూడ, దీనిని (చెప్పబడబోవుదానిని) కోరుకొనెను.

ఆహోష్యతామిహ ప్రేష్ఠ దినాని కతిచిన్మయా ।
రమస్వ నోత్సహే త్యక్తుం సంగం తేఽంబురుహేక్షణ ॥ 9

ఆహ - పలికెను, ప్రేష్ఠ - ఓ ప్రియతమా!, అంబురుహ-ఈక్షణ - పద్మములవంటి కన్నులు గలవాడా!, ఇహ - ఇచట, ఉష్యతామ్ - నివసించబడుగాక!, కతిచిత్ - కొన్ని, దినాని - దినములను, మయా - నాతో, రమస్వ - రమించుము, తే - నీ, సంగమ్ - పొందును, త్యక్తుమ్ - విడుచుటకు, న ఉత్సహే - సమర్థురాలను కాను.

పద్మములవంటి కన్నులు గల ఓ ప్రియతమా! ఇచట ఉండుము. కొన్ని దినములు నాతో నిరంతరముగా రమించుము. నీ పొందును విడిచిపెట్టే శక్తి నాకు లేదు, అని ఆమె పలికెను.

తస్యై కామవరం దత్త్వా మానయిత్వా చ మానదః ।
సహోద్ధవేన సర్వేశస్స్వధామాగమదర్చితమ్ ॥ 10

మానదః - సమ్మానమునిచ్చువాడు, సర్వ-ఈశః - సర్వేశ్వరుడు అగు శ్రీకృష్ణుడు, తస్యై - ఆమె కొరకు, కామవరమ్ - కోరిన వరమును, దత్త్వా - ఇచ్చి, మానయిత్వా చ - సమ్మానించి, ఉద్ధవేన సహ - ఉద్ధవునితో బాటు, అర్చితమ్ - సమృద్ధమగు, స్వధామ - తన గృహమును గురించి, ఆగమత్ - వెళ్లెను.

సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుడు భక్తులను సమ్మానించును. ఆయన ఆమెకు కోరిన వరమునిచ్చుట ద్వారా సమ్మానించి, ఉద్ధవునితో బాటు సంపత్సమృద్ధమైన తన గృహమునకు వచ్చెను.

దురారాధ్యం సమారాధ్య విష్ణుం సర్వేశ్వరేశ్వరమ్ ।
యో వృణీతే మనోగ్రాహ్యమసత్త్వాత్కుమనీష్యసౌ ॥ 11

దురారాధ్యమ్ - ఆరాధించ శక్యము కానట్టియు, సర్వ-ఈశ్వర-ఈశ్వరమ్ - ఈశ్వరులందరికి ఈశ్వరుడైన, విష్ణుమ్ - శ్రీకృష్ణ భగవానుని, సమారాధ్య - బాగుగా ఆరాధించి, యః - ఎవడైతే, మనః-గ్రాహ్యమ్ - మనస్సునకు ప్రియమైనదానిని, వృణీతే - కోరునో, అసత్త్వాత్ - మిథ్య యగుట వలన, అసౌ - ఈతడు, కుమనీషీ - చెడు తలంపు గలవాడు.

ఇంద్రుడు మొదలైన లోకపాలకులందరికీ ఈశ్వరుడగు శ్రీకృష్ణ భగవానుని ప్రసన్నుని చేసుకొనుట తేలిక కాదు. ఆయనను బాగుగా ప్రసన్నుని చేసుకొని ఎవడైతే మనస్సునకు ప్రియమైన భోగమును కోరునో, అట్టివాడు తెలివితేటలు గలవాడు కాదు. ఎందుకంటే, మనస్సునకు ప్రియమైన సర్వము మిథ్యయే.

అక్రూరభవనం కృష్ణస్సహరామోద్ధవః ప్రభుః ।
కించిచ్చికీర్షయన్ ప్రాగాదక్రూరప్రియకామ్యయా ॥ 12

కించిత్ - ఏదో ఒకదానిని, చికీర్షయన్ - చేయించ గోరు, ప్రభుః కృష్ణః - శ్రీకృష్ణ ప్రభుడు, సహరామ-ఉద్ధవః - బలరాముడు ఉద్ధవులతో కూడిన వాడై, అక్రూరప్రియకామ్యయా - అక్రూరుని కొరకు ప్రీతిని చేసే కోరికతో, అక్రూరభవనమ్ - అక్రూరుని భవనమును గూర్చి, ప్రాగాత్ - వెళ్లెను.

శ్రీకృష్ణ ప్రభుడు అక్రూరునకు ప్రీతిని కలిగించి ఆయనచే ఒక పనిని చేయించ గోరెను. అందుచే ఆయన బలరామ-ఉద్ధవులతో కలిసి అక్రూరుని ఇంటికి వెళ్లెను.

స తాన్నరవరశ్రేష్ఠానారాద్వీక్ష్య స్వబాంధవాన్ ।
ప్రత్యుత్థాయ ప్రముదితః పరిష్వజ్యాభ్యనందత ॥ 13

సః - ఆతడు, నరవరశ్రేష్ఠాన్ - మానవులలోని గొప్పవారిలో గొప్పవారైనట్టియు, స్వబాంధవాన్ - తన బంధువులైన, తాన్ - వారిని, ఆరాత్ - దూరముగా, వీక్ష్య - చూచి, ప్రముదితః - మహానందమును

పొందినవాడై, ప్రతి-ఉత్థాయ - ఎదురేగి, పరిష్వజ్య - కౌగిలించి, అభ్యనందత - అభినందించెను.

వారు అక్రూరునకు బంధువులు మాత్రమే గాక మానవులలోని గొప్పవారిలో గొప్పవారు. వారిని దూరమునుండి చూచి అక్రూరుడు మహానందముతో ఎదురేగి కౌగిలించి అభినందించెను.

ననామ కృష్ణం రామం చ స తైరప్యభివాదితః ।
పూజయామాస విధివత్కృతాసనపరిగ్రహాన్ ॥ 14

సః - ఆ అక్రూరుడు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, రామం చ - బలరాముని కూడ, ననామ - నమస్కరించెను, తైః అపి - వారిచే కూడ, అభివాదితః - నమస్కరించబడినవాడు, కృత-ఆసనపరిగ్రహాన్ - చేయబడిన ఆసనమును స్వీకరించుట గల వారిని, విధివత్ - యథావిధిగా, పూజయామాస - పూజించెను.

ఆ అక్రూరుడు బలరామ శ్రీకృష్ణులకు నమస్కరించెను. వారు కూడ ఆయనకు నమస్కరించిరి. వారందరు ఆసనమును స్వీకరించిన పిదప, ఆయన వారిని యథావిధిగా పూజించెను.

పాదావనేజనీరాఽపో ధారయఞ్ఛిరసా నృప ।
అర్హణేనాంబరైర్దివ్యైర్గంధస్రగ్భూషణోత్తమైః ॥ 15

అర్చిత్వా శిరసాఽఽనమ్య పాదావంకగతౌ మృజన్ ।
ప్రశ్రయావనతోఽక్రూరః కృష్ణరామావభాషత ॥ 16

నృప - ఓ రాజా!, పాద-అవనేజనీః - పాదములను కడిగిన, ఆపః - నీళ్లను, శిరసా - శిరస్సుతో, ఆ - అంతటా, ధారయన్ - ధరించువాడై, అక్రూరః - అక్రూరుడు, అర్హణేన - అర్ఘ్యము మొదలగువాటితో, దివ్యైః - ప్రకాశించే, అంబరైః - వస్త్రములతో, గంధస్రగ్-భూషణ-ఉత్తమైః - గంధము పుష్పమాలలు ఉత్తమమగు అలంకారములతో, అర్చిత్వా - పూజించి, శిరసా - శిరస్సుతో, ఆనమ్య - నమస్కరించి, అంకగతౌ - ఒడిని పొందిన, పాదౌ - రెండు పాదములను, మృజన్ - నొక్కువాడై,

ప్రశ్రయ-అవనతః - వినయముతో నమ్రుడై, కృష్ణరామౌ - కృష్ణ బలరాములను గూర్చి, అభాషత - పలికెను.

ఓ పరీక్షిన్మహారాజా! అక్రూరుడు వారిద్దరి పాదములను కడిగిన నీటిని తలపై అంతటా చల్లుకొనెను. ఆయన వారిని అర్ఘ్యము, ప్రకాశించే వస్త్రములు, గంధము, పుష్పమాలలు, విలువైన అలంకారములు మొదలగువాటితో పూజించి తల వంచి నమస్కరించెను. ఆయన వారి పాదములను ఒడిలో ఉంచుకొని సంవాహనము చేసెను. తరువాత ఆయన వినయముతో వినమ్రుడై బలరామకృష్ణులతో ఇట్లు పలికెను.

దిష్ట్యా పాపో హతః కంసస్సానుగో వామిదం కులమ్ ।
భవద్భ్యాముద్ధృతం కృచ్ఛ్రాద్దురంతాచ్చ సమేధితమ్ ॥ 17

పాపః - పాపి, స-అనుగః - అనుచరులతో కూడినవాడు అగు, కంసః - కంసుడు, హతః - వధించబడినాడు, దిష్ట్యా - మంగళము, భవద్భ్యామ్ - మీ ఇద్దరిచే, వామ్ - మీ యిద్దరి, ఇదమ్ - ఈ, కులమ్ - కులము, దురంతాత్ - అంతము లేని, కృచ్ఛ్రాత్ - ఆపదనుండి, ఉద్ధృతమ్ - ఉద్ధరించబడినది, సమేధితమ్ - వర్ధిల్ల జేయబడినది.

పాపియగు కంసుడు అనుచరులతో సహా వధించబడెను. మీరిద్దరు ఈ మీ కులమును అంతము కానరాని ఆపదనుండి గట్టెక్కించి వర్ధిల్ల జేసిరి. ఇది మంగళము.

యువాం ప్రధానపురుషౌ జగద్ధేతూ జగన్మయౌ ।
భవద్భ్యాం న వినా కించిత్పరమస్తి న చాపరమ్ ॥ 18

యువామ్ - మీరిద్దరు, ప్రధానపురుషౌ - మాయాశక్తి పరబ్రహ్మలు, జగద్-హేతూ - జగత్తునకు ఉపాదాన నిమిత్తకారణములు, జగత్-మయౌ - జగద్రూపులు, భవద్భ్యాం వినా - మీరిద్దరు లేకుండా, కించిత్ - ఏదైనా, పరమ్ - కారణము, న - లేదు, అపరం చ - కార్యము కూడ, న - లేదు.

బలరాముడు జగత్తునకు ఉపాదానమగు మాయాశక్తి కాగా, శ్రీకృష్ణుడు నిమిత్తకారణమగు పరబ్రహ్మ. ఈ తీరున మీరిద్దరు జగత్తు రూపముగా ప్రకటమైరి. మీరిద్దరు లేకుండా కారణము గాని, కార్యము గాని ఏదీ లేదు.

ఆత్మసృష్టమిదం విశ్వమన్వావిశ్య స్వశక్తిభిః ।
ఈయతే బహుధా బ్రహ్మన్ శ్రుతప్రత్యక్షగోచరమ్ ॥ 19

బ్రహ్మన్ - ఓ పరమాత్మా!, ఆత్మసృష్టమ్ - నీచే సృష్టించబడిన, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తును, స్వశక్తిభిః - నీ శక్తులచే, అను - తరువాత, ఆవిశ్య - ప్రవేశించి, బహుధా - పలు విధములుగా, శ్రుతప్రత్యక్షగోచరమ్ - వినబడేది కనబడేది విషయమయ్యే విధముగా, ఈయతే - తెలియబడుచున్నావు.

ఓ పరమాత్మా! నీవీ జగత్తును సృష్టించి తరువాత నీ శక్తులతో దానియందు ప్రవేశించినావు. నీవే అనేకవిధములుగా వినబడేది (నామము), కనబడేది (రూపము) గా తెలియబడుచున్నావు.

యథా హి భూతేషు చరాచరేషు
మహ్యాదయో యోనిషు భాంతి నానా ।
ఏవం భవాన్ కేవల ఆత్మయోని-
ష్వాత్మాఽఽత్మతంత్రో బహుధా విభాతి ॥ 20

యథా హి - ఏ విధముగానైతే, చర-అచరేషు - కదిలే మరియు కదలని, భూతేషు - ప్రాణులయందు, మహీ-ఆదయః - పృథివి మొదలగు భూతములు, నానా - అనేకరూపములుగా, భాంతి - ప్రకాశించుచున్నవో, ఏవమ్ - ఇదే విధముగా, కేవలః - రెండవది లేనివాడవు, ఆత్మా - ఆత్మవు, ఆత్మతంత్రః - స్వతంత్రుడవు అగు, భవాన్ - నీవు, ఆత్మయోనిషు - నీనుండి ఆవిర్భవించిన సకలచరాచరములయందు, బహుధా - అనేకరూపములుగా, విభాతి - ప్రకాశించుచున్నావు.

కదిలే మరియు కదలని ప్రాణుల అనేకరూపములైన దేహములయందు పృథివి, జలములు మొదలగు పంచభూతములే ప్రకాశించుచున్నవి. అదే విధముగా, స్వతంత్రుడవగు నీవే నీనుండి ఆవిర్భవించిన సకలచరాచరములయందు అనేకరూపములుగా ప్రకాశించుచున్నావు. సర్వమునకు రెండవది లేని నీవే ఆత్మవు.

సృజస్యథో లుంపసి పాసి విశ్వం రజస్తమస్సత్త్వగుణైస్స్వశక్తిభిః ।
న బధ్యసే తద్గుణకర్మభిర్వా జ్ఞానాత్మనస్తే క్వ చ బంధహేతుః ।। 21

స్వశక్తిభిః - నీ శక్తులైన, రజః-తమః-సత్త్వగుణైః - రజస్తమస్సత్త్వగుణములచే, విశ్వమ్ - జగత్తును, సృజసి - సృష్టించెదవు, పాసి - పాలించెదవు, అథో - తరువాత, లుంపసి - ఉపసంహరించెదవు, తద్-గుణకర్మభిః వా - ఆ గుణములచే గాని కర్మలచే గాని, న బధ్యసే - బంధించబడవు, జ్ఞాన-ఆత్మనః - చైతన్యస్వరూపుడవగు, తే - నీకు, బంధహేతుః - బంధకారణమగు అజ్ఞానము, క్వ చ - ఎక్కడిది?

నీవు నీ శక్తియగు రజోగుణముచే జగత్తును సృష్టించి, నీ శక్తియగు సత్త్వగుణముచే పాలించి, తరువాత తమోగుణముచే ఉపసంహరించెదవు. కాని, ఆ గుణములు గాని క్రియలు గాని నిన్ను బంధించవు. చైతన్యస్వరూపుడవగు నీకు బంధహేతువగు అజ్ఞానమెక్కడిది? (లేదు).

దేహాద్యుపాధేరనిరూపితత్వాద్భవో న సాక్షాన్న భిదాఽఽత్మనస్స్యాత్ ।
అతో న బంధస్తవ నైవ మోక్షస్స్యాతాం నికామస్త్వయి నోఽవివేకః ।।22

దేహ-ఆది-ఉపాధేః - దేహము మొదలైన ఉపాధి, అనిరూపితత్వాత్ - నిర్వచించ శక్యమైనది కాదు గనుక, ఆత్మనః - ఆత్మకు, భవః - పుట్టుక, భిదా - భేదము, సాక్షాత్ - స్వరూపమునందు, న స్యాత్ - ఉండదు, అతః - ఇందువలన, తవ - నీకు, బంధః - బంధము, న - లేదు, మోక్షః - మోక్షము, న ఏవ - లేనే లేదు, న స్యాతామ్ - రెండు ఉండవు, నికామః - తమ అభిప్రాయమునకు అనురూపమైనది, త్వయి - నీ విషయమునందు, నః - మా, అవివేకః - అవివేకము.

ఆత్మకు దేహము-మనస్సు మొదలగు ఉపాధులు ఉన్నవి అని గాని, లేవు అని గాని నిరూపించుటకు శక్యము కానివి (మిథ్య). కావున, ఆత్మస్వరూపమునందు పుట్టుక గాని, భేదము గాని లేవు. కావున, నీకు బంధము గాని, మోక్షము గాని లేనే లేవు. అవివేకముచే మేము మా అభిప్రాయములకు తగ్గట్లుగా నీయందు బంధమోక్షములను కల్పిస్తూ ఉంటాము.

త్వయోదితోఽయం జగతో హితాయ యదా యదా వేదపథః పురాణః ।
బాధ్యేత పాఖండపథైరసద్భిస్తదా భవాన్ సత్త్వగుణం బిభర్తి ॥ 23

జగతః - జగత్తుయొక్క, హితాయ - హితము కొరకు, త్వయా - నీచే, ఉదితః - ప్రకాశింపజేయబడిన, అయమ్ - ఈ, పురాణః - సనాతనమైన, వేదపథః - వేదమార్గము, యదా యదా - ఎప్పుడెప్పుడైతే, అసద్భిః - దుష్టములైన, పాఖండపథైః - వేదవిరుద్ధములగు మార్గములచే, బాధ్యేత - పీడించబడునో, తదా - అప్పుడప్పుడు, భవాన్ - నీవు, సత్త్వగుణమ్ - సత్త్వగుణప్రధానమైన రూపమును, బిభర్తి - ధరించెదవు.

నీవు జగత్తుయొక్క హితము కొరకు సనాతనమైన వేదమార్గమును ప్రకాశింప జేసితివి. ఎప్పుడెప్పుడైతే ఆ మార్గము నరకహేతువులైన వేదవిరుద్ధమార్గములచే పీడించబడునో, అప్పుడప్పుడు నీవు సత్త్వగుణప్రధానమగు మూర్తివై అవతరించెదవు.

స త్వం ప్రభోఽద్య వసుదేవగృహేఽవతీర్ణః
స్వాంశేన భారమపనేతుమిహాసి భూమేః ।
అక్షౌహిణీశతవధేన సురేతరాంశ-
రాజ్ఞామముష్య చ కులస్య యశో వితన్వన్ ॥ 24

ప్రభో - ఓ ప్రభూ!, సః - అట్టి, త్వమ్ - నీవు, భూమేః - భూమియొక్క, భారమ్ - బరువును, అపనేతుమ్ - తొలగించుటకు, ఇహ - ఈ లోకమునందు, వసుదేవగృహే - వసుదేవుని ఇంటియందు, స్వ-అంశేన - తన అంశయగు బలరామునితో గూడి, అవతీర్ణః - అవతరించినవాడవు, అసి - అగుచున్నావు, సుర-ఇతర-అంశరాజ్ఞామ్ - రాక్షసుల అంశలైన రాజులయొక్క, అక్షౌహిణీశతవధేన - అక్షౌహిణుల వందల సంహారముచే, అముష్య - ఈ, కులస్య - వంశముయొక్క, యశః చ - కీర్తిని కూడ, వితన్వన్ - విస్తరింప జేయువాడవు.

ఓ ప్రభూ! అట్టి (సత్త్వగుణప్రధానుడవగు) నీవు భూభారమును పోగొట్టుటకై ఈ భూలోకములో వసుదేవుని ఇంట్లో నీ అంశయగు బలరామునితో గూడి అవతరించితివి. రాక్షసుల అంశలైన రాజుల వందల

అక్షౌహిణీల సైన్యమును సంహరించి ఈ వంశముయొక్క కీర్తిని నీవు విస్తరింప జేసెదవు.

అద్యేశ నో వసతయః ఖలు భూరిభాగా
యస్సర్వదేవపితృభూతనృదేవమూర్తిః ।
యత్పాదశౌచసలిలం త్రిజగత్పునాతి
స త్వం జగద్గురురధోక్షజ యాః ప్రవిష్టః ॥ 25

ఈశ - ఓ ఈశ్వరా!, అధోక్షజ - ఇంద్రియగోచరము కాని స్వరూపము గలవాడా!, యః - ఎవడైతే, సర్వదేవపితృభూతనృదేవమూర్తిః - సకలదేవతలు పితృదేవతలు ప్రాణులు రాజుల రూపములోనున్నవాడో, యత్-పాదశౌచసలిలమ్ - ఎవ్వాని పాదములను కడిగిన నీరు, త్రిజగత్ - ముల్లోకములను, పునాతి - పవిత్రము చేయునో, సః - అట్టి, జగద్-గురుః - జగత్తునకు తండ్రివగు, త్వమ్ - నీవు, యాః - ఏ గృహములను, ప్రవిష్టః - ప్రవేశించితివో ఆ, నః - మా, వసతయః - గృహములు, అద్య - ఈనాడు, భూరిభాగాః ఖలు - గొప్ప భాగ్యము గలవి గదా!

ఓ ఈశ్వరా! నీ స్వరూపము ఇంద్రియగోచరము కాదు. సకలదేవతలు, పితృదేవతలు, ప్రాణులు, రాజులు నీ మూర్తులే. నీ పాదములను కడిగిన నీరు ముల్లోకములను పవిత్రము చేయును. జగత్తునకు తండ్రివగు అట్టి నీవు మా ఇళ్లలో ఈ నాడు పాదము మోపినావు. మా ఇళ్లు గొప్ప భాగ్యము గలవి సుమా!

కః పండితస్త్వదపరం శరణం సమీయాత్
భక్తప్రియాదృతగిరస్సుహృదః కృతజ్ఞాత్ ।
సర్వాన్ దదాతి సుహృదో భజతోఽభికామాన్
ఆత్మానమప్యుపచయాపచయౌ న యస్య ॥ 26

పండితః - వివేకి, కః - ఎవడు, భక్తప్రియాత్ - భక్తులు ప్రియులైనట్టియు, ఋతగిరః - సత్యమగు వాక్కులు కలిగినట్టియు, సుహృదః - హితమును చేయునట్టియు, కృతజ్ఞాత్ - చేయబడిన కర్మలను తెలిసిన, త్వత్ - నీకంటె, అపరమ్ - మరియొకనిని, శరణమ్ - రక్షకునిగా,

సమీయాత్ - పొందును?, సుహృదః - శుద్ధహృదయుడైన, భజతః - భక్తునకు, సర్వాన్ - సకలములైన, అభికామాన్ - కామనలను, ఆత్మానం అపి - తనను కూడ, దదాతి - ఇచ్చును, యస్య - ఎవనికైతే, ఉపచయ-అపచయౌ - వృద్ధిహ్రాసములు, న - లేవో.

నీకు భక్తులయందు ప్రీతి. నీవి యథార్థవచనములు. హితకారివగు నీకు జనుల ధర్మాధర్మములు తెలియును. అట్టి నిన్ను కాకుండా వివేకి మరియొకనిని ఎవనిని శరణు జొచ్చును? (ఎవనినైననూ శరణు వేడడు). శుద్ధహృదయుడగు భక్తునకు నీవు సకలకామనలననుగ్రహించుటయే గాక, నిన్ను కూడ సమర్పించెదవు. కాని, నీకు వృద్ధిహ్రాసములు లేవు.

దిష్ట్యా జనార్దన భవానిహ నః ప్రతీతో
యోగేశ్వరైరపి దురాపగతిస్సురేశైః ।
ఛింధ్యాశు నస్సుతకలత్రధనాప్తగేహ-
దేహాదిమోహరశనాం భవదీయమాయామ్ ॥ 27

జన-అర్దన - దుష్టజనులను శిక్షించువాడా!, యోగ-ఈశ్వరైః - యోగిరాజులగు సనకాదులచే, సుర-ఈశైః అపి - దేవనాయకులగు ఇంద్రాదులచే కూడ, దురాపగతిః - తెలియ శక్యము కాని స్వరూపము గల, భవాన్ - నీవు, నః - మా, ఇహ - ఈ గృహమునందు, ప్రతీతః - ప్రత్యక్షమైనవాడవు, దిష్ట్యా - మంగళము, నః - మాయొక్క, సుతకలత్రధన-ఆప్తగేహదేహ-ఆదిమోహరశనామ్ - సంతానము భార్య ధనము బంధువులు ఇల్లు దేహము మొదలైనవాటియందలి మోహమనే పాశము అగు, భవదీయమాయామ్ - నీదైన మాయను, ఆశు - శీఘ్రముగా ఛింధి - ఛేదించుము.

దుష్టజనశిక్షకుడవగు ఓ దేవా! నీ స్వరూపమును తెలియుట యోగిరాజులగు సనకాదులకు, దేవనాయకులగు ఇంద్రాదులకు కూడ దుర్ఘటము. అట్టి నీవు మా ఈ గృహములో ప్రత్యక్షమైనావు. ఇది మంగళము. నీ మాయ వలన మాకు సంతానము, భార్య, ధనము, బంధువులు, ఇల్లు, దేహము, ఇంద్రియభోగములయందు మోహము కలిగి

మమ్ములను బంధించుచున్నది. ఈ అజ్ఞానబంధమును నీవు శీఘ్రముగా తొలగించుము.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యర్చితస్సంస్తుతశ్చ భక్తేన భగవాన్ హరిః ।
అక్రూరం సస్మితం ప్రాహ గీర్భిస్సమ్మోహయన్నివ ॥ 28

ఇతి - ఈ విధముగా, భక్తేన - భక్తుడగు అక్రూరునిచే, అర్చితః - పూజించబడినవాడు, సంస్తుతః చ - గొప్పగా స్తుతించబడినవాడు కూడ, హరిః - పాపములను పోగొట్టే, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, గీర్భిః - పలుకులతో, సమ్మోహయన్ ఇవ - మోహపెట్టుచున్నాడా యన్నట్లు, అక్రూరమ్ - అక్రూరుని ఉద్దేశించి, సస్మితమ్ - చిరునవ్వుతో కూడుకున్నట్లుగా, ప్రాహ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా భక్తుడైన అక్రూరుడు పాపములను పోగొట్టే శ్రీకృష్ణ భగవానుని పూజించి గొప్పగా స్తుతించెను. అప్పుడాయన తన పలుకులతో మోహపెట్టుచున్నాడా యన్నట్లు చిరునవ్వుతో అక్రూరుని ఉద్దేశించి ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
త్వం నో గురుః పితృవ్యశ్చ శ్లాఘ్యో బంధుశ్చ నిత్యదా ।
వయం తు రక్ష్యాః పోష్యాశ్చ అనుకంప్యాః ప్రజా హి వః ॥ 29

త్వమ్ - నీవు, నః - మాకు, గురుః - గురుడవు, పితృవ్యః చ - పినతండ్రివి కూడ, నిత్యదా - సర్వకాలములయందు, శ్లాఘ్యః - కొనియాడదగిన, బంధుః చ - హితకారివి కూడ, వయం తు - మేమైతే, రక్ష్యాః - రక్షించదగినవారము, పోష్యాః చ - పోషించదగినవారము కూడ, అనుకంప్యాః - దయ చూపదగినవారము, వః - మీకు, ప్రజాః చ - పుత్రులము కూడ.

శ్రీకృష్ణ భగవానుడిట్లు పలికెను --- నీవే మాకు గురుడవు, పినతండ్రివి. సర్వకాలములలో కొనియాడదగిన హితకారివి నీవే. నీవే మమ్ములను రక్షించి పోషించువాడవు. పుత్రులమైన మాపై నీవు దయను చూపవలెను.

భవద్విధా మహాభాగా నిషేవ్యా అర్హసత్తమాః ।
శ్రేయస్కామైర్నృభిర్నిత్యం దేవాస్స్వార్థా న సాధవః ॥ 30

భవద్-విధాః - నీవంటి, మహాభాగాః - మహానుభావులు, శ్రేయః-కామైః - శ్రేయస్సును కోరే, నృభిః - మానవులచే, నిత్యమ్ - నిత్యము, నిషేవ్యాః - సేవించదగినవారు, అర్హసత్తమాః - మహోత్కృష్టులు, దేవాః - దేవతలు, స్వ-అర్థాః - స్వార్థపరులు, సాధవః - సత్పురుషులు, న - కారు.

శ్రేయస్సును కోరే మానవులు నీవంటి మహోత్కృష్టులైన మహానుభావులను నిత్యము సేవించదగును. దేవతలు తమ హవిర్భాగములను కోరి భక్తులకు కామనలనిచ్చెదరు. కాని, సత్పురుషులయందు అట్టి స్వార్థము కానరాదు.

న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః ।
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః ॥ 31

తీర్థాని - తీర్థములు, న అమ్మయాని హి - కేవలము నీరు రూపములోనుండునవి మాత్రమే కాదు, దేవాః - దేవతలు, మృత్-శిలామయాః - మట్టితో రాళ్లతో చేసినవారు మాత్రమే, న - కారు, తే - వారు, ఉరుకాలేన - చాల కాలముచే, పునంతి - పావనము చేయుదురు, దర్శనాత్ ఏవ - దర్శనము వలన మాత్రమే, సాధవః - సత్పురుషులు.

తీర్థములనగా కేవలము జలమయములు మాత్రమే కాదు. సత్పురుషులు కూడ తీర్థములే. దేవతలనగా కేవలము మట్టితో, రాళ్లతో చేసినవారు మాత్రమే కాదు. సత్పురుషులు కూడ దేవతలే. తీర్థములు, దేవతలు చాలకాలము సేవించిన తరువాత పావనము చేస్తే, సత్పురుషుల దర్శనమాత్రముచే మానవుడు పునీతుడగును.

స భవాన్ సుహృదాం వై నశ్శ్రేయాఞ్ఛ్రేయశ్చికీర్షయా ।
జిజ్ఞాసార్థం పాండవానాం గచ్ఛస్వ త్వం గజాహ్వయమ్ ॥ 32

సః - అట్టి, భవాన్ - తమరు, నః - మా, సుహృదామ్ - హితకారులలో, శ్రేయాన్ - గొప్పవారు, వై - నిశ్చయము, త్వమ్ - నీవు, శ్రేయః-చికీర్షయా - శ్రేయస్సును చేసే కోరికతో, పాండవానామ్ - పాండవులయొక్క,

జిజ్ఞాసార్థమ్ - (క్షేమమును) విచారించుటకై, గజ-ఆహ్వాయమ్ - హస్తినాపురమును గురించి, గచ్ఛస్వ - వెళ్లుడు.

తమరు నిశ్చయముగా మా శ్రేయస్కాములలో అగ్రగణ్యులు. కాబట్టి, తమరు పాండవులకు హితమును చేయుటకు, వారి క్షేమమును విచారించుటకై హస్తినాపురమునకు ప్రయాణము కట్టుడు.

పితర్యుపరతే బాలాస్సహ మాత్రా సుదుఃఖితాః ।
ఆనీతాస్స్వపురం రాజ్ఞా వసంత ఇతి శుశ్రుమ ।। 33

పితరి - తండ్రి, ఉపరతే - మరణించగా, రాజ్ఞా - రాజుచే, సుదుఃఖితాః - అధికమగు దుఃఖమును పొందిన, బాలాః - పిల్లలు, మాత్రా సహ - తల్లితో బాటు, స్వపురమ్ - తన నగరమును గురించి, ఆనీతాః - తీసుకు రాబడినవారు, వసంతః - నివసించుచున్నవారు, ఇతి - అని, శుశ్రుమ - వినియున్నాము.

తండ్రియగు పాండురాజు మరణించిన పిదప మిక్కిలి దుఃఖితులైయున్న ఆయన పిల్లలను వారి తల్లియగు కుంతిని ధృతరాష్ట్ర మహారాజు తన నగరము హస్తినాపురమునకు తీసుకువచ్చినాడనియు, ఇప్పుడు వారు అక్కడే నివసించుచున్నారనియు విని యున్నాము.

తేషు రాజాఽంబికాపుత్రో భ్రాతృపుత్రేషు దీనధీః ।
సమో న వర్తతే నూనం దుష్పుత్రవశగోఽంధదృక్ ।। 34

అంబికాపుత్రః - అంబికయొక్క పుత్రుడు, దీనధీః - దీనమైన మనస్సు గలవాడు, దుష్పుత్రవశగః - చెడు కొడుకుల వశములోనున్నవాడు, అంధదృక్ - చూడలేని కన్నులు గలవాడు అగు, రాజా - ధృతరాష్ట్ర మహారాజు, తేషు - వారియందు, సమః - సమచిత్తుడై, న వర్తతే - ఉండుట లేదు, నూనమ్ - నిశ్చయము.

అంబిక పుత్రుడగు ధృతరాష్ట్రుడు దీనమైన మనస్సు గలవాడు. ఈయన గ్రుడ్డివాడు, పైగా దుష్టులగు పుత్రులకు వశుడైనాడు. ఈయన పాండవులను తన పుత్రులతో సమముగా చూచుట లేదు. ఇది యథార్థము.

గచ్ఛ జానీహి తద్వృత్తమధునా సాధ్వసాధు వా ।
విజ్ఞాయ తద్విధాస్యామో యథా శం సుహృదాం భవేత్ ॥ 35

గచ్ఛ - వెళ్లుము, తద్-వృత్తమ్ - ఆ ధృతరాష్ట్రుని ప్రవృత్తిని (ఆ పాండవుల బాగోగులను), జానీహి - అరయుము, సాధు - బాగున్నదా?, వా - లేక, అసాధు - బాగులేదా?, తత్ - ఆ విషయమును, విజ్ఞాయ - తెలుసుకొని, విధాస్యామః - చేసెదము, యథా - ఏ విధముగానైతే, సుహృదామ్ - ప్రియబంధువులకు, శమ్ - సుఖము, భవేత్ - కలుగునో.

తమరు వెళ్లి ఆ ధృతరాష్ట్రుని ప్రవృత్తిని, పాండవుల బాగోగులను అరయుడు. ఆతని ప్రవృత్తి బాగున్నదా? లేదా? పాండవులు బాగున్నారా? లేదా? అనే విషయము తెలిసిన పిదప, ప్రియబంధువులగు పాండవులకు సుఖము కలిగే ఉపాయమును చేసెదము.

ఇత్యక్రూరం సమాదిశ్య భగవాన్ హరిరీశ్వరః ।
సంకర్షణోద్ధవాభ్యాం వై తతస్స్వభవనం యయౌ ॥ 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే అష్టాచత్వారింశోఽధ్యాయః ॥

హరిః - పాపములను పోగొట్టువాడు, ఈశ్వరః - జగత్తును శాసించువాడు అగు, భగవాన్ - శ్రీకృష్ణ భగవానుడు, ఇతి - ఈ విధముగా, అక్రూరమ్ - అక్రూరుని, సమాదిశ్య - ఆదేశించి, తతః వై - ఆ తరువాతనైతే, సంకర్షణ-ఉద్ధవాభ్యామ్ - బలరామునితో ఉద్ధవునితో, స్వభవనమ్ - తన భవనమును గురించి, యయౌ - వెళ్లెను.

జగత్తును శాసించువాడు, పాపములను పోగొట్టువాడు అగు శ్రీకృష్ణ భగవానుడు అక్రూరుని ఈ విధముగా ఆదేశించెను. తరువాత ఆయన బలరాముడు, ఉద్ధవుడు తోడు రాగా తన ప్రాసాదమునకు వెళ్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో
శ్రీకృష్ణుడు అక్రూరుని ఇంటికి వెళ్లుటను వర్ణించే
నలుబది ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (48).

* * * * *

# అథ ఏకోనపంచాశోఽధ్యాయః

## అక్రూరుడు హస్తినాపురమునకు వెళ్లుట

శ్రీశుక ఉవాచ ।
స గత్వా హాస్తినపురం పౌరవేంద్రయశోఽంకితమ్ ।
దదర్శ తత్రాంబికేయం సభీష్మం విదురం పృథామ్ ॥ 1

సః - ఆ అక్రూరుడు, పౌరవ-ఇంద్రయశః-అంకితమ్ పురువంశీయులగు మహారాజుల కీర్తిని చాటే వస్తువులతో కూడియున్న, హాస్తినపురమ్ - హస్తినాపురమును గురించి, గత్వా - వెళ్లి, తత్ర - అచట, సభీష్మమ్ - భీష్మునితో కూడిన, ఆంబికేయమ్ - అంబిక పుత్రుడగు ధృతరాష్ట్రుని, విదురమ్ - విదురుని, పృథామ్ - కుంతిని, దదర్శ - చూచెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆ అక్రూరుడు హస్తినాపురమునకు వెళ్లెను. అక్కడి ప్రతి వస్తువు పురువంశీయులగు మహారాజుల కీర్తికి అద్దము పట్టుచుండెను. అచట ఆయన అంబిక పుత్రుడగు ధృతరాష్ట్రుని, భీష్ముని, విదురుని, కుంతిని చూచెను.

సహపుత్రం చ బాహ్లీకం భారద్వాజం సగౌతమమ్ ।
కర్ణం సుయోధనం ద్రౌణిం పాండవాన్ సుహృదోఽపరాన్ ॥ 2

సహపుత్రమ్ - పుత్రుడగు సోమదత్తునితో కూడియున్న, బాహ్లీకం చ - బాహ్లీకుని, సగౌతమమ్ - కృపాచార్యునితో కూడియున్న, భారద్వాజమ్ - భరద్వాజపుత్రుడగు ద్రోణుని, కర్ణమ్ - కర్ణుని, సుయోధనమ్ - దుర్యోధనుని, ద్రౌణిమ్ - ద్రోణుని పుత్రుడగు అశ్వత్థామను, పాండవాన్ - పాండవులను, అపరాన్ - ఇతరులైన, సుహృదః - ప్రియబంధువులను (చూచెను).

ఆయన అచట బాహ్లీకుని, ఆయన పుత్రుడగు సోమదత్తుని, కృపాచార్యుని, భరద్వాజుని పుత్రుడగు ద్రోణుని, ఆయన పుత్రుడగు అశ్వత్థామను, కర్ణుని, దుర్యోధనుని, పాండవులను, ఇతరప్రియబంధువులను చూచెను.

యథావదుపసంగమ్య బంధుభిర్గాందినీసుతః ।
సంపృష్టస్తైస్సుహృద్వార్తాం స్వయం చాపృచ్ఛదవ్యయమ్ ॥ 3

గాందినీసుతః - గాందిని పుత్రుడగు అక్రూరుడు, బంధుభిః - బంధువులతో, యథావత్ - యథోచితముగా, ఉపసంగమ్య - కలుసుకొని, తైః - వారిచే, సుహృద్-వార్తామ్ - బంధువుల వార్తను, సంపృష్టః - అడుగబడినవాడై, స్వయం చ - తాను కూడ, అవ్యయమ్ - క్షేమమును, అపృచ్ఛత్ - అడిగెను.

గాందిని పుత్రుడగు అక్రూరుడు బంధువులను యథోచితముగా కలుసుకొనెను. వారాయనను బంధువుల క్షేమసమాచారమును అడిగి తెలుసుకొనిరి. ఆయన కూడ వారి క్షేమమునడిగి తెలుసుకొనెను.

ఉవాస కతిచిన్మాసాన్ రాజ్ఞో వృత్తవివిత్సయా ।
దుష్ప్రజస్యాల్పసారస్య ఖలచ్ఛందానువర్తినః ॥ 4

దుష్ప్రజస్య - దుష్టులైన పుత్రులు కలిగినట్టియు, అల్పసారస్య - అల్పమైన మనోబలము కలిగినట్టియు, ఖల-ఛంద-అనువర్తినః - దుష్టుల ఇష్టము ప్రకారము నడుచుకొనే, రాజ్ఞః - ధృతరాష్ట్ర మహారాజుయొక్క, వృత్తవివిత్సయా - ప్రవృత్తిని తెలియాలనే కోరికతో, కతిచిత్ - కొన్ని, మాసాన్ - మాసములను, ఉవాస - నివసించెను.

ధృతరాష్ట్ర మహారాజు పుత్రులు దుష్టులు. ఆయన మనోబలము తక్కువ. కావుననే, ఆయన ఆ దుష్టుల ఇష్టమునకు అనుకూలముగా నడుచుకొనును. ఆయన ప్రవృత్తిని తెలియగోరి అక్రూరుడు అచట కొన్ని మాసములు నివసించెను.

తేజ ఓజో బలం వీర్యం ప్రశ్రయాదీంశ్చ సద్గుణాన్ ।
ప్రజానురాగం పార్థేషు న సహద్భిశ్చికీర్షితమ్ ॥ 5

కృతం చ ధార్తరాష్ట్రైర్యద్గరదానాద్యపేశలమ్ ।
ఆచఖ్యౌ సర్వమేవాస్మై పృథా విదుర ఏవ చ ॥ 6

పార్థేషు - కుంతీపుత్రులయందు, తేజః - తేజస్సును, ఓజః - శస్త్ర నైపుణ్యమును, బలమ్ - బలమును, వీర్యమ్ - పరాక్రమమును, ప్రశ్రయ-ఆదీన్ - వినయము మొదలైన, సద్-గుణాన్ - మంచి గుణములను, ప్రజా-అనురాగం చ - ప్రజల ప్రేమను కూడ, న సహద్భిః - సహించని, ధార్తరాష్ట్రైః - ధృతరాష్ట్రుని పుత్రులచే, చికీర్షితమ్ - చేయగోరినది, కృతం చ - చేయబడినది కూడ, యత్ - ఏ, గరదాన-ఆది - విషమును పెట్టుట మొదలైన, అపేశలమ్ - చెడు కర్మ గలదో, సర్వం ఏవ - ఆ సర్వమును కూడ, అస్మై - ఈ అక్రూరుని కొరకు, పృథా - కుంతి, విదురః ఏవ చ - విదురుడు కూడ, ఆచఖ్యౌ - వివరించి చెప్పెను.

పాండవులయందు తేజస్సు, శస్త్ర నైపుణ్యము, బలము, పరాక్రమము, వినయము, దయ మొదలగు సద్గుణములు గలవు. ప్రజలకు వారిపై అనురాగము గలదు. దీనిని ధృతరాష్ట్రుని పుత్రులగు దుర్యోధనాదులు సహించ లేకపోయిరి. వారు పాండవులపై విషప్రయోగము మొదలగు కుట్రలను పన్నిరి. ఇంకనూ వారిపై కుట్రలను పన్నుతూనే ఉన్నారు. ఈ వివరములనన్నింటినీ కుంతి, విదురుడు అక్రూరునకు వివరించి చెప్పిరి.

పృథా తు భ్రాతరం ప్రాప్తమక్రూరముపసృత్య తమ్ ।
ఉవాచ జన్మనిలయం స్మరంత్యశ్రుకలేక్షణా ॥ 7

పృథా తు - కుంతియైతే, ప్రాప్తమ్ - వచ్చిన, భ్రాతరమ్ - సోదరుడైన, తమ్ - ఆ, అక్రూరమ్ - అక్రూరుని, ఉపసంగమ్య - దగ్గరకు వెళ్లి, జన్మనిలయమ్ - పుట్టింటిని, స్మరంతీ - గుర్తు చేసుకొనునదై, అశ్రుకలేక్షణా - నీటిని స్రవించే కన్నులు గలదై, ఉవాచ - పలికెను.

కుంతి వచ్చిన తన సోదరుడగు ఆ అక్రూరుని వద్దకు వెళ్లెను. ఆమెకు పుట్టిల్లు గుర్తుకు వచ్చి కళ్లు నీళ్లతో నిండెను. ఆమె ఆయనతో నిట్లనెను.

అపి స్మరంతి నస్సౌమ్య పితరౌ భ్రాతరశ్చ మే ।
భగిన్యో భ్రాతృపుత్రాశ్చ జామయస్సఖ్య ఏవ చ ॥ 8

సౌమ్య - ఓ ప్రియదర్శనా!, మే - నా, పితరౌ - తల్లిదండ్రులు, భ్రాతరః చ - సోదరులు, భగిన్యః - అప్పచెల్లెళ్లు, భ్రాతృపుత్రాః చ - సోదరుల పుత్రులు, జామయః - కులస్త్రీలు, సఖ్యః ఏవ చ - చెలికత్తెలు కూడ, నః - మమ్ములను, అపి స్మరంతి - స్మరించుచున్నారా?

ఓ ప్రియదర్శనా! నా తల్లిదండ్రులకు (శూరుడు, ఆయన భార్య), సోదరులకు, అప్పచెల్లెళ్లకు, సోదరుల పుత్రులకు, దేవకి మొదలైన కులస్త్రీలకు , చెలికత్తెలకు మేము గుర్తు ఉన్నామా?

భ్రాత్రేయో భగవాన్ కృష్ణశ్శరణ్యో భక్తవత్సలః ।
పైతృష్వసేయాన్ స్మరతి రామశ్చాంబురుహేక్షణః ॥ 9

భ్రాత్రేయః - సోదరుని పుత్రుడు, శరణ్యః - శరణు పొందదగినవాడు, భక్తవత్సలః - భక్తులయందు మిక్కుటమగు ప్రేమ గలవాడు అగు, భగవాన్ కృష్ణః - శ్రీకృష్ణ భగవానుడు, అంబురుహ-ఈక్షణః - పద్మములవంటి కన్నులు గల, రామః చ - బలరాముడు కూడ, పైతృష్వసేయాన్ - తండ్రి చెల్లెలి కొడుకులను, స్మరతి - స్మరించునా?

నా సోదరుడగు వసుదేవుని పుత్రుడగు శ్రీకృష్ణ భగవానుడు భక్తులయందు మిక్కుటమగు ప్రేమ గలవాడు. ఆయన శరణు పొందదగినవాడు. ఆయన, పద్మమువంటి కన్నులు గల బలరాముడు అత్తనగు నా పుత్రులను స్మరించెదరా?

సపత్నమధ్యే శోచంతీం వృకాణాం హరిణీమివ ।
సాంత్వయిష్యతి మాం వాక్యైః పితృహీనాంశ్చ బాలకాన్ ॥ 10

వృకాణామ్ - తోడేళ్లలో, హరిణీం ఇవ - లేడిని వలె, సపత్నమధ్యే - శత్రువుల మధ్యయందు, శోచంతీమ్ - దుఃఖించుచున్న, మామ్ - నన్ను, పితృహీనాన్ - తండ్రి లేని, బాలకాన్ చ - పిల్లలను కూడ, వాక్యైః - వాక్యములతో, సాంత్వయిష్యతి - ఓదార్చునా?

తోడేళ్ల మధ్యలోనున్న లేడి వలె, నేను శత్రువుల మధ్యలో చిక్కుకొని దుఃఖిస్తున్నాను. నన్ను, తండ్రి లేని నా పుత్రులను ఆయన అనునయవాక్యములతో ఓదార్చునా?

కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన ।
ప్రపన్నాం పాహి గోవింద శిశుభిశ్చావసీదతీమ్ ॥ 11

కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, కృష్ణ - ఓ శ్రీకృష్ణా!, మహాయోగిన్ - గొప్ప యోగీ!, విశ్వ-ఆత్మన్ - సకలప్రాణులకు ఆత్మ యైనవాడా!, విశ్వభావన - జగత్తును పాలించువాడా!, గోవింద - ఓ గోవిందా!, ప్రపన్నామ్ - శరణు జొచ్చినట్టియు, శిశుభిః చ - పిల్లలతో కూడ, అవసీదతీమ్ - క్లేశపడుచున్న నన్ను, పాహి - రక్షించుము.

ఓ శ్రీకృష్ణా! ఓ శ్రీకృష్ణా! నీవు మహాయోగివి, సకలప్రాణుల ఆత్మవు, జగత్తును పాలించువాడవు. ఓ గోవిందా! నేను పిల్లలతో క్లేశపడుతూ నిన్ను శరణు జొచ్చినాను. నన్ను రక్షించుము.

నాన్యత్తవ పదాంభోజాత్పశ్యామి శరణం నృణామ్ ।
బిభ్యతాం మృత్యుసంసారాదీశ్వరస్యాపవర్గికాత్ ॥ 12

మృత్యుసంసారాత్ - మృత్యువుతో కూడిన సంసారము వలన, బిభ్యతామ్ - భయపడే, నృణామ్ - మానవులకు, ఈశ్వరస్య - ఈశ్వరుడవగు, తవ - నీ, ఆపవర్గికాత్ - మోక్షమునిచ్చే, పద-అంభోజాత్ - పద్మమువంటి పాదము కంటె, అన్యత్ - మరియొక, శరణమ్ - రక్షణను, న పశ్యామి - కనజాలను.

మానవులు మృత్యువుతో కూడిన సంసారమునకు భయపడుచుందురు. వారికి రక్షణనిచ్చేది ఈశ్వరుడవగు నీయొక్క మోక్షప్రదమగు పాదపద్మముకంటె మరియొకటి నాకు కానరాదు.

నమః కృష్ణాయ శుద్ధాయ బ్రహ్మణే పరమాత్మనే ।
యోగేశ్వరాయ యోగాయ త్వామహం శరణం గతా ॥ 13

శుద్ధాయ - గుణసంస్పర్శ లేనట్టియు, బ్రహ్మణే - పరబ్రహ్మ యైనట్టియు, పరమాత్మనే - పరమాత్మ యైనట్టియు, యోగ-ఈశ్వరాయ - మాయాశక్తికి అధీశ్వరుడైనట్టియు, యోగాయ - జ్ఞానస్వరూపుడగు, కృష్ణాయ - శ్రీకృష్ణుని కొరకు, నమః - నమస్కారము, అహమ్ - నేను, త్వామ్ - నిన్ను, శరణమ్ - రక్షకునిగా, గతా - పొందినదానను.

శ్రీకృష్ణుడు గుణసంస్పర్శ లేని పరబ్రహ్మ, పరమాత్మ. ఆయన మాయాశక్తికి అధీశ్వరుడు, జ్ఞానఘనుడు. ఓ శ్రీకృష్ణా! నేను నిన్ను శరణు వేడుచున్నాను.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యనుస్మృత్య స్వజనం కృష్ణం చ జగదీశ్వరమ్ ।
ప్రారుదద్దుఃఖితా రాజన్ భవతాం ప్రపితామహీ ॥ 14

రాజన్ - ఓ రాజా!, భవతామ్ - మీ, ప్రపితామహీ - తాత తల్లి, ఇతి - ఈ విధముగా, స్వజనమ్ - తన వారిని, జగద్-ఈశ్వరమ్ - జగన్నాథుడగు, కృష్ణం చ - శ్రీకృష్ణుని కూడ, అనుస్మృత్య - గుర్తు చేసుకొని, దుఃఖితా - దుఃఖితురాలై, ప్ర-అరుదత్ - బిగ్గరగా రోదించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! మీ తాత తల్లి ఈ విధముగా తన వారిని, జగన్నాథుడగు శ్రీకృష్ణుని కూడ గుర్తు చేసుకొని దుఃఖితురాలై బిగ్గరగా రోదించెను.

సమదుఃఖసుఖోఽక్రూరో విదురశ్చ మహాయశాః ।
సాంత్వయామాసతుః కుంతీం తత్పుత్రోత్పత్తిహేతుభిః ॥ 15

సమదుఃఖసుఖః - సమానమైన సుఖదుఃఖములు గల, అక్రూరః - అక్రూరుడు, మహాయశాః - గొప్ప కీర్తి గల, విదురః చ - విదురుడు కూడ, కుంతీమ్ - కుంతిని, తత్-పుత్ర-ఉత్పత్తిహేతుభిః - ఆమె పుత్రుల జన్మకు కారణమైన దేవతలచే, సాంత్వయామాసతుః - ఓదార్చిరి.

కుంతి సుఖమే అక్రూరుని సుఖము. ఆమె దుఃఖము ఆయనకు కూడ దుఃఖమే. ఆయన గొప్ప కీర్తి గల విదురునితో గూడి కుంతిని, ఆమె పుత్రుల జన్మకు హేతువులైన దేవతల మహిమను ప్రస్తావించి ఓదార్చెను.

యాస్యన్ రాజానమభ్యేత్య విషమం పుత్రలాలసమ్ ।
అవదత్సుహృదాం మధ్యే బంధుభిస్సౌహృదోదితమ్ ॥ 16

యాస్యన్ - వెళ్లబోవు అక్రూరుడు, విషమమ్ - సమదృష్టి లేనట్టియు, పుత్రలాలసమ్ - పుత్రులయందు లంపటము కలిగిన, రాజానమ్ -

ధృతరాష్ట్ర మహారాజును, అభ్యేత్య - సమీపించి, సుహృదామ్ - బంధువుల, మధ్యే - మధ్యయందు, బంధుభిః - బంధువులచే, సౌహృద-ఉదితమ్ - ప్రేమతో చెప్పబడినదానిని, అవదత్ - చెప్పెను.

అక్రూరుడు తిరిగి వెళ్లబోవువాడై ధృతరాష్ట్రుని వద్దకు వెళ్లెను. ఆ రాజునకు పుత్రలాలస మెండు. ఆయనకు పాండవుల యెడల పుత్రులతో సమానమైన ప్రేమ లేదు. అక్రూరుడు బంధువుల మధ్యలోనున్న రాజుతో, బంధువులైన శ్రీకృష్ణాదులు ప్రేమతో చెప్పిన మాటలను చెప్పెను.

అక్రూర ఉవాచ ।
భో భో వైచిత్రవీర్య త్వం కురూణాం కీర్తివర్ధన ।
భ్రాతర్యుపరతే పాండావధునాఽఽసనమాస్థితః ॥ 17

భోః - ఓయీ!, భోః - ఓయీ!. వైచిత్రవీర్య - విచిత్రవీర్యుని పుత్రుడా!, కురూణామ్ - కురువంశీయుల, కీర్తివర్ధన - కీర్తిని వర్ధిల్ల జేయువాడా!, భ్రాతరి - తమ్ముడగు, పాండౌ - పాండువు, ఉపరతే - మరణించగా, త్వమ్ - నీవు, అధునా - ఇప్పుడు, ఆసనమ్ - సింహాసనమును, ఆస్థితః - అధిష్ఠించినవాడవు.

అక్రూరుడిట్లు పలికెను --- ఓయీ! ఓయీ! ధృతరాష్ట్రా! విచిత్రవీర్యుని పుత్రుడవగు నీవు కురువంశీయుల కీర్తిని వర్ధిల్ల జేసెదవు. నీ తమ్ముడు పాండువు మరణించిన పిదప నీవు ఇప్పుడు సింహాసనమును అధిష్ఠించితివి.

ధర్మేణ పాలయన్నుర్వీం ప్రజాశ్శీలేన రంజయన్ ।
వర్తమానస్సమస్స్వేషు శ్రేయః కీర్తిమవాప్స్యసి ॥ 18

ఉర్వీమ్ - భూమిని, ధర్మేణ - ధర్మముతో, పాలయన్ - పాలించువాడవై, ప్రజాః - జనులను, శీలేన - సచ్ఛీలముతో, రంజయన్ - రంజిల్లజేయువాడవై, స్వేషు - బంధువులయందు, సమః - సమచిత్తుడుగా, వర్తమానః - ఉంటున్నవాడవై, శ్రేయః - శ్రేయస్సును, కీర్తిమ్ - కీర్తిని, అవాప్స్యసి - పొందగలవు.

నీవు ధర్మముగా భూమిని పాలిస్తూ, సచ్ఛీలముతో జనులను రంజిల్ల జేస్తూ, బంధువులయ్యందు సమబుద్ధి కలిగి ఉన్నచో, సద్గతిని కీర్తిని పొందగలవు.

అన్యథా త్వాచరంల్లోకే గర్హితో యాస్యసే తమః ।
తస్మాత్సమత్వే వర్తస్వ పాండవేష్వాత్మజేషు చ ॥ 19

తు - దీనికి భిన్నముగా, అన్యథా - విరుద్ధముగా, ఆచరన్ - ఆచరించువాడవై, లోకే - లోకమునందు, గర్హితః - నిందించబడువాడవు, తమః - నరకమును, యాస్యసే - పొందగలవు, తస్మాత్ - అందువలన, పాండవేషు - పాండు పుత్రులయందు, ఆత్మజేషు చ - నీ పుత్రులయందు కూడ, సమత్వే - సమబుద్ధి కలిగియుండుటయందు, వర్తస్వ - నిలుపుము.

దీనికి భిన్నముగా నీవు విరుద్ధముగా చేసినచో, జనులు నిన్ను నిందించుటయే గాక, నీవు నరకమును పొందెదవు. కావున, నీవు నీ పుత్రులయందు, పాండుపుత్రులయందు సమానముగా వ్యవహరించుము.

నేహ చాత్యంతసంవాసః కర్హిచిత్కేనచిత్సహ ।
రాజన్ స్వేనాపి దేహేన కిము జాయాఽఽత్మజాదిభిః ॥ 20

రాజన్ - ఓ రాజా!, ఇహ చ - ఈ లోకమునందైతే, కర్హిచిత్ - ఎప్పుడైననూ, కేనచిత్ సహ - దేనితోనైననూ, అత్యంతసంవాసః - నిత్యము కలిసియుండుట, స్వేన - తనదైన, దేహేన అపి - దేహముతోనైననూ, న - లేదు, జాయా-ఆత్మజ-ఆదిభిః - భార్య సంతానము మొదలగువారితో, కిము - వేరుగా చెప్పనేల?

ఓ రాజా! ఈ లోకములో ఎవడైననూ ఎప్పుడైననూ దేనితోనైననూ, తన దేహముతోనైననూ, నిత్యము కలిసియుండుట సంభవము కాదు. భార్య, పిల్లలు, బంధువులు మొదలగువారితో నిత్యసంవాసము అసంభవమని వేరుగా చెప్పవలయునా? (చెప్పనక్కర లేదు).

ఏకః ప్రసూయతే జంతురేక ఏవ ప్రలీయతే ।
ఏకోఽనుభుంక్తే సుకృతమేక ఏవ చ దుష్కృతమ్ ॥ 21

జంతుః - జీవుడు, ఏకః - ఒంటరిగానై, ప్రసూయతే - పుట్టును, ఏకః ఏవ - ఒంటరియే, ప్రలీయతే - మరణించును, ఏకః - ఒంటరి, సుకృతమ్ - పుణ్యమును, అనుభుంక్తే - అనుభవించును, ఏకః ఏవ చ - ఒంటరిగనే, దుష్కృతమ్ - పాపమును.

జీవుడు ఒంటరిగా పుట్టి, ఒంటరిగానే పుణ్యపాపములననుభవించి, ఒంటరిగానే గిట్టును.

అధర్మోపచితం విత్తం హరంత్యన్యేఽల్పమేధసః ।
సంభోజనీయాపదేశైర్జలానీవ జలౌకసః ॥ 22

అల్పమేధసః - మూఢునియొక్క, అధర్మ-ఉపచితమ్ - అధర్మముచే ప్రోగు చేయబడిన, విత్తమ్ - ధనమును, సంభోజనీయ-అపదేశైః - పోషించదగినవారు అనే మాటలతో, అన్యే - ఇతరులు, జల-ఓకసః - నీటియందు నివసించే ప్రాణులు, జలాని ఇవ - జలములను వలె, హరంతి - కొనిపోవుదురు.

నీటిలో నివసించే ప్రాణుల సర్వస్వమైన నీటిని ఆ నీటిలో నివసించే ఇతరప్రాణులు త్రాగివేయును. అదే విధముగా, మూర్ఖుడు అధర్మముతో ధనమును ప్రోగు చేయును. మేము నీకు పోషించదగినవారము అని కబుర్లను చెప్పి ఇతరులు వాని ధనమును లాగుకొనెదరు.

పుష్ణాతి యానధర్మేణ స్వబుద్ధ్యా తమపండితమ్ ।
తేఽకృతార్థం ప్రహిణ్వంతి ప్రాణా రాయస్సుతాదయః ॥ 23

యాన్ - ఎవరినైతే, స్వబుద్ధ్యా - తనవారనే భావనతో, అధర్మేణ - అధర్మముతో, పుష్ణాతి - పోషించునో, తే - ఆ, ప్రాణాః - ప్రాణములు, రాయః - సంపదలు, సుత-ఆదయః - పుత్రుడు మొదలగువారు, అపండితమ్ - అవివేకియైనట్టియు, అకృతార్థమ్ - కృతార్థుడు కాని, తమ్ - వానిని, ప్రహిణ్వంతి - విడిచిపెట్టును.

అవివేకి ప్రాణములను, సంపదలను, పుత్రాదులను తనవనే భావనతో అధర్మమును చేసి పోషించును. వాడు జీవితములో ఆత్మజ్ఞానము లేక

అకృతార్థుడుగనే మిగిలిపోవును. ఆ ప్రాణములు, సంపదలు, పుత్రాదులు కూడ వానిని పరిత్యజించును.

స్వయం కిల్బిషమాదాయ తైస్త్యక్తో నార్థకోవిదః ।
అసిద్ధార్థో విశత్యంధం స్వధర్మవిముఖస్తమః ॥ 24

స్వధర్మవిముఖః - తన ధర్మమునందు రుచి లేనివాడు, న-అర్థకోవిదః - పురుషార్థపరిజ్ఞానము లేనివాడు, అసిద్ధ-అర్థః - సిద్ధించని పురుషార్థములు కలవాడు, స్వయమ్ - తాను, కిల్బిషమ్ - పాపమును, ఆదాయ - మూట గట్టుకొని, తైః - వాటిచే, త్యక్తః - విడువబడినవాడై, అంధమ్ - చీకటియైన, తమః - నరకమును, విశతి - ప్రవేశించును.

అవివేకి తన ధర్మమునందు రుచిని కోల్పోయి పురుషార్థపరిజ్ఞానము లేనివాడై పురుషార్థమునుండి జారిపోవును. అట్టివాడు పుత్రాదులచే పరిత్యజించబడినవాడై పాపమును మూట గట్టుకొని దుఃఖముతో నిండిన నరకములో పడిపోవును.

తస్మాల్లోకమిమం రాజన్ స్వప్నమాయామనోరథమ్ ।
వీక్ష్యాయమ్యాత్మనాఽఽత్మానం సమశ్శాంతో భవ ప్రభో ॥ 25

రాజన్ - ఓ రాజా!, ప్రభో - ఓ ప్రభూ!, తస్మాత్ - అందువలన, ఇమమ్ ఈ, లోకమ్ - లోకమును, స్వప్నమాయామనోరథమ్ - కల ఇంద్రజాలము మనస్సుయొక్క విలాసమునుగా, వీక్ష్య - దర్శించి, ఆత్మనా - తనచే, ఆత్మానమ్ - మనస్సును, ఆయమ్య - వశము చేసుకొని, సమః - సమచిత్తుడవు, శాంతః - శాంతుడవు, భవ - కమ్ము.

ఓ రాజా! నీవు సర్వసమర్థుడవు. ఈ లోకము కల, ఇంద్రజాలము, మనస్సుయొక్క విలాస అని తెలుసుకొనుము. నీవు నీ మనస్సును వశము చేసుకొని సమచిత్తుడవు, శాంతుడవు కమ్ము.

ధృతరాష్ట్ర ఉవాచ ।
యథా వదతి కల్యాణీం వాచం దానపతే భవాన్ ।
తథాఽనయా న తృప్యామి మర్త్యః ప్రాప్య యథాఽమృతమ్ ॥ 26

దానపతే - ఓ అక్రూరా!, యథా - ఏ విధముగానైతే, భవాన్ - తమరు, కల్యాణీమ్ - మంగళకరమగు, వాచమ్ - మాటను, వదతి - చెప్పితిరో, తథా - ఆ విధముగా, అనయా - ఈ వాక్కుతో, న తృప్యామి - నేను తృప్తిని జెందుట లేదు, అమృతమ్ - అమృతమును, ప్రాప్య - పొంది, మర్త్యః యథా - మానవుడు వలె.

ధృతరాష్ట్రుడిట్లు పలికెను --- ఓ అక్రూరా! నీవు మధురలో అన్నదానమును చేసిన పుణ్యాత్ముడవు. మరణించబోవు మానవునకు అమృతము దొరికినచో, వానికి దానిపై చాలు అనే భావన కలుగదు. అదే విధముగా, నీవు చెప్పిన కల్యాణకరమగు వచనములపై నాకు చాలు అనే భావన కలుగుట లేదు.

తథాఽపి సూనృతా సౌమ్య హృది న స్థీయతే చలే ।
పుత్రానురాగవిషమే విద్యుత్సౌదామనీ యథా ॥ 27

సౌమ్య - ఓ ప్రియదర్శనా!, సూనృతా - సత్యవచనము, తథాపి - అయినప్పటికీ, చలే - చంచలమైనట్టియు, పుత్ర-అనురాగవిషమే - పుత్రులయందలి ఆసక్తిచే సమత్వమును కోల్పోయిన, హృది - హృదయమునందు, సౌదామనీ - మేఘమునందలి, విద్యుత్ యథా - మెరుపు వలె, న స్థీయతే - నిలబడుట లేదు.

ఓ ప్రియదర్శనా! నీ వచనము సత్యము. అయిననూ అది పుత్రునియందలి ఆసక్తిచే విషమము మరియు చంచలము అగు నా హృదయమునందు, మేఘమునందలి మెరుపు వలె, నిలబడుట లేదు.

ఈశ్వరస్య విధిం కో ను విధునోత్యన్యథా పుమాన్ ।
భూమేర్భారావతారాయ యోఽవతీర్ణో యదోః కులే ॥ 28

ఈశ్వరస్య - ఈశ్వరుని, విధిమ్ - నిర్ణయమును, కః ను - ఏ, పుమాన్ - వ్యక్తి, అన్యథా - మరియొక విధముగా చేసి, విధునోతి - అతిక్రమించును?, యః - ఏ ఈశ్వరుడైతే, భూమేః - భూమియొక్క, భార-అవతారాయ - బరువును దించుట కొరకు, యదోః - యదువుయొక్క, కులే - వంశమునందు, అవతీర్ణః - అవతరించినవాడో.

ఈశ్వరుని నిర్ణయమును మరియొక విధముగా చేయగల మొనగాడెవడు? (ఎవ్వడూ లేడు). అట్టి ఈశ్వరుడు భూమియొక్క భారమును తగ్గించుటకై యదువంశమునందు అవతరించి యున్నాడు.

యో దుర్విమర్శపథయా నిజమాయయేదం
సృష్ట్వా గుణాన్ విభజతే తదనుప్రవిష్టః ।
తస్మై నమో దురవబోధవిహారతంత్ర-
సంసారచక్రగతయే పరమేశ్వరాయ ॥ 29

దుర్విమర్శపథయా - ఊహించ శక్యము కాని మార్గము గల, నిజమాయయా - తన మాయాశక్తిచే, యః - ఏ ఈశ్వరుడైతే, ఇదమ్ - ఈ జగత్తును, సృష్ట్వా - సృష్టించి, అను - తరువాత, తత్ - దానిని, ప్రవిష్టః - ప్రవేశించినవాడై, గుణాన్ - సత్త్వరజస్తమోగుణములను, విభజతే - విభాగము చేయునో, తస్మై - అట్టి, దురవబోధవిహారతంత్రసంసారచక్రగతయే - తెలియ శక్యము కాని లీల అనే ముఖ్యకారణము గల సంసారమనే చక్రముయొక్క భ్రమణము గల, పరమేశ్వరాయ - పరమేశ్వరుని కొరకు, నమః - నమస్కారము.

పరమేశ్వరుని మాయాశక్తియొక్క మార్గము ఊహకు అందదు. ఆ ఈశ్వరుడు ఆ మాయాశక్తితో ఈ జగత్తును సృష్టించి, తరువాత దానియందు అంతర్యామిగా ప్రవేశించి, సత్త్వరజస్తమోగుణముల మేళవింపుతో వైవిధ్యమును కలుగజేయును. ఈ సంసారమనే చక్రముయొక్క భ్రమణమునకు ముఖ్యకారణము ఆ పరమేశ్వరుని లీలయే. ఆ లీలయొక్క స్వరూపము మస్తిష్కమునకు అందేది కాదు. అట్టి పరమేశ్వరుని కొరకు నమస్కారము.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యభిప్రేత్య నృపతేరభిప్రాయం స యాదవః ।
సుహృద్భిస్సమనుజ్ఞాతః పునర్యదుపురీమగాత్ ॥ 30

యాదవః - యదువంశీయుడగు, సః - ఆ అక్రూరుడు, నృపతేః - ధృతరాష్ట్ర మహారాజుయొక్క, అభిప్రాయమ్ - అభిప్రాయమును, ఇతి -

ఈ విధముగా, అభిప్రేత్య - తెలుసుకొని, సుహృద్భిః - బంధువులచే, సమనుజ్ఞాతః - అనుమతి ఈయబడినవాడై, పునః - మరల, యదుపురీమ్ - మథురానగరమును గురించి, అగాత్ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- యదువంశీయుడగు అక్రూరుడు ఈ విధముగా ధృతరాష్ట్ర మహారాజుయొక్క అభిప్రాయమును తెలుసుకొనెను. ఆయన బంధువుల వద్ద సెలవు తీసుకొని మరల మథురానగరమునకు వెళ్లెను.

శశంస రామకృష్ణాభ్యాం ధృతరాష్ట్రవిచేష్టితమ్ ।
పాండవాన్ ప్రతి కౌరవ్య యదర్థం ప్రేషితస్స్వయమ్ ॥ 31

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే ఏకోనపంచాశోఽధ్యాయః ॥

॥ దశమ స్కంధ పూర్వార్ధస్సమాప్తః ॥

కౌరవ్య - కురువంశీయుడవగు ఓ రాజా!, పాండవాన్ ప్రతి - పాండవుల యెడల, ధృతరాష్ట్రవిచేష్టితమ్ - ధృతరాష్ట్రుని ప్రవృత్తిని, రామకృష్ణాభ్యామ్ - బలరామ శ్రీకృష్ణుల కొరకు, శశంస - చెప్పెను, యద్ -అర్థమ్ - దేని కొరకైతే, స్వయమ్ - తాను, ప్రేషితః - పంపబడినవాడో.

కురువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! అక్రూరుడు పాండవుల యెడల ధృతరాష్ట్రుని ప్రవృత్తిని బలరామ శ్రీకృష్ణులకు చెప్పెను. ఆయన పంపబడినది దాని కొరకే గదా!

శ్రీమద్భాగవత మహాపురాణము పదవ స్కంధములో
అక్రూరుడు హస్తినాపురమునకు వెళ్లుటను వర్ణించే
నలుబది తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (49).

**దశమ స్కంధ పూర్వార్ధము ముగిసినది.**

హరిః ఓమ్, తత్సత్, శ్రీకృష్ణార్పణమస్తు.



T.T.D. Religious Publications Series No. 685

Price : Rs.



భారతీయ వాఙ్మయం అంతా ఒక యెత్తు; శ్రీమద్భాగవతం ఒక్కటి ఒక యెత్తు. ఈ ప్రఖ్యాతికి ముఖ్యకారణం – భగవంతుణ్ణి గూర్చి తెలిపే గ్రంథాల్లో భాగవత పురాణం అగ్రగణ్యమై అలరారుతూ వుండటం.

"వేద"మనే కల్పతరువున ఫలించి, శుక యోగీంద్రుని వాక్కులనెడి అమృత రసంతో సమ్మిళితమయి, పుడమికి అవతరించిన పరిపక్వ మధుర ఫలం భాగవతం!

ఇంతటి విశిష్టతగల భాగవత మహాపురాణాన్ని 'తత్త్వప్రకాశిక' – అనే తెలుగు టీకతో ప్రచురించటం తెలుగువారందరికీ మిగుల సంతోషదాయకమైన విషయం. తి.తి.దేవస్థానంవారి ఈ ప్రచురణ సంస్కృతమూలంలోని పరమార్థాన్ని తెలిసికోవటానికి, అలాగే, పోతన మహాకవి రచనను ఇతోఽధికంగా అవగాహన చేసి కోవటానికి –ఉభయ తారకంగా ఆంధ్రావళికి ఉపయోగపడుతుంది.

సార్థకనామధేయమైన ఈ టీకను రచించినవారు పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారు. బ్రహ్మ విద్యాకుటీర (సికిందరాబాదు) నిలయులు. సంస్కృతాంధ్రాంగ్లాది బహుభాషావేత్తలు. వేద, వేదాంతాది ప్రాచీన విద్యల్లోను, రసాయన శాస్త్రాది అధునికవైజ్ఞానిక శాస్త్రాల్లోను నిష్ణాతులు.

పరిశోధన, బోధన, బహుగ్రంథ రచన, సామాజికాది సమస్యల సదవగాహన – ఇత్యాది రంగాల్లో విశేషానుభవం గడించిన పరిణత ప్రజ్ఞావంతులు శ్రీస్వామివారు. ఆర్ష విద్యాపారంగతులైన వీరు ఉత్తమవక్తగా అనేక జాతీయ, అంతర్జాతీయ వేదికలపై ప్రశస్తిగాంచారు.

విశేషించి, ఉపనిషత్తుల్లో నిక్షిప్తమై ఉన్న ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ప్రబోధించే ఉదారాశయంతో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన యతివరేణ్యులు వీరు! బ్రహ్మవిద్యానిధులయిన వీరు భాగవతానికి సరళ సుందరశైలిలో ఈ టీక రచించటం బంగారుకు తావి అబ్బినట్లయింది!

Printed and Published by **Dr. K.V. Ramanachary,** I.A.S., Executive Officer, T.T.Devasthanams, Tirupati and Printed at T.T.D. Press, Tirupati.